## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తత్త్వదృష్టి - 2

## రెండవ భాగము

# అనుష్ఠాన వేదాంతము

కేశవభొట్ల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి
ఎమ్ ఏ ,

# విషయసూచిక

# అనుష్ఠాన వేదాంతము

## (PRACTICAL VEDANTA)

ఓం

# నివేదన

పరమాత్మ నిర్గుణుడు, నిరాకారుడు, అగోచరుడు కాని మన అనుభవములు ఏదో ఒక అతీతశక్తి ఈ విశ్వమును నడిపించుచున్నది అని తలపింపజేయును ఆ అతీతశక్తి మన బుద్ధికి అందదు అయినా అనుభవములను త్రోసివేయలేము గదా! అనుభవములకు అర్థం చెప్పుటకు అనుభవములకు అతీతమైన భావనలను కల్పన చేయుటయే తత్త్వ సిద్ధాంత సారాంశము ఆ భావనలను గ్రహించినచో ఆ అతీత శక్తిని ఏదో ఒక మార్గమున అర్థం చేసుకుని భావాతీత స్థితిలో అనుభూతి పొందవచ్చును అదే తత్త్వదృష్టి (The Vision of Reality)

దృశ్యములు చాలా వరకు భ్రమను కలిగిస్తుంటాయి ఈనాటి దృశ్య, శ్రవణమాధ్యమాలు (T V and Radio Media) ఇట్టి భ్రమను కలిగించేవే ముఖ్యంగా సినిమా ప్రభావం భ్రమను కలిగించటమే (make believe), అంటే నమ్మించటం అన్న మాట ఈ నమ్మించటం అనేది ఈనాడు బహుముఖంగా ఒక వృత్తిగా అనంతంగా విస్తరించింది ఒక రూపాయి ఖరీదు చేసే ఒక గరిటెడు ఉప్మా మీద రెండు 'టొమాటో' ముక్కలు అతికించి ఏదో 'బాత్' అనే పేరుతో ఇరవై రూపాయలకు విక్రయించగల ప్రవీణులున్నకాలమిది పేరు మాత్రమే చూసి పుస్తకం కొనటం, నటుడి పేరు మాత్రమే చూసి సినిమాకు వెళ్లటం, యోగాచార్యులు చెప్పు నాలుగు పడికట్టు మాటలకు, జ్యోతిష్కులు చెప్పు కప్పదాటు పదాలకు, హరిదాసుల పీతాంబరాలకు, బైరాగి గడ్డాలకు, రూపాయి అంత కుంకుమ బొట్టు పెట్టు అమ్మలకు, కాషాయ స్వాములకు, వారి రూపాలకు భ్రమ చెంది, వారికి దైవత్వం ఆపాదించటం - ఇవన్నీ దేనికి చిహ్నాలు? మన బలహీనతకు ఆ బలహీనతను వారు స్వలాభానికి ఉపయోగించుకుంటున్నారు ఇది కొంతమందికి జీవనోపాధి అయింది

ఉపనిషత్తులు గాని, భగవద్గీత గాని చెప్పేది ఆ బలహీనత నుండి బయటపడమని గ్రుడ్డి నమ్మకాలు వద్దు హేతుపూర్వకమైన అవగాహన కావాలి ఏది సత్యమో, ఏది అసత్యమో తెలుసుకునే ప్రయత్నం కావాలి ఆ ప్రయత్నమే తత్త్వదృష్టి ఇదే భగవద్గీత సందేశం

తత్త్వము అంటే యదార్ధ స్థితి మన మనస్సు స్థితే మన యదార్ధ స్థితి దృష్టి అంటే చూపు, బుద్ధి, లేక దృక్పధము తత్త్వదృష్టి అంటే మన మనసులోకి మనం చూడగలగటం అలా చూడగలిగితే మన బుద్ధి మనకు తెలుస్తుంది అపుడు మన దృక్పధం మనం గ్రహించగలుగుతాము మనం అద్దంలో చూసుకుంటే మన స్థూల శరీరం అందులో ప్రతిబింబిస్తుంది అది ప్రతిబింబం మాత్రమే కాదు మనం నిజంగా ఎలా ఉన్నామో తెలుపుతుంది అది ఊహారూపం కాదు మన యదార్ధ రూపం మన రూపాన్ని ఏకాగ్రతతో మనం చూస్తే మన కళ్లకు 'ఎక్స్' కిరణముల (X-Rays) శక్తి వచ్చిందా అనిపిస్తుంది మనలోకి మనం చూస్తున్నట్లు అనిపిస్తుంది మన యదార్ధ మానసిక స్థితి మన ముందు కనబడుతుంది దానిని ఉన్నది ఉన్నట్లుగా మనం అవగాహన చేసుకుంటే మన స్థితి మనకు తెలుస్తుంది ఇది భౌతిక స్థితి మాత్రమే దాని ఆధారంగా దృష్టి ఇంకా ఇంకా లోపలికి ప్రసరించేటట్లు సాధన చేస్తే మనకు ప్రకృతికి ఉన్న సంబంధం బోధపడుతుంది ఆ అవగాహన వికసించినపుడు మనకు అద్దంలో కనబడు మన శరీరం లోపల జీవుడు అనబడు ఇంకొక శరీరం ఉంది అను భావన కలుగుతుంది సాధనతో భావాతీత స్థితికి చేరినపుడు ఆ జీవాత్మ అను జ్యోతి గోచరమవుతుంది దానిని చూడగలిగేదే తత్త్వదృష్టి

నేనేదో వేదాంత తత్త్వవేత్తనను అహంతో ఇది చెప్పటం లేదు ఉద్వేగాలతోను, ఒడుదొడుకులతోను జీవనయానం సాగిస్తూ, ఈ జీవిత గమ్యమునకై అన్వేషణలో ప్రాకులాడుతున్న సామాన్య జీవిని నేను ఆ అన్వేషణలో కలిగిన ఆలోచనా ప్రవాహమునకు నా పరిమితులలో అక్షరరూపమునిచ్చుటకే ఈ ప్రయత్నము ఇది ఏ విధంగాను వివిధ వేదాంత

రీతులపై విమర్శనాత్మక పరిశోధనా వ్యాసము కాదు నిజానికి ఇది పూర్తి స్వీయ రచన కాదు, అలాగని పూర్తి సంకలనమూ కాదు ఇన్ని సంవత్సరాలుగా వేదాంత తత్త్వ గ్రంథ పరిశీలన వలన నాలో ఏర్పడిన భావ పరంపరకు క్రమమార్గంలో శబ్దరూపం ఇచ్చే ప్రయత్నం మాత్రమే ఇది చెప్పదలచిన విషయము నిగూఢమైనది అగుట వలన పరిమితికి లోబడి విషయము, భావము ననుసరించి సామాన్యునికి చేరువగ నుండవలయునను ఆశయము ప్రధానముగా నెంచి వ్యాకరణ నియమములను విస్మరించి సరళ శిష్ట వ్యావహారిక భాషనే ఉపయోగించుట జరిగినది

ఆంగికం భువనం యస్య
వాచికం సర్వవాఙ్మయమ్ ।
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్వికంశివమ్ ॥ (అభినయ దర్పణము)

జగత్తుకు మూలం పరమాత్మ పరమాత్మ సంకల్ప రూపమే విరాట్ పురుషుడు (ఈశ్వరుడు) ఈశ్వరుని చైతన్యరూపమే ఈ జగత్తు లేక ప్రకృతి నాట్యమే చైతన్యరూపమైన అభినయము అనగా చైతన్యమును సూచించు దృశ్య సమాహారము ఆ దృశ్య సమాహార రూపమే ఈ జగత్తు ఈశ్వరుని నాట్యమును అనగా అభినయమును ప్రతిఫలించేదే ఈ జగత్తు నాట్యానికి ప్రధానం నాలుగు అంశాలు ఆంగికం (అభినయ విశేషం అనగా హావభావములచే అర్థమును సూచించుట), వాచికం (సాహిత్యం), ఆహార్యం (అలంకరణ, వేషధారణ), సాత్త్వికం (సత్త్వగుణ ప్రధానంగా రససిద్ధి) ఈ సమస్త భువనం అనగా జగత్తు ఈశ్వరిని అభినయ విశేషం ఆయన భావసూచకం సమస్త సాహిత్యరూపమైన ప్రణవమే (ఓంకారము) ఆయనకు వాచికం, సూర్యచంద్ర నక్షత్రములతో కూడిన ఈ సృష్టి ఆయనకు ఆహార్యం, ఆయన సాత్త్వికాభినయ ప్రతిఫలమే రససిద్ధిరూపమైన ఈ జగత్తు (ప్రకృత్తి) అభినయం ఈశ్వరునిది, అభినయదర్పణరూపం ప్రకృతి ఈశ్వరుడు పురుషుడు ఆ పురుషుని

అభినయ చైతన్య రూపం ప్రకృతి ప్రకృతి పురుషుల సహచరయోగం ఈ చరాచర జగత్తు

ప్రకృతి సాయంబున ప్రభవించె జగము
సకలంబు నద్దాన సంభవమయ్యె
ప్రకృతి పురుషుల యైక్య భావంబు తెలియ
సకలంబు నద్దాన చక్కగా తెలియు
ప్రతబింబరూపముల్ ప్రకృతి పురుషులకు
సతియు పతియు వారి జతజూడనెంచు
మతిమంతుడిమ్మహి మహిమవంతుండు
ప్రతిలేడు వానికి వసుధలో నెవడు

అదే తత్త్వదృష్టి అది గ్రహించిననాడు నిత్యజీవితంలోనే భావాతీత స్థితికి ఆనందానుభూతికి అవకాశం కలుగుతుంది

ఈ తత్త్వదృష్టిని గురించి నాకున్న పరిమితులలో నాదైన పద్ధతిలో విశదపరచటానికి నాలుగు అంశాలు ఎంచుకున్నాను ఈ నాలుగు అంశములు నాలుగు భాగములలో వివరించటం జరిగింది

1) చెఱకు చాలా తియ్యగా ఉంటుందని అందరికి తెలుసు కాని తియ్యగా ఉండేది చెఱకులోని రసం మాత్రమే, దాని పిప్పి కాదు ఆ పిప్పిలోంచే రసం తీసుకోవాలి వేదాంతం కూడా అంతే వేదాంతం అంటే ఏమిటి? దాన్ని నిత్యజీవితంతో సమన్వయించటం ఎలా? ఇవి మొదటి భాగంలోని అంశములు అదే 'వేదాంతసారము' (The Essence of Vedanta)

2) చెఱకు నుండి రసము తీసినంత మాత్రమున సరిపోదు గదా! అది త్రాగినపుడే దాని రుచి, మాధుర్యం తెలుస్తాయి అలాగే వేదాంతసారము గ్రహించినంత మాత్రమున చాలదు ఆ గ్రహించినది ఆచరణలో పెట్టినపుడే దాని ఫలితం తెలుస్తుంది ఈ ఆచరణ సందర్భంలో మన కర్మఫల ప్రసక్తి

వస్తుంది కర్మఫలం - పురుష ప్రయత్నం గురించి తెలుసుకుంటేనే వేదాంతం ఆచరణలో ఫలిస్తుంది ఇవి రెండవ భాగములోని అంశములు అదే 'అనుష్ఠాన వేదాంతం' (Practical Vedanta)

3) మన శరీరం ప్రకృతికి ప్రతీక ప్రకృతిని గురించి తెలుసుకుంటే మనలను మనం తెలుసుకోటానికి అవకాశం ఏర్పడుతుంది ఈ ప్రకృతి (జగత్తు) చాల విచిత్రమైనది ఆ విచిత్రతయే సృష్టిలోని నిగూఢత్వము సృష్టి వైచిత్ర్యమును అర్థం చేసుకోగలిగితే మనం ఎవరో తెలుసుకొనుటకు అవకాశం కలుగుతుంది ఇది మూడవ భాగంలోని అంశము అదే 'సృష్టి వైచిత్ర్యము' (Mystery of the Universe)

4) చారిత్రకంగా తాత్త్విక చింతనలో కలిగిన పరిణామ పరంపరను పరిశీలించినచో ఆయా కాలములలో నున్న సామాజిక పరిస్థితులకు అనుగుణంగానే భిన్న భిన్న తాత్త్విక సిద్ధాంతములు ఏర్పడినట్లుగా మనం గమనించవచ్చు మానవుడు సంఘజీవి ఆదిమజాతి మానవులు గూడ తెగలు తెగలుగా (nomads) తిరుగుచుండెడివారు ఆచారాలు, సంప్రదాయాలు, విశ్వాసాలు కూడ సమాజపరంగానే వ్యాప్తి చెంది స్థిరపడతాయి తత్త్వచింతన వ్యక్తిగతం అయినప్పటికి, 'సర్వంఖల్విదం బ్రహ్మ' అను ఉపనిషద్వాక్యం సమాజపరంగానే చెప్పారు గదా! అనగా సర్వం బ్రహ్మమని గ్రహించమన్నారు సర్వంలో పరమాత్మను, పరమాత్మలో సర్వమును చూడగలగటమే తత్త్వదృష్టి అగును ఇది నాల్గవ భాగంలోని అంశము అదే 'సామాజిక స్పృహ' (Social consciousness)

నేను వేదాంత శాస్త్రమును సంప్రదాయ రీతిలో చదవలేదు కాని ఏ విషయమైనా అవకాశమున్నంతలో వీలగునంత సంపూర్ణంగా తెలుసుకోవాలను జిజ్ఞాసతో నిత్యం చదవటం నాకు స్వభావమైంది నాకు పండితుడనని ఉత్కర్ష పొందాలనీ లేదు, ఇది పాండిత్య ప్రకర్ష కూడా కాదు ముప్పది అయిదు సంవత్సరములు కళాశాలలో అధ్యాపకుడిగా పనిచేయుట వలన వృత్తిపరంగా,

ప్రవృత్తిపరంగా నిరంతరం చదవటం, గ్రహించింది విద్యార్థులకు చెబుదామను తపన నాకు సహజమైంది ఆ సహజ స్వభావం వలననే వేదాంతమును గురించి నాలో కలుగుతూ వచ్చిన భావపరంపరను సామాన్య పాఠకులకు తెలియజేయాలనే తలపే ఈ నా ప్రయత్నమునకు కారణము సందర్భమునకు మించి ఏ అంశమును సాగదీయలేదు కర్మ సిద్ధాంత సందర్భవశమన పతంజలి యోగ దర్శనమును ప్రస్తావించటం జరిగింది యోగతత్త్వమును గురించి మాత్రమే సంక్షిప్తముగా చెప్పటం జరిగింది నాకు యోగాసనములు, సాధనలను గూర్చిన అనుభవం లేదు షడ్దర్శనములలో ఒకటిగానున్న యోగదర్శనమును గురించి మాత్రమే చెప్పటం జరిగింది ధ్యానమే నా మార్గము అందుచే ప్రాణాయామం, ఆసనాలు మొదలైన వాటిని గూర్చి చెప్పలేదు

ఒక విధంగా చెప్పాలంటే మరణానంతర జీవితమును గురించిన ఆలోచనయే తత్త్వచింతనకు కేంద్ర బిందువుగా కనబడుతుంది ఎందుకనగా ఈ జీవితంలో సుఖానికి, కోరికలు నెరవేరటానికి భక్తినే వీలగునన్ని మార్గములలో ఉపయోగించుకుంటున్నారు తత్త్వచింతనకు వలసిన ఓపిక, సమయం ఆ భక్తులకు లేదు ఏ మతమునకు చెందిన తాత్త్వికులైనా ఆత్మ-పునర్జన్మలను గూర్చి తమ జ్ఞానము, అనుభవము ద్వారా తార్కికముగా ఒక నిర్ణయమునకు రావటం, దానిని నిర్వచించటం జరిగింది, జరుగుతోంది సైన్సు దృక్పథముతో గాని, తాత్త్విక దృక్పథముతో గాని పర్యవసానరూపము (ultimate conclusion) తార్కికముగా ఊహించబడినదే సైన్సు దృక్పథమునకు ప్రత్యక్ష పరిశోధనలు ఆధారం కాని పర్యవసానం సిద్ధాంతరూపములో వచ్చినను దానికి ఆధారం తార్కికమైన ఊహయే గదా! (Hypothesis) కొంత ఊహించి దానిని ప్రత్యక్ష పరిశోధనా ఫలితములతో సమన్వయించటం జరుగుతుంది అలా ఎన్ని పరిశోధనలను సమన్వయించినా ఏ ఒక్క పరిశోధనా ఫలితము పరిపూర్ణము అని నిశ్చయముగా చెప్పుటకు ఏ పరిశోధకుడు సాహసించడు గదా! లేనిచో ఎప్పటికపుడు పరిశోధనలు పరిపూర్ణమైతే ఇన్ని శతాబ్దములుగా పరస్పర

విరుద్ధములైన సిద్ధాంతాలు రూపొందటానికి, నూతన పరిశోధనలు సాగించటానికి కారణం ఉండదు గదా! తాత్త్విక దృక్పథములో తర్కమునకు యోగదృష్టితో కూడిన అనుభవము తోడగును తాత్త్విక, భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు పరస్పర దూషణాస్త్రములతోను, స్వోత్కర్షతోను కాలం వృధా చేయటమే జరుగుతోంది సైంటిస్టు విశ్వరహస్యములను తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నాడు గాని తనను తాను తెలుసుకోలేదు తనను తాను మరచిపోయాడు అన్నాడు అయిన్‌స్టీన్ భౌతికశాస్త్రము, తత్త్వశాస్త్రము రెండును తర్కము (logic) మీదనే ఆధారపడినపుడు పరస్పర సమన్వయమునకు ప్రయత్నించినచో ఫలితము సమగ్రముగా నుండును గదా!

ఆత్మ-పునర్జన్మ అనునవి ఏ దృక్పథముతో తర్కించినను ఎన్నటికీ ప్రత్యక్షములు కానేరవు మరణానంతర జీవితమునకు ఇహజీవితమునకు ప్రత్యక్ష అనుబంధము అసాధ్యము గదా! తార్కిక అనుసంధానమే మార్గము మరణించిన వ్యక్తికి కారణశరీరము ఉండును అని అంగీకరించినప్పటికి దానికి జీవించియున్న స్థూల శరీరములతో సంసర్గము (Communion) ఉండదు పైగా కారణ శరీరములు అదృశ్య రూపములు వాటిని గురించి ఉపనిషత్తులు గాని, జైన బౌద్ధములు గాని, మరి ఏ యితర తాత్త్వికములు గాని చెప్పినవి తార్కిక వ్యుత్పన్నములే (derivatives) యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పినది కూడ తన అత్యంత శక్తివంతమైన యోగదృష్టి ద్వారా గ్రహించినదే గదా! తద్వారా అది ఆయనకు ప్రత్యక్షమే అయి ఉండవచ్చు కాని ఇతరులకు భగవద్గీతను సత్యముగా విశ్వసించటమేగాని ఆత్మ-పునర్జన్మలతో ప్రత్యక్ష సంసర్గము (direct communication) దుర్లభము గదా! ఎవరైనా శ్రీకృష్ణుడంత యోగేశ్వరుడైనపుడు అది లభ్యమగును ఆధునిక యుగంలో రామకృష్ణ పరమహంస, రమణమహర్షి, వివేకానంద, అరవిందుల వంటి పరమ యోగులకు వారి, వారి మార్గములలో అది సాధ్యపడి యుండవచ్చును కాని సాధారణ నిత్యజీవితములో ఉద్వేగముతో ఊగిసలాడు సగటు మనిషికి అది ఎట్లు సాధ్యపడును? సాధ్యపడదు

అందువలన ఆత్మ-పునర్జన్మలతో ప్రత్యక్ష సంసర్గము అసంభవము అని గ్రహించాలి కాని ఆత్మజ్ఞానమును గురించి ఉన్న ఆధారములను క్రోడీకరించుకుని సైన్సు, తాత్త్విక దృక్పథములను సమన్వయించుకుని అన్నిటి కంటే అధికముగా ఆత్మ-పునర్జన్మల వాస్తవికతకు తార్కికముగా (logically) అతిదగ్గరగా నుండు సిద్ధాంతరూపమును విశ్వసించవలసి యుండును ఆత్మ పునర్జన్మలను గురించి తార్కికముగా విజ్ఞానముతో అనుభవమును జోడించి ఊహించినపుడు ఏర్పడు వ్యుత్పన్న రూపములే అట్టి సిద్ధాంత రూపములగునని తెలియును కాని విశ్వాసమునకు భయం జోడించినచో అది మూఢవిశ్వాసముగా దిగజారును తత్త్వదర్శనముగాని, సైన్సుగాని దానిని అంగీకరించవు వేదాంతం అంటే మతమౌఢ్యం కాదు వేదాంతం అంటే తర్కముతో వ్యక్తి ఆంతరిక అనుభవము కలిసినపుడు కలుగు ఊహ (Hypothesis) ఆ తర్కం సరళమైతే అది సామాన్యుడి ఊహకు అందుతుంది లేకపోతే ఆ అనుభూతి ఆకాశపుష్పముగానే ఉండిపోతుంది

ఉద్వేగభరితమైన ప్రస్తుత మానవ జీవితంలో వేదాంతం ఎంత వరకు సహాయకారి? సహాయకారి అయితే సహాయం పొందటం ఎలా అనే తపన నాలో క్రమేపి ఉధృతం అగుట వలన సమాధానం కొరకే ఈ ప్రయత్నం కృషి అంటే సాధన లేంది ఫలితం శూన్యం సాధన మార్గాన్వేషణే ఈ ప్రయత్నం బుద్ధిబలంతో వేదాంతం అంటే ఏదో తెలుసుకున్నామని తృప్తిపడుతూ, తర్కిస్తూ ప్రయాసపడటం నిరర్థకం అలా తర్కముతోను, ఉపన్యాసములతోడను కాలం వృథా చేయువాడు రాగద్వేషాల పరిధిని దాటలేదు ఆత్మానుభూతి మార్గమును అన్వేషించలేదు అట్టివానిని శంకభగవత్పాదులు వాచిక జ్ఞాని అన్నారు (వివేక చూడామణి శ్లోకం 443) అనుభూతి పొందలేనివాడు నీటి యందు ప్రతిబింబించిన శాఖాగ్రము నందు గల ఫలమును చూచి, తినినట్లు సంతోషించువాడు అన్నారు శంకరులు (వివేక చూడామణి శ్లోకం 357)

కఠిన తర్కమునకు ఇందు అవకాశము లేదు ఎందుకనగా ఏ సిద్ధాంత రూపకల్పనా కాదు ఈ ప్రయత్నం మహర్షులు, మహాపురుషులు తమ

అనుభూతుల ద్వారా సిద్ధాంత రూపకల్పన చేయనే చేశారు కుతర్కంతో వారి అనుభూతుల వెనుకనున్న నిగూఢార్థమునకు దూరమగుట కంటె, వారి అనుభూతులను అర్థం చేసుకొనుటకు అవసరమైన సరళతర్కంతో ప్రశ్నలకు సమాధానానికై అన్వేషిస్తూ, ఆ సమాధానములను వర్తమాన ఉద్వేగభరిత మానవ జీవితమునకు సమన్వయపరిచే ఉద్దేశంతో సాగిన ప్రయత్నమిది

తత్త్వశాస్త్ర సాహిత్యము ఒక మహాసముద్రం వేదాలు, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, సూత్రాలు, వాటికి భాష్యములు, ఆ భాష్యాలకు వ్యాఖ్యలు, ఎన్నో భాషలలో వాటికి అనువాదాలు, ఇక పురాణాలు, ఇతిహాసాలు - ఇవి లెక్కకు అందవు వాటిలో నూరవ వంతు చూడాలన్నా ఒక జీవితకాలం చాలదు అందుకనే అందుబాటులో నున్న ప్రస్థానత్రయభాష్యములు, వ్యాఖ్యలు, తత్త్వగ్రంథముల పరిశీలనచే ఏర్పడిన నా అభిప్రాయములకు అక్షరరూపం మాత్రమే ఈ తత్త్వదృష్టి నాకు స్ఫూర్తినిచ్చి ప్రేరణ కలిగించిన గ్రంథములు అనేకములు వాస్తవమునకు అవి దాదాపు ఒక వందకు మించియే యుండవచ్చును, ఎందుకంటే అవి అన్నీ ఒక పరిమితకాలంలో (limited period) చదివినవి కావు వాటినన్నిటిని ఇచట ప్రస్తావించటం సాధ్యపడదు ఆ గ్రంథములకు నేను ఎంతో రుణపడి ఉన్నాను ఆ గ్రంథముల కర్తలకు త్రికరణశుద్ధిగా అభివందనములతో సుమాంజలి సమర్పించుకుంటున్నాను

ఇది నా నివేదన

ఎందరో మహానుభావులు అందరికీ వందనములు

కృష్ణం వందే జగద్గురుం

బాగంబరుపేట, హైదరాబాదు **కేశవభొట్ల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి**

విక్రమ ఆశ్వయుజ

శుక్ల సప్తమి బుధవారం

అక్టోబరు 4, 2000

# I. వేదాంతం - ఆచరణ

## 1 ఆచరణ

వేదాంతం అంటే ఏమిటో ఇంత వరకు తెలుసుకొన్నాము కాని వేదాంతం అంటే ఏమిటో తెలిసికొనటమో, లేక దానిని గురించి అనర్గళంగా మాట్లాడటమో చేస్తూ, ఆదిశంకరులు చెప్పినట్లు వాచిక జ్ఞానులుగా మిగిలిపోవటమే వేదాంత పర్యవసానమా లేక వేదాంతం ద్వారా అభ్యసించి, సాధించగలిగినదంటూ ఏమైనా ఉన్నదా? అనేది అందరి మనసులలో నిత్యం మెదిలే ప్రశ్న అభ్యాసం ద్వారా ప్రాప్తించు వేదాంతజ్ఞానం నిత్యజీవితంలో ఎంత ఉపయోగమో ప్రత్యేకించి పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉంది అదే అనుష్ఠాన వేదాంతం (Practical Vedanta) చాల మందికి వేదాంతం శుష్కముగా, రసహీనముగా అనిపిస్తుంది అర్థం కాని విషయమును 'వేదాంతం' అనటం పరిపాటి వేదాంతం అనగానే ఏవో నాలుగు వాక్యాలు ఉపనిషత్తుల నుండి చెప్పటమో, లేక భగవద్గీత నుండి నాలుగైదు శ్లోకాలు అప్పచెప్పటమో చేసి, "ఈ ప్రపంచం అంతా ఏమి లేదు, అంతా దేవుడే మనదేమిలేదు అంటూ జననమరణాలు తప్పవు, మోక్షమే మార్గము" అని నీతులు చెప్పటం మొదలుపెడితే పర్యవసానం అలాగే ఉంటుంది

ప్రకృతి మనకు రెండు శక్తులనిచ్చింది మేధాశక్తి, ఆత్మశక్తి మేధాశక్తి శారీరకం అది బుద్ధి కర్మతో బంధించబడినది ఆత్మశక్తి కర్మమునకు అతీతమైనది కర్మఫలితము అంటనిది మేధాశక్తి, ఆత్మశక్తి కలిసినపుడు 'ఆంతరిక జీవితం' (inner life) అంటే ఏమిటో తెలుస్తుంది ఆ తెలుసుకోవటమే వేదాంతం

వేదాంతం అనగానే సంసార బంధముల నుండి విడివడి మోక్షసాధన చేయటం అంటే ఎవరు వేదాంతం తెలుసుకునేందుకు ప్రయత్నిస్తారు? అందుకే వేదాంతమును సరళముగా ఉత్తేజకరంగా చెప్తూ వేదాంతం తెలుసుకోవాలంటే అడవుల వెంటనో, కొండలు, కోనలలోనో ఒంటరిగా సాధన చేయాల్సిన అవసరం లేదు, నిత్యజీవిత ధర్మమును (బాధ్యతలను) నెరవేరుస్తూ మనలో ఏముందో తెలుసుకునే ప్రయత్నం చేస్తే చాలు అని చెప్తే వేదాంతం అంటే ఏవగింపు నశించి ఆత్మజ్ఞాన సాధనలోని రసానుభూతి అనుభవంలోకి వస్తుంది

వేదాంతం వేరు, ప్రకృతితో ముడిపడిన నిత్యజీవితం వేరు అను భావం ఉన్నంతకాలం ఆత్మజ్ఞాన రసానుభూతి అనుభవంలోకి రాదు రెండు వేరుగా ఊహించినంత కాలం, మనిషికి ఆత్మానుభూతికి, బాహ్య జీవితానుభవమునకు మధ్య సమన్వయం కుదరదు సమన్వయం కుదరకపోతే సాధకుడు ఎంతో క్షోభకు గురి అవుతాడు ఆంతరిక సాధనకు, నిత్యజీవితముతో ముడివడిన బాహ్య ప్రపంచముతో పొంతన కుదరక క్రమంగా ఒక వ్యక్తి తనలో ఇద్దరు వ్యక్తులుగా తయారౌతాడు (split personality) అది చాలా ప్రమాదకరమైన మానసిక స్థితి (psychosis) అటు ఆత్మశక్తికి కావలసిన సాధన చేయలేడు, ఇటు మేధాశక్తి బలహీనపడుతుంది క్రమంగా రెండింటికి దూరమై ఒక రకమైన వింత వ్యక్తిగానో, పిచ్చివాడుగానో తయారౌతాడు

అందువలన అభ్యాసం ద్వారా ఒక్కొక్క స్థాయి ఎదుగుతూ అలా ప్రాప్తించే వేదాంతానుభూతిని పొందటం ఉత్తమం అపుడు ఆ అనుభూతిని

వర్తమాన జీవితంతో మేళవిస్తే అందరి యందూ ఉన్నది భగవంతుడు ఒక్కడే అను జ్ఞానం కలుగుతుంది అదే వేదాంత సారాంశం కాబట్టి నిత్య జీవితంలో కర్మములు (బాధ్యతలు) నిర్వహిస్తూనే ఎంతో కొంత సమయం నిత్యం ధ్యానంలో గడిపితే మనస్సు నిర్మలమవుతుంది నిర్మలమనస్సు ద్వారా బుద్ధి చైతన్యమవుతుంది చైతన్యమైన బుద్ధికి ఆత్మశక్తి దూరం కాదు రెండింటి కలయికే అభ్యాసప్రాప్త వేదాంతం ఆ స్థితిలో మనస్సు ఒకవైపు నిత్యజీవన ప్రవాహంలో తెరచాపగానూ ఉంటుంది మరొకవైపు అంతర్ముఖమై ఆత్మశక్తితో మిళితమవుతుంది ఆ వ్యక్తి నిత్యజీవితంలో కష్టసుఖాలకు, జయాపజయాలకు అతీతంగా ఉంటాడు తెరచాప గాలిని తనలో ఇముడ్చుకుని గమ్యంవైపుకు కదుల్తుంది తనతోపాటు పడవను కూడా తీసుకువెళ్తుంది పడవలో ఎవరు ఏమి చేస్తున్నా తెరచాపకు పట్టదు దాని దృష్టి గమ్యం వైపుకే ఉంటుంది అలాగే మనసును ధ్యానం ద్వారా గమ్యంవైపుకు అనగా ఆత్మను తెలుసుకొనుటకు, మళ్లిస్తూనే బాహ్యజీవితంలో నిష్కామంగా కర్మయోగమును అనుసరిస్తాడు జీవుడు అపుడు బాహ్య ఆంతరిక (worldly and inner lives) జీవిత సమన్వయం కుదురుతుంది అలా నిత్యజీవితానికి ఆటంకం కాకుండా మనసును పరమాత్మ వైపుకు మళ్లించటమే అభ్యాసప్రాప్త వేదాంతం పడవ లేకపోతే తెరచాప ఉండదు తెరచాప లేకపోతే పడవ నడవదు అదే మనసుకు, ఇంద్రియ భూతమగు శరీరానికి గల సంబంధం శరీరంలో ఉంటూనే మనసుకు బంధవిముక్తి కలిగించటమే అభ్యాసప్రాప్త వేదాంతం (Practical Vedanta) దీనినే అనుష్ఠాన వేదాంతం అన్నారు ఈ వేదాంతమునకు ఆదిశంకరుల 'వివేక చూడామణి', గీతాచార్యులు చెప్పిన 'భగవద్గీత', సాధన ద్వారా దివ్యచైతన్యంలో ప్రవేశించటానికి మార్గము చూపుతున్నాయి 'వివేక చూడామణి' జ్ఞానమార్గం (విచక్షణాజ్ఞానం లేక వివేకం) ద్వారా ఈ విషయాన్ని తెలిపితే, భగవద్గీత - భక్తిమార్గము ద్వారా యీ విషయాన్ని తెలియజేస్తుంది

'అహం బ్రహ్మాస్మి'యని నోట పల్కినంత మాత్రాన మోక్షము లభించదు

(వివేక చూడామణి 64వ శ్లోకం) ఆత్మతత్వజ్ఞానము కలుగనిదే 'అహం బ్రహ్మ అహం బ్రహ్మ' అని శబ్దోచ్ఛారణ చేసినంత మాత్రాన ముక్తి లభించదు పెట్టెలో 'మణి యున్నది మణి యున్నది' అని నోట ఉచ్ఛరించినంత మాత్రాన యా మణి చేజిక్కునా? అలాగే సన్యసించినంత మాత్రాన ఆత్మజ్ఞానసిద్ధి లభించునా? కొందరు భార్యా, పిల్లల వల్లను, ఇతర కష్టముల వలననో ఓర్చుకోలేక సన్యసింతురు కాని వారిని ఆశాపిశాచము విడువదు కొందరు తమ ఉదర పోషణకు, కొందరు తమ నిష్ఠ గుణప్రకటనకు అత్యంత విరాగుల వలె నటింతురు ఇట్టివారికి ముక్తి ఒక వార్తగానే మిగిలిపోతుంది

గృహస్థుడు గృహములో నివసించుచు బాహ్య సంసారమునెట్లు నిర్వర్తించునో అట్లే జీవుడు ఈ స్థూలశరీరము నాశ్రయించి, 'నేను చూచుచున్నాను, వినుచున్నాను' మొదలగు బాహ్య వ్యవహారములు జరుపుచుండును (వివేక చూడామణి 92 శ్లో)

పరమాత్మ (పరమేశ్వరుని) శక్తిని (మూలప్రకృతి) అవ్యక్తం అంటారు అంటే వ్యక్తం కానిది కనబడనిది దానినే మాయ అని, అవిద్య అని కూడ అంటారు ఇది అనాదియైనది కార్యవర్గమునకు పరమైనది సత్వరజస్తమోగుణ విశిష్టమైనది కార్యమును బట్టి ఊహింపబడినది ఈ మాయ (ప్రకృతి) నుండియే చరాచర రూపమగు సర్వప్రపంచము ఉత్పన్నమగుచున్నది (వివేక చూడామణి 110 శ్లో)

ఈ మూలప్రకృతి పరబ్రహ్మముతో నున్నపుడు మాయ అనబడును అది సత్వగుణ ప్రధానముగా జ్ఞానసాధనమగును అదే జీవునితో గూడినపుడు అవిద్య (అజ్ఞానం) అనబడును అది రజస్తమోగుణ ప్రధానమై సంసార కారణమగును ఈ మాయ (అవిద్య) నిజముగా ఉన్నదీ కాదు, లేనిదియును గాదు అదే ఈ విశ్వము (ప్రపంచము) అజ్ఞానముచే ఉన్నట్లుగా కన్పడును జ్ఞానదృష్టి (ఆత్మజ్ఞానం)తో తిలకించినచో ఈ విశ్వము అంతా మూలప్రకృతి

రూపాంతరమేనని బోధపడును రూపాంతరమే కాని అవాస్తవము కాదు గదా! కావున ఈ మాయ అనునది మహాద్భుతమగు అనిర్వచనీయరూపము గలది అనగా రూపమును స్పష్టముగా నిర్వచించుటకు సాధ్యము కానిది

బ్రహ్మము అద్వితీయమైనది దానిని అపరోక్షజ్ఞానము ద్వారా మాత్రమే (ప్రత్యక్ష జ్ఞానము) అనగా ప్రత్యక్ష అనుభూతి ద్వారా (Direct Experience) తెలిసికొనగా మాయ నశించి మూలప్రకృతితో కూడిన పరమాత్మ గోచరమగును సత్త్వరజస్తమోగుణములు మాయ యొక్క గుణములు తెలుపు, ఎరుపు, నలుపు వర్ణములు గల నూలుదారములతో పేనబడిన త్రాటివలె మాయ ఈ త్రిగుణములతో మిశ్రమైయుండును వాని వాని కార్యములననుసరించి యీ త్రిగుణములు తెలియబడును ఎట్లనగా - ప్రసన్నచిత్తము కలిగి శాంతముతో నుండునపుడు సత్వగుణము ప్రధానముగా నుండి రజస్తమములు తగ్గి యుండును చంచల చిత్తముతో క్రోధాది వికారములు కలిగియుండునపుడు రజోగుణము ప్రకటమగును నిద్ర, ఆలస్యము మొదలగు దోషములతో కూడియుండునపుడు తమోగుణము ప్రధానమై యుండి తక్కిన గుణములు తగ్గియుండును

ఈ త్రిగుణములలో క్రియారూపము దాల్చునది రజోగుణము ఇది మాయ యొక్క 'విక్షేపశక్తి' అనబడును అనగా 'కదలిక' గలది ఇది అనాదియై, దీని నుండియే సకల సృష్టియు, మనుష్యులకు ప్రవృత్తి (స్వభావము) కలుగును మనోవికారములగు అనురాగం, ద్వేషం, సుఖం, దుఃఖం మొదలగునవి విక్షేపశక్తి యొక్క కార్యములు

కామము (విషయవాసన), క్రోధము, లోభం, మదము, మోహం, అసూయ, మొదలగు వృత్తులు రజోగుణధర్మములు దీని వలన మనిషి ప్రవృత్తి (స్వభావం) కలుగును కనుక రజోగుణము బంధహేతువు 'మాయ' యొక్క 'తమో'గుణము 'ఆవరణశక్తి' అనబడును వస్తువు యొక్క

యదార్థరూపమును మాటుపరచి దానిని మరియొక రూపముగ తోచునట్లు చేయుట ఆవరణశక్తి యొక్క కార్యము ఇదియే జీవునకు సంసార కారణమున్ను, విక్షేపశక్తి (అనగా కామక్రోధాదులు ప్రవాహరూపము) వ్యాపించుటకు కారణము అగుచున్నది భ్రాంతికి కారణము ఆవరణశక్తియే విక్షేపశక్తి అనగా యదార్థంగా వున్నదానిని మరియొక విధంగా వక్రీకరించి మన మనస్సుకు తెలుపునది

అత్యంత విశుద్ధ ప్రకాశస్వరూపుడగు ఆత్మను మాయ యొక్క ప్రబలమగు ఆవరణశక్తి అచ్ఛాదింపగా పురుషుడు (జీవుడు) మోహవశుడై అనాత్మయగు శరీరమే తాననుకొని దేహాభిమానియై వ్యవహరించును అపుడు రజోగుణ ప్రధానయగు గొప్ప విక్షేపశక్తి కామక్రోధాది బంధక గుణములచే జీవునకు దుఃఖము కలిగించును

వివేక చూడామణి 147వ శ్లోకంలో శంకరులు సంసారమును చక్కటి ఉపమానం ద్వారా వివరించారు సంసారరూప మహావృక్షమునకు అజ్ఞానము (అవిద్య), బీజము (విత్తము), దేహమే ఆత్మ అనుకొను బుద్ధి అంకురము (మొలక), శరీరమందు రాగము (ప్రేమ), చిగురుకొమ్మ, కామ్యకర్మములు జలము, దేహమే స్కంధము (ప్రమాను), ప్రాణాది పంచవాయువులు కొమ్మలు ఇంద్రియ సముదాయము ఉపశాఖలు (పై భాగములు) శబ్దాది విషయములు (sense organs) పుష్పములు, నానావిధ కర్మముల వలన గలిగెడి దుఃఖ సముదాయమే ఫలము ఈ ఫలమునననుభవించెడి జీవుడే పక్షి

సంసారవృక్షము అజ్ఞానుల విషయమై యిట్లు వర్ణింపబడినది తత్వవేత్తలకు ఇదియే సత్ఫలవృక్షముగా 148వ శ్లోకములో చెప్పబడినది (ఇచట ఇవ్వబడిన శ్లోకసంఖ్యలు రామకృష్ణ మఠం, మద్రాసు వారిచే తెలుగులో ప్రచురింపబడిన వివేక చూడామణిలోనివి)

'మోక్షము, మోక్షము' అని పదేపదే వేదాంతంలో వినబడుతూ ఉంటుంది అసలు మోక్షమంటే ఏమిటో శంకరులు వివేక చూడామణి 559వ శ్లోకంలో

చెప్పారు దేహమును విడుచుట మోక్షము కాదు దండక మండలములను విడుచుట మోక్షము కాదు మరియేమనగా అవిద్య అను కంతి లేక పుండు నుండి విమోచనమే ముక్తి లేక మోక్షము అనగా అవిద్య మూలముగా ఏర్పడిన ఈ శరీర వ్యామోహత్యాగమే మోక్షము

అంటే నిత్యజీవితంలో స్వార్థత్యాగం ద్వారా నిష్కామకర్మము చేయుచు సర్వమందు పరమాత్మను చూచుచు పరమాత్మ శక్తిరూపమైన ప్రకృతి చైతన్యమును (activity) గ్రహించి దానితో మన కర్మాచరణములను సమన్వయించుకొనుచు కర్మఫలితమును గురించి చలించకుండ కర్మములను నిర్వర్తించుచు కర్మయోగము ద్వారా ధ్యానమార్గమున నిర్మల మనస్సును సాధించి భావాతీత స్థాయికి మనస్సును ఆరోహింపచేయుటయే అభ్యాసప్రాప్త వేదాంతం అదే అనుష్ఠాన వేదాంతం

పరమాత్మను తెలుసుకొనుటకు ప్రకృతియే మార్గము శ్రీరామకృష్ణ పరమహంస "మాయయే బ్రహ్మమును ఉత్పత్తి చేయుచున్నది మాయ లేనిచో బ్రహ్మమును ఎరుగ ఎవరి తరము? ఈశ్వరుని శక్తిని తెలియలేకున్నచో అతనిని గ్రహించజాలము" అన్నారు అనగా పరబ్రహ్మము యొక్క శక్తిరూపమైన ప్రకృతిలో జరుగు కర్మ ప్రవాహములో ఒకరమై ప్రకృతి ద్వారా పరమాత్మను నిరాకారముగా గాని, సాకారముగా గాని మనసు నందు స్థిరీకరణ చేసుకుని ధ్యానములో లీనమగుటయే అభ్యాసము, దీనినే అనుష్ఠానము, ఆచరణ, సాధన అన్నారు

## 2 సత్యాన్వేషణ

అభ్యాసం ద్వారా మాత్రమే వేదాంతానుభూతికి అవకాశం ఉన్నదని తెలుసుకున్నాము నిత్యజీవితంలో అభ్యాసం చేయవలసినది ఏమిటి, దాని ద్వారా ప్రాప్తించేది ఏమిటి? వాస్తవిక వేదాంతం అంటే ఏమిటి? వీటి సమాధాన

ప్రయత్నమే సత్యాన్వేషణ స్వామి వివేకానంద 1896 నవంబర్‌లో లండన్‌లో ఇచ్చిన ఉపన్యాసాలలో వేదాంత వాస్తవమును గురించిన వివరణ ఏనాటికీ చెరగని శిలాక్షరములు

సిద్ధాంతములు (Theories) ఎక్కువ భాగము ఊహారూపములే అవి చాల మంచివిగానే ఉంటాయి అనంతమైన ఊహాపరంపరయే వేదాంత సిద్ధాంతములు అవి తర్కించటానికి, గంభీరోపన్యాసాలకు చాలా బాగుంటాయి అర్థము చాల ఉన్నతమైనది కాని అది ఆ స్థాయిలోనే నిలిచిపోతే నిష్ఫలం గదా! ఉపనిషత్తుల ఉద్దేశం అది కాదే! ఆచరణ ద్వారానే అనుభూతి (Direct Experience) పొందాలనేది వేదాంత ఉద్దేశము, పరమార్థము ఆచరింపవలసిన (Practical) వేదాంతము ఏమిటి? వేదాంత పరమార్థమే బ్రహ్మజ్ఞానసిద్ధి గదా! ఉద్వేగంతో కూడిన నిత్యజీవితంలో 'బ్రహ్మజ్ఞాన' స్థానం ఏమిటి? నిత్యజీవితంలో 'బ్రహ్మజ్ఞాన' వాస్తవపరమార్థం ఏమిటి? ఇది తెలుసుకొనటమే సత్యాన్వేషణ

వేదాంత పరమార్థం తెలుసుకోవాలంటే వేదాంతం, వేదమతం భిన్నం కాదు అనే సత్యం గ్రహించాలి జీవితానికి వేదాంతానికి (మతం) మధ్య కల్పించబడిన భిన్నత్వం పోవాలి వేదాంతం ఏకత్వంను గురించే చెప్తుంది వేదాంతమును నిత్యజీవితానికి అన్వయించటానికి ముందు వేదాంత సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలి, అవి ఏ విధంగా ఏర్పడినవో కూడ తెలుసుకోవాలి "ఏకాంతంగా ఉండే వన్యప్రాంతాల నుండి నిత్యం సందడిగా ఉండే పట్టణ ప్రాంతాల వరకు పరిశీలించి ఎక్కడ ఎక్కువగా ఈ సిద్ధాంతాలు రూపొందటం జరిగిందో గమనిస్తే, ఏకాంత వన్యప్రాంతాలలో నున్న మునులు, వానప్రస్థుల కంటే నిత్యం పరిపాలనా వ్యవహారాలతో సతమతమగుచున్న రాజులు, చక్రవర్తులే ఈ సిద్ధాంతాలకు మూలకారకులు అని ఉపనిషత్తుల ద్వారా తెలుస్తుంది" అని స్వామి వివేకానంద అన్నారు కాబట్టి వేదాంతమనేది ఎక్కడో అడవులలో ధ్యాన నిమగ్నత ద్వారా మాత్రమే రూపొందింది అనటం సమంజసం కాదు అని స్వామి

వివేకానంద అన్నారు వేదాంతంలోని మూలభావాలు, రాజసౌధాలలోను, రహదారులలోను కూడ చాలవరకు రూపొందినవై అని స్వామి వివేకానంద అభిప్రాయం నిరంతరం విశ్రాంతి ఎరుగని చక్రవర్తులు, పౌరులలో కూడ ఉదాత్తులైన తత్వవేత్తలున్నారు అని కూడ స్వామి గట్టిగా చెప్పారు

దీనిని బట్టి వేదాంతం అనేది అభ్యాసప్రాప్తంగా (Practical) ఉండాలే కాని సిద్ధాంత (Theoritical) రూపంగా మాత్రమే ఉంటే అది నిరుపయోగంగానే మిగిలిపోతుంది అని గ్రహించాలి వేదాంతసారమైన భగవద్గీత ఎక్కడ చెప్పబడింది? భయంకరమైన యుద్ధభూమిలో ఆ స్థితిలో కూడ గీతాచార్యులు ప్రశాంతమైన మనసుతో గీతాబోధన చేశాడు అదే కర్మములో అకర్మము గదా! భగవద్గీత ప్రతి పేజీలోను మనకు లభ్యమయే సిద్ధాంతం ఒకటే అదే నిత్యం సాగిపోయే కర్మయోగం కర్మము లేక పనియందలి మూలం ప్రశాంత చిత్తం నిశ్చేష్టత్వం (inactivity) జీవిత గమ్యానికి మార్గం కాదు ఉద్రేకం (passion) తోడైనంత మాత్రాన నిశ్చేష్టత్వం ఒక్కసారిగ చలనరూపం పొందదు (activity) ప్రశాంతచిత్తంతో కూడిన చలనమే నిజమైన కర్మము అదే వేదాంతధ్యేయము ఊహలతో రూపొందిన ధ్యేయము లేక ఆదర్శమే (aim or ideal) వేదాంతం చెప్తుంది ఆదర్శం ఎపుడూ వాస్తవానికి, ఆచరణకు అతీతంగానే ఉంటుంది ఏ ఆదర్శం విషయంలోనైనా మనిషి పద్ధతులు రెండు విధాలుగా ఉంటాయి **ఒకటి**, ఆదర్శమును జీవితముతో సమాధానపరచుకొని (compromise) లేక సమన్వయపరచుకొని తృప్తిపడుట **రెండవది** జీవితమును ఆదర్శము స్థాయికి ఎదగనీయటం (elevate) ఇందులో మొదటిది సహజంగా మనిషికి ఆకర్షణ, ప్రేరణ అవుతుంది 'నేను ఈ రకమైన పని మాత్రమే చేయగలను' అను భావము ఈ ప్రేరణ ఫలితమే ఈ ప్రేరణ సాధారణంగా చెడుదే అయి ఉంటుంది ఎందుకంటే దీనికి స్వార్థం పునాదిగా ఉంటుంది అందువలన ఆదర్శమును తన స్వార్థానికి అనువుగా మలచుకోవటం పరిపాటి అయింది దానికి వీలుగానున్న ఆదర్శం దొరకగానే మనిషి గెంతి దానిని అందుకుంటాడు

దుకాణం నడిపేవాడు వ్యాపారం తన ఆదర్శం అనుకుంటాడు అలాగే దొంగ తను చేసే దొంగతనమే ఆదర్శంగా భావిస్తాడు అలాగే మనం చేయగలిగిన పనినే అభ్యాసప్రాప్తంగా (Practical) చేసుకుని దానినే ఆదర్శంగా భావించటం జరుగుతుంది మిగిలినవి ఆచరణయోగ్యం కావు అనిపిస్తుంది మనం ఇష్టపడే, చేయకలిగే పనినే ఆదర్శం అనుకుంటాము దీనినే ఇంకొక విధంగా చెప్తే ఏ పనైనా చేయగలము అనుకుంటే చేయగలుగుతాము

వేదాంతం చెప్పేది ఆచరణ సాధ్యంగానే ఉంటుంది ఆదర్శంగా దానిని వర్ణిస్తే, ఆచరించ తలచుకుంటే దానిని ఆచరించగలుగుతాము ఆచరణ సాధ్యంకాని ఆదర్శమును వేదాంతం చెప్పలేదు అది ఎంత ఉన్నతమైనది అయినా ఆదర్శము ఉండవలసినంత ఉన్నతంగానే ఉంటుంది ఒక మాటలో చెప్పాలంటే, వేదాంతాదర్శము చెప్తుంది 'తత్వమసి' అని అదే వేదాంతసారాంశము త్వం = నీవు, తత్ = ఆ స్థితి లేక ఆత్మ, అసి = అయి ఉన్నావు ఈ జగత్తుకు మూలకారణంగా ఏ సూక్ష్మమైన సారము చెప్పబడిందో అదే ఈ సమస్తమైన జగత్తును అదే (ఆ సూక్ష్మమైన సారము) ఆత్మ అదే సత్యం, అదే నీవు నీవే అది

ఆత్మ నిత్యమైనది జనన మరణములు లేనిది మరణమును గురించి భయము మూఢవిశ్వాసం మాత్రమే "నేను ఈ పని మాత్రమే చేయగలను, ఆ పని చేయలేను" అను భావాలు కూడ మూఢవిశ్వాసాలు మాత్రమే

వాస్తవానికి మనం అన్నీ చేయగలము ఆత్మవిశ్వాసం ప్రధానం అని వేదాంతం చెప్తుంది ఇష్టదైవం మీద నమ్మకం లేనివాడు నాస్తికుడు అని కొన్ని మతాలు చెప్తున్నట్లుగానే, తన మీద తనకు విశ్వాసం లేనివాడే నాస్తికుడని వేదాంతం చెప్తుంది మన ఆత్మ ప్రకాశం మనకే తెలియకపోవటం నాస్తికత్వం ఇదే వేదాంతాదర్శము కొంతమందికి ఇది అతిభయంకరముగా కనబడును ఈ ఆదర్శమును సాధించటం కూడ దుర్లభం అని కొంతమందికి అనిపిస్తుంది

కాని అది ప్రతి ఒక్కరు సాధించవచ్చునని వేదాంతం నొక్కి చెప్తుంది ఇది ఏదో క్రొత్తగా సాధించవలసినది కాదు ఇది వరకే ఆత్మను తెలుసుకొనటం జరిగింది అది అక్కడే ఉంది కొత్తగా గ్రహించవలసినది ఏమియు లేదు ఉన్నదానిని తెలుసుకొనటమే వేదాంతాదర్శము దీనికి జాతిభేదములు గాని, లింగ భేదములు గాని, వయోభేదములు గాని లేవు

అనంత విశ్వములోని శక్తులన్నీ మనలోనే ఉన్నాయి మన కళ్లు మనమే మూసుకుని అజ్ఞానం, మూఢత్వం అను అంధకారంలో పడి, అంతా చీకటిమయం అని విలపిస్తూ ఉంటాము మన చుట్టూ చీకటి అంటూ ఏమియు లేదు అని గ్రహించాలి ఈ గ్రహణశక్తి పొందటమే వేదాంతాదర్శనము కళ్లు తెరిస్తే అంటే అడ్డం పెట్టిన చేతులు తీసేస్తే అంతా వెలుగే గదా! ఈ వెలుగే నిరంతర సత్యం చీకటి అనేది విశ్వంలో లేదు సృష్టి అరంభము నుండి అంతా వెలుగే అలాగే శక్తిహీనత లేక అశక్తత (weakness) కూడ సృష్టిలో ఎపుడూ లేదు 'అశక్తులము' అని అనుకునేవాళ్లు బుద్ధిహీనులు

ఈ సృష్టిలో వెలుగు నిత్యం, సత్యం ఇదే వేదాంత ఆదర్శం అది తెలుసుకోవటం అసాధ్యం కాదు గదా! ఇది తెలుసుకోవటం అనే ఆచరణ అసాధ్యం కాదు గదా! ఇది వేదాంత ఆదర్శము, ధ్యేయం, అంతేకాదు, ఇది నిత్యసత్యం (Reality)

"మానవుడు మర్త్యుడు (మరణము గలవాడు) అనటమే మనకి మనం అసత్యం చెప్పుకోవటం మన మనస్సును మనమే ఈ అసత్యమనే నిద్రలోకి నెడ్తున్నాము వేదాంతం దృష్టిలో పాపం అనేది లేదు దానిని గుర్తించదు తప్పులను పొరపాట్లను మాత్రం గుర్తిస్తుంది తాను అశక్తుడు, పాపి, దుఃఖజీవి, ఈ పని చేయలేను, ఆ పని చేయలేను, అనటం అన్నిటికంటే పెద్ద తప్పు - ఇట్టి జీవితం నిరర్థకం అట్టి జీవితంతో సమాధానపడటానికి వేదాంతం ఎన్నడూ అంగీకరించదు మన శక్తిని మనం గుర్తించినపుడే అది వాస్తవిక జీవితం అది

ఎపుడూ అనంతమైన వెలుగుతో నిండి ఉంటుంది" అని స్వామి వివేకానంద ధృడవిశ్వాసం

ఇది సాధించటం వానప్రస్త ఏకాంతజీవితంలోనే గాక, నిత్యం ఒడుదుడుకులతో కూడిన ఎట్టి స్థితిలోని జీవితంలోనైనా జరుగుతుంది అని వేదాంతం చెప్తుంది ఏకత్వమే వేదాంత ప్రధానాంశము పరమాత్మ ఒకరే పరాశక్తి ఒకరే విశ్వము ఒకటే ఉన్నట్లుగా కనబడే భిన్నత్వము వాస్తవం కాదు ఆ భేదం స్థాయికి (degree) సంబంధించినది కాని జాతి, రీతికి సంబంధించినది కాదు మనష్యులలో కనబడే భిన్నత్వం రూపానికి సంబంధించినది కాదు మానసిక స్థాయికి సంబంధించినది అందరిలో ఉన్నది ఆత్మయే దానికి భిన్నత్వం లేదు ఇంకా కాస్త ముందుకు వెళ్తే జంతువులకు, మానవులకు మధ్య కూడ భిన్నత్వం లేదు ఇద్దరిలోనున్న ఆత్మ ఒకటే కాని పరిణామ స్థాయిలలో వారిద్దరి మధ్య ఉన్న భిన్నత్వమే మనకు గోచరమయే భిన్నత్వం

'మార్పులకు ఏ మాత్రం ఇష్టపడక పోవటం' (conservatism) అనేది మానవ స్వభావంలోని ప్రధానలక్షణం ఒక్క అడుగు ముందుకు వేయటానికి కూడ ఇష్టపడడు 'మంచులో గడ్డకట్టిన' స్థితిలో మనిషి ఉన్నాడని స్వామి వివేకానంద అన్నారు ఇదే మానవుని బలహీనత దీనిని నిరోధించటానికి మార్గం ఒకటే "నీవు శక్తివంతుడవు, పరిపూర్ణుడవు, పాపములుగా చెప్పబడుచున్న వాటితో నీకు సంబంధము లేదు" అని ప్రతి మనిషిని ఉత్తేజపరచాలని (activate) వేదాంతం చెప్తుంది 'నేను చేయలేను' అని ఎపుడూ అనవద్దు తలచవద్దు నీ శక్తి అనంతము కాలము, ఆకాశము కూడ నీ శక్తి ముందు నిరర్ధకము నీవు ఏదైనా చేయగలవు, నీవే పరమాత్మవు' అని వేదాంతాదేశము

నిత్యజీవితంలో, గ్రామంలో కాని, పట్టణంలో కాని, జాతీయ జీవనంలో కాని, సంసార జీవితంలో కాని వేదాంతమును ఎలా ప్రవేశపెట్టాలనేది తప్పక గ్రహించవలసిన విషయము మతం కాని వేదాంతం కాని మానవునికి

ఉపయోగపడనపుడు అది నిరర్ధకమే అవుతుంది ఏదో కొద్ది మంది కొరకు ప్రత్యేకించబడిన సిద్ధాంతంగానే మిగిలిపోతుంది మానవశ్రేయస్సే వేదాంత (మత) ధ్యేయం కావాలి మానవుడు ఏ స్థితిలో నున్నను, ఎచట ఉన్నను మతం అతనిని ఆదుకోవాలి అపుడే అది ఆచరణయోగ్య వేదాంతం అవుతుంది వేదాంత సూత్రాలు గాని, మత అదర్శాలు గాని మానవ శ్రేయస్సుకు ఉపయోగపడుటకు వీలైన శక్తివంతములైనపుడే వాటి ధ్యేయం నెరవేరుతుంది

ఆత్మవిశ్వాసం అనేదే మనకు అత్యంత ఉపయోగకారి 'ఆత్మవిశ్వాసం' పెరగటానికి సాధన చేస్తే మనలో ఏర్పడుతున్న చెడు, బాధలు ఎక్కువభాగం అదృశ్యమవుతాయి అని స్వామి వివేకానంద దృఢవిశ్వాసం "బాధలలో మానవుడు ఎంత దిగిపోయినా, ఏదో ఒక సమయంలో పూర్తి నిస్పృహలో, ఒక్కసారిగా తన మీద తాను విశ్వాసం సంపాదిస్తాడు కాని అలా కాకుండ మొదటి నుండి ఆత్మవిశ్వాసం కలిగి ఉండటం ఉత్తమం" అని స్వామి వివేకానంద స్వానుభవంతో చెప్పారు

ఆత్మవిశ్వాసం అంటే మితిమీరిన స్వార్థం కాదు 'స్వార్థం' అనేది వేదాంతానికి వ్యతిరేకం వేదాంత సిద్ధాంతం ఏకత్వం అంటే జీవులందరి యందు విశ్వాసం కలిగి ఉండటం ఆ జీవులందరిలో మనం కూడ ఉన్నాం కదా! మనందరిలో ఉన్న ఆత్మ ఒక్కటే గదా! మనలను మనం ప్రేమించటం అంటే స్వార్థప్రేమ కాదు 'జీవకారుణ్యం' అది అంటే అందరిలో మనలను చూడగలగటం, మనలో అందరిని చూడటం అదే విశ్వప్రేమ (universeal love) అది సాధించినవాడే 'నా గురించి నాకు పూర్తిగా తెలుసు' అని ఎంతో ఆత్మవిశ్వాసంతో చెప్పగలుగుతాడు అదే ఆత్మశక్తి లేక ఆత్మబలం ఈ ఆత్మబలం వెనుక ఉన్నదే సచ్చిదానందము, అనంతము అయిన పరమశక్తి అదే పరమాత్మ చైతన్యశక్తి

ఇది పొందాలంటే 'ఆత్మధ్యానం' అనుక్షణం జరగాలి ఉపనిషత్తులలోని

మహావాక్యమైన 'తత్వమసి' మన నాళములలోను నరములలోను ప్రతిధ్వనించునటుల ధ్యానించాలి ఈ ధ్యానం అదేది మన నోరు ధ్వనించునట్లుగాను, మన హృదయం పరిపూర్ణంగా మన నోటి ద్వారా ప్రతిధ్వనిస్తున్నట్లు ఉండాలి అదే ధ్యానము

"హృదయ పరిపూర్ణత్వము ద్వారా మన చేతులు పనిచేస్తాయి చలనం ప్రారంభమౌతుంది కర్మము మొదలౌతుంది సర్వం పరమాత్మ అను ఆదర్శంతో మన మనస్సు, శరీరం నిండిపోవాలి ఏ కర్మము చేసినా "సర్వం పరమాత్మ" అనే భావంతోనే చేయాలి అపుడే మన కర్మములన్ని ఉన్నతంగా పవిత్రంగా రూపొందుతాయి మన భావాలన్నీ ఆత్మధ్యానం ద్వారా కలిగిన శక్తి వలన రూపొందినపుడు, ఆ శక్తి వలన మన కర్మములు గూడ శక్తివంతము లౌతాయి 'తత్వమసి' 'అహంబ్రహ్మాస్మి' అను భావాలు పవిత్రంగా మన జీవితంలో మనలను ప్రభావితం చేయునట్లు మన మనసు వాటితో నిండి ఉండాలి 'అందరిలో నున్న ఆ పరబ్రహ్మాను సేవిస్తాను' అని నిర్ణయించుకోవాలి "Arise - Awake! and stop not till the goal is reached" - లెమ్ము, మేల్కొనుము, గమ్యం చేరేదాకా విశ్రమించవద్దు (మూలం, కఠోపనిషత్తు 3-14) మనకు కావలసినది బలము అట్టి బలము ఉపనిషత్ప్రతిపాదకములైన సత్యములను విశ్వసించుట చేతను 'నేను ఆత్మను' అని లెస్సగ భావించుట చేతను కలుగగలదు" అని స్వామి వివేకానంద పిలుపునిచ్చారు

విశ్వాత్మయైన పరమాత్మ అంశమే జీవాత్మ అనియు, ఈ జీవాత్మ అన్ని జీవులలోను ఉన్నదని ఉపనిషత్తులు చెప్తున్నాయి అంటే అందరిలోనున్నది పరమాత్మ అనే గదా అర్థము అందరినీ మన కళ్లముందు చూస్తున్నాము వారిలో పరమాత్మ ఉన్నాడు పరమాత్మ కనబడడు అందరిలోనున్నాడు అందరు మనకు కనబడతారు అంటే పరమాత్మ మనకు కనబడుతున్నాడనే కదా అర్థం అనగా సర్వాంతర్యామిగా పరమాత్మ మనకు కనబడుతూనే

ఉన్నాడు  కాని మనమే గుర్తించుట లేదు

"హృదయం (మనసు) ద్వారానే మనం భగవంతుని చూడగలము బుద్ధి (తెలివి) ద్వారా కాదు  బుద్ధి అనేది మార్గం శుభ్రము చేస్తుంది  అది ఉపకార్యకర్త (secondary worker) మాత్రమే అనగా రక్షకభటుడు (Policeman) అలజడి తగ్గించుట, తప్పులను సరిదిద్దుట - ఇవి మాత్రమే బుద్ధి చేయు పని బుద్ధి చాతుర్యమునకు సంబంధించిన పుస్తకమును చదవటం పూర్తిచేసినపుడు 'భగవంతుడా! ఈ బాధ వదిలింది, ధన్యుడను' అని అనిపిస్తుంది  బుద్ధి గ్రుడ్డిది  స్వతంత్రముగా చలనము లేనిది  చేతనత్వము (చలనము) కలది భావము (చిత్తవృత్తి మాత్రమే)  అదే చేతనమైన అనుకంపన గల మనసు (Feelings)  అది మాత్రమే కర్మములు చేయిస్తుంది  విద్యుత్ ప్రవాహము కంటే గూడ వేగంగా కదులుతుంది  మనసు మాత్రమే చలిస్తుంది  బుద్ధికి చలనం లేదు  అనుభవం రెండు రకాలు 1) శారీరకం, 2) మానసికం శారీరకంగా కలిగే అనుభవాలు ఇంద్రియానుభూతి  మానసిక అనుభవం ప్రత్యక్షం (Direct Experience)  ఇది భావ ప్రకంపనల (Vibratory Feelings) రూపంలో ఉంటుంది  మానసికానుభవమే భావ ప్రకంపనలు (Feelings)  ఈ అనుభవం అనుభూతి అయినపుడు మానసికంగా పరమాత్మ దర్శనం అవుతుంది ఈనాటి మానసికానుభవం క్రమంగా తీవ్రమై, పవిత్రమై అత్యున్నత స్థాయికి చేరుతుంది  ఈ స్థాయిలోనే వేదాంతం చెప్పు ఏకత్వ భావన, అటుపై 'సర్వంఖల్విదంబ్రహ్మ' అను విశ్వ ఐక్య భావం రూపొందుతుంది  ఇది మనసుకు మాత్రమే సాధ్యము  బుద్ధికి కాదు"  ఇదే ఆదిశంకరులు వివేక చూడామణిలో చెప్పారు (60వ శ్లోకం)

"తర్కమీమాంసాది అష్టాదశవిద్యలును భుక్తి కొరకే కాని ముక్తి కొరకు కాదు  పాండిత్యము, వాక్చాతుర్యము, అనర్గళ శబ్దప్రయోగ కౌశలము, శాస్త్ర వ్యాఖ్యానములో నేర్పు - ఇవి అన్నియు భుక్తి కొరకే కాని ముక్తి కొరకు కాదు

పరమాత్మ ప్రతిబింబమే జీవాత్మ కాబట్టి జీవాత్మ పరమాత్మ కంటే భిన్నము కాదు ఇది తెలుసుకొనుట మాత్రమే ముక్తికి మార్గము కేవల తర్క,వ్యాకరణాది శాస్త్ర అధ్యయనముతో పనిలేదు అనగా శాస్త్రాధ్యయనముతో పాటు పరతత్వజ్ఞాన అభ్యాసము కూడ అవుసరము "

మనసు ప్రధానం అన్నాం కదా అని బుద్ధి అప్రధానం కాదు బుద్ధి హీనమైనపుడు అన్ని రకముల తప్పులు చేయటం జరుగుతుంది వీటిని సరిదిద్దటమే బుద్ధి చాతుర్యము చేయుపని అంతకు మించి బుద్ధి నుండి ఆశించకూడదు బుద్ధి నిశ్చేష్టం నిజమైన సహాయం మనసు (భావం), ప్రేమ ద్వారానే వస్తుంది మానసిక స్పందన (response or feeling) ప్రేమకు ఆధారం అత్యంత మేధావి (intellectual giant) కూడ హృదయస్పందన లేనపుడు నిస్సారపు మేధావిగానే మిగులుతాడు అందుకే వృత్తికి కావాలి మేధ, కాని ప్రవృత్తికి (స్వభావం) ఆధారం హృదయం (మనసు) హృదయస్పందన పొందకలిగినపుడే 'తత్వమసి' అనుభూతి కలుగుతుంది

ఏ మతప్రవక్త కూడా జీసస్, మహమ్మదు, బుద్ధుడు మొదలైనవారు, వారి బుద్ధి ఔన్నత్యమును తెలుపు గ్రంథములు వ్రాయలేదు వారు పలికిన మాటలే బహుకొద్ది వారి పలుకులే వారి హృదయస్పందనకు ప్రతిబింబములు శ్రీకృష్ణుడు ఎపుడూ తర్కించలేదు ధర్మం కొరకు, భక్తుల కొరకు స్పందించాడు ఆ స్పందనే జీవము, శక్తి బుద్ధి ఔన్నత్యము లోపించినా తిన్నడు వలె స్పందనతో భగవంతుని చూడకలుగుతాడు బుద్ధి శరీరఅంగముల వంటిది వాటికి స్పందన ఉండదు స్వతంత్రచలనం ఉండదు మనసు (హృదయం) ద్వారా స్పందన వాటిలో ప్రవేశించినపుడు వాటిలో చలనం వస్తుంది ఇదే వేదాంతం తెలుపు పరమసత్యం

ప్రకృతిలోని పంచభూతములు, అంతరిక్షము, గ్రహములు, నక్షత్రములు, మెరుపు, విద్యుత్తు, వెలుగు మొదలైనవి పరబ్రహ్మరూపములే అని వేదాంతం

చెప్తుంది వేదములలోని సంహితలకాలము నుండి ఉపనిషత్తుల కాలము నాటికి భగవంతుని గురించి తెలుసుకొనుటలో వచ్చిన మార్పు ఫలితమే వేదాంతం ఉపనిషత్తులలోనే 'సర్వంఖల్విదంబ్రహ్మ' అను వాక్యం కనబడుతుంది సంహితలు, బ్రాహ్మణములలో ప్రకృతి శక్తులను పంచభూతములను దేవతారూపములుగా కొలవటమే కనబడుతుందిగాని 'పరమాత్మ'ను గురించి ప్రసావన లేదు విరాట్ పురుషుని గురించి పురుషసూక్తములో మాత్రమే తెలియనగును ఆరణ్యకములలో ప్రారంభమైన దేవతారూపపరిణామము ఉపనిషత్తులలో పరిపూర్ణమై నిరాకారుడు, నిర్గుణుడు అయిన పరమాత్మయే సర్వమునకు మూలము అని సిద్ధాంత పరికల్పన జరిగింది ఇదే సాధన ద్వారా ప్రాప్తించిన మతము, వేదాంతము

సర్వము నందు భగవంతుని చూడగలుగుటయే వేదాంత కేంద్ర విషయము (central theme) ఏ వస్తువునైనా అది కనబడు రూపమును బట్టి కాక దాని వాస్తవిక, అంతరిక (internal) రూపమును గ్రహించగలుగుటయే వేదాంత అంతరార్థము ఉపనిషత్తులలో మరొక విషయము కూడ ఉన్నది

సత్యమును (సత్) లేక పరమాత్మను గ్రహించిన మనిషి సత్యస్వరూపుడు (pure man) ఒక ప్రత్యేకమైన జ్యోతి అతని కనులలో వెలుగునని ఉపనిషత్తులు చెప్పాయి ఆ వెలుగు నిజంగా అతని ఆత్మది అది అతనిలోనే ఉన్నది అతనిలోనే కాదు సర్వత్ర ఆ వెలుగే ఉన్నది గ్రహములలో, నక్షత్రములలో, సూర్యునిలోను ప్రకాశించు వెలుగు అదే అదే బ్రహ్మం ఆదిశంకరులు చెప్పినట్లు అదే సత్యం, సత్యమే సౌందర్యం ఆ సత్యమే అనంతప్రకాశము ఆ ప్రకాశమే విశ్వమంతటా వ్యాపించియున్నది అదే విశ్వాత్మయైన పరమాత్మ

పరమాత్మ అంశమే జీవాత్మ అనగా ఆ అనంత ప్రకాశభాగమే జీవాత్మ ప్రకాశము ఆ ప్రకాశమే ఆత్మజ్ఞాని కన్నులలో కనబడు వెలుగు ఇదే ఉపనిషత్ సారాంశము ఇదే వేదముల నుండి వేదాంతము వరకు జరిగిన

జ్ఞానపరిణామము (Evolution) జీవాత్మను కలిగిన మనిషే పరమాత్మకు చిహ్నముగా (symbol) చెప్పబడింది భగవంతుని ధ్యానించుటకు విగ్రహము పెట్టుకోవచ్చు ఆలయం కట్టవచ్చు కాని అంతకు మిన్నయైన ఆలయం మన శరీరం అందులోని ఆత్మయే పరమాత్మ ధ్యానానికి ఇంతకంటే ఉన్నత చిహ్నము ఏది కావాలి

మం॥ దేహో దేవాలయః ప్రోక్తస్సజీవః కేవలశ్శివః
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్ ॥
(మైత్రేయోపనిషత్తు 2-1)

దేహము దేవాలయమని చెప్పబడింది జీవుడు కేవలము శివుడే అయి ఉన్నాడు అజ్ఞానమను నిర్మాల్యమును తొలగించి 'సోఽహం' భావనచే (ఆ పరమాత్మయే 'నేను' అను భావనచే) పూజించవలెను ఇదియే ఉపనిషత్తులలో ఎదిగిన ఆత్మపరిజ్ఞాన పరిణామము (evolution) వేదములలోని కర్మకాండ భాగమునకు క్రమంగా ప్రాధాన్యం తగ్గించి జ్ఞానకాండకు ప్రాధాన్యము పెంచినాయి ఉపనిషత్తులు విశ్వమంతా దేవాలయమే మనిషి పరమేశ్వరుని ఎచటనైనా ధ్యానించవచ్చునని చెప్పాయి

ఉపనిషత్తులలో మనకు కనబడేది ఆంతరిక సాధన (inner practice) అందుకనే ఉపనిషత్తులు సాధన ముందు తాత్వికం (philosophy) తరువాత అని చెప్పాయి ఆ విధంగానే ఆత్మవిషయాలు గ్రహించబడినాయి ఆంతరికంగా దర్శించబడినాయి అటుపై ఆంతరిక (inner sight) దృష్టిగల ఆనాటి ఋషులు ప్రకృతి హృదయంలోకి ప్రవేశించగలిగారు సత్యమును దర్శించారు కాబట్టి సాధనయే ప్రథమంగా అవలంబించవలసిన పద్ధతి మతం (వేదమతం, వేదాంతం భిన్నం కాదు) ఆచరణ (సాధన) కొరకు ఏర్పడిన శాస్త్రము (Practical Science) తాత్వికం మాత్రమే కాదు సాధన ముందు విజ్ఞానం తరువాత

మరణం తరువాత పుణ్యం చేసినవారు - పుణ్యం, పాపం అను

పదములు పురాణాల ద్వారా ప్రాచుర్యం పొందినాయి తప్ప, వాటి నిర్వచనం ఉపనిషత్తులలో లేదు - స్వర్గం చేరుతారు వారి పుణ్యకర్మల పరిమాణం (span of time) తీరగానే తిరిగి పునర్జన్మ పొందుతారని చెప్పబడింది అంటే స్వర్గం శాశ్వతం కాదు పరబ్రహ్మను (ఆత్మజ్ఞానం) తెలిసికొనినవారు పొందు స్థానం ఈ స్వర్గం కాదు, ఎందుకంటే ఈ స్వర్గం అశాశ్వతం కాబట్టి దీనిని బట్టి మనకు తెలిసే విషయం ప్రధానంగా ఒకటి ఈ విశ్వంలో పేరు, రూపం కలిగిన ప్రతిది అశాశ్వతం (transient)

'స్వర్గసుఖం' అనేది కష్టం లేని సుఖానికి పర్యాయపదం కాని సత్యం వేరు సుఖం వేరు సత్యం అనేది గమ్యం చేరేదాకా కష్టాలనే కలిగిస్తుంది గమ్యం చేరితే అంటే సత్యమును (సత్‌ను) తెలుసుకుంటే, ఆ స్థితి కష్టసుఖాలకు అతీతం

"పుణ్యములు కాని పాపములు కాని కర్మము యొక్క ఫలితము అనగా కర్మము కారణము (cause) పాపం, పుణ్యం ఫలితం (effect) కర్మము చేయబడుతుంది చేయబడిన తరువాత అది మారదు అంటే అది పరిమితమవుతుంది (పరిచ్ఛిన్నమౌతుంది) (finite or limited) దాని ఫలితం కూడ పరిమితమే అవుతుంది కాబట్టి పరిమితమైన కారణము ద్వారా అపరిమితమైన (infinite) ఫలితం రాదు కదా! ఫలితం అపరిమితం లేక అనంతం (శాశ్వతం) కానపుడు వాటిని అనుభవించే లోకములుగా చెప్పబడిన స్వర్గం, నరకములు శాశ్వతం కాదు కావున పుణ్యం, పాపములు పరిమితములే అగును (limited) 'సత్'ను గురించిన జ్ఞానమే శాశ్వతం (eternal) అది తెలిసిన జ్ఞాని ఎక్కడ ఉంటే అదే స్వర్గం ఎందుకంటే అతని మనసు (హృదయం) స్వర్గనరకాలుగా చెప్పబడిన లోకాలకు అతీతంగా పరమాత్మపై కేంద్రీకృతమై ఉంటుంది మాయ లేక భ్రాంతి అను తెరను తొలగించుకొని బయటపడుటకు అదొకటే మార్గమని ఉపనిషత్తులు చెప్తున్నాయి

దీని అర్థం మంచి అని గాని చెడు అని గాని ప్రత్యేకంగా గుర్తింపు ఇవ్వకుండటం అన్నీ విశ్వాత్మ నుండే వెలువడునని గ్రహించటం సర్వత్ర విశ్వాత్మ వ్యాపించి ఉన్నదని, విశ్వమును నిరాకరించి కనులు మూసుకొనుట, స్వర్గ నరకములుగా చెప్పబడినవాటియందు, మృత్యువునందు, జీవితము నందు కూడ పరమాత్మను చూడటం - అదే సత్యాన్వేషణ అని స్వామి వివేకానంద నిర్వచించారు మంచి కాదు, చెడు కాదు, జీవితం కాదు, మృత్యువు కాదు - ఏదీ కాదు శాశ్వతం బ్రహ్మము ఒకటే శాశ్వతం (eternal)

ఈ సత్యమును గ్రహించినవాడే స్వేచ్ఛను పొందుతాడు అతనొకడే ఈ ప్రపంచమందు జీవింపతగినవాడు అతడే ఈ జీవితం ఆనందమయం అనగలడు 'సత్'లో అన్నిటిని, అన్నిటిలో 'సత్'ను చూడగలడు "స్వర్గం నరకం అనేవి వేదాలలో ఎక్కడా చెప్పబడలేదు చాలాకాలం తరువాత పురాణ కాలంలో ఈ 'లోకాలు' వాడుకలోనికి వచ్చాయి పునర్జన్మయే ఒక శిక్ష పునర్జన్మ పొందుట కంటే మరొక నరకం లేదు శిక్ష (punishment), బహుమానం (reward) అనేవి భౌతికం మాత్రమే మానవ లక్షణాలు గల దేవుడు (human god) మాత్రమే రాగద్వేషాలు కలిగి ఉంటాడు అట్టి దేవుడు మాత్రమే శిక్షించటం, బహుమానం ఇవ్వటం చేస్తాడు వేదాలలో 'సంహితా' కాలంలో 'భయం' జీవితంలో ప్రధాన అంశం కావటం వలన అటువంటి మానవ దేవతలకు రూపకల్పన జరిగింది కాని ఉపనిషత్తుల కాలంనాటికి 'భయం' అనేది అదృశ్యమైంది అవ్యక్తమైన దైవం (impersonal God) అను భావం రూపొందింది మహామహాతాత్వికులు కూడ ఈ 'అవ్యక్త దైవం' అను భావాన్ని అసహ్యించుకుంటారు భగవంతుడిని మానవుడిగా ఊహించటం ఎంత అర్థంలేని పని? అవ్యక్తదైవం ఒక మూలసూత్రం (Principle) అవ్యక్త దైవం అంతటా ఉంటాడు, ఏ ఒక్కరిలోనో కాదు ఎందులోనైనా అవ్యక్త దైవాన్ని ముందు చూచి తరువాత పదార్థ రూపమైన ఆ వస్తువును చూడగలిగినవాడు అవ్యక్త దైవాన్ని అర్థం చేసుకోగలుగుతాడు ఈ విశ్వములోని

సర్వము ఆ దైవమే ఎక్కడో కనబడనివాడు దైవం అని చెప్పితే కొంత మందికి భయంకరమైన వైరుధ్యము అనిపిస్తుంది పురోహితులు తమను అనుసరిస్తే స్వర్గం ఖాయం అని నమ్మ పలుకుతారు మరణం తరువాత వారు మనకు స్వర్గానికి పాస్‌పోర్టు ఇస్తారు ఇదంతా అర్ధంలేని పౌరోహత్యజాలం నిజమే! అవ్యక్త దైవమే మూలదైవము అంటే దేవాలయాల, చర్చిలలోని వ్యాపారం అడుగంటుతుంది పౌరోహత్య మధ్యవర్తిత్వం తొలగించి అవ్యక్తమైన ఆ పరమాత్మను అందరికి మనం ఎరుకపరచాలి భగవంతుడు కానిదంటూ ఈ విశ్వములో ఏదీ లేదు మనలోని ఆత్మయే ఆ దైవము మన శరీరమే దేవాలయం ప్రతి జీవిని పరమాత్మయందు భక్తితో చూడగలిగితే ఈ బంధాలు అదృశ్యమవుతాయి మనకు స్వేచ్ఛ కలుగుతుంది ఆ స్వేచ్ఛయే వేదాంతా దర్శము" - స్వామి వివేకానంద లండన్‌లో ఇచ్చిన ఉపన్యాసాలలో అన్నారు

"ఇదే వాస్తవమైన ఆచరణయోగ్యమైన ధ్యానం ఇందులో తర్కం కాని, నిశ్చయం లేని వ్యాపారం (speculation) కాని లేవు నిజమే! సత్యాన్వేషణలో ఎవరి మార్గం వారు ఎన్నుకొనవచ్చునని వేదాంతం చెప్తుంది కాని మార్గం గమ్యం కాదు (Means is not the end) గదా! మానవరూపంలో భగవంతుని ధ్యానించటం తప్పుకాదు దానిని గమ్యము చేరుటకు ఒక సోపానంగా మాత్రమే గ్రహించాలి గాని అదే గమ్యం అనుకోకూడదు అవ్యక్తముగానున్న ఏ బ్రహ్మమునైతే మనము ధ్యానిస్తున్నామో, ఆ అవ్యక్త బ్రహ్మమునే ఎదుటి వానిలో చూస్తున్నాము అని చెప్పగలగాలి విశ్వమంతా వ్యాపించియున్న ఏ పరమాత్మను చూడటానికి ప్రయత్నిస్తున్నామో ఆ పరమాత్మయే మనలో ఎల్లపుడూ ఉన్నాడు అతని ద్వారా మనం జీవిస్తున్నాము అతడే సర్వదా జగత్‌సాక్షి జగత్తుకే వెలుగు, జీవము 'అహం' అనగా 'నేను' ఆ 'అహం' (ఆత్మ) మనలో లేకపోతే మనచుట్టూ అంతా అంధకారంగానే ఉండేది" - స్వామి వివేకానంద తన ఉపన్యాసంలో అన్నారు

స్వామి వివేకానంద చెప్పినట్లు మనిషి రూపంలోనున్న దేవుని ధ్యానించటం అజ్ఞానం అయితే శ్రీరాముడు, శ్రీకృష్ణుడు పరిపూర్ణ అవతారములు గదా! వారిని ధ్యానించటం తప్పుకాదా! అనే ప్రశ్న ఉదయిస్తుంది

మానవమూర్తిగా భగవంతుని ధ్యానించటం బ్రహ్మజ్ఞానానికి ప్రధమ సోపానం మాత్రమే అని స్వామి వివేకానంద అన్నారు గాని అది తప్పు అనలేదు శ్రీరాముడు తనని ఆదర్శ మానవుడుగా (పురుషోత్తముడుగా) గ్రహించమన్నాడు శ్రీకృష్ణుడు తానే పరమాత్మనని చెప్పి విశ్వరూపం చూపించాడు అంటే మనిషి రూపంలో ఊహించబడి స్వర్గంలో ఉండే ఏ దేవుడో కాదు

"ప్రపంచమందు ఉదయించిన అవతారములన్నియును ఒక్క ఈశ్వరునివే అతడు బ్రహ్మమనెడి సముద్రమునందు మునిగియుండి ఒకచోట తేలునపుడు కృష్ణునిగను మరియొకసారి మునిగి వేరొకచోట తేలునపుడు క్రీస్తు అనియు పిలువబడుచున్నాడు" - శ్రీరామకృష్ణుని ఉపదేశము

జీవుల జననము ప్రకృతికి లోబడినట్టిది కాని ఈశ్వరునికి ప్రకృతి బానిస పుట్టుకలేని అతడు పుట్టుచున్నవాడిగను, పెరుగుచున్నవాడుగను తనను ప్రకటించుకొనుట యనునది తనకు బానిసగా నున్న మాయాశక్తి ప్రభావమే యగును అందుచేత తనకు లేనట్టి కర్మను ఉన్నట్లుగా అతడు చూపుచున్నాడు ఆ కర్మయనునది కాకతాళీయముగా వచ్చినది కాదు జనసమూహము యొక్క కర్మప్రభావమంతయు ఈ అవతారపురుషుని జీవితమున కన్పించును అతడు చేయు ఒక్కొక్క కార్యము నందు నీతి నిక్షిప్తమైయుండును మానవులు ముక్తి పొందుటకు తగిన మార్గమును ఆ అవతార పురుషుడు అవలీలగా చేసి చూపెను కావున కేవలము అతని కొరకు మాత్రమే కర్మలేదు మానవుల ముక్తికై అనుసరింపవలసిన మార్గము అవతార పురుషుని జీవితముననుండును

సామాజికాభివృద్ధికి దోహదము చేయు కర్మములే ధర్మములగుచున్నవి

అభివృద్ధి నిరోధకములైనట్టివి అధర్మములగుచున్నవి ఈ అధర్మము వృద్ధి పొంది దాని వలన హాని కలుగునపుడు భగవానుడు అవతరింపవలసిన ఆవశ్యకత ఏర్పడుచున్నది

చక్కని ధ్యానసమృద్ధి కోరినపుడు కలుపు తీయుట, ఎరువు వేయుట మొదలైన క్రియలను చేసి మంచి వ్యవసాయముతో తగిన ఫలితమును పొందుదురు ప్రపంచమున దుర్గార్గులు ఎక్కువైనపుడు వారి మధ్య ధర్మము తలఎత్తదు కావున యుద్ధము, కరువు కాటకములు మొదలైనవి తలయెత్తి వారిని బాధించునట్లు భగవానుడు చేయును ప్రజలయందు పరివర్తన వచ్చుటకు దుఃఖము కలిగించుటయే సాధనము ఇట్టి పరిస్థితులను కల్పించి మరణములు కల్పించుట వలన దుర్మార్గులను పలువురను తగ్గించుట సాధ్యమగును

త్రిగుణములందు రజోగుణము, తమోగుణము మెండుగానున్న జనులు అధర్మము చేయుచుందురు కావున వారి సంఖ్యను తగ్గించవలయును సత్వగుణము గలవారిని అధికము చేయవలయును అట్లు చేసినచో మూడు గుణముల మధ్య తారతమ్యము కొంతవరకు తగ్గిపోవుచున్నది దీనినే అవతారపురుషుడు చేయుచున్నాడు "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం" - అంటే అర్థం ఇదే

"అవతార పురుషుడయినట్టివాడు ఈశ్వరునిచే పంపబడినట్టి మానవదూతయే యగును అతడు ఒక గొప్ప చక్రవర్తి యొక్క ప్రతినిధి వంటివాడు బహుదూరములోని ప్రదేశమునందు కలహము కలిగినపుడు దానిని అణచుటకై రాజు తన ప్రతినిధిని పంపించుట వలె ప్రపంచమందెచట నైనను ధర్మమునకు హాని జరిగినపుడు ఆ ధర్మమును కాపాడుటకు ఈశ్వరుడు తన అవతారపురుషుని పంపుచున్నాడు" - శ్రీరామకృష్ణుని ఉపదేశము "అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం" - అని భగవానుడు చెప్పిన

దాని భావం ఇదే

పుట్టుకలేని పరబ్రహ్మము, పుట్టుక గలవానివలె తన మాయాశక్తిచే కాన్పింపజేయుచున్నాడు అట్లే కర్మమునకు అతీతమైన అవతారమూర్తి, సత్కర్మలనన్నిటిని ఆచరించువానివలె అగుపించును ఈ సత్యమును యదార్థముగా స్వానుభవపూర్వకముగా తెలుసుకొను ఆత్మసాధకులు తామును అదే రీతిగా యీ జగత్తునందు జీవించి భవసముద్రమును దాటగల శక్తివంతులగుచున్నారు

శ్రీరామచంద్రుడు ఈశ్వరావతారమని సప్తఋషులు మాత్రమే గ్రహించగలిగారు కావున ఈ లోకమున అవతారమెత్తినపుడు కొందరు మాత్రమే ఆ దైవము యొక్క దైవస్వభావమును గ్రహించగలరు

'నేనే పరమాత్మను' అని అనుకొనుట వలన ఒక ప్రమాదం వచ్చే అవకాశం ఉంది మనలో ప్రతి ఒక్కడు 'నేనే భగవంతుడిని, నేను తలచినది, చేయునది మంచిదే కావలయును ఎందుకంటే భగవంతుడు చెడు చేయడు గదా!' అని తలచవచ్చు అది విజ్ఞానము వెర్రితలలు వేయటమే ఔతుంది

ఇష్టదైవముతోనే సర్వం అనుకుని స్థిరపడినపుడు ఏమి ఇబ్బంది ఉండదా? అని స్వామి వివేకానందులు ప్రశ్నించారు మానవుడు తనకు భిన్నమైన దేవుడు స్వర్గంలో ఉన్నాడని, అతని వలన భయముతో జీవితాంతం వణుకుతూ ఉంటే ప్రపంచం బాగుపడుతుందా? అన్నారు స్వామి ఇష్టదైవ ధ్యానము చేసిన వారిలోనా? లేక పరమాత్మ ధ్యానము చేసినవారిలోనా? ప్రపంచంలో అత్యంత ఉదాత్తులైన తత్వకోవిదులు ఉన్నారు పరమాత్మను తెలుసుకొనివారిలోనే ఆ ఉదాత్తులు ఉన్నారని స్వామి వివేకానంద అన్నారు భయంతో కూడిన ధ్యానం వలన ఫలితం ఉంటుందా? పరమాత్మ మనలోనే ఉన్నాడని ఏకాగ్రతతో ధ్యానం చేయుట వలన ఫలితం ఉంటుందా? నిస్సందేహంగా ఆత్మజ్ఞానం వలన విశ్వాత్మదర్శనం ఔతుంది ఇష్టదేవతారాధన

సంకుచితత్వమునకు దారితీసి ఎవరికి వారు తమ ఇష్టదైవమే ఉన్నతమని వీర ఉన్మాదముతో పోరాటమునకు దిగినట్లు చరిత్ర చెబుతోంది గదా! "కాబట్టి సంకుచితత్వమును వదలి వెలుగులోకి రావాలి విశ్వములోని ప్రతిది నీదే చేతులు చాచి ప్రేమతో ఆహ్వానించు ఏనాడైతే అలా ఆహ్వానిస్తావో ఆనాడే భగవంతుడిని చూచిన అనుభూతి పొందుతావు" అని స్వామి వివేకానంద స్పష్టం చేశారు

సర్వాత్మకుడైన (impersonal God) పరమాత్మ యందే ఇష్టదైవ రూపమును ఊహించుకొనవలయునని స్వామి చెప్పారు అందువలననే భగవంతుడు సర్వవ్యాపి అయిన అందరి దేవుడుగాను (impersonal God) కోరిన రూపంలోని ఇష్టదైవముగాను గూడ గ్రహించాలి కర్మము అను గొలుసుతో మనలను మనం బంధించుకుని పరిమితులు (finite) గా జీవిస్తున్నాము జీవిత ప్రవృత్తి (human nature) పరిమితం చేసే చట్టం గాని, గమ్యం గాని, విధిగాని లేవు జీవుడు అనంతమైనపుడు ఇవి అన్ని ఎలా ఉంటాయి స్వేచ్ఛ (freedom (or) liberation) యే జీవుని హక్కు స్వేచ్ఛ ద్వారా భిన్న వ్యక్తిత్వాలు ఏర్పడవచ్చు అన్ని వ్యక్తిత్వాలకు ధ్యేయం ఒకటే - ఆత్మజ్ఞానం

దీనికి వివేకానందులు తన ఉపన్యాసంలో చక్కని ఉపమానం ఇచ్చారు "ఆ స్వేచ్ఛను పొంది ఎన్ని వ్యక్తిత్వాలనైనా కలిగియుండవచ్చు అపుడు నీవు ఒక నటుడిగా రంగస్థలం మీద బిచ్చగాడి పాత్ర ధరించవచ్చు బిచ్చగాడి పాత్ర ధరించిన ఆ నటుని, వీధిలో తిరిగే నిజమైన బిచ్చగానితో పోల్చి చూడండి రెండింటిలోను దృశ్యం ఒకటే, వారు చెప్పే మాటలు కూడ ఒకటే కావచ్చు కాని వారిద్దరి మధ్య ఎంతో వ్యత్యాసం ఉంది! నటుడు బిచ్చగాని పాత్ర ధరించటంలో విజయం పొందినందుకు ఎంతో ఆనందిస్తాడు వీధిలోని బిచ్చగాడు ఆకలితో మాడుతుంటాడు ఈ భేదములనకు కారణమేమిటి? నటునికి స్వేచ్ఛ ఉంది

అతనికి ఆకలి బాధ ఉండదు మనసు ఆనందంగా ఉంటుంది నిజమైన బిచ్చగాడు తన గతి అదేనని, తనకి ఇష్టమున్నా లేకపోయినా భరిస్తాడు నటుడికి తను బిచ్చగాడు కాదు అని తెలుసు అందుకని అతనిని బిచ్చగాని బాధ అంటదు ఇదే సత్యము, మనలను గురించి మనకు సత్యము తెలియనంత కాలం బిచ్చగానివలె వ్యధలకు లోనౌతాము సాయం కొరకు చేతులు చాస్తాము ఆ సాయం రాదు అలాగే ఈ జీవితనాటకరంగం సాగిపోతుంది "

"స్వేచ్ఛ పొందండి (Be Free) - బయట నుండి సాయం ఆశించవచ్చు జీవితంలో ఒక్కసారి వెనక్కు తిరిగి చూడండి ఇంతవరకు మీకు అందిన సాయం బయట నుండి రాలేదు నీలో నుండి నీకే అందింది నీవు ఆశించిన ఫలితం పొందే మార్గం నీలోనే ఉంది నీవే సర్వాంతర్యామి అంశవు ఆ శక్తి నీలోనే ఉంది అదే విశ్వాసం ఈ ప్రపంచం అనే నాటకరంగం మీద నీ పాత్ర పోషించు మనమంతా నటులమే!"

"ఇంతవరకు కారాగారం వలె కనిపించిన ఈ ప్రపంచం ఒక్కసారిగా చక్కటి ఆటస్థలంగా కనిపిస్తుంది నరకం అనిపించిన ఈ ప్రపంచం స్వర్గంగా మారుతుంది మనం మానవరూపాలుగా ఊహించే దేవతలంతా ఇక్కడే ఉన్నారు దేవతలు మనిషిని తమ ప్రతిరూపంగా సృష్టించలేదు మనిషే దేవతలను తన ప్రతిరూపాలుగా చిత్రించాడు అంటే ఈ దేవతారూపాలకు మూలం మనమే అనేది సత్యంగదా! మనమే వాస్తవం మనమే పరమాత్మ రూపం అదే మన ఆత్మ ఆ ఆత్మను ధ్యానించటమే నిజమైన వేదాంతం అదే అభ్యాసప్రాప్త వేదాంతం ఈ స్వేచ్ఛ వచ్చిందంటే సమాజమును వదలి అడవులకు పరుగెత్తమని అర్థంకాదు సమాజంలోనే మనం ఉండాలి అదే సమాజం మనకు నూతనంగా కనబడుతుంది ప్రతి విషయంలోను నూతనార్థం గోచరిస్తుంది సర్వస్వం మనలోనే ఉన్నదని తుదకు గ్రహిస్తాము మనలో

వినబడే అమరమైన మధురధ్వని వినగలిగితే (celestial eternal harmony) అదే స్వేచ్ఛ ఆ మధుర ధ్వనిలోని భాగమే ఈ విశ్వము, ఈ భూమి వేదాంతార్థం ఒక్క మాటలో చెప్పాలంటే మనల గురించి మనం వాస్తవం గ్రహించటమే అదే వేదాంతం అందచేసే సమాచారము (message) తోటి మానవునిలో నున్న పరమాత్మను గ్రహించలేనపుడు నిరాకారుడు, నిర్గుణుడు అయిన పరమాత్మను ఎలా గ్రహించగలము!"

అపుడే మనిషికి మనిషికి మధ్య ఉన్న సంబంధం దైవత్వమౌతుంది "భగవంతుని ప్రేమమూర్తిగా తలచటమే అత్యున్నతమైన వేదాంతాదర్శము " అపుడే 'నీవే నేను' (తత్వమసి) అని భగవంతుని మధురవాక్కు మనలో వినబడుతుంది అదే దైవమానవ సంబంధం సర్వం భగవంతుడే

ఇతర ధ్యానమార్గములు మంచివి కావా? మంచివి కాదు అనుటకు వీలులేదు మనలోని భగవంతుని చూడగలగటమే అత్యున్నతస్థాయి అత్యున్నత సత్యము ఇతర మార్గములు సత్యమును గ్రహించుటలో క్రింది స్థాయి నుండి పై స్థాయి ఎదుగుటకు చేయు ప్రయాణము వంటివి చెడు, చెడును గుర్తిస్తుంది మనలో ఎక్కడో ఏ మూలనో చెడు దాగి ఉన్నపుడే మనము చెడును చూడగలము ఇది వేదాంతం ద్వారా ఆచరణలో తెలిసే ఒక విషయం అని స్వామి వివేకానంద అంటారు చెడు లేనపుడు మనకు అంతా స్వచ్ఛముగా మంచిగానే కనబడునని అర్థము సత్యం (సత్) మనలోనే ఉంది దానిని కలిగి ఉండటం మన జన్మహక్కు దానిని వెలువరచి ప్రత్యక్షరూపం ఇవ్వటమే మనం చేయవలసిన పని అదే వేదాంతం

విజ్ఞానానికి సంబంధించిన సూత్రాలు రెండు ఉన్నాయి **మొదటిది** ఒక ప్రత్యేక పదార్థము యొక్క ధర్మము లేక లక్షణము గ్రహించి (the particular) అన్నిటికి సమన్వయించుటకు వీలగు సామాన్యధర్మమును దాని నుండి తెలుసుకొనుట అలాగే అన్నిటికి సమన్వయింపదగు ఒక సామాన్యధర్మము

నుండి విశ్వమునంతకు సమన్వయింప వీలగు ధర్మమును ఉత్పాదించుట (From the particular to the general and from the general to universal) **రెండవది** ఏదైన ఒక విషయము లేక పదార్థము గురించి వివరింపవలసి వచ్చినపుడు వీలైనంత వరకు దాని స్వభావ లక్షణముల నుండియే వివరణ సాధించుట

ముందుగా **మొదటి సూత్రము**ను గురించి తెలుసుకొనతగును ఏదో ఒక విషయము ఒకేసారి జరిగినపుడు ఆ విషయమును గురించి అంతగా పట్టించుకోము కాని అదే విషయము మరల, మరల అదే విధంగా జరుగుతుంటే దానిపై దృష్టి పడుతుంది అదే ఒక సిద్ధాంతంగా రూపొందుతుంది చెట్టు నుండి ఆపిల్ పండు ఒకసారి మాత్రమే పడి ఉంటే ఆ సిద్ధాంతము వచ్చి ఉండేది కాదు కాని ఆ పండ్లు అలా పడుతూనే ఉండటం వలననే భూమ్యాకర్షణ సిద్ధాంతం వచ్చింది ఇదే ఒక ప్రత్యేక విషయము నుండి సామాన్య సిద్ధాంతమును రూపొందించటం (From the particular to the general)

వేదాంతములో కూడ ఇదే పద్ధతిని అవలంబించవలసియున్నది ఆనాటి ఋషులు ఈ ఎద్ధతిననుసరించే చిన్నచిన్న వెలుగు అణువుల, కణముల కలయిక ద్వారా ఒక సిద్ధాంతము (One Principle) లేక సూత్రము ఏర్పడుట తెలుసుకొనిరి సూక్ష్మపదార్థముల నుండి సూక్ష్మాతి సూక్ష్మ పదార్థములను గురించి, అటుపై సర్వత్రా అంతరిక్షంలో వ్యాపించి ఉన్న ఈథర్ పదార్థమును గురించి తెలుసుకొనిరి అటునుంచి ముఖ్యప్రాణమును గూడ తెలుసుకొనిరి అనగా ఆత్మను తెలుసుకొనిరి

దీనిని బట్టి ఈ విశ్వములో ఏ ఒకటి కూడా విడిగా లేక వేరుగా లేదు అని తెలియుచున్నది ఈ ఈథరే అత్యున్నత ముఖ్య ప్రాణముగాను (పరమాత్మ) లేక అత్యున్నత ముఖ్యప్రాణం ఈథర్‌గాను, ఆ ఈథర్ క్రమంగా కంటికి

కనబడు రూపాలుగాను మారింది అన్నారు

ఇష్టదైవము నుండి సర్వాంతర్యామియగు పరమాత్మను తెలుసుకొనుట కూడ ఈ పద్ధతిలోనే జరిగింది కాని అది పరిపూర్ణం అని చెప్పుటకు వీలుపడదు ఎందువలననగా పైన చెప్పిన రెండవసూత్రం ప్రకారం ఏ విషయమునైనా దాని స్వభావమునసరించే వివరించవలసియున్నది కాబట్టి మానవరూపంలోని ఇష్టదైవమే సృష్టికర్త అయినచో ఆ సిద్ధాంతము ఈ రెండవ సూత్రము ద్వారా పరీక్షకు నిలబడవలసియున్నది

ప్రకృతితో సంబంధం లేని మానవరూపంలోని దేవుని ఆజ్ఞవలన ఈ ప్రకృతి ఏర్పడినదని, శూన్యము నుండి అది రూపొందిందని చెప్పినచో అది అశాస్త్రీయం అవుతుంది (unscientific) ఏకేశ్వరారాధన (Monotheism), ఇష్టదేవతారాధన (Henotheism) మీద ఆధారపడిన మతసిద్ధాంతములలో ఈ లోపం కనబడుతుంది ఈ సిద్ధాంతమందు తగినంత సామాన్యధర్మము (generalization) లేదు ప్రకృతి నుండియే ప్రకృతి ఉద్భవించినది అనటానికి ఇది సరైన వివరణ కాదు ఫలితమే తిరిగి కారణమౌతుంది అను సూత్రమును ఈ సిద్ధాంతం అంగీకరంచదు కారణము పూర్తిగా ఫలితమునకు భిన్నమైనది అంటుంది కాని సామాన్య మానవానుభవంలోనే ఒకదాని ఫలితం తిరిగి మరొకదానికి కారణమౌతుందని ప్రత్యక్షంగా తెలుస్తుంది సైన్సు కూడా ఇందుకు అంగీకరిస్తోంది కదా! జీవపరిణామ సిద్ధాంతము, కారణము ఫలితంగా మారుతుందని ఆ ఫలితమే కారణరూపం పొందుతుందని చెప్తుంది కదా! శూన్యము నుండి సృష్టి ఏర్పడింది అంటే ఆధునిక విజ్ఞానశాస్త్రము పరిహసిస్తుంది కారణము, ఫలితము (cause and effect) పరస్పరం ఆధారభూతములని చెప్పగలిగిన మతమును మాత్రమే ఆధునిక మనస్సు అంగీకరిస్తుంది కేవలం పౌరోహిత్య సృష్టియైన మత సిద్ధాంతమును ఈనాటి మనిషి అంగీకరించలేడు దాని ఫలితం అసహ్యకరమైన నాస్తికత్వం ఆ మత

సిద్ధాంతములను విశ్వసించినట్లు కనబడు వారి మనస్సులలో కూడ ఎంతో అవిశ్వాసం (unbelief) ఉంటుంది ఇతరులు మతం అంటే ఏమి లేదు పౌరోహిత్య మాయాజాలం అని దాని నుండి దూరమౌతారు మతం అనేది ఒక జాతీయరూపంగా (national form) దిగజారింది మితిమీరిన ఇష్టదేవతారాధన, కర్మకాండల ప్రాబల్యం బౌద్ధమతం ఏర్పడటానికి కారణమయినాయి ప్రకృతి సర్వశక్తివంతమైనపుడు, తాను సంకల్పించినది చేయకలిగినపుడు ప్రకృతితోపాటు విశ్వాత్మ ఒకటి ఉన్నదని చెప్పటం అనవసరం కదా! అన్నారు బౌద్ధులు జీవాత్మ కూడా అనవసరమే ఔతుంది కదా అని కూడా అన్నారు

'పదార్థము-దాని లక్షణములు' అను విషయమును గూర్చిన చర్చ ఎంతో పురాతమైనది దీనికి సంబంధించిన మూఢవిశ్వాసాలు ఈనాటికి జీవంతో ఉన్నాయి అంటే ఎంతో ఆశ్చర్యంగా ఉంటుంది పదార్థము యొక్క లక్షణాలు (స్వభావము) దానిని అంటుకొనే ఉంటాయా? నిర్జీవమైన తరువాత (dead matter) కూడ లక్షణాలు అందులో ఉంటాయా? ఈ ప్రశ్నలు మధ్యయుగ (Middle Ages) కాలము నాటి నుండి చర్చనీయంగా ఉన్నాయి దీనికి బౌద్ధులు అన్నారు అలాంటివి ఉన్నదనటానికి వీలులేదు స్వభావమే (లక్షణము) ప్రధానం స్వభావాన్ని (qualities) మించినది ఏదీ లేదు

ఇదే ఈనాటికీ అజ్ఞాతావాదుల (Agnostics) (దేవుడు మనుష్యులకు తెలియనేరడని వాదించువారు) విశ్వాసము ఈ 'పదార్థము-లక్షణములు' (Substance-Qualities) వాదము క్రమంగా ఈనాటి 'గోచరము-అగోచరము' వాదంగా మారింది Phenomenon = things perceived by senses (గోచరమగునవి) and Noumenon = an unknown and unknowable substance or a thing as it is in itself (అగోచరమైనవి) ఈ ప్రకృతి గోచరమగునది (Phenomenal World), నిరంతరం మార్పులకు (పరిణామములకు) లోనగునది దాని వెనుక అగోచరమగు పదార్థమున్నది

(Noumenon) అది ఎటువంటి పరిణామము చెందదు గోచరము (Phenomenon) అగోచరము (Noumenon) అనుద్వైత (duality) సిద్ధాంతము అనగా రెండూ ఉన్నవి అని చెప్పునది వాస్తవము (సత్యము) అనువారు కొందరు, రెండూ ఉన్నాయి అని చెప్పే హక్కు మనకు లేదు ఎందుకనగా గోచరమగు దానికంటే వేరొకటి ఉండటానికి వీలుపడదు అని వాదించువారు మరికొందరు ఈ వాదానికి సమాధానము సులభము కాదు

ఈ వాదములకు సమాధానము అద్వైత సిద్ధాంతము (Monish) ద్వారా మాత్రమే సాధ్యము ఉన్నది ఒకటి మాత్రమే అనునది వాస్తవము (ఏకంసత్ విప్రాబహుధావదంతి) దానిని గోచరము అనుకొనవచ్చు, అగోచరము అని కూడ అనుకొనవచ్చు పరిణామం చెందునది ఒకటి, పరిణామం చెందనిది మరొకటి ఉన్నదనుట సరికాదు ఉన్నది ఒకటే అదే పరిణామము చెందునట్లు కనబడును వాస్తవంగా పరిణామము అంటూ ఏమియు లేదు శరీరము, మనస్సు, ఆత్మ అని విడివిడిగా ఉన్నాయి అని అనుకుంటున్నాము నిజానికి అవి అన్నీ ఒకటిగా మాత్రమే ఉన్నాయి ఒకదానిలో మరొకటి ఉన్నాయి గాని ఒకదాని నుండి మరొకటి వేరుగా లేక విడిగా మాత్రము కాదు ఉన్నది ఒకటే, అదే భిన్నరూపములలో కనబడుతున్నది విరాట్ పురుషుడే విశ్వాత్మగా (వైశ్వానరుడు) సర్వత్రా వ్యాపించి అగోచరముగా ఉండగా ఆయన చైతన్యశక్తి అయిన పరాశక్తి ప్రకృతి రూపంలో ఉన్నదనుటే అద్వైతము రెండు విడిగా ఉన్నట్లు అనిపిస్తుంది అవి విడిగా లేవు ఒకటి లేనిది మరొకటి లేదు ప్రకృతియే చైతన్యరూపం కాని అందు విశ్వాత్మ లేనిది ప్రకృతి చైతన్యము ఉండదు దీనికే అద్వైత సిద్ధాంతంలోని 'రజ్జు సర్పభ్రాంతి' అన్నారు చీకటిలో గాని మరెందువలన గాని తాడును పాము అని భ్రమించుట భ్రమ తొలగినపుడు పాము మాయమౌతుంది మనసులో 'పాము' ఉన్నంతవరకు 'త్రాడు' అదృశ్యమౌతుంది అదే మనసులోకి 'త్రాడు' ప్రవేశించగానే 'పాము' అదృశ్యమౌతుంది అక్కడ ఉంది త్రాడే అది 'పాము' అను భ్రాంతి

ఆవరించటం వలన త్రాడు కనబడదు భ్రాంతి తొలగగానే వాస్తవమైన త్రాడు కనబడుతుంది

గోచరం (Phenomenon) అగోచరం (Noumenon) కూడ ఇలాగే జరుగుతుంది కనబడేది మాత్రమే వాస్తవం అను భ్రాంతిలో నున్నంతవరకు అగోచరంగానున్న విశ్వాత్మ కనబడదు గొచరమగు ప్రకృతి మాత్రమే కనబడుతుంది భ్రాంతి తొలగినపుడు ప్రకృతి అదృశ్యమై విశ్వాత్మ మాత్రమే కనబడుతుంది ఇదే వాస్తవవాదుల, భావవాదుల మధ్య ఉండే భిన్నత్వము వాస్తవవాదులకు (Realists) ప్రకృతి (phenomenon) మాత్రమే కనబడుతుంది భావవాదులకు (Idealists) అగోచరమైన (Noumenon) విశ్వాత్మ కనబడుతుంది

స్వచ్ఛమైన భావవాది ఆత్మదర్శి అవుతాడు అతడు పరిణామం చెందుతున్న ప్రకృతికి అతీతంగా పరిణామం లేని పరమాత్మ అనుభూతి పొందగలుగుతాడు పరిణామం అంతా భ్రాంతి అనటానికి అతనికి హక్కు ఉంది అలాగే వాస్తవవాదికి పరిణామం చెందుతున్న ప్రకృతి మాత్రమే కనబడుతుంది దానికి అతీతమై పరిణామం లేని ఆత్మ అదృశ్యమౌతుంది అతని దృష్టికి వాస్తవంగా కనబడేదే ఉన్నది అనటానికి అతనికి హక్కు ఉన్నది

ఈ తత్వవివాదం వలన తుదకు తేలేది ఏమిటి? ఒకటే 'ఇష్టదైవము' అను అభిప్రాయం మాత్రమే చాలదు అని తేల్తుంది 'ఇష్టదైవము' అను స్థాయికి అతీతంగా విశ్వమునకంతటికి దైవము (impersonal God) అను భావము పొందాలి అదే తార్కికమైన సోపానము అని తెలుస్తుంది ఇందువలన 'ఇష్టదైవము' అను భావము నశిస్తుంది, నశించాలి అని కాదు అంతే కాదు 'ఇష్టదైవము' అంటూ ఎవరు లేరు అనటానికి ఇది సాక్ష్యము అనీ కాదు కాని 'ఇష్టదైవము' అను భావము పూర్తిగా అర్థం కావాలంటే విశ్వమంతట వ్యాపించిన (సర్వం ఖల్విదం బ్రహ్మ) దేవుడు ఒకరే అనే భావం అర్థం కావాలి అతడే అనంతుడు (infinite) అని, ఇష్టదైవము అనగా వ్యక్తిగత దైవము పరిమిత

(పరిచ్ఛిన్నమైన) (finite) దైవము అని తెలుస్తుంది

ఇదే వేదాంతాదర్శము వ్యక్తిత్వమును నశింపచేయటం కాదు, దానిని పరిరక్షించుటయే వేదాంత ఆదర్శము విశ్వాత్మకుడైన దైవము ద్వారానే ఇష్టదైవమును రుజువు చేయవచ్చును అపుడే ఇష్టదైవమే విశ్వాత్మరూపమని తెలుస్తుంది ఇష్టదైవము విశ్వాత్మ కంటే భిన్నమని తలచిన మరుక్షణము ఇష్టదైవ భావనకు స్థానముండదు విశ్వాత్మకు భిన్నమైన దైవము అని ఎవరూ లేరు ఇదే సత్యము

ఇక **రెండవ సూత్రము**ను గురించి తెలుసుకొనతగును ఏదైన ఒక విషయము లేక పదార్థమును గురించి వివరింపవలసినపుడు వీలైనంత వరకు దాని స్వభావ లక్షణముల నుండియే వివరణ సాధించుట ఈ సూత్రం ద్వారా విశ్వాత్మను అర్థం చేసుకోవాలి విశ్వము అంతటికి (impersonal) చెందిన దేవుడు అత్యున్నత సాధారణ ధర్మము (generalization) అదే మనలో ఉన్నది అదే మనము అందుకే వేదాంతం 'తత్వమసి' అని చెప్పింది సర్వవ్యాపి అయిన దేవుడు మనలోనే ఉన్నాడు అంటే 'నీలోను', 'నాలోను' ఉన్నాడు ఎవరి కోసం ఇంతవరకూ వెతుకుతున్నావో అతడు నీలోనే ఉన్నాడు అంటే 'నీవు' ఒక వ్యక్తిగా కాదు ఒక జీవుడిగా జీవులందరి చిహ్నాముగా (symbol) అయిన నీలో విశ్వాత్మ ఉన్నది కాబట్టి వ్యక్తిగత దైవము గ్రహించాలంటే సర్వవ్యాపి అయిన పరమాత్మను గ్రహించాలి అనగా ఇష్టదైవము అను ప్రత్యేక విషయము (ధర్మమును)ను అత్యున్నత సామాన్య ధర్మము అయిన (విషయము) పరమాత్మతో గల సంబంధము ద్వారానే తెలియనగును (from particular to general) సర్వవ్యాపి అయిన అతడే సత్ (సత్యము) లేక పరమాత్మ అతడే జీవాత్మ కూడా ఇదే శాశ్వత సత్యము

దీనిని గురించి అనేక ప్రశ్నలు ఉదయిస్తాయి ఆ ప్రశ్నలకు సమాధానానికి ముందు అద్వైతమును స్పష్టంగా అర్థం చేసుకోవాలి వ్యక్తమగు జీవుల

రూపాలు విడివిడిగా ఉన్నట్లు కనబడుతున్నప్పటికి అవి నిజానికి ఒకటే

మనము వేరు లేక భిన్నమైన వారము అని ఎంత తక్కువగా తలచిన అంత మంచిది ఆ అవ్యక్త పరమాత్మ కంటే మనము భిన్నము అని ఎంత తలుస్తామో మానసికంగా అంత వ్యధ ఏర్పడి మన ఆత్మవిశ్వాసము అంతరిస్తుంది అద్వైతము (Monism) లోని ఈ ప్రధానాంశము మానవ నీతికి, ధర్మమునకు (ethics) మూలం ఒకనాడు ఎవరో ఒకరో లేక కొంతమంది చెప్పినదే నీతి, ధర్మము అని నమ్మారు కాని ఈనాడు అలా నమ్మేవారిని వ్రేళ్ల మీద లెక్కించవచ్చు ఎందుకంటే అది సామాన్యధర్మ పరిపూర్ణ నిర్వచనవు కాదు (partial generalisation)

హిందువులు ఈ పని చేయకూడదు, ఆ పని చేయకూడదు అంటారు ఎందుకూ అంటే వేదాలు (శ్రుతులు) అలా చెబుతున్నాయి కాబట్టి అంటారు క్రైస్తవులు వేదాలను విశ్వసించరు గదా! వారు కూడా బైబులు అలా చెబుతోంది కాబట్టి ఆ పని చేయవద్దు, ఈ పని చేయవద్దు అంటారు

విశ్వమంతా ఒకటే అని చెప్పినపుడు పరమాత్మ ఒకరే అయినపుడు ఈ భిన్న సిద్ధాంతాలను సమన్వయించగల సూత్రం ఒకటి కావాలి ఇష్టదైవమే సర్వం అని భావించేవారు ఎంతోమంది ఉన్నారు అలాగే అంతకంటే ఉన్నతమై సర్వవ్యాపి అయిన భగవంతుని విశ్వసించే సత్వగుణ సంపన్నులు కూడ ఎంతో మంది ఉన్నారు

ఈ భిన్న ధృవాలను కలపగల మతమే మానవ శ్రేయస్సుకు శరణ్యము అట్టి మతము చెప్పు ప్రతి విషయము కారణము, లేక హేతువు లేక వివేకము ఆధారంగా విచారించబడుతాయి "సాధారణంగా ప్రతి మతము హేతు వాదమునకు సమాధానం చెప్పటానికి నిరాకరిస్తుంది ఎందుకో బోధపడదు" - అంటారు స్వామి వివేకానంద 'కారణము' తెలుసుకొనటం ఏ మతానికైనా ప్రధానమే దేనికైనా కారణము సరిగా బోధపడినపుడే ఫలితం సార్థకమవుతుంది

కారణం బోధపడనపుడు మతం మూఢవిశ్వాసాలకు దారితీసే అవకాశం ఉంది "ఉదాహరణకు మహమ్మదీయుల మతము తమ మతము కానివారిని చంపుటకు అనుమతిస్తుంది," ఖురాన్‌లో "మహమ్మదీయ మతము పుచ్చుకొనుటకు నిరాకరించు నాస్తికులను (infidels) కత్తికి బలివ్వండి లేక నిప్పులో పడవేయండి" అన్నారు మహమ్మదీయులకు 'ఇది దురాచారము' అని చెప్పితే వెంటనే వారు "అలాగని నీకెలా తెలుసు?" అని ప్రశ్నిస్తారు తమ గ్రంథము అలా చెప్తోంది అంటారు వారు బౌద్ధులు తమ గ్రంథము అంతకంటే పురాతనమైనది అంటారు అన్నిటికంటే తమ గ్రంథమే బహు పురాతనమైనదని హిందువులు ఎలుగెత్తి చాటుతారు

కాబట్టి మన గ్రంథాలను సంప్రదించుట ద్వారా ఈ సమస్యకు సమాధానం దొరకదు అని తెలుస్తోంది అన్నిటిని సమన్వయింపగల అధికారిక లేక స్థిరమైన (standard) సూత్రము ఏదైనా ఉన్నదా? తెలుసుకొనుటయే కర్తవ్యము అది పరతంత్రము కాని అనగా పూర్తిగా స్వతంత్రమైన అధికారిక సూత్రము అయి ఉండాలి అది ఏదో ఒక గ్రంథమైతే ఉపయోగం లేదు సర్వతోముఖము, సర్వసామాన్యము సర్వమునకు చెందినది (universal) అయినది ఏదైనా కావాలి కారణము (reason) తెలుసుకొనుటకు వీలగు సూత్రమునకు మించిన సర్వసామాన్యమైనది ఏముంటుంది? కాని 'హేతువు (కారణము)' అనేది తగినంత శక్తివంతమైనది కాదు - దాని ద్వారా సత్యమును గ్రహించుట సాధ్యము కాదు అను వాదన కూడ ఒకటి ఉన్నది అయినను కారణము తెలుసుకొనుట ద్వారానే సత్యమును చేరుటకు ఎక్కువ అవకాశమున్నదని స్వామి వివేకానంద అభిప్రాయం మనకు వలసినది ప్రగతి, అభ్యుదయం, సత్యగ్రహణము ఆత్మపారిశుధ్యమునకు గ్రంథములు ఉపయోగపడవు దానికి వలసినది అనుభవసిద్ధి లేక అనుభూతి అది మనలోనే ఉన్నది చింతన (realisation) ద్వారా అది వెలువడుతుంది ప్రకృతి మానవునికి ప్రసాదించింది ఆలోచనాశక్తి ఆ శక్తే అతనిని జంతువులకంటే

భిన్నమైనవానిగా చేస్తోంది ఆధికారికంగా ప్రకటించటం కంటే కారణం ద్వారానే సత్యమున్ను వెలువరించుట ఉత్తమం

సృష్టి వేదముల ద్వారా జరిగిందని హిందువుల విశ్వాసము ఆవు అనేది ఉన్నదని నీకు ఎలా తెలుసు? అంటే 'ఆవు' అను పదము వేదములలో ఉన్నది కాబట్టి అని సమాధానం వస్తుంది సృష్టిలో మనిషి ఉన్నాడని ఎలా తెలుసు అంటే 'మనిషి' అను పదము వేదాలలో ఉన్నది కాబట్టి అంటారు అనగా వారు మన కళ్ళ ఎదుట కనబడుతున్నారు కాబట్టి ఉన్నారని చెప్పటకు వీలులేదు వేదాలలో ఆ పదాలు ఉన్నాయి కాబట్టి వారు ఉన్నారన్న మాట ఇది ఎలా ఉంది? వేదాలను నమ్మి తీరాలి అని ఒక పట్టుదలతోనో లేక ఒక పగతోనో బలవంతం చేస్తున్నట్లున్నది వేదాలను నమ్మించే ప్రయత్నంగా బలవంతం చేయటం మంచిదా? లేక వేదాలు వివరించే సత్యమును హేతువు ఆధారంగా బహిర్గతం చేయుట మంచిదా?

కాని శతాబ్దాలు ఎందరో మేధావులు, తత్వవేత్తలు కృషిచేసి తర్కబద్ధంగా పూర్ణసిద్ధాంతరూపాలు ఆవు, మనిషిని గురించి పైన చెప్పిన విధంగా రూపొందించారు అవి ఎంత శక్తివంతమైనవి అంటే అవి మానవ ప్రగతి, అభ్యుదయమును నిరోధించాయి (stunts the growth of humanity) మనిషికి వలసినది ప్రగతి, అభివృద్ధి అని మరువకూడదు "సత్యము కంటే సాపేక్ష సత్యము (relative truth) ప్రధానము దాని కొరకే కృషి జరగాలి అదే మన జీవితము" అని స్వామి వివేకానంద అన్నారు

'అద్వైత సిద్ధాంతము' అన్ని మత సిద్ధాంతముల కన్న, పరిపూర్ణమైన హేతువు ఆధారంగా నిర్మించబడిన అనగా హేతుబద్ధమైన పూర్ణ సిద్ధాంతము అని వివేకానందులు స్పష్టంచేశారు 'అద్వైత సిద్ధాంతము' భగవంతుని గూర్చి కొన్ని అసంపూర్ణ విశ్వాసములను కూడ పరిగణనలోనికి తీసుకుని, కొంతమందికి వాటి అవుసరమును గూర్చి కూడా వివరించింది ఇష్టదేవతారాధన హేతుబద్ధం

కాదని కొంతమంది అభిప్రాయం కాని అది తేలికగా ఉపశమనం (consolation) కలిగిస్తుందనేది వాస్తవం ఒక స్థాయి మనుష్యులకు ఉపశమనం కలిగించు మతము అవుసరము ఉన్నది 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను పరమసత్యమును గ్రహించగలవారు, భరించగలవారు ఎపుడూ కొద్దిమందే ఉంటారు కాబట్టి ఉపశమనం కలిగించగల మతం ఎంతైనా అవుసరమున్నది అది చాల మంది జీవుల్కు సహాయకారి కొన్ని మనసులు సహజంగా కుచించుకుని అతితక్కువ పరిధి కలిగి ఉంటాయి అవి ఉన్నతస్థాయికి చేరుటకు ప్రయత్నించే ధైర్యము కలిగి ఉండవు అవి చిన్నచిన్న విషయముల ద్వారా రూపం పొందుతాయి కాని సర్వమునకు చెందిన (impersonal) పరమాత్మను తెలుసుకొనుట చాల ఆవశ్యకము పరమాత్మ జ్ఞానము ద్వారానే పరిమితమైన (limited) ఇష్టదేవతా జ్ఞానమును వివరించుటకు వీలగును

ఇష్టదైవమును (Personal God) ప్రత్యక్షముగా రుజువుచేయటం అసంభవం అని కొందరి అభిప్రాయం కాని సర్వమునకు చెందిన పరమాత్మను గురించి తెలుసుకొనుటకు మానవ మేదస్సు చేరుకోగల అత్యధిక స్థాయి ఇష్టదైవము విశ్వాత్మ గురించి విభిన్న అభిప్రాయముల (Readings) సంయుక్త రూపమే ఈ విశ్వము కదా! విశ్వము అనేది మన ముందు ఉన్న ఒక పుస్తకము వంటిది ఎవరికివారు తమ మేధస్సు ద్వారా దానిని చదువుతారు ఎవరి మేధస్సు వారి ప్రత్యేకత అయినను, అందరి మేధలోను సామాన్య లక్షణమనేది ఒకటి ఉన్నది కావుననే కొన్ని వస్తువులు అందరికి ఒకటిగానే కనబడతాయి ఉదాహరణకు ఒక కుర్చీ తీసుకుందాం అది అందరికి కుర్చీగానే కనబడుతుంది విభిన్నమైన మేధస్సు గల వ్యక్తి ఆ కుర్చీని చూచినపుడు, అతడు దానిని కుర్చీగా చూడడు కాని ఒకే విధమైన మేధస్సు గలవారు వస్తువులను ఒకే రకంగా చూస్తారు

కాబట్టి మనకు కనబడే ఈ విశ్వమే పరమాత్మ (Absolute) అదే

ఉన్నది ఉన్నట్లుగా కనబడును అనగా మార్పు లేనిదీ అగోచరము అగు (Noumenon) విశ్వాత్మ దాని పరిశీలనే గోచరరూపమగు (Phenomenon) ప్రకృతి గోచరమగునవి అన్ని పరిమితమైనవే (finite) మనకు గోచరమగు ప్రతిదీ అనగా మనము చూచేది, స్పర్శించేది, భావించేది అన్ని పరిమితమైనవే అనగా మన విజ్ఞాన పరిధికి లోబడి ఉంటాయి మనము ఊహించిన ఇష్టదైవము కూడ వాస్తవానికి మన ఊహకు గోచరమైన రూపమే కదా (Phenomenon)! ఒక పని జరగటం (causation) అనేది గోచరమగు ప్రపంచంలోనే జరుగుతుంది ఈ విశ్వమునకు కారణమైన దేవుడు కూడ పరిమితుడే (finite) కావాలి అయినా ఈ విశ్వమునకు మూలము లేక కారణము సర్వమునకు చెందిన ఆ పరమాత్మ కదా (impersonal God) మనకు కనబడు ఈ విశ్వమంతా మన విజ్ఞానపరిధుల ఆధారంగా మనకు కనబడు లేక బోధపడు పరమాత్మయే ఈ విశ్వములోని అంతరార్థమైన సత్యమేదో అదే పరబ్రహ్మము (Impersonal Being) ఈ రూపాలు, భావాలు, ఊహాలు అన్నీ ఆ పరమాత్మకు మనము రూపొందించినవే అనగా అవి మన మేధారూపాలే ఏ వస్తువులోనైనా మూలం ఆ పరమాత్మే భిన్న, భిన్న రూపాలన్నీ మన మేధావుల కల్పనలే

కనబడు ఈ ప్రపంచంలోని ప్రతిది చలనముతో కూడినది చలనము అను లక్షణము వాటిలోనే కూడియున్నది కాని ఈ ప్రపంచమంతా వ్యాపించి యున్న విశ్వాత్మకు చలనము లేదు ఈ విశ్వములో ఇమిడియున్న ప్రతి అణువు చలనముతోను, పరిణామముతోను కూడినవి కాని ఈ విశ్వము అఖండమైన పరిపూర్ణ రూపంగా అచలమైనది సర్వదా స్థిరముగా నుండును ఎట్టి పరిణామము ఉండదు

చలనము, పరిణామము అనేవి సాపేక్ష లక్షణములు చలనములేని ఒక వస్తువుతో పోల్చినపుడే మరొక వస్తువు చలనముతో నున్నదని తెలియును

చలనము తెలియాలి అంటే రెండు వస్తువులు ఉండాలి విశ్వమునంతను ఒకటే పరిమాణముగా గ్రహించినచో (single unit) దానికి చలనము కనబడదు దేనితో పోలికతో లేక సంబంధముతో అది కదులుతుంది? దానిని మించి మరొకటి లేదు కదా! కాబట్టి అఖండ రూపంలో (Absolute) విశ్వము అచలము కాని అందున్న ప్రతి అణువు నిత్యము పరిణామము అను ప్రవాహములో చరిస్తూనే ఉంటాయి (in a constant state of flux and change) అందువలన ఈ విశ్వము ఒకే సమయములో అచలముగాను, చలముగాను ఉండును అనగా సర్వాత్మ కూడా సర్వవ్యాపి అయిన పరమాత్మ, ఊహారూపమైన ఇష్టదైవము ఒక చోటనే ఉన్నారన్న మాటగదా! (At the same time Impersonal and Personal in one)

ఇదే వేదాంతము చెప్పు పరమసత్యము చలనముతో కూడిన విశ్వము అనినను, వ్యక్తిగతమైన ఇష్టదైవమన్నను ఇదే అర్థము ఇదే 'తత్వమసి' అను మహావాక్యము తెలుపు పరమసత్యము ఆ సత్యము గ్రహించుట కొరకు కృషియే సత్యాన్వేషణ

ఈ విధముగా ఇష్టదైవ భావమును నిషేధించకుండను, సాపేక్ష (relative) సంబంధమును నిరాకరించకుండగను, సర్వవ్యాపి పరమాత్మ అను సిద్ధాంతము హేతుబద్ధంగా మన మనస్సుకు తృప్తి కలిగిస్తుంది

ఇష్టదైవము, మరి ఇతర వస్తువులన్నియు కూడా సర్వవ్యాపి పరమాత్మను మన మనస్సు ద్వారా చూడటం వలన ఏర్పడినవే ఈ మనసు పరిధులు దాటి భావాతీత (తురియా) (transcendental) స్థితికి చేరినపుడు, మనము పరమాత్మతో ఒకటిగా అవుతాము దాని భావమే మహావాక్యం 'తత్వమసి' మనము పరమాత్మ (Absolute) యే అను పరమసత్యమును గ్రహించగలగాలి అదే సత్యాన్వేషణ

ఒక గ్లాసులో నీరుపోసి, ఆ నీటిని మాత్రమే వ్రేలుతో కదిల్చినపుడు నీరు

కదుల్తుంది గ్లాసు అక్కడే ఉన్నది, చలనము లేదు నీరు కూడ ఎచటకూ పోలేదు అందలి అణువులు చలన ప్రవాహములో ఉన్నట్లు కనబడతాయి, అనగా నీరు కదుల్తున్నట్లు కనబడుతుంది నిజానికి ఏ చలనము లేదు ఈ విశ్వము కూడ అట్టిదే ఈ విశ్వము మొత్తము గ్లాసువలె స్థిరముగానే ఉన్నది అందలి నీటి వలె ఈ విశ్వమందలి ప్రతి అణువు చలన ప్రవాహంలో ఉన్నట్లు కనబడతాయి

మానవుడు పరిమితుడై (finite) తనకు మూలాధారమైన పరమాత్మను మరచి తాను పూర్తిగా భిన్నమని తెలుస్తాడు మనము వ్యక్తిత్వము, భిన్నత్వము ఉన్న జీవులమని తలచి, సత్యమును (సత్) మరుస్తున్నాము మన వ్యక్తిత్వమును, భిన్నత్వమును వదులుకోమని అద్వైత సిద్ధాంతము చెప్పటం లేదు కాని ఈ వ్యక్తిత్వము, భిన్నత్వము వెనుకనున్న సత్యమును గ్రహించమని చెప్పుచున్నది వాస్తవంగా మనం అంతా ఆ అనంతమైన పరబ్రహ్మ (Infinite Being) రూపమని గ్రహించమంటున్నది మన రూపములు ఆ పరమాత్మ భిన్నమార్గములలో భిన్నరూపిగా గోచరమగుటయే సృష్టిలో అనగా ఈ విశ్వమందు జరుగు అనంతమైన పరిణామ ప్రవాహము (flow of evolution) ఆ పరమాత్మ అనంత చైతన్యశక్తి భిన్నరూపములలో కనిపించుటయే ఆ ప్రవాహమును ఆపుటకు మనకు సాధ్యపడదు మన శక్తి, యుక్తులు, పావనత్వము ఆ అనంత పరమాత్మ వైపుకే ప్రగతి పొందాలి పరమాత్మ అనంతత్వము (Infinite Existence) మనదే దానిని మనము సాధించవలసిన పనిలేదు అది మనలోనే ఉన్నది దానిని గుర్తించి వెలువర్చుటయే మనము చేయవలసిన పని

ఇదే అద్వైత సారాంశము దానిని గ్రహించుట చాల శ్రమతో కూడినది మనం ఎందుకు పనికిరాము బలహీనులము అని చిన్నతనము నుండి వింటూ ఉంటాము అందువలన అద్వైతసారము అర్థం కావటం, పరమాత్మ మనలోనే

ఉన్నాడు, శక్తి మనలోనే ఉంది, దానిని వెలికితీసుకురావాలి అనే విషయం తెలుసుకోవటం గూడ అసాధ్యమవుతోంది

"ఈ ప్రపంచంలో నున్న విజ్ఞానమంతా ఎక్కడ నుండి వస్తోంది? అది మనలోనే ఉంది బయట ఏమి విజ్ఞానం ఉంది? ఏమియు లేదు విజ్ఞానం ఏ పదార్థంలోనూ లేదు అది సర్వదా మానవునిలోనే ఉన్నది విజ్ఞానమును ఎవరు సృష్టించలేదు మానవుడే తనలో ఉన్న విజ్ఞానమును వెలువరుస్తాడు అది అక్కడే ఉంటుంది బ్రహ్మాండమైన మర్రి చెట్టు చిన్న విత్తనము నుండే బయటకు వచ్చి వ్యాపించును ఆ చెట్టు పెరగటానికి వలసిన అంతశక్తీ ఆ చిన్న విత్తనము నుండే వచ్చినది మానవుని బ్రహ్మాండమైన మేధస్సు అతనిలోని ప్రతి జీవకణములోను (Protoplasmic Cell) చుట్ట చుట్టుకుని ఉంటుంది అనంతమైన శక్తి మాత్రము అందులోనే ఎందుకు ఉండకూడదు అది విరుద్ధంగాను విపరీతంగాను తోచవచ్చు కాని అది పరమసత్యము మనలోని ప్రతి ఒక్కరు చిన్న జీవకణము నుండి వెలువడినవారమే శక్తి అంతా అక్కడే చుట్ట చుట్టుకుని ఉన్నది శక్తులన్నీ ఆహారము నుండి వచ్చినవే అంటారు కొండలు కొండలుగా ఆహారము ప్రోగువేసినా అందునుండి శక్తి వస్తుందా? అందులో శక్తి ఉంది కాదనుటకు వీలు లేదు కాని నిశ్చలంగా అది అక్కడే ఉంటుంది అలాగే మన ఆత్మయందు కూడ అనంతమైన శక్తి నిశ్చలంగా ఉంటుంది అది మనకు తెలిసినా తెలియకపోయినా అక్కడే ఉంటుంది అది వెలువడి బాహ్యరూపం పొందుట మనము దానిని గుర్తించుట మీదే ఆధారపడి ఉంది అనంతమైన ఈ శక్తి వెలువడుతుంది, మనలను మేల్కొల్పుతుంది, మనం ఆ శక్తిని గుర్తిస్తాము ఆ గుర్తింపు వలన జ్ఞానశక్తి పరిధులను, సంకెలలను దాటి బయటకు వస్తుంది ఆ రోజు తప్పక వస్తుంది ఆనాడు మనిషి బ్రహ్మాండమైన తన శక్తిని, మరియు వివేకమును (Power and Wisdom) గుర్తించి స్వయంగా నిలబడగలుగుతాడు ఆ స్థితి లేక సిద్ధి సాధనకై మనమంతా తోడ్పడదాము" అని స్వామి వివేకానంద కోరారు

బౌద్ధమతం ప్రచారంలోకి వచ్చు సమయమునకు వేదాంత భావములలో ద్వైతసిద్ధాంతము ప్రాబల్యములోనున్నది అనంతమైన పరమాత్మ, పరిమితమైన (limited or finite) జీవాత్మ భిన్నములను ద్వైతభావము ప్రాధాన్యం పొందింది ప్రతి మనిషిలోనున్న ఆత్మను గురించి అనేక సిద్ధాంతాలు ప్రచారంలో ఉన్నాయి

ఆనాటి వేదాంతులు వ్యక్తిలోనున్న ఆత్మ పరిపూర్ణమైనదన్నారు అట్టి వ్యక్తిగతమైన ఆత్మలేదన్నారు ఆనాటి బౌద్ధులు దాదాపు అట్టిదే పాశ్చాత్యులలో ప్రబలిన 'పదార్థము-స్వభావము' అను సంవాదము కొంతమంది స్వభావమునకు (qualities) వెనుక పదార్థమున్నది అన్నారు ఆ పదార్థమందు స్వభావము లేక లక్షణములు స్థిరముగా నుండునన్నారు (inhere) మరికొందరు అట్టి పదార్థమనునది ఏదీ లేదన్నారు అట్టి పదార్థ అవుసరము కూడ లేదని, లక్షణాలు వాటంతట అవే జీవిస్తాయి అన్నారు

వేదాంత సిద్ధాంతాలలో కూడ చాల వరకు అహం అహం (అహమహం) (I am I) 'నేను నేనే' అను వ్యక్తిత్వ గుర్తింపు (self identity) అను వాదన మీదనే ఆధారపడి ఉన్నాయి నిన్నటి 'నేను' ఈ రోజు 'నేను'లలో భేదము లేదు ఈనాటి 'నేను'కు రేపటి 'నేను'కు భేదముండదు శరీరమునకు సంభవించు మార్పులున్నప్పటికి 'నేను' మాత్రము అభిన్నము ఇది పరిమితమైన వ్యక్తిగత 'ఆత్మ' వాదము యొక్క ప్రధానాంశము పరిమితమే కాని పరిపూర్ణమైనది ఆ 'ఆత్మ' అని విశ్వసించారు

సనాతన బౌద్ధులు దీనిని వ్యతిరేకించారు అటువంటి విశ్వాసమునకు తావులేదు అన్నారు మనకు తెలిసినవి, తెలియదగినవి ఈ మార్పులు మాత్రమేనన్నారు మార్పుచెందని, మార్పుకు అవకాశంలేని పదార్థమును గురించి చర్చించటం అనావశ్యకం అని భావించారు ఎందుకంటే అలాంటి పదార్థము ఉంటే, దానిని అర్థం చేసుకోవటం మనకు సాధ్యపడదు దానిని వివరించగల అర్థము ఉన్న మాటలే లేవు ఇదే ఒక విధంగా (1) మతవాదులు,

భావవాదులు ఒకవైపు (2) వాస్తవ అనుభవం పరిశీలన మీద ఆధారపడేవారు, దేవుడు మనుష్యులకు తెలియనేరడని వాదించువారు మరొకవైపు (Religionists and Idealists on one side and Positivists and Agnostics on the other side) చేయు చర్చవంటిదే ఇది

పరిణామము లేక మార్పు చెందని పదార్థమున్నదని నమ్మేవారు మొదటివారు ప్రత్యక్ష ప్రమాణము మాత్రమే నమ్మువారు రెండవవారు వీరిని కామ్టిస్ట్లు లేక పాజిటివిస్ట్లు (Comtists or Positivists) ఆగస్ట్‌కామ్టే (Auguste Comte) అను తత్వశాస్త్రజ్ఞుడు చెప్పిన సిద్ధాంతమిది వీరినే (Agnostics) అనగా (అజ్ఞాతవాది) దేవుడు మనుష్యులకు తెలియనేరడని వాదించువారు అని కూడా అంటారు

ఈ రకమైన వాదప్రతివాదములు అనాది నుండి ఈనాటి వరకు ఉంటూనే ఉన్నాయి అని తెలుస్తోంది కదా!

ఎట్టి మార్పును పొందని పదార్థము ఒకటి ఆవరణగా (Background) ఉన్నప్పుడే మరియొక పదార్థము యొక్క మార్పుగాని చలనముగాని తెలుస్తుంది అది అనావశ్యకము (superfluous) అని కొందరి వాదన మార్పు చెందుచున్న పదార్థమును గురించి మాత్రమే ఊహించగలము గాని మార్పులేని పదార్థమును గ్రహించుటగాని ఊహించుటగాని అసాధ్యము అని వీరి వాదన

ఈ ప్రశ్నకు సమాధానము పురాతనకాలంలో మనదేశంలో దొరికినట్లు ఎక్కడా కనబడదు అని స్వామి వివేకానంద అభిప్రాయము ఎట్టి స్వభావము కాని, ప్రతి స్వభావము (quality) వెనుక ఉన్న పదార్థమును ప్రత్యక్ష ప్రమాణముగా చూపుట అసంభవము 'నేను' అనే కర్త కార్యములు చేస్తున్నట్లు చెప్తాము నేను నడుస్తున్నాను, నేను పడుకున్నాను, నేను చదువుచున్నాను అని ఈ భిన్నమైన పనులు చేసేది శరీరము 'నేను' అనగా 'మనస్సు' ఎట్టి మార్పు చెందనిది ఈ సమాధానము కొంతవరకు హేతుబద్ధంగా ఉన్నప్పటికి, ఈ

పనులు బాహ్యంగా భిన్నంగా కన్పడినను, వాటి మూలాధార్రమైన మనస్సు నందు వాటిని వేరుపరచలేము అందువలన 'నేను' అనే ఒక వ్యక్తిగా మార్పు చెందనిది అని అనటం సహేతుకంగా లేదు అన్నారు స్వామి వివేకానంద

కాబట్టి ఆత్మను పరిపూర్ణమైన, శాశ్వత గుర్తింపు (continuing identity) గలదిగాను కాని పరిమితమైనదిగాను ఉండి, స్వభావమునకు భిన్నమైనదిగా రూపొందటం జరగదు ఎన్నో స్వభావములతో కూడి పరిమిత స్థితిలో నున్న (limited existence) దానిని ప్రత్యక్షముగా వివరించటం జరగదు

స్వభావాలు లేక గుణాలకు అతీతమైన పదార్థమును గురించి మనకు తెలియదు, తెలిసే అవకాశం లేదు అన్నారు బౌద్ధులు. గుణాలకు (స్వభావాలకు) అతీతమైన పదార్థమును ఊహించటం అసాధ్యము అని అద్వైతి కూడా అంటాడు ఒకే సమయంలో పరిణామం ఉండటం, లేకపోవటం జరగదు కాని పదార్థము - గుణములు భిన్నములు కావు పదార్థముతోనే గుణములు ఉంటాయి నిర్గుణమై మార్పు చెందని పదార్థము మార్పు చెందుచున్నట్లుగా కనబడును అగోచరమైనది (Noumenon) గోచరమగు (Phenomenon) ప్రకృతిగా కనబడును అగోచరము, నిర్గుణము అయినదే సగుణముగా గోచరమగుచున్నది అదే వేదాంతసారము నిర్గుణముగానున్నది, పరిణామ రహితమైనది అయిన ఆ పదార్థము దీనికంటే (గోచరమైన దానికంటే) భిన్నమైనది కాదు

"పరిణామము చెందని ఆత్మ ఒకటి ఉన్నది ఇంకొక దృష్టితో పరికించినచో, వేటినైతే మనము భావములు, గ్రాహ్యత లేక జ్ఞానము అంటామో చివరకు ఈ శరీరము కూడా, అంతా ఆత్మయే మనకు ఆత్మ ఉన్నది, శరీరం ఉన్నది, అది ఉన్నది, ఇది ఉన్నది అని ఆలోచిస్తూ ఉంటాము కాని వాస్తవానికి ఉన్నది ఒక్కటే" అని స్వామి వివేకానంద అన్నారు

శరీరమే మనము, మనమే శరీరం అని తలచినంత కాలం మనం

ఇంకొకటి అని చెప్పితే అది హాస్యాస్పదం అవుతుంది కాని మనము ఆత్మను గుర్తించినపుడు శరీరం అదృశ్యమవుతుంది శారీరక గ్రాహ్యత (ఇంద్రియ జ్ఞానము) ఉండదు అనగా శారీరక గ్రాహ్యత అంటే శరీరమే 'నేను' అనుకొనినంత కాలం ఆత్మగ్రాహ్యత ఉండదు మరొకరకంగా చెబితే, గుణముల ప్రభావము తొలగనంతవరకు, మూలపదార్థ గ్రాహ్యతరాదు అద్వైత సిద్ధాంతంలో చెప్పబడిన 'రజ్జు సర్పభ్రాంతి' భావము ఇదే

మనకు ఉన్నది ఒకటే శరీరము అను ఆవరణయందున్న ఆత్మ ఆ ఉన్న ఒకటి అనగా ఒక్క పదార్థము భిన్నరూపములలో కనబడుచుండుటచే కారణము - ఫలితములు, లేక కార్యము - ఫలితము ఏర్పడుచున్నవి కార్యము అనగా పని జరగటం అటుపై దాని ఫలితం ఏర్పడటమే సృష్టి పరిణామంలో (Evolution) ఒకటి మరొకటిగా మారుతుండటం జరుగుతుంది ఒక పర్యాయం కారణం కనబడదు అనగా మూలం తెలియదు దాని స్థానంలో ఫలితం కనబడుతుంది శరీరానికి ఆత్మమూలమైనపుడు, తాత్కాలికంగా ఆత్మ అదృశ్యమై శరీరమే కనబడుతుంది కాని ఆంతరికదృష్టి (Inner sight) ఏర్పడినపుడు శరీరం అగోచరమవుతుంది బౌద్ధుల వాదమైన 'మార్పులతో' (పరిణామముతో) కూడినది ఒకటే ఉన్నది' అను దానికి ఇదే సరైన సమాధానం పదార్థము-గుణములు భిన్నములు కావు ఒకటే భిన్న రూపములలో కనబడుతుంది

పరిణామము చెందని ఆ పదార్థము పరిపూర్ణమైనది ఆ విధంగా గ్రహించినపుడే అది అర్థమవుతుంది భిన్న అంశములుగా అది ఎన్నడు ఉండదు పరిణామము-చలనము కలిగినపుడే భాగము లేక అంశము అనేవి ఏర్పడతాయి పరిమితమైన వాటిని (limited or finite) గురించి తెలుసుకొనగలము, ఎందువలననగా అవి నిరంతరం పరిణామం చెందుతూ ఉంటాయి కనుక సంపూర్ణమైనది పరిణామం చెందదు పరిణామం

తెలుసుకొనుటకు మరొక పదార్థం ఉండాలి దానితోటి పోలికతోనే పరిణామమును తెలుసుకొనుటకు వీలు కలుగును మార్పుచెందని ఒక పదార్థముతోటి సంబంధము ఉన్నపుడే మరొక పదార్థము యొక్క మార్పులను గుర్తించగలుగుతాము

కాబట్టి ఆత్మ సార్వజనీనం శాశ్వతం, సంపూర్ణం, పరిణామం చెందనిది అని అద్వైతం చెప్పిన సిద్ధాంతమును వీలైనంత వరకు నిదర్శనములతో నిరూపించవచ్చును కాని ప్రత్యేక ఆత్మ లేక జీవాత్మను నిరూపించే విషయంలోనే ఎంతో ప్రయాస ఉంది సార్వజనీనమైన పరమాత్మయే మన జీవాత్మ అని గ్రహించగలిగినపుడు మనం గూడ నాశములేని (immortal) జీవన్ముక్తుల మౌతాము కాని జీవాత్మ పరమాత్మ భాగంగా భిన్నమైనదని మనము తలుస్తాము గదా! అదే అనంతమైన పరమాత్మయే ఈ జీవాత్మలు అని గ్రహించటానికి ఆటంకం అవుతున్నది జీవాత్మలు భిన్నములని తలచినంత కాలము అవి భిన్నవ్యక్తులుగా ఎదుగుతాయి అవి అన్నీ ఒకటే కాని భిన్నంగా కనబడతాయి నిన్నటి 'నేనే' ఈనాటి 'నేను' అయినా ఎంతో కొంత మార్పు కలుగుతుంది కాని ఈ ద్వైత దృష్టిని అనగా రెండు (పరమాత్మ - జీవాత్మల) భిన్నము అను భావమును అధిగమించి, జీవాత్మ చెందుచున్నట్లు కనబడు పరిణామముల వెనుక ఎట్టి పరిణామము చెందనిది ఒకటి ఉన్నదని గ్రహించినచో, శాస్త్రీయ దృక్పథంలో 'నేను' అనునది నిత్యం పరిణామము చెందుచు ప్రగతివైపుకు వ్యాకోచించునని తెలియును ఈ పరిణామము యొక్క పర్యవసానము ఆత్మతో జీవాత్మ ఐక్యత సాధించుటయే అదే ఆత్మజ్ఞాన సాధన, సత్యాన్వేషణ

మనిషి నత్త నుండి పరిణామము చెంది ఎదిగిన జీవి అయినపుడు, నత్త కూడ మానవుని వలె ఒక ప్రత్యేక వ్యక్తిత్వము గల జీవి అయి ఉండాలి కాని అది మానవుని స్థాయికి ఎదగవలసి ఉంటుంది అందువలననే నత్త నుండి మానవుని వరకు అది ఒక నిత్య పరిణామ ప్రవాహము ఆ ప్రవాహము జీవి

ఇంకొకటి అని చెప్పితే అది హాస్యాస్పదం అవుతుంది కాని మనము ఆత్మను గుర్తించినపుడు శరీరం అదృశ్యమవుతుంది శారీరక గ్రాహ్యత (ఇంద్రియ జ్ఞానము) ఉండదు అనగా శారీరక గ్రాహ్యత అంటే శరీరమే 'నేను' అనుకొనినంత కాలం ఆత్మగ్రాహ్యత ఉండదు మరొకరకంగా చెబితే, గుణముల ప్రభావము తొలగనంతవరకు, మూలపదార్థ గ్రాహ్యతరాదు అద్వైత సిద్ధాంతంలో చెప్పబడిన 'రజ్జు సర్పభ్రాంతి' భావము ఇదే

మనకు ఉన్నది ఒకటే శరీరము అను ఆవరణయందున్న ఆత్మ ఆ ఉన్న ఒకటి అనగా ఒక్క పదార్థము భిన్నరూపములలో కనబడుచుండుటచే కారణము - ఫలితములు, లేక కార్యము - ఫలితము ఏర్పడుచున్నవి కార్యము అనగా పని జరగటం అటుపై దాని ఫలితం ఏర్పడటమే సృష్టి పరిణామంలో (Evolution) ఒకటి మరొకటిగా మారుతుండటం జరుగుతుంది ఒక పర్యాయం కారణం కనబడదు అనగా మూలం తెలియదు దాని స్థానంలో ఫలితం కనబడుతుంది శరీరానికి ఆత్మమూలమైనపుడు, తాత్కాలికంగా ఆత్మ అదృశ్యమై శరీరమే కనబడుతుంది కాని ఆంతరికదృష్టి (Inner sight) ఏర్పడినపుడు శరీరం అగోచరమవుతుంది బౌద్ధుల వాదమైన 'మార్పులతో' (పరిణామముతో) కూడినది ఒకటే ఉన్నది' అను దానికి ఇదే సరైన సమాధానం పదార్థము-గుణములు భిన్నములు కావు ఒకటే భిన్న రూపములలో కనబడుతుంది

పరిణామము చెందని ఆ పదార్థము పరిపూర్ణమైనది ఆ విధంగా గ్రహించినపుడే అది అర్థమవుతుంది భిన్న అంశములుగా అది ఎన్నడు ఉండదు పరిణామము-చలనము కలిగినపుడే భాగము లేక అంశము అనేవి ఏర్పడతాయి పరిమితమైన వాటిని (limited or finite) గురించి తెలుసుకొనగలము, ఎందువలననగా అవి నిరంతరం పరిణామం చెందుతూ ఉంటాయి కనుక సంపూర్ణమైనది పరిణామం చెందదు పరిణామం

స్నేహభావంతో గౌరవించింది దానికి ఒకటే కారణం ఉన్నది ఆ సిద్ధాంతములు కూడ తమదైన పద్ధతిలో అదే సత్యమును తెలుసుకొనుటకు ప్రయత్నించినవి మార్గాలు భిన్నమైనా ధ్యేయము ఒక్కటే అద్వైతము వలెనే అవి కూడ 'సత్' ను తెలుసుకొనుటకు ప్రయత్నించినవి అందువలననే వేదాంతములో అన్ని సిద్ధాంతములకు తగిన స్థానములు ఇవ్వబడినవి

ద్వైత సిద్ధాంతం మానవుడు మరణించిన తరువాత ఊర్ధ్వలోకాలకు వెళ్లునని చెప్తుంది వేదాంతంలో ఈ అభిప్రాయములు యధాతధంగా కొనసాగించబడినవి అద్వైతము గుర్తించబడిన తరువాత పైన చెప్పబడిన సిద్ధాంతములకు వాటికి తగిన స్థానము ఇవ్వబడి, అవి సత్యమును అసంపూర్ణముగా మాత్రమే తెలియజేయనని చెప్పబడినది

పదార్థ లేక శక్తి సృష్టియే ఈ ప్రపంచమంతా అని ద్వైత సిద్ధాంతము చెప్తుంది ఈ సృష్టి అనేది ఒకానొక ప్రత్యేకమైన ఇచ్ఛాఫలితము అని చెప్తుంది ఈ ఇచ్ఛ అనేది సంకల్పము అని కూడ అనవచ్చును ఈ సంకల్పము పొందినది ఈ విశ్వము కంటే భిన్నమైనది అని కూడా అంటుంది అలా చెప్పినపుడు మనిషి ఆత్మ, శరీరము అను రెండు భిన్న స్వభావములతో (Natures) కూడినది ఔతాడు అపుడు ఆత్మ పరిమితమైనదైనను తన ప్రత్యేకతతో (individually) పరిపూర్ణమైనదౌతుంది భవిష్యత్తు అమరత్వము అనేవి ఆత్మను గురించి ఇట్టి అభిప్రాయముతో కూడినవి అయి ఉంటాయి దర్శనములోని ఈ స్థాయి లేక స్థితు (phase) లన్ని వేదాంతంలో చేర్చబడినవి

ద్వైత సిద్ధాంతం ప్రకారం (Dualism) మనకి ఒక స్థూల శరీరం దాని వెనుక సూక్ష్మపదార్థంతో ఏర్పడిన ఒక సూక్ష్మశరీరం ఉంటాయి ఈ సూక్ష్మ శరీరమే మన కర్మ ఫలితములన్నిటిని తనలో నిల్వ ఉంచుతుంది (actions and impressions) మనం చేయు ప్రతి ఆలోచన, ప్రతి కర్మము కొంత కాలం తరువాత సూక్ష్మస్థితి పొంది బీజ రూపంలో శక్తివంతంగా సూక్ష్మశరీరంలో

స్థిరపడతాయి ఇవి కాలక్రమంగా వెలువడి ఫలితములను కల్గిస్తాయి ఈ ఫలితాలే మన జీవితాన్ని ప్రభావితం చేస్తాయి అనగా ప్రతి వ్యక్తి తన జీవితాన్ని తానే రూపొందించుకొన్నవాడౌతాడు తనకి తానే రూపొందించుకున్న చట్టానికి తప్ప మరొకదానికి అతడు లోబడడు మన ఆలోచనలు, మన వాక్కు, మన కర్మలు అనేవి మన చుట్టు మనము ఏర్పరచుకొన్న వలలోని దారములు అవి మఁచివి కావచ్చు చెడ్డవి కావచ్చు ఈ ఫలితములు అను వల (net) చాల శక్తివంతమైనవి దాని ప్రభావమునకు పూర్తిగా దాసులమే దీనినే 'కర్మ సిద్ధాంతం' అన్నారు

సూక్ష్మ శరీరం వెనుక (లోపల) జీవాత్మ ఉంటుంది జీవాత్మ పరిమాణమును గురించి అనేక వాదనలు చర్చలు ప్రచారంలో ఉన్నాయి కొంతమంది అది పరమాణు ప్రమాణంలో ఉందన్నారు మరికొందరు అది అంత సూక్ష్మం కాదన్నారు ఇంకా కొందరు అది పెద్దగా ఉంటుందన్నారు ఇలా ఎన్నో వాదనలు, అభిప్రాయాలు ఉన్నాయి

జీవాత్మ అనేది విశ్వములోని సార్వజనికమైన పదార్థములోని అంశమే ఆ పదార్థము వలె అది కూడ ఆది, అంతము లేనిదే అది ఇన్ని రూపములు పొందటం, శాశ్వతమైన తన వాస్తవ రూపమును (సత్) వ్యక్తము చేయుట కొరకే ఈ పరిణామ ప్రగతిని తిరోగమింపచేయు ఏ కర్మమైనా దుష్కర్మమే అగును జీవాత్మను పరమాత్మ వైపు వ్యాకోచింపచేయు ఏ కర్మమైనా సత్కర్మయే అగును ముతక స్థితిలో నున్న ద్వైతులు (Dualists) అయినను పరిణతి సాధించిన అద్వైతులైనను చెప్పేది ఒకటే జీవాత్మ యొక్క శక్తులన్నియు దానియందే మిళితమై ఉన్నాయి తప్ప ఏ బాహ్య మూలము (source) నుండి మాత్రము రావు ఆ శక్తులన్ని ఆత్మయందే ఉన్నాయి ఆ శక్తులను బహిర్గతము చేయటమే జీవిత ధ్యేయము లేక జీవితకర్మము అన్నారు

ఇంతేకాక పునర్జన్మ సిద్ధాంతం కూడ ఉంది ఒక శరీరమును వదలిన

ఆత్మ మరియొక శరీరములో చేరుతుంది విశ్వములోని ప్రపంచము (world) లన్నిటిలోకి మన ప్రపంచమునకే పునర్జన్మకై ఆత్మ ప్రాధాన్యం ఇస్తుందని కూడ అన్నారు ఇతర ప్రపంచములలో సుఖములే అధికముగా ఉండుట వలన భావ ఔన్నత్యమునకు అవకాశము తక్కువ అని అభిప్రాయపడ్డారు ఈ ప్రపంచంలో సుఖదుఃఖాలు కలిసి ఉన్నాయి అందువలన ఏదో ఒకనాడు జీవాత్మ మేల్కొంటుంది భవబంధముల నుండి వెలువడటానికి ప్రయత్నిస్తుంది

ఈ ప్రపంచంలో ధనికులకు ధనమునకు మించి ఉన్నతమైన దానిని గురించి తలచుటకు ఏ మాత్రం అవకాశముండదు అటులే స్వర్గము చేరిన జీవాత్మకు పరమాత్మను గురించి తలచే అవకాశము ఏ మాత్రముండదు ఎందుకంటే స్వర్గము చేరిన జీవాత్మ ఈ ప్రపంచంలోని ధనికుని వంటిదే అన్నారు స్వామి వివేకానంద అచట జీవాత్మకు రోగములు లేని చక్కటి శరీరము, ఆకలి, దాహము లేనటువంటిది ఆ విధముగా ఆనందముపై ఆనందము అనుభవిస్తూ తన వాస్తవ ఉనికిని (real nature) మరుస్తుంది

అయినను అంతకు ఉన్నతమైన లోకాలు ఉన్నాయి అచట ఆనందముతో పాటు పరమాత్మ దిశగా పరిణామమునకు కూడ అవకాశము ఉండును కొంత మంది ద్వైతుల దృష్టిలో భగవంతుని సన్నిధిలో శాశ్వతముగా జీవాత్మ ఉండుటకు వీలగు అత్యున్నత లోకమున్నది అచట జీవాత్మ సుందర శరీరము కలిగి రోగము, దుఃఖములు లేనటువంటిది, మృత్యువు లేనిది, కోరికలను నెరవేర్చునది, అవసరమయినపుడు ఈ భూలోకమునకు తిరిగివచ్చి శిష్టులను రక్షించి ధర్మ సంస్థాపన చేయు శక్తి కల్గినది అయి ఉంటుంది అని అన్నారు అలా వచ్చిన జీవాత్మలే అవతార పురుషులు, మత ప్రవక్తలు, ధర్మసంస్థాపకులు అని చెప్పబడింది అట్టి జీవాత్మలు విముక్తి పొందినవి (జీవన్ముక్తులు) అయి ఉంటాయి భగవంతునితో కలిసి అత్యున్నత లోకంలో ఉంటాయి కాని వారి ప్రేమ, సానుభూతి బాధితులగు మానవుల కొరకే

అందుకే వారు అపుడపుడు అవతార పురుషులుగా వచ్చి వారిని ఆదుకుని స్వర్గమునకు మార్గము చెపుతారు

కాని అద్వైతము చెప్పే పరమార్థము ఇది కాదు నిశ్శరీరముగా పరమాత్మయందు ఐక్యత పొందటమే జీవిత ఆదర్శము, ధ్యేయము అంటుంది పరిమితమైనది (Finite) అనగా అంతమున్నది, ఆదర్శము కానేరదు శరీరము పరిమితమైనది అది అనంతము కానేరదు భావము అనంతము కాదు దానికి పరిమితి ఉన్నది కాబట్టి ఈ భౌతిక శరీరానికి అతీతంగా, భావాతీతంగా పయనించాలి అని అద్వైతం చెప్తుంది ఈ విముక్తి కొత్తగా సాధించవలసినది కాదని ఎందుకంటే అది మనలో ఉన్నదని దానిని మనము గుర్తించలేక పోతున్నామని కూడ అద్వైతం చెప్తుంది అమరత్వము, పరమానందము సాధించవలసినవి కాదని, అవి మనలోనే ఉన్నాయి అని, వాటిని గుర్తించటం, గ్రహించటం, దర్శించటం (ఆత్మదర్శనం) మనం చేయవలసిన పని అని అద్వైత సిద్ధాంత సారాంశము

"నేను విముక్తి (స్వేచ్ఛ) పొందాను" అని ధైర్యంగా చెప్పిన క్షణంలోనే మనం విముక్తి పొందుతాము 'నేను బంధాలలోనే ఉన్నాను' అని చెప్పినంత కాలం మనం భవబంధాలలోనే ఉంటాము ఇదే అద్వైత సిద్ధాంతం చాటిచెప్పే పరమసత్యం

ద్వైతులు చెప్పే సిద్ధాంతం ముందే చెప్పబడింది కదా! మనిషి ఏది కావాలనుకుంటే దానినే గ్రహించవచ్చు

కాని వేదాంతంలోని పరమోన్నత (ఉత్కృష్ట)మైన ఆదర్శమును గ్రహించటం చాల కష్టము ఆ ఆదర్శమును గురించే పండితులు వాదోప వాదములతో కాలం వృధా చేస్తున్నారు ఏవో కొన్ని భావాలు ఏర్పరచుకొని ఇతర భావాలను తిరస్కరించటం జగడమాడటం చేస్తారు

అందుకనే స్వామి వివేకానంద ఇలా అన్నారు "నీకు నచ్చింది నీవు గ్రహించు ఇతరులకు నచ్చింది వారిని అనుసరించనీ పరిమితమైన ఈ మనుష్యత్వం (Manhood) తో కూడిన వ్యక్తిత్వం నీకు తృప్తికరంగా ఉంటే దానిని అంటిపెట్టుకునే ఉండు మనిషిగా నీ అనుభవం సుఖంగా, ఆనందంగా ఉంటే నీకు ఇష్టమైనంతకాలం మనిషిగానే ఉండు నీ అనుభవాలకు నీవే కారకుడవు కదా! నీ మనుష్యత్వమును త్యజించమని ఎవరూ బలవంతం చేయలేరు అలాగే దైవత్వం పొందాలని భావిస్తే అదీ పొందవచ్చు ఎవరూ కాదనలేరు కాని కొంత మందికి దైవత్వ వాంఛ లేదు వారిది ఘోరమైన స్వభావము అని అనటానికి నీకు ఏ మాత్రము హక్కు లేదు ఒక వంద రూపాయలు వదులుకొనటానికి నీకు విపరీతమైన భయం ఉండవచ్చు కాని కొంతమందికి వారికి ఉన్న ధనము అంతా వదులుకొనటానికి ఏ మాత్రం భయం ఉండకపోవచ్చు అట్టి మనుష్యులు గతంలో ఉన్నారు, ఇప్పుడూ ఉన్నారు ఎప్పటికీ ఉంటారు నీ ప్రమాణాలతో వారిని విమర్శించటం తగదు నీ పరిమితులకు నీవే అంటిపెట్టుకుని ఉండు పరిమితమైన ఈ ప్రాపంచిక ఆదర్శాలే నీకు ఉన్నతంగా తోచవచ్చు నీ తలపులు నీవే కాని 'సత్యమును' దర్శించినవారు కొందరున్నారు వారు ఈ పరిమితులకు లోబడి ఉండరు ఈ బంధాలకు అతీతంగా ఎదగాలనేది వారి ఆదర్శము నీ భావాలకు, ఆదర్శాలకు వారిని పరిమితం చేయాలని నీకెందుకు వాంఛ? సుఖాలతో, ఆనందాలతో కూడిన ఈ ప్రపంచం వారి దృష్టిలో ఒక బురదగుంట వారిని నీ ఆలోచనలతో బంధించే ప్రయత్నం కూడదు ఎవరి స్థానం వారికి ఉండనీ ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కరికీ స్థానం ఉంది "

అవివేకంతో కూడినదైన మరియొక అభిప్రాయం కూడ చాలమందికి ఉన్నది పరిమితమైన మనుష్యత్వము (వ్యక్తిత్వము)ను వదలినచో నీతి, ధర్మము అంతరిస్తాయి అని, మానవాళికి అపుడు నిరాశయే మిగులుతుంది అనేదే ఆ అభిప్రాయం ప్రపంచంలో ప్రతి ఒక్కరు మానవాళి సుఖమునకు

కృషి చేయు వ్యక్తిత్వము కలిగి ఉంటే అపుడు ఆ అభిప్రాయం సత్యమే అనవచ్చు వాస్తవానికి అందరూ అవుసరం లేదు దేశానికి ఒక రెండు వందల మంది అట్టి వారు ఉంటే, క్రీస్తు పునరాగమనం అయిదు రోజులలోనే జరుగుతుంది (Millennium) అంటారు స్వామి వివేకానంద రెండు వందల మంది కాదు గదా, చేతి వ్రేళ్ల మీద లెక్కించుటకు వీలైనంత మంది కూడ అట్టి త్యాగమూర్తులు ఈ ప్రపంచంలో ఉండరు అనేది జగమెరిగిన సత్యము కాబట్టి పైన చెప్పిన అభిప్రాయం కేవలం వ్యర్థ ప్రసంగం తప్ప మరొకటి కాదు

ప్రపంచ చరిత్ర తిరగేస్తే ఒక పరమసత్యము మనకు గోచరిస్తుంది తమ ప్రత్యేకతను, వ్యక్తిత్వమును (individuality) ఎన్నడూ తలంపనివారే మానవసేవ చేసినవారిలో ఉత్తములని తెలుస్తుంది స్త్రీగాని, పురుషుడుగాని తనను గురించి ఎంత ఎక్కువ తలుస్తారో, మానవాళికి అంత తక్కు మంచి చేస్తారు ముందు చెప్పబడిన స్వభావమును నిస్వార్థత అని, తరువాత చెప్పబడిన దానిని స్వార్థము అని అన్నారు పరిమితమైన సుఖసంతోషాలకు (little enjoyments) తాత్కాలిక ఫలితాలతో కూడిన వాంఛలకు అంటిపెట్టుకుని ఉండటం అనేది పరమస్వార్థం అది సత్యాన్వేషణగాని, పరోపకారి బుద్ధి వలన గాని ఎన్నడు ఏర్పడదు "సర్వం నాకే కావాలి, మరెవరిని నేను లెక్కచేయను" అనేదే పరమస్వార్థం

గౌతమ బుద్ధుని వంటి నిస్వార్థపరులే ఈ ప్రపంచానికి అవసరం అంటారు స్వామి వివేకానంద గౌతమబుద్ధుడు సగుణుడైన ఇష్టదైవమును గురించి గాని, జీవాత్మను గురించి గాని ఎన్నడు ప్రశ్నించలేదు, తర్కించలేదు కనబడని, తెలియని భగవంతుని గురించి వాదన వృథా ప్రయాస అని నమ్మినవాడు (Agnostic) అయినా తోటి జీవుని కొరకు ప్రాణాలైనా అర్పించటానికి సిద్ధపడే మనస్తత్వము అతనిది అతడు ఇల్లు, రాజ్యము, సంసారం అన్నీ వదలి అడవికి వెళ్లింది తన స్వార్థం కొరకు కాదు గదా! ప్రపంచంలో ఎందుకింత

దుఃఖమున్నదో అన్వేషించటానికే వెళ్లాడు

మనిషి ఎంత స్వార్థపరుడైతే అంత అధర్మపరుడు అవుతాడు రెండు విధములైన శక్తులు ఎపుడూ ప్రక్కప్రక్కనే పనిచేస్తూ ఉంటాయి ఒకటి 'నేను' అనేది మరొకటి 'నేను కాదు' అనేది ఈ రెండు శక్తులు మనిషిలోనే కాదు, జంతువులోనే కాదు చిన్న పురుగులో కూడ పనిచేస్తూనే ఉంటాయి అడపులి మనిషిని చంపుతుంది, కాని తన సంతానం కోసం ప్రాణం యివ్వటానికి సిద్ధపడుతుంది ఆ విధంగా సృష్టి అంతా ఈ రెండు శక్తులమయం ఒకటి ఉన్నచోట రెండోది కూడ ఉంటుంది ఒకటి స్వార్థం, రెండోది నిస్వార్థం ఒకటి అంతం లేని సంపాదన, రెండోది త్యాగము ఒకటి ఎపుడూ తీసుకుంటుంది, మరొకటి ఎపుడూ ఇస్తుంది అతితక్కువ స్థాయి నుండి పరమోన్నత స్థాయి వరకు ఈ విశ్వమంతా ఈ రెండు శక్తుల క్రీడారంగమే దీనికి నిదర్శనాలు అవసరం లేదు ఈ ప్రపంచమే ప్రత్యక్ష నిదర్శనం

'స్వార్థం', 'నిస్వార్థం' కాక మరొక శక్తి కూడ ఈ సృష్టిలో ఉన్నది అదే దేనికైనా కారణము, మూలము లేక తలపు అనబడు శక్తి (Motive) ఈ 'మూలం' ఏ రూపంలోనైనా ఉండవచ్చు అదే నిస్వార్థము, త్యాగము, ప్రేమ మొదలైన వాటి వెనుకనున్న ఏకైక మూలశక్తి దేనికైనా కారణం లేక మూలం రెండుగా ఉండవు రెండుగా ఉంటే ఒకటి మంచి, ఒకటి చెడుగా ఉండాలి అలా లేవు ఉన్నది ఒకే శక్తి (One-Force Theory) ద్వైతం లేదు అంటారు స్వామి వివేకానంద అత్యున్నతమైన నీతి, ధర్మము, నిస్వార్థత పరస్పర ఆధారములు అదే అత్యంత ఉన్నతమైన వేదాంతాశయము ధర్మము నీతికి మూలాధారము అని వేదాంత, శాస్త్రీయ దృక్పథము (Philosophical and Scientific Conception) మానవ సుఖమునకు విజ్ఞానము (Knowledge) విరుద్ధము కాదు జీవితములోని ప్రతి క్షణము, ప్రతివిభాగములోను విజ్ఞానమే క్షేమకారి ఎంత ఎక్కువ జ్ఞానం పొందితే మనకు అంత మంచిది 'చెడు'గా

కనబడే దానికి మూలం, ఆది, అంతము లేనిదానికి (అనంతం) పరిమితి (పరిచ్ఛిన్నం) ఏర్పరచటం (Evil is the limitation of the unlimited) అని వేదాంతం చెప్తుంది ప్రేమ సంకుచిత మార్గములలో ప్రవహింపచేయబడినపుడు చెడుగా కనబడుతుంది అదే పర్యవసానంగా ఇష్టదైవంగా రూపొందుతుంది (Limited God) కాబట్టి చెడుగా కనబడే ప్రతిదానికి మూలం మనలోనే ఉన్నది

ఈ విషాదానికంతా ఏదో మానవాతీతశక్తి కారణమని తలచటం గాని, నిరాశ, నిస్పృహ చెందటంగాని, ఈ స్థితి నుండి ఎన్నటికి విమోచనం లేదని తలచటం గాని లేక ఎవరో వచ్చి ఏదో ఉద్ధరిస్తారని ఆశించటం గాని చేయవద్దు అంటారు స్వామి వివేకానంద ఈ సందర్భంగా స్వామి వివేకానంద చక్కటి ఉపమానం ఇచ్చారు మనమంతా అనగా మనుష్యులంతా పట్టుపురుగులు వంటివారము ఆ పురుగుల వలెనే మనము గూడ మనలోని పదార్థము ద్వారానే మన చుట్టు దారాలు అల్లుకుంటాము అదే పట్టుకాయలాగ తయారై అందు పట్టుపురుగు వలె మనలను మనమే బంధించుకుంటాము కాని అది శాశ్వతం కాదు ఆ బంధనలోనే క్రమంగా ఆత్మజ్ఞానం గ్రహిస్తాము పట్టుపురుగు సీతాకోకచిలుకగా మారి విముక్తి పొందినటులే మనము గూడ విముక్తుల మవుతాము

మన చుట్టు మనం అల్లుకొనే పట్టుకాయయే మన కర్మబంధము అది మన చర్య ఫలితమే అజ్ఞానంలో మనం బంధించబడినట్లు విషాదంతో సహాయం కోసం ఎలుగెత్తి అరుస్తాము ఆ సహాయం బయట ఎచట నుండీ రాదు ఆ సహాయం మనలోనుండే వస్తుంది, భగవంతుడు మనలోనే ఉన్నాడు కాబట్టి మనచుట్టు మనం అల్లుకున్న కర్మబంధములను మనమే తెంచుకుని బయటపడాలి జీవితంలో అనేక పొరపాట్లు చేస్తుంటాము కాని ఆ పొరపాట్లనే తలుస్తూ నిరాశపడకూడదు పొరపాటు అని తెలిసిన తరువాత ఆ

పొరపాటు మరల చేయము కదా! అందువలన చివరకు మంచే జరుగుతుంది మానవుని మూలస్వభావము స్వచ్ఛమైనదే ఆ మూల స్వభావము నాశము లేనిది ఎన్నటికి అది అలాగే ఉంటుంది

మనం తెలుసుకోవలసినది ఒకటే పొరపాటు లేక చెడు అనేది మనం బలహీనత వలన చేస్తుంటాం అంటే మానసిక బలహీనత వలన అజ్ఞానం వలన ఆ బలహీనత ఏర్పడుతుంది అజ్ఞానం ఎందుకు కలుగుతోంది? దానిని మనమే కలుగజేస్తున్నాం మన కళ్లకు మన చేతులు అడ్డుపెట్టుకుంటే అంతా చీకటే గదా! చేతులు తీసివేస్తే అంతా వెలుగే ఆ వెలుగు మనతోనే ఉంది అదే స్వయంప్రకాశకమైన ఆత్మజ్యోతి

పరిణామమునకు మూలము కోరిక లేక అవసరం అని సైన్సు చెప్తోంది (Necessity is the mother of invention) అవసరమే క్రొత్త విషయం తెలుసుకోవటానికి మూలం లేక కారణం అవుసరము అంటే కోరికే గదా! డార్విన్ సిద్ధాంతం వివరించినటుల జంతువు ఏదో ఒక పనిచేయాలని ఆశిస్తుంది కాని పరిసరాలు అందుకు అనుకూలించవు అందుచే తన శరీరాన్ని పరిస్థితులకు అనుకూలంగా మలుచుకుని మార్పు చెందుతుంది ఆ జంతువుకు క్రొత్త శరీరం ఎవరిస్తారు ఎవరూ ఇవ్వరు ఆ జంతువే తన కోరిక ద్వారా క్రొత్త శరీరం పొందుతుంది అదే జంతువులో దాగి ఉన్న శక్తి (will) ఏకకణజీవి అమీబా నుండి పరిణామం ద్వారా మానవుడు రూపొందాడు ఈ పరిణామానికి ఆధారం మనలో ఉన్న ఆ శక్తి (will) (ఇచ్ఛ, సంకల్పం లేక చిత్తము) ఆ పరిణామమునే ఇంకా ముందుకు సాగనిచ్చినచో మానవుడు అత్యున్నత స్థాయికి చేరుకుంటాడు ఆ ఇచ్ఛాశక్తి లేక సంకల్పమే పరమాత్మ ఆ శక్తి పరమాత్మ అయినపుడు మనం సర్వము చేయకలిగి ఉండాలి గదా అని సంశయం వస్తుంది ఆ సంశయానికి మూలం 'నేను అను పరిమితమైన (little self) ఆత్మభావము కాని ఒక్కసారి వెనుతిరిగి అమీబా నుండి మనిషి వరకు

జరుగు పరిణామం ఎలా జరిగిందో అర్థం చేసుకుంటే ఆ సంశయం రాదు ఆ పరిణామానికి మూలం మనలోని చైతన్యశక్తి అన్నాము కదా! ఈ మార్పు ఒక్కసారిగా హఠాత్తుగా రాలేదు గదా! ఆ శక్తి క్రమక్రమంగా పరిణతి చెందుతూ వచ్చింది ఇంత దూరం ఎదిగిన ఆ శక్తి ఇంకా ఎదగలేదు అని ఎలా అనగలము తప్పక ఎదుగుతుంది అదే మనలోని ఆత్మశక్తి అదే పరమాత్మ ఆ సంకల్ప శక్తినే బలవర్ధకం చేసుకోవాలి

"స్వయంప్రకాశకమైన ఓ శక్తీ! మేలుకో! స్వచ్ఛమైన నీవు మేలుకో! ఆది, అంతము లేని ఓ శక్తీ మేలుకో! నీ వాస్తవరూపమును వెలుపరుచుము మధ్యలో వచ్చు పొరపాట్లు, చెడు పనులు మొదలైనవి తాత్కాలికములే సత్యరూపమైన ఆత్మశక్తి ముందు అవి తాత్కాలికములే "

ఇదే అద్వైతము తెలుపు అత్యున్నత ప్రార్థన మన వాస్తవ స్వభావమైన ఆత్మ, అదే మనలోనున్న పరమాత్మను గురించిన ప్రార్థన అనంతమైనది, సర్వశక్తివంతమైనది, సత్యమైనది, పరిమితముకానిది, స్వార్థములేనిది అయిన పరమాత్మను గురించిన భావాతీతధ్యానము (transcendental meditation) 'ఆత్మ' స్వభావము సత్యమైనది, నిస్వార్థమైనది అందుకే అది శక్తివంతమైనది, భయము లేనిది స్వార్థం కలిగినపుడే భయం ఏర్పడుతుంది తనకు ఏమీ కోరిక లేనపుడు, ఎవరిని గురించి భయపడాలి? దేనిని గురించి భయపడాలి

కాబట్టి అద్వైతి ఎల్లపుడు గత స్వభావం గురించి ఆలోచించడు పరిణితి చెందిన వర్తమాన స్వచ్ఛత పొందిన స్వభావమును ప్రధానంగా తీసుకుంటాడు అదే సృష్టిలోని పరిణామమునకు తార్కాణము ఈ పరిణామము నిరంతరం జీవుడు పరమాత్మను చేరునంత వరకు సాగుతూనే ఉంటుంది సత్యము శాశ్వతము ఆత్మస్వభావము సత్యము ఆ సత్యమును (సత్) గ్రహించటమే ధ్యానపరమావధి అదే భావాతీత ధ్యానము అదే సత్యాన్వేషణ

## 3 ఆంతరిక జీవితం (అంతర్బుద్ధి - intuition)

దేవుడు ఉన్నాడా? ఎవ్వరా దేవుడు? ఎక్కడుంటాడు? ఎలా ఉంటాడు? ఎవరైనా చూశారా? అసలు దేవుడు అన్న భావానికి నిర్వచనం ఏమిటి? సృష్టించినవాడా? రక్షించేవాడా? లయకారకుడా? ఈ చరాచర జగత్తును సృష్టించినది ఎవ్వరు? ఈ సృష్టి ఎపుడు మొదలైంది? ఎందుకు జరిగింది? వీటి సమాధానమే సత్యాన్వేషణ అని తెలుసుకున్నాము గదా! ఈ ప్రశ్నలని వివిధ దృక్పథాలతో కూలంకషంగా పరిశీలించి అనేకమైన సిద్ధాంతాలను ప్రతిపాదించారని గూడ చూశాము వీటిలో ఎవరికి అనుకూలమైన మార్గాన్ని వారు అవలంబించి బ్రహ్మసత్యాన్ని కనుక్కున్నారు మహానుభావులు వారి ప్రతిపాదనలను పరిశీలిస్తే మనకూ బ్రహ్మసత్యం తెలుస్తుంది సిద్ధాంతపరంగా కాని దానిని అనుభవంలోకి తెచ్చుకుని అనుభూతి పొందటం ఎలా? ఈ పరమ గమ్యమును పొందటానికి 'అంతరంగపు పిలుపు' వినగలగాలి అది వినగలిగితే 'ఆంతరిక జీవితం' అర్థమౌతుంది

'అంతరంగపు పిలుపు', 'ఆంతరిక జీవితం' అంటే తెలియటానికి ముందు బాహ్య జీవితం లేక ప్రాపంచిక జీవితం నుండి స్వేచ్ఛ అంటే ఏమిటో తెలుసుకోవాలి

ఆధ్యాత్మిక ప్రవృత్తి లేక చింతనకు గమ్యం స్వేచ్ఛ లేక మోక్షము అని సంప్రదాయ వేదాంతం గుర్తించినది తాను పరిపూర్ణ ఉత్తీర్ణత (self perfection) పొందినపుడే గమ్యం చేరటం జరుగుతుందని శ్రీ అరవిందుల సంపూర్ణయోగ సిద్ధాంతము చెప్తుంది (Integral Yoga) ఎక్కడో ఉన్న తెలియని స్వర్గం అనబడే శిఖరాగ్రానికి ఎగిరే ప్రయత్నం కంటే ఇక్కడే ఈ భౌతిక జీవితంలోనే ఆ పరిపూర్ణతను పొందటమే గమ్యం అని అరవిందుల యోగసిద్ధాంతం చెప్తుంది ప్రకృతి అనబడే ఈ ప్రాపంచిక బంధముల నుండి విడివడటమే ముక్తి లేక స్వేచ్ఛ అని సాంఖ్య సిద్ధాంతం చెప్పగా, వ్యక్తిత్వ చైతన్యము (individual

consciousness) భావాతీత పరిపూర్ణ చైతన్యము (transcendental consciousness) లేక పరబ్రహ్మముతో సంయోగము చెందటమో స్వేచ్ఛ లేక ముక్తి అని అద్వైత సిద్ధాంతం చెప్తుంది

ఈ స్వేచ్ఛ అనేది 'పరిపూర్ణ యోగం' (Integral Yoga) లో ప్రథమ సోపానం మాత్రమే అన్నారు అరవిందులు అరవిందుల యోగం అంటే కలయిక అని అర్థం ఉన్నత దైవ జీవితంలోకి పోయేటట్లు చేసే సాధనను 'పూర్ణయోగం' అన్నారు అరవిందులు ఊర్ధ్వమనసు (Over Mind) విశ్వానికి చెందిన చైతన్యం పరబ్రహ్మ జ్ఞానముతో దివ్యచైతన్య మానవుడుగా ఎదగాలంటే నిమ్న ప్రకృతిని జయించి ఉన్నత ప్రకృతి వైపుగా పోవాలి

ఇది ఆధ్యాత్మిక జీవితంలో మకుటాయమానదశ అయినా ఆధ్యాత్మిక పరిణామంలో ఇది చివరి మెట్టు కాదు అన్నారు అరవిందులు దివ్యచైతన్యం (higher or supreme consciousness) దిగివస్తేనే (అవతరిస్తేనే) (descent) అనగా దివ్యచైతన్యం వ్యక్తిలోకి వస్తేనే అచేతన అజ్ఞానాలు పూర్తిగా పోతాయి తప్ప ఊర్ధ్వమనసుకు వాటిని పోగొట్టు శక్తి లేదు అని అరవిందులు అన్నారు దివ్యచైతన్యం వ్యక్తిలో అభివ్యక్తం (manifest) అయినపుడు మానవ జీవితం దివ్యజీవితంగా రూపొందుతుంది అపుడు మానవుడు వ్యక్తిగా జీవనం సాగించుచున్నను దివ్యచైతన్యమునకు కేంద్ర బిందువుగా నుండి దానిని ప్రసరింపజేయుచు విశ్వజీవిగా (universal individual) రూపొందుతాడు సాధన ద్వారా భావాతీత చైతన్యం (transcendental consciousness) పొందవచ్చు కాని దివ్యచైతన్యం (supreme consciousness) పొందటానికి కావలసినది ఆత్మార్పణం (self surrender) అనగా జీవిత అహం (life ego or self ego) ను వదులుట అదే పరిపూర్ణ యోగం (integral yoga) దీనినే ఆత్మార్పణ యోగం (The Yoga of self surrender) అని కూడ అన్నారు

ఇట్టి పరిపూర్ణయోగపురుషుడు శ్రీకృష్ణుడు దివ్యచైతన్యం (supreme

consciousness) వ్యక్తిలో అభివ్యక్తమే (manifestation) శ్రీకృష్ణుడు అందుకే ఆయనను పరిపూర్ణ అవతారము, ప్రత్యక్ష భగవానుడు అన్నారు భావాతీతమై, సర్వోత్కృష్టమైన చైతన్యరూపుడు (transcendental nature/supreme consciousness) శ్రీకృష్ణుడు భగవానుడే ప్రధానంగా ఆయన యోగీశ్వరుడు విశ్వాత్మ సత్యస్వరూపుడు మానవరూపంలో వ్యక్తమైనను శ్రీకృష్ణుడు దివ్య చైతన్యమునకు కేంద్రబిందువుగా నుండి దానిని ప్రసరింపచేసిన, సర్వమునకు చెందిన అనగా సార్వజనీనుడైన (universal individual) యోగమూర్తి

ఈ జీవితంలోనే పరిపూర్ణత్వం పొందటమే అనగా ఆత్మసాక్షాత్కారము పొందటమే మన పరమగమ్యము (supreme goal) 'అంతరంగపు పిలుపు' (inner call) వినగలిగిన వారే ఈ పరమగమ్యము పొందగలుగుతారు

స్వామి వివేకానంద శ్రీరామకృష్ణ పరమహంసకే అనంతమైన ఆనందం కలుగచేసిన రెండు పాటలు పాడారు అందు మొదటిది "ఓ మనసా! నీ నిజ నికేతనమునకు పొమ్ము" అని ప్రారంభమవుతుంది అంటే మనం ఇపుడు ఉన్నది మన నిజస్థానం కాదు మన నిజస్థానం మరెక్కడో ఉన్నది మరెక్కడో అంటే ఎక్కడో స్వర్గంలో అని కాదు అర్థం అది మనలోనే ఉన్నది భగవద్గీత 18వ అధ్యాయం 61వ శ్లోకంలో భగవానుడు ఇలా అన్నారు

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

అర్జునా! ఈశ్వరుడు సమస్త ప్రాణులను శరీరమనెడి యంత్రము నారోహింపజేసి తన మాయ చేత నాడించుచు వాని హృదయమందు నెలకొని యున్నాడు

"పాము కోరలందు విషమున్నను ఆ విషము వలన అది బాధింపబడుట లేదు కాని అది ఇతరులను కాటు వేసినచో ఆ విషము వలన వారు

మరణింతురు ఇదే రీతిగా ఈశ్వరుని యందు మాయయున్నది కాని ఆయన దానిచే బాధింపబడకున్నాడు జగత్తునంతయు ఆయన తనదిగా గైకొని యున్నాడు" అని శ్రీరామకృష్ణ పరమహంస ఉపదేశము

స్వామి వివేకానంద పాడిన రెండవ పాటలోని భావం ఇలా ఉన్నది "ఓ పరమాత్మ! నా జీవితంలో రోజులన్నీ వృధాగా గడచిపోవలసిందేనా?"

ఈ మాయా ప్రపంచపు ఆటలతో అలసి, సొలసి, ప్రాపంచికపు సుఖలాలసతో విసుగెత్తినపుడు మాత్రమే మన నిజస్థానానికి మరల చేరాలని అనిపించి మన దృష్టి "లోదృష్టి" (ఆత్మ దృష్టి) (inner sight) గా మారుతుంది అపుడే మనలోని అనంతత్వాన్ని గ్రహించగలుగుతాము ఆ అనంతత్వమే మన నిజతత్వమనీ గ్రహించినపుడు మాత్రమే అఖండమైన, శాశ్వతమైన ఆనందం కలుగుతుంది కాబట్టి ఆత్మ సాక్షాత్కారం లేక పరగమ్య సాధనలోనే మానవ జీవిత నిజలక్ష్యం ఇమిడి ఉన్నది

కానీ నిజమైన చైతన్యం కలిగిన వారిలోనైనా అంతర్మధనం జరగక తప్పదు (internal conflict) ఈ అంతర్మధనము లేనట్లయితే ఆధ్యాత్మిక సాధన యొక్క అవసరమే లేదు మనస్సును బాహ్య ప్రపంచం నుండి మరలించి ఆత్మ పరిశీలన ప్రారంభించినపుడే లేదా బాహ్య పరిశీలకులుగా (Extrollert) కన్న అంతర్ పరిశీలకులుగా (introvert) మారాలని అనుకున్నపుడు మాత్రమే మనలో ఒక విధమైన అలజడి ఏర్పడుతుంది ఆత్మ ఉన్నదని గాని, పరమాత్మ ఉన్నదని గాని, అతీతమైన శక్తి ఉన్నదని గాని విశ్వాసం లేనివారు యీ విషయముల గురించి ఆలోచించరు వారిలో ఏ విధమైన ఆరాటము గాని పోరాటము గాని ఉండదు వారు పూర్తి భౌతికవాదులు ఎంత భౌతికవాదులకైనా ఏదో ఒకనాడు అంతర్ మధనం రాక తప్పదు జీవిత గమ్యం ఏమిటి అనే ప్రశ్న వారిని ఎదుర్కొనక తప్పదు

వీరుగాక అంతర్మధనం లేనివారు మరొకరు కూడ ఉన్నారు వారే

తమకు తాము ధార్మికపరులుగా మతానుయాయులుగా భావించేవారు కానివారు పైపైన మాత్రమే ఆ విధంగా ఉంటారు చాలమంది తీర్థయాత్రలు చేస్తారు, దేవాలయాలను దర్శిస్తారు, మేళాలకు వెళ్తారు, గంగాయమున సంగమంలో స్నానాలు చేస్తారు కాని ఇవన్నీ కొన్ని సంప్రదాయాలు మాత్రమే 'ఇవన్నీ సాంఘికమతము'గా వ్యవహరింపబడుతాయి

ఇటువంటి ఆచారవ్యవహారాలకీ, నిజమైన లక్ష్యసాధనకు గల సూక్ష్మభేదాన్ని, తారతమ్యాన్ని మనం గుర్తించాలి ఉన్నత లక్ష్యం వైపు దృష్టి గలవారందరికి లోపోరాటము, అంతర్మధనము తప్పదు సంపూర్ణ భౌతికవాదుల వలెనే, మతం పేరిట సాధారణ సంప్రదాయాలనూ, ఆచారాలనూ పాటిస్తూ వుండేవారు కూడ అంతర్మధనము చేత బాధింపబడరు

ఇక ఈ జీవితంలోనే పరమగమ్యాన్ని సాధిద్దామని నిజాయితీగా ప్రయత్నించే సాధకులు సాధారణ పురుషులు, స్త్రీలు కారు వారు తమ లోపల జరిగే అంతర్నాటకాన్ని వీక్షించే మహానుభావుల కోవకుచెందుతారు అటువంటివారు ఈ జీవితంలోనే పరిపూర్ణత్వం పొందుట అనే ఉన్నత లక్ష్యం వైపు, జీవితంలోని ఉన్నత విలువల వైపూ అకర్షింపబడుతారు కానీ శారీరక అవుసరాలు కూడ తీర్చవలసిన బాధ్యత మనపై ఉన్నది గదా! ఇదే మన లోపల జరిగే పోరాటానికి ఆధారభూతమై యున్నది అనగా అంతరాత్మ పిలుపుకూ, ఇంద్రియముల ప్రలోభమునకూ మధ్య పోరాటం జరుగుతూ ఉంటుంది పరమగమ్యం వైపుకు స్థిరంగా అభివృద్ధి చెందాలని మనకు వున్నా బాహ్య ప్రపంచపు ఆకర్షణలూ ప్రలోభాలు మనల్ని మన లక్ష్యానికి వ్యతిరేక దిశలో లాగుతూ వుంటాయి మనస్సులోనున్న భావాలకు శరీరం ఏ విధంగానూ సహకరించదు ఈ రెండు రకముల పరస్పర విరుద్ధ భావముల మధ్య నలిగి పోతుంటాం

ఒక వైపు భగవంతుని చేరాలనే నిజమైన అకాంక్ష మరొకవైపు మనలను

చుట్టుముట్టి వున్న బాహ్య ప్రపంచపు ప్రలోభములు - ఈ రెండు ఒకదానికొకటి విరుద్ధముగా మనకు అగుపడతాయి కాబట్టి అందరూ ఈ పరమ లక్ష్యాన్ని చేరుకోలేరనీ, పరమలక్ష్యం వైపుకు పయనం చేసే యాత్రకు అందరూ అర్హులు కారని నిస్సందేహంగా చెప్పవచ్చును నిజమైన ఆధ్యాత్మిక జీవితం కొందరికే సాధ్యము అని మనము గుర్తుంచుకోవాలి ఆధ్యాత్మికత అన్నది అందరికి సాధ్యం కాని విషయం మానవజీవిత లక్ష్యం శారీరక పరిమితులను అధిగమించి మన నిజతత్వాన్ని పొందగలగటమేనన్న దృఢ విశ్వాసం గల కొద్ది మందికి మాత్రమే నిజమైన ఆధ్యాత్మిక జీవనం సాధ్యపడుతుంది

అయినా, ఆత్మకు, శరీరానికి ఎటువంటి విభేదాలున్నా, ఆధ్యాత్మిక జీవనానికి, నిజమైన ఆధ్యాత్మిక చైతన్యం పొందుటకు ఎన్నుకోబడిన కొద్ది మందిలో మనం కూడా ఒకరము, మనం ఆ వర్గానికి చెందినవారమే అను దృఢ విశ్వాసం వుండాలి ఈ జీవనం కొద్ది మందికే పరిమితం అయినా, ఆ కొద్ది మందిలో మనం కూడా ఒకరము అనే ఆత్మవిశ్వాసం, దృఢవిశ్వాసం మనపై మనకు కలగాలి లేనట్లయితే మనకు ఉత్సాహం మృగ్యమై ఆశావాదులుగా కాకుండా నిరాశావాదులుగా తయారవుతాం మనం దృఢమైన, స్థిరమైన ఆశావాదులుగా తయారై అచంచల విశ్వాసాన్ని కలిగి ఉండాలి

మనలో చాలమందిలో ఆధ్యాత్మిక సాధన మధ్యలోనే ముగుస్తుంది ఆరంభ దశలో కొంత అభిరుచి, ఉత్సాహము ఉంటుంది కాని కొంతకాలం అయ్యేసరికి, ఆధ్యాత్మిక ఆనందం పొందుతున్నాం అనుటకు ఏ విధమైన దృఢమైన నిర్ధారణ కలగకపోవటంతో మనకు ఉత్సాహం తగ్గుతుంది అదే గొప్ప ప్రమాదం మన మనస్సు ఎల్లప్పుడూ చంచలంగా వుండి, బాహ్యదిశగా మరలుతూ వుంటుంది ఆధ్యాత్మిక జీవితం ఉన్నత విలువలకే అంకితం కాబడి, సమర్పణ, త్యాగములకే బద్ధమైన ఏకాగ్రత గల జీవితం ఈ ప్రాపంచికపు సుఖాల యెడల అమితానందం పొందుతున్నట్లయితే, పరమగమ్యం

చేరే అవకాశమే వుండదు  కొద్దిసార్లు మనకు ఈ ప్రపంచం నుండి తగిలే దెబ్బలు, గాయాలు మన గమ్యాన్ని గుర్తుచేస్తాయి  అందువలననే, మనకీ ప్రాపంచిక విషయాల యెడల కొంత అసంతృప్తి వుండాలనీ, బాహ్య ప్రపంచంలోనిది ఏదైనా మనకు నిజమైన శాశ్వతానందాన్ని యివ్వలేదు అను అవగాహన కలగాలనీ, అపుడే యీ ప్రాపంచిక విషయాల యెడల బంధాలు తొలగి విరక్తి ఏర్పడుతుందని అన్నారు

ఈ సందర్భంగా మనకు రెండు మార్గాలున్నాయి అన్నారు  **మొదటిది** సుఖకరమైన ప్రియమైన మార్గము (ప్రేయోమార్గము)  దీనినే భోగమార్గము, ఇంద్రియ చాపల్య మార్గము అని కూడ అంటారు  **రెండవది** ధార్మిక మార్గము (శ్రేయోమార్గము)  దీనినే త్యాగమార్గము, ఇంద్రియ సంయమమార్గము అని కూడ అంటారు  ముండకోపనిషత్తులో జీవాత్మ, పరమాత్మలను శరీరం అనే వృక్షంపైన కూర్చొని వున్న ఒకే రకమైన రెండు పక్షులుగా పోల్చారు  వీటినే ఆత్మగా భ్రమింపబడిన శరీరం (నీచాత్మ), నిజమైన ఆత్మ (ఉన్నతమైన ఆత్మ) అని కూడ అంటారు  ఆత్మగా భ్రమింపబడిన శరీరంపై విజయం సాధిస్తే తప్ప ఉన్నతమైన ఆత్మ సాక్షాత్కారం కాదు

భ్రాంతికి మూలమైన 'మాయ'కు వున్నవి శక్తులు రెండు  (1) ఆవరణ, (2) విక్షేపము)  ఇవి నిద్ర, మరుపు వంటివి  'నిద్ర' ఒక తెర వంటిది  నిద్రలో మనోప్రభావం, కల్పనలు లేని కారణంగా కేవల బ్రహ్మానంద స్థితికి దగ్గరౌతాము అని వేదాంతశాస్త్రము చెప్తుంది  గాఢనిద్రలో ఆనందం అందరికీ సమంగా ఉంటుంది  నిద్ర లేవగానే తిరిగి మనం భ్రాంతిలో పడుతున్నాం  అనగా దివ్యాత్మ యొక్క స్పృహ మనకు లేకుండా చేస్తుంది అని అర్థం  ఇక మరుపు ఇది మన నిజతత్వాన్ని మరిపింపజేసేదే  భ్రాంతి వంటిది  నిజతత్వమే దివ్యతత్వము

వీటికి సమాంతరమైనవే 'ఆవరణ' - 'విక్షేపము'  ఆవరణ అనగా ఒక

తెరవలె ఆవరించి యుండుట నిజతత్వమును మరుగుపరచుట లేక దాచి యుంచుట ఇది నిద్ర వంటిది 'విక్షేపము' అనగా నిజంగా ఉన్న దానిని మరొక విధంగా వక్రీకరించి మన మనసుకు తెల్పుట మనం ఏది కామో అదే మనం అని నమ్మేటట్లు చేయుట అనగా సత్యమును మరిపింపజేయుట వంటిది

ఈ ఆవరణ, విక్షేపాలు భ్రాంతిని కల్గించే అవిద్య లేక అజ్ఞానం యొక్క పనులు ఈ మాయ వలన ప్రభావితులై అజ్ఞానులు అద్వితీయ పరబ్రహ్మకు బదులు ఈ లోకంలోని బహు వస్తువులను నిజమైనవిగా భావిస్తారు కాని, మనము దివ్యాత్మ స్వరూపులము అదే నిజమైన సత్యం పరిమితమైన జీవులవలె ప్రవర్తిస్తాము కాని నిజానికి మనము బ్రహ్మస్వరూపులమే

మాయాశక్తి యొక్క బాహ్య ప్రకటన వలన కలిగే ఈ విక్షేపము వలననే మనలోని నిజతత్వాన్ని మనం గ్రహించలేకున్నాము మాయ యొక్క ఈ రెండు శక్తులైన ఆవరణ, విక్షేపములను అతిక్రమించటం ఎలా? వీటి నుండి బయటపడే మార్గం వుందా? ఉన్నది దానికి మనం సత్యం గ్రహించాలి

ధనికులైనా, పేదలైనా ఒకేరకంగా ఎదురు చూసే తప్పనిసరిగా ప్రతివారికీ ఎదురయ్యే ఆ చివరి క్షణమైన మరణాన్ని మనం తప్పనిసరిగా గుర్తుంచుకోవాలి "నగ్నంగా, ఒంటరిగా మాతృగర్భం నుంచి వచ్చిన మనం, మరల నగ్నంగా, ఒంటరిగానే, యీ ప్రపంచాన్ని వదలి వెళ్లెదము మనతో ఎవరినీ, దేనినీ తీసుకుని వెళ్లలేము ఇది కఠోర సత్యము" అందుకనే సత్యము, అసత్యముల మధ్య విచక్షణ చేయగలగాలి భగవంతుడు ఒక్కడే సత్యము, శాశ్వతము మిగిలినదంతయు అసత్యము, అశాశ్వతము

"ఓ కలగనే మానవా! మరల నిద్రించకుము లెమ్ము మెల్కొనుము! లక్ష్యము సాధించువరకు ఆగకుము!" అన్నారు స్వామి వివేకానంద దివ్యతత్వాన్ని గ్రహించిన పిదప, మరణం ఆసన్నమైనా, ఈ శరీరం, మనస్సు, ఇంద్రియములు

మనం కాదనీ, సర్వస్వతంత్రమైన ఆత్మ స్వరూపులమేనన్న నిశ్చయం కలుగుతుంది

పరమగమ్యమును సాధించుట గురించి - మన మనస్సును పూర్తిగా భగవంతునికే అర్పించాలి మనకొక సందేహం కలుగవచ్చు "నా మనస్సును పూర్తిగా భగవదర్పణ గావిస్తే, నా కుటుంబ సభ్యులతో బంధుత్వం కలిగి వుండటం, నేను చేయవలసిన పనిచేయటం, ఇతర వ్యక్తులతో సంబంధ బాంధవ్యము కలిగియుండటం, నా వృత్తిధర్మం, బాధ్యతలు నిర్వహించటం ఎలా సాధ్యపడతాయి?" అని

అంటే, సాధ్యపడతాయి అన్నారు మనస్సును భగవన్ముఖం గావించి సంబంధ బాంధవ్యములన్నిటినీ ఆధ్యాత్మికపరంగా మార్చాలి ప్రతి వ్యక్తి హృదయమందు భగవంతుడున్నాడని విశ్వసించాలి స్వామి వివేకానంద తెలిపిన విధమున మానవ లక్ష్యమైన దివ్యత్వమును మనలో వ్యక్తపరచగలగాలి

మతాతీత విధానమునకు, మతపరమైన విధానమునకు భేదమే లేదు ప్రతి ఒక్క పని గూడా ఒక పూజయే ఈ సమాజములో ఎవరైనాసరే వందలాది కార్యక్రమములు నిర్వహించవలసినదే! కానీ ప్రతి ఒక్కరూ తమదైనందిన జీవితంలో తారసపడే వ్యక్తులందరితో గల తమ బంధాన్ని ఆధ్యాత్మికపరంగా మార్చుకుని జీవితంలో ప్రతిక్షణాన్నీ ఆ విధంగా ఆధ్యాత్మీకరణ చేసుకోవాలి

ఆధ్యాత్మిక సాధకుని జీవితం నిరంతర ధ్యానమయము ,ప్రతి ఒక్క పని దేవుని అర్చనయే ఈ విధమైన దృక్పధం అలవరచుకుంటేనే యితరులతో మనకు గల సంబంధ బాంధవ్యములను ఆధ్యాత్మీకరణ చేయుట సాధ్య పడుతుంది మనసును పూర్తిగా భగవంతునికి అర్పించి లౌకికకృత్యములు, ఆధ్యాత్మిక కార్యక్రమములు అభేదమన్న స్ఫురణతో పనిచేయగలిగినపుడే అది సాధ్యపడుతుంది

బాధ్యతలు నిర్వర్తిస్తూ ఉన్న మానసికస్థితి నుండి ఒక్కసారిగా మనో పరిధులకు అతీతమైన మానసిక చైతన్యం (supramental consciousness) పొందటం సాధ్యపడదు దివ్యచైతన్యం (super mind) పొందటానికి మధ్య స్థితి (middle stage) అయిన అంతర్బుద్ధి (అంతర్జ్ఞానం) ద్వారా ముందుకు సాగాలి అంతర్బుద్ధి (అంతర్జ్ఞానం) (intuition) అనేది అధోస్థితి (క్రింద స్థాయి) (lower nature) లో బలంగా ఉండే దివ్యచైతన్యం మానవునిలో సహజస్థాయిలో అంతర్బుద్ధి (intuition) గా దివ్యచైతన్యం ఉంటుంది పరిణామంలో మానవునికి దిగువ స్థాయికి చెందిన పశువులలో (జంతువులలో) ఇది అంతఃప్రవృత్తి (instinct) గా ఉంటుంది మానవుడు గూడా నిత్యజీవ కార్యక్రమాలలో ఈ అంతః ప్రవృత్తి చేతనే (instinct) నడపబడతాడు

కాని మానవునికి కొన్ని ధర్మాలు (విధులు) ఉన్నాయి గదా! అవి నెరవేర్చటానికి అంతఃప్రవృత్తి స్థాయి దాటి ఉన్నతమై హేతుబద్ధమైన (Reason) ఆలోచన పెంపొందించుకొనవలసి వస్తుంది అంతఃప్రవృత్తులను (instincts) నియంత్రించుకొనవలసి ఉంటుంది హేతుబద్ధమైన ఆలోచనల వలన కలుగు అంతర్జ్యోతి (inner light) ద్వారా సత్యము (సత్) వైపుకు మార్గం గ్రహించి ముందుకు సాగాలి అపుడే మాయాప్రకృతి బంధము నుండి స్వేచ్ఛ లభిస్తుంది అయినను హేతుపద్ధతి మీదనే చివరిదాకా ఆధారపడటానికి కుదరదు 'ఆత్మ' అనేది హేతువుకు అతీతమైంది కాబట్టి హేతుబద్ధమైన బుద్ధితో (rational intelligence) పాటు మానవునిలో మరికొన్ని శక్తులు (faculties) ఉన్నాయి అవి పరిపూర్ణ వ్యక్తీకరణ కొరకు ప్రోద్బలం చేస్తాయి ఈ మార్గంలో హేతువు (Reason) అంతగా ఉపయోగపడకపోవచ్చు కాబట్టి మనోతీతమైన జ్ఞానము కొరకు (Supramental knowledge) అంతర్బుద్ధి (intuition) మీద ఆధారపడటమే దివ్యచైతన్యం పొందటానికి ప్రథమ సోపానం అని గ్రహించవలయును

అసలు ఈ అంతర్బుద్ధి (సహజ జ్ఞానం) (intuition) అంటే ఏమిటి? ఎటువంటి తర్కమునకు గాని, విశ్లేషణకు గాని (analysis) అందనిది, తళుక్కున మెరుపు వలె మనసుకు తోచేది, (sudden flash) అంతర్బుద్ధి లేక సహజజ్ఞానం లేక స్ఫూర్తి అని గూడ అనవచ్చును వృత్తిలో గూడ అది ఏదైనా, అత్యున్నత అర్హతలు, నేర్పు ఉన్నా కూడ, అంతర్బుద్ధి (సహజ జ్ఞానం) లేకపోతే అవి శోభించవు అంతర్బుద్ధి ఒక ఉత్ప్రేరకము (catalyst) వంటిది బుద్ధికి మెరుపులాగ వెలుగునిస్తుంది అంతర్బుద్ధి గమ్యం తెలుసుకోటానికి, ఆశించేది (aiming) ఏదో గ్రహించటానికి అంతర్బుద్ధి అవసరం అంతర్బుద్ధిని గురించి శ్రీ అరవిందులు ఇలా అన్నారు "స్వాభావిక లక్షణముతో కూడిన చర్య (కదలిక) అజ్ఞానముతో కూడిన మనసులోనికి ప్రతిరూపముగా చొచ్చుకొని వచ్చుటను అంతర్బుద్ధి అనవచ్చును ఒక ఉన్నత శక్తి ఏదో మన మనసులో ప్రవేశించి దాని చర్యలలో కల్పించుకొనుటనే అంతర్బుద్ధి అన్నారు దాని చర్య లేక ఫలితమే బుద్ధి కౌశలముగా రూపొందుతుంది (genius) అది అకస్మాత్తుగ మెరుపువలె మనస్ఫూర్తి లేక చైతన్యము (consciousness) లోనికి చొచ్చుకొని వచ్చి మరుగున ఉన్న సత్యమును వెలుగులో గోచరింపచేస్తుంది ఈ అంతర్బుద్ధి ద్వారా మనకు చేరు వర్తమానములను మనము గ్రహించగలిగినపుడు, మన మనస్సు పరిపూర్ణముగా అంతర్బుద్ధి (సహజజ్ఞానము)ని పొందుతుంది ఇదే సంభవించినపుడు హేతువును (Reason) మన మనస్సు పూర్తిగా విస్మరించవచ్చు లేక అదే హేతువు ఆధారంగా అంతర్బుద్ధి ద్వారా అందిన విషయములను వివరించు లేక విశ్లేషించుకొనవచ్చును కాబట్టి మానవుడు దివ్యచైతన్యం (Super Mind) పొందుటకు ముందు అంతర్బుద్ధిని (intuitive Mind) పొంది అందు స్థిరపడవలసియున్నది అంతర్బుద్ధి దివ్యచైతన్యం కాదు గదా! అందువలన దానికి గూడా కొన్ని పరిమితులు (limitations) ఉన్నాయి అయినా అది దివ్యచైతన్యము యొక్క ఒక అంచు మన మనస్సులోనికి ప్రవేశపెట్టగలుగుతుంది కాబట్టి మనము మనస్సు స్థాయి నుండి ఎదిగి

అంతర్బుద్ధిని గ్రహించి, దివ్యచైతన్యము వరకు ఎదగటానికి ఆ అంతర్బుద్ధిని సోపానముగా గ్రహించాలి "

మన సాధారణ బుద్ధి, హేతుజ్ఞానము మాత్రమే జీవితమును గురించి, ప్రపంచమును గురించి పరిపూర్ణ వివేకము ఈయజాలవని తెలియుచున్నది గదా! అసంపూర్ణమైన ప్రత్యక్ష వివరణ (partial graphic account) మాత్రమే అవి ఈయగలవు

అంతర్బుద్ధి స్థిరమైన, నిశ్చలమైన వెలుగువలె గాక అపుడపుడు వెలిగే మెరుపులాగా తళుక్కుమంటూ వుంటుంది ఈ మెరుపులు నిత్యసత్యమును గురించి అనుగుణ్యమైన (coherent and cohesive vision) దృష్టిని ఈయజాలవు ఆ సత్యమును మన మనస్సు (will) (బుద్ధి), భావము, కర్మము ద్వారా ఏ మాత్రము గ్రహించలేము, ప్రకటించలేము అందువలన అంతర్బుద్ధి మెరుపువలె గాక నిశ్చలంగా నియతమైన (regular) జ్యోతి వలె వెలుగునట్లు సాధన చేయవలయును సాధన ద్వారా మన సాధారణ, సామాన్యమైన మనస్సు స్థానంలో శరీరమంతా అతిసన్నిహితంగా వ్యాపించి ఉండునట్లు అంతర్బుద్ధిని శక్తివంతం చేసుకోవాలి అంతర్బుద్ధిని (intuition) శక్తివంతం చేయటానికి రెండు మార్గాలున్నాయి

**అందు మొదటిది** మన సామాన్యబుద్ధిని (common intellect) ధ్యానము ద్వారా నియంత్రించ (to silence) వలెను ధ్యానంతోపాటు ఆలోచన (చింతన) కూడ సామాన్యబుద్ధిని నియంత్రించగలుగుతుంది అపుడు అంతర్బుద్ధి (intuition) మనలో ప్రవేశించినపుడు దానికి ఏ విధమైన అంతరాయములుండవు

**ఇక రెండవది** మన సామాన్య లేక నిమ్న మనస్సును (lower mind) అంతర్బుద్ధి ద్వారా ఉన్నత స్థాయికి పరిణామం చెందించుట

కాని ఈ రెండు మార్గాలను సంయుక్తం చేసి సాధన చేసినచో ఫలితం చాల తొందరగా వస్తుంది మనస్సును నియంత్రించి నిశ్చలం చేయటం ద్వారా అంతర్బుద్ధి (intuition) పరిధిని పెంచి సత్యమును గ్రహించుట సుగమం అవుతుందని చాలమంది అభిప్రాయపడుతున్నారు అనేక యోగాపద్ధతులు కూడ యిదే విధంగా మనస్సును నిశ్చలం చేసి పరిపూర్ణ ప్రశాంతత పొందినపుడు మన మనస్సు (will), ఆలోచన (thought) భావన (feeling) లను ఆంతరిక ప్రశాంతత (inner silence) దిశగా దివ్యశక్తి నడిపిస్తుందని చెప్తున్నాయి

అయినను ఈ సాధన (discipline) మీదనే పూర్తిగా ఆధారపడుటకు వీలుపడదు ఆంతరిక ప్రశాంతత ద్వారా ఎంత మనోతీత (supramental) స్థాయికి చేరగలిగినను, మనలోని నిమ్నస్థాయి ప్రకృతి (old power of lower nature) పూర్తిగా తొలగింపబడినది అని ప్రకటించుటకు సాధ్యపడదు మనము తిరిగి మామూలు స్మృతిలోకి (normal consciousness) రాగానే ఇంద్రియ ప్రాబల్యం మరల ఉధృతమౌతుంది అందువలన నిమ్నస్థాయి మానసిక స్థితి (inferior mentality) తొలగనంత వరకు లేక ఉన్నతస్థాయికి పరిణామము చెందనంత వరకు ఆంతర్బుద్ధి క్షేమంగా, స్థిరంగా, నిశ్చలంగా ఉండదు కేవలం మనస్సును నియంత్రించి నిశ్చలం చేసినంత మాత్రాన సాధారణ బుద్ధి (common intellect) అంతర్బుద్ధి (intuition)గా పరిణామం చెందటం జరగదు

మరి సాధారణ మనస్సు అంతర్బుద్ధిగా పరిణామం చెందటం ఎలా? మరొక మార్గం ఏదైనా గ్రహించవలసి ఉంటుంది భక్తిమార్గం అట్టి మరొక మార్గం కావచ్చు

మన హృదయ కమలంలో లేక హృదయకుహరంలో స్థిరుడైన ఈశ్వరునితో సాన్నిహిత్యం ఏర్పరచుకొనుటకు సంసిద్ధత వ్యక్తం చేసేదే భక్తిమార్గము ఈశ్వరునితో సాన్నిహిత్య సంబంధము ఏర్పరచుకొని, ఆయన ఆజ్ఞలను గ్రహించి శిరసావహించుటయే భక్తిమార్గముగా చెప్పబడినది కాని

ఇది సంప్రదాయముగా చెప్పబడే భక్తిమార్గము కాదు సంప్రదాయానుసారముగా భక్తుడు అనుభూతి పొందటం కంటే కర్మకాండలకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నాడు

భక్తిమార్గమును సవ్యముగా అనుసరించినచో మన ప్రకృతి (స్వభావము) పరిపూర్ణముగా అంతర్బుద్ధి పరం అవుతుంది ఈశ్వరుడే అంతర్బుద్ధి యొక్క ఆశయము (repository) భక్తుడు తన భావాలను, సంకల్పాలను, ప్రేరణ సరాసరి ఈశ్వరుని నుండే పొందుతాడు క్రమంగా మన శరీరంలోని ప్రతి భాగం అంతర్బుద్ధి శక్తికి లోనౌతుంది ఫలితంగా మన చర్యలన్నీ అంతర్బుద్ధి స్వభావమును పొందుతాయి

వాస్తవానికి మన కర్మములన్నియు ఈశ్వరుని చేతనే ప్రేరణ (initiation) పొందుతాయి నిజమైన భక్తుడు తన స్వీయప్రేరణలన్నియు వదులుకుంటాడు అతడు సర్వారంభ పరిత్యాగి అవుతాడు ఆ స్థాయికి మనము ఎదగగలిగినపుడు మన కర్మములు ఏ మాత్రము అజ్ఞానముతో కూడిన బాహ్య భావములకు లోనుకావు అవి సర్వదా దివ్యశక్తి ప్రేరణనే పొందుతాయి

అయినా ఈ మార్గము కూడ ఆశించిన ఫలితమును కలిగించ లేకపోవచ్చు మనస్సు (హృదయం) మనలోని సర్వాతీత కేంద్రం (highest centre of our being) కాకపోవటమే అందుకు కారణము మానవాతీత శక్తి అయిన పరమాత్మ చైతన్యము యొక్క ప్రభావమును సూటిగా లేక సరిగా పొంద లేకపోవటం కూడ అందుకు కారణం కావచ్చు

మన హృదయకేంద్రము (heart centre) (మనసు) మిక్కిలి శక్తివంతమైనది, ఉద్రేకపూరితమైనది అయినా మన చర్యలను పూర్తిగా మరలించవలసినది అది మాత్రమే అనుటకు వీలుపడదు అది సంకుచితమైనది (narrow), పరిమితమైనదిగా మాత్రమే తెలియుచున్నది నిమ్నస్థాయి (lower level) ఉద్రేకములతో మిళితమై ఒక విధమైన వింత ప్రకృతి (స్వభావము)

(character) ని సంతరించుకుని అస్వాభావికముగా, విపరీత ధోరణిని (abnormal) కనబరుస్తుంది

మనకు వలసినది ఏకస్వనముగా అనగా అవిరుద్ధముగా క్రమపరచ బడిన పరిపక్వత లేక దోషరహిత సంపూర్ణత (harmonised perfection) హృదయకేంద్రము (మనసు) మరియు అన్ని స్థాయిలు (planes) అందు క్రమపరచబడాలి అందువలన మన శరీరందలి ఇతర భాగములను వదలి హృదయమునకే (మనస్సుకే) అపరిమిత ప్రాధాన్యము ఇచ్చుట ద్వారా మన జీవిత పరిణామము (transformation of our life) సాధించవచ్చునని తలచినచో అది నిరాశగానే మిగులుతుంది

మన హృదయ లేక మానసిక పరిమితి లేక పరిధిని దాటిన గాని ఉన్నత స్థాయికి చెందిన అంతర్బుద్ధిని (intuition) సాధించుటకు వీలుపడదు

మనో నిశ్చలత (మనస్సును మౌనముగా చేయుట) (silence of mind) లేక సంపూర్ణ భక్తి కాని మనకు వలసిన అంతర్బుద్ధి ప్రభావిత విజ్ఞానం (intuitive knowledge) ఇస్తుందని నిశ్చయంగా చెప్పుటకు సాధ్యము కాదు మనకు వలసినది తాత్కాలికమైన కీర్తి కాని, విపరీత మానవాతీత అనుభవాలు కాదు గదా! మనస్సుకు అతీతమైన (supramental) ఆధ్యాత్మిక (spiritual) కర్మమే (చర్య) (actions) స్వాభావికం (normal) చేయాలి అదే మన ధ్యేయం అదే మన జీవిత (our Being) నిర్దిష్ట సరళి, (Process (or) Way of Life) ప్రకృతి (స్వభావం) కావాలి ఇది సాధించాలంటే మన జీవితంలో ప్రాతిపదికమైన మార్పు (radical change), దానికి ఒక విపులమైన పద్ధతి (comprehensive method) కావాలి

బాహ్యప్రపంచము నుండి విడివడి అంతర్ముఖులం కాగలిగినపుడే మనోనిశ్చలత (silence of Mind) అంతర్బుద్ధి ప్రభావితమగు విజ్ఞానమును

ఇవ్వకలుగుతుంది తిరిగి మనసు బాహ్య ప్రపంచమువైపుకు తిరగగానే అంతర్బుద్ధి సన్నగిలటమో, అంతరించటమో జరుగుతుంది అంతర్బుద్ధిని (intuition) కలిగించటానికి భక్తి శక్తివంతమైన మార్గమే కాని అది మన హృదయానికి (మనసు), చిత్తవృత్తికి (feelings) మనోవికారాలకు (చిత్త భ్రమ) (emotions) పరిమితమై ఉంటుంది మనకు వలసినది అంతర్బుద్ధి ప్రభావిత విపుల (comprehensive) విజ్ఞానం కావున మరియొక శక్తివంతమైన పద్ధతి కావాలి

ప్రతిమనిషిలోను అతిశక్తివంతమైన మనోకేంద్రం ఉంటుంది దానినే తాంత్రికవిద్యలో (తాంత్రిక పరిభాషలో) వేయి రెక్కలు గల పద్మము అనగా సహస్రారము అన్నారు కొంతమంది దానినే పొరపాటుగా మెదడుగా పరిగణిస్తారు అది శిరస్సుపై భాగమున ఉన్నమాట వాస్తవమే కాని అది మెదడు (brain) కాదు అది నీలివర్ణముతో బంగారు ఛాయలచే ఆవరించబడి ఉంటుంది అన్నారు అది ఊర్ధ్వముఖంగా ఊర్ధ్వమనసు (పరమాత్మ), అంతర్బుద్ధి వైపుగా తెరుచుకుంటుంది దీనినే శూన్యకేంద్రం (void centre) అని కూడ అంటారు

మనోపరిధులకు అతీతమైన స్థాయిలలో మన బుద్ధిని (మనసును) కేంద్రీకరించవచ్చు ఈ పద్ధతి యందు మన కర్మలకు (చర్యలకు), భావాలకు సంబంధముండదు మన హృదయపద్మమందలి జీవాత్మకు సంబంధముండదు తెరమరుగున మన భావాతీత స్థాయిలోనున్న పరమాత్మతో అనుభూతి కలుగుతుంది అని అరవిందులు వివరించారు ఇది సాధించిననాడు మనలో అంతర్బుద్ధి (intuition) ఊర్ధ్వమనసు (Over Mind) (Divine) నుండి అవతరిస్తుంది అట్టి అంతర్బుద్ధి ఆధ్యాత్మికంగానే కాక భౌతికంగా కూడ స్పృహను (conscious) కలిగి ఉంటుంది

క్రమంగా మన ఆలోచనలు (భావాలు), చర్యలు (కర్మలు) మన శిరోభాగానికి (మెదడు) అతీతమైన స్థితికి ఎదుగుతాయి అవి మన స్థూల

{రీరంలో కాక మన సూక్ష్మశరీరంలో (subtle body) జరుగుతున్నట్లు అనుభూతి {లుగుతుంది అపుడు మనము మన మెదడు లేక మనసు ద్వారా ఆలోచించటం జరగదు

మన ఆలోచనలు అన్నీ సూక్ష్మశరీరం (subtle body) లోనే రూపొందటం మొదలిడుతాయి మనము ఈ స్థితికి చేరగలిగినపుడు మానసికంగా భౌతికమైన పరిధుల నుండి (physical limitations) మనకు విముక్తి కలుగుతుంది అపుడు సహజ లేక ప్రకృతి పరిధులకు అతీతమైన కేంద్రములతో (supra natural centres) సంసర్గము (సంబంధము) (communication) సరళతరం అవుతుంది

అయినను ఈ స్థితిలో ఎచటనైతే మన ఆలోచనలు రూపొందుతాయి అని చెప్పుకున్నామో ఆ సూక్ష్మ శరీరం కూడ (subtle body) మనస్సుకు పూర్తిగా అతీతమైన స్థాయి కాదు (supramental) అందువలన అది మనస్సుకు అతీతమైన చర్యలను (supramental actions) మాత్రమే కాక ఇతర నిమ్న (lower) చర్యలకు కూడ అవకాశం కల్గిస్తుంది కాని మన పరిశీలనాశక్తి (power of discrimination) అత్యంతంగా వృద్ధి చెంది మనలోని నిమ్న (lower) ఉన్నత (higher) చర్యల మధ్యగల తారతమ్యమును గ్రహించుటకు వీలు కల్గించును అయినను ఇది పరిపూర్ణమైన అంతర్బుద్ధి స్థాయి అని చెప్పుటకు వీలులేదు మన మేధస్సు (బుద్ధి) (intellect) మిశ్రమమై మనస్సుపై భౌతికమైన పూతలు ఇంకను ఏర్పడుతూనే ఉంటాయి అందుచే అంతర్బుద్ధి శక్తి సన్నగిల్లుతుంది

ఊర్ధ్వ (ఉన్నత) మనస్సు (higher mind or over mind) నుండి దిగి వచ్చిన అంతర్బుద్ధిని పరిపూర్ణంగా, పరిశుద్ధంగా పొందాలంటే మనము మన స్పృహను ఉపరితలముల వైపు (higher planes) తెరచి దానిని దానివలన మన చర్యలను సరిదిద్దుకొనవలసి యున్నది

పైన చెప్పబడిన మూడు పద్ధతులు అనగా - మనో నిశ్చలత (silencing

the mind), పరిపూర్ణమైన భక్తి, అత్యుత్తమ మనోకేంద్రము (highest mind centre) దిశగా మనస్సును కేంద్రీకరించటం - వాటివాటి ప్రత్యేక ఔన్నత్యము, దాని వెనువెంటనే పరిమితులు కూడ కలిగి ఉన్నాయి వీటి పరిశీలనానంతరం అరవిందులు నాల్గవ పద్ధతిని సూచించారు మన తెలివి లేక బుద్ధిని (intellect) తొలగించుట కంటే దానిని వృద్ధి చెందనీయటం మంచిదని అరవిందులు అభిప్రాయపడ్డారు తాపసులు, యోగసాధకులు చాల మంది బుద్ధిని గురించి అపభ్రమలో ఉన్నారని ఆయన అన్నారు బుద్ధి తనదైన ఒక మార్గము స్థిరపరచుకొని, మనలను ఆ మార్గములోనే బంధించి, మన ఆధ్యాత్మిక ప్రగతికి అది ఒక ఆటంకముగా తయారుకాగలదని తాపసులు, యోగసాధకులు చాలమంది అభిప్రాయపడుతున్నారు వీరి భయము అకారణమైనదని అనుటకు కూడ వీలుపడదు ఎందుకనగా తెలివిమంతులు (intellectuals) కొందరు తమ పద్ధతులతో తృప్తిపడి వాటిని అధిగమించు ఇచ్ఛయే లేకుండ ఉంటారు

ఈ పరిధులలో ఇమిడిపోయి స్థిరపడకుండా, ఆలోచనాపరుడు బుద్ధికుశలతను, పరిమితులను వ్యాపింపజేయటానికై మార్గము కొరకు అన్వేషిస్తాడు అపుడు అతడు క్రమంగా బుద్ధికే అతీతుడౌతాడు ఇది సాధించకలిగిననాడు అతడు బుద్ధి పరిమిత మార్గము అధిగమించగలుగుతాడు మన శారీరక శక్తులన్నిటిలోను అత్యంతశక్తివంతమైనది బుద్ధి శరీరంలోని అన్ని ఇతర శక్తులకు అది నాయకత్వం వహిస్తుంది బుద్ధి తనను తాను పరిణామ దిశలో మలచుకోగలిగితే అది శరీరంలోని ఇతర శక్తులలో కూడ ప్రగతిని ప్రోత్సహిస్తుంది ఈ పరిణామ సాధననే బుద్ధియోగమనవచ్చును ఈ యోగసాధన బుద్ధి లోపములను, విపరీత లక్షణములను తొలగింపునకు వత్తిడి చేస్తుంది అది సిద్ధించిననాడు బుద్ధి దివ్య చైతన్యముతో సాన్నిహిత్యం సాధించకలుగుతుంది ఆ సాన్నిహిత్యమును శరీరంలోని ఇతర భాగములకు ప్రసారం చేయకలుగుతుంది కూడ

కాని ఇక్కడ కూడ కొన్ని బాధకములున్నట్లు అరవిందులు అన్నారు మనం మన బుద్ధిని ఎంత పరిశుద్ధం, లోపరహితంగా చేయకలిగినా దానిలో అంతర్లీనంగా ఉండు కొన్ని దోషములను పూర్తిగా తొలగించుటకు సాధ్యపడదు అంటారు అరవిందులు మనస్సుకు అతీతమైన శక్తి (supramental) ప్రసరిస్తే తప్ప మన బుద్ధిలోని లోపములను, వక్రగతులను పూర్తిగా తొలగించటం సాధ్యపడదు

అయినా ఒక్క విషయం మాత్రం సిద్ధాంతపరంగా చెప్పటం సాధ్యపడదు మనోతీత శక్తి ప్రసారం, బుద్ధి పరిణామములలో ఏది ముందు, ఏది వెనుక అని చెప్పటం దుర్లభం మనసుకు అతీతమైన శక్తితో సాన్నిహిత్యం ఏర్పడిన తరువాతనే బుద్ధి వికాసము కలుగవచ్చు లేదా వికాసం తరువాతనే సాన్నిహిత్యము ఏర్పడనూవచ్చు కాబట్టి బుద్ధి అనేది స్వయంప్రకాశం కాదు స్వయముగా అది పరిణామము పొందజాలదు అని తెలియుచున్నది దానికి మనోతీత దివ్యచైతన్య సాన్నిహిత్యము ఎంతో అవుసరమనేది ప్రస్ఫుటము

కావున అన్ని స్థాయిలలోను మనలో అంతర్బుద్ధి (intuition) వికాసమునకు పైన వివరింపబడిన నాలుగు పద్ధతుల సమ్మేళనమే సరైన మార్గముగా కన్పడుచున్నది అనగా (1) మనోనిశ్చలత (silence of mind) (2) భక్తి (3) ఊర్ధ్వస్థాయి నుండి అంతర్బుద్ధి అవతరణ (descent from above) (4) బుద్ధి ఆరోహణ (ప్రగతి) (development of intellect) ఇందులో ఏ ఒక్కటి విడిగా పరిపూర్ణ అంతర్బుద్ధి సిద్ధిని కల్పింపజాలవు (integral intuition) పరిపూర్ణమైన అంతర్బుద్ధి మాత్రమే మనలోని (శరీరములోని అనగా జీవులలోని) అన్ని భాగములను ప్రభావితం చేయగలదు

(1) మనోనిశ్చలత లేక మనో నిష్క్రియత్వం (silence of mind) మనలను బాహ్య ప్రపంచము నుండి వేరు చేసి, మన ఏకాంత క్షణములలో మాత్రమే అంతర్బుద్ధిని కలిగిస్తుంది

(2) భక్తి అంతర్బుద్ధిని శక్తివంతం చేస్తుంది కాని అది మన హృదయకేంద్ర సంకుచిత మార్గములోనే పరిమితమై ఉంటుంది (confined to a narrow groove of heart centre)

(3) అవతరించిన (descent) అంతర్బుద్ధి నిమ్నస్థాయి బుద్ధి సమ్మేళనము లేక మిశ్రమములు మనస్సుపై ఏర్పడు భౌతికపరమైన పూతల నుండి పూర్తి స్వేచ్ఛను పొందలేదు

(4) ఇక బుద్ధి స్వయముగా శక్తివంతము కావలెనన్న అది దాని పరిమితులను, వక్రగతులను అధిగమించగలగాలి

అందువలన ఈ నాలుగు పద్ధతులలో ఏ ఒక్కటి స్వయంగా పరిపూర్ణమైన అంతర్బుద్ధిని (integral intuition) ఈయజాలదు కావున ఈ నాలుగు పద్ధతుల సమ్మేళనమును అరవిందులు సూచించారు ఈ సమ్మేళనము కూడ ఏ స్థిరమైన యాంత్రిక పద్ధతిలో ఉండకూడదన్నారు (not in a fixed and mechanical order)

ఈ పద్ధతుల సమ్మేళనము ప్రధానంగా వ్యక్తి యొక్క స్వభావం (nature) అవసరం (need) శక్తి (capacity) మీద అధారపడి ఉంటుంది ఉదాహరణకు, - ఒక వ్యక్తి మనోనిశ్చలత (silence of mind) తో ప్రారంభించాడు అనుకుందాం అది అతనిలోని అంతర్బుద్ధి రూపమును వికసింపజేస్తుంది అపుడు అతని మనస్సు అతని ఆలోచనలు, భావాలు, సంకల్పం (చిత్తం), చర్యలను అతనిలోని అనగా అతని హృదయకమలంలోని పరమాత్మకు అర్పించును

అటుపై అతడు మానసికంగా శిఖరాగ్రం చేరుకుని, మనస్సుకు అతీతమైన స్థాయి నుండి (supramental level) దివ్యచైతన్య ప్రసారం పొందగలుగుతాడు దివ్యచైతన్యం అతనిలో అవతరించి (Divine Power) అతనిలోని అధోస్థాయి

స్వభావము (lower nature) ను పరివర్తనకు లోనగునట్లు చేస్తుంది ఆ ప్రభావము వలన అతని బుద్ధి పరివర్తన చెంది అతని చర్యలను వ్యాకోచింపజేస్తుంది అపుడు అతనిలోని తర్కబద్ధమైన శక్తులన్నీ సంపూర్ణంగా పరిణామం చెంది, అంతర్బుద్ధి అతని శరీరమంతటా వ్యాపిస్తుంది

కాని పై ఉదాహరణలో చెప్పిన క్రమంలో మాత్రమే పద్ధతులను వినియోగించాలని లేదు

కొంతమందిలో దివ్యచైతన్యం ప్రారంభ దశలోనే అవతరించవచ్చు ఫలితంగా బుద్ధి వికాసం కలుగవచ్చు కావున ఈ నాలుగు పద్ధతులను మిశ్రితం చేసి ఎవరికి వారు తమకు అనుకూలమగు క్రమంలో అనుసరించి అంతర్బుద్ధి వికాసమును పొందవచ్చు

ఎంత సాధన చేసినను మానసిక స్థాయి నుండి మనోతీత స్థాయి ఒక్కసారిగ ఎదగటం అసంభవం అలా సంభవిస్తే మనస్సు దిగ్భ్రమ చెంది (stunned) (మ్రాన్పడిపోతుంది) స్పృహను కోల్పోతుంది అంతర్బుద్ధి (intuition) అనేది ఒక మధ్యస్థాయి అది మనస్సును దివ్యచైతన్యం (Mind to Super mind) వైపుకు పరిణామం చెందటానికి సిద్ధం చేస్తుంది

అందువలన సాధకుడు ముందుగా దివ్యచైతన్యము నుండి సాన్నిహిత్య సూచనలు పొందాలి ఆ సూచనలను తన మనసును ప్రభావితం చేసేటట్లు చేసుకోవాలి అంతర్బుద్ధి మెరుపులను (flashes of intuition) శ్రద్ధతో గుర్తించాలి అంతర్బుద్ధికి నాలుగు స్థాయిలు (grades) ఉన్నాయని అరవిందులు అన్నారు సాధకుడు వాటిని గుర్తించగలగాలి అపుడే వాటి ద్వారా మనోతీత దివ్యచైతన్యము వైపుకు ఆరోహించగలుగుతాడు

ఆ నాలుగు స్థాయిలు (1) అంతర్బుద్ధి సూచనలు మెరుపుల వలె అందుతాయి ఈ మెరుపులు సత్యమును గురించిన భావాలను ప్రకాశింపజేసే

స్వభావమును కలిగి ఉంటాయి వాటిని యధాతథంగా సాధకుడు గుర్తించలేకపోవచ్చు కాని ఏవో సత్యమును గురించిన జ్ఞాపకాలు స్పృహలోకి వచ్చినట్లు అవి ఉంటాయి మేఘములతో నిండి చీకటిమయముగా నున్న ఆకాశములో కనబడు అసంఖ్యాకములగు మెరుపు వెలుగులు వలె **ఈ సూచనలు** స్పృహలోకి వస్తాయి

(2) తరువాత స్థాయిలో **తారతమ్య భేదములను గుర్తించగల శక్తి** కలుగుతుంది అది సూచనలను వాటివాటి స్థానములలో క్షేమంగా ఉంచి వాటి పరస్పర సంబంధములు కాపాడుతుంది తారతమ్యములను గుర్తించు శక్తి, సూచనలు ఒకే సమయంలో కలసి పనిచేయాలి తారతమ్యములను గుర్తించలేనిచో సూచనలు క్రొత్త సత్యములను వెలుగులోకి తెస్తాయి కాని వెంటనే మానసిక భావాలు (mental ideas) వాటిని చుట్టుముట్టుతాయి సూచనలు లేకుండ తారతమ్యములను గుర్తించటం జరిగితే, విమర్శనాదృష్టి ఏర్పడుతుంది కాని, క్రొత్త సత్యములు వెలుగులోకి రావు మానసికంగా దొరలు పారపాట్లు (errors) తొలగితేకాని మానసిక భావాలు నిష్ప్రయోజనం దీనికి తరతమ భేదములను గుర్తించగల శక్త అవసరం

(3) అటుపై సాధకుడు సత్యవాక్కు నుండి స్ఫూర్తి పొందుతాడు అతడు దివ్య (దైవ) ఆజ్ఞలను మానసికంగా పొందుతాడు

(4) చివరకు సత్యమర్మములు తెలుస్తాయి అవి ప్రత్యక్ష దృష్టులుగా గోచరమవుతాయి దీనినే దివ్యదర్శనము (revelation) అనవచ్చు

స్ఫూర్తి, దివ్యదర్శనము సంయోగంలో ఉండాలి దివ్యదర్శనము మాత్రమే పొందినచో అది వ్యక్తిగత ఆస్తిగా మిగిలిపోతుంది స్ఫూర్తి లేనిచో అది సంసర్గమునకు (communication) వీలుగా ఉండదు దివ్యదర్శనం (revelation) తానుగా మన శరీర ఇతర భాగాలకు ప్రసారం కాలేదు దానికి ఉచ్చారణకు వీలగు 'మాట' (word) కావాలి కావున సంసర్గము ద్వారా

ప్రసారశక్తికి (power of communication) స్ఫూర్తి (inspiration) తోడు కావాలి స్ఫూర్తి తానుగా ఏమి చేయలేదు అది మాటయందలి మర్మమును దర్శించలేదు ఆ శబ్దమందలి సత్యవాక్కులను సమన్వయపరచగల శక్తి స్ఫూర్తికి ఉండదు కావున స్ఫూర్తి, దివ్యదర్శనం రెండూ సంయోగంలో ఉండాలి మొదటి రెండు శక్తులు (1) సూచనలు (suggestions) (2) తారతమ్యములను గుర్తించు శక్తి (descrimination) కలసి నిమ్న (lower gnosis) మైన ఆధ్యాత్మిక మర్మములను తెలుపుతాయి చివరి రెండు శక్తులు (3) స్ఫూర్తి (4) దివ్యదర్శనం కలసి మహోన్నత (higher gnosis) మైన ఆధ్యాత్మిక మర్మములను తెలుపుతాయి ఈ నాలుగు కలిస్తే అంతర్బుద్ధి ద్వారా తెలిసే ఆధ్యాత్మిక మర్మాలు ఔతాయి (intuitive gnosis)

ఆంతరిక జీవనమునకు (inner life) అంతర్బుద్ధి (intuition) ఒక ప్రధానమార్గము అని గ్రహించాము కదా! ఇక ఆంతరిక జీవనానికి ఏర్పడుతున్న **అంతరాయాలు**, ఆంతరిక, లేక ఆధ్యాత్మిక జీవనానికి గల **దోహదకారులను** కూడ గ్రహించాలి

బాహ్య ప్రపంచపు ఆకర్షణ ఒక ప్రభంజనము వంటిది ఈ ప్రభంజనానికి మూలం ధనం ఇది ఎంత ప్రలోభమును కలుగజేస్తుందంటే, మనం అంతర్ముఖులం కాకుండ అనగా మన లోపలికి చూచి మనలను మనం గ్రహించకుండా ఇది నిరంతరం అడ్డుపడుతుంది మనమంతా ఆధ్యాత్మిక సాధనయందు నిజంగా విశ్వాసం గలవారమైతే విచక్షణ ద్వారా మన నిజతత్వాన్ని కొంతవరకైనా అవగాహన చేసుకోగలమని మనకు ఇప్పటికే కొంత అయినా తెలిసి ఉండాలి

ఆ విచక్షణ ద్వారానే పరమసత్యము మనకు అవగాహన అవుతుంది ఆ పరమసత్యమే "తత్వమసి" (నీవే అది) 'అహం బ్రహ్మాస్మి', ఆత్మ ఒక్కటే నిత్యము అని తెలుస్తుంది ఈ సత్యమును గ్రహించటంలో మనకు కలిగే

అంతరాయాలలో కొన్ని ముఖ్యమైనవి ఉన్నాయి అది మనస్సు - శరీరముల సమ్మిళితము - బాహ్యంగా కన్పించే శరీరము - మనస్సు యొక్క సమ్మిళితమునకు పూర్తిగా బద్ధులమై శరీరం లోపల ఉండే వాటిని మనం అసలు పట్టించుకోవటం లేదు ఈ సమ్మిళితం వలన ఏర్పడే ప్రలోభం నీటి మీద ఏర్పడు నాచు మొక్కల వంటిది ఈ నా ు ఆత్మజ్ఞానమును మరుగుపరచి మనస్సును వికాసం చెందకుండా కప్పివేస్తుంది ఈ పొర నుండి బయట పడాలంటే సాధకుని జీవితం అంతా ఒక అవిరామధ్యానమయంగా మారాలి అయినా మనం చాలాసార్లు విఫలం చెందుతుంటాము అందుకు కారణం ఈ శరీరమే మనము అని అనుకోవటమే ఈ ప్రాపంచిక బంధాలకు ఈ భావనయే మూలం

సాకారమైన ఇష్టదేవతా రూపములో నిరాకారమైన పరమాత్మను దర్శించుట సత్యము కాని అజ్ఞానం వలన నిరాకారమైన పరమాత్మను కుంచించి సాకారంగా ఊహిస్తున్నాము బాహ్య ప్రపంచపు ఆకర్షణల వలన ఈ భావన కలుగుచున్నది ఈ మనస్సు-శరీరము పరిధిని దాటినపుడే ఆత్మజ్ఞానం కలుగుతుంది ఇది కొంత కష్టమైన విషయమే శరీరానికి కలిగే కోరికలకు మనస్సే మూలం అందువలన ఆ మనస్సు పరిధి దాటినపుడే సత్యదర్శనం అవుతుంది

భక్తియోగసాధన మంచిదే కాని ప్రతి భక్తుడు తాను పాపి అని తలంచుట మాత్రం మంచిది కాదు 'ప్రతి మహాపురుషునికి 'ఒక గత జీవితం' ఉన్నది అలాగే ప్రతి పాపికి 'ఒక భవిష్య జీవితం' ఉంటుంది అనేవారు శ్రీరామకృష్ణ పరమహంస ఈ దృక్పథంతో ఆలోచనలు సాగిన యెడల 'పాపపు' వాసనలు తొలగుటకు అవకాశం మెరుగవుతుంది

ప్రాపంచిక ఆకర్షణలకు లోనగుటయే ఈ సృష్టి ప్రక్రియలోని ప్రధానాంశము అందుకే మన మనస్సు, బాహ్యముఖంగా పరుగెడుతుంది

'కఠోపనిషత్తు'లో చెప్పబడినట్లుగా

పరాంచిఖానివ్యతృణత్ స్వయం భూ
స్తస్మాత్ పరాజ్ పశ్యతి నాంతరాత్మన్ - (4-1)

"స్వయంభువు అయిన పరమాత్మ ఇంద్రియాలను, మనస్సును బాహ్యముగా తిరుగుట అనే దోషముతో సృష్టించబడునట్లు చేశాడు కనుకనే మానవుడు తనకు బాహ్యముగానున్న సర్వమును దర్శించగలడు కాని తనలోనున్న ఆత్మను దర్శించలేడు" ఇది సృష్టి లక్షణము, మనకు వచ్చిన జీవసంబంధమైన వారసత్వము ఇంతేకాదు పరమాత్మ జీవరూపమైన జీవాత్మ మనలో ఉన్నదనుట కూడ సత్యము ఇది ఉన్నతమైన దివ్యత్వముతో కూడిన వారసత్వము

జీవసంబంధమైన వారసత్వానికి సంబంధించిన దోషాలు, జ్ఞాపకాలు మనలను వెంటాడుతుంటాయి ఇవి మనకు జన్మతః వచ్చే సంస్కారాలే అయినా మనము ఇంకా మానవతను ఎంతో కొంతైనా కలిగి ఉన్నాము అంటే అది మనలోని దివ్యత్వ వారసత్వ ప్రభావముగానే గ్రహించాలి ఈ దివ్య వారసత్వ సత్యమును మనము గ్రహించగలిగిననాడు క్రమంగా జీవవారసత్వ ప్రభావం తగ్గుతుంది జంతువులలో ఉండేది అంతః ప్రవృత్తి (instinct) అని అందుకు భిన్నంగా పరిణామ దశలో (Evolution) ఎదిగిన మానవుని యందు అంతర్బుద్ధి (intuition) ఉంటుంది అని చెప్పబడింది గదా! ఈ అంతర్బుద్ధియే ఒక అంతర్వాణి (inner voice)

ఇదే మనకు ఏది మంచో, ఏది చెడో చెప్తుంది అది మనం గ్రహించ గలిగితే దివ్యత్వ వారసత్వమును గ్రహించగలుగుతాము ఇదే అంతరాత్మ ప్రబోధము అని కూడ అనవచ్చును ఈ ప్రబోధమునే పరమాత్మవాణిగా గ్రహించగలిగిననాడు మన ఆంతరిక జీవితం పవిత్రమవుతుంది ఈ అంతరాత్మ ప్రబోధము, లేక అంతరంగపు పిలుపును (inner call) వ్యతిరేకించనపుడు

మాత్రమే మనలోని దివ్యత్వాన్ని గ్రహించగలుగుతాము తన దివ్యత్వాన్ని ఎరిగినవాడే నిజమైన మానవుడు ఇందువలన మనము గ్రహించవలసిన సత్యము మానవుడు తనను తానే ఉద్ధరించుకొనవలయును ఇదే భగవద్గీతలో కూడ చెప్పబడింది (6-5)

శ్లో॥ ఉద్ధరేదాత్మనాత్మానం
నాత్మానమవసాదయేత్
ఆత్మైవహి ఆత్మనోబంధుః
ఆత్మైవరిపురాత్మనః

''ఆసక్తి లేని మనస్సు చేత సంసార సాగరమగ్నుడైన తనను తానే ఉద్ధరించుకొనవలయును తనకు తన మనస్సే బంధువు తన మనస్సే శత్రువు ''

అంటే ప్రతి మనిషి తనకు తానే శత్రువు, తానే మిత్రుడు తనను తానే ఉద్ధరించుకోగలడు, తననుతానే చెరుపుకోగలడు

విచక్షణా మార్గమును అవలంబించుటకు చాలమంది అర్హులు కాకపోవచ్చు అటువంటి వారు సులభముగా అవలంబించదగు భక్తిమార్గమును స్వీకరించవలెను ఈ మార్గములో ''ఇష్ట-నిష్ఠ'' అనగా ఇష్టదైవము యెడల సంపూర్ణమైన భక్తి సహకరించగలదు ఆ దైవమునే మనకు తోడునీడగా తలచిననాడు ఇటు భౌతికంగానూ అటు ఆధ్యాత్మికంగానూ స్థైర్యం కలుగుతుంది పరమాత్మ మనతోనే, మనలోనే కలడనునది నిత్యసత్యము పరమాత్మ మనతో, మనలో ఉన్న విధంగా భక్తుడు కూడా పరమాత్మలో, పరమాత్మతో ఉండుటయే సరైన దృక్పథము

ఈ సందర్భంగా స్వామి వివేకానంద చెప్పిన మాటలు గమనించదగినవి సాధనలో భావనలకు అనగా ఊహలకు చాలా ప్రాధాన్యం ఉన్నదన్నారు

ఆధ్యాత్మికంగా పరిపూర్ణ స్థితికి అతిసామీప్యంలో వున్నట్లుగా మనం భావించుకున్న యెడల (ఊహించుకున్న యెడల) ఆ పరిపూర్ణ స్థితికి దగ్గర అయే మార్గం సుగమం అవుతుంది ఈ భావనలు స్వయంసూచనలు మాత్రమే స్వయంసూచనల ద్వారా లక్ష్యమును వెంటనే సాధించలేకపోవచ్చు కాని క్రమంగా మనలో సమన్వయపరిస్థితి ఏర్పడి, ఆధ్యాత్మిక ప్రకాశం పెరుగుతుంది ఉత్సాహం, క్రియాశీలక శక్తి పెరుగుతాయి అపుడు లక్ష్యసాధన సుగమం అవుతుంది గదా! ఈ విధంగా భావఔన్నత్యం పొంది భావాతీత స్థితికి క్రమక్రమంగా ప్రత్యక్ష అనుభూతికి చేరువౌతాము నేటి భావనలే రేపటి సాక్షాత్కారానికి ఆధారం 'యద్భావం తద్భవతి' ఏ విధంగా భావిస్తే ఆ విధంగా అవుతాము అని హితోక్తి గదా!

ఇష్టదైవమును ధ్యానిస్తూ భావాలను పరమగమ్యం వైపు పయనించేటట్లు చేసుకోవాలి ఇష్టదైవమును ధ్యానించమంటే వారి భౌతిక శరీరమును మాత్రమే ధ్యానిస్తే సరిపోదు వారి తేజోవంతమైన దివ్యస్వరూపమును ధ్యానించాలి మనస్సును ఇష్టదైవపాదపద్మముల వద్ద స్థిరపర్చుకోవాలి జపధ్యానములు చేయునపుడు తరుచూ మన మనస్సు ధ్యానలక్ష్యము నుంచి తొలగి భిన్నరీతులలో చలిస్తూ ఉంటుంది అపుడు ఏం చేయాలి? మన ధ్యానలక్ష్యమైన ఇష్టదైవము యొక్క లీలా స్థలములయందు మనమున్నట్లు భావించినచో ఏకాగ్రతకు సహాయకారి అగును అరగంట సేపు ధ్యానంలో కూర్చుంటే కనీసం అయిదు నిమిషాలైనా మనసు ఏకాగ్రత చెందితే ఆ అయిదు నిమిషాలే ఎంతో విలువైనవి మన భాగ్యవశమున మనకు అంతర్దృష్టి ఏర్పడితే బాహ్యప్రపంచము మనలను చలింపచేయలేదు ఇదంతా చెప్పటం సులభమే కాని ఆచరించటం కష్టం అది కష్టమే గాని అసాధ్యం మాత్రం కాదని చెప్పవచ్చును కావున పరమగమ్యమును సాధించదలచినట్లయితే అంతరావలోకనము అభ్యసించాలి

మనమే బ్రహ్మము, సచ్చిదానంద స్వరూపము అనే బ్రహ్మచైతన్య భావనను నిరంతరం కలిగియుండుటకు తగిన కృషి చేయాలి ఆ చైతన్య భావనను ఎల్లపుడు కలిగి ఉండాలి ఆ దివ్యతత్త్వమును తెలుసుకుని ఆత్మస్థాయిలో ఉండలేక పోయినచో క్రిందిస్థాయి అయిన 'నేను'లోనే ఉండటం జరుగుతుంది సాంప్రదాయ సంబంధమైన మతావలంబనతోనే తృప్తిపడితే అది నిజమైన ఆధ్యాత్మికత కాదు మనస్సును ఆవరించి యుండు మాయ తప్పించకల్గినపుడే ఆధ్యాత్మికతకు అర్హత వస్తుంది ఈ అర్హతకు బంధరాహిత్యము ఒక్కటే చాలదు ఉన్నత లక్ష్యము కూడా కావాలి ఆ లక్ష్యమే దివ్యత్వ వ్యక్తీకరణ ఈ లక్ష్యాన్ని గురించే స్వామి వివేకానంద ఇలా అన్నారు "ప్రతి మానవుడూ దివ్య ఆత్మస్వరూపుడే తనలోని దివ్యత్వమును వ్యక్తీకరించుటయే మానవజీవిత లక్ష్యము" మనమంతా ఒకే పదార్థమైన పవిత్ర చైతన్యముతో నిర్మింపబడియున్నాము మనమధ్య భేదము కేవలము నామ, రూపములలోనే యున్నది ఈ సత్యమునే మన ప్రాచీన ఋషులు తమ అలౌకిక, అపరోక్ష అనుభూతితో కనుగొన్నారు

ఈ ప్రపంచంలో జడపదార్థమైనా, జీవపదార్థమైనా వాటి ప్రధాన స్వభావం ఒకటే అది ఉండటం (అస్తి), తెలియబడుట (భాతి), రూపం (రూప) నామరూపములను తొలగిస్తే మనమందరమూ ఒకే పదార్థముచే తయారు చేయబడి యున్నామని తెలుస్తుంది నామరూపములు అనేకత్వమును సూచించును నిజతత్త్వము (చైతన్య స్వభావం) ఏకత్వమును సూచించును బాహ్యపుపొర వంటి నామరూపములను తొలగించగలిగితే, లోనున్న స్థిరమైన, పునాది వంటి సచ్చిదానందము గ్రహించగలుగుతాము ఈ దృక్పథము పొందితే విశ్వమంతా బ్రహ్మచైతన్యముతో నిండియున్నట్లు కన్పడును

పరమాత్మ సర్వవ్యాపకుడు అనే భావంతో ధ్యానం చేస్తే ఒక అద్భుత కాంతికిరణం మన హృదయంలో ప్రవేశించి అచటనున్న నీచ సంస్కారము

లనబడు మాలిన్యములను తాత్కాలికంగా ఒక ప్రక్కకు నెట్టివేస్తుంది ధ్యానము నుండి లేవగానే ఆ సంస్కారములు మరల పైకి వస్తాయి ఈ మాలిన్యములు పూర్తిగా తొలగవలెనన్న మనకు అంతరంగపు నియంత్రణ కూడా కావాలి

భగవద్గీత (2-59)లో ఇదే చెప్పబడింది

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోప్యస్య పరంధృష్ట్వా నివర్తతే ॥

ఇంద్రియముల ద్వారా విషయములు గ్రహింపని వాని నుండి విషయములు దూరమైనను, వానిని గూర్చిన వాసనలు (వాంఛలు లేక అభిలాషలు) తొలగుట లేదు పరమాత్మ దర్శనమైనపుడు మాత్రమే అవి తొలగును

భగవద్గీత (2-60)లో ఇంకా ఇలా అన్నారు

శ్లో॥ యతతోవ్యాపికౌన్తేయ పురుషశ్చవిపశ్చితః,
ఇంద్రియాణిప్రమాధీని హరంతి ప్రసభంమనః ॥

వివేకవంతుడెంత పట్టుదల కలిగియున్నను, కలత నొందించు ఇంద్రియములు వాని మనస్సును బలాత్కారముగా ఆకర్షించి, విషయములందు ప్రవర్తింపజేయును

అర్జునుడంతటివాడే మనస్సును ఎలా నియంత్రించాలో బోధపడటం లేదని వాపోయాడు ఏదేని ఉపాయము చెప్పమని గీతాచార్యుడైన పరమాత్మను అడిగితే ఆయన కూడా నిస్సహాయత వ్యక్తం చేసి ఇలా అన్నారు

(భగవద్గీత 6-33)

అర్జున ఉవాచ

శ్లో॥ యోఽయం యోగస్త్వయాప్రోక్తః సామ్యేన మధుసూదన
ఏతస్యాహంనపశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥

ఓ మధుసూదనా! సమత్వముచే సాధింపదగినదిగా నీవు ఏ యోగమును చెప్పితివో (6-30 శ్లోకములో చెప్పబడినది) ఆ యోగము మనస్సు యొక్క చంచలత్వమును బట్టి స్థిరముగా నిలచి యుండునని నాకు తోచుట లేదు

శ్లో॥ (6-34)

చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహంమన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥

ఓ కృష్ణా! మనస్సు చంచలమైనది, క్షోభ పెట్టునది, బలవంతమైనది, దృఢమైనది దానిని నిగ్రహించుట గాలిని అణచిపెట్టుట వలె కష్టసాధ్యమని తలచెదను.

నేడు గాలినైనా బంధింప మానవుడు నేర్చియున్నాడు కాని మనస్సును బంధించటం వానికి సాధ్యపడటం లేదు దీనికి అడ్డత్రోవలు (short-cuts) గాని యాంత్రిక మార్గాలు కాని లేవు గీతాచార్యుడు కూడ మనస్సును నియంత్రించటానికి 'అభ్యాసం' ఒక్కటే మార్గము అన్నారు

శ్లో॥ (6-35)

అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహంచటం ।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణచగృహ్యతే ॥

ఓ అర్జునా! మనస్సుని గ్రహించుట అశక్యము మనస్సు చంచలమైనది ఇందు సందేహము లేదు కాని పలుమారు చేయు అభ్యాసము చేతను, విషయములందలి వైరాగ్యము చేతను మనస్సును నిగ్రహింపవచ్చును

మరొక సందర్భముగా కూడ గీతాచార్యుడు ఇదే చెప్పారు (8-8)

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసానాన్యగామినా,
పరమంపురుషం దివ్యం యాతి పార్థాను చింతయన్ ॥

మనస్సును అన్యథా పోనీయక అభ్యాసయోగముతో ధ్యానించువాడు దివ్యమూర్తియగు పరమపురుషుని పొందును

ఇదే మరల భక్తియోగంలో కూడ చెప్పారు

శ్లో॥ (12-9)

అథచిత్తం సమాధాతుంన శక్నోషిమయిస్థిరమ్
అభ్యాసయోగేన తతోమామిచ్ఛాప్తుంధనుంజయ ॥

ఒకవేళ నీ చిత్తమును నాయందు స్థిరముగా నిలుపుటకు సాధ్యము కానిచో, అభ్యాసయోగము చేత నన్ను పొందుటకు ప్రయత్నింపుము

ఇంతకూ భగవానుడు అర్జునుని అభ్యాసము ద్వారా పొందమనిన యోగము ఏది?

శ్లో॥ (6-30)

యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచ మయిపశ్యతి
తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి ॥

ఎవ్వరు నన్ను అన్నింటియందును, సర్వమును నాయందును చూచుచున్నాడో అతని దృష్టి నుండి నేను కనిపించకపోజాలను అతడును నా దృష్టి నుండి మరుగుపడడు

ఇదే గీతాచార్యుడు సాధన (అభ్యాసం) చేయమని చెప్పిన యోగం

ఇక భగవానుడు చెప్పిన రెండవ మార్గము వైరాగ్యము ఈ వైరాగ్యం రెండు విధాలు అవి బాహ్య వైరాగ్యము, అంతర్ వైరాగ్యము

బాహ్యవైరాగ్యము పొందినవారు ప్రాపంచిక విషయాలను త్యజించి ఒక గుహకో, అడవిలోనికో వెళ్లవచ్చును కానీ అంతర్గత వైరాగ్యము లేనిచో, ఎచటికి వెళ్లినా, ఇంద్రియ సుఖములను కలిగించు వస్తువుల యెడల

బంధము, కాంక్ష వదలవు మనస్సు ఇంద్రియ వస్తువులచే మోసగించబడును అందువలన అంతర్వైరాగ్యము లేని బాహ్యావైరాగ్యం నిరుపయోగము ఈ అంతర్వైరాగ్య సాధన కొరకే భగవానుడు పైన చెప్పిన సర్వసమత్వ దృష్టి

కాబట్టి ఏదో బాహ్య వైరాగ్యం పొందామని భావించి ఏ గుహలకో, అడవులకో వెళ్లనవుసరం లేదు ఆ భావన ఒక భ్రమ మాత్రమే

ప్రపంచంలో అందరితో కలసి సమాజ జీవనం గడపటం తప్పులేదు కాని మనస్సును భగవంతుని దిశకే త్రిప్పవలెను ఒకవైపు జీవితంలో బాధ్యతలు నిర్వర్తిస్తూనే మరొకవైపు సర్వసమత్వదృష్టితో భగవంతుని స్మరించాలి బాధ్యతలు పూర్తికాగానే భగవంతుని స్మరణే సర్వంగా భావించాలి

మనస్సును నియంత్రించుటకు జపసాధన ఉపయోగపడుతుందా? సమాధానం, ఉపయోగపడుతుందనే చెప్పాలి కాని యిక్కడ ఒక ప్రధానమైన విషయం ఉంది జపసాధనకు కావలసినది ఒక మంత్రం ఏదో ఒక పుస్తకం ద్వారా ఒక మంత్రం గ్రహించి సాధన చేస్తే ఫలితం ఉండదు మంత్రమును అర్హులైన, యోగ్యులైన గురువు ద్వారా మాత్రమే గ్రహించాలి మంత్రమునకు అంతర్లీనమైన అద్భుతశక్తి ఉంటుంది అది అలౌకిక శక్తి మంత్ర అర్థముపై మనస్సు నుంచినపుడు మాత్రమే జపం ఫలప్రదమవుతుంది పతంజలి యోగసూత్రములలో "తత్‌జపః తత్ అర్థభావనమ్" అని చెప్పబడింది మంత్రము యొక్క ఆధ్యాత్మిక అంతరార్థమును గురించి అవగాహన ఉండాలి ప్రారంభదశలో యాంత్రికముగా మంత్రమును స్మరించినను క్రమంగా దాని అవగాహన పొందాలి

మంత్రశబ్దము యొక్క తరంగముచే, ఒక విధమైన ఆధ్యాత్మిక చైతన్యము కలిగి మనలో తెలియని వికాసము ఏర్పడుతుంది జపసాధన ఒక విధమైన శక్తిని కలుగజేస్తుంది ఆ శక్తి మనలో గల వివిధ శక్తులను కేంద్రీకృతము చేసి ఒక శక్తి సముదాయముగా పనిచేస్తుంది అపుడే కుండలినీశక్తి జాగృతం

ఔతుంది

జపసాధన సాధ్యపడనపుడు, ఇక ధ్యానయోగమే శరణ్యం నామస్మరణయే ధ్యానము కదా! కాని సామూహికంగా నామస్మరణలు అంత ఫలదాయకములు కావని స్వామి వివేకానంద పలుమార్లు చెప్పారు సామూహికంగా ధ్యానం లేక కీర్తనలు ఉద్రేకం కలిగిస్తాయి మనస్సు ఉన్నత స్థానం చేరుకుంటుంది కాని ఆ ఆవేశం తగ్గగానే మనస్సు హఠాత్తుగా దిగజారుతుంది

కాని నిరంతర ధ్యానము సాధ్యమా! సాధ్యం కాదు అయినా నిరంతర ప్రార్థన అంటే అర్థం ఎల్లపుడు భగవంతుని యందే నివసించి యుండవలెను అని సాధన చేసే భగవన్నామస్మరణం నిరంతరం అంతరంగంలో చేయవచ్చు ఇది కష్టమైనదే కాని అసాధ్యమైనది మాత్రము కాదు

## 4 హేతువాదం - ఒక పరిశీలన

అభ్యాసం ద్వారా వేదాంతదృష్టి పొందటానికి ఆంతరిక జీవితం, ఆ ఆంతరిక జీవితానికి అంతర్బుద్ధి, మనోనిగ్రహం ఎంత ఔసరమో వివరించబడింది కదా!

ఇక కర్మమునకు, నిత్యజీవితానికి గల సంబంధం ఏమిటో గ్రహించవలసి యున్నది కర్మములు జీవితంతో ముడివడి ఉన్నాయి కర్మములు లేనిది జీవితమే లేదు కర్మము అంటే కార్యము ప్రతి కార్యమునకు కారణము, అనగా హేతువు ఉంటుంది ఈ సృష్టికే పరమాత్మకు కలిగిన సంకల్పమే హేతువు అని ఉపనిషత్తులు చెప్తున్నాయి కదా! కార్యకారణాలే ఈ జీవితానికి మూలమైనపుడు వాటికి కొన్ని ధర్మములు, అటుపై వాటికి కొన్ని విలువలు ఉంటాయి కదా! ఇవి అన్నీ సమన్వయింపబడినపుడే కదా జీవితానికి పరమార్థం కలిగేది కాబట్టి వీటిని గురించి తెలుసుకొనటం ఎంతైనా ఆవశ్యకము

కాని ఈ కార్యకారణములకు మూలమైన ఈ శరీరం గురించి ముందు అవగాహన ఏర్పడాలి కదా! శరీరము అంటే మన కన్నులకు గోచరమయ్యేది మాత్రమే కాకుండా ఆంతరిక శరీరం అంటే ఏమిటో గ్రహించాలి అది ఎలా ఏర్పడిందో తెలుసుకోవాలి అనగా జీవశాస్త్రం చెప్పే దానికంటే నిగూఢమైన దేదైనా ఉందా అని అన్వేషించాలి ఆ అన్వేషణ ఫలితమే వేదాంత సారము

ఈ అన్వేషణలో ఎదురయే హెచ్చరికలు (challenges) ప్రధానంగా రెండు ఒకటి హేతువాద దృక్పధము (rationalism) మరియొకటి తాపస దృక్పధము (ascetic outlook) రెండూ అత్యంత భిన్నమైన, విరుద్ధములైన అంచులు హేతువాద దృక్పధము పరిపూర్ణంగా భౌతికం తాపస దృక్పధం పూర్తిగా ఆధ్యాత్మికం ఆధ్యాత్మికమును గురించి ఇంతవరకు కొంత తెలుసుకున్నాము గదా! ఇక ముందుకు సాగటానికి, హేతువాదం దానికి పూర్తిగా విరుద్ధమా? లేక పూర్తిగా భౌతికమైన అది నాస్తికవాదమా? లేక ఆధ్యాత్మికముతో ఏదో ఒక విధముగ, ఏదో ఒక స్థాయిలో సమన్వయమునకు అవకాశము ఉన్నదా? అను సమస్యలను పరిశీలించవలసి ఉన్నది

భౌతికవాది (Materialist) ఆత్మ అనేది ఉన్నదంటే, దానికి సమ్మతించడు అందుకే అతనిని అనాత్మవాది అన్నారు అతని దృష్టిలో పదార్థమే (matter) మూలసత్యము (ultimate reality) భౌతికవాది ఒక అజ్ఞాతావాది (agnostic) దేవుడు అజ్ఞాతంగా మనుష్యులకు తెలియనేరని విధంగా ఉన్నాడని, కాబట్టి అతనిని గురించి అన్వేషణ వృధాప్రయాస అని వాదిస్తాడు

మన విజ్ఞానము అంతా మన ఇంద్రియానుభవం (senses) వలననే వస్తుంది కాని కొన్ని సమయములలో మన జ్ఞానము, మన హేతువు అన్వేషణ వ్యాప్తి చెంది అతివేగముగా పయనిస్తుంది అయినా అది భౌతిక విషయ పరిధులను (material facts) లేక పదార్థ విషయవాస్తవములను అధిగమించలేదు ఎందుకనగా ఈ విశ్వములో మన భౌతిక ఇంద్రియానుభవ

పరిధిలో గమనించలేని వాస్తవములు ఎన్నో ఉన్నాయి అను సత్యమును కాదనలేము ఈ వాస్తవములు హేతువాదమునకు అందవు

మానవజాతి ఆదర్శములు కొన్ని ఇంద్రియానుభవమునకు అనుగుణముగా ఏర్పడినవి కావు అను వాస్తవమును, ఎంత తీవ్ర భౌతికవాది అయినను నిరాకరించలేడు ఈ ఆదర్శములు కొన్ని ఇంద్రియానుభవములకు, వివరములకు భిన్నముగా కూడ ఉంటాయి ఈ ఆదార్శాలను సాధించటానికి మానవజాతి కొన్ని ప్రధాన భౌతిక విషయములను త్యాగం చేయటానికి కూడ సిద్ధపడింది దీనికి హేతువాది (అజ్ఞాతావాది) వద్ద సమాధానం దొరకదు

ఆచారాలు వేరు, ఆదర్శాలు వేరు ఏదో ఒక సందర్భంలో, పరిస్థితుల ఆధారంగా కలిగిన అనుభవమును ఒక ఆచారంగా మార్చి సంప్రదాయం పేరిట స్థిరపర్చటం జరుగుతూ ఉంటుంది విభిన్న లేక మారిన పరిస్థితులలో ఆ అనుభవం ప్రాధాన్యం కోల్పోతుంది, అర్థరహితమౌతుంది మార్పు అనేది కాలం ప్రధాన లక్షణం మార్పుననుసరించి అనుభవం సంపాదించి సంప్రదాయం ఏర్పరచుకోవాలి 'నేను' పాతకాలంవాడిని అంటూ అర్థం కోల్పోయిన ఆ సంప్రదాయాలను పట్టుకువ్రేలాడటం మూఢత్వం అవుతుంది విద్యుత్తు దీపాలు లేనపుడు వొత్తులదీపాలే గతి ఆనాడు మరి ఈనాడూ ఆ దీపాలే వాడచ్చుగదా నిజంగా పాతకాలం వాడివైతే! ఒకవైపు కాలగమనంతో ఏర్పడిన అవసరాలను క్రొత్తగా ఏర్పడిన సాధనాలతో తీర్చుకుంటూ, మరొకవైపు అర్థం, అవసరం కోల్పోయిన సంప్రదాయాలను పట్టుకువ్రేలాడటం, వాటిని ఇతరుల నెత్తిన కూడా రుద్దే ప్రయత్నం చేయటం శుద్ధ మూఢత్వం అవుతుంది

ఆదర్శాలు అలా కాదు అవి నియమాలు (Principles) ఒక్కొక్క జాతికి, మతానికి ఒక్కొక్క రకమైన ఆదర్శాలు ఉంటాయి వాటికి హేతువులు దొరకవు ఆ జాతి వారు వాటిని అసంకల్పితంగానే పాటిస్తారు అందులో హేతువాదులు కూడా ఉండే ఉంటారు

హిందూమత ప్రక్రియలన్నీ సవ్యంగా అంటే ఎడమ నుండి కుడివైపుకు (clock-wise) ఉంటాయి వ్రాయటం కూడా ఎడమ నుండి కుడివైపుకే గదా! ఇది ఏదో సులువుగా ఉంటుంది అని ఏర్పరచారు అంటే అర్థం ఉండదు ఇందుకు భిన్నంగా అనగా కుడి నుండి ఎడమవైపుకు ఆచరించే మతంవారున్నారు గదా! అది వారికి సులువుగానే ఉన్నదిగదా! కాబట్టి ఇవి ఇంద్రియానుభూతికి అనుకూలంగా ఏర్పడినవి కాదు ఎపుడో ఎందుకో దానిని ఆదర్శంగా నియమించారు కాలగమనంతో అది ప్రభావితం కాదు అది హేతువుకు అతీతంగా కనబడుతుంది ఇలాగే ప్రతి మతానికి, జాతికి ఎన్నో ఉంటాయి ఆ ఆదర్శాల కొరకు ఆ మతం వారు ఎన్నో త్యాగాలకు కూడా సిద్ధపడ్తారు

ఇలాగే ప్రకృతిలో ఎన్నో హేతువుకు అందకుండా జరుగుతూనే ఉంటాయి సృష్టికి మూలం సంకల్పం అని ఉపనిషద్వాక్యం తప్ప దానికి ప్రత్యక్ష సాక్ష్యం ఇంతవరకు లేదు హేతువునకు అందని దానిని అజ్ఞాతంగానే ఉంచాలి అంటే అన్వేషణాసక్తి సన్నగిల్లుతుంది

ఇది హేతువాదయుగము హేతువు కొరకై అన్వేషణ అవసరము అది భౌతిక, ఖగోళశాస్త్ర దృక్పథము కూడ కాని ప్రతిదానికి హేతువు వుండాలి అను ప్రభంజన ప్రభావం అన్వేషణకు ఆటంకంగా మారుతుంది మన కన్నులకు గోచరమగు దానిని, దానికి వ్యతిరిక్తమగు సాక్ష్యము లభ్యమగు వరకు, విశ్వసించుటయే అన్వేషణకు సరైన మార్గము హేతువాదమును దాని అవధులు దాటకుండ అనుసరించినచో సత్ఫలితం కలుగుతుంది అన్వేషణ ద్వారా హేతువు అవగాహన అవధులు వ్యాపిస్తాయి

హేతువాదమును పూర్తిగా వ్యతిరేకించుట తగదు అజ్ఞాతావాదము (agnosticism), హేతువాద మూలకముగ ఏర్పడిన భౌతికవాదము (rationalistic materialism) లను కొంతవరకు అనుమతించవలసి యున్నది మానవ విజ్ఞానమును మూఢవిశ్వాసముల నుండి స్వేచ్ఛ కలుగచేసి వివేక మార్గములో

(wisdom) వ్యాప్తి చెందించి రక్షించేది హేతువాద మూలక భౌతికవాదమే. స్వచ్ఛమైన, నియంత్రితమైన బుద్ధియే వాస్తవ విజ్ఞానానికి మార్గము. ఆ బుద్ధిని పొందగలగటానికి హేతువిచారణ చాల అనుకూలమైన మార్గము. ఆధ్యాత్మికమైనను మనకు వాసమైన ఈ పృథివిని వదలి ఎక్కడో అగమ్యమైన వాస్తవములను గ్రహించమని చెప్పుట లేదు. స్థూల శరీరము లేనిది ఆంతరిక జీవితము లేదు కదా! స్థూల శరీరానికి ఆధారం పంచభూత సమన్వితమైన ఈ భూమియే కదా! భౌతికవాదము (హేతువాదము)ను బహిష్కరించటం 'నేల విడిచి సాముచేసి'నట్లే అవుతుంది. కావున ఏ నిజమైన సత్యాన్వేషి భౌతికవాదమును ద్వేషించడు. దానికున్న పరిమితులలో దానిని సద్వినియోగం చేసుకుని గమ్యం చేరటానికి సాధన చేస్తాడు.

భౌతికవాదులైనను (హేతువాదులు) తమ వాదమునకున్న పరిమితులను గుర్తించకుండా తమ సిద్ధాంతమే సర్వస్వం, ఈ విశ్వమందలి విజ్ఞాన, వివేకములకంతటికి తమ వాదమే మూలము అని ప్రగల్భించినచో, వారి త్రోవ వారిది, సంప్రదాయ మూఢవాదుల త్రోవ వారిదిగా అలాగే స్థిరపడిపోయి సత్యాన్వేషణ మార్గములో ఆటంకములుగా మాత్రమే మిగిలిపోతాయి.

హేతువాదమనగానే హేతువు ఆధారంగా ఏర్పడిన వాదమని స్ఫురిస్తుంది. నిజానికి ఇదొక వాదమా? లేక సిద్ధాంతమా? అంటే కాదేమో అనిపిస్తుంది. హేతువు ఆధారంగా సత్యాన్వేషణ మార్గము అంటే బాగుంటుంది అనిపిస్తుంది. అపుడే హేతువాద ఆశయము నెరవేరవచ్చు. హేతువాదము సాధారణంగా నాస్తిక వాదమనే భావన ఉంది. బహుశ ప్రారంభ దశలో హేతువాదం ఆ రూపంలో ఉందేమో!

హేతువాద తప్పు, ఒప్పులను చర్చించుటకు ఉద్దేశించబడిన రచన కాదు గదా ఇది! వేదాంత దృక్పథములో హేతువాద స్థానమును గురించి మాత్రమే మనకు వలసినది.

హేతువాది (rationalist) తన కర్మములకు (actions) నిర్ణయములకు (decisions) ఉద్రేకము (emotions) విశ్వాసముల (beliefs) కంటే కారణమునే (reason) ఆధారం చేసుకుంటాడు

శాస్త్రజ్ఞానము లేకుండ తమ స్వానుభవమును మాత్రమే ఆధారం చేసుకుని కర్మములను, నిర్ణయములను చేయువారున్నారు (Empirics) మతము విశ్వాసము మీద, స్వానుభవం మీద ఆధారపడింది కాబట్టి మతానికి తాను వ్యతిరేకమంటాడు హేతువాది

క్రీ॥శ॥ 19వ శతాబ్దము చివరలో బ్రిటిష్ దేశములో ఈ హేతువాదమునకు నాంది పలుకబడింది భౌతిక శాస్త్ర పరిశోధనా ఫలితాలు (science experiments) ఆధారంగా ఈ హేతువే నిశ్చయమైనది (certainty) అనువాదమేర్పడినది ఇది హేతువు యొక్క సర్వాధిక్యతను ఎట్టి నిబంధనలు లేకుండా స్వేచ్ఛతో కూడిన మానసిక వైఖరి అంటుంది ఈ వాదనలో కూడ పరిణామాలు చోటు చేసుకున్నట్లు కూడా కన్పడుతున్నాయి అనుభవానికి హేతువాది పూర్తిగా వ్యతిరేకి కాదేమో అనిపిస్తుంది కారణాన్వేషణలో అనుభవం ఒక ప్రయోగమే (Experiment) కదా! అందువలన భావనలకు, ప్రమాణాలకు దూరంగా ఉండి అనుభవం ద్వారా మాత్రమే నిరూపణ (నిశ్చయం) (certainty) చేసుకొనుటకు వీలైన తత్వజ్ఞాన సముపార్జనయే నిజమైన హేతువాద ఆశయమనిపిస్తుంది అంతేకాని కేవలం నాస్తికత, మూఢవిశ్వాసాల వ్యతిరేకతయే హేతువాద లక్ష్యం అనటం పొరపాటు

గత నాలుగు వందల సంవత్సరములలో ఐరోపా ఖండములో జరిగిన మార్పులను గమనించినచో ఏకకాలమందు కొన్ని మార్పులు ప్రక్కప్రక్కనే జరిగినట్లు తెలియును అవి ప్రధానంగా, రాజకీయ స్వాతంత్ర్యము, ఆర్థిక ప్రగతి, విజ్ఞాన పురోగతి, సాంఘిక సంస్కరణలు, కాని అదే సమయంలో క్రమంగా సంప్రదాయమతం, నీతి, న్యాయం, సన్మార్గం (Moralities), సాంఘిక

నియంత్రణ (Social order) క్షీణించినాయి ఒకవైపు కొన్నింట ప్రగతి స్ఫుటంగా గోచరించినప్పటికి, మరొకవైపుగా అది ఒక రకమైన ప్రతిక్రియగా (reaction) రూపొంది సనాతన ఆధికారిక (authentic) జీవిత మూలసూత్రముల నుండి విడివడుటకు మార్గగామి అయింది ఒక నవీన నాగరికత రూపొందటం ప్రారంభించింది ఈ నాగరికతకు మూలాధారాలు మూడు హేతువాద తాత్విక గ్రీకు సిద్ధాంతాలు, మానవతా నీతి నియమాలు, జాతీయతా భావపూరిత రాజకీయాలు (Greek ideals of rationalist Philosophy, humanist ethics and nationalist politics)

ఈ ఆధారాలతో క్రీ॥శ॥ 16వ శతాబ్దంలో రూపొందిన పునరుజ్జీవనం (Renaissance) వివిధ శాఖలుగా విస్తరించింది గ్రీకు జాతి పరిశోధన జిజ్ఞాస (curiosity), రోమ్ (Roman) జాతి అభ్యాసప్రాప్త అనుభవ విజ్ఞానం , సాంఘిక ఉపయోగములకు అనుగుణంగా నియంత్రణలు (order of life and social utility) ఎంతో ఉత్సాహంగా అనుసరించబడినాయి వీటి ప్రాభవం వలన మానవునిలోని అంతర్గత శక్తి మేల్కొల్పబడి విజ్ఞానశాస్త్రం (science) నిరాఘాటంగా పురోగమించటం ప్రారంభమైంది కోపర్నికస్‌తో (Copernicus) ఆకాశరూపమే మారిపోయింది భూగోళమంతా పరిశోధకులతో నిండిపోయింది విజ్ఞానశాస్త్ర, సాంకేతిక (technological) పరిశోధనా విజయాలతో ఈ ప్రపంచం (world) నిర్దుష్టమైన అల్లికతో కూడిన (closely knit unity) ఐక్య సంఘటన వలె రూపొందింది

తాత్విక చింతన కూడ (Philosophical thought) సైన్సు ప్రాభవానికి లోనైంది మానసిక ప్రవృత్తికి (mental habits (or) behaviour) ప్రాధాన్యం పెరిగింది విమర్శనాత్మక పరిశోధనా దృక్పథం ప్రాబల్యం పొందింది స్పష్టంగా, నిర్దుష్టంగా గుర్తింపబడేదే (recognized clearly and distictly) సత్యం అను సిద్ధాంత రూపకల్పనకు నాంది ఏర్పడింది అస్పష్టమైనది సత్యం కాదు

అన్నారు విశ్వంలోని మానవులందరు దేనిని గురించి ఒకే విధంగా ఆలోచిస్తారో అందులోనే సత్యం ఉంటుందన్నారు (Truth lies where all men think alike) గణితశాస్త్రం అట్టి సత్యానికి (truth) ఉదాహరణగా పరిగణించారు తత్వవిజ్ఞానం (Metaphysics or Philosophy) పరిపూర్ణంగా సైన్సు దృక్పధంతోనే పురోగమించాలి అన్నారు ఆకారాల స్వభావ, లక్షణాలను (the nature and properties of figures) తెలుపు గణితశాస్త్రము మరొక ప్రామాణికమైన సత్యమును తెలుపును అన్నాడు స్పినోజా (Spinoza) భగవంతుడు, గ్రాహ్యశక్తి, మానవ మనోభావాలు వృత్తాలు, త్రిభుజాలవంటివి అన్నాడు ఆయన మానవ విలువలను పట్టించుకొనని ఒక నిశ్శబ్ద యంత్రము వంటిది ప్రకృతి అన్నారు అదే భగవంతుడు అన్నప్పటికి అది మానవునికి ఎంతో దూరంగానే ఉంటుంది ఎందుకనగా హేతువు, సంకల్పములే (the reason and will) భగవంతుని స్థితి (తత్వము) (essence) స్వభావములు అవి మానవ స్థితికి ఎంతో భిన్నములు అన్నాడు ఆయన కుక్క రూపంతో పోల్చబడిన జ్యేష్టా నక్షత్రమునకు (Dogstar) వాస్తవంగా కుక్కకు ఉన్నంత భేదముంది అన్నారు

ఈ ప్రపంచం ఒక స్థిరమైన, ఎట్టువంటి మార్పునకు వీలుపడని సూత్రములను (సిద్ధాంతములను) అనుసరించు అసంఖ్యాకమైన భాగముల కలయిక అన్నాడు లీబ్‌నిజ్ (Leibniz) అసలు స్థిరమైన, తార్కికమైన గణిత, విజ్ఞాన శాస్త్రముల వంటి (Mathematics and Science) తత్వశాస్త్రమును రూపొందించుటకు అవకాశమున్నదా అని అనుమానం వ్యక్తం చేశాడు కాంట్ (Kant) గణిత విజ్ఞాన శాస్త్రములు విశ్వసామాన్య (universal rules) సూత్రములననుసరించి ఒక సంయోజన (synthetic) రూపమును పొందాయి గణిత, సైన్సు సిద్ధాంతములు అవకాశమున్నంత వరకు అనుభవ పరిమితులలో (limits of possible experience) మాత్రమే ఉపయుక్తంగా ఉంటాయి (applicable) అన్నాడు ఆయన కాని తత్వశాస్త్రం సర్వోత్కృష్టమైన, భావాతీతమైన స్థితి (transcendental) ఆశిస్తుంది కాబట్టి అది దాదాపు అసంభవమైనది

(impossibility) అన్నాడు సిద్ధాంతాలు, సూత్రాల మీదనే కాంట్ (Kant) తత్వశాస్త్రము ఆధారపడింది ఒక నిబంధన లేక సూత్రము (Rule) ఒక సత్యమును (truth) ప్రకటించి, దాని ఆచరణను సమర్థిస్తుంది అలా ఆచరించినపుడే ఏ కార్యమైనా (action) సవ్యమవుతుంది (right), అపుడే ఆ నిబంధన సర్వసామాన్య సూత్రంగా మారుతుంది (general rule) అది తత్వశాస్త్రంలో సంభవమా? అనేది వారి ప్రశ్న జర్మన్ తత్వవేత్త హెగెల్ (Hegel) మరి కొంత ముందుకు వెళ్లి అసలు తత్వశాస్త్రమును సైన్సుగా పరిగణించవచ్చునా? అను ప్రశ్నకు అవకాశమివ్వకుండ హేతువుకు స్వతంత్రత బలపర్చాడు స్వయంశక్తి (self development of the spirit) వికాసమే తత్వశాస్త్రం అన్నాడు

ఈ విధంగా పునరుజ్జీవన ఉద్యమ ఫలితంగా (renaissance) మతాధికారుల నిరంకుశ ఆధిపత్యమునకు అడ్డుకట్ట వేయబడి, మధ్యయుగపు మత సిద్ధాంతములకు తీవ్ర అభ్యంతరములు ఎదురైనవి మధ్యయుగపు మతస్థితి, శ్రుతి ప్రమాణములను విస్మరించి బాహ్య ఆచారములను స్థిరీకరించుటయే దీనికి ప్రధాన కారణమైనది అస్తిత్వము (theism) నూతన రూపం పొందింది ఈ ప్రపంచము ఒక సిద్ధాంత రూపం (expression of Law) అనుకుని, అది ఒక యాంత్రిక స్వభావం కలది అంటే ఆ యంత్రాన్ని రూపొందించటానికి ఒక భగవంతుడను రూపశిల్పి ఉండాలి కదా! అన్నారు కాబట్టి భగవంతుడు ఒక రూపశిల్పి మాత్రమే అన్నారు అటపై ఆ యంత్రం స్వతంత్రంగానే పనిచేసేటట్లు భగవంతుడు నిర్మించాడు అన్నారు అలా స్వతంత్రత కల్గిన ఈ విశ్వం దానంతట అదే రూపొంది, పనిచేయటం ప్రారంభించింది అను సిద్ధాంతరూపకల్పనకు మార్గం ఏర్పడింది

పునరుజ్జీవనము, సంస్కరణలు (Renaissance and Reformation) శ్రుతుల ద్వారా (Scriptures) (ఇక్కడ శ్రుతులు అంటే వేదాలు అని కాదు

బైబిలు వంటి మతగ్రంధములని అర్థము) కలుగు స్ఫూర్తిని (inspiration) నిశ్చయించుకునే వ్యక్తిగత హేతువును (individual reason) ఒక హక్కుగా పరిగణించుటకు వీలు కల్గించినాయి బైబిలు వంటి గ్రంధములకు ఇవ్వబడు వివరణలకు వ్యక్తిగత ఆలోచనలు ఆధారములు అయినాయి లూధర్ (Luther) చర్చి స్థానంలో బైబిలుకు ప్రాధాన్యం ఇచ్చి అదే భగవంతుని వాక్కు అన్నాడు

ఇదే సమయంలో కొంత మంది తాత్వికులు - రూసో (Rousseau) స్లియర్‌మాచర్ (Schleiermacher) రిట్చల్ (Ritchel) టాల్‌స్టాయి (Tolstoy) మున్నగువారు - కొంతవరకు కాంట్ (Kant) కూడా - క్రైస్తవ విశ్వాసమును హేతువాద పరిశీలనలతో (findings of reason) సమన్వయపరచే ప్రయత్నం చేశారు కాని స్పినోజా (Spinoza) హెగెల్ (Hegel) బ్రాడ్లీ (Bradley) మున్నగువారు మాత్రము పరిపూర్ణంగా హేతువునే (Reason) సమర్థించారు

మతవిశ్వాస, హేతువాద సమన్వయ ప్రయత్న ఫలితంగా క్రమంగా విశ్వాసం హేతువు ఆధారంగా మార్పుచెంది సైన్సు తెలుపు సత్యముతోను (scientific truth) నీతి విలువలతోను (ethical values) సమన్వయం పొందటం జరిగింది అందువలన క్రమంగా విశ్వాసం ద్వారా దివ్యదర్శనానుభవం (revelation) కంటే విజ్ఞానశాస్త్ర (Scientific) పరిశోధనా ఫలితాల మీదనే మక్కువ పెరిగింది

పునరుజ్జీవన ఉద్యమ (Renaissance) ప్రధాన లక్ష్యము మానవత (Humanism) మానవాతీత (Supermatural) దైవ (divine) విషయాల కంటే మానవ విషయాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వటమే మానవతావాదం (Humanism) (An outlook concerned with human rather than divine or supernatural matters) - ఇదే క్రమంగా హేతువాదంగా రూపొందింది సామాన్య మానవ అవుసరములు, సామాన్య జీవన సమస్యలు పరిష్కరించు

కొనుటలో పూర్తిగా హేతువు ఆధారంగా ప్రవర్తించటం దీని ఆదర్శం (a belief or outlook emphasizing common human needs and seeking solely rational ways of solving human problems and concerned with mankind as responsible and progressive intellectual beings) ఎక్కువ మంది విజ్ఞులు (intellectuals) మానవతా సిద్ధాంతమునే (Humanism) సమర్థించారు, అనుసరించారు

మతాన్ని అనుసరించేవారైనా దానిని పూర్తిగా అర్థం చేసుకుని అనుసరించలేదు ఏదో ఒక అలవాటుగానో, మూఢనమ్మకంతోనో లేక సోమరితనంతోనో అనుసరించారు దేవుని యందు నమ్మకం ఉందంటారు కాని ఆ విశ్వాసం ఆచరణలో ఎక్కడా గోచరించదు ఆలోచనలు, తర్కాలు ఉన్నాయి కాని వాటికి వలసిన స్థిరనమ్మకం లోపించింది (conviction) సనాతన విశ్వాసం అంతరించింది దాని స్థానంలో ఏ నూతన విశ్వాసం రూపొందలేదు చాలకాలంగా కృశించిన (long starved) మానవ మనోశక్తి తిరిగి వికసించి, స్థిరత్వము పొందే పరిణామ ప్రవాహంలో మనస్సు మూల పునాదులే రూపాంతరం చెందినాయి మానసికంగా బలహీనులు, జీవితంలో ఆటుపోట్లు తిన్నవారు మనోవిశ్లేషణా (Psycho-analysis) మార్గమును అనుసరించారు ఈ మనోవిశ్లేషణ హేతుస్పృహ (rationality), విజ్ఞానశాస్త్ర గౌరవ ప్రపత్తి (surrendering to the prestige of science) అను ముసుగులో (guise) సాగింది మతాధికారులు మధ్యయుగం వైపుకు లాగుచుండగా, సంస్కర్తలు హేతుజ్ఞానం వైపుకు లాగారు సగటు మానవుడు పాత నమ్మకాలు, సంస్కరణల పేరిట ఏర్పడి భగవంతుని విస్మరించిన విజ్ఞుల సహజత్వ ధోరణి (naturalism) మధ్య నలిగిపోయాడు ఈ సందర్భంలో పవిత్రత (piety) అనేది పూర్తిగా అర్థం కోల్పోయింది 'జాతీయ రాష్ట్ర' (national state) సిద్ధాంతాలు ఏర్పడి మానవశక్తి అంతా అటువైపు మళ్ళింది అదే తరువాత హిట్లర్ నాజీ ప్రభుత్వం, ముస్సొలినీ ఫాసిస్టు ప్రభుత్వాలకు దారితీసి ప్రపంచయుద్ధానికి కారణమైంది

రాజ్యము (దేశము) అనేది ఒక అతిశక్తివంతమైన నిర్మాణ ప్రక్రియ బాహ్య నియంత్రణలు, ఆంతరిక నీతి నియమాలు దానికి ఆటంకాలు కానేరవు సమాజంలోని మనిషి కొంతవరకైనా నాగరికత కలవాడు కాని రాష్ట్రము లేక రాజ్యమనేది ఆదిమంగా (primitive) అనాగరికంగానే ఉన్నది అది ఒక మిక్కిలి పెద్దదైన క్రూరజంతువు వంటిది (beast of prey) అంతర్జాతీయంగా వాస్తవంగా ఎటువంటి నియంత్రణలు ఈ క్రూరజంతువును నియంత్రించలేవు ఓటమి అను భయం (fear of defeat) మాత్రమే దానిని నియంత్రించగలదు ఈ రాజ్యాలు నిగూఢమైన చిహ్నాలుగా మారినై వాటి రక్షణ కొరకు మనుష్యులు అడవిమృగాలవలే ప్రవర్తిస్తుంటారు

రూసో యొక్క కరుణ మొదలైన రసాత్మకమైన ఆస్తికత్వమునకు (sentimental theism) ప్రామాణిక క్రైస్తవ మత సిద్ధాంతాలకు పోలికలు చాల తక్కువ దివ్యదర్శనం అను విషయమే లేని చైనావారి మతం (religion without revelation of China) అంటే లిబినెజ్ (Leibniz) ఆనందించాడు భగవంతుడున్నాడని ఏ ఊహాజనిత సిద్ధాంతాల ద్వారా నిరూపించటం అసంభవమైనప్పటికి మానవ నిత్యజీవితంలో ఆయన అవసరం ఎంతైనా ఉంది అన్నాడు కాంట్ (Kant)

కాని హెగెల్ (Hegel) సిద్ధాంతాలలో భగవంతునికి స్థానం లేదు ప్రష్యా రాష్ట్రమే (జర్మనీ దేశమునకు పూర్వపు పేరు) దివ్యభావాలకు రూపాంతరం అని, అదే ఈ భూమిపైన వెలసిన దివ్యరూపం అన్నాడు హెగెల్ జర్మన్ జాతీయ సమాజవాది పార్టీ (National Socialism) హెగెల్ సిద్ధాంతములనే అనుసరించింది కాని ప్రష్యన్ రాష్ట్రం అనకుండా జర్మనీ జాతిపూర్వీకులైన నార్డిక్ (Nordic race) జాతియే మూలాధారమైనది (ultimate) సర్వోత్కృష్ట విశ్వవిజ్ఞాన స్వీయరూపమని ప్రకటించారు (the noblest self-expression of the cosmic intelligence) ఆ పార్టీ అధికారిక తాత్వికుడు రోసెన్‌బెర్గ్ (Herr Rosenberg) తన పుస్తకం "The Myth of the Twentieth Century (1930)"

లో ఆస్తికులు విశ్వసించు భావాతీత రూపమైన భగవంతుని (transcendent) యందు తనకు విశ్వాసము లేదని స్పష్టముగా ప్రకటించాడు తన భగవంతుడు మానవత (Human spirit), జాతి ప్రధాన సమాజం (racial society) అని కూడా ప్రకటించాడు

ఈ భావాల నుండే క్రమంగా "ప్రత్యేక జాతి" (elect race) అను సిద్ధాంత రూపకల్పన జరిగింది అనగా నిమ్న, ఉన్నత దేశాలు (inferior, superior states) అను సిద్ధాంతాల నుండి నిమ్న, ఉన్నత జాతులు (inferior, superior races) అను సిద్ధాంతం ఉద్భవించింది ఇదే జాతుల మధ్య తారతమ్య భావములకు దారితీసింది (theory of the inequality of human races) క్రమంగా ఈ సిద్ధాంతానికి సైన్సు స్థాయి (scientific setting) రూపకల్పన జరిగింది

ప్రతి ఒక్క జాతికి (race) ప్రత్యేకమైన అంతరిక రూపం ఉన్నదని (particular soul), అందే వారి అత్యంత ప్రత్యేకరూప (intimate being) పరికల్పన జరుగుతుందన్నారు (expressed) ఆ జాతి రక్తంలోనే వారి ప్రత్యేక ఉన్నత సుగుణాలు (virtues) రూపొందుతాయి అని సిద్ధాంతీకరించారు మానవజాతులు అనేది ఒక భావరూపం (abstraction) వారసత్వ ప్రకారంగా రక్తం ద్వారా రచించబడిన అనగా రూపొందించబడిన భేదాలు జాతులను నిర్ణయిస్తాయి అన్నారు (races determined by differences in the hereditary composition of the blood) మానవ జాతులు విభిన్నమైనవే కాక విలువలయందు అసమానతలతో కూడినవి (not only diverse but of unequal value) అని కూడ అన్నారు అందునా నార్డిక్ జాతి (Nordic race) అత్యంత ఉన్నతమైనది అన్నారు ఆ జాతి శాఖలను ఈజిప్టునందలి అమోరైట్లు జాతియందు, భారతదేశ ఆర్యులందు, ప్రాచీన గ్రీకులందు, ప్రాచీన రోమ్ జాతీయులందు గుర్తించవచ్చునని చెప్పారు అయినా జర్మన్ జాతి మాత్రమే

అందరి కంటే ఉన్నతమైనది అని నిర్ణయించారు

నిమ్నజాతులతో కలయిక ఉన్నత జాతులను కాలుష్యపరుస్తుంది అని వారి అభిప్రాయం భారతదేశమందు ఏర్పడిన కుల అసమానతా భావాలు దీనికి ప్రతిబింబమేమో! ప్రపంచ చరిత్రలో అలా కాలుష్యం పొందిన జాతులకు ఉదాహరణలుగా భారత, పర్షియా, గ్రీసు, రోమ్ జాతులను పేర్కొన్నారు నీచజాతి సంపర్కం వలననే ఆ జాతులు దిగజారిపోయినై అని వారి అభిప్రాయం సార్వజనిక (universal) మతము అనునది నార్డిక్ జాతికి తెలియదు నార్డిక్ జాతి ఔన్నత్యమునకు కాథొలిక్ క్రైస్తవులను, కమ్యూనిష్టులను, సార్వజనిక మతస్థులను (Free masonry which is a system and institution of instinctive sympathy or understanding) ప్రత్యేక శత్రువులుగా భావించారు జర్మానిక్ ఆత్మ మూడవ రీక్ (Third Reich) రూపంగా అవతరించిందని వారి విశ్వాసం (Note Reich is the former German state **First Reich** The Holy Roman Empire 962-1806 **Second Reich :** The German Empire 1871-1918 **Third Reich** The Nazi Regime 1933-45 Only the third Reich is the normal historical terminology) వీరి జండా గుర్తు క్రైస్తవ శిలువ (cross) గుర్తుకు బదులుగా స్వస్తికా ఉంటుంది (卐) నార్డిక్ వారసత్వము నీచజాతి సంపర్కము నుండి రక్షించటమే నేషనల్ సోషలిస్ట్ పార్టీ ధ్యేయము అన్నారు

ఈ విధంగా దేశ నిమ్నత్వ, ఉన్నతత్వముల నుండి (inferiority, superiority) జాతి నీచత్వ, ఉత్కృష్టతలకు (inferiority, superiority) అటపై కుల, వర్గ అసమానతల వరకు దారితీసింది దీనివలన వైషమ్యాలు పెరిగి, పునరుజ్జీవన ఉద్యమ సారాంశమైన మానవతాభావం (Humanism) అదృశ్యమైంది

ఒకవైపు ప్రపంచములోని మతముల చరిత్ర పరిశీలిస్తే అవి దైవ

బోధనా ప్రయోగములుగానే (experiment of divine pedagogy) మిగిలినవే గాని అభ్యాసప్రాప్త దివ్యానుభూతి పొందిన సందర్భాలు చాల తక్కువ ఎపుడో, ఎక్కడో జరిగిన సత్యాన్వేషణ వలన పొందిన అనుభూతిని సర్వసామాన్యముగాను (Generalised) శాశ్వతమైన వివేకవిశిష్టమైన (rational powers) శక్తి అని చెప్పటకు వీలుపడదు స్థూలంగా చెప్పాలంటే, మతము అనగా భగవంతునిపై ఆధారపడే మనోభావన అని కొంత మంది నిర్వచించారు క్రైస్తవ మతమును విశ్వమానవ సౌభ్రాతృత్వము, నిస్వార్థసేవ అని మరికొంతమంది అభిప్రాయం కాని మతమును వివేక విశిష్టతతో (Rational clarity) నిర్వచించిన సందర్భములు కనబడవు

దివ్యదర్శనం (revelation), పవిత్రత (piety) వివేకంతో కూడిన అంతఃకరణం (intellectual conscience) వలన మాత్రమే సాధ్యము కాని మతం విశ్వాసాలతో కూడినది ఆ విశ్వాసాలలో ఏ ఒక్క భాగమైనా ఎలా ఏర్పడింది, ఆధారాలు ఏమిటి అనేది ప్రశ్నగానే మిగిలిపోయింది దాని సమాధానమునకు ఒకటే మార్గమని తోస్తుంది అది శాస్త్రజ్ఞానము ఒక దాని మీదనే ఆధారపడకుండ ఆచరణ ద్వారా కలుగు అనుభవముతోను, పరిశీలనతోను (empirical method) యదార్థ విషయములను గ్రహించటమే

ఆధునికత్వము (Modernism) - మానవత (humanism) అనునవి దాదాపుగా ఒక రకమైన మధ్యస్థ రాజీ సమాధానాలు (compromises) అనవచ్చు ఇంకా స్ఫుటంగా చెప్పాలంటే అవి తార్కిక భౌతికవాదములు (dialectical materialism) అనవచ్చు మానవ ఆరంభదశ (origin) మానవ స్వభావములను గురించి వాటి విశ్వోత్పత్తి (cosmogony) సిద్ధాంతాలు వాటికి ఉన్నాయి మానవ గతస్థితి అంధకారం, అనాగరికం దాని నుండి బయట పడటానికి వలసిన వెలుగును, స్థిరత్వమును పొందటమే ఈ వాదము ఆశయము అనవచ్చు. దానికి అనుకూలమైన ఆర్థిక, సామాజిక మత పద్ధతులు ఆ

వాదములో ఉన్నాయి మూఢవిశ్వాసము అను దుర్బలత్వము, మందబుద్ధి (imbecility) నుండి వెలువడి బుద్ధి పరిపక్వత (sanity) సంస్కృతి (culture) నాగరికత (civilization) అను రహదారి (high way) పైకి వచ్చుటయే దాని లక్ష్యము

స్వర్గము, దేవుడు అను నామములు నిరాధారమైన, శూన్యమైనవని, అవి భ్రాంతీయంగా మానవుడు ఊహించుకున్నవి అని వీరి వాదన ప్రతి విషయమును పదార్థము, కదలిక (matter and motion) ఆధారంగా వివరించదగును అంటారు అంతర్భూతమైన వాస్తవికత (immanent reality) స్వీయమైన ఆంతరిక తార్కిక విధానము ద్వారా (unfolding itself by an inner dialectic) వికసించునని, హెగెల్ (Hegel) సిద్ధాంతము - దీనినే కొద్ది భేదముతో కార్లమార్క్స (Carl Marx) అనుమతించాడు హెగెల్ చెప్పిన అంతర్భూత వాస్తవికత లేక సత్యము (immanent reality or spirit) అను దాని స్థానములో పదార్థము (matter) అను పదము (word) ను ఉపయోగించాడు

పదార్థము స్వీయ చలనశక్తి కలదనియు, ఆ చలనశక్తి యొక్క అత్యున్నతమైన బాహ్యరూపమే మానవుడు అని ఈ మార్క్స వాదన సారాంశం ఇది ఒక విధమైన మానవ వ్యక్తిత్వ స్వీయ స్థిరీకరణ ఉద్యమం అనవచ్చు (a self-determining movement of expression of human personality) దీనిని పూర్తిగా భౌతికంగా పరిగణించారు (material) మనిషికి ఆత్మ వ్యక్తిత్వం (self) స్వేచ్ఛ, స్వీయ బాధ్యతలు నిరాకరించబడినవి ఒకనాడు నేరస్థులను, పాపులను శాశ్వతంగా దోషులుగానే పరిగణించారు కాని ఈ సిద్ధాంతం ప్రకారం వారిని తిరిగి ఆరోగ్యవంతులై సీతిమంతులుగా మార్చుటకు అవకాశం ఉన్నది కాని అది భగవంతుని కరుణాకటాక్షముల వలన మాత్రం కాదంటారు మానవుడు భౌతికశక్తుల పరిణామ దశారూపమే అయినను అతనిలో పవిత్రత ఉంటుందంటారు అట్టి దైవత్వానికి మానవుడు స్వల్పజీవి (too small) అని అందుచే ఆ దైవత్వం సమాజానికి చెందుతుందన్నారు

గ్రీకు తత్వసిద్ధాంతం ప్రకారం వాస్తవమైన ప్రగతి నిశ్చయమైన కార్యాచరణలోనే ఉన్నది (in positive action) స్పష్టమైన తార్కిక విధానం (concrete reasoning), బాహాటమైన లేక సామాజికపరమైన జీవశక్తి దానికి ప్రధానమైన అంశాలు (public spirit) అనాగరిక స్థాయి నుండి నాగరిక స్థాయికి ఎదుగుటకు నీతి, న్యాయసూత్రములతో ఒక విశాలమైన అల్లికను (frame work) లేక చట్టమును మానవులు తయారుచేసుకున్నారు దానికి అత్యున్నతమైన విలువలను ఇచ్చారు కాని పైన చెప్పిన నిశ్చయమైన కార్యాచరణ ద్వారా ప్రగతి అను సిద్ధాంత సందర్భంగా ఈ విలువలను సాంకేతికాచారము లేక లోకాచారము మాత్రమే అని త్రోసిపుచ్చారు ప్రకృతికి (Nature) దయ, న్యాయము అనేవి తెలియవు అన్నారు బలములోని తారతమ్యం దాని శక్తి మాత్రమే తెలుసు మతం ప్రవచించే శాంతి, సౌభ్రాతృత్వము ఎండమావులుగానే మిగిలిపోయాయి జీవిత, సామాజిక స్వస్థతకు వలసిన పరిస్థితులను, అంశములను తెలుసుకోవాలంటే జీవశాస్త్ర పరిధి (Biology) లోకి వెళ్లాలి మానవశరీరంలోని జీవాణువు స్వభావం కంటే బాహ్యంగా మానవ స్వభావం ఏ మాత్రం భిన్నం కాదు శత్రుజీవాలు ఏవైనా మానవ శరీరంలో ప్రవేశించగానే వాటిని వెంటనే చుట్టుముట్టి నాశనం చేసే రూపాలు (immune bodies) మానవ శరీరంలో ఉన్నాయి కాబట్టి జీవపరిణామ ప్రవాహంలో కలహాలు యుద్ధాలు (strife and war) అను అంశాలు అంతర్లీనంగా ఉన్నాయి అన్నారు అందుకే గ్రీకు సాహిత్యంలో యుద్ధభూమిలో మరణం స్వర్గసోపానం అన్నారు ఈ ఆర్యోక్తి భారతదేశంలో కూడా నాటుకుపోయిందని మనకు తెలిసిన విషయమే

అందుకే గ్రీకులు ఏథెన్సు (Athens) పట్టణ ప్రగతికి ఏ సూత్రం ఉపయోగపడుతుందో అదే అవుసరమైనది, ఉన్నతమైనది కూడా అన్నారు ఇది ఈనాడు మానవులందరికి పరమావధి అయినది అదే వ్యక్తిపరంగా అయితే స్వార్థం అంటారు సమాజపరంగా, దేశపరంగా అయితే సమాజసేవ,

దేశభక్తి అన్నారు తమకేది లాభం కలిగిస్తుందో అదే సవ్యమైనది (right) లాభం కలిగించనిది తప్పు అన్నారు మానవత్వం, సౌభ్రాతృత్వం ఆశయాలుగా చెప్పబడిన క్రైస్తవమతం కూడా ఈ ఆలోచనా సరళిని మార్చలేకపోయింది బ్రిటిష్ తాత్వికుడు సర్ థామస్ బ్రౌన్ (Sir Thomas Browne) తన 'రిలిజియో మెడిసి' (Religio Medici) అన్న గ్రంథంలో ఇలా అన్నారు "అందరు ఒకే సమయంలో సుఖమును పొందలేరు ఒక దేశ ఉన్నతి, మరొక దేశ పతనం మీద ఆధారపడుతుంది" అదే భావమును వోల్టైర్ (Voltair) మహాశయుడు కూడ ప్రకటించాడు "మానవజాతి పరిస్థితి అలాగే ఉన్నది స్వదేశ ఔన్నత్యం కావాలంటే ప్రక్కనున్న దేశవినాశం కోరినట్లే"

ఈ సిద్ధాంతాలు క్రమంగా బలం పుంజుకుని ఊడలుగా వ్యాపించినై నాగరికతా ఔన్నత్యం (the most civilized state) పొందిన దేశం అంటే అది అత్యంత కలహాభిలాషి (aggressive) అని నిర్వచించారు ఈ కలహాలు, యుద్ధాలు ఈ ప్రపంచం, మానవజాతి ఉన్నంతవరకు ఉంటాయి అన్నారు మానవ ఆలోచనా సరళి, మానవ స్వభావం ఆరోగ్యవంతమైన మరొక సరళీకృత మార్గ అన్వేషణను వ్యతిరేకించింది మానవుడు ఆహార అన్వేషి అడవులలో జంతువుల 'చంపటం, చంపబడటం' అను జీవనక్రమం అని భావార్థం స్త్రీకి మాతృత్వం ఒక వరం అన్నారు మాతృత్వం ఒక భారమైన, ఎంతో బాధతో కూడిన ప్రక్రియ అయినా మాతృత్వం ఎంతో ఉత్కృష్టమైనది అంటారు గదా! ఈ సత్యాన్నే యుద్ధ సిద్ధాంతానికి అపాదించారు స్త్రీకి మాతృత్వం ఎలాగో అట్టిదే పురుషునికి యుద్ధ అనుభవం ఫలితం అన్నారు

ఇటలీ దేశపు నియంత ముస్సోలినీ (Mussolini) యుద్ధమును ఇలా నిర్వచించాడు, "మానవశక్తిని అత్యున్నత స్థాయికి తీసుకువెళ్ళగలిగేది యుద్ధం ఒకటి మాత్రమే యుద్ధమునకు సాహసించే వారే అత్యున్నత ఘనతకు (nobility) అర్హులు"

భూకంపము సహేతుకంగాదు (unreasonable) అలాగే రోగాలు, అంటువ్యాధులు కూడా వాటికి నీతి, న్యాయాలు ఉండవు యుద్ధం కూడా అట్టిదే అన్నారు పరిపూర్ణ శాంతి అంటే, అది మరణం ద్వారానే అన్నారు భౌతికంగా శాంతి అంటే తాత్కాలికమైన సంధి ఒప్పందాలే (armistice or truce) శాంతి అనేది పరస్పర సహనమునకు చిహ్నము అన్నారు అయినా నియంత్రించబడిన లేక అంతర్లీనంగా ఉండే శతృత్వ స్వభావమే జీవపరిణామ ప్రగతి లక్షణము అన్నారు ఆ విధంగా నాగరిక జీవితంలో యుద్ధము అను భావం అతిసామాన్య భాగంగా (normal part) గ్రహించటానికి మానవుడు అలవాటుపడ్డాడు అన్నారు

హెగెల్ సిద్ధాంతం ప్రకారం ప్రష్యా (ఆధునిక జర్మనీ) దేశపు సైనిక ప్రభుత్వం అనగా ఆనాటికి ఉన్న స్థితి ఈ ప్రపంచంలో 'దైవ ఆత్మకు' (the spirit) మహోన్నతమైన రూపం అదే మరొక విధంగా చెప్తే నీతి, న్యాయములకు స్థానం నిరాకరించబడింది అని అర్థము

'మంచి' అనగా వర్తమాన వాస్తవ స్థితి అని భ్రమలోపడి మంచి-చెడుల తారతమ్యమును బలమైనది - బలహీనమైన దానికి గల భేదమునకు దిగజార్చారు ప్రధానం బలప్రయోగం, నిర్బంధన మంచి-చెడులతో పనిలేదు మంచికి మరింత శక్తివంతమైన బలప్రయోగం అని అర్థం చెప్పబడినది ఈ విధంగా ఏ ప్రభుత్వమునకు నీతిపరంగా స్థానం లేకుండా పోయింది జాతి పోరాటాలు కాని, వర్గపోరాటాలుగాని బలప్రయోగం ద్వారా మాత్రమే పరిష్కరించవచ్చునను విశ్వాసము బలపడినది

ఏ దేశానికైనా, ఏ జాతికైనా, కుల, వర్గానికైనా వాటి అవసరాలకు అనుకూలమైనదే సత్యమైనది అని, మిగిలినవి అన్ని అసత్యములని విశ్వసించటం జరుగుతోంది

వాస్తవమైన ప్రజాస్వామ్యమునకు పరిపూర్ణ భౌతికరూపం ఇవ్వకలగటం

వర్తమాన తరం (present generation) వారి అత్యంత ముఖ్యమైన బాధ్యత ఇచట ఒక ప్రశ్న ఉదయించటం సహజం అసలు బలప్రయోగం అనేది అవసరం లేదా? ఉన్నది న్యాయబద్ధమైన, చట్టపరమైన నియంత్రణకు దాని అవసరం ఉన్నది భారతదేశంలో హైందవ చట్టములు అందుకే నిర్దేశించబడినవి కాని బలప్రయోగంతో సాధించినవానికి పరిపూర్ణత సిద్ధించదు అని చెప్పబడింది మహాభారతంలో (XII-94-1) ఇలా చెప్పబడింది

"హింసయా సంయుతమ్ ధర్మం అధర్మంచ విదుర్ బుధాః"

యుద్ధము ద్వారా సాధించిన దానికంటే యుద్ధము లేకుండా సాధించిన విజయం గొప్పది అన్నారు

ఈ హేతువాద వివరణ సందర్భంలో ఒక సందేహం వస్తుంది పాశ్చాత్య నాగరికతలో మత విలువలకు స్థానం లేదా? పాశ్చాత్య నాగరికత అంతర్భాగ విశ్లేషణ ప్రయత్నిస్తే దీనికి సమాధానం దొరుకుతుంది పాశ్చాత్య నాగరికతా సౌధానికి మూలస్తంభాలు మూడు అన్నారు (1) గ్రీకు దేశపు కళలు, సంస్కృతి (art and culture), రోమ్ దేశపు చట్టములు, నిర్మాణక్రమము (law and organization), (2) క్రైస్తవ మతము దాని నైతిక విలువలు, (3) విజ్ఞానశాస్త్ర వికాసము (scientific enlightenment) పాశ్చాత్య మత జీవితము (religeous life), పాశ్చాత్య నాగరికతపై దాని ప్రభావం ఎంత వరకు ఉన్నది పరిశీలించినపుడే పాశ్చాత్య నాగరికతా విశ్లేషణ సాధ్యపడుతుంది

క్లుప్తంగా వివరిస్తే పాశ్చాత్య మతసాంప్రదాయాలలో మూడు విధములైన ప్రవాహాలు అంతర్లీనంగా ఉన్నట్లు గమనించవచ్చు ఇవి తరచు పరస్పర విరుద్ధంగా ఉన్నట్లుగా గూడా సూచనలు కనబడతాయి ఈ ప్రవాహాలను సంగ్రహంగా (1) గ్రీకు-రోమ్ (Greeco-Roman) ('2) హీబ్రూ (Hebrew) (3) హిందూమత నిగూఢత్వం (Hindu mysticism)

గ్రీకు-రోమ్ నాగరికత ప్రధాన లక్షణాలు (1) హేతుప్రాధాన్యం (rationalism) (2) మానవత (Humanism) (3) రాష్ట్ర అధికారం మిన్న (sovereignty) అను సిద్ధాంతాలు మత సాంప్రదాయాలను, నియమాలను ఎదురించటం, ఎంత అసౌకర్యమైనా భరించి యోచనాతత్వము (spirit of speculation) నకు ప్రాధాన్యం ఇవ్వటం గ్రీకులతోనే ప్రారంభమైందనవచ్చు ప్రపంచం ఎవరో ఒక దేవుని సృష్టి గాని, లేక మానవునిచే సృష్టించబడినది గాని కాదన్నారు గతంలో కాని, వర్తమానంలో గాని, ఇక భవిష్యత్తులో గాని అలా నిరంతరం ప్రకాశించే సజీవజ్యోతి (ever-living) అనియు అది కాలగతిన వలసిన పరిమాణంలో స్వయంసృష్టి, స్వయంగానే అంతరించటం వంటి శక్తులను పొందుతుంది అన్నారు మూఢనమ్మకముల నుండి, అసత్యముల నుండి మానవాళిని ఉద్ధరించటమే గ్రీకు నాగరికత ముఖ్య లక్షణము

ఆధునిక నాగరికతా ప్రభావమునకు కారణములు సైన్సు దృక్పథము (the spirit of science), హేతువాదము (rationalism) మతముతో సంబంధంలేని మానవతాదృష్టి (secular humanism), రాష్ట్ర సార్వభౌమత్వం (sovereign state) కాని ఆధునిక నాగరికతను ప్రభావితం చేసిన ఈ అంశాలు పూర్తిగా ఆధునికం కాదు క్రీ॥పూ॥ నాలుగైదు శతాబ్దముల నాటి గ్రీకు నాగరికతలోనే ప్రభవిల్లినై

ఈనాటి పాశ్చాత్య జీవశాస్త్ర (Natural Science) విజ్ఞానానికి ఆనాడే గ్రీకులు బీజావాపనం చేశారు ఏ విషయమునైనా విశ్లేషించుట (analyse) పరిశోధించుట (explore) పరీక్షించుట (test) నిరూపించుట (prove) అను ప్రక్రియలను హేతువు ఆధారంగా (in the light of reason) సాగించటమే ఆనాటి గ్రీకుల ఆశయము సిద్ధాంత పరిగణనలోనికి రాని జీవితాంశమంటూ లేకుండ చేశారు జీవన విధానమును హేతుదృక్పథములోనికి తెచ్చి మానవ జీవన విధానమునకు సరైన మార్గం తెలుసుకుని, దానిని హేతువు ఆధారంగా

రూపొందించిన సూత్రాలతో (principles of reason) సమన్వయించి పురాతన మూఢవిశ్వాసముల వలన ఏర్పడిన సంకులస్థితికి ఒక క్రమస్థితిని కల్పించిన వారిలో గ్రీకులు ప్రథములు పరిశీలనా విధానమునకు లోనుగాని జీవనమార్గమును వ్యతిరేకించాడు సోక్రటీసు ఆనాటి సంప్రదాయబద్ధంగా స్థిరపడిన పడికట్టు మాటలను (catch words) పరిపూర్ణంగా విశ్లేషించాడు మానవ స్వభావం ప్రధానంగా మంచిదేనని, చెడు అనేది ఎపుడో జరిగే పొరపాటు వంటిది అని విశ్వసించాడు సోక్రటీస్ (Socrates)

సార్వజనీనమైన భావములే వ్యక్తిగత స్వభావమునకు గూడ వర్తిస్తాయని, వ్యక్తిగతం కంటే సార్వజనీనమే (universal) వాస్తవమైనది అన్నాడు ప్లాటో అనిత్యమైన స్థితి (transient realm) నుండి విముక్తి పొంది, నిత్యానుభవములో ఎదురయే కలవరములను (confusion) పొరపాట్లను తొలగించుకుని వాస్తవమైన ప్రపంచమును గురించి యోచించేవాడే తాత్వికుడు కాగలడు అని విశ్వసించాడు ప్లాటో (Plato) రూఢియైన వాస్తవ స్థితిలోని (concrete reality) మానవుని గురించియే నిరంతరం వారి ఆలోచన మానవునికి పూర్తి ఇంద్రియ స్వేచ్ఛ మానసిక శక్తులకు పరిపూర్ణ అవకాశము వారి ఆశయము మానవునిలోని ప్రతిభాగం పరిపూర్ణంగా ఎదగనిచ్చి వాటి మధ్య సమన్వయం కలిగేటట్లు ప్రయత్నించాలి ఇంత తాత్వికులైనను గ్రీకులు మత విషయంలో గాని నీతి విషయాలలో గాని ఏ మాత్రం శ్రద్ధ చూపలేదు, బుద్ధి మళ్లించలేదు వారికి తెలిసిన దేవతలు ఒలింపియన్ శిఖరం (Olympian Gods) మీద ఉన్నట్లుగా భావించబడిన శక్తులు మాత్రమే ఆ శక్తి రూపాలు పన్నెండుగా (twelve gods) భావించారు వాస్తవానికి అవి ప్రకృతి శక్తులు అటుపై వాటిని మానవ వివిధ స్వభావ ప్రతీకలుగా గుర్తించారు గ్రీకు పౌరాణిక గాథలలో వాటిని మానవాతీత శక్తి రూపాలుగా చిత్రించారు ప్రత్యేక ఉన్నత ఆధ్యాత్మిక సిద్ధాంతములతో కూడిన మతము అని ఏదీ గ్రీకులకు ఉన్నట్లు సూచనలు లేవు

కాని మతవిశ్వాసాలు రాజకీయాలకు ఉపయోగపడినై ప్రతి ఒక్క పట్టణమునకు ఒక దేవత రక్షణ ఉన్నదనే విశ్వాసం గాఢంగా ఉండేది మత ఉత్సవాలకు గ్రీకులకు మాత్రమే ప్రవేశముండేది ఈ సంప్రదాయ విశ్వాసాలను ఎదిరించినందుకే సోక్రటీసును ఉరితీశారు

వారి ప్రార్థనలలో ప్రధానాంశాలు ఆరోగ్యము, శారీరక బలము, పట్టణములో కీర్తి, స్నేహితులతో సాన్నిహిత్యము, యుద్ధములలో రక్షణ, సంపద వృద్ధి మాత్రమే ఉండేవి ఆధ్యాత్మిక దృక్పథము ఏ మాత్రము గోచరించదు అరిస్టాటిల్ కూడ దాదాపు ఇవే అంశాలను ప్రస్తావించాడు (ఆయన పుస్తకం Rhetoric లో) సుఖం అనగా ఆయన నిర్వచనం ఇది మంచితనముతో కూడిన సంపద, స్వతంత్ర జీవనం, రక్షణ గల జీవనం, ఈ విధమైన జీవనమును ఈయగల సంపన్నమైన రాష్ట్రము లేక ప్రభుత్వము సంపన్నమైన పుట్టుక, విరివిగా స్నేహితులను కలిగియుండుట, సత్సంతానము, సుఖవంతమైన వృద్ధాప్యము, శారీరకంగా మనిషి దృఢత్వమును, ఆరోగ్యము, సుందరమైన రూపు వ్యాయామంతో ఎదిగిన శరీరం, - ఇంతకు మించి సుఖం అనేది ఏదీ లేదు అంటాడు వృద్ధాప్యం అంటే గ్రీకులకు ఏవగింపు వృద్ధాప్యం, మరణం లేని అత్యున్నత మానవరూపాలనే దేవతలుగా ఊహించారు

ఆధ్యాత్మిక జీవితమును గురించి గాని, మరణానంతర జీవితమును గురించి గాని గ్రీకులకు ఒక అభిప్రాయం ఉన్నట్లుగా ఎక్కడా సూచనలు లేవు వారి తాత్విక చింతనలో దానికొక నిర్దుష్ట స్థానం లేదు మరణానంతర జీవితమును గురించి ప్లాటో కూడ (ఆయన Republic అను గ్రంథం) నిశ్చితాభిప్రాయం వెల్లడించలేదు అది అమరత్వం ఔతుందా లేక స్వప్నరహితమైన నిద్రవంటిదా తేల్చుకోలేకపోయాడు అరిస్టాటిల్ అయినా ఈ విషయంలో ఇంతకు మించి ఏమి స్పష్టత కనబరచలేకపోయాడు (ఆయన (Nichomachean Ethics అను గ్రంథములో) మనిషి మరణానంతరం మంచి

లేక చెడులకు అతీతుడు అన్నాడు గ్రీకు దేశం ప్రాభవంలో ఉన్నపుడు గ్రీకు తత్వదృష్టి ప్రత్యక్ష ఏకాత్మక దర్శనము (positivism) మానవత (Humanism) వరకే పరిమితమైనది అనగా అనుభవం ద్వారా గడించిన విజ్ఞానమును ప్రత్యక్ష పరిశీలన ద్వారా నిర్ధారించుట మానవాతీత, దైవవిషయాల కంటే మానవ విషయాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చుట ఇదే క్రమంగా వర్తమానకాలంలో హేతువాదంగా రూపొందింది (Rationalism)

గ్రీకుల తత్వచింతనలో ఆధ్యాత్మికంగా శూన్యత (vacuum) ఏర్పడింది ఈ శూన్యత రాష్ట్రభక్తి (devotion to the city-state) తో పూరించబడింది గ్రీకు సమాజంలో ఒక నగరం ప్రమాణకాంశము (unit) అందుచే ఆ నగరం ఎడల భక్తి పౌరుల బాధ్యతగా గుర్తించారు ఏ నగరము మరొకరి ఆధిపత్యమును అంగీకరించలేదు అందువలననే గ్రీకులు తమ నగర భక్తి దృష్టిలోపడి దేశ ఐకమత్యమును మరచారు ప్లాటో ఆదర్శమైన సమాజమును ఆశించాడు కాని అది ఒక నగరదేశమును దృష్టిలో ఉంచుకునే చెప్పబడింది కాని అఖిల మానవ సమాఖ్య లేక ప్రజాప్రభుత్వముగా ఊహించబడినట్లుగా లేదు ఈ దేశ (నగర) భక్తి అనబడు అసత్య మతవిశ్వాసంతో గ్రీకు నాగరికత అంతరించింది ఏ వ్యామోహం (disinterested) లేకుండా విజ్ఞానమునకై శ్రమించుట అను వారసత్వమే గ్రీకు నాగరికత పాశ్చాత్య దేశాలకు ఇచ్చింది కాని దీనికి వ్యతిరేకార్ధకంగా పైన చెప్పబడిన నగర-దేశభక్తికి దారితీసింది అదే హెగెల్ మొదలగు వారి సిద్ధాంతములకు మూలము గ్రీకు నాగరికత అంతరించటంతో ఈ నగర-దేశభక్తి అదృశ్యమై దాని స్థానంలో జనబాహుళ్య భావం (Public spirit) ఏర్పడింది

గ్రీకుల తరువాత రోమనుల నాగరికత రూపొందింది ఇది కొంతకాలం ప్రభావం చూపింది కాని రోమ్ మతమునకు, రాష్ట్రము (ప్రభుత్వమునకు)నకు పరస్పర సంబంధం ఏర్పడింది ప్రభుత్వ ఆమోదం పొందిందే ఆ రాష్ట్రమతం

ప్రజలు ఆ మతమును గౌరవించినంత కాలం వారివారి వ్యక్తిగత విశ్వాసాలను కలిగియుండవచ్చు మతకార్యక్రమములకు పూజారులు ఏర్పరచబడ్డారు నూతన, వినూతన ఆరాధనలు ఆమోదించబడినవి క్రమంగా రోమ్ వింతవింత విశ్వాసాల పురావస్తు ప్రదర్శనశాలగా (Museum) మారింది అంతే కాకుండ జూలియస్ సీజర్, ఆగస్టస్ వంటి అపారమైన అధికార బలం కల ప్రభువులను మానవాతీత శక్తులుగా పూజించటం ప్రారంభమైనప్పటి నుండి దురభిమానం పెరిగి దైవారాధన సన్నగిల్లింది ప్రభువులపై దైవత్వ ఆరోపణ (Apotheosis) లతో మత నిగూఢత్వం (mystery) అంతరించి, మతం జాతీయగీతంగా మారింది (national anthem) ఆ రకమైన మతము మానవుని ఆధ్యాత్మిక సాధనకు, అమృతత్వ కోరికలకు దూరమై రోమ్‌లోని వివిధ రాష్ట్రముల ఐక్యత కల్పించలేకపోయింది ప్రతి రాష్ట్రము వారి ప్రత్యేక మతమునే గౌరవించి పొరుగు వారి మతమును ద్వేషించారు ప్రాంతీయతత్వం ప్రబలి పర్యవసానంగా రోమ్ సామ్రాజ్యం పతనమైంది ఎపుడైతే ఈ పురాతన మత సంప్రదాయాలు అంతరించినవో అపుడే నూతన మతమైన క్రైస్తవం వెలుగులోకి వచ్చింది రోమ్ సైనిక విజయాలతో దానికి ఇతర జాతులతోను వారి మత సంప్రదాయాల తోను స్పర్శ ఏర్పడింది అపుడే రోమ్ దేశపు మతపరమైన లోపాలు, దారిద్ర్యము బయటపడి ఇతర దేశపు మత ప్రభావానికి లోనైంది రోమ్ కొంత ఘర్షణ తదుపరి క్రైస్తవం విజయం సాధించింది రోమ్ చక్రవర్తి కాన్‌స్టంటైన్ క్రైస్తవమతం అనుసరించటంతో (క్రీ॥శ॥ 306-337లో కాన్‌స్టంటైన్ (Constantine) రోమ్‌ను పాలించాడు) సనాతన యుగము, దాని ప్రతిభ అంతరించింది అటుపై అనగా దాదాపు క్రీ॥శ॥ 5వ శతాబ్దాంతం నుండి 11వ శతాబ్దం వరకు పాశ్చాత్య దేశాలలో సాంఘికంగా, మతపరంగా, రాజకీయంగా అంధకారమైంది దీనినే అంధయుగం (Dark Ages from the end of 5 AD to 11 AD) అన్నారు 11వ శతాబ్దం నుండి 13వ శతాబ్దం వరకు మధ్యయుగంగా చెప్పబడింది 14వ శతాబ్దం నుండి ప్రారంభమైన ఆధునికయుగం 16వ శతాబ్దంలో పునరుజ్జీవన

(Renaissance) ఉద్యమంతో శక్తివంతమైంది

పాశ్చాత్య మతజీవితమును ప్రభావితం చేసిన వాటిలో యూదుల మత విశ్వాసాలు కూడా ఉన్నాయి ప్రవక్తల జీవితాలే యూదుల (Jews) ఘనత గ్రీకు తాత్వికులకు భగవంతుడు పరిపూర్ణమైన మంచితనమునకు భావరూపం, యూదులకు, అటు తరువాత క్రైస్తవులకు కూడ భగవంతుడు సర్వోన్నతుడు అతడు తన సంకల్పమును (will) ప్రవక్తల ద్వారాను తన అజ్ఞానువర్తుల ద్వారాను మానవులకు తెలియజేస్తాడు అని వారి విశ్వాసము క్రైస్తవులు ఒక అడుగు ముందుకు వేసి, భగవంతుడు మానవరూపం పొంది ఈ భూమిపై మానవజీవితానికి మార్గం చూపాడు అన్నారు గ్రీకులకు ఏదో ఒక చారిత్రక ఘనసంఘటన (great event) ద్వారా భగవంతుడు తమకు వ్యక్తమై విముక్తి కలిగిస్తాడను విశ్వాసంతో ఎదురుచూడటం వంటి చింతన లేదు ఒక నిశ్చితమైన ధ్యేయంతో చరిత్ర పరిభ్రమిస్తూ ఉంటుంది అని మాత్రమే వారు విశ్వసించారు

కాని యూదులు (Jews) మాత్రం అట్టి సంఘటన నిశ్చయంగా చరిత్ర తీరునే నిర్ణయించగలదని గాఢమైన విశ్వాసం కలవారు రక్షకుడెవరో వస్తాడు అను విశ్వాసం యూదుల (Jews (or) Hebrews) చరిత్రలోనే అతిప్రధానమైన విషయం ఈ విశ్వాసమే క్రైస్తవమతంలో కూడ సజీవంగా ఉండిపోయింది మానవాళికి యూదులు ఇచ్చిన కానుక వంటిది, ఏకేశ్వర ఆరాధన (Monotheism) కాని ఆ ఈశ్వరుడు నిర్గుణుడు, నిరాకారుడు కాదు సగుణుడు, సాకారుడు అయిన ఇష్టదైవము తనను నమ్మినవారిని ఇష్టపడే దైవము

క్రైస్తవం గ్రీకు, యూదుల విశ్వాసాలను మిళితం చేసింది ఆ రెండు విశ్వాసాల కూడలి (Cross Roads) కేంద్రంగా సైంట్ అగస్టైనును గుర్తించవచ్చు అగస్టైను క్రీ॥శ॥ 5వ శతాబ్దం వాడు తన కన్నుల ముందే మహాశక్తివంతంగా

వెలిగిన రోమ్ సామ్రాజ్యం పతనం కావటం చూసి సర్వోత్కృష్టమైన సత్యమే భగవంతుడు అని గుర్తించాడు అన్ని పరిణామాలకు అతీతుడై పరిణామరహితుడు అనగా మార్పులు లేనివాడు భగవంతుడొక్కడే అన్నాడు క్రైస్తవులు మతాచార్యుల వద్ద తమ తప్పులను లేక పాపములను ఒప్పుకొనుట (confessions) అను దాని భావం ఇదే అయి ఉండవచ్చు

యూదుల చారిత్రక విశ్వాసాలు, క్రైస్తవుల భగవదవతార విశ్వాసం అనునవి నిర్గుణుడు, నిరాకారుడైన పరమాత్మ అను భావముతో సమన్వయ పరచుట అసాధ్యము తమ మతం ఒక్కటే సత్యమైనది అను భ్రమ (myth) కు అంకురార్పణ చేసింది యూదులే తాము భగవంతునిచే ఎన్నుకొనబడిన మానవులు (chosen people) అను విశ్వాసంతో వారు తమ మతమును వ్యాపింపజేయుటకు ప్రయత్నించలేదు ఒక రకమైన ఆధిక్యతా భావం యూదుల నుండే క్రైస్తవులకు వారసత్వంగా వచ్చింది గ్రీకుల నుండి అస్పష్టమైన ఆశయాలు, ఆత్మను గురించిన అస్పష్టత వచ్చింది రోమన్ల నుండి ఆచరణ యందు ఉత్సుకత, క్రమబద్ధత యందు ఇచ్ఛ వచ్చింది అన్ని కలిసి క్రైస్తవమతమును వ్యవస్థీకరించుటకు తోడ్పడినవి ప్రపంచరాజ్యము (world dominion) అను విపరీత వాంఛ అన్యమతముల నుండి క్రైస్తవంలోనికి ఆకర్షించుటయే సిద్ధాంతంగా మారింది (proselytizing creed)

రోమ్ చక్రవర్తి కాన్స్టన్టైన్ (Constantine) తరువాత అధికారుల యందు, మతాచార్యుల యందు ఇతర మతములపై అపరిమిత అసహనం ఏర్పడింది 'నన్ను అనుసరించనివాడు నాకు వ్యతిరేకి నాతో కలవలేనివాడు చెదిరిపోవును' అను ప్రవక్త మాటలను ఆధారంగా చెప్పుకుని ఈ అసహనం విస్తరింపజేసారు రాష్ట్ర (ప్రభుత్వ) ఆధిక్యతకు చర్చి ఆమోదముద్ర లభించింది

ఐరోపాలో రోమ్ దండయాత్రలు, పరిపాలన వలన స్థిరమైన చట్టాలు, భాషలు ఏర్పడినవి క్రీ॥శ॥ 5వ శతాబ్దాంతంలో ఐరోపా ఉత్తరభాగము నుండి

వచ్చిన దండయాత్రల వలన రోమ్ సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది కాన్‌స్టాంట్ నోపిల్ (Constantinople) లో రోమ్ పూర్వపు అధికారం ఛాయలుగా మిగిలినప్పటికి, ఐరోపా ఖండములోని పూర్వపు ఐక్యత అంతరించింది క్రీ॥శ॥ 1453లో టర్క్‌లు కాన్‌స్టాంట్‌నోపిల్‌ను ఆక్రమించుటతో రోమ్ సామ్రాజ్యపు ఛాయలు కూడ అంతరించినవి

క్రీ॥శ॥ 11వ శతాబ్దం నుండి 13వ శతాబ్దం వరకు అనగా మధ్యయుగంలో పాశ్చాత్య దేశాలలో క్రైస్తవమతం అగోచరుడగు భగవంతుడే సత్యము అను నిశ్చితాభిప్రాయం కలుగజేసి అతడే మానవుని జీవితగమ్యమునకు మూలము అను విశ్వాసం కలుగజేసింది ఇది క్రమంగా మత దురభిమానంగా మారి సంకుచితత్వమునకు దారితీసింది

కాని భౌతిక, మానస శక్తిని ఇంకా కలిగి ఉన్న కొందరు దీనిని వ్యతిరేకించి తమ అభిప్రాయాలను నిశ్చితబుద్ధితో ప్రకటించారు ఆంతరిక మానసిక పరిపక్వత క్రమంగా ఏర్పడి 14వ శతాబ్దంలో పునరుజ్జీవన ఉద్యమం రూపొందింది

హేతువు ఆధారంగా సాగిన గ్రీకు తత్వవిచారంలో మతమునకు స్థిరమైన స్థానము లేకపోయినను, ఆత్మతత్వ విచారమును పూర్తిగా విస్మరించారు అనుటకు వీలుపడదు పైథాగరస్ (Pythagoras) ఆత్మ, పునర్జన్మలను గురించి చర్చించాడు బహుశ అతడు పునర్జన్మ సిద్ధాంతమును ఈజిప్టు నుండి పొంది ఉండవచ్చును అని కొంతమంది పాశ్చాత్య తాత్వికులు అభిప్రాయపడ్డారు కాని ఈజిప్టులో ఎపుడూ కూడ పునర్జన్మ, దేహాంతర ప్రాప్తి (transmigration) సిద్ధాంతాలపై విశ్వాసం ఏమాత్రం లేదని చరిత్ర స్పష్టం చేస్తోంది కదా! అందువలననే అయి ఉండవచ్చు, మరికొంత మంది పాశ్చాత్యతాత్వికులు పైతాగరస్ భారతీయ 'ఆత్మతత్వజ్ఞాన' ప్రభావమునకు లోనై ఉండవచ్చునని అభిప్రాయపడ్డారు దీనికి కారణం కూడ ఉంది పైథాగరస్ బోధించిన మత,

తాత్త్విక, గణిత సిద్ధాంతాలు దాదాపుగా అన్నీ భారతదేశంలో క్రీ॥పూ॥ 6వ శతాబ్దం నాటికే తెలిసియున్నవని వేదగణిత భాగాలు తెలుపుతున్నాయి గదా! పైతాగరస్ కూడ (క్రీ పూ 6) ఆ కాలంనాటివాడే పైతాగరస్ కూడ జైనులు, బౌద్ధుల మాదిరే జీవహింస వ్యతిరేకించాడు పైతాగరస్ పర్షియా ద్వారా ఈ భారతీయ తత్త్వవిచారమును గ్రహించి ఉండవచ్చుననుటయే సమంజసంగా ఉంటుంది అని పాశ్చాత్య తాత్త్వికుల అభిప్రాయం

అలాగే సోక్రటీసు (470-399 BC) కూడ హేతుజ్ఞానం ద్వారా స్వయంగా క్రమశిక్షణ పొందవచ్చునని (self-discipline) సిద్ధాంతీకరించినప్పటికి, అతడు మతవిశ్వాసం కూడ కలవాడని అన్నారు తరచుగా అతడు 'ఆంతరిక ధ్వని' (శబ్దము) (inner voice) అని అంటూ ఉండేవాడట దానినే మనం అంతరాత్మ అంటుంటాము కదా! ఆ అంతరాత్మ వాణియే తాను చేయతలచిన కొన్ని పనులను నిరోధించేదని కూడ అనేవాడట సోక్రటీస్ తాను ఒక విధమైన తాపసి (mystic) అగుట వలన అపుడపుడు సోక్రటీస్ గాఢమైన ధ్యానముద్రకు లోనయేవాడట మానవాతీతమైన ప్రపంచమేదో ఉన్నదని, ఆ స్వర్గ నగరంలో తాను సభ్యుడనను భావం అతనికి ఉండేదట బహుశ ఆత్మ శాశ్వతం అని సోక్రటీసు విశ్వసించి ఉండవచ్చు సుఖం అనగా భవబంధముల నుండి విముక్తి అని, మానవులందరు సోదరులే (విశ్వమానవ సౌభ్రాతృత్వము) అనియు విశ్వసించి యుండవచ్చునని కూడ తాత్త్వికుల అభిప్రాయం

ఇదే తాపసిక సంప్రదాయ భావం ప్లాటోలో కూడ కనబడుతుంది (427-347 BC) గ్రీకు సిద్ధాంతమైన హేతువాదమును ప్లాటో పూర్తిగా అనుసరించినట్లు కనబడదు సత్యమును అన్ని సమయములలోను నిరూపించుట కుదరదు అన్నాడు కొన్ని సమయములందు సత్యమును సూచించుట మాత్రమే చేయనగును దానిని మానసికంగా శబ్దములలో వ్యక్తపరచుటకు వీలుగాక తార్కికంగా మాత్రమే గ్రహింపనగును అన్నాడు

సత్యము అనేది ఒక బుద్ధికి మాత్రమే కాకుండ మానవుని సంపూర్ణ ప్రకృతి (స్వభావం)కి సంబంధించినది అని ప్లాటో అన్నాడు కవులను (Poets) గురించి ప్లాటో ఇలా అన్నాడు 'కవి ఒక సున్నితమైన, రెక్కలు గల పవిత్రమైన వస్తువు కవి భగవంతుని స్వంతము అతనినే తన వాణిగా పరిగణిస్తాడు' (a light and winged and tidy thing, one whom god possesses and uses as his mouth piece) ఈ ప్రపంచంలో మనకు గోచరమయ్యే రూపాలు వేరు, అందులో మనం చూడగలిగే రూపాలు వేరు వివేక విశిష్టమైన ఆత్మ ద్వారా మాత్రమే (rational soul) ఆ అంతర రూపాలను గ్రహించగలము అన్నాడు ప్లాటో దృష్టిలో వాస్తవములు (reality) రెండు విధములు రూపములు (The Forms) నిరంతరం అవి ఉన్న విధంగానే ఉండాలి కాని మనకు గోచరమయ్యే రూపములు ఎన్నో నిరంతరం మారుతూనే ఉన్నాయి ఈ వాస్తవం రెండు విధములు అన్నాడు ప్లాటో అగోచరములు, ఎట్టి మార్పునకు లోను గానివి ఒక రకము మరొక రకము మనకు గోచరమయ్యేవి, నిరంతరం మార్పుకు లోనయ్యేవి ఆత్మ అనేది అగోచరము, శాశ్వతము, మార్పులకు లోనుగానిది శరీరము గోచరము, అశాశ్వతము, మార్పులకు లోనయ్యేది ఆత్మ ఇంద్రియములతో మిళితమైనపుడు తన ఉనికిని కోల్పోయి, మార్పులకు లోనయ్యే ఈ ప్రపంచంతో సన్నిహితమవుతుంది ఎప్పుడైతే ఇంద్రియ ప్రభావముల నుండి విడివడుతుందో, అపుడే తిరిగి ఉనికిని పొంది, స్వచ్ఛమైన, శాశ్వతమైన, మార్పులకు లోను గాని స్థితిని పొందుతుంది తాత్వికుల ఇంద్రియాతీత దృష్టి (దివ్యదృష్టి కావచ్చు)ని గురించి ప్లాటో ఇలా అన్నాడు "తత్వజ్ఞులమైన మేము పరమానందకరమైన (beatific vision) దృశ్యమును చూచాము మేము ఒక నిగూఢత్వములోనికి (mystery) ప్రవేశపెట్టబడినాము (initiated) అది అతిపావనమైన, అనుగ్రహింపబడిన స్థితి మా అమాయక స్థితిలో దానిని స్తుతించుకున్నాము అది మాకు ఏ పాపమును గురించి తెలియని స్థితి ఆ స్థితిలో మాకు అమాయకులైన, సాధువులైన, శాంతముతోను, ఆనందంతోను

శుద్ధమైన వెలుగులో ప్రకాశించెడు ఆకారములను చూచుటకు అనుమతి లభించినది మేము శుద్ధులమైనాము కాని ఇంకను మేము ఆ జీవన్ముక్తి (living tomb) స్థితికి చేరలేకపోయాము ఈ శరీరములో చిప్పలోని ముత్యమువలె బంధింపబడియున్నాము " ('ఫైడ్రస్' అను గ్రంథము నుండి (Phaedrus))

ఇంకను శాశ్వత ఆత్మను గురించి ఇలా అన్నాడు "ఆత్మ శరీరమును వీడి తన యధాస్థితిలోనికి వచ్చినపుడు, అది ఆలోచిస్తుంది మరియొక ప్రాంతములోనికి పయనమవుతుంది ఆ ప్రాంతము స్వచ్ఛమైనది, ప్రశాంత మైనది, శాశ్వతమైనది అయి ఉంటుంది ఆ ప్రదేశముతో తన సంబంధము అనుభవమును పొందుతుంది అచట తాను తన నియంత్రణలోనే ఉంటుంది అచట పునర్జన్మ నుండి విశ్రాంతి, స్వేచ్ఛ పొందుతుంది" ('ఫైడో' Phaedo నుండి)

ఆ స్థితి పొందు వరకు ఆత్మ తనకు అనుకూలమైన శరీరం కొరకు వెతుకుతూ పయనిస్తూనే ఉంటుంది తన 'Republic' రిపబ్లిక్ చివరలో ప్లాటో ఇంకా ఇలా అన్నాడు "శరీరమును వదలిన ఆత్మలు, పునర్జన్మకు తగిన ఆత్మలను 'అవసరము'నకు అధిదేవత (లేక కుమార్తె) లాకిసిస్‌ను (Lachesis, daughter of necessity) అనుసరించి పొందెదరు " గత జన్మలోని జీవితమునకు తగిన శరీరమును ఆత్మలు తిరిగి పొందును 'లాకిసిస్' అనునది మన కర్మ సిద్ధాంతమునకు మూర్తివంతమైన చేతనత్వము (personification)

ప్లాటో ఆలోచనలలో ప్రధానమైనది సామాన్య మానవుని అజ్ఞానము సామాన్య మానవుడు వాస్తవంగా మేల్కొనలేదు అతడు స్వప్నచారుడు (somnambulist) మాత్రమే (నిద్రలో నడిచెడివాడు) అని ప్లాటో అభిప్రాయము అట్టి మానవుడు భ్రమలో తనకు తానే సృష్టించుకొనిన (Phantoms) రూపముల కొరకు వెతుకుతూ ఉంటాడు కామక్రోధాది మనోవికారములతో కూడి ఉన్నంతకాలము, మానవునికి స్వప్నములు (భ్రమలు) వాస్తవములుగానే

కన్పడుతాయి అన్నాడు సత్యము తెలిసినపుడు చీకటి ఛాయలు తొలగి వెలుగు వస్తుంది అపుడు అన్నిటిని దివ్యత్వముతోనే (దివ్యదృష్టి) మానవుడు చూడగలుగుతాడు, గ్రహించగలుగుతాడు అన్నాడు మన వేదాంతంలోని మిధ్యా (మాయా) వాదముతో దీనికి పోలిక కనబడుతోంది గదా!

కాని ప్లాటో చెప్పిన పై విషయములు గ్రీకుల తాత్విక చింతనలో వైపరీత్యము, లేక వింత అభిప్రాయాలు (eccentricities) సాధారణ గ్రీకు తత్వమునకు ప్లాటో చింతనకు భేదమున్నది గ్రీకుల ప్రాధమిక అభిప్రాయం ప్రకారం మానవత, దివ్యత్వం (humanity and divinity) స్థలంలోను స్వభావంలోను భిన్నంగా సృష్టించబడినవి కావున అవి అలా భిన్నంగానే ఉండాలి మర్త్యత్వము (mortality), అమరత్వము (divinity) మధ్య పెద్ద అఘాతమంత అంతరమున్నది కవి ఊహలలో (poetic fancies) ఎవరో కొంత మంది మర్త్యులు భౌతిక శరీరంతో అమరత్వం పొందటం (బహుశా జీవన్ముక్తి కావచ్చు) అనేది సామాన్యుడి విశ్వాసాన్ని పొందుతుంది కాని అవి కొన్ని ప్రత్యేక సందర్భాలలో దివ్యశక్తి అంతరములను విస్మరించి మర్త్యులను అమరులు చేయటం అనేది అద్భుతాలుగానే (miracles) మిగిలిపోతాయి తప్ప సర్వసామాన్యం కానేరవు (general)

కాని గ్రీకు చరిత్రలో ఒకానొక కాలంలో - ఇది అంతకు ముందుగాని, గ్రీసు కాక మరొక పాశ్చాత్యదేశంలోగాని కన్పడలేదు - దివ్యత్వము, దివ్యత్వంలోని అమరత్వం, ఆత్మకు శాశ్వతత్వము అను అభిప్రాయాలు రూపొందినవి ఆ అభిప్రాయం గూఢత్వముతో కూడిన మత తాత్విక భావముల (mysticism) వలన కలిగినది దీనికి ప్రధాన ప్రతినిధులు పైతాగరస్, ప్లాటో గ్రీకు పౌరాణిక వేణుగాన విశారదుడు ఆర్ఫియస్ (Orpheus) తన గానంతో అందరిని మంత్రముగ్ధులను చేసెను అను గాధ ప్లాటోపై చాల ప్రభావం చూపింది అని తాత్విక విమర్శకుల అభిప్రాయం ఈ నిగూఢత్వముతో కూడిన మహత్వము

అనునది ఆసియా ఖండము నుండి, ప్రధానంగా భారతదేశం నుండి పొందబడి ఉండవచ్చునని తాత్విక పరిశోధకుల అభిప్రాయం, ఎందుకనగా నిగూఢ భక్తితత్వము (mystical devotion) నకు అప్పటికే భారతదేశం జన్మస్థలం అయింది

దైవికమైన ఉత్పత్తి (origin) గల ఆత్మ, ఇంద్రియ శరీరము పొందుటకు పూర్వము దాని స్థితి, అటుపై ఈ స్థూల శరీరములో ప్రవేశించుట, మరణానంతరం దాని తీర్పు, దాని స్వభావము (ప్రకృతి) ననుసరించి జంతు, మనుష్య శరీరముల ద్వారా దాని సంచారము, చివరకు ఈ విధమైన జనన, మరణముల నుండి విముక్తి పొంది భగవంతుని పొందుట - ఇవి గూఢత్వముతో కూడిన మత (mystery cult) విశ్వాసములు ప్లాటో మరికొందరు ఈ విశ్వాసములను ప్రకటించారు

కాని ఏ ఇతర దేశ మత భావ సంపర్కము లేని గ్రీకు తాత్విక భావములు ఈ విధమైన ఆత్మజ్ఞాన వివేకమును అనుమతించి ఉండవు కాని ఈ ఆత్మజ్ఞాన వివేచనము హిందూమతమందు పుష్కలముగానున్న విషయము విదితమే కదా!

అయినను మత, సాంస్కృతిక ప్రగతిని గురించి తెలిసికొన తలచిన వానికి రెండు దేశముల, విశ్వాసముల తత్వచింతనల మధ్య కనబడు ఉపమానములు (పోలికలు) ఒకరు మరొకరి నుండి గ్రహించినవా, లేక రెండును సమాంతరముగ దాదాపు ఒకే సరళిలో రూపొందినవా అనునది అప్రస్తుతము ప్రధాన విషయము ఆ రెండిటి మధ్య గల సామ్యము భారతదేశమునందు ఆత్మజ్ఞాన వివేచనము క్రీ పూ 6వ శతాబ్దమునకు పూర్వమే నిశ్చితరూపములో స్థిరపడినది గ్రీసుదేశమందు మాత్రము అది క్రీ॥పూ॥ 6వ శతాబ్దం తరువాతనే ఉద్భవించినది చరిత్ర పునరావృతం అవుతుంది నిజమే కాని కొన్ని మార్పులతోనే ఆ పునరావృతం జరగటం సహజం కావున

సామ్యము పూర్తిగా ఉన్నదా అను పరిశీలన లేక పరిశోధన వృధా ప్రయాసయే అగును కాని హిందూమత తత్వవిచారమునకు గ్రీకు సిద్ధాంతములకు పోలికలు ఉన్నమాట వాస్తవం

హేతువాత్మకమైన (rational) గ్రీకు విజ్ఞానమునకు, మరొక దేశము నుండి మతవిజ్ఞాన సంపర్కము ఏర్పడెనని చెప్పుట గ్రీకు విజ్ఞానమును అవమానపరచినట్లేనని అనువారు కొందరున్నారు కాని గ్రీకుల వంటి సునిశిత బుద్ధి శక్తి కలవారు, అన్వేషణా శక్తి కలవారు, నూతన విషయము గ్రహించుటకు మృదువైన (flexible) మేధస్సు కలవారు, ఇతర దేశస్థులతో ఏర్పడిన సాన్నిహిత్యము ద్వారా కలుగు ప్రభావమునకు విముఖులు కాలేరు సైనికులుగా, వ్యాపారస్తులుగా, సాహసవీరులుగా, నావికులుగా, వారు విదేశస్థులతో సాన్నిహిత్య సంపర్కము పొందారు గ్రీకు దేశస్థుడైనంత మాత్రాన ఇతర దేశ ప్రభావములకు అతీతులు, అభేద్యులు కాలేరు గదా!

ఇక్కడ గ్రీకు చక్రవర్తి అలెగ్జాండరును గురించి కొంత తెలుసుకొనవలసి యున్నది హేతువాదకమగు గ్రీకు విజ్ఞానమునకు మూల ఆచార్యులలో ఒకరైన అరిస్టాటిల్ శిష్యుడు అలెగ్జాండరు వ్యక్తి ప్రాధాన్యము కంటే నగర-రాష్ట్ర (City-State) ప్రాధాన్యం ఎక్కువగా పరిగణించబడిన నాగరికత అది గ్రీకు దేశ (రాష్ట్ర) ఆధిపత్యం, ప్రాధాన్యం చాటుటకే గదా అలెగ్జాండరు దండయాత్రలు చేశాడు కాని మానవ నాగరికతా ప్రగతిలో అలెగ్జాండరుకు ప్రధాన పాత్ర ఉంది అది అర్థం చేసుకోవాలంటే అలెగ్జాండరు తన గురువైన అరిస్టాటిల్ సిద్ధాంతాలకు అతీతంగా ఎంతదూరం వెళ్లగలిగాడో తెలుసుకొనవలసి యున్నది

పురాతన గ్రీకు నాగరికత వెలసిన ప్రాంతము అయోనియా (Ionia) (సుమారుగా క్రీ॥పూ॥ 9వ శతాబ్ద ప్రాంతం) అచటివాడే ప్రఖ్యాత గ్రీకు కవి, ఇతిహాసకర్త అయిన హోమర్ (850 BC) ఆయన భాష అయోనిక్ ప్రాంతీయమగు

గ్రీకు భాష క్రీ॥పూ॥ 4వ శతాబ్దంలో ఏర్పడిన గ్రీకు అభిప్రాయం హోమర్ కాలంలో లేదు అనగా మానవులలో గ్రీకులు - అనాగరికులు అను రెండు వర్గములే అను భావం హోమర్ ఇతిహాసాలలో ఈ భావన గోచరించదు గ్రీకులు కానివారిని నాగరికత తెలియనివారు అనలేదు హోమర్ భిన్న భాష మాట్లాడువారు, విదేశస్థులు అని మాత్రమే అన్నాడు

అయోనియన్ తత్వవేత్తలు మానవజాతి సహజముగా ఒకటే అని విశ్వసించారు గ్రీకులు, అనాగరికులు, బానిసలు, స్వేచ్ఛాజీవులు అను వర్గములు ఏదో సంప్రదాయబద్ధంగా ఏర్పడినవే తప్ప మానవులలో అట్టి వర్గములు లేవు అన్నారు కాని క్రీ॥పూ॥ 6వ శతాబ్దం తరువాత విదేశస్థులను శత్రువులుగా పరిగణించటం మొదలైంది అన్యము (strange and difficult) అయినది భయకారణము ఈ భయమును అనుసరించి ఉండేవి ద్వేషము (hatred), అటపై తిరస్కారము (contempt) అనాగరికులు సహజ శత్రువులు అన్నాడు ప్లాటో పుట్టుక లేక సహజ బానిసలు (slaves by nature) ఉన్నారు అన్నాడు అరిస్టాటిల్ అట్టి అనాగరికులతో యుద్ధం సహజం అని కూడా అన్నాడు ఆగస్టైన్ సైతాన్‌ను విశ్వమందలి పెద్ద అనాగరికుడు అన్నాడు అనగా అనాగరికులను సైతానులనటమే దాని భావం

కాని అలగ్జాండరు అరిస్టాటిల్ బోధలను దాదాపుగా విస్మరించి, మానవుల మధ్య భేదము మంచి, చెడులే కాని నాగరికులు అనాగరికులు కాదు అన్నాడు గ్రీకుల ఆధిక్యము, గ్రీకు దేశ ఆధిక్యమును విస్మరించాడు మంచి, సంస్కారవంతులు ఒకవైపు, దుష్టులు, సంస్కారహీనులు మరొకవైపు అన్నాడు అంతేగాని గ్రీకులు, అనాగరికులు అని కాదు అన్నాడు సుగుణము, దుర్గుణముల మధ్యనే వైరము (virtue and vice) అని ప్రకటించాడు అంతేకాక నాగరికులు అని చెప్పబడిన గ్రీకులలోనే దుష్టులు చాలమంది ఉన్నారని, అనాగరికులుగా వర్ణించబడిన వారిలో చాలమంది సంస్కారవంతులు

ఉన్నారని ప్రకటించటానికి సాహసించాడు అందుకనే తనకు సంస్కార వంతులుగా కనబడిన అనేకమందిని అలెగ్జాండరు ఆహ్వానించాడు అలెగ్జాండరు వీలునామా ఒక ఆధారపత్రము (document) కాకపోయినప్పటికి, అది అతని అభిప్రాయాలను వెల్లడిస్తోంది అని చరిత్రకారులు అభిప్రాయ పడుతున్నారు స్త్రీపురుషులను ఆసియా ఖండము నుండి ఐరోపా ఖండమునకు, అలాగే ఐరోపా ఖండము నుండి ఆసియా ఖండమునకు మార్పిడి (transplantation) ద్వారా అనగా ఒకచోట పెరిగిన మొక్కను తీసి మరొకచోటు నాటినట్లుగా, పరస్పర సంబంధాలు పెరగాలని అలెగ్జాండరు వాంఛ అని, ఆత్మీయత కొరకు పరస్పర వివాహాలు కుటుంబ సంబంధముల ద్వారా స్నేహము, భాగస్వామ్యము, శాంతి, ప్రపంచ ఐక్యత - ఇవి అలెగ్జాండరు కోరికలుగా అతని వీలునామా తెలుపుతోంది అన్నారు మానవులందరు విశ్వమునకు మూలహేతువు (reason (or) logos) కు లోబడి ఉండాలని, అందరికి ఒకే రాజనీతి, రాజ్యాంగ శాసనము (constitution) ఉండాలని అలెగ్జాండరు ఆశించాడు ప్రపంచ మానవ ఐక్యత ప్రపంచమందలి విభిన్న ప్రాంతముల కలయిక సమన్వయము అతని ఆశయము

వివరములు ఏవైనను ఒకటి స్పష్టపడుచున్నది 'వసుధైక కుటుంబము' కొరకు ప్రయత్నించి ఆచరణలోకి అనువదించినవాడు అలెగ్జాండర్ విశ్వమానవ సౌభ్రాతృత్వ ఉద్యమమునకు మార్గదర్శి (Pioneer) అలెగ్జాండరు అనవచ్చునేమో!

భారతదేశంలో స్థిరపడి కొంతమంది గ్రీకులు బౌద్ధమతము ననుసరించి వారి కళాత్మక శిల్పసృష్టిని బౌద్ధ శిల్పములలో ప్రతిష్ఠించారు దానిని గాంధార శిల్పకళ అన్నారు ఇది దాదాపు క్రీ॥శ॥ ఒకటవ శతాబ్దము కుషానుల కాలము వరకు కొనసాగింది అటుపై అది పూర్తిగా భారతీయత సంతరించుకుంది

అలెగ్జాండరు దండయాత్రతో (క్రీ॥పూ॥ 327) భారత, పాశ్చాత్య దేశాల మధ్య పరస్పర అవగాహన ప్రారంభమైందని చెప్పవచ్చు అలెగ్జాండరు తన

అధికారులలో ఒకరిని (ఓనెస్క్రిటస్) తక్షశిలకు పంపి, అచటి ఆచార్యులలో ఒకరైన కలనాస్‌ను తన వెంట తీసుకువెళ్లగలిగాడు ఆచార్య చాణుక్యుడు అప్పటివాడే గదా! చాణుక్యుడు అలెగ్జాండరును కలిసాడా? అనేది చారిత్రకులు నిర్ణయించాలి ఇచట చర్చ అప్రస్తుతం ఆసియా, ఐరోపాల వైవాహిక మైత్రి తన ద్వారానే ప్రారంభించాడు అలెగ్జాండరు బాక్ట్రియా రాజకుమార్తె రొక్సానాను అప్పటికే వివాహమాడాడు మరల పర్షియా రాకుమార్తె స్తాతిరాను రెండవ భార్యగా స్వీకరించాడు అతని సైనికాధికారులలో అనేకమంది ఆసియా దేశపు కన్యలను వివాహమాడారు

పైర్హో (Pyrrho) అను తాత్వికుడు అలెగ్జాండరుతో పాటు భారతదేశం వచ్చి భారతీయతత్వ విజ్ఞానము గ్రహించాడట ప్లాటో పైర్హో సిద్ధాంతాల కలయిక ఏర్పడి ఒక నూతన విద్వత్సభ (Academy) రూపొందింది ఆత్మ యొక్క ఉన్నతస్థితి నిశ్చలత అన్నారు ఇంద్రియానందమే (sensual enjoyment) ప్రధానంగా ఏర్పడిన ఎపిక్యూరియస్ మతము - స్థాపకుడు (Epicurus) ఎపిక్యూరస్ (341-270 BC) - భగవంతుని ప్రకృతిని గురించి నిశ్చల మనసుతో ఆలోచించుట ఈ మత సిద్ధాంతము అలాగే జీనో (308 BC) ప్రారంభించిన స్టాయిక్ సిద్ధాంతము (stoics) - సుగుణమే ఉన్నతము, కామక్రోధాది గుణములతో (passions) కూడిన మనస్సును నియంత్రించుట వీరి సిద్ధాంతము గోచరమగు ప్రపంచముతోనే భగవంతుని ఒకటిగా గుర్తించి దాని హేతువే భగవంతుడని, ఆ దివ్య హేతు అంశరూపమే (Reason) మానవుడని వీరి సిద్ధాంతము ఈ రెండు మత సిద్ధాంతములు అలెగ్జాండరు ఆశించిన నూతన ప్రపంచ రూపములోని భాగములే మానవుడు ఇక ఏదో ఒక నగరము, రాష్ట్రములోని భాగము కాదు ప్రపంచములోని ఇతర మానవులతో సంబంధములు కలవాడు అలెగ్జాండరు ఆశయము ఎక్కువ భాగము ఆధ్యాత్మికమా లేక రాజకీయమా అను ప్రశ్నకు సమాధానము అంత సులభము కాదు కాని ఆనాటికి అనగా క్రీ॥పూ॥ మూడవ శతాబ్దము నాటికి అలెగ్జాండరు

ఆశయ రూపము వాస్తవానికి ఎంతదూరంగా ఉన్నదో, అతని అనంతరం ఈనాటికీ అది ఆశయంగానే మిగిలిపోయింది

మత దురభిమానము పాశ్చాత్యదేశాలలో కాథొలిక్ చర్చిలు క్రైస్తవ మతమును క్రమబద్ధం చేసిన తరువాత ప్రారంభమైంది అప్పటి వరకు ప్రార్థనలు, పూజలు ఇతర మతముల ప్రభావ భయమును ఎక్కడా సూచించలేదు కాని హిందువులు నిరంతరం ఆధ్యాత్మిక అన్వేషణలోనే కాలం గడిపి తమ భావాలను ఇతరులకు వ్యక్తపరచుటకు సందేహించలేదు హిందూమత తాపసిక ఆచరణలు (Ascetic Practices) పాశ్చాత్యదేశాలలో ఎంతవరకు వ్యాపించినవో చరిత్రకారులు చెప్పిన దానిని బట్టి తెలుస్తుంది 480 BC లో గ్రీసులోని పర్షియా సైన్యములో పెద్ద భారతీయ పటాలం ఉన్నదట క్రీ॥పూ॥ 5వ శతాబ్దం ప్రాంతంలో భారతీయుల శిరస్సులను పోలిన రూపములు ఉన్నట్లుగా కనుగొన్నారు అనగా భారతీయులు వ్యాపార నిమిత్తం ఆనాటికే గ్రీసులో ఉన్నారన్నమాట కావున పాశ్చాత్య దేశాలలో ఏర్పడిన నూతన తపోవిధానమునకు భారతదేశమే మూలమనునది నిర్వివాదము ప్లాటో, పైతాగరస్‌లు నిగూఢత్వముతో కూడిన మతవిధానము (mystery cults) నకు భారతదేశ ప్రభావము ప్రత్యక్షముగా గాని, అప్రత్యక్షముగా పర్షియా దేశము ద్వారా గాని ఉండి ఉండవచ్చునని అభిప్రాయం కలుగుతుంది

గ్రీస్, రోమ్ దేశాల, యూదుల, ప్రభావంతో క్రీ॥శ॥ 14వ శతాబ్దంలో రూపొందిన పునరుజ్జీవన (Renaissance) ఉద్యమము ప్రధానంగా హేతువు ఆధారంగా, రాష్ట్ర ప్రాధాన్యం ఆధారంగాను ఏర్పడి క్రమంగా యూదు సిద్ధాంతాల సంపర్కం ఏర్పడి, యూదు భావాలైన (semitic ideas) ప్రత్యేకత (exclusiveness) ఆధిక్యత (particularism), శక్తివంతమైన అంతఃప్రవృత్తి (instincts) గల పాశ్చాత్య మనిషిని ఆకర్షించినై వారు ఆ భావాలను గ్రీకు భాషలో వ్యక్తపరిచి, రోమ్ పద్ధతిలో క్రమపరచారు

కొంతకాలం ఐరోపా రాజకీయ ప్రాభవము పతనమై, రోమ్ సామ్రాజ్యం అంతరించటం, విపరీతమైన కష్టనష్టములకు ప్రజలు గురికావటం జరిగి వారి మనసులలో భయం చోటుచేసుకుంది ఆ సమయంలో క్రైస్తవం వారికి ఉపశమనం కలిగించింది కాని క్రైస్తవం, దాని భావం మొత్తం మీద పాశ్చాత్య ప్రవృత్తికి పరాయిదే (foreign) పశ్చిమవాసులు నిరంతరం వేగం గలవారిదే పరుగుపందెం, బలవంతులదే యుద్ధవిజయం అని నమ్మారు బలహీనులు శరణు పొందవచ్చు, లేక పారిపోవచ్చు కాని వేగం గలవారికి, శక్తివంతులకు బలహీనులంటే ద్వేషమే ఆ విధంగా ద్వేషింపబడిన బలహీనులకు క్రైస్తవం శరణ్యమైనది క్రైస్తవ ప్రశాంత సాధారణ జీవితం వారిని ఆకర్షించింది వారికి భౌతిక విషయాల మీద వాంఛ పోలేదు, ఆధ్యాత్మిక స్పృహను వదులుకోలేరు

కాని ఒక విషయం స్పష్టం క్రైస్తవ మత విజయం మానవ చరిత్రలో గతం నుండి విడివడటం, ఒక కొత్త వైఖరికి సూచన మనిషి నూతన విషయ అన్వేషణలో అలసిపోయాడు ఇక ముందుకు సాగుటకు ఇష్టపడుట లేదు ఆ స్థితిలొ అశాంతితో నున్న మనస్సుకు శాంతి, అనిశ్చయ స్థితికి నిశ్చయం కల్పించటం, ఇంకా అనేక సమస్యలకు సమాధానాలు అవకాశం చూపిన మతం వైపుకే పాశ్చాత్య మనిషి మొగ్గాడు సైన్సు, తర్కము కంటే వేదాంతమే (theology) శ్రేయస్కరం అనుకున్నారు తన ఆంతరిక జీవితమును నియంత్రించుకొనలేక (inner life) తనని తాను అతీతుడైన వ్యక్తికి (superior being) అర్పించుకున్నాడు కాని ఆ అతీతుడు తనకు అనుగుణుడైనవాడు కాదని గ్రహించలేదు అనగా తన ప్రవృత్తికి సరిపడడు అని గ్రహించలేదు హేతువు మానవజాతికి ఆశించిన సుఖమునీయలేదు క్రైస్తవం ప్రత్యేకించి మరణానంతర సుఖమును గురించి ఆశ చూపినది ఆ విధంగా గరిమనాభి కేంద్రం మారింది మానవుని ఆశలు, ఆశయాలు భవిష్య జీవితం వైపుకు మరలినై తదనంతర జీవిత సుఖమునకై ఈ జీవితంలో బాధలకు సిద్ధపడ్డాడు ఈ వైఖరి పురాతన ప్రపంచమునకు ప్రత్యేకించి గ్రీకు, రోమన్లకు పూర్తిగా

పరాయిదే (foreign) గ్రీకులకు భవిష్య జీవితము చీకటి వంటిది వారికి వర్తమాన భౌతిక జీవితమే ప్రధానము

క్రైస్తవం ఇన్ని శతాబ్దముల నుండి ఐరోపా ఖండపు మతము అయినప్పటికి ఆ ఖండవాసులు దానిని పూర్తిగా జీర్ణించుకొనలేదు పాశ్చాత్య జీవన సరళిపై క్రైస్తవ మత విజయం ఒక సుదూర స్వప్నం మాత్రమే ఒక తూర్పు ప్రాంతపు మతమును (క్రైస్తవం పుట్టింది మధ్య ప్రాచ్య (Middle East) దేశంలో కదా) పాశ్చాత్య భావములకు అనుగుణంగా మలచగలగటమే క్రైస్తవమత విజయం వెనుకనున్న రహస్యము తాపస ప్రవృత్తి నిత్యజీవితంలో ఎదురయే సవాళ్లను, సమస్యలను ఎదుర్కొనే భౌతిక ప్రవృత్తిగా మార్చబడింది పాశ్చాత్య జాతులు భౌతిక జీవితం అశాశ్వతం అని దానికి దూరంగా తాపస (ascetic) జీవితం గడిపే ప్రవృత్తి గలవారు కాదు అపరిమితమైన శక్తి (energy), అణచుటకు వీలుగాని సహజ మానవ ప్రవృత్తి అధికం వారిలో

క్రైస్తవ ప్రవక్త అయిన జీసెస్ ఎన్నడు తన మతమునకు ఒక వ్యవస్థ (organisation) ఏర్పరచవలెనని తలంచలేదు కాని క్రమేణ అది మహా విస్తృతమైన వటవృక్షము వంటి వ్యవస్థగా తయారైంది జీసెస్ ఆధ్యాత్మిక ప్రవృత్తిగల జీవులను (spiritual souls) తయారుచేయాలని ఆశించాడు కాని అది క్రమంగా చర్చి విశ్వాసపాత్రులైన వారిని తయారుచేయు వ్యవస్థగా మారింది

భౌతిక వాంఛలు, అవసరాల ప్రాధాన్యం పెరిగింది ప్రాపంచిక శాంతి, భౌతిక జీవితంలో సంపద కొరకు దానిని (క్రైస్తవమతమును) ఒక పరికరంగా ఉపయోగించారు నరకం నుండి స్వేచ్ఛ పొంది స్వర్గానికి దానిని మార్గంగా చెప్పారు దేశాన్ని పూజించటం అను ప్రవృత్తి గ్రీసు, రోమ్ దేశాల నుండి వచ్చిన వారసత్వం దానికి తోడు మతమును రాజకీయ అవసరాలకు అనుగుణంగా ఒక జాతీయ సంస్థగా రూపొందించారు మానవ గుణములను (passions)

పవిత్రం చేయటానికి మతం అవసరం ఉందన్నారు కాని మానవుని అధికార వాంఛకు మతపు ముసుగు వేసినపుడు, అతని విషాదాంతం అంతకంటే మించినది లేనంత అవుతుంది భౌతిక వాంఛలకు మతం అను పూత పూసినపుడు అది ఏ విధంగా భంగమునకు అతీతమవుతుంది? వాస్తవమైన మతమునకు అదే అతిప్రమాదకరమైన, సునిశితమైన అగోచరమైన శత్రువు విశ్వమానవత రూపుదిద్దుకొనుటకు తోడ్పడని మతము సార్వజనీన విశ్వాసమును పొందలేదు

ఆలోచనాపరమగు ఆధ్యాత్మికతతో కూడిన మతము, అనగా దివ్యానుభూతి (Direct experience) పరమాత్మతో ఐక్యత (identification) లేని మతము, క్రమంగా హేతువునకు దూరమవుతుంది ఐహిక వాంఛల మతంగా మారి, విశ్వాసాలతోను, కర్మకాండలతో నిండి భావగర్భితమై (sentimental) ఉద్రేకాలకు (emotions) దారితీసి మనిషి జీవితంలో ఆధ్యాత్మికతాదిశగా మార్పు తీసుకురావటానికి విఫలమవుతుంది క్రైస్తవమతం అదే దిశగా పరిణామము చెందింది జీసెస్ ఆశయాలకే దూరమైంది

మధ్యయుగంలో అనగా క్రీ॥శ॥ 11, 12, 13 శతాబ్దములలో విశ్వాసమునకు అపరిమితమైన ఆధిక్యత పెరిగింది ఏ విధమైన అనుమానమునకు అవకాశం లేకుండా పోయింది సహేతుకం కాని ఏ విశ్వాసమునకు (dogma) వ్యతిరేకంగా ఒక్క మాట కూడా మాట్లాడటానికి వీలులేనంతగా చర్చి నిరంకుశత్వం పెరిగింది విమర్శనాత్మకమగు పరిశోధన నిషేధించబడింది ఈ రకమైన పరిశోధనా ప్రవృత్తి పదమూడవ శతాబ్దంలోనే ప్రారంభమై 14వ శతాబ్దంలో ఒక విశిష్ట ఉద్యమంగా మారింది ఈ పరిశోధనా ప్రవృత్తి గలవారిని మత వ్యతిరేకులు (heretic) అన్నారు నాస్తికుల కంటే వారినే ఎక్కువ ద్వేషించారు ఒకవేళ దురదృష్టం కొద్దీ జీసెస్ ఆ సమయంలో ఐరోపాలో ఉంటే ఆయనను సజీవ దహనం చేసి ఉండేవారేమో!

కాని ఉద్యమ స్పృహ వస్తే దానిని నియంత్రించటం అంత సులభం కాదు చర్చి నియంతృత్వం వలన ఇదే జరిగింది పునరుజ్జీవన ఉద్యమం (Renaissance) ప్రారంభమై హేతువు ఆధారంగా ఆలోచనా దృక్పథం ఏర్పడింది విశ్వ విద్యాలయాల శాసనసభల ప్రగతికి దారితీసింది

మధ్యయుగంలో తర్కభూతమైన పాండిత్యమునకు తత్వజ్ఞానంలో (Philosophy) ప్రాధాన్యం ఉండేది అట్టి క్రైస్తవ పండితులలో థామస్ అక్వినాస్ (St Thomas Aquinas 1225-1274 AD) ముఖ్యుడు అతడు తత్వజ్ఞానమును, మతముతో సమన్వయించడానికి ప్రయత్నించాడు అరిస్టాటిల్ విజ్ఞానమును సంప్రదాయ కాథలిక్ సిద్ధాంతాలతో సమన్వయానికి కృషి చేశాడు సత్యము (reality) అనునది ఒక క్రమబద్ధమైన స్థితి (existence) పరంపర (hierarchy) స్వయంభువుడైన భగవంతుని నుండి క్రమంగా క్రిందకు వచ్చిన స్థితి భగవంతుడు సశరీరుడు కాదు అతడే పరిపూర్ణమైన సత్యరూపము భగవంతుడే పరిశుద్ధమైన జీవుడు, పరిశుద్ధమైన క్రియ లేక చట్టము (Act) మిగిలిన స్థితులు (existences) అసంపూర్ణములు, పరిమితమైనవి భగవంతుడు ఒక్కడే సత్యరూపుడు, పరిపూర్ణుడు అని అన్నాడు సెయింట్ థామస్ (St Thomas) అతని సిద్ధాంతములను థామిజమ్ (Thomism) అంటారు పదార్థమనే దాని స్థితి పూర్తిగా స్థితి పరంపరలో (hierarchy) ఉన్నతస్థాయి మీద ఆధారపడి ఉంటుంది దాని సారము (essence) పూర్తిగా సశరీరమే (corporeality) దాని సహజ విధము లేక రీతి కొలుచుటకు వీలులేని దాని శక్తి వాస్తవానికి ఈ ప్రపంచం భేదములు గుర్తించుటకు వీలుపడని సంకుల స్థితి కాదు, అసాధ్యమైన ద్వైతస్థితి కూడా కాదు అంటాడు థామస్ పరంపరలోని దిగువ జీవులు పరమసత్యము నుండి వెలువడిన నీడలు కాదు కాని అవి వాటి స్థితిని అచట నుండియే పొందుతాయి అయినా వాటి ప్రత్యేక ఉనికి, ప్రత్యేక రీతి, ప్రత్యేక పనులు వాటికి ఉంటాయి అని అంటాడు అవి ఒక మూలము నుండే వచ్చిన (analogy) సాదృశ్యతా సూత్రమునను సరించి

ఉండవచ్చును, కాని ఒకే పోలికను మాత్రము కలిగి ఉండవు హేతువు ద్వారా భగవంతుని నిరూపించలేము, కాని అప్రత్యక్ష (indirect) హేతువైన ఈ సాదృశ్యత ద్వారా భగవంతుని నిరూపించుటకు మార్గము దొరకును అని అంటాడు థామస్

మన మనస్సునకు గోచరమగు ఈ విశ్వమును గురించిన సత్యమును గ్రహించవలెనన్న, మనము దానిని అర్థము చేసుకొనగలిగిన స్థితికి ఎదగాలి ఆ స్థితికి ఎదగటమే అరిస్టాటిల్ సిద్ధాంతమైన హేతువు హేతువు ఆధారంగా ప్రకృతి నుండి గ్రహించినదంతా అరిస్టాటిల్ హేతు సిద్ధాంతరూపము అంటాడు ప్రకృతి యందలి ప్రతి వస్తువు నందు అణిగి ఉన్న అర్థమును (implications) పరిశీలించుట ద్వారా భగవంతుడు అంటే అర్థము గ్రహించవచ్చునని ఆ హేతు సిద్ధాంతభావము భగవంతుని వివేకము, మనస్సు (శక్తి) (will) సుగుణములు గల తత్వజ్ఞానరూపునిగా భావించవచ్చు కాని భగవంతుని నిజరూపము దివ్యదర్శనము (revelation) ద్వారా మాత్రమే తెలుసుకొనగలము అంటాడు

క్రీ॥శ॥ 13వ శతాబ్దపు క్రైస్తవ తార్కికుల - థామస్ వంటివారు - పాండిత్యము (scholasticism), గ్రీకు ఆచార్యులు అరిస్టాటిల్ వంటివారి హేతవాద వారసత్వము కలిసి 14వ శతాబ్దములో పునరుజ్జీవన ఉద్యమమునకు, అటుపై హేతువాద ఉద్యమమునకు ఆధారములైనవి

థామస్ ఇంకా ఇలా అన్నాడు మనిషి భగవంతుని కంటే భిన్నమైనవాడు ఈ సృష్టిక్రమములో మనిషి జడమైన పదార్థమునకు (non-intelligent matter) పూర్ణమైన బుద్ధిరూపమునకు (pure intelligence) మధ్యస్థాయిలోనివాడు సాదృశ్యతలో (analogy) కూడ మనిషి ఆ స్థాయవాడే ఒక వైపు పశుస్థాయి, మరొకవైపు దేవతాస్థాయి ఆత్మ, శరీరమును కలిగి ఉన్న మనిషి ఆ రెండు స్థాయిలలో దేనికి ప్రయత్నించకూడదు ఈ సృష్టి క్రమానికి పరమావధి (end point) భగవంతుడు ప్రతి వస్తువు ఆ దిశలోనే పయనిస్తుంది కాని ఈ

సృష్టిలోని ప్రతి ఒక్క స్థాయి లేక స్థితిలోని వారికి ఒక ప్రత్యేక రీతి లేక వైఖరి ఉన్నది ఆ పద్ధతిలోనే అవి దివ్య పరిపూర్ణత్వమునకు చేరుకుంటాయి మానవుని బుద్ధి లేక మనశ్శక్తి (faculty of intelligence) దానికి సహజమైన అభివృద్ధి పొందక పోయినచో మానవ జీవితము అసంపూర్ణము పరమసత్యమును గూర్చిన చింతనయే మానవుని బుద్ధికి పరమావధి దానికి శారీరక ఆరోగ్యం, నీతిప్రదమైన సుగుణముల ద్వారా కామక్రోధాది గుణ ఉద్రేక నియంత్రణ అవసరము మానవుని జీవితము దివ్యమైనది (divine) కాదు అని థామస్ విశ్వసించాడు అందువలన ఇంద్రియానుభూతులు మానవ జీవితంలోని భాగమే అన్నాడు మానవ పరిపూర్ణతకు ఈ భౌతిక శరీర ఆవశ్యకత ఉన్నది అన్నాడు అది ఏ విధముగాను ఆత్మకు బంధకము కాదు అన్నాడు పరమానందకరమైన దర్శనము (beatific vision) వలయునన్న దానికి పరమ ఆనందదాయకమగు చిత్తము (హృదయము, మనసు) (beatific consciousness) ఉండాలి ఇట్టి మనసు సాధారణ మనసు కంటెను, భవిష్య సూచక మనసు కంటెను (prophetic consciousness) భిన్నంగా ఉంటుంది అప్పటికీ దివ్యచైతన్యసారమును పూర్తిగా అర్థము చేసుకొనుటకు సాధ్యపడదు ధ్యానము చింతన అనగా ఆలోచనతో కూడిన సత్యాన్వేషణ యందు ఇచ్ఛ గల జీవితము అంటాడు థామస్ అంతర్బుద్ధి (intuitive vision) ద్వారా దివ్యదర్శనం కాదు జీవితం అంటాడు మానవులకు ప్రత్యక్ష దివ్యదర్శనము సాధ్యము కాదు మానసికంగా అస్పష్టమైన, అసంపూర్ణమైన భగవంతుని రూపచిత్రణ మాత్రమే సాధ్యము అంటాడు మరి ప్రవక్తల భగవత్సాక్షాత్కార అనుభూతి విషయం ఏమిటి? భక్తులైన ప్రవక్తలు తమ భక్తి పారవశ్యములో పొందిన భగవత్సాక్షాత్కార అనుభూతి మాత్రమే అది అంటాడు ప్రవక్తలు తాత్వికులు కాదు అది ప్రత్యక్షము కాదు (direct), అట్టి పారవశ్యము అసాధ్యము కాదు, ప్రకృతి విరుద్ధము కాదు కూడా అంటాడు థామస్

మరి నీతి, నియమాలు అంటే ఏమిటి? ఏదో ఒక బాహ్య ప్రామాణిక

అధికారమునకు లోబడి, నిస్సహాయ స్థితిలో అనుసరించటం నీతి ఔతుందా! ఆ నియమంలో ఏదో ఒక మంచి అంతర్లీనంగా ఉన్నదనా? లేక అవిధేయత (disobedience) వలన దుష్ఫలితాలు వస్తాయని భయంతోనా మత ప్రమాణమును అనుసరించేది? అను విషయం ప్రధానం భయంతో చేసేది స్వప్రయోజనాలకు అవుతుంది నీతి అనే సుగుణమును మరణానంతర జీవిత అసౌఖ్యమును తొలగించుకొనుటకే అయితే నీతిని నీచపరచినట్లే అవుతుంది మధ్యయుగపు క్రైస్తవతాత్వికులు ఆ పనినే చేశారు మూఢవిశ్వాసములతో కూడిన కథలు, ఇతిహాసాలు ప్రచారంలోకి వచ్చాయి మత ప్రక్రియలు యాంత్రికములైనాయి బజారు దుకాణంలో మందులు కొన్నట్లు ఆధ్యాత్మిక లాభాలను లేక సంపదను కొనవచ్చును అను విశ్వాసం బయలుదేరింది జాతి సంపద నుండి వచ్చిన మత సంస్థల ఆదాయమును మతాధిపతుల స్వంత ఆస్తి అను భావం ఆచారంలోకి వచ్చింది

ఈ స్థితి మీద తిరుగుబాటుగా వచ్చినదే పునరుద్ధరణ లేక పునరుజ్జీవన ఉద్యమం (Renaissance) క్రీ॥శ॥ 14వ శతాబ్దంలో మతవిశ్వాసం సన్నగిల్లింది పోపు అధిపత్యమును వ్యతిరేకించటం జరిగింది మత సంస్కారములకు ఆధిపత్యం వహించే వ్యక్తి పవిత్రుడు కానిచో ఆ సంస్కారములకు విలువలేదు అని తిరస్కరించారు

రష్యాలోని అనగా కమ్యూనిజమ్‌లోని నాస్తికతను ఇతరులను బహిష్కరించు మతముల ద్వారా (exclusive religions) జయించటం అటు దైవవిజయం కాని ఇటు మానవ విజయం కానీ కాదు ఈ రెండు భిన్న ధృవాలను - అనగా నాస్తికతను, మౌఢ్యముతో కూడిన ఆస్తికత - వ్యతిరేకించటమే బహుశ ఆధ్యాత్మికత భగవంతునికి ఇవ్వకలిగిన అత్యంత ఉత్కృష్టమైన కానుక ఈ రెండు ధృవాల మధ్య చలించటం మాని ధార్మిక, ఆధ్యాత్మిక ఐక్యతతో పరమసత్యమును అన్వేషించటమే సరైన మార్గము

చింతన, ఆత్మసమర్పణ వంటి నిగూఢ ఆధ్యాత్మిక సంప్రదాయములు బహుశ భారతదేశము నుండే పాశ్చాత్య దేశములకు వ్యాపించి ఉండవచ్చునని చాలమంది తాత్వికుల అభిప్రాయిం కాని హిందూమతంలో ఆస్తికత ప్రవహిస్తుంది కాని వ్యక్తి ప్రత్యేకతను తుడిచివేయదు హిందూమత దృక్పధంలో భగవంతుడు అంతస్తుడు, సర్వోత్కృష్టుడు అంతస్తుడనగా అంతరముగా మరుగున ఉన్నవాడు ప్రశాంత మానసిక ధ్యానముతోపాటు భగవంతునికి ప్రార్థనలు, పూజలు కూడ హిందూమతం ఆమోదిస్తుంది శ్వేతాశ్వతర ఉపనిషత్తు, భగవద్గీత ఆత్మజ్ఞానమును ప్రోత్సహిస్తే, ఆస్తిక సంస్కర్తలు రామానుజుడు, మధ్వుడు మొదలైనవారు, పరమభక్తులైన తుకారామ్, తులసీదాసు మొదలైనవారు ఇష్టదేవతారాధనకు ప్రాధాన్యం ఇచ్చారు రెండును శక్తివంతమైన, స్వచ్ఛమైన ఆధ్యాత్మిక మార్గాలే నిగూఢమైన ఆధ్యాత్మికచింతన (mysticism), భక్తిమార్గము భిన్నధృవాలుగా పరిగణించనవుసరము లేదు వాస్తవానికి, ఉపనిషత్తులు ఈ రెండింటిని భిన్నధృవాలుగా పరిగణించలేదు ఈ ప్రపంచమును, మనుష్యులను పూర్తిగా విస్మరించి భగవంతుని తోటి సంపర్కమే ఆధ్యాత్మికత అని అన్నపుడే రెండు మార్గములకు భిన్నత్వము వస్తుంది ఇచట మానవ వ్యక్తిత్వం అదృశ్యమవుతుంది పరమాత్మయందు ఐక్యతాభావములో బాహ్యప్రపంచము అర్ధరహితము, ఆత్మ పరమాత్మలో లీనమైన భావం కలుగుతుంది ఆ అనుభూతిలో ఉన్నంత వరకు మానవుడు అపరిమిత ఆనందమునే పొందుతాడు కాని తిరిగి బాహ్య స్పృహలోనికి వచ్చినపుడు అయోగ్యతా భావము, ఒంటరితనము ఆ వ్యక్తిని బాధిస్తుంది అందువలననే ఆ పరమాత్మ యొక్క నిరాకారము, ఇష్టదేవతా రూపమును రెండు విధములని గుర్తించవచ్చు కాని రెండింటిని వేరుచేయుట అసాధ్యము, అనవసరము కూడ

మతం ఏదైనా, దేశం ఏదైనా పరిస్థితులు భిన్నమైనా అంతర్బుద్ధి (intuition) తత్వజ్ఞానం (philosophy) నీతి-నియమాలు (ethics) ఒకే రకమైన

ఫలితాలను ఇవ్వటం ప్రకృతి సహజమేమో అనిపిస్తుంది చింతన, ఆత్మ సమర్పణ వంటి నిగూఢ ఆధ్యాత్మికత (mysticism) క్రైస్తవ, హిందూమతముల మధ్య ఏర్పడిన సాదృశ్య లక్షణము అటువంటిదేనేమో హిందూమతంలో నిగూఢ ఆధ్యాత్మికత (mysticism) తత్వజ్ఞానంలోని సార్వజనీనతను (universality) గుర్తించింది . దాని ఆధారంగానే మత తాత్వికత రూపొందింది నిగూఢమైన ఆధ్యాత్మికత మానవజాతిలో అంతర్లీనంగా ఉంటుందని, అనుకూలమైన పరిస్థితులలో అది బహిర్గతమవుతుందని హిందూ తత్వజ్ఞానం చెప్తుంది ఈనాడు మానవుడు అర్థం లేని విశ్వాసాలను, సమాజానికి అనుకూలం కాని సంప్రదాయాలను నిరసిస్తున్నప్పుడు, ఆధ్యాత్మికతా దృక్పథము గలవారికి ఈ చింతన, ఆత్మసమర్పణ వంటి నిగూఢ ఆధ్యాత్మికత (mysticism) ఆకర్షిస్తుందేమో!

సైన్సు ఆత్మ అవసరాలను తీర్చలేదు సహేతుకం కాని విశ్వాసాలు బుద్ధి అవసరాలు తీర్చలేవు నాస్తికత లేక హేతుపూర్వకం కాని సిద్ధాంతాలు (పిడివాదాలు) Dogmas, సంశయాత్మకత (scepticism) లేక మూఢవిశ్వాసం సైన్సుకు గత్యంతరాలు (alternatives) కానేరవు ఈ రెండు ఒకే చెట్టు కొమ్మ మీద ఉన్న జంట ఫలములు ధన, ఋణ ధృవములు ఒకదానిని వదలి మరొకదానిని ఎదిరించటం కుదరదు

సైన్సు దృక్పథము, మానవ స్వభావ విజ్ఞానము, రెండింటిని సమన్వయపరచగల మతము కావాలి మానవునికి మతము, సైన్సు, మానవత (humanism) అనునవి పురాతన భారతదేశంలో సహజన్మ్ములుగా ఉండేవి పురాతన గ్రీసులో అవి మిత్రులుగా ఉండేవి ఈనాడు ఆ మూడు తిరిగి సమన్వయం పొందాలి అపుడే మతమును వ్యతిరేకించేవారు, నాస్తికత్వము వ్యతిరేకించేవారు, మానవాతీతశక్తిని నిరాకరించేవారు, శూన్యవాదమును అనుమతించనివారు అందరు నూతన మతము వైపుకు ఆకర్షితులౌతారు

మానవునికి ఒక మతము ద్వారా రక్షణ నిలయం కావాలి అక్కడ హేతువు హక్కునకు భంగముండదు మానవుని సహజ అవుసరములకు ఆటంకము ఉండదు సత్యము మీద గౌరవమే అచట నీతి నియమం సత్యము అనునది హేతువునకు గాని, గ్రీకు భావములకు గాని వ్యతిరేకము కాదు సత్యము వ్యతిరేకించేది సహేతకము కాని విశ్వాసమును, శిలాజములుగా (Fossils) మాత్రమే మిగిలిన సంప్రదాయములను మతమును మరెంత కాలమూ సహేతుకము కాని, ప్రకృతి సహజము కాని సిద్ధాంతాల మీద ఆధారపడునట్లు చేయకూడదు మతమునకు విముక్తి కలిగించాలి

కాని ఈ స్థితిలో మనం అంటే సగటు మానవుడు ఏ స్థితిలో ఉన్నాడు? అనిశ్చయం (uncertainty) అజ్ఞాతావాదము (fundamental agnosticism) వ్యాకులత (uneasiness) - వీటి మధ్య మనం సంకుల (confused) స్థితిలో మనకు తెలియని గమ్యం వైపుకు పరుగెడుతున్నాము భవిష్యత్తు అగమ్యముగానున్నది గతకాలంలో మానవులు కనీసం ఏదో ఒక గమ్యమును స్పష్టం చేసుకుని అటుపైననే కృషి మొదలుపెట్టారు కాని నేడు మనకు వలసినది ఏదో మనకే తెలియదు ఇక గమ్యం ఎలా తెలుస్తుంది?

ఇక ఈ పరిస్థితులలో హిందూమతం బాధ్యత ఏమిటి? సహేతుకం కాని మూఢత్వముతో కూడిన విశ్వాసాల నుండి, వంశ ఔన్నత్య భావము వలన (aristocracy), వడలిన కాలం తీరిన (orthodox) సంప్రదాయ భావముల వలన, ఏర్పడి మ్రోడువారిన ఆచార పరంపరలో మగ్గుచున్న మతమును పునరుద్ధరించటం ఎలా? అందు వేదాంతం ఎంత వరకు ఉపయోగపడుతుంది? ఇదీ ప్రస్తుత పరిశీలనాంశము

అనాది నుండి కూడా హిందూమతం మత విషయాలలో హేతు దృక్పధమును అనుసరించింది మానవ జీవిత వాస్తవ విషయములను విజ్ఞానశాస్త్ర (సైన్సు) పద్ధతిలో, అనగా సర్వసాధారణ వాస్తవ విషయములను

ఒక క్రమపద్ధతిలో పరిశోధించింది ప్రత్యక్ష విషయాలే కాకుండ, ఆధ్యాత్మిక స్పృహ లేక నిద్రావస్థలో నుండు మానవుల జయ, అపజయాలే కాకుండ, జీవితపు లోతుల వాస్తవమును గూడ పరిశోధించింది

మతము అనునది దివ్యదర్శనమును విశ్వాసము ద్వారా పొందుట అని నిర్వచించుట కంటే, మానవ మనసు లోతులలోని ఆంతరిక పొరలను (layers) తెరిచి వాటితో ఒక స్థిరమైన సంబంధము ఏర్పరచుకొనే ప్రయత్నము అనుట ఉచితంగా ఉంటుందేమో ఎందుకనగా ముందు మనసులోని పొరలను తెరిచిన గాని దివ్యదర్శనానుభూతికి తగిన క్షేత్రం ఏర్పడదు గదా

కొన్ని మతాలు వస్తు ప్రాధాన్యము గలవి అవి అగోచరమగు లేక బాహ్యమగు వస్తువు యెడల విశ్వాసము, ఆ మార్గంలో వలసిన ప్రవర్తనకు ప్రాధాన్యం ఇస్తాయి మరికొన్ని మతములు వస్తువు కంటే ప్రత్యక్ష అనుభవము (అనుభూతి)నకు అత్యధిక ప్రాధాన్యం ఇస్తాయి హిందూమతం, బౌద్ధమతం ఈ కోవకు చెందినవి ఇవి ముక్తి లేక నిర్వాణమునకు ప్రాధాన్యం ఇస్తాయి భగవంతుని గూర్చి అభిప్రాయము కంటే ఈ మతములు అనుభూతి పరివర్తన రూపములు అనుట సముచితంగా ఉంటుంది భగవంతుని గూర్చి ఒక స్థిరమైన భావరూపము లేకపోయినను మతము జీవించవచ్చును కాని ఆధ్యాత్మికతకు, లౌకికభావమునకు, పవిత్రతకు అపవిత్రతకు భేదము తెలియని మతము నిలువజాలదు ఆదిమజాతులలో కూడ ఇంద్రజాల విశ్వాసములతో కూడినదైనా, భగవంతుడు, విశ్వాసము అనేవి తెలియకపోయినప్పటికి, వారికి కూడ ఒక మతము అనేది ఉండేదని చరిత్ర చెప్తోంది

ఆస్తిక మతాలలో భగవంతుని స్థితి కంటే మానవుని యందు పరివర్తన తీసుకురాగల ఆ దైవశక్తికే ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది బౌద్ధమతంలో బుద్ధుని స్థితి కంటే అతనికి కలిగిన జ్ఞానజ్యోతి (Bodhi (or) enlightenment) అనేది ఒక దివ్యానుభూతి కదా బౌద్ధసూత్రాలలో పరిపూర్ణ అంతరదృష్టి

(insight) యే పరమగమ్యము గదా! హిందూ షడ్దర్శనాలలో ఒకటైన సాంఖ్యవాము, జైనసిద్ధాంతము కూడ భగవంతుని అంగీకరించలేదు, కాని ఆధ్యాత్మిక చైతన్యం గురించి వాస్తవమును అంగీకరించినాయి రామానుజుని వంటి ఆస్తిక తాత్వికులు ఆధ్యాత్మిక చైతన్యము అంటే (spiritual consciousness) సూటిగా స్వయంగా భగవంతుడే అని చెప్పకపోయినప్పటికి, భగవంతుని తెలుసుకొనుటకు అదొక్కటే మార్గమని అంగీకరించారు గదా! ఏది ఏమైనా "ఆత్మప్రాప్తి లక్షణం మోక్షం" అని అందరు అంగీకరించారు

కాబట్టి ఆత్మదర్శనమునకు, దివ్య అనుభూతికే ప్రధాన స్థానం ఇచ్చారు విశ్వాసం, ప్రవర్తన, కర్మకాండలు, మతాధిపత్యం, సహేతుకం కాని నమ్మకాలకు అప్రధానమైన స్థానమే ఇచ్చారని తెలుస్తోంది కదా! హిందూమతంలోని ఈ ప్రత్యేకతను పురాతనులు కూడ అనుసరించారని చరిత్ర చెప్తోంది

ప్రతి మనిషి జీవితంలో ఏదో ఒక సమయంలో బాహ్య ప్రపంచంతో విసిగి, తీవ్రమైన హేతువాది అయినప్పటికి, అంతర్ముఖుడౌతాడు అనగా బాహ్యమును కొంతసేపైనా మరచి తనకు మించిన ప్రాపంచిక వ్యథల నుండి బయటపడటం ఎలా అని ఏకాగ్రతతో ఆలోచించటం జరిగినపుడు, అదే అంతర్ముఖుడగుట అనవచ్చు ఇచట భగవంతుడి ప్రసక్తి లేదు అతడు నాస్తికుడైనా బాహ్య ప్రపంచ స్పర్శ లేనపుడు - తనలో ఎందుకు, ఎందుకు అను ప్రశ్నకు సమాధానం కొరకు మనస్సు ప్రయత్నిస్తుంది అపుడు హేతువుకు అందని ఒక ఆంతరిక అనుభవం కలుగుతుంది అది సమాధానం కాదు కాని ఆ అనుభవం అతనిని ఆవరిస్తుంది అది వింతగా, అద్భుతంగా పారవశ్యం కలిగించి వేదన నుండి దూరం చేస్తుంది ఎంతసేపు అనే దానికి సమాధానం లేదు క్షణం కావచ్చు, కొంత సమయం కావచ్చు ఆ అనుభవం గురించి అతడు ఏమి చెప్పలేడు, వర్ణించలేడు భౌతిక విషయములను బాధ్యతతో నిర్వర్తించు, కాని మనసుకు పట్టనీయవద్దు అనగా కార్యము మొదలుపెట్టినప్పటి

నుండి ఫలితం కొరకు అలజడి మొదలైనపుడే మనసుకు శాంతిరాదు బాధ్యతో సవ్యముగా కార్యము నిర్వర్తించు, అలజడి చెందవద్దు, ఫలితం అదే వస్తుంది అను భావం ఆ సమయంలో మనసులో ప్రతిధ్వనిస్తుంది ఆ క్షణం బాహ్య స్పర్శ ఉండదు ఆంతరిక అనుభూతి కలుగుతుంది అదే ప్రపంచంలో ఉంటూనే అంటకుండా ఉండటం అవుతుంది (detached state) ఆ స్థాయి శక్తివంతమైనపుడు అనుభూతి మొదలవుతుంది, మనసు ఆత్మకు దగ్గరవుతుంది ఆత్మ అంటూ ఒకటి ఉన్నదని గుర్తించని వారు కూడ చెప్పటానికి వీలుపడని ఆ అనుభూతిని గుర్తించక తప్పదు భగవంతుడనేవాడు లేడు, అదొక భావమే అన్నప్పటికీ ఆ భావం వలన కలుగు అనుభవం పొందటం కూడ దివ్యానుభూతియే గదా!

జీవితంలో పరిణతి (perfection) కోరటం, జీవితంలో ఏదో లోపించిందను భావన, ఈ విశ్వ అనంతత్వము తెలుసుకోవాలనే తపన, ఆదర్శం కొరకు శ్రమించటం, ఇవి అన్నియు అందరికీ సహజం, భగవంతుని గుర్తించినా, గుర్తించకపోయినా ఇవే దివ్యదర్శనమునకు మూలములౌతాయి (divine revelation) ఇది ఏదో ఒక పరిమాణంలో (measure) అందరికి కలుగుతుంది తెలిసి ఈ అనుభూతి కలిగినా, గుర్తించని వానికి తెలియక కలిగినా అది అగోచరుడైన పరమాత్మ స్థితికి నిదర్శనము అది గుర్తించగలిగితే అదే ఆధ్యాత్మిక చైతన్యము (spiritual consciousness) పరమాత్మస్థితి, మనం గుర్తించినా గుర్తించకపోయినా భిన్నం కాబోదు గుర్తింపు, నిరూపణ, మహిమలుగా చెప్పబడిన రుజువులు, మతగ్రంథముల ఆధికారిక ప్రకటనలు, పాండిత్య ప్రకర్షలు - ఇవి ఏవీ పరమాత్మ స్థితిని నిరూపించజాలవు సైన్సు పరిశోధనా ప్రభావము, యాంత్రిక హేతువాదము పరమాత్మస్థితిని విశ్వసించలేవు కాని పైన చెప్పిన అనుభూతి వ్యక్తిగతం, నిరూపణలకు అందనిది అది ప్రధానమైనది, వాస్తవమైనది తత్వసిద్ధాంతాలను నిరాకరించవచ్చు, కాని ఆత్మానుభవమును కాదనలేము జీవితమును ఒక జ్యోతిగా భావిస్తే ఆ

వెలుగులో సత్యమును గుర్తించవచ్చు చలి కాచుకునే మంటల చుట్టూ పిచ్చాపాటీలో ఈ సత్యం గోచరించదు

ఇక్కడ ఒక సహజమైన సందేహానికి అవకాశం ఉంది జీవితంలో వచ్చే తీవ్ర సమస్యలకు సమాధానం కోసం ఎవరైనా ఏకాంతంగా కూర్చుని ఆలోచిస్తుంటే అతడు అంతర్ముఖుడై ఆత్మకు దగ్గరైనట్లా? ఆ స్థితి అతడు గుర్తించగలుగుతాడా? ఈ సందేహానికి సమాధానానికి ముందుగా మానవుడు తన మనసును తాను తెలుసుకోగలడా? అని తెలుసుకోవాలి ఏ మనిషి తన మనసును గురించి తాను తెలుసుకోలేడు అనగా మనిషి తనకు తానే పరాయివాడు "Man is a stranger to himself" మానవుడు మెదడులో నుండు వేలాది భాగములు 'lobes' ఏది ఎపుడు దేనికి ప్రతిస్పందిస్తుందో మనోవిజ్ఞానశాస్త్ర పరిశోధనలకు అందటం లేదు మరి ఇది అంతర్ముఖం ఎపుడవుతుందో చెప్పలేము సమస్యలకు సమాధానం కొరకు ఏకాంతంగా ఆలోచించినంత మాత్రాన మనసు లోపలకు తిరగదు (introvert) మనసు లోపలకు త్రిప్పు అంటే అంతర్ముఖము అని స్థూలంగా అర్థం చెప్పినప్పటికి అంతర్ముఖము అనగా భావం అది కాదు

ఒక వస్తువును గురించి గాని, విషయమును గురించి గాని భావం వ్యక్తపరచేటపుడు ఆత్మప్రధానం, వస్తుప్రధానం అని రెండు విధాలున్నాయి ఇక్కడ ఆత్మ అంటే జీవాత్మ కాదు ఇక్కడ ఆత్మ అంటే తనదైన (subjective) అని అర్థము భావ వ్యక్తీకరణలో భావమునకు మూలమైన వస్తువునకు ప్రాధాన్యం తగ్గి వ్యక్తిపై అది కలిగించిన ప్రభావమునకు ప్రాధాన్యము ఏర్పడుతుంది ఇక వస్తుప్రధాన విధములో (objective) వస్తు ప్రభావమునకు ప్రాధాన్యముండదు వస్తువుకే ప్రాధాన్యం ఎక్కువ వ్యావహారికంగా మనసు లోపలకు త్రిప్పుట అంటే బయట ప్రపంచం నుండి తనను తాను వేరుపరచుకుని ఎపుడూ తనను గురించే తాను ఆలోచించుకుంటాడు తన ఆలోచనలే

నుండి ఫలితం కొరకు అలజడి మొదలైనపుడే మనసుకు శాంతిరాదు బాధ్యతో సవ్యముగా కార్యము నిర్వర్తించు, అలజడి చెందవద్దు, ఫలితం అదే వస్తుంది అను భావం ఆ సమయంలో మనసులో ప్రతిధ్వనిస్తుంది ఆ క్షణం బాహ్య స్పర్శ ఉండదు ఆంతరిక అనుభూతి కలుగుతుంది అదే ప్రపంచంలో ఉంటూనే అంటకుండా ఉండటం అవుతుంది (detached state) ఆ స్థాయి శక్తివంతమైనపుడు అనుభూతి మొదలవుతుంది, మనసు ఆత్మకు దగ్గరవుతుంది ఆత్మ అంటూ ఒకటి ఉన్నదని గుర్తించని వారు కూడ చెప్పటానికి వీలుపడని ఆ అనుభూతిని గుర్తించక తప్పదు భగవంతుడనేవాడు లేడు, అదొక భావమే అన్నప్పటికీ ఆ భావం వలన కలుగు అనుభవం పొందటం కూడ దివ్యానుభూతియే గదా!

జీవితంలో పరిణతి (perfection) కోరటం, జీవితంలో ఏదో లోపించిందను భావన, ఈ విశ్వ అనంతత్వము తెలుసుకోవాలనే తపన, ఆదర్శం కొరకు శ్రమించటం, ఇవి అన్నియు అందరికీ సహజం, భగవంతుని గుర్తించినా, గుర్తించకపోయినా ఇవే దివ్యదర్శనమునకు మూలములౌతాయి (divine revelation) ఇది ఏదో ఒక పరిమాణంలో (measure) అందరికి కలుగుతుంది తెలిసి ఈ అనుభూతి కలిగినా, గుర్తించని వానికి తెలియక కలిగినా అది అగోచరుడైన పరమాత్మ స్థితికి నిదర్శనము అది గుర్తించగలిగితే అదే ఆధ్యాత్మిక చైతన్యము (spiritual consciousness) పరమాత్మస్థితి, మనం గుర్తించినా గుర్తించకపోయినా భిన్నం కాబోదు గుర్తింపు, నిరూపణ, మహిమలుగా చెప్పబడిన రుజువులు, మతగ్రంథముల అధికారిక ప్రకటనలు, పాండిత్య ప్రకర్షలు - ఇవి ఏవీ పరమాత్మ స్థితిని నిరూపించజాలవు సైన్సు పరిశోధనా ప్రభావము, యాంత్రిక హేతువాదము పరమాత్మస్థితిని విశ్వసించలేవు కాని పైన చెప్పిన అనుభూతి వ్యక్తిగతం, నిరూపణలకు అందనిది అది ప్రధానమైనది, వాస్తవమైనది తత్వసిద్ధాంతాలను నిరాకరించవచ్చు, కాని ఆత్మానుభవమును కాదనలేము జీవితమును ఒక జ్యోతిగా భావిస్తే ఆ

వాస్తవాన్ని గురించి అభిప్రాయ ప్రకటనకు చాల భేదమున్నది ఆ భేదమే దైవత్వములోని నిగూఢత్వమునకు, భగవంతుని యందు విశ్వాసమునకు మధ్య ఉన్నది ఏ వ్యక్తి అయినా తత్వజ్ఞానం ఎంతో సంపాదించవచ్చు, మతభావన అనగా అనుభూతి భావన లోపించినపుడు ఆ జ్ఞానం నిష్ప్రయోజనమవుతుంది

హేతువే సర్వస్వము అను వాదము విషయములో సునిశితంగా ఆలోచించవలసి యున్నది అన్నారు హిందూతాత్వికులు అజ్ఞానుల కంటే జ్ఞానులే ఎక్కువ పొరపాట్లు చేస్తారు అని అన్నారు ఆ తాత్వికులు వారు మోసపోతారు ఇతరులు మోసపోవటానికి కారణమవుతారు మనలను మనం రెండు విధాలుగా మోసగించుకుంటాము మొదటి విధము గోచరమయే ఈ ప్రపంచమే సర్వం అని విశ్వసించుట ఇక రెండవది జ్ఞానము వలన కలిగే అజ్ఞానం అలౌకికమును విస్మరించు లోకాయతమతము (Naturalism) వస్తు స్వభావమునకే కర్తృత్వము చెప్పు మతము ఒక రకంగా ఆనాటి చార్వాకమతము వస్తుస్వభావము నిశ్చితము (definite) ఆ స్వభావము సర్వానికి మూలం అంటే మనం మోసపోయినట్లే నిరంతరం మార్పుచెందే పరిస్థితులలో నిశ్చిత స్వభావం ఎలా రాజీపడుతుంది కాబట్టి ఈ రెండు మార్గాలు జీవుని స్థితిని (reality of our being) వాస్తవముగా గ్రహించటానికి ఉపయోగపడవు ఇదే బృహదారణ్యక ఉపనిషత్తులో చెప్పారు (IV-4-10)

బ్రా॥ అంధంతమః ప్రవశన్తియేఽ విద్యాముపాసతే
తతోభూయఇవతే తమోయ ఉ విద్యాయాగ్ంరతా. ॥

విద్యకంటే భిన్నమగు కర్మమార్గమును అనుసరించువారు "అంధంతమః ప్రవిశన్తి" అనగా కారుచీకటిలో ప్రవేశించుచున్నారు (ఈశావాస్యోపనిషత్తు (9)) లో కూడ ఇదే చెప్పారు

కర్మకాండల వ్యామోహము విద్యకంటే భిన్నమైనది అన్నారు

పరావిద్యయే అనగా ఆత్మజ్ఞానము మాత్రమే విద్య అనబడును అని భావం కదా! ఆత్మజ్ఞానము పొందు విధము అనగా మనలను మనము తెలుసుకొను విధము బుద్ధివిశ్లేషణ (intellectual analysis) ద్వారా కంటే ప్రకృతి లేక స్వభావమును నియంత్రించటం ద్వారా అభిన్నత్వము (పూర్ణత్వము) పొంది ఆత్మజ్ఞానమునకు మార్గము సుగమము చేసుకొనవచ్చునేమో అనిపిస్తుంది హేతువు నందు గ్రీకులనాటి విశ్వాసం అనగా మన ఆలోచన సరైనదైతే కార్యము సరిగా ఉంటుంది అనే సిద్ధాంతం ఎంతవరకు సరైనది?

విజ్ఞానం ఒక అలంకారం వంటిది దానికి ఆధారం లేకపోతే అదొక ప్రదర్శన వస్తువుగానే మిగులుతుంది అది మనస్సుకు స్వేచ్ఛను ఈయజాలదు హేతువు ఆధారంగా విశ్లేషణ చేసినా, మతగ్రంథ (శ్రుతులవంటివి) పాండిత్యము సంపాదించినా, ఆత్మను గురించిన వాస్తవమును గ్రహించలేకపోయినచో అన్నీ నిష్ప్రయోజనాలే ఔతాయి బుద్ధి పరిణతి ఆత్మవిజ్ఞానం కాదు బుద్ధికి అతీతమైన ఒక శక్తి (energy) బుద్ధిలోనికి ప్రవహించినపుడు బుద్ధి వికసిస్తుంది ఆ శక్తే మనోనేత్రం అదే మనిషిని అంతర్ముఖుని చేస్తుంది అపుడే ఆత్మగోచరమయినట్లు అనుభూతి కలుగుతుంది ఇదే మానవ జీవితంలో సర్వోత్కృష్టమైన సాధన భగవంతుడు (పరమాత్మ) ఉన్నత బుద్ధికి తోచు భావరూపం కాదు, అలాగే ఒక నీతి సిద్ధాంతమూ కాదు తర్క పరిణామ రూపం కాదు మనోనేత్రముతో అనుభూతి ద్వారా మనం గ్రహించగలిగే రూపమే భగవంతుడు (పరమాత్మ) అదే సత్ అదే అందరిలోనున్నది అందరూ కలిగి ఉండే సత్యము (సత్) లేక స్థితి అదే మనకు విముక్తి మతము ద్వారా రాదు ఆధ్యాత్మిక జ్ఞానము, వివేకము ద్వారా వస్తుంది ఏ వస్తువునైనా వ్రేలుతో చూపి గుర్తిస్తాము ఆ వస్తువును గుర్తించిన వ్రేలు ప్రాధాన్యం కోల్పోతుంది తార్కికజ్ఞానము ఆ వ్రేలు వంటిదే అన్నారు అద్వైతతత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ గుర్తించగలగటమే నిజమైన జ్ఞానము పరమాత్మతో ఐక్యత అను స్థితిని గుర్తించటమే నిజమైన జ్ఞానము, తర్కము ఊహించేది, శ్రుతులు (మత

గ్రంథములు) చెప్పేది ఏద్వైతే ఉన్నదో దానిని అంతరదృష్టి ద్వారా గుర్తించగలగటమే నిజమైన జ్ఞానము పవిత్రమైన తపోనిష్ఠ గల జీవితము జ్ఞానమును వివేకముగా మారుస్తుంది, పండితుని ప్రవక్తగా రూపొందిస్తుంది అని సర్వేపల్లి రాధాకృష్ణ అభిప్రాయం

ఈ సందర్భంలో హేతువు - ఆధ్యాత్మిక సత్యం సంబంధం గురించి రాధాకృష్ణ అభిప్రాయము గణనీయం "ఏదో రసమయ భావము (sentiment) నకు శక్తి ఉన్నదని చెప్పటం కాదు అలాగే అజ్ఞానము నుండి జ్ఞానజ్యోతిని సాధించటమూ కాదు అనుభూతి యొక్క వాస్తవము (the turth of experience) మూలము యొక్క నిగూఢత్వము (mystery) నుండి ఉద్భవించదు అది మనలో కలిగించే ఆనందము నుండి కూడా వాస్తవము తెలియదు అది మనలో కలిగించే తృప్తియే, అనగా బుద్ధి సంబంధమైన తృప్తి ఆ అనుభూతి స్థితికి కారణము అది మనిషికి మనశ్శాంతి, సమాజములో సఖ్యత (social harmony) కలుగజేస్తుంది ఎవరైతే వాస్తవ జ్ఞానములోనికి ప్రవేశిస్తాడో అనగా ఎవరిలో ఆ జ్ఞానము ఉదయిస్తుందో అతడు పరిపూర్ణ మానవుడౌతాడు అతని మనసు, అతని స్థితి శాంతినిలయం అవుతుంది అంతరబుద్ధి (intuitions) భావములను లేక ఆలోచనలను అందుకుని వాటిని జల్లెడ పట్టాలి ఎందుకనగా దివ్యమైనవి, స్పష్టమైనవి మాత్రమే గ్రహించాలి లేనిచో విరుద్ధమైనవి, విపరీతమైనవి క్రొత్త విషయాలు కనుగొనినట్లుగాను, ఉపమానములను నిరూపణలుగాను, మాటలను సత్యములుగాను భ్రమించుట అను ప్రమాదమునకు అవకాశమున్నది బుద్ధి యొక్క అర్హతలను (అవసరములను) (claims) మనము అనుమానించినచో మనము ఆత్మతృప్తి అనబడు జ్ఞానవికాస వ్యతిరేకతకు (self-satisfied obscurantism) లోనవుతాము పరీక్షించబడిన విజ్ఞాన పరిధిలోనికి రాని ఎట్టి అనుభవమునైనను ఒడలు తెలియని (Hocus-Pocus) స్థితిగా గుర్తించి తిరస్కరించాలి ఆధ్యాత్మికంగా ఉండాలి అనగా హేతువును తిరస్కరించటం కాదు దానిని దాటి అనగా అతీతంగా ముందుకు

స్థాగాలి అనగా దృఢంగా ఆలోచించాలి ఆలోచనే తెలుసుకొనుట, గోచరించుట స్థాయిగా రూపొందాలి దానినే కల్పనాత్మకమైన ఆలోచన అంటారు (It is to think so hard that thinking becomes knowing or viewing, what we might call creative thinking) ఒకె ఉద్యమంలోని రెండు అంశాలే తత్వజ్ఞానము, మతము "

"ఈ అభిప్రాయము యొక్క గూఢార్థము ఒక రకంగా మనుష్య స్వభావ విజ్ఞానమే (humanistic) వాస్తవమైన మానవ జీవిత సహజ ప్రగతియే మతము అని దీని భావము మానవుడు అన్నిటికి ఒక కొలమానము (పరిమాణము) వంటివాడు పదార్థము నుండి భగవంతుని వరకు అన్ని వాస్తవ స్థాయిలు (levels of reality) ప్రతిబింబించే స్వభావము మానవునిది మానవునిది బహుళ స్థాయీ స్థితి (many-levelled being) తనని తాను తనలోని పశుప్రవృత్తితో ఐక్యత పొందుతాడు, - అదే భౌతిక, దేహధర్మ సంబంధ ప్రవృత్తి (Physical and Physiological) లేక అంతర్బోధమగు హేతుప్రవృత్తిని పొందుతాడు కాని మానవుడు పశుప్రవృత్తి మాత్రమే పొంది ఉండలేడు అంతర్బోధకమగు బుద్ధి (self-conscious intellect), దాని వలన కలుగు విశ్లేషణాశక్తి పరిమిత ఆశయాలు ఆధునిక మానవుని ఆలోచనలలోను, జీవితములోను అతిఉన్నత స్థానం పొంది ఉన్నాయి కాని దాని పర్యవసానము ఆత్మహత్యా సదృశమగు అనుమాన ప్రవృత్తి (scepticism) ఇంద్రియ ప్రత్యక్ష సాక్ష్యములను, ఊహలను, వాటి నిర్ణయాలను (judgement and inference) అది కొంతవరకు అనుమతిస్తుంది (అంగీకరిస్తుంది) కాని దేనినైతే బహువిషయక హేతువు (discursive reason) సరైనదిగా ఊహించవలసి వస్తుందో (take for granted) అట్టి గాఢమైన అంతర్బుద్ధిని కృత్రిమమైనదిగాను, ఆత్మ అనగా వ్యక్తి ప్రధానమైనదిగాను (subjective) తిరస్కరిస్తుంది సామాన్య ఊహతో కూడిన హేతువు నందు విశ్వాసము (faith in conceptual reason) అహంకారమునకు తార్కికమైన ప్రతిరూపము అది స్వార్థపూరితమైన

అహంకారమును ఆత్మకు అత్యంత ప్రబలశత్రువుగా చేస్తుంది సాధారణ చైతన్యమునకు అతీతమైనదేదో మానవునిలో ఉన్నదని సత్యమైన మానవత సూచిస్తుంది అదే మానవుని భావములను, ఆశయములను, సూక్ష్మమైన ఆధ్యాత్మిక స్థితి, రూపొందించి భౌతిక అనుసరణ, వృత్తుల యందు అసంతృప్తి కలుగజేస్తుంది అనాది నుండి అతిపురాతన వారసత్వముగల సిద్ధాంతము ఒకటి ఉంది మానవుని సాధారణ స్థితి అతని పరిపూర్ణ స్థితి కాదు (ultimate being) అను విశ్వాసం - అతనిలో గాఢతరమైన ఆత్మస్థితి (self) ఉన్నది ఆ స్థితిని శ్వాస (breath) అనవచ్చు, ప్రేతాత్మ (ghost) అనవచ్చు, జీవాత్మ లేక, (soul) శరీరం వదలిన ఆత్మ అని కూడ అనవచ్చు దేనివలనను అంతరించని జ్యోతి (వెలుగు) మనిషిలో ఉంది అది అమరమైన ఆత్మ, దయామయమైనది, సహనము కలది అది అతని హృదయములోని మౌనసాక్షి ప్రపంచంలో మహాత్మ్వికులందరు ఏకగ్రీవంగా ఆత్మను గురించి తెలుసుకొనండి అని చెప్పున్నారు రాధాకృష్ణ ఇంకా ఇలా అన్నారు, "వాస్తవమైన ఆత్మ సర్వాతీతమైన స్థితి ఇది ఆధ్యాత్మిక మతములోని మూలసత్యము దానిని తెలిసికొనుట, దానితో ఐక్యత పొందుట మన కర్తవ్యము ఆత్మతో సఖ్యత పొందిన జీవాత్మ తన ప్రత్యేక స్థూలస్థితిని విస్మరిస్తుంది అది సార్వజనీనమైన, సర్వమానవుల స్పష్టరూపమని గుర్తిస్తుంది సర్వమానవుల ఆశయములలోను ఒకే ప్రేరణ (impulsion) ప్రవాహము ఉంటుంది "నీవు నాలో - నేను నీలో" అను వాక్యములోని అంతరార్థము పరిపూర్ణ స్థితిలోని ప్రధాన స్థితియైన ఏకత్వము ఆత్మ యొక్క అనుభూతి సహకారమే జీవితం సహకారం లేకపోవుటే మరణం మానవజాతి ఐక్యత నుండి మనము వేరుకాలేము ప్రపంచంలో అపుడపుడు కనబడు పిచ్చి స్వభావములు దానిని త్రోసివేయలేవు'

తత్వవేత్తగా రాధాకృష్ణను అర్థం చేసుకోవటం అంత సులభం కాదు ఆయనకు గల బహుముఖ ప్రజ్ఞయే ఇందుకు కారణం అని చెప్పాలి ప్రాచ్య పాశ్చాత్య దేశాలలో భారతీయ సంస్కృతికి వివేకానందుని తరువాత ప్రతినిధిగా

ప్రవర్తించిన ఏకైక తత్వవేత్త రాధాకృష్ణ ఆయన తత్వం పరిపూర్ణ భావవాదం **భావము అనగా సత్తు, ఆత్మ, ఉనికి** 'సత్తు' మూలం అను అభిప్రాయం కాని ఏదో శక్తి మూలంగా ప్రపంచం అంతా నడుస్తోంది అని నమ్మినప్పటికీ అందు తొలగించవలసిన అనేక సత్యాలను ఆయన తిరస్కరించలేదు **ఈ సత్యముల అన్నిటి కలయికే పూర్ణమైన అభివృద్ధి అనునదే ఆయన భావవాదం** ఇదే స్థూల ప్రపంచము కల్ల యను వాదము లేక ఊహాప్రపంచవాదము అదే భావవాదము (Idealist view), అనగా అద్వైతతత్వము అసహనానికి, పాక్షిక దృష్టికి, పెడవాదనలకు, మాఢ్యమునకు ఆయన వ్యతిరేకి భావవాదానికి, దాని వ్యతిరేకవాదానికి, భగవంతునికి, ప్రపంచానికి, హేతువాదానికి, స్థూలదృష్టికి, ఉన్న వైరుధ్యమును, తాత్విక సిద్ధాంతాలలోని భిన్నత్వమును, భిన్న మత వ్యతిరేకతలను తొలగించి సమన్వయపరుస్తాడు అయితే ఆయన కృషి సమన్వయం వరకేనా అని సందేహం వస్తుంది అంతేకాదు ఈ సమన్వయ ప్రయత్నంలో అనేక క్రొత్త లక్షణాలు వెలువడినాయి వీటికి ఆయన కారకుడనటంలో సందేహమునకు తావులేదు అది ఆయన స్వతంత్ర ఆలోచనలకు, నిశితదృష్టికి తార్కాణములు తత్వశాస్త్రంతో ఆయన ఆలోచనలకు, నిశితదృష్టికి అద్దం పట్టేవి ప్రత్యేకంగా రెండు వ్యాఖ్యలు అందులో **మొదటిది** 'మాయా'వాదానికి ఈయన ఇచ్చిన నూతనవ్యాఖ్య **రెండవది** ఆత్మతత్వమునకు ఆయన ఇచ్చిన నూతన అర్థం

తత్వశాస్త్రజ్ఞులలో పెక్కుమంది చెప్పే మాయావాదానికి ఈయన ఇచ్చిన వ్యాఖ్యకు చాల భేదం ఉన్నది ఈయన దృష్టిలో మాయావాదం అంటే మిధ్యావాదం కాదు ప్రపంచం మాయ అంటే ప్రపంచం లేదు అని కాదు ఈ ప్రపంచం అనాది పదార్థం కాదు అని మాత్రమే ఈయన వ్యాఖ్య ఈ ప్రపంచంలో కనబడే రూపభేదాలకు మూలం పరిపూర్ణ భావంలో ఉంది అయితే ఈ రూపభేదాలు పరబ్రహ్మం యొక్క సమగ్రతను గాని, పరిపూర్ణతను గాని కదిలించలేవు ఇదే రాధాకృష్ణ ప్రాక్ పశ్చిమతత్వద్రష్టల సమన్వయం

ఇదే పాశ్చాత్యులకు భారత తత్వశాస్త్రం యెడల ఆసక్తి, సానుభూతి ఏర్పడటానికి ప్రధాన కారణంగా చెప్పవచ్చు ఆ విధంగా మొత్తం ప్రపంచానికి తగిన ఒక శ్రేష్ఠమైన తత్వశాస్త్రమునకు రాధాకృష్ణ గట్టి పునాది వేయగలిగాడు

వీరి తాత్వికదృష్టిలో రెండవ వ్యాఖ్య ఆత్మతత్వమును గురించినది ఈ తత్వంలోని మూలసూత్రం సర్వమత సామరస్యం మతం అనేది ఒక సిద్ధాంతం గాని, సూత్రాల సంకలనం కాని కాదు అనేది వీరి ప్రధాన సూత్రం వాస్తవమును (సత్యమును) గ్రహించగలిగిన దృష్టిని (vision) ఇవ్వకలిగేదే మతం అన్నారు సర్వమత సహనమునకు మార్గం చూపిన తాత్విక న్యాయవాది రాధాకృష్ణ పండితులు భారతదేశం యొక్క ప్రాచీన తత్వసిద్ధాంతాలకు స్వచ్ఛత చేకూర్చి, వర్తమాన స్థితికి అన్వయించు నూతన వ్యాఖ్యలను కల్పించి విశ్వమానవ అభ్యుదయానికి ఉత్కృష్టమైన కృషి చేసిన ప్రముఖులలో రాధాకృష్ణ పండితులు అగ్రగణ్యుడు

రాధాకృష్ణ తన 'Idealist view of life' 'భావవాది జీవితదృక్పథం' అను గ్రంథంలో "భావవాది జీవిత పధకం ఒక నియంత్రిత పద్ధతిలో ఉండదు దానికి అనేక రూపాలు ఉన్నాయి కాని భిన్నములైన ఈ రూపాలన్నీ ఒక చైతన్యం నుండి ఉద్భవించినవి అని మనం తెలుసుకోగలం," అని వివరించారు విశ్వంలో కనబడు అన్ని రూపాలకు ప్రయోజనం కల్పించి వాటికి ఉచిత స్థానాలు యివ్వగలిగినపుడే ఏ తత్వశాస్త్రానికైనా విలువ ఏర్పడుతుంది మానవుల మనస్సులలో స్థావరం ఏర్పడుతుంది ఈ పనిని రాధాకృష్ణ పండితులు అతిప్రతిభావంతముగా నిర్వర్తించారు

శంకరుల మాయావాదమును (మిధ్యావాదమును) సంప్రదాయ పద్ధతిలో అంగీకరించకపోయినప్పటికి రాధాకృష్ణ పరిపూర్ణ అద్వైతతత్వవేత్త ఆయన శంకర భగవత్పాదుల శిష్యులే అనగా వాస్తవముగా అనుసరించినవారు మాయావాదమును ఈ విధంగా వ్యాఖ్యానించారు శంకర భగవత్పాదులే తన

మాయావాదమును సంప్రదాయముగా ఇవ్వబడిన అర్థములో నిర్వచించలేదు అని రాధాకృష్ణ అభిప్రాయపడ్డారు ఈ ప్రపంచం సృష్టిని అర్థం చేసుకోలేమని గాని, ఈ ప్రపంచమునకు ఏ విధమైన విలువలు లేవని గాని శంకర భగవత్పాదుల అభిప్రాయం కాదు అన్నారు "శంకరులే ఒకచోట పైకి కనబడేది సత్యాసత్యముల కలయిక అని అన్నారు" అని రాధాకృష్ణ అన్నారు శంకరులు ఈ దృష్టినే అనుసరించినట్లుగా కనబడుతుంది అనగా ఈ ప్రపంచమును సత్తు, అసత్తుల కలయికగా భావించాలి గాని సత్తుగా గాని అసత్తుగా గాని భావించరాదు పండితులు అద్వైతమునకు చెప్పే తార్కికవ్యాఖ్యకు ఇది వ్యతిరేకముగా కన్పడుతుంది శంకర భగవత్పాదుల ఉద్దేశ్యమే ఈ పండితుల తర్క వ్యాఖ్యలతో పొసగనపుడు, ఇంక ఈ వ్యాఖ్యలకు ప్రాముఖ్యము ఏముంది!

రాధాకృష్ణ భావవాదం ఒక లోతైన జల నుంచి ప్రవహించే నిర్మల ప్రవాహం వంటిది ఆయన రచన ప్రతి అక్షరం వేదాంతవాహినిలో ముంచెత్తినట్లు కనబడుతుంది వీరి తాత్త్వికదృష్టి విశ్వమునంతా తనలో ఇముడ్చుకున్నదా అనిపిస్తుంది

నేటి మానవుని దృష్టి ఏమిటి? అది పూర్తిగా బాహ్యదృష్టి అంతర్దృష్టి లేదు తనను తాను తెలుసుకునే ప్రయత్నం చేయడు చేయటానికి అతనికి తీరిక దొరకదు ఒక తత్త్వవేత్త ఇలా అన్నాడు 'సైన్సు సర్వమును పరిశీలించింది కాని తనకు మూలమైన సైంటిస్టుని మాత్రం మరచిపోయింది' అనగా సైంటిస్టు బాహ్యంగా ఎన్నో పరిశోధించాడు కాని తనను తాను పరిశోధించు కోలేకపోయాడు సైన్సు యొక్క విజయాలను కించపరచటం కాదు సైన్సు భౌతికవాదం అది చైతన్యశక్తిని నిరసిస్తుంది అలాగే భౌతిక లక్షణాలను నిరసించే చైతన్యవాదము కూడ నిరుపయోగమే అవుతుంది

హేతువాదం కూడ ఈ కోవకు చెందిన భౌతికవాదం వంటిదే ఒకప్పుడు అల్లకల్లోలంగా ఉన్న ప్రపంచమునకు ఒక వెలుగు బాట చూపించింది

ఈ హేతువాదం స్వభావం ఏమిటి? అను ప్రశ్న వస్తుంది సామాన్య మానవ అవసరములు, సామాన్య జీవన సమస్యలను పరిష్కరించుకొనుటలో పూర్తిగా హేతువు ఆధారంగా ప్రవర్తించటం దీని ఆదర్శం (rationalism) ఎప్పటికప్పుడు ప్రత్యక్షంగా తేలిన నిదర్శనాల సహాయంతో నిర్ణయాలను చేసుకుంటుంది తర్కమే దీనికి ఆధారం కాని తర్కానికి అందని అనుభవాలు కొన్ని మానవునికి వస్తూ ఉంటాయి అవి అప్పటికి సహేతుకం కానివి అవుతాయి హేతువాదులు అంగీకరించని సత్యాలు కొన్ని ఉన్నాయి ఉదాహరణకు స్వాభిమానము అనుగుణం అది హేతుపూర్వకం కాదు అందుచే సత్యాన్వేషణలో హేతవాదం నిష్ప్రయోజనం పరిణామ దశలలో ఒక పై స్థాయికి తీసుకువెళ్లగలుగుతుంది హేతువాదం అంతవరకే దాని పరిమితి

హేతువాదం వలన అవకాశమున్న ప్రమాదమును గురించి అరవిందులు ఇలా అన్నారు "హేతువాదం మనస్సులో ఉన్నంత వరకు ప్రమాదం లేదు అప్పుడది విభిన్న దృక్పథాలను సిద్ధాంతాలను కొంతవరకు సహిస్తుంది ఒకదానితో మరొకదానిని పోల్చుకుని సమన్వయం కోసం ప్రయత్నిస్తుంది మార్పు చెందుతుంది తన పరిధిని పెంచుకుంటుంది ఉన్నత స్థితి పొందుతుంది కాని అది జీవితంలో కల్పించుకుని ఆధిపత్యం పొందే ప్రయత్నంలో సిద్ధాంతంగా మారుతుంది అపుడది అభివృద్ధి కదలికలకు ఆటంకం అవుతుంది సామరస్యానికి సమన్వయానికి బదులుగా సంఘర్షణలకు, రక్తపూరిత విప్లవాలకూ దారితీస్తుంది ఆచరణ, ప్రవర్తననూ క్రమబద్ధం అను పేరుతో యాంత్రిక స్వభావమును అలవరుస్తుంది భౌతిక ప్రకృతిని యాంత్రికంగా క్రమబద్ధం చేయవచ్చు కాని చైతన్య రూపమును ఎలా చేయకలుగుతుంది? అపుడే దుష్ఫలితాలు ఏర్పడతాయి "

హేతువాద ధ్యేయం అను సంధానం మాత్రమే జీవితమును ప్రత్యక్షముగా పరిశీలించి, అది ఏ మార్గంలో నడుస్తోందో గ్రహించి దాని

నియమాలను ప్రకటించటం దాని పని ఇందుకు అది అర్ధసత్యాలను సంపూర్ణసత్యాలుగా పరిగణించి అభివృద్ధిని నిరోధిస్తుంది

అందువలన పూర్తిగా హేతువాదం ద్వారానే సత్యం తెలుసుకోవటం అసంభవం హేతువాదమునకు అతీతంగా ఆత్మజ్ఞానం అనేది ఒకటి ఉన్నది దాని ద్వారా సత్యమును తెలుసుకొనవచ్చునని ఆధ్యాత్మికవాదం చెప్తుంది అలాగని హేతువాదం పూర్తిగా నిష్ప్రయోజనం అని ఎవరు అనలేదు మానవుని ఆత్మజ్ఞాన స్థాయికి ఎదుగుటకు అది తోడ్పడుతుంది హేతువాద ప్రయోజనాలను మానవుడు పొందాడు మంచి, చెడు తర్కించి తెలుసుకోగల స్థితికి చేరాడు ఇది ఆత్మజ్ఞాన సాధనకు తగిన స్థితి

మన పూర్వులు, ఉపనిషద్కర్తలు ఆత్మజ్ఞానమును బహుముఖంగా పరిశీలించారు ఈ దృష్టి ఇపుడిపుడే పాశ్చాత్య మేధావులను గూడా ఆకర్షిస్తోంది ఉపనిషత్తులలో విషయ ప్రతిపాదనలో చక్కని క్రమం ఉంది హేతువాదంతో, దృష్టాంతాలతో, ఉపమానాలతో ప్రత్యక్ష ప్రమాణాలతో బ్రహ్మజ్ఞాన (ఆత్మజ్ఞాన) బోధసాగింది ఈ ఉపనిషదృషులెవరూ కూడా ఈనాడు తామే భగవంతులమని చెప్పుకుంటూ చలామణి అవుతున్న స్వామీజీలు, గురూజీలు లాగా అహంకారంతో లేదా అసత్యంగా తాము పరమాత్మ తత్వమును సంపూర్ణంగా తెలుసుకున్నామని, తామే భగవంతులమని చెప్పుకోలేదు అంతేకాదు, మన భౌతిక విజ్ఞానం ఎంత పెరిగినా పరమాత్మను గూర్చిన ప్రత్యక్ష జ్ఞానమును పొందలేము అనే చెప్పారు

మనిషికి, ఈ ప్రపంచానికి అతీతమైనది, ఇక్కడ లేనిది ఎక్కడో ఉన్నదని మన భారతీయ మతం చెప్పలేదు తనలోనే భగవంతుడున్నప్పుడు ఇంకా ఎక్కడో వెతకటం దేనికి? సమస్తము భగవత్స్వరూపమే అయినపుడు ఎక్కడికని పోయి వెతుకుతావు? నీలో ఉన్న ఆత్మను దర్శించు ఆత్మానుభూతిని పొందు అదే నీ లక్ష్యం నీవు చేరవలసిన గమ్యం అదే అపరోక్ష అనుభూతి అదే ఉపనిషణ్మతం చెప్పేది

ఒక పాశ్చాత్య తత్వవేత్త పాల్ బ్రంటన్, "మానవుని విషమ పరిస్థితి' అను గ్రంథంలో ఈ లక్ష్యాన్ని గురించి ఇలా వ్యాఖ్యానించాడు "మానవుడు పెంచుకున్న పూలతోటలో అన్ని పువ్వులలోకి ఇది సున్నితమైనది స్వచ్ఛపరచబడిన అనుభూతే ఆత్మజ్ఞానం హేతువాదం అనుభూతులను పరిశీలించి అదుపులో పెట్టవచ్చు గాని, రూపుమాపటానికి ప్రయత్నించగూడదు అనుభూతి స్వచ్ఛపడినపుడు అహం నశిస్తుంది అపుడు పై స్థాయికి చెందిన వెలుగు దాని మీద ప్రసరిస్తుంది స్వచ్ఛపరచబడి వెలుగును స్వీకరించిన దానిని 'ఆత్మజ్ఞానం' అంటున్నాం "

కాబట్టి ఈ సందర్భంలో ఈ అనుభూతిని మూడు స్థాయిలుగా చెప్పవచ్చునేమో మనస్సు ద్వారా గ్రహించటం (ఆలోచన ద్వారా), హేతువాదం ద్వారా పరిశీలించటం, అటుపై 'భావం' ద్వారా ఆత్మజ్ఞానం పొందటం ఆత్మజ్ఞానం ఒక భావసిద్ధి అన్నారు గదా! దానిని మరి ఈ భౌతిక శరీరం కూడా పొందినపుడే గదా ఇంద్రియానుభూతి నియంత్రించబడి ఆత్మానుభూతి మార్గం సుగమము అయేది అనగా ఇంద్రియానుభూతి అందులో మిళితం కావాలి ఎందుకంటే ఇంద్రియానుభూతి పూర్తి భౌతికం గదా! ఆ భౌతిక స్థితిలో ఉంటూనే ఆత్మజ్ఞాన అనుభూతితో సంయోగం పొందాలి ఇది ఎలా సాధ్యం? సాధ్యము చేసుకోవచ్చు తెలుసుకున్న లేక పొందిన ఆత్మానుభూతి వాస్తవమైనదేనా? లేక ఏదో భౌతికానుభవం వలన కలిగిన పారవశ్య స్థితా? అనేది హేతువాదం ద్వారా పరిశీలించి మనస్సుకు అందచేస్తే, ఇంద్రియ నియంత్రణాధికారి మనసే కాబట్టి, అది కొంతసేపైనా ఇంద్రియములను బాహ్య విషయముల నుండి వేరుచేసి ఆత్మజ్ఞాన అనుభూతిలో సంయోగం చేయగలుగుతుంది స్థూలశరీరం ఉన్నంతవరకు మనస్సును అనుభూతి నుండి వేరుచేయలేము కాబట్టి ఆత్మానుభూతితో మిళితం చేయాలి మనస్సు ఇంద్రియాలను కలుపుకుంటుంది అపుడే నిద్రావస్థలో కలుగునని చెప్పబడిన ఆత్మానుభూతిని జాగ్రదావస్థలో కూడా పొందే అవకాశం వస్తుంది అదే

జీవన్ముక్తి స్థితి అవుతుంది కదా! ఏ సిద్ధాంతమునననుసరించి చెప్పింది కాదు ఇది

ఇక్కడ ఒక్క విషయమును హేతువాదులు గమనించాలి ఆత్మజ్ఞానం ఉన్నదని చెప్పటం వలన హేతువాదం భంగపడిందని ఆందోళన చెందవలసిన పనిలేదు సృష్టికి మూలం పదార్థమే అని చెప్పినప్పటికీ దాని పరిణామమే ఈ ప్రకృతి లేక సృష్టిప్రవాహం అన్నారు గదా! ఆ పరిణామంలో అనేకమైన శక్తులు వెలువడినాయి గదా! ఆత్మజ్ఞానం అంటే మనస్సు కంటే అతీతమైన శక్తి ఏదో మనలో ఉన్నదని, సృష్టి ప్రవాహమునకు మూలమైన శక్తి నుండి, - అనగా పదార్థము నుండే శక్తి వచ్చును గదా! - పరిణామం పొందిన అంశమే మన ఆత్మ అని గ్రహించవచ్చు గదా! అలా గ్రహించినందు వలన మనస్సు ప్రేరకంగా ఏర్పడిన జీవిత విలువలు నిర్మూలించబడతాయి అనటానికి అవకాశం ఎక్కడుంది ఎందుకనగా ఆత్మ నుండి మనస్సు వేరుచేయకూడదు అటు ఆత్మజ్ఞానానికి, ఇట్టు భౌతిక విలువలు, అనుభవాలకు వారధి వంటిది మనసు నిత్యజీవితంలో భౌతికంగా మానవ పురోభివృద్ధికి ఆత్మజ్ఞానం అడ్డురాదు హేతువాదమును పూర్తిగా నాస్తికవాదంగా పరిగణించవలసిన పనిలేదు హేతువాదం, ఆత్మజ్ఞానం విరుద్ధములు కావు రెండు సమన్వయంతో పనిచేసేటట్లు చేసుకోవచ్చు భౌతికానుభవ పారవశ్యమును ఆత్మజ్ఞానముగా భ్రమించకుండా హేతువాదం అదుపులో పెడ్తుంది అలాగే హేతువాదం ద్వారా పూర్తి భౌతిక వాంఛానుభవంలోకి దిగజారకుండా ఆత్మజ్ఞానం అదుపులో పెడ్తుంది అంటే హేతువాదం, ఆత్మజ్ఞానం పరస్పర పర్యవేక్షకులుగా తలచినపుడు వైరుధ్యం ఉండదు

నేడు హేతువాదముగా చెప్పబడుతున్న ఈ వాదము వాస్తవానికి వేదమతమునకు కొత్తది కాదు ఉపనిషత్తులలో చర్చల ద్వారా అంతర్లీనంగా ప్రవహించేది హేతువాదమే అని గ్రహించాలి వేలాది సంవత్సరముల క్రిందటనే

శ్రీమద్భాగవతంలో వేదవ్యాసుడు "హేతుంజ్ఞాత్వా మానవాః విందతి సుఖం" అని అంటాడు మనం ఏదైనా పనిచేసేటప్పుడు, ఎందుకు, దేనిని ఆశించి, దేనిని ఆధారం చేసుకుని, దేని ద్వారా చేయాలి అని పరిశీలించాలి ఇలా ఆలోచించి చేయడం, తద్వారా మనసుకు లేక మానవ సమాజానికి ఉపయోగం ఏమిటి అని ఆలోచించటమే మంచిదని భారతంలో విదురుడు, సంజయుడు, రామాయణంలో విభీషణుడు చెప్పారు మరి హేతువాద సారాంశం కూడ అదే కదా! అదే హేతువాదం అను భావన లేకపోయినా తరతరాలుగా ఈ వాదన తరుచూ వినబడుతూనే ఉన్నది గదా! ఈ హేతువాదమునే మరొక రూపములో 'తత్వజ్ఞానం' గ్రహించుట అని కూడ అనవచ్చు 'తత్వజ్ఞానం' వేదాంత పరిభాషాపదం రెండు పర్యాయపదాలు కాదు కాని ధ్యేయం ఒకటే ఏది? ఎందుకు? అను ప్రశ్నలకు సమాధానాలే ఈ రెండు కూడ

హేతువు ఆధారంగా చేసేదే హేతువాదం వాస్తవానికి అదొక వాదము కాని, సిద్ధాంతం కూడా కాని కాదు అనిపిస్తుంది హేతువాదం నాస్తికం అనేది అపార్థం మాత్రమే తొలిదశలో అది నాస్తికవాదముగా అనిపిస్తుంది అది భౌతిక వాస్తవిక వాదరూపం అది ఒక ఆలోచనావిధానం ఒక మానసిక వైఖరి భావాలకు అతీతంగా ప్రమాణాలకు దూరంగా నిరూపణలకు అనుభవమును మాత్రమే ఆధారంగా తీసుకునే తత్వవిధానం హేతువాదం దీని లక్ష్యం చాల విస్తృతమైనది నాస్తికవాదంగాను, మూఢవిశ్వాసాలను విమర్శించే సిద్ధాంతంగా మాత్రమే దానిని వక్రీకరించటం సంకుచిత భావనిదర్శనం ఈ విశ్వం నియమబద్ధమైంది విశ్వము నుండి పరిణామం చెందిన మానవునిలోని ఆ నియమబద్ధతే హేతుత్వముగా పరిగణించాలి నిరంతరాన్వేషణకు హేతుత్వం స్ఫూర్తి అట్టి స్ఫూర్తికి ఆటంకంగా కాలం చెల్లిన మత విశ్వాసాలు, మౌఢ్యాలు నిలబడుతున్నాయి వీటి నుండి మతమును స్వచ్ఛపరిస్తే అపుడు మతం పారమార్థికం అవుతుంది పారమార్థికం, హేతత్వం సమన్వయం పొందవచ్చునని చెప్పబడింది గదా!

మనది వైదిక ధర్మాచరణపూర్వక ధార్మిక వ్యవస్థ కాని, ఒక మతం కానీ కాదు మతం మతిని పోగొడ్తుంది ఇలా ఉండాలి, ఇలా ఆలోచించాలి అంటూ మనలను గిరిగీసి అందులో కూలవేస్తుంది కులం కల్మషం చేస్తుంది ఇపుడున్నది కులవ్యవస్థ వర్ణవ్యవస్థ కాదు మతం సంకుచితత్వాన్ని అలవరుస్తుంది శరీరమునకు సంబంధించిన ఏ వికారమైనా మతం పరిధిలోనికి మారుతుంది అట్టి మతాన్ని తిరస్కరించాలి సనాతన వైదిక ధర్మం ఈ విధమైన సంకుచిత భావాలను బోధించలేదు విశేషమైన స్వేచ్ఛను ప్రసాదించింది శారీరక వేషభాషలకు ఆడంబరాలకు, అసలు శరీరానికే విలువనీయలేదు మన వేదధర్మం ఒక్క ధర్మ, జ్ఞానములకు మాత్రమే ప్రాముఖ్యమునిచ్చింది, బోధించింది అయితే 'శరీరమాద్యం ఖలుధర్మసాధనం' అన్నారు కాబట్టి, ఏ కార్యమునకైన శరీరమే ఆధారం కాబట్టి, దానికి కూడ మనసుతో బాటుగా నియమిత శిక్షణ అవసరం కనుక కొన్ని నియమాలు ఏర్పరిచారు అంతవరకే వాటికి మాధ్యమును, సంకుచితత్వమును జోడించమని చెప్పలేదు అవి తొలగిస్తే మతం సమ్మతం, సన్మతం అవుతుంది

పాశ్చాత్య తత్వవివేచన పరిణామములలో 'గ్రీసు-రోమ్' యుగంలో ప్రధానంగా హేతువాదమునకు అత్యంత ప్రాధాన్యం ఉన్నది అందుకే దానిని 'హేతుయుగము' (Age of Reason) అనవచ్చును క్రైస్తవ మధ్యయుగంలో దివ్యదర్శనమునకు (Revelation) అత్యంత ప్రాముఖ్యం ఇవ్వబడింది తత్వవిజ్ఞానము (Philosophy), సైన్సు కూడ మత సిద్ధాంతములకు (Theology) తోడ్పడినై కాని ఆధునిక యుగంలో ప్రత్యేకించి క్రీ॥శ॥ 18వ శతాబ్దము నుండి తిరిగి హేతువు (Reason) ప్రాధాన్యం సంతరించుకున్నది ఇంద్రియానుభవమునకు (sense experience) ప్రయోగ విధానమునకు (experimental method) విజయం కలిగింది వీటికి ప్రక్కనే సంశయాత్మకవాదము (scepticism), అంతర్బుద్ధివాదము (intuitionism), హేతువ్యతిరేకవాదము (anti-rationalism), అజ్ఞాతావాదము (agnosticism) ఉద్యమించినవి

ఈ పరిణామాలు, ఉద్యమాల వలన హిందూ తత్వవిజ్ఞానమును గురించి పాశ్చాత్య అభిప్రాయములు అసంపూర్ణముగాను, ఎక్కువ భాగము సత్యదూరములుగాను ఉండటం జరిగింది మూలసత్యముతో ఐక్యత లేక గుర్తింపు కొరకే భారతీయ తాపసులు ప్రయత్నించారు (strives for direct identification with fundamental reality) అనునది అట్టి అభిప్రాయములో ఒకటి వాస్తవమునకు ఏ భారతీయ తాపసి ఇట్టి ఐక్యత కొరకు ప్రయత్నించినట్లు కనబడదు 'జ్ఞానము' అనునది ఎట్టి భౌతిక, మానసిక చర్యల ఫలితము కానేదరు అని శంకర భగవత్పాదులు స్పష్టము చేశారు ఎందుకనగా జ్ఞానము అనునది, సంబంధిత వస్తువు మీద, గ్రహించుటకు అనుసరించు మార్గము మీద ఆధారపడి ఉంటుంది జీవాత్మ పరమాత్మ నుండి అభిన్నమైనది ఇది నిత్యసత్యము ఇచట గుర్తింపు సమస్యలేదు శంకరులు చెప్పిన గుర్తింపు లేక ఏకత్వము (identification) ఆత్మజ్ఞానము అనగా జీవాత్మ పరమాత్మల ఏకత్వమును గ్రహించుట మానవుడు తనను తాను తెలిసికొనుటయే అనుభూతి (realization) దీనిని ఏదైన బాహ్యావస్తువును గురించి తెలిసికొనుట యందు సమన్వయించకూడదు అనుభూతి (realization) అనునది జీవాత్మయే పరమాత్మ అను జ్ఞానము ద్వారా కలుగు ప్రత్యక్ష అనుభవమే గాని గుర్తించుట వంటి ప్రక్రియ కానేరదు పరమాత్మ నిర్గుణుడు, నిరాకారుడు జీవాత్మయే పరమాత్మ అనినపుడు జీవాత్మను మరొకదానితో గుర్తించటం సాధ్యపడదు కదా! ఒక బాహ్యావస్తువును గురించి తెలుసుకునేటపుడు భిన్నత్వము ఉన్నది కాబట్టి మనలను దానితో గుర్తించుట అను ప్రశ్న ఉదయించదు ఒక మనిషి ఒక ఆకాశ హర్మ్యములోని ఏదో పదవ అంతస్థు నుండి క్రిందకు చూచినపుడే తనకు గలుగు అనుభవము ద్వారా తన స్థితిని గుర్తించగలుగుతాడు ఇదే గుర్తింపు ద్వారా కలుగు అనుభవము (identity realization) ఈ అనుభవము మానవభావ పరిధిలోనిది కాని ఆత్మానుభూతి భావాతీతమైన స్థితి నిరాకారుడైన పరమాత్మను భావాతీత స్థితిలో గ్రహించి జీవాత్మ పరమాత్మల ఏకత్వమును

గ్రహించుట ఒక అనుభూతి (ప్రత్యక్ష అనుభవము) ఇది పాశ్చాత్యులు తలచిన 'గుర్తింపు' (identification) వంటి శ్రమ కాదు (striving) ఆత్మ, అనాత్మ (ఆత్మకానిది) పూర్తిగా భిన్నములు అనాత్మ విషయములో గుర్తింపు సమస్యరాదు ఆత్మ తెలియదు కావున దాని నుండి అనాత్మను గుర్తించే ప్రశ్నలేదు అనాత్మ ఆత్మకాదు అని తెలుసుకొనుటయే జ్ఞానము

భక్తుడు భగవంతునితో ఐక్యత కోరుకుంటాడు కాని ఇది ఏకత్వము (identification) కాదు ఇది ద్వైతము ఆత్మ పరమాత్మలో లీనమగుట ఒక వస్తువు మీద మనసు కేంద్రీకరించి ఆ వస్తువు సారమును (essence) గ్రహించుట యోగసిద్ధాంతము ఇచట కూడ గుర్తింపు సమస్య రాదు గదా!

పాశ్చాత్య దేశములలో వలెనే భారతదేశంలో విభిన్నతత్వ సిద్ధాంతములు అంకురించినవి అందు ఎక్కువ భాగము వేదప్రాధాన్యము అంగీకరించినప్పటికి, వేదములను తిరస్కరించినవి, నాస్తికత్వమును ప్రబోధించినవి కూడ ఉన్నవి వేదాంత ఆధ్యాత్మిక అద్వైత, ద్వైత సిద్ధాంతములతో పాటు న్యాయ, మీమాంస, జైన, బౌద్ధ మరియు చార్వాక సిద్ధాంతములు కూడ ఉన్నవి కదా తాము ఊహించుకున్న దానికి సరిపడిన ఏదో ఒక సిద్ధాంతమును గ్రహించి దానిని సర్వసామాన్యము చేసి అదే హిందూ తాత్విక చింతన సర్వస్వము అని భ్రమించుట పాశ్చాత్యులకు తగదు అటులనే మనము కూడ పాశ్చాత్య తాత్వికులలో ఎవరో ఒకరి సిద్ధాంతము గ్రహించి అదే పాశ్చాత్య తాత్విక దృక్పథ సర్వస్వము, సర్వసామాన్యము అని తలంచకూడదు

హిందూ మత, లేక బౌద్ధ నిగూఢతత్వచింతన (mysticism) లన్నియు అవ్యక్త ఆనందస్థితికి మార్గములనియు, అవి అన్నియ గమ్యమునకు చేర్చగలవు అని నిర్ధారణ లేదు నిర్వాణము లేక మోక్షము అనునది అట్టి అవ్యక్త ఆనందగమ్యమే అగునా, అనునది వివాదాత్మకమైన ప్రశ్న హిందూ తాత్వికులెవ్వరు వేదములు మహర్షుల అనుభవములు అని విశ్వసించరు

అందు అనేకులకు వేదములు అపౌరుషేయములు  కొందరికి అవి ఈ సృష్టియందలి నిత్యసత్యములు, వాటి కర్తృత్వము ఎవరికిని లేదు అని విశ్వాసము  అంతేకాక అన్ని విధములైన ఆధ్యాత్మిక అనుభవములకు వేదవిజ్ఞానము, శ్రద్ధ మాత్రమే ఆధారములు, మార్గదర్శకములు అని కూడ వారి ప్రగాఢ విశ్వాసము  శ్రద్ధ (faith) యొక్క ప్రాధాన్యమును గురించి అనేక ఉపనిషత్తులలోను, భగవద్గీతలో కూడ చెప్పబడింది

మం॥ యస్యదేవే పరాభక్తిః యధాదేవే తధాగురౌ ।
తస్యైతే కధితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ।
ప్రకాశంతే మహాత్మనః ।

'భగవంతుని యందు, భగవంతుని వలెనే గురువు నందు శ్రద్ధాభక్తులు కలిగిన మహాత్మునికి ఉపనిషత్తులలోని సత్యాలన్నీ ప్రకాశితమౌతాయి 'ప్రకాశంతే మహాత్మనః' అని రెండు పర్యాయములు చెప్పటం యోగ్యతగల, సాధన సంపత్తి గల శిష్యులు, కొడుకులు చాల అరుదుగా ఉంటారని సూచిస్తుంది ' ('శ్వేతాశ్వతర' 6-23)

భక్తి సిద్ధాంతకారులైన రామానుజ, మధ్వఆచార్యులేకాక కొన్ని శృతివాక్యముల వలన కూడ భగవంతుని పరమాత్మ రూపాంతరముగాను లేక పర్యాయమైన నిమ్నరూపమని తలంచుట దైవదూషణమే- అగునని భావింపబడినట్లు తెలియుచున్నది

కాని హైందవ ఆస్తికత్వము ప్రకారము భగవంతుడు అత్యున్నతుడు (supreme person)  ఈ విషయమే భగవద్గీతలో

శ్లో॥ శ్రద్ధావాన్ లభతేజ్ఞానం తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వాపరాం శాంతిం అచిరేణా ధిగచ్ఛతి ॥ (4-39)

శ్రద్ధగలవాడును, తదేక నిష్ఠతో కూడినవాడును, ఇంద్రియములను

నిగ్రహించినవాడును జ్ఞానమును పొందగలడు జ్ఞానమును పొంది అతిత్వరలో పరమశాంతిని పొందును

ఇంకను 40, 41, 42 శ్లోకములలో ఇలా చెప్పబడింది సందేహము జీవితమునకు శత్రువగుచున్నది జ్ఞానహీనుడు, శ్రద్ధలేనివాడు, సందేహము గలవాడు వినాశమునే పొందును సందేహ ప్రాణికి ఇహలోకమున గాని, పరలోకమున గాని, సౌఖ్యముగాని లేవు

"నమ్మకముంచుటలో శిశువువలె నుండిన గాని ఈశ్వరదర్శనము లభించుట దుర్లభము అన్నిటియందు లాభనష్టములను చూచు స్వభావముతో నున్న యెడల ఈశ్వరానుగ్రహము పొందుట అసాధ్యము'' అని శ్రీరామకృష్ణ పరమహంస ఉపదేశించారు

ఇంకను భగవద్గీతలో

శ్లో॥ అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యమేదం ధార్యతే జగత్ ॥ (7-5)

అర్జునా! ఈ ప్రకృతి అపరము (నికృష్టము) అని గ్రహింపుము ఏమన, ఇది జడమును పదార్థమును అయి ఉన్నది దీనికంటే భిన్నమగు నా పరాప్రకృతి (శ్రేష్ఠమగు చేతనరూపము) జీవస్వరూపమున వెలయుచున్నది ఏ ప్రకృతి లోపల ఉండి ఈ జగత్తును ధరించుచున్నదో ఆ ప్రకృతి జడపదార్థమైన ప్రకృతి కంటే భిన్నమైనది అదే శ్రేష్ఠమైన నా ప్రకృతి అది జీవస్వరూపమైనదిగ ఉన్నది

ఇంకను

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ ।
అహంకృత్స్న స్యజగతః ప్రభవః ప్రళయస్తథా ॥ (7-6)

సమస్త ప్రాణులును ఈ రెండు ప్రకృతుల వలననే అనగా జీవప్రకృతి,

జడప్రకృతుల వలననే కలుగును నేనే, అనగా పరమాత్మ సమస్త ప్రపంచము యొక్క ఉత్పత్తి, వినాశములకు కారణభూతుడనై యున్నాను

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।
మయిసర్వమిదం ప్రోతం సూత్రేమణి గణాఇవ ॥ (7-7)

ధనంజయా! నాకంటే శ్రేష్ఠతరమగు జగత్కారణము వేరొకటి లేదు దారమున గుచ్చబడిన మణులవలె ఈ జగత్తంతయును ఆత్మభూతుడనగు నా యందు అనుగతమై, నాచే ధరింపబడియున్నది

శ్రీరామకృష్ణపరమహంస ఇలా అన్నారు

"సచ్చిదానంద బ్రహ్మము ఇట్టిది అని ఎరుగజాలము అందులకే భగవంతుడు అర్థభాగము పురుషుడుగను అర్థభాగము స్త్రీగను అర్థనారీశ్వర రూపము దాల్చెను ప్రకృతియు, పురుషుడును తానేయని చూపుటకై అట్టి రూపమునెత్తెను అదే సచ్చిదానంద స్వరూపుడగు భగవంతుడు ఇంకను కొంత దిగివచ్చి పురుషులుగను, పలువిధములైన ప్రకృతులుగను రూపుదాల్చి యున్నాడు '

అతడే సర్వజగద్వ్యాపియని భావము

ఇంకను

శ్లో॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాహమమృతస్యావ్యయస్యచ ।
శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ ॥ (14-27)

హి = ఏలయన, అహమ్ = నేను, అవ్యయస్య = వికార రహితమును, అమృత్యస్య = వినాశరహితమును, శాశ్వతస్య = నిత్యమును, ధర్మస్య చ = జ్ఞానయోగ-ధర్మప్రాప్యమును, (ఐకాంతికస్య (లేక) ఏకాంతికస్య, తప్పక కలుగునది) ఐకాంతికస్య సుఖస్యచ = అవ్యభిచార (అలవికాని) సుఖ స్వరూపమునునగు, బ్రహ్మణః = బ్రహ్మమునకు, ప్రతిష్ఠా = ఆశ్రయుడను

"ఎవడు ఐకాంతికమగు భక్తితో సర్వభూత హృదయస్థితుడనగు నన్ను (నారాయణుని) సేవించుచున్నాడో అతడు త్రిగుణముల నతిక్రమించి బ్రహ్మభావమును పొంద సమర్థుడగుచున్నాడు (14-26)

(14-27) "ఏలనన నేను బ్రహ్మము యొక్క ప్రతిష్ఠను - ఘనీభూతమగు బ్రహ్మ ప్రతిమను (ఘనీభూతమైన ప్రకాశమే సూర్యమండలమైనట్లు), నిత్యమగు మోక్షమునకును, తత్సాధనమగు సనాతన ధర్మమునకును, తత్ఫలమగు అఖండ సుఖమునకును నేనే ఆశ్రయుడను, కనుక, నా భక్తులు బ్రహ్మభావమును పొందెదరు " ఐకాంతికస్య అనగా తప్పక కలుగునది ఐకాంతికస్య సుఖస్యచ అనగా అలవికాని సుఖము కలుగునని చెప్పబడింది అనగా, నేను (ప్రత్యగాత్మను) అవ్యయమును (శుభము, వ్యయము లేని), అమృతమును, సనాతనమును, అఖండ స్వరూపమును అగు బ్రహ్మము (పరమాత్మ)నకు ఆశ్రయుడును (ఎందు వెలయునో అది ప్రతిష్ఠా) అనగా సమ్యక్-జ్ఞానముచే ప్రత్యగాత్మ (అంతరాత్మ) పరమాత్మగ నిశ్చయింపబడుచున్నది ఇదియే బ్రహ్మత్వ లాభము ఏలనన ఏ బ్రహ్మశక్తి (శక్తి, శక్తిమంతునకు అభేదము) భక్త అనుగ్రహాది ప్రయోజనముల ననుసరించి ప్రవర్తిల్లుచున్నదో, అదియును నేనే " (14-26) మరియు, (14-27) నేను నిర్వికల్ప బ్రహ్మమును అనగా నిరుపాధికము, నిర్గుణమును అమృతమును, అవ్యయమును అగు సవికల్పక అనగా సోపాధికము, సగుణము అగు బ్రహ్మమునకు ఆశ్రయమను, మరియు జ్ఞాననిష్ఠయను సనాతన ధర్మమునకును తత్ఫలమగు అఖండ సఖమునకు ఆశ్రయమగును "

భగవద్గీత యందు 2వ అధ్యాయములో చెప్పబడిన 'స్థితప్రజ్ఞుడు', 6వ అధ్యాయములో చెప్పబడిన 'యోగి' 12వ అధ్యాయమున చెప్పబడిన భక్తుడు, 13వ అధ్యాయమున చెప్పబడిన 'జ్ఞాని', 14వ అధ్యాయమున చెప్పబడిన 'గుణాతీత పురుషుడు' పేరుకు మాత్రమే వేరు, కాని వారు పొందు

ఫలము ఒక్కటియే ఈ స్థితినే మహాభారతము బ్రాహ్మణత్వమని, బౌద్ధగ్రంథములు అర్హతత్వమనియు, తంత్రగ్రంథములు సిద్ధావస్థ అనియు పేర్కొనుచున్నవి

ఈ సందర్భమున శ్రీరామకృష్ణుని ఉపదేశము సముచితము

"ఈ ప్రపంచమే ఒక అడవి సత్త్వ, రజ, తమో గుణములే అందు తిరుగాడు దొంగలు అడవి దారియందు వెళ్లు బాటసారియే జీవుడు ఆత్మజ్ఞానమే అతని వస్తువు (సంపద) తమో, రజో గుణములు ప్రపంచ బంధములనెడి గొలుసుచేత అతనిని బంధించుచున్నవి ప్రపంచ బంధముల నుండి అతనిని సత్త్వగుణము కాపాడుచున్నది సత్త్వగుణమును ఆశ్రయించెడి జీవుడు తమస్సు, రజస్సుల నుండియు, వాటి ఫలితములగు కామక్రోధాది మాయల నుండియు విడుదల పొందుచున్నాడు ప్రపంచ బంధముల నుండి కడచేర్చునది ఆ సత్త్వగుణమే అయినను అదియును ఒక దొంగయే పరమపదమునకు వెళ్లెడి దారి వరకు ఒకనిని పిలుచుకొని వచ్చి 'అదిగో నీ గమ్యము చూడుము' అని మాయమగుచున్నవి సత్త్వగుణమైనను పరమపదమునకు దగ్గరగా వెళ్లుట లేదు "

(శ్లో॥ 14-26)లలో చెప్పినట్లు భక్తి ద్వారా సగుణబ్రహ్మము పొందబడును జ్ఞానము వలన నాశరహితమగు మోక్షపథమైన నిర్గుణ బ్రహ్మము పొందబడును కర్మయోగము ద్వారా భగవత్ కైంకర్యము చేసిన, శాశ్వతమైన ధర్మము లభించుచున్నది తరువాత రాజయోగం ద్వారా అమృతధార నుండి ఉత్పత్తియగు అలవికాని ఆనందము పొందబడుచున్నది కావున యీ నాలుగు యోగములు గుణాతీత స్థితికి కొనిపోవు సాధనములుగా నున్నవి ఈ నాలుగు యోగములను ఒకటిగా ఆచరించవలెను వాటిని అట్లు అనుష్ఠించువాడు గుణములను అధిగమించుచున్నవాడు అగును

సర్వసృష్టి పరమాత్మయందే ఉన్నది అనియు మరియు పరమాత్మ

నిరాకారుడు, నిర్గుణుడు అనుట పరస్పర విరుద్ధముగా కన్పడును ఇది సత్యమే సర్వము పరమాత్మయందే ఉన్నది అని గీత చెప్పుచున్నది కదా! కాని తిరిగి భగవద్గీతయే సృష్టి ఏదియు ఆయన యందు లేదు, అదియే ఆయన నిర్గుణత్వం అని కూడ చెప్పుచున్నది అనగా ఈ సృష్టికి కారణకార్యములు ఆయన ద్వారా మాత్రమే జరుగును ఆయన జగత్తుకు సాక్షి, కర్మమునకు సాక్షి

ఈ సృష్టి పరమాత్మయందు లేదు అనగా ఒక పెట్టెలో (suitcase) పెట్టబడిన బట్టలవలె లేదు అని అర్థము నిర్గుణుడైన (transcendent being) ఆ పరమాత్మ ఈ సృష్టికి మూలము మరియు గమ్యము కూడ ('origin and goal'), ఆయనయే పునాది మరియు ప్రాపు (ఆధారం) ('Foundation and Prop') ఆయనయే ఆది, మరియు అంతము కూడ ('alpha and omega of the world') ఇదే గీతావాక్యముల పరమార్థము

క్రైస్తవ గ్రంథాలలో కూడ దాదాపు ఇదే భావము సూచించు వాక్యములు ఉన్నవి కదా! "క్రీస్తు మనలోనే దర్శితుడు, ఆయనలోనే మనము జీవిస్తున్నాము, చరిస్తున్నాము "

ప్రతి మతంలోను భగవంతుని గూర్చిన పరిభాష, - గీతకాని, బైబిల్ కాని, - దాని అనుగుణమైన సంకేత తర్కముతో, సందర్భానుసారముగా కూడియుండును అది గ్రహించకుండా దానిని విశ్లేషించి, అర్థం చేసుకొనుటకు ప్రయత్నించినచో అది అర్థరహితంగానే కనబడుతుంది

ఈ విషయం భగవద్గీత 9వ అధ్యాయంలో 4 నుండి 12 వరకు శ్లోకములలో వ్యక్తము చేయబడినది (రాజవిద్యారాజగుహ్యాయోగము) ఈ శ్లోకములందు ప్రపంచ పోకడకు పరమాత్మకు గల సంబంధమెట్టిదో భగవానుడే వివరించియున్నాడు

శ్లో॥ మయాతతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥ (9-4)

శ్లో॥ నచ మత్స్థానిభూతాని పశ్యమేయోగమైశ్వరం ।
భూతభృన్నచ భూతస్థోమమాత్మా భూతభావనః ॥ (9-5)

శ్లో॥ యథాకాశస్థితో నిత్యంవాయుః సర్వత్రగోమహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ॥ (9-6)

శ్లో॥ సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాంతి మామికామ్ ।
కల్పక్షయే, పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ (9-7)

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః ।
భూతగ్రామమిమంకృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥ (9-8)

శ్లో॥ నచమాంతాని కర్మాణి నిబధ్నంతిధనంజయ ।
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు ॥ (9-9)

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతేసచరాచరమ్ ।
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥ (9-10)

శ్లో॥ అవజానంతి మాంమూఢా మానుషీంతను మాశ్రితమ్ ।
పరంభావ మజానంతో మమభూత మహేశ్వరమ్ ॥ (9-11)

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణోమోఘజ్ఞానావిచేతసః ।
రాక్షసీమాసురీంచైవ ప్రకృతిం మోహినీంశ్రితాః ॥ (9-12)

శ్లో (4) "అతీంద్రియ స్వరూపుడను, కారణభూతుడను అగు నాచే ఈ విశ్వమంతయు పరివ్యాప్తమై ఉన్నది కనుక, చరాచరములగు భూతములన్నియును, కారణభూతుడనగు నాయందు వెలయుచున్నవి కాని, నేను ఆకాశమువలె అసంగుడనగుటచేత (సంసారబంధములు లేనివాడనగుట చేత) నా యందు, స్వకార్యములగు ఘటాదుల యందు మృత్తిక వలె ఉండుట లేదు సముద్రమునందు అలలన్నియు అణగియుండునట్లు

సమస్తప్రాణులు పరమాత్మయందు నిక్షిప్తమై యున్నవి పాత్రయందు నీటివలె పరమాత్మ ప్రాణులయందు కలియక యున్నాడు ఆకాశము వలె అన్నింటియందు వ్యాపించియున్నాడు "

శ్లో (5) "వాస్తవమునకు భూతములు (ప్రాణులు) నా యందు నిలకడ కలిగియుండునవి కావు నా యొక్క యోగమహిమ వలన భూతగణములను సృష్టించుటయు, కాపాడుటయు చేయునట్టి నా స్వరూపము వాటి యందుండుట లేదు బ్రహ్మము అసంగమగుటచే దేనియందును ఆసక్తి యుంచుటలేదు ఐశ్వరమగు (ఈశ్వర సంబంధమగు) యోగవైభవము అసాధారణము అసంగుడగుటచే భూతములు పరమాత్మయందుండుట లేదు అయినను పరమాత్మ స్వరూపము భూతములను ధరించునదియు, పాలించునదియును అయినను తాను భూతములందుండుట లేదు అనగా జీవుడు శరీరమును ధరించి పాలించును అహంకారమున ఆ శరీరముచే సంశ్లిష్టుడై (ఆవరింపబడిన) అందు వెలయుచున్నాడు కాని పరమాత్మ అహంకారరహితుడగుట వలన వానియందుండుట లేదు జీవాత్మయే పరమాత్మయైనను ఆ జ్ఞానము ఆవరించియున్న శరీరము వలన కలుగు అహంకారమువలన జీవాత్మలో పరమాత్మను చూచుట లేదు ఈ సందర్భముగా అధ్యాయము (7) శ్లోకము (12)లోని భావము గ్రహించుట అవుసరము

'జీవుల యందు సాత్త్వికి, రాజసిక, తామసికములగు అనగా **శమదమాదులు** అనగా (శాంతి, ఇంద్రియ నిగ్రహము), హర్షదర్పములు, శోకమోహములునునగు ఏయే భావములు వారివారి కర్మముల చేత కలుగుచున్నవో, వానిని నా నుండి కలిగిన వానిగానే తెలిసికొనుము అవి నా నుండియే కలిగినను నేను వానికధీనుడనుగాను, అవియే నాయధీనమున నున్నవి "

"త్రిగుణాకారమైన ప్రపంచమంతయు పరమాత్మ నుండి వచ్చినది

పాలు పెరుగుగా మారునట్లు అతడు ప్రపంచముగా మారలేదు త్రాడు పామువలె కనిపించులాగున తన మాయాశక్తి చేత అతడు ప్రపంచముగా కనిపించుచున్నాడు మూలవస్తువైన త్రాడు మోహవస్తువైన పామును అధిష్ఠానము (ప్రధానము)గా చేసికొనలేదు వట్టి రూపమైన పాము మూలవస్తువైన త్రాడుపైన ఆరోపించబడుచున్నది అట్లే త్రిగుణములచే నిండియున్న ప్రపంచము పరమాత్మను అధిష్ఠానముగా చేసికొనియున్నది పరమాత్మ త్రిగుణ వస్తువులను అధిష్ఠానముగా చేసికొనియున్నవాడు కాదు తన యొక్క మాయాశక్తి చేత అతడే జగత్తుగా కన్పించుచున్నాడు "నేను వాటియందు లేను అవి నా యందున్నవి" అనుటకు అర్థమిదియే "

"ఆరోపించబడిన జగత్తును వెనుకకు పంపి అధిష్ఠానముగానున్న పరమాత్మను దర్శించుటయే జీవుని లక్ష్యముగా నుండవలెను దీనికి అనుసంధానముగా (2)వ అధ్యాయము 42 నుండి 45 వరకు శ్లోకముల భావమును గూడ గ్రహింపవలయును "బుద్ధి చంచలత కల ప్రాపంచికుల స్వభావము ఎట్లుండుననగా వారు వేదభాషయందు ఆసక్తి కలిగి, అందు చెప్పబడిన స్వర్గాదిభోగముల కంటె మించినది లేదని వాదించువారును, విషయ వాంఛలతో నిండిన చిత్తము కలవారును,' స్వర్గాభిలాషులు అయి ఉన్నారు అట్టి భోగ, అయిశ్వర్య వ్యామోహితులకు స్థిరచిత్తము కలుగదు కోరికలతో ఆశాపాశములందు బంధింపబడియున్న వారు మానవులలో అధములు ఇహపరములయందు ఇంద్రియభోగముల ననుభవించుటయే వారి ధ్యేయముగా నుండును వారి జ్ఞానము, విద్య, మాటకారితనము, శక్తి సామర్థ్యములన్నియు క్షణికములగు భోగముల ననుభవించటకే ఉపయోగింతురు ఇట్టి భోగుల యొక్క వాంఛలను నెరవేర్చుటకే వేదములయందు కర్మకాండము కలదు పలువిధములైన భోగములను వాంఛించి ఈ సంసార బంధమనెడి మహాసాగరమున మునిగి యుండు వానికి మాత్రమే అది ఉపయోగపడును వేదములు కడు పురాతనమైనవే అనినను

అవి బోధించు కర్మకాండలు అన్నియు మంచివేయని తలచి ఏమరరాదు భోగములను పొందుటయే జీవితలక్ష్యము కాజాలదు పరిపూర్ణానందము పొందుటయే ఆఖరి లక్ష్యము దానికై జ్ఞానము నందు యోగము నందు నిశ్చయము కలిగిన చిత్తము కావలయును వేదములు బోధించెడి కర్మకాండ, అనుష్ఠానము వలన ఎన్నటికి స్థిరచిత్తము కలుగదు "

"జనులు కష్టసాధ్యములగు కామ్యకర్మములను పరిత్యజించి, పరమాత్మ యందు నిశ్చయాత్మకమగు బుద్ధిని నిలిపి, నిష్కామ కర్మానుష్ఠానము ఒనర్చుట లేదు ఎందుకనగా అవివేకులగువారు వేదోక్త కర్మముల ప్రశంసించుట యందు అనురక్తులై ఉన్నారు స్వర్గాది ఫలజనకము అగు కర్మముగాక వేరేమియు లేదని వారి తలంపు వారు వాంఛాయుక్తులు, స్వర్గకాములు జన్మమను ఫలమును ఒసగునవియును, భోగైశ్వర్య లాభోపయోగకరములును అగు బహుక్రియాకలాపములను వారు ప్రశంసించుచుందురు "

"స్వర్గాదులు పరమపురుషార్థము కాని యెడల వేదములు కర్మమును సాధనముగ ఉపాదింపనేల అని సందేహం వస్తుంది వేదము కర్మకాండాత్మకము మరియు త్రిగుణాత్మకము కర్మకాండాత్మకమగు వేదము సకామవిషయకము జీవుడు నిష్కాముడై కర్మముల నాచరింపవలయును ద్వంద్వరహితుడు సత్త్వగుణాశ్రితుడు కావాలి యోగ, క్షేమములు పరిత్యజించి ఆత్మజ్ఞుడు కావాలి తత్వజ్ఞానార్థికి కర్మమందే అధికారముండును కర్మఫలమందు ఆసక్తి కలుగకూడదు కర్మఫలతృష్ణయే కర్మఫలములను కలిగించును అందుచే కర్మఫలప్రాప్తికి కారణము కాకూడదు అనగా కర్మములను సకాముడై ఆచరించకూడదు నిష్కామకర్మము ఉత్తమము కామ్యకర్మము అత్యంత అధమం నిష్కామకర్మ యోగి ఇహజీవితముననే పుణ్యపాపములు రెండింటి నుండి విముక్తుడగును నిష్కామకర్మ కౌశలమే యోగము "

శ్లో (9-6) "సంశ్లేషము (కౌగలించుట) లేని రెండు వస్తువుల ఆధార

ఆధేయ భావము చెప్పబడినది ప్రాపు కలిగించేది ఆధారము దానిని పొందేది ఆధేయము వాయువు ఆకాశమున నిత్యసంచారి ఆకాశము లేనిచో వాయువు ఉండజాలదు కాని ఆకాశమునకు అవయవములు లేవు అందువలన సంశ్లేషము లేదు అదే విధముగ సర్వభూతములు పరమాత్మ యందు వెలయుచున్నవి వాయువు మొదలగు నాలుగు భూతములు (elements) ఆకామునందున్నను, అవి దానియందు కలసిపోవుట లేదు ఎట్టి మార్పును కలిగించుట లేదు అట్లే బ్రహ్మము యొక్క మాయాకార్యములన్నియు బ్రహ్మమునందు నిలిచియున్నను, బ్రహ్మమునకు ఎట్టి మార్పును కలిగించుటలేదు ఆకాశతత్త్వమును తెలిసికొనుట వలన బ్రహ్మతత్త్వము చక్కగా బోధపడుచున్నవి గాలి సువాసన, దుర్వాసనలను గూడ మోసికొని వచ్చును కాని దానిచే మార్పునొందదు పరమాత్మయు గాలివంటిదే'' అని అన్నారు శ్రీరామకృష్ణ పరమహంస

శ్లో (9-7) ఇచట సృష్టి, ప్రళయ హేతువులు చెప్పబడుచున్నవి ప్రళయకాలమున సర్వభూతములును త్రిగుణాత్మకమగు పరమాత్మ మాయయందు లీనమగుచున్నవి మరల కల్పారంభమున పరమాత్మ ద్వారా అవి సృష్టించబడుచున్నవి ''

శ్లో (9-8) ''పరమాత్మ అసంగుడు, నిరాకారుడు అతడు సృజించుట ఎట్లు? స్వీయమును, స్వాధీనమును, అవిద్యా రూపమునునగు మాయను అధిష్టించి పూర్వ సంస్కారవశమున జన్మమృత్యువులకు అధీనమగు చతుర్విధ భూతములను మరల మరల పరమాత్మ సృష్టించుచున్నాడు ''

శ్లో (9-9) ''నానా విధ కర్మములకు కర్తయైన పరమాత్మకు జీవుని వలె బంధములు ఏల కలుగకున్నవి? అందుకు కారణము ఆ కర్మములందు ఆయనకు ఆసక్తి లేకపోవుటయే తటస్థుడై వెలయుచున్న ఆయనను అవి బంధింపజాలవు తానే కర్తయనెడి అహంకారము లేని ఈశ్వరుని వలె,

సాధకుడు తాను చేయు అనేక కర్మములకు తానే కర్తయను భావమును విస్మరించినచో ఆ కర్మములు అతనిని బంధించజాలవు" 'నేను' అనునది తొలగినచో దుఃఖమంతయు తొలగును ఈశ్వరకృపచే 'నాచే చేయబడునది ఏదియు లేదు' అను సిద్ధాంతము మనస్సునందు నిలిచినచో మానవునికి ఈ జన్మమునందే ముక్తి లభించును" అని శ్రీ రామకృష్ణ పరమహంస చెప్పారు

శ్లో (9-10) "స్థావర జంగమముల (చరాచరముల)తో నున్న ఈ సృష్టికి పరమాత్మ అధ్యక్షుడు (అధిష్ఠాత) అధిష్ఠాత కర్త మాత్రమే కార్యకారణములు రెండును ఆయనె కాని ఆయన నిమిత్తమాత్రుడు త్రిగుణాత్మికమగు మాయస్థావర జంగమాత్మకమగు ఈ విశ్వమును సృష్టించుచున్నది ఈ కారణముననే వ్యక్తమును, అవ్యక్తమును అగు జగత్తు వివిధ రూపముల పరివర్తనము నందుచున్నది పరమాత్మ అధిష్ఠాతృత్వము సాన్నిధ్యము మాత్రమే అగుటచేత కర్తృత్వ ఉదాసీనత్వములు పరస్పర విరుద్ధములు కావు

ఇదే శ్వేతాశ్వతర ఉపనిషత్తులో 6-(9, 10, 11)లలో చెప్పబడింది

"పరమాత్మకు నియంత లేక యజమాని అంటూ ఎవరు లేరు అతనిపై ఎవరికీ అధికారం లేదు అతడు ఫలానా విధంగా ఉంటాడని గుర్తించటానికి ధూమాదిరూపమైన అనగా పొగ వంటి చిహ్నమంటూ ఏదీ లేదు అతడే అన్నిటికి కారణమైనవాడు జీవాత్మలన్నిటికీ పాలకుడైనవాడు అతడే అతనికి తండ్రి లేదు అతనికి ప్రభువూ లేదు"

"సాలెపురుగు తన నుండి తాను తీసుకున్న దారములతోనే తనను తానే (స్వాభావికముగా) ఆవరించుకున్నట్లుగా (కప్పుకొన్నట్లుగా) అద్వితీయుడైన ఆ పరమాత్మ ప్రకృతిజన్యాలైన కార్యాల ద్వారా స్వాభావికంగా తనను తానే ఆచ్ఛాదించుకుంటాడు అటువంటి పరమాత్మ మాకు తనతో ఏకత్వము ప్రసాదించుగాక"

"సమస్త ప్రాణులందు సర్వత్ర వ్యాపకుడై అన్ని భూతాలలో అన్ని కర్మలను పర్యవేక్షిస్తాడు ప్రాణులలో అంతర్యామిగా దాగిఉంటున్న పరమాత్మయే సమస్త కర్మలకు అధిపతి అన్ని జీవాలలోను ఆయన దాగి ఉన్నాడు అంతేగాదు - అన్ని జీవాలు ఆయనలోనే ఉంటున్నాయి అన్నిటికి సాక్షియైనవాడు, ఉపాధిశూన్యుడు, సత్త్వరజస్తమోగుణరహితుడు అయిన శుద్ధ చైతన్యం ఆయనయే"

పైన చెప్పబడిన భగవద్గీతలోని (9-7) నుండి (9-10) శ్లోకములందు ప్రపంచ పోకడకు తనకు గల సంబంధము యెట్టిది యని భగవానుడు వివరించియున్నాడు

"దీనికి అరుంధతీ న్యాయము ఉపయోగపడుచున్నది కనుపించు వస్తువు నుండి కనుపించని సూక్ష్మమైన వస్తువును ఊహించటమే అరుంధతీ న్యాయమనబడును ఒక వృక్షము, దానియందున్న ఒక కొమ్మ, దాని వెనుక ఆకాశమందున్న ఒక పెద్ద చేప, దానికి చేరవలోనున్న చిన్నచేపలు వాటి మధ్య మిక్కిలి చిన్నదిగా కనుపించునది అరుంధతీ నక్షత్రం కనబడు వృక్షమునుండి అతిసూక్ష్మమైన అరుంధతీ నక్షత్రమును చూచుటయే ఈ న్యాయము

7వ శ్లోకమందు "నేను సృష్టించుచున్నాను' అనుచున్నాడు 8వ శ్లోకమందు "ప్రకృతి ద్వారా ఆ కార్యమును చేయుదునని" చెప్పుచున్నాడు 9వ శ్లోకమున "తనను ప్రకృతి యొక్క సృష్టి కార్యములు బాధించుట లేదు" అనుచున్నాడు 10వ శ్లోకమున తాను సాక్షీభూతముగా కూర్చుని కనిపెట్టుచుండగా తన సాన్నిధ్య విశేషము చేత ప్రకృతికి జగత్కార్యములను చేయునట్టి శక్తి ఏర్పడియున్నదనుచున్నాడు సూర్యుని సాన్నిధ్యమున, సూర్యకిరణములచే వస్తువులు పరిణమించుటవలె, ఈశ్వర సాన్నిధ్యమున అతని యొక్క మాయాశక్తిచే ప్రపంచమంతయు సృష్టించబడుచున్నది" అన్నాడు

"అధ్యక్షుడు అనగా సభాపతి లేక సాక్షీభూతుడు అని గదా అర్థము

ప్రపంచ పోకడకు భగవంతుడు సాక్షీభూతమై యున్నాడు రాజు సింహాసనము నందు కూర్చుని యుండగా, సిబ్బందులు చేయుచున్న తమతమ కార్యములను గమనించు రీతిగా, పరమాత్మని సాన్నిధ్యమందు ప్రకృతి అండముల నన్నిటిని ప్రవర్తింప చేయగలుగునట్టి శక్తిని, సామర్ధ్యమును పొంది తన వృత్తిని చేయుచున్నది అట్టి పరమాత్మ సాన్నిధ్యము చేతనే ప్రకృతి చరాచర ప్రాణికోట్లను సృజింపగలుగుచున్నది "

(9-11,12) శ్లోకములలో బుద్ధిహీనుల స్వభావము చెప్పబడింది

శ్లో (9-11) "పరమాత్మ నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త-స్వభావుడు సర్వాత్మ స్వరూపుడు, సర్వేశ్వరుడు - భక్త అనుగ్రహార్థము పరమాత్మ శుద్ధ సత్త్వమయమగు మనుష్యదేశమును ధరించుచున్నాడు ఆయన పరమస్వరూపమును ఎరుగని, శిశుపాల దుర్యోధనాది మూఢులు ఆయన యెడల అవివేకము చూపియున్నారు

శ్లో (9-12) "అన్యదేవతలు శీఘ్రముగ ఫలముల నొసగుదురని తలచు వ్యర్థకాములు, విఫలకర్ములు, నిష్ఫలజ్ఞానులు, వివేకశూన్యులు, తామసమును, రాజసమును, బుద్ధి భ్రంశకరమును అగు స్వభావము నాశ్రయించి అవతారమూర్తి అయిన భగవానుని అవమానించి యున్నారు "

"కర్మము నందు బందీ కానివాడు రూపమునందును బంధితుడు కాజాలడు జడాకాశమును ఏ వస్తువు చేతనైనను నాశనము చేయజాలము మరిదానికి అవతలనున్న చిదాకాశము ఎట్లు నాశనమగును? అది నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్తస్వభావము కలది అందరికిని కావలసిన ఉమ్మడి సొత్తుగా నుండి అంతర్యామిగానున్న పరమాత్మ, మానవ శరీరమున ఎట్లు జీవించవలెనని చూపించుట కొరకై ఉదాహరణ పురుషుడుగా, అవతార పురుషుడుగా దేహము దాల్చియున్నాడు కాని వారు కర్మవశమునకు అతీతులై పరమశాంతియందు నిలకడ కలిగియున్నారు "

"అశాశ్వతమైన శరీరమును శాశ్వతమని యెంచి దాని ద్వారా 'భోగము ననుభించుటయే లక్ష్యము' అను మైకము 'మోహము' అగుచున్నది అందుకై పొందెడి ఆశలు, చేసెడి కర్మములు, నేర్చెడి జ్ఞానము, ఉపయోగించెడి యుక్తులు అన్నియు ఆత్మ లాభమునకు ఉపకరింపక వ్యర్థమగుచున్నవి అట్టి అధమ స్వభావము గలవారి యందు రజోగుణముతో గూడిన వారు రాక్షసులు, తమోగుణముతో కూడినవారు అసురులు అగుచున్నారు "

హేతువాద పూర్వాపరములు, వేదాంత తత్వవిచారమునందు దాని స్థానము ప్రస్తుత విచార విషయము గదా! వేదాంత తత్వ విచారము నంమ అనగా ఆత్మజ్ఞాన విచారము నందు హేతువు ప్రసక్తి ఉన్నదా? అనునది ప్రశ్న 'ఉన్నది' అని నిస్సందేహంగా సమాధానం ఉన్నది కాని ఎంతవరకు అనేది సందేహము

వేదాంత తత్వజ్ఞాన సాధనలో హేతువు ప్రసక్తి పరమాత్మ సమీపం వరకు తీసుకు వెళ్లగలదు కాని పరమాత్మ దివ్యచైతన్య అనుభూతి కలిగించలేదు అచట హేతువు అదృశ్యమవుతుంది అని పాశ్చాత్య తాత్వికుల అభిప్రాయం అత్యంత ఉన్నతమైన అంతర్దృష్టి ద్వారా మాత్రమే నిర్గుణ బ్రహ్మతత్వ అనుభూతి పొందవచ్చునని వారి విశ్వాసం అనగా హేతువిచారం నుండి అంతర్దృష్టిలోనికి ఒక రకమైన 'గంతు' 'Jump' అవుసరం అని వారు అంటున్నారు అంతే కాదు, పాశ్చాత్య తత్వవివేచనంలో హేతువు చాల ఉన్నతమైనదని, అది సూటిగా పరమాత్మ దర్శనానుభూతినే కలుగజేస్తుంది అంటారు అచట హేతువిజ్ఞానమార్గము పరమాత్మను చేరునంత వరకు నిరంతరం నిరాఘాటంగా సాగుతూనే ఉంటుందని వారి విశ్వాసము

కాని నిరంతరం సాగుతూనే ఉంటుందనగా వారి అభిప్రాయం స్పష్టంగా బోధపడటం లేదు అయినా ఇచట పాశ్చాత్య తత్వవివేచనము చర్చావిషయము కాదు

వేదాంత విజ్ఞానంలో హేతువు ప్రాధాన్యం ఎంతవరకు? దాని స్థానం ఏమిటి? అది ప్రస్తుత విషయము

అంతర్బుద్ధి (intuition) వేదాంత పరిజ్ఞానంలో చాల ప్రాధాన్యం సంతరించుకుందని ఇంతకు ముందే తెలుసుకున్నాము గదా! ఇక హేతువు స్థానమేమిటి, హేతువు అంతర్బుద్ధి - వీటిలో ఏది ఎక్కువ ప్రధానం? దీనికి సమాధానం స్పష్టంగా దొరకదు ఉపనిషత్తులలో కూడ దీనికి సమాధానం ఉన్నట్లు స్పష్టంగా గోచరించటం లేదు అంతేకాదు హేతువుతో అంతర్బుద్ధి సంబంధం లేదని కూడ ఏ సందర్భంలోను చెప్పబడినట్లు కనబడదు

వాస్తవానికి ఉపనిషత్తులలో చాల సందర్భములలో ప్రజ్ఞ, మేధ పరస్పర పర్యాయపదాలుగా ఉపయోగించబడినాయి ఛాందోగ్య ఉపనిషత్తులో (7వ అధ్యాయం) మనస్సు, సంకల్పం, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము మరియు అన్నము క్రమంగా ఒకదానికంటే దాని తరువాతది శక్తివంతమైనదనియు, చివరకు అన్నము సర్వోన్నతమైనదనియు చెప్పబడినది కాని అదే అధ్యాయం 26వ ఖండంలో ప్రాణం సర్వోన్నతమైనదనియు అది ఆత్మ నుండి ఉద్భవిస్తుందని చెప్పబడింది ఆత్మ నుండే ప్రాణం, ఆత్మ నుండే ఆశ, ఆత్మ నుండే స్మృతి, ఆత్మ నుండే ఆకాశం, ఆత్మ నుండే జలం, ఆత్మ నుండే జనన మరణాలు, ఆత్మ నుండే అన్నం, ఆత్మ నుండే బలం, ధ్యానం, మనస్సు, వాక్కు, నామం, మంత్రం, కర్మ మొదలైన సమస్తము ఉద్భవిస్తాయి అని తెలుస్తుంది అని కూడా చెప్పబడింది అన్నీ ఆత్మ నుండి పుట్టటాన్ని తత్వజ్ఞాని తెలుసుకుంటాడు అతడు అన్నిటిని, అందరిని ఆత్మభావంతో చూస్తాడు అందుచేత అతడు అన్నిటిని, అందరిని పొంది ఉంటాడు అతడే బహురూపాలుగా విస్తరించగలడు అనగా ఆత్మయే అలా విస్తరిస్తుందని భావం శబ్దం మొదలైనవి శ్రోత్రం (చెవి) మొదలైన ఇంద్రియాలకు విషయాలు గదా! అంటే చెవికి ఆహారం వంటిది ఇలా శబ్దం చెవికి, రసం నాలుకకు,

రూపం కళ్లకు ఆహారాలు  శబ్దం మొదలైన విషయాల రూపంలో ఉండే ఆహారం శుద్ధి అయితే మనసు శుద్ధి అవుతుంది  అంటే వినేవి, చూచేవి అయిన విషయాలు స్వచ్ఛమైనవి అయితే మనస్సు స్వచ్ఛం అవుతుంది  మనసు పరిశుద్ధమైతే నిశ్చలమైన స్మృతి కలుగుతుంది  ఆ స్మృతి పరిశుద్ధమైతే సమస్త హృదయగ్రంథులు విడిపోతాయి  అంటే అజ్ఞానం వలన కలిగిన సమస్త బంధాలు తొలగిపోతాయి  అపుడతడు ఆత్మతత్వవేత్త అవుతాడు  అలా వేదాంత విజ్ఞానంలో హేతువు ఒక స్థాయి వరకే ప్రాధాన్యం కలిగియుండును



# II. వేదాంతం - కర్మసిద్ధాంతము

## (1) కర్మసిద్ధాంతము  నిత్యజీవితము

మనసు పరిశుద్ధమైతే నిశ్చలమైన స్మృతి కలుగుతుందని, ఆ స్మృతి పరిశుద్ధమైతే సమస్త హృదయగ్రంధులు విడిపోతాయని, అపుడు అజ్ఞాన బంధాలు తొలగిపోతాయని, ఆ స్థితి పొందిన మానవుడు ఆత్మతత్వవేత్త అవుతాడని చెప్పబడింది గదా! మరి ఈ ఆత్మతత్వజ్ఞాన వికాస ప్రభావములో కర్మసిద్ధాంత స్థానం ఏమిటి? నిత్యజీవిత కార్యక్రమంలో కర్మసిద్ధాంత ప్రమేయం ఎంత వరకు? కర్మయోగం అంటే ఏమిటి? రాజయోగ ప్రాధాన్యం ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం తెలుసుకొనవలసిన అవసరము ఎంతైనా ఉన్నది 'నిత్యజీవితంలో కర్మసిద్ధాంతము' అనునదే ఇచట చర్చనీయాంశము 'కర్మ' ఫలం - పునర్జన్మ విషయం సంబంధిత అధ్యాయంలో చర్చింపబడును

'కృ' అను ధాతువు నుండి పుట్టినదే కర్మము అను పదము సమస్తములైన పనులు కర్మములే వ్యావహారికంగా సంకేతార్ధంలో కర్మము అను పదమును కర్మఫలము అను భావంతో ఉపయోగిస్తుంటారు వేదాంత తత్వశాస్త్రమును అనుసరించి కర్మము అనగా పూర్వకర్మముల ఫలితము అని భావార్ధము కాని కర్మయోగ వివేచన యందు కర్మము అనగా 'పని' లేక 'క్రియ' అనియే గ్రహింపవలయును

మానవ జీవిత పరమావధి సుఖము కాదు, జ్ఞానము సుఖమే పరమావధి యనుకొనుట భ్రాంతి మాత్రమే యగును మానవ జీవితములో సుఖదుఃఖములు రెండును గుణపాఠములు తెలుపును ఈ సుఖదుఃఖములు రెండును మానవుని మనస్సుపై భిన్నములైన సంస్కారములను ముద్రించును ఈ సంస్కారములన్నిటి ఫలితమే మానవుని 'శీలము' అనబడుచున్నదని స్వామి వివేకానంద అన్నారు చిత్తవృత్తుల సాముదాయక ఫలితమే శీలము

శీలము మనోభావముల ప్రతిబింబము అందువలన సుఖదుఃఖములు రెండును శీలము రూపొందుటలో తోడగును శీలమే కర్మఫలములకు మూలమగును కర్మఫలమునే మనము విధి (Character is fate) అని కూడ అంటాము ప్రారబ్ధ కర్మానుసారము బుద్ధి ప్రభావితం ఔతుంది అని కూడ అన్నారు బుద్ధిననుసరించే గదా మనోభావాలు రూపొందేది ఆ మనోభావముల ప్రతీకయే శీలము గదా! ఆ శీలము కర్మఫలములకు మూలము గదా! కర్మఫల ప్రభావితమే జీవిత గమ్యము గదా! (character is destiny) కావున బుద్ధి, చిత్తవృత్తులు (మనోభావములు), సుఖదుఃఖములు, శీలము, కర్మఫలము - ఇవి అన్నియు ఒక వలయము నందు చలించుచు పరస్పర ప్రభావమునకు లోనగుచున్న అణువుల వలె తోచును ఆ వలయమే జనన మరణములతో కూడిన మానవ జీవితమును ప్రతీక

కావున మన జీవితములో మనము చేయు క్రియలు అనగా పనులు గోచరమగు ప్రధానాంశముగా తెలియుచున్నది గదా! అవియే మన కర్మములు

కర్మములు గోచరములే కాని కర్మఫలములు వెంటనే గోచరములు కావు ఆ ఫలితము ఇపుడు రావచ్చు లేక ఎప్పుడైనా రావచ్చు ప్రతి కర్మమునకు (పని) కారణము, ఫలితము (cause and effect) ఉంటాయి కాని ఈ ఫలితము విషయములోనే కొంత భ్రమకు అవకాశము ఉన్నది ఒక మనిషి ఎవరో మరొక మనిషిని హత్యచేశాడు అని అనుకుందాము ఆ మనిషి చనిపోతాడు గదా! అదే హత్య అను పనికి ఫలితము గదా! అని భావిస్తే అది పొరపాటు ఆ మనిషి మరణము హత్య అను పనిలోనే ఇమిడి ఉన్నది ఆ మరణమే హత్య అను కర్మ ఫలితము అనుకుంటే ఆ ఫలితము దక్కినది ఆ కర్మ చేసిన వానికి అనగా హంతకునికి కాదు గదా! హతుడు ఆ ఫలితమును పొందాడు దానికి కారణము హంతకుడు ఆ కారణమునకు ఫలితము (effect) హంతకుడు పొందాలి గదా! అది ఎపుడు పొందుతాడు? అది

గ్రహించుట సాధ్యము కాదు ఆ ఫలితము శారీరకం కావచ్చు, మానసికం కావచ్చు, సామాజికం కావచ్చు ఆ హంతకుడు పట్టుబడితే ఉరి తీయబడతాడు గదా! అద్ధి పలితమే గదా! ఔను, ఫలితమే కాని పట్టుబడకుండా తప్పించుకు తిరుగువాని విషయంలో కాని, ఆ హత్య చేయించి అప్రత్యక్షంగా కారణమైన వాని విషయంలో కాని అది భిన్నంగా ఉంటుంది అది ఎపుడు ఎలా ఉంటుంది చెప్పటం అంత సులభము కాదు ఈ కర్మము, దాని ఫలితము అనునవి క్రియ - ప్రతిక్రియ వంటివి (action and reaction)

ఈ క్రియలకు కలుగు ఫలితములు లేక ప్రతిక్రియలు ఈ జన్మలో చేసినవి ఈ జన్మలోనే పొందవచ్చు అనుటలో అర్థము ఉన్నది కాని ఎపుడో మరొక'జన్మలో దాని ఫలితం ఉంటుంది అని లేక గత జన్మల కర్మ ఫలితమునే ఇపుడు పొందుతున్నాము అనుట ఏ మాత్రము విశ్వసించతగినది కాదు అని విజ్ఞానశాస్త్రకారులు (scientists), హేతువాదులు అంటారు కావున కర్మ సిద్ధాంతమును విశ్వసించుటకు మానవ శరీరము, స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు అను అగోచరములగు పొరలలో ఇమిడియున్నది అను విషయమును ముందు గ్రహించవలసి యుంటుంది వీటినే కోశములని అంటారు మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు మనస్సును మూడు భాగములుగా విభజించి క్రింది రెండవ మూడవ భాగములలో కొన్ని స్మృతులు నిలువయుండి అపుడపుడు బహిర్గమవుతూ ఉంటాయి అంటున్నారు ఆ స్మృతులు మరొక జననము వరకు సూక్ష్మ, కారణ శరీరములను అనుసరిస్తాయి అని వేదాంత శాస్త్రము అంటుంది జననము తరువాత ఆ స్మృతుల ఫలితములను నూతన శరీరము పొందుట ప్రారంభమవుతుంది ఆ స్మృతులు లేక సంస్కారములు కర్మఫలితాలు విజ్ఞానశాస్త్రము కూడ ఈ సంస్కారములను యధాతథంగా అనుమతించకపోయినను గత స్మృతుల విషయమై ఏదో ఒక రూపంలో మొగ్గు (inclination) చూపుతూనే ఉన్నది ఈ కర్మ ఫలితములు అను విషయము విజ్ఞానశాస్త్ర రీత్యా కూడా ఎంతవరకు అనుమతించతగినదో చర్చించవలసిన

అగత్యం ఉన్నది

గతములో మనము చేసిన పనుల ఫలితమే నేటి మన జీవితానుభవము ఈ ఫలితములు కొన్ని భవిష్య జీవితములోనికి గూడ ప్రాకవచ్చు ఇది తప్పదు అప్పులు చేసినపుడు తీర్చక తప్పుతుందా! సంపద కల్గినపుడు అనుభవించేది కూడ మనమే గదా! పూర్వకర్మమును బట్టి ఇపుడు మన బుద్ధి పనిచేయును గదా! ఇపుడు యింక ఏమియు చేయలేము, అనటం వ్యర్థ వేదాంతం గత కర్మం మనదే ఇపుడు ఫలితాలు మనవే అనగా సంకల్పము మనదే ఆ సంకల్పం ఎపుడూ ఉంటుంది దానిని సద్వినియోగం చేసుకుని గతంలో జరిగిన తప్పులను ఇపుడు సరిదిద్దుకోవచ్చు గదా! కాలులో ముల్లు విరిగితే ఏదో రకంగా ముల్లును తీసే ప్రయత్నం చేస్తాము కాని కాలునే తీసివేయము గదా! జీవితం కూడ అంతే

ఈ సందర్భంలోనే జ్యోతిషాచార్యుడు వరాహమిహిరుడు జీవితసత్యాన్ని నిర్వచించాడు

"చీకటి గదిలో దీపము వెలిగించినచో, అక్కడ ఉన్న వస్తువులను తన్నుకొనుచు పడుచు, లేచుచుండు ఔసరముండదు - చిందరవందరగానున్న వస్తువులను యధాస్థానమున చక్కగా సర్దుకొనుటకు దీపము ఉపయోగపడును అటులే జీవితములో కార్యాచరణములను సద్వినియోగము చేసికొనవలయును" ఆ దీపమే ఆత్మజ్ఞానము

మనం తినే ఆహారమును బట్టి మన శరీరంలో జీర్ణక్రియ జరుగుతూ ఉంటుంది అటులే మన కష్టసుఖాలకు పూర్తిగా బాధ్యత మనదే ప్రకృతికి అందరు సమానమే ప్రకృతి శక్తులను మనము ఉపయోగించుకొను మార్గము మీదనే లాభనష్టములు ఆధారపడి ఉండును నీరు మన దాహం తీరుస్తుంది అదే నీటిని కలుషితం చేస్తే మన ప్రాణం తీస్తుంది అటులే మన కర్మ ఫలితములను గ్రహించి వర్తమాన, భవిష్య జీవితమును సరిదిద్దుకొని సవ్య

మార్గములో నడిపించుకొనవచ్చును సముద్రముపై తెరచాప వాలుని బట్టి మాత్రమే పడవ నడుస్తుంది గాని గాలివాటమును బట్టి కాదు అంతా దైవ విధియే, మానవ కర్తవ్యము లేదనుట సత్యము కాదు దారిన నడచునపుడు దైవం మీద భారం వేసి కన్నులు మూసుకొని నడవము కదా! మానవుడు తన వంతు కర్తవ్యము సన్మార్గములో నిర్వర్తించి సత్ఫలితముల కొరకు దైవముపై ఆధారపడవచ్చును

గతంలో చేసిన కర్మల వలన కలుగుచున్న దుష్ఫలితముల నుండి యిపుడు రక్షణ పొందగలమా? పొందగలము కాని అది సమాధానం చెప్పినంత సులభం కాదు ఏ దురభ్యాసమునకైన మూలం వ్యామోహం మనసు వ్యామోహంలో పడినపుడు దుష్కార్యములు జరుగుతై, ఆ పైన దుష్ఫలితాలు కలుగుతాయి దుష్కార్య ఫలితం అప్పటికే కాక తరువాత చాలకాలం వరకు బాధించును తనకేకాక తన సంతానమునకు కూడ వ్యాపించును తను చేసిన దుష్కర్మ ఫలితం అమాయకులైన తన సంతానం అనుభవించవలసి వస్తోంది ఉదాహరణకు, త్రాగుడు లేక వ్యభిచారం దురలవాట్లే గదా! వాటి దుష్ఫలితాలు ఎంత వరకు వ్యాపించేది అందరికి తెలిసిన విషయమే ఈ దురభ్యాసముల నుండి బయటపడినపుడు ఆ తరువాత వాటి దుష్ఫలితాలు ఉండవు గదా!

అటులనే గత దుష్కర్మ ఫలితాల నుండి యిపుడు రక్షణ పొందాలంటే మనస్సును వ్యామోహంలో పడకుండ కాపాడుకోవాలి గత దుష్కర్మ మన మనస్సును వ్యామోహపరచి తిరిగి దుష్కర్మ చేయిస్తుంది అంతేకాని వ్యామోహమునకు లోబడని మనస్సును పూర్వకర్మ ఏమియును చేయలేదు అనగా మనోబలముచే పూర్వకర్మ దుష్ఫలితముల నుండి తప్పించుకొనవచ్చును దానికి ఆత్మబలం, నిగ్రహశక్తి కావాలి ఇవి ఎంతో అభ్యాసము వలన గాని సాధ్యపడవు అది సాధించిననాడు గత కర్మ ఫలితాలు యిపుడు బాధించవు

ఈ సాధనకు మార్గములు అనేకం ఆత్మజ్ఞానం, నిర్మలభక్తి, నిస్వార్థ మానవసేవ, నిగ్రహసాధన మొదలైనవి

'కర్మ' అనగా విధి, అనగా బాధ్యతననుసరించి చేయుపని బాధ్యతగా నిర్వర్తించే పనియందు స్వీయలాభమునకు ప్రాధాన్యమొసగినచో బాధ్యతా నిర్వహణ నిష్ఫలం అవుతుంది అనగా నిస్వార్థంగా స్వీయ ఫలాపేక్ష లేకుండ చేయు పని సత్ఫలాన్ని యివ్వటమే కాకుండ అత్యంత ఉన్నతమైన ఆనందదాయకము కూడ అవుతుంది జీవించి యున్నంత కాలము ఏ జీవియును కర్మము అనగా క్రియ చేయకుండ ఉండదు, ఉండలేదు క్రియ (కర్మము) జీవితమునకు మూలాధారము యోగసాధన ద్వారా ఇంద్రియ నిగ్రహము పొందగలిగినపుడు ఫలాపేక్షారహితమైన కర్మ (క్రియ) ప్రవాహము సాగుతూనే ఉంటుంది

కర్మము ద్వారానే జ్ఞానము, విముక్తి పొందవచ్చునని 'గీత' చెప్పింది గదా! కర్మఫలితము ప్రతిక్రియారూపము (reaction) కర్మము (క్రియ)నకు తప్పక ఫలితము ఉండును కర్మఫలితము ప్రతిధ్వని (resound), పరావర్తనము (reflection) వంటిది కర్మము యొక్క ప్రతిబింబమే కర్మఫలము కాని కర్మము చేయుటయే కర్మఫలము కొరకు గదా, ఫలితము లేకుండ పనులు చేయుట ఎందుకు? అను ప్రశ్న ఉదయిస్తుంది ఫలాసక్తి లేకుండ పనులు చేయుట యందు అర్థముండునా? ఇది సర్వసాధారణమైన ప్రశ్న ఏ పనియైనను తన కొరకు గాని, పరుల కొరకు గాని సదుద్దేశముతో బాధ్యతాయుతముగా నిర్వర్తించినచో సత్ఫలము తప్పక ఉంటుంది ఫలమును ఉద్దేశముగా మాత్రము గ్రహించి అటుపై ఫలము మాత్రమే దృష్టియందు ఉంచుకొనక కర్మమును (పనిని) బాధ్యతగా నిర్వర్తించవలయును కర్మము చేయుట యందే మానవునికి హక్కు ఉన్నది, ఫలమును పొందుటయందు కాదు అని గీతావచనము కాని పొందిన ఫలమును అనుభవించుటకు హక్కు

(అధికారము) మానవునికి లేదు అని గీత చెప్పి యుండలేదు కాని ఫలాసక్తియే గాక ఫలానుభవ ఆసక్తిని గూడ త్యాగము చేయగల్గిన నాడే విముక్తికి మార్గము సుగమము అవుతుంది అని గీతాప్రవచనము ఫలాసక్తిని త్యజించి చేయు కర్మము ద్వారా సత్యమైన ఆనందమును పొందవచ్చునని శ్రుతివాక్యము మానవ సంక్షేమము, ఆనందము త్యాగబుద్ధితో విడదీయరాని బంధమును కలిగియుండును

కష్టము, సుఖము అనునవి అనుభవించబడేవి అందువలన అనుభవించేవాడు ఎల్లప్పుడు వాటిని అనుసరించియే ఉంటాడు వెలుగు, చీకటి, సుఖము, దుఃఖము, ఉష్ణము, శీతలము, అనునవి ప్రత్యేకమైన అస్థిత్వము కలవి కానేరవు కాలము అను ప్రవాహములో ఏర్పడు భిన్నమైన అనుభవములు మాత్రమే ఇవి అని గ్రహించగలిగిననాడు వాటి భిన్నత్వము అదృశ్యమగును

వాస్తవమునకు ఆనందమును ప్రియ, మోద, ప్రమోద అని మూడు విధములుగా విభజించవచ్చునని తాత్వికుల అభిప్రాయము ఒక వస్తువును పొందవలెనని కోరిక జనించినపుడు కలుగు ఆనందము ప్రియము ఆ కోరిక ఫలించినపుడు కలుగునది మోదము కాని సత్యముగా పొందినది ఏమిటి అని గ్రహించగల్గినపుడు ఏర్పడునది మాత్రమే ప్రమోదము ఇది ఉన్నతమైన ఆనందము ప్రియము, మోదము స్థాయిలోని ఆనందములో స్వార్థము ఉండును స్వార్థ ఛాయలు లేనపుడు కలుగునది మాత్రమే ప్రమోదము నిఘంటు భాషలో ఈ మూడు శబ్దములకు అర్థము ఒకటే ఈ స్థాయీ భేదము తాత్త్వికదృష్టిలో మాత్రమే అని గ్రహించవలయును

అలాగే యాత్రల ద్వారా గాని, మరొక విధముగా గాని విగ్రహ రూపములోని భగవంతుని దర్శించినపుడు కలుగు ఆనందము పారవశ్యము వంటిదైన (ecstasy) మోదము అది తాత్కాలికమే విగ్రహ రూపము ద్వారా

పరమాత్మను మనస్సునందు స్థిరీకరణ చేసుకొనగలిగినపుడు మనయందు ఆత్మజ్యోతి వెలుగుతుంది (illumination) అపుడు కలుగునది పరమానందము అది శాశ్వతము ఆ జ్యోతి నిరంతరము వెలుగుతూనే ఉంటుంది అది ప్రమోదము

కర్మము విషయములో కూడ యిదే పరమసత్యము స్వీయ లాభమునకై కర్మమునాచరించి అది పొందినపుడు కలుగు ఆనందము ప్రియ, మోదము స్థాయిలోనిది నిస్వార్థముగా ఫలాపేక్ష ఆసక్తి లేకుండ కర్మము చేసి ఫలమును పొందినపుడు కలుగునది ప్రమోదము స్వార్థముతో చేయు కర్మఫలములు నియమిత స్థలములో మాత్రమే వెలుగునిచ్చు విద్యుత్ 'బల్బు' వంటివి నిస్వార్థ కర్మములకు మూలము విశ్వజనీనమైన ప్రేమ అది అనంతము, నియమితము కాని సూర్యుని తేజస్సు వంటిది

ఈ సృష్టి పరిణామములో (evolution) మానవుడు ఉద్భవించినప్పటి నుండి ఏ పని చేసినా సుఖము, ఆనందము ప్రేరణగానే చేస్తూ ఉన్నాడు కాలక్రమేణ విషయేంద్రియములు (sense organs) ఆనందమును ఇవ్వలేవు అని గ్రహించాడు ఆనందమునకు మూలసాధనము (motive) ఏదో తెలిసికొనుటకు పరిశోధన ప్రారంభించాడు ఈ పరిశోధనా పర్యవసానమే వివిధ తాత్త్విక సిద్ధాంతములు ఏర్పడుటకు కారణమైనది వివేకముతో కూడిన జ్ఞానమార్గమే సత్యమైన ఆనందమునకు సాధనము అని గ్రహించాడు మానవుడు మానవ దృష్టికి అతీతమైన సచ్చిదానందము మ్మాత్రమే సత్యమైన శాశ్వతమైన ఆనందము అని ఉపనిషత్తుల ద్వారా విశదపరిచాడు సర్వసృష్టి పరమాత్మ సంకల్ప ఫలితమే అని, అది ఆయన చైతన్యరూపమే అని గ్రహించాడు ఆ చైతన్య రూపములో సర్వత్ర యిమిడి ఉన్నది ఆ పరమాత్మయే (వైశ్వానరుడు) అని తెలుసుకోగలిగాడు పరమాత్మ తన చైతన్యమును వెనుకకు తీసికొనినపుడు (withdraw) ఈ సృష్టి అంతయు లయమగును ఈ మధ్యకాలంలో జరుగునది

ఏమిటి? మానవుడు తాను చేయు కర్మముల ఫలితమును ఎలా పొందుతాడు, యీ సృష్టి ప్రవాహములో అతడు పొందు పరిణామ దశలు ఏమిటి? అని తెలిసికొనుటకు మానవుడు నిరంతరము తన కృషిని సాగిస్తూనే ఉన్నాడు

మానవుడు తాను చేయు ప్రతి కర్మములోను 'నేను-నాకు' అను ప్రేరణతోనే చేస్తున్నాడు అందువలననే కర్మసిద్ధాంతము 'కర్తృత్వ' 'భోక్తృత్వ' 'జ్ఞానతృత్వ' అను మూడు అహంభావములను గురించి చెప్పింది 'కర్తృత్వ' అనగా 'కర్మము చేయువాడిని నేను', 'భోక్తృత్వ' అనగా ఫలితము అనుభవించే వాడిని నేను', 'జ్ఞానతృత్వ' అనగా 'అన్నియు తెలిసినవాడిని నేను' అను మూడు అహంభావములను తొలగించుకొనగలిగిననాడే కర్మ పరిపక్వత పొంద గలుగుతాడు మానవుడు

కర్మము, వివేకము అనునవి ఒకే నాణెమునకు ఉండు రెండు ముఖముల వంటివి అవి విడదీయరాని సంబంధము కలిగినవి కర్మము చేయునపుడే వివేకము ఏర్పడుతుంది కర్మములు చేయనిచో వివేకము వికసించుటకే అవకాశము ఉండదు మన శరీరమునందు గల జ్ఞానేంద్రియముల (కళ్లు, చెవులు, ముక్కు, నాలుక, చర్మము), కర్మేంద్రియముల (నోరు, కాళ్లు, చేతులు, ముడ్డి, రహస్యాంగము) సంబంధము యిట్టిదే ఈ సంబంధమును నిరంతరము సమన్వయపరచు ఇంద్రియము అంతరింద్రియ మైన మనస్సు కాని ఇంద్రియ ప్రభావమునకు లోబడినంత కాలము వివేకము పరిపూర్ణముగా వికసించదు ఇంద్రియములను అవయవములుగా మాత్రమే గ్రహించి నిస్వార్థముగా, కర్మఫలమునకై ఆతురత పొందకుండ కర్మముల నాచరించుట ద్వారానే వివేకము వికసించును

సాధారణముగా మానవుడు సుఖమును ఆశించియే కర్మముల నాచరించును ఆశించిన సుఖము రానిచో అతడు దుఃఖించును కాని పశువులు, ఏదో ఒక విధముగ వృక్షములు గూడ కర్మములను ఆచరించుచునే

ఉండును కాని వాటికి ఫలాసక్తి ఉండదు ఆవు పాలు యిచ్చును చెట్లు పుష్పములను, ఫలములను యిచ్చును అలాగే కోడిగ్రుడ్లను, తేనెటీగ తేనెను యిచ్చుచున్నవి ఈ కర్మములందు వాటికి కలుగు ఫలము ఏమిటి? ఏమియును లేదు ఆ కర్మములు చేయుట వాటి స్వభావలక్షణము అందు వాటికి సుఖము ఉండదు దుఃఖము ఉండదు

కాని మానవునికి మనస్సు అను ఒక అవయవము ఉన్నది అది కోరికల నిలయము ఆ కోరికలే అతని సుఖమునకు గాని దుఃఖమునకు గాని కారణములు అతనికి మనస్సుకు తోడు బుద్ధి (intelligence) కూడ ఉన్నది మనస్సు ద్వారా కలుగు కోరికలను బుద్ధి ద్వారా నియంత్రించుకొనగలిగినపుడు కర్మముల ఫలితము గురించి ఆతురత ఉండదు మనస్థైర్యముతో నిశ్చలముగా కర్మములను ఫలాసక్తి లేకుండ చేయుటకు తగిన సమభావము (equanimity) కలుగును ప్రతి కర్మమునకు ఫలితముండును కాని కొన్ని సమయములందు కర్మము చేయువాడు ఒక్కడే పూర్తిగా కర్మఫలితమునకు కారణము కాజాలడు దానికి యితర మూలకారణములు అనేకములుండవచ్చును అందువలన ఫలితము కొన్ని సందర్భములందు ఆశించిన విధముగా నుండకపోవచ్చును అయినను కర్మరహితముగా నిశ్చేష్టుడుగా, సోమరిగా మానవుడు ఉండకూడదు, ఉండజాలడు కర్మ ఫలాసక్తిని నియంత్రించుకొనగలుగుటయే దీనికి మార్గము

ఈ సందర్భములో శ్రీ అరవిందులు తన 'సావిత్రి' మహాకావ్యము ద్వారా చెప్పిన సత్యప్రవచనములు తెలుసుకొనుట ఎంతో సముచితము పశుప్రాయము, వివేకహీనము అని సాధారణముగ వర్ణించబడిన ఈ ప్రపంచము (ప్రకృతి లేక సృష్టి)నకు వెనుక లేక మూలము ఒక దైవత్వము (God Head) ఉన్నది అని శ్రీ అరవిందులు అన్నారు ఈ ప్రపంచము పశుప్రాయమైన ఒక యంత్రము వంటిది అని, అది తన కార్యములను యాంత్రికముగా నెరవేర్చు చుండును అనియు చాలమంది అభిప్రాయపడతారు దానికి చిత్ (మనసు)

అనబడు చైతన్యము (consciousness) ఏ మాత్రము లేదని, అది తన యందు గల జీవుల గురించి ఏ మాత్రము శ్రద్ధ వహించదనియు అన్నారు ప్రపంచము తన సృష్టిని తానే నాశనము చేస్తుందని, దాని చిత్తవృత్తి అనగా అనుకంపన గల భావములు (feelings) ఉండవని, బాధపడ్డారు అందువలననే తాత్త్వికులు కూడ దానిని గురించి ఎంతో వ్యథతో అసహ్యముతో 'కుక్కతోక'గా వర్ణించారు ఈ ప్రపంచమంతయు దుష్టత్వముతోను వ్యథలతోను నిండి ఉన్నది, దాని యందు మంచికి స్థానము లేదు ఈ నిరంతరమైన తన ప్రవృత్తి పర్యవసానమును గురించి అది తలంపదు, అది సరిదిద్దరానిది, అనుకంప భావరహితము, అచేతనము, యాంత్రికము అన్నారు దానిని సరిదిద్దుటకు ప్రయత్నించినచో దాని ఫలితము అందుండు జీవుల వినాశము అని కూడ భావించారు

కాని ఇది అంతయు ప్రకృతి బాహ్యరూపము మాత్రమే పశుప్రాయమైన ఒక యంత్రముగా చెప్పబడిన ఈ ప్రపంచము వెనుక ఒక దైవత్వము ఉన్నది అని అరవిందులు అన్నారు "A God-head stands behind the brute machine" ప్రకృతిలో కనబడు వెర్రితనము (madness) లో ఒక పద్ధతి ఉన్నది అన్నారు ప్రకృతి ఒక అతిశక్తివంతమైన మహాపరిణామ గతి యందు లీనమై ఉన్నది (involved in a high process of evolution) దివ్యత్వముతో ప్రత్యేకముగా రూపొందు వ్యక్తుల సృష్టి కొరకు ప్రకృతి నిరంతరము కృషి చేస్తోంది అందుకొరకే పదార్థము, మనస్సు, ప్రాణము (జీవము) (matter, mind and life) సృష్టించబడినవి ఇపుడు ఈ భూమిపై దివ్యరూపులను సృష్టించు మార్గములో ప్రకృతి పరిణామ గతిలో (process of evolution of divine manifestation) పయనించుచున్నది ఈ దిశలో ప్రకృతి అనేక ప్రయోగములు చేస్తున్నది అన్నారు అరవిందులు ఈ ప్రయత్నము శోధన-పొరపాటు-తిరిగి శోధన (trial and error) పద్ధతిలో సాగుచున్నట్లుగా కనబడుతుంది అయినను నిరంతరము పరమాత్మ ఆశయమైన మానవ

స్వీయ దివ్య చైతన్య సాధన సఫలీకృతం చేయుటకే ప్రకృతి కృషి చేయుచున్నది (self-manifestation of the divine) ఈ ప్రకృతి కృషి వెనుక దివ్యచైతన్యము మానవ సాధనకు తోడుగా మార్గదర్శకముగా నిలిచియే యున్నది ఆత్మదృష్టి (అంతరదృష్టి) కలవారికి మాత్రమే యిది గోచరమవుతుంది వారు మాత్రమే ప్రకృతి చర్యలను బాహ్య అనగా గోచరమగు విలువలతో (face values) గ్రహించరాదు అని తెలుసుకొనగలరు పరమాత్మ వైశ్వానరునిగా సర్వమునకు సాక్షి, కర్త, భోక్త, యజమాని అనుజ్ఞ యిచ్చువాడు అని వారు గ్రహించగలరు అని (witness, master, enjoyer, lord and sanctioner) అరవిందులు చెప్పారు

ఈ విధముగా దివ్యచైతన్యము గ్రహించగలిగిన వారు నిత్య జీవితమునకు దూరమవుతారా? వారికి కర్మములతో (actions or works) పనిలేదా? వారి గమ్యము నిర్వాణము లేక ముక్తియా? శ్రీ అరవిందులు భగవద్గీతకు వ్రాసిన వ్యాఖ్యలలో (essays) ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పారు నిర్వాణము లేక మోక్షము లేక విముక్తి (liberation) పొందిన వారికి కర్మములు చేయనవుసరము లేదు అని కొంతమంది విశ్వసిస్తున్నారు వారి దృష్టిలో కర్మములు అనునవి అజ్ఞానము వలన చేయబడును అజ్ఞానము అంతరించినపుడు కర్మములు కూడ ప్రాధాన్యమును కోల్పోవును అని వారి అభిప్రాయము

భగవద్గీత యందు ఈ విశ్వాసమునకు స్థానము లేదు ముక్తి, కర్మములు పరస్పర విరుద్ధములు కావు అని స్పష్టముగా గీత చెప్పుచున్నది బుద్ధుడు కరుణామయ జీవితమునకు ఎంతో ప్రాధాన్యము ఇచ్చాడు కరుణతో కూడిన కర్మములు జీవితములో ఎంతో ముఖ్యమైనవి అన్నాడు భగవద్గీతలో కూడ యిదే విధమైన దృష్టి కనబడుచున్నది బ్రహ్మ నిర్వాణమును పొందిన వ్యక్తి తన వ్యక్తిత్వము చాలించునని చెప్పలేదు ముక్తిని పొందిన వ్యక్తి తన

అహంభావమును మాత్రము తొలగించుకొనును అహంభావి అనగా తన మనస్సు, తన శరీరము మాత్రమే పరిమితిగా భావించు వ్యక్తి అహంభావమును త్యజించిన వ్యక్తి బ్రహ్మజ్ఞానమును పొందగలడు ఆత్మజ్ఞానము ద్వారా తనకు మిగిలిన ప్రపంచమును గల సామ్యమును గ్రహించగలుగుతాడు అట్టివాడు జీవన్ముక్తుడు జీవన్ముక్తుడు ఎన్నడు తన జీవితము భిన్నమైనది, తాను ఇతరుల కంటె భిన్నము అని తలపడు స్వార్థం మాని సమత పెంచుకుంటాడు అట్టి వానికి తన చుట్టూ వున్న ప్రకృతిని గురించిన స్పృహను త్యజించవలసిన అవసరము ఏమున్నది? పరబ్రహ్మము చైతన్యరూపమే ఈ ప్రకృతి భావాతీతుడైన పరబ్రహ్మము నిర్గుణుడు, నిశ్చలుడు పరబ్రహ్మ యొక్క భావాతీత నిర్గుణత్వము ఆయన చైతన్య రూపమైన ప్రకృతిని రెండింటిని గ్రహించగల్గినవాడే పరిపూర్ణమైన ముక్తిని పొందగలుగుతాడు అతడే జీవన్ముక్తుడు జీవన్ముక్తుడు నిశ్చలుడు మరియు చైతన్యము గలవాడు నిర్గుణ బ్రహ్మముతోను, తన కర్మములందు పరబ్రహ్మ చైతన్యమును చూచుకొనుటతోను ఐక్యతను పొంది ఆనందించగలడు ఇదే భగవద్గీత పరమార్థము అని అరవిందులు వివరించారు

కర్మములు చేయునపుడు (actions) అనేక సమస్యలు ఎదురవుతాయి బాధలు, ఆందోళనలు ఉంటాయి ఈ సమస్యలకు పరిష్కారము కర్మములను త్యజించి జీవిత సంగ్రామం నుండి పారిపోవటం కాదు నిత్యజీవితము సాగిస్తూనే సమస్యలకు కర్మముల ద్వారానే పరిష్కారము సాధించాలి అది సాధించగలిగినవాడు మానవాళి అందరికి లాభము కలుగును అరవిందులు తన గీతోపన్యాసములలో మార్గము సూచించారు ప్రథమముగా అతిప్రతిక్రియా పద్ధతులననుసరించకుండా సహనముతో పరిష్కారము సాధించాలి సంయమముతో (సాధుమార్గమున) సమస్యలను అధిగమించాలి మనస్సు భగవంతునిపై కేంద్రీకృతము చేసుకుని చింతన ద్వారా పరిష్కారము సాధించాలి బాహ్య పరిస్థితులకు త్వరితగతిని ప్రతిస్పందించకుండా తన బుద్ధి, మేధస్సు లేక తెలివిని ఉపయోగించి ఇంద్రియానుభవము ద్వారా

వేదనకు గురికాకుండా ముందుకు సాగిపోవాలి ఈ స్థితినే 'స్థితప్రజ్ఞ' అని గీతలో చెప్పబడినది ఈ స్థితి సాధన కొరకు ప్రతిక్రియా తలంపునకు లోనుగాకుండ క్రియలను నెరవేర్చాలి జయముకాని అపజయముకాని క్రియామార్గమునకు అవరోధము కాకూడదు ఫలితమును ఉద్దేశించి మార్గమును ఎన్నుకొనరాదు కర్మములు చేయుచున్నంత వరకు మాత్రమే మనము సహనముతో ముందుకు సాగుతున్నామో లేదో తెలుస్తుంది కావున కర్మములే సహనమునకు పరీక్షా క్షేత్రములు భగవానుడు అర్జునునితో చెప్పినట్లు బాహ్యా పరిస్థితులకు చలించకుండా ముందుకు సాగగలిగినవాడే ధీరుడు (ధైర్యస్థుడు) ధీరత్వము సాధించనంతవరకు ఇంద్రియములను నియంత్రించుట సాధ్యపడదు

జీవితములో ఏ కర్మమునకైనను యోగాపద్ధతి అనుసరణీయము కర్మములు చేయునపుడు సామర్థ్యము ప్రధానాంశము కాని మనము ఏ పనిలోను సంపూర్ణమైన నిమగ్నత లేకుండా అర్ధాంగీకారముతో చేస్తూ ఉంటాము ఫలాపేక్ష అధికమైనపుడు "ఇందులో నాకేమి వస్తుంది" అను భావన వలన నిరాసక్తి ఏర్పడి కర్మములందు నిమగ్నత ఉండదు కాని సంపూర్ణమైన నిమగ్నతతో సమర్థతతో కర్మములు ఆచరించినపుడు మానసికంగా ఒక పరివర్తనకు అవకాశము ఏర్పడి ఎంతో ఆత్మతృప్తి కలుగుతుంది ఆత్మతృప్తి వలన మానసిక వికాసము కలుగుతుంది

సైన్సు సృష్టి అయిన రాబట్ (Robot) మరియు జంతువులు కూడా పనులు చేస్తాయి బాహ్యప్రపంచమునకు వాటి పనులు ఎంతో ఉపయోగంగా ఉండవచ్చు కాని వాటికి ఆత్మతృప్తి తద్వారా మానసిక వికాసమునకు అవకాశము లేదు ఆ అవకాశము మానవునకు మాత్రమే ఉన్నది కాని నేడు పని పరిమాణమునకు (quantity) ఉన్న ప్రాధాన్యము పని స్వభావమునకు (qulaity) లేదు కళాశాలలో విద్యాభ్యాసములో కూడ యిదే పరిస్థితి కనబడుచున్నది

కర్మములలో కనబరచబడు సామర్థ్యము వ్యక్తి ఆధ్యాత్మిక ప్రగతికి

తోడగును ఆధ్యాత్మిక వికాసము ప్రాపంచిక (బాహ్య) జీవితమునకు వ్యతిరేకము కాదు అవి పరస్పర పోషకములు సహజమైన గృహస్థాశ్రమ జీవితమునకు అది ఎంతో గంభీరత (depth (or) dignity) కలుగజేస్తుంది ఇది గీతాప్రవచనము

ఆధ్యాత్మిక ప్రగతికి నిష్కామకర్మమే మార్గము కర్మమును బాధ్యతగా, అంకిత భావముతో, ఆరాధనతో చేసినపుడు మాత్రమే ఆత్మతృప్తి కలుగుతుంది అదే మానసిక వికాసమునకు దోహదపడుతుంది నిరాశ సందేహములతో (despondency and doubt) కర్మముల నాచరించినచో ఆత్మతృప్తి కలుగదు అహంభావము (egotism) ఆత్మతృప్తికి ప్రథమ శత్రువు అహంభావము ఇంద్రియ వాంఛాపూరితమైన స్వార్థమునకు దారితీస్తుంది స్వార్థమును అధిగమించుటకు ప్రేమతత్వము అలవరచుకొనుట మంచిమార్గము భగవంతుడు ప్రేమ స్వరూపుడు ఆ భగవంతుడే జీవాత్మ గదా! జీవాత్మలోని భగవత్ ప్రేమతత్త్వమును వెలువరించి సాధించినచో మనస్సు నందు స్వార్థమునకు స్థానము ఉండదు సాధనకు ఏకాగ్రత, భావశుద్ధి, తోడైనపుడే ఆత్మతృప్తి కలుగుతుంది ఆత్మతృప్తియే ఆనందమునకు సోపానము అన్నాము కదా!

"అందమే ఆనందము
ఆనందమే జీవిత మకరందము"

'అందము'ను గురించి పూర్తి వివరణ, విశ్లేషణ తదుపరి అధ్యాయములో తెలుపబడును "సులభసాధ్యమైన ఆనందాల వలన ఏర్పడిన శూన్యత నా జీవితంలో నిరంతరం పెరిగిపోతోంది నా గత జీవితాన్ని నేను తిరిగి పొందగలిగితే అందని ఫలాలకు అర్రులు చాచటం విరమించి కోరుకొనకుండా లభించు చిన్నచిన్న దైనందిన ఆనందాల్ని - జీవితం ఏవైతే ప్రసాదిస్తుందో వాటినే - పూర్తిగా అనుభవిస్తాను" అని విశ్వకవి రవీంద్రనాథటాగూర్ అన్నారు

కర్మముల ద్వారా ఈ ఆనందం పొందటం ఎలా? ఆనందం అనుభూతిలోకి రావటానికి ముందు మనము మనస్సుకు ఇంద్రియములకు మధ్య సత్సంబంధం సాధించాలి మనం కోరుకున్నది చేయటం మాత్రమే ఆనందము కాదు చేస్తున్నదానిని నిరంతరం కోరుకోవటం ద్వారా మనస్సుకు ఇంద్రియములకు మధ్య సమన్వయం ఏర్పడుతుంది జీవితం నిరంతరం సాగే యుద్ధక్షేత్రము అందులో ఆనందం కావాలంటే ఆసక్తి ఉండాలి ఈ ఆసక్తి ఫలాసక్తి కాకూడదు నిర్వహణాసక్తి అయి ఉండాలి మరొక విషయం అసలు ఆనందం అంటే ఏమిటి? దానిని నిర్వచించగలమా? ఒకవేళ నిర్వచించినా అది విశ్వజనీనము అవుతుందా? కాదు కానేరదు ఆనందం వైయక్తికం అనగా వ్యక్తిపరం ఇంకనూ స్వచ్ఛంగా చెప్పాలంటే ఆనందమే పరబ్రహ్మము

మానవుని బుద్ధికి స్వేచ్ఛ ఉన్న మాట వాస్తవము కాని మానవుడు ఆ స్వేచ్ఛను కొన్ని స్థితులలోను లేక దశలలోను మాత్రమే ఉపయోగించును అను నిబంధనతో మిగిలిన స్థితులలో ఉపయోగించడు అనినచో అది స్వేచ్ఛ కానేరదు ఆ స్వేచ్ఛకు అర్థము ఉండదు కావున కొంచెము ఆలోచించినచో స్వేచ్ఛకు పరిమితులున్నాయి అని తెలుస్తుంది కర్మములు చేయునపుడు స్వేచ్ఛ విషయమును గురించి ముందుగా కొంత చింతన చేయవలసిన అవసరమున్నది కర్మములు చేయుటయందు మానవునికి స్వేచ్ఛ యున్నది విశ్వజనీనమైన ప్రేమతో నిస్వార్థముగా ఫలాపేక్ష లేకుండా చేయుటయా లేక స్వార్థబుద్ధితో ఫలాపేక్షతో చేయుటయా నిర్ణయించుకొనుటకు అతనికి స్వేచ్ఛ ఉన్నది నిస్వార్థంతో ఫలాపేక్ష లేకుండా కర్మము చేసినచో వర్తమాన జన్మములోనే అతని కర్మములకు పరిపక్వత కలుగుతుంది

మన కర్మములను గురించి 'చిత్రగుప్తుడు' నిరంతరము చిట్టా తయారుచేస్తూ ఉంటాడు అను ఒక పౌరాణిక విశ్వాసమున్నది కాని అది పూర్తిగా నిరాధారము కల్పితము వ్రాయటానికి చిత్రగుప్తుడు శిక్షించటానికి

యముడు అను పాత్రలు (characters) ఈ విశ్వనాటకమందు జీవులు తమ స్వేచ్ఛను కర్మము లొనరించుటయందు సవ్యముగా ఉపయోగించుకొనుటకు ఒక రకమైన భయమును కల్గించుటకు కల్పించబడినవి అలంకారార్థముతో కల్పించబడిన సంకేతరూపములు (symbolic forms)

పునరపి జననం, పునరపి మరణం అను ఒక వలయములో జీవుడు తిరుగాడుతూ ఉంటాడు ఈ వలయములో జీవునికి మూడు స్థితులుంటాయి మొదటిది బాహ్యస్థితి అది స్థూల శరీరము రెండవది సూక్ష్మ శరీరము ప్రాణ, మనో, బుద్ధిమయ కోశములతో ఏర్పడినవి దానికి లోపలగా సూక్ష్మాతి సూక్ష్మమైన కారణశరీరముంటుంది దానిలోపల జీవాత్మ ఉన్నది జీవాత్మకు ఒక విధమైన తొడుగు కారణశరీరము ఇది నిరాకారమైన రూపము (astral body) కాని జీవితములో చేయబడు కర్మముల వలన కలుగు వాసనలు, సంస్కారములు యిచటనే స్థిరముగా ఉండి సంచిత కర్మములుగా ప్రారబ్ధ కర్మములకు అటుపై ఆగామి కర్మములకు ఆధారము లేక మూలము అవుతాయి మరొక విధముగా చెప్పినచో బయటది బాహ్యప్రపంచము, మనలోనిది అంతరంగమైనది బాహ్య ప్రపంచము అనగా బాహ్యప్రపంచములో జరుగు జీవిత విధానము అంతరంగ ప్రపంచమునకు ఒక విధమైన నకలు లేక ప్రతి అనవచ్చును కారణమేమన, కారణ శరీరమందలి వాసనలు సూక్ష్మశరీరము ద్వారా బాహ్యజీవితమును నడిపించును కారణశరీరమందు స్థిరపడిన వాసనలే చిత్రగుప్తుని చిట్టా అనవచ్చును ఇక యమధర్మరాజు విషయము యముని సూర్యపుత్రునిగా చెప్పారు సూర్యుడు సర్వమును చూచును కావున అతనిని కర్మసాక్షి అను సంకేతార్థములో రూపొందించారు తండ్రియైన కర్మ సాక్షి ద్వారా యమధర్మరాజు జరిగిన కర్మములను తెలిసికొని ఫలితములను నిర్ణయించును అతడు ధర్మాధిపతి అన్నారు ఒక విషయమును గూర్చి సంపూర్ణముగా సూక్ష్మబుద్ధితో అర్థము చేసుకొనుటయే ధర్మము (discerning power) ఈ సూక్ష్మబుద్ధియే ఆత్మజ్ఞానమునకు సోపానము అది

కార్యనిర్వహణ యందు వివేకము కలిగించును కారణశరీరము సూక్ష్మ శరీరములోని సూక్ష్మబుద్ధి (subtle mind) ద్వారా బాహ్యాశరీరము చేయు కర్మములకు మార్గము సూచిస్తుంది కర్మముల నిర్వహణ యందు వలసిన విచక్షణా జ్ఞానమునే (discerning power) చిత్రగుప్తునికి ప్రతీకగా చెప్పవచ్చును ఇక యమధర్మరాజు, శిక్ష అనగానేమి? జరిగిన దుష్కర్మకు విచక్షణాజ్ఞానముతో పశ్చాత్తాపము పొందుటయే శిక్ష పశ్చాత్తాపమునకు మించిన శిక్షలేదు అని ఆర్యోక్తి ఉన్నది కదా! జరిగినవి దుష్కర్మలు అని అర్థము చేసుకుని పశ్చాత్తాపము ద్వారా మనలను మనము శిక్షించుకొనుటయే యమధర్మరాజుకు ప్రతీక కావున కర్మములు, వాసనలు, విచక్షణాజ్ఞానము, పశ్చాత్తాపము యీ జీవిత వలయమునకు ఆధారములు

కర్మఫలమును గూర్చి 'విరజగీతి'లో వివేకానందులు మహిమాన్వితంగా గానం చేసారు దాని భావం ఇలా వుంది

విత్తునాటిన వాడే దాని ఫలం తినాలి అదే కర్మఫలం అది ఆగదు శుభమునకు శుభము, అశుభమునకు అశుభము కలుగుతుంది ఇది ఒక నియమం ఇది ఎవరికి దాటతరం కాదు తనువు పొందిన ప్రతి జీవికి బంధములు తప్పక తగులును ఇది నియమం ఈ నామరూపములకు అవతల నిత్యస్వచ్ఛమైన రూపంలోనున్న ఆత్మ నీవేనని తెలుసుకో ఓం తత్సత్ ఓం అని పాడు ముక్తగీతి

కర్మఫలము ఆగదు అనుభవించక తప్పదు కాని దానిని అనుభవిస్తూనే దానికి అతీతముగా మనస్సును నిశ్చలం చేసుకొనుటకు మార్గం ఏమిటి అనేది ప్రధాన సమస్య మార్గము భక్తియా లేక కర్మకాండలా (ఆచార కర్మలా?) దీనికి సమాధానం తెలుసుకొనవలసిన అగత్యం ఎంతైనా ఉన్నది

భక్తి ఆచారకర్మల ద్వారా కావచ్చు లేక ఆధ్యాత్మికంగానూ కావచ్చు కాని ఆచారకర్మలు ప్రధానంగా భౌతికములు, గణితాంక ప్రకారములు

(external and mathematical) ఆచారకర్మలు సాధారణముగ నరకలోకప్రాప్తి భయముతో గాని, స్వర్గప్రాప్తి ఆకాంక్షతో గాని ప్రేరితమవుతాయి ఆచారకర్మలకు వెనువెంటనే అహంభావము ఉంటుంది ఆధ్యాత్మికత భిన్నమైనది ఆత్మ-పరమాత్మల సంబంధమే దాని ప్రధానాంశము అది ఆంతరంగికమైనది ధ్యానప్రేరితము అయినది ఆధ్యాత్మికతకు ఆచారకర్మలకు వలె గమ్యం ఉండదు ఆధ్యాత్మికత ఒక అనుభూతి (Direct experience) దానికి భయముగాని, ఆపేక్షగాని అంశములు కావు సృష్టి సర్వస్వముతో పారదర్శకమైన సాన్నిహిత్యము అనుభవించుటయే దాని ఆశయము

ఆచార కర్మోక్తములైన పూజ పునస్కారములు వ్యక్తిని వాస్తవ జీవితమునకు దూరము చేస్తాయి ఆచార కర్మిష్ఠులలో ఎంతో మంది క్రూరులు, అసత్యవాదులు, దుర్మార్గ, అక్రమ ప్రవృత్తి కలవారు పురాణాలలోనూ నిత్యజీవితంలో కూడ కనబడతారు వారి కర్మలకు సామాజిక స్పృహ ఉండదు కాని 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను స్పృహ ఆధ్యాత్మికతకు కేంద్రం గోచరుడగు జీవునిలో పరమాత్మను దర్శించి తద్వారా అగోచరుడగు నిర్గుణ పరమాత్మ దర్శనానుభూతియే ఆధ్యాత్మికత ఇదియే ధ్యానమునకు కేంద్రబిందువు గోచరుడగు జీవునిలో పరమాత్మను దర్శించలేనపుడు అగోచరుడు, నిరాకారుడు అయిన పరమాత్మ దర్శనానుభూతి పొందటం అసాధ్యము ఎదుటనున్న జీవునిలో పరమాత్మను చూడగలిగినపుడు తనలోని జీవాత్మయే పరమాత్మయని గ్రహించగలుగుతాడు అదియే అనుభూతి (Direct experience and illumination) అది పొందినవాడు కర్మఫలానుభవమునకు అతీతుడు అవుతాడు విశ్వజనీనమైన ప్రేమ ద్వారా మనస్సు విశాలమవుతుంది భావాతీతమవుతుంది అదే మనలను సృష్టి ఆంతర్యమునకు దగ్గర చేస్తుంది అందము, ఆనందములే సృష్టి ఆంతర్యము అందము అనేక విధాలు, అలాగే ఆనందము కూడ అనేక రూపాలలో ఉంటుంది సృష్టి ఉన్నంత కాలము చెట్ల నుండి పుష్పములు సుగంధ తరంగములను వెదజల్లుతూనే ఉంటాయి, పక్షులు గగనంలో

ఆనందవిహారము చేస్తూనే ఉంటాయి, ఇంద్రధనుస్సు ఆకాశంలో చిరునవ్వులను ప్రతిబింబిస్తూనే ఉంటుంది, పసిపిల్లల బోసినవ్వులు దివ్యత్వ ప్రతీకలుగానే ఉంటాయి అవి గ్రహించగలిగిననాడు మనలో నిద్రాణంగా ఉండు సంయమన శక్తి (reconciling power or checking power) విదితమవుతుంది కర్మఫలము నుండి విముక్తికి మార్గమైన పశ్చాత్తాపమునకు ఆ శక్తియే ప్రేరణ కలిగిస్తుంది నరక శిక్ష అనబడునదే పశ్చాత్తాపము అదియే కర్మఫలము నుండి విముక్తి అదియే సృష్టితో జీవితమకరందము అనబడు శృతిని కలుపుతుంది అదియే వాస్తవమైన ధ్యానము, భావాతీత స్థితి అదే జీవాత్మ పరమాత్మల ఐక్యతానుభూతి

కర్మములకు, పురుషార్థములకు గల అవినాభావ సంబంధము గ్రహించవలసి యున్నది ఈ విషయములో వేదమత సందేశము కూడ తెలుసుకొనవలసియున్నది వేదాలలో హిందూమత స్వరూపము, మానవజాతికి హిందూమత సందేశము - ఈ విషయములు తదుపరి అధ్యాయములలో వివరముగా చర్చించబడును కర్మములు - పురుషార్థములు అను విషయము ప్రస్తుత చర్చనీయాంశము అసలు ఈ విషయములను సమగ్రముగా పరిశీలించి సామాన్య మానవునికి అర్థమగునటుల విశ్లేషణ వేదపండితులు చేయగలుగుతున్నారా? అని ప్రశ్నించినచో సమాధానము చాల నిరుత్సాహంగా ఉంటుంది అమూల్యమైన ఈ విషయములను వేదపండితులు ఎందుకు విశదీకరించుట లేదు? ఎందుకు విశదీకరించలేకపోతున్నారు?

తరతరాలుగా వేదాలను వల్లించటం, వేదపండితులుగా సంభావనలు, దక్షిణలు సంపాదించుటకు మాత్రమే ఉపయోగించుచున్న వారికి వేద విజ్ఞానమునకు సామాజిక స్పృహ జోడించి వేదమత సందేశమును వివరించుటకు ఇచ్ఛ గాని, సమయము గాని లేదు సంపాదనకు మాత్రమే వేదాలను ఉపయోగిస్తున్న పండితులకు వాటి అర్థం ఏమిటో ఆలోచించే ఆసక్తి గాని, సమయముగాని లేదు వేదాలను రక్షిస్తున్నాము అని ప్రచారం చేసుకుంటున్న

పీఠాధిపతులకు కూడ ఆడంబరాసక్తి, సన్మాన ప్రచారముల యందున్న ఆసక్తియే తప్ప వేదాలలోని హిందూమతము - సామాజిక స్పృహ అను విషయము జోలికి వారు పోవటం లేదు కొంతమంది పీఠాధిపతులు తమ చాతుర్యముతో పురాణగాధలకు పిట్ట కధలు జోడించి ఆకర్షణీయమైన ఉపన్యాస ధోరణిలో- అశేష జనసమూహములను ఆకర్షిస్తున్నారే తప్ప అసలు మూల విషయములైన వేదమత సందేశము - వేదాలలోని హిందూమత స్వరూపము - నిత్యజీవితం - ఆధ్యాత్మికత అను విషయములను సామాన్యులకు వివరించే ప్రయత్నమే చేయుట లేదు ఇక 'వేదపోషకులము', 'వేదరక్షకులము' అని ప్రచారము చేసుకొనువారు కూడ తరచుగా వేదసభలు, వేదఘోషలు ఏర్పాటు చేయటము అందు ఆహ్వానితులగు ముఖ్య అతిధులు అప్పటికి తోచిన నాలుగు మాటలు నోటి చివరగా మాట్లాడటం, దానికి తోడు వేదఘోషతో దిక్కులు పిక్కటిల్లటము తప్ప, ఇతిహాసములలోను, పురాణములలోను వర్ణించబడిన మహర్షుల ఆశ్రమములలో జరుగుచుండెడి వేదాధ్యయన, వేదప్రవచనములలోని పవిత్రత, ఏ మాత్రమైనా ఇచట మనకు గోచరమగునా?

అటుపై ఎవరికో కొంత మందికి సన్మానాలు, ప్రకటనలు తప్ప వేద ప్రయోజనము - నిత్యజీవితమును గురించి ఆలోచన ఎవరి మనసులోనైనను ఇసుమంతయైనను ఉన్నదా? లేదు ఎందుకనగా ఇందు ప్రచారము - స్వప్రయోజనము - ఆచారకర్మల ప్రాభవము తప్ప మరేదియు గోచరించదు వేదోద్ధారణ పేరుతో ఏర్పాటు చేయబడుతున్నది ఏమిటి? వేదపాఠశాలలు వేదమంత్రాలను వల్లించటమే ప్రధానం అచట అటుపై ఆ వల్లించువారు వేదమంత్రములను వృత్తికి భుక్తికి వ్యాపారసరళిలో ఉపయోగించటమే జరుగుచున్నది అంతేకాని వేదవిజ్ఞానమునకు వివేకము సమన్వయించి విద్యగా నేర్పటం, నేర్వటం జరుగుచున్నదా? లేదు మంత్రములు వల్లెవేయటం వరకు మాత్రమే ఆ పాఠశాలలను పరిమితం చేసినచో మంత్రములను యాంత్రికముగా నేర్వటం, అవి మెదడునందు భారముగా స్థిరపడి

నిరుపయోగమగును ఇది మాత్రమే వాస్తవముగా జరుగుచున్నది వేదమంత్రములను విశ్వవిద్యాలయ (university) సరళిలో విద్యగా నేర్చినచో అవి మెదడును చైతన్యపరచి (activate) బుద్ధిని (intelligence) వికసింపజేసి ప్రతిభను, ఆలోచనాశక్తిని ప్రకాసింపచేస్తాయి వేదార్థ విశ్లేషణకు, ప్రయోజనమునకు వలసినదే ఇది కాని ఇది జరుగుట లేదు అదే నేటి సమస్య ఈ సమస్యకు డా॥ వేదవ్యాస్ యిచ్చిన విశ్లేషణ ఎంతో శ్లాఘనీయము

జనసామాన్యానికి వేదకాల పురుషులిచ్చిన ఆధ్యాత్మిక సందేశం - మానవుడి జీవిత లక్ష్యమునకు చేరాలి కాని అది ఎలాగ అను విషయము ఆలోచించవలసి యున్నది

"కేవలం వేదపండితులను సన్మానించటమే వేదాలను రక్షించటం అన్న భ్రాంతిలో తమకు సౌకర్యముగానున్న జీవన విధానమునే అనుసరిస్తున్నారు ఫలితముగా జనసామాన్యానికి వేదాలలో ప్రాచీన రుషులు మనకు అందించి మహత్తర విజ్ఞానం ఏమిటి? అది మనకు నిత్యజీవితములో సాధనకు ఏ విధంగా తోడ్పడగలదు? ఇహలోక విషయాలలో ఈ విజ్ఞానం ఎందుకూ పనికి రాదా? మనిషిలోని దైవశక్తులను మేల్కొల్పేందుకు వేదరుషులు ఉపదేశించిన సాధన విధానం ఎలా ఉపయోగపడుతుంది? ఈ ప్రశ్నలకు సమాధానం లేకుండా పోయింది దీనికి కారణం ఏమిటి, అనగా ఆ ప్రశ్నలే ఈ వేదపండితుల వేదపోషకుల మదిలో మెదలలేదు ప్రశలే మదిలోనికి రానపుడు సమాధానాలు ఎలా వస్తాయి? ఇది నేటి వేదమతం దుస్థితి ఇందువలన సుడిగుండము వంటి విషవలయాలు మన హిందూ సమాజాన్ని చుట్టివేసి విషవలయము వైపుకు లాగుతున్నాయి ఈ సుడిగుండం వంటి ప్రమాదాలు ఏమిటి?"

"ప్రాచీన రుషులు దైవశక్తిని మనలోకి ఆకర్షించుకునే విజ్ఞాన (సైంటిఫిక్) ప్రక్రియలు మనకు ఇచ్చియున్నారు ఇవి ప్రత్యక్షంగా ఆచరణ చేసి సాధన చేసినపుడే ఫలితములనిస్తాయి అలా ఏర్పాటు చేయబడిన

సైన్సు వంటి విజ్ఞానము 1) యోగశాస్త్రం, 2) మంత్రశాస్త్రం, 3) ఆగమశాస్త్రం వీటిని ఏర్పాటుచేసినవారు పతంజలి, భృగు, మరీచి, వసిష్ఠాది మహర్షులు ప్రతి మానవునికి భగవదనుభవాన్ని ప్రత్యక్షముగా లభించునట్లు చేయుటకు ఆలయములను నిర్మించి నిర్వహించుటకు శాస్త్రములను మనకు ఇచ్చారు కాని ఈ పనిని సక్రమముగా నెరవేరుస్తున్నామా? ఒక్కసారి మన తిరుపతి, తిరుమల, అన్నవరం వంటి దేవాలయముల నిర్వహణ కొరకు చేయబడుచున్న వ్యాపారం గమనించినచో బోధపడుతుంది ఇందు చెడి బ్రతికిన రాజకీయవేత్తలే కాక లంచగొండులు గూడ చేరి డబ్బు దండుకునే వ్యాపార కేంద్రములుగా ఈ దేవాలయములను మార్చి ప్రసాదాలను సైతము అమ్ముకుంటున్నారు అర్చక స్వాములను, వంటవారిని తగ్గించారు ఈ లోపం వలన వేదపండితులు అసలైన వేదమత సందేశమును రక్షించుట అను మాట ప్రక్కన ఉంచి పరిశీలించినచో కనీసం తాము అర్థం చేసుకుని ఇతరులకు చెప్పగలిగిన స్థితిలో గూడ లేరు ఈ పరిస్థితి ఇలాగే కొనసాగినచో సామాన్య మానవునికి ఈ రాజకీయవేత్తలు, వ్యాపారవేత్తలు చేయు ఆలయ వ్యాపారం చూసి అసహ్యము కలిగి అసలు మతము అంటేనే శ్రద్ధ, విలువ నశించిపోతుంది అందువలన వేదశాస్త్రాలను పరిరక్షించటంలో అత్యంత ముఖ్యమైనది - 'ప్రసాదాలను అమ్మటం' కాదు, ఆలయములో పండితులకు డబ్బు పంచటం కాదు, డబ్బు పండితుల ఆర్థిక పరిరక్షణకు అవసరమే - కాని అంతటితోనే వేదమతాన్ని రక్షించటం జరిగిందని భ్రాంతిపడుతున్నారు అసలు - వేదార్థం ఏమిటి - నిత్యజీవితానికి సంబంధించినంతవరకైనా సామాన్యులకు ప్రాచీన ఋషుల విజ్ఞానమును దాని సందేశమును అందించాలి అపుడే జనసామాన్యంలో ఆధ్యాత్మిక చైతన్యం కలిగి 'సాధన' అంటే ఆసక్తి పెరుగుతుంది ఇది, మతం పేరిట వ్యాపారం చేసుకునే రాజకీయ నాయకుల వంటి దేశద్రోహులకు అవసరం లేకపోవచ్చు కాని ప్రతి హిందువునకు అది అవసరం వేదాలలోని ప్రాచీన హిందూమత 'లక్ష్యం' ప్రయోజనం ఏమిటో - సామాన్యుడికి వాటి

వలన ఉపయోగం ఎలా ఉండవచ్చునో పరిశీలించవలసి యున్నది ''

"హిందూమతం ఇహలోకం గురించి ఏమి పట్టించుకొనదని ఒక తప్పుడు ప్రచారం వున్నది ఇది అబద్ధమే కాదు అజ్ఞానం కూడ అద్వైతులమని చెప్పుకుంటూ మెట్ట వేదాంతం ఉపన్యాసాలిచ్చి శాలువలు, దక్షిణలు లేదా పీఠాలకు వచ్చే వాటాలు మాత్రమే పొందే అట్టి మెట్ట వేదాంతుల వలన జరిగిన ప్రచారం అది ఇది ప్రచారమైన తప్పుడు అభిప్రాయం నిజానికి సామాన్య మానవుడికి జీవితములో కావలసినది ఏమిటి అను ప్రశ్నను వేదరుషులు యదార్థ దృష్టితో గమనించారు '

' జీవితంలో ప్రతి మనిషి కోరుకునేది సంతోషం, సంతృప్తి, ఆనందము వీటినే సంస్కృత పరిభాషలో పురుషార్థములు అన్నారు జీవితంలో ఒకే విధంగా అందరికీ సంతోషం కలుగదు ఎవరి కోరికలు వారికి ఉంటాయి కార్మికుడు, కర్షకుడు, సామాన్య సంసారి, మేధావి, యోగసాధకుడు, పరిపూర్ణ జ్ఞాని - వీరందరూ కూడ కోరేది ఒక్కటే - అది వారి పురుషార్థం ఏ మనిషి ఏ అంతస్థులో జీవిస్తూ వుంటాడో అతడి ఆనందం అంతలోనే ఏర్పాటుచేస్తుంది ప్రకృతి అపుడే పుట్టిన పసిబిడ్డ దగ్గర నుంచి నిర్వాణం చేరుకునే పరిపూర్ణ యోగి దాకా "అందరు కోరేది జీవితంలో సంతోషాన్ని సంతృప్తిని ఇచ్చే మార్గాన్నే! ఈ కోరికలు అనేకులకు అనేక రకాలు ''

" 'కామం' - మొదటి పురుషార్థం 'కోరిక' (కామం) ఈ కోరికలలో ప్రథమమైనది ఆహారం ఇది మనుషులందరికి కావాలి మోక్షం కోసం ఈ లోకాన్ని పరిత్యజించిన యోగికి కూడా ఆహారం కావాలి మనిషికే కాదు బ్రతికివున్న ప్రతిజీవికి ఆహారం కావాలి ఈ అత్యవసర విషయాన్ని ఋషులు ప్రత్యక్షంగా గుర్తించారు అందరికీ అవసరమైనది ప్రతివారికి సమానంగా కావలసినది భగవంతుని ప్రత్యక్షరూపమే దీనిని ఋషులు "అన్నం బ్రహ్మేతి విద్వాన్" అన్నారు అన్నమే బ్రహ్మము యొక్క అత్యవసర స్వరూపము కాబట్టి

పురుషార్థమైన 'కామం'లో మొదటిది 'అన్నం' అన్నము వలననే ప్రాణులు జీవిస్తాయి కనుక అన్నదానం మహాపుణ్యం అన్నారు అన్నమును విక్రయించరాదు - అన్నమును నిందించరాదు అన్నారు అందుకే దేవాలయంలోని దేవుని దయకు ప్రత్యక్ష రూపముగా పూజింపబడి అందరికీ లభించేది 'ప్రసాదమే' ఇదే వేదాలలోని అలయ పూజా విధానంలోని ప్రసాదం యొక్క రహస్యం

అర్థం - "రెండవది 'అర్థము' ఆహారం లభించిన తరువాత మనిషికి కావలసినవి అనేకం అత్యవసరమైనవి 'నివాసం', 'బట్ట', 'రక్షణ' ఆ తరువాత సంతానం కొరకు ప్రకృతి ఏర్పరచిన 'సుఖం' లేక 'సంసారసౌఖ్యం' ఇవి ప్రతి జీవునికి అవసరమైన పురుషార్థములు అని వేదం ఘంటాపథంగా ఉపదేశించిన సత్యాలు ఇలాగే తక్కిన కోరికలు తీరాలంటే అవసరమైనది 'అర్థము' లేక 'ధనము' దీనికి ఒక శాస్త్రమును కూడా ఏర్పరచి ఇచ్చి వున్నారు 'కామశాస్త్రమా?' 'ఋషులా'! అని విస్తు పోనక్కరలేదు అసంతృప్తి వలన వచ్చు అనర్థాలు గ్రహించి, సక్రమంగా సంతృప్తిని సాధించటం పురుషార్థములలో మొదటి మెట్టు అది ధర్మమునకు విరోధం కాని విధంగా కోరికలను తీర్చటం హిందూమతము యొక్క మొదటి లక్ష్యం దీనిని ప్రభుత్వాలు అలక్ష్యం చేయటం వలననే 'కలియుగం సర్వత్రా వ్యాపించి పరిపాలకులే దొంగలై పాలిస్తున్నారు అవసరాలనే ఆసరాగా ప్రజలను దండుకొంటున్నారు కాబట్టి ప్రజాహితమే ఈ పురుషార్థముల సారము అన్ని అంతస్తులలోని మనుష్యులూ - ప్రొద్దుగూకుతూ ఆహారంతోనే, కామసుఖాలతోనే, డబ్బుతోనే సంతృప్తి చెంది ఊరుకోరు ఒక్క జంతువులుండు దశలో వుండు మానవులు మాత్రమే అలా వీటితో తృప్తిపడతారు కాస్త ఇంగిత జ్ఞానం కలిగి వివేకి అయిన మనిషికి కళ్లెదుట కనుపించు భయంకర సత్యాలు కొన్ని, అతనిని ఆలోచింప చేయునవి మరికొన్ని ఉన్నాయి '

"అవి 1 మరణం, 2 రోగము, 3 ముసలితనము, 4 బాధలు, 5

దుఃఖము - వంటివి వీటిని జయించటం ఎలా? ఈ రోజు భోజనం చేస్తే సమస్య శాశ్వతముగ తీరిపోదు మనిషికి జన్మ ఎత్తిన క్షణం నుంచి మరణించే క్షణం వరకు అనేక బాధలు వీటి నుండి శాశ్వతంగా విముక్తి లభించేదెట్లా! మరణమును జయించలేమా? - ఈ ప్రశ్నలు మనిషిని వేటకుక్కల వలె వెంటాడుతూనే ఉంటాయి "

'శాశ్వత విముక్తి', 'మరణమును జయించటం' వంటి సమస్యలు ఎలా వున్నా, పైన చెప్పబడిన బాధలు మాత్రము నిత్యము మనము చేయు కర్మములను (పనులు) ప్రభావితం చేస్తాయి

నిత్యము కర్మములు (పనులు) లేకుండ జీవితము లేదు మన చర్యల వలయమే జీవితము మన చర్యలకు వేదాంతమునకు గల అవినాభావ సంబంధము తెలుసుకొనుటకు ముందుగా పురుషసూక్తమును గురించి వివరములు మననం చేసుకొనవలసిన అవసరమున్నది (పురుష సూక్తమును గురించి మొదటి భాగము రెండవ అధ్యాయమునందు చర్చించబడినది) ఇందు వర్ణించబడిన పురుషుడు (విరాట్ పురుషుడు) ముక్తియే తన నిజ స్వభావముగా కలిగినవాడు 'ముక్తగుణః' అంటే ప్రకృతి యొక్క గుణముల నుండి విముక్తుడైనవాడు అని కూడ అర్థము ఆ పురుషుని చైతన్య రూపమే త్రిగుణములతో కూడిన ఈ ప్రకృతి లేక ప్రపంచము ఆ పురుషుడు శాస్త్ర ప్రమాణములకు అందనివాడు కోరికలతో సతమతమయ్యే మానవులకు ఏమి అర్థము కానివాడు

మన మనస్సుకు అందని తన నిర్గుణ రూపమును సగుణ రూపముగా అనగా విరాట్ పురుషునిగా రూపొంది లోకకళ్యాణము కొరకు సృష్టి యంతయు వైశ్వానరునిగా వ్యాపించియున్నాడు ఆయనయే నారాయణుడు లేక ఈశ్వరుడు (త్రిమూర్తులలోని శివుడు కాదు) పరమాత్మ సగుణరూపమే ఈశ్వరుడు లేక నారాయణుడు అతడే విశ్వరూపుడు

ఆ విశ్వరూపుని నుండే సమాజమునకు మూలమైన చతుర్వర్ణము లుద్భవించినవి ఈ వర్ణములు మనము చేయు కర్మములు ఆధారముగ ఏర్పడినవి మన శరీరములో కాలు, చేయి, మెదడు, నోరు మొదలగు అవయవములున్నవి ప్రతి అవయవమునకు ఒక్కొక్క ప్రత్యేకమైన పనియున్నది ఒక అవయవము చేయు పని మరొక అవయవము చేయలేదు, చేయకూడదు అందుకని ఒక అవయవము నీచమైనది, మరొకటి ఉన్నతమైనది అనుటకు వీలులేదు ఎక్కువ తక్కువలు లేవు అవయవములన్నియు ఏర్పడితేనే శరీరము రూపుదిద్దుకుంటుంది ప్రతి అవయవము తను చేయవలసిన పనిని తానే చేయవలయును అపుడే శరీరము ఆరోగ్యముగా ఉండును

సమాజము శరీరము వంటిదే వర్ణములే అవయవములు ప్రతి వ్యక్తి తాను చేయవలసిన పని చేస్తే సమాజం ఆరోగ్యముగా ఉంటుంది శరీరం ఆరోగ్యంగా ఉండాలంటే ప్రతి అవయవమునకు కొన్ని నిబంధన లున్నాయి ఆ నిబంధనలననుసరించే తన పని తాను చేయాలి ప్రతి అవయవము తాను చేయవలసిన పనినే తాను చేయాలి ఒకదాని పని మరొక అవయవము చేయకూడదు ఏ అవయవము స్వలాభము ఆపేక్షించకూడదు అవయవములు ఐక్యతతో పనిచేసినపుడే శరీరం ఆరోగ్యముగా ఉంటుంది శరీరం ఆరోగ్యముగా ఉంటేనే అవయవములు ఆరోగ్యముగా ఉంటాయి

శరీరములో పనులన్ని చేయునది చేయి కాని ఆహారం తినేది నోరు మాత్రమే నోరు సోమరిపోతు అని చేతులు నోటికి ఆహారం ఇవ్వటం మానివేసినచో శరీరమునకు ఆహారము లేక చేతులకే నీరసము వస్తుంది మెదడు ఆలోచిస్తుంది దాని పని బయటకు కనబడదు సమాజములోని మేధావులు శరీరములోని మెదడు వంటివారే విద్యావేత్తలు, శాస్త్రజ్ఞులు ఈ కోవకు చెందినవారే వీరు చేయుపని కార్మికులు చేయు ఉత్పత్తి వంటిది కాదు అందుకని మేధావులు కర్మము చేయుట లేదని అనతగునా! తగదు

'మేధావులు యంత్రములు కనిపెట్టకపోతే కార్మికులకు పని ఉండదు గదా! అందుకనే మేధావులు సమాజమునకు మెదడు వంటివారు పురుషసూక్తంలో 'బ్రాహ్మణోస్యముఖమాసీత్' బ్రాహ్మణుడు విరాట్ పురుషుని శిరస్సు నుండి ఉద్భవించారు అని అనుటలోని అంతరార్థమిదే 'బ్రహ్మ' అనగా 'తెలివి' అని అర్థం ముఖము అనగా ముఖ్యము అని అర్థము బ్రాహ్మణుడు శరీరమునకు మెదడు వంటివాడు 'ముఖయః' అనగా 'ముఖ్యః' అని అర్థము మేధావుల నిస్వార్థ చర్యల వలన సమాజమునకు మేలు జరుగుతుంది

శరీరమునకు బలము ఎంత అవసరమో దేశమునకు రక్షణ అంత అవసరము రక్షణ బాధ్యత సైనికులది సైనికులకు బుద్ధిబలము కంటే శౌర్యము, శారీరక బలము అవసరము దీనినే 'క్షత్రం' అని అన్నారు క్షతి (దెబ్బ) నుండి కాపాడునది త్రాణ (రక్షించు) క్షాత్రము శరీరమునకు చేతులు (బాహువులు) (భుజములు) రక్షక సాధనములు సమాజము ఒక శరీరం అనుకుంటే దాని రక్షకులు బాహువుల వంటి క్షత్రియులే

శరీరము ఆరోగ్యముగా, సుఖముగా ఉండవలెనన్న మేధస్సు, భుజబలము మాత్రమే చాలవు శరీరములోని ఊర్ధ్వభాగములైన శిరస్సు, భుజములను, అధోభాగములైన పాదములతో అనుసంధానం జరిగినపుడు శరీరం స్థిరంగా ఉంటుంది ఈ మధ్యభాగమే శరీర స్థితికి ఆధారం ఈ మధ్యభాగమే నడుము, తొడలు సమాజములో ఈ మధ్యస్థితిరూపులే వైశ్యులు వీరే నిత్యజీవనానికి వలసిన వస్తు ఉత్పత్తిదారులు కాని ఊర్ధ్వ, మధ్య భాగాలు నిలబడాలంటే ఆధారము కావాలి శరీరమునకు పాదములే అట్టి ఆధారం పాదము లేనిచో శరీరము నిలబడలేదు పాదాలు శ్రామిక భాగాలు చలనానికి, మూలం, ఆధారం అలాగే సమాజంలో కూడ శూద్రులు లేక కార్మికులు ఇతర వర్గాల చలనానికి ఆధారం వీరే ఈ నాలుగు వర్ణాలు అనబడే నాలుగు స్తంభాలతో నిర్మించబడిన భవనమే ఈ సమాజము ఇందులో

ఏ స్తంభం జరిగినా భవనం ఎలా కూలిపోతుందో అదే విధంగా సమాజం కూడా అస్తవ్యస్తమవుతుంది పురుష సూక్తములో చెప్పబడిన ఈ వర్ణోద్భవం పూర్తిగా సంకేతార్ధముతో కూడినది (symbolical meaning) ఈ వర్ణములు గుణసంకేతములు అంతేతప్ప కులాల ప్రసావన లేదు హెచ్చుతగ్గులు లేవు

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః
తస్యకర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥ (భగవద్గీత 4-13)

"సత్వాది గుణములను, శమదమాది కర్మములననుసరించి బ్రాహ్మణాది చతుర్వర్ణములను సృష్టించితిని నేను సృష్టికర్తనైనను అవినాశియగు నన్ను తటస్థునిగా తెలిసికొమ్ము" అని పరమాత్మ భగవద్గీతలో చెప్పాడు అగ్రకులాల వారు ఉత్తములు, క్రింది కులమైన శూద్రులు అధములు అని తలంచుట తప్పు వర్ణములు సృష్టిలో సహజముగా ఏర్పడినవి కులాలు మనము కృత్రిమంగా సృష్టించుకున్నవి విరాట్ పురుషుని పాదముల నుండి జన్మించినట్లు శూద్రులు అధములు అని నిర్ణయించుట చాల అప్రశస్థము

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అను పదములు వర్తమానములో కులముల పేర్లతో వ్యవహరించబడుతున్నాయి అది అన్ని విధముల అసమంజసము విరాట్‌పురుషుని నుండి గుణకర్మముల బట్టి ఉద్భవించినవి వర్ణములు కులములు కావు శూద్రుడు అనగా ఈనాడు అసంఖ్యాకములైన కులములకు చెందినవాడు కాదు అతడు శ్రమించువాడు అనగా కార్మికుడు శరీర చలనమునకు కాళ్లు ఏ విధముగా ఆధారమో, అలాగే సమాజ చలనమునకు శూద్రులు (శ్రామికులు) ఆధారం అదేవిధంగా 'వైశ్యుడు' అనగా కోమటి కులమువాడు అని కాదు అర్థము 'కృషి, గోరక్ష, వాణిజ్యం' అని భగవద్గీతలో చెప్పినట్లు వ్యవసాయము, పాడిపంటలు, వాణిజ్యము ద్వారా సమాజమునకు సంపదను కలుగజేసే వర్గమే వైశ్యులు

సమాజంలోని ఈ వర్గాలే సమాజానికి అవయవాలు విరాట్

పురుషుని ముఖము నుండి బ్రాహ్మణులు, భుజముల నుండి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు ఉద్భవించారని చెప్పారు ఇది పూర్తిగా సంకేతార్థ సూచన సమాజమే విరాట్పురుషుని శరీరముగా భావించి యోచించినచో చాతుర్వర్ణ ఉద్భవములోని సంకేతార్థము బోధపడును సమాజము సక్రమముగా పనిచేస్తూ ఆరోగ్యముగా ఉండాలంటే దాని అవయవములు సక్రమముగా పనిచేయాలి ప్రపంచమునే తన శరీరముగా కలిగిన విరాట్ పురుషుడు (వైశ్వానరుడు) తన శరీరావయవముల నుండి నాలుగు వర్ణములను సృష్టించాడు అనగా సంకేతార్థము ఇదే (symbolical meaning)

అందువలన ఈ నాలుగు వర్ణములు అనగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు - మనదేశములోని కులములుగా వ్యవహరింపబడుచున్న వర్గములు మాత్రమే అని తలచుట పొరపాటు ఈ సృష్టిలోని సమాజములన్నియు ఏ దేశములోనివైనా విరాట్ పురుషుని శరీరమునకు ప్రతిబింబములే కావున ఆయా సమాజములలోని మేధావులు, సైనికులు, సంపదనుత్పత్తి చేయువారు, శ్రామికులు (కార్మికులు) ఈ నాలుగు వర్ణములకు చెందినవారుగానే భావించాలి వర్గములు మాత్రము అవే, నామములు మాత్రము బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు కాకపోవచ్చు మానవుడు ఏ దేశమువాడైనా శరీరములో అవే భాగములు కలిగియుంటాడు కదా! ఆ అవయవముల పేర్లు మాత్రము ఆయా భాషానుసారముగానుండును భాష మారినా అవయవముల రూపం, స్వభావం అదే ఉండును గదా!

అందువలననే పురుషసూక్తం చెప్పిన నాలుగు వర్ణములు కులములు కానేరవు గుణకర్మములను బట్టి వచ్చునది వర్ణము జన్మముతో వచ్చునది కులము పురుషసూక్తములో చెప్పబడిన వర్ణాశ్రమము అనగా వర్ణము యొక్క ఆశ్రమము, అనగా వృత్తి కొంతమంది అర్థహీనముగా చెప్పుచున్నట్లు కులములే

వర్ణములని భావించినను ఆ కులములు నామమాత్రమే అయినాయి కదా! కులమునను సరించి వృత్తులు చేయుటలేదు గదా! ప్రతి వ్యక్తి కులమునకు సంబంధము లేని ఏదో ఒక వృత్తిని చేబడుతున్నాడు అందువలన కులములు గుణకర్మములను బట్టి పుట్టినవి కావు అందువలననే అవి వర్ణములు కావు విరాట్పురుషుని నుండి ఉద్భవించిన నాలుగు వర్ణములు ఏ దేశమునకైనా అనగా ఏ సమాజమునకైనా ఒకటే కాని కులములు అలా కాదు అవి మానవునిచే సృష్టించబడినవి అవి దేశ, దేశమునకు, ప్రాంతప్రాంతమునకు భిన్నములుగా ఉన్నవి మనము ఏర్పరచుకున్న కులములు పుట్టుకతో వస్తాయి వర్ణములు అలా రావు కాబట్టి కులము ఏదైనా చేబట్టిన వృత్తిని బట్టి ఆ వర్ణాశ్రమ ధర్మముగా భావించలేని అగ్రత్వమును ఊహించి అహంకారముతో ప్రవర్తించకుండా సర్వశ్రేయస్సుకై కర్మయోగం ద్వారా కర్తవ్యాన్ని నిస్వార్థముగా నిర్వర్తించినచో సిద్ధి పొంది వర్ణాశ్రమ ధర్మ ధ్యేయమైన సమాజ శ్రేయస్సుకు తోడ్పడతారు ఆధ్యాత్మిక పురోగతి కలుగుతుంది వర్ణాశ్రమ ధర్మమే సమాజ శ్రేయస్సునకు మార్గము కులవ్యవస్థ కాదు పురుష సూక్తములోని సందేశం ఇదే

అస్తవ్యస్తమైన కులవ్యవస్థ పురుషసూక్త అనగా వేదప్రోక్తము కాదు మానవుడు స్వార్థముతో సమాజములో హెచ్చుతగ్గులు అను భ్రమతో కల్పించినదే ఈ కులవ్యవస్థ మతిభ్రమతో కొందరు చెప్పుచున్నట్లు కులవ్యవస్థయే వర్ణవ్యవస్థగా అంగీకరించెదమన్నను, నేడు ప్రతి కులములోను లెక్కకు అందని శాఖలు (sects) ఉన్నవి గదా! ఒకే కులములో ఆ శాఖల హెచ్చుతగ్గుల గురించి వాద ప్రతివాదములకు అంతులేదు గదా! అదియును గాక గుణ కర్మములను బట్టి వర్ణములకు వృత్తులు, ప్రవృత్తులు చెప్పబడినవి కాని నేడు కులవృత్తికి ప్రాధాన్యము లేదు అందరు అన్ని వృత్తులు చేస్తున్నారు బ్రాహ్మణులలో ఎంతో మంది విజ్ఞాన (బ్రహ్మజ్ఞాన) దృష్టి వదలి మేధావి వర్గములో కాక వైశ్యవర్గముతో చేరి ఆయా వృత్తులు చేబడుతున్నారు వారు

బ్రాహ్మణ కులము నందు జన్మించారు కావున బ్రాహ్మణకులస్థులు అనవచ్చును కాని బ్రాహ్మణ వర్ణస్థులు అనుటకు వీలుపడదు వర్ణవ్యవస్థ గుణకర్మములను బట్టి ఏర్పడినది గుణకర్మములను అనుసరించియే వారి వృత్తి, ప్రవృత్తులు ఏర్పడును కులవ్యవస్థ యందు గుణకర్మములకు స్థానము లేదు ఈ కుల వ్యవస్థలోని కులవైరము, తిరిగి ఒకే కులములోని శాఖావైరము ఒక విషవ్యాధి వలె వ్యాపించి సమాజ నాశనమునకు కారణమగుచున్నవి కాని సమాజ శ్రేయస్సుకు తోడ్పడుట లేదు వర్ణవ్యవస్థ వలననే విశ్వామిత్రుడు, వాల్మీకి బ్రహ్మర్షులు కాగలిగినారు కులవ్యవస్థ ఒక చీడపురుగుగా రూపొందినది ఈ వ్యవస్థలోని అసూయాద్వేషములు దావాగ్నిలాగా సమాజమును మసిచేస్తున్నాయి వర్ణవ్యవస్థ అదృశ్యమై కులవ్యవస్థ స్థిరపడింది ఇపుడు దానిని ఏమి చేయుటకు వీలుపడదు అందువలన కులవ్యవస్థను అంగీకరిస్తూనే వర్ణవ్యవస్థలోని గుణకర్మ సిద్ధాంతమును అంగీకరించి వృత్తి ప్రవృత్తులకు స్వేచ్ఛ కలుగజేసినచో కులవ్యవస్థ సమాజ శ్రేయస్సుకు తోడ్పడును లేనిచో ఈ కులవ్యవస్థ అసూయా ద్వేషములకు మూలమై సమాజ వినాశమునకు కారణమగును

వర్ణవ్యవస్థకు గుణకర్మములు మూలము కాని నేడు వర్ణవ్యవస్థ లేదు దాని స్థానంలో వ్యావహారికముగా కులవ్యవస్థ అమలులో నున్నది గుణకర్మములకు స్థానం లేని ఈ కులవ్యవస్థలో కర్మసిద్ధాంతమునకు ప్రాధాన్యము ఎంతవరకు అనునది విచారించతగిన విషయము ఏ కులమునకూ గుణకర్మములు ప్రత్యేకించి నిర్ణయించబడలేదు కులములకు, వాటిలోని శాఖలకు కాలక్రమమున కృత్రిమముగ వృత్తులు నిర్ణయించి అనగా గుణములతో సంబంధము లేని విధముగ, అనుసరించటం జరిగింది కాని నేడు అది కూడ అనుసరింపబడుటలేదు గదా! కులముతో సంబంధము లేకుండ అందరు అన్ని వృత్తులకు సిద్ధమవుతున్నారు కావున ఇచట గుణములకు సంబంధము లేకుండ చేయు వృత్తి ననుసరించియే కర్మముల నిర్వహణ జరుగవలసి యుండును

పుట్టుకతో మనం కల్పించుకున్న కులములకు హెచ్చుతగ్గులు సృష్టించుకుని కులము అను బడబాగ్నిలో దహించుకుపోతున్నామే తప్ప పురుషసూక్తములోని వర్ణాశ్రమముల అంతరార్థమును గురించి యోచించుట లేదు వాస్తవమునకు ప్రతి మానవుని జీవితపథంలో నాలుగు వర్ణాలు మిళితమై ఉన్నాయి 'శతాయుః పురుషః' అని వేదవచనము గదా! ఈ నూరు సంవత్సరములను నాలుగు ఆశ్రమములుగా విభజించారు అందు మొదటిభాగం 25 సంవత్సరములు బ్రహ్మచర్య ఆశ్రమం అన్నారు ఈ ఆశ్రమంలో గురుకులమునందు గురుసేవ చేయుచు విద్యా సముపార్జన చేయాలి ఇది ఒక విధమైన శ్రామిక జీవనం అనగా ఇది శూద్రత్వం రెండవభాగం 25 సంవత్సరముల నుండి 50 సంవత్సరముల వరకు గృహస్థాశ్రమము ఇందు వివాహం, సంతానం, పోషణ, కుటుంబపరంగాను, సమాజపరంగాను బాధ్యతానిర్వహణ లక్షణములు ఇది ఉత్పాదన స్థితి అనగా వైశ్యత్వం అటుపై మూడవ భాగం 25 సంవత్సరములు అనగా 75 సంవత్సరముల వయస్సు వరకు గృహస్థాశ్రమ బాధ్యతలను సంతానమునకు అప్పగించి భార్యతో అరణ్య ప్రాంతములలో వానప్రస్థాశ్రమము స్వీకరించాలి తనను భార్యను రక్షించుకొనుచు తపోవృత్తిని అభ్యసించాలి ఇది భౌతికంగా రక్షణస్థితి ఆత్మజ్ఞాన సముపార్జనకు సోపానము అనగా ఇది క్షత్రియత్వం ఇక నాల్గవభాగమైన చివరి 25 సంవత్సరములు అనగా నూరు సంవత్సరముల వరకు తురియాస్థితి సాధన, బ్రహ్మజ్ఞాన సముపార్జన, నిస్సంగత్వమును పొందుట ఇది బ్రాహ్మణత్వము

ఈ జీవిత క్రమమందు ప్రస్ఫుటమగు విషయమును గ్రహించాలి వర్ణవ్యవస్థ యందు బ్రాహ్మణత్వం, క్షత్రియత్వము, వైశ్యత్వం, శూద్రత్వము ఉన్నాయి జీవిత ప్రమాణంలో దేనికదే ప్రాధాన్యము కలిగిన స్థితులు ఈ వర్ణములు హెచ్చుతగ్గులు లేవు నూరు సంవత్సరముల జీవితములో

నాలుగు భాగములను నాలుగు వర్ణముల స్థితులుగా చెప్పినను, నిత్య జీవితములో ప్రతిదినము మనము చేయు కర్మములందు కూడ అదే విధముగ 'వర్ణత్వము' కలుగును ఉదాహరణకు ఒక ఉపాధ్యాయుని నిత్యజీవితము విశ్లేషించినచో అర్థము బోధపడును తరగతి యందు పాఠములు చెప్పునపుడు అనగా జ్ఞానబోధ చేయునపుడు అతనిది బ్రాహ్మణత్వం విద్యార్థుల క్రమశిక్షణ కొరకు వారిని దండించునపుడు అతనిది క్షత్రియత్వము తన కుటుంబ పోషణకు ఆదాయమునకు ఖర్చులను సర్దుకొను స్థితి వైశ్యత్వం గృహసంబంధమగు పనుల కొరకు గాని అధ్యాపక వృత్తికై రాకపోకల యందు గాని శ్రమించటం జరుగుతుంది ఈ స్థితి శూద్రత్వం జ్ఞానసముపార్జన బ్రాహ్మణత్వం రక్షణ కర్మ నిర్వహణ క్షత్రియత్వం వస్తు సంగ్రహణం, అందచేయటం వైశ్యత్వం, శ్రమించటం శూద్రత్వం

ఈ విధంగా వర్ణాశ్రమములు గుణములకు (అనగా సత్త్వరజస్తమో గుణములు) రూపములు ఈ గుణముల ననుసరించియే కర్మములు నిర్వర్తించబడుతాయి ఈ కర్మములే జన్మ పునర్జన్మలకు మూలము కదా! ఇచట హెచ్చుతగ్గుల ప్రసక్తియే ఉండదు ఇక మనము సృష్టించుకున్నది, హెచ్చుతగ్గులు అను భ్రాంతితో కూడినది అయినది కులవ్యవస్థ ఈ హెచ్చుతగ్గుల భావన మన నరనరాలకు పట్టుకుంది కులనిర్మూలన అంటూ ఏవో ఆడంబర ప్రదర్శనలతోను, రాజకీయ స్వార్థముతో లబ్ధి కొరకు చేయబడు సామూహిక కులాంతర వివాహములతోను కులవ్యవస్థ పరిపక్వత పొందదు హెచ్చు తగ్గులను భ్రాంతితో మనస్సు నిండి ఉన్నంత వరకు కులాంతర వివాహములు కులవ్యవస్థలను సరిదిద్దలేవు కులాంతర వివాహమను పేర ప్రపంచానుభవము లేని యువతీయువకులను క్షణికోద్రేకమగు సముద్రము లోనికి నెట్టటమే తప్ప కులాంతర వివాహము వలన సమాజములో యువతీ యువకులకు సుఖమున్నదా అను సమస్యకు సమాధాన అన్వేషణ మాత్రము జరగటం లేదు కులసంబంధమైన హెచ్చుతగ్గులు, కులస్వార్థము, రాజకీయ

ప్రయోజనము కొరకు కులమును ఉపయోగించుకొను ఏచత్వము ప్రబలి యున్నంత వరకు కులవ్యవస్థ సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడదు సమాజ వినాశమునకే దోహదము చేయును కులములు వ్యక్తిగతమై కులాంతర ద్వేషము, దూషణలకు దారితీయనంత వరకు కులవ్యవస్థతో సమాజమునకు ప్రమాదము లేదు ఎవరికి వారు తమకు సంప్రదాయములను పాటించవచ్చు ఇతరుల సంప్రదాయములను నిందించకుండ కులముల సమన్వయమునకు కృషి చేసినచో సమాజమునకు శ్రేయస్సు కలుగును కులవ్యవస్థ వర్ణవ్యవస్థ కాదు, కులములు సమాజవిభాగములే తప్ప గణకర్మ విభాగములు కాదు అని గ్రహించినచో మానవ సమాజమునకు శుభము కలుగును కులవ్యవస్థను సరిదిద్దుటకు వివాహము మార్గము కాదు వివాహ వ్యవస్థ ఒక ప్రత్యేక ఉన్నతాశయముతో ఏర్పడినది యువతీయువకుల మధ్య ఏర్పడు ప్రేమానుబంధరూపమే వివాహవ్యవస్థ సంప్రదాయానుబద్ధమైన ప్రేమాను బంధమే వివాహబంధము జీవితాంతము ఇద్దరు జీవుల మధ్య సంసారాను బంధమునకు ప్రతీక వివాహవ్యవస్థ

ఉదాత్తం వివాహబంధం,
రెండు హృదయాల సంబంధం,
అవ్యక్తం ఆ ప్రేమానుబంధం
శారీరకసుకృతం సౌందర్యం,
ఆత్మానురూపం సౌశీల్యం,
సుప్రభావితం, ఆ స్త్రీపురుషానురాగం

అట్టి ఉదాత్తమైన వివాహబంధమును, అనురాగ రూపమైన వివాహమును క్షుద్ర, నీచ రాజకీయ లబ్ధితో అస్తవ్యస్తము చేయుట మహానేరము

'చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్' అని వివరించాడు శ్రీ కృష్ణ పరమాత్మ ఇదే విజ్ఞానశాస్త్ర దృష్ట్యా (సైన్సు) పరిశీలించినచో మానవ పరిణామ దశలలో

ఈ నాలుగు వర్ణములు ఎలా ఏర్పడినవో గ్రహించవచ్చు మానవ పరిణామము జంతుదశతో ప్రారంభమైనదని పరిణామ సిద్ధాంతము (Theory of Evolution) చెప్తుంది ఒక్కొక్క దశతో ముందుకు పురోగమిస్తు మానవ రూపము ఏర్పడింది ఇది అందరికి తెలిసిన విషయమే సైన్సు పరిశోధనలలో కూడ తెలిసిన విషయము ఇదే ఆరంభములో ఈ భూమి అంతయు సముద్రపు నీటితో నిండియున్నదని వేదవచనము ప్రాణులు 'ఏకకణజీవులు'గా సముద్రమునందే ఉద్భవించి పరిణామదశలకు శ్రీకారము చుట్టినట్లు సైన్సు కూడ చెప్తోంది ఏకకణజీవుల నుండి క్రమముగా వృక్షములు, క్రిమికీటకాలు, జంతువులు, చేపలు, సరీసృపాలు ఏర్పడినాయి ఆ విధముగా పరిణామదశలు ఒక్కొక్క మెట్టుపైకి ఎక్కుతు జీవుడు మానవునిగా ఉన్నతస్థితి చేరుకున్నాడు అటుపై మానవుడు ఒక్కొక్క స్థాయిపైకి ఎదుగుతు పరిణామం చెందాడు ఈ పరిణామ ప్రవాహములో గతజన్మ అనుభవాలు (సంస్కారములు) ఎంతో ముఖ్యమైన పాత్రను పోషించాయి మరణానంతరము స్థూల శరీరమును వదలి, కారణ శరీరమందలి మనస్సులో గతించిన జన్మ సంస్కారములను నెమరువేసుకొనుచు మరుజన్మ కొరకు ఎదురుచూస్తూ, జన్మజన్మకు ఏర్పడు సంస్కారముల (అనుభవముల) ద్వారా మానవుడు పరిణామం చెందుతూ వస్తున్నాడు ఈ విధముగా పరిణామ సిద్ధాంతముతో జన్మ-పూర్వజన్మ-పునర్జన్మ సిద్ధాంతము ఎంతో సంబంధము కలిగియున్నట్లు తెలుస్తుంది ఈ పరిణామ ప్రవాహంలో ప్రగతికి గతజన్మ అనుభవము ఆధారం అవుతోంది గతజన్మ అనుభవాలే మరుజన్మకు పునాది గతజన్మ అనుభవాలే మరుజన్మలో పురోగమనమునకు నాంది ఇలా అనేక జన్మల అనుభవమును పొందుతు చివరకు మానవుడు విముక్తి పొందుతాడు అని వేదాంతం చెప్తుంది

రూపమునకు అందరూ మానవులే కాని వారిలో మనిషి మనిషికీ తేడా కనబడుతుంది ఒక మనిషి వలె ఇంకొక మనిషి ఉండడు ఈ భేదము సంస్కారములలో, అభిరుచులలో, చేయు పనులలో, జీవన సరళిలో కూడా

కనబడుతుంది వృత్తి, ప్రవృత్తులలో కూడ ఈ భేదమున్నది ఒకరు డాక్టరైతే, మరొకరు ఇంజనీరు, ఇంకొకరు సైనికుడు, ఇంకొకరి నైపుణ్యం మరొక శాఖలోను విదితమవుతుంది వృత్తులను బట్టి మానవులను తరగతులుగా విభజించవచ్చు వృత్తులను బట్టియే నేటి సమాజ విధానము సాగుచున్నది ఇక్కడ కులవ్యవస్థకు స్థానం లేదే! వారివారి గుణ, స్వభావములను బట్టియే వారు వృత్తులను ఎన్నుకొనటం జరుగుతున్నది స్వభావమునే అభిరుచి (attitude or aptitude) అనవచ్చును వర్ణవ్యవస్థ గుణకర్మములను బట్టి ఏర్పడింది గుణము స్వభావమునకు మూలము స్వభావముననుసరించియే కర్మములు జరుగును

ఈ విధముగా పరిణామ దశలలో రూపొందిన స్వభావము వలన అభిరుచులు ఏర్పడినవి కొంత మంది శరీరసుఖమునే కోరుకుంటారు ఈ కోరికతో ధనం ఆర్జిస్తారు ధనార్జన పెరిగి ధనవంతుల మధ్య ఈర్ష్య, అసూయలు పరస్పర స్పర్థలకు దారి తీస్తాయి అపుడు అధికార వ్యామోహం ఏర్పడుతుంది ఈ వ్యామోహం పెరిగిన కొలది మనశ్శాంతి కొరవడుతుంది అపుడు అన్నిటి కంటే మనశ్శాంతి ముఖ్యమని భావిస్తాడు మనశ్శాంతి లభించిన తరువాత బుద్ధి అంతరంగములోనికి మరలుతుంది ఈ సృష్టి ఏమిటి? జనన-మరణాలు ఎందుకు? మనిషి ఎందుకు జన్మిస్తున్నాడు? అను ప్రశ్నలు అతని మనస్సులో ఉదయిస్తాయి వాటి సమాధానము కొరకు అన్వేషిస్తాడు ఆ స్థితే ఆత్మజ్ఞానమునకు దారితీస్తుంది అదే విముక్తి లేక ముముక్షత్వము (liberation)

మానవ జీవితంలో ఈ దశలు - సుఖవాంఛ, ధనవాంఛ, అధికార వాంఛ, మనశ్శాంతిని కోరటం ఆత్మజ్ఞానం (ఆత్మ స్వాతంత్ర్యము) ఏర్పడటం - జీవ పరిణామ దశలలో క్రమపద్ధతిలో రూపొందినవే మొదటిదైన సుఖ వాంఛతో (శారీరక సుఖం కోరుకొను స్థితి) శ్రమించటం శూద్రస్థితి (శూద్రః

సుఖమవాప్నుయాత్) దీని కొరకు కార్మికుడిగానో, ఉద్యోగిగానో (ఉద్యోగం ఏ స్థాయిలోనిదైనా కావచ్చు - అది సేవ చేయటమే (service)) ఈ సేవాధర్మముతో ప్రతిఫలమును గ్రహించి జీవించు స్వభావమే శూద్రత్వము ఈ దృష్టితో పరికించినచో ఉద్యోగాన్వేషణలో తపించువారే సమాజంలో ఎక్కువ మంది కనబడతారు ఇదియే మానవ మానసిక పరిణామ దశలలో ప్రథమసోపానము

ఇంక ఉద్యోగము ద్వారా కాని మరొక మార్గము ద్వారా కాని ధనము సంపాదించవలయును, సంపాదించి కూడబెట్టవలయును అను వాంఛ ఏర్పడుతుంది ఇది రెండవదశ ఇది వైశ్యతత్వము (వైశ్యోధన సమృద్ధః స్యాత్) ఈ మనస్తత్వము కలవాడే వైశ్యుడు ఉద్యోగంలో క్రమాభివృద్ధియే గాని ఒక్కసారి మెరుపు మెరిసినట్లు ధనాభివృద్ధి జరగదు ఒక్కసారిగా అధిక మొత్తముగా లాభము పొందటం, పొందాలనే దృష్టి వ్యాపారంలో మాత్రమే ఉంటుంది అదే వైశ్య ప్రవృత్తి ధనార్జనా దృష్టి ఫలితమే వాణిజ్యం నేడు ప్రముఖముగానున్న పారిశ్రామిక వృత్తియే వాణిజ్యం ఇందులోనున్న వారు ఏ కులము వారైనప్పటికి వారి గుణకర్మములు మాత్రము వైశ్యప్రవృత్తితోనే ఏర్పడతాయి వారి జీవితం వైశ్యధర్మంతోనే సాగుతుంది పరిణామ దశలో ఇది ద్వితీయ సోపానము

కొంతకాలము గడిచిన పిదప అన్నిటికి కేవలం ధనం మాత్రమే మూలము కాజాలదని గ్రహిస్తాడు ఎంత ధనవంతుడైనా అధికారం లేకపోతే వారిని వీరిని ప్రాధేయపడవలసి వస్తుందని గ్రహిస్తాడు అపుడే దృష్టి రాజకీయముల వైపు మరలుతుంది

రాజకీయముగా పరిపాలనాధికారమును చేజిక్కించుకునే ప్రయత్నము చేస్తాడు ఇది మూడవ దశ ఈ దశలోకి పరిణామం చెందిన మానవుడు క్షత్రియ మనస్తత్వము పొందుతాడు అధికార తాపత్రయమే క్షత్రియు స్వభావము (క్షత్రియో విజయీభవేత్) పదవీ వ్యామోహం, అధికార దాహం ఏర్పడతాయి

పరిణామదశలో ఇది మూడవ సోపానము

అధికార దాహంతోను, పదవీ వ్యామోహంతోను కొంతకాలం సతమతమైన తరువాత మానవుని మనస్సు తనకేదో లోపించిందని గ్రహిస్తుంది క్రమంగా అది మనశ్శాంతి అని అది తనకు లేదు అని తెలుసుకుంటుంది సుఖమునకు డబ్బు, పదవి, అధికారం మాత్రమే చాలదు అని అతడు గ్రహిస్తాడు అది గ్రహించినపుడే అతడు జ్ఞాని (మేధావి) అవుతాడు ఈ దృష్టి ఏర్పడినపుడు అతడు బ్రాహ్మణుడవుతాడు (బ్రాహ్మణోబుద్ధి జీవినాః (మనుస్మృతి))

ప్రతి జన్మలోను మనిషి తన అనుభవములను అర్థం చేసుకుంటూ పరిణామక్రమంలో ఒక్కొక్క సోపానము పైకి ఎగబ్రాకుతాడు ఒక జన్మ నుండి మరొక జన్మకు మారినపుడు సోపానం మారుతుంది అభిరుచులు, స్వభావం మారుతాయి జీవనసరళి మారుతుంది చేయు కర్మములు తదనుగుణంగానే ఉంటాయి

మానవ స్వభావంలో పైన చెప్పబడిన నాలుగు దశలు ఒకే జన్మలో పరిణామం చెందవచ్చునని కాదు కొన్ని జన్మలకు గాని పరిపూర్ణ స్వభావ పరిణామం జరగదు పరిణామక్రమంలో జీవుడు (ఆత్మ) ఒకటి తరువాత మరొకటి మెట్లు ఎక్కుతూ ఉంటాడు ఇవి స్వభావ పరిణామ దశలే కాని హెచ్చుతగ్గులను సూచించవు భౌతిక సుఖమే ధ్యేయముగా ప్రారంభమగు శూద్రత్వదశ నుండి ధనార్జన ధ్యేయము గల వైశ్య స్వభావమునకు మార్పుచెంది అటుపై అధికార తాపత్రయం గల క్షత్రియ స్వభావమునకు మారి కొన్ని జన్మల తరువాత జీవితమునకు వలసినది ఆత్మజ్ఞానం ద్వారా శాంతి అని తెలుసుకుంటాడు ఇదే చాతుర్వర్ణ్య ధర్మము వర్ణముల పేర్లు మాత్రము దేశదేశమునకు మార్పు చెందవచ్చు కాని మానవ స్వభావం మాత్రము ఎచటనైనను ఒకటే

కాని ఇచట ఒక విషయము గమనించవలయును పైన చెప్పిన దశలు ఆత్మజ్ఞానము పొందు స్థితి వైపుగా పరిణామములు మాత్రమే ఈ పరిణామమునకు ఒక జన్మ చాలదు, కొన్ని జన్మముల కాలము పట్టును అని చెప్పబడింది అయినను ఒకే జీవిత (జన్మకాలము) ప్రమాణములో వర్ణవ్యవస్థ యందలి బ్రాహ్మణత్వం, కత్రియత్వం, వైశ్యత్వం, శూద్రత్వం ఉన్నాయి అని చెప్పబడింది గదా! పరిణామమునకు కొన్ని జన్మల కాలము పట్టునని చెప్తూనే ఒకే జీవిత ప్రమాణాము నందు నాలుగు స్వభావములు ఇమిడి ఉన్నాయి అని చెప్పుట పరస్పర విరుద్ధముగా ఉన్నది గదా! ఈ విశ్లేషణలోని అంతరార్థము గ్రహించినచో అవి విరుద్ధములు కావు అని బోధపడును

సుఖము నాశించుచు స్వార్థముతో శ్రమించు స్థాయి నుండి జీవన్ముక్తి స్థాయికి ఎదగటం పరిణామం ఆత్మజ్ఞాన (బ్రహ్మజ్ఞాన) సిద్ధి పొందటమే జీవన్ముక్తి అదే బ్రాహ్మణత్వము

"సత్సంగత్వే నిస్సంగత్వం - నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం - నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః"

సత్పురుషులతో స్నేహం నిస్సంగత్వం (ఋషి వలెనుండుట) కలుగజేస్తుంది నిస్సంగత్వం వ్యామోహత్వమును తొలగిస్తుంది అదే నిర్మోహత్వము నిర్మోహత్వముతో నిశ్చలుడు, నిర్గుణుడు అయిన పరమాత్మ తత్త్వము బోధపడ్తుంది ఆ తత్వజ్ఞానమే జీవన్ముక్తిని కలుగజేస్తుంది

ఆ స్థాయికి ఎదగటమే పరిణామ గమ్యం

గుణకర్మములతో వర్ణవ్యవస్థ ఏర్పడింది గుణములు మూడు (సత్వరజస్తమో గుణములు) పరిపూర్ణ సత్వగుణమే బ్రాహ్మణతత్వము కొంత సత్వగుణము, కొంత రజోగుణము కలిసి క్షత్రియతత్వము కొంత రజోగుణము మరికొంత తమోగుణము కలిసి వైశ్యతత్వము అత్యధిక

భాగము తమోగుణముతో శూద్రతత్త్వము ఏర్పడును ఈ తత్త్వములన్నియు కలిసియే సామాన్య మానవునిలో ఉంటాయి నూరు సంవత్సరముల జీవితములో నాలుగు భాగములను నాలుగు వర్ణముల స్థితులుగా చెప్పారు అలాగే నిత్యజీవితములో ప్రతిదినము, మనము చేయు కర్మములందు అదే విధముగ వర్ణత్వము కలుగును ప్రతి మనిషిలో నిత్యము జీవితములో ఒక సమయమందు బ్రాహ్మణత్వమును మరొక సమయమందు క్షత్రియత్వం, అలాగే వైశ్యత్వం, మరియు శూద్రత్వం గోచరమవుతూ వుంటాయి వర్ణవ్యవస్థకు కులవ్యవస్థకు గల భేదమును సూచించుటకే ఇది చెప్పబడినది కాని ఇది పరిణామ దశలను సూచించదు పరిణామ దశల గమ్యము పరిపూర్ణ బ్రాహ్మణత్వము అనగా జీవన్ముక్తి

చాతుర్వర్ణ్యము ఒక ఆరోగ్యమైన సమాజమునకు రూపము మానవజాతి అంతటా చాతుర్వర్ణ్య లక్షణములున్నాయి పరిణామము చెందుతున్న జీవాత్మ ప్రతి జన్మలోను తన పరిణామ స్థితిని బట్టి ఏర్పడు స్వభావమును ననుసరించి తనకు అనుకూలమైన జీవన సరళిని ఎన్నుకుంటుంది చాతుర్వర్ణ దృక్పథం ఇదే కులవ్యవస్థది కాదు పరిణామం ఒక పరమసత్యం పరిణామ దిశలో దశలను దాటి ఆత్మజ్ఞాన మార్గమైన తురియా స్థాయికి చేరుకుంటాడు జీవుడు అతనికే సత్యమైన ఆధ్యాత్మిక సాధన చేకూరుతుంది ఈ స్థాయికి చేరుటకు క్రింది సోపానములు దాటవలయును గదా! అంతవరకు క్రింది స్థాయి వారికి గూడ సమాజములో స్థానము ఉండాలి గదా! చాతుర్వర్ణ గమ్యమే అది కులవ్యవస్థ వలన సమాజము విషమయమైనది వర్ణవ్యవస్థను అర్థము చేసుకుని అనుసరించటమే సమాజశ్రేయస్సుకు మార్గము

గుణప్రధానమైన వర్ణవ్యవస్థ నేటి సమాజములో అనుసరణలో లేదు కులవ్యవస్థకు ఈ గుణములతో సంబంధము లేదు మరి కర్మ

సిద్ధాంతమును నేటి సమాజమునకు ఎలా అన్వయించాలి? అది చర్చనీయాంశము హిందూమతమునకు (వేదమతము) ప్రధానముగా నాలుగు సిద్ధాంతములు మూలాధారములు అవి 1) కర్మసిద్ధాంతము, 2) చతుర్యుగ సిద్ధాంతము, 3) పునర్జన్మ సిద్ధాంతము, 4) అవతార సిద్ధాంతము కర్మసిద్ధాంతము ప్రస్తుత చర్చనీయాంశము మిగిలిన మూడు సిద్ధాంతములు తదుపరి అధ్యాయములలో చర్చించబడును

కర్మసిద్ధాంతము సర్ ఐసాక్ న్యూటన్ భౌతిక విజ్ఞానశాస్త్ర సిద్ధాంతమును పోలి ఉన్నట్లు అనిపించును 'Action and Reaction are equal and opposite' క్రియ - దాని ప్రతిక్రియ సమానము, వ్యతిరేకము ఇది న్యూటన్ సిద్ధాంతము ఇది కర్మ సిద్ధాంతమును ఎంతవరకు పోలిఉన్నది? క్రియకు ప్రతిక్రియ ఎపుడూ ఉంటుంది కాని కర్మసిద్ధాంతములో ప్రతిక్రియ అన్ని ఎడల సమానంగా ఉంటుందా? ఉండకపోవచ్చు రాగద్వేషాలు ఎరగని పసిపిల్లలు చేయు పనులు, రాగద్వేషాలెరిగిన పెద్దలు చేయు కర్మములు ఒకే రకమైన ఫలితమును యిస్తాయా? అను ప్రశ్నకు ఊయవు అనే చెప్పవలసి వస్తుంది పని ఒకటే కావచ్చు కాని ఒకటి రాగద్వేషములు లేకుండ చేయబడినది మరొకటి రాగద్వేషములతో కూడినది

'క్రియ' అనగా 'పని' అని చెప్పబడింది కొన్ని పనులు స్థూలరూపములో బయటకు కనబడునవిగా ఉండవచ్చు అపుడు వాటి ఫలితము కూడ కనబడునదిగానే ఉండును మనసున కలుగు మంచి లేక చెడు ఆలోచనలు కూడ కర్మములే వీటికి భౌతిక రూపముండదు దాని ప్రతిఫలముకు కూడ భౌతికరూపముండదు మానసికముగానే ఉంటుంది ఇదే 'అకర్మ'లోని 'కర్మ' అనగా క్రియారూపంలో కనిపించని కర్మ కొన్ని 'కర్మ'లు క్రియారూపములో కనబడతాయి కాని వాటి వెనుక అసలు 'కర్మ' ఉండదు చెట్టుకొమ్మలు గాలికి కదులుతాయి అది క్రియ భౌతికముగా కనబడుతుంది కాని చెట్టుకు

మంచి గాని, చెడుగాని సంకల్పమే లేదు అందువలన ఇచట 'కర్మ' జరుగుట లేదు ఇది కర్మలాగ కనిపిస్తుంది కాని ఇది 'అకర్మయే' అనగా 'కర్మ'లో 'అకర్మ' కర్మ, అకర్మలను గురించి భగవద్గీత 4వ అధ్యాయము (జ్ఞాన యోగము)లో పరమాత్మ వివరించారు (12 నుండి 20 శ్లోకము వరకు) ఇది పేరుకు జ్ఞానయోగమే కాని ఇది మనకు తెలిపేది కర్మను గురించి

కర్మ అనేది రెండు రకములుగా ఉంటుంది ఒకటి పరమార్ధ సాధనకు తగినది, మరొకటి ఇహలోక సాధనకు తగినది వీటినే వైదిక కర్మ, లౌకిక కర్మ అన్నారు (sacred and secular activities) వీటినే ఆత్మసాధన, ప్రాపంచిక వ్యవహారము, లేక దైవచింతన, భోగచింతన అని కూడా అంటారు భగవద్గీత జీవితమును ఈ విధముగా విభజింపలేదు మంచి జీవితమును జీవింప నెరిగినవాడు తాను చేయు కర్మలనన్నిటిని ఆత్మసాధనకు ఉపకరణములుగా చేసుకొనగలుగుతాడు అట్టి మంచి జీవితమును జీవింపలేనివాడు భగవంతుని పూజించుట మొదలైన మేలు కర్మలను గూడ బంధపాశములకు అనగా ఇహలాభములకు అనుకూలముగా మార్చివేయును చేయు కర్మలనన్నిటిని ఉత్తమ కర్మలుగా మార్చుటకు భగవద్గీత నేర్పుచున్నది ఈ తత్త్వమే భగవద్గీత ముఖ్యాంశము

మనస్తత్వ శాస్త్ర ప్రకారం (psychology) మన మనస్సునందు మూడు భాగములుంటాయి అవి ఆసక్తి (will), భావము (emotion), బుద్ధి (congnition) - వేదాంతపరంగా చెప్పితే మాతయైన పరాశక్తియే (ప్రకృతి) మానవుల హృదయమందు ఇచ్చాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపిణిగా అవతరించి యున్నది మనస్సులో యీ మూడు విధములైన శక్తులు లేక గుణములు ఒక్కటిగా ప్రకాశింపవలయును అపుడే సంస్కృతి ధర్మము సంపూర్ణమగును ఈ మూడు గుణములను బోధించుటచే గీత సర్వమానవులకు ఉపయోగపడు గ్రంథమైనది

మానవుని పరిపూర్ణునిగా చేయుటయే భగవద్గీత యొక్క పరమార్థము మంచి శరీరము, ఉదాత్తమైన మనసు, ఉన్నతమైన జ్ఞానము - ఈ మూడు లక్షణములు సంపూర్ణత్వమునకు అవసరమైన అంగములు

ఇందు **మొదటిది** (1) గొప్పశక్తిని (అనగా మానసిక శారీరక శక్తి) కలిగియుండుట శీలము ఈ శక్తియందే ఇమిడి ఉంటుంది మేలుచేయుట, చేయించుట శక్తివంతులకే సాధ్యపడుతుంది **రెండవది** (2) ప్రేమ ప్రాణులకన్నిటికి ప్రేమ ఉమ్మడియైనది ఈ ప్రేమను పవిత్రముగా మార్చుటయే భక్తియోగము యొక్క ఉద్దేశ్యము ఇట్టి పవిత్రప్రేమ నుండియే అన్ని ఆనందములును కలుగును ఈ ఆనందములను, జీవులను ఐక్యము చేయునదే ప్రేమ **మూడవది** (3) జ్ఞానము వెలుగు చూపునట్టి సూర్యుని వంటిది జ్ఞానము జ్ఞానము అంటే బుద్ధి కర్మములను చేయుటకు ప్రేరేపించునది బుద్ధి చేయు కర్మములను లోపములేనట్లు పూర్తి చేయుటకు దారిచూపునది కూడ బుద్ధియే కావున శక్తి, భక్తి, జ్ఞానములు ఒక చోట చేరినచో మానవునికి ఇంక కావలసినదేమున్నది అట్టి వ్యక్తియే పరిపూర్ణుడైన వ్యక్తి అందుకే భగవద్గీత (1) ఆసక్తి, శక్తి (ఇచ్ఛాశక్తి) **త్వమ్ కర్మయోగము**, (2) భావము, **జ్ఞానశక్తి** ప్రేమ, **తత్**, **భక్తియోగము**, (3) బుద్ధి, **క్రియాశక్తి**, జ్ఞానము, **అసి జ్ఞానయోగము**లను తెలుపు పరిపూర్ణ శాస్త్రము

ఇక కర్మ విషయము కర్మలేనిది ఏ ప్రాణి కూడ ఒక్క క్షణం జీవించలేడు ఒక రకంగా విశ్రాంతి కోసం నిద్రపోవటం కూడా పనే అందువలన ఏ పని చేయకుండ ఏ ప్రాణి ఉండదని భగవద్గీత మనకు చెప్తోంది మనం చేసే పనులన్నీ 'మనం' అనుకోవటం మన భ్రమ మాత్రమే ఆంగ్ల రచయిత AG Gardener We are strangers to ourselves మనకు మనమే పరాయివాళ్లము అన్నాడు అనగా మనల గురించి మనకే పూర్తిగా తెలియదు అని అర్థము ఇది వాస్తవము కర్మలు మూడు విధములు 1)

కర్మ, 2) వికర్మ, 3) అకర్మ

1) **కర్మ** అనగా శాస్త్రం సమ్మతించిన కర్మములు

2) **వికర్మ** అనగా శాస్త్రం నిషేధించిన కర్మములు

3) **అకర్మ** కర్మ చేయకుండా ఉండటం తెలుసుకోవటం

కర్మలేని జీవితం లేదు అంటే కర్మ చేయకుండా ఉండటమేమిటి అను ప్రశ్న ఉదయిస్తుంది అకర్మ అంటే ఏమిటో గీత జ్ఞానయోగం (4వ అధ్యాయం)లో వివరించింది సూక్ష్మంగా దీని అర్థం ఇది ఒక పని 'నేను' చేశాను అని భావిస్తే ఆ పని ఫలితం మంచిదైనా చెడుదైనా మనమే అనుభవించాలి కర్మఫలితం అనుభవించటానికి 'పునరపి జననం, పునరపి మరణం' కొనసాగుతూనే ఉంటుంది కర్తృత్వం మన మీద వేసుకొనకుండా జీవాత్మ పరమాత్మయే కదా, పరమాత్మయే ఈ పని చేయించాడు అని భావిస్తే మనము చేసిన కర్మ 'అకర్మ' అవుతుంది దాని వలన 'విముక్తి' కలుగుతుంది అట్టి వానిని 'కర్మయోగి' అన్నారు ఇక్కడ మరొక ప్రశ్న ఉదయిస్తుంది భగవంతుడు చేయిస్తున్నాడు అని హత్యలు చేయవచ్చునా? అట్టి కర్మలను 'వికర్మలు' అన్నారు వికర్మలు భగవంతుడే చేయించాడని మనము అనుకున్నా భగవంతుడు బాధ్యత స్వీకరించడు

తాను కోరకుండ తనకు లభించిన వాటితో సంతృప్తి చెందుతూ, సమబుద్ధితో మెలిగేవాడు కర్మలు చేసినా కర్మలు చేయనివాడి కిందే లెక్క అనగా కర్మఫలితం వానినంటదు సుఖదుఃఖాలను సమచిత్తంతో గ్రహించడమే కర్మయోగి లక్షణం సుఖాలన్నీ మన ప్రయోజకత్వం అని, దుఃఖాలన్నీ భగవంతుడు కల్పించాడని భావించేవాడు 'కర్మయోగి' కానేరడు

భగవద్గీతలో 4వ అధ్యాయం జ్ఞానయోగము పేరుకు జ్ఞాన యోగమైనను అది మనకు తెలిపేది కర్మను గురించి మొదటి ఆరు

అధ్యాయములు కర్మయోగమును వివరించును 4వ అధ్యాయములో 12 నుండి 20 శ్లోకముల వరకు కర్మను గురించి వివరించబడింది

కర్మల ఫలప్రాప్తిని కోరు మానవులు ఈ లోకమున దేవతల నారాధించుచున్నారు ఏలనన కర్మ ఫలసిద్ధి ఇచట శీఘ్రముగా కలుగుచున్నది ఆత్మజ్ఞానము కంటే శీఘ్రముగా పొందకలిగినది కర్మఫలప్రాప్తి ఇహము అని లేక మనుష్యలోకము అని చెప్పబడునది ఇంద్రియముల ద్వారా గ్రహించనగు ఈ ప్రపంచమే బుద్ధిహీనులు ఏది త్వరగా లభించనున్నదో దానియందే ఆసక్తి కలిగి దానిని కోరుచుందురు మానవుల చిత్తమందు కలుగు మనః పరిపాకమును బట్టి వారికి ఫలప్రాప్తి యగుచున్నది

భగవానుడు ఇలా చెప్పాడు "నన్ను కర్మలు అంటవు నాకు కర్మఫలమందు అపేక్ష కూడలేదు ఈ విధముగా నన్ను తెలుసుకొనువాడు కర్మలచే బంధింపబడడు"

అహంకారము గలవానికి కర్మలు మనోవికారము కలుగజేయును భగవానుని యందు - అహంకారము ఎంతమాత్రమును లేదు - కావున అతడు కర్మలచే అంటబడడు అర్హతకు మించిన వాటిని ఆశించుట కోరిక యనబడును భగవానుడు పరిపూర్ణుడు అన్నిటిని తనలో దాచుకుని అతీతుడైనాడు

ముక్తిని కోరు ముముక్షువులు నిష్కామకర్మలు చేయుదురు వివేకులు అహంకారమును, కోరికలను విడుతురు గాని కర్మను విడనాడలేరు

కర్మ ఎట్టిది, అకర్మ ఎట్టిది అను విషయములను జ్ఞానులే తెలుసుకొనజాలరు

కర్మ యొక్క స్వరూపమును బాగుగా తెలుసుకొనవలయును కర్మ ఏది అని కూడ తెలుసుకొనవలయును కర్మాతీతమైన స్థితిని గురించియు యెరుగవలయును

(4-18) శ్లోకము ప్రధానమైనది

శ్లో॥ కర్మణ్య కర్మయః పశ్యేత్ అకర్మణి చకర్మయః
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్న కర్మకృత్ ॥

కర్మణి - అకర్మ - యః - పశ్యేత్ - అకర్మణ - చ - కర్మ - యః
సః - బుద్ధిమాన్ - మనుష్యేషు - సః - యక్తః - కృత్స్న కర్మకృత్ ॥

కర్మణి = కర్మము నందు, అకర్మ = అకర్మమును, యః = ఎవడు, పశ్యేత్ = చూచునో, అకర్మణి చ = అకర్మమునందును, యః = ఎవడు, పశ్యేత్ = చూచునో, సః = అతడు, మనుష్యేషు = మనుష్యులందు, బుద్ధిమాన్ = వివేకియును, సః = అతడు, యుక్తః = యోగముతో కూడినవాడును, కృత్స్నకర్మకృత్ = సకల కర్మలను ఆచరించినవాడు, భవతి = అగుచున్నాడు

కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును చూచువాడు మానవులలో మేధావి అతడే యోగి అగును అతడే సకల కర్మములను ఆచరించినవాడు, కర్మబంధమునకు అతీతుడును అగును

ఈ శ్లోకమునకు (18) **శంకరభాష్యసారము**

కర్మము ప్రకృతి స్వభావము అకర్మము ఆత్మస్వభావము అవివేకులు ఈ రెండింటి మధ్య గల భేదము తెలియక దుఃఖము నొందుదురు **వర్తమానకాలము నుండి ఒక ఉదాహరణ** - మనము రైలుబండిలో ప్రయాణించునపుడు బయటనున్న చెట్లు మొదలైనవి వ్యతిరేకదిశలో పరుగిడుతున్నట్లు కనబడును కదలిక లేని చెట్లు కదులుచున్నట్లు కనబడుట అను కర్మను చేయుచున్నట్లు కనబడును చెట్లు కదలకపోవటం అకర్మము కదలినట్లు కనబడటం కర్మ అనగా అకర్మములో కర్మ కనుపించటం అలాగే దూరముగా సముద్రము మీద పోతున్న ఓడ చలనము లేనట్లు కనబడును ఓడ కదలటము కర్మము చలనము లేనట్లు కనబడటం అకర్మము అనగా

అజ్ఞానం వలన కర్మము అకర్మముగా కనబడును అలా ప్రకృతి యందు మాయచే ఒకదాని స్వభావము మరొకదానిలో కనబడును

అజ్ఞాని అగువాడు 'దేహమే తాను' అనుకొనుచు "నేను ఇపుడు పనిచేయుచున్నాను నేను ఇపుడు విశ్రాంతి తీసుకొనుచున్నాను" అని ప్రకృతి కర్మమును ఆత్మకు ఆరోపించుచున్నాడు ఈ అజ్ఞాన స్థితియే అకర్మము నందు కర్మము అగుచున్నది ఆత్మస్వరూపము ఎరిగిన జ్ఞానికి అహంకారముండదు అతని శరీరము ఎల్లపుడు కర్మము చేయుచున్నను ఆత్మసాక్షిగా మాత్రమే ఉండును ఎట్టి కర్మములతోను అది బాంధవ్యము ఉంచుకొనదు

**వర్తమాన ఉదాహరణ** రైలుబండియందు ప్రయాణించుచు నిద్రించినవాడు నడచినవాడు కాజాలడు అదే సమయంలో నిద్రించెడివాడును కాదు శరీరము చేయు కర్మము లేవియును ఆత్మను అంటుట లేదు కర్మమునందు అకర్మము అనెడి గొప్పస్థితియే అది జ్ఞానులకు, వివేకులకు మాత్రమే అది సాధ్యము

ఈ శ్లోకమునకు (18) **రామానుజభాష్యసారము**

కర్మము = శరీరము మొదలగువాటితో జరుపబడు అన్ని పనులు, అకర్మము = జ్ఞానము

వంట చేయుట కర్మము కాలక్రమమున రుచికరమైన వంట చేయు నేర్పు వస్తుంది ఈ నేర్పును జ్ఞానము అందురు ఆ జ్ఞానమే అకర్మము

ఇచట కర్మమునందు అకర్మమున్నది ఏ కార్యమునైనను సక్రమముగా చేయుట ద్వారా జ్ఞానము కలుగును ఇదే కర్మమునందు అకర్మము నిపుణత్వము ఇంకను పెంచుకొనినచో అపుడది కర్మముగా మారును అనగా ఇందాకటి అకర్మయైన నిపుణత్వములో కర్మము అగు వంటను మిళితము చేయుట ఇదే అకర్మము నందు కర్మమును చూచుట అగుచున్నది ఈ

విధముగా కర్మము ద్వారా జ్ఞానము (అకర్మము) వృద్ధియగును అనగా తన ఆత్మస్వరూపమును అనుసంధానము చేసి చేయు కర్మములో ఆత్మ స్వరూప జ్ఞానము ఇమిడియున్నట్లు ఎరింగినచో కర్మములో జ్ఞానము అను అకర్మమును చూచువాడు అగును అకర్మయగు తన యాత్మ స్వరూప జ్ఞానముతో కర్మ చేసినపుడు ఆ కర్మ జ్ఞానముతో కలిసినందున జ్ఞానమగు అకర్మములో కర్మమును చూచినట్లగును ఈ విధముగ జ్ఞాన, కర్మలు రెండును ఒకదానితో మరొకటి చేరియుండుట వలన జ్ఞానము కర్మ ఆకారముగను, కర్మ జ్ఞాన ఆకారముగను అగుచున్నవి అను విషయము గ్రహించినవాడు వివేకియగును

ఈ శ్లోకమునకు (18) **మధ్వభాష్యసారము**

కర్మ జీవులచే నాచరింపబడు వృత్తి, వ్యాపారము, క్రియ, అకర్మ అ = విష్ణువు, కర్మము = విష్ణువు యొక్క కర్మము లేక విష్ణువును చేరిన కర్మము

జీవుడు చేయు కర్మలకన్నిటికి తానే కర్తయని తలంచుచున్నాడు వాస్తవమునకు అతను చేయు కర్మలన్నియు మహావిష్ణువు సంకల్పములే అన్నింటికి తానే కర్తనను భావనను వదలి, తన ద్వారా జరుగు కర్మములన్నిటికి భగవానుడే కారణభూతుడనియు, అతడే కర్తయని భావించువాడు కర్మము నందు అకర్మ చూచినవాడగును స్వప్నమునందు కనబడు సకల కార్యములున్ను ఈశ్వర సృష్టియైనను, తాను చేసినవి వలె స్వప్నమున చూచుచున్నాడు స్వప్నము నందు ఒక జీవుడు చేయు కర్మమునకు అతడు కర్మ కానేరదు అచట జరుపబడు కర్మములకు వాస్తవమునకు విష్ణువేయగును స్వప్నము నందు జీవుడు తాను కర్త కాలేని అకర్మము నందు నిలిచియున్నాడు అపుడు విష్ణువు యొక్క కర్మము జరుగుచున్నదని గ్రహించినవాడు అకర్మమునందు కర్మమును చూచుచున్నాడు మానవుడు తన యొక్క కర్మయని భావించి చేయుట, నిరహంకారియై చేయుట మొదలగు అన్ని కర్మములు వాస్తవమునకు

విష్ణువు యొక్క కర్మములే యగుచున్నవి దీనిని తెలుసుకొనినవాడు బుద్ధిమంతుడు

ఈ శ్లోకమునకు (18) **శ్రీధరుల భాష్యసారము**

కర్మణా బధ్యతే జన్తుః - ప్రాణియైనవాడు కర్మచే కట్టబడుచున్నాడు అనునది ప్రమాణము జీవుని బంధించుట కర్మము యొక్క స్వభావము అహంకార, మమకారములు లేనివాడు కర్మములను ఈశ్వరార్పణముగా చేసినచో అట్టి కర్మము మానవుని బంధించుట లేదు నిష్కామముగా చేయు కర్మ పాతబంధములను తొలగించుచున్నది కావున కర్మము నందు అకర్మమును చూచుటయనునది బంధము కల్గించు కర్మములను బంధవిముక్తి కలిగించు కర్మముగా మార్చుట యనబడుచున్నది సోమరితనముచే మంచికార్యములు చేయకుండుట అకర్మము అనబడును అకర్మమునందు కర్మము చూచుట వివేకి యొక్క బాధ్యత

ఈ శ్లోకముపై **స్వామి వివేకానందుని ఉపదేశము**

సంఘజీవితమున, ఏకాంత జీవితమున రెండింటి యందు మనస్సు పరిపక్వత నంది యుండవలయును

**కర్మము నందు అకర్మము** యుద్ధము వంటి పనులందు కూడ మనస్సు ప్రశాంతముగానుండుట కర్మమునందు అకర్మము అగును

**అకర్మము నందు కర్మము** ఏకాంతవాసమున బాహ్యాకర్మలను విడనాడి భగవంతుని స్మరణ చేయుట అనెడిది అకర్మమునందు కర్మము బాహ్యాకర్మలు చేయకపోవటం అకర్మము భగవంతుని స్మరణ కర్మము

ఏదో ఒక స్థితిలో మాత్రమే పక్వముగా నుండు మనస్సు అసంపూర్ణము అటు సంఘ జీవితంలోనో ఇటు ఏకాంతంగానో ఏదో ఒక స్థితిలో మాత్రమే పరిపక్వమైన మనశ్శాంతిని పొందగలిగినవాడు అసంపూర్ణుడే

రణరంగములో శ్రీకృష్ణుడు, అర్జునుని స్థితి, కర్మ, అకర్మలకు గొప్ప ప్రతీకము  కృష్ణుడు వేగముగా పరుగెత్తుచున్న అశ్వములను నిర్దేశిస్తూ, గీతోపదేశమునకు చిహ్నముగా కుడిచేతితో చిన్ముద్రను చూపుచున్నాడు (చిన్మయము = స్వచ్ఛమైన జ్ఞానము పరమాత్మ) రెండు చేతులు ఇలా కర్మలు చేయుచున్నవి  కాని అతని ముఖవిలాసము ప్రశాంతంగా, నిశ్చలంగా మేరువు వలె ప్రకాశిస్తోంది  ఇది కర్మమునందు అకర్మము  కర్మము ప్రకృతితో కూడినది  విరాట్‌పురుషుడు కర్మము చేయడు, అను సత్యమును కృష్ణుడు విశదపరచుచున్నాడు  కర్మను అనుసరించుచున్నను మనశ్శాంతితో నుండుటయే కర్మయందు అకర్మము అను సిద్ధాంతమునకు ప్రత్యక్ష సాక్షి

ఇక అర్జునుడు కర్తవ్యహీనుడై నిలబడియున్నాడు  తాత్కాలికంగా కర్మను విసర్జించాడు  అతనికి మనఃక్లేశము అధికముగానున్నది  ఒకవైపు భయం మరొకవైపు దుఃఖముతో విలవిలలాడుతున్నాడు  కర్తవ్య హీనుడగుట అకర్మము  క్లేశముతో విలవిలలాడుట ఒక విధమైన కర్మము చేయుటయే ఇది అకర్మము నందు కర్మము  ఇదే సామాన్య మానవుని స్థితి

మానవ జీవితమున యోగియైనవాడు ఏ విధముగా ప్రవర్తించవలెనో యోగీశ్వరుడైన కృష్ణుడు తానే ప్రవర్తించి చూపుచున్నాడు  యుక్తాయుక్త విచక్షణ లేక మానవుడు యేమరిపాటు చెందుట తగదు అనుటకు అర్జునుని దైన్యస్థితి చక్కని ఉదాహరణ  అన్ని భాష్యముల మూలాధారము వీరిరువురి స్థితి యొక్క దృశ్యమునందు ఇమిడియున్నది  వీనిని చక్కగా నెరిగినవాడు బుద్ధిమంతుడగును  అతడే ఉత్తమయోగి అగును  ముక్తితోపాటు ఇహపర సుఖములు రెండింటిని పొందగలవాడు అతడే

గురుశిష్యులైన శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానందుడు కూడ దీనికి ప్రతీకలే

**శ్రీరామకృష్ణ పరమహంస** బాహ్యరూపమున నిష్క్రియుడుగా అకర్మము

నందుండెను కాని మానసికముగా భగవంతుని ధ్యానము అనెడి గొప్ప కర్మము చేయుచుండెను ఇది అకర్మములో కర్మ

**వివేకానందుడు** లోకహితమనెడి గొప్ప కర్మ చేయుచు అంతరంగమున ఆత్మస్వరూపమనెడి అకర్మము చేయుచుండెను ఇది కర్మములో అకర్మ

కర్మఫలితం అనుభవించక తప్పదు అని వేదాంతం చెప్తోంది పునరపి జననం, పునరపి మరణం అను వలయములో సంచితకర్మశేషం అనుభవించాలని, కర్మనిశ్శేషం అయేదాకా అనగా కర్మఫలితం మనకు అంటని యోగీశ్వరస్థితికి ఎదిగే దాకా ఈ వలయం తప్పదు కర్మ ఫలితం తప్పదు మరి ఈ కర్మఫలితాల లెక్కలను వ్రాసేదెవరు? దానిని పర్యవేక్షించేదెవరు? అసలు అట్టివారు ఎవరైనా ఉన్నారా? సమాధానం ఒక్కటే ఎవరూ లేరు

చిత్రగుప్తుడు మన కర్మల లెక్కలను నిర్వహించునని పురాణాలు చెప్తున్నాయి పురాణాల అరటిపండు వంటివి, అందుపై తొక్కు తీసివేస్తే కాని లోపం ఫలము మనకు దక్కదు ఆ తొక్కే పౌరాణిక గాధలు, పేర్లు లోపలి ఫలమే అంతరార్థము చిత్రగుప్తుడు, యముడు లాంటి పేర్లు కూడ సంకేతార్థములో చెప్పబడినవే

ఆత్మజ్ఞానము పొంది కర్మ విముక్తుడు కావటానికి జీవుడు అనేక స్థాయిల ద్వారా ఎదగవలసియున్నది ఈ స్థాయిలే కర్మ ఫలితములు మానవులు వారివారి వాసనల అనగా ప్రాపంచిక కోరికలు, అనుబంధాలు, స్థాయిననుసరించి వివిధ స్థాయిలలో ఉంటారు ఈ వాసనలు అంతరించే దాకా పునరపి జననం, పునరపి మరణం తప్పదు చైతన్యము, స్మృతి (consciousness) వారివారి స్థాయిలను బట్టి ఉంటుంది ఈ స్థాయిననుసరించి వారి కర్మ ఫలితములు వారి కారణ శరీరమును అంటిపెట్టుకుని ఉంటాయి ఆ కారణ శరీరమునే చిత్రగుప్తుడను లేఖకునిగా (Accountant) గా సంకేతపరచినారు పురాణాలలో

జీవితము ఒక వలయము దీనిని నాలుగు భాగములుగా చెప్పవచ్చు (1) స్థూల లేక ముతక భాగము (gross) (2) సూక్ష్మ లేక యుక్తి గల భాగము (subtle) (3) సూక్ష్మతరమైన భాగము (more subtle) (4) మిక్కిలి ఉదాత్తమైన భాగము (most subtle) రెండు అక్షములు వలన నాలుగు ధృవములు ఏర్పడును ఇందు (1) స్థూలమైనదియైన ప్రాపంచిక జీవితము లేక సంసారము (2) సూక్ష్మమైన అంతర్గత చైతన్యము (consciousness) మిగిలిన రెండు భాగములు ఈ రెండవ భాగము యొక్క ఉన్నతస్థాయిలు




బాహ్య స్థూలమైన సంసారము ఒక విధముగా మన అంతర్గత సూక్ష్మ శరీరము, లేక ప్రపంచమునకు ప్రతిబింబము ఎందుకనగా మన బాహ్య సంసారమును నడుపునది మన అంతరంగమందలి సంకల్ప, వికల్పములే

అంతరంగమందలి భావములే ఈ సంకల్ప, వికల్పములు సంకల్పమనగా స్థిరనిర్ణయము వికల్పమనగా భ్రాంతి, సందేహము అనిశ్చయము ఇవి బయటకు తెలియవు నిద్రావస్థలోని సంకల్పములు జాగ్రదావస్థలో వికల్పములు కావచ్చు ఈ సంకల్ప, వికల్పములే చిత్రగుప్తుని రచనకు ప్రతీకలు ఇవి సూక్ష్మమైన కారణ శరీరముతో అనుబంధంగా ఉంటాయి

ఇక ధర్మరాజైన యముడు ఎవరు? అతడే ధర్మాధిపతి ధర్మము నెరిగినవాడు 'ధర్మమును ఎరుగుట' అంటే ధర్మ, అధర్మ విచక్షణము అది మనలోనే ఉంది మనలోని ధర్మాధర్మ విచక్షణజ్ఞానమే (discerning power) యమధర్మరాజుకు ప్రతీక మనస్సు ప్రక్షాళనమైనపుడు చేసిన అధర్మమునకు పశ్చాత్తాపము కలుగుతుంది ఆ పశ్చాత్తాపము చేసిన నేరమునకు శిక్ష ఆ స్థితే ధర్మదేవతకు ప్రతీక

జనన మరణములు అనివార్యములు మమకారము, స్వార్థము

అనేవి అజ్ఞానం వలన జనించేవి జీవుడు శరీరమును విడిచి వెళ్లేటపుడు తనతో బాటు భూత సూక్ష్మాలను తీసుకుపోతున్నాడని బృహదారణ్యక ఉపనిషత్తులో (4-4-1) చెప్పబడింది అనగా జీవుడు ముఖ్యప్రాణమును, ఇంద్రియాలను, మనస్సు, అవిద్య, కర్మము, పూర్వబుద్ధిని, కారణ శరీరము ద్వారా తీసుకుని వెళ్తాడు శృతిననుసరించి సైతం ఈ విధముగానే చెప్పబడింది (బ్రహ్మ సూత్రములు, తృతీయాధ్యాయం, ప్రథమ పాదము) జీవులు తాము చేసిన కర్మ ఫలితమును అనుభవించి తీరాలి పూర్వకర్మ జన్యవాసనలు సంస్కారములు

ఇవి లింగ శరీరం (కారణ శరీరం) (Astral body) తో పాటు ఉంటాయి జీవుడు తాను చేసిన కర్మఫలములను అనుభవించటానికి తగిన శరీరాన్ని అనగా యోనిని పొంది మళ్లీ జన్మిస్తాడు పునర్జన్మ అనేది సంచిత కర్మను అనుసరించి ఉంటుంది

మానవజన్మ పొందిన తరువాత ఆ వాసనలు గల కారణ శరీరంలో నున్న జీవుడు పునర్జన్మలో మానవజన్మ కాక మరొక జన్మ పొందటం అనేది అసంభవం సృష్టిలో పురోగమనమే తప్ప తిరోగమనం ఉండదు పురోగమనంలోనే సంచిత కర్మఫలాన్ని అనుభవించాలి తప్పదు

మనకు మనమే విధి మన కర్మ చేసినది మనమే కదా! అనుభవించేదీ మనమే విధి వ్రాత అంటూ ఏదీ లేదు మన కర్మములే మన విధి ఆత్మజ్ఞానం ద్వారా సంచిత, ఆగామి కర్మ ఫలితములను నిరోధించవచ్చు కాని ప్రారబ్ధ కర్మను నిరోధించలేము దానినే మనము విధి అంటాము అయినా ఆత్మజ్ఞానికి ప్రారబ్ధకర్మ అనుభవిస్తున్నా దాని కష్టసుఖాలు అతనికి అంటవు

సృష్టి పరబ్రహ్మ ఇచ్ఛాఫలితమే ఇది సత్యమే కర్మఫలం అనుభవించాలి అను నియమం కూడ పరబ్రహ్మ ఇచ్ఛాఫలితమే కాని ఆ కర్మఫలం ఏమిటి అనేది పరమాత్మ ఇచ్ఛ కాదు అది మన సంచిత కర్మఫలితం ఇది కూడ సత్యమే ఈ స్థూల శరీరాన్ని నడిపేది బుద్ధి మరి బుద్ధిని నిర్దేశించేది

ప్రారబ్ధ కర్మ  అందుకే "బుద్ధిః కర్మానుసారిణి" అన్నారు

గీతోపదేశ సందర్భంలో శ్రీకృష్ణార్జునుల స్థితి వ్యక్త దృశ్యము మన నిత్య జీవితమునకు ప్రతిబింబం  కర్మములకు అతీతంగానున్న శ్రీకృష్ణుడను మూర్తిని విశదపరచు దృశ్యమే ఇది  ఇక అర్జునుని స్థితి నేటి సగటు మానవుని పరిస్థితికి చిహ్నంగా ఉంది  అతడు అటు మహారుషి కాడు, అలాగని ఇటు మహాపాపి కూడ కాదు  భౌతికమైన బాధలు, దుఃఖాలు, అశాంతి నుండి విముక్తి కొరకు మహా తపన పడుతున్న జీవుడే అతడు  అతడు క్షత్రియుడు గాన కర్మ జీవుడైన యోధుడు  తన కర్తవ్యము సరిగా తెలియక, జీవిత పరమావధిని (goal) గురించి అలజడి, గందరగోళము పడుతూ మరొకవైపు విముక్తి, మనశ్శాంతి కొరకు తపన పడుతున్న జీవుడతడు  అందుకే అతడు సగటు మానవునికి ప్రతీక  ఉద్వేగభరితమైన నేటి ప్రపంచములో (జీవితములో) ఆశలు చంపుకోలేక, కోరికలు తీర్చుకోలేక, కావాలనుకున్నది సాధించలేక, సాధించిన వాటితో తృప్తిపడక మానవుడు సతమతమవుతున్నాడు

ఈ స్థితి నుండి విముక్తి కొరకు మార్గం ఒకటే  యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని పద్ధతి  ఇక్కడ కృష్ణుడు అంటే చారిత్రక పురుషుడుగా కాదు (not an historical person)  బ్రహ్మజ్ఞానసిద్ధి పొందిన యోగేశ్వరుడైన జీవన్ముక్తుడుగా మాత్రమే  భావాతీత ధ్యానమునకు (Transcendental state of Mind) కృష్ణుడు పరిపూర్ణమైన ప్రతీక  ఆ స్థితి కొరకు సాధన చేయుటయే కర్మ ఫలితముల నుండి విముక్తి కొరకు మార్గము

ఇది అందరికి సాధ్యపడుతుందా? అంటే సాధ్యపడదు  ఆ స్థితికి కూడ గీత సమాధానం చూపింది  (18వ అధ్యాయం 66వ శ్లోకం)

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

ఇది గీతాశాస్త్రానికి (గీతోపదేశానికి) ఉపసంహారశ్లోకం

తా॥ "అర్జునా! సమస్త ధర్మాధర్మములను అనగా వర్ణాశ్రమ పరిస్థితి స్వభావానుసారంగా మానవుని కర్తవ్యాలైన కర్మలన్నిటితో పాటు, నిషిద్ధ కర్మల సైతం నాయందే త్యజించి పరమేశ్వరుడనైన నన్నొక్కడినే శరణు పొందు, ఇట్టి నిశ్చిత బుద్ధి గల నిన్ను, సర్వశక్తివంతుడనైన నేను (పరమాత్మను) సమస్త పాపముల నుండి విముక్తి చేయగలను నీవు దుఃఖింపనక్కరలేదు "

'ఈశ్వర శరణాగతి' అనేది అన్ని శాస్త్రముల పరమరహస్యం 'ఈశ్వర శరణాగతి' అనేది లేనపుడు సన్యాసం సైతం ఫలం ఇవ్వదు

ఇక్కడ 'శరణాగతి' అంటే మనం చేసే ప్రతి పని భగవంతుని ద్వారానే జరుగుతున్నది అను పరిపూర్ణ విశ్వాసముతో మనం నిమిత్తమాత్రులమే (instruments) అని మనసా, వాచా, కర్మణా మనలను మనం అర్పణం (surrender) చేసుకున్నపుడు 'నేను', 'నా ప్రయోజకత్వం' అను భావన తొలగిపోతుంది అపుడు **'నేను నీవు'** స్థాయి నుండి **'నీవే నేను'** అను స్థాయిలోకి అటుపై **'సర్వం నీవే'** అను పరమోన్నత స్థాయికి మనం ఎదగటం జరుగుతుంది అందువలన భగవంతుని మీద ఎంత విశ్వాసం ఏర్పడుతుందో మన మీద మనకు కూడ పరిపూర్ణ విశ్వాసం ఏర్పడుతుంది

మన కర్తవ్యం మనం నిర్వహించటానికి ఈ విశ్వాసము ఎంతో అవుసరము భావాతీత స్థితికి చేరటానికి భగవంతునికి ఆత్మార్పణ (self-surrender) చేయటం దగ్గర మార్గము

ఈ సందర్భములో కర్మములు ఎందుకు చేస్తున్నాం? అని ప్రశ్న వస్తుంది దానికి సమాధానం ఒక్కటే కర్మములు సంతుష్టి కొరకు చేస్తున్నాం కాని కర్మముల వలన నిత్య సంతోషము వస్తుందా? రాదు మరి కర్మములు చేయనవసరము లేదా? ఉన్నది ఈ శరీరమున్నంత వరకు

కర్మములు చేయక తప్పదు కాని ఇవి భౌతికము మాత్రమే, నిత్యసంతుష్టినిచ్చేది నిత్యమైనది వేరొకటి ఉన్నదని గ్రహించాలి జ్ఞానికి, అజ్ఞానికి భౌతిక శరీరంలో ఏమి తేడా ఉండదు ప్రాపంచిక విషయాలు, వ్యవహారాలు ఇద్దరికి ఒక్కటే ఏమి భేదము కనబడదు కాని ఈ సర్వసృష్టికి మూలమైన పరంజ్యోతి ఒకటి ఉన్నదని అది నిత్యసత్యమైనదని తెలియుటలోనే ఇద్దరికి భేదమున్నది జ్ఞాని ప్రాపంచిక కర్మములు చేయుచున్నను, విషయలోలుడు కాడు వ్యామోహం ఉండదు ఏ కర్మము చేయుచున్నను అతని మనస్సు నందు పరంజ్యోతియే గోచరిస్తు ఉంటుంది వ్యావహారిక కర్మములు చేస్తాడు కాని అవి అతని ధ్యేయము కాదు, గమ్యం కాదు అతని ధ్యేయం, గమ్యం పరంజ్యోతియైన పరబ్రహ్మము మాత్రమే ఈ శరీర ప్రపంచాలతో మమేకం కాకుండ, తాను శాశ్వత ఆనందప్రదమైన పరమాత్మ పదానికి చేరుకోడానికి సాధనంగా ఈ శరీరమును ఉపయోగించుకుని క్రమంగా ఆత్మజ్ఞాని అవుతాడు దీనివలన అతనికి కలిగే ప్రయోజనం ఏమిటి? ఆ స్థితి పొందినపుడే అది అర్థమవుతుంది లేనిచో శృతానుభవముగా అనగా విని తెలుసుకొనినదిగా మాత్రమే మిగిలి పోతుంది ఆ అనుభూతి పొందగలిగిన నాడు ఆ పరమాత్మ కంటే తాను భిన్నమైనవాడు కాను అని తెలుసుకుని ఆ శాశ్వతానంద స్వరూపునిగా రూపొందుతాడు అతడే జీవన్ముక్తుడు ఇంతకీ సారాంశమేమంటే ఎంత భౌతికవాది అయినను అతనికి తానున్న స్థాయితో సంతుష్టి కలుగదు తాను ఎవరు? అను ప్రశ్న జీవితంలో ఏదో ఒక స్థితిలో అతను ఎదుర్కొంటాడు నిరంతరం ఉన్నత స్థాయి పొందాలని తపన పడుతుంటాడు లౌకికంగా చేరగలిగిన ఉన్నత స్థాయికి చేరినను ఇంకా ఏదో వెలితి ఉన్నట్లుగానే భావన పొందుతూనే ఉంటాడు ఏదో ఒక స్థాయిలో అది భౌతికమైన మానసిక ఆవేదన కాదు, అది ఆత్మ పొందు తపన అని గ్రహించగలుగుతాడు అది గ్రహించగల్గిననాడు ఆత్మజ్ఞాన మార్గము సుగమము అవుతుంది ఈ శరీరం ద్వారానే అది సాధ్యము

మానవ కర్మాచరణ దశలలో ఉన్నతమైనది, చివరది జీవన్ముక్త దశ ఈ దశను పొందిన మానవుడు స్థితప్రజ్ఞుడుగా గణింపబడతాడు ఆ స్థితి నందినవాడు కర్మములు చేసినా, చేయకపోయినా నష్టం లేదు అని గీతాచార్యుడు ఉపదేశించారు

శ్లో॥ నైవతస్యకృతేనార్థో
నాకృతేనేహకశ్చన,
నచాస్యసర్వభూతేషు
కశ్చిదర్థవ్యపాశ్రయః (3-18)

ఈ లోకమున ఆత్మజ్ఞానికి కర్మముల వలన నేమియు ప్రయోజనము లేదు అంతకు ముందు చేసియున్న కర్మచేతగాని, ఇక ముందు చేయనున్న కర్మ చేతగాని ఎలాటి ప్రయోజనము లేదు అతనికి ఏ ప్రాణితోను ప్రయోజనకరమగు ఏ సంబంధమును లేదు అయినప్పటికి గీతాచార్యులే ఇలా అన్నారు

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి
మాస్థితాజనకాదయః
లోకసంగ్రహమేవాపి
సంపశ్యన్ కర్తుమర్హసి (3-20)

జనకుడు మున్నగువారు కర్మము చేతనే ఆత్మజ్ఞానమును పొందిరి లోకోపదేశము కొరకైనను (జ్ఞానిని చూచి జనులు కర్మత్యాగులగుదురు, కాన వారిని కర్మములు చేయునట్లు ప్రేరణ చేయుటకైనను) నీవు కర్మల నాచరింపదగును

విద్యుక్తమైన లోకవ్యవహారాలను నిష్కామబుద్ధితో సక్రమంగా నిర్వర్తించాలని ఆదేశించారు

కర్మములు ఎందుకు ఆచరించాలి అను ప్రశ్నకు సమాధానంగా శ్రీకృష్ణుడు ఇలా అన్నారు

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ
స్తత్తదేవేతరోజనః,
సయత్ప్రమాణం కురుతే
లోక స్తదనువర్తతే (3-21)

శ్రేష్ఠుడగువాడెట్టి కర్మముల నాచరించునో, వానిని సామాన్యుడు అనుకరించును అతడు దేనిని ప్రమాణముగ గ్రహించునో లోకమును దానినే అనుసరించును

అందుకు ఉదాహరణగా తననే ఉదహరించుకున్నారు

శ్లో॥ నమే పార్థాస్తి కర్తవ్యం
త్రిషులోకేషుకించన,
నానవాప్తమవాప్తవ్యం
వర్తపవచకర్మణి (3-22)

పార్థా! ముల్లోకములలో నాకెట్టి కర్తవ్యమును లేదు నేను పొందనిది గాని, పొందవలసినది గాని లేదు అయినను లోకమునకు ఆదర్శముగ నుండుటకై నేను సదా కర్మములను చేయుచునే యుందును ఎందువలననగా జీవన్ముక్తునికి కర్మలు చేయవలసిన అవసరం లేకపోయినా, అతడు కర్మములు చేయని పక్షంలో ఆయననే ఆదర్శముగా తీసుకున్న లోకులు అతని మార్గము ననుసరించి చెడిపోతారు ఇదే గీతాచార్యులు చెప్పిన లోకసంగ్రహ కర్మము

రాగద్వేషాది మలిన మనోవృత్తులతో చేయు సత్కర్మములైనను పూర్ణ ఫలితమునీయజాలవు నిష్కామబుద్ధితో, పరిశుద్ధ అంతఃకరణతో చేసిన సత్కర్మలు పరమాత్మకు సంపూర్ణ తృప్తి కలుగుటచే వాటి సంపూర్ణ ఫలితం

శీఘ్రకాలంలో లభిస్తుంది జీవన్ముక్తుల కర్మములు సామాన్యులకు మార్గదర్శకములుగా ఉంటాయి

జీవన్ముక్తికి భావాతీత స్థితి మార్గము మన కర్తవ్యం మనం నిర్వహించటానికి వలసిన ఆత్మవిశ్వాసము అపుడు మనకు ఏర్పడుతుంది ఈ స్థితికి చేరటానికి భగవంతునికి ఆత్మార్పణ (self-surre ler) చేయుట దగ్గర మార్గము అని చెప్పబడింది గదా!

'శరణాగతి' అని మనం యాంత్రికంగా పనులు చేయుట కాదు గీత చెప్పింది అందుకే ముందు 'శరణాగతి' అనగా ఏమిటో పూర్తిగా అర్థం చేసుకోవాలి 'శరణం' అనటం ఎంత తేలికో దాని అనుభూతి పొందటం అంత కష్టం "Self-surrender is knowingly to live, move and have our being in god" - 'ఆత్మార్పణం' అంటే బహిరంగంగా మన చలనము మనకే ఉంటుంది చేసే పని నిజాయతీతోనే చేస్తాము ఇది మనకెందుకు, మనం ఎందుకు చేయాలి అను సంశయం ఉండదు కానీ, పని ఎంతసేపు చేసినా మనసులో మనం స్థిరీకరణ చేసుకున్న ఆ భగవంతుని రూపం మనోఫలకం మీద తేజరిల్లుతూనే ఉంటుంది ఈ పని చేస్తోంది అతడే, మన చేతులు, కాళ్లు అతని పరికరములు మాత్రమే అను భావన పొందటమే 'శరణాగతి'

'గీత'లో చెప్పిన యోగములు ఇవే యోగాలే భగవత్సాన్నిధ్యం పొందటానికి మార్గాలు 'యోగం' అంటే భగవంతునితో సాన్నిధ్యం లేక సంయోగం లేక ఐక్యత పొందుట, లేక, అలా సాన్నిధ్యం పొందటానికి మార్గము ఈ యోగములకు ఆధారం పరిత్యాగం అంటే వదలిపెట్టుట (Renunciation) వదలటం అనగా వ్యామోహం త్యజించటం త్యజించుట అంటే కర్తవ్యాలను వదలి సన్యసించమని గీత చెప్పటం లేదు మనసు భగవంతుని మీద నిలిపి, స్వార్థం, వ్యామోహం వదలి కర్తవ్య నిర్వహణే మానవ ధ్యేయం అని గీత చెప్తోంది ఈ పరిత్యాగం కొరకు మనం సమాజమును వదలి

వనవాసమునకు వెళ్లనవసరం లేదు  స్వార్థచింతన, వ్యామోహం లేని కర్తవ్య నిర్వహణనే గీత ప్రధానంగా చెప్తోంది  "A life of non-attachment in the midst of duties combined with the knowledge of the nature of one's immutable eternal self - is the real message of Bhagavadgita "

ఏకాగ్రత ద్వారా మనోనిగ్రహం సాధించినచో మనస్సుకు ప్రశాంతత వస్తుంది  అపుడు **'మనలను'** (self) మనం చూడగలుగుతాం  అపుడు మన మీద మనకు తృప్తి, విశ్వాసం ఏర్పడుతాయి  ఈ ఆత్మతృప్తి, ఆత్మవిశ్వాసము ద్వారా మన బుద్ధి క్షాళనమవుతుంది  అలా శుద్ధమైన బుద్ధి మనసును భావాతీత (transcendental) ఆనందస్థితికి (bliss) తీసుకువెళ్తుంది  ఈ స్థితినే **'గీత'**లో 'యోగం' అన్నారు  (4-20, 23)

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం
నిత్యతృప్తోనిరాశ్రయః
కర్మణ్యభి ప్రవృత్తోఽపి
నైవకించిత్ కరోతి సః ॥

కర్మఫలమందాసక్తిని వీడి, ఎల్లపుడు సంతృప్తుడై దేనిని ఆశ్రయింపక కర్మములు చేయువాడు ఏమియు చేయనివాడే అగును

శ్లో॥ గతసంగస్య ముక్తస్య
జ్ఞానావస్థిత చేతసః,
యజ్ఞా యాచరతః కర్మ
సమగ్రం ప్రవిలీయతే ॥

సంగమును వదలి జ్ఞాననిష్ఠయందు గట్టిగా మనస్సు నిలిపి కేవలము దేవతారాధనము కొరకు గర్మములు చేయునట్టి ముక్తుల యొక్క కర్మ సంపూర్ణముగా లయమై పోవును

కాని అందరి మనుష్యులలో భగవంతుడు సమంగా వ్యక్తం కాడు కారణం ఏమిటంటే అందరు మానవులకు సమంగా భగవంతునిలో జీవించటం సాధ్యపడదు కాబట్టి ఈ భిన్నత్వము గుణకర్మల వలన కలుగుచున్నది (గీత 4-13)

స్వామి వివేకానందుని మాటలలో "ధర్మంలోను, (కర్తవ్యం (లేక బాధ్యత) నీతిలోను స్థాయిలు ఉన్నాయి ఒక స్థాయి, స్థితిలోని ధర్మం (Duty) మరొకస్థాయిలోని స్థితిలోని ధర్మంతో భిన్నంగా ఉంటుంది అయినా అన్ని స్థాయిలలోను, స్థితులలోను పరిగణించదగు ప్రాథమిక ధర్మములను అనుసరించవలసినదే స్వచ్ఛమైన మనస్సు, నిస్వార్థం, నిష్కామం, మానసికంగా భగవంతుని సాన్నిధ్యం" - ఇవి అందరికి సమానధర్మములు

ఇంకొకటి ప్రధానమైనది ఆశ ఉండదగినదే కాని స్థాయికి మించిన ఆశ దుఃఖమునకు హేతువు జీవితంలో ప్రతి మనిషి తన కర్తవ్యములను, నీతి, ధర్మములను (Duties and Virtues) తన గుణకర్మములకు (పని) అనుగుణముగా నిర్ణయించుకుని తన ధర్మమును పరిపూర్ణముగా నిర్వహించి, తద్వారా భగవంతుని ఆరాధించవచ్చు

కర్మసిద్ధాంతము, పునర్జన్మ, ఉపనిషత్తులలోను, భగవద్గీతలోను ప్రధానాంశము 'కర్మ' అనగా పని (work or action) - అంతేకాదు పనిని గురించిన భావములు కూడ కర్మ అనే అనాలి తెలిసి చేసినా, తెలియక చేసినా, ప్రతిక్రియగా చేసినా (reflex) అది 'కర్మ'యే ఒక పనిచేసి దానిని మనం మరచిపోతాం కాని ఆ కర్మ ఫలితంగా ఏర్పడిన ముద్ర లేక స్మృతి (impression) శాశ్వతం దానినే సంస్కారం అంటారు స్మృతి లేక జ్ఞాపకశక్తి (memory) కి ఆ సంస్కారములను స్పృహలోనికి (conscious mind) తెచ్చు శక్తి ఉన్నది ఇలా స్పృహలోనున్న సంస్కారముల కలయికే ఒక వ్యక్తి యొక్క శీలము (character) గా రూపొందుతుంది ఆ శీలము (స్వభావం లేక ప్రవృత్తి) వ్యక్తి భావాలను,

నడవడికను రూపొందిస్తుంది ఆ విధంగా ఒక 'కర్మ' మరొక కర్మకు విత్తనం అవుతుంది కాబట్టి ప్రతికర్మ కారణము, ఫలితము కూడ అవుతుంది

వర్తమానంలో మన స్థితికి మన కర్మలే కారణం అందువలన నిష్కామంగా, నిస్వార్థంగా, మనస్సు నందు భగవంతుని స్థిరీకరణతో మన కర్తవ్యం (ధర్మం) మనం నిర్వర్తించటమే మార్గం అదే ఆత్మార్పణం (self-surrender) లేక సర్వం పరమాత్ముని కార్యములే అను స్థిర భావనతో జీవితం అను ప్రయాణం కొనసాగించుట

మరి ఈ స్థిరీకరణకు సాధన ఎలా? మన ఇష్టదైవము యొక్క సగుణరూపమును మనస్సునందు సర్వదా స్థిరపరచుట **మరొక మార్గం** ప్రణవము అనగా 'ఓం'కారమును మనస్సునందు ప్రతిధ్వనించునటుల సాధన చేయుట **మరొక మార్గం** మన హృదయంలో కేంద్రబిందువు ఆధారంగా తూర్పు వైపుకు తిరిగి ఎనిమిది దిక్కుల వైపు ఎనిమిది రేఖలను అనంతంగా ఆకాశంలోకి ఊహించుకుంటే, ఆ సాధన ద్వారా అనంతమైన పరమాత్మ తేజమును కేంద్రముగా మన మనస్సులో దర్శించవచ్చు అది ఒక అనుభూతిని కలుగజేస్తుంది దీనిని గురించి ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు వివరించారు




మన హృదయంలో ఊహించబడిన కేంద్రబిందువు యోగములను గురించి మరొక్క విషయము గ్రహించ వలసియున్నది ధ్యానం, యోగాభ్యాసం రెండును మనలను మనమే పవిత్రం చేసుకోవడానికి, కుశాగ్రబుద్ధి పెంచుకోవటానికి ముఖ్యమైన సాధనాలు ద్యానం, యోగం ద్వారా ఆత్మను, పరమాత్మగా గ్రహించవచ్చు పరమాత్మగానే మార్పు చెందించవచ్చు 'యోగం' కేవలం భౌతిక అంశాలకే పరిమితమైంది కాదు యోగంలో భౌతిక, మానసిక వ్యాయామాలు కూడ ఉంటాయి శరీరంలో శక్తి, సామర్థ్యం ఒక భాగము, చైతన్యం మరొక భాగము అయినా అవి కలిసి పనిచేస్తేనే జీవితమునకు

పరిపూర్ణత వస్తుంది శరీరమును నడిపించే చైతన్యమే 'ప్రాణం' నాడీమండలం ద్వారా శరీరమంతా విద్యుచ్ఛక్తిని ప్రవహింపజేసే శక్తి కేంద్రమే 'సహస్రారం' శరీర, చైతన్యాలు ధైర్యంగా ఉండుటకు శారీరక వ్యాయామం (భౌతిక యోగం) అవసరం అనారోగ్యం, బలహీనతలు లేకుండా ప్రాణాయామం వంటి భౌతిక యోగధ్యానం సహాయపడుతుంది

ప్రకృతిని నడిపే శక్తిని 'యోగ' అన్నారు ఆత్మపరమాత్మల సంయోగ న్ని కూడా రుషులు 'యోగ'మని పిలిచారు ఆత్మవివేకంతో 'అంతర్‌యోగం సాధన ద్వారా పరమాత్మతత్వం తెలుసుకొనవచ్చును మామూలు మనిషి మహాపురుషుడు కావచ్చు ఇది "ఆధ్యాత్మిక యోగం" ఇందు మొదటి భాగం ఇంద్రియాలను, సమయమును, ధనవాంఛను, ఆలోచనలను అదుపులో ఉంచుకొనుట ఇక రెండవది ధ్యానం మనం ఎంచుకున్న అంశంపైన ఏకాగ్రత పెంచుకునే శక్తి "ధ్యానం" వలన లభిస్తుంది

శారీరక వ్యాయామం వలన శరీరదార్ఢ్యం వస్తుంది - ఆధ్యాత్మిక సాధన ద్వారా శ్రద్ధ, ప్రజ్ఞ, నిష్ఠ, ప్రతిభ అను ఆధ్యాత్మిక సిద్ధులు కలిగి ఆత్మలో దైవిక శక్తులు ప్రేరణ పొందుతాయి ఈ విధమైన సిద్ధి పొందినవారు నిష్కామంతో, నిస్వార్థంగా సత్కార్యములు చేస్తారు ఇంకా ఉత్కృష్టత సాధిస్తే వరాలు ఇవ్వడం, శాపాలు ఇవ్వడం వంటి శక్తులు లభిస్తాయి అన్ని జీవులలోను ఆత్మ ఉంటుంది (ఆత్మవత్ సర్వభూతేషు) ఇది అందరికి తెలుసు అందరు చెప్తూ ఉంటారు ఉపన్యాసాలు ఇస్తూ ఉంటారు కాని ఎందరికి ఈ సత్యం అనుభవంలోకి వచ్చింది అనేది ప్రశ్నార్థకం

'ఆత్మయోగం' ద్వారా తత్వజ్ఞానం, దేవతాపరిచయం భగవత్ దర్శనం కలుగుతుంది లాభాలు, ఆశలు అహంకార ప్రదర్శన అను మూడు సంబంధాల నుండి ముక్తి పొందుతాడు అదే 'జీవన్ముక్తి' జననమరణాలు సృష్టి క్రమంలో భాగమే అయినప్పటికి వాటికి అతీతమయిన స్థాయి 'జీవన్ముక్తి'

'యోగ'ను ఇంద్రజాలంగా భావించకూడదు సిద్ధులు, శక్తులు లభిస్తాయని ఆశ చూపి యోగవిధానాలు అమ్ముకోవడం తప్పు పాశ్చాత్య దేశాలలో, ప్రస్తుతం మనదేశంలో కూడా, ప్రాచుర్యం పొందిన 'యోగ'లో 'ధ్యానము'ను విస్మరించి శారీరక వ్యాయామములకు మాత్రమే పరిమితం చేయబడుచున్నది అది మంచిది కాదు యోగసాధనలో సత్ప్రవర్తన, ఆత్మార్పణ (self-surrender) తో కూడిన భక్తి చాల ప్రధానమైనవి

మన కర్మ సిద్ధాంతము న్యూటన్ సిద్ధాంతమును పోలియున్నట్లు కనబడును అన్నాము

"Action and reaction are equal and opposite" "క్రియ-దాని ప్రతిక్రియ సమానము, వ్యతిరేకము" దీనిని గురించి మరికొంత విచారించుదము వర్తమానం కంప్యూటర్ (computer) యుగం ప్రతి విషయము చిట్టాలు, లెక్కలతో పనిలేకుండా కంప్యూటర్‌లో నిలవ ఉంచుతున్నారు మెదడులాగ అది వాటినన్నిటిని జ్ఞాపకం ఉంచుకుని అవసరమైనపుడు మనము అడిగితే అది వెంటనే చెప్తుంది మన కర్మల ఫలితములనే గదా మనము అనుభవించేది అదే గదా కర్మ సిద్ధాంత ప్రధానాంశము కర్మలన్నియు స్మృతులుగా కారణ శరీరంలోని మనసులో ముద్రింపబడి అవి పునర్జన్మలో సంస్కారములుగా ఏర్పడునని చెప్పబడింది ఇలా సృష్టిలో కోట్ల కొలది జీవులు వారివారి జన్మ పునర్జన్మలలో వారివారి కర్మ ఫలితములను అనుభవించునట్లు విచారణ చేయు ప్రక్రియ ఏదైనా ఈ విశ్వములో అనగా అంతరిక్షములో ఉన్నదా? సమాధానం, ఉన్నదనే చెప్పాలి కాని అది కార్యస్థానము (office) వలె ఎక్కడో ఒక చోట స్థిరముగా ఉండదు ఈ ప్రక్రియ జీవులందరిలోను, విశ్వమంతటా జరుగుతూనే ఉంటుంది

సృష్టి ఒక నిత్య ప్రవాహము అందు ప్రతి పరిణామము, ప్రతి ఒక్క క్రియ, ప్రతిక్రియలు (action and reaction) వాటంతట అవే సహజముగా

జరుగుతూ ఉంటాయి పరమాత్మ సంకల్ప ఫలితమే ఈ సృష్టి అందలి పరిణామ ప్రణాళిక గూడ ఆ సంకల్పములోని భాగంగానే గుర్తించాలి ఆ పరిణామ ప్రణాళికలోని భాగమే కర్మఫలానుభవము కర్మములు, ఫలితములు లేనిచో పరిణామమే ఉండదు గదా! ఆ పరిణామ రూపమే కర్మసిద్ధాంతము అని గ్రహించాలి అంతరిక్షములో అణువుల, పరమాణువుల కలయిక, విడిపోవటంలోనే ఉన్నది పరిణామం ఆ కలవటం, విడిపోవటంలోనే ఇమిడి ఉన్నై రాగద్వేషాలు రాగద్వేషాలే కర్మసిద్ధాంతమునకు మూలము జనన, మరణములే ఈ కలవటం, విడిపోవటం

ఈనాడు సర్వం 'కంప్యూటర్లలో' (computers) నిల్వ చేస్తున్నారు అవసరమైనపుడు అదే మనకు వలసిన విషయములను, ఫలితములను తెలియజేస్తోంది అదే విధముగా ప్రకృతిలో అనగా అంతరిక్షములోనే ఒక కంప్యూటర్ వంటి ప్రక్రియ జరుగుతూ ఉంటుందని గ్రహించాలి అది తనంతట తానుగా (automatic) పనిచేసే యంత్రము వంటిది అదే పరమాత్మ సంకల్పితమైన విశ్వచైతన్యము అంతరిక్షములో నిత్యం జరిగే క్రియ - ప్రతిక్రియలను ఛాయాచిత్రములుగా (photos) చిత్రించే యాంత్రిక ప్రక్రియ అక్కడ ఉన్నదని శాస్త్రవేత్తలు (scientists) అంటున్నారు కాలయంత్రము (Time machine) ద్వారా గతమును, భవిష్యత్తును గూడ దర్శించవచ్చునని సైన్సు చెప్తోంది గదా!

అలాగే మన కర్మలను ఫలితములను గూడ నిల్వ యుంచు ప్రక్రియ ప్రకృతిలో తనంతట తానుగానే జరుగుచున్నది మన మనసే ఆ ప్రక్రియకు ప్రతిరూపం మన మనసు (mind) ఒక కెమెరా (camera) వంటిది మన కర్మములన్నియు మన మెదడు వెనుక భాగమున స్మృతుల రూపమున ఆ ఛాయా మందిరము (photo studio) వంటి దాని యందు స్థిరపడుతాయి అవే మరుజన్మలో సంస్కారములై గత కర్మ ఫలితములకు మార్గములౌతాయి

మెదడులోని ఈ స్టూడియో వంటి భాగమే మరణానంతరము కారణశరీరముతో (astral body) కదలి వెళ్తుంది అదే మరుజన్మలో బుద్ధిని నడిపిస్తుంది ("బుద్ధిః కర్మానుసారిణి") ఆధ్యాత్మిక యోగసాధన ద్వారా ఈ సర్వం చూడవచ్చు

ఈ సృష్టి పదార్థమయం పదార్థం పరిణామం చెందుతూ క్రియా (కర్మ) రూపమును సూచిస్తుంది అదే కర్మ సిద్ధాంతమునకు ఆధారము

'కర్మ బ్రహ్మోద్భవం విద్ధి' భగవద్గీత (3-15)

'కర్మబ్రహ్మము నుండి పుట్టినదిగా తెలుసుకొనుము' అని భగవద్గీత చెప్పుచున్నది

భగవంతుని అంగీకరించని బౌద్ధులు బుద్ధుడు గతంలో ఎత్తిన అనేక జన్మలను వివరించు జాతక కథలను నమ్ముచున్నారు గౌతమబుద్ధునిగా చివరకు పరిపూర్ణ జ్ఞానమును పొంది ప్రవక్త అగుట యదార్థము అని విశ్వసిస్తారు

మన స్థూల శరీరం పదార్థమయం పదార్థంతో తయారైన ఈ శరీరంతోనే మానవుడు కర్మములు చేస్తుంటాడు మరణంతో ఈ పదార్థ శరీరం నశిస్తుంది కాని కర్మలు నశించవు అని కర్మ సిద్ధాంతము కాబట్టి మనిషి చేయు కర్మ శరీరము నుండి పుట్టినది కాదు శరీరము ఒక పరికరము మాత్రమే మనిషి చేతలకు ఆధారం అతని మనసు మనస్సు అందరికి ఉంటుంది కాని వారి పనులు భిన్నంగా ఉండుటకు కారణం ఏమిటి? కారణం భిన్నప్రవృత్తులు (స్వభావాలు) మాత్రమే ప్రవృత్తులు ఎలా ఏర్పడతాయి? మనస్సు ద్వారానే మనస్సులోని బుద్ధి అను భాగము స్వభావమునకు మూలం మెదడు (Brain) లోని భాగమే మనస్సు (mind) ఈ మెదడులోని ఒక భాగమే మన కర్మముల స్మృతులను వ్రాసి-యుంచు (రికార్డు చేయు) కంప్యూటర్ వంటిదని లేక ఒక ఫోటో స్టూడియో వంటిది అని గ్రహించవలసి యున్నది టివిలో కాసెట్ ద్వారా చూచుటకు వీలగు సినిమా వలె ఈ

కర్మములు కారణ శరీరమును అంటిపెట్టుకొని తదుపరి జన్మలలో క్రమముగా సంస్కారరూపములో అనుభవంలోకి వస్తాయి ఈ సంస్కారములే (గత కర్మములు) మన ప్రవృత్తిని రూపొందిస్తాయి బుద్ధి రూపమే ప్రవృత్తి ప్రవృత్తి వ్యక్తరూపమే కర్మము ఈ కర్మములే తిరిగి స్మృతులుగా మారి తదుప౨ జన్మలలో సంస్కారములుగా రూపొందుతాయి ఇది ఒక నిరంతర వలయం దీని నుండి బయటపడటమే జీవన్ముక్తి

మనలోని మానసిక భావమే శరీర చేష్టగా రూపొందుతుంది మనస్సులో ఒకటి పెట్టుకుని పైకి మరొక రీతిగా మసలే వారంతా మనస్సుకు వ్యతిరేకంగా సంచరిస్తున్నారని మనం తలుస్తుంటాం కాని ఇది సరికాదు ఆ మనస్సే తన స్వరూపం ఒకటై ఉండగా పైకి మరొక రీతిగా కనబడాలని తలచడమే దీనికి కారణం దానికి అనుకూలంగానే చేష్ట బహిర్గతమవుతుంది ఈ చేష్ట పూర్తిగా మనోభావన ప్రతిబింబమే ఈ రకంగా వాక్కులోగాని శరీరచేష్టలో గాని దోషాలుగా కనబడేవన్నీ మనస్సులోని దోషాలే అవుతున్నాయి ఎంత అప్రయత్నంగా పైకి కనబడే చేష్ట అయినా ఆ చలనానికి కారణం మనస్సులో అది కలగాలనే సంకల్పం వలననే జరుగుతుందని గ్రహించాలి ఉదాహరణకు, గాలి వలన దుమ్ము రేగుతుంటే అప్రయత్నంగానే మన కనురెప్పలు మూతబడతాయి ఇక్కడ కనురెప్పలు అసంకల్పితంగా వాటంతట అవే మూతబడ్డాయని మనం తలుస్తాం కాని వాస్తవముగా, కళ్లకు హాని కలగకూడదన్న మనస్సంకల్పమే మనకు తెలియనంతగా క్షణంలో బయలుదేరి కనురెప్పల మూతకు కారణమవుతుంది ఇలా మానసిక కర్మలే శారీరక, వాచక కర్మలుగా బయటకు వస్తున్నాయి ఉత్పత్తి ఎక్కడో లయం కూడా అక్కడే అనునది శాస్త్ర సమ్మతమైన సిద్ధాంతం మట్టితో తయారైన కుండ పగిలిన తరువాత మట్టిగానే మారుతుంది

అలాగే సమస్త కర్మలు ఏ మనస్సు నుండి అయితే వచ్చాయో, ఆ

మనస్సులోనే ఆవి లయమవుతాయి ఫలితంగా అన్ని కర్మల ఫలితం మనోరంగం మీదే కనబడుతుంది కాలికి ముల్లు గుచ్చుకుంటే కన్ను ఏడుస్తుంది, కాలు ఏడవదు నిజానికి ఈ ఫలితమును అనుభవిస్తున్నది మనస్సే గాని, కాలూ కాదు, కన్నూ కాదు మనము ఏ ముఖ్య విషయం మీదనో మనసు కేంద్రీకరించి వెడుతున్నప్పుడు ముల్లు గుచ్చుకున్నా మనకు తెలియదు అప్పుడు కంటి వెంట నీరు కూడా రాదు ఎందువలననగా మనస్సు ఆ సమయంలో వేరే విషయం మీద లగ్నమై ఉన్నందున శరీరంలో ఏ భాగానికి బాధ కలిగినా మనస్సు దానిని కన్నుల ద్వారానే వ్యక్తం చేస్తుంది ఆనందం కూడా అలాగే వ్యక్తమవుతుంది కొన్ని పనులు చేతుల ద్వారా, మరికొన్ని కాళ్ల ద్వారా జరుగుతుంటాయి అన్నిటికి మనస్సే కారణం ఈ విధంగా అన్ని కర్మల ఫలితాన్ని అనుభవించేది మనస్సే

చేసిన కర్మ ఫలితాన్ని అనుభవించి తీరాలి కాబట్టి సుఖప్రాప్తికి గాని, దుఃఖనివారణకు గాని మనం ప్రయత్నించడం వ్యర్థం అని చెప్పరాదు కర్మ సిద్ధాంతంపై అవగాహన లేనివారు చేసే విమర్శ ఇది! గత కర్మ ఫలితంగా ఈ జన్మ ఏర్పడింది కాబట్టి, అది ఆ ప్రకారమే నడుస్తుంది ప్రత్యేకించి మనం చేయకలిగింది ఏమి లేదు అనటం వర్తమాన జన్మవ్యర్థం అన్నట్లు అవుతుంది ఆత్మజ్ఞాన సిద్ధి వైపుగా పరిణామ ప్రగతి సిద్ధాంతం వ్యర్థమే అవుతుంది క్రియ-ప్రతిక్రియ (action and reaction) ప్రకారం క్రియ జరిగినపుడు ప్రతిక్రియ తప్పదు ఉదాహరణకు బంతి గోడకు కొట్టినపుడు అది తిరిగి మన ముఖముపై పడుతుంది ముఖమునకు ఏదైనా అడ్డం పెట్టుకుంటే బంతి తగిలే ప్రమాదం కొంతైనా తగ్గుతుంది ప్రారబ్ధ కర్మను తప్పించుకొనుట జీవన్ముక్తునికి కూడ సాధ్యపడదు కాని ఆ కర్మానుభవము అతనికి అంటదు అతని ఆత్మజ్ఞానసిద్ధి అట్టిది ప్రారబ్ధ కర్మయే కాక, ఈ జన్మలో కూడ కర్మము చేయకుండ ఉండలేము కదా! కర్మము లేనిది జీవితము లేదు అన్నారు కదా! వర్తమాన కర్మల ద్వారా ప్రారబ్ధ కర్మ ప్రభావం తగ్గించుకొనవచ్చు ఏదైనా జబ్బు

చేస్తే అది ప్రారబ్ధకర్మ అని ఊరుకుంటున్నామా? లేదు మందులు తీసుకుంటున్నాము జబ్బు నుండి బయటపడ్తున్నాము ప్రారబ్ధ కర్మ తప్పదు కాని దాని ప్రభావం తగ్గటానికి ఈ జన్మలో కర్మ కావాలి ప్రారబ్ధ కర్మలో ఇమిడి ఉన్న సుఖదుఃఖాలు, వర్తమాన జన్మలో మనం చేయు కర్మముల ననుసరించి మార్పు చెందుతూ ఉంటాయి పురుష ప్రయత్నమే వర్తమాన కర్మ పురుష ప్రయత్నం లేకపోతే సృష్టి ఆంతర్యమే వ్యర్థమౌతుంది

ఆధునిక నాగరికత, వైజ్ఞానికాభివృద్ధి ఫలితంగా మనం మనకు భౌతిక సుఖాలను అందిస్తాయన్న భ్రమతో అనేక వస్తువులను సమకూర్చుకుంటూ మానసిక సుఖమును కోల్పోతున్నాం మానసిక ప్రశాంతి ఉన్నవాడు రోడ్డు ప్రక్కనైనా ప్రశాంతంగా నిద్రపోగలడు అది లేనివాడు ఏ సి (air conditioned) గదులలోను మెత్తని పరుపుల మీద కూడా నిద్రపోలేడు 'నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః' (శంకర భగవత్పాదులు) అంతే కాదు ఈ వస్తువులే జీవితం అని భ్రమించి ఆ వస్తువులతో తాదాత్మ్యం చెందడం వలన కూడా మనం అనర్థమునే పొందుతున్నాము ఉదాహరణకు మన చిన్ననాడు ఈ ఫ్యానులు (Fans) లేవు విసనికర్రలే ఆనాడు అందుబాటులో నున్నవి అలాగే సుఖంగా పడుకున్నాం నేడు కొద్దిసేపు కరెంటు పోయి, ఫ్యాను లేకపోతే చికాకుతో తపనపడే స్థాయికి ఎదిగాం ఈ విధంగా మనం సమకూర్చుకుంటున్న వస్తువులు మనకు దుఃఖమునే మిగులుస్తున్నాయి వీటిని ఇలా పెంచుకుంటూ పోతే మనం మనశ్శాంతిని కోల్పోయి మన ఉనికినే మనం గుర్తించలేకపోతాం అంటే నేడు నాగరికత చిహ్నాలుగా చెప్పబడుతున్న ఈ వస్తువులను సమకూర్చుకొనకూడదా? నిశ్చయంగా సమకూర్చుకొనవచ్చు దోషం ఆ వస్తువులలో లేదు వాటి మీద మనం ఏర్పరచుకొనే వ్యామోహంలోనే దోషం ఉన్నది వస్తువులను ఉపయోగించుకొనవచ్చు కాని వాటి మీద అవధులు దాటిన వ్యామోహం పనికిరాదు

మనశ్శాంతి లోపించటానికి కారణము కామం (కోరిక) క్రోధం ఇవి రెండు రజోగుణము నుండి ఉద్భవిస్తాయి రజోగుణం అంటే క్రియకు (action) ఆధారం

'కామ (కోరిక) ఏషక్రోధ ఏష రజోగుణ సముద్భవః' (3-37) భగవద్గీత ఈ రెండు ప్రవృత్తులకు ప్రతీకలు రామాయణ మహాభారతగాధలు కామవిధానమును రామాయణం చెప్పగా, క్రోధ విధానమును మహాభారతం చాటింది ముందుగా మనకు కోరిక కలుగుతుంది అది నెరవేరకపోతే క్రోధం కలుగుతుంది ఇలా అవి రెండు అవినాభావ సంబంధం కలిగి ఉంటాయి అంతేకాదు ఇవి రెండు ఒకటేనని చెప్పవచ్చు తీరని కామమే (కోరిక) క్రోధంగా పరిణమిస్తుంది అయితే మనం ఉత్తమ మానవులుగా జీవించాలంటే ఈ కామ క్రోధాలను పూర్తిగా విడిచివేయాలా? కాదు అవి మనలో ఉండటం చాల ఆవశ్యకం అసలు ఈ రెండూ లేకపోతే మనిషి మృతునితో సమానం కాని కామ, క్రోధాలు ఉండటం ఎంత అవసరమో వాటిని సరైన మార్గములో నడిపించటం అంతే అవసరం తొలగించవలసినది కామక్రోధాలు కాదు స్వార్థమును తొలగించాలి నిస్వార్థతతో కూడిన కామక్రోధాలు దోషము కావు పిల్లలు పొరపాటు చేస్తే తలిదండ్రులకు కోపం వస్తుంది ఇక్కడ స్వార్థం ఉండదు నిస్వార్థంగా ఏదైనా కోరితే అది సమాజ శ్రేయస్సుకే ఉపయోగ పడుతుంది అందువలన కామక్రోధములను కలిగి ఉండటం దోషం కాదు అవి సన్మార్గంలో క్రమబద్ధంగా ఉండకపోవడం దోషం కామక్రోధములను సమన్వయంతో నిగ్రహంతో పాటిస్తే "తరతి శోకం" అని చెప్పారు మహర్షులు

కర్మములు చేయుట అంటే కర్మకాండలు చేయుట అని భ్రాంతిలో పడతారు చాలమంది కర్మయోగములో చెప్పబడిన కర్మ అనగా కర్మకాండలు కాదు కర్మకాండలు సకామకర్మలు అనగా కోరికలతో కూడినవి ఈ కోరికలలో స్వార్థం ఉంటుంది కర్మకాండలను మాత్రమే ఆశ్రయించినచో

ఇహపరలోక సుఖములు కొన్ని కలుగవచ్చు కాని వాటి వలన అహంభావము (ego) పెరిగి మనిషి శాశ్వతసుఖమునకు దూరమవుతాడు కర్మకాండల వలన కలుగు సుఖములు దుఃఖమిశ్రితాలు, అల్పకాలికములు అని తెలుసుకొనుటకు కొన్ని జన్మల కాలం పట్టును అపుడు గాని ఇవి కొండను తవ్వి ఎలుకను పట్టినట్లుగా ఉన్నది, ప్రయత్నమునకు తగిన ఫలితము లభించకపోవటం గుర్తించలేడు ఈ సకామకర్మల అంతిమ పరిణామం జనన, మరణ ప్రవాహ రూపమైన సంసారంలో మునగడమేనని గ్రహిస్తాడు అపుడే నివృత్తి ధర్మము అనగా ఏమిటో తెలుసుకునే ప్రయత్నం చేస్తాడు నిష్కామ బుద్ధితో కర్మములను నెరవేర్చుటయే నివృత్తి ధర్మము ఈశ్వరార్పణ (self-surrender) బుద్ధితో చేయునదే నిష్కామకర్మ విధ్యుక్తమైన కర్మములను నిస్వార్థముగా నిర్వర్తించటమే కర్మయోగము ఇది క్రమానుగతంగా మానవునిలో కలుగు పరిణామము

ఇది వీధికొక ఆధ్యాత్మిక శిక్షణా కేంద్రముల వలనను, భౌతిక యోగాభ్యాస వ్యాయామ కేంద్రముల వలనను వచ్చేది కాదు ఫలాసక్తి లేకుండా ఎపుడైతే కర్మములను ఆత్మార్పణ బుద్ధితో నిర్వర్తించడం ప్రారంభించెదమో అపుడు మనస్సు నిశ్చలము, ప్రశాంతము అవుతుంది ఫలాపేక్ష ఉన్నంత వరకే మనస్సుకు ఆందోళన, బెంగ ఫలితం ఎపుడు వస్తుందో, ఎంత వస్తుందో, ఏ విధంగా వస్తుందో అని పరిపరి విధాల ఆలోచిస్తూ మనస్సు నిరంతరం ఊగిసలాడుతూ ఉంటుంది అట్టి మనస్సుకు సుఖముగాని, శాంతిగాని ఉండదు ఈ భావమే భగవద్గీతలో చెప్పబడింది 2వ అధ్యాయము - 42, 43, 44 శ్లోకములు

వేదభాషయందు ఆసక్తి కలవారును, అందు చెప్పబడిన స్వర్గాది భోగముల కంటే మించినది లేదని వాదించువారును, విషయ వాంఛలతో నిండిన చిత్తము కలవారును, స్వర్గాభిలాషులునగు అవివేకుల యొక్క అలంకార ప్రాయములైన మాటలను విని బుద్ధి స్వాధీనతను గోల్పోవు వారలకును,

భోగైశ్వర్య వ్యామోహితులకును స్థిరచిత్తము కలుగదు వారియొక్క పుష్పాలంకార ప్రాయమైన మాటలు భోగైశ్వర్యములను పొందుట కోసమై కామిత కర్మ విశేషములు నిండియున్నవిగను క్రొత్త పుట్టుకలు కలిగించునట్టివిగను ఉండును ఈ సందర్భములో శ్రీరామకృష్ణ పరమహంస ఉపదేశము యుక్తియుక్తము

"రాబందు ఆకాశమున మిక్కిలి ఎత్తులో ఎగురుచున్నది కాని క్రింద భూమిపై క్రుళ్లిన శవము ఎచట ఉన్నదో యని అది వెదకుచుండును అదే విధముగ వేదశాస్త్రములు ఎంత నేర్చియున్నను, మనస్సు కోరికలతో నిండి యున్నంతవరకు అట్టివారు రాబందులను పోలినవారే కోరికలు, పేరాశయు మనస్సున నిండియున్నంత వరకు అట్టివారు ఈశ్వరప్రాప్తిని పొందజాలరు" - శ్రీ రామకృష్ణ పరమహంస

పరిపూర్ణానందము పొందుటయే జీవిత లక్ష్యము కావలెను దానికై జ్ఞానమందు, యోగమందు నిశ్చయము కలిగిన చిత్తము కావలయును వేదములు బోధించెడి కర్మకాండ అనుష్ఠానము వలన ఎన్నటికి స్థిరచిత్తము కలుగదు

భగవద్గీత 2వ అధ్యాయము, 47, 48 శ్లోకములలో చెప్పినది ఇచట గ్రహించవలసియున్నది "కర్మములను ఆచరించుట యందే మానవునకు అధికారము గలదు వాటి ఫలితములపై అతనికి అధికారము లేదు మానవుడు కర్మఫలములకు కారణము కారాదు అట్లని కర్మములు చేయుట మానరాదు మనిషి యోగనిమగ్నుడై, నిరాసక్తి కలిగినవాడై జయాపజయముల యందు అనురక్తి లేనివాడై సమదృష్టి కలిగి కర్మము చేయవలయును అట్టి సమత్వబుద్ధియే యోగమనబడును ఈ యోగం కర్మాచరణ యందలి నైపుణ్యం ద్వారానే సిద్ధిస్తుంది కర్మఫలాపేక్షను అనగా ఆసక్తిని వదలడమే ఈ నైపుణ్యం ఈ సమత్వ బుద్ధియే సమాధినిష్ఠ అదే నైష్కర్మ్యసిద్ధి ఈ నిష్ఠలో చేయబడిన కర్మలు బంధహేతువులు కాదు ఏ పనైనా "నేనే" చేస్తున్నాను, 'నా'

వల్లనే జరుగుతోంది అను అహంకారం కర్తృత్వాభిమానం 'నేను' చేసిన ఈ పని యొక్క ఫలితమును 'నేనే' అను కోరిక భోక్తృత్వాభిమానం ఈ అభిమానాలను వదలి కర్మములు చేయడమే నైష్కర్మ్యసిద్ధి

మనము చేయు పనిని 'కర్మ' అంటారు ఈ పనికి మన ఇంద్రియములే పరికరములు అవి ప్రధానంగా మూడు శరీరము, నోరు, మనస్సు వీటినే కాయిక, వాచిక, మానసిక కర్మలంటారు కాలు, చేయి, ముక్కు, కన్ను మొదలైన శరీరావయవములతో చేయు పనులన్నీ కాయికములు నోటితో పలుకునవి వాచికములు, మనస్సుతో ఆలోచించే భావాలు, అనుభవించే భావవికారాలు మొదలైనవి మానసిక కర్మలు ఈ కర్మల సమిష్టి రూపమే మానవ జీవితము మన ఆలోచనలు, మాటలు, చేష్టలు కాక జీవితమనేది వేరే ఏదీలేదు అందువలన జీవితమంటేనే కర్మ కర్మలేని బ్రతుకే లేదు ఈ విషయమే భగవద్గీత స్పష్టం చేసింది

శ్లో॥ నియతంకురుకర్మత్వం కర్మజ్యాయోహ్య కర్మణః ।
శరీర యాత్రాపి చ తేన ప్రసిద్ధ్యేద కర్మణః ॥ (3-8)

శాస్త్రములచే నియమించబడినట్టి నిత్యకర్మములను చేయవలయును కర్మము చేయకుండుట కంటెను చేయుటయే శ్రేష్ఠము కర్మములు చేయకపోవుట వలన దైనందిన జీవయాత్రయు చక్కగా నడవదు

భుజించుట, నిద్రించుట, స్నానము చేయుట మొదలగునవి నిత్యకర్మము లనబడును ఆరోగ్యకరమైన జీవితమునకు ఈ నిత్యకర్మలు తప్పని సరియైనవి ఇట్టి నిత్యకర్మలను చేయుటచే ఎట్టి పుణ్యము దొరకక పోవచ్చును కాని, వాటిని చేయకున్నచో తప్పక నష్టము వాటిల్లును ఉదాహరణకు, ఆహారము తినుట వలన ప్రత్యేకమైన పుణ్యమేమియును లేదు కాని పస్తుండుట వలన ఆరోగ్యభంగమను పాపము కలుగును

మన దేహములన్ని ప్రకృతి వికారములు ప్రకృతి అంటే కదలిక, మార్పు, సంచలనం దీనినే వ్యాపారమని అంటారు వ్యాపారము అంటే పని (క్రియ) దేహధారులెవ్వరు నిర్వ్యాపారిగా ఉండజాలరు ఇదే భగవద్గీత చెప్పింది

శ్లో॥ నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మసర్వః ప్రకృతిజైర్గుణైః ॥ (3-5)

కర్మ చేయక ఎవ్వడును క్షణకాలమైనను ఉండజాలడు ఏలనన ప్రకృతి వలన పుట్టిన సత్త్వరజస్తమో గుణములు అతనిచే కర్మ చేయింపక విడువవు ఈ ప్రకృతి సత్త్వ, రజస్తమో గుణములతో కూడియున్నది అది కర్మ స్వరూపము కావున ప్రకృతిచే కట్టుబడినవాడు కర్మములను చేసియే తీరవలయును తినుట, శ్వాసించుట, నిద్రించుట, హృదయము స్పందించుట అన్నియు కర్మములే ఈ ప్రకృతిలో స్పందనము లేనిది ఏదియు లేదు అణువు మొదలు అండము వరకు అన్నియు మార్పు చెందునవిగనే యున్నవి కావున ప్రకృతి యందు బంధింపబడియున్న ప్రాణులకు కర్మమును వదలివేయు స్వతంత్రము లేదు

"వైద్యశాలయందు చికిత్స కొరకు చేరియున్న రోగి, అతని రోగము తీరునంత వరకు ఆ వైద్యశాల యందే ఉండవలయును తీరకముందే వదలి వెళ్ళుటకు అనుమతి ఉండదు అతని వ్యాధి నయమైన తరువాత అతనికి ఆ వైద్యశాల యందు పనిలేదు అట్లే అజ్ఞానమను రోగముచే పీడింపబడువారు ప్రకృతి యనెడి వైద్యశాల యందు యుండియే తీరవలెను అపుడు కర్మము చేయుట అనెడి చికిత్సకు వారు లోబడియే ఉండవలయును - శ్రీ రామకృష్ణ పరమహంస ఉపదేశము

ఏ ప్రాణీ ఒక్క నిమిషం కూడా నిర్వ్యాపారంగా ఉండజాలదు ఎందువలననగా ప్రకృతి గుణముల వలన వలదనినను అవశ్యం ప్రతి ప్రాణి

కర్మములను ఆచరిస్తూనే ఉంటుంది అని బోధించింది గదా భగవద్గీత ఇది ప్రకృతి నియమం దీనిని ఉల్లంఘించటం ప్రకృతి బద్ధులైన సమస్త ప్రాణులకు సాధ్యం కాదు పరమేశ్వరుడు (పరమాత్మ) ఒక్కడే ప్రకృతికి అతీతుడు కనుక ఆయన మాత్రమే నిష్క్రియుడు తక్కిన వారికి నిష్క్రియత్వం లేదు వారికి సాధ్యమయ్యేది నైష్కర్మ్యసిద్ధి మాత్రమే అనగా కర్మములు చేసినప్పటికి వాటిని ఈశ్వరార్పితం చేసి కర్మబంధములో చిక్కుకొనకుండా ఉండడం మాత్రమే అనేక దృక్పథాలతో మనం చేసే కర్మలను పలురకాలుగా విభజించారు సాధనమును బట్టి కాయిక, వాచిక, మానసిక విభాగములు ఇంతకు ముందే చెప్పబడింది గదా! మరల వాటిని లౌకిక, వైదిక కర్మలుగా రెండు విధములుగా విభజించారు లౌకిక కర్మములనగా నిత్యజీవితంలో మన జీవనం కొరకు చేసే వృత్తి వ్యాపారాలన్నీ వైదిక కర్మలు మానవుని ఆధ్యాత్మికోన్నతికి ఏర్పాటు చేయబడిన ధర్మబద్ధ, సంప్రదాయబద్ధ కర్మలు

ఒక ఫలితమును ఆశించి చేయు కర్మలన్నియు సకామకర్మలు అనగా కోరికతో కూడినవి ఫలితమును కోరకుండా విధిగా చేయు కర్మలన్నీ నిష్కామకర్మలుగా పిలువబడుతాయి మన చేసే వృత్తి వ్యాపారాలన్నీ సకామకర్మలే అదే విధముగా ప్రత్యేక ఫలితమును ఆశించి చేసే లౌకిక, వైదిక కర్మలన్నియు కూడ సకామకర్మలే వర్షాలు కురవకపోతే యజ్ఞయాగాలు చేయడటం, విరాటపర్వపారాయణ, పుత్రకామేష్టి, ఇతర పూజాపునస్కారములు అన్నియు సత్కర్మలే అయినప్పటికీ అవి అన్నియు కామ్యకర్మలే అనగా కోరికలతో కూడిన కర్మలు నిత్య, నైమిత్తిక కర్మలు అని మరొక విభజన కూడా ఉన్నది ప్రతిరోజు మనము చేయు స్నానసంధ్యావందనాదులు, అన్నపానాదులు నిత్యకర్మలు - గ్రహణ, పుష్కర సమయములలో చేయు ప్రత్యేక కర్మలు నైమిత్తిక కర్మలు నైమిత్తిక అనగా ఒక నిమిత్తము లేక ఒక ప్రత్యేక కారణమునకై చేయు పనులు

ప్రకృతి గుణములననుసరించి ఈ కర్మలన్నియు సాత్త్విక, రాజస, తామసములు అని మూడు విధములుగా విభజించారు వీటిని గురించి భగవద్గీతలో విస్తారంగా చర్చించబడింది కర్మములు చేయునపుడు కర్తృత్వ (నేను చేయుచున్నాను) భోక్తృత్వ (నాకు ఫలితము కావాలి) భావములున్నంత వరకు అవి ఫలాపేక్షతో కూడిన కర్మలే అవుతాయి నియమబద్ధంగా కర్తృత్వ, భోక్తృత్వ అభిమానరహితంగా రాగద్వేషాలకు లోనుగాకుండ ధర్మాన్ని అనుసరించి చేసే పనులు సాత్త్విక కర్మలు కర్మఫలాన్ని అపేక్షించి కర్తృత్వాభిమానంతో, బహుకష్టంతో చేసే పనులు రాజసకర్మలు పురుషప్రయత్నానికి సాధ్యమవుతుందా కాదా అనే విచక్షణ లేకుండా, దీని వలన తనకు గాని, ఇతరులకు గాని వినాశనం తటస్థిస్తుందేమోనన్న ఆలోచనాజ్ఞానం లేకుండా చేసే పని తామసం సాత్త్విక కర్మలు చేసేవాడు అహంకార, మమకార వర్జితుడై తాను చేసే పనికి ఫలితం సిద్ధించకపోయినా నిర్వికారుడై ధైర్యోత్సాహాలను విడిచిపెట్టకుండా, పట్టుదలతో కార్యసిద్ధి అయేంత వరకు తన యత్నాన్ని కొనసాగిస్తూనే ఉంటాడు తాను ఎక్కడ పొరబడ్డాడో తెలుసుకుని తిరిగి పొరపాటు జరగకుండా కృషి చేసి, కార్యసిద్ధిని పొందాలి అను పూర్ణ విశ్వాసంతో అతడు కార్యాచరణకు పూనుకుంటాడు అతడే కర్మయోగి

శ్లో॥ యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవభజామ్యహం ।
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః ॥ (భగవద్గీత (4-11)

"ఎవరెవరు ఏయే విధములుగా నన్ను తెలియగోరుచున్నారో వారిని ఆయా విధములుగా నేను అనుగ్రహించుచున్నాను కావున పార్థా! మానవులు ఎల్లపుడు నన్ను అనుసరించుచునే యున్నారు" అని భగవానుడు చెప్పాడు గీతాచార్యుడైన శ్రీకృష్ణుని వలెనే భగవద్గీత కూడ తనను ఎవరు ఏ దృక్పథంతో ఆశ్రయిస్తారో వారికి ఆ విధంగానే అర్థమవుతూ వస్తోంది అందువలననే గీతలో ప్రధానంగా ప్రతిపాదింపబడిన విషయము జ్ఞానయోగమని కొందరు,

కర్మయోగమని ఇంకొందరు, భక్తియోగమని మరికొందరు - ఇలా పలువురు పలువిధాలుగా నిరూపించారు ఇప్పటికీ నిరూపిస్తూనే ఉన్నారు ఇలా అన్ని వ్యాఖ్యానాలకి అవకాశమిస్తోంది భగవద్గీత అయితే వీటిలో ఏదో ఒక్కటే ప్రధాన ప్రతిపాద్య విషయముగా ఉండి, తక్కినవి దానికి ఉపకారకములై అధికార భేదాన్ని అనుసరించి ప్రతిపాదింపబడి ఉంటాయని మనం అంగీకరించాలి అన్నిటికి సమ ప్రాధాన్యమని చెప్పటం కుదరదు అందువలననే శంకర భగవత్పాదులు సర్వ ఉపనిషత్సారభూతమైన ఈ గీతాశాస్త్రం మోక్ష మార్గమును బోధించు శాస్త్రమని, ఈ మోక్షమునకు సర్వకర్మ సన్యాస పూర్వకమైన ఆత్మజ్ఞానమే ఏకైక సాధనమని అనేక ప్రమాణాల యుక్తి ద్వారా తమ గీతా భాష్యంలో నిరూపించారు

అయితే గీతలో ప్రతిపాదింపబడిన ప్రధాన విషయం కర్మయోగమే అని వాదించేవారు శంకరులకు ముందే అనేకులు ఉండేవారు తరువాత కూడా బాలగంగాధర తిలక్ వంటి పండితులు ఈ మార్గమును అనుసరించి గీతలో కర్మయోగ ప్రాధాన్యమును నిరూపించడానికి ఉద్యమించారు శంకరులకు ముందున్న కర్మవాదుల దృష్టిలో కర్మ అంటే వైదిక, స్మార్త కర్తలు తిలక్ మొదలైన అర్వాచీన (ఆధునిక) కర్మవాదుల దృష్టిలో కర్మ అంటే శత్రువులపై విజయము, స్వరాజ్య స్థాపన మొదలైనవి క్షత్రియధర్మమైన యుద్ధమును చేయడానికి ఉద్యుక్తుడై, తాత్కాలిక విషాదమును పొంది స్వధర్మాచరణకు వెనకాడుతున్న సమయంలో అర్జునుని ఉద్దేశించి చేయబడిన భగవదుపదేశమే భగవద్గీత భగవద్గీత అర్జునుని కర్మాచరణకు పురిగొల్పుతున్నది కాబట్టి కర్మయోగమే గీతలోని ప్రధాన ప్రతిపాద్య విషయమని వీరి వాదం

గీత ఉపనిషత్సారము అందువలన గీతలో ప్రతిపాదించబడిన యోగములలో దేనికి ప్రాధాన్యమీయాలి అను ప్రశ్నకు సమాధానముగా ఉపనిషత్తులచే ప్రతిపాదితమైన అర్థమును సమన్వయపరచుకొని గీతా

తాత్పర్యమును నిర్ణయించుట ఉత్తమము ఈ విధముగా నిర్ణయించిన వారు శంకర భగవత్పాదులు ఈ నిర్ణయముననుసరించి జ్ఞానయోగం వలెనే, కర్మ, భక్తి యోగాలు కూడా మోక్ష సాధనాలే ఇక్కడ ఉన్న భేదము గ్రహించాలి జ్ఞానమనేది సాక్షాత్సాధన (Direct) కర్మ మొదలైనవి క్రమసాధనాలు అనగా చిత్తశుద్ధి మొదలైన వాటి ద్వారా కర్మాదులు జ్ఞానోత్పత్తికి ఉపకరించి మోక్షమునకు పరంపరా సాధనాలు అవుతున్నాయి కర్మాదులు సాక్షాత్సాధనలు కానేరవు ఎందుకనగా కర్మ, భక్తిమార్గములలో కార్యము, కారణము, కర్త మొదలైనవి ప్రాధాన్యం వహిస్తాయి అద్వైత ఆత్మజ్ఞానంచే ఈ భేదత్వం నశిస్తుంది కాని అపుడు మరల కర్మ ఆచరణకు అవసరము, అవకాశము ఉండదు కదా అను వాదన వస్తుంది జ్ఞానమే ప్రధానమైనపుడు కర్మలు చేయకపోవడం వలన వచ్చు నష్టమేమిటి అని భావించి అందరు కర్మవిముఖులవుతారు తమకు ఆత్మజ్ఞానమెంత ఉంది? అసలు ఆత్మజ్ఞానమునకు వలసిన అర్హతైనా తమకు ఉన్నదా అను ఆలోచన కూడా లేని శుష్క వేదాంతులనెంతమందినో మనమీనాడు సమాజంలో చూస్తున్నాం అందుకే పరమాత్మ గీతలో అనేక చోట్ల కర్మ ప్రాధాన్యమును స్పష్టముగా చెప్పారు శంకరభగవత్పాదులు కూడా జ్ఞానం కలిగే చివరి క్షణం`వరకు కర్మలు చేయవలసినదే అని నిర్ణయించారు కర్మ, భక్తియోగాలు క్రమసాధనములు

కర్మఫలితములు వ్యక్తిగతంగాను, లేక సామూహికంగాను కూడా ఉంటాయి ఒక వ్యక్తిగా మనిషి చేసే ప్రతి పని, ప్రతి తలపు, వాటి మంచి, చెడుల ఫలితాలు వ్యక్తిగా అతనికే తగులుతాయి ఇది వ్యక్తిగత కర్మ అని అనవచ్చును ఇక ఒక కుటుంబంలోనో, ఒక జాతిలోనో, లేక ఒక దేశంలోనో అందరికి సామూహికంగా ఒకేసారి వచ్చు కష్ట, సుఖాలు సామూహిక కర్మఫలితాలు ఒక కుటుంబంలోని వారు అందరు కలిసి ఇతరులకు కలిగించిన కష్ట సుఖముల ఫలితములు వారందరు కలిసి ఒకేసారి అనుభవించవలసి వస్తుంది

అలాగే ఒక కులం వారు, ఒక మతం వారు సామూహికంగా మరొక కులం వారిని లేక మతం వారిని బాధించటం జరిగినపుడు దాని ఫలితం వారందరు కలిసి ఒకే సమయంలో అనుభవించవలసి ఉంటుంది అలాగే ఒక దేశ ప్రజలు వారి సామూహిక కర్మఫలితాలు వారు సామూహికంగానే అనుభవించవలసి ఉంటుంది

మనం చేయు కర్మలలో కొన్ని బుద్ధిపూర్వకంగా తెలిసి నిశ్చితంగా చేయునవి కొన్ని సంకల్పం లేకుండా పొరపాటుగానో, తెలియకనో చేయు కర్మలు మరికొన్ని తెలిసీ తెలియక చేయు పనులు తెలిసి కావలయునని చేయు కర్మల ఫలితములు చాల నిశ్చితముగాను, నివారణ లేనివిగాను ఉంటాయి తెలియకనో, పొరపాటునో చేసిన కర్మ ఫలితములు తాత్కాలికంగానే ఉంటాయి ఇక మరికొన్ని కొంత తెలిసి మరికొంత తెలియక చేసిన చెడు, మంచి ..నుల ఫలితములు కూడ అలాగే ఉంటాయి ఒక పనిలోనే తెలియక ఇమిడిఉన్న మంచి, చెడుల ఫలితాలు కూడా మంచికి మంచి ఫలితాలు కొంత శాతం, చెడు పనులకు చెడు ఫలితాలు మరికొంత శాతం మనిషికి చేరుతాయి

వర్తమాన జన్మలోనే యోగసాధన ద్వారా మన కర్మ ఫలితములను మనమే జయించవచ్చు, నిరోధించవచ్చు అనగా మన కర్మ ఫలితమును మనమే జయించవచ్చును లేదా అనుభవించవలసియున్నది కర్మ సిద్ధాంతమును అర్థం చేసుకుని విచక్షణతోను, వివేకంతోను, జీవిస్తూ గతంలో జరిగిన తప్పులు లేక చెడు పనులు మరల చేయకుండా సరిదిద్దుకుంటూ, నిశ్చలబుద్ధితో, నిస్వార్థ బుద్ధితో జీవితయానం సాగిస్తూ, యోగసాధనతో గత కర్మల చెడు ఫలితముల నుండి ముక్తి పొందవచ్చును లేనిచో కర్మ ఫలితము అనుభవించక తప్పదు

కర్మ యొక్క ఫలితం ఎప్పుడు వస్తుంది అనేది నిరంతరం తొలిచే ప్రశ్న ఒక బంతిని ఎంత వేగంతో గోడకి వేసి కొడతామో తిరిగి అంతే వేగంతో

బంతి వెనక్కి వస్తుంది  అలాగే మనము చేయు కర్మల పరిమాణమును బట్టి ఫలితము త్వరగానో, ఆలస్యముగానో వస్తుంది  ఇక కర్మ యొక్క గుణము లేక స్వభావమును బట్టి అది మంచి లేక చెడు ఫలితమును ఇవ్వటం జరుగుతుంది  ఇక మరొక ప్రశ్న  ఈ జన్మలో మనం చేయు కర్మల ఫలితాలు భవిష్య జన్మలలోనేనా, లేక ఈ జన్మలో కూడా వస్తాయా?  ఈ జన్మలో చేసిన కర్మ ఫలితం ఈ జన్మలోనే కనబడవచ్చు  కర్మసూత్రమును జాగ్రత్తగా పరిశీలించినచో ఇది బోధపడును  మనం చేయు మంచిపని ఫలితం ఎంతమందికి అందినది, అది మనం ఎంత నిస్వార్థతతో చేసియున్నాము అను విషయము మీద ఫలితం ఎపుడు వచ్చేది ఆధారపడుతుంది  'పది మందికి సుఖం, ఆనందం కలిగించే పని ఎంత నిస్వార్థతో కూడి ఉన్నదో అంత త్వరగా మంచి ఫలితం' ఇస్తుంది

పుణ్యం-పాపం అను ప్రత్యేకమైన నామములతో ఏ పనులు ఉండవు మన పనుల ద్వారా ఇతరులకు సుఖం, ఆనందం కలిగించటం పుణ్యం అలాగే దుఃఖమును, కష్టమును కలిగించేవి పాపం  నిస్వార్థత మంచిపనుల స్వభావమునకు ఉదాత్తత కలుగజేస్తుంది  ప్రతి పనికి ఫలితం దానికి తగినట్టుగానే ఉంటుంది  మనము చేయు దానధర్మముల ననుసరించి ఫలితం ఉంటుంది  ఐహిక పుణ్యకర్మముల ఫలితములు ఐహిక సుఖమునే కలుగజేస్తాయి  దానము (అన్నదానము, విద్యాదానము మొదలైనవి), దానము కంటే తపస్సు మిన్న, తపస్సు కంటే, అన్నిటి కంటే మిన్నయైనది స్వార్థత్యాగము - ఇవే మన కర్మల స్వభావమును ప్రభావితం చేస్తాయి  స్వార్థత్యాగం అనగా ఫలితం ఆశించకుండా పనిచేయడం

విత్తనాలు వెయ్యగానే పంట చేతికి రాదు గదా!  మొలకలు ఎత్తాలి, కలుపు మొక్కల్ని తీసివేయాలి, మంచి ఎరువు వేయాలి, క్రిములను నివారించాలి, అపుడు గాని పంట చేతికిరాదు గదా!  అలాగే ఒక మంచి కర్మ యొక్క ఫలితం

రావడానికి కొంత సమయం పడ్తుంది

ఈ సమాజంలో అన్యాయాలు, అక్రమాలు, చేయు దుర్మార్గులు అనేక మంది ఉన్నారు వారందరు ఆ దుష్కర్మల ఫలితములను అనుభవించుట లేదు గదా! అంతేగాక అధికార, ధనదర్పములతో వారు సుఖంగానే ఉన్నారు గదా! మరి కర్మ సిద్ధాంతం అబద్ధమా? హ్రస్వదృష్టితో చూచినచో అలాగే అనిపిస్తుంది కాని సునిశితంగా కర్మ సిద్ధాంతమును అర్థం చేసుకుంటే పై ప్రశ్నకు సరైన సమాధానం దొరుకుతుంది ఒక వ్యక్తి గతంలో చేసిన సత్కర్మల వలన సత్ఫలితమును ఇపుడు అనుభవిస్తున్నాడు సత్ఫలితము పరిమాణము (quantity) పూర్తి అయేదాకా ఆ సత్ఫలితము పొందుతూనే ఉంటాడు అలాగని ఇపుడు చేయు దుష్కర్మల ఫలితాలు వృధాకావు తప్పక అనుభవిస్తాడు సత్కర్మల ఫలిత ప్రభావం తగ్గగానే దుష్కర్మల ఫలిత ప్రభావం అనుభవంలోకి వస్తుంది అందువలన సత్కర్మలను మొదలుపెట్టిన తరువాత మధ్యలో వదలిపెట్టకుండా, నిష్ఠతో, సహృదయంతో పూర్తిచేస్తే ఫలితం తప్పకుండా కలుగుతుంది సత్కర్మ, దుష్కర్మలలో ఏది ఎక్కువగా చేయబడిందో ప్రారబ్ధ కర్మలో దాని ఫలితం ఆలస్యంగా వస్తుంది అని కర్మ సిద్ధాంతం తక్కువ పరిమాణంలో చేయబడిన కర్మఫలము త్వరగా వస్తుంది ప్రారబ్ధ కర్మను వర్తమాన కర్మల ద్వారా నిరోధించగలగటమే ఈ జన్మలోని కర్మను ఈ జన్మలో అనుభవించటం ఈ జన్మలోనే అనుభవించుటకు వీలుకానంత కర్మఫలమున్నచో అది తదుపరి జన్మలకు వ్యాపించును మంచిగాని, చెడుగాని కర్మల ఫలము అత్యుత్కటమైనపుడు అనగా మిక్కిలి తీవ్రమైనపుడు కొంత ఫలితమైనా ఈ జన్మలోనే అనుభవములోనికి వస్తుందని కర్మసిద్ధాంతంలోని ప్రధానాంశము

యోగసిద్ధాంతం ప్రకారం మాన శరీరంలోని నాడీ చక్రాలయందు (ఏడు చక్రాలు అని చెప్పబడింది) కర్మ ఫలితం, చెడుగాని, మంచిగాని,

నిక్షిప్తమై వుంటుంది సౌరకుటుంబములోని ఏడు గ్రహాలకు ఈ నాడీ చక్రములకు సంబంధము ఉన్నదని చెప్పబడింది కర్మఫలితముల స్వభావమును బట్టి ఆయా చక్రములలో అవి నిక్షిప్తమై ఉంటాయి జనన కాలమును బట్టి వ్రాయబడిన జాతక చక్రములో గ్రహముల స్థానములు సూచించబడుతాయి ఆయా స్థానములలోని గ్రహములు ఆయా నాడులలో నిక్షిప్తమైయున్న ప్రారబ్ధకర్మ ఫలితములను సూచించును అనగా ఆ గ్రహములు తమ సమయం వచ్చినపుడు నాడీ చక్రముల ద్వారా కర్మను అనుభవింప చేస్తాయి అందువలననే ఒక రాశిలోనున్న గ్రహము అందరికి ఒకే రకమైన ఫలితమును సూచింపదు గ్రహము ఆయారాసులలో నున్నపుడు ఆ గ్రహ కిరణములు ఆ జాతకుని మీద పడును (Electro magnetic rays) నాడీచక్రములలో నిక్షిప్తమై యున్న కర్మలు మనిషి, మనిషికి భిన్నముగా నుండును గదా! అందువలననే ఆ గ్రహము ఒకటే అయినను భిన్న వ్యక్తులకు భిన్న ఫలితములు సూచించును ఈ విధంగా గ్రహం ఒకటే అయినా అందరికి ఫలితము ఒకే విధముగా ఉండదు కర్మ ఫలితమును సూచించునదే జాతక చక్రము అంతేగాని గ్రహాలు వాటంతట అవి మంచిగాని చెడుగాని చేయవు గ్రహాలు మంచి చేస్తాయి, చెడు చేస్తాయి అనుకుంటే అది భ్రమ మాత్రమే మన కర్మలే మనకు తిరిగి ప్రతిఫలాన్నిస్తాయి ఆ ప్రతిఫలం ఎట్టిది, ఎపుడు వస్తుంది అని తెలిపేదే జాతకచక్రము, జ్యోతిషశాస్త్రము

కాలప్రమాణములో 'నిన్న', 'ఈ రోజు', 'రేపు' అనగా 'గతము', 'వర్తమానము', 'భవిష్యత్తు' వలెనే కర్మలు 'సంచితము', 'ప్రారబ్ధము', 'ఆగామి' అను మూడు రకములు 'సంచితము' అనగా గతజన్మలలో చేసిన కర్మ వర్తమానంలో మనం చేయు కర్మ భవిష్యత్తులో సంచితకర్మ అవుతుంది ఇపుడు అనుభవములో నున్నది ప్రారబ్ధకర్మ ఇది విల్లు నుండి విడువడిన బాణము వంటిది దానిని నిరోధించటం అసాధ్యం జీవన్ముక్తుడైనను దానిని అనుభవించవలసినదే ప్రారబ్ధకర్మ పూర్తి కావటమే కర్మ పరిపక్వత అంటారు

ఈ జన్మలో మనం అత్యున్నతమైన, నిస్వార్థమైన సత్కర్మల ద్వారా ప్రారబ్ధకర్మ ప్రభావమును తగ్గించవచ్చు

మరణం తరువాత శరీరం నుండి కారణం శరీరం ద్వారా ఆత్మ బయటకు పోవటం ఫోటో తీయగలిగారని సైన్సు పరిశోధనలు తెలుపుతున్నాయి ఈ కారణశరీరం పంచభూతముల అణువులతో ఏర్పడినది కాదు ఇది ఒక తేజస్సు లేక విద్యుత్తు వంటి ఆకారమువలె అయస్కాంత పరిధి లేక క్షేత్రముతో (Magnetic field) ఉంటుంది అన్నారు ఒక అయస్కాంతము ఇనుమును ఆకర్షించినపుడు జరుగు ప్రక్రియ ఏమిటి? ఆకర్షణ ప్రక్రియ కంటికి కనబడుతుంది కాని అయస్కాంతము చుట్టు ఉండు అయస్కాంత క్షేత్రం ఒక విద్యుత్తులాగ అయస్కాంతం చుట్టు వ్యాపించి ఉంటుంది కారణశరీరం కూడ (astral body) జీవాత్మ చుట్టు ఒక విద్యుత్ అయస్కాంత క్షేత్రం' వలె (Electromagnetic field) వ్యాపించి ఉంటుంది స్థూల శరీరమును వదలి పోవుచున్న కారణశరీరముచే ఆవరించబడి యున్న జీవాత్మ ఫోటోలో ఇది గుర్తించబడినదని శాస్త్రజ్ఞులు అంటున్నారు (Scientists) జీవాత్మను ఆవరించి యున్న కారణ శరీరము అనబడు విద్యుత్ అయస్కాంత వలయము లేక క్షేత్రము సూక్ష్మమైన ప్రకంపనలతో (Vibrations) కూడి ఉంటుందన్నారు ఈ ప్రకంపనలలోనే - అదే కారణ శరీరముతో కూడియున్నదనబడు మనసులో (Mind) - గతించిన జన్మలోని కర్మల ఫలితములు నిక్షిప్తమై తదుపరి జన్మకు అందచేస్తాయి యోగశాస్త్రజ్ఞులైన ప్రాచీన ఋషులు ఈ సూక్ష్మమైన కారణ శరీరములో 'నాడీచక్రాలు', 'కుండలిని', 'సహస్రారం', మొదలైనవి ఉంటాయి అన్నారు ఈ చక్రములలోనే వివిధ కర్మల ఫలితములు నిక్షిప్తమై కారణ శరీరము మరొక స్థూల శరీరములో చేరి, పునర్జన్మ పొందినపుడు, ఆ జన్మలో ప్రారబ్ధకర్మమునకు ఆధారమవుతాయి మనిషి పుట్టిన క్షణంలో సౌర కుటుంబంలోని గ్రహముల స్థితిని, నక్షత్రముల స్థితిని జాతకచక్రములో చూపించి దాని ద్వారా ఆ మనిషి భవిష్యత్తు చెప్తారు భవిష్యత్తు అనగా అపుడు

ఆ శరీరంలో ప్రవేశించిన నాడీచక్రములలో నిక్షిప్తమై యున్న గతజన్మల కర్మ ఫలితములను సూచించటమే గ్రహస్థితిని బట్టి, గ్రహదశలను బట్టి ఇవి సూచింపబడుతాయి జాతకచక్రము అనగా గతజన్మల కర్మఫలితముల పట్టిక (Account) దానినే చిత్రగుప్తుని చిట్టా అని కూడ అనవచ్చును ఈ విధంగా జ్యోతిష్యమునకు - కర్మసిద్ధాంతమునకు అవినాభావ సంబంధము ఉన్నది

గ్రహాలు ఒకరికి అశుభం చేస్తే, అదే సమయంలో మరొకరికి శుభం చేస్తాయి అందునా ఒకే గ్రహం - శని గాని, గురువు గాని - అలా భిన్నంగా ఫలితాలు ఇవ్వటం ఎందుకు వాటికి ఏం పట్టింది? వాటికి కూడ స్వార్థం ఉన్నదా? అదంతా ఒక భ్రమ అని, గ్రహాలు వాటంతట అవి ఏమీ చేయవు అని చెప్పబడింది గదా! మనిషికి జరుగు శుభ, అశుభములు అతని కర్మ పట్టిక (Account)ను బట్టి ఉంటాయి ఉదాహరణకు, శని అశుభం చేయు గ్రహం అని విశ్వాసం ఒకటి ఉన్నది అది మూఢవిశ్వాసమే శని వలన యోగములు సూచింపబడి, అవి అనుభవములో పొందిన జాతకులు ఎంతో మంది ఉన్నారు

కర్మ ఫలితములు అంటనివాళ్లూ ఉన్నారు రమణ మహర్షి వంటి మహాయోగులకు కర్మఫలితాలు అంటవు గ్రహాలు ఏమీ చేయలేవు గత కర్మలు మరుజన్మలో సంస్కారములుగా అనుభవంలోకి వస్తాయి కర్మలు అనబడు బీజములే లేనిది సంస్కారములనబడు మొక్కలు ఎలా వస్తాయి - రావు అపుడు కర్మ ఫలితములే ఉండవు గ్రహసూచనలు ఉండవు ఆ స్థితి ఒక్క యోగీశ్వరులకు మాత్రమే సాధ్యము అలా విత్తనములు అనగా కర్మలు, మొక్కలు అనగా సంస్కారములు (ఫలితములు) ఒక నిరంతర వలయముగా ఈ సృష్టిక్రమములో ఏర్పడుతూనే ఉంటాయి అదే భగవంతుని సంకల్పమైన సృష్టి ప్రణాళిక ఆ ప్రణాళికను పరమాత్మ మార్చడు, దానికి ఏమి కూర్చడు అంతా మనము చేయు కర్మల వలన మాత్రమే ఈ సృష్టి ప్రణాళిక సాగుతూ ఉంటుంది

జాతకచక్రము కర్మఫలముల పట్టిక అన్నాము కదా! అపుడు ఒక సందేహం వస్తుంది జాతకచక్రము వ్యక్తి పుట్టిన క్షణమున నున్న గ్రహస్థితిని తెలిపి దాని ఫలితమును సూచించును కాని అది ఆ సమయముననున్న గ్రహస్థితి గదా, అది వ్యక్తి జీవితాంతము ఫలితములను ఎటుల సూచించగలదు? ఈ సందేహం సహజము దీనికి సమాధానం ఒకటే - జనన కాల జాతక చక్రం ఆ వ్యక్తి జీవితకాల కర్మ ఫలితములను సూచిస్తుంది ఇది శాస్త్ర సూత్రము మాత్రమేనా? లేక పరిశోధనల ద్వారా రుజువు కాబడిన సత్యమా? ఇది పరిశోధనల ద్వారా రుజువు కాబడిన సత్యము వ్యక్తి జీవితమున జరుగు సంఘటనలను అతని జననకాల జాతక స్థితితో సమన్వయపరచుట ద్వారా పరిశోధనలే కాక, వైద్యశాస్త్ర పరిశోధనలు, ఎలక్ట్రానిక్ సైన్సు పరిశోధనల ద్వారా కూడ (Electronic Science) ఇది రుజువు కాబడిన సత్యము ఎలక్ట్రానిక్ సైన్సు చెప్పిన న్యూరాన్ సూత్రము (Neuron Principle) ఈ పరిశోధనల ఫలితము ఈ న్యూరాన్ సూత్రము లేక సిద్ధాంతము కర్మ సిద్ధాంతమునకు ప్రతిబింబము వంటిది

న్యూరాన్ సూత్రమునకు (Neuron Principle) ఆధారమైన ప్రధాన విషయములు

భిన్నదశలలో మరల మరల మార్పు చెందుచు వచ్చు విద్యుత్ ప్రవాహము మానవుని మెదడులో నిరంతరము ప్రవహించుచుండును మెదడు నందు జరుగు రసాయనక మరియు కొన్ని ఇతర ప్రక్రియల వలన అచట ఈ విద్యుచ్ఛక్తి (alternating current) ఏర్పడును

మెదడు నందున్న భిన్న భిన్నములైన నాడీ లేక నరములందలి కణములనే న్యూరానులు అందురు ఈ కణముల (Neurons) పరిమాణము (dimension) లను, వాటి లక్షణములును కనుగొనబడుట

సూక్ష్మములైన ముక్కల వంటి జ్ఞానేంద్రియములుగా ఉపయోగపడు

(microstrip antenna) పరికరములను కనుగొని వాటి ద్వారా న్యూరాన్ వ్యూహ నిర్మాణము (arrays) వాటి యొక్క కిరణ ప్రసార లక్షణములను (radiation), పరిమాణములను (measurement) తెలుసుకొనుట

ఉపగ్రహములందు, విమానములందు, ఓడలయందు, ఇతర అంతరిక్ష నౌకల యందు ఉపయోగించబడు యాంటెనా (antenna) లకు అనుకరణ వంటి సాధనమే న్యూరాన్ కణముల యొక్క కిరణ ప్రసార (radiation) లక్షణములను కనుగొనుటకు జరిగిన ప్రయోగములలో (experiments) ఉపయోగించబడిన సాధనము

రెండు దశాబ్దములకు పైగా వివిధ ప్రయోగశాలలోను, విశ్వ విద్యాలయములందు ప్రధానంగా జైపూర్, ఇంజనీరింగ్ కళాశాలలో జరిగిన పరిశోధనా ఫలితములు (By research Scholars of Regional Engineering College, Jaipur, Rajasthan) ఈ న్యూరాన్ సూత్రమునకు జాతకచక్రము ద్వారా సూచించబడు కర్మ ఫలితములకు గల సంబంధమును విశదపరిచినవి ఈ విషయం ఒక జ్యోతిష పత్రికయందు (Astrological Magazine) క్లుప్తంగా చెప్పబడింది నాడీకణముల (Neurons) కిరణ ప్రసార (radiation) లక్షణములను గురించి ఆ ఇంజనీరింగ్ కాలేజి పరిశోధక మండలి జరిపిన పరిశోధనలలో న్యూరాన్ సూత్రము (Neuron Principle) నకు ఆధారమైన కొన్ని ప్రధాన విషయములు వెలువడినట్లు చెప్పబడింది

మానవుని మెదడు నందు అతిసూక్ష్మమైన కణమే న్యూరాన్ (Neuron cell) ఈ కణ నిర్మాణము అత్యంత క్లిష్టమైనది (చిక్కులతో కూడినది) ఈ కణము నందు DNA, RNA, genes మొదలైనవి ఉండునని శాస్త్రజ్ఞుల అభిప్రాయము ఒక్క మెదడు నందే ఈ న్యూరాన్ కణ సముదాయం వేయి కోట్లను మించి ఉండునని తెలుసుకొనబడింది శరీరమంతయు ఈ కణములు వ్యాపించియున్నను వాటి కేంద్రస్థానము మెదడు అవి మెదడు నందే ఎక్కువ

భాగము కేంద్రీకృతమై ఉన్నాయి

ఈ న్యూరాన్ కణములు అనేక రకములు వాటి స్వభావము భిన్నముగా ఉంటుంది వాటి వాటి ధర్మములు కూడ భిన్నముగానే ఉండును మెదడు నందు అవి ఉన్న భాగమునననుసరించి వాటి పరిమాణం, రూపు మారును న్యూరాన్ పొడవు 0 02 మైక్రోమీటర్ (Micrometer) నుండి 100 మైక్రోమీటర్ల వరకు ఉండునని వైద్యశాస్త్రము చెప్తోంది ఈ న్యూరాన్‌ల స్వభావము సంబంధిత వ్యక్తి వారసత్వ లక్షణములతో పాటు మరెన్నో విషయములపై ఆధారపడియుండును

మెదడునందు జరుగు అనేక విధములైన రసాయన క్రియల వలన, నిరంతరము దిశ మార్పు చెందు విద్యుచ్ఛక్తి (alternating current) ఉత్పన్నమగును ఈ విద్యుత్ శక్తి సుమారు -80 m v నుండి +40 m v (milli volts) ఉండునని కనుగొనబడినది ఈ విద్యుత్ ఉత్పత్తి ద్వారా మెదడు కలుగజేయు విద్యుత్ అయస్కాంత తరంగముల (Electromagnetic waves) తరచుదనము (frequency) కొద్ది హెర్ట్జ (Hertz) నుండి కొన్ని వందల హెర్ట్జ వరకు ఉండునని కూడ కనుగొనబడినది 1995లో ఆస్ట్రేలియాలోని సిడ్నీ విశ్వవిద్యాలయములో శాస్త్రజ్ఞులు ఈ విద్యుత్ అయస్కాంత తరంగములను హెచ్చుగా చేసి (amplified) పరిశీలించారట దీని కొరకు ఉపయోగించబడిన మెదడు ప్రవాహా నియామపక పరికరము ఈ విద్యుత్ అయస్కాంత తరంగములను ఎలా విస్తరింపచేయునో అమెరికా, జపాన్, ఇంగ్లాండు టెలివిజన్ వ్యవస్థల ద్వారా ప్రపంచమంతటా ప్రదర్శించారట ఎన్నో లక్షల మంది ప్రేక్షకులు దానిని దర్శించారని చెప్పబడింది

గ్రహముల నుండి, సూర్యుని నుండి, నక్షత్రముల నుండి నిరంతరము, స్థిరముగా విద్యుత్ అయస్కాంత శక్తి (em energy), భూమి ఉపరితలము చేరుచుండును ఆ అయస్కాంత శక్తి యొక్క బలము (తీవ్రత) తరచుదనము,

భాగము (phase) (భాగము అనగా ఆ శక్తిలోని ఏ భాగము భూమిని చేరుచున్నదో అది) యొక్క పరిమాణము (measure) కనుగొనబడింది అది తేదిని బట్టి, సమయమును బట్టి, స్థలమును బట్టి మారుచుండునని గూడ కనుగొనబడింది ఈ అయస్కాంత శక్తి యొక్క తరంగాంతరం (wave length) సుమారు $40 \times 10^{8}$ మీటర్ల నుండి $4 \times 10^{6}$ మీటర్లు ఉండునని పరిశోధనలో తెలిసింది

మానవుని వివిధములైన చర్యలను నియంత్రించుటకు, సమన్వయ పరచుటకు మానవుని మెదడు వివిధ భాగములుగాను తిరిగి అంతర భాగములుగాను విభజించబడినదని వైద్యశాస్త్రము చెప్తోంది ఈ వివిధ భాగములలోని న్యూరాన్ కణములు (nerve cells) పరస్పరము భిన్నముగా నుండుననియు, అవి అనేక కారణములపై లేక ప్రాతినిధ్యములపై (factors) ఆధారపడి ఉండునని కూడ వైద్యశాస్త్రము చెప్పుచున్నది

మన కన్నులలోనే సుమారు 130 మిలియన్ల అనగా 13 కోట్ల న్యూరాన్ కణములున్నట్లు సైన్సు చెప్పుచున్నది ఈ కణములు కాంతిశక్తిని (em-energy of light) గ్రహించి దానిని సంజ్ఞల లేక సంకేతముల రూపమున మెదడుకు అందజేయును మెదడు వానిని గ్రహించి, విశ్లేషించి ఈ విద్యుత్ అయస్కాంత కిరణ ప్రసారము (em radiation) పంపిన రంగులు, మరియు ఇతర సమాచారమును మనసుకు అందజేస్తుంది మనసు (Mind) మెదడు (Brain) లో ఒక భాగమే గదా!

ఎలక్ట్రానిక్ సైన్సును అనుసరించి ప్రయోగశాలలో కిరణ ప్రసారములను (radiation) గ్రహించుటకు ఉపయోగపడు యంత్రముల ఎమూనా ద్వారా న్యూరాన్ కణముల స్వభావ లక్షణములను గ్రహించి పరిశోధించి విశ్లేషించుటకు వీలగును అన్నారు

మానవుని మెదడు నందు ఏర్పడు విద్యుత్ అయస్కాంత శక్తి (em

energy) అతని శిరస్సు చుట్టు, అతని శరీరము చుట్టు ఒక తేజో (Halo) వలయమును ఏర్పరచును అది ఒక అయస్కాంత క్షేత్రము ఆ అయస్కాంత క్షేత్రము యొక్క ప్రభావము, శక్తిని కిర్లియన్ (Kırlean Photographic Technique) ఫోటో పద్ధతి ద్వారా కొలుచుట జరిగినది ఈ తేజోవలయము (Halo) మనిషి మనిషికి మారుచుండును

న్యూరాన్ సూత్రములోని ప్రధాన విషయముల ఇటీవల కాలములో ప్రయోగముల (Experiments) ద్వారా సరిచూడబడినవి కొన్ని ప్రధానమైన విషయములు

మన మెదడులోని న్యూరాన్ కణములు విద్యుత్ అయస్కాంత శక్తిని అంతరిక్షము నుండి గ్రహిస్తాయి, తమలోని విద్యుత్ అయస్కాంత శక్తిని ప్రసారం కూడా చేస్తాయి ప్రయోగశాలలో న్యూరాన్ నమూనాలను తయారుచేసి, న్యూరానుల యొక్క గ్రహణశక్తి, ప్రసారశక్తి సరిచూడటం (verify) జరిగింది న్యూరానులు గ్రహించు, ప్రసారము చేయు విద్యుత్ అయస్కాంత శక్తి తరంగాంతరములు, న్యూరానుల పరిమాణము, రూపము, పొడవు మొదలగు వాటి ననుసరించి భిన్నభిన్నముగా నుండును మెదడు నందు న్యూరానులను ఆవరించియుండు ద్రవ వాయు మిశ్రమ పదార్థము (fluid) న్యూరాను లక్షణములను ప్రభావితము చేయును అని వైద్యశాస్త్రజ్ఞుల అభిప్రాయము

మానవుని మెదడుపై ఈ విద్యుత్ అయాస్కంత శక్తి (em) మరియు ఇతర శక్తుల ప్రభావము తేది, సమయము, స్థలముల అనగా జనన కాలమున జనన సమయము, జన్మస్థలము (Date, Time and Place of Birth) లపై ఆధారపడును అంతేగాక ఆ వ్యక్తి యొక్క న్యూరాన్‌ల లక్షణముల ననుసరించి ఈ ప్రభావము మెదడు నందు గల వివిధ భాగములపై వివిధముగా నుండును

జనన సమయమున శిశువుపై ఏర్పడు ఈ విద్యుత్ అయస్కాంత శక్తి ప్రభావము శాశ్వతమైనది జీవితాంతము అతని చర్యలను అది ప్రభావితం

చేయును అంతేగాక జీవితంలో వయసు పెరుగుచున్న కొలది అతని స్వభావమును, చర్యలను కాలక్రమముగా ఆయా సమయములందు అంతరిక్షము నుండి వచ్చు విద్యుత్ అయస్కాంత శక్తి మరియు ఇతర శక్తులు ప్రభావితము చేయును దీనినే జ్యోతిషశాస్త్రములో గోచారము (Transits) దశా పద్ధతి (Planetary Periods Systems) అన్నారు

మానవుని మెదడు నందలి అతిసూక్ష్మమైన నాడీకణము (Nerve cell) అనగా న్యూరాన్ కణ నిర్మాణం అతిక్లిష్టమైనది అది పనిచేయు విధానము కూడా అతి నిగూఢముగా ఉన్నది శాస్త్రీయ పరిశోధకులు (scientists) ఈ విషయములోని నిగూఢత క్లిష్టతలను గురించి నిరంతరం పరిశోధనలను సాగిస్తూనే ఉన్నారు న్యూరాన్ ధర్మములు, దాని ద్వారా మెదడు ధర్మములు (functions) తెలిసికొనుటకు జరుగుచున్న పరిశోధనల ననుసరించి అందుకు సంబంధించిన ఎలక్ట్రానిక్ సైన్సు విభాగమును న్యూరల్ ఎలక్ట్రానిక్స్ (Neural Electronics) అన్నారు

మెదడు మానవుని వివిధ చర్యలకు, ధర్మములను నియంత్రించుచు వాటి సమన్వయపరచును ఇది అందరు అంగీకరించిన సత్యము మెదడులో 12 ప్రధాన భాగములున్నాయి అని వైద్యశాస్త్రము చెప్తోంది జ్యోతిషశాస్త్రము ప్రకారము జాతకచక్రములో నున్న 12 భావములు మెదడులోని ఈ 12 భాగములతో సరిపడుచున్నవి ఇది వింత అనిపించినను ఇది సత్యము

కాని జ్యోతిషశాస్త్రము - జాతకచక్రము ఇచట చర్చనీయాంశములు కావు కర్మ సిద్ధాంతము ఇచట చర్చనీయాంశము కావున ఈ న్యూరాన్ సూత్రము కర్మ సిద్ధాంతమును ఎంతవరకు విశదపరచుచున్నదో గ్రహించ వలయును

న్యూరాన్ కణములు (Neurons which are Nerve Cells) అంతరిక్షము నుండి (Space or Cosmos) విద్యుత్ అయస్కాంత శక్తిని (em

energy) గ్రహించటమేగాక, అవి శరీరములో విద్యుత్ అయస్కాంత క్షేత్రము ద్వారా శక్తిని లేక తేజస్సును (halo) కలుగజేస్తాయి గత కర్మ ఫలితములు నాడీచక్రములలో నిక్షిప్తమై యుండునని యోగశాస్త్రము చెప్పింది గదా! ఇవి వర్తమానములో సంస్కారములు అగును అన్నారు నాడీ చక్రములందలి న్యూరాన్ కణములు ఆయా సమయములందు ప్రారబ్ధ కర్మములననుసరించి గ్రహముల నుండి వచ్చు (em) విద్యుత్ అయస్కాంత తరంగములను గ్రహించి తద్వారా సంబంధిత నాడీచక్రము నందలి కర్మ ఫలితములను చలనపరచి (activate) ఆ చలనమును మెదడునకు చేర్చును ఇచట చలనము అనగా న్యూరాన్ కణముల వలన ఏర్పడిన అయస్కాంత క్షేత్రము నందలి విద్యుత్ అయస్కాంత తరంగముల చలనము అంతరిక్షము నుండి వచ్చు విద్యుత్ అయస్కాంత తరంగములు నాడీ చక్రములలోని కర్మఫలితములను చైతన్యపరచినపుడు ఆ ఫలితములు న్యూరానులు ఏర్పరచు విద్యుత్ అయస్కాంత క్షేత్రము నందలి తరంగాంతరములను (wave length) ప్రభావితము చేయును ఆ తరంగాంతరములు మనసు లేక బుద్ధిని ప్రారబ్ధ కర్మము ననుసరించి చలనపరచును ఆ చలన ఫలితమును స్థూల శరీరము అనుభవించును ఇదే బుద్ధిః కర్మానుసారిణి అను ఆర్యోక్తి సందేశము

కర్మ ఫలితములను గురించి స్పష్టముగా చెప్పటం చాల దుర్లభమైన విషయము ఉదాహరణకు న్యాయస్థానములో ఒక హత్యను గురించి విచారణ జరిగినపుడు, న్యాయాధిపతి ఆ హత్యను గురించి అనేక విషయములు పరిగణనలోకి తీసుకుంటాడు ఆ హత్య బుద్ధిపూర్వకముగా ఒక పద్ధతి ప్రకారం జరిగిందా, ఏ ఉద్దేశము లేని (Motive) పెనుగులాట వలన జరిగిందా లేక అది ఆత్మరక్షణా ప్రయత్నంలో జరిగిందా - ఇలా అనేక విధముల ఆలోచించి శిక్ష నిర్ణయిస్తాడు జడ్జి జరిగినది హత్యే అయినను కారణమును బట్టి శిక్ష భిన్నముగా ఉంటుంది ఆత్మరక్షణా ప్రయత్నంలో హత్య జరిగితే అసలు శిక్షే ఉండదు

అలాగే కర్మ ఫలితముల వలన కలుగు అనుభవం గురించి సాధారణ నిర్వచనం (general definition) ఇవ్వటం దుర్లభం కర్మ ఒకటే అయినను ఫలితము వ్యక్తిని బట్టి, సమయమును బట్టి, స్థలము బట్టి, కాలమును బట్టి మారుచుండును ఒక కర్మము జరిగినపుడు ఆ కర్మము చేసిన వ్యక్తి వయసు, స్థితి, ఆ కర్మము వలన ఇతరులకు కలిగిన కష్టనష్టములు లేదా సుఖము, ఆనందము, ఆ కర్మము చేయుటలోని ఉద్దేశము మొదలైన అనేక విషయములపై ఆధారపడి ఆ కర్మ ఫలితము అనుభవములోకి వచ్చును ఇచట న్యూరాన్ సూత్రము కొంతవరకు సమాధానం ఇస్తుంది

కాలము, రోజు, సమయము, స్థలమును బట్టి అంతరిక్షము నుండి వచ్చు విద్యుత్ అయస్కాంత శక్తి మానవుని శరీరములోని న్యూరానులపై భిన్న భిన్న రీతులలో ప్రభావము చూపును తదనుగుణముగా న్యూరానులు మానవుని చర్యలను నడుపును ఆ చర్యల అనుభవములే గదా కర్మ ఫలితములు ఒకే స్థలమునందు వివిధ దినములందు వివిధ సమయము లందు ఆ అంతరిక్ష విద్యుత్ అయస్కాంత శక్తి (em energy) వివిధముగా నుండును అందుచే ఒకే స్థలములోని, ఇంకను ఒకే కుటుంబములోని వ్యక్తుల కర్మఫలానుభవములు భిన్న భిన్నముగా నుండును అందువలన వారి స్వభావము, చర్యలు భిన్నముగా నుండును వారివారి శరీరములోని న్యూరానుల లక్షణములు భిన్నముగా నుండుటయే దీనికి కారణము

న్యూరానుల గ్రహణ స్వభావము, ప్రసార స్వభావం (receiving and transmitting properties) అనేక పరిమాణములపై (parameters) ఆధారపడి యుండును

1 తలిదండ్రుల నుండి వచ్చు వంశానుగత వారసత్వ లక్షణములు

2 న్యూరానుల పరిమాణములు (dimensions) వాటిని ఆవరించి యుండు ద్రవ వాయు మిశ్ర పదార్థ (fluid) లక్షణములు

3 న్యూరానుల వ్యూహరచన (arrangement or arrays) వాటి పరస్పర సంబంధము

న్యూరానులు స్వయముగా విద్యుత్ అయస్కాంత శక్తిని ప్రసారము చేయగలవు గనుక ఒక వ్యక్తి నుండి ప్రసారమగు విద్యుత్ అయస్కాంత శక్తి మరియొక వ్యక్తిని అతని కర్మములను గూడ ప్రభావితము చేయగలవు

అందువలన మానవుని కర్మలు, కర్మ ఫలితములను గురించి స్పష్టమగు చిత్రము (picture) ఇచ్చుట దుర్లభము కర్మ సిద్ధాంతమును, న్యూరాన్ సిద్ధాంతముతో సమన్వయపరచి పరిశోధన జరిపినచో మరికొంత స్పష్టత ఏర్పడగలదు వేదాంతులు ఎలక్ట్రానిక్ శాస్త్రజ్ఞులు తమ వైరుధ్యము మరచి కృషి సలిపినచో తగిన సమాధానము దొరకగలదు

## 2 కర్మ సిద్ధాంతము - విశ్లేషణ

కర్మ సిద్ధాంతమును గురించి మరికొంత విశ్లేషణ (analysis) అవసరము వేద సంహితలలోను బ్రాహ్మణములలోను చెప్పబడిన కర్మ సిద్ధాంతము ఏమిటి? దానికి ఉపనిషత్తులు చెప్పు కర్మ సిద్ధాంతమునకు భేదమున్నదా? జైన, బౌద్ధ మతములలో కర్మ సిద్ధాంతమునకు స్థానమున్నదా? పురాణ, ఇతిహాసములలో వ్యక్తపరచబడిన కర్మ సిద్ధాంతము ఏమిటి? షడ్దర్శనములు కర్మను గురించి ఏమి చెప్పుచున్నవి? కర్మ పరిపక్వత అనగా నేమి? కర్మసిద్ధాంతమును వ్యతిరేకించు విషయములు ఏమిటి? కర్మ సిద్ధాంతమును గురించిన విరుద్ధ (controversies) అంశములు ఏమిటి? సమాజముపై కర్మ సిద్ధాంత ప్రభావము ఏమిటి? కర్మ ఫలితముల ద్వారా వర్తమాన జీవితము పూర్తిగా నిబద్ధమైనదా? లేక వర్తమాన కర్మల ద్వారా మార్గాంతరమున్నదా? - ఈ ప్రశ్నలకు సమాధానము కొరకు అన్వేషణయే ఈ అధ్యాయం తదుపరి అధ్యాయములలోని విశ్లేషణ సారాంశము

'కర్మ' అనునది ఒక నిగూఢ విషయము పెద్ద పశువుల మందలోనైనను దూడ తల్లిని గుర్తుపట్టి వెంటనే దగ్గరకు చేరుతుంది అలాగే ఏ కర్మ అయినను అది చేసిన వాని వెంట నంటియే యుండును ఆదియే కర్మ సిద్ధాంతములోని ప్రధానాంశము గత జన్మల కర్మములను సంచిత కర్మలు అన్నారు అవి బాంకులో దాచిన డబ్బు వంటివి ఆ డబ్బు నుండి కొంత తీసి ఉపయోగములోనికి తెచ్చుకొనినట్లుగనే సంచిత కర్మములలో కొన్ని వర్తమాన జన్మము నందు అనుభవములోనికి వచ్చును అట్టి కర్మమును ప్రారబ్ధ కర్మము అన్నారు ఇవి కాక వర్తమాన జన్మమునందు మనము చేయు కర్మలయందు మనకు స్వేచ్ఛ యుండును మంచి, చెడు గ్రహించి చేయవచ్చు దీనినే క్రియమాణ కర్మము అన్నారు ప్రారబ్ధ కర్మము ఒక విల్లు నుండి విడవబడిన బాణము వంటిది ఆ విలుకాడు దానిని ఆపలేడు అత్యంత నేర్పరియైన విలుకాడు మాత్రమే దానిని మరొక బాణము ద్వారా నిరోధించగలడు ఆ మరొక బాణము వంటిదే క్రియమాణ కర్మము ప్రారబ్ధ కర్మము అనుభవించక తప్పదు అందువలన ఈ జన్మములో చేయగలిగినది ఏమియును లేదు అనుట మెట్ట వేదాంతము దానివలన వర్తమాన జన్మము అర్థరహితమగును అపుడు సృష్టి ప్రణాళికలోని ప్రధానాంశమైన ప్రగతిశీల పరిణామము (progressive evolution) నిరర్థకమై ఆత్మజ్ఞానమునకు (self realization) దూరమవుతాము సృష్టి అంతర్యము అది కాదు 'పునరపి జననం, పునరపి మరణం' అను సోపానముల నధిరోహించి ఆత్మదర్శనం సాధించి జీవన్ముక్తిని పొందగలగటమే ఈ సృష్టి ధ్యేయం (goal) అందుకు ఉపయోగకరమగు మార్గమే క్రియమాణ కర్మము ఇచట మనకు పూర్తి స్వేచ్ఛ ఉన్నది కావున మంచి కర్మముల ద్వారా ప్రారబ్ధ కర్మము యొక్క దుష్ఫలితమును అనుభవిస్తూనే దాని ప్రభావము మనకు అంటకుండ చేసుకొనవచ్చును ఇదియే కర్మ సిద్ధాంతంలోని నిగూఢమైన అంశము

జ్యోతిషము ద్వారా కాని మరి ఏ ఇతర పద్ధతుల ద్వారా కాని సంచిత

కర్మ ఫలితములను చెప్పటం, భవిష్యత్తును సూచించటం ఒక వృత్తిగా చేసుకుని ధన సంపాదన ప్రక్రియగా మార్చినచో, అందలి దివ్యత్వం నశించును అది నీచ స్థితికి దిగజారును భుక్తి కొరకు వృత్తిచేయటం, ధనము సంపాదించటం తప్పు కాదు కర్మ ఫలితములను గుర్తించగలుగుట, భవిష్యత్తును మనోదృష్టితో గ్రహించగలగటం, ఒక దివ్యత్వముతో కూడినది ఆ దివ్యత్వం ఉన్నవానికే వాక్శుద్ధి ఉంటుంది వాక్శుద్ధి లేనిది ఆ వాక్కు నిష్ప్రయోజనం దివ్యత్వం, వాక్శుద్ధి ప్రధానమైన దానిని వృత్తిగా మలచుకుని ధనము ఆర్జించటం నేరం అవుతుంది అట్లు చేసినచో దివ్యత్వం, వాక్శుద్ధి నశిస్తాయి మరొక విషయం భూత, భవిష్యత్తులు ఒక్క సృష్టికర్తకు మాత్రమే పూర్తిగా తెలియును దివ్యత్వం, వాక్శుద్ధి ఉన్నవారు కూడ చేయకల్గునది స్పష్టమైన సూచనలు మాత్రమే మరి దీనిని వృత్తిగా చేసుకుని ధనార్జనా దృష్టితో తాము చెప్పునది జరిగి తీరును అని ఉద్ఘాటించు వారిని ఏమనాలి? అటివారు ఆత్మ వంచకులు (hypocrites)

ఈ విధంగా ఆధ్యాత్మికతను గూడ వ్యాపారాత్మకంగా మార్చటం పరిపాటి అయింది ఇది నేటి సమాజంలో ప్రబలుచున్న అతి నీచమైన లక్షణం ఈ లక్షణంలో బ్రిటిష్, అమెరికా జాతీయులు అఖండులు వారిలో ఆధ్యాత్మికత ఎంతో ఉన్నట్లు కనబడుతుంది సాధనలోని సారము వారు గ్రహించగలరు వారు భారతదేశం వస్తుంటారు, యోగులను, సాధకులను కలుస్తుంటారు, విషయములు తెలుసుకుంటారు కాని దాని ద్వారా వారు సాధించేది ఆధ్యాత్మికత కాదు, ఆధ్యాత్మికత పేరుతో వ్యాపార సంబంధాలు పెంచుకొనటం ఇది అమెరికా జాతీయుల సాధారణ స్వభావం ఇటు ధనార్జన కొరకు ఆధ్యాత్మికతను ఉపయోగించుకొను భారతీయులకు గాని, అటు చాప క్రింద నీరులాగ ఆధ్యాత్మికతను వ్యాపార విస్తరణకు ఉపయోగించగల అమెరికా జాతీయుల శక్తి, యుక్తులకు గాని వాస్తవమైన ఆధ్యాత్మికత (True spirituality) ఆత్మానుభూతి (Direct Experience) ఎన్నటికీ గ్రాహ్యము కాదు

ఏకాగ్రతతో కూడిన ధారణ లేక ధ్యానము (meditation) మాత్రమే స్వచ్ఛమైన ఆధ్యాత్మికతకు సోపానము అమెరికా జీవితము (American life) వలె నియమ నియంత్రణలు లేని జీవన సరళి వలన (way of life) తాము ఎంతో ఆధ్యాత్మికత సాధించామని భావించినను అది భ్రమగా మాత్రమే మిగిలిపోతుంది అట్టి జీవనసరళిలో ఆధ్యాత్మికత విక్రయమునకు అనువైన ఒక వస్తువు (salable commodity) గాను, బేరసారములతో కూడిన సంత వస్తువుగాను (marketing commodity) మారినది దురదృష్టవశమున అనుకరణలో తమ శక్తియుక్తులను పూర్తిగా వినియోగించుటలో అఖండులుగా మారిన భారతీయుల వలన ఈ దేశములో అదే విధమైన జీవనసరళి (way of life) ప్రబలుచున్నది ఈ అనుకరణ అను వ్యాధి నుండి (disease of imitation) విముక్తులైన నాడే ఏ ఆధ్యాత్మికతకు భారతదేశం వన్నెకెక్కినదో బోధపడుతుంది

దేనినైనా సంత వస్తువుగా (market commodity) మార్చగల యుక్తి అమెరికా వారికి ఉన్నది దానితోనే ప్రస్తుతానికి వారు ప్రపంచమునకు మకుటం లేని మహారాజులము అను భ్రమలోనున్నారు ఈ విధముగ ఆధ్యాత్మికతను భౌతిక లాభములతో (physical worldly advantages) ముడిపెట్టినంత కాలము కర్మ సిద్ధాంతములోని అంతరార్థమైన "కర్మము ద్వారా అకర్మము సాధించుట" అను సూత్రము అర్థము కాదు కర్మములు నిర్వర్తిస్తూనే కర్మములు చేయకుండుట అని దీని అర్థము అనగా కర్మ ఫలితములను తన మనసున కంటనీయకుండుట ఆంతరిక జీవితమునకు లేక ఆధ్యాత్మిక జీవితమునకు ఇది మూలమైనది కురుక్షేత్ర యుద్ధములోని శ్రీకృష్ణుని రూపమే దీనికి చక్కని ఉదాహరణ సంకుల సమర భూమిలో రథము నడుపుచున్నను ఆయన ముఖము పరిపూర్ణమైన, ప్రశాంతమైన వర్చస్సుతో వెలుగొందుతూ ఉంటుంది ఆ వర్చస్సును గూర్చిన అనుభూతి అమెరికావాసులైన ఆధ్యాత్మిక ముసుగులోని భౌతికవాదులకు సాధ్యము

కాదు

అమెరికాలో గూడ వేదవేదాంగములు అధ్యయనం చేసినవారు ఉన్నారు కాని వారి దృక్పధం ఆధ్యాత్మికం కాదు మానసిక స్థితి, మనస్తత్వ శాస్త్ర పరిధుల వరకే వారి ఆలోచనలు వెళ్లి ఆగిపోతున్నాయి భావాతీతమైన తురియాస్థాయి దాటిన స్థితి ద్వారా ఆత్మానుభూతి సాధన (Direct Experience) వారి ఆలోచనలకు అందటం లేదు ఈ పరిస్థితే నేడు భారతదేశంలో కూడా వ్యాపిస్తోంది దానధర్మముల కొరకు (charity) జరుగు సభలు కూడ అమెరికాలో వ్యాపారంలో ఒక భాగంగానే ఉంటాయి ఇది భారతదేశంలో కూడ వ్యాపించి ధనవ్యామోహం లేకుండటమే ఆధ్యాత్మికతకు మూలం అను సూత్రము మరుగున పడుచున్నది ఈ ఆధ్యాత్మికత అర్థమైనపుడే కర్మ సిద్ధాంతం బోధపడుతుంది ప్రారబ్ద కర్మ అనుభవించుటకు వలసిన స్థైర్యము ఆధ్యాత్మికత ద్వారా కలుగును భగవద్గీత **2వ అధ్యాయంలో 69వ శ్లోకం** దీనిని చక్కగా విశదపరిచింది

శ్లో॥ యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తిసంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతోమునేః ॥

తా॥ సమస్త ప్రాణులకును అనగా సామాన్య మానవులకు ఏది అనగా పరమాత్మ తత్వము లేక ఆత్మజ్ఞానము అగోచరముగా నుండి రాత్రివలె నున్నదో, అదే సమయమున ఇంద్రియనిగ్రహుడైన యోగికి పగలువలె యుండును అతడు మేలుకొనియే యుండును అనగా ఆత్మావలోకనము చేయుచుండును దేనియందు అనగా ఇంద్రియ ప్రేరిత విషయములందు, సామాన్య జీవులు మేలుకొని యున్నారో అనగా ఆసక్తితో ప్రవర్తించుచున్నారో, అది అనగా ఆ విషయ సమూహము పరమాత్మతత్వమును అవలోకించు యోగికి రాత్రిగా నుండును అనగా అగోచరముగానుండును

మేలుకొనునంత వరకు మాత్రమే ఎవరైనా స్వప్న జగత్తులో

నుండగలరు స్వప్నజగత్తు మిధ్య (unreal) మేలుకొనినపుడు మిధ్య మాయమై వాస్తవం (reality) గోచరమవుతుంది భౌతిక వ్యామోహం స్వప్న జగత్తు వంటిది ఆ వ్యామోహంలో ఉన్నంత వరకు వాస్తవం గోచరించదు వాస్తవం (reality) అనగా ఆత్మజ్ఞానము అను సత్యం గోచరించినపుడు వ్యామోహం అగోచరమవుతుంది

ఒక వస్తువు యొక్క వాస్తవమును (Reality) గ్రహించలేకపోవుటకు కారణము దానిని భ్రమతో అనగా స్వప్నదృష్టితో (Dream like) గమనించటమే ఆ వస్తువును యధాతధముగా వాస్తవిక దృష్టితో గమనించినపుడు దానికి వ్యతిరేకమైన భ్రమకు అవకాశముండదు

ఉపనిషత్తులు కూడ ఇదే చెప్పినవి

**బృహదారణ్యక ఉపనిషత్తు** (4-3-31)

**"విశేషవిజ్ఞానరాహిత్యమే ప్రత్యగాత్మ స్వరూపము"**

జాగ్రతావస్థ అనగా మేలుకొని యుండునపుడు, స్వప్నావస్థయందు, ఇతరమైన వస్తువు అనగా తాను కానిది రెండవదిగా భిన్నముగా నుండును కాని సుషుప్తి అనగా నిద్రస్థితి యందు ఇతరమైన వస్తువు ఏదియును ఉండదు అందువలన విశేషమైనది తెలుసుకొనుట యుండదు ఇచట ఒక ప్రశ్న ఉదయించును నిద్రయందు (సుషుప్తి) విశేష విజ్ఞానము లేకుండుట, మేలుకొని యున్నపుడు, స్వప్నమందున్నపుడును విశేష విజ్ఞానముండుటను ఆత్మకు స్వభావమా? దీనికి సమాధానము

మేలుకొని యుండునపుడు గాని, స్వప్నమందు గాని అవిద్యా (అజ్ఞానము - స్థూలమైన బాహ్యప్రపంచమే సర్వస్వము అను (భ్రమ) ప్రభావము వలన, ఆత్మ అన్నిటియందు ఉన్నది - ఆత్మవత్ సర్వభూతాని - ఆత్మకు భిన్నమైనది మరేదియును లేదు అను సత్యమును గ్రహించలేక, ఇతర వస్తువు తన కంటే భిన్నమైనదనియు, ఆ వస్తువు కంటే తాను భిన్నమైనవాడననియు

అను భ్రమ యందుండును ఆ భ్రమయే విశేషజ్ఞానము అందువలననే

'-'తత్ర అన్యః అన్యత్పశ్యేత్ - ఆ జాగరిత స్వప్నముల యందు తాను వేరుగా తన కంటే వేరగు వస్తువును చూచును స్వప్నమున ప్రత్యక్షముగా కల్పిత విభక్తరూపము చూపబడినది అటులనే అన్యః అన్యత్ జిఘ్రేత్' - తాను వేరై తన కంటే వేరగు గంధమును వాసన చూచును - 'అన్యోఽన్యత్ రసయేత్' - అన్యుడే భిన్నమగు రసమును ఆస్వాదించును - 'అన్యః అన్యద్వదేత్' - అన్యుడై ఇతరమును మాట్లాడును - అన్యః అన్యత్శృణుయాత్' - అన్యుడై యితరమగు శబ్దమును వినును - 'అన్యః అన్యత్ మన్వీత' - తాను వేరై యితరములగు విషయములను ఆలోచించును - 'అన్యః అన్యత్ స్పృశేత్ - అన్యుడై యితరములను స్పృశించును - అన్యః అన్యద్విజానీయాత్' - అన్యుడై యితరమగు విషయమును తెలిసికొనును ''జ్యోతి స్వభావుడగు పరమాత్మకు విశేష విజ్ఞాన రాహిత్యమే, స్వరూపము మేలుకొనినపుడు, స్వప్నావస్థ యందు విశేష విజ్ఞానత్వము అవిద్యా (అజ్ఞాన) కల్పితమే కాని స్వాభావికము కాదు

ఇక సుషుప్తి యందు (నిద్ర యందు) సహజ జీవలక్షణములు నశించునా? నశించవు సుషుప్తి యందు ఇంద్రియములు, విషయములు విభక్తములై యుండవు (వేరువేరుగా ఉండవు) ఉదాహరణకు ఆ ఘ్రాణశక్తి (వాసన చూచుట) ఒక స్వభావము అది నశించదు కాని సుషుప్తి యందు ఆ ఘ్రాణశక్తి, సంబంధిత ఇంద్రియం విభక్తములు కావు కావున గంధమును (వాసనను) గ్రహించుటలేదు ఇదే విధముగ సుషుప్తియందు ఆత్మరసమును ఆస్వాదించుట లేదు కాని రసాస్వాదన శక్తియను స్వభావమును కలిగియే యున్నాడు విషయము లేదు గనుక రసమును గ్రహించుట లేదు

ఈ విధముగనే వక్తృత్వశక్తి, శ్రవణశక్తి, స్పర్శశక్తి, భూత, భవిష్యద్వర్త మాన విషయనిర్ణయశక్తి ఎల్లపుడు కలిగియే యుండును అయినను విభక్తమగు

(వేరువేరుగ నుండు) రూపము, విషయ ఇంద్రియములు లేనందున వచన, శ్రవణ, మనన, స్పర్శన విజ్ఞానములను ఆత్మ సంపాదించుట లేదు మేలుకొనినపుడు, స్వప్నమందు గూడ విషయగ్రహణము ఇంద్రియకృతమే గాని, ఆత్మకృతము కాదు ఆత్మ నిరంతరం నిర్వికారము అయియున్నది

"ఆత్మ ఏకరూపముగా ఎల్లప్పుడు ప్రకాశించుచుండును చక్షురింద్రియము ద్వారా కలిగిన బుద్ధి వృత్తి యందు అభివ్యక్తమగు ఆ చైతన్యమే దృష్టి అనియు, ఘ్రాణేంద్రియము ద్వారా అభివ్యక్తమగు చేతనము ఘ్రాతి అనియు, శ్రోత్రము ద్వారా అభివ్యక్తము అయినపుడు శ్రుతి యను నియ వ్యవహారభేదమే గాని, దృష్టి, ఘ్రాతి, శ్రవణాదులు ఆత్మకు వేర్వేరు రూపములు, శక్తులు కావు ఈ దృగాది (కన్ను లేక చూపు మొదలైనవి) రూపములతో ఆత్మ పరిణామము నొందదు " ఈ విధముగ ఆత్మ ఏకరూపము అని నిరూపించబడినది నానారూపత్వము నిరాకరించబడినది ఆత్మ ఏకత్వ నిరూపణమే, నానారూపత్వ నిరాకరణము

భగవద్గీతలోని పైన చెప్పిన శ్లోకము (2-69) ఆలంకారిక భాషలో చెప్పబడినది

"అజ్ఞానులకు ఏది రాత్రియో అది జ్ఞానులకు పగలు, జ్ఞానులకు ఏది రాత్రియో అది అజ్ఞానులకు పగలు "

ఆత్మ, పరమాత్మ, ఇంద్రియ నిగ్రహము మున్నగునవి పరమార్థ విషయములు అజ్ఞానులకు అవి అంతుబట్టవు తెలిసికొనవలెనను కుతూహలము కూడ వారికి ఉండదు అవి యేవియు వారి దృష్టికి గోచరింపవు అవి వారికి లేనట్లేయగును కావున అవి వారికి రాత్రి వంటివి అని చెప్పబడినవి ఆ పరమార్థ విషయములందు వారు నిర్లక్ష్యముగ నిదురపోవుచున్నట్లుందురు

కాని జ్ఞానులు సంయమశీలురు వారి స్వభావము ఇందుకు భిన్నముగా నుండును వారికి ఆత్మానుభూతి యుండును ఆత్మ విషయమై జాగరూకులై యుందురు పరమాత్మ అనుభూతి యందు మేలుకొనియుందురు ఏ విషయములందు అజ్ఞానులు నిర్లక్ష్యముతో నిదురపోవుచున్నట్లుందురో, ఆ విషయములందు జ్ఞానులు మేలుకొనియే యుందురు అనగా వారికేది రాత్రి వంటిదో అదే వీరికి పగలు

మరియు జ్ఞానులు ఇంద్రియనిగ్రహులై యుందురు ఇంద్రియార్థములు వారి దృష్టికి గోచరింపవు అనగా ఆ విషయములందు వారు నిదురబోవుచున్నట్లుందురు కాని అజ్ఞానులకు అవియే ప్రీతికరముగ ఉండును వాటినే అనుభవించుచు జాగరూకులై యుందురు అనగా ఏ ఇంద్రియ విషయములందు జ్ఞానులు నిద్రించుచున్నట్లుందురో, ఆ విషయము లందే అజ్ఞానులు మేలుకొనియుందురు జ్ఞానులకేది రాత్రి వంటిదో, అదే అజ్ఞానులకు పగలు వంటిది

గుడ్లగూబ వంటి జంతువులు రాత్రి మాత్రమే చూడగలవు, సంచరించగలవు రాత్రియే వాటికి పగలు వంటిది పగలు వాటికి ఏమియు గోచరించవు పగలు వాటికి రాత్రివంటిది మనకు పగలు వాటికి రాత్రి, మనకు రాత్రి వాటికి పగలు, 'సంయమీ' అను ప్రయోగము చాల ప్రధానమైనది అనగా ఇంద్రియ నిగ్రహము గలవాడే ఆత్మవిషయమున మేలుకొనగలడు అట్టి సంయమము లేనివానికి పరమాత్మ (ఆత్మ) కానరాడని దీని గూఢార్థము ఆధ్యాత్మ విషయమున సంయమము (ఇంద్రియ నిగ్రహం)నకు అత్యంత ప్రాధాన్యమున్నదని చెప్పబడింది

మరొక విషయము 'పశ్యతోమునేః' అని చెప్పబడింది మును లనేకులుండవచ్చు కాని 'పశ్యతః' అని చెప్పినందు వలన ఆత్మదర్శనము పొందిన మునులు అరుదు అన్నారు అట్టి స్థితిని ప్రతివారును పొందవలసి

యున్నది ఇంద్రియ నిగ్రహము కలిగి ఆత్మయందు సదా మేలుకొని యుండవలెనని ఈ శ్లోకము చెప్పుచున్నది

కర్మ సిద్ధాంతము అనుల్లంఘనీయమైనది అనగా అతిక్రమించుటకు వీలుకాని చట్టము (Law) వంటిది మానవులు జంతువులు అందరు ఈ కర్మ సిద్ధాంతము ఎదుటబడినవారే అనగా దాని ప్రభావపరిధిని దాటలేనివారే కాని కర్మ సిద్ధాంతమును ఎదుర్కొని నిలబడి ఆత్మదర్శనము ద్వారా జీవన్ముక్తుడగుటయే సృష్టి ప్రణాళికలోని ప్రగతిశీల పరిణామ ధ్యేయము (Progressive evolution goal) ఈ ఇంద్రియ గోచరమగు ప్రపంచమందు (phenomenal world) ఇదే మహోన్నతమైన జీవితాదర్శము కావాలి

శ్లో॥ సహజం కర్మకౌంతేయ సదోషమపి నత్యజేత్ ।
సర్వారంభాహి దోషేణధూమేనాగ్ని రివావృతాః ॥ (భగవద్గీత 18-48)

అర్జునా! పొగచేత నిప్పు కప్పబడినట్లు సర్వకర్మములు **దోషము చేత కప్పబడియున్నవి** అందుచేత స్వభావసిద్ధమైన కర్మను వదలరాదు

ఈ ప్రపంచమందు పరిపూర్ణమైన సత్కర్మగాని పూర్తిగా దుష్కర్మగాని ఏది ఉండదని, అందు వలన స్వాభావికమైన కర్మమును వదలరాదు అని యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు భగవద్గీత యందు స్పష్టము చేశాడు

వాస్తవమునకు ఇంద్రియ గోచరమగు ఈ ప్రపంచమందు **ప్రతి విషయము కార్యకారణము** (cause and effect) **అను ఒక వలయమందు నిరంతరం పరిభ్రమించుచునే యుండును ఒక నిశ్చితమైన కారణము లేకుండా ఏ కార్యము జరగదు** ఈ కారణమును గురించి, దాని ఫలితము ఏ పరిస్థితులలో ఎటులుండునో తెలుసుకొనుటయే అటు సైన్సు (science) పరిశోధనల, ఇటు వేదాంత శాస్త్ర శాఖల ఆశయము

సిద్ధాంతములన్నిటిలోకి కర్మసిద్ధాంతము అత్యంత విశ్వజనీనమైనదని

సైన్సు, ప్రపంచములోని అన్ని తత్వశాస్త్రములు అంగీకరించుచున్నవి భౌతికమైనవి గాని, మానసికమైనవి గాని ప్రకృతిలోని శక్తులన్నియు (forces) ఈ సిద్ధాంతమును అతిక్రమించలేవు అని స్వామి అభేదానంద అన్నారు స్వామి అభేదానంద శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యులు (direct student), స్వామి వివేకానంద సహచరులు ఆయన ఇంకా ఇలా అన్నారు "అంతరిక్షములో ఎలక్ట్రానుల (electrons) ప్రకంపనల దగ్గర నుండి, సూర్యుని చుట్టు భూమి పరిభ్రమించటం, సంకల్పితముగానో, అసంకల్పితముగానో మనము చేయి ఎత్తటం వంటి చిన్న కార్యం వరకు ఏదో అగోచరమగు శక్తి ద్వారా కార్యకారణ సిద్ధాంతమునునుసరించియే జరుగుచున్నవి

ఒక కారణము (cause) వలన జరిగిన కార్యము (effect) మరొక కార్యమునకు కారణముగా మారును దీనినే మరొక విధముగా చెప్పినచో ఒక ఫలితమునకు (effect) కారణము (cause) ఒక కర్మము ఈ ఫలితము మరియొక కర్మమునకు కారణమగును ఈ కార్యకారణములు, లేక కర్మము, ఫలితము (cause and effect) ఒక అనంతమైన గొలుసు వంటి పరంపర (chain) ఒక కార్యము యొక్క ఫలితము అది చేసిన వ్యక్తి, ఇతరులు కూడ దాని ఫలితం పొందుదురు ఒక హత్య జరిగినపుడు దాని ఫలితము హతుడే గాక హంతకుడు గూడ ఏదో ఒక రూపమున పొందును

'కర్మ' అను పదము ఈనాడు ఇంగ్లీషు భాషలో ఒక సహజపదముగా చేరినది సంస్కృతమున 'కృ' అను ధాతువు నుండి పుట్టినదే 'కర్మము' అను పదము భౌతిక లేక మానసిక చర్యయే కర్మము ఒక కర్మము మరొక కర్మమునకు కారణమగుట వలన 'కర్మము'లోనే కార్య, కారణములు రెండును ఇమిడి ఉన్నవి భౌతికముగాని (శారీరకము) లేక మానసికముగాని ఏ చర్య అయినను మానసికమే అగును **కర్మ సిద్ధాంతములో ఆకస్మికతకు లేక తలవని తలంపునకు స్థానము లేదు** (accidental or chance) ఆకస్మికముగానో

లేక తలవని తలంపుగా జరుగు చర్యలకు గూడ వాస్తవమునకు మన నియమిత (limited) పరిజ్ఞానము వలన మనకు అంతుబట్టిని ఏదో ఒక కారణము ఉండే ఉంటుంది అతితెలివిపరులైన కొందరు ఈ చర్యలను మానవాతీత శక్తులకు అంటగడ్తారు అది విధి (providence) అనో, దైవకృతమనో (providential) నిర్ణయిస్తారు కాని వాస్తవమునకు ఈ ఆకస్మిక చర్యలకు గూడ, మనకు తెలిసినా తెలియకపోయినా ఏదో ఒక కారణం ఉంటుంది నిర్దేశక లేక తార్కికమైన విజ్ఞానము లేనివారికి (unscientific) ఏదైతే, విధి ప్రేరితంగాను, మానవాతీతంగాను కనబడుతుందో, అదే నిర్దేశక జ్ఞానము (scientific knowledge) కలవానికి, తాత్వికునికి (philosopher) సహజంగా కనబడుతుంది దానికి కారణం వారి అంతరిక దృష్టి విశాలంగాను, విశ్వజనీనంగాను ఉంటుంది

**కర్మముల వలన కలుగు ఫలితములను, సత్ఫలితములు, దుష్ఫలితములు, మిశ్రమఫలితములుగా విభజించవచ్చు** ఏ ఇతర జీవికి అపకారము జరగకుండ కర్మము చేయువానికి గాని సంబంధిత వ్యక్తులకు గాని భౌతికంగానో, నైతికంగానో శుభము (లాభం) కలిగించునది సత్కర్మము కర్మము చేయువానికి, సంబంధిత వ్యక్తులకు, ఇతరులకు బాధ, దుఃఖము కలిగించునది దుష్కర్మము కొంతమందికి లేక చాల మందికి సంతోషము కలిగించుచు మరికొంత మందికి బాధ కలిగించునది మిశ్రమకర్మ అన్నారు

సాపేక్షత (తారతమ్యము) (relativity) తో కూడినది, కాలము, స్థలములచే (time and space) నియమితమైనది ఈ 'ప్రపంచము' ఇందు పరిపూర్ణమైన సత్ఫలితములను, ఎవరికీ ఏ రూపముగాను బాధ కలిగించనిది అయిన కర్మములు అసంభవము అని భగవద్గీతయే చెప్పియున్నది గదా! ఎవరికో ఒకరికి కొంతలో కొంత అయినను లాభము కలిగించని దుష్కర్మము గూడ ఉండదు

కావున ఒక కర్మ ఫలితమును గురించి విచారించునపుడు దుష్ఫలితముల కంటే ఎక్కువ శాతము సత్ఫలితములను కలిగించునది సత్కర్మముగానే పరిగణించవలయునని స్వామి అభేదానంద అన్నారు అటులే ఎక్కువ దుష్ఫలితములను కలిగించునది దుష్కర్మయే అవుతుంది ఇదే భగవద్గీతావాక్యం (18-48) "సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః" సారాంశము నిప్పు పొగచే కప్పబడినటుల సర్వకర్మములు దోషముచే కప్పబడియున్నవి భగవద్గీత (5-15) శ్లోకంలో మరొక విషయము కూడ చెప్పింది

శ్లో॥ నాదత్తే కస్యచిత్ పాపం న చైవ సుకృతం విభుః
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥

**ఈశ్వరుడు పురుషుల యొక్క పాపమును గాని పుణ్యమును గాని గ్రహింపడు** (న + ఆదత్తే) అజ్ఞానముచే జ్ఞానము కప్పబడుటచే, జీవులు మోహమును పొందుచున్నారు

కర్మ సిద్ధాంతములో (కార్య, కారణ సిద్ధాంతం) (The law of causation or cause and effect) మరొక ప్రధానాంశము **ప్రతి ఒక చర్యకు అదే రకమైన, అదే పరిమాణము గల ప్రతిచర్య ఉండును** (The like produces the like) ఇది భౌతిక చర్యల విషయములోనే గాక, మానసిక విషయములకు కూడ వర్తించును మానసిక చర్యలైన ఉద్దేశం లేక తలంపు (motive), కోరికలు (desires) ఆలోచనలు (thoughts) మొదలైన ఇతర మానసిక చర్యలన్నియు కర్మ సిద్ధాంతమునకు లోబడినవే

ఈ మానసిక చర్యలే మానవుని స్వభావమును నిర్ణయించును (individual ego) అదే వ్యక్తి అహంభావమునకు మూలము అనగా కర్మ ఫలితములైన ఈ మానసిక చర్యలననుసరించియే వ్యక్తులను సత్పురుషులని, దుష్టులని, మిశ్రమ స్వభావులని చెప్పుదురు బుద్ధియే స్వభావమునకు

మూలమగుచున్నది కావునను, ఆ బుద్ధి కర్మఫలానుసారముగా రూపొందును కావునను బుద్ధిః కర్మానుసారిణి (character is fate) అను ఆర్యోక్తి వ్యావహారికమైనది ఒక మనిషి వ్యక్తిత్వము లేక స్వభావము అతని గత మానసిక చర్యల (mental actions) రూపమే, మరియు వర్తమాన మానసిక చర్యల ననుసరించియే అతని భవిష్యత్తు స్వభావములో మార్పులు చోటు చేసుకొనును

కర్మము, ఫలితము ఒక గొలుసుగా చెప్పబడినందున, ప్రతి కర్మములోను దాని ఫలితము అంతర్గతంగాను, తిరిగి ప్రతి ఫలితములోను మరొక కర్మము లేక కర్మమునకు కారణము అంతర్గతంగా నుండును అనగా ప్రతి కర్మములోను కారణము, కార్యము రెండును ఒదిగి యుండును ఇది విత్తు, చెట్టు సంబంధము వంటిది (seed and tree) కావున మన బుద్ధి లేక స్వభావమును బట్టియే మంచి చెడులు జరుగుచుండును **మన కర్మల ఫలితమును మనం అనుభవించుటయే మన గత కర్మలకు పరిహారము** (compensation) మన స్వభావమునకు, మన కష్టసుఖములకు భగవంతుడు కారణము కాదు కర్మ సిద్ధాంతము ద్వారా మనుష్య స్వభావములలోని హెచ్చుతగ్గులు, భిన్నత్వము, విరుద్ధతను సహేతుకంగా (scientifically) వివరించవచ్చు

**కర్మ సిద్ధాంతములో ఊహాజనితమైన విధిలిఖితము** (hypothesis of predestination) **అను విశ్వాసమునకు స్థానము లేదు** ఈ విశ్వాసమందు మానవుని జీవితంలోని మంచి చెడులు ముందే నిర్ణయించబడి ఉంటాయి అనియు, భగవంతుని ఇచ్ఛానుసారము మనుష్యులు పాపులుగానో, పుణ్యాత్ములుగానో పుట్టుదురనియు అను విషయములు ప్రధానాంశములు కాని ఈ విశ్వాసము వలన సృష్టి ప్రణాళికలోని ప్రగతిశీల పరిణామ పురోగతి, మానవుని ధర్మము, విలువలు, ఆధ్యాత్మిక పురోగతికి మూలమైన ఆంతరిక

స్వేచ్ఛ (personalfreedom) నిర్వీర్యం అగును అపుడు జీవితము యాంత్రికము అగును అంతేగాక ఈ విశ్వాసము భగవంతుని అధర్మపరునిగాను, పక్షపాతిగాను చిత్రించును జననమునకు పూర్వమే అమాయకుడైన జీవునికి దుఃఖములు, కష్టము భగవంతుడు ఎందుకు నిర్ణయిస్తాడు పుట్టుటకు పూర్వమే ఒకరు భగవంతుని కరుణ, మరొకరు క్రోధము ఎందుకు పొందుతారు? పుట్టుకకు పూర్వమే ఒకరు పాపిగానో, పుణ్యాత్ముడుగానో నిర్ణయించబడినచో ఇక ఈ జీవితములో అతడు చేయు పనులకు ప్రాధాన్యం ఏమున్నది? భగవంతుడు కరుణామయుడు, నిష్పక్షపాతి గదా! మరి ఆయన అందరిని మంచివారుగాను, ఆధ్యాత్మికపరులుగాను సృష్టించవచ్చు గదా! విధి లిఖితము' లేక 'బ్రహ్మరాత' అను విశ్వాసమునందు ఈ ప్రశ్నలకు సమాధానము లేదు కర్మ సిద్ధాంతము నందు ఈ ప్రశ్నలు ఉదయించవు మన కర్మల ఫలితమే మన కష్టసుఖములకు, మన మంచితనము చెడ్డతనమును కారణము అని గ్రహించినపుడు **'మన రాత ఇంతే' అను మూఢ విశ్వాసమునకు తావుండదు**

కర్మ సిద్ధాంతమును గ్రహించగలిగివాడు **తన జీవితమును తానే నిర్ణయించుకొనగలడు** తన చర్యల ద్వారా, ఆలోచనల ద్వారా తన స్వభావమును తానే రూపొందించుకొనగలడు భగవంతుడు శిక్షించటం, కరుణించటం అనగా మనసత్కర్మల, దుష్కర్మల ఫలితమును మనం అనుభవించటమే **భక్తి సిద్ధాంతములో కూడ కర్మపరిపక్వము అయిన తరువాతనే అనగా అనుభవ కాలం పూర్తి అయిన తరువాతనే భగవంతుడు కరుణించును అని గదా చెప్పబడింది**

"నాదత్తే కస్యచిత్ పాపం నచైవ సుకృతం విభుః" (భగవద్గీత 5-15) అను గీతావాక్య సారాంశమే యిది

**కర్మఫలితం అనుభవించక తప్పదు అన్నారు అనుభవిస్తూనే దాని ప్రభావానికి లోనుకాకుండా ఉండాలంటే ఎలా?** ఈ అనుభవము నుండి బయటపడుటకు భగవద్గీత మార్గము సూచించుచున్నది

శ్లో॥ నమాం కర్మాణిలింపంతి నమే కర్మఫలే స్పృహా
ఇతిమాంయోఽభిజానాతి కర్మభిర్నసబధ్యతే ॥ (భగవద్గీత 4-14)

కర్మలు నన్ను అంటవు కర్మఫలమందు నాకు ఆసక్తి లేదు **ఈ విధముగ నన్ను తెలిసికొననివాడు కర్మలచే బంధింపబడడు** దీని భావము కర్మములో అకర్మమును చూడగలగటమే కర్మము, అకర్మమును గురించి పూర్వ అధ్యాయములలో వివరించుట జరిగింది అయినను సందర్భాను సారముగా ఇచట తిరిగి క్లుప్తముగా మననము చేయుట జరుగుచున్నది

భగవద్గీత 4వ అధ్యాయము 16, 17, 18 శ్లోకములలో ఇది వివరించబడినది

కర్మరహస్యము చాల నిగూఢమైనది, చాల లోతైనది కర్మ యెట్టిది, అకర్మ యెట్టిది అను విషయం పండితులు గూడ గ్రహించలేకుండ ఉన్నారు కర్మ అనగా చేయదగిన కర్మను (విహిత కర్మ) వికర్మ అనగా చేయరాని కర్మము (నిషిద్ధ కర్మ) అకర్మ అనగా ఊరకయుండు స్థితి ఇంకను విశ్లేషించినచో కర్మ అనగా సామాన్యమగు కర్మము వికర్మ అనగా రాగద్వేషరహితముగ నిష్కామముగ చేయు కర్మము అని శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి అభిప్రాయం ఇలా ఇచ్చ, ఫలాపేక్ష లేకుండ చేయు కర్మము నిత్యజీవితములో చేయకూడని కర్మముగానే కనబడుతుంది వికర్మ అనగా నిషిద్ధ కర్మము అనియే సామాన్యముగా అర్థము చెప్పబడినది

(1) కర్మ అనగా శాస్త్రవిహితమైన కర్మ అని శంకరులు అన్నారు వేదోక్తమైన కర్మ అని శ్రీధరులు, రాఘవేంద్రులు అన్నారు ఇక రామానుజులు దానిని మోక్షసాధనమైన కర్మ అన్నారు

(2) **వికర్మ** అనగా వేదముచే నిషేధింపబడిన కర్మము అని శంకరులు, శ్రీధరులు, రాఘవేంద్రులు నిర్వచించారు కామ్యకర్మలు, ద్రవ్యసంపాదనా

కర్మలు వికర్మలు అని రామానుజులు బోధించారు

(3) **అకర్మ** అనగా కర్మను చేయకుండుట అని శంకరులు, శ్రీధరులు, రాఘవేంద్రులు అన్నారు కర్మలో ఇమిడియున్న అకర్తయైన తన ఆత్మ స్వరూప జ్ఞానము అని రామానుజులు అభిప్రాయపడ్డారు

వికర్మలు అనగా నిత్యనైమిత్తిక కామ్యద్రవ్య ఆర్జనాది కర్మలు గూడ ఫలాపేక్ష విడిచి చేసినచో గుర్తించవచ్చునని రామానుజుల అభిప్రాయము శంకరులు దానిని నిషేధించుటలోని భావము అవి కామ్యకర్మలుగా నున్నంత వరకు నిషేధములే అని

18వ శ్లోకంలో "అకర్మణి చ కర్మయః" అనుటలోని భావము ('చ' అను శబ్దము చేత) వికర్మను కూడ గుర్తించినటులే అని కొందరి అభిప్రాయం

ఎవడు కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించునో అతడు బుద్ధిమంతుడు, అతడు సర్వకర్మలను ఆచరించినవాడే అగునని 18వ శ్లోకములో చెప్పబడింది

**కర్మయందు అకర్మను జూచుట** ఫలాసక్తి లేకుండ చేయబడు కర్మము బంధము కాజాలదు కర్మయోగములో ఇది ప్రధానాంశము ఫలాపేక్ష లేని కర్మము చేయుబడనట్టి కర్మయే యగును అద్దము ప్రతిబింబము ప్రక్రియ ఇటువంటిదే చుట్టు ఉన్న వస్తువులు జీవులు అవి చేయు ప్రతి చర్య అద్దములో ప్రతిబింబ రూపములో కనబడును కాని అవి చేయు ఏ చర్య కూడ అద్దమునకు అంటవు అద్దము చలనం లేకుండ నిర్మలముగా నుండును అద్దములో కర్మ జరుగుచున్నది కాని అద్దము అకర్మ స్థితిలోనే యున్నది ఈ స్థితియే కర్మములో అకర్మము ఆధ్యాత్మికంగా అత్యున్నమైన స్థితి అది యోగీశ్వరులు ఎల్లపుడు ఆ స్థితియందే ఉండి జీవయాత్రకు సంబంధించిన కార్యములు చేయుచున్నను చేయనివారే యగుచున్నారు ఈ విధముగా

ఫలాసక్తి లేకుండ చేయు కర్మ అకర్మగా, నిష్కర్మగా మారును ఏదో ఒక ఫలితం కొరకే గదా ఏ కర్మ అయినా చేయటం, కర్మకు ఫలితం తప్పక ఉంటుంది గదా ఫలాసక్తి లేకుండా కర్మ చేయటం ఏమిటి? అను సందేహం రావటం సహజం పలాసక్తి లేకుండ కర్మచేయటం అంటే ఫలితం రాకుండ కర్మ చేయటం కాదు 'కర్మ యందు' కంటే 'ఫలితం' మీదనే ఎక్కువ ఆసక్తి చూపుచు లాభమును ఆకాంక్షించటమే ఫలాసక్తి అది అకర్మ కానేరదు కర్మము సక్రమముగా నిర్వర్తిస్తూ ఫలితం మీద మనస్సు కేంద్రీకరించకుండా ఉండటమే అకర్మ నిరంతరం ఫలితం మీదనే మనసు కేంద్రీకరించినచో బంధం ఏర్పడును అట్టి బంధం లేకుండ కర్మ సవ్యముగా నిర్వర్తించినచో ఫలితం సవ్యముగానే వచ్చును అంతేగాక కర్మము చేయువానికి ఆ కర్మ బంధం ఏర్పడదు అదియే కర్మయందు అకర్మను జూచుట దీనినెరుంగుటయే కర్మయోగము కర్మయందు అకర్మను జూచుట కర్మరాహిత్యమే అగును అతడు సకల కర్మ ఫలమును పొందిన వాడే అగును 18వ శ్లోకంలో అట్టివానిని 'కృత్స్నకర్మకృత్' అనగా సకల కర్మలను ఆచరించినవాడు అన్నారు అట్లుగాక కర్మ చెడ్డది, అది బంధమగును అని ఏ కర్మము చేయకుండు వారు అకర్మను చూడలేరు వారు బుద్ధి మాంద్యులు అవుతారు

**అకర్మ యందు కర్మను జూచుట** స్వప్నమునందు సకల కార్యములు తాను చేసిన వాని వలె మానవుడు చూచును కాని స్వప్నావస్థయందు తాను ఎట్టి కార్యమును చేయని అకర్మ స్థితి యందుండును అలా అకర్మము నందు కర్మను చూచుచున్నాడు ఈ సృష్టియే ఒక కర్మము దానికి మూలము పరబ్రహ్మము (పరమాత్మ) కాని పరమాత్మ నిర్గుణుడు అతడు ఏ కర్మను చేయడు ఈ సృష్టికి అతడు కర్త కాదు ఆయనది అకర్మ స్థితి ఆయన సంకల్పము వలన సృష్టియను కర్మము దానంతట అదే జరుగుచున్నది అది అకర్మ యందు కర్మ చూచుటయే యగును అనగా నిర్గుణుడు కర్త కానివాడు (అకర్మ) అయిన పరమాత్మ యందు సగుణుడు, సంకల్పము వలన కర్త

అయిన (కర్మ) సృష్టికర్తను చూచుటయే అకర్మము నందు కర్మమును జూచుట దీనిని వ్యావహారికముగా చెప్పినచో కొందరు దేహ ఇంద్రియములను బంధించగలిగినను వాసనలకు దూరము కాలేక మనస్సు ద్వారా కర్మములు చేయుదురు అనగా చేసినట్లు అనుభవము పొందుదురు వాస్తవమునకు బంధరాహిత్యము నిర్ణయించునది మనస్సే కాని ఇంద్రియములు కావు ఇంద్రియములను బిగబట్టి చిత్తముతో అన్ని కర్మలు చేయుట అకర్మమునందు కర్మము జూచుట అనవచ్చును అది ఉత్తమాచరణ ద్వారా చిత్తము ద్వారా కర్మము నెరవేర్చగలిగినచో అది అకర్మమునందు కర్మమే అగును ఇదియే కర్మ రహస్యము

కర్మఫలముగా శిక్షగాని, శుభముగాని పొందటం (compensation) అనగా జరిగిన చర్యకు (action) బదులుగా వచ్చు మరొక చర్య ద్వారా సరితూగునట్లు (balancing) చేయటం లేక జరగటం కర్మసిద్ధాంత సారాంశము చర్యకు ప్రతిచర్య వలెనే కర్మము (కారణము) దాని ఫలితము (cause and effect) పరిమాణములోను, స్వభావములోను (quantity and quality) సరిసమానముగా నుండును సృష్టి ప్రణాళికననుసరించి ప్రకృతి శక్తులు తమ లాభమునకు గాని, నష్టమునకు గాని ఏ చర్య చేయవు కేవలం పరిపూర్ణమైన సమతుల్యమును (perfect harmony) కాపాడుటయే ప్రకృతిశక్తుల ధ్యేయము సముద్రములోని ఆటుపోటులు, ఒక ప్రదేశమందు అతిఉష్ణము, మరొక చోట అతి శీతలము, భూగోళమందు ఒక వైపు పగలు అదే సమయమున మరొకవైపు రాత్రి, ఈ విధమగు సమతుల్యమును ఏర్పరచుటయే ప్రకృతి చర్యల అంతరార్థము ఇదే కర్మ, కర్మ ఫలితముల అంతరార్థము గూడ

భౌతికముగానే కాక మానసిక, బౌద్ధిక (బుద్ధికి సంబంధించిన), నైతిక, ఆధ్యాత్మిక తలములందు కూడ ప్రతి శక్తి చర్యలందును ఈ సమతుల్య సిద్ధాంతమే సక్రమపద్ధతిలో జరుగుచున్నట్లు స్పష్టముగ గోచరించును

ప్రకృతియందు ఈ విషయములో 'బేరసారము'లకు ఆస్కారము లేదు మనస్సు, వాక్కు, కర్మల ద్వారా మనము కోరిన చర్య జరిపినపుడే దానికి తగిన ఫలితం మనకు దక్కుతుంది చర్య లేనపుడు ఫలితము లేదు చర్యకు సమమగు ప్రతిచర్య లేక ఫలితము అచేతనముగా కన్పడు పదార్థ విషయములోనే గాక చేతనమగు జీవులు, వారి బుద్ధి విషయములో గూడ వర్తించుసు మనము భౌతికంగాను, మానసికంగాను పడు బాధలు మనకు రావలసినవి కావు, అనిపిస్తుంది కాని అవి ఎందువలన వస్తున్నాయో కారణము గ్రహించుటకు మనము ప్రయత్నించినచో, ఇది, ఏనాటిదో మన చర్యలకు ప్రతిచర్య (ప్రతిఫలము) మాత్రమే అని తెలియవచ్చును కర్మఫలమును ఎవరూ అధిగమించలేరు

కాని ఇక్కడ మనకు అర్థముకాని విషయమొకటి ఉన్నది కర్మ, కర్మ ఫలితములనునవి బహుక్లిష్టమైన విషయములు ఇది ఆది, అంతం లేని ఒక వలయము వంటిది కర్మ జరుగుట, దాని ఫలితం అనుభవంలోకి వచ్చుటకు అది పూర్తి అగుటకు ఎంత కాలము పట్టును? అను ప్రశ్నలకు సమాధానము మనకు అంతుబట్టదు ఎందుకనగా, కొన్ని కర్మ ఫలితములు అతితక్కువ కాలంలోనే అనగా ఈ జన్మలోనే అనుభవములోనికి వచ్చును మరికొన్ని కర్మ ఫలితములు మరుజన్మలో అనుభవములోకి వచ్చును

ఆత్మ, పునర్జన్మలందు విశ్వాసము లేని వారు ఏ జన్మకు ఆ జన్మ పుట్టుకతో మొదలు, మరణముతో అంతము అందురు అపుడు మన కష్ట సుఖములకు మూలమైన కారణము గోచరించదు ఎందుకనగా మన కష్టసుఖములన్నిటికి కారణము ఈ జన్మలో మన చర్యలు కాకపోవచ్చును గదా! గతము, వర్తమానము, భవిష్యత్తు (Past, Present and Future) ఒక అంతములేని కాలప్రవాహము ఈ కాలప్రవాహములో ఒక్క క్షణము గాని, రోజు గాని మరొకదానితో సంబంధము లేని (isolated) కాలప్రమాణము కాదు ఈ రోజు రేపటికి గతము ఆ రేపు వర్తమానమగును ఒకదాని నుండి

మరొకదానిని వేరుచేయుటకు వీలుపడదు మనము గమనిస్తూనే ఉంటాము గదా! ఒక రోజు మనం చేసిన పనికి ఫలితం రావటానికి కొన్ని రోజులు పట్టవచ్చును ఈ వర్తమాన భౌతిక జీవితము ప్రతి రోజు మనకు కలుగు అనుభవముల సముదాయము అటులే ఈ అనంత విశ్వములోని సృష్టియందు ఆత్మ (జీవాత్మ) యొక్క 'జీవితము' అనేక భౌతిక జీవితములందలి అనుభవముల సముదాయము

ఈ భౌతిక జీవితములోని కష్టసుఖములకు మూలము 'ఆత్మజీవితము' (life of the soul) నందు కనబడును ఒక జన్మములోని జీవితకాలముగా చెప్పబడిన నూరు సంవత్సరముల కాలమందు 24 గంటల కాలము (ఒక రోజు) అతిచిన్నదిగా కన్పడును అటులే జన్మము, పునర్జన్మములతో కూడిన అనంతమైన 'ఆత్మ జీవితమందు' ఒక జన్మకాలము - అది నూరు సంవత్సరములైనను - అతిచిన్నదిగా కన్పడును అందువలన వర్తమాన జన్మమందు మనము అనుభవించు కర్మ ఫలితములకు కారణము ఈ జన్మలోని మన చర్యలు మాత్రమే కాకపోవచ్చును గత జన్మలందలి కర్మ ఈ జన్మయందు ప్రారబ్ధ కర్మగా అనుభవములోనికి వచ్చును ఇదే కర్మసిద్ధాంతములో చెప్పబడిన కర్మ పరిహారము అనగా కర్మకు **సమతుల్యమగుట కర్మఫలితమును అనుభవించుట** (The Law of Compensation)

ఈ **సమతుల్యమగు** కర్మఫలితమును వ్యావహారికముగా సత్కర్మ ఫలితములకే అన్వయించుదురు దుష్కర్మ ఫలితములను **దుష్ఫలితము లేక శిక్ష (retribution)** అందురు ఎవరినైనా మోసం చేసి స్వలాభం పొంది ఆనందించటం ఆత్మద్రోహమే అవుతుంది ఎందుకనగా ఇపుడు ఆనందించటం ఎపుడో ఒక రోజు దాని వలన దుఃఖము కలుగునను సత్యమును గ్రహించ లేకపోవటమే కర్మము, దాని ఫలితము ఒక చెట్టు మీద పుష్పము ఒక కాయగా (ఫలము) మార్పు చెందటం వంటిదే

ఒక కర్మ ఫలితము ముందు ఆంతరికంగా (మానసికముగా) కలిగి అటుపై భౌతికంగా లాభంగానో, నష్టముగానో, సుఖముగానో, దుఃఖముగానో, ఆరోగ్యముగానో, అనారోగ్యముగానో కనబడును ఈ కర్మ ఫలితములు ముందుగానే 'ఆత్మ' అనుభవములోనికి వస్తాయి ఇవి బాహ్యముగా గోచరించుటకు కొంత సమయం పడుతుంది అవి గోచరించినపుడు పరిస్థితులు బాగున్నాయనో లేక పరిస్థితులు బాగలేవు అనో అంటాము ఆ పరిస్థితులే మన ఆలోచనలకు, చర్యలకు బాహ్యరూపములు బౌద్ధులు 'ఇష్టదైవమును' అంగీకరించరు ఆత్మ అస్తిత్వమును (entity) అంగీకరించరు అయినను వారు తమ నీతి, మత సిద్ధాంతములను విశ్వజనీనమైన కర్మ సిద్ధాంతము ఆధారంగానే నిర్మించారు వేదాంతతత్వశాస్త్రములో కర్మసిద్ధాంతము అత్యంత ప్రధానమైనది

ఈ విషయమును గురించి శ్రీ రామకృష్ణ పరమహంస శిష్యులు స్వామి అభేదానంద ఇచ్చిన విశ్లేషణ ఎంతో ఉపయోగకరమైనది

"కర్మ సిద్ధాంతమును గురించి వేదాంతమునకు బౌద్ధమతమునకు ప్రధానమైన ఒక భేదమున్నది కర్మములు చేయు కర్త, ఆ కర్మ ఫలితము అనుభవించు ఆత్మ అనునది లేదు అంటారు బౌద్ధులు కర్మ చేయువాడు, అనుభవించువాడు అను ద్వైతార్థమునిచ్చు రెండు లేవు అంటారు (అనగా గత జన్మలోని కర్మ ఆత్మ ద్వారా మరొక జన్మలోని శరీరము అనుభవించుట అనునది లేదు అంటారు) చేయువాడు, ఆలోచించువాడు, సుఖదుఃఖములను అనుభవించువాడు అనునవి సంభాషణలో ఉపయోగపడు శబ్దములు (మాటలు) మాత్రమే అంటారు వారు కర్మములు ఒకని వ్యక్తిత్వమును (స్వభావము) రూపొందించుననియు, అది మరణానంతరము కూడ స్థిరముగా నుండునని వారి వాదన మన ఇంద్రియములైన కన్నులు చూచును, చెవులు వినును, ఆలోచనలు స్పందన కలిగించును, - ఈ రకమైన మానసిక, భౌతిక

చర్యలు సంస్కారములనబడు అతిసూక్ష్మమైన చర్యారూపములుగను, ఆలోచనా రూపములుగను, (subtle forms such as deed forms, thought forms) ఏర్పడి, అవి మరణానంతరము గూడ అలాగే ఉండి, భవిష్యత్తు నందు మరొక శరీరము ద్వారా కర్మ (కార్యకారణ సిద్ధాంతము) సిద్ధాంతము ప్రకారం పనిచేయును అని బౌద్ధుల సిద్ధాంతము "

"కారణ శరీరమును అందున్న ఆత్మను ఆవరించి ఈ కర్మ ఫలితములు సంస్కారముల రూపమున ఆత్మ ద్వారా మరొక శరీరమున ప్రవేశించునని వేదాంతం చెప్తుంది కాని ఆత్మ అనేది లేదు, సంస్కారములనబడు సూక్ష్మరూపము లున్నాయి, అవే మరొక శరీరమున ప్రవేశించునని బౌద్ధమతం అంటుంది "

"బుద్ధి, సంస్కారములు ఆత్మ ననుసరించియే ఉండును, ఆత్మయే కర్మములు చేయువాడు అనుభవించువాడు (doer and enjoyer or sufferer) అని వేదాంతకర్మ సిద్ధాంతం కర్త లేనిచో అనగా ఆత్మలేనిచో భౌతిక, మానసిక చర్యలు, వాటికి ఆధారమైన బుద్ధి అచేతనములుగానే మిగులును కర్తయే లేనిచో అనగా ఆత్మకు అస్తిత్వము లేనిచో కర్మ చేసినవాడే ఫలమును పొందువాడు కానేరడు అని బౌద్ధమును వేదాంతము తిరస్కరించింది కర్మములు చేయువాడు, అనుభవించువాడు ఒకడే అను గుర్తింపు లేనిచో, భోజనము ఒకడు చేసిన మరొకరి పొట్ట (కడుపు) నిండినది అనునట్లు ఉండును అది ఎంతో అసంభవము, అసంబద్ధము చర్య జరిగిన చోటుకే ప్రతిచర్య చేరును లేనిచో ఒకడు అన్నియు దుష్కర్మలు చేయుచు తాను మాత్రం మరొకరి సత్కర్మల ఫలితమును పొందును అనునట్లుండును కర్మ, కర్మ ఫలితములు ఒక ఆది, అంతము లేని గొలుసు వంటివి కావున వీటికి కర్త, అనుభవము పొందునది అయిన ఆత్మ కూడ ఆది, అంతము లేనిది "

"గతకర్మ అనగా కారణశరీరములో నిలువయుండు **సంచితకర్మ** అందు ఈ జన్మమందు అనుభవములోనికి వచ్చునది **ప్రారబ్ధకర్మ** ఈ

జన్మయందు మనము చేయునది **క్రియమాణ కర్మ** భవిష్యత్తు చర్యలు **ఆగామి కర్మ** అన్నారు "

"క్రైస్తవమతం పునర్జన్మను గురించి సూటిగా చెప్పకపోయినప్పటికి, ఈ మతం ఆత్మ ఉన్నదని విశ్వసించినట్లు, క్రియ ప్రతిక్రియ లేక ఫలితం అనబడు కర్మ సిద్ధాంతమును విశ్వసించునట్లు వారి మత గ్రంధము బైబిల్ ద్వారా మనకు గోచరించును క్రైస్తవ ఋషులలో ఒకడైన పాల్ (St Paul) గెలాషియనులకు (Galatians) వ్రాసిన పత్రము (Epistle or letter) నందు ఇలా అన్నాడు - (7th verse) "What so ever a man soweth, that shall he also reap" - మానవుడు ఏది నాటునో, దాని ఫలమునే అతడు పొందును - (9th verse) ఇంకా ఇలా అన్నాడు "And let us not be weary in well doing, for in due season we shall reap, if we faint not" - మంచి చేయుట యందు మనము అలసట చెందవలదు తగిన సమయమందు దాని ఫలము మనము పొందుదుము, అప్పటికి మనము నిస్పృహతో మూర్ఛ చెందనిచో "

ఇది మనము చేయు కర్మల ఫలితమును అనుభవించుదుము అను కర్మ సిద్ధాంతమును పోలియున్నది గదా! "అందువలన పునర్జన్మ - ఆత్మను పరోక్షముగా విశ్వసించినటులే అగును గదా! "బహుశ క్రైస్తు (Christ) కూడ కర్మ సిద్ధాంతమును గూర్చియే పరోక్షముగా బోధించెనని ఆయన తన శిష్యుని ప్రశ్నకు ఇచ్చిన సమాధానమందు మనకు గోచరించును "Who did sin, this man or his parents that he was born blind? Jesus answered Neither hath this man sinned nor his parents " - ఇతను పుట్టుగుడ్డిగా జన్మించుటకు అతను పాపము చేసెనా? లేక అతని తలిదండ్రులు పాపము చేసిరా? అని శిష్యుని ప్రశ్న దానికి క్రైస్తు సమాధానం 'ఇతను కాని అతని తలిదండ్రులు గాని పాపము చేయలేదు' - అతను పుట్టుగుడ్డి కావున అతనిది ఈ జన్మ కర్మఫలము అనుటకు వీలుపడదు అతని తలిదండ్రుల పాపఫలము కూడ

కానపుడు మరి అతని గ్రుడ్డితనమునకు కారణమేమిటి? వారసత్వమా? అది తగిన సమాధానము కాదు వారసత్వ దోషములు రావచ్చు గాని తప్పక వచ్చునని కాదు గదా! ఇక తాత్త్వికులు అది భగవదేచ్ఛ అంటారు విధి నిర్ణయం ముందు జరుగుతుంది అంటారు కాని 'విధి వ్రాత' అనునది భగవంతుని పక్షపాతిగాను, అధర్మపరునిగాను రూపొందిస్తుంది దీనికి సహేతుకమైన సమాధానము కర్మ సిద్ధాంతము నందు మాత్రమే ఉన్నది ఆ వ్యక్తి సంచిత కర్మ ఫలితమే ఈ జన్మలోని పుట్టుగ్రుడ్డితనమునకు కారణము అని వేదాంతకర్మసిద్ధాంత సమాధానము ఇంతకంటే సహేతుకమైన సమాధానం మరొకటి లేదు అని స్వామి అభేదానంద అంటారు

ఈ సృష్టి విధానమును, మన ఆలోచనలను, చర్యలను శాసించు కర్మసిద్ధాంతము ఇంత విశ్వజనీనమైనపుడు, వర్తమానములో గాని, భవిష్యత్తులో గాని మన కర్మఫలములను మనమే అనుభవించి తీరవలయునని కర్మ సిద్ధాంతము అంత కఠినముగా శాసించునపుడు, మన చర్యలకు సమతుల్యములగు ప్రతిచర్యలు జరుగునను విషయము సత్యమైనపుడు, కర్మములకు కర్తయైన వాడే ఫలితములను గూడ అనుభవించి తీరవలయునను విషయము రూఢియైనపుడు, మనము నిత్యము చేయు ప్రతి చర్యలోను ఎంత జాగ్రత్త వహించవలయునో గ్రహించినపుడు మాత్రమే జీవితములో కలుగు దుర్భరములగు కర్మ ఫలితముల నుండి విముక్తి కలుగును ఈ సత్యమును గ్రహించినవాడు 'విధి వ్రాత' అనుచు భగవంతుని నిందించుటకు పాల్పడడు అంతేగాక ఈ జన్మమందు తనకు తెలిసి ఏ దుష్కృత్యము చేయనపుడు బాధలు ఎందు వలన కలుగుచున్నవో అతడు గ్రహించగలుగుతాడు మన జీవిత సరళికి మన చర్యలే మూలము కర్మ దేనినీ సృష్టించదు, దానికి ప్రణాళిక లేదు మన చర్యలే కర్మలు కర్మఫలములగు బాధలను అనుభవించుట ద్వారా భవిష్య జీవితము సుఖముగాను, ప్రశాంతముగాను చేసుకొనవచ్చును బాధలు అనుభవించుటకు ఎంతో సహనముతోను దురాశకు

దూరముగాను ఉండవలయును

మానసిక చర్యలు (thought actions) ప్రథమముగా మిణుకు మిణుకు మను వెలుగు కిరణము వలె క్రింది జాతి జంతువులలో ప్రారంభమై పరిణామ దశ మనిషి స్థాయికి చేరినపుడు మానసికశక్తి అత్యున్నత స్థాయికి చేరింది అంటారు స్వామి అభేదానంద మానవులలో మనసు అత్యున్నత స్థాయి చైతన్యము (activity) పొందినది చర్యలకు మూలమైన ఈ స్థాయిని 'రజస్' అన్నారు రజస్ అనగా చర్యలకు వలసిన చైతన్యము (activity) దీని ద్వారా మానవుడు మానసికంగాను, భౌతిక చర్యల ద్వార ను తనను తాను ప్రకటించుకొనును (వ్యక్తము చేసుకొనును) (expresses himself)

ఇవి మనసుపై ముద్ర వేయును ఈ ముద్రలు భవిష్య చర్యలకు, కోరికలకు మూలము (విత్తు) అగును భౌతికమైనను, మానసికమైనను ప్రతి చర్యకు మూడు స్థాయిలు ఉన్నవి అన్నారు స్వామి అభేదానంద

**మొదటిది** మానసిక చర్యలు అవే కోరికలు

**రెండవది** వాటికి బాహ్యరూపమగు చర్యలు (భౌతిక చర్యలు)

**మూడవది** వాటి వలన మనసుపై ఏర్పడు ముద్రలు (impressions)

అటుపై చర్యలు ముద్రల రూపంలో కొంతకాలం నిద్రాణంగా ఉండి తిరిగి చైతన్యమై పై మూడు స్థాయిల ద్వారా తిరిగి మనసుపై ముద్రలు ఏర్పరచును ప్రతి వ్యక్తి ఈ మానసిక చర్య (కోరిక), భౌతిక చర్య, మనసున ఏర్పడు ముద్ర అనబడు ఈ మూడు స్థాయిలలో బద్ధుడై యున్నాడు మానసిక చర్యలు (కోరికలు) ఉన్నంత వరకు మన భౌతిక చర్యలను నిరోధించలేము మన ఆంతరిక స్వభావము వలన (inner nature) భౌతికంగా ఎంతో శ్రమపడతుంటాము భగవద్గీత కూడ ఇదే సత్యమని చెప్పింది (3-5)

శ్లో॥ నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్

కార్యతే హ్యవశః కర్మసర్వః ప్రకృతి జైర్గుణైః ॥

జాతు = ఎప్పుడైనను, నహి + తిష్ఠతి + అకర్మకృత్ ప్రకృతి జైః = ప్రకృతి (మాయ) వలన పుట్టిన ఎవ్వడైనా, ఎక్కడైనా, ఎన్నడైనా కర్మము చేయకుండా ఒక్క క్షణం కూడా ఉండలేడు ప్రకృతి వలన కలిగిన సత్త్వరజస్తమో గుణములతో కూడినవై సమస్త ప్రాణులూ, వివశములై కర్మ చేస్తూనే ఉంటాయి

ప్రకృతి అనగా జన్మకు కారణమైనట్టియు, పూర్వము నుండియే సంపాదింపబడిన కర్మలు ఈ కర్మలు మూడు రకములు - మానసిక కర్మ, వాచిక కర్మ, కాయిక కర్మ అవే మనో వాక్కాయములను కర్మలు సమస్త జీవులు ఒక్క నిద్రావస్థలో తప్ప మిగిలిన రెండు అవస్థలందు అనగా జాగ్రత్ (మేలుకొని) స్వప్నావస్థలందు పై మూడు విధముల కర్మములందు ఏదో ఒకటి గాని లేక రెండు మూడు విధములగు కర్మలు చేస్తూనే ఉంటాయి ఒక్క బ్రహ్మజ్ఞాని తప్ప మరెవరు ఉదాసీనంగా ఉండలేరు

ఎందరో తాత్వికులు, మహాకవులు, ఈ ప్రపంచమంతా ఒక నాటక రంగం అన్నారు మనమంతా ఆ రంగస్థలిపై పాత్రధారులమగు నటీనటులము అన్నారు ఈ జీవితమే ఒక నాటకం ఈ నాటకం నిరంతరం సాగుతూనే ఉంటుంది అందు స్థూల శరీరం పొందిన అన్ని జీవాత్మలు నటులే జీవాత్మ మనసు ద్వారా తనకు తగిన పాత్రను ఎంచుకుని అందు ప్రవేశించి ఆ పాత్ర కోరికలు, స్వభావము శక్తి ననుసరించి వాని చర్యలను ఈ రంగస్థలిపై ప్రదర్శిస్తూ ఉంటుంది ఒకరు చక్రవర్తిగానో, దేశాధ్యక్షునిగానో నటిస్తే, మరొకరు వ్యాపారవేత్తగానో, డాక్టరుగానో లేక న్యాయవేత్తగానో చరిస్తే, ఇంకొకరు తండ్రిగానో, తల్లిగానో నిత్యం తమ పాత్రలను పోషిస్తూ, తెలిసియో, తెలియకో, అనంతమైన ఈ ప్రపంచములోని జీవితమను అఖండమగు ఈ నాటకరంగములో తమ వంతు పాత్రను నిర్వహిస్తూ ఉన్నాయి ఆంగ్ల నాటకకర్త షేక్స్పియర్ ఈ విషయమును ఎంతో చక్కగా వర్ణించారు

**(As you like it – Act II – Scene VII) సప్తాంక జీవితం**

ప్రపంచమే రంగస్థలం,
నటీనటులు స్త్రీపురుషులంతా
రంగప్రవేశం, నిష్క్రమణం,
ధరిస్తారు ప్రతి ఒక్కరు ఎన్నో పాత్రలు జీవిత సమయంలో
అవి ఏడు అంకాలు ప్రధమం శైశవం,
అమ్మ ఒడిలో పాలకి గోల, అటుపై ఒకింత వమనం
తదుపరి విద్యార్థి ప్రకాశవదనం,
అడుగులో అడుగు అయిష్టంగా బడికి.
ఇక యవ్వనం, తోడు ప్రేమాయణం
కొలిమి వలే దీర్ఘశ్వాసల ప్రేమ గీతాలాపన
అటుపై జీవన సమరం సిపాయి వోలె,
శార్దూల విక్రీడిత పటుత్వం, ఆపదల నోర్చి,
క్షణభంగుర కీర్తి శిఖరారోహణం
తరువాత, వయసు మీరిన భారీ ఉదరం,
నిశిత దృష్టి, పండిన అనుభవ వివేకం,
ఉక్తులతో నిండు పాత్ర పోషణం
ఇక విశ్రాంత ఏకాంతం,
జారిన పటుత్వం, చిక్కిన శరీరం,
దానికి అందని అంతుచిక్కని ప్రపంచం,
గొంతులో జీర, మాటలో పిగులు
ఘటనల సమాహార జీవితం
చేరుతుంది చరమాంకం మరపులో
మరుగుపడు అనుభవ వివేకం
మారిన రూపురేఖలు

లేదు నోరు, లేదు చూపు, లేదు రుచి,
ఏమియు లేని శిశువును బోలు చివరి అంకం

ఆంగ్ల మహాకవి కీట్సు ఋతువుల ప్రతీక జీవితం అన్నాడు

**(Human Seasons) మానవ ఋతువులు**

ఏడాదికాలం ఋతువులు నాలుగు,
మనిషి మనసులో కూడ నాలుగే ఋతువులు
పుష్టి గల వసంతం, తుష్టి గల ఊహలు
తనివితీర సౌందర్య ఆరాధనం
గ్రీష్మంలో వసంతం నాటి సుకుమార
శృంగార మధుర విలాసపర్యాలోచనలు,
స్వర్గతుల్యం స్వప్నవిహారం
తదుపరి శరత్తులో రెక్కలుడిగిన పక్షి,
తృప్తితో నిర్వ్యాపారం,
మంచు తెరల వీక్షణం,
ఇంటి ముంగటి నిర్లిప్త నీటి ప్రవాహంలా
సాగిపోతుంది జీవితం
చివరిది హేమంతం,
ముదిరిన చలి, ముగ్గిన శరీరం
ఈ ఋతువులు లేని శరీరమే లేదు

కాని ఈ ప్రపంచమను రంగస్థలిపై తామంతా నటీనటులము మాత్రమే అను సత్యము గ్రహించగలిగినది ఎంతమంది? చాల తక్కువ మంది అంతేకాదు, తాము నటించు పాత్రలు తాము ఎంచుకొనినవే అను సత్యమును గూడ గ్రహించలేరు దానికి తోడు, ఎవరో అగోచరుడగు వ్యక్తి తమను ఈ నాటకములోని పాత్రలలో నటింపజేస్తాడు అను భ్రమకు లోనగుదురు

తాము ఆ భ్రమలో నున్నపుడు ఆ అదృశ్య వ్యక్తి సంతసించుననని కూడ తలుస్తారు ఇక తమకు బాధలు కలిగినపుడు ఆ అదృశ్యశక్తిని నిందిస్తారు ఆ భగవంతుడు ఆడు చదరంగమే ఈ ప్రపంచమని, మనమంతా ఆయన చేతిలో పావులము అను నానుడి వ్యావహారికం అయింది ఇది సత్యమా? ఇది సత్యమూ కాదు అసత్యమూ కాదు కర్మ సిద్ధాంత అంతరార్థమును గ్రహించలేని స్థూలదృష్టికి ఇది సత్యముగానే గోచరించును స్థూలదృష్టియే భ్రమ అని వేదాంతం చెప్తుంది ఆ భ్రమలో నున్నంత వరకు మనకు గోచరమగు సర్వం వాస్తవం అనిపిస్తుంది పరమాత్మ సంకల్పం వలన 'స్ఫోటం' (Sphota or Big Bang) ద్వారా పరమాత్మ చైతన్యము అనబడు (activity) మాయచే పదార్థము, శక్తి ఏర్పడినవి ఆ మాయయే ప్రకృతి పదార్థము, శక్తి సంయోగమే ప్రపంచము అనగా సృష్టి ఈ సంయోగము కలిగించినది పరమాత్మ చైతన్యమైన మాయ అనబడు ప్రకృతి ఈ ప్రకృతిలో అనగా మాయలో వ్యాపించి ఉన్న పరమాత్మయే వైశ్వానరుడు మాయ (ఉన్నది అను భ్రమను కలిగించునది)తో ఏర్పడిన పదార్థ, శక్తి సంయోగము నిర్లిప్తముగా ఉండదు నిరంతరం ఏదో ఒక చర్యకు పాల్పడుతూ ఉంటుంది ఆ చర్యలకు ప్రతిచర్యలు ఫలితాలు ఉంటాయి వాటి ద్వారా ఇంక కొన్ని చర్యలు, ప్రతిచర్యలు, ఫలితాలు ఇదే ప్రకృతి చైతన్యం లేక మాయ దీనికి పరమాత్మ అనగా వైశ్వానరుడు సాక్షి ఇందు ఆయన ప్రమేయం ఉండదు ఈ ప్రకృతి చైతన్యమే సృష్టి ప్రణాళిక అదే కర్మ సిద్ధాంతం ప్రతిఒక్కడు ఆత్మజ్ఞానసిద్ధి కలుగు వరకు ప్రకృతి ప్రణాళికలో సాగుతూనే ఉంటాడు

ఈ ప్రపంచ నాటక రంగంలో నటీనటులు తాము ధరించిన పాత్రలు నచ్చనపుడు, ఆకర్షణీయంగా ఉన్నదనిపించిన మరొకరు ధరించిన పాత్రలలోనికి మారుచుందురు ఈ విధముగా ఒకదాని నుండి మరొకదానిలోనికి మారుతు, అనుభవము గడిస్తూ నాటకము యొక్క ధ్యేయము సాధించుటకు తోడ్పడుతూ సాగిపోతూ ఉంటారు ప్రకృతి యనబడు మాయ వలన కలుగు బంధము

నుండి జీవాత్మ విముక్తి సాధనయే ఈ సృష్టి ప్రణాళిక ఆశయం జీవాత్మను ఆవరించి యున్న స్థూలశరీరము యొక్క అజ్ఞానం, స్వార్థం, ఆశ మొదలైన వాటి వలననే ఈ బంధం ఏర్పడుతోంది ఈ అనుబంధం నుండి విముక్తి పొందిన జీవాత్మ ప్రపంచ రంగస్థలము నుండి నిష్క్రమిస్తుంది తిరిగి ప్రవేశించదు

ప్రతి ఒక్క జీవాత్మ ప్రపంచ నాటక రంగమందు ధరించు విభిన్న పాత్రలకు మూలము నటీనటులందరిలో అనగా స్త్రీపురుషులందరిలో ఆంతరికంగానే ఉంటుంది కాని బాహ్యంగా ఎక్కడా ఉండదు ఒక విత్తనము బ్రహ్మాండమైన వృక్షముగా పెరుగుటకు వలసిన శక్తి ఆ విత్తనములోనే అంతర్లీనంగా ఉంటుంది విత్తనము భూమిలోపల పడగానే ఆ శక్తి విజృంభించి ఆ విత్తులోని ప్రత్యేకతలను బట్టి, వృక్షముగానో, చిన్న చెట్టుగానో లేక పొదగానో రూపొందుతుంది ఇటులే ప్రతి జీవాత్మలో నిద్రాణంగా అంతర్లీనంగా ఉన్న ఈ శక్తి తగిన సమయంలో మేల్కొని దానిని చైతన్యపరచి ఈ సృష్టి నాటక రంగంలో ఏదో ఒక పాత్ర ధరించునటుల ప్రోద్బలము చేయును అంతర్లీనంగా ఉన్న ఈ శక్తులే కర్మఫలములుగా ఏర్పడిన సంస్కారములు ఈ సంస్కారములే కోరికలకు, చర్యలకు (activities) కారణమగును ఈ సంస్కారములు నిద్రాణంగా ఉన్నంత వరకు ఏ చర్యలు జరగవు నిద్రాణంగా ఉన్న ఈ స్థితిని 'తమస్సు' అన్నారు స్వామి అభేదానంద ఉదాహరణకు, మనము గాఢ నిద్రలో నున్నపుడు మన చలనశక్తులన్నియు నిశ్చేష్టముగా లేక అచేతనముగా ఉంటాయి (inert) జాగ్రతావస్థయందు ఆ శక్తులు మేల్కొని మానసికంగా ప్రకంపనలు కలుగజేస్తాయి ఈ ప్రకంపనలే భౌతిక చర్యలకు మూలము భౌతిక చర్యలకు ముందు మానసిక చర్యలు తప్పక జరుగుతాయి

జీవమునకు మూలమైన ప్రతి బీజకణము నందు అనంతమైన శక్యత (potentiality) అనగా సాధ్యతకు వలసిన శక్తి ఉంటుంది ఈ శక్యతలు

అచేతనమైన తమ స్థితి నుండి చేతనములైన కోరికల స్థితికి సాగినపుడు బీజకణమును అనేక పరిణామ దశల ద్వారా ముందుకు తీసుకు వెళ్లను వృక్ష దశ నుండి జంతు దశకు అటుపై మానవదశకు చేర్చును

భగవంతుడు జగన్నాటక సూత్రధారి అను వాక్యం ఎన్నో కావ్యముల లోను, పురాణాలలోను, పౌరాణిక నాటకములలోను, పురాణాలలోను మనకు కనబడుతూ ఉంటుంది ఇచట భగవంతుడు అనగా శ్రీ మహావిష్ణువు, లేక శ్రీకృష్ణునిగానే అన్వయిస్తుంటారు సూత్రధారి యనగా నాటకం నడిపించువాడు లేక రంగస్థలమును నిర్వహించువాడు అని యర్థము పాత్రల హావ, భావములను ప్రదర్శించేది, నటీనటులు మాత్రమే కాని సూత్రధారుడు కాదు నిర్గుణుడైన పరమాత్మకు సృష్టి సంకల్పము కలిగినపుడు ఆయనలోని చైతన్యశక్తి మేల్కొనగా ఆయన సగుణుడైన విరాట్ పురుషుడైనాడు ఆ విరాట్ పురుషుడు తన నుండి ఆ శక్తిని బయలుపరచి ఆ శక్తి ద్వారా సృష్టి ప్రణాళిక ఏర్పరచినాడు ఆ శక్తియే ప్రకృతి ప్రకృతి చర్యయే సృష్టి విరాట్ పురుషుడు వైశ్వానరుడుగా విశ్వమంతా అనగా ప్రకృతియంతా వ్యాపించి సృష్టి ప్రణాళికను నిర్వహిస్తున్నాడు (manage) సృష్టికి మూలం (కారణం) ఆయనే అయినను, సృష్టి యందు జరుగు చర్యలతో ఆయనకు ప్రమేయం లేదు సృష్టి ప్రణాళికకు అవాంతరములు రాకుండ సాక్షిగా దానిని పరిశీలిస్తూ ఉన్నాడు ప్రకృతిలోని పదార్థ, శక్తుల సంయోగ, వియోగములు, పరివర్తనలు వాటి వలన జరుగు చర్యలు, ప్రతిచర్యలు, వాటి ఫలితములు వాటి కర్తలకు చెందునట్లు ప్రకృతి ద్వారా ఏర్పాటు చేసి ఆ ఏర్పాటును పరిరక్షించుచుండును(పర్యవేక్షించుచుండును) (organize or supervise) సృష్టి ప్రణాళికా పరిరక్షణకు ప్రకృతి ఒక మాధ్యమము (medium) జీవులు పరికరములు కర్మాగారమందు స్విచ్ వేయగానే యంత్రములు వాటంతట అవే పనిచేసి ఉత్పాదన కలిగించును స్విచ్ వేయటమే పరమాత్మ సంకల్పము యంత్రాగారమే ప్రకృతి యంత్రములు నడుచు విధానమే ప్రణాళిక యంత్రములే జీవులు యంత్రములు చేయు

పనియే కర్మ ఉత్పాదనయే (production) కర్మ ఫలితము స్విచ్ వేసిననాడు ఏ పనియు చేయడు యంత్రములు సక్రమముగా పనిచేయుచున్నవో లేదో నని పరిశీలన మాత్రమే చేయును ఆ విధముగా అతడు యంత్రాగారమునకు సూత్రధారి యంత్రములు స్వయం ప్రవర్తకములు అటులే జీవులు స్వయం ప్రవర్తకులు వారి కర్మములకు వారే బాధ్యులు భగవంతుడు పరిశీలకుడు మాత్రమే అనగా ఈ సృష్టి ప్రణాళికకు సూత్రధారి సృష్టిలోని చర్యలు, ప్రతిచర్యలు స్వయంప్రవర్తకములు పరమాత్మ చైతన్య శక్తికి పరిరూపమైన ప్రకృతిలోని ప్రతి అంశము స్వయంప్రవర్తకమే ఈ స్వయంప్రవర్తకతే సృష్టి రహస్యము అదే కర్మ సిద్ధాంత అంతరార్ధము యంత్రములకు ఎపుడైనా అంతరాయము కలిగినపుడు స్విచ్ వేసినతడు ఆ యంత్రములను బాగుచేయించి సక్రమముగా నడిపించును అటులే జీవుల మనస్సులందు ప్రకంపనలు కల్పించి వాటి ద్వారా సవ్యమైన మార్గమును గోచరింపచేయునది ప్రకృతి యందు వ్యాపించి యున్న వైశ్వానరుడు అందుకే అతడు ఈ జగన్నాటకమునకు సూత్రధారి వైశ్వానరునిగా ఈ విశ్వమంతటా ఆయన ఉన్నాడు అనగా ప్రతి జీవాత్మ పరమాత్మ అంశయే జీవాత్మ స్థూల శరీరముచే ఆవరింపబడి కర్మ ఫలములనబడు సంస్కారములచే ప్రభావితమై "పునరపి జననం, పనరపి మరణం" అను ప్రవాహములో సాగిపోతూ పరమాత్మకు దూరమవుతోంది ఆ దూరమగుటయే ప్రకృతి యనబడు 'మాయ' లక్షణము ఒక నాటకం లేక సినిమా చేస్తున్నంత సేపు అది నిజమా అను భ్రమతో అందులో లీనమై పోతాము అదే 'నాటకం' లక్షణం నాటకం అయిపోగానే భ్రమ తొలగిపోతుంది అందలి కొన్ని దృశ్యములు మనస్సునందున్నప్పటికి అవి భ్రమ కలిగించవు ఎందుకనగా ఇపుడు మనం 'నాటక దృశ్యములను' చూస్తూ అందు లీనమై లేము అవి వాస్తవములు కావు అని మనకు తెలుసు కాబట్టి అటులే ఈ జగత్తు ఒక నాటకము అని గ్రహించిన నాడు భ్రమ తొలగిపోతుంది, జగత్తులో ఉంటూనే దాని ప్రభావమునకు లోను కాము అదే జీవన్ముక్తి

మనకు గతజన్మ అనునది ఒకటి ఉన్నది అనుటకు రుజువు ఏమిటి? అని చాలమంది అడుగు ప్రశ్న వర్తమానంలో మన స్థితియే దానికి రుజువు కారణము దాని అనుక్రమము (cause and sequence) ప్రతి ఫలితములోను కారణము అంతర్లీనంగా ఉంటుంది అంటారు స్వామి అభేదానంద ఫలితము బయటకు కనబడుతుంది, కారణము అందులోనే అంతర్లీనంగా ఉంటుంది ఈనాటి మన స్థితి దేనికో ఫలితమైనపుడు 'అది' అనగా కారణము బాహ్యము కాదు 'అది' మనలోనే ఉన్నది అని కదా అర్థము వర్తమానంలో మన స్థితికి గోచరము కాని కారణము ఉన్నపుడు అనగా ఆ కారణము మనకు అంతు బట్టనపుడు, అది మనలోనే ఉన్నదని అర్థము కదా మనలో ఉండునవి సంస్కారములు అవి ఈనాటివి కావు అని మనకు తెలుసు గదా! ఎందుకనగా ఆ సంస్కారములే వర్తమాన ఫలితములకు కారణములగును గదా! ఆ సంస్కారములు గత జన్మలోని లేక ఈ జన్మలోని గతించిన అనగా పూర్వము జరిగిన కర్మముల ఫలితములు (impressions) అగునని తెలుస్తోంది గదా! అదే రుజువు ఈ సంస్కారములే (impressions) మనిషి స్వభావమును లేక శీలమును (character) రూపొందించును అని చెప్పబడింది గదా! కర్మ సిద్ధాంతమును అంగీకరించనివారు అన్ని చర్యలు (activities) మృత్యువుతో సమాప్తమగును, ఏదీమి గలదు, ఈ శరీరము యొక్క చర్యలకు ఎవరూ బాధ్యులు కారు, అని వాదిస్తారు - కాని వీరి వాదన వలన చర్య-ప్రతిచర్య (కార్య-కారణము) (చర్య-ఫలితము) అను ప్రకృతి సహజమగు ప్రవాహము ఆగదు మనము విశ్వసించినా, తిరస్కరించినా భూమ్యాకర్షణ శక్తి ఆగదు గదా! అటులే కర్మములు - ఫలితములనబడు సంస్కారములు అను ప్రవాహము ఈ ప్రకృతిలో అనంతంగా సాగిపోతూనే ఉంటుంది ఇది ప్రకృతి నిర్ణయం ఏకరీతిగా సాగు తీర్పు జగన్నాటక సంకల్పం లేక హేతువు అదే ఈ నాటకరంగంలో వాంఛలకు, వ్యామోహాలకు మనం బానిసలమవుతున్నాం ఈ బంధం నుండి విముక్తి ఎలా పొందాలి? ఇది వేదాంతంలో ప్రధాన అంశం

పాశ్చాత్యుల మనసులందు ఈ ప్రశ్న సాధారణంగా ఉదయించదు ఎందుకనగా ఈ ప్రశ్నల సమాధానముల ప్రాధాన్యము హిందువులు గుర్తించి నంతగా వారు గుర్తించలేదు కర్మ సిద్ధాంతము వారి మతము నందు ఏ మాత్రము ఉదహరించబడలేదు కర్మ సిద్ధాంతమునకు ఆధారమైన కారణత్వ సిద్ధాంతమును (Law of causation) ఆధునిక శాస్త్రీయ విజ్ఞానం (Modern Science) బహిర్గతం చేయుచున్నను, పాశ్చాత్యుల మత గ్రంధములందు దాని ప్రసక్తి ఏ మాత్రం కనబడదు ప్రతి సంఘటనకు లేక ప్రతి అనుభవమునకు వెనుక వారసత్వమో లేక మానవాతీత శక్తి ఏదో ఉన్నదను విశ్వాసముతో మానవుని చర్యలకు కారణము బయటనే (outside) ఉన్నదంటారు మానవునిలోని కర్మ ఫలితములనబడు సంస్కారములే అతని చర్యలకు, స్వభావమునకు కారణము అని వారు గ్రహించుట లేదు ఏదో మానవాతీత శక్తి వారి చర్యలకు కారణము అంటారు కాని ఆ శక్తి ఏమిటో వారు వ్యక్తపరచలేదు, నిర్వచించలేదు భారతదేశంలో ఈ విషయమును గురించి ఎన్నో గ్రంధములు వ్రాయబడినవి కర్మ సిద్ధాంతము నిర్వచించబడినది నిత్యజీవితములోని సమస్యలను కర్మ సిద్ధాంతమునకు అన్వయించి సమ ధానములు చెప్పబడినవి జగన్నాటకములోని నిగూఢత్వము వివరించ బడినది

ప్రతి జీవుడు కర్మకు అధీనుడే వర్తమాన జీవితంలోనే కాక భవిష్య జీవితములో (జన్మలో) కూడ కర్మకు అధీనుడే ప్రకృతిబద్ధమైన ఈ కర్మము నుండి జీవునికి విముక్తి లేదా? ఇక్కడ ఒక సత్యమును గ్రహించవలసియున్నది స్వామి అభేదానంద చెప్పినట్లు ప్రకృతి కొరకు జీవాత్మ సృష్టించబడలేదు కాని ప్రతి జీవాత్మ అనుభవముల కొరకే ప్రకృతి కృషి చేయుచున్నది ఇది గ్రహించుట తలచినంత సులభము కాదు మన భౌతికమైన స్థూలశరీరం ప్రకృతికి ప్రతీక అపుడు ఈ భౌతిక శరీరం జీవాత్మ కొరకు ఏర్పడినదా? లేక జీవాత్మయే భౌతిక శరీరము కొరకు ఏర్పడినదా? జీవాత్మను గురించి జాగ్రత్తగా

పరిశీలించినచో దీనికి సమాధానం దొరుకుతుంది మన మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, శరీరము, దృగ్గోచరమగు అనగా దృగ్ విషయ పరిధిలోనివే అనగా కంటికి కనబడునవి కాని జీవాత్మ ఈ పరిధికి బయటగా వాటికి సాక్షిగా ఉన్నది అది మనస్సు, బుద్ధి, శరీరము, ఇంద్రియముల పరిధి దాటి ఉన్నది మనలోనే ఆంతరికంగా ప్రకృతికి దాని నిబంధనలకు అతీతంగా ఆత్మ ఉన్నది దానికి పరిపూర్ణమైన స్వేచ్ఛ ఉన్నది ఆ విధంగా స్వేచ్ఛ లేక విముక్తి కొరకు తపన మనలోనే ఉన్నది ఈ స్వేచ్ఛ అనునది వాస్తవముగా లేనిచో దాని కొరకు తపన ఉండదు గదా! కావున పరిపూర్ణమైన స్వేచ్ఛ అనునది ఒకటి ఉన్నది అనునది వాస్తవము ప్రతి జీవుడు ముందుగానో, ఆలస్యముగానో దానిని పొందును ఇదే ప్రతి జీవుని అంతిమ ధ్యేయము అదే జీవన్ముక్తి

మనలో నిత్యము చలించు తలంపులు, కోరికలు మన చర్యలకు కారణము అని తెలిసిన విషయమే గదా! ఈ కోరికలున్నంత వరకు మనము చర్యలు చేస్తూనే ఉంటాము దాని ఫలితము అనుభవించక తప్పదు ధనము కొరకో, కీర్తి కొరకో, స్వర్గప్రాప్తి కొరకు కర్మకాండలో, ఏదో ఒక చర్య (కర్మము) చేస్తూనే ఉంటాము స్వర్గప్రాప్తి అనేది ఊహకు అందనిది కాబట్టి భౌతికంగా అది గోచరము గాదు కాని మిగిలిన భౌతికపరమైన కోరికలైన ధనము, సంపద, కీర్తి, కుటుంబము, అధికారము మొదలైనవి తీరినపుడు స్వర్గతుల్యమైన సౌఖ్యము కలుగునను భావము మనలో ఏర్పడుచున్నది కాని ఇది స్వార్థము అను పునాది మీద ఏర్పడు సౌధము ఆ సౌధములో ఆత్మ బంధింపబడి ఆ కర్మ ఫలితములకు జీవుడు బద్ధుడగుచున్నాడు ఎపుడైతే నిష్కామముతో కర్మములు ఆచరించుదుమో అపుడు కర్మ సిద్ధాంతము అను బంధమునుండి విముక్తులగుదుము అదే జీవుడు నిత్యము ఆశించు స్వేచ్ఛ స్వార్థపరమైన కోరికలను తీర్చుకొనుటకు కాక కర్మము కొరకే కర్మము చేసినచో ఆ స్వేచ్ఛ లభించును

కర్మము కొరకే కర్మము చేయుట అనుటలో ఏమైనా అర్థమున్నదా? అను సందేహము సహజం అదియును గాక అట్టి కర్మము సాధ్యమా? అను ప్రశ్న కూడ ఉన్నది జననమొందినది మొదలు తలిదండ్రులతోను, కుటుంబముతోను, బంధువులతోను, సమాజముతోను మనకు సంబంధం ఏర్పడుతుంది ఈ సంబంధమే బంధము అవుతుంది ఏనాడో పొందిన ఉపకారమునకు ఫలితముగా ఈనాడు ఈ బంధము ఏర్పడుతుంది ఆ పొందిన ఉపకారమును బంధరూపముగానున్న ఋణము అన్నారు ఆ ఋణమును తీర్చుకొననినాడే ఆ బంధము నుండి విముక్తి ఉదాహరణకు, ఎక్కడ నుండి అయినా ధనము అప్పుతెచ్చి అది తీర్చునంత వరకు మానసికంగా వ్యధ అనుభవిస్తూ ఉంటాము అది తీర్చిననాడు మనకు కలుగునది ఏమిటి? తృప్తి, మానసికంగా శాంతి అదే స్వేచ్ఛ జననమొందినది మొదలు ఏర్పడు బంధములు గూడ అట్టి ఋణఫలితములే ఆ ఋణము ఏనాటిది? ఈనాటిది అయినచో మనకు తెలుస్తుంది గదా! ఈ బంధములు మనకు తెలిపి వచ్చినవి కాదు గదా! జననముతోనే ఏర్పడినవి గదా! అనగా మన ఊహకు అందని ఏనాటివో ఆ ఋణములు ఆ **'ఏనాడో'** అను పదమునకు అర్థము ఏమిటి? 'పునర్జన్మ' అనునది ఉన్నది అని అంగీకరించినపుడే 'ఏనాటివో ఈ ఋణములు' అనుదానికి అర్థము ఏర్పడుతుంది అప్పు తీర్చునపుడు మనకు ఏ కోరిక ఉండదు 'అప్పు తీర్చుట' అను పని (కర్మము) కొరకే ఆ పని చేయుదుము దాని ఫలితం తృప్తి, ఆనందము అటులే మనము చేయు ప్రతి కర్మము కొరకే ఆ కర్మము చేసినచో, అనగా కర్మ ఫలితమునే ఉద్దేశముగా (motive) తీసుకొనకుండా, కర్మము నెరవేర్చినచో ఆంతరికముగా స్వేచ్ఛ కలుగును కర్మ సిద్ధాంత ఆశయమే యిది ఋణ విముక్తులగుటయే జీవిత ధ్యేయమని వేదాంతం చెప్తుంది

ఈ ధ్యేయం నెరవేర్చుటకు ముందు తెలుసుకొనవలసిన విషయం ఒకటి ఉన్నది మానసికంగాను, శారీరకంగాను మనము ఉపయోగించుకొను

శక్తులు వాస్తవమునకు మనవి కావు అవి మనవి అనుకొనుట మన భ్రమ మాత్రమే మనము పీల్చు గాలి మనది అని చెప్పగలమా? దానిని మనము ఉపయోగించుకుంటున్నాము కాని అది మనది అని చెప్పలేము మనలో ప్రతి ఒక్కరి శరీరములోను జీవకణములను కలుపు ఆకర్షణశక్తి ఉన్నది అది ఎవరి శరీరములోది వారిదే కాని గాలి అలా కాదు అది విశ్వము అంతటికి చెందినది అలాగే మనము ఉపయోగించుకొను ప్రతి శక్తి విశ్వం అంతటికి చెందినది

మన స్థూల శరీరము నుండి కొంతసేపు విడివడి ఈ విశ్వములో (universe) మనము ఎలా కనబడతామో ఊహించగలిగితే, అంతరిక్షము - సృష్టిరూపము తెలుసుకొనుట సులభమవుతుంది అంతరిక్షము (cosmos) అంతా పదార్థమయమైన సముద్రము వలె ఉంటుంది సముద్రములో నీటి సుడిగుండాలు (whirlpools) అనేకం ఉంటాయి అలాగే అంతరిక్షములో పదార్థము అను సముద్రములో గూడ అనేక సుడిగుండాలు ఉన్నాయి మన స్థూల శరీరములు అంతరిక్షములోని ఆ సుడిగుండముల వంటివేనని స్వామి అభేదానంద అన్నారు ఆ సుడిగుండములోని ప్రతి కణము నిత్యము చలిస్తూనే ఉంటుంది అటులే మన మనస్సు స్వభావమును గమనించినచో 'మనస్సు' అను ఒక ప్రవాహము (mental current) నిత్యము విశ్వములో ప్రవహిస్తూ ఉంటుంది అని స్వామి అభేదానంద అన్నారు ఈ ప్రవాహమును ఈ విశ్వమంతటికి మనస్సు అని కూడ ఆయన (cosmic mind) అన్నారు దాని విభిన్న రూపములే మనలోని ప్రతి ఒక్కరి మనస్సు కాని వాస్తవమునకు ప్రతి ఒక్కరిలోను పనిచేయునది ఆ విశ్వము యొక్క మనసు మాత్రమే (cosmic mind) అయితే విశ్వములోని శక్తి (energy) ఈ సృష్టిలో అనేక రూపముల ద్వారా (అనగా అనేక జీవుల ద్వారా) పనిచేయుచున్నది కాని ఆ శక్తి ప్రత్యేకించి ఏ ఒక్క జీవునికి చెందినది కాదు ఆలోచన, శ్రవణ, రుచి, వాసన మొదలైన అన్ని శక్తులు విశ్వము అంతటికీ చెందినవే అవి ఏ ఒక్కరివి కావు మానవ

శరీరము అను యంత్రం ద్వారా పనిచేయు ప్రతి ఒక్క శక్తి ప్రకృతి శక్తిలోని భాగమే కాని ఈ శక్తులన్ని మనవి అను భ్రమలో మనం ఉన్నాము అందుకనే భగవద్గీత (3-27) ఇలా చెప్పింది

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మాకర్తాహమితి మన్యతే ॥

సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థను 'ప్రకృతి' అన్నారు దానినే 'మాయ' అని గూడ అంటారు దేహము, ఇంద్రియములు, బుద్ధి, మనస్సు మొదలగునవి ప్రకృతి యొక్క కార్యకారణరూపమైన వికారములు అట్టి ప్రకృతి వికారములైన దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి చేత లౌకిక, వైదిక కర్మములను ఆచరిస్తూ, ఈ ప్రకృతి వికారములనే ఆత్మ అని మూఢాత్ములు (అజ్ఞానులు) భావిస్తుంటారు ఇది అజ్ఞానుల కర్మ పద్ధతి

ప్రకృతి వలన ఏర్పడిన త్రిగుణములచే సమస్త కార్యములు జరుగుచున్నవి త్రిగుణములచే నిండిన ప్రకృతి కర్మ స్వరూపమైనది ప్రకృతి వేరు ఆత్మ వేరు ప్రకృతియే కర్మ అని భావించి ఆత్మయే కర్మ చేయుచున్నదను మోహమున అజ్ఞాని పడుచున్నాడు నిలిచియున్న రైలుబండి యందు తాను కూర్చుని, ఎదుటి బండి పరుగెత్తుట ప్రారంభించిన వెంటనే తాను కూర్చుని ఉన్న రైలుబండియే కదలుచున్నట్లు కలుగు భ్రమ ఇటువంటిదే

ఇంకను భగవద్గీత (3-28) ఇలా వివరించింది ప్రకృతి గుణముల వలన సహజ కర్మలు కలుగును తత్త్వజ్ఞాని ఈ విషయము గ్రహించి, ప్రకృతి గుణములు తమ తమ నియమముల ననుసరించి ప్రవర్తించునని గ్రహించును వాటి యందు ఆసక్తి లేక మెలగును కర్మలు అనగా దేహ, ఇంద్రియ, మనస్సు, బుద్ధుల వ్యాపారములు అవి మమకారమునకు హేతువులు తత్త్వవేత్త గుణకర్మలకు ఆత్మకు ఉన్న భేదం తెలుసుకుని ఇంద్రియ విషయములందు భ్రమను పొందడు కర్మల యందు కర్తృత్వ అభిమానమును

పొందదు ఇంద్రియములు గుణరూపములు అవి విషయభోగముల గుణములను గ్రహించి ప్రవర్తించును ఉదాహరణకు ప్రకాశించుట అగ్ని యొక్క గుణము ఆ ప్రకాశమును గ్రహించు శక్తి మన కళ్లకు ఉన్నది కళ్ల ద్వారా అగ్ని యొక్క గుణము అగు ప్రకాశమును మనము గ్రహించుచున్నాము ఇదే విధముగ ఇంద్రియములచే గుణములు గ్రహింపబడుచున్నవి కాని ఇవి ఏవియు ఆత్మ చైతన్యమును గ్రహించుట లేదు ఈ విషయము గ్రహించిన వానికి ఇహభోగవాంఛ ఉండదు

కర్మములకు తామే కర్తలము అని భ్రమించినంత కాలము వాటి ఫలితములను అనుభవింపక తప్పదు స్థూల శరీరమే సర్వము అని భ్రమించినంత కాలము మనము నటీనటులము అని తలచినంత కాలము ఆత్మసత్యము మనకు బోధపడదు కర్మఫలితములను అనుభవించక తప్పదు విశ్వము (జగత్తు) అనునదే ఒక అనంతమైన శరీరము అనియు, దాని భాగమే మన స్థూల శరీరమనియు, మన మనసు అనంతమైన విశ్వమనసు (Cosmic Mind)లోని భాగమనియు, గ్రహించగలుగునది మన శరీరము కాదు, మనస్సు కాదు, అది వాటికి అతీతమైనది అదే మనలోని సత్యమైనది యైన ఆత్మ ఇది గ్రహించగలిగిన నాడు కార్యములకు మనము కర్తలము కాదు, మనము నటీనటులమూ కాదు అని తెలుసుకుని, కర్మ ఫలితములు మనకు అంటకుండ చేసుకొనగలము ఇదే విముక్తి మన శరీరము చేయు కర్మములు, మనసు చేయు కర్మములు వాస్తవమునకు మనలోని ఆత్మ చేయుట లేదు, ప్రకృతియే తన భాగమైన మన శరీరము ద్వారా చేయుచున్నది ఇది అత్యంత ప్రధానమైన సత్యము

ఈ జగత్తు అంతా ఒక నాటకం శ్రీమహావిష్ణువు ఈ జగన్నాటకమునకు సూత్రధారి అన్నారు మరి నటీనటులు ఎవరు? మనమంతా నటీనటులమే సూత్రధారి నాటకమును నడిపించువాడు మాత్రమే అతడు అందు పాల్గొనడు

ఒకవైపు జగత్తు నాటకం అంటూనే మనం నటీనటులం అని తలచినంత కాలం ఆత్మసత్యము మనకు బోధపడదు అంటే అర్థమేమిటి? ఇది విరుద్ధంగా ఉన్నట్లు కనబడుతోంది దీని అంతరార్థం ఏమిటి?

లేని దానిని ఉన్నదిగా ప్రదర్శించటమే నటన అంటే భ్రమ కలిగించేదే నటన కాని నటుడు తాను భ్రమ పొందడు తాను భ్రమ పొందకుండా నాటకంలోని పాత్రను రంగస్థలం మీద (stage) జీవం పొందినట్లు చేసి ఒక భ్రమ కల్పిస్తాడు కాని ఈ జగత్తు అను నాటకంలో ఆత్మను మరచి స్థూల శరీరమే సత్యము అను భ్రమను మనమే పొందుతున్నాము వాస్తవమునకు మనం చేసే పనులన్నీ మన మనస్సు ద్వారా ఆత్మ శరీరం చేత చేయిస్తోంది అది గ్రహించలేకపోవుటయే భ్రమ కాని నటునికి భ్రమ ఉండదు తాను ధరించిన పాత్ర వేరు తాను వేరు అని అతనికి తెలుసు తెలియాలి లేకపోతే అతడు నటించలేడు పాత్రలో అతడు లీనం కాడు, కాకూడదు నటుడు తనను మరచి పాత్రలో లీనమైతే నాటకం రసాభాస అవుతుంది నాటకం అయిపోగానే తాను ధరించిన పాత్ర ఉండదు

కాని జగన్నాటకంలో స్థూలశరీరం కర్మలు చేస్తుంది ఫలితం పొందుతుంది నిజానికి ఫలితం పొందేది శరీరం కాదు జీవాత్మ ఫలితాలను పొందుతుంది అంటే మన స్థూల శరీరం పాత్ర రూపం మాత్రమే ఆ పాత్రను ధరిస్తోంది జీవాత్మ అంటే స్థూలశరీరం నటుడు కాదు అది ఒక పాత్ర మాత్రమే (a character in a play) అంటే మనమంతా పాత్రలము మాత్రమే, పాత్రధారులము కాము అనగా నటులము కాము పాత్రధారి అను నటుడు జీవాత్మ అది గ్రహించినపుడు ఆత్మను గురించి మనకు తెలుస్తుంది అది గ్రహించలేక స్థూలశరీరమే పాత్రధారి అనగా మనమే నటులము అనుకుంటే మనం ఆత్మకు దూరమవుతాము

నాటకం రక్తి కట్టించేది ధరించబడిన పాత్ర కాదు, దానిని ధరించిన

నటుడు నాటకం రక్తి కడితే ఆ రసానుభూతి పొంది భ్రమలో పడునది ప్రేక్షకుడు నటుడు కాదు అలాకాక తాను ధరించిన పాత్రే నిజము అనుకుని నటుడు భ్రమలో పడితే నాటకం రసాభాస అవుతుంది అతడు నటించలేడు కురుక్షేత్ర నాటకంలో భీమపాత్రధారి పాత్రలో లీనమై తానే భీముడనుకుని దుర్యోధన పాత్రధారి తొడలు విరగగొడితే అది నాటకం కాదు, హత్య అవుతుంది అందుకే నటుడు తాను వేరు, పాత్ర వేరు అనుకోవాలి కాని పాత్రతో ఐక్యత పొందకూడదు

అలాగే జగన్నాటక రంగంలో మన స్థూల శరీరాలు నటులు కాదు అవి పాత్రలు అనగా ఉపాధులు ఉపాధి అనగా ఆధారం పొందేది జీవాత్మ అందువలన జీవాత్మయే నటుడు జీవాత్మయే ఈ శరీరం అను పాత్రను ధరించి జగన్నాటకంలో తన పాత్ర పోషిస్తుంది అది గ్రహించలేక మనమే అంటే మన శరీరాలే నటులు అనుకుంటే అది భ్రమ మాత్రమే మనము నటులము కాదు ప్రపంచం ఒక నాటకరంగం అంటే మనకు కనబడేది అంతా వాస్తవము కాదు, అది అంతా ఒక భ్రమ అని అర్థము మనమంతా నటీనటులం అంటే మనము కాదు మన స్థూలశరీరం అను ఉపాధి పొందిన జీవాత్మ అని అర్థము అది గ్రహించగలిగినపుడు ఆత్మజ్ఞానం కలుగుతుంది భ్రమ తొలగిపోతుంది భ్రమను కల్పించినది ప్రకృతి అను మాయ ఈ మాయకు సూత్రధారి నారాయణుడు నటుడు పాత్ర నుండి బయటపడినట్లు మనం భ్రమ నుండి బయటపడితే సత్యం తెలుస్తుంది

మన స్థూల శరీరమును, మన మనస్సును ఆత్మగా తలచినంత కాలము 'నేను' లేక 'మేము' అను అహంకారము ప్రజ్వరిల్లును అదే అరిషడ్వర్గములైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములకు దారితీయును అవే దుష్కర్మలకు అటుపై దుష్ఫలితములకు కారణమగును అనంతమైన విశ్వము యొక్క శరీరము (cosmic body) విశ్వము యొక్క

మనస్సులోని అంశములే మన శరీరం మనస్సు అని గ్రహించినవాడు 'నేను', 'మేము' అను అహంకారము తొలగును అట్టివారు జగత్తు నాటకమని గ్రహించి అందు తమ పాత్రలను నిష్కామముగా ధరించి, జగన్నాటక ధ్యేయం సఫలమగుటకు తోడ్పడుదురు జగత్తును నాటకము అని గ్రహించి ఆత్మ సందర్శనము పొందగలుగుటయే ఈ జగన్నాటక ధ్యేయము ఇదే విషయమును గీతాచార్యులు భగవద్గీతలో స్పష్టము చేశారు (భగవద్గీత 2-47)

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన ।
మాకర్మఫల హేతుర్భూర్మాతే సంగోస్త్వకర్మణి ॥

కర్మ చేయుటకు మాత్రమే మనకు అధికారమున్నది కర్మ ఫలమును కోరు అధికారం లేదు అందుకే కర్మఫల వాంఛ కూడదు కర్మఫలము కొరకు వాంఛ ఉన్నచో కర్మఫలమునకు హేతువు అవుతాము అలాగని మనము కర్మ చేయకుండానూ ఉండకూడదు కర్మ తప్పక చేయవలసినదే కర్మఫలమును ఆశించి కర్మ చేసినచో అది పునర్జన్మ కారణమగును

పరిపక్వమైన అంతఃకరణము లేని సగటు మానవునికి అర్జునుడు ప్రతీక అట్టివాడు కర్మ పరిత్యాగము ద్వారా జ్ఞాననిష్ఠకు అర్హుడు కాడు అందువలన అతడు కర్మ చేయవలసినదే కాని కర్మఫలప్రాప్తి కొరకు వాంఛ లేనిచో కర్మబంధము ఏర్పడదు కేవలం ఈశ్వరానుగ్రహం కొరకు కర్మలను ఆచరింపమని కూడా గీతాచార్యుడు చెప్పలేదు (భగవద్గీత 2-48) ఈశ్వరానుగ్రహం అను ఆసక్తిని కూడ వదలి కర్మ చేసినచో అంతఃకరణ పరిశుద్ధమవుతుంది అట్టి అంతఃకరణ శుద్ధి వలన జ్ఞానయోగసిద్ధి కలుగునని చెప్పబడింది ఫలమును పొందినను పొందకపోయినను సమబుద్ధితో కర్మలను నిర్వర్తించుట యోగమనబడినది

కర్మలను మానరాదు ఫలమును ఆశించరాదు ఇది పరస్పర విరుద్ధముగా కనబడును కర్మఫలమును ఆశించక ఎవరు కర్మ చేయగలరు

ఫలమును ఆశించకున్నచో కర్మలు చేయవలసిన అవుసరమే ఉండదు గదా!
గీతాచార్యుడు దీనికి వ్యతిరేకముగా జీవిత రహస్యమును బోధించారు
ఫలాపేక్షతో కూడిన కర్మ వ్యామోహమును కలుగజేయును సర్వభోగముల
నాశించి చేయు కర్మములు గూడ బంధమును కలుగజేయును ఆశను
జయించినచో స్వేచ్ఛ కలుగును చిత్తశుద్ధి ఏర్పడును అందుచే కర్మల
నాచరించవలయును గాని కర్మఫలమును ఆశించరాదు అని గీతాచార్యులు
బోధించారు ఇది విరుద్ధము కాదు పడవ నీటిపైననే ప్రయాణము చేయును
కాని పడవలో నీరు ప్రవేశించినచో అది మునిగిపోవును పడవ నీటిపై
నుండునటులే మనము కర్మలు తప్పక చేయవలయును పడవలోనికి నీరు
చేరినచో అది మునిగిపోవునటులే ఫలాపేక్షతో కర్మములను ఆచరించినచో
వాటి వలన బంధము ఏర్పడును నిష్కామకర్మాచరణమే అనాసక్తి యోగము
కష్టసుఖములు, ఆశనిరాశలు నిరంతరం ఒకదాని వెంట మరొకటి వలయంలో
చరిస్తూనే ఉంటాయి వాటి ప్రభావము నుండి బయటపడుటకు మార్గము
నిష్కామ కర్మయోగము

మన శరీరము ప్రకృతికి ప్రతీక అని, మనలోని శక్తులు ప్రకృతి శక్తుల
విస్తరణ (extension) అన్నాము గదా! మరి మనవి కాని శక్తులతో నిర్వర్తించు
కర్మల ఫలితం మనం ఎలా ఆశించగలము ఆశించలేము మన శరీరం, మన
మనస్సు ద్వారా వ్యక్తమగు (expressed) శక్తులకు మూలమేదో (source)
గ్రహించి ఆ శక్తుల ద్వారా చేయు కర్మ ఫలితము మూలమునకే చెందునని
అనాసక్తితో కర్మలు నిర్వర్తించినచో 'కార్యకారణము' అనబడు బంధము నుండి
విడివడుదుము అపుడే మన మనస్సు, ఇంద్రియములు నిరంతరము
చురుకుగా ఫలాసక్తి లేకుండా కర్మములు చేయుటలో పాల్గొనును

కర్మములే చేయకపోతే కర్మ సిద్ధాంత శాసనము నుండి తప్పించు
కొనవచ్చును గదా అని కొందరు వాదించవచ్చు అది ఒక పొరపాటు లేక భ్రమ

మాత్రమే దీనికి సమాధానం భగవద్గీత చెప్పింది (18-59)

ఏ కారణం వలననైనా మనము అహంకారమును ఆశ్రయించి - దురహంకారముతో కాని, దురభిమానముతో కాని - కర్మము చేయుటకు నిరాకరించినచో లేక చేయకుండుటకు నిశ్చయించుకొనినచో అది వృథాయే అవుతుంది మనలో సహజముగానుండు త్రిగుణ (సత్త్వరజస్తమోగుణము) ప్రభావముచే ప్రకృతి యనబడు మాయ మనము చేయకూడదని నిశ్చయించుకొనిన కర్మను స్వాభావిక గుణ ప్రభావము ద్వారా చేయునట్లు చేయును ఒక కర్మము చేయుట, చేయకపోవుట మన వశములోనిది కాదు అని దీని భావము మనలోని గుణముల వలన కలుగు ప్రవృత్తిచే కర్మములు చేసియే తీరుదుము

మన నిత్యజీవితములో కర్మముల నుండి విరమించుకొనుట లేక తప్పుకొనుట, పిరికితనము అగునని గీతా ప్రవచనము మనము కర్మముల నుండి తప్పుకొనినను అనగా కర్మములు చేయుట విరమించుకొనినను, మన మనసు విశ్రమించదు అది పనిచేయుచునే యుండును కర్మ సిద్ధాంత రహస్యమును గ్రహించి చేయు నిష్కామకర్మయోగము ద్వారా మాత్రమే స్వేచ్ఛ లభించును అనాసక్తి కర్మయోగము ద్వారా మన మనస్సు శుద్ధి పొందును అపుడే ఆత్మజ్యోతి మన మనోఫలకముపై ప్రతిబింబించును మన శరీరము, ఇంద్రియములు, మనస్సు ద్వారా పరమాత్మ చైతన్యము (The Divine Will) అనగా ప్రకృతి వ్యక్తమగుచున్నదని మనకు బోధపడును ఇదియే గీతాప్రవచనము (4-20,21)

కర్మఫలమందు ఆసక్తి లేనివాడై, నిత్యతృప్తుడై, దేనిని ఆశ్రయించనివాడై, కర్మ చేయుచున్నను అట్టివాడు కర్మచేయనివాడే యగును

అంతఃకరణమందు విషయకామనలు లేనివాడు అనగా ఆశలేనివాడు, శరీరమును నిగ్రహించినవాడు శరీరముతో మాత్రమే కర్మము చేయువాడు

అగును కర్మబంధము అతనిని అంటదు

అజ్ఞానము, స్వార్థము, భ్రమల నుండి విముక్తి ద్వారా ఆత్మ, జన్మ, పునర్జన్మల బంధము నుండి ముక్తి పొందును ఆ విధముగా శాశ్వతమైన శాంతి పొందును ఏ మతములోనైనా అత్యున్నతమైన లక్ష్యము ఇదే దానిని సాధించుట ద్వారా జీవితధ్యేయము నెరవేరును ఈ స్థితి సాధించినపుడు ఆత్మపరిపూర్ణమైన స్వేచ్ఛ పొందును ప్రకృతి శాసనముల నుండి స్వేచ్ఛను సాధించగలుగుటయే దానికి కారణము అదియే ఆత్మజ్ఞానము ఆత్మజ్ఞానము సిద్ధించినపుడు జీవుడు అంతర్యామియైన పరమాత్మయే తాను (పరమాత్మ అంశయే తాను) అని గ్రహించును అట్టివారే జీవన్ముక్తులగు అవతారమూర్తులు వారే జగద్రక్షకులు ప్రతి జీవాత్మ పరమాత్మయే అను జ్ఞానము ద్వారా వారు కర్మము కొరకే కర్మము చేశారు అనాసక్తితో కూడిన అనగా నిష్కామకర్మయోగము వారు సాధించారు ఆ కోవకు చెందినవారే శ్రీకృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు రామకృష్ణ పరమహంస మొదలైనవారు

భగవద్గీత (2-50)లో నిష్కామకర్మకు మార్గము సమత్వ బుద్ధి యోగము అని చెప్పబడింది పుణ్యపాపములను, సుఖదుఃఖములను సమదృష్టితో గ్రహించి మనస్సు ఉద్రేకమునకు లోను కాకుండ చేసుకొనుటయే సమత్వబుద్ధియోగము సమత్వబుద్ధి కర్మములందు క్షేమము కలుగజేయును కర్మలు బంధస్వభావము కలవి సమత్వబుద్ధి వలన వాటిలో ఉండు బంధస్వభావము తొలగును అనగా సుఖమైనా దుఃఖమైనా, పుణ్యమైనా, పాపమైనా మనసుకు అంటదు ఇష్టాయిష్టరూపములైన కర్మఫలములు మనసు దరికి చేరవు సమత్వబుద్ధి ద్వారా మోహమును కాలుష్యమును అతిక్రమించవచ్చు అట్టివాడు కర్మయోగి అగును కర్మయోగి అయినవాడు నిస్వార్థజీవి చంచలబుద్ధితో ఏకాంతముగా పర్వతములపై లేక వాటి గుహల యందు తపస్సు చేయు యోగి కంటే ఏకాగ్రచిత్తముతో తన వృత్తిని చేయు

చెప్పులు కుట్టు మాదిగయే కర్మయోగమందు ఉన్నతుడు అని స్వామి వివేకానంద అన్నారు

మనస్సు, శరీరము మానవుని జీవనస్థితికి లక్షణములు అవి అతనిని నిష్క్రియునిగా ఉండనీయవు కర్మములు తప్పవు అనినపుడు కర్మలు ఏ ఉద్దేశముతో చేయవలయును కర్తవ్యము సవ్యముగా నిర్వహించుటయే కర్మల ఉద్దేశము కావలయును అన్నారు కాని ఒక కర్తవ్య నిర్వహణ మాత్రమే సమత్వబుద్ధి ద్వారా తృప్తినిచ్చునా? కర్తవ్య నిర్వహణ ఉద్దేశము తృప్తియే కదా! కాని ఆ తృప్తి కలుగునా?

ఉద్దేశముననుసరించి కర్మలు మూడు విధములు **మొదటి రకము** ఇంద్రియ సుఖమునకు, శరీర పోషణకు చేయునవి **రెండవ రకము** కర్తవ్య నిర్వహణ కొరకు చేయునవి ఇక **మూడవది** ఏ ఉద్దేశము లేక ప్రేమతో చేయునవి

ఇందు **మొదటి రకములో** ఆకలి, జాతి అభివృద్ధి (Propagation of Species) అను తృష్ణ తీర్చుకొనుటయే ప్రధానంగా కనబడుతుంది వృక్షజాతిలోను పరిణామదశలో నిమ్నదశలోని (lowest) జంతువులలోను ఇది కనబడుతుంది మానవులలోనూ ఇది ఎక్కువగానే కనబడుతుంది భేదము వృక్షములా, జంతువులా, మానవులా అని కాదు దశ లేక స్థితిలోనే భేదము పరిణామదశలలో పైకి ఎదిగిన కొలది పైన చెప్పబడిన తృష్ణకు ఆత్మ పరిశీలన, మంచి-చెడు, కర్తవ్య నిర్వహణ అనునవి పరిణామములో ఉచ్చదశ అయిన మానవునిలో కలుగును

**రెండవ రకములో** (స్వార్థభ్రమ) (love of self) వృద్ధి చెందుతుంది ఇక్కడ శరీరమే ఆత్మ అను భావంలో మానవుడు ఉంటాడు అందువలన అది ఆత్మజ్ఞాన స్థితి కాదు ఈ రకము క్రమముగా మొదటి రకము నుండి ఏర్పడి వృద్ధి చెందుతుంది పరిణామములో (Evolution) క్రింది దశకు చెందిన

జంతువులలోను కాక పశుప్రవృతి గలిగి ఆధ్యాత్మిక దృష్టి వికసించని మానవులలో కూడ ఈ స్థితి కనబడుతుంది స్థూల శరీరమునే ఆత్మగా తలచటం వీరి స్వభావముగా కనబడుతుంది వీరి చర్యలన్నిటికి స్వార్ధమే ప్రేరకముగా ఉంటుంది తమకు అనుకూలముగానున్నది మంచిదిగాను లేనిది చెడుగాను భావించటం వీరి ప్రధాన లక్షణము దీనివలన వీరిలో అహంభావము పెరిగి సర్వము 'నేను' నన్ను' అను దృక్పధము ఏర్పడుతుంది నిత్యము తమ సుఖము మాత్రమే చూచుకొను వీరు మృగప్రాయులైన ఆటవికజాతి (కిరాతకులు) స్థాయివారు కాని క్రమముగా పరిణామములో (Evolution) వీరు మనసు వికసించి నీతి నియమములను గ్రహించగలిగిన స్థితికి చేరుదురు ఈ స్థితిలో తమ దగ్గరి వారి (అనగా కుటుంబ, రక్తసంబంధీకులు, బంధుగణములు) అవసరములను గూడ గౌరవించగలుగుతారు వారి యెడల తమ బాధ్యతను గూడ గుర్తించగలుగుతారు తమకు మాత్రమే తృప్తి, రక్షణ అను పశు స్వభావము నుండి కుటుంబ రాగబంధములలోకి ఎదుగుతారు తమతోపాటు వారి రక్షణ, పోషణకు కూడ ప్రయత్నించుటతో వారి యెడల తమకు గల బాధ్యతను గురించిన స్పృహ వీరిలో ఏర్పడుతుంది

**మూడవ రకములో** మనిషికి తన ఇరుగుపొరుగువారితో సంబంధము ఏర్పడుతుంది వారిలో తనకు ఉపకారము చేసినవారిని, ఆనందము కలుగజేసిన వారిని బంధుసములుగా చూసి వారికి ఉపకారము చేయుటకు ప్రయత్నిస్తాడు ఇరుగు, పొరుగువారి యెడల అనగా సమాజము యెడల తన ధర్మమును (బాధ్యతను) గుర్తించటం ప్రారంభిస్తాడు

ఈ విధముగా రక్తసంబంధము లేని వారి యెడల కూడ మానవుడు తన బాధ్యతను గుర్తించటం మనం అనుభవములో గమనిస్తూ ఉంటాము కాని ఈ బాధ్యతలను గుర్తించటం, నెరవేర్చటం వ్యక్తిగతంగా ఉంటుంది ఏదైనా బాధ్యతను గుర్తించటం అనుదానికి మూలము మానవులలో నిక్షిప్తమై

యుండు స్వీయప్రేమ (love of self = తనను తాను ప్రేమించుట లేక తన యెడల తాను మక్కువ కలిగియుండుట) పరిణామదశలలో ఇది క్రమంగా వికసించి ఇతరుల యెడల ప్రేమ చూపుట వరకు విస్తరించును ఈ ప్రేమ పరిణామమే బాధ్యతను గుర్తించుట బాధ్యతను గుర్తించుట వ్యక్తిగతముగా వారివారి పరిస్థితులు, పరిసరములపై (environment) ఆధారపడి ఉంటుంది వ్యక్తిపరముగా ఇది భిన్నముగా నుండును బాధ్యత అనునది సాపేక్షమైనది (relative) అనగా సంబంధార్థకమైనది (expressing relation) అందువలన అందరికి సమముగా వర్తించు నిశ్చితమైన ప్రమాణము 'బాధ్యత'కు లేదు పరిస్థితులు అందరికి ఒకే ప్రమాణములో ఉండవు కదా! వృత్తిని బట్టి, ప్రవృత్తిని బట్టి, పరిసరములను బట్టి అవి మార్పు చెందుచుండును దానిని బట్టి బాధ్యత ప్రమాణము కూడ మారుచుండును అదియును గాక జీవితములోని వివిధ స్థాయిలను అనుసరించి కూడ బాధ్యత మార్పు చెందుచుండును ఒకరికి బాధ్యత మరొకరికి కాకపోవచ్చును గదా! మానవుని జీవితములో వయసు దశలను అనుసరించి కూడ బాధ్యత రూపాంతరము చెందుచుండును పాత బాధ్యతలు పోయి క్రొత్త బాధ్యతలు ఏర్పడును ఆయా స్థితిగతులకు యుక్తమగునదే 'బాధ్యత' అను భావము మనలో ఏర్పడుతుంధి ఆ భావమే 'బాధ్యత' అను స్పృహ (sense of duty)

'బాధ్యత' అనునది వస్తుపరంగా (objective) ఏమి ఉండదు అనగా బాధ్యత బయట నుండి రాదు అది పూర్తిగా ఆత్మాశ్రయమైనది (subjective) అనగా మనస్సుకు సంబంధించినది మానసికంగా ఆ స్పృహ కలిగినపుడే 'బాధ్యత' ఏర్పడుతుంది "ఇది నీ బాధ్యత" అని ఎవరు చెప్పగలరు? మనలోని ఆంతరిక స్పృహ (inner sense) మాత్రమే మనకు 'బాధ్యత'ను తెలియజేస్తుంది

కొంత ప్రవృత్తి వలన, కొంత అసంపూర్ణ జ్ఞానము వలన కొన్ని

సందర్భములందు కొన్ని చర్యలను బాధ్యతగా నిర్వర్తించవలయును అను భావన మనలో కలుగుతుంది ఈ భావనయే ఆ బాధ్యతను నిర్వర్తించుటకు ప్రోద్బలం చేస్తుంది ఈ భావనయే శరీరమును మనస్సుతో బంధించును ఈ భావనయే 'బాధ్యత' అను స్పృహ అన్నాము గదా! ఆ స్పృహయే వ్యక్తిని పరిసరములకు బద్ధుని చేయును ఆ స్పృహ లేనపుడు ఈ బంధము ఉండదు బాధ్యతానిర్వహణలో దాస్యభావము ఉంటుంది కాని బాధ్యత సవ్యముగా నిర్వర్తించినపుడు తృప్తి, ఆనందము కలుగునను స్పృహ కూడ దానిననుసరించియే ఉండును పరిసరములు మారినపుడు దానికి యుక్తమగునట్లుగా బాధ్యత కూడా మారును బాధ్యతానిర్వహణ అనగా కర్మము నిర్వర్తించుటయే గదా! అందువలననే కర్మము చేయకుండ ఏ ప్రాణి ఉండదు అని భగవద్గీత చెప్పింది

బాధ్యతానిర్వహణ ద్వారా తృప్తి దాని ద్వారా కొంత ఆనందము కలిగినను, నిరంతరం కొనసాగు సుఖము ఉండునా? ఉండదు జీవితాంతం బాధ్యతానిర్వహణలో కాలం గడిపినను చివరకు ఏమి మిగులును? సుఖమా? దుఃఖమా? ఏదియును కాదు ఎందువలన అనగా బాధ్యతలు నిరంతరం పెరుగుతూనే ఉండును భౌతికమైన ఈ బాధ్యతలు అనగా కర్తవ్యములు (కర్మములు) కాక మరొకటి, సత్యమైనది అయిన బాధ్యత ఏదైనా ఉండునా? అను ప్రశ్న ఉదయిస్తుంది అది నిజమైన సుఖమును కలుగజేయునా? అనునది కూడ మరియొక ప్రశ్న

పరోపకారమే ఉత్కృష్టమైన బాధ్యత అని కొందరు అంటారు ఇతరులకు మనము ఎందుకు ఉపకారము చేయాలి అంటే, అలా చేయాలి అని పెద్దలు అన్నారు అని గాని, లేక ఏదో పుస్తకంలోని వాక్యం అలా చెప్తోంది అని గాని అంటారు పరులకు ఏమీ చేయకుండా మన లాభం మనం చూసుకుని సంపద పొందితే తప్పు ఏమిటి? అంటే, అలా చేయకూడదు అని

మతగ్రంథాలు చెప్పున్నాయి అంటారు చేసినచో భగవంతుడు శిక్షించును అని భయపెట్టుదురు ఈ ప్రపంచంలో ఎన్నో మతములున్నాయి ప్రతి మతమునకు గ్రంథములు ఉన్నాయి, భగవంతుడున్నాడు

భగవంతుడు ఒక జాతిని ఒక విధముగాను, మరొక జాతిని లేక మతమును మరొక విధముగాను ఎందుకు ఆజ్ఞాపించాలి?

మహమ్మదీయ మతగ్రంథము పురుషుడు ఇరువది వివాహములు చేసుకొనుటకు అనుమతించును గదా! అనగా అది భగవంతుని ఆజ్ఞగా చెప్పబడుచున్నది గదా! ఇది అమెరికాలో చెల్లదు అనగా ఒకే సమయములో ఇరువది మంది భార్యలు ఉండుటకు కుదరదు గదా! సామాజిక పరిస్థితులను బట్టి భగవంతుని ఆజ్ఞలు మారుచుండునా? ఏ వ్యక్తి అయినా ఈ విభిన్న మతగ్రంథములను అవి నిర్వచించు భగవంతుని ఆజ్ఞలు పరిశీలించినచో, అతని విశ్వాసము చిలించి, అసలు భగవంతుడు ఎవరు? ఈ పరస్పర విరుద్ధములైన ఆజ్ఞలు ఏమిటి? అసలు భగవంతుడు లేడు, శిక్షలు లేవు అను నిర్ణయమునకు కూడ చేరవచ్చును అపుడు అతనికి బాధ్యతలు ఉండవా?

'బాధ్యత' (ధర్మము) (duty) అనునది ఒక నిగూఢమైన (abstract) విషయము అందువలన దానిని నిర్వచించుటకు సాధ్యపడదు కాని బాధ్యత (ధర్మము) అను పదమునకు గల అర్థమును గ్రహించవచ్చును వివిధ మత గ్రంథములలో 'అది చేయకూడదు, ఇది చేయకూడదు, అది ధర్మము, ఇది అధర్మము' అని చెప్పబడినది కాని అవి పరస్పరం విరుద్ధముగా కనబడుతాయి అయినను వాటిని క్రోడీకరించి స్థూలముగా గ్రహించినచో వాటి అంతరార్థము 'స్వార్థము వలదు, నిస్వార్థముగా నుండుము' అని కనబడును ఏ మతమునకు సంబంధించిన 'దేవుని' ఆజ్ఞలనైన విశ్లేషించినచో ఇదే వాటికి మూలము అని గోచరమగును స్వార్థము నుండి నిస్వార్థము వైపుకు మరలించు ఏ కర్మము అయినను వ్యక్తి ప్రవృత్తిని వికసింపజేసి ఆత్మకు స్వేచ్ఛ కలుగజేస్తుంది

మనసును పరమాత్మ వైపుకు మరలించును అట్టి కర్మము మాత్రమే ఉన్నతమైనది ఇది గ్రహించగలిగిన వ్యక్తి, బాధ్యత (ధర్మము)ను మత గ్రంధముల, లేక సుభాషితముల పరిధిని దాటి విశ్వజనీనమైన నిస్వార్థ నియమముగా గ్రహించును

స్వభావమును (శీలమును) ఉద్ధరించునది సత్కర్మ (బాధ్యత), దానిని నీచపరచునది (హీనస్థితికి చేర్చునది) దుష్కర్మ (బాధ్యత) - ఇదే విశ్వజనీనమైన, నిస్వార్థ నియమము ఇది కూడ వ్యక్తి యొక్క ప్రవృత్తిని బట్టి, పరిసరములను బట్టి అనుగుణముగానుండును కాని శీల ఉద్ధరణ లేక నీచగతి ఎవరో ఒక వ్యక్తి యొక్క ఏదో ఒక దశలోని స్థితిని బట్టి ప్రమాణముగా నిర్ణయించతగదు సర్వమానవాళికి వర్తించు విశ్వజనీనమైన ప్రమాణము (standard) ను అనుసరించియే శీలమును నిర్ణయించవలయును అన్ని జాతులకు, అన్ని మతములకు, అందరి వ్యక్తులకు వర్తించు అత్యున్నతమైన ఆదర్శమే ప్రామాణికము కావాలి అంత ప్రామాణికమైన ఆదర్శమైన శీలము (స్వభావము) ఏమిటి? సర్వబంధముల నుండి విముక్తితో కూడిన పరిపూర్ణమైన ఆత్మ స్వేచ్ఛయే, అత్యున్నతమై, ప్రామాణికమైన శీలము

ఆత్మ స్వేచ్ఛతో కూడినది (freedom of soul) ఇహపరములందు స్వాతంత్ర ప్రతిపత్తికి దోహదపడునదే సత్యమైన బాధ్యత (కర్తవ్యము లేక కర్మము) ఆదర్శవంతమైన అట్టి కర్మము ధృవనక్షత్రము వలె మార్గము చూపును

నిస్వార్థతయే మనము నిత్యము చేయు కర్మములకు ప్రేరకము కావలయును అపుడే ఆత్మస్వేచ్ఛ కలుగును ఆత్మస్వేచ్ఛ ద్వారా వైశ్వానరునిగా సర్వవ్యాపియైన పరమాత్మ అంశములే జీవాత్మలన్నియు అను స్పృహ కలిగి విశ్వమానవ దృక్పథము కలుగుతుంది అదే అనాసక్తి యోగము లేక నిష్కామ కర్మములోని సారాంశము

'నిన్ను నీవు ప్రేమించినటులే ఇరుగుపొరుగు వారిని ప్రేమించు' 'నీ శత్రువులను కూడ ప్రేమించు' అని బోధించాడు ఏసుక్రీస్తు కాని గౌతమబుద్ధుడు 'తోటి ప్రాణులందరిని ప్రేమించు' అని చెప్పినట్లుగా ఏసుక్రీస్తు చెప్పలేదు తోటిప్రాణులందరిని ప్రేమించు స్థాయికి మనం చేరగలిగినపుడు, మనలో 'నేను', 'నాది', 'నన్ను' అను అహంభావం అదృశ్యమై ఆధ్యాత్మికంగా సృష్టిలో ప్రాణులందరు సమానమే అను భావన (స్పృహ) బలపడుతుంది

ఇదే భగవద్గీతలో భగవానుడు చెప్పారు (13 అధ్యాయం 28, 29, 30 శ్లోకములు)

సమస్త ప్రాణులందును పరమాత్మయే యున్నాడు అది గ్రహించినవాడు తనను తాను హింసించుకొనజాలడు ఇతర ప్రాణులను తన కంటే వేరుగా తలచుట చేత వాటికి కష్టము కలిగించును బ్రహ్మజ్ఞాని బ్రహ్మమునకు అన్యముగా దేనిని తలచడు ప్రపంచమంతయు అతనికి ఒకే బ్రహ్మస్వరూపముగా కనిపించును కర్మములన్నియు ప్రకృతి (శరీరము) చేతనే చేయబడుచున్నవి, ఆత్మకర్మలు చేయుట లేదు అని అతడు గ్రహించును సూర్యుడున్నచోట వెలుగు ఉండును, అగ్ని యున్నచోట వేడి యుండును అటులే పరమాత్మ యొక్క సన్నిధానమునందు శక్తి పనిచేయు చున్నది ఆ శక్తియే ప్రకృతి ఆ ప్రకృతి యొక్క కృత్యములు వలసిన రీతిగా జరుగుచున్నవి సంపూర్ణ జ్ఞాని యొక్క శరీరమే ప్రకృతి మనస్సు మొదలగునవి వలసిన రీతిగా కర్మములు చేయుచున్నవి కాని దాని వలన జ్ఞాని యొక్క సంపూర్ణ స్థితి యేమియును చలించదు ఈ సత్యము గ్రహించగలిగినవాడే నిష్కామకర్మయోగి కెరటము, నీటి బిందువు, నురగ - ఇవి అన్నియు సముద్రము యొక్క వేరువేరు రూపములే కాని అన్యములు కావు అన్నియు సముద్రమునందే కలియుచున్నవి సముద్రము తన శక్తిచేత ఇన్ని రూపములు దాల్చుచున్నది ప్రకృతి మాయాశక్తి రూపము ఆ ప్రకృతి భిన్నరూపములే ఈ

సృష్టిలోని అసంఖ్యాకులైన ప్రాణులు ప్రకృతి పరమాత్మ శక్తికి బాహ్యరూపము ప్రకృతిలో సర్వవ్యాపియైన విశ్వాత్మగా పరమాత్మ యున్నాడు ఇది గ్రహించినవాడు నిష్కామకర్మయోగి అగును అతనిని కర్మములంటవు నిశ్చలమైన పరబ్రహ్మము, చలనము గల శక్తియు, వాస్తవమునకు రెండును ఒక్కటియే అగ్నిలేని ఉష్ణము, ఉష్ణము లేని అగ్నిని ఊహింప శక్యము కాదు గదా! శక్తి బ్రహ్మము యొక్క గోచరరూపము శక్తి కర్మములు చేయును అనగా ప్రకృతి లేక శరీరము కర్మములు చేయును ఆ కర్మములు బ్రహ్మమును అనగా ఆత్మను చేరవు ఇది గ్రహించిన నాడే నిష్కామకర్మ సాధ్యమగును

ప్రకృతి యంతటా వ్యాపించియున్న పరమాత్మకు సర్వము సమానమే సూర్యుని వెలుగు సర్వత్రా వ్యాపించునటులే పరమాత్మ (వైశ్వానరుని) ప్రేమ అందరికి చెందును

ఈ ప్రేమ 'సత్' రూపమైనపుడు ఫలితము పరమానందము ఈ పరమానందము వర్ణనకు అతీతమైనది ప్రేమకు మరొక రూపమే పరమానందము సృష్టి సంకల్పుడైన పరమాత్మ ప్రవృత్తి ప్రేమ ఈ ప్రేమ కామముతో కూడినది కాదు పరమోన్నత స్థితి (absolute existence), పరమజ్ఞానము (absolute knowledge), పరమానందము (absolute bliss) - వీటి కలయిక పరమాత్మ ఈ మూడింటి సంయుక్త రూపమే ప్రేమ ఈ ప్రేమలో వాంఛ ఉండదు

పరమాత్మ తనలోని చైతన్యమును (శక్తిని) ప్రకృతిగా రూపొందించాడు ఆ ప్రకృతిలో అంతర్యామియైన ఆత్మగా వైశ్వానరుడై పరమాత్మ ఇమిడియున్నాడు పరమాత్మ తనలోని మాయను, అనగా భ్రమను కల్పించునది, ప్రకృతిపై ఆచ్ఛాదించియున్నాడు భ్రాంతి కలిగించుచు ఆచ్ఛాదనగా ఉన్నదే ప్రకృతి లేక స్థూల శరీరములో గోచరమగు సౌందర్యము పైకి కనబడు సౌందర్యము భౌతికము మాత్రమే ఆ భౌతికమే వాస్తవము అనుకొనుట భ్రాంతి ఆ భ్రాంతిని

కలిగించునదే మాయ ఆ భ్రాంతి దాటినచో వాస్తవము బోధపడును ఆ వాస్తవమే పరమాత్మ (వైశ్వానరుడు లేక విశ్వాత్మ) యొక్క ప్రవృత్తియైన ప్రేమ ప్రకృతిలో మనకు కనబడు సౌందర్యమును ఇంద్రియాతీత దృష్టితో గమనించినచో (transcendental) ఆ సౌందర్యమునకు మూలమైన ప్రేమ అవగతమవుతుంది ప్రకృతి, శక్తి లేక కర్మమునకు ప్రతీక (symbol of energy or activity) ఆ శక్తి లేక చర్యలు భ్రాంతి కలిగించు మాయ అను తెర (లేక) పొరచే కప్పబడి యుండును ఆ తెరను తొలగించుకొని చూచినచో అంతర్యామిగా నున్న పరమాత్మ యొక్క ప్రేమరసానుభూతి అనుభవములోనికి వస్తుంది మాయ (భ్రాంతి) వెనుక వాస్తవ ప్రకృతి యనబడు సత్య సౌందర్యము, దాని వెనుక అంతర్యామిగా నున్న పరమాత్మ ప్రేమ ఇదియే సృష్టి రహస్యము

మన స్థూల శరీరమే ప్రకృతి అదే శక్తి లేక కర్మములకు ప్రతీక భ్రాంతికి (మాయ) ప్రతీకలైన ఇంద్రియము (senses) లకు లోబడి కర్మములు చేసినంత కాలము ఆసక్తి అను ప్రేరణ ఉంటూనే ఉంటుంది కాని ఇంద్రియాతీతమైన అనగా భావతీతమైన ఉద్దేశముతో కర్మము లాచరించినచో ఆసక్తి అదృశ్యమై దాని స్థానంలో అనాసక్తమైన ప్రేమ ఏర్పడుతుంది ఆ ప్రేమయే అంతర్యామియైన పరమాత్మ అంశమైన జీవాత్మకు ప్రతీక అపుడు భ్రాంతి ప్రభావం అదృశ్యమై అనాసక్తి యోగ (నిష్కామకర్మ యోగ) సాధన సాధ్యపడుతుంది

**సత్యం శివం సుందరం** సత్యం లేక సత్ అనగా ఆత్మ శివం అంటే పరమాత్మ పరమాత్మ (విశ్వాత్మ) అంశమైన ఆత్మ ఎరమసుందరం అనగా ఇంద్రియ గోచరమగు సౌందర్యమును దాటి భావాతీత దృష్టితో పరికించినచో అంతర్ సౌందర్యము గోచరమగును - అదే సత్యసౌందర్యము

**సత్యమే సౌందర్యము, సౌందర్యమే సత్యము** (Truth is Beauty and Beauty is Truth) అను వాక్య భావమును శంకర భగవత్పాదులు 'సౌందర్యలహరి'

కావ్యములో వ్యక్తం చేశారు **సత్ + చిత్ + ఆనందము** సచ్చిదానందమే పరబ్రహ్మము అన్ని ఉపనిషత్తులలోను ప్రధానముగా చెప్పబడినది ఇదే ఆత్మ పరమాత్మ సంబంధము అదే ఆత్మజ్ఞానము - అదే బ్రహ్మజ్ఞానము కూడ పరబ్రహ్మ సచ్చిదానందరూపుడు - పరమోన్నతస్థితి (absolute existence), పరమజ్ఞానము (absolute knowledge) పరమ ఆనందము (absolute bliss) వీటి కలయికే పరమాత్మ

అదే అందరిలో ఉండు ఆత్మ ఆత్మ యొక్క లక్షణము సత్ లేక ఉనికి (అస్థిత్వము, స్థితి) అనగా సత్ లేక సత్యము అంటే ఆత్మ అని అర్థము చిత్ అనగా జ్ఞానము ఆనందం అనగా వర్ణనకు అతీతమైన పరమానంద స్థితి అదే ప్రేమ ఇది ఆత్మ లక్షణము ఆత్మజ్ఞానము పొందిన వ్యక్తి సచ్చిదానందమును పొందును అనగా సత్యమైన జ్ఞానము వలన కలుగు పరమానందం పొందును అదే పరమాత్మ లక్షణము, ప్రకృతిలో అగోచరముగా నుండు ప్రేమ అది పరమాత్మ వలె అగోచరమే కాని ఆ రసానుభూతి నిరంతరం ప్రకృతిలో వ్యక్తమవుతూనే ఉంటుంది

"కానరాదీ సృష్టి గల చోద్యమేమొ
దాని జూచిన మదిలీనమౌనందె
ఆ శాంత సీమ యందా శైలపంక్తి
పై శోణరుచుల లోపలి శీతభాను
చెరలాట లతనితో చిత్రాంచలముల
మెరసి చేసెడి శారమేఘమాలికలు
మంతనంబుల నవ్వి మజ్జనములాడు
శాంతమౌ యానీల జల తరంగములు
ఇవి డోలికలభంగి నెగిరి యూగాడ
ధవళ ఫేనార్ద్రమై తనరునీ తటము

ఈ సరస్తట పుష్పవృక్షసంతతుల
ఆ సారమదియేమొ! యాకర్షణంబొ!
ఔర నా నేత్రమ్ములవి మూతపడెడు
ద్రవించె హృదయంబది తన్మయంబున

ప్రకృతిలో మనకు కనబడు సౌందర్యమును ఇంద్రియాతీత దృష్టితో గమనించినచో ఆ సౌందర్యమునకు మూలమైన ప్రేమ అవగతమవుతుంది ప్రకృతిలోని చిరుగాలులు, ఆ గాలికి కదులు చెట్లు, ఆకులు, పూలు, గలగల పారు యేరులు, ఆ గలగలల యందలి మధురభావ స్పందనలు, లోయలందు, కొండలయందు వినబడు ప్రతిధ్వనులు, పశుపక్ష్యాదుల అమాయక చర్యలు - గమనించినచో ప్రకృతి సౌందర్యము గోచరించును ఆ సౌందర్యములో అంతర్లీనముగా నుండు ప్రేమను గ్రహించినపుడు, గోచరమగు దానిలోని అగోచరమగు సౌందర్యము గోచరించును అపుడు పరమానందము (Absolute Bliss) పొందుటకు మార్గము సుగమము అగును అపుడే సర్వవ్యాపియును అగోచరుడునునగు పరమాత్మను సర్వత్ర మానసికంగా చూడగలుగుతాము

అచటనిచట ఎచట చూచిన నీవై ఉన్నావు,
మాకు దృష్టి ఉండాలి గాని
అణువణువు నీకేతనం,
రక్తియే నీశక్తి,
ప్రేమయే నీ ఉక్తి,
అద్వైతమే నీరూపు
ఆ శక్తిలోని ఉక్తిలోని
ఐక్యతే మాకు ముక్తి
హొయలు తీరు నీరూపం
ప్రకృతే ప్రతిబింబం,

అనంతం సృష్టిచిత్రం
ఊహాతీతం, అది భావాతీతం
ఆది అనూహ్యం
అంతం అగోచరం
'సత్' రూపం అనేకం
సత్యం శివం సుందరంబిది
సచ్చిదానంద గమ్యం
ఆ శాంతసీమ హిమశైలపంక్తి
ఆపై రాగరుచుల శీతభాను
చెరలాటలతనితో చిత్రాంచలముల
మెరసి చేసెడి శారమేఘమాలికలు
అనేకంలో ఏకం నీ ఆకారం
సూర్యుని వైపు తిరుగాడు పుష్పం,
కుదువపెట్టు సౌందర్యం,
ఆత్మార్పణ పారవశ్యం
ఎక్కడ నీ ఉనికి?
అహంలోనా? ప్రేమలోనా?
కోకిల గానం నిరంతరం
మనసు పులకరించు,
హృదయం చలించు, అన్వేషణ నీకోసం
కాలం నీ కల్పనం,
ప్రకృతి నీ సంకల్పం,
రుతువులు నీ చింతనం
పూవుల ఇంపుసొంపులు
పొంగు తుమ్మెదల చెరలాటలో,

ఎక్కడ నీవు?
తుమ్మెద చెరలాటలోనా?
పూవుల సొగసులోనా?
అతీతం మనోపరిధికి
అందదు మన అహానికి
ఏమిటా సచ్చిదానందం?
మోహప్రేమమా?
రసోద్రేకమా?
వివేకచేతనమా?
రసోద్వేగ సంకల్పమా?
పావనానుభవమా?
ఆకాశ ప్లవనమా?
ఏమో! ఎవరికి తెలుసు?
ఆత్మార్పణమే
సచ్చిదానంద దర్శనం
విశ్వాత్మకం సచ్చిదానందం

సర్వవ్యాపకుడైన విశ్వాత్మకుని చూడగలిగే స్థితికి ఎదిగితే మనలోని ఆత్మజ్యోతి ద్యోతకమవుతుంది అలా ప్రేమ ద్వారా సౌందర్యమును తద్వారా ఆనంద అనుభూతి పొందకలుగుతాము ఆస్థితిలోనే అనాసక్తి యోగసాధన వీలుపడుతుంది నిష్కామ కర్మయోగము సాధ్యపడుతుంది పర్వత సానువుల నుండి నీరు క్రిందకు పారుతుంది అది గలగల పారు సెలయేరుగానూ ఉంటుంది ఘోషించు వరదలాగానూ ఉంటుంది శరత్కాల శాంత గోదారిలాగ కూడ ఉంటుంది ఇవి అన్నియు కర్మలే గదా! వాటి వలన ఆ నీటికి ఫలితమేమి ఏమియును లేదు పారుట నీటి స్వభావ కర్తవ్యము దాని వలన ఇతరులకు ఫలితము కలుగును గాని స్వయముగా దానికి ఏమియును

లేదు గదా! కనీసం ఫలితమును గురించిన ఆలోచన గూడ నీటికి ఉండదు గదా! ఒక చెట్టునే ఉదాహరణగా తీసుకుందాము అది విత్తము నుండి పెరిగి పడిపోయే దాకా తన పనిచేస్తూనే ఉంటుంది గదా! తన కర్మల ఫలితమును గురించి అది ఎపుడైనా ఆలోచిస్తుందా? స్థాణువులకు, పశుపక్ష్యాదులకు మనసు అను ఇంద్రియము లేదు గదా, వాటికి తాము కర్మము చేయుచున్నాము అను భావనయే రాదు గదా, ఇక ఫలితము ప్రసక్తి ఏముండును అను ప్రశ్న ఉదయించును వాస్తవమే ఏ ప్రాణికీ లేని ఇంద్రియము, మనసు మానవునికి ఉన్నది అందువలన మనసు స్వభావమైన ఆసక్తి లేకుండ కర్మము ఎట్లు చేయనగును? ఆసక్తి వలన ఫలితమును గురించిన ఆలోచన కలుగును గదా! మరి అనాసక్తి యోగము ఎటుల సాధ్యపడును?

ఇచట మనము ఒకటి గ్రహించవలసి యున్నది మనసు అను ఇంద్రియము లేని ఈ ప్రాణులే ప్రేమానుభవమును పొందగలుగుచున్నవి గదా! ఆ ప్రేమానుభావమే సౌందర్యానుభూతి ద్వారా పరమానందము కలుగజేయును అని గదా చెప్పబడినది మనసే లేనిది ప్రేమానుభూతి ఎలా కలుగుతుంది? కావున పశుపక్ష్యాదులలో గూడ ఆయా పరిణామ దశకు అనుగుణముగా ఎంతో కొంత పరిమాణములో మనసు ఉండుననే చెప్ప వలయును అపుడు పరిణామములో ఉన్నతుడైన మానవుడు పరిపూర్ణముగా రూపొందిన మనసు కలిగి ఉండి ప్రేమానుభూతి పొందలేడు అంటే దోషము ఎవరిది? మానవునిదే గదా! దోషము మనలోనే ఉన్నది సాధన లోపమే ప్రేమానుభూతిని పొందలేకపోవుటకు కారణము

కావున సాధన ద్వారా ప్రకృతియందు అంతర్లీనంగా ఉన్న ప్రేమ ప్రవృత్తిని గ్రహించి తద్వారా సౌందర్యానుభూతిని పొంది పరమానంద స్థాయికి ఎదుగవచ్చును ఆ విధంగా సర్వవ్యాపియైన పరమాత్మను పొంది బ్రహ్మజ్ఞాన అనుభూతిని సిద్ధింప చేసుకొనవచ్చును తద్వారా అనాసక్తి యోగము లేక నిష్కామ కర్మయోగము సాధింపవచ్చును

సర్వము పరమాత్మయే (సర్వం ఖల్విదం బ్రహ్మ) అని గ్రహించినపుడు మాత్రమే మన మనసునందు ప్రేమబీజము ఏర్పడును ఈ ప్రేమ భావన ద్వారా బాధ్యత (ధర్మము) కర్మములకు అతీతముగా ఎదిగి వాటిని ఏదో తప్పదు కాబట్టి బద్ధుడై మొగమాటము కొరకు కాక ప్రేమ ప్రేరితుడై అనాసక్తితో నిర్వర్తించును

ప్రేమ, బాధ్యత (ధర్మము) కంటే అతీతమైనది మనసు ప్రేమ ప్రేరితమైనపుడు బాధ్యత అను భావన రాదు బాధ్యతాభావముతో కర్మములు నిర్వర్తించటం బానిసత్వమునకు రూపాంతరము ప్రేమతత్వము బానిసభావము నుండి విముక్తి కర్మ నిర్వహణలో ఆత్మస్వేచ్ఛకు మార్గము సుగమమగును పరమాత్మకు ఏ ప్రాణియందూ బాధ్యతలేదు, కాని ప్రేమ, వాత్సల్యం ఉంటాయి కాబట్టి కర్మనిర్వహణ యందు బాధ్యత, ప్రేమలకు మధ్య గల భేదము గుర్తించగలగాలి 'బాధ్యత' యాంత్రిక బానిసత్వ లక్షణం కలుగజేస్తుంది 'ప్రేమ' ఆనందమును, స్వేచ్ఛను కలుగజేస్తుంది

సర్వప్రాణుల యెడల ప్రేమానుకంపనముతో (feeling of love) కూడిన భావచైతన్యము పొందిన వ్యక్తి అన్ని బాధ్యతాబంధముల నుండి, అన్ని భౌతిక ఋణానుబంధముల నుండి విముక్తుడౌతాడు అతడు ఇంద్రియ సుఖము కొరకు తాపత్రయపడడు 'అహం' అను భావము తొలగి, 'తాను' స్థూల శరీరం కాదు, అందలి 'ఆత్మ' అని గ్రహించగలుగుతాడు అనాసక్తి యోగమునకు అతడు అర్హుడవుతాడు అలా నిష్కామకర్మముల ద్వారా ధ్యానయోగశక్తిని పొందగులుగుతాడు

ప్రేమ ప్రేరితం కాని బాధ్యత మధురంగా ఉండదు అంతేగాక అది కఠినంగాను, బాధాకరంగాను ఉంటుంది ఉదాహరణకు భార్యాభర్తల సంబంధమునే తీసుకుందాము భరించేవాడు భర్త, భరించబడేది భార్య అను యాంత్రికమైన, మూఢమైన భావాలతో చరించినంత కాలం సంసారంలో

ఉండవలసిన మధురానుభూతి ఉండదు  రెండు హృదయాల కలయిక సంసారం  ఆ హృదయాలలో ప్రేమ నిండినపుడే నిజమైన ఆ కలయిక ఏర్పడుతుంది  లేనిచో ఏదో పెండ్లి జరిగింది కాబట్టి తప్పదు అని నెత్తిన బరువు మోస్తున్నట్లుగా భర్త, మంగళసూత్రం కట్టినవాడు కాబట్టి నిరాసక్తితో సంసారం సాగించు భార్య నిరంతం బంధం అను ఉచ్చులో తగిలిన పక్షులలాగ గిలగిలలాడుతుంటారు  అదే ప్రేమభరితమైన మనసులతో నిండిన భార్యాభర్తల సంబంధం మధురంగా ఉండి సంసార బాధ్యతలను ధైర్యంగా, సంతోషంగా నిర్వహించగలుగుతారు  ప్రేమ ఉన్నపుడే సుఖ, శాంతులుంటాయి  ప్రతి ఫలాపేక్ష ఉండదు  సత్యమైన ప్రేమ వ్యక్తిని ప్రేమ కొరకే కర్మములు నిర్వహించుటకు ప్రేరకమవుతుంది  ఏదో బాధ్యత కాబట్టి చేస్తున్నాము అను యాంత్రికభావం అదృశ్యమవుతుంది  ఇది గ్రహించిన వానికి కర్మసిద్ధాంత సారము గ్రాహ్యమవుతుంది  ప్రేమప్రేరితములైన కర్మములు వ్యక్తిని పరిపూర్ణమైన కర్మయోగి స్థాయికి ఎదుగునట్లు చేయును

భగవద్గీతలో 5వ అధ్యాయం 11, 12 శ్లోకములలో ఇదే వివరించబడింది  కర్మయోగులు ఫలాపేక్షను వదలి, చిత్తశుద్ధి కొరకు కేవలము శరీరము చేతను, మనస్సు చేతను, బుద్ధి చేతను, ఇంద్రియముల చేతను కర్మములు చేయుచున్నారు  కర్మయోగి యొక్క హృదయము నుండి అహంకారము, స్వార్థము మాయమగుచున్నవి  అపుడు అంతఃకరణములు, బాహ్యకరణములు తమ తమ కర్మములు మాత్రమే చేయుచుండును  లోపల నుండి కోరికయను ఇంధనము వాటికి రాదు  అందువలన చిత్తశుద్ధి కలుగును  కర్మము నుండి కర్మయోగి పొందు లాభము ఇదియే  కర్మయోగియైనవాడు కర్మఫలము నందాసక్తి లేనివాడై నిష్కామనిష్ఠ ద్వారా కలుగు శాంతిని పొందుచున్నాడు  నిష్కామనిష్ఠ లేనివాడు ఆశకు వశుడై కర్మఫలాసక్తితో కర్మబద్ధుడగుచున్నాడు

ఏసుక్రీస్తు మానవాళి కొరకు తనను తానే అర్పించుకున్నారు

గౌతమబుద్ధుడు మానవసేవ కొరకు తన సుఖమును త్యాగం చేశాడు వారు చేసినదానికి ప్రేరణ ప్రేమ వారు తమకు తామే మానవసేవ చేపట్టారు వారు చేసిన దానిలొ బాధ్యతకు స్థానం లేదు అది బాధ్యతకు ఎంతో అతీతమైనది వారిది ప్రేమ బాధ్యత కాదు దాని వలన వారు పొందినది శాంతి, దైవత్వ లక్షణమైన ఆత్మస్వేచ్ఛ

అట్టి దైవికమైన (divine) ప్రేమ, ఆత్మ స్వేచ్ఛ ద్వారా బ్రహ్మజ్ఞానము కలుగుతుంది దైవికమైన ప్రేమ అనగా ప్రాణులందరు ఒకటే అను ఐక్యతాభావము కాని ఈ భావము మనము భౌతిక (plane) తలము నందు మాత్రమే జీవితము గడిపినంత కాలము మనకు కలుగదు అత్యున్నతమైన ఆధ్యాత్మిక తలమునందు మాత్రమే ఇది కలుగును పరమాత్మ సర్వత్ర సమముగానే వ్యాపించియున్నాడు

భగవద్గీత 6వ అధ్యాయం 29, 30 శ్లోకములలో ఈ విషయమే చెప్పబడింది

యోగము నందు ఐక్యమైనవాడు, అన్నిటియందు సమదృష్టి కలిగి యుండును పరమాత్మను సర్వప్రాణులందును, సర్వప్రాణులను పరమాత్మ యందున్నవిగను చూచును

ఎవరైనను 'తాను ప్రత్యేకమైన జీవుడను' అని చెప్పినచో అది గంగా ప్రవాహము నందు ఒక చిన్న భాగమునకు ఆనకట్ట కట్టి, ఆ ఆనకట్టలోని నీటిని తన యొక్క గంగ అని చెప్పినట్లు ఉండును అని శ్రీ రామకృష్ణ పరమహంస అన్నారు

ఎవరు పరమాత్మను అన్నిటి యందును, సర్వమును పరమాత్మ యందును చూచుచున్నాడో అతని దృష్టి నుండి పరమాత్మ తప్పుకొనజాలడు, అంతియే కాదు పరమాత్మ దృష్టి నుండి అతడు మరుగునపడలేదు అతడే

నిష్కామకర్మ కర్మయోగి కర్మయోగికి దైవత్వముతో ఏకత్వము లభిస్తుంది అతడికి జీవితము త్యజించవలసిన అవుసరము ఉండదు ఇహములోనే సర్వకర్మములను నిర్వర్తించుచు కర్మములకు అతీతుడై సచ్చిదానందమును పొందును

ఇంతవరకు ఉపనిషత్తులు, భగవద్గీతననుసరించి కర్మ సిద్ధాంతము విశ్లేషించబడినది వర్తమాన జీవితములో కాలపరిస్థితులతో సమన్వయించ బడినది ఇక కర్మసిద్ధాంత పరిణామముల గురించి అనగా వేదకాలము నుండి నేటి వరకు కర్మసిద్ధాంతములో జరిగిన మార్పులు కూర్పులు తెలుసుకొనవలసి యున్నది

## 3 కర్మసిద్ధాంత పరిణామము (Evolution of the Doctrine of Karma)

మానవ పరస్పర సంబంధ విషయములోను, నైతిక, తాత్త్విక విషయములలోను నిగూఢమైన కర్మసిద్ధాంతము కలుగజేసిన ఆలోచనా వికాసము ఎంతో ఉన్నది మానవులలో కలుగుచున్న అసమానత, బాధలకు తార్కికమైన, హేతుబద్ధమైన సమాధానము కర్మసిద్ధాంతములో నున్నది ప్రకృతి యందు జరుగు ప్రతి చర్య ఒక బలీయమైన కర్మము ఆ కర్మము వెనుక ఒక బలీయమైన కారణము మానవ జీవిత స్థితిగతులకు మూలము అను విషయము కర్మ సిద్ధాంతము వెలుగులోనికి తెచ్చినది విశ్వాసము కంటే హేతువే ప్రధాన ఆధారముగా శాస్త్రీయ దృక్పథముతో (Scietific out look) మానవస్థితిగతులు దైవప్రోక్తములు అనుట కంటే కర్మ ఫలితములుగా కలుగు సహజ సిద్ధములు అనుట మిక్కిలి సమంజసము అను ఆలోచనాసరళి కర్మసిద్ధాంతము వలన ఏర్పడినది

వేదకాలము నుండి నేటివరకు ఈ కర్మసిద్ధాంతము ఎంతో పరిణామములకు లోనైనది కర్మ ఫలితముగా కలుగు పునర్జన్మ, సంచిత,

ప్రారబ్ధ కర్మలు కర్మ సిద్ధాంతములోని ప్రధానాంశములు కర్మ సిద్ధాంత పరిణామ దశలు ఉపనిషత్తులలో పతాక స్థాయికి చేరుకున్నాయి కర్మకాండల దశ నుండి ఉపనిషత్తులలో కార్యకారణ (cause and effect) దశకు కర్మ సిద్ధాంతము రూపొందినది

పరిణామక్రమములో 'కర్మ ఒక వ్యక్తిగత బాధ్యత, అనగా కర్మ లేనిది మానవుడు మనజాలడు కర్మము నుండి అనగా దాని ఫలితము నుండి ఏ మానవుడు తప్పించుకొనజాలడు అను పరిపక్వమైన భాష్యము కర్మ సిద్ధాంతమునకు ఏర్పడినది కర్మ' స్వయంప్రతిపత్తి కలది అను సిద్ధాంత పరికల్పన జరిగినది 'నొసటి వ్రాత' లేక 'విధి వ్రాత' అను పదములకు పర్యాయముగా 'ఇది నా కర్మ' అను పదము ప్రాచుర్యము పొందినది సర్వము భగవంతుని ఇచ్ఛానుసారమే జరుగును, జీవులు ఆయన ఆటలోని పావులు అను విశ్వాసమునకు ఎదురు పలుకుగా (challenge) అనగా సవాలుగా కర్మ సిద్ధాంతము పరిణతి చెందినది

కర్మ సిద్ధాంతము బలపడుటకు బౌద్ధమతము కూడ తనవంతు దోహదము ఇచ్చినది ఒక చర్య జరుగుట యందు గల ఉద్దేశము ననుసరించి ఆ చర్యకు కలుగు నైతికస్థాయి రూపొందును ఉద్దేశపూర్వకముగ (motive) జరగని కర్మము వలన ఫలితముగా ఎటువంటి శిక్షయు జరగదు అని బౌద్ధమత కర్మసిద్ధాంతము కర్మములకు మూలము కోరికలు, ఆ కోరికలే కర్మములను బలీయమొనర్చును అందు వలన వాంఛలు లేక కోరికలే ఏ చర్యకైనను మూలము అని బౌద్ధమత సిద్ధాంతము కోరికల వలన చర్యలు జరుగును ఆ చర్యల వలన భౌతిక బంధములు ఏర్పడును తృష్ణ లేక కోరికలను నియంత్రించటమే కర్మ ఫలితముల నుండి తప్పించుకొనుటకు మార్గము అని బౌద్ధసూత్రము

జైనమతము కూడ సమాజములో కర్మసిద్ధాంత ప్రభావమునకు

మార్గమైనది జైనుల కర్మ సిద్ధాంతము కొంత వింతగా నుండును కర్మము అనునది పదార్థ కణ సముదాయము అది ఆత్మయందు (జీవాత్మ) అంతర్గతముగా స్థిరపడును అని జైనమతవాదన 'కర్మ' పదార్థము సహజముగా దుష్టమైనది (evil) ఈ కర్మమే జీవులను జనన, మరణ వలయములో బంధించును అన్నారు జైనులు జననం, మరణం, పునర్జన్మ అనునవి ఒక ఆవృతము అన్నారు అందువలన అకర్మ వాదనను బోధించారు, అనగా ఏ కర్మమును చేయకుండుట శరీరమును కృశింపజేయుట వంటి ప్రాయశ్చిత్తముల ద్వారా కర్మము నుండి విముక్తి పొందవచ్చును అని జైనసిద్ధాంతము

అటుపై భగవద్గీత ద్వారా నిష్కామకర్మయోగము ఆచరణలోనికి వచ్చినది బౌద్ధుల బోధిసత్వ ఆదర్శము కూడ ఈ కోవకు చెందినదే హిందూమతములోని షడ్దర్శనములు అనగా న్యాయ, వైశేషికములు, సాంఖ్య యోగములు, పూర్వ, ఉత్తర మీమాంసలు కర్మసిద్ధాంతమును గూర్చి విభిన్న భాష్యములు చెప్పినవి 'కర్మము'నకు సంబంధించినంత వరకు భగవంతుని ప్రతిపత్తిని గూర్చి ఈ దర్శనములు విభేదించినవి కర్మ అచేతనమైనది అందువలన కర్మఫలితము జీవులకు చేరుటకు చేతనుడైన భగవంతుని ప్రమేయము ఉండవలసిన అవసరమున్నదా? లేదా? అను ప్రశ్న వాద ప్రతివాదములకు దారితీసినది 'కర్మ పరిపక్వము' అనగా నేమి? ఇది కర్మ సిద్ధాంతములో ప్రధానాంశము కాలక్రమేణ విధి, నొసటివ్రాత (fate, destiny etc ) మొదలగు పదములు 'కర్మము'నకు పర్యాయములైనవి కర్మఫలితము తప్పించుకొనుటకు వీలులేనిది అను అంశము ప్రాధాన్యము పొందినను, వర్తమాన జీవితములో క్రియమాణ కర్మకు స్థానము కల్పించారు

వేదకాలములో విశ్వసించబడిన స్వర్గ, నరకములు ప్రత్యేక లోకములుగా వాటి ప్రమాణమును కోల్పోయినవి ఈ జీవకోటి నిలయమైన ప్రపంచమును దాటి అవి ఎక్కడను బయట లేవు అను తార్కికవాదమునకు

స్థానమేర్పడినది దేవతలు కూడ కర్మఫలిత పరిధిలోనివారే అన్నారు కర్మ ఫలితమునననుసరించి పునర్జన్మలో కష్టసుఖానుభవమే నరకము, స్వర్గములు తప్ప అవి వేరు లోకములు కావు అన్నారు రోగబాధలు కూడ గతజన్మ కర్మ ఫలితములే అన్నారు కర్మ ఫలితము నుండి తప్పించుకొనుట అసాధ్యము అనునది కర్మ సిద్ధాంత ప్రధాన అంశమైనది దీపము వెనుకనే నీడ వలె ఈ కర్మ సిద్ధాంతము క్రొత్త మూఢవిశ్వాసమునకు కూడ దారితీసినది చాతుర్వర్ణ వ్యవస్థ స్థానంలో కులవ్యవస్థ ఏర్పడి దానికి కర్మఫలితమునకు ఒక అక్షము (axis) గా విశ్వసింపబడినది జప, దాన పుణ్యకర్మల ద్వారా ప్రారబ్ధకర్మను నిర్వీర్యము చేయవచ్చును అను వాదము రూపొందినది

కర్మసిద్ధాంతము శాస్త్రీయ (scientific) దృక్పథముతో కూడినది అయినను, బ్రాహ్మణముల కాలములో ఏర్పడిన కొన్ని మూఢ విశ్వాసములు ఇంకను స్థిరముగానే ఉన్నవి మరణించిన వారికి చేయు శ్రాద్ధకర్మల ద్వారాను, తీర్థయాత్రల ద్వారాను, నవగ్రహ జపముల ద్వారాను, కర్మ ఫలితమును నిరర్థకముగా చేయవచ్చును అను వాదన కర్మ సిద్ధాంతమునకు ప్రతికూల అంశములుగా ఏర్పడినవి

ఉపనిషత్తుల ద్వారాను, ఆధునిక విజ్ఞానశాస్త్రము ద్వారాను (science) సృష్టి పురోగతితో కూడిన ఒక పరిణామ ప్రవాహము (evolution) అని తెలియుచున్నది పరిణామము నందు పురోగతియే తప్ప తిరోగతి ఉండదు పరిణామములో మానవజన్మ పొందిన జీవుడు పునర్జన్మము ద్వారా తిరోగమించి తిరిగి పశుజన్మము కర్మ ఫలితముననుసరించి పొందును అను వాదన వ్యతిరేకించబడినది మానవుడు పునర్జన్మ ద్వారా కర్మ ఫలితముగా పశు, పక్ష్యాదులుగా పుట్టుదురు అను వాదన కర్మసిద్ధాంత అంతరార్థము కాదు అని తార్కికముగా వివరించుట, కర్మము వ్యక్తిగతమేనా? లేక సామూహికముగాను, సామాజికముగాను కూడ దాని ఫలితము ఉండునా? ఒక చెడు కర్మ ఫలితమును,

మరియొక సత్కర్మ ఫలితము ద్వారా నిరర్ధకముగా చేయవచ్చునా? కర్మ ఫలితమును ఒకరు మరొకరికి మార్చతగునా? ప్రారబ్ధకర్మ అనుభవింపక తప్పదు అనినచో వర్తమాన జీవితములో చేయు క్రియమాణ కర్మము యొక్క భావము ఏమిటి? దాని ప్రభావము ఏమిటి? కర్మపరిపక్వము అనగా నేమి? సంచితకర్మ, ప్రారబ్ధకర్మ, క్రిమాణకర్మ వీటి పరస్పర సంబంధము ఏమిటి? ఇవి ప్రధాన చర్చనీయాంశములు అయినవి

ఇక వేదకాలము నుండి నేటి వరకు కర్మసిద్ధాంతము పొందిన పరిణామదశలను పరిశీలించుదము

## 1) వేదకాలము నాటి కర్మ సిద్ధాంతము

వేద సాహిత్యమునందు, అనగా ప్రధానముగా 'సంహిత'ల యందు 'కర్మ' అను శబ్దము కర్మసిద్ధాంత అర్థముతో ఉపయోగించబడినట్లు కనబడుట లేదు కర్మ సిద్ధాంతమునకు రూపము ఏర్పడిన తరువాతనే కర్మము, సుకృతము, దుష్కృతము, పునర్జన్మ అను శబ్దములు అటుపైన వేదసాహిత్యము నందు ప్రవేశము పొందినట్లు తెలియుచున్నది సంహితల యందు 'కర్మ' శబ్దము మతసంబంధమైన కర్మకాండలు అను అర్థముతోనే ఉపయోగించ బడినట్లు కనబడుచున్నది దైవప్రీతి కొరకు చేయబడు కార్యములను మాత్రమే కర్మములుగా పరిగణించినట్లు తెలియుచున్నది చర్య, ప్రతిచర్య, ఆత్మ, జన్మ, పునర్జన్మ అను అర్థములు 'కర్మ' శబ్దమునకు ఉపనిషత్తులకు పూర్వకాలము నాటి వేదసాహిత్యమునందు కనబడవు ఋగ్వేదములో, ముఖ్యముగా 'బ్రాహ్మణము'లలో 'కర్మ'ను 'యజ్ఞకర్మ' పరముగానే ఉపయోగించారు క్రతువు, హోమబలి, పరిత్యాగము (offering) 'యజ్ఞకర్మ'కు అర్థముగా చెప్పబడినది ప్రధానముగా సంహితలలో ఈ యజ్ఞకర్మకు 'ఇష్టాపూర్తము' అనునది పర్యాయపదముగా ఉన్నట్లు కనబడుచున్నది 'ఇష్టాపూర్తము' అనగా ఇష్టమును, పూర్తమును (లేక) సత్కార్యాచరణము మరొక విధముగా

గ్రహించినచో 'ఇష్టా' అనగా పరిత్యాగము చేయబడినది (sacrifice), 'పూర్తా' అనగా పూరించుట అని కూడా అర్ధము వచ్చును 'ఇష్టాపూర్తము' పదమునుగురించి గల విరుద్ధ, విభిన్న వ్యాఖ్యలు ఇచట చర్చనీయాంశము కాదు సంహిత, బ్రాహ్మణముల కాలము నాటి కర్మసిద్ధాంతరూపకల్పన మాత్రమే చర్చనీయాంశము యజ్ఞకర్మలందు చేయబడు 'హోమబలుల' ద్వారా స్వర్గమునందు స్థానము పొందగలుగుటయే ఇష్టాపూర్తమునకు పర్యవసానార్థముగా చెప్పవచ్చును 'స్వర్గసుఖము అను 'నిధి'ని ఏర్పరచు కొనుటయే దీని భావార్థముగా కనబడును దైవప్రార్థనల యందు భగవంతునికి సమర్పించబడు దక్షిణల యందు ఇమిడియున్న కోరిక ఒక్కటే, అది మనిషి మరణానంతరము అతనిని గురించి అతని 'ఇష్టాపూర్తము'ను తెలిపి అతనిని స్వర్గమునకు చేర్చవలయును అనునదే అనగా ఉపనిషత్తులలోను, భగవద్గీతలోను 'కర్మ'కు గల భావార్థము వేదసంహితలలోను, బ్రాహ్మణముల లోను ఏ మాత్రము కనబడదు

'యజ్ఞోవైకర్మ' అని బ్రాహ్మణముల (శతపథ బ్రాహ్మణము) వచనము 'యజ్ఞకర్మ'కు రూపాంతరముగానే 'ఇష్టాపూర్తమును' భావించవచ్చును వైదిక కర్మలందు 'అగ్ని'కి 'దైవత్వము, మధ్యవర్తిత్వము' (mediator) ఊహించబడినది ఋగ్వేదములో అగ్నిని (1-1-1) 'యజ్ఞస్యదేవమ్' అన్నారు అనగా హోమబలులకు సంబంధించిన దైవము ఋగ్వేదములో అగ్నిని దేవదూతగాను, పురోహితుని గాను భావించారు దేవతల కరుణను పొందుటకు అగ్నిని మార్గముగా (మాధ్యమము medium) ఎంచుకున్నారు ఈ విశ్వాసము నేటికి కూడ ఆచరణలో నున్నట్లు అందరికి తెలిసిన విషయమే ఋగ్వేదములో (1-164-35) యజ్ఞమును విశ్వమునకు నాభి అన్నారు (యజ్ఞభువనస్యనాభిః) యజ్ఞములో హోమబలులు చేయుట ద్వారా బ్రాహ్మణులు దైవత్వమును పొందుదురు అని విశ్వసింపబడినది ఈ యజ్ఞ సంప్రదాయము నేటికీ రాజకీయ నాయకుల విజయము కొరకు, ఇతర వ్యాపారాత్మకమైన స్వార్థ

ప్రయోజనముల కొరకు 'ఆచరణలోనున్న విషయము విదితమే కదా! ఈ సంప్రదాయము బ్రాహ్మణముల కాలము నుండియే ప్రాచుర్యము పొందినదిగా కనబడును సంహితల యందు ప్రార్థనలకే ఎక్కువ ప్రాధాన్యము ఇవ్వబడినది కాని బ్రాహ్మణములందు యజ్ఞకర్మలు ఎక్కువ ప్రాధాన్యము సంతరించు కున్నాయి హవిస్సుల ద్వారా (అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఇవురబెట్టిన యన్నము, నెయ్యి) హవనము (హోమము) పాప పరిహారమునకు మార్గముగా విశ్వసించబడినది హవము నందు (యజ్ఞకర్మయందు) అగ్నిహోత్రమునకు అపారమైన ప్రాధాన్యము ఆపాదింపబడినది తదుపరి కాలములో అనగా ఉపనిషత్తులలో పరిపూర్ణ రూప పరిణామమును పొందిన కర్మ సిద్ధాంతము నందు ప్రాధాన్యము పొందిన ధర్మము, నీతి, విలువలు, యజ్ఞకర్మలందు కానరావు

సంహితల యందు 'పాపకర్మము', 'పుణ్యకర్మము' అను పదములు స్పష్టముగా నిర్వచింపబడలేదు దుష్టచిత్తముతో (ఉద్దేశముతో motive) చేయు పనిని దుష్కృతము అని తరువాత కాలమునందు అన్నారు 'పాపము' లేక 'పుణ్యము' అను శబ్దములను విడిగా పూర్తి అర్థముతో ఉపయోగించినట్లు సంహితలందు కనబడదు వాటిని ఉపసర్గలు (prefixes) గా మాత్రమే ఉపయోగించారు అనగా ఒక శబ్దమునకు ముందు ప్రత్యయముగా మాత్రమే ఉపయోగించారు పాపఫలము, పుణ్యఫలము అనియే తప్ప ప్రత్యేకముగా నీతిని యమములను సూచించు 'పాపము' లేక 'పుణ్యము' అను పదములు విడిగా ఉపయోగించబడలేదు బ్రాహ్మణములందు కూడ ఇందుకు భిన్నమైన పరిణామము కనబడదు అంతియేగాక ఒక వ్యక్తి అనుభవించు పాప, లేక పుణ్యఫలములు తను చేసిన మంచి చెడుల వలన కాక తన పూర్వీకుల దుష్కృత, సుకృత ఫలములు మాత్రమే అను భావన ఉన్నట్లుగా కూడ కనబడును ఈ భావన కర్మసిద్ధాంతము నందు చెప్పబడిన కుటుంబ సంచిత కర్మఫలమును పోలియున్నట్లు కనబడును, కాని కర్మసిద్ధాంతము సంహితల

యందు, బ్రాహ్మణములయందు ఏ విధముగాను నిర్దిష్ట రూపము పొంది యుండలేదు అనునది మాత్రము స్పష్టము

'పునర్జన్మ' కర్మ సిద్ధాంతము నందు ప్రధానాంశము కర్మఫలములు ఎపుడు అనుభవములోనికి వచ్చునో, తెలియుట దుర్లభము అని గదా కర్మ సిద్ధాంతము వర్తమానములో అనుభవములోకి వచ్చు ఫలితములు గతములోని ఏ జన్మలోనివైనా కావచ్చు అని చెప్పబడినది గతజన్మ ఉన్నది అనినపుడు పునర్జన్మ కూడ ఉండి తీరవలయును గదా! అందువలననే 'పునర్జన్మ' కర్మ సిద్ధాంతము నందు ప్రధానాంశము అయినది

సంహితలయందు (ఋగ్వేదము 1-164-30) పునర్జన్మ గురించి చెప్పబడినది కాని ఉపనిషత్తుల ద్వారా కర్మసిద్ధాంతము నందు చెప్పబడిన పునర్జన్మ విధానమునకు, ఋగ్వేదమునందు చెప్పబడిన పునర్జన్మ విధానమునకు చాల భేదము కనబడును ఆత్మ తనలోని అంతర్లీనముగానున్న శక్తి (స్వధా) ఆధారముగా శరీరములను మార్చుచుండును, ఆత్మకు మృత్యువు లేదు అని కూడ పునర్జన్మను గురించి ఋగ్వేదవచనము సత్పురుషుడు తన వంశములోనే తిరిగి పునర్జన్మ పొందును అని కూడ విశ్వసించబడినది ఈ విశ్వాసము నేటికి కూడ ఎంతో కొంత నమ్మకముగానే మిగిలియున్నది కర్మఫలమునకు పునర్జన్మకు గల సంబంధమును గురించి వేదమునందు చెప్పబడలేదు ఇష్టాపూర్తమును అనుభవించుటకు మరణానంతరము జీవుడు స్వర్గమునకు చేర్చబడును అని వేద (అధర్వవేదము XVIII 2-56, 57) వచనము స్వర్గము చేరుటకు ఆత్మ మరియొక శరీరము నందు ప్రవేశించును అనగా స్వర్గము నందు ఆత్మ పునర్జన్మ పొందును అని భావార్థముగా తెలియుచున్నది ఇష్టాపూర్తము లేక యజ్ఞఫలము జన్మ, పునర్జన్మల మధ్యగల వారధి (అనుబంధము)గా కనబడుచున్నది ఇష్టాపూర్తము ద్వారా దేవయానము నందు స్వర్గము చేరి ఆత్మ పరకాయ ప్రవేశము చేయును అని ఊహించబడినట్లు కనబడును

కర్మ సిద్ధాంతము నందు చెప్పబడినట్లు సంచిత, క్రియమాణ కర్మల ఫలితముగా పునర్జన్మ కలుగును అని కాక ఆత్మ తనలో అంతర్లీనముగా నున్న శక్తిచే పునర్జన్మలు పొందుచుండెను అని ఋగ్వేదవచనం యజ్ఞమందలి అగ్నిహోత్రుని ద్వారా పునర్జన్మను (పునర్మృత్యువు) జయించవచ్చును (X 1-4-14) అని శతపథ బ్రాహ్మణం చెప్పింది అగ్నిహోత్రుడు జీవుని స్వర్గమునకు చేర్చు యానముగా (Medium) భావించబడెను అగ్నిహోత్రుని ఆరాధించినవాడు తన సంతానముగా తానే ఉద్భవించును అని విశ్వసించబడినది "ఆత్మావైపుత్ర నామాసి" మరణానంతరము స్థూల శరీరము దహింపబడిన తరువాత జీవుడు పునర్జన్మ పొందును అని శతపద బ్రాహ్మణవచనము (XI 2-1-1) పునర్జన్మలో మానవునిగానే కాక ఇతర జీవులుగా కూడ జన్మము పొందుటకు అవకాశము కలదు అని వేదసంహితలు, బ్రాహ్మణములు చెప్పినవి కాని ఇది కర్మ సిద్ధాంతము ప్రకారము కర్మఫలముననుసరించిన పునర్జన్మ కాదు

సంహితల యందు, బ్రాహ్మణముల యందు వివరించబడిన పునర్జన్మలకు, కర్మ సిద్ధాంతములో చెప్పబడిన పునర్జన్మలకు, పోలిక, అనుబంధము లేకపోయినను, వేదమునందు చెప్పబడిన ఇష్టాపూర్తము, యజ్ఞకర్మలు కర్మసిద్ధాంత సౌధమునకు పునాది వంటివి అని మాత్రము చెప్పవచ్చును వీటి ఆధారముగానే ఉపనిషత్తుల కాలము నాటి సంపూర్ణ కర్మ సిద్ధాంతము రూపొంది ఉండవచ్చును అని అనిపించును మూలము పునాదియే అయినను దానిపై ఏర్పడిన సౌధము పునాది కంటే భిన్నముగా ఉండుటకు అవకాశము కలదు

యజ్ఞకర్మను 'ఇష్టి' అన్నారు దీని ద్వారా ఏదో అగోచరమగు శక్తి కలుగునని, ఆ శక్తి ద్వారా కలుగు లాభము స్వర్గములో ఆ వ్యక్తి పేర ఒకే నిధిగా ఉండునని, యజ్ఞకర్త మరణానంతరము తన ఆత్మ పరకాయ ప్రవేశము ద్వారా అనగా మరియొక శరీరరూపము పొందుట ద్వారా స్వర్గములో నున్న తన నిధిని పొందును అని విశ్వసించారు

కర్మ సిద్ధాంతములో ఇది రూపాంతరము పొందినది పాపము, పుణ్యము అనునవి కర్మ సిద్ధాంతములో ప్రధానాంశములు ప్రతి ఒక్క చర్యకు (action) ప్రతిచర్య (reaction) రూపములో ఫలితము ఏర్పడును అనునది కర్మ సిద్ధాంతము ఈ చర్య భౌతికమైనపుడు ప్రతిచర్య దాదాపు వెంటనే కనబడును కాని ధర్మము, నీతి, నియమములకు సంబంధించిన చర్యలకు ఫలితములు ఎపుడు కలుగునో తెలియుట దుర్లభము దీనినే కర్మఫలితము అంటారు ఈ కర్మ ఫలితములు చాలవరకు భవిష్యత్తులోనే కలుగును ఇవి కష్ట, సుఖముల రూపములో నుండును వీటినే అదృష్టము, దురదృష్టము లేక విధి వ్రాత అన్నారు వర్తమానములో జరుగు ప్రతి చర్యకు (కర్మము) ఎపుడో భవిష్యత్తులో కలుగు ఫలితమునకు అగోచరమగు సంబంధము ఉన్నది అని కర్మ సిద్ధాంత సారాంశము కర్మఫలితములు సంస్కారముల రూపములో కారణ శరీరము ద్వారా ఆత్మను అనుసరించి యుండును అని కూడ కర్మసిద్ధాంత అంతరార్థము కర్మ పరిపక్వము ద్వారా దాని ఫలితము అనుభవములోనికి వచ్చును అను కర్మ సిద్ధాంత అంశము ఇష్టాపూర్తము ద్వారా స్వర్గములో 'నిధి' ఏర్పరచుకొనుట, మరణానంతరము స్వర్గములో కలుగు నూతన శరీరము ద్వారా ఆ నిధిని అనుభవించుట అనునది యజ్ఞకర్మ సారాంశముతో పోలియున్నదేమో అనిపించును

వేద సంహితలు, బ్రాహ్మణములలో చెప్పబడిన పునర్జన్మ విషయము, కర్మ సిద్ధాంతమందు వివరించబడిన పునర్జన్మ విషయమునకు భిన్నముగా నుండును యజ్ఞకర్మ లేక ఇష్టాపూర్తము ప్రకారము ఒక వ్యక్తి ఆత్మ మరణానంతరం స్వర్గములో పరకాయ ప్రవేశము పొంది (trans-migration) అచట నిల్వయున్న 'నిధి'ని అనుభవించును అనగా యజ్ఞకర్మ ప్రకారము పునర్జన్మ మరియొక లోకము లేక తలములో (plane) సంభవించును కాని కర్మ సిద్ధాంత ప్రకారము పునర్జన్మ ఈ లోకములోనే అనగా భూతలములోనే సంభవించును

కర్మసిద్ధాంతములో కూడ దేవయాన, పితృయాన మార్గముల ద్వారా స్వర్గ, నరకములలో కర్మఫలములు అనుభవించును అని కర్మ సిద్ధాంత పూర్వదశ యందు కనబడును కాని అటుపై కర్మ సిద్ధాంత పరిణామ రూపములో కర్మఫలము స్వర్గ నరకములలో అనుభవించుట జరిగినపుడు సంచితకర్మ, పునర్జన్మ యందు ఈ లోకమందు కలుగు ప్రారబ్ధకర్మ అనుభవము అర్థశూన్యమగుటయే గాక కర్మ సిద్ధాంత ఉద్దేశమే నిరర్థకమగును అని కర్మ సిద్ధాంత సారాంశముగా చెప్పబడినది అనగా కర్మసిద్ధాంతము ప్రకారము కర్మ ఫలానుభవము ఈ లోకమున మాత్రమే పునర్జన్మ యందు కలుగును స్వర్గనరకములు వర్తమాన జన్మయందు అనుభవములోనికి వచ్చు ప్రారబ్ధకర్మ ఫలముల భావార్థక సంకేతములు మాత్రమే తప్ప స్వర్గ నరకములు అని వేరు లోకము లేవు అని కర్మ సిద్ధాంతము ద్వారా స్పష్టమయినది

కర్మసిద్ధాంతము నీతి, నియమము, ధర్మము, విలువలు ఆధారముగా రూపొందినది కాని యజ్ఞకర్మ ప్రధానంగా స్వర్గసుఖములు పొందవలెను అను ఆకాంక్షతో మాత్రమే ఏర్పడినది ఇష్టాపూర్తము లేక యజ్ఞకర్మ కాలక్రమేణ ఆరణ్యక దశ నుండి ఉపనిషత్తుల కాలము నాటికి కర్మసిద్ధాంతముగా రూపాంతరము చెంది యుండవచ్చునేమో అనిపించును బ్రాహ్మణముల కాలము నాటి యజ్ఞకర్మకాండల ప్రాభవము ఉపనిషత్తుల కాలము నాటికి తగ్గి నీతి, నియమము, ధర్మము, విలువలు ప్రధానంగా కర్మ సిద్ధాంత ప్రాభవము పెరిగినది కదా! ఉపనిషత్తుల కాలంలో స్వర్గసుఖముల కంటే ఆధ్యాత్మికత ద్వారా బ్రహ్మజ్ఞాన సముపార్జనకే ప్రాధాన్యము ఏర్పడినది సంహితలు, బ్రాహ్మణములయందు పాపము, పుణ్యము, ఆధ్యాత్మికత, బ్రహ్మజ్ఞానములకు స్పష్టమైన స్థానము లేదు ఉపనిషత్తులలోనే వీటికి నిర్దిష్టమైన స్థానమేర్పడినది యజ్ఞకర్మల ద్వారా స్వర్గమునందు సుకృతనిధి ఏర్పడును అన్నాడు కాని మనిషి దుష్కృత్యములకు నిధి ఎక్కడ ఏర్పడును? అవి ఆ వ్యక్తి మరణానంతరము ఎక్కడ అనుభవించును? ఈ ప్రశ్నలకు సమాధానముగానే

కర్మ సిద్ధాంత ప్రధమదశ యందు స్వర్గము, నరకము ఏర్పడి పాపము, పుణ్యము అను పదములు నిర్వచింపబడి వాటి ఫలితముగా స్వర్గసుఖములు, నరకబాధలు ఊహించబడినవి తదుపరి కాలములో కర్మ సిద్ధాంతము పరిణామము చెంది స్వర్గ, నరకములు ఊహారూపములు మాత్రమే, కర్మ ఫలితములు కారణ శరీరమును అంటియుండు సంస్కారముల ద్వారా పునర్జన్మ యందు పాప, పుణ్యములు అనుభవములోనికి వచ్చును అని తార్కికముగా వివరించబడినది

కర్మసిద్ధాంత రూపకల్పన జరిగిన తదుపరి కూడ పూర్వమీమాంసకులు కర్మకాండలకే ఇంకను ప్రాధాన్యము ఇస్తూనే ఉన్నారు ఇష్టపూర్తమును తొలగించి దాని స్థానములో యజ్ఞకర్మకు ప్రాధాన్యము ఇచ్చారు

జైనమతస్థులు కర్మను ఒక ద్రవ్యముగా అనగా ఒక పదార్థముగా నిర్వచించారు ఈ పదార్థము ఇంద్రియములకు అతీతము, అగోచరము అయినది అన్నారు ఈ పదార్థము ఆత్మను అంటియుండి దానికి కర్మణ శరీరరూపము కలిగించును అని కూడ అన్నారు ఈ నిర్వచనము జైనమత ప్రత్యేకత అయినను వేదసంహితలలోని ఇష్టాపూర్తమునకే ఇది ఒక పరివర్తన రూపమా అని సందేహము కలుగుటకు అవకాశమున్నది ఇష్టాపూర్తము ఒక చరాస్తిగా చెప్పబడినది ఇది ద్రవ్య లేక పదార్థ రూపమునకు సూచన కావచ్చునని భావించవచ్చును గదా! కావున జైనులు విశ్వసించు కర్మ యొక్క ద్రవ్య లక్షణము దీని పర్యాయమే కావచ్చును అని భావించవచ్చునేమో?

బౌద్ధమతమునను సరించి కర్మ ఒక నిర్జీవ పదార్థము కాదు అది ప్రధానముగా శీలమునుండియే ఉత్పన్నమగును, అనగా అది మానసికము అని బౌద్ధవాదము సంచితకర్మ రూపరహితమై మహాభూతములతో (great elements of nature) ఏర్పడి పునర్జన్మ రూపమునకు కారణమగును అని బౌద్ధ కర్మ సిద్ధాంతము జైన బౌద్ధ మతముల కర్మ సిద్ధాంతమును గురించిన

మరికొంత వివరణ తదుపరి తెలిసికొందుము

షడ్దర్శనములు అనగా సాంఖ్య యోగములు, న్యాయ వైశేషికములు, ఉత్తర మీమాంస (వేదాంత శాస్త్రము) కూడ కర్మను జడము, అచేతనము అని, అది ప్రకృతిలోని ఒక అంశము అని ప్రవచించినవి ఈ విధముగా కర్మ సిద్ధాంత పరిణామ దశలకు, పునర్జన్మ సిద్ధాంతమునకు ఏదో ఒక విధముగ వేద సంహితలనాటి ఇష్టాపూర్తము ప్రాథమిక దశగా విశ్వసించుటకు ఆస్కారము కలుగుచున్నది

## 2) జైన మతములోని కర్మ సిద్ధాంతము

జైనులకు చివరి ప్రవక్త వర్ధమానుడు అతనినే జినుడు అన్నారు ఇంద్రియ ప్రకృతిని జయించిన వారందరికి 'జినుడు' అను నామము చెల్లును వర్ధమానుడు బుద్ధుని సమకాలీనుడు వయస్సులో బుద్ధుని కంటే పెద్దవాడు క్రీ॥పూ॥ 6వ శతాబ్దము ద్వితీయ భాగములో (599 BC to 527 BC) జీవించెను అని చరిత్రకారుల అభిప్రాయము జైన ప్రవక్తలను తీర్థంకరులు అందురు జినుడు, మహావీర అను గౌరవ నామములచే ప్రసిద్ధుడాయెను తనకు ముందు వరుసగా ఇరువది ముగ్గురు తీర్థంకరుల ద్వారా ప్రవచించబడినదని గురు పరంపరాగతమైనదని తాను నూతన మతస్థాపకుడను కాను అని వర్ధమానుడు చెప్పినట్లుగా జైనులు విశ్వసింతురు వర్ధమానుని అనుచరులు అందరు చాల వరకు రాజకుటుంబముల నుండి వచ్చిన వారే వర్ధమానుడు గూడ మగధరాజ్య ప్రభువైన ఒక క్షత్రియ కుటుంబములోని వాడే

వర్ధమానుడు పన్నెండు (12) సంవత్సరములు తపస్సు, ఉపవాసము మొదలైన దీక్షలను ఆచరించెను ఇరువది ఎనిమిదవ యేట ఆధ్యాత్మిక జీవిత సంబంధమైన ఈ దీక్షను ప్రారంభించెను ఈ దీక్ష సమయములోనే ఆతడు దిగంబరుడాయెను క్రీ॥పూ॥ 8వ శతాబ్దము ద్వితీయ భాగములోనివాడైన

పార్శ్వనాధుని మతమునే తాను బోధించుచున్నానని మహావీరుడు చెప్పెను అనేక శతాబ్దముల పూర్వము వాడైన ఋషభుడు జైనమత స్థాపకుడని జైన సంప్రదాయము అయినను ఈ తీర్థంకరుల చరిత్రకు సరైన చారిత్రక ఆధారములు లేవు

భిన్న మతముల వారు వర్ధమానుడు ఏర్పరచిన జైనసంఘము నందు చేరిరి అందు ఒక వర్గమువారు వర్ధమానుని వలె సర్వత్యాగముతో బాటు పూర్ణదిగంబరత్వమును అంగీకరించిరి కాని రెండవ వర్గము వారు పార్శ్వనాధుని అనుసరించి వస్త్రధారణ అవసరము అని విశ్వసించారు ఈ విధముగా 'సవస్త్ర' 'వివస్త్ర' విభాగముల వలన క్రీ॥శ॥ ఒకటవ శతాబ్ద రెండవ భాగములో జైనులు దిగంబరులు, శ్వేతాంబరులని రెండు శాఖలుగా విడిపోయిరి

ఈ శాఖలందు భేదము నీతిసూత్రములందే ఎక్కువ గలదు తత్త్వసిద్ధాంతములందు భేదము గోచరించదు ఏ మాత్రము 'నాది' (వస్త్రముతో గూడ) అను భావమున్నచో నిర్వాణము లభింపదనియు, భుక్తి లేకుండ గూడ జీవించగలగవలయుననియు, స్త్రీలకు మోక్షము లేదనియు దిగంబర శాఖ వారి విశ్వాసము అలంకారము లేకుండుట, దిగంబరత్వము, అధోముఖముగా నుండుటయే తీర్థంకరుని లక్షణమని వీరు విశ్వసించారు వీరు ఏ పవిత్ర గ్రంథమును అంగీకరించరు శ్వేతాంబరుల మతగ్రంథములను వీరు తిరస్కరింతురు జైనమత గ్రంథ నిర్ణయము క్రీ॥పూ॥ నాల్గవ శతాబ్దంతమున పాటలీపుత్రమున ఏర్పాటు చేయబడిన సభలో ప్రారంభించబడి, క్రీ॥శ॥ 454లో వలభి నగరమున జరిగిన సభలో నెరవేరినది

జైన బౌద్ధ మతములు రెండును సృష్టికి కారణుడైన సగుణ బ్రహ్మమును అంగీకరించవు యతి శేఖరులనే దైవ సమానులుగా పూజించును ఎటువంటి జీవహింసను అంగీకరించవు ఉభయమతములు వేద ప్రమాణమును వ్యతిరేకించును వర్ధమానుని, బుద్ధుని ఉపదేశములు దాదాపు సమానముగ

నుండుట చేతను, ఇద్దరు సమకాలీనులగుట చేతను జైనమతము, బౌద్ధ మతశాఖయనియు తలంపబడెను వర్ధమానుడు క్రీ॥పూ॥ 527 నందున, బుద్ధుడు క్రీ॥పూ॥ 543 నందున నిర్వాణము పొందినట్లు చెప్పబడినది ఈ తేదీలలోని భేదమునకు కారణము నిర్ణయ విధానములో లోపములే తప్ప వారిరువురు రెండు నామములు గల ఒకే వ్యక్తి అయి ఉండవచ్చును అను అభిప్రాయము కలుగుటకు అవకాశమున్నది వారిరువురు రాజకుమారులే వారి ఇరువురి బంధువులకు, అనుచరులకు దాదాపు ఒకే విధమైన నామములున్నవి ఒకే కాలములో జన్మించి వారిరువురు ఒకే కాలమున దివంగతులైరి ఈ సమకాలీనతను గూర్చి వాదప్రతివాదనలు ఉన్నవి అవి ఇచట చర్చనీయాంశములు కావు భారతీయ సంప్రదాయమున ఈ రెండును భిన్నమతములు జైనము బౌద్ధముతో సంబంధము లేని స్వతంత్ర మతమని నిశ్చయింపబడినది

జ్ఞానము, ఆత్మను గూర్చి జైన బౌద్ధ సిద్ధాంతములు భిన్నములైనవి కర్మ, పునర్జన్మములను గూర్చిన భావములందు రెంటికిని గల సమానత్వము వలన మాత్రమే, రెండు మతములు ఒకటియే అని చెప్పుటకు వీలుపడదు జైనమతమే బౌద్ధమతము కంటే పురాతనమైనదని పెక్కుమంది అభిప్రాయము

ఉపనిషత్తులలో పునర్జన్మ సిద్ధాంతము కొన్ని సందర్భములలో ప్రసక్తికి మించి అధికముగానే చెప్పబడినది దానితో సర్వవస్తువులందు 'ఆత్మ' కలదు అను విశ్వాసము ఏర్పడినది దానినే జైనమతస్థులు మరికొంత సాగదీశారు జడపదార్థములైన అగ్ని, వాయువు, వృక్షములు మొదలైన వాటికి కూడ ఆత్మ ఉన్నదని అభిప్రాయపడ్డారు జైనులు దీని వలన యజ్ఞములచే సుఖముగా కాలము గడపవచ్చునను విశ్వాసమునకు ఆటంకము ఏర్పడినది అన్ని వస్తువులు, పశుపక్ష్యాదులు, క్రిమి కీటకాదులు, ఆకులు, చెట్లు కూడ 'ఆత్మ' లను కలిగియుండి పునర్జన్మ పొందునను భావము వలన ఏ మాత్రము

జీవహింస చేయుటకైనను ప్రజలు భయపడసాగిరి యజ్ఞముల కొరకైనను, వినోదము కొరకైనను జీవహింస చేయరాదు అని వర్ధమానుడు బోధించెను ఏ దేవతనుద్దేశించి బలులు చేయబడుచున్నవో అట్టి దేవతయే లేదు అని చెప్పి తన అహింసావాదమునకు వర్ధమానుడు బలము చేకూర్చెను జీవితములోని దుఃఖమునకు దేవుడు బాధ్యుడు కాడు, తపోదీక్షయే దుఃఖనివారణోపాయము అని జైనుల వాదము వేదప్రమాణమును జైనమతము అంగీకరించలేదు కావున దానిని అవైదికమతము అని పరిగణించారు జైనులు వేదప్రోక్తమైన జగత్తు సత్యత్వమును అంగీకరించిరి కాని ఉపనిషత్తుల వలె దానికొక సమగ్ర రూపమును నిర్వచింపలేకపోయిరి ప్రకృతి అణువులచే నిర్మితమైనదని జైనుల అభిప్రాయము జైనధర్మసూత్రములు ఆధ్యాత్మిక సత్యముపై ఆధారపడియున్నవి ఈ విషయములో హిందూతత్వ విచారముతో పోలిక కనబడును

జ్ఞానమును అయిదు విధములుగా జైనులు విభజించిరి 1) మతి, 2) శ్రుతి, 3) అవధి, 4) మనఃపర్యాయము, 5) కేవలము 1) ఇంద్రియముల ద్వారా తెలియు సామాన్య జ్ఞానము మతి అది ఇంద్రియముల వలన మనస్సు ద్వారా కలుగు జ్ఞానము దీనిలో స్మృతి (జ్ఞాపకము), సంజ్ఞ (గుర్తించుట), తర్కము (పరిశీలన), అనుమానము (deductive reasoning) భాగములు మనస్సును అనింద్రియము అన్నారు మతి అను జ్ఞానమునకు ముందుగా దర్శనముండును (sense perception or observation) 2) ఇక రెండవది శ్రుతి ఇది సాక్ష్యము, సంజ్ఞ (symbol), శబ్దముల (words) నుండి గ్రహించబడును అనగా మతి జ్ఞానము దర్శనము (sense perception or observation) ద్వారా కలుగును శ్రుతిజ్ఞానము వర్ణనము ద్వారా (descriptive) కలుగును 3) 'అవధి' అనగా ప్రత్యక్ష జ్ఞానము ఇది దూరదర్శన, శ్రవణ (వినుట) (దూరశ్రవణ) మొదలగు శక్తుల ద్వారా కలుగు జ్ఞానము దేశకాలములందు దూరముగానున్న వస్తువుల అప్రత్యక్ష దర్శనము ఇది

యోగదృష్టి (జ్ఞానదృష్టి) ద్వారా కలుగును దర్శనము అప్రత్యక్షమైనను దాని వలన కలుగు జ్ఞానము ప్రత్యక్షమే అన్నారు (clairvoyance) 4) మనఃపర్యాయము అన్యుల భావములను మనస్సు ద్వారా గ్రహించుట (Telepathy) 5) 'కేవల' అనగా పరిపూర్ణ జ్ఞానము సర్వవస్తురూపగుణ జ్ఞానము ఇది దేశకాలములకు పరిమితము కానిది ఇదే సర్వజ్ఞత్వము సర్వజ్ఞుడైన వానికి అంతయు విదితమే అగును ఇది ఇంద్రియాతీతమై, వర్ణింపనలవిగానిది, అనుభవముతో మాత్రమే తెలియునది ఇది భవబంధముల నుండి విముక్తులైన పరిశుద్ధులకు మాత్రమే లభించును

జ్ఞానము ప్రత్యక్షము, పరోక్షము అని రెండు విధములు మతి, శ్రుతి పరోక్షములు ఇంద్రియములు, మనస్సు వలన లభించు ఈ రెండును పరోక్షములు మిగిలిన మూడు అవధి, మనఃపర్యాయము, కేవల ప్రత్యక్షములు కాని ఆత్మజ్ఞాన విషయములో జ్ఞానము, జ్ఞేయముల సంబంధము ఆవశ్యకము జ్ఞానము అనగా తెలివి లేక ఒకానొక మానసిక ప్రవృత్తి జ్ఞానము గలవాడు జ్ఞాని లేక వేదాంతి జ్ఞేయము అనగా తెలియదగు విషయము ఆత్మజ్ఞానము నందు మూడు అనగా జ్ఞాని, జ్ఞానము, జ్ఞేయము ఒకే వ్యక్తిత్వము యొక్క రూపములు జ్ఞానము లేని జీవులు లేవు ఎందుకనగా, జ్ఞానములేని జీవి అచేతనము అగును అచేతనములు అనగా జీవములేని ద్రవ్యములు జీవములేని జ్ఞానము పునాదిలేని గృహనిర్మాణమగును

"పరిపూర్ణ స్థితిలో (perfect condition) ఆత్మ శుద్ధజ్ఞాన, దర్శన స్వరూపము (knowledge and intuition) " ఇవి రెండును ఒకే సమయమందు కలుగును అజ్ఞాన జీవులందు దర్శనము ముందు కలిగి తరువాత జ్ఞానము కలుగును జ్ఞానమంతయు ఆత్మయందే యుండును అవరోధములైన కామమోహాదికములు తొలగినచో జ్ఞానము బహిర్గతము అగును

జ్ఞానము రెండు రూపములు అన్నారు జైనులు అవి ప్రమాణము,

నయము ప్రమాణము అనగా వస్తు స్వరూప జ్ఞానము నయము అనగా వస్తుసంబంధ జ్ఞానము నయసిద్ధాంతము జైనమత ప్రత్యేకత ఒక వస్తువును గూర్చి, మనము తెలుపు "అభిప్రాయ దృక్పథము"ను నయము అన్నారు దృక్పథములను మనము నిర్వచించి భావనాశక్తిచే వేరుపరచుదుము మన కోరికలననుసరించి మన భావములు ఆయా దృక్పథములకు చెందును (conception) మన జ్ఞానదశల ననుసరించి ఒకే సత్యము భిన్నరూపములలో గోచరించును ఒక అవస్థలో సత్యముగా కనబడినది మరియొక అవస్థలో అట్లు కనబడకపోవచ్చును మన దృక్పథములననుసరించి సత్యస్వరూపము ఉండును అని జైనసిద్ధాంత ప్రధానాంశము సత్యము యొక్క సామాన్య స్వరూపము భిన్నముగాను, పాక్షికముగా మాత్రమే లభించును

ఒక ఏనుగును ఆరుగురు గ్రుడ్డివారు వర్ణించిన విధమును జైనులు ఈ సందర్భముగా ఉదహరింతురు ప్రతి ఒక్క గ్రుడ్డివాడు ఏనుగును తాకి తాను తాకిన భాగమే దాని పూర్ణస్వరూపమని వర్ణించెను వాస్తవమునకు వారు ఊహించినది ఏనుగునందు అంశ మాత్రమే దృక్పథములందలి భేదముల చేతనే, ఆ భేదములను గ్రహింపలేకపోవుట చేతనే తాత్వికములందు స్పర్థలు కలుగుచున్నవి

కారణము కార్యమునకు పూర్వమే యుండును అనియు కార్యము మార్పు చెందినపుడు కారణము కూడ మార్పు చెందును అన్నారు కార్యము కారణమునకు ఇతరమైన రూపమున ఉండునను వాదన కూడ ఏర్పడినది కాని జైన సిద్ధాంతము ఈ రెంటిని సమన్వయించినది ఉదాహరణకు ఒక స్వర్ణహారము కార్యము బంగారము దానికి కారణము రెండును ఒకటే అని తలచినచో భేదము లేదు కారణమైన బంగారము కంటే హారము నందు భిన్నరూపము అనబడు కార్యసృష్టి జరిగినది అనుకొనినచో రెంటికిని భేదము కలుగును రెండు దృక్పథముల నుండి ఏర్పడిన ఈ రెండు భావములు

పాక్షికములు, అసంపూర్ణములు

ప్రతి వస్తువు నందు స్వభావ వైవిధ్యము ఉండునని అదే భిన్నత్వములో ఏకత్వము మాత్రమే అని జైన సిద్ధాంతము సత్స్వరూపము భిన్నత్వము కలిగియుండును, కాని దానిని తనలోనే సమన్వయించును అన్నారు వస్తుగుణములు విజ్ఞానమందు పరస్పర భిన్నములుగా గోచరించును కాని జీవితమునందు అనుభవము ద్వారా అవి కలిసియే యున్నవని తెలియును ఒక చెట్టు కొమ్మలు కదిలినపుడు చెట్టు కూడ కదులుచున్నది అని చెప్పవచ్చును కాని చెట్టు స్థావరము అందుచే అది కదులుట లేదు ఒక వస్తు స్వతఃస్థితిని, దానికి ఇతర వస్తువుల సంబంధము వలన కలుగు స్థితిని స్పష్టముగా వేరుగా తెలుసుకొనవలెనని జైనమతము చెప్పును

జైనుల కర్మతత్త్వశాస్త్రమును తెలుసుకొనుటకు పూర్వము మనస్తత్వమును గూర్చి వారి భావములు తెలుసుకొనుట యవసరము

మనస్సు, శరీరముల ద్వైతమును జైనులు అంగీకరించారు అనగా మనస్సు, శరీరములు భిన్నమైన రెండు భాగములు అని ఆమోదించారు పంచేంద్రియములను రెండు వర్గములుగా వారు విభజించారు అవి 1) ద్రవ్యేంద్రియములు 2) భావేంద్రియములు నేత్రములను అవి చూచు వస్తురూపముతో సంధానము చేయునది రంగు రంగు వస్తుగుణములలో నొకటి దానిని గ్రహించు విధమునకు అనుగుణముగా నేత్ర నిర్మాణము ఏర్పడినది ఈ విధముగా ఇంద్రియములు జీవునికి ఉపకరణములుగా చేయబడినవి

ద్రవ్యేంద్రియములు అనగా భౌతిక జ్ఞానేంద్రియములు, భావేంద్రియములకు ప్రతిరూపములు (counter parts) అనగా ఇవి ఇంద్రియముల రెండు ప్రతిరూపములు అదే విధముగా మనస్సుకు రెండు రూపములు కలవు అవి ఒకదానికొకటి ప్రతిరూపములు మాత్రమే అవి

భౌతిక, మానసికరూపములు (physical and psychical) ఆత్మ శరీరమంతా వ్యాపించియున్నది అనగా ఆత్మ, శరీరములు ఒకే అస్తిత్వము (రూపము) యొక్క రెండు ప్రతిరూపములు అన్నారు జైనులు భౌతిక భాగమనగా ద్రవ్యభాగము రెండు ప్రతిరూపములు అనగా రెండు లక్షణములు గల ఒకే అస్తిత్వం అని జైన సిద్ధాంతము కాని ఇది ఆత్మ, శరీరములకు గల సంబంధమును గూర్చిన సమస్యకు పరిష్కారము కాజాలదు

ఇంద్రియముల ద్వారా ఆత్మవస్తురూపము నెరిగి అనుభవించుచున్నది అన్నారు బాహ్యముననున్న వస్తు గుణములు అనుభవించదగినవి వాటిని అనుభవించుటకు ఇంద్రియములు ఆత్మ యొక్క ఉపకరణ శక్తులు జైనులకు విశేషమైన మనస్తత్వజ్ఞానము గలదని తెలియుచున్నది ఇంద్రియమునకు వస్తువునకు గలుగు సంపర్కముచే ఇంద్రియములకు గ్రహించు జ్ఞానము (sense perception) కలుగుచున్నది అన్నారు కాని మానసిక దర్శనము ఇంత మాత్రముచే కలుగదు ఆత్మజ్ఞానమునకు అడ్డుగా నుండు తెరను తొలగించుటకు మాత్రమే ఉపయోగపడును అని భావించారు

కర్త, భోక్త, జ్ఞానియు నొకడే అనగా చేయువాడు, ఫలితము అనుభవించువాడు మరియు జ్ఞానము పొందువాడును ఒకడే సంకల్పమునకు భావనకు దగ్గర సంబంధమున్నది సాధారణముగా మొదట భావన, తరువాత సంకల్పము, అటుపై జ్ఞానము కలుగును ద్రష్ట అనగా ప్రత్యక్షముగా గాని, లేక మానసికముగా గాని చూచువాడు అనగా గ్రహించువాడు అందువలన ద్రష్టకు, దృశ్యమునకు నిత్యము సంబంధముండును అట్టి సంబంధమే జీవునికి పుద్గలము (పదార్థము)నకు ఉండును అన్నారు జైనులు ద్రష్టకు, దృశ్యమునకు, జీవునికి పుద్గలమునకు (పదార్థమునకు) గల సంబంధమును ఏర్పరచునది జ్ఞానము కాదు అన్నారు ఎందుకనగా, ఒక విషయమును మనము తెలిసికొనవచ్చును, కాని దానిని అనుసరించి మనము నడువక

పోవచ్చును గదా! సృష్టియంతయు జ్ఞానమున ప్రతిబింబించును అట్టి జ్ఞానము ద్వారా సిద్ధాత్ముని ప్రజ్ఞారూపమై సృష్టి యున్నది అని భావించారు కాని వానియందు ఆతనికి ఆత్మబంధము లేకపోవచ్చును జీవుని కోరికల ననుసరించి లోకానుబంధముండును వాంఛకు దాసుడై జీవుడు బంధమున బడియుండవలసిన అవసరము లేదు ఎందువలననగా వాంఛలను తొలగించుకొనవచ్చును గదా!

ప్రతి జీవియు దేహ, ఆత్మ సంయుక్త రూపము ఆత్మ కర్తృత్వము గల భాగస్వామి దేహము నిష్క్రియాత్మకమైనది మనస్సే సత్యము అను సిద్ధాంతము నందు దేహమే సత్యము అను సిద్ధాంతము నందు గల లోపములను జైనులు గుర్తించుట వలన మనస్సుకు దేహమునకు (పదార్థము) సంబంధ సహకారములున్నవి అన్నారు కాని ఆత్మ, అనాత్మ (ఆత్మ కానిది అనగా దేహము) భేదము కేవలము మనస్సుచే కల్పించబడినది అని జైనమతము గుర్తించలేదు అని ప్రఖ్యాత అద్వైతవేత్త (భావవాది) సర్వేపల్లి రాధాకృష్ణ భావించారు ఆత్మ, అనాత్మ అనునవి శాశ్వతమైన రెండు వస్తువులు అని జైనమతము ఆ రెంటికి మధ్య జరుగు కార్యకలాపము మాత్రమే ఆ రెంటి కంటే భిన్నమైనదైన జ్ఞానము అన్నారు కాని దేహము పరిణామము ద్వారా ఉన్నత దశారూపములలో నూతన గుణములను ప్రదర్శించును అని జైనతత్త్వం గుర్తించలేదు అని రాధాకృష్ణ అన్నారు

మనస్సు, శరీరము వేరు అను ద్వైత సిద్ధాంతమును నమ్మిన మానసిక జ్ఞానము అను స్థాయిలోనే జైన సిద్ధాంతము ఆగిపోయినది రెంటికి గల పరస్పర సంబంధ బాంధవ్యము జైన సిద్ధాంతము గుర్తించలేదు "కర్మ పదార్థము దానియొక్క సహజ స్వభావముననుసరించి, కావలసిన మార్పులను తానే చేసికొనును జీవుడును అట్లే, కర్మ నియతి ననుసరించి, వచ్చు అపరిశుద్ధజ్ఞానదశల నుండి, తన జ్ఞానమందలి మార్పులను తానే కల్పించు కొనుచుండును "

ఇవి రెండును అనగా కర్మ, జీవుడు సర్వస్వతంత్రములైన రెండు శక్తులు అన్నారు అట్టి స్థితిలో జీవుడు ఎందుకు కర్మఫలమును అనుభవింపవలెను, అను ప్రశ్నకు సమాధానముగా "పూర్వ స్థాపితమైన సామరస్యము" వలననే అది జరుగుచున్నది అన్నారు (Indian Philosophy Vol I P 310)

భౌతిక పదార్థములు, చిన్నవి, పెద్దవి అనేకములు కలవు ఇందు కొన్ని కర్మ పదార్థములు అవి జీవులను ఆకర్షించును సాహచర్యముచే జీవి, కర్మ పదార్థ అణువులు కలియును ఒకే ప్రదేశమందు ఏర్పడు ఈ సాహచర్యమే కర్మ పదార్థము జీవునందు ప్రవేశించుటకు కారణము మనస్సునకు ఇందు ఏ మాత్రం ప్రమేయము లేదు అన్నారు కాటుక పొడిచే అది ఉంచబడిన పాత్ర నలుపుగా మారుట ఇందుకు ఉదాహరణముగా చెప్పబడింది స్వతంత్రములైన జీవి, కర్మ అను రెండు శక్తులు ఎటులో సమన్వయము పొందినవి రెంటికి ప్రత్యక్షమైన కారణ సంబంధం ఏమియును లేదని చెప్పబడింది అందువలన ఈ సంబంధం నిగూఢమైన (mystery) దని చెప్పవలసియున్నది

దీనిని బట్టి జ్ఞానము గూడ నిగూఢమే అగును మనస్సు నందొకటి, దానికెదుట నున్న స్వతంత్రమైన జగత్తునకు పరస్పర సంబంధము లేదని ఊహించబడినది అనగా మనము మన ఎదుటి వస్తువులను చూడకుండ, వాటి ప్రతిమలను, ప్రతిబింబములను మాత్రమే చూచి వాస్తవ ప్రపంచము తెలుసునని తలంచుట అగుచున్నది ఈ సందర్భములో సర్వేపల్లి రాధాకృష్ణ ఇలా అన్నారు (Indian Philosophy P 310) "మనస్సునకు, జగత్తునకు ఒక సమాన ధర్మముండిన గాని మనస్సునకు జగత్తునకు సామ్యమున్నదని చెప్పుటకు వీలుపడదు అందువలన మనస్సు తన సౌధమున కూర్చుండి బయటనున్న ప్రపంచమును చూచుచున్నది అను సిద్ధాంతము అర్థహీనమగును"

ఆత్మకు కొలతలున్నవని, అది పెరుగుటకు, తరుగుటకు

అవకాశమున్నదని అన్నారు ఆత్మగర్భమున ప్రవేశించునపుడు చిన్నదై, శరీరముతో పాటు క్రమాభివృద్ధి చెంది తుదకు ఉన్నత రూపము పొందును ప్రతి జీవితాంతమున అది మరల సూక్ష్మమై యింకొక జన్మమును పొందుచుండును కాని శరీరమందు ఆత్మ వ్యాపించియున్న విధము భిన్నమైనది అది మరొక ప్రకృతి వస్తువు వ్యాపించు విధము కాదు ఎందుకనగా ఆత్మభాగములు లేనిది ఆత్మ తన శరీరములో నుండి స్థూల శరీరమునకు కూడ చైతన్యము కలిగించుచున్నది

ఒక దీపము చిన్న పాత్రలో ఉంచినను, లేక పెద్ద గదిలో ఉంచినను అచట గల ప్రదేశమంతయు సమానముగనే కాంతిని ప్రసరించును ఈ ఉపమానము ఆధారముగా జైనులు జీవి తాను ప్రవేశించు శరీరముల ననుసరించి పెరుగుటయో, తరుగుటయో జరుగును అన్నారు

అద్వైత ప్రవక్త ఆదిశంకరులు ఈ అభిప్రాయముతో ఏకీభవించలేదు (శంకర సూత్ర భాష్యము, 2వ అధ్యాయం, 33-36) (II 2-33-36) దేహముతో సమానవ్యాప్తి గల ఆత్మలుండుట సాధ్యపడదు అని శంకరసూత్రభాష్యము దేహముచే ఆత్మ పరిమితమైనచో దేహమువలెనే అది అనిత్యమగును అనిత్య వస్తువగుటచే మోక్షము లేనిదియునగును అంతేగాక ఆత్మ ఒక కొలత గల శరీరమును విడిచిపోవునపుడు, మరల నింకొక భిన్నదేహములలో ప్రవేశించి నపుడు అనగా పునర్జన్మ యందు ఆత్మ కష్టము నెదుర్కొనవలసియుండును

జైనసిద్ధాంతము ప్రకారము ఆత్మ అవసరము ననుసరించి చిన్నదిగాను, పెద్దదిగాను మారును అని స్థూలముగా చెప్పవచ్చును కాని కర్మ పదార్థ అణుసమూహములో ఆత్మయందు ఏవి ప్రవేశించునో, ఏవి బయటకు పోవునో చెప్పుటకు వీలుపడదు మరి ఏ విధముగా పెరుగుట, తరుగుట జరుగునో స్పష్టముగా జైనులు చెప్పలేదు

నైతిక ప్రవర్తనము, కర్మ స్వాతంత్ర్యము జైన సిద్ధాంత ప్రధానాంశములు

భగవంతుడు జగమును సృష్టించెను అని గాని, లేక జగత్తు ప్రకృతి నుండి జనించినది అని గాని, లేక జగత్తు మిధ్య అని గాని జైనతత్త్వము అంగీకరించదు ఎందుకనగా ఆ వాదములు దుఃఖ కారణమును గాని, దుఃఖనివారణోపాయమును గాని చూపలేవు అని జైనవాదము

శాశ్వత స్వభావము గల సత్పదార్థమున్నదని జైనులు అంగీకరింపరు ప్రతి వస్తువునకు జననము, స్థితి, లయములు కలవు వస్తువు నిర్వచనము మన దృక్పథము ననుసరించి యుండును అన్నారు ఏదైతే జగత్తు రూపములో నున్నదో అదే ఆద్యంతములు లేకుండ ఎల్లపుడు ఉండును అని జైనవాదము దానికి గుణములు, మార్పులు ఉండను అన్నారు జన్మ, స్థితి, లయములు గలది ఏదియైనను ద్యవ్యమే అగును అన్నారు దానికి కొన్ని క్రియాశక్తులు ఉండునని భావించారు పదార్థములలో నున్న మూలద్రవ్యము స్థిరమైనది అనియు ప్రతి ద్రవ్యము నందు మార్పులకు లోనగు గుణములుండుననియు జైనులు చెప్పారు భౌతిక రూపములు జడముల వలె యథాస్థితిలో ఉండగా, ప్రత్యేక ద్రవ్యములు మారుచుండును అన్నారు జీవి మార్పులేనిది కాదు మనకు అనుభవములో నున్నదే జీవి అని జైన దృక్పథము దానికి మించిన జీవలక్షణములను వారు పట్టించుకొనలేదు ఈ ప్రపంచములో వస్తువులు (ద్రవ్యములు) క్రొత్త గుణములను పొందుతూ, పాతవాటిలో కొన్ని వదలుచు నిరంతరం మార్పు చెందుచుండును అని జైనతత్త్వము భిన్నత్వములో ఏకత్వము జైనుల వాస్తవ జగత్తు దానికి మించినది మరేమియును లేదని జైనుల తత్త్వసిద్ధాంతము దీనినే భేదాభేదవాదము అనవచ్చును తన భిన్న గుణములందు విచ్ఛిన్నము కానిదై (వేరు కాని) ఉండునదే జైనుల దృష్టిలో వస్తుస్వరూపము వస్తువు, గుణము విడదీయరానివి అనేక గుణముల కలదే వస్తువు అగునని వారి నిర్వచనం అదియే నిత్యము పరిణామశీలము గలది అన్నాడు 'అనంత ధర్మాత్మకం వస్తు' అని జైనదర్శనము "సర్వవస్తు సారరూపమగు ద్రవ్యము ఒకటే", అది అనేక రూపములను ప్రదర్శించును

జననము స్థితి, లయములు దాని లక్షణములు ద్వంద్వ వైరుద్ధ్యములచే దానిని వర్ణింపవచ్చును అని రాధాకృష్ణ అభిప్రాయం (Indian Philosophy P 313)

ద్రవ్యము (పదార్థము) అణువులలో నుండు విధముగానే గుణములు వస్తువులకు చెందియుండునే కాని యే ఆధారము లేకుండ ఉండజాలవు ద్రవ్యములకు సామాన్యగుణములు మరియు ప్రత్యేక గుణములు కూడ నుండును కాని ఏదో ఒక గుణము ఆధారముగ దానినే వస్తువు అనుటకు వీలులేదు అయినను వస్తువు లేనిది గుణము కాని, గుణము లేనిది వస్తువు గాని ఉండవు వస్తువునకు గుణమునకు సంబంధము లేదు అని న్యాయ (గౌతమ న్యాయ సిద్ధాంతము అనగా బౌద్ధము కాదు న్యాయసిద్ధాంతము షడ్దర్శనములలో నొకటి) సిద్ధాంతము దానిని జైనులు తిరస్కరించారు ఒక వస్తువు తన గుణములందే యుండును గుణములే వస్తువునకు రూపమునిచ్చును ఇది సంబంధమే కాని స్థితికాదు అన్నారు "వస్తువు తన గుణముల నుండి వేరైనదైనచో, అప్పుడు ఒక వస్తువే అనంత వస్తువులుగా మారవచ్చును లేక, గుణములు తమ వస్తువునకు పూర్తిగా వేరైనవైనచో, ఇక ఒక వస్తువుండుటకు అవసరము ఉండదు" (Indian Philosophy Part I P 313) అని రాధాకృష్ణ వ్యాఖ్యానించారు

నిర్గుణ బ్రహ్మావాదమును జైనులు తిరస్కరించారు వస్తు, గుణ సంబంధము ఏకకాలమునందుండు సమానత్వము, ఏకత్వము ఇది విభజించుటకు వీలుకానిది సహజముగా ఏకరూపము గలది వస్తువు, గుణము యొక్క ఐక్య భావము, ఏకత్వము వలన గాని, సంయోగము వలనగాని ఏర్పడినది కాదు అన్నారు

ద్రవ్యము (పదార్థము) గుణముతో కూడినది అది ఒక రూపమును లేక ఒక స్థితిగాని కలిగి యుండవలెను దీనినే మార్పునకు లోనైన పర్యాయము

అన్నారు (modification) గుణములు మారవు సాగగొట్టబడు గుణము, పసిమి రంగు బంగారము యొక్క గుణములు ఇవి మారవు పర్యాయము (modification) అనగా రూపము మారును పర్యాయములను రెండుగా విభజించారు 1) ఒక వస్తువు యొక్క ముఖ్యగుణముల పర్యాయములు (రూపములు) రంగు నిత్యగుణము అయినను నీటి రంగు మారవచ్చును 2) తాత్కాలిక గుణ పర్యాయములు నీటి కాలుష్యము అనగా బురద వంటిది మారవచ్చును

'జీవము', 'అజీవము' అను సర్వ స్వతంత్రములైన రెంటి నుండి - విశ్వమంతయు ఏర్పడినది అని జైన సిద్ధాంతము జీవము అనుభవించునది (భోక్త), అజీవము (జడము) అనుభవించబడునది (భుక్తి) జీవము చైతన్యము కలిగియుండును అజీవము లేక జడము అచేతనము జడమును మనము చూచుట ద్వారా, స్పర్శ, వాసన ద్వారా గుర్తించవచ్చును కాని జడమునకు ఈ మూడు విధములైన చైతన్యములు (చూపు, స్పర్శ, వాసన) లేవు అందువలన జడము ఒక చూడబడు వస్తువు లేక దృశ్యము మాత్రమే ఏదైతే వివిధ పదార్థములను చూడగలుగునో, తెలియగలుగునో, సుఖవాంఛ వలన దుఃఖమునకు భయపడునో, పరోపకారము మొదలగు సత్కార్య ఫలముల ననుభవించగలుగునో అట్టిది మాత్రమే 'జీవము' అన్నారు జైనులు 'జీవము' 'అజీవము' - అనునవి 'నేను', 'నేను-కాను'లకు సంబంధించనవిగాని సరిపడునవి గాని కావు వస్తు ఆశ్రయముగా అనగా ద్రవ్యము, లేక పదార్థము లేక దృశ్యము (object) ననుసరించి చేయబడిన వర్గీకరణమే ఈ 'జీవ' 'అజీవ' భేదను 'జీవులు' చేతనములైన ఆత్మలు, శరీరములు కలిగియుండును ఆత్మలు పదార్థములకు భిన్నమైనవి అందువలన అవి శాశ్వతమైనవి (eternal) అజీవములలో తిరిగి రెండు రకములు 1) రూపము లేనివి అవి ధర్మము, అధర్మము, ఆకాశము, కాలము మొదలగునవి 2) పదార్థము లేక పుద్గలములు రూపము కలవి

అజీవ ద్రవ్యములు ఆకాశము, ధర్మాధర్మములు, కాలము రూపము లేనివి ఆకాశము రెండు విధములు అన్నారు వస్తువులతో కూడిన ఈ లోకమంతయు 'లోకాకాశము' అన్నారు పైన శూన్యముగా కనబడు ఆకాశమునకు 'అలోకాకాశము' అని పేరు పెట్టారు "విభజించుటకు వీలుపడని పుద్గలము యొక్క అణువుచే అడ్డగింపబడినదై, అన్ని పదార్థముల అంశములకు స్థలమును ఇచ్చునదే ప్రదేశము'' అని నిర్వచించారు జైనులు ఆ ప్రదేశము నందు ధర్మము యొక్క అంశము, అధర్మము యొక్క అంశము, కాలము యొక్క అంశము మరియు ఎన్నో పదార్థముల అణువులు సూక్ష్మరూపమున నుండవచ్చును అన్నారు ప్రదేశము అనునది చలనమునకు గాని, నిశ్చలత్వమునకు గాని స్థితిరూపము కాదు ధర్మము అనునది చలన నియమము

ధర్మమునకు రుచి, రంగు, వాసన, శబ్దము, స్పర్శ ఉండవు ధర్మము లోకమంతయు వ్యాపించియున్నది విడదీయరాని సంబంధము కలిగి అది అవిచ్ఛిన్నమై (continuous) యున్నది అది ఆకాశమంతయు వ్యాపించియున్నది దానికి వ్యాప్తి యున్నది వాస్తవమునకు ఏకప్రదేశము నందున్నను, వ్యవహారికముగా అది పెక్కు ప్రదేశములను ఆక్రమించి యుండును అది అమూర్తము అనగా శరీరము లేనిది, అవిచ్ఛిన్నము (continuous) అయినది అది రూపము లేని స్వభావము కలదైనను అనంతరూపములు కలది, దృశ్యమునందు, అదృశ్యమునందు ఉండు శక్తి కలది అందుచే అది నిత్యమైయున్నది చలనముచే అది చలించదు కాని చలించు స్వభావము గల జీవములకు, పదార్థములకు చలించుటకు దోహదము చేయును ఉదాహరణగా జైనులు నీటిని చెప్పారు నీరు తాను కదలదు కాని తనయందు చేపలు కదలుటకు దోహదము చేయుచున్నది ద్రవ్యమునకు ఉండు ప్రత్యేక గుణములేవియును ధర్మమునకు లేవు అయినను అది స్వయంసమర్థమైన యునికి కలిగియున్నది అది చలనమునకు కారణము

కాదు అయినను అది చలనమునకు అవకాశము కల్పించుచున్నది అనగా చలనమునకు అది మాధ్యమము (medium)

అధర్మము నిశ్చలత్వమునకు బీజము (మూలము) దానికి ఇంద్రియ గుణములుండవు రూపముండదు అది లోకాకాశమంతయు నిండియున్నది ధర్మము, అధర్మము రెండును క్రియారహితములు, రూపము లేనివి, అణు రహితములు, విడదీయరానివి, చంచలత్వమునకు, నిశ్చలత్వమునకు అవి ఉదాసీనహేతువులు (indifferent) వాస్తవ హేతువులు వేరుగానున్నవి లేనిచో వస్తువులు నిత్యము చలించునవో, ఎన్నడు చలనము లేనివో యగును ధర్మాధర్మములు చంచలత్వము, నిశ్చలత్వము ననుసరించి యుండవు కాని చలించునట్టి, చలనములేనట్టి అన్ని వస్తువులకు ఆధారభూతమైన శక్తులు ధర్మాధర్మములు చెల్లాచెదరుగా నున్న వస్తుసమూహమునకు ఒక క్రమస్థానమును కలుగజేయునవి ధర్మాధర్మములు

జైనతత్వమున ధర్మ, అధర్మములు అనగా పుణ్యపాపములు కావు ఇది ప్రధాన విషయము అవి వస్తువులకు చలనము, విశ్రాంతి కలుగజేయు శక్తులు ఆకాశము ధర్మాధర్మములతో కూడి యున్నది అది జీవులకు, ద్రవ్యములకు (పదార్థములకు) స్థితి కలిగియుండుటకు దోహదము చేయు చుండును జీవులు, ద్రవ్యములు ఉండుటకు ఆకాశము స్థానమిచ్చినది ధర్మముచే నవి చలించును అధర్మముచే నవి నిశ్చలమగును

కాలమును గూడ ఏదో ఒక విధమైన ద్రవ్యముగా అప్పుడపుడు జైనులు చెప్పారు కాలమనునది ఒక సూత్రము ప్రపంచమంతయు ఈ కాలసూత్రముతో నిండియున్నది ఈ కాలసూత్రమందు ఈ విశ్వము యొక్క గతి పరంపరలన్నియు ఇమిడియున్నవి అపుడపుడు ఏర్పడు మార్పుల యొక్క సమగ్ర రూపమే కాలము అనుకొనుట పొరపాటు అన్నారు కాలము ఒక అనంతమైన గమనము భూతము నుండి భవిష్యత్తులోనికి ప్రవహించు

అవిచ్ఛిన్న స్వరూపము కాలమునకు అస్తిత్వము ఉన్నది, కాని పరిమాణము లేదు దానికి వ్యాప్తి లేదు ఎందుకనగా అది ఏకముఖముగా మాత్రమే ఉండును (unilateral) కాలము రెండు విధములని అన్నారు ఆది, అంత్య రూపములు లేనిది శాశ్వతకాలము ఆది, అంతములు, గంటలు, నిమిషములుగా భిన్నత్వము గల కాలమును తాత్కాలిక కాలము అన్నారు శాశ్వతకాలమును కాలమనియు, తాత్కాలిక కాలమును సమయము అన్నారు సమయమునకు కాలము ముఖ్యకారణము పరిణామము వలన మార్పులలో ఉనికి గ్రహింపబడెను మార్పుల వలన గాని వస్తువులలోని చలనము వలన గాని తాత్కాలిక కాలము (relative time) తెలియును అన్నారు కాలము చక్రమనియు, కొంతకాలమునకు అన్ని రూపములు నశించును గాన కాలము నాశనరూపమని గూడ చెప్పారు

ఇక అసలు పదార్థము లేక పుద్గలము అనగా జైనులు ఏమి నిర్వచించారో తెలిసికొనవలసియున్నది ఇంద్రియములకు కనబడు శరీరములు, మనస్సు, కర్మలు మొదలగునవి మూర్తి అనగా రూపము గలవి అన్నియు పుద్గలములు "శబ్దము, సంయోగము, సూక్ష్మత్వము, స్థూలత్వము, ఆకారము, విభాగము, అంధకారము, ప్రతిమ, కాంతి, ఉష్ణములతో కూడిన గుణము లన్నియు పుద్గలమునకు చెందినవి" (Indian Philosophy P 317) పరిమాణము నిర్ణయించుటకు సాధ్యము కాని గుణము, నిత్యము అయిన వస్తువు పదార్థము (పుద్గలము) పదార్థము పెరుగును, తరుగును కాని అణువుల సంఖ్య మాత్రము పెరగదు, తరగదు పదార్థము ఏ రూపమునైనను పొందును, ఏ గుణములనైనను పొందగలదు చలన స్వభావము గల శక్తి యొక్క వాహనమే పుద్గలము (పదార్థము) అన్నారు పుద్గలమునకు ఈ చలనశక్తి యుండును ఈ చలనము రెండు విధములు 1) పరిస్పందన (vibration or simple motion) 2) పరిణామము (evolution) ప్రపంచమునకు పుద్గలము భౌతిక మూలాధారము పదార్థము ఆరు విధములు అన్నారు ఇవి 'స్పష్టత',

'స్వచ్ఛత' ననుసరించి యుండును స్పర్శ, రుచి, వాసన, రంగు, శబ్దము అనునవి పుద్గలము యొక్క లక్షణములు ఆత్మలు, ఆకాశము తప్ప మిగిలినవి అన్నియు పదార్థము నుండి పుట్టినవే అని జైనవాదన మనకు కనబడు వస్తువులు స్థూల పదార్థములు ఇంద్రియములకు కనబడని సూక్ష్మపదార్థము కూడ ఉన్నది ఈ సూక్ష్మపదార్థమే భిన్న పరిమాణములకు (degrees) చెందిన కర్మ రూపముగా మారును అని జైన ద్రవ్య సిద్ధాంతము

ప్రపంచమంతయు అణువులతో ఏర్పడినది ఇది జైన ద్రవ్య సిద్ధాంతములో ప్రధానాంశము మనకు కనబడుచున్న వస్తువులు పరమాణువులచే ఏర్పడినవి సంపూర్ణము, సమానము అగు లక్షణములు గల్గిన పుద్గలము విడిపోయి (breaks up) గుణభేదములు గల అణువులుగా మారును అణువునకు ఆది, మధ్య, అంత్యములు లేవు అణువు సూక్ష్మమైనది, నిత్యమైనది అది సర్వాతీతమైన చివరిది (ultimate) అది దేని నుండి పుట్టినది కాదు దానికి నాశనము లేదు దానికి మూర్తము అనగా శరీరము లేదు కాని అన్ని శరీరములకు ఆధారము సర్వజ్ఞుడైన (omniscient) కేవలుడు ఒక్కడు మాత్రమే తన దివ్యదృష్టితో చూడగల రూపము అణువునకున్నదని యొకప్పుడు చెప్పబడినది అణువులకు బరువుండును తేలికైన పదార్థములు పైకి, బరువైన పదార్థములు క్రిందకును కదులును ప్రతి అణువు ప్రదేశములో (space) ఒక బిందువు లేక స్థలమును (point of space) ఆక్రమించును సూక్ష్మస్థితి యందు (subtle state) స్థూలముగా (gross) ఒక అణువు స్థానమునందును అసంఖ్యాకములైన అణువులాక్రమించును ప్రతి అణువునకు ఒక విధమైన రుచి, రంగు, వాసన, స్పర్శ యుండును ఈ గుణములు స్థిరమైనవి, శాశ్వతమైనవి కావు పరస్పర ఆకర్షణ గల అణువుల సంయోగముచే ద్రవ్యము (పదార్థము) ఏర్పడును సంయుక్తాణువులను స్కంధములు అన్నారు స్కంధములు ఇతర స్కంధములతో కలియుచుండును పుద్గలము అణువులందును, స్కంధములందును ఉండును ఆకాశము, ధర్మము,

అధర్మము అణువుల చలనము వలన ఏర్పడును స్కంధములు రెండు అంతకు మించిన సంఖ్యలో సంయోగము చెందుచుండును ఈ విశ్వమే ఒక మహాస్కంధము అన్నారు ఈ ప్రపంచమందలి అన్ని పరివర్తనములకు అణు సంయోగ వియోగములే కారణము వ్యతిరేక స్వభావము గల అణువులే సంయోగము చెందుచుండును వివిధ భూతములకు (elements) అనువైన లక్షణములను కలిగించి, వాటితో అణువులు భూత (elements) రూపములను ఏర్పరచుచున్నవి ఈ విశ్వములో ఎన్ని విధములైన భూతములున్నవో (elements) అన్ని విధములైన అణువులున్నవని న్యాయ, వైశేషిక దర్శన సిద్ధాంతము మూలములైన అణువులలో గుణభేదములున్నవని జైనులు అంగీకరించరు ఒకే లక్షణములు గల అణువులు భిన్నరూపములలో సంయోగము చెందుట వలన భిన్నములైన భూతములు (elements) ఏర్పడుచున్నవని జైనద్రవ్య సిద్ధాంతము

జైనతత్త్వ సిద్ధాంతములో కర్మద్రవ్యరూపము కలది దీని ప్రకారము భావములు, ఊహలు మన శీలమును ప్రభావితము చేయును అది మన ఆత్మకు సంస్కారములు కల్పించును మార్పు కూడ కలిగించునని చెప్పబడినది కర్మ ఒక శక్తి అది ద్రవ్యాత్మకం పదార్థము సూక్ష్మరూపము కర్మరూపము ఏర్పడుటకు తగిన సూక్ష్మపదార్థము జగత్తులో అంతట నిండియున్నది పుణ్యపాపఫలములు కలిగించు ప్రత్యేకమైన శక్తి యీ సూక్ష్మ పదార్థమునకు గలదు బయటనున్న ప్రపంచముతో కలుగు సంబంధము వలన ఆత్మ యందు యీ సూక్ష్మపదార్థము ప్రవేశించును ఇందువలననే కర్మ శరీరం ఏర్పడును ఆత్మ మోక్షము పొందు వరకు యీ కర్మ శరీరము దానిని వదలదు ఈ కర్మ పదార్థమే ఆత్మతేజస్సుకు అడ్డముగా నుండును జీవులు భావకర్మయును, దేహములు ద్రవ్యకర్మను అనుసరించును అని జైనమతము వాస్తవమునకు యీ రెండును ఒకటియే కాని ఒకటి చేతనము (conscious), రెండవది అచేతనము (nonconscious) దీని మూలముననే ఆ భేదము కలిగినది

మనము చేయు ప్రతికర్మ తన సంస్కారమును జీవునిపై ముద్రించును ఆ ముద్ర భవిష్యత్తులో జరుగు కర్మలకు పునాదియగును ప్రతి కర్మయు మానసిక సంస్కారమునకు కారణమగును కర్మలన్నియు తమకు అనుగుణములైన ఫలితములనిచ్చును తగిన ప్రయత్నముతో కర్మ ఫలితములను అనుభవములోనికి రాకుండ చేయవచ్చునని జైనవాదన అయినను కర్మ "నివురు గప్పిన నిప్పు" వలె నాశనము కాకయుండును అన్నారు

ఈ విధముగా జైనకర్మ సిద్ధాంతము ఒక ప్రత్యేకత కలిగి యుండినను, సంప్రదాయకర్మ సిద్ధాంతముతో పోలికలు కలిగి యుండినట్లు కనబడును కర్మ అణు స్వభావముతో పదార్థరూపము కలిగి యుండునని అన్నారు కర్మ 'అధోగురుత్వము'ను (downward gravity), ఆత్మ 'ఊర్ధ్వగురుత్వమును' కలిగి యుండునని జైనవాదన కర్మ ద్రవ్యములోని అణువులు అనంతములు మనస్సు, దేహము, వాక్కు ద్వారా కర్మ పనిచేయును పరిస్పందన (vibration) వలన మనస్సు, వాక్కు శరీరము చేతనమగును ఈ చేతనము (activity) ద్వారా జీవుని (ఆత్మ) యందు పరిస్పందన తరంగములు ఏర్పడి దాని ద్వారా పదార్థమును ఆకర్షించు శక్తి కలుగును అన్నారు కర్మ వలన ఆత్మ యందు క్రోధము, గర్వము, ఆశ, మోసము వంటి ఉద్రేకములు కలుగును ఈ ఉద్రేకముల వలన ఎక్కువ (more) కర్మ పదార్థమును ఆకర్షించుటకు ఆత్మకు శక్తి ఏర్పడును ఈ విధముగా ఆత్మకు ద్రవ్యముతో బంధము ఏర్పడును అన్నారు ఎంత కర్మ పదార్థం ఆత్మలోకి ప్రవహించును అనునది వ్యక్తి యొక్క కోరికల, ఉద్దేశ్యము యొక్క, స్థితిగతుల తీవ్రత (intensity) పై ఆధారపడి యుండును కర్మద్రవ్యము, ఆత్మతో కలియుట వలన "కర్మణ శరీరము" ఏర్పడును అన్నారు ఈ కర్మ ప్రవాహమును నిరోధించగలిగినపుడు కర్మబంధము నుండి విముక్తి కలుగును కర్మ ఫలితములను అనుభవించుట ద్వారా కూడా నిల్వయుండిన కర్మ పదార్థ ప్రభావము నుండి విముక్తి పొందవచ్చును అని

కూడ అన్నారు

పదార్థమునకు, పదార్థము వలన ఏర్పడు వస్తు రూపమునకు భిన్నమైనవి జీవులు జైనులు 'జీవ' అను శబ్దమును (మాట) అనేకార్థములలో ఉపయోగించారు ప్రాణము, శక్తి, ఆత్మ చైతన్యము, బాహ్య ప్రపంచమునకు భిన్నమైన చేతనానుభవము, అని 'జీవ' శబ్దమునకు అర్థముగా చెప్పారు జీవులు అసంఖ్యాకములు అందు అనేక జాతులు కలవు ప్రధానముగా అవి 1) నిత్య సిద్ధ జీవులు, 2) ముక్తులు, 3) బద్ధ జీవులు ముక్తజీవులకు దేహములుండవు వారు సర్వబంధములకు అతీతముగా నుందురు బద్ధజీవులు పదార్థమునకు బద్ధులు, మోహములకు దాసులు, వారు అనంతమైన 'పునర్జన్మల పరంపర'లో బంధితులగుదురు నిత్యసిద్ధజీవులు సంపూర్ణ పవిత్రరూపులు . పదార్థదోషము వీరిని అంటదు వీరియందు ఆత్మ-పదార్థ బంధపాశము ఉండదు అజ్ఞానము వలన తానే పదార్థమని జీవుడు భ్రాంతిలో నుండును అన్నారు ముక్తజీవులు దోషములకు అతీతులు ముక్తజీవి పవిత్రుడైన ద్రష్ట (చూచువాడు) ముక్తజీవియే ఉపనిషత్తులందు చెప్పబడిన 'ఆత్మ' ఆత్మ స్వయంస్థితి గలది లోకానుభవ ప్రమాణముతో నిశ్చితమైనవి బద్ధజీవులు "ఈ రెంటి స్వరూప స్వభావములను స్పష్టపరచుటలో జైనతత్త్వములో గందరగోళము ఏర్పడినది" అని అద్వైతవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు (Indian Philosophy, Vol I, P 321)

ఆత్మ సర్వదా పదార్థ సంబంధము కలిగియుండును కర్మ యీ సంబంధమునకు కారణము ఒక్క సిద్ధావస్థ (స్థితి)లో యీ బంధముండదు ఆత్మ అన్ని స్థితులలోను అవిచ్ఛిన్నముగా నుండును అది దేహము నుండి ఏర్పడినది కాదు ఒక క్రొత్త పదార్థము ఏర్పడుట గాని, ఉన్న పదార్థము నాశనము పొందుట గాని జరగదు అని జైనులు అంగీకరింతురు అణువుల సంయోగము వలననే నూతన రూపములు ఏర్పడును జీవులు అనేకములు అవి అన్నియు నిత్యములు జీవుల మూలరూపమైన చేతనత్వము నశింపదు

జీవులకు పరిమాణము (size) గలదు అది భిన్నభిన్నముగా నుండును ఎప్పటికి ఏ దేహములందు ఉండవలెనో ఆ దేహ పరిమాణముల ననుసరించి జీవపరిమాణము పెరుగుట, తరుగుట జరుగును జైనుల అహింసా సిద్ధాంతమునకు అనుకూలముగా జీవులలో యీ భేదవాదము ఏర్పడినది చర్మము (స్పర్శ), కళ్లు, చెవులు, నాలుక ముక్కు అను అయిదు జ్ఞానేంద్రియములు గల జీవులు ఉత్తములు అన్నారు స్పర్శేంద్రియము (చర్మము) మాత్రమే గల జీవులు అధమములు అన్నారు మిగిలినవి మధ్యమములు ఉత్తమ జీవులగు మానవులకు, దేవతలకు ఆరవ ఇంద్రియమగు మనస్సు ఉన్నది ఇది అంతరింద్రియం దాని వలన వారు వివేకము గల జీవులు ఇంద్రియములు దేహములు కలిసి ఆత్మస్థితి (essence of the soul) కానేరవు వీటికి అంతర్భూతము, ఆధారము అయిన చేతనత్వము (consciousness) జీవుల ప్రధాన లక్షణం జీవలక్షణమైన జ్ఞానము జీవునకి భిన్నము కాదు జ్ఞానమార్గములు అనేకములుండుట వలన లోకములు అనేకములుగా ఏర్పడినవి అని జైనజ్ఞానుల అభిప్రాయము

జననం, మరణం, జననములలో ఆయా సమాన భూత శరీరములనో (elemental bodies), ఇతర భూత శరీరములనో పొందుచుండును ఇవి కొన్ని స్థూలములు మరికొన్ని సూక్ష్మములు సూక్ష్మములు కంటికి కనబడవు మొక్కలు మొదలగునవి ఒకే ఇంద్రియము కలవి మొక్కల లతలు జీవి దేహములు కావచ్చును ఇతర తత్వజ్ఞులు లతలు కూడ జీవులే అని చెప్పినను జైనులు మాత్రము యీ సిద్ధాంతమును విశేషముగా వృద్ధి చేశారు జీవి దశ దేహ దశ ననుసరించి యుండును జడపదార్థము నందు జీవచైతన్యము నిగూఢమైయున్నది చేతనమైన (active) దేహమునందు అది చలించుట ప్రారంభించినది మనుష్య దేహములో చేతనత్వము (consciousness) చురుకుగా నున్నది

జీవునకు రూపము లేదు అయినను జ్ఞాన లక్షణము కలిగి యుండుట వలన కర్మఫలము అనుభవించుచున్నాడు అందుచే దేహపరిమాణము కలిగి యున్నాడు జీవి మార్పులను పొందుచుండును లేనిచో జీవుడు కారణమునకు కర్త కాజాలడు (causal agent) జీవి భావములకు ఉపాదానకర్త (భౌతిక కారణము) అన్నారు కర్మ పదార్థము నిమిత్తమాత్రము కారణము ఉదాహరణగా కుమ్మరి కుండలు చేయుట చెప్పారు కుమ్మరి జీవి యందు కుండను గురించిన భావన ఉన్నది తరువాత అది మట్టికుండ రూపములో బయటపడినది అనేక రూప పరిణామములున్నను జీవి తన సహజ స్వభావమును అవిచ్ఛిన్నముగా నిలుపుకొనును జనన మరణములు జీవికి పర్యాయపదములు మాత్రమే ముక్తజీవి, సంసార బంధములో నున్న జీవునితో నేకముగానే ఉండును (one with) అనగా జీవి నిరంతరము పరిణామ ప్రవాహ వల యందు తగుల్కొని యుండనవసరము లేదు అనగా శరీరముతో నిమిత్తము లేకుండ జీవి ఉండగలదు చైతన్యము ఒక స్వతంత్ర శక్తి దానికి పదార్థముతో సంబంధము అవసరము లేదు అది ఆది, అంతములేని శాశ్వతశక్తి అణు సముదాయములు విచ్ఛిన్నమై నాశనమగుచుండును

అజీవ ద్రవ్యములు అయిదుగా చెప్పబడినవి అవి 1) ధర్మము, 2) అధర్మము, 3) ఆకాశము, 4) కాలము, 5) పుద్గలము లేక పదార్థము ఇందు మొదటి నాలుగు రూపము లేనివి చివరిది పుద్గలము రూపము కలది ఆరవ ద్రవ్యము జీవము అని జైనమతము ఈ ఆరింటియందు కాలము తప్ప మిగిలినవి రూపసంబంధము కలవి అని ఊహించారు కాలము సత్యమైనది కాని దానికి రూపము లేదు కాలము ఒక స్వతంత్రస్థితి గల ద్రవ్యము అని జైనద్రవ్య సిద్ధాంతము ఒకే స్థలమునందు అనేక ద్రవ్యములున్నను అవి తమ స్వభావములందు మార్పులేకుండ పరస్పరము ప్రవేశశక్తి కలిగియుండును జైనులు చెప్పిన ఆరు ద్రవ్యములు వైశేషికులు చెప్పిన తొమ్మిది భూతములు

(elements) కంటే భిన్నమైనవి వైశేషికులు చెప్పిన తొమ్మిది భూతములు 1) భూమి, 2) జలము, 3) అగ్ని, 4) వాయువు, 5) ఆకాశము, 6) కాలము, 7) దిక్కు, 8) మనస్సు, 9) ఆత్మ కాని జైనులు ఇందు మొదటి నాలుగు పదార్థములు అన్నారు ఇంద్రియములకు అనుకూలమైన పదార్థ లక్షణములు వాటికి కలవు అన్నారు కలియుటకు వీలగు అంశములు, పరస్పర ప్రవేశము ద్వారా మార్పు పొందుట వలన పదార్థము ద్రవ్యమగును శబ్దము ఆకాశము నుండి వచ్చును అన్నారు వైశేషికులు కాని పదార్థ అంశముల ప్రకంపనల (vibrations) వలన శబ్దము జనించును అని జైనుల వాదన

పైన చెప్పబడిన ఆరు ద్రవ్యములలో జీవము, పుద్గలము ప్రధానమైనవి మిగిలినవి ఆ రెండింటి పరస్పర చర్యల (అనగా ఒకదానిపైనొకటి పనిచేయుట వలన) ఫలితములు జీవి పదార్థబద్ధుడగుటయే సంసారము జీవ, పుద్గలములు క్రియతో కూడిన ద్రవ్యములు, అనగా ఒక చోట నుండి మరియొక చోటికి చలించుచుండు ముఖ్య కారణములు ధర్మము, అధర్మము చలనమునకు అవకాశము కల్పించును కాని అవి మార్పులకు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని కారణములు కానేరవు అందువలననే వాటి క్రియతో కూడిన, క్రియతో కూడని ద్రవ్యములు అన్నారు కర్మ వలన జీవ, అజీవములకు అనుబంధము కలుగును కర్మోత్పత్తి, ఫలితము, నాశనము, జీవఅజీవములు ఇవి జైన తత్త్వ సిద్ధాంత అంశములు జీవ, అజీవము ప్రధాన నియమములు (principles) అవి రెండును సాధారణముగా కలిసి యుండును అజీవ బంధము నుండి విముక్తియే జీవునికి మోక్షము అన్ని కర్మముల గమ్యము (goal) మోక్షమే కర్మ చేయకుండుట, లేక కర్మ నాశనముచే ఈ గమ్యము సిద్ధించును 'సంవరము', 'నిర్జరము' అను రెండు పదములు కర్మసిద్ధాంతములో జైనులుపయోగించారు 'సంవరము' అనగా ధర్మనియతి తీర్థంకరుల బోధనల ననుసరించి మనోవికారములైన కామక్రోధాది గుణములను నిరోధించుట ద్వారా సంవరమును సాధించవచ్చునన్నారు 'నిర్జరమును'

పూర్వపాపములను కఠిననిష్ఠ ద్వారా నాశనము చేయుట అని నిర్వచించారు 'సంవరము' ద్వారా కర్మ జీవియందు ప్రవేశించకుండ నిరోధించవచ్చు అన్నారు పూర్వము చేసిన పాపములను 'నిర్జరము' ద్వారా నాశనము చేయవచ్చును అన్నారు 'ఆశ్రవము' అనగా లోనికి ప్రవహించుట బంధముల వలన 'సంవర', 'నిర్జరముల' అవసరము ఏర్పడినది ఇతర పదార్థములు జీవునిలోనికి ప్రవహించుటయే 'ఆశ్రవము' జీవుని దేహమునకు బంధించునది బంధము అది అయుక్త విశ్వాసము (మిథ్యా దర్శనము), అవిరతి (పరిత్యాగము లేకపోవుట) (non-renunciation), ప్రమాదము (అజాగ్రత్త), కల్మషము (passions), వాక్కు, మనస్సు, దేహముల వలన జీవిలో కలుగు ప్రకంపనల (vibrations) వలన కలుగును ఒక వస్తువు ఏది కాదో అదేనని భ్రమించుట మిథ్యాత్వము ఆశ్రవ బంధములు దుష్కర్మ ఫలితములు సత్ప్రవర్తనము ద్వారా కర్మ నిర్మూలమగును భావములు కర్మను నిర్ణయించును అన్నారు

జీవిలో నుండు కర్మ పదార్థమే జీవి జన్మకు కారణమగును జీవికి విజ్ఞానము, అంతర్జ్ఞానము (దివ్యదృష్టి) (knowledge and intuition) సహజములు ఇవి కలుషితమగుటకు కర్మయే కారణము మోక్షము సిద్ధించు వరకు జీవి పూర్తిగా పదార్థము నుండి బయటపడడు ఆ విధముగా జీవికి కాలుష్యమేర్పడును కర్మగా మారుటకు ముందు సూక్ష్మ పదార్థము జీవిలోనికి ప్రవాహమై ప్రసరించును ప్రతి ప్రత్యేకమైన కర్మ ఏదో ఒక చర్య వలన ఏర్పడును ఆ చర్య మంచిది కాని, చెడు కాని, ఉపేక్షతో కాని లేక నిర్లక్ష్యముగా చేసినది కాని కావచ్చును ఆ కర్మ సుఖదుఃఖ ఫలితముల నిచ్చుచుండును ఒక కర్మ తన ఫలితమునిచ్చునపుడు, అది జీవము నుండి తుడిచివేయబడును ఇది నిరంతరాయముగా జరిగినపుడు మరెన్నడు జీవుని యందు కర్మఫల ప్రవేశం జరగకుండ పదార్థ కాలుష్యమంతయు పూర్తిగా తుడిచివేయబడి జీవి శుద్ధమగును కాని దురదృష్టము వలన కలుష ప్రవేశము, ప్రక్షాళనము ఒకే సమయమందు జరుగుచుండుటచే జీవి సంసార

చక్రమందు బంధింపబడియే యుండును మరణకాలమున జీవి తన కర్మణ శరీరమును పొంది, కొన్ని క్షణములలో పునర్జన్మ పొందవలసిన చోటికి పోయి నూతన దేహములో ప్రవేశించి, దాని పరిమాణముననుసరించి తాను పెరుగుట, తరుగుట జరుగుచుండును ఐహిక (mundane) బద్ధ జీవులను జన్మ స్థానముల ననుసరించి నాలుగు రకములుగా నిర్ణయించారు 1) నరకములో పుట్టినవి 2) జంతు ప్రపంచములో పుట్టినవి 3) మానవ సమాజములో పుట్టినవి 4) దేవతల సమాజములో పుట్టినవి

విధి, స్రష్ట, విధాత, దైవం, పురాకృత కర్మ, ఈశ్వరుడు, ఇవి అన్నియు కర్మకు పర్యాయపదములు అన్నారు జైనులు ఒకరి కర్మఫలమును మరొకరు అనుభవించుటకు వీలుపడదు అని జైనకర్మ సిద్ధాంతములో ఒక అంశము కర్మఫలము అనుభవింపక తప్పదు అని కూడ అన్నారు వర్ణవిభాగము (కులములు) జైనులు నిరసించలేదు కాని శీలము బట్టి మాత్రమే వర్ణము గ్రహించారు "తాను చేయు కర్మ వలన నొకడు బ్రాహ్మణుడో, క్షత్రియుడో, వైశ్యుడో, శూద్రుడో అగును ఎవ్వనిని ఏ కర్మలు అంటవో వానిని మేము బ్రాహ్మణుడందుము" (Indian Philosophy Vol I P 328) అని అన్నారు

జైన సిద్ధాంతములో దుష్కర్మకు ఉద్దేశము ప్రధానము కాదు ఉద్దేశము ఉన్నను, లేకున్నను (intent) అనగా ఉద్దేశపూర్వకముగా కాక యాదృచ్ఛికముగా పాపము జరిగినను చెడుకర్మయే ఆకర్షించబడును అని విశ్వసించారు ఇది బౌద్ధ సిద్ధాంతమునకు వ్యతిరేకము బుద్ధి పూర్వకము కాని కృత్యములు, దుష్కృత్యములైనను చేసిన వ్యక్తిని దోషిగా నిర్ణయించుట కుదరదు అని బౌద్ధ సిద్ధాంతము కాని దురుద్దేశము ఉన్నను లేకున్నను దుష్కృత్యములు పాపములే అని మహావీరుడు ఉద్ఘాటించాడు దురుద్దేశము అనునది పాపమును అధికము చేయు అంశము మాత్రమే అన్నారు దురుద్దేశము వలన ఆత్మ (జీవి) యందు ప్రకంపనలు ఎక్కువై ఎక్కువ కర్మను ఆకర్షించును అని నిర్వచించారు

ఈ విధముగా జైనుల కర్మ సిద్ధాంతము ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది

1 కర్మ అనునది సూక్ష్మపదార్థము పద్గులము (పదార్థము) నుండి కర్మ ఏర్పడును కర్మలు జీవుని వైపు ఆకర్షించబడును

2 మనసు ఒక పదార్థ అస్తిత్వము అది కర్మ యొక్క ఉత్పత్తి కొన్ని జీవులకు మాత్రమే మనసు భౌతిక లక్షణము ఎందుకనగా యీ ప్రపంచమున కొన్ని జీవులకు మనసు (Mind) ఉండదు కాబట్టి

3 క్రోధము, కామము, గర్వము, ఆశ మొదలగు మానసిక స్థితులు పదార్థము నుండి జనించినవే అవి భౌతికములు (material)

4 తప, ధ్యాన, ప్రాయశ్చిత్తముల ద్వారా గతములో ఏర్పడిన కర్మలను నిర్మూలించవచ్చు

5 కర్మలు పదార్థ స్వభావము కలవి కావున, ఉద్దేశము మాత్రమే కర్మకు మూలము కాదు అన్నారు ఉద్దేశము లేనంత మాత్రమున చెడు కర్మ ఆకర్షింపబడకుండ ఉండదు

6 కఠిన నియమముల ద్వారా కర్మను నిరోధించవచ్చును అన్నారు ప్రాయశ్చిత్తము, తపస్సులకు ప్రాముఖ్యముండుట వలన జైనకర్మ సిద్ధాంతమందు సర్వమునకు అదృష్టము ప్రధానమని లేక సర్వం పూర్వ నిర్ణీతము అను విశ్వాసములకు ఆస్కారము లేదనిపించును

జైనమతము తాపసిక ప్రవృత్తికి, పరిశుద్ధ స్వభావమునకు ప్రాధాన్యము యిచ్చినది ఇతర మతముల కంటే ఇందు తపోసాధనకు ముఖ్యస్థానము కలదు అహింస, సత్య, దానవ్రతములు, బ్రహ్మచర్యము, పరిత్యాగము (renunciation) అనునవి హిందూ బౌద్ధ, జైనమతములందు దాదాపు సమముగానే కనబడును, కాని వాటి దృక్పథములందు భిన్నత్వము గోచరించును ద్రవ్యసూత్ర ఆధారముగా రూపొందిన జైనుల కర్మ సిద్ధాంతమే దీనికి కారణము

కావచ్చును కర్మ లేక చర్యలు (activity) చేయకుండ నిరోధించుట ద్వారా క్రొత్త కర్మ ఆకర్షింపబడకుండ చేయవచ్చును అని జైన దృక్పధము కాని భగవద్గీత కర్మ చేయకుండ ఏ జీవి మనలేడు అని చెప్పింది

కర్మ ఉద్దేశము (intuition) ద్వారా ఏర్పడును అని బౌద్ధ సిద్ధాంతము అందుచే ఉద్దేశమును నిర్మూలించిన కర్మలుండవు అన్నారు అందువలన శరీరమును కృశింపజేయు కఠోర నియమములు బౌద్ధమునందు లేవు

మానవ చర్యలు కామము (కోరిక) ద్వారా రూపొందును అని భగవద్గీత (18-2) చెప్పింది అందుకే భగవద్గీత నిష్కామకర్మ, అనాసక్తి యోగం ప్రబోధించింది బౌద్ధుల 'తృష్ణనిరోధము' భగవద్గీత 'నిష్కామకర్మ' (అనాసక్తి యోగము) ఒకటిగానే కనబడును కాని జైనుల 'కర్మ విరోధము' ఇందుకు భిన్న దృక్పధము

జైనుల కఠోర నియమములకు ప్రతిగా కర్మఫలము నుండి తప్పుకొనుటకు హిందూమతము భక్తి యోగమును ప్రవచించింది భక్తి విశ్వాస ఫలితమే భగవంతుని వివిధ అవతారరూప విశేషము కర్మఫలమునకు సమాధానముగా బౌద్ధమతము దానము, పుణ్యమును కూడ దానము చేయతగును అని బోధిసత్వ సూత్రములను ప్రవేశపెట్టారు

కాలక్రమములో ప్రచారములోనికి వచ్చిన తాంత్రికులు కర్మ సిద్ధాంతమును ఎదిరించారు మంచి, చెడు, పుణ్యము, పాపముల మధ్య తారతమ్యమును నాశనము చేశారు తపశ్చర్యల ఉపయోగమును తిరస్కరించారు సుఖానుభవమునకు హెచ్చు ప్రాధాన్యము యిచ్చారు యోగసాధనను విడిచి భోగసాధనకు ప్రయత్నించారు

ఇంకను వామాచారులు అను మరియొక శాఖ ఏర్పడింది వీరు పూర్తిగా భౌతిక సుఖమునకు, ఉద్రేక వాంఛలకు (passions), అత్యధిక

ప్రాధాన్యము కల్పించి జైనమునుల తపోసాధనలను హేళన చేసి తిరస్కరించారు

తాంత్రికుల, వామాచారుల ప్రభావము కొంత బౌద్ధ, హిందూమతముల మీద ప్రసరించింది కాని జైనమతమును ఏ విధముగను ప్రభావితము చేసినట్లు కనబడదు దీనికి కారణము బహుశ జైనుల తత్వశాస్త్రములోని కర్మద్రవ్యరూప సిద్ధాంతము కావచ్చుననిపించును జైనకర్మ సిద్ధాంతములో ఉద్దేశము లేక భావము (motive) నకు ప్రాధాన్యము లేకపోవుటచే కర్మ ఫలానుభవ విషయములో ఎటువంటి సమాధానము లేక రాజీ ప్రసక్తికి అవకాశము లేకపోయినది భక్తి, అవతార విశ్వాసము, బోధిసత్వ బోధనములకు జైనమతములో స్థానం లేకుండ పోయినది హిందూ, బౌద్ధమతముల వలెనే జైనమతము కూడ అహింస బోధించినను, అహింసా సిద్ధాంతము జైనమతములో అత్యంత కారిన్యముతో కూడినది కర్మద్రవ్య సిద్ధాంతము వలన పుణ్యాదానము, పాపపరిగ్రహణమునకు జైనమతములో స్థానము లేదు ఒకరి కర్మను మరొకరు అనుభవించుట అసంభవము అని జైన సిద్ధాంతము

### 3) బౌద్ధమతములోని కర్మ సిద్ధాంతము

ప్రాచీన బౌద్ధమతము అనగా బుద్ధుడు స్వయముగా ప్రబోధించినది, ప్రకటించిన తత్త్వ సిద్ధాంతము అత్యంత స్వతంత్రములైన తత్త్వములలో నొకటి అని చెప్పుటకు సందేహమునకు తావులేదు కాని అనంతర కాలములో విభిన్న దశలలో బౌద్ధమతము నందు అనేక భిన్న రూపములు ఏర్పడినవి బౌద్ధమత స్థాపకుడైన బుద్ధుని గురించి అనేక పుక్కిటి పురాణగాధలు పుట్టినవి వాటిని వదలి ప్రాచీన బౌద్ధ తత్త్వ ముఖ్య సూత్రములను పరికించినచో అవి ఈనాటి 'కర్మ' విషయ అవసరములకు సముచితమైనవి అని గ్రహించవచ్చును అని తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు ప్రకృతి శాస్త్రీయ విజ్ఞానమునకు (Natural Science) విశ్వాసమునకు (faith) గల పరస్పర వైరుధ్యములను తొలగింపగల శక్తివంతమైన తత్త్వశాస్త్రము పురాతన బౌద్ధమతము

రూపొందించినది అని కూడ ఆయన అభిప్రాయపడిరి

భారతదేశము నందే బౌద్ధమతము పుట్టిన తదనంతర వేయి సంవత్సర కాలములో అది ఎంతో పరిణామములకు లోనైనది ఎన్నో శాఖలు పూర్ణరూపము పొందినవి

ఉపనిషత్తులు అనేకుల మానసిక కృషి ఫలితము బౌద్ధమతము ఒకే వ్యక్తిలో మూర్తీభవించిన తత్త్వజ్ఞాన సర్వస్వము బౌద్ధము జ్ఞానము, జీవితము కలిసిన తత్త్వశాస్త్రము ఆనాటి సమాజముపైనది అద్భుత ప్రభావము చూపినది బుద్ధుని వ్యక్తిత్వ ప్రతిభయే ప్రాచీన బౌద్ధమత విజయమునకు ప్రధాన కారణము ఆనాటి సామాజిక పరిస్థితులు కూడ దోహదము చేసినవి జైనప్రవక్త వర్ధమాన మహావీరుడు, బౌద్ధమత స్థాపకుడు సిద్ధార్థుడు (బుద్ధుడు) దాదాపు ఒకే కాలమువారు వారి జనన, మరణ సంవత్సరముల గురించి వాదప్రతివాదము లున్నవి తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ చెప్పిన ప్రకారం మహావీరుడు క్రీ॥పూ॥ 599లో జన్మించి క్రీ॥పూ॥ 527లో నిర్యాణము పొందెను బుద్ధుడు క్రీ॥పూ॥ 567లో జన్మించి క్రీ॥పూ॥ 448లో నిర్యాణము పొందెను

బుద్ధుడు అనగా జ్ఞానసిద్ధుడు ఆ పేరుతోనే గౌతముడు బౌద్ధమత స్థాపకుడైనాడు అతని పేరు సిద్ధార్థుడు వంశనామము గౌతముడు ఆరు సంవత్సరముల కఠిన తపోనిరతి తదుపరి ఐశ్వర్యము, మతగ్రంధముల వలన కలుగు అనుభవశూన్యజ్ఞానము, యతి జీవితములోని దుర్భరదీక్ష అన్నియు నిరర్ధకములని నిశ్చయించుకొనెను చివరకు ఒక వటవృక్షఛాయలో కూర్చుండి తన పరమలక్ష్యమైన జ్ఞానజ్యోతిసాధన తన మనస్సున స్థిరీకరించుకొనెను ఆ వృక్ష ఛాయలో ఆసనమందు నిగూఢమైన సమాధి అవస్థ యందు విశ్రాంతుడై యుండగా నొక దివ్యజ్ఞానజ్యోతి అతని మనస్సున వెలిగెను ఆ వృక్షమును బోధివృక్షమని, ఆ యాసనమును జ్ఞానపీఠమనియు ఆయన శిష్యులు శాశ్వతమొనర్చిరి ఎన్నో సంవత్సరముల అన్వేషణ, ధ్యానముల ద్వారా

దుఃఖపూరితమైన మానవ జాతికి ఆనందము కలిగించు మార్గము చూపుట తన కర్తవ్యముగా నిర్ణయించుకొనెను నలుబది సంవత్సరముల నిరంతర ప్రచారము తరువాత బుద్ధుడు తన కర్తవ్యమును శిష్యులకు అందజేసి ఎనుబది సంవత్సరముల వయస్సున నిర్వాణము పొందెనని చెప్పుదురు ప్రసన్నమైన గాంభీర్యము, అత్యంత సౌజన్యము, సౌమ్యమైన నిశ్చలత్వములే రూపము దాల్చినట్లుగా నుండెను బుద్ధుని మూర్తి శాక్యముని, తథాగతుడను నామములు గూడ అతనికి కలవు

ప్రతి మత తత్త్వ సిద్ధాంతము ఆనాటి సమాజముననున్న ఆలోచనలను, స్వభావమును ప్రతిబింబించును ఆ తత్త్వము నర్థము చేసికొనుటకు ఆనాటి సామాజిక పరిస్థితులను గ్రహించవలయును బుద్ధుని కాలమున దేశము ఏకచ్ఛత్రాధిపత్యమున లేదు అనేక స్వతంత్రరాజ్యములున్నవి దేశభాషలు వివిధములైనను సంస్కృతభాషను మాతృభాషగానే గ్రహించిరి వేదములకు లోక ప్రమాణ గౌరవముండెను మన ధర్మశాస్త్రము వాడుకలో నుండెను చిత్రవిచిత్ర వాదనలతో పరస్పర విరుద్ధమైన అనేక సిద్ధాంతములతో సామాజిక వాతావరణమంతయు సంకులముగా నుండెను దినదినము మారుచుండు వాదనలుండెను సత్యము-మిథ్య యందు భేదము, పరలోకము-పునర్జన్మమున్నవా, కర్మ స్వాతంత్ర్యము మొదలగునవి నిరంతర వాదప్రతివాద ప్రసంగ విషయములైనవి మనస్సే ఆత్మయని, కాదని, దేవుడే సర్వస్వమని, కాదని, మొదలగునవి వివాదాంశములాయెను ఇట్టి కోలాహలముతో కూడిన సమాజ వాతావరణములో వేద సంప్రదాయమునకు విరుద్ధమైన సిద్ధాంతము లెన్నో పుట్టుకొచ్చినవి ఇందువలన నొక విధముగా తత్త్వశాస్త్రమే కళావిహీనమై యుండెను అసాంఖ్యాక దేవతా గణసృష్టి, బహుదేవతారాధన, దేవతాదుల శాపములు, వరముల గూర్చిన విశ్వాస ప్రచారము ఆనాటి విశృంఖల స్వాతంత్ర్యముతో సమాజ వాతావరణము అత్యంత సంకీర్ణము, సంకులముగా తయారైనది దేవతలను తృప్తిపరచుటయే ప్రజల నిత్యకృత్యమైనది

కర్మకాండలతో కూడిన వేదమతము సామాన్య జనవాహినికి గతియైనది దాదాపు 2500 సంవత్సరముల తర్వాత నేటి సమాజములో కూడ యీ సంకీర్ణ స్థితి ఎంత దారుణముగా నున్నదో మనకందరకు ప్రత్యక్ష దృశ్యమే గదా! బౌద్ధము ప్రకాశించింది, దేశ సరిహద్దులు దాటి వెళ్లిపోయింది, వేదమతము పునరుద్ధరించబడింది, ఉపనిషత్తుల వేదాంత ధోరణి ప్రచారములోనికి వచ్చింది, కాని బౌద్ధమత స్థాపనాకాలమున ప్రబలియున్న సామాజిక సంకుల వాతావరణము నేటి సంకీర్ణ వాతావరణమునకు ఏ మాత్రమైనా భిన్నముగా నుండేనా అని ఆలోచించిన పూర్తిగా అదే సంకుల స్థితి నేడును ఆవరించి యున్నదని విదితమగును కులవ్యవస్థ వేరుపురుగువలె సమాజమును తొలుచుచున్నది వేద, మత ప్రచారములు, మత విశ్వాసములు, స్వార్థ ప్రయోజనములకు ఆధారములు, అస్త్రములు అయినవి వేదాంతము కూడ స్వార్థముతో కూడిన ప్రచారాడంబరాగ్నిలో సమిధ్యఅగుచున్నది

ఆనాడు తలమోదుకొని దేవుని సంతృప్తిపరచుట, దేవుని ప్రీతియే పుణ్యము, దైవద్రోహము పాపము అను విశ్వాసము ప్రచారములో నుండెను కర్మ సిద్ధాంతము నాలుక చివరి మాటగా మిగిలియుండెను దాని ఫలితముగా మతమునకు జీవితమునకు, దేవునకు మానవునికి మధ్య సమన్వయ సామరస్యము అదృశ్యమాయెను కర్మకాండల పేరున క్రూరచర్యలు ప్రబలినవి మూఢవిశ్వాసములు మానవ నీతి, ధర్మములను, విలువలను కలుషిత మొనర్చెను ఈ స్థితిగతులు బుద్ధుని హృదయమును కంపింపజేసెను అందుచే అతడు మానవాతీత ధర్మము కంటే మానవధర్మమే లోకహితము అని నిశ్చయించెను మానవుడు తన సుఖదుఃఖములకు, మోక్షమునకు తానే కర్త, బాధ్యుడు అని చెప్పినచో మానవత్వం ఉద్ధరించబడును అని బుద్ధుడు తలచెను మన సుఖదుఃఖములకు మరొకరు ఎవరో కారకుడు అని తలచుట మూర్ఖత్వమే అగును అన్నాడు కర్మ నియమము ద్వారానే వ్యావహారిక ప్రపంచము యొక్క కారణము ఊహించవచ్చును అని చెప్పాడు లోకాతీతమైన

సత్పదార్థ సూచన చాల నిగూఢమైనదని, అది తర్కబుద్ధికి అందదు అన్నాడు ఉపనిషత్సిద్ధాంతములు అంగీకరించెను, కాని అవి జనసామాన్యమునకు అందనిచో వాటి ప్రయోజనము శూన్యము అన్నాడు ఆనాడు ఉపనిషత్తుల ఉపదేశములను కలుషిత మొనర్చి, దేవతలను తమ స్వాధీనములో నుంచుకొనుటకై కొందరు ఉపాసనల పేరుతో సమాజంపై ఆధిపత్యము సంపాదించిరి పాపపరిహారము డబ్బుతో కొనగల్గినచో మానవ హృదయమున నుండు అశాంతి తొలగదు అని తలచి మానసిక శాంతి కొరకే సర్వము అని బౌద్ధమత స్థాపన బుద్ధుడు చేసెను

19వ శతాబ్దములో హేతువాదము ననుసరించి హేతువును మత విశ్వాసమును మంటగలుపు అభ్యాసముగా నిర్వచించారు కొందరు బుద్ధుని గూడశుద్ధ హేతువాదిగానే చిత్రించారు కాని అతడు పూర్తిగా హేతువాది అని చెప్పుటకు వీలుపడకపోయినను, అతడు ఒక విధముగా హేతువాదియే అని తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ అభిప్రాయపడిరి బుద్ధుని ఆశయము మతనాశనము కాదు ఎట్టి పక్షపాతమును లేకుండ సత్యమును గ్రహించుటయే అతని కృషి, ఆశయము దేవుడు చెప్పెను అను విశ్వాసముతో గాక మానవ సహజమైన పద్ధతినే అతడు అనుసరించుట వలన, అంతవరకు అతడు హేతువాది అని చెప్పవచ్చును ప్రకృతియందు మనకు గోచరించు విషయములను పరిశీలించు నపుడు ప్రకృతికి అతీతమైన విషయములను గ్రహించరాదు అను ప్రకృతి శాస్త్రవేత్తల అభిప్రాయములతో అతనికి సామ్యము కనబడును తాను చెప్పదలచిన విషయమును గురించి అతనికి స్పష్టమైన భావన యుండుటవలన మానవాతీత అద్భుత సాక్ష్యముల అవసరము అతనికి కలగలేదు బుద్ధుడు నిరర్థక తత్త్వవాదముల జోలికి పోలేదు ఒక విధముగా బౌద్ధము తత్త్వోపదేశము కాదు అది ప్రధానముగా మనస్తత్వము, తర్కము

ఆనాటి పరిస్థితులననుసరించియే అతడు తన విధానమును

నిర్ణయించుకొనెను పరమార్థ చింత, విశ్వాసభావములు సన్నగిల్లిన కాలమది ముందు తర్కింపకుండ యే సత్యమును అంగీకరించని పరిస్థితులు అవి అట్టి ప్రజలున్న వాతావరణములో తర్క ఆధారము లేకుండ యే మతము నిలువజాలకుండెను అందువలన బుద్ధుడు తర్కానుభవముల మీదనే ఆధారపడెను (మూఢవిశ్వాసములకు, సంశయవాదములకు) అవకాశము కల్పించలేదు తపస్సు ద్వార తనకు కలిగిన అనుభవమును శిష్యులకు చెప్పి వారిని కూడ అటులే ప్రయత్నించి తెలుసుకొనమనెను బుద్ధుడు తానే ఉద్ధారకుడను అని చెప్పలేదు తనవలెనే ఎవరికి వారు తామే ఉద్ధరించు కొనుటకు మార్గము చూపెను ఆయన ప్రోత్సాహముచే ప్రయత్నము చేసిన వారి మనసులందు ఆయన యుపదేశజ్ఞానము ఆయనకు స్ఫురించినటులే దాదాపు సమానముగా స్ఫురించెను అతని పద్ధతి మనస్తత్త్వమును అనుసరించినది వ్యర్థ తత్త్వ భావములకు అవకాశమీయక తాను స్వయముగా అనుభవములో చూచి, సమన్వయించుకుని తనకు యదార్థములని తోచిన వాటినే నిర్ణయములుగా చేసె లోకములోని దుఃఖ నివారణకు పూనుకొనెను

బుద్ధుడు బోధించినది నూతనముగా రూపొందించిన విషయములు గాదు అతడు తాను జీవించిన యుగము నుండి వేరుపడిపోలేదు సంప్రదాయ సిద్ధమైన మతవిశ్వాసములను ఎదుర్కొనెను కాని ఆ సంప్రదాయముల వెనుక సజీవమైన శక్తిగానున్న ఆర్యధర్మమును అతడు తిరస్కరించలేదు బుద్ధుడు తన సిద్ధాంతమును నిర్మించుటలో ఉపనిషత్తులను గ్రహించెను, కాని వైదిక బహుదేవతారాధనతో ఉపనిషత్తులకు గల సంబంధమును తిరస్కరించెను, ఉపనిషత్తుల ఇంద్రియాతీత ప్రమాణములను వదలి వాటియందలి విశ్వజనీన ధర్మమును అంగీకరించెను బుద్ధుడు ఉపదేశించిన మతము (ప్రాచీన బౌద్ధము) ఉపనిషత్తులందలి ఉపదేశమును నూతన దృక్పథముతో తిరిగి స్థాపించెను అని సర్వేపల్లి రాధాకృష్ణ సాహసిక అభిప్రాయము అనాటి హిందూ ధర్మ ప్రవక్తలకు బుద్ధునికి గల భేదము అతని అపూర్వమైన

నిష్ఠ, విశ్వమంత విశాలమైన కరుణతో కూడిన మనస్సు బౌద్ధమతము కర్మ సిద్ధాంతమును దాని ద్వారా సమకూరు నిర్వాణమును విశ్వసించెను

బుద్ధుడు తన యనుభవముతో నాలుగు విషయములు సత్యములని నిర్ణయించెను అవి 1) దుఃఖము, 2) దుఃఖకారణము, 3) దుఃఖము అనివార్యము, 4) దుఃఖము నివారించుటకుపాయము జీవితము దుఃఖమయము అను విషయము బౌద్ధమతము నూతనముగా కనుగొనిన విషయము గాదు కాని బుద్ధుడు యీ విషయమును యెక్కువ చేసి వర్ణించినట్లు కనబడును జీవిత దుఃఖలక్షణములను బుద్ధుడు వర్ణించినంత దారుణముగా యింకెవరును వర్ణించినట్లు గోచరించదు ఉపనిషత్తులలో కూడ విషాదభావమున్నది కాని బౌద్ధములో నది కేంద్ర స్థానమాక్రమించినది కొన్ని బౌద్ధమతశాఖలు ఆశకు అవకాశము లేదని, ఇహలోకములో జీవించుట అలసటతో కూడినది, అంతకు మించి సుఖములేదు అని ప్రకటించినవి ఇది నిజముగా నిరాశావాదము (pessimism) కాని పూర్వబౌద్ధము (బుద్ధుడు స్థాపించిన) అట్టిది కాదు జీవితము దుఃఖమయము అని చెప్పింది, నిజమే జ్ఞానము ద్వారా కామములను జయించి దుఃఖమును నివారించుకొనవచ్చును దుఃఖములను ప్రతిఘటించమని చెప్పెను జీవితము వ్యర్థమని, విధి బలీయమని, నిరాశాభావము బుద్ధుడు బోధించలేదు

దుఃఖకారణము కామము (కోరిక) అన్నాడు బుద్ధుడు ఒక కామము మరికొన్ని కామములను ఉత్పత్తి చేయును మనము కోరు ప్రతి వస్తువు అనిత్యమే వాటి అనిత్యత ఆశాభంగము కలిగించును అటుపై దుఃఖము కలుగజేయును సుఖములన్నియు క్షణికములు జీవితము దుఃఖాత్మకము ఇది మూలసిద్ధాంతము ఆత్మ యీ లోకపు వస్తువు కాదని బుద్ధని వాదన దేహము, ఇంద్రియములు, చేతనత్వము అన్నియు అనాత్మరూపము (ఆత్మకానివి)లు, దుఃఖకారణములు అన్నాడు ఇందు యేదియు సత్యము

కాదు అవి శుష్కములు (empty) జీవము అని మనము అనుకొనునది శుష్కక్రియల సమూహమని, దానిని గురించి బాధపడవలసిన పనిలేదు అన్నాడు వాటిని గురించి మానవుల కలహము అజ్ఞానఫలితమే అన్నాడు అజ్ఞానము పోయినచో భావములు నశించును భావములు పోయినచో దుఃఖానుభవము నశించును

సుమారు 2500 సంవత్సరముల క్రిందట బుద్ధుడు నిర్మించిన ఆచరణాత్మకమైన తత్త్వమును (Philosophy of dynamism) ఈనాడు భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు (Physical scientists) నిర్మించ ప్రయత్నించుచున్నారు భౌతిక వస్తువులను గూర్చి విద్యుదయస్కాంత సిద్ధాంతము (Electromagnetic Theory) వెలుగులోనికి వచ్చినది ఏ పదార్థము జడము కాదు అది అణుశక్తితో కూడి నిత్యము స్పందించుచుండును అంటున్నారు అదే విధముగ మనస్తత్వ శాస్త్రమున గూడ అనేక విప్లవాత్మకమైన మార్పులు వచ్చినవి వస్తువులు నిరంతరం పరివర్తనములను పొందుచుండునని బుద్ధుడు ఒక పరిణామ సిద్ధాంతమును రూపొందించెను ఆత్మలు, పదార్థములు, అణువులు నిత్యము చలించుచు మార్పులకు లోనగు శక్తులు అని నిర్వచించాడు రూపములు కనబడును, అదృశ్యమగును ఈ పరంపరా సమూహమే జీవితము అన్నాడు జీవితమొక ప్రవాహమనియు, ఇంద్రియగోచరమగు యీ లోకము క్షణక్షణము మారుచుండును జనన మరణ చక్రమే జీవితము జీవితము, ఎన్ని సంవత్సరముల ప్రమాణము కలదైనను పరివర్తనకు లోనగుచునే యుండును మానవదైవ సంబంధములన్నియు పరిణామము పొందినవే అని బౌద్ధ సిద్ధాంతము ఇట్లు అనేక పరివర్తనముల కలయికయే లోకము అన్నారు నదీ ప్రవాహములో నీటిపై బుడగలు ఏర్పడును, ప్రకాశించును, పగలి నీటిలో కలిసిపోవును అట్టిదే ఈ లోకము నీటి ప్రవాహములో నిత్యము క్రొత్త నీరు వచ్చి చేరుచుండును ప్రవాహము నిరంతరముగా కన్పడును ఈ ప్రపంచమున అన్నియు నిరంతరమైన మార్పులతో కూడినవి అనునదే బౌద్ధతత్త్వమునకు

ప్రధాన బిందువు జీవితకాల పరిమాణములో నిది భిన్నత్వమే, కాని జన్మించిన ప్రతిది మరణింపక తప్పదు పరివర్తనయే సత్యము ప్రపంచమునకు నిత్యత్వము లేదు ఇది బౌద్ధభావము

ఈ పరిణామ ప్రవాహమునకే వస్తువులు అని నామకరణము చేయుచున్నాము బాలుడు, యువకుడు, మధ్యవయస్కుడు, ముదుసలి - వీరంతా ఎవరు? ఒకరే గదా అవి ఒకే వస్తువు యొక్క పరిణామ స్థితులు విత్తనము, చెట్టు ఒకటే అనంతమైన చలనము వలన వస్తురూపములు ఏర్పడుచున్నవి మన దేహమునకు కారణము పదార్థము ఆత్మకు కారణము చేతనశక్తి అవి నిత్యము మార్పులు పొందుచున్నను, అవి పూర్వరూపములే అను మన భావన ఒక భ్రాంతి మాత్రమే ఇట్టి దశా పరంపరల రూపమే వస్తువు ఒక దశ అనంతర దశకు కారణమగును నిత్యము పరివర్తనలకు లోనగుచున్నను ఏకముగా కన్పడునదే ప్రపంచము అన్నారు

ఈ మార్పులకన్నిటికి ఆధారమేమైన ఉన్నదా? కారణధర్మమే ఆధారము అన్నాడు బుద్ధుడు ఇది విశ్వవ్యాప్తమైనది కారణధర్మము యొక్క అవయవము అవిచ్ఛిన్నత (continuity) స్థితి అనునది మార్పుల పరంపర ఒక వస్తువు అనగా ఒక శక్తి, ఒక కారణము, ఒక స్థితి ఇది యంతయు ఒక ధర్మము అన్నాడు బుద్ధుడు నిరంతర పరివర్తన క్రమముతో కూడినదే యీ లోకము అన్నాడు

జగత్తు అనిత్యము అని ఉపనిషత్తుల సిద్ధాంతము పూర్వబౌద్ధము దానినే అంగీకరించినది అనంతర బౌద్ధ శాఖలు దానిని క్షణికవాదముగా మార్చుజేసినవి కాని అనిత్యమునకు, క్షణికమునకు భేదమున్నది శరీరము నూరు సంవత్సరములున్నను మనస్సు, బుద్ధి నిత్యము మారుచుండును అని బుద్ధుడు చెప్పెను అందుచే వస్తువుల కన్న వస్తుజ్ఞానమే క్షణికము అని బుద్ధుని ఉద్దేశముగా తెలియుచున్నది శరీరము, మనస్సు, చిత్తము

మొదలగునవి 'ఆత్మ' కానేరవు అని బుద్ధుని అభిప్రాయము ఇవి నిత్యములు కావు ఇచట అనిత్యము అనగా క్షణికత్వము కాదని తెలియుచున్నది ఈ భావము 'అగ్నిజ్వాల' ఉదాహరణగా స్పష్టము చేయబడినది ఒక జ్వాల అనేక చిన్న జ్వాలల పరంపర అట్టి చిన్న జ్వాల ఒక్క క్షణమే యుండును దీపజ్వాల క్షణికముగాదు చిత్తమున కలుగు పరిమాణ పరంపర (ఆలోచనము) అటువంటిదే అనగా చిత్త వికారములు (mental processes) క్షణికములు (momentary) కాని వస్తువులు అనిత్యములు (impermanent) ఇదే బుద్ధుడు చూపదలచిన భేదము అట్లుకాక క్షణికత్వమును అన్నిటికి వర్తింపజేసినచో అది క్షణికవాదము అనంతరకాల బౌద్ధతాత్త్వికులు సర్వము క్షణికము అని విశ్వసించిరి

స్థిరము, సత్యమైన, నిత్యమైన పదార్థమును గురించియే ఉపనిషత్తులకు బౌద్ధమునకున్న భేదము నిత్య సత్పదార్థము మానవుని ఆత్మరూపమై యున్నదని ఉపనిషత్తులు ప్రకటించినవి బుద్ధుడట్టి నిత్య సత్పదార్థమున్నట్లు చెప్పియుండలేదు అంతమాత్రముచే లోకమంతయు చలించు శక్తుల పరిభ్రమణము మాత్రమే అని యాతని యుద్దేశమని చెప్పలేము మనస్సు చలించును లోకము చలించును వీటికి మూలము ఏదైన ఉన్నదా? ఈ చలనమునకు కర్త ఈశ్వరుడా? పదార్థమా? లేక ప్రపంచము స్వయంశక్తిచే చలించుచున్నదా? దీనికి స్పష్టమైన సమాధానము లేదు అనుభవముతో కూడిన అంశములనే బుద్ధుడు అంగీకరించెను మార్పులకు ఆధారమైన వస్తువు లేదనెను అందువలన ప్రధానమైనది కారణసూత్రమే మూల కారణమును గూర్చి బుద్ధుడు ఏమియును చెప్పియుండలేదు ప్రపంచమును అవసరమే పాలించుచున్నది ఇందు గందరగోళమగు స్థితిగాని చపలమైన అన్య జోక్యముగాని లేదనెను జగత్తులో జరుగు పరివర్తనములో ఈశ్వరశక్తి యున్నదని ఉపనిషత్తుల భావము ఒకదానితో మరొకటి సంబంధములేని వివిధ దశల సమూహమే ప్రపంచము అని ఉపనిషత్తులు చెప్పలేదు పరివర్తనము

సత్యమని ఉపనిషత్తుల సిద్ధాంతం కాదు ఆ పరివర్తనముల వెనుక మార్పులేని నిత్య సత్పదార్థమొకటి యున్నదని ఉపనిషత్తుల భావము ఆ పదార్థ లక్షణములే యీ మార్పులకు మూలము మూలపదార్థమొకటి యున్నదని కాని పరివర్తనమే నిత్యమని కాని బుద్ధుడు భావించలేదు అభ్యుదయమునకు వలసిన ప్రాపంచిక స్వభావమును గురించి మాత్రమే యాతడు విచారించెను రూపములకు వెనుకనున్న సత్యమైన వస్తువును గూర్చి యాతడు తలచలేదు

గోచరమగు ప్రపంచము పైననే బుద్ధుడు దృష్టి కేంద్రీకరించాడు అందువలన ఉపనిషత్తుల వలె సృష్టికి ఒక కేంద్రమున్నదని, సర్వజీవములందు అది ఒక నిత్యమైన శక్తిగా నున్నదను నిశ్చయముపై అతడు దృష్టి సారించలేదు మనకు గోచరమగు యీ జగత్తు అనిత్యమని బుద్ధుడు అంగీకరించెను కాని దాని వెనుకనున్న సత్యపదార్థము యీ అనిత్య పరంపరలోనిది కాదు అయినను కనబడు యీ లోకముతో దానికి సంబంధము లేదనుట కుదరదు ఎందుకనగా అపుడీ కనబడు ప్రపంచమంతయు అసత్యమగును అందువలన ప్రతి వస్తువు ఉన్నట్లుగా కనబడును కాని వాస్తవమునకు అది అట్లు లేదు ఒకే సమయమందు ప్రతి వస్తు నిత్యము, అనిత్యమును గూడ అయి ఉన్నది దీనిని రజ్జు సర్ప (తాడ-పాము) భ్రాంతి అని అద్వైతములో అన్నారు ఈ అనిత్యస్థితిని నిత్య పరిణామ (change) ప్రవాహముగా బుద్ధుడు చిత్రించాడు ఈ పరిణామమందు ప్రతిదశ అనంతర దశకు కారణమగును అంతేగాక పూర్వదశ ప్రత్యేకత అనంతర దశలోనికి ప్రసరించును అందుచే ఈ పరిణామ పరంపరలో పూర్వదశ అనగా పూర్వవస్తువు, అనంతర దశతో అనగా వస్తుపరిణామ రూపముతో సంబంధము ఉండియు, లేనట్లు కనబడును అపుడు పూర్వవస్తువు నిత్యమా? అనిత్యమా? ఏదీ కాదు, కాని రెండును అగును అనగా ప్రతి వస్తువు ఉన్నది, లేదు, ప్రతిది నిత్యము, అనిత్యము ఒకటి మరొకదానికి కారణమగును ఈ పరివర్తన పరమార్థము దానికి కారణమగును ఈ పరివర్తన పరమార్థము దానికి వెనుకనున్న సత్పదార్థము అది మూలపదార్థము ఈ పరిణామమే

బుద్ధుని ఉపదేశ సారాంశము కాని పరిణామము, వస్తు అనిత్యత గురించి చెప్పి, బుద్ధుడు మూలపదార్థమును గురించి మౌనము వహించెను ఈ నిత్య, అనిత్య లక్షణములను విభజించజాలము రెండు దశల సమన్వయమే వస్తువు స్థితిగా గ్రహించవలెను మనకు గోచరమగు ప్రపంచపు నిత్యరూపము యీ సమన్వయ స్థితియే అనగా తాత్కాలికమైన మధ్యమ స్వరూపము మనకు గోచరమగు ప్రపంచము నిత్యము అని తర్కించుట వృధా ప్రయాసయే అగును దానికి వెనుకనున్న సత్పదార్థము లేక మూలపదార్థమును గురించి బుద్ధుడు ఎందుకు మౌనము వహించెను? దానికి ఒకటే కారణము కనబడును ఆ 'సత్' రూపము మన మనస్సునకు అగోచరము, అతీతము కనబడని విషయమును గురించి ఉదహరించుట వ్యర్థమని భావించినట్లు కనబడును లోకానుభవమునే అతడు సాధనముగా ఎన్నుకొనెను 'సత్' రూపము అనుభవమునకు అతీతమైనది అతీత విషయముల స్వభావమును నిర్ణయించు ప్రయత్నము నిరర్థకము అని అతడు భావించెను వాస్తవమునకు మానవ జ్ఞానము పరిమితమైనది అట్టి పరిమిత జ్ఞానముతో సత్‌పదార్థము ఉన్నది, లేదు అని నిర్ణయించుట అసాధ్యమని గుర్తించక తప్పదు

కాని మానవబుద్ధి ఉదాసీనంగా ఉండదు గదా! ఉపనిషత్కర్తలు 'సత్' పదార్థమున్నది అని స్పష్టముగా ప్రకటించారు నిత్య పరివర్తనకు లోనగుచున్న ఈ ప్రపంచమందు ఆ 'సత్' పదార్థమును (మూల పదార్థమును) దర్శించుట అసంభవమని బుద్ధుడు బావించెను అందుకని గోచర ప్రపంచమును, లోకానుభవమును సాక్ష్యముగా గ్రహించి 'సత్' పదార్థమును గురించి బుద్ధుడు మౌనము వహించెను మరి యీ మౌనమును నాస్తికవాదముగా పరిగణించవలయునా? పరిగణించకూడదనే అనిపించును ఎందుకనగా బౌద్ధవాఙ్మయ పరిశీలనలో బుద్ధుడు ఆది, అంతము లేనిది, అద్వితీయమైనది అయిన పదార్థమొకటి యున్నదని తన శిష్యులకు చెప్పినట్లుగా తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ ఉదహరించారు (Indian Philosophy Vol I P 379)

అయినను నాగసేనుడు మొదలగు అనంతర బౌద్ధతత్త్వవేత్తలు బుద్ధుని మౌనమును నాస్తికత్వముగానే నిశ్చయించారు

నిత్యత్వముతో కూడిన అనిత్యత్వమునకు, క్షణిక వాదమునకు గల భేదమును నిర్వచించి అద్వైత ప్రవక్త శంకరుడు క్షణికవాదమును విమర్శించెను (సూత్రభాష్యము 2-2-2) అంతయు క్షణికమని బౌద్ధవాదము పరిణామములో రెండవ క్షణములో మొదటి క్షణములోనున్న వస్తువుండదు అక్కడ ఏర్పడిన యింకొక వస్తువు పూర్తిగా క్రొత్తది అందువలన రెండవదానికి మొదటిది కారణమని చెప్పుటకు వీలుపడదు ఇక రెండవది మొదటిదాని కార్యమని చెప్పుటకు కూడ వీలుపడదు క్షణికవాదము ప్రకారము అనంతర వస్తువు ఏర్పడునప్పటికి పూర్వవస్తువు అదృశ్యమగును అనంతర వస్తువు పూర్వవస్తువు కారణముచే ఏర్పడినట్లు కాదు శూన్యము నుండి స్థితి ఏర్పడదు ఇది శంకరుల విమర్శ ఈ విమర్శను సమాధానపరచుటకు కొందరు అనంతర బౌద్ధతాత్వికులు పరిణామము వెనుక ఒక నిత్యమైన వస్తువున్నదని అంగీకరించారు (Indian Philosophy P 377 Vol I) మూలాధారము నిత్యమైనది పరిణామము చెందునది వస్తువు గుణవిశేషము అందుచే మొదటి క్షణములో నున్న వస్తువు మరుక్షణములో ఉండదు అని బౌద్ధము చెప్పినది అనుట భావ్యము కాదు అని కొందరు ఆధునిక తత్త్వజ్ఞుల అభిప్రాయము

రెండుగానున్న మనస్సు, శరీరములు పరిణామములో ఒకే భాగము పరిణామము నిరంతరాయము అందలి భిన్నదశల సంబంధరూపములే వస్తువులు జీవము (individual self) నిత్యమైనదే కాని అది చేతనత్వముతో (consciousness) కలిసియుండదు ఈ విశ్వమందు ఏ ఒక్క బిందువు లేక అంశమైనను (point) పరిభ్రమించుచున్న యితర సర్వముతోను సంబంధము కలిగియుండును అట్టి అంశము చేతనమైనపుడు (conscious) దానిని ఒక

జీవమందుము (individual self or subject) దానినే అనగా జీవమునే అనుభవము ఆధారముగా (empirical) నుండు మానవ జీవితము అన్నారు అది పరిణామము చెందుచు పెరుగును శరీరమును గాని పరిణామములకు లోనగు మనస్సును గాని 'ఆత్మ'గా గుర్తించరాదు అని ఉపనిషత్తులు స్పష్టము చేసినవి కాని భౌతిక, మానసిక గుణముల కలయిక ద్వారానే ఒక వ్యక్తి రూపొందుచున్నాడు వస్తువు వలెనే వ్యక్తి కూడ ఒక సంయోజితమే (synthetic compound) బౌద్ధుల దృష్టిలో యిది సంస్కారము మానవుడు కూడ ఒక ద్రవ్యమే అన్నారు కాని అతడు సజీవుడు అనంతర బౌద్ధ తాత్వికులు ఆత్మగాని, జీవముగాని, సత్‌గాని ఏదియు లేదు అన్నారు దేహములో ఏ భాగమునందైనను ఆత్మ ఉన్నదని వెదకుట శుష్క ప్రయత్నమే అగును అన్నారు శరీరమునకు ఆత్మకు సంబంధమున్నదని చెప్పినచో అన్ని కర్మలు ఆత్మయే చేయును అని మానవులు కర్తవ్యములనే మరచిపోవుదురు అని బౌద్ధుల వాదన అపుడు కర్మ సిద్ధాంతమే నిరర్థకమగును అని భావించారు సత్‌రూపమైన పరమాత్మయే జీవాత్మయని విశ్వసించుటకు బౌద్ధులు యిష్టపడలేదు

ఆత్మలేదని బుద్ధుడు నిజముగా విశ్వసించి యున్నాడా? స్పష్ట సమాధానము లభ్యము కాదు ఏలనన ఆత్మను గూర్చి బుద్ధుడు మౌనము వహించెనే గాని లేదు అనలేదు ఆయన అనుచరులు అనంతరకాలములో మౌనమును 'ఆత్మలేదు' అను వాదముగా చిత్రించారు ఆత్మయే సర్వస్వము అని విశ్వసించినచో 'అహం'కారము, 'మమ'కారము వృద్ధి చెందునని తలచి బుద్ధుడు ఆత్మను గూర్చి మౌనము వహించెనేమో చైతన్యము కల ప్రతిది ఆత్మ యనుటకు బుద్ధుడు యిచ్చగించలేదు గోచరమగు గుణములకు అగోచరమగు ఆధారమున్నదనినను అతడు అంగీకరించలేదు

'ఆత్మ' కానిదేదో చెప్పుటకు బుద్ధుడు వెనకాడలేదు కాని 'ఆత్మ'

యేదో మాత్రము అతడు చెప్పలేదు 'ఆత్మ' నిత్యమైనదని విశ్వసించిన వారిని, 'ఆత్మ' నాశనమగును అని వాదించు వారిని - ఇద్దరిలో ఎవరినీ సమర్థించుటకు బుద్ధుడు యిచ్ఛగించినట్లు తోచదు కాని గోచరమగు వస్తువుల వెనుక నిత్యాత్మ ఉన్నదని చెప్పినచొ అది అతీంద్రియ శక్తులను అంగీకరించినట్లగును అని బుద్ధుడు చెప్పెను దుఃఖమయమైన యీ ప్రపంచము ఆత్మకు తగిన స్థానము కాదు అనెను అయినను ఉపనిషత్తుల ఆత్మ సిద్ధాంత విషయమున అతడు మౌనముగానే ఉండెను ఆత్మసత్య స్వరూపము తర్కమునకు అందదు జీవాత్మకు పరమాత్మ మూలము కాని ఆ పరమాత్మ మన జ్ఞానమునకు అగమ్యము, అగోచరము ఆ పరమాత్మ ఉన్నదనుటకు గాని, లేదు అనుటకు గాని ఎవరికైనను అధికారమున్నది కాని బుద్ధుని దృక్పథములో తత్త్వవాదమునకు కొన్ని పరిమితులున్నవి 19వ శతాబ్దములో బుద్ధుని పద్ధతిలోనే భౌతిక, జీవ శాస్త్రజ్ఞులు పదార్థము, జీవములను నిర్వచించు ప్రయత్నము చేయకనే మనస్తత్వ పరిశోధన సాగించారు బుద్ధుడు మనోవికారములను గురించి చెప్పి ఆత్మను గురించి చెప్పుటకు ప్రయత్నము చేయలేదు

స్థూల శరీరంలో గల అన్నమయ, ప్రాణమయ, మనోమయ, బుద్ధిమయ, ఆనందమయమని అయిదు కోశముల లోపలి ఆత్మ వస్తువును ఉపనిషత్తులు కనుగొనినవి ఒకవేళ బుద్ధుడు దానిని అంగీకరించి యుండినను, బయటకు చెప్పలేదు ఆత్మ అంగుష్ఠమాత్ర ప్రమాణము కలిగియుండునని, మరణ సమయమున అది బ్రహ్మరంధ్రము నుండి దేహమును విడిచిపోవునని ఉపనిషద్వచనము దానిని బుద్ధుడు తిరస్కరించెను ఆత్మ నిరూపించుటకు సాధ్యము కాదు కాని అన్నిటికి మనలోనున్న అదియే సర్వసాక్షి మరియు కర్త అని మనము గ్రహించవలసియున్నది బుద్ధుడు కాలానుకూల లౌక్యముతో ఆత్మయున్నది లేనిది నిర్ధారించలేదని పూర్వబౌద్ధులు అంగీకరించి అతని మౌనము అపార్థములకు దారితీసినదని కూడ భావించారు అని సర్వేపల్లి

రాధాకృష్ణ అన్నారు

బౌద్ధ తత్త్వవేత్త నాగార్జునుడు ఆత్మ లేదనునదే సత్యము, యిది బోధపడుట యోగ్యత లేని వారికి కష్టమని, బుద్ధుడు యీ సత్యమును చెప్పలేదు అన్నాడు బుద్ధుని ఉపదేశముల భాష్యకారులైన నాగసేనుడు, బుద్ధఘోషు, ఆత్మను గురించి బుద్ధుని మౌనమును నాస్తిసత్వముగానే వ్యాఖ్యానించారు వస్తువు ప్రదర్శించు గుణముల వెనుక నిత్యమైనదని ఏమియు లేదు అన్నారు కొన్ని గుణముల సంపుటి శరీరము అట్లే కొన్ని మానసిక అవస్థల సంపుటి ఆత్మ అన్నాడు నాగసేనుడు అంతకు మించి ఆత్మకు ఏ విధమైన ప్రత్యేకత, అతీత లక్షణము అతడు అంగీకరించలేదు 'ఆత్మ'యను పదమే శుష్కమైనది అన్నాడు

మనస్తత్త్వ శాస్త్రజ్ఞులు 'ఆత్మ'ను అంగీకరించరు విభిన్న భావముల సంపుటమే 'ఆత్మ'యను ఒక అలంకారపదము అన్నారు ఆత్మశబ్దము దేనిని నిర్ణయించదు మనకు తెలియునవి దాని భావములు మాత్రమే అన్నారు పూర్వబౌద్ధులు చెప్పినటులే వీరు కూడ 'ఆత్మజ్ఞానము'ను వ్యతిరేకించారు బాహ్యవస్తువునకు భిన్నమైన అంతరికమైన నిత్యమైన వస్తువున్నదనుట మూఢవిశ్వాసము మాత్రమే అన్నారు

ఆత్మ విచిత్రమైనది ఇట్టి సులభ వాదములతో అది పోదు మానసిక అనుభవములు భిన్నముగా నుండును వాటిని సమన్వయించి ఏకత్వము కలిగించునది మనస్సు కానిది ఒకటి ఉండవలయును అదియే ఆత్మ ఆత్మకార్యమైన సమన్వయము లేనిచో పరస్పరము అన్వయము లేని భిన్నభావసంపుటి వలన జ్ఞానము కలుగదు మన అనుభవములనగా భావములే గాని, వస్తువులు కావు ఇది తాత్త్విక సత్యము శంకరాచార్యులు తన సూత్రభాష్యములో దీనిని స్పష్టము చేసినారు (2-2-18 నుండి 32 వరకు) మన అనుభవము క్షణికము గాదు అది ఒక వ్యక్తికి చెందినది ఆ వ్యక్తి

లేనిచో గత స్మృతి సాధ్యము కాదు ఒక క్షణమున జరిగినది మరొక క్షణములో స్మృతికి వచ్చును ఈ జరిగినది అనగా అనుభవము క్షణికమైనచో నిన్నటిది నేడు స్మరణకు వచ్చు అవకాశముండదు అందుచే మన అనుభవములు క్షణకములు కానేరవు అని శంకరులు క్షణికవాదమును ఖండించినారు నిన్న జరిగిన దాని నేటి స్మృతి భ్రాంతియని వాదించినచో నిన్నటిది క్షణికమగును కాని క్షణికములో రెండు వస్తువులు వాటి సమానత్వము ఉండదు కాని యిచట నిన్న జరిగినది, నేటి దాని స్మృతి అను రెండు వస్తువులు (భావములు) ఉన్నవి వాటికి సమన్వయమున్నది రెండు వస్తువులు లేనిచో సమన్వయమునకు (సమానత్వమునకు) అవకాశముండదు క్షణికవాదము అంగీకరించినచో నిన్నటిది నేడు ఉండదు కాని యిచ్చట రెండు కలవు ఈ విధముగా భూత వర్తమానముల అనుభవమును ఏకదిశకు తెచ్చి సమన్వయించుటకు ఒక నిత్యద్రష్ట (చూచువాడు) ఆవశ్యకత ఉన్నది 'నిన్నటి', 'నేటి' అనుభవముల సమానత్వము వలన 'స్మృతి' కలిగినది అనినను ఆ సమానత్వమునకు ఒక ద్రష్ట కావలయును లేనిచో అనుభవ సమన్వయము, జ్ఞానము, స్మృతి సాధ్యము కావు అని అన్నాడు శంకరుడు ఆ ద్రష్టయే ఆత్మ

ఆత్మను గూర్చి తాత్త్విక సిద్ధాంతమెట్లున్నను బౌద్ధులు మాత్రము మానవజీవితమునకు నిత్యమైన ఆత్మకు సంబంధము లేదనియే వాదించారు ఒకవేళ నిత్యమైన ఆత్మ ఉన్నదని అంగీకరించినను అది జీవితములో నిష్ప్రయోజనమైనదన్నారు

ఉపనిషత్తులందు జీవాత్మ లక్షణములు, నామము, రూపము చెప్పారు నామమనగా ప్రాతిపదికము లేక ఒక వస్తువునకు వాడుకలో నున్న పేరు [నామము మానసిక స్థితికి చెందినదని, రూపము భౌతిక పదార్థాంశములకు చెందినది] అని అన్నారు నిర్గుణ బ్రహ్మ ప్రకటితమగుటకు యీ నామరూపములే ద్వారములు బౌద్ధులు జీవాత్మను బహిరంగముగా అంగీకరించకున్నను,

వ్యక్తిత్వమును వారు కూడ నామరూపములుగానే విభజించారు జీవనిర్మాణములో మనస్సు ఒక ఏకత్వమును కలిగియున్నది మనస్సు కొన్ని శక్తుల కలయిక మనస్సు శరీరములు పరస్పరము ఆధారపడియున్నవి అన్నారు స్థూలమైనది (gross) అనగా బయటకు కనబడునదియే రూపము సూక్ష్మమైనది నామము (subtle) ఒకటి లేనిది మరొకటి లేదు ఉదాహరణగా కోడిగ్రుడ్డు చెప్పారు కోడిగ్రుడ్డు పెట్టినప్పుడు గ్రుడు, పైన డొల్లను (shell) విడిగా పెట్టదు రెండు కలిసియే గ్రుడ్డు అగును దాదాపు అన్ని భారతీయ తత్త్వ సిద్ధాంతములు మనస్సును ఒక అవయవముగానే గుర్తించినవి బౌద్ధులు గూడ అటులే విశ్వసించారు

మానవ వ్యక్తిత్వము నామరూపముల అనగా మనస్సు శరీరములచే కల్పించబడిన భావముల సమూహము అన్నారు బయట కనబడు ప్రపంచమంతయు రూపము అని, మనసులో నున్నది మరొక ప్రపంచమని అన్నారు పూర్వబౌద్ధులు (అనగా బుద్ధుని కాలమువారు) మనస్సును గూర్చి యింతకు మించి తెలుసుకొను ప్రయత్నము చేసినట్లు కనబడదు వారి దృక్పథము ప్రధానముగా నైతికము వారు తమ భౌతికరూపము ఆధారముగా జగత్తును గురించిన నిర్ణయములు చేయ ప్రయత్నించారు

చిత్తము (బుద్ధి), విజ్ఞానము (లేక తర్కశక్తి), మనస్సు నామమునకు సంబంధించినవిగా చెప్పారు మనస్సు, శరీరములందు కొంత స్థిమితము గలది దేహము అన్నారు మనస్సునకు యీ స్థిమితము తక్కువ మనస్సునందు సంజ్ఞావేదన, విజ్ఞానములున్నవి అన్నారు ఇంద్రియములు, మనస్సు దర్శించునవి, వాటికి సంబంధించిన వాటిని గ్రహించు శక్తిని సంజ్ఞా విభాగమని, వేదనమనగా ఇంద్రియముల కార్యము లేక అనుభవము (feeling) అనగా మానసికానుభవము అన్నారు విజ్ఞానము బాహ్య వస్తువులతో ఇంద్రియ స్పర్శచే మానసికానుభవములను కలిగించును తృష్ణకు యిదియే కారణమగును

మనస్సుకు స్పష్టమైన గ్రహణశక్తి యున్నది  వివిధ పరిణామదశలందు అనేకములైనవి పరంపరగా మనస్సుచే గ్రహించబడును  ఈ గ్రహించు శక్తి అనగా సంజ్ఞా  గ్రహించబడునది యింద్రియ విషయము కావచ్చు లేదా మానసిక విషయము కావచ్చును

మానసికముగా దర్శించు దానిని ధర్మము అన్నారు బౌద్ధులు మనస్సు ఒక భౌతిక అవయవము అన్నారు  అది వేదనముల నుండి అనగా అనుభవముల నుండి (feelings) భావమును, అర్థమును కల్పించుకొనును అది యెట్లు జరుగునో మనకు తెలియదు  ఇంద్రియముల ద్వారా కలుగు అనుభవమును అర్థముతోను భావముతోను కూడిన జ్ఞానముగా మనస్సు ఎట్లు మార్చునో బౌద్ధులు వివరించలేదు  కాని అట్టి మానసిక దర్శనమును ధర్మము అన్నారు  ఇంద్రియము అనగా విషయి తెలియబడిన అంశము లేక గోచరించిన వస్తువుతో అనగా విషయముతో కలిసినపుడు అనుభవము లేక వేదనము ఏర్పడును (feeling)  ఇదే విషయి, విషయ సంబంధము  అనగా ఇంద్రియము, విషయముల స్పర్శ (contact)  అప్రయత్నముగా ఇంద్రియము, విషయముతో కలిసినపుడు ఏర్పడు మానసిక దశల ఫలితమును విజ్ఞానము అన్నారు నేత్రము (ఇంద్రియము) వేరు, వస్తువు వేరు  ఆ రెండు కలిసినపుడు (దృష్టి ద్వారా) ఆ బాహ్యరూపము ఇంద్రియముపై తన ప్రభావము చూపును  దాని ఫలితముగా వ్యక్తిలోని ఆంతరిక రూపము (మనస్సు) మార్పునకు లోనగును  ఈ మార్పు పర్యవసానమే జ్ఞానము అని భావించారు  అనగా ద్రష్టకు (చూచువానికి) దృశ్యమునకు గల సంబంధము విజ్ఞానము

ఆధునిక మనస్తత్వశాస్త్రములో సంకల్పము (will) ఎంతో ప్రాధాన్యము వహించినది  వేదనము (అనుభవము feeling), స్మరణ (recognition) ల వలెనే సంకల్పము కూడ ప్రధానమైనదే  మానవ జీవితమునకు విజ్ఞానము ప్రధాన ఉపకరణము  విజ్ఞానమునకు సంకల్పము ప్రధానాంశము  బౌద్ధులు

చెప్పు దానిని బట్టి విజ్ఞానము జ్ఞానమునకు, వేదనము అనుభవమునకు, సంస్కారము సంకల్పమునకు పర్యాయపదములుగా చెప్పవచ్చును కోరిక, ప్రయత్నము సంకల్ప లక్షణము ప్రయత్నము సంస్కారమునందు యిమిడియున్న శక్తి నైతిక ప్రవృత్తి సంకల్పము యొక్క ఫలితము అన్నారు నైతికమునకు విరుద్ధముగా నుండు మానసిక లక్షణములకు సంకల్పములే కారణము అన్నారు అహంకారము తృష్ణ, నీచకామము మొదలైనవి అన్నియు సంకల్ప (will) వికార రూపములే సంకల్ప లక్షణము లేక ఉద్దేశపూర్వక క్రియా లక్షణము మానసిక జీవితములో ప్రధాన అంశము అని ఆధునిక మనస్తత్వ శాస్త్రము (modern psychology) చెప్పుచున్నది సంకల్పమునకు కొన్ని సమయములందు సిద్ధాంతపరంగాను, కొన్ని సమయములందు అనుష్ఠాన పరంగాను (practical) బౌద్ధులు ప్రాధాన్యమునిచ్చిరి సంకల్పము (will), సంకల్పము యొక్క బాహ్య, అంతరక్రియారూపములే జ్ఞానము అన్నారు సంకల్పాత్మకమే మానవజీవితం కావున, లక్ష్యమును సాధించుటకు చేయు ప్రయత్నమే సంకల్పమనబడును (will) సంకల్పములోనున్నది కార్యము అనగా సంకల్పము క్రియాత్మకము క్రియకు ఆటంకము ఏర్పడినపుడు ఆలోచనారూపములో జ్ఞానము పనిచేయును ధ్యానమునకు గమ్యం ఆనందం ఇది కూడ సంకల్పపరిణామమే అన్నారు ఇచట ధ్యానమే సంకల్పము యొక్క క్రియారూపము భావము సంకల్పము నుండి వేరుకాదు అది అన్ని క్రియలను అనుసరించును

ఇంద్రియాలకు అతీతమైనది 'ఆత్మ' బౌద్ధ తత్త్వములో 'ఆత్మ'కు స్థానము లేదు కాని దాని స్థానమును విజ్ఞానమునకు యిచ్చినట్లు కనబడును జన్మల పరంపరలో విజ్ఞానము తోడువచ్చునదిగా చెప్పారు విజ్ఞానం నిత్యమైనది, మార్పులేనిది కాదు జన్మనుండి మరొక జన్మకు ప్రయాణించు వ్యక్తిత్వము కాదు అది క్షణికమైన అనేక దశాపరంపర ప్రవాహము విజ్ఞానదశ లేక స్థితులు అనుభవము (వేదనము)తో సంబంధము లేనివి భౌతిక స్థితుల

ఆవశ్యకత వీటికి లేదు

బౌద్ధుల మనస్తత్త్వ సిద్ధాంతము చెదిరిన అనేక విషయములను ఒకచోటకు చేర్చి సంబంధము కల్పించబడినదిగా కనబడును బౌద్ధులు ప్రతి ధర్మమునకు ఆధారము లక్షణము (స్వభావము) అన్నారు ఆ లక్షణములు విజ్ఞానమునకు కారణములగును కాలానుగుణముగా బౌద్ధులు దానికి కారణము (హేతువును)ను ప్రకటించారు కొన్ని దృశ్యములు చూచినపుడు వాటికి సమానమగు భావములు మనస్సునందు కలుగును అట్లు ఎందుకు కలుగును? అవి భావముల స్వభావము అగుటచే అన్నారు ఆధునిక భౌతిక శరీర తత్త్వశాస్త్రము (Physiological Psychology) ప్రకారము ఆ స్వభావము నరముల అభ్యాసము అని చెప్పబడినది

మానసిక దశలు పరిణామముతో కూడినవి ప్రతి దశకు మూడు స్థాయిలు చెప్పారు (పుట్టుక, స్థితి, భంగము (genesis, development and dissolution)) ఇందు ఒక్కొక్కటి అతిసూక్ష్మకాలమే యుండును ఆ సూక్ష్మకాలమును చిత్తదశ అనవచ్చును అనగా పుట్టుట, స్థితి కలుగుట, నాశము - యీ మూడును కలిసి చిత్తక్షణమగును అది పేరుకు మాత్రమే క్షణము ఎందుకనగా నిజానికి అది క్షణకాలము కూడ ఉండదు బౌద్ధ మనస్తత్త్వశాస్త్రము మానసిక దశలను గురించి చెప్పినది అంతవరకు బాగుగనే యున్నది కాని సంకల్పము, శ్రద్ధ (will, attention) మొదలగు వాటి గతి లేక గమనమునకు ఒక నాయకుడు లేక ద్రష్ట అవసరమున్నదా లేదా అను విషయమును వారు గ్రహించినట్లు కనబడదు అనుభవములు, సంబంధములను గురించి (feelings and relations) చెప్పిరి గాని వాటిని సమన్వయించుటకు వలసిన ఒక చేతనత్వమును గురించి (consciousness) చెప్పలేదు బాహ్యావస్తువులతో ఇంద్రియ స్పర్శచే మానసికానుభవము కలిగించునది విజ్ఞానము అన్నారు భిన్న మానసికావస్థల కూటమి దీనికి కర్త అని భావించారు

నామము, రూపముల వలన అనగా మనసు, శరీరముల వలన చర్యలు అనగా క్రియ జరుగును కాని యివి (నామరూపములు) అనేక పరిణామముల కలయిక ఇంద్రియ స్పర్శచే మానసికానుభవము కలుగును కాని స్పర్శ అనుభవించునది ఎవరు అని ఆలోచించక, ఆ స్పర్శకు ఆధారము ఏమి అని మాత్రమే ఆలోచించవలయును అన్నారు మనకొక వ్యక్తిత్వమున్నదనుకొనుట ఒక భ్రాంతి మాత్రమే అన్నారు కాని పునర్జన్మ పొందుట, నిర్వాణము పొందుట అనుటలో భావమేమి? దానికి సమాధానముగా యిలా అన్నారు కొన్ని భిన్నస్థితుల సమూహము ఒక వృక్షము దానికి ఫలము కలిగినపుడు "వృక్షము ఫలించినది" అని చెప్పుదురు అటులే మానవుడు విభిన్న స్థితులు సమూహ (కలయిక) రూపము ఆ రూపము సుఖము కాని దుఃఖము కాని పొందినచో ఆ మానవుడు సుఖమును లేక దుఃఖము పొందెను అని చెప్పెదరు మానవుని వర్తమాన దశ గతించిన దశ కాదు అయినను వర్తమానము గతము నుండి వచ్చినదే కనుక అది దశ పరంపరకు ఫలితముగానే చెప్పవలయును అన్నారు

నిత్యమైన ఆత్మలేదు అను బౌద్ధుల విశ్వాసములోనే పునర్జన్మ విషయము స్పష్టమగుచున్నది అని తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ భావించారు నిత్యాత్మ లేనపుడు పాపపుణ్యఫలముల అనుభవము ఎవరికి చెందును? ఫలానుభవ సమయమునకు పాపము చేసినవాడు లేడు అనగా మరణించెను పునర్జన్మ రూపమున ఆ కర్మఫలము అనుభవించుటకు వేరొకడున్నాడని చెప్పినచోనెట్లు సంభవమగును దీనికి బౌద్ధుల సమాధానమిది శిక్షానుభవ సమయమునకు జీవసమానత్వము (living complex) ఉండును ఈ జీవి నియమము లేని, పరస్పర సంబంధము లేని దశాపరంపర కాదు "అది యొక భౌతిక, నైతిక, సజీవదశాసంపుటి" చనిపోయినవాడు పునర్జన్మ పొందినవాడు కాదు కాని వారిరువురి మధ్య ఎక్కువ భేదముండదు చచ్చినవాని నుండియే తిరిగి జన్మ పొందినవాడు పుట్టును "ప్రతి దినము మనము నూతన పురుషులమే కాని పూర్తిగా నూతనులము కాము" బాల్యదశ నుండి పెరిగి

పెద్దవాడైన తరువాత ఆ వ్యక్తి బాలుడు కాడు కాని ఆ బాలుడు అతడు కానిచో అతడు లేడు, అతని తలిదండ్రులుండరు ఇటులే "ఎడతెగని మార్పులో, ఎడతెగని అవిచ్ఛిన్నత్వమున్నది" (continuity) దశాపరంపరల నుండి పూర్ణవ్యక్తి లభించును ఉదాహరణగా బౌద్ధులు పాలు పెరుగు చెప్పారు పుల్లని పెరుగు పాల నుండి రాలేదు కాని అసలు పాలు లేనిచో పుల్లని పెరుగు రాదుకదా! అదియే సమానత్వము అన్నారు ఇది అంతయు దశల పరంపర సమానత్వముగాని, భిన్నత్వము గాని యేదియు పూర్ణము కాదు పూర్వము ఏర్పడినది అనంతరమేర్పడినది రెండును సన్నిహితములే అందుచే రెండును ఒకటిగానే భావించవచ్చును ఇదే విధముగ కర్మ కూడ ఎడతెగనిదే (continuous) పునర్జన్మ నూతనమే ఉపనిషత్తులలో చెప్పబడిన జీవాత్మ నిత్యమైనది కాని అది అనిత్యమైన జీవరూపమున (body) సంసారమను చక్రమున పరిభ్రమించును పుణ్యపాపకర్మ ఫలములను అనుభవించును జీవాత్మ పునర్జన్మములకు ఏకత్వము కల్పించును 'అనిత్యత' (impermanence) 'కారణధర్మము' (causality) వలన క్రియతో కూడిన 'జీవ'భావము పరిణమించినది ప్రతి అనుభవము అనంతర క్షణములో కలుగు అనుభవముతో కూడిన జీవితములో కలిసిపోవును ఇట్లు గత అనుభవమంతయు సూక్ష్మరూపమున వర్తమానములోనికి ప్రవహించును బౌద్ధుల సిద్ధాంతము ప్రకారము స్మృతి (memory) యనునది ప్రత్యేకముగ ఏమియు లేదు గతము తన ముద్ర వర్తమానముపై వేసి అదృశ్యమగును

దుఃఖమయమైన జీవ (జీవిత) ఉత్పత్తి, దాని నాశమునకు కారణములను అనులోమ, విలోమక్రమమున బుద్ధుడు చెప్పియున్నాడు అనులోమ అనగా ఆరోహణ క్రమములో అజ్ఞానము నుండి సంస్కారములు, సంస్కారముల నుండి విజ్ఞానము, విజ్ఞానము నుండి నామరూపములు, నామరూపముల నుండి ఆరు ఇంద్రియములు అనగా చర్మము, కళ్లు,

చెవులు, నాలుక, ముక్కు (యీ ఆరు జ్ఞానేంద్రియములు sense organs), వీటి నుండి సంయోగము, దాని నుండి వేదనము, దాని నుండి కామము, దాని నుండి అనుబంధము, దాని నుండి పరిణామము, దాని నుండి జననము, దాని నుండి ముసలితనము మరణములు, వియోగము, దుఃఖము, నిరాశ ఏర్పడుచున్నవి ఇవి ఒకదాని నుండి మరొకటి ఏర్పడుటచే అనులోమక్రమము (direct order) తిరిగి అజ్ఞానము నశించినపుడు విలోమక్రమములో ఒకటి తరువాత మరొకటి అన్నియు నశించును ఇది అవరోహణం (reverse order) పైన చెప్పినవి దుఃఖపరంపరకు మూలకారణములు కామమునే అజ్ఞానము అన్నాడు బుద్ధుడు అజ్ఞానము నశించినపుడు కామము పూర్ణముగా నశించును అపుడు వరుసగా సంస్కారములు, విజ్ఞానము, నామరూపములు, జ్ఞానేంద్రియములు, అనుబంధము, వేదనము, తృష్ణ, సంయోగము, పరిణామము ఒకటి నశించగా మరొకటి క్రమముగా అన్నియు నశించును అపుడు జన్మము నశించును దానితో ముసలితనము, మరణము, వియోగము, దుఃఖము మొదలగునవి నశించును దీనినే దుఃఖపరంపరను నాశనము చేయు విధానము అన్నారు బుద్ధుడు దీనిని బహుక్లుప్తముగా చెప్పెనని, అనంతర కాలముననది విస్తృతపరచబడినదని తాత్త్విక విమర్శకుల అభిప్రాయము ఇందలి భావము బహుక్లుప్తము మానవ జీవితం సంసార బంధమున తగుల్కొని యున్నదని, దాని నుండి బయటపడుటకు అవకాశమిది అని దాని భావము ఉపనిషత్తులు కూడ సంసారమును బంధముగానే చెప్పినవి సంసారచక్రమనబడు ప్రవాహమున నున్న వివిధ అంశములే గత, వర్తమాన, భవిష్య జీవితములుగా రూపొందుచున్నవి జీవస్వేచ్ఛ జీవితమునకు మూలము అది నశించుటయే నిర్వాణము ఇదియే బౌద్ధతత్త్వము బౌద్ధము చెప్పినది అతిచిన్నదైన సత్యము ''జన్మమెత్తుటయే మానవుడు చేసిన మహాపాపము'' ఇది కారణధర్మముగా విస్తరింపబడినది విజ్ఞానమే 'అహం' కారము అది నిత్యమైన 'ఆత్మ' లోనిది కాదు కారణము - కార్యము వలన

ఏర్పడు దశాంపరంపరయే విజ్ఞానము లేక 'అహం'కారము ఇది క్లుప్తముగా బౌద్ధ సిద్ధాంతము మనలను అంటిపెట్టుకుని ఉన్న 'అహం'కారము అవిద్య వలన ఏర్పడిన ఒక అనిత్యరూపము 'అహం'కారమున్నంత కాలము 'అవిద్య' యుండును వ్యక్తి కర్మల ద్వారా దుఃఖమును కలిగించుకొనుట కాదు అసలు విషయం వ్యక్తియే (individual) అనగా జీవియే దుఃఖము యొక్క రూపము 'అహం' భ్రాంతిని కలుగజేయును కాని ఆ 'అహం' కూడ ఒక భ్రాంతియే అన్నారు ఉపనిషత్తులు గూడ ఆత్మను గూర్చిన అజ్ఞానము ఉన్నంతవరకు యీ జీవుని రూపముండును అనియే చెప్పినవి 'అహం' అను భావమే అజ్ఞానమునకు మూలము 'అహం' నశించినపుడే అజ్ఞానము నశించును అజ్ఞానవశముచే ప్రపంచమంతయు దుఃఖవశమగుచున్నది

పుట్టుట, పెరుగుట, వ్యక్తిత్వము పొందుట యివి అన్నియు అవిద్య (అజ్ఞానము) నుండి యేర్పడినవే అన్నాడు బుద్ధుడు కాని యీ అవిద్య ఎట్లు వచ్చినదో మాత్రము చెప్పలేదు జీవపరిణామము ఒక ప్రవాహము దానికి కారణము అవిద్య - అట్టి అవిద్యకు పూర్వము ఏమియును లేదు ఎందుకనగా సృష్టి పరిణామమునకు 'ఆది' లేదు అన్నాడు కారణధర్మముల పరంపరలో అజ్ఞానమును మొదటగా చెప్పాడు దానికి కారణమొకటే కన్పడును అవిద్య నుండి సంకల్పము కలిగి సంకల్పము నుండి 'అహం'కారము ఏర్పడును అజ్ఞానము అనగా నేమిటి? 'నేను' గురించిన అసంపూర్ణ భావనయే అజ్ఞానము అన్నాడు ఉపనిషత్తులు కూడ 'అవిద్య'ను గూర్చియే చెప్పినవి కాని జీవాత్మ పరమాత్మ యొక్క రూపము అని తెలియకుండుటయే అవిద్య అన్నవి అవిద్యయే 'అహం'భావమునకు అటుపై దుఃఖమునకు మూలకారణము అని చెప్పినవి

అజ్ఞానము నశింపవలయును, నశించును అన్నాడు బుద్ధుడు అందువలన అది సత్యము, నిత్యము కానేరదు అట్లని అది అసత్యము కూడ

కాదు ఎందువలనన దాని నుండి మరికొన్ని కలుగుచున్నవి అసత్యమైనచో అవిద్య మరి దేనికి కారణము కాజాలదు బుద్ధుని దృక్పథములో అవిద్య జీవస్థితికి కారణము ఉపనిషత్తులలో చెప్పినది యింక స్ఫుటముగాను, పరమసత్యముగాను ఉన్నది

ఎన్నో రూపములతో కూడినది యీ ప్రపంచము దానికి రెండు శక్తులున్నట్లుగా చెప్పబడినది అది సత్యమును ఆవరించి దానిని అగోచరము చేయును అదియే మరల ఆ సత్యమును గోచరము చేయును ఈ శక్తి అనాత్మరూపము (ఆత్మకానిది) కాని ప్రపంచము యొక్క యీ శక్తిని గుర్తించుటకు అన్నిటికి కేంద్రమైన ఒక స్థితిని (central being) గుర్తించవలసి యుండును లేనిచో అవిద్యకు కారణమును గ్రహించలేము అవిద్య పూర్తిగా నిష్ప్రయోజకమైనదా అనినచో కాదనియే చెప్పవలయును అవిద్య వలననే మోక్షసాధనకు అవకాశము కలుగును అనగా అవిద్య తొలగించుకొనుటయే ఆ సాధన నిర్వాణము నాశనమునకు అతీతమైనది, సత్యమనునది దాటిపోవు ఒక ఛాయకు (passing shadow) మించినది, అని చెప్పినచో, 'అహం' అను వ్యక్తిత్వము పూర్తి అనాత్మ (non-being) కానేరదు అందుచే వ్యక్తిత్వము 'ఆత్మ-అనాత్మల' సమ్మేళనము లేక మిశ్రమము అవిద్య అనగా జ్ఞానము లేకుండుటనియే అర్థము గాని అది అసత్యము అని కాదు అవిద్య నశించినచో సత్యము కనబడును అనంతర కాల బౌద్ధ తాత్వికులు అవిద్య హఠాత్తుగ ఏర్పడినది అన్నారు విశ్వసంకల్పము నుండి జీవసంకల్పము లేక వ్యక్తి సంకల్పము (individual will) అటులే హఠాత్తుగ సంభవించినది అని చెప్పారు విశ్వమానసము (universal mind) ఉన్నది ఒకటి మాత్రమే దాని నుండి ఏర్పడిన అసంపూర్ణ ప్రతిబింబములే భిన్నవ్యక్తులు అన్నారు అవిద్య అను శక్తి విశ్వశక్తి నుండి వివిధ వ్యక్తిత్వములను రూపొందించును అని విశ్వసించారు పరమసత్యము అను కేంద్రమునందున్న వ్యతిరేక స్వభావమే (Negativity) అవిద్య అన్నారు సత్యము దాని లోపల నుండును అవిద్య

ఆవరించి యుండుటచే సత్యము గోచరించదు బౌద్ధతత్త్వము ఉపనిషత్తులకు అనుకూలముగా నున్నట్లు కనబడును కాని 'ఆత్మ' విషయమున అనిశ్చితము దానిని ఉపనిషత్తులకు దూరము చేయుచున్నది పరిపూర్ణమైన 'సత్' పదార్థమున్నదని ఆమోదించినచో, బౌద్ధతత్త్వము ఉపనిషత్తుల ఆమోదమును పొందును

దుఃఖవిమోచనమే బుద్ధుని ఉపదేశసారము జీవితములో దుఃఖము నుండి విమోచనము పొందుటకు నైతిక వర్తనము ప్రధానము మోక్షమునకు 'అహం' నశింపజేయాలి బౌద్ధ నీతికి ఆధారము మనస్తత్వము బౌద్ధ మనస్తత్వము విస్తృతమగుటకు నీతి, నిరూపణయే కారణము బౌద్ధులు ఆత్మ సిద్ధాంతమును నిరసించారు దానికి కూడ నైతిక ఉద్దేశమే కారణముగా కనబడును బౌద్ధ సిద్ధాంతము ననుసరించి సంకల్పము (will) మానవుని విశిష్ట లక్షణము అతని నైతిక వ్యక్తిత్వమునకు సంకల్పమే ఆధారము తృష్ణయే జన్మకు కారణమని బౌద్ధ కర్మ సిద్ధాంతము చెప్పుచున్నది నైతిక నియమములు కూడ అదియే చెప్పుచున్నవి మంచి సంకల్పమే అత్యంత విలువైనది అని బుద్ధుడు చెప్పియున్నాడు నైతిక నియమములచే సంకల్పము విశిష్టమగును అనెను కర్మయందు ఆసక్తి నశించినపుడు 'అహం'కారము నశించును ఇంద్రియ సుఖములందు ఆసక్తి నశించినపుడు కర్మ కూడ నశించును జన్మ పరంపర నుండి నిత్యానంద స్థితిని పొందుటయే బౌద్ధమత లక్ష్యము

కర్మ బుద్ధి, సంకల్పములు రెంటికి చెందియున్నది కర్మ ఒక మానసిక ఉద్దేశము కర్మ కార్యముగా రూపొంది ఫలితమునిచ్చును ప్రతి కర్మకు మనోనిశ్చయము లేక సంకల్పము, కార్యము జరుగుట, కార్యము వలన అసంతృప్తి అను స్థాయిలుండునన్నారు తృష్ణను, మోహమును తొలగించు కర్మలు సత్కర్మలు దుఃఖఫలితములనిచ్చునవి దోష కర్మలుగా విభజించారు పరోపకారములు సత్కర్మలు స్వార్థముతో కూడిన విదుష్కర్మలు

రాగము గాని వైరాగ్యము గాని మితిమించి యుండరాదు అన్నాడు బుద్ధుడు ఇంద్రియ లోలత్వము, కఠిన తపస్సు, ఉపవాసములు రెండు పద్ధతులు విపరీతములని బుద్ధుడు తిరస్కరించినాడు అతడు మధ్యమార్గమును అనుసరించాడు అదియే అష్టాంగయోగము 1 సక్రమ విశ్వాసము, 2 సక్రమ ఆశయము, 3 సక్రమ వచనము, 4 సక్రమ ప్రవర్తనము, 5 సక్రమ జీవన ప్రవృత్తి, 6 సక్రమ ప్రయత్నము, 7 సక్రమ మనఃప్రవృత్తి, 8 సక్రమ సంతోషము దీనినే బౌద్ధమత 'అష్టాంగ నీతిధర్మము' అన్నారు

వ్యక్తి తాను యితరము కంటే వేరైన జీవమును అను భావమును కలిగించు జ్ఞానము అని చెప్పబడిన వ్యవహార దృక్పథమును అణుసమూహమైన అనగా పంచభూతముల రూపమైన శరీరము కలిగించును విజ్ఞానము, ప్రజ్ఞ లేక అంతరదృష్టి (insight) మానవ ఆలోచనల భిన్నరూపములని అనంతర (later) బౌద్ధులు భావించారు తాను ప్రత్యేక జీవమును అను భావము, విశ్వజీవముతో కలిసినపుడు ప్రజ్ఞ అను జ్ఞానము ఏర్పడును అన్నారు ప్రజ్ఞ (అంతరదృష్టి insight) ఉన్నతస్థాయి జ్ఞానము అజ్ఞానము నుండి విజ్ఞానము అటుపై ప్రజ్ఞను పొందుటకు ప్రయత్నించవలయును అన్నారు

బౌద్ధములో మనోశిక్షణ ప్రధానాంశము శిక్షణ అనగా శిక్ష కాదు మనోశిక్షణ ఉద్దేశము ఇంద్రియములను అణచివేయుట కాదు సత్యమును గ్రహించు సాధన వాటికి కల్పించుటయే మనోశిక్షణ అన్నాడు బుద్ధుడు ఇంద్రియములను శిక్షించినచో అవి బలహీనమై పనిచేయుట మానుకొనును సత్యనిర్ణయమునకు వాటిని ఉపయోగపడేట్లు చేయటమే సరియైన ఇంద్రియ శిక్షణము అన్నాడు బుద్ధుడు ఇంద్రియ జ్ఞానమును, బుద్ధిని వికసింప చేయుటయే వాటిని సంస్కరించుట అగును అపుడే నిజమగు ఆత్మదృష్టి కలుగును 'ప్రజ్ఞ' స్థితి యందు 'సత్' లేక పరమాత్మ దర్శనము కలుగుటకు అవకాశమున్నదని ఉపనిషత్తులు చెప్పును మరి 'ప్రజ్ఞ' గూర్చి చెప్పునపుడు

'సత్'ను బుద్ధుడు అంగీకరించినటులే కనబడును అయినను పరిపూర్ణ 'సత్' దర్శనమును గూర్చి అనగా దివ్యదృష్టిని గురించి స్పష్టముగా చెప్పుటకు బుద్ధుడు ఎందువలననో వెనుదీసినటుల కనబడును దానికి బదులు మానసిక దశా విశేషములను చెప్పియున్నాడు ప్రజ్ఞ దశ తరువాత ధ్యానము, నిశ్చల సమాధి అన్నాడు ప్రార్థనకు బదులు ధ్యానమును ప్రవేశపెట్టినట్లు కనబడును దైవకృప కొరకు ప్రార్థన నిర్హేతుకము అని బౌద్ధభావన 'స్వయంశిక్షణ' యే సర్వమునకు ఆధారము అన్నారు స్వయంకృషికి, స్వయం వికాసమునకు పరిపూర్ణమైన స్వేచ్ఛ మానవునకున్నది అన్నారు "తనను తాను జయించిన వానిని ఎవ్వడు జయించలేరు" అన్నారు "తన 'అహం'కారమును నాశనమొనర్చుకొనిన వానిని దేవతలైనను జయింపలేరు" అని ఉద్ఘాటించారు మతముతో సంబంధము లేని సర్వమానవ ప్రేమను పెంపొందించు మనో (చిత్త) శిక్షణమును బుద్ధుడుపదేశించెను

దేహమును నిగ్రహించుటయే జ్ఞానసాధనము అన్నాడు నిగ్రహించుట అనగా తపస్సు, ఉపవాసము కాదు తపమునకు బదులు జ్ఞానమునిచ్చు మానసిక దశలను గురించి చెప్పాడు ధ్యానము వలన చిత్తమునకు ప్రసన్నత కలుగునని బౌద్ధులు విశ్వసించారు నేటికిని అదే విశ్వాసము బౌద్ధులలో కనబడును నేడు ధ్యానము (meditation) అందరికి ఉపయోగపడు సాధనగా రూపొందింది ఇంద్రియ చాపల్యము తొలగించి, 'అహం'కారమును నశింపచేసినచో 'సత్'దర్శనమగునని (పరమాత్మ దివ్యజ్యోతి) భారతీయులు నేటికి కూడ విశ్వసించుచున్నారు విభిన్న మతతత్త్వముల ననుసరించి యోగాభ్యాస విధములు విభిన్నముగానున్నవి ఉపనిషత్తుల ననుసరించి యోగమనగా పరబ్రహ్మముతో ఐక్యత పతంజలి యోగము అనగా 'సత్యదర్శనము' బౌద్ధయోగములో ప్రపంచము శూన్యము అని తెలియును 'యోగ' పదమునకు అర్థము ధ్యానము

స్మృతి (memory) లేని స్థితియే సమాధి అని బుద్ధుడు చెప్పినట్లు తోచదు కామము నిర్మూలించుటకు పొందిన సమాధి స్థితియే సక్రమమైనదని బుద్ధుని ఉపదేశము అతీంద్రియ శక్తుల కొరకు యోగసాధన బుద్ధుడు అంగీకరించలేదు సక్రమపద్ధతిలో నైతిక అచరణ, జ్ఞానము ద్వారా కూడ శక్తులు పొందవచ్చునని యోగాభ్యాస విధానమును బుద్ధుడు సంస్కరించాడు ఇంతకు ముందు చెప్పబడిన అష్టాంగయోగము ద్వారా ఐహిక బంధములను తొలగించుకొనవచ్చునని చెప్పాడు

ప్రవర్తనము రెండు రకములుగా విభజించారు అవి యోగ్య ప్రవర్తన, అయోగ్య ప్రవర్తన యోగ్యప్రవర్తన స్వార్ధరాహిత్యము నుండి కలుగును అది కరుణతో కూడిన కర్మరూపము పొందును అయోగ్యప్రవర్తన 'అహం'కారము ఆధారముగా కలుగును ఇది దౌర్జన్యముతో కూడిన కర్మరూపము పొందును నిషేధింపతగినవి పది అన్నారు అవి విసర్జించినచో సత్కర్మలు జరుగును దశనిషేధములు అసత్యము, దూషణము, అర్థము లేని సంభాషణ, మూర్ఖ ప్రసంగములు - ఇవి నాలుగు వాక్కుకు సంబంధించిన దోషములు ఇతరుల వస్తువులను కాంక్షించుట, ద్వేషము, వ్యత్యాసము చూపుట, - ఇవి మూడు మానసిక దోషములు హత్య, చౌర్యము, వ్యభిచారము ఇవి మూడు దేహసంబంధ దోషములు ఈ దశ నిషేధములలో పంచవిధములైన నిగ్రహము యిమిడియున్నది క్రోధము, వస్తు సంపాదన ఆకాంక్ష, శరీర సుఖ ఆపేక్ష, పిరికితనము, ఈర్ష్య ఈ అయిదింటిని నిగ్రహించినచో వ్యక్తి తాను సుఖమును పొందును, యితరులకు సుఖము కలుగజేయును

ధర్మములు కూడ పదియనినారు అవి దానము, సత్ప్రవర్తనము, ఓర్పు, దీక్ష, ధ్యానము, వివేకము, సక్రమ సాధన, పట్టుదల, బలము, జ్ఞానము నైతిక శిక్షణ అనగా ధర్మము, విజ్ఞానము, అంతరదృష్టి అన్నారు. పూర్వ బౌద్ధ

ధర్మ నియమములకు, ఉపనిషత్తుల నీతి సూత్రములకు కొంత పోలిక కనబడును

మానవ ప్రవర్తనమునకు దుఃఖనిరోధము, సుఖప్రాప్తి మూలమైన ఉద్దేశములు అత్యున్నతమైన సుఖము నిర్వాణమే అన్నారు చార్వాకులు అనగా నాస్తికులు సుఖమునకు మూలము శరీరము, దానిని వృద్ధిచేసిన సుఖము పెరుగునన్నారు బౌద్ధతత్త్వము ననుసరించి అజ్ఞానము, స్వార్థము పునర్జన్మకు కారణములు అవి నశించినచో సుఖము కలుగును అని బౌద్ధులు అన్నారు ఏ వ్యక్తియు యితరుల కంటే వేరు కాదు సర్వజీవములతో ఐక్యభావము పొందుటయే మోక్షము అని బౌద్ధులు విశ్వసించారు బౌద్ధధర్మము నందు నీతికి పరలోక ఫలమున్న సూచనలు లేవు అయినను సామాన్యుల తృప్తి కొరకు స్వర్గసుఖము నీతి వలన కలుగునను భావము మాత్రము తిరస్కరింపబడలేదు

ధర్మము ఆచరించుటకు బాహ్య పరిస్థితులతో పనిలేదు జ్ఞానము లేకపోవుట అను స్థితికి రాజు అయినను పేద అయినను ఒకటే విధి (బాధ్యత) నిర్వర్తించుట కంటే వ్యక్తి శీలములో కలుగు పరివర్తనమునకు ఎక్కువ ప్రాధాన్యము నిచ్చియున్నారు వినయము, దానము, దయ లేని జీవితము బ్రతికియు మరణించినటులేయగునన్నారు కర్మ వలన యీ శరీరము ఏర్పడును జ్ఞానము వలన మాత్రమే ఆ శరీరము నశించదు అయినను పునర్జన్మ రూపమున ఇంకొక శరీరము ఏర్పడకుండ జ్ఞానము చేయగలదని బౌద్ధ విశ్వాసము జ్ఞానము అనగా మానసిక జ్ఞానము, శాస్త్ర, మంత్ర పాండిత్యము మాత్రమే కాదని, జ్ఞానమునకు నైతిక అనుష్ఠానము (practical morality) ప్రధానమైనది అని బుద్ధుని భావము కామక్రోధాది వికారముల నుండి జీవుని కాపాడునదే జ్ఞానము అన్నాడు మెదడులో ఎక్కడో ఒక మూల దాగియుండునది జ్ఞానము కాదు "మనలో ప్రవేశించి, మన ఆవేశములను

సంస్కరించి, మన ఆత్మలో లీనమై, జీవితముతో ఏకమై పోవునదే జ్ఞానము "

బౌద్ధనీతి అనగా సన్యాసి నియమమే అను ఒక విమర్శ యున్నది కామమును (desire) అణగజేయుటయే సన్యాసనియమము అనుకుంటే బౌద్ధనీతి అదే అనవచ్చును కామము (కోరికలు లేక వాంఛలు) చంచలము దానికి శాంతి యుండదు భోగవాంఛ అజ్ఞానుల కామరూపము విద్యావంతులలో అది 'వస్తువాంఛ' రూపములో ఉంటుంది కామము నశించినపుడే భోగవాంఛ, వస్తువాంఛలు నశించును దీనికి వజ్రసంకల్పము అవసరమని బుద్ధుడు బోధించాడు సంకల్పము (will) వలన వాంఛలు (కామము) ఏర్పడును కాబట్టి సంకల్పమును నాశనము చేయవలెనా? బుద్ధుడు సంకల్పమును నాశనము చేయమనలేదు ఈ ప్రపంచమును వదలి పొమ్మనలేదు కామము (వాంఛ)తో యుద్ధము చేసి నిరోధించమని చెప్పాడు కామము, రాగద్వేషములు క్షుద్రములు అన్నాడు కాని వాటి నుండి పరమోన్నతమైన పవిత్ర ప్రేమభావమును ఉద్భవింపజేసిన ఘనత బౌద్ధమతముది మాత్రమేననియు, క్రైస్తవమతము కూడ పోలజాలదు అన్నాడు సర్వేపల్లి రాధాకృష్ణ 'కామరాగము'లను నశింపజేయుమని బుద్ధుడుపదేశింపలేదు సర్వజీవుల యెడల అనంతమైన ప్రేమను చూపగల జీవితము కొరకు సాధన చేయమని బుద్ధుడుపదేశించెను బుద్ధుని పూర్వజన్మములను తెలుపు జాతక కథలు బుద్ధుని అమిత ప్రేమను చాటిచెప్పుచున్నవి పశువాంఛతో కూడిన భోగమునకు, మితిమీరిన వైరాగ్యమునకు మధ్యమార్గము బుద్ధుడు అవలంబించెను కామమును సరైన మార్గములో నడపమని చెప్పెను కాని కామమును పూర్తిగా నాశనము చేయమని చెప్పలేదు అనగా కామములన్నిటిని నిర్మూలింప నవసరము లేదు దుష్కామములను మాత్రమే నిరోధించవలెనని భావము అట్లు చేయువాడే బుద్ధుని దృష్టిలో తపస్వి తపస్సు ఆంతరికమే గాని బాహ్య శరీర స్థితులకు సంబంధము లేదు అని బుద్ధుని దృక్పథము దేహమును జాగ్రత్తగా రక్షించుకొనవచ్చును కాని శరీరముపై అభిమానము పనికిరాదు

అన్నాడు బుద్ధుడు అనగా "శరీర పరిత్యాగము కాక జీవిత మమకార పరిత్యాగమునే" బుద్ధడుపదేశించెను శరీరమును కృశింపచేయుట తపస్సు కాదు చిత్తశుద్ధి చేసుకొనుటయే తపస్సు

ప్రపంచములోనందరిని సన్యసించమని బుద్ధుడు చెప్పలేదు, అట్లని ఆశించనూలేదు జనులను సంసార బంధములోనున్నవారిని ఉపాసకులనియు, ఆ బంధములను త్యజించినవారిని శ్రమణులనియు వర్గీకరించెను అయినను లోకములో విధినిర్వహణ ఒక్కటి మాత్రమే మోక్షమార్గము కాదు అన్నాడు సిద్ధాంతరీత్యా బుద్ధుడు శరీరమును కృశింపచేయుటకు అంగీకరించలేదు కాని నిర్వాణ సాధనకు బహు కఠినమైన శిక్షణ విధానము నిర్ణయించెను నిర్వాణ సాధనకే బౌద్ధులందురు సంఘముగా నేర్పడిరి స్త్రీలను చేర్చుకొనుటకు బుద్ధుడు వ్యతిరేకించినను, శుద్ధోదనుని మరణము తరువాత అతని భార్య అనగా పూర్వాశ్రమమున బుద్ధుని తల్లి, 500 మంది రాజుల భార్యలతో సహా వచ్చి బౌద్ధమతములో చేర్చుకొనుమని కోరినపుడు బుద్ధుడు మూడు పర్యాయములు తిరస్కరించి, చివరకు స్త్రీలకు ఉద్ధరణ అవసరము అని వారికి సభ్యత్వము నిచ్చెనని చరిత్ర చెప్తోంది

వర్ణధర్మములో జైనబౌద్ధములకు సామ్యము కనబడును శీలమును బట్టియే వర్ణమును గ్రహింతురు వర్ణవిభాగమును జైనులు తిరస్కరించలేదు కాని కర్మల వలన వర్ణనిర్ణయము జరగవలెనని నిర్ణయించారు "ఎవ్వని ఏ కర్మలూ అంటవో వానిని బ్రాహ్మణుడు అన్నారు " జైనులు బౌద్ధులు బ్రాహ్మణ శబ్దమును ఒక గౌరవ శబ్దముగా ఉపయోగించారు కులగర్వము, ప్రత్యేకత జైనులు నిరసింతురు కులగర్వము పాపకారణము అన్నారు

బుద్ధుని వర్ణధర్మము ఉపనిషత్తుల ననుసరించినట్లు కనబడును శీలము చేతనే వర్ణము వచ్చును కాని పుట్టుకచే కాదు అన్నాడు

బుద్ధుని కాలమున జన్మ ఆధారముగ ఆచరణలోనున్న వర్ణవ్యవస్థ

సంకరమాయెను ఆత్మ నిగ్రహము కలిగి జ్ఞానమూర్తియైనవాడే బ్రాహ్మణుడగును క్రోధ ద్వేషపూరితమనస్కుడు శూద్రుడగును అన్నాడు పుట్టుకతో నెవ్వడును బ్రాహ్మణుడు గాని శూద్రుడు గాని కాడు కర్మల వలననే బ్రాహ్మణుడు గాని శూద్రుడు గాని అగును అని చెప్పాడు పూర్ణజ్ఞానమూర్తియే బుద్ధుడు జ్ఞాన ధ్యాన నిగ్రహములచే ఎవరైనను బుద్ధుడు కావచ్చునని బుద్ధుని భావము అందుచే అన్ని వర్ణములు వారికి బౌద్ధ సంఘములో సభ్యులగుటకు అర్హత కలిగెను బుద్ధుడీ విధముగా వర్ణభేదమును తొలగించెను కాని ధర్మసూక్ష్మము తెలుసుకొనగల బుద్ధిసూక్ష్మత శ్రమణులను బ్రాహ్మణులకే యున్నదని వారిని ఎక్కువగా ఆదరించెను అందరికి జ్ఞానము పొందుటకు అర్హత ఉన్నదని అంగీకరించినను "పుణ్యపరిపాకము చేతనే బ్రాహ్మణకులమున జన్మము లభించునని బుద్ధుడు అంగీకరించినాడు "

జైన బౌద్ధములు సంఘసంస్కరణకు ప్రయత్నించలేదు వాటి ప్రవక్తలైన మహావీరుడు, బుద్ధులకు సంస్కరణోద్యమమునకు వలసిన ఆవేశము, నాయకత్వము లేవు ఉపనిషత్తుల వలెనే జైన బౌద్ధములు వర్ణ వివక్షతా కాఠిన్యము గర్హించినవి వర్ణ వినాశనమునకు గాని, సంస్కరణమునకు అవి ప్రయత్నించినట్లు ఎక్కడా కనబడదు గృహస్థ కర్మల జోలికి బుద్ధుడు పోలేదు. కాని వేద ప్రమాణమును అంగీకరించలేదు సత్యము విషయములో గుప్తము చేయు పద్ధతిని అతడు అంగీకరించలేదు అయినను బుద్ధుడు వేదములను నిందించలేదు

కర్మ సిద్ధాంతము బౌద్ధము నూతనముగా సృష్టించినది కాదు అది చాల పురాతనమైనది జీవి యొక భౌతిక నైతిక దశాసంపుటి అని బౌద్ధ పరిణామ వాదము ఇది కర్మ సిద్ధాంతమునకు తార్కికమైన ఆశ్రయము కల్పించినది కారణము, కార్యము అను అంతు తెలియని ఒక గొలుసు నందు (chain) ప్రతి మానవుడు ఒక 'లింకు' ప్రతి 'లింకు'నకు వ్యక్తిత్వము లేక

ప్రత్యేకత ఉంటుంది కాని అది ఆ గొలుసునందున్నంత వరకు మాత్రమే పరస్పర సంబంధములపై ఆధారపడిన వ్యక్తిత్వము అది గొలుసు లేనిది 'లింకు' లేదు, 'లింకు' లేనిది గొలుసు లేదు మానవుని జీవితములో ప్రతి జన్మ ఒక 'లింకు' అతని చరిత్ర పుట్టుకతో ప్రారంభమైనది కాదు ఎప్పటిదో తెలియని అనేక గత జన్మల వెనుక ప్రారంభమైనది అతని చరిత్ర

మానవ స్వభావము ఆధారముగానే కర్మసిద్ధాంతము ఏర్పడినది ఆత్మకు స్వేచ్ఛ యున్నది కాని ఆ స్వేచ్ఛను క్షీణింపచేయు ఎన్నియో క్రియలు (చర్యలు) మానవ స్వభావము ద్వారా జరుగుచున్నవి వాటిని గురించినదే కర్మ సిద్ధాంతము - మన కర్మల ఫలితములను మనము తప్పించుకొనలేము వెనుక చెప్పినట్లుగా జైనమునందు కర్మ సిద్ధాంతము విచిత్రమైనది కర్మ ఒక పదార్థరూపం అన్నారు అందు ఉద్దేశమునకు (motive (or) intention) స్థానము లేదు కర్మ ప్రవాహములో ఏ విధమైన రాజీకి (compromise) అవకాశము లేదు అందువలన భక్తి, అవతార, బోధిసత్వ సిద్ధాంతములకు జైనములో అవకాశము లేకపోయినది హిందూ బౌద్ధమతములలో వృద్ధి చెందిన తాంత్రిక తత్త్వము జైనమతములో లేకపోవుటకు కూడ అదే కారణము కావచ్చును

బౌద్ధములో కర్మ మూలము సంకల్పము (will or intention or motive) హిందూమతములో కూడ కోరికలతో కూడిన అనగా కామ్య కర్మలకు ప్రత్యేకత యున్నది కామ్యము అనగా కోరికతో కూడిన సంకల్పము (desire with will) బౌద్ధులు దానిని తృష్ణ అన్నారు తృష్ణ నిరోధము ద్వారా నిర్వాణము పొందవచ్చునన్నారు కర్మ సిద్ధాంతములో హిందూ, బౌద్ధతత్త్వములకు పోలిక కనబడును

కర్మ ఫలితముల తారతమ్యముల వలననే మానవులందరు ఒక రీతిగా లేరు అని హిందువుల వలెనే బౌద్ధులు కూడ విశ్వసించారు కర్మ

సిద్ధాంతము తెలియనిచో దేవుడు అన్యాయము చేశాడు అను భ్రాంతిన పడుదురు కర్మ ఫలము అనుభవించుట ద్వారా కర్మ విముక్తి కలుగునని కూడ గ్రహించారు కర్మ సిద్ధాంతమందలి వ్యక్తి స్వీయకర్మ బాధ్యతను అంగీకరించారు పాపఫలము అది చేసిన వాని జీవితదశననుసరించి యుండును అన్నారు దుర్మార్గుడు చేసిన పాపఫలము జన్మాంతరముల వరకు అనుసరించును అదే ఒక సత్పురుషుడు చేసిన పాపఫలితము వర్తమాన జన్మలోనే అనుభవములోనికి వచ్చి అతనిని విముక్తుని చేయునని బౌద్ధులు చెప్పారు దానికి వారిచ్చిన ఉదాహరణమిది కొద్దిగా ఉప్పు ఒక చిన్న పాత్రయందలి నీటిలో వేసినచో ఆ నీరంతయు ఉప్పగానగును అంతే ఉప్పును గంగానదిలో కలిపినపుడు గంగా నదిజలము రుచి యందు మార్పు కనబడదు

దేవతలకు, మానవులకు కర్మసూత్రమును ఉల్లంఘించుటకు సాధ్యము కాదు అన్నారు అటులైనచో పురుష ప్రయత్నమునకు స్థానము లేదా అను సందేహము కలుగును కర్మఫలమే సర్వస్వము, ప్రార్థన ద్వారా కాని, పురుష ప్రయత్నము ద్వారా కాని దానిని మార్చుట అసాధ్యము అని గ్రీకులు విశ్వసించారు ఇస్లాము మతములో కూడ యిట్టి విశ్వాసమే కనబడును బౌద్ధములో బుద్ధత్వము (జ్ఞానసిద్ధి) పొందుట కూడ కర్మఫలమా అను ప్రశ్నకు బుద్ధుడు సమాధానము చెప్పలేదు కాని బౌద్ధధర్మములను పాటించుట ద్వారా కర్మ నిర్జించవచ్చునని బౌద్ధము చెప్పుచున్నది కర్మదోషమును ప్రతిఘటించుటకు శక్తి కావలయునని బుద్ధుడు చెప్పియుండుట వలన పురుష ప్రయత్నమునకు స్థానము కల్పించబడినటులే గ్రహించవలయును బుద్ధుని బోధనలో పశ్చాత్తాపము పురుష ప్రయత్నములలో నొకటి బౌద్ధములో ఆ విధముగ కర్మసూత్రములో కర్మ స్వాతంత్ర్యమునకు స్థానమేర్పడినది నేటి విజ్ఞానశాస్త్రమునందు (science) కూడ కారణధర్మము (cause) నకు స్థానముండుట వలననే కర్మ సూత్రమునకు సమర్థన కలుగుచున్నది

జైనులు తలచినట్లు కర్మ నిర్జీవ పదార్థము కాదు అని బౌద్ధతత్త్వము అది జీవుల శీలము నుండి ఏర్పడును జీవము నిరంతరం వికసించుచుండును ఆత్మయనునది లేదు అనియు నిత్యము పరిణామము చెందు దశాపరంపరలే యున్నవి అను పరిణామవాదమే బౌద్ధతత్త్వము గత దశ వర్తమానమును బంధించును కాని భవిష్యత్తు దశను మన సంకల్పమునకు అనుకూలముగా రూపొందించుకొనవచ్చును వర్తమానము గతము అధీనములోనున్న యంత్రము కాదు గతమునకు వర్తమానమునకు మధ్య నిరంతరమైన ఒక సూత్రము ఉన్నదన్నారు కాని కర్మసూత్రము నిర్జీవము కాదు నీతి నియమములతో కూడిన మత జీవితమునకు అవకాశమున్నదన్నారు

బుద్ధుడు మానసిక తత్త్వమునకు ఎక్కువ ప్రాధాన్యమునిచ్చెను ఉపనిషత్తులు చెప్పిన 'ఆత్మ'ను గురించి మౌనము వహించినను, వివిధ మానసికదశాసంపుటమే ఆత్మ అన్నాడు మానసిక దశా పరిణామములకు అనుకూలముగా కర్మ సూత్రముండును మానసిక దశలకు కర్త మన యాత్మయే కదా! అందుచే గత కర్మ బంధమును ఎప్పుడైనను ఛేదించుకొనుటకు దానికి అవకాశమున్నది కర్మల ఫలితమున్నంత వరకు పునర్జన్మ అవసరము ఉండును పునర్జన్మ లేకుండుటే మోక్షము పాపపుణ్యములకు అతీతమైనది జన్మరాహిత్యము నైతిక వర్తనము ద్వారా అది సాధ్యము అన్నారు

బౌద్ధతత్త్వమున కర్మఫలము కర్త ఉద్దేశము ననుసరించియుండును దురుద్దేశము దుష్కర్మలకు మూలము జైనకర్మ సూత్రము ప్రకారము మనస్సు, వాక్కు, దేహము చేయు కర్మలందు దేహము చేయునవే దుష్కార్యములు అవి అధికము కాని బౌద్ధమున దేహ, వాక్కు కర్మ కంటే మనోకర్మలే ఎక్కువ దుష్టములు ఉద్దేశము లేకుండ హత్య వంటి నేరము చేసినను అది దుష్కార్యము కాదు ధమ్మపదము అను బౌద్ధతత్త్వగ్రంథము నందు ఒక ఉదాహరణ చెప్పబడినది ఒక గ్రుడ్డి సన్యాసి తొక్కుటచే కొన్ని

కీటకములు నశించినవి తోటి సన్యాసులు దానిని మహాపాపముగా పరిగణించి బుద్ధునికి చెప్పిరి బుద్ధుడు గ్రుడ్డి సన్యాసి నేరం చేయలేదనెను ఆ సన్యాసి కీటకములను చూడలేదు అందువలన అతనికి వాటిని చంపు ఉద్దేశము లేదు ఉద్దేశము లేదు కావున అది హత్యానేరము కాదు దాని దుష్ఫలితము ఆ సన్యాసికి అంటదు అని బుద్ధుడు నిర్ణయించాడు అనగా బౌధతత్త్వములో ఉద్దేశము లేకుండ చేయబడిన కర్మ ఫలితమునకు విలువ లేదు నేటి న్యాయస్థానములలో కూడ శిక్షాస్మృతి (penal code) ననుసరించి ఉద్దేశము లేని హత్యానేరమునకు శిక్ష స్వల్పముగా నుండును గదా! అటులే బౌద్ధకర్మ సిద్ధాంతమున ఉద్దేశము లేకుండ చేసిన హత్యవలన హంతకుడు నేరస్థుడు కాదు

బౌద్ధకర్మ సిద్ధాంతం ప్రకారం కర్మమునకు కర్తయే ఫలితము ననుభవించవలయును కర్మ ఫలితము ఒక నీడవలె అతనిని వెంటాడును ఉద్దేశపూర్వకముగా చేసిన కర్మల ఫలితములను తప్పించుకొనుట అసాధ్యము కర్మఫలితమును కర్తయే యెటుల అనుభవించవలయునో అటులే ఆ కర్త కృషి వలన మాత్రమే దాని నుండి విముక్తి సాధ్యము మరణానంతరము శరీరము నశించును కాని కర్మలు నశించవు

కర్మ ఫలితము ననుసరించి వ్యక్తి పునర్జన్మ పొందునని బౌద్ధతత్త్వము పునర్జన్మ స్థితి, రూపము, లక్షణము కర్మ ఫలితముపైననే ఆధారపడును కాని కర్మ పరిపక్వము ఎపుడు జరుగునది చెప్పుటకు బౌద్ధతత్త్వములో కూడ సాధ్యపడలేదు కర్మఫలము వర్తమాన జన్మములో కాని భవిష్యత్తులో నెపుడైనను రావచ్చునన్నారు సత్కర్మ, దుష్కర్మ ఫలితములు విడివిడిగానే ఉండునని కూడ నిర్ణయించారు సత్కర్మ ఫలితములు, దుష్కర్మ ఫలితముల కంటే శక్తివంతమైనవి అన్నారు సత్కర్మ విశాలమైనదని, అది పరిపక్వము చెందుటకు చాలకాలము పట్టునని చెప్పారు ఎవరి కర్మఫలము వారే

అనుభవించవలెనని బౌద్ధకర్మ సిద్ధాంతమైనను, కర్మఫలమును మరియొకరికి పుణ్య పరిణామము లేక పుణ్యఫలదానము ద్వారా యివ్వవచ్చునని చేర్చబడిన అంశము కర్మ సిద్ధాంతమునకు వ్యతిరేకముగా కనబడును కర్మఫలము కర్త యొక్క స్థితి, గతులు, వనరుల (status and resources) పై ఆధారపడునను విషయము కూడ కర్మసిద్ధాంతమునకు విరుద్ధముగానే తోచును కర్మపరిపాకము (పరిపక్వము) విషయములోని సందిగ్ధత కూడ ఉన్నది కొన్ని కర్మలు తప్పక పరిపక్వము చెందును అన్నారు మరికొన్ని కర్మల విషయములో పరిపక్వత ఉన్నదో లేదో సందిగ్ధముగానే ఉన్నది అనగా కర్మ పరిపక్వత విషయములో స్పష్టత లోపించినట్లు కనబడును కొన్ని కర్మలు వర్తమాన జన్మలో పరిపక్వము చెందును అన్నారు కాని వాటిని స్పష్టము చేయలేదు కర్మల వర్గీకరణము నందు ఎట్టి స్పష్టమైన పద్ధతి ఉన్నట్లు కనబడదు

అనంతర కాలములో కర్మ సిద్ధాంతమునందు కొన్ని మార్పులు చేర్చబడినట్లు కనబడును అందు పుణ్యదానము, బోధిసత్త్వుని కరుణ ద్వారా దుష్కర్మ నాశనము ప్రధానమైనది వాంఛలను నిరోధించగలిగిన బౌద్ధ భిక్షువు తన పుణ్యఫలమును ఇతరుల దుష్కర్మ ఫలమును నిరోధించుటకు దానము చేయవచ్చునన్నారు దాని వలన దుష్కర్మ ఫలము నశించును, మరియు దాతకు తిరిగి పుణ్యఫలము చేకూరును అనంతర కాలములో మహాయాన బౌద్ధములో బోధిసత్త్వుని దయతో దుష్కర్మను నాశనము చేయవచ్చునన్నారు జన్మ-పునర్జన్మల నుండి రక్షణ చెప్పలేదు కాని దుష్కర్మల నుండి రక్షణకు మార్గము చెప్పారు

జన్మ పరంపరలు కర్మ నియమముననుసరించి యుండును ఆ పరంపరల ప్రతీకయే సంసారచక్రము అన్నారు పూర్వజన్మ అంతము, పునర్జన్మ ప్రారంభమే మరణమునకు అర్థమన్నారు జీవితకాలములోనే ఎన్నో మార్పులుండును కాని జననము, మరణము అత్యంత పెద్దమార్పులు

కీటకములు నశించినవి తోటి సన్యాసులు దానిని మహాపాపముగా పరిగణించి బుద్ధునికి చెప్పిరి బుద్ధుడు గ్రుడ్డి సన్యాసి నేరం చేయలేదనెను ఆ సన్యాసి కీటకములను చూడలేదు అందువలన అతనికి వాటిని చంపు ఉద్దేశము లేదు ఉద్దేశము లేదు కావున అది హత్యానేరము కాదు దాని దుష్ఫలితము ఆ సన్యాసికి అంటదు అని బుద్ధుడు నిర్ణయించాడు అనగా బౌధతత్త్వములో ఉద్దేశము లేకుండ చేయబడిన కర్మ ఫలితమునకు విలువ లేదు నేటి న్యాయస్థానములలో కూడ శిక్షాస్మృతి (penal code) ననుసరించి ఉద్దేశము లేని హత్యానేరమునకు శిక్ష స్వల్పముగా నుండును గదా! అటులే బౌద్ధకర్మ సిద్ధాంతమున ఉద్దేశము లేకుండ చేసిన హత్యవలన హంతకుడు నేరస్థుడు కాదు

బౌద్ధకర్మ సిద్ధాంతం ప్రకారం కర్మమునకు కర్తయే ఫలితము ననుభవించవలయును కర్మ ఫలితము ఒక నీడవలె అతనిని వెంటాడును ఉద్దేశపూర్వకముగా చేసిన కర్మల ఫలితములను తప్పించుకొనుట అసాధ్యము కర్మఫలితమును కర్తయే యెటుల అనుభవించవలయునో అటులే ఆ కర్త కృషి వలన మాత్రమే దాని నుండి విముక్తి సాధ్యము మరణానంతరము శరీరము నశించును కాని కర్మలు నశించవు

కర్మ ఫలితము ననుసరించి వ్యక్తి పునర్జన్మ పొందునని బౌద్ధతత్త్వము పునర్జన్మ స్థితి, రూపము, లక్షణము కర్మ ఫలితముపైననే ఆధారపడును కాని కర్మ పరిపక్వము ఎపుడు జరుగునది చెప్పుటకు బౌద్ధతత్త్వములో కూడ సాధ్యపడలేదు కర్మఫలము వర్తమాన జన్మములో కాని భవిష్యత్తులో నెపుడైనను రావచ్చునన్నారు సత్కర్మ, దుష్కర్మ ఫలితములు విడివిడిగానే ఉండునని కూడ నిర్ణయించారు సత్కర్మ ఫలితములు, దుష్కర్మ ఫలితముల కంటే శక్తివంతమైనవి అన్నారు సత్కర్మ విశాలమైనదని, అది పరిపక్వము చెందుటకు చాలకాలము పట్టునని చెప్పారు ఎవరి కర్మఫలము వారే

దశలను తిరిగి సంపుటీకరణము చేయాలి అటుల చేయునది ఉపాదానమను ఒక ఆకర్షణశక్తి ఇది లేనిది కర్మకు అవకాశముండదు కర్మ వీటి కొరకు ఎదురుచూచుచుండును అన్నారు ఇది బౌద్ధ పునర్జన్మ సిద్ధాంతము

మరణ సమయమున కర్మబలముచే హృదయము కొలది సేపు కొట్టుకొనును ఈ కర్మము గత ఘనకార్య స్మృతులతో తనచే నిర్మితమైన నూతనరూపమును ధరించి విజ్ఞానముగా నూతన జీవితములోనికి సాగిపోవును అన్నారు విజ్ఞానము కర్మ చేతను, తృష్ణ చేతను ముందుకు త్రోయబడును అపుడే మరియొక జన్మము మొదలగును ఇచట ఒక విషయము గమనించినచో పునర్జన్మ విషయము బోధపడును నశించిన పూర్వవిజ్ఞానమే మరణము నూతన విజ్ఞానము క్రొత్త దేహమున ప్రవేశించుటయే పునర్జన్మము కాని యీ నూతన విజ్ఞానము ఎచట నుండి వచ్చినది? అది పూర్వజన్మ విజ్ఞానము నుండి రాలేదు పూర్వజన్మకు కారణములైన ధర్మములు, అనగా పూర్వజన్మలోనున్న కారణములు అవి మరణసమయమున కలుగు నూతన జన్మ ఆపేక్ష, దానికి తోడు తృష్ణలతో కలిసి నూతన విజ్ఞానము (consciousness) ఏర్పడును విజ్ఞానమనగా బాహ్యావస్తువులతో ఇంద్రియ స్పర్శచే మానసికానుభవం కలిగించునది అదియొక శక్తి కావచ్చు

బౌద్ధమతములో దేవతలకు, రాక్షసులకు, మానవులకు, పశువులకు గల భేదము విశ్వసించబడినది దేవతలు, రాక్షసులు అగోచరులు జన్మకాంక్ష కలిగినపుడు సంకల్పముచే యే రూపమునైన పొందగలరు మానవ, పిశాచ, పశువులకు అట్టి శక్తి లేదు వారికి పునర్జన్మమునకు వలసినవన్నియు సిద్ధమైనపుడు మాత్రమే పునర్జన్మ కలుగును అవి సిద్ధమగు వరకు గంధర్వరూపమున అశరీరులై యుండి తమ భావబలముతో నూతన శరీరమునకు వలసిన స్థితులను కల్పించుకొందురు ఇది బౌద్ధ విశ్వాసము

పునర్జన్మము పొందిన మానవుడు చనిపోయిన వాని కర్మఫలము

పొందును ఇతడు నూతన పురుషుడే ఇరువురు ఒకరు కాదు, కాని ఇరువురకు సంబంధమున్నది మరణించిన వ్యక్తి కర్మలరూపమే నూతన వ్యక్తి బృహదారణ్యక ఉపనిషత్తునందు (3-2-10) యాజ్ఞవల్క్యునకు, ఆర్తభాగునకు జరిగిన సంభాషణము నందు యీ విషయమే వెల్లడియగును

బౌద్ధతత్త్వమందు కర్మయే మరణానంతరం మిగిలి యుండునది కాని కొన్ని సమయములందు ఆ బాధ్యత విజ్ఞానమునకున్నదని చెప్పబడినది "మనకు కనబడునదంతయు మన విజ్ఞాన ఫలితమే ఒక విధముగ విజ్ఞానమే మన ఆత్మవస్తువు (subject of our soul) లేక ఆత్మనిర్మాణ కర్త విజ్ఞానమునకు కర్మమునకు, ఆలోచన (thought), సంకల్పములకు (will) దగ్గర సంబంధము చెప్పబడినది ఉత్తమ నిర్వాణమునందు కర్మము, విజ్ఞానము రెండును బంధములు కావు వ్యక్తి మరణముతో సర్వదుఃఖములు నాశనమగును కర్మయే జన్మ-పునర్జన్మల పరంపరను నడుపును కర్మ నశించినచో పునర్జన్మ లేదు "

అనంతర కాలమున నేర్పడిన బౌద్ధశాఖలందు సిద్ధాంత భేదము లేర్పడినవి అవి యిచట చర్చనీయాంశములు కావు మహాయానశాఖయందు బుద్ధుడు మానవరూపమును వదలి, అతీంద్రియ శక్తులతో కూడిన దైవరూపమును పొందెను హీనయానశాఖయందు బుద్ధుని పూర్వజన్మ వృత్తాంతము, బోధిసత్త్వుని కారుణ్యము జాతక కథల ద్వారా ప్రాచుర్యము పొందినవి

**4) జైనబౌద్ధములు - దైవతత్త్వము (Attitude to God)**

కర్మ సిద్ధాంత సందర్భములో జైనబౌద్ధ మతముల దైవతత్త్వమును గురించి కొంత తెలిసికొనవలసియున్నది దీనిని గురించి తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ యిచ్చిన విశ్లేషణ ఎంతో సమంజసముగాను సునిశితముగానున్నది ముందుగా జైనమత దైవతత్త్వము

ఈ ప్రపంచమునందున్న వస్తువుల సంబంధములు స్థిరములు కావు, స్వతంత్రములు కావు ఎందుకనగా అవి మన భావఫలితములు మాత్రమే జైనతత్త్వమునను సరించి అనేకత్వముతో కూడిన లోకము ఒక తాత్కాలిక దర్శనమే కాని సత్యజగత్తు కాలేదు లోకమంతయు పరమాణువుల వలె (మోనాడులు - Monads) జీవులతో నిండియున్నదని జైనవాదము అతిసూక్ష్మమైన అణువునందు అనంతజీవకోటి యిమిడి యున్నదన్నారు లోకములో నిరుపయోగమైనది నిస్సారమైనది లేదన్నారు చేపలతో నిండియున్న కాసారమును చూచినచో నీరు మాత్రమే కన్పడును చేపల ఆకృతులు స్పష్టముగా కనబడవు అటులే బాహ్యప్రపంచము స్పష్టముగా కనబడును కాని అందు జీవము లేని ప్రదేశము ఏ మాత్రము లేదు అన్నారు

"చైతన్యము గల ప్రతివస్తువు జీవమే" జైనబౌద్ధములు ఎడతెగని తాత్త్విక వాదనలతో నిండిన యుగమునకు చెందినవి స్పష్టమైన నిర్ణయములు లేని తాత్త్విక తర్కములగుటచే "జీవునికి ఆత్మకు, ఆత్మకు జడపదార్థమునకు గల భేదమును స్పష్టము చేయు జ్ఞానము ఏర్పడలేదు" వస్తువులకు స్థితి యుండును వాటి యందున్న జీవము ఒక విధమైన వస్తువు అన్నారు పదార్థము నుండి విడివడినపుడు ఆ వస్తువు ఆత్మ యనబడెను పదార్థ దోషములు దానికి లేనపుడు అది శుద్ధ చైతన్యమగును అదే ఆత్మ దానికి గోచరమగు రూపము లేదు ఉత్తమమ్మైన ఆత్మకు రూపములేని చైతన్యముండును అదే పరిశుద్ధ జీవము పుద్గలము జైనతత్త్వములో ప్రధానాంశము పుద్గలమనగా కేవలము చైతన్యరహితమైన జడపదార్థము కాదు అన్నారు దానికి కూడ చైతన్యమున్నదన్నారు ఆత్మ అనునది చేతనత్వముతో కూడిన జీవము పుద్గలము (పదార్థము) చేతనత్వము గల అనాత్మ (ఆత్మ కానిది) పదార్థము ప్రాతిపదికము అనగా మూలము అన్నారు పుద్గలము శుద్ధ ఆత్మభావమునకు వ్యతిరేకము అది భిన్నరూపము గల వస్తువు జైనతర్కములో అది సత్యమైనది కాదు జీవము పదార్థ ఆత్మల

మిశ్రరూపమన్నారు అనగా పదార్థముతో నిండిన యాత్మయే జీవియని జైనతత్త్వము సంసారము నందు తగుల్కొని యున్న ప్రతిజీవియు శుద్ధాత్మకు వ్యతిరేకమైన పదార్థ (పుద్గలము) అంశమును కలిగియుండును ఆత్మ అనగా శుద్ధచైతన్యము, జడపదార్థము, మరియు యీ రెంటి కలయిక అయిన జీవము, యీ మూడును మూలపదార్థములని జైనతత్త్వ సిద్ధాంతము

"జీవము, అజీవము ఆత్మ యొక్కయు, పదార్థము యొక్కయు వ్యావహారిక రూపములు కావు" రెంటి సంయోగములే జీవాజీవములు పుద్గలము (పదార్థము) నందు ఆత్మ సంబంధమున్నది అటులే ఆత్మయందు పుద్గలము (ద్రవ్యము లేక పదార్థము) ప్రవేశించియే యున్నది జీవ, అజీవములు అనగా ఆత్మ, అనాత్మలు కావు అట్లు చెప్పుటలో అపార్థమున్నది వాస్తవముగ ఆత్మ, అనాత్మలు "మూలరూపములు" (primary elements) వాటికి పరస్పర సంబంధము లేదు జీవములో ఆత్మ యెక్కువగాను, అజీవములో అనాత్మ ఎక్కువగా నుండును అవి రెండును పూర్ణమైన 'సత్' పదార్థములో రెండు క్రమములు గల రూపము

ప్రపంచము జీవసంపుటి ప్రతిజీవియు ప్రత్యేక రూపము గల వ్యక్తిగాను, సంపుటములో సమిష్టి రూపముగాను ఉండును అదే అనేకములో నొకటి, ఒకటిలో అనేకము "చైతన్యముగల కేంద్రములన్నియు జీవములే" ఈ ప్రపంచమున ఆత్మ, పదార్థము, ద్రష్ట (చూచువాడు), దృశ్యము విడిగా నుండవు అవి కలిసియే యుండును ఈ రెంటిలోను ఒకదానిని మరియొకటి అధీనము చేసికొనుటకు జరుగు ఘర్షణయే మానవ అనుభవరూపము అని జైనవాదము "జీవునందుగల ఆత్మ అంశమునకు ఊర్ధ్వగతి, పదార్థ అంశమునకు అధోగతి సహజములు" అన్నారు కాని అది కొంత విచిత్రముగా కనబడును పదార్థభాగమధికమగుటచే జీవుడు భూలోకమున జన్మమును పొందుచుండును అన్నారు

జీవములలో తారతమ్యమునకు కారణము ఆత్మపదార్థముపై అనాత్మ పదార్థము పొందిన ఆధిపత్యములో గల తారతమ్యములే దేవతలు, సిద్ధాత్ములలో అనాత్మపై ఆత్మ అధికారము ఎక్కువగా నుండును ఉన్నతి చెందిన దశలలో అనాత్మ ప్రభావము అతితక్కువగా నుండును అనాత్మశక్తి అల్పమైనపుడు మనకు దేవతాశక్తి కలుగును శుద్ధఆత్మ యందు ఆత్మ శుద్ధపదార్థము నందు అనాత్మ సంకరము లేకుండ ఉండును వాస్తవ అనుభవములో అట్టి సంకరము లేని స్థితి దుర్లభము

గోచరమగు యీ జగత్తు అంతా ఆత్మ, అనాత్మల, సత్తు అసత్తుల మిశ్రమము 'సత్' సత్యమైనది అదియే ఆత్మ దానికి సర్వజ్ఞత్వముండును అసత్తు సర్వజ్ఞత్వమును మరుగుపరచి జీవునికి బంధములను కలిగించును ఆత్మలోకమంతట వ్యాపించియున్నది కాని జీవుడు ఒక ప్రాంతమునకే బద్ధుడు అసత్తు వలన ప్రత్యేక వ్యక్తిత్వము కలుగును ఆకాంక్ష, మమకారముతో ప్రత్యేక వ్యక్తిత్వము కలిగియున్నట్లు తలపించునది అనాత్మశక్తి అది ఆత్మ యొక్క పరిమిత బాహ్యరూపము మానసిక లోకమున అదియొక స్థితి అది అసత్ యొక్క రూపము దేహము జీవుని అసంపూర్ణతను ప్రకటించి ఆ దృక్పథము ఆత్మకు కలుగజేయును వివిధ జీవులలోని భేదములు వారివారి శరీర భేదముల వలననే కలిగినవి అన్నారు అనగా వివిధ శరీరములలోని ఆత్మ యొక్కటియే కాని దాని వ్యతిరేకమైన పదార్థము వలన విభిన్న వ్యక్తిత్వము అను భ్రాంతి ఏర్పడుచున్నది "వాస్తవమునకు అన్ని జీవరూపముల సారాంశము (essence) 'సత్' చైతన్యమే "

అనుభవములో మనము ఇంద్రియ దర్శనము (దృశ్య స్పర్శాను భవము)నకు, జ్ఞానమునకు ప్రాధాన్యము యిచ్చుచున్నాము అందుచే ఏకమాత్రమైన 'సత్' అనేకములుగా గోచరించును అంతియేగాక అవియే సత్యమని భ్రాంతి కూడ పొందుచున్నాము ఇట్టి వ్యవహార జీవన స్థితి నుండి

దానికి అతీతమైన తార్కికదృష్టి గల ద్రష్ట (చూచువాడు) స్థితికి చేరవలయునని జైనసిద్ధాంతము విశ్వమునంతను చూచు ద్రష్టఅవిచ్ఛిన్నమైన లేక నిరాటంకమైన లేక పూర్ణమైన స్థితి గలది దానిని మనము ఒక మానసిక జీవిగా ఊహించి దానికి దేహ, దేశ, కాలములను కల్పించి దానికొక ప్రత్యేకత ఆపాదించి వ్యావహారికముగా అదియొక జీవియనియు అట్టివి అనేకములున్నవని తలచుచున్నాము ఈ సందర్భమున సర్వేపల్లి రాధాకృష్ణ శంకరాచార్యుల భాష్యమును గుర్తు చేశారు "మనము ద్రష్టను ఒక దృశ్యముగా చేసి దాని లక్షణములను మనము వితర్కించుటకు వీలగునని తలచినంత కాలము జీవ అనేకత్వము సత్యముగానే గోచరించును సక్రమమైన జ్ఞానమార్గమును తెలుసుకుని, మన వ్యావహారిక అనుభవములోని భావములు, ఊహలచే మనము ద్రష్టకు కల్పించిన దేహము మొదలైన రూపములను తొలగించి ద్రష్టకు దృశ్యముతో సంబంధమును నిర్మూలించి చూచినచో సత్యముగా ఒకే ద్రష్టయుండెనని అర్థమగును" ఈ అత్యున్నత భావస్థాయి ఎదుగుటకు జైనమతము అంగీకరించలేదు "ఈ మహోన్నత భావతత్త్వము" సామాన్యునికి లభించుట సులభసాధ్యము కాదు

పూర్ణ సత్పదార్థము ఒకటి మాత్రమే యను సిద్ధాంతమును జైనము ఆలోచించినది కాని వ్యతిరేకించినది "అందరికి ఒకటే ఆత్మ యుండుట నిజమైనచో ఒకరి నుండి మరొకరికి భేదముండదు, భిన్న అనుభవములు పొందుటకు అవకాశముండదు అన్నారు జైనులు మానవులు దేవతలుగా మారుదురు మంచివారు, చెడ్డవారు ఒకటేయగుదురు" అని వాదించారు మానసిక స్థాయిలో గాని వ్యావహారిక స్థాయిలో గాని అనేకత్వమును తిరస్కరించవలసిన అవసరము లేదు కర్మఫలము వ్యావహారిక ప్రపంచ (empirical level) స్థాయిలోనే కలుగును జీవునకు మనస్సు, దేహములతో సంబంధమున్నంత వరకు దాని అనేకత్వమును అంగీకరించవచ్చును

జీవుని పరిమితత్వము (limitation) శాశ్వతమూ తొలగించరానిదీ అయినపుడు జీవుని అనేకత్వము సత్యమే అగును కాని జీవుని పరిమితత్వము బాహ్య బంధములు మూలతత్త్వమున లేకపోవుట వలన అవి తాత్కాలికము లనియు, సిద్ధాత్మ యందు అనగా సిద్ధి ద్వారా స్వేచ్ఛ పొందిన ఆత్మయందు అవి సంపూర్ణముగా నశించును అని జైనులు అంగీకరింతురు అట్టి స్థితిలో తాత్కాలికమైన జీవుని అనేకత్వము తార్కికము, హేతుబద్ధము కాదు "మొదటను చివరను ఏదైతే ఉండదో అది వర్తమానమున ఉండుననుట అసత్యము" అని తత్త్వవిచారమున అందరు అంగీకరింతురు అన్నారు సర్వేపల్లి రాధాకృష్ణ గోచరమగు ప్రపంచములోనిది, తాత్కాలికము అయినది పరమసత్యము కానేరదు

ఈ ప్రపంచమున కనబడు జీవుని అనేకత్వమును సమర్థించినచో, ప్రతి ఒక్క జీవుని ప్రత్యేకతను, వ్యక్తిత్వమును అంగీకరించవలసి యుండును అట్టి ప్రత్యేక వ్యక్తిత్వము కలిగి, ఇంద్రియబద్ధమైన ప్రకృతి గుణములతో కూడిన యీ దేహముతో నున్న జీవునకు మోక్షము సాధ్యమా? సాధ్యమైనను అపుడు జీవునకు ఏమగును? అసలు మోక్షమునకు సవ్యమైన అర్థము ఏర్పడునా? వీటికి సమాధానము వ్యతిరేకముగానే యుండును ప్రత్యేకత నశించినపుడు గదా ఏకత్వము లభించునది ఆ ఏకత్వమే గదా మోక్షము కాని ఆ ఏకత్వము దేనితో? మూలచైతన్యము ఒకటి యున్నది అని అంగీకరించినపుడే ఆ ఏకత్వమునకు అర్థము ఏర్పడును

విశ్వమున నున్నవి రెండు శక్తులు అవి జీవాత్మ, పరమాత్మ వాటి సంబంధమునను సరించియే అద్వైతము కాని ద్వైతము కాని సంభవము జైనులు వారి ద్రవ్య సిద్ధాంతములో పదార్థమునకు కారణము లేక మూలము చెప్పలేదు ఎందుకనగా విశృంఖల స్వభావము గల నియంతగా (Dictator) ఒక దేవుడున్నాడని, అతని యిచ్ఛ ప్రకారము విశ్వము నడుచును అని జైనులు

అంగీకరించరు లోకాతీతుడైన దేవునకు జైనసిద్ధాంతములో స్థానములేదు మరి దేవుడెవరు? ఒక పదార్థము యొక్క భిన్నరూపములే ప్రకృతి, ఆత్మ, దేవుడు అని జైనసిద్ధాంత అంతరార్థముగా కనబడుచున్నది అని సర్వేపల్లి రాధాకృష్ణ అభిప్రాయపడ్డారు పరిపూర్ణ సిద్ధి పొందిన ఆత్మయే దేవుడు ఇంకొక విధముగా దేవుని ఊహించినచో ఆతనికి పరిమితత్వము ఏర్పడును మానవుడు తన మనసున యితరుల కంటే తాను వేరు అని తలచినపుడే మనసుకు పరిమితి ఏర్పడును పరిమితి లేని (limitations) మనసును పొందకలిగినపుడు ఆ మనసు తనను తానే దర్శింపకలుగును అపుడు మానవుడు తన యనుభవములోని లోపములను తొలగించుకొనకలుగును అనుభవము లోపలనే జ్ఞానశక్తి యున్నది ప్రపంచములోని పరిమితులకు లోనగు రూపములకు అతీతమైన స్థితికి చేరుటకు యీ శక్తి ప్రేరణ కలిగించును అది అతీతమైన స్థితి మాత్రమే ద్వైత అద్వైతములలో చెప్పిన పరమాత్మ కాదు పరిమితుడైన (limited) జీవి అపరిమితత్వము (limitless) పొందుటకు జేయు కృషి ఫలించినపుడు ఆత్మశక్తి కలుగును అదియే జ్ఞానశక్తి

పరిమితమైన, పరిమితరహితమైన రెండు పదార్థములు పరస్పర విరుద్ధముగా కనబడును కాని అవి ఒకే పూర్ణత్వములోని రెండు అంశములు అందుకే జైనతత్త్వమున ఏకత్వములో అనేకత్వము, అనేకత్వములో ఏకత్వము చెప్పబడినది ఇదే జైన బహుజీవ సిద్ధాంత సారాంశము బహుజీవ సిద్ధాంతమందు కేవలము ఆత్మకాని, కేవలము పదార్థము కాని లేవు అవి రెండును తర్కము ద్వారా ఏర్పడిన రూపములే సత్యము ఒకటి (ఏకము) మాత్రమే అదే పూర్ణత్వము శుద్ధ ఆత్మ, శుద్ధ పదార్థము (purely spiritual and purely material) రెండు విధములైన దాని సంకల్పరూపములే అవి పరస్పరం వ్యతిరేకముగా కనబడును కాని అవి పూర్ణత్వములోని అంశములే విడదీయరానివి అన్నిటి రూపము ఆ ఏక ఆత్మశక్తియే (ఏకసత్యము) అదియే ప్రపంచమున అనేక రూపములలో కనబడును శుద్ధ ఆత్మ, శుద్ధ పదార్థముల

యొక్క భిన్నత్వము చివరకు పూర్ణత్వ దర్శనము కలిగినపుడు తొలగిపోవును

జైనతత్త్వము మనస్సునకు, దాని చర్యలకు ప్రాధాన్యము నిచ్చినది అదే వారి ప్రధాన ప్రమాణము మానసిక వ్యాపారమైన ఆలోచనలకు కనబడు జగత్తు రూపమే సత్యమైనది అనినచో అది సగుణ బ్రహ్మ ఏకత్వమును (విరాట్ స్వరూపుడైన బ్రహ్మము) (పరబ్రహ్మము కాదు ఏలనన పరబ్రహ్మ నిర్గుణము) పోలియుండును (concrete Monism) ఇదే శుద్ధ చైతన్యమైన పరిపూర్ణత్వము (Absolute) అనినచో అది నిష్క్రియాత్మకమైన శక్తి అనగా క్రియలేని చైతన్యము ఇది స్థాణువైన (స్థిరమైన) ఈశ్వరత్వము అది శూన్యముతో సమానమైనదే కాని జైనతత్త్వమున సిద్ధాత్మ ఒక స్థితిగా (condition of soul) చెప్పబడినది ఆ స్థితి యందు ఆత్మ తన బంధముల నుండి విడివడి స్వాతంత్ర్యమును పొంది ఊర్ధ్వగమన (upward movement) శక్తి పొందును అందు అధోగమనముండదు (no downward movement) కానియీ సిద్ధాత్మ స్థితి, ఊర్ధ్వ గమనము తార్కికముగా నిర్వచించుటకు సాధ్యపడదు పూర్ణ లేక సిద్ధాత్మస్థితి ఇంద్రియగోచరము కాదు ఊహకు కూడ అందదు కాని ఆత్మకు సహజ స్వభావముచే పూర్ణత్వమున్నదని, అది ఆటంకముగానున్న వానిని తొలగించినచో ఆ సహజ పూర్ణత్వము కనబడును అని జైనుల దృఢ విశ్వాసము సర్వమును గ్రహించగలుగు సహజశక్తి ఆత్మకున్నదని, దానిని వ్యక్తపరచుటకు సాధనలున్నాయని జైనులు చెప్పారు అంతియే కాక జైనులు మరియొకటి కూడ చెప్పారు మనసుకు అతీతమైన 'కేవలి' (అనగా పూర్ణస్థితి) కి అతీంద్రియ జ్ఞానమున్నదని అన్నారు ఇది పరిపూర్ణమైన అపరిమితమైన అద్వైత తత్త్వమునకు చేర్చును తాత్కాలికమైన యీ వస్తువులతో కూడిన ప్రపంచమంతయు అసత్యమైనదని అది సత్యమునకు శూన్యమునకు కాక మధ్యమార్గమున కదులుచున్నదని తలచవలసివచ్చును ఆత్మకున్న 'పరమసత్య స్వరూప స్థితిని' విస్మరించినచో అపుడు గోచరమగు ప్రపంచము సత్యమని చెప్పుటకు వీలగును అట్లుకాక "ఆత్మ సత్యస్వరూప స్థితిని" మనము గుర్తించినచో

అనాత్మ రూపమైనదంతయు పరిపూర్ణ సత్యము కాదని తెలియును 'అనాత్మ' స్వరూపము 'సత్య స్వరూపము' యొక్క ఛాయ మాత్రమేయని బోధపడును అది జ్ఞానదృష్టితో మాత్రమే తెలియనగును అపుడు అనాత్మశక్తి వలన గోచరమగు అనగా ఇంద్రియముల ద్వారా కనబడు యీ ప్రపంచమంతయు తాత్కాలికము, అసత్యము అని తెలియును అది శంకరాచార్యులు చెప్పిన శుద్ధాద్వైత స్థితియే కదా! కాని జైనులు ఆ స్థితికి చేరుటకు అంగీకరించక అలాగని పూర్ణత్వ స్థితి లేదని చెప్పక మధ్యమార్గము నవలంబించి బహుజీవ సిద్ధాంతమును ప్రవేశపెట్టారు ఇది దైవతత్త్వమును గురించి (attitude to god) జైనుల దృక్పధము ఇంతకు మించి చర్చించుటకు యీ గ్రంధ పరిమితిలో సాధ్యపడదు

**ఇపుడు బౌద్ధ దైవతత్త్వము (attitude to god)** బుద్ధుని కాలమున మతము, దైవమానవ సంబంధము వ్యాపారాత్మకమైనవి ఉపనిషత్తులు బ్రహ్మజ్ఞానమును బోధించినవి అది మహోన్నతమైన తత్త్వము కాని అదే సమయమున బహుదేవతారాధనము ఆచరణలోనున్నది గ్రహగోళములకు వ్యక్తి గుణారోపణము (personify) చేయుట, పంచభూతములకు, చెట్లు, చేమలను, సర్పములను, నదులు, పర్వతములను, జంతువులను దైవశక్తి సంకేతములుగా ఊహించి పూజించుట సర్వసామాన్యమైపోయినది దైవత్వమును అనేక భౌతిక రూపములకు తగిలించి, విశృంఖలముగా అనేక వికృత దైవరూపములను కల్పించటం జరిగింది ఆ దేవతారూపములకు ఉన్నతస్థానం సృష్టించటం కూడ జరిగింది ఉపనిషత్తులు యీ అసంఖ్యాకము లైన, కల్పితములైన దేవతామూర్తులను పూర్తిగా తిరస్కరించినవి అయినను ఆ కల్పిత దేవతల ప్రభావము సమాజముపై శాశ్వత ముద్ర వేసినది అది నాటిది కాని దాదాపు 2500 సంవత్సరములు గడచిన తరువాత నేటికి కూడ మౌఢ్యముతో అసంఖ్యాక కల్పిత దేవతామూర్తులను పూజించుచుండటం మన అందరికి తెలిసిన విషయమే సృష్టికర్తలు దేవతలని, మానవ కష్టసుఖములకు

దేవతలే కారణమని ప్రకటించు ఘనులు నేటికీ సమాజమున లెక్కకు మించియే యున్నారు కదా! దీనికి తోడు నాడు, నేడు మతమునకు కొంత భయము తగిలించబడినది ఈ భయమే మూఢత్వమునకు మూలము ఈ భయము మూలమున స్తోత్రములు, వ్యాపార సరళిలో మ్రొక్కుబడితో కూడిన ఆరాధనలు మానవ సమాజమునకు ఆవరింపజేసిన దుస్థితిని నిర్మూలించవలెనని బుద్ధుడు నిశ్చయించుకొనెను అందుకు అతనికి దేవతాభావ నిర్మూలనమే తగిన మార్గమని తోచెను సృష్టి ఎలా ఏర్పడినది, జీవులు ఎలా ఉద్భవించినవి అను ప్రశ్నలకు సమాధానములు తన ఆశయమునకు తోడ్పడవు అని తలచెను పైగా దాని వలన బానిసత్వ భావన, బాధ్యతలను విస్మరించుటచే నిష్క్రియతతో సోమరితనము ప్రబలును అని బుద్ధుడు విశ్వసించెను

దేవుడు కర్తయని అంగీకరించినచో ప్రపంచములో జరుగుచున్న మంచి చెడులకు అతడే కర్త కావలసి యుండును అపుడు మానవ కర్మలు నిరర్థకమగును అనగా మానవుడు నిష్క్రియుడగును దేవతలను స్తోత్రములతో తృప్తిపరచుట ఒక్కటే మానవుని ధ్యేయమగును ఇది భక్తియోగ విమర్శ కాదు భక్తియోగమనగా దేవుని తృప్తిపరచటం కాదు భక్తియోగమును గురించి అనంతర అధ్యాయములో చర్చించబడును ఆనాటి, ఈనాటి వ్యవహారిక భక్తి ధ్యేయము దేవుడు శిక్షించునను భయముతోను, వాంఛలు నెరవేర్చుకొనుటకు మ్రొక్కులు వంటి యిచ్చి పుచ్చుకొను 'వర్తకతుల్య సంబంధము' అది భక్తి కాదు

దైవమే ఒకరిని సుకృతునిగాను, మరొకరిని దుష్కృతునిగాను లేక ఒకరినే ఒక క్షణములో సుకృతునిగాను మరుక్షణంలో దుష్కృతునిగాను, అలాగే యోగిని నేరస్థునిగాను, నేరస్థుని యోగిగాను క్షణంలో చేయగలదైనచో ధర్మ జీవనమునకు, సత్శీల ప్రవర్తన సాధనకు ప్రాధాన్యము నశించి మానవుడు ఉదాసీనుడగును "నారు పోసినవాడే నీరు పోయును" అను నానుడి

భావార్థము పెడర్థమునకు దారితీయును దైవము సర్వమునకు కర్తయైనచో మన దోషములకు, దుష్కృతములకు అతడే కర్త కావలయును అపుడు మన దోషములను మన్నింపుమని అతనిని కోరటంలో అర్థముండదు సత్ప్రవర్తనకై ప్రయత్నము వృథా యగును ఎచటనో ఎపుడో తటస్థించు స్వర్గ నరకములను గురించి భ్రమలు కల్పించబడినవి అందుచే మానవ స్వప్రవర్తన ద్వారా కలుగు ధర్మ అధర్మ ఫలితములు తటస్థములాయెను (neutral) దైవప్రార్థన ద్వారా అరచేతిలో సుఖముండునను భ్రమ ప్రబలినది ఈ వాతావరణములో బుద్ధుడు ధర్మము సుఖము, అధర్మము దుఃఖములకు గల పరస్పర సంబంధము ప్రకటింప నిశ్చయించుకొనెను

తమ కర్తృత్వమును దేవునిపై పడవేసి భారము అతనిదే అను మూఢత్వముతో స్వయంకృషిని పూర్తిగా విస్మరించు మూర్ఖ పద్ధతిని చూచి బుద్ధుడు దైవము, కర్తృత్వము అను విషయములను వదలి యీ లోకమున వ్యక్తి యొక్క ధర్మాధర్మములను గురించి తద్వారా సుఖమును గురించి మాత్రమే తన ప్రబోధనలందు ప్రాధాన్యము నిచ్చెను ప్రకృతి రూపములకు శక్తియున్నది కాని వాటికి దైవత్వమును ఆపాదించినపుడు మతమౌఢ్యమునకు దారితీయును ప్రకృతి రూపములను ప్రకృతిలో గల సహజ విధానము ననుసరించి అర్థము చేసికొనినచో మతమౌఢ్యము వలన ఏర్పడు భ్రాంతి తొలగును నిర్గుణ దైవారాధన (పరబ్రహ్మ జ్ఞానము) ద్వారా యోగశక్తి కలుగును కాని సగుణ దైవారాధనను పూర్తిగా విస్మరించనవసరము లేదు భయము, వాంఛలతో కూడిన సగుణ దైవారాధన మూఢత్వమునకు దారితీయును సగుణదైవము ద్వారా నిర్గుణ బ్రహ్మజ్ఞాన సాధన ఉత్తమము సగుణ దైవారాధన దైవము సర్వమునకు కర్త అను భావముతో కూడినచో అది కర్మ సిద్ధాంతమునకు విరుద్ధము కర్మ నియతిననుసరించియే సర్వము జరుగును దేవుడు దయామయుడనినచో లోకమువ భయంకర బాధాకర సంఘటనలున్నవనుటకు సాధ్యముకాదు సుఖదుఃఖములకు కర్మయే

కారణము అని అంగీకరించినపుడు దేవుడు దయామయుడను విశ్వాసము కర్మఫలమును భరించుటకు వలసిన మనోధైర్యము కలుగును ప్రపంచమున జరుగు అన్నిటికి కర్మసిద్ధాంతమే సరియగు అర్థము నీయగలదు దేవతలున్నారని అంగీకరించినను కర్మసిద్ధాంతమునకు వారితో పనిలేదు దేవతలు కూడ కర్మసూత్రమునకు బద్ధులని కర్మ సిద్ధాంతము చెప్పును మానవుడు స్వకర్మవశుడు

సృష్టికర్తయగు సర్వేశ్వరుడు (supreme creator) ఒకడున్నాడను సంప్రదాయవాదమును, వస్తువులందు గల సహజశక్తి వలననే యీ ప్రపంచము ఏర్పడును, నడచును అను భౌతికవాదుల (Materialists) స్వభావవాదమును బుద్ధుడు తిరస్కరించెను ప్రపంచమునందలి భిన్నత్వమునకు (diversity) కారణము కర్మయే అన్నాడు కర్మలకే నిర్ణయాధికారము కలదు కర్మల ఫలములననుసరించియే యీ లోకము నడచుచున్నది ఒకడు కర్మ ఫలముననుసరించి సూర్యుడంతటివాడు కావలసి వచ్చినచో అతడు అటులే జన్మించును దాని కనుగుణమైన అధికారము, సౌకర్యములు కూడ కర్మఫలముననుసరించి ఏర్పడును సృష్టి ఆరంభమునందు కూడ పూర్వసృష్టిలోని వ్యక్తుల కర్మఫలములకనుగుణముగా అనంతర సృష్టి ఏర్పడును అన్నారు అనగా జీవుల గత కర్మల ఫలితరూపమే వర్తమాన లోకము

కాని సృష్టిని గూర్చి సంప్రదాయవాదుల అభిప్రాయము భిన్నముగనున్నది సృష్టిని గడియారముతో పోల్చిరి సృష్టించబడిన ప్రపంచము వలెనే గడియారము సృష్టించబడినది ప్రపంచము వలెనే గడియారము నడచును అన్నారు కాని గడియారము సృష్టించిన వాడొకడున్నాడు అటులే లోకము సృష్టించిన దేవుడు ఒకడున్నాడందురు బుద్ధుడీ వాదమును తిరస్కరించెను విత్తనము వృక్షముగా మారును దానికి ఎవరి అవసరము లేదు అటులే ఒక దేవునితో నిమిత్తము లేకుండ సృష్టి జరగవచ్చును

వస్తువులు, ఆలోచనలు, క్రియా (కర్మ) ఫలితములే అటులే సుఖదుఃఖాను భవములు కూడ కర్మ ఫలితములే అన్నారు బౌద్ధులు కర్మఫలితమైన జీవితమును లేక సంసారమును బౌద్ధులు ఒక చక్రముతో పోల్చారు ఆ చక్ర చలనమునకు వలసిన శక్తి ఆ చక్రములోనే ఉన్నదని చెప్పారు గ్రుడ్డు నుండి కోడి, కోడి నుండి గ్రుడ్డు అటులే పరంపరగా ఏ సహాయము లేకుండ పుట్టుచుండును నేత్రములు, చెవులు, దేహము, జీవము (life or spirit) నిత్యము ప్రపంచముతో సాంగత్యము (contact) పొందుచుండును ఈ సాంగత్యము వలన అనుభవము, ఆకాంక్ష, ప్రవృత్తి కలుగుచున్నవి వీటి వలన జరుగు కర్మ ఫలితముగా తిరిగి నూతన జన్మ రూపమున కళ్లు, చెవులు, దేహము ఏర్పడుచున్నవి "ఇదియే నిరంతరము, శాశ్వతమును అయిన ధర్మచక్ర ప్రవర్తనము" (the everlasting law (or) wheel of righteousness) దాని గమనమును మనము మార్పు చేయజాలము బుద్ధుడు రక్షకుడు అనుట కంటే ఒక బోధకుడు అనుట సమంజసముగా నుండును సత్యమును దర్శించుటకు మార్గము చూపుటయే అతని ధ్యేయము ఈ ప్రపంచమందు ఎన్నో యుగాల క్రింద సంసారమనబడు పరంపరకు సృష్టికర్త యొకడున్నాడని బుద్ధుడు తలచలేదు ఈ సంసార (ప్రపంచ) ప్రవాహమునకు మూలము లేక కారణము సంసారమే (ప్రపంచమే) తప్ప మరొకరు కాదు అన్నాడు అంతరిక్షము (cosmos) సృష్టికర్త, సృష్టి యతని కార్యము మొదలగునవి అతని దృష్టిలో నిరర్థకమైనవి వస్తువులెట్లు ఏర్పడుచున్నవో తెలియుటకు వస్తువులను వదలి మరొక చోటుకు పోవనవసరము లేదు అని భావించాడు కార్యమునకు కారణమే పూర్వమైనది అను వివరణ నిశ్చితమైనది కాకపోయినను మనిషికి అంతకు మించి తెలుసుకొనుటకు సాధ్యము కాదు ఈ సృష్టికి ప్రధమ కారణమును ఊహించినను ఆ కారణము నిష్కారణమగును కదా! అపుడది తనకు తానే విరుద్ధమగును కారణము కార్యము ఒక పరంపరగా తలచి ప్రతి కారణమును ఒక ఫలితముగా గ్రహించి దానికి కారణము అంతకు పూర్వము

దానిలో నున్నట్లు తలచినచో ప్రతి కారణము తానే ఫలితము కూడా నగును అపుడు కార్యకారణ పరంపర ఆది అంతము లేనిదై ప్రథమ కారణం ఏమిటి అను సమస్య ఉత్పన్నం కాదు అటులే కర్తలేని సృష్టిని గురించి తర్కము కూడ నిరర్థకమే యగును ఏలనన సృష్టికి కర్త యుండినచో అతడు జీవులను బాధించు దురుద్దేశముతోనే పనిలేక యీ సృష్టి చేసినవాడగును సృష్టియంతయు దుఃఖమయమే గదా! ఈశ్వరుడు సృష్టికర్తయైనచో అతడు పరిపూర్ణుడై యుండడు పరిపూర్ణుడైన ఈశ్వరుడు అసంపూర్ణమైన సృష్టిని చేయడు గదా! అందుచే దయామయుడైన ఈశ్వరుడు యీ సృష్టికి కారణము కాదు ఈ సృష్టి యతని లీలయైనచో అతడు ఒక పనిలేనివాడు బాధ్యత లేని విలాస పురుషుడై యుండాలి అందుచే యీ సృష్టిని నిర్దయతో నడుపునది కఠినమైన "ఒక సూత్ర నియతి" మాత్రమేనని బుద్ధుని అభిప్రాయము ఆయన అభిప్రాయములో యీ జగత్తు మంచిది గాని చెడ్డది గాని, దయారహితమైనది గాని, పూర్ణమైనది గాని కాదు ఈ "ప్రపంచమంతయు మానవతా లక్షణములు గల ఒక (anthromorphism) శక్తి వలన నడచుచున్నట్లు కనబడును" అన్నాడు అవసరమును గురించి ఒక నియమముతోనే యీ లోకము నడచుచున్నది అంతియే కాని ప్రకృతి (లోకము) బయట నుండి ఆపాదించబడిన, లేక విధించబడిన ఏ సూత్రమునకు లోబడదు అని నిర్ణయించెను

సంసారము అనగా ప్రపంచము ఒక చక్రము, అది నిరంతరం తిరుగుచునే యుండును జన్మ పునర్జన్మల వలన మానవుడు అందు తగుల్కొని, దాని నుండి బయటపడుటకు ప్రయత్నం చేస్తుంటాడు కాని సంసార స్వభావము వలన నిరాశ చెందనవసరం లేదు అని ఉపనిషత్తులు చెప్పున్నాయి మానవుని ఆత్మోన్నతికి తోడ్పడు విధముగనే యీ సంసారము లేక ప్రపంచము సంకల్పించబడినది అని ఉపనిషత్తుల సారాంశము కాని బౌద్ధమతము కూడ అటులే చెప్పుచున్నదా? లేదు బౌద్ధమతము సత్యము, నిత్యము అయిన పరమాత్మతత్త్వమును అంగీకరించలేదు

బౌద్ధుల ఉపదేశము వారి కర్మ సిద్ధాంతములోనే యున్నది సృష్టికి పూర్వము ఒక ఉద్దేశము కాని తరువాత ఆశయము కాని లేవు అని బౌద్ధులు తర్కించారు నిత్యము, సత్యము అయినది కర్మ నియమమే అన్నారు సృష్టికి వెనుక ఒక పరమసత్యము 'సత్' ఉన్నదని ఉపనిషత్తులు చెప్పును మరి యీ రెంటికి భేదమేమైనా ఉన్నదా? భావము ఒకటే రూపములు భిన్నములు అదియే భేదము కర్మననుసరించి సృష్టి వైచిత్ర్యము రాదు కర్మననుసరించి జీవితములో సుఖదుఃఖములు, హెచ్చుతగ్గులు కలుగుచున్నవి కాని ఉపనిషత్తులు చెప్పు నిత్యమైన ఆత్మతత్త్వము కర్మ సిద్ధాంతమునకు వ్యతిరేకము కాదు సర్వవ్యాపియైన పరమాత్మగా కాక బహురూపియగు విలాస పురుషునిగా చెప్పినపుడు ఆ విశ్వాసమును తిరస్కరించుటకు కర్మ సిద్ధాంతముపయోగపడును బుద్ధి ఊహలతో కూడినది ఊహల ద్వారా లోకమును గురించి అది అనేక కల్పనలను చేయును విజ్ఞానముతో కూడిన జీవితమునకు సంబంధము లేని పరబ్రహ్మమును గూర్చి కూడ యిట్టి ఊహలు లేక భావములు ఉపనిషత్తులలో కూడ అక్కడక్కడ కనబడును కాని ప్రధాన ఉపనిషత్తులు వివరించిన బ్రహ్మతత్త్వము మనస్సున కతీతమైనది దానిని నిర్వచించుటకు సాధ్యపడదు 'సత్'ను గూర్చిన అట్టి భావము జీవితమునకు అతీతమైనది "జీవితముతో సంబంధము లేని అట్టి బ్రహ్మ పదార్థము మానసిక కల్పన మాత్రమేనని" బుద్ధుడనెను ఋజువు చేయుటకు సాధ్యపడని బ్రహ్మ పదార్థమున్నదని, లేదని తర్కించుటకు మనకు అధికారము లేదని బుద్ధుని వాదన మన విజ్ఞానము పరిమితమైనపుడు పరమాత్మను గూర్చిన మన భావములు కూడ పరిమితమే అగును అన్నాడు పరబ్రహ్మమును గూర్చిన జ్ఞానము పరోక్షము లోకము, దాని స్వభావము ప్రత్యక్షము అప్రత్యక్షమైన దానికంటే ప్రత్యక్షమైన దానిని గూర్చి విచారించుటయే మేలు అని బుద్ధుని వాదన అనేక రూపములతో కూడిన యీ ప్రపంచము అనంతసాగరము కార్యము, కారణముల సంబంధముచే నది నిత్యము పరిణామములకు లోనగుచుండును ఈ

పరిణామములు సృష్టికర్త లీలలుగా భావించనవసరము లేదని బుద్ధుడు తలచెను అంతియేకాని 'సత్'ను గూర్చి ఉపనిషత్తులు చెప్పిన దానిని బుద్ధుడు తిరస్కరించలేదు ఉపనిషత్తులు, బౌద్ధమతము గూడ జీవిత దుఃఖమును గూర్చియే చెప్పియున్నవి కాని దుఃఖమొకటియే నిత్యము సత్యము కాదు, దుఃఖము లేని స్థితిని తెలుసుకొనుటకు "నిద్రాణమైయున్న ఆత్మశక్తి"ని మేల్కొలుపుటకు ఉపనిషత్తులు, బౌద్ధము కూడ కృషి చేసినవి జగత్తు ఆత్మమయము ఆత్మను తెలిసికొనుట ద్వారా దుఃఖమును నిరోధించవచ్చునని ఉపనిషత్తులు చెప్పను కోరికలు పాపరూపములు వాటిని నిరోధించుట ద్వారా దుఃఖమును నిరోధించవచ్చునని బుద్ధుడు చెప్పెను ప్రకృతికి వెనుక నిత్యసత్యమైన 'సత్' పదార్థమున్నదని యీ సృష్టి ఆ ఆత్మశక్తి స్పందన పరిణామమే యని అంగీకరించనిచో సృష్టి ఉద్దేశము లేని యెడారి యగును అని రాధాకృష్ణ భావించారు క్రమము, నైతిక నియమముతో కూడినది యీ ప్రపంచ గమనము ఉద్దేశము లేనిచో ఆ గమనము నిరర్థకమగును గమ్యము లేని గమనమును బుద్ధుడు అంగీకరించలేదు నిత్య పరిణామములకు లోనగు యీ సృష్టి అనగా ప్రపంచము లేక ప్రకృతి వెనుక ఒక నిత్య 'సత్' (సత్యము) ఉన్నదని బుద్ధుడు యెరిగియే యుండునని అనిపించును దానికివ్వబడిన పేరులోనే బౌద్ధమునకు, ఉపనిషత్తులకు గల భేదము దానిని కర్మయనవచ్చును, ధర్మమనవచ్చును, నిత్యసత్యమనవచ్చును ఏ పేరున చెప్పినను నిత్యసత్యము మారదు ప్రపంచ పరిణామములు ఇంద్రజాల మహిమలు కాదు ప్రపంచము వెనక 'నిత్య సత్' శక్తి ఉన్నదని అంగీకరించనిచో ప్రపంచము ఇంద్రజాల ప్రదర్శనమే యగును

కర్మ నియమము ద్వారా చిత్తశుద్ధి పొంది మానవుడు తన జీవన నియమములను ఏర్పరచుకొనవలయును ఈశ్వరుడున్నాడని బుద్ధుడు అంగీకరించలేదు ధర్మమే (righteousness) నిత్యము యీ లోకమును పాలించును ధర్మమే ఈశ్వరరూపము దానిని బుద్ధుడు గుర్తించెను

కర్మసూత్రము పూర్తిగా మానసికము కాదు, జడమైన శక్తి మాత్రమేనని బుద్ధుడు చెప్పలేదు అణుసమూహములను, వాటి సమ్మేళనము ద్వారా వస్తువులను కల్పించగల ఆ శక్తి కేవలము జడశక్తి కాదు "ప్రపంచ పరివర్తనమునకు కారణమై, నిత్యమై, స్వయంపోషకమైన అనంతశక్తి లేదని బుద్ధుడు చెప్పిన వాక్యము ఒక్కటియును లేదు" అని తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు ప్రపంచ విధానమును పరిశీలించినచో నొక విశ్వధర్మముననుసరించి అది నడచుచున్నదని గ్రహించగలము ఈ జగత్తు నిరంతరము పరిణామమునకు లోనగుచున్నది పరిణామము సత్యము కాని నిత్యము కాదు మార్పు చెందుచుండును ఈ పరిణామము అనుసరించు విశ్వధర్మమునకు మూలము పరబ్రహ్మమున్నదని సూచనగా మనకు తెలియుచున్నది గదా! తాత్త్వికముగా చెప్పినచో యీ విశ్వధర్మము ఒక దివ్య పురుషుని మానసమందు సంకల్ప రూపమున జనియించి యుండునని గ్రహింపవచ్చును ఆ సంకల్పము నిర్గుణ పరమాత్మ యొక్క సగుణ చైతన్యరూపమున వెలువడినదిగా గ్రహింపవచ్చును

చపలచిత్తుడైన దేవుడొకడు అకారణముగా ధర్మక్రమమున కల్పించుకొనునను దైవతత్త్వము కర్మసిద్ధాంతమునకు వ్యతిరేకము అట్టి దేవుని నిరసించుట దేవుని అస్తిత్వమును ప్రశ్నించుట కాదు ప్రపంచ గమనము దైవత్వమునకు వ్యతిరేకము కాదు జగత్తునకు కారణమైన పరమాత్మ స్థితి మన జ్ఞానమునకు అందదు అంత మాత్రము చేత అది లేదని చెప్పుట కుతర్కమగును ధర్మసూత్రం అమోఘమైనది దానిని బుద్ధుడు అంగీకరించినాడు కాని అట్టి ధర్మమునకు మూలమైన పరమాత్మను గుర్తించక మౌనము వహించినాడు ఏదియు హేతువునకు విరుద్ధముగా జరగదు పరిణామ పరంపరలు నిర్హేతుకములు కావు ఈ ప్రకృతి పురోగతి పరమత్మ యందే యున్నదను జ్ఞానమువలననే జగత్పరిణామము నిర్హేతుకము కాదు అను విశ్వాసము స్థిరపడును దేవుడు కోపగించునను భయముతోను, దేవుని

దయ కొరకు స్వార్థముతో కూడిన భక్తిని బుద్ధుడు వ్యతిరేకించి ధర్మబద్ధమైన స్వచ్ఛమైన మతమును స్థాపించుటకు కృషి చేసెను "ప్రపంచము నిర్జీవ సమూహముతో మాత్రమే నిండినది కాదు, సజీవమైన ధర్మరూపమని బుద్ధుడు నిర్ణయించెను ' "చరములతోను, అచరములతోను నిండిన యీ ప్రకృతి నిర్మాణ విధానమే ధర్మము అని బుద్ధుడు నిర్వచించెను " ప్రకృతిలో జరుగు ప్రతిదానికి కారణము దానిలోనున్న జీవము యొక్క స్పందనవే నిష్కామతత్త్వమునకు ఆధారము ఆ విశ్వ జీవతత్త్వము (universal spirit) దానిని బుద్ధుడు గ్రహించి యుండడు అని చెప్పలేము

స్వాభావికముగ మనిషి ఒక దేవుని కోరును దేవుని విషయంలో బుద్ధుడెంత మౌనం వహించినను తుదకు బుద్ధునే ఒక దేవుని చేశారు అతని అనుచరులు తాను తత్త్వమార్గదర్శిని, ఒక జ్ఞానిని మాత్రమేయని బుద్ధుడు చెప్పినను, సామాన్య జనులు అతనే రక్షకుడని పూజించనారంభించారు సామాన్య జనుల మత భావములను బుద్ధుడు అంగీకరించవలసి వచ్చెను అందువలన దేవతలను గూడ మనుష్యులుగానే చిత్రించెను సృష్టికర్త యనువాడు లేడనిన బుద్ధుడు సామాన్య జనులు ఆరాధించు దేవతలను పరిగణనలోనికి తీసికొనవలసివచ్చెను మానవులకు దేవతలకు 'సంపర్కము' అంగీకరించెను దేవతలు కూడ బౌద్ధమతము స్వీకరించినట్లుగా చెప్పబడెను వేదమతములోని దేవతలు బౌద్ధసన్యాసుల శిష్యులుగా అనేక గాథలు కల్పించబడినవి త్రిమూర్తులు కూడ మాయామోహితులైరనియు, బుద్ధుడొక్కడే మాయామోహములకు లోను కానివాడని కథల ద్వారా ప్రచారం జరిగింది

యుగయుగముల నుండి ఒక ప్రవాహరూపమున సాగునది జ్ఞానము కాని యీ జ్ఞాన ప్రవాహము ఏదైనా ఒక తార్కికమైన పరిణామక్రమమును అనుసరించి ఉన్నటుల మనకు గోచరించదు ఒక తాత్త్విక సిద్ధాంతమునకు మరియొక సిద్ధాంతమునకు మధ్య పరిణామ సంబంధము కనబడదు ఒకదానిని

మరొకటి తిరస్కరించటం కనబడుతుంది కాని ఆ తిరస్కరణలలోనే ఒక అప్రకటిత ప్రాథమిక సామ్యము (basic similarity) కనబడును బుద్ధుడు జ్ఞానజ్యోతిసాధన బోధించెను కాని నిగూఢము మూలము అయిన విషయములను వదలివేసెను అయినను ఉపనిషత్తులలోని యనేక భావములు బౌద్ధతత్త్వములో కనబడును బుద్ధుడు తానొక నూతన ధర్మ ప్రవక్తనని చెప్పలేదు ఉపనిషత్తత్త్వము వేదములకు భిన్నముగా నున్నది బౌద్ధము కూడ వేద ప్రమాణమును గ్రహించలేదు ఉపనిషన్మతము బౌద్ధము రెండును కర్మకాండలు హేతురహితములని తిరస్కరించినవి యజ్ఞకర్మలు, తపస్సులు మోక్షమార్గములు కావని చెప్పినవి ఉపనిషత్తులలోని పారిభాషిక పదములైన నామరూపములు, అవిద్య, కర్మ పరిపక్వము లేక కర్మవిపాకము, ఉపాధి, ఉపాదానము, ప్రకృతి, ఆత్మ, నివృత్తి, నిర్వాణము మొదలగునవి బుద్ధుడు తన సంభాషణములందు ఉపయోగించెను ధర్మనియమములను సామాన్య మానవునికి అందుబాటులోనికి తీసుకుపోవటమే బుద్ధుని ధ్యేయము ఉపనిషత్తులు చెప్పిన విషయములు సామాన్యునికి అందుబాటులో ఉండవు వాటికి గల భాష్యములు, వ్యాఖ్యలు సామాన్యునికి తెలియవు ఉపనిషత్తుల సారాంశమును నిత్యజీవితములో అనుష్ఠాన ప్రదముగా (useful in practical life) చేయుటకు బుద్ధుడుపక్రమించెను అందువలన నిగూఢ విషయములను వదలి మిగిలిన విషయములను సరళముగా జనసామాన్యమునకు అందజేసెను "ఈ విధముగా బుద్ధుడు ఉపనిషత్తులను సామాన్య ప్రజల స్వాధీనము చేసెను" అని సర్వేపల్లి రాధాకృష్ణ అన్నాడు ఎవరో కొద్ది మంది వద్ద గుప్తనిధిగా నుండిన ఉపనిషత్తుల జ్ఞానమును సామాన్యునికి అందజేయుట వలన బౌద్ధము నేటికిని ప్రపంచములో సజీవముగానే యున్నది ఆదిశంకరాచార్యుల వంటి తత్త్వజ్ఞానులు ఉపనిషత్తుల జ్ఞానమునకు పునర్జీవము కలిగించుట వలన భారతదేశములో బౌద్ధమతము మరుగునపడినది ఉపనిషత్తులపై విప్లవోద్యమము బుద్ధుడు ప్రారంభించలేదు తన ధ్యేయమునకు అనుగుణముగా

కొన్ని నిగూఢ విషయములను విస్మరించెను ఆ విస్మరించబడిన విషయము అనగా ఆత్మ-పరమాత్మ సంబంధము ఉపనిషత్తుల జ్ఞానము నందు ప్రధానమైనది దానిని వదలి మిగిలిన వాటినే పరమసత్యముగా బుద్ధుడు ప్రకటించుట వలన బౌద్ధము ఉపనిషత్తులకు వ్యతిరేకము అను అభిప్రాయము ఏర్పడినది

అయినను భారతీయ తత్త్వ విచారణా సంప్రదాయములో బౌద్ధమునకు స్థిరమైన స్థానము ఏర్పడినది ఉపనిషత్తులకు పునరుజ్జీవనము కలిగించు ఉద్యమములో బౌద్ధమతతత్త్వ విషయములు కొన్ని హిందూమతములోనికి చొరబడినవి జీవితమును గురించి సదవగాహన, భూతదయ, శీలప్రాధాన్యము (value of character), కర్మ సిద్ధాంతము అనుష్ఠాన యోగ్యముగా మారుట, తోటి మానవుని క్షేమమునకు తోడ్పడుట, హేతువ్యతిరేక భావములను బయటపెట్టుట వంటి విషయములు వేదమతముపై బౌద్ధమత ప్రభావమునకు మచ్చుతునకలు తుదకు బుద్ధుడు జనుల హృదయమందు దేవుడుగా సుస్థిర స్థానము పొందెను పౌరాణిక సాహిత్యములో అవతారమూర్తి అయినాడు బౌద్ధమతము భారతదేశములో నశించినను బుద్ధుడు మాత్రము భారతీయుల మనస్సులలో అమృతమూర్తిగా నిలిచియున్నాడు

చివరగా ఒక విషయము చెప్పవలసియున్నది ఈ అధ్యాయ ప్రధానాంశము కర్మ సిద్ధాంతము దాని పరిణామములు ఆ పరిమితికి లోబడి జైన బౌద్ధముల కర్మ సిద్ధాంతములను వివరించుట జరిగినది అందుకు వివరణాత్మకముగా జైన బౌద్ధమత సిద్ధాంతములను క్లుప్తముగా చెప్పవలసి వచ్చినది అంతేగాని జైన బౌద్ధ మతముల విస్తృత విశ్లేషణ, విభిన్న కోణముల నుండి విమర్శనాత్మక వివరణలు యిచ్చుట ధ్యేయము కాదు అది యిచట సాధ్యపడదు అందున బుద్ధుని అనంతర కాలమున బౌద్ధమతము నందు పరస్పర విరుద్ధ సిద్ధాంత పరిణామములతో లెక్కకు మించిన శాఖలు ఏర్పడినవి

నాగసేన, బుద్ధఘోష, నాగార్జున వంటి బాష్యకారుల వ్యాఖ్యలు ఏర్పడినవి అవి అన్నియు యిచట వివరించుటకు సాధ్యపడదు యీ అధ్యాయ పరిమితిలో అది యిమడదు కర్మ సిద్ధాంతమును గురించి మాత్రమే సాధ్యమైనంత వివరముగా జైన బౌద్ధముల దృక్పధములను పేర్కొనటం జరిగింది

## 5) పురాణ, ఇతిహాస యుగము కర్మ సిద్ధాంతము

జైన బౌద్ధ మతములకు పూర్వము అనగా సుమారు క్రీ॥పూ॥ 9వ శతాబ్దము నుండి క్రీ॥పూ॥ 7వ శతాబ్దము వరకు బ్రాహ్మణ మతము అనగా వేదమత పునరుద్ధరణ ప్రయత్నములు ప్రారంభమైనట్లుగా కనబడుచున్నది అటుపై జైన బౌద్ధముల వలన వైదిక మతము వెనుకబడినది అనంతరము క్రీ॥పూ॥ 2వ శతాబ్ధ ప్రాంతము నుండి వైదిక పునరుద్ధరణ స్థిరముగా ముందుకు సాగింది క్రీ॥పూ॥ 9వ లేక 10వ శతాబ్ద ప్రాంతమును అనంతర వేదయుగము అన్నారు ఈ కాలమునే పురాణ, ఇతిహాస యుగము అన్నారు కాని పురాణ, ఇతిహాసములందు చెప్పబడిన సామాజిక పరిస్థితులు యీ కాలమునకు చెందినవిగా కనబడుట లేదని కొందరు చరిత్రకారుల అభిప్రాయము మౌర్య సామ్రాజ్య (క్రీ॥పూ॥ 3వ శతాబ్దము) గుప్త సామ్రాజ్య (క్రీ॥శ॥ 4వ శతాబ్దము) మధ్యకాలము చారిత్రకముగా మరుగునబడిన కాలముగా చెప్పబడుచున్నది పురాణ, ఇతిహాసము లందలి సామాజిక విషయములు యీ కాలము నాటికి చెందినవిగా కనబడుచున్నవని మరికొందరి అభిప్రాయము పురాణ, ఇతిహాసములు క్రీ॥పూ॥ 6000-4000 సంవత్సరముల మధ్యకాలమునకు చెందినవి అని నిర్ణయించినవారు పురాణ ఇతిహాసములు క్రీ॥పూ॥ 3వ శతాబ్దము తరువాత క్రీ॥శ॥ 4వ శతాబ్దమునకు పూర్వము వ్రాయబడి యుండవచ్చును అను వాదమును నిర్ద్వందముగా తిరస్కరింతురు బాలగంగాధర తిలక్ మహాశయుడు పూర్వవేదభాగములు (ఋగ్వేద భాగములు) క్రీ॥పూ॥ 6000 సంవత్సరముల ప్రాంతమున రూపొంది యుండవచ్చునన్నారు ఆయన

వాదము కొంత మంది చరిత్రకారుల అంగీకారము పొందినది అనగా క్రీ॥పూ॥ 6000-4000 సంవత్సరముల మధ్యకాలములో వేదములు రూపొందినవి అని అంగీకరించినచో క్రీ॥పూ॥ [illegible] సంవత్సరముల యనంతర కాలములో పురాణ ఇతిహాసములు వ్రాయబడి యుండవచ్చును అని అంగీకరించవలసి యుండును రామాయణకర్తగా వాల్మీకి, వేదములను విభజించి నిర్దిష్టపరచుటకు మహాభారత ఇతిహాసమునకు, మరియు పదునెనిమిది పురాణములకు వ్యాసుని కర్తగా విశ్వసిస్తున్నాము గదా! రామాయణ కాలము క్రీ॥పూ॥ 5000 సంవత్సరముల ప్రాంతమని, మహాభారత కాలము క్రీ॥పూ॥ 3000 ప్రాంతమనియు కొందరి దృఢమైన వాదన వ్యాసుని శ్రీకృష్ణుని సమకాలీనునిగాను, మహాభారత యుద్ధమును స్వయముగా చూచినవానిగాను వీరు చెప్పుదురు పౌరాణికకర్త వ్యాసుడు గాన భారత ఇతిహాసము పురాణములు క్రీ॥పూ॥ 3000 సంవత్సర అనంతరము రూపొంది యుండునని విశ్వసించవలసియుండును కాని మహాభారత యుద్ధము క్రీ॥పూ॥ 1500 సంవత్సర ప్రాంతమున జరిగియుండునని మరియొక వాదన గూడ యున్నది దీని ననుసరించి వ్యాసుడు వేదముల విభజన క్రీ॥పూ॥ 15వ శతాబ్దమునకు పూర్వమే చేసియున్నను, పురాణములు, మహాభారత ఇతిహాసము యీ ప్రాంతముననే వ్రాసి యుండునని గ్రహించవలసి యున్నది ఇంతియేగాక మరియొక వాదన గూడ యున్నది క్రీ॥పూ॥ 3వ శతాబ్ది అనంతరము, క్రీ॥శ॥ 4వ శతాబ్దమునకు పూర్వము అనగా సుమారు 700 సంవత్సరముల కాలము ఏ కారణముల వలననైనను చారిత్రకముగా మరుగున (obscure) బడినది ఈ కాలమున బ్రాహ్మణ మత (వేదమత) పునరుద్ధరణ జరిగినట్లుగా చెప్పబడుచున్నది ఆ సందర్భముగా కాలానుగుణమైన అనేక మార్పులు, కూర్పులు, చేర్పులు పురాణ ఇతిహాస గ్రంథములందు జరిగి యుండవచ్చునను వాదన బలముగానున్నది దీనిననుసరించి వ్యాస వాల్మీకుల ఇతిహాసములు, వ్యాసపురాణములు ఇపుడు మనకు అందుబాటులో నున్నవి పూర్తి మూలరూపములు కావు అని తెలియుచున్నవి

మహాభారత కాలమును గురించి చారిత్రక తామ్రశాసనములు ఆధారముగా విశేష కృషి సలిపి పి హెచ్ డి డిగ్రీ పొందిన ఎక్కిరాల వేదవ్యాస్ మహాభారతము క్రీ॥పూ॥ 3000 సంవత్సరమునకు ముందే జరిగియుండునని నిరూపించుటకు ప్రయత్నము చేశారు మహాభారత యుద్ధానంతరము శ్రీకృష్ణుడు 36 సంవత్సరములు జీవించి క్రీ॥పూ॥ 3102లో నిర్యాణము పొందాడని అభిప్రాయపడ్డారు అప్పటికి శ్రీకృష్ణుని వయస్సు 125 సంవత్సరములు అన్నారు అనగా భారత యుద్ధము 3102 + 36 క్రీ॥పూ॥ 3138లో జరిగినది అని ఆయన నిర్ణయము శ్రీకృష్ణ నిర్యాణం తరువాత వ్యాసుడు జీవించియున్నాడని, పాండవుల స్వర్గారోహణ తరువాత హిమాలయాలకు వెళ్లి అక్కడ తపస్సులో నిమగ్నమైనాడని అన్నారు శ్రీకృష్ణుని నిర్యాణం రోజునే కలియుగం ప్రారంభమైనదని ఆయన విశ్వాసం శ్రీకృష్ణ నిర్యాణానంతరం ధర్మరాజు పరీక్షిత్తుకు పట్టాభిషేకం చేసి, సోదర సమేతంగా స్వర్గారోహణకై వెళ్లాడు (18-2-3102 B C అనంతరం వెంటనే యిది జరిగింది) పరీక్షిత్తు పాలన అనగా కలియుగ ప్రారంభంలో వ్యాసుడు మహాభారత మరియు పురాణ రచన గావించాడని ఆయన పరిశోధనా నిర్ణయము

భగవద్గీతలో బ్రహ్మసూత్ర విషయము ఉదహరించబడినది గాన గీతోపదేశమునకు ముందే వ్యాసుడు వేదవిభజనే, బ్రహ్మసూత్రరచన గావించి యుండును

"బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః" (13-5)

యుక్తులతో కూడి అనగా హేతువాదముతో బాగుగా నిశ్చయించబడిన బ్రహ్మసూత్ర వాక్యములచే నిర్ణయింపబడినది

వ్యాసుడు కృష్ణుని సమకాలికుడు, కృష్ణుని నిర్యాణము తరువాత కూడ వ్యాసుడు జీవించి యుండెనని చెప్పబడినది గదా! వ్యాసుడు శ్రీకృష్ణ నిర్యాణానంతరమే మహాభారత రచన, పురాణ ప్రవచనము చేసెను అయినను

ఆయన వ్రాసిన పదునెనిమిది పురాణములకు, అంతకు పూర్వము ఆయన తండ్రి పరాశరుడు వ్రాసిన ఆదివిష్ణు పురాణమునకు ఆధారమైనది, బహుపురాతనమైనది అయిన 'ఆదిపురాణము' అనునది ఉన్నదని అన్నారు అది వేదముల కంటే కూడ పూర్వకాలమునకు చెందినదని అనగా క్రీ॥పూ॥ 7000-10000 సంవత్సరముల ప్రాంతమున రూపొంది యుండవచ్చును అన్నారు

యుగాంతములలో పురాతన విజ్ఞాన గ్రంథములు నాశనమగుట, తిరిగి ఋషులు, యోగులు తమ తపస్సు, ధ్యానయోగముల ద్వారా వాటిని గ్రంథస్థం చేయటము జరుగుతూనే యున్నది అందువలన ఏది ఏ యుగము నాటిది, ప్రళయము తరువాత ఏది పునరుద్ధరింపబడినది నిర్ణయించుట మనకు సాధ్యపడదు ఈ ఆదిమ గ్రంథం లేక ఆదిపురాణం గురించి నారద, స్కాంద పురాణములో చెప్పబడినదని డా॥ ఎక్కిరాల వేదవ్యాస్ ఉదహరించారు వ్యాసుని పదునెనిమిది పురాణములే తప్ప యీ 'ఆదిగ్రంథము'ను చూచుటకు సామాన్యునికి సాధ్యపడదు అందువలన నారద, స్కాంద పురాణముల నుండి ఉదహరింపబడిన శ్లోకములు, చారిత్రకముగా మరుగైన క్రీ॥పూ॥ 3వ శతాబ్దము నుండి క్రీ॥శ॥ 4వ శతాబ్ద మధ్యకాలములో ఇతిహాస పురాణములలో జరిగిన కూర్పులు, మార్పులు, చేర్పులలోనిదే అయి యుండవచ్చునని ఎవరైనను భావించినచో వారిని నిందించలేము అందువలన ఈ 'పురాణ సంహిత' లేక 'ఆదిపురాణము'ను గురించిన చర్చ ఎన్నటికి తేలదు కాన అది యిచట చర్చనీయాంశము కాదు మనకు అందుబాటులోనున్న వ్యాసుని పురాణములే కర్మసిద్ధాంత పరిణామ అంశములకు ఆధారములు

ఇక రామాయణం రామాయణకర్త వాల్మీకి వాల్మీకి రాముని సమకాలికుడు ఆయన రామాయణం రాముని కాలంలోనే వ్రాశాడు కాని రామాయణములో (అయోధ్యకాండ - 109 సర్గ - 33-34 శ్లోకములు) బుద్ధుని నాస్తికత గురించి చెప్పబడింది అందువలన రామాయణం మహాభారత కాలం

తరువాతనే జరిగినట్లు వాదన యున్నది అయినచో అపుడు వాల్మీకి ఎట్లు వచ్చును బౌద్ధ సన్యాసి మతమునకు ప్రతిఘటనగా రామాయణము రూపొందియుండునని కొందరి భావన అనగా రామాయణ కాలము నాటి వాల్మీకి రచన బుద్ధుని అనంతరం మార్పు చెంది యిపుడున్న రూపములో మనకు చేరినదని భావించవలసియుండును ఏది ఏమైనను రామాయణగాధ మహాభారత పూర్వగాధయేయని నిర్ద్వందముగా చెప్పవలసియుండును

వాల్మీకి రామాయణమునకు తన ఆంగ్ల గద్య అనువాదమునకు పీఠికలో సి రాజగోపాలాచారి (రాజాజి) యిలా అన్నారు సంప్రదాయ దృక్పధముననుసరించి శ్రీరాముని జీవితకాలములోనే వాల్మీకి రామాయణము రచించెనని విశ్వసించబడినది కాని స్వాభావిక అనుభవ దృక్పధముతో పరిశీలించినచో వాల్మీకి రామాయణ రచనకు ఎంతో పూర్వకాలము నుండియే రామాయణగాధ గ్రంధరూపములో కాకపోయినను సజీవముగానే యున్నట్లు తెలియుచున్నది తరతరాల నుండి పరంపరగా అందించబడిన యీ గాధకు వాల్మీకి కావ్యరూపము యిచ్చినట్లుగా కనబడును ఇదే ఈ కధలోని కొన్ని కాఠిన్యముతో కూడిన సంఘటనలకు అర్ధము కలుగచేసింది వాలి వధ, రాముని ఆనతిన సీత వనవాసమునకు వెడలుట అట్టి సంఘటనలే

రామాయణ, మహాభారత పురాణముల రచనాకాలమును గురించిన పరస్పర విరుద్ధ వివిధ వాదములను చర్చించుటకు యిచట సాధ్యపడదు పురాణ, ఇతిహాసములు కర్మను గురించి ఏమి నిర్వచించినవో తెలుసుకొనుటయే యిచటి ప్రధానాంశము వేదకాలమును గురించి జరిగిన పరిశోధన తప్పు అని కంచి పరమాచార్య చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి అన్నారు వేదాలు అనాదివి ఎపుడు ఏర్పడినవో తెలియదు హేతువాద పరిమితులలో వేదకాల నిర్ణయ ప్రయత్నాలు జరిగినవి, జరుగుచున్నవి భూగోళ శాస్త్రపు ఆధారాలు, వేదభాషాశైలి, వేదాలలో కొన్నిచోట్ల చెప్పబడిన నక్షత్రాల ఉనికిని ననుసరించి

జ్యోతిషశాస్త్రపు లెక్కల ప్రకారం గ్రహకూటమితో క్రీ॥పూ॥ ఏదో సహస్రాబ్దమును వేదాలకు ఆదిగా నిర్ణయించటం శుష్క ప్రయత్నాలే అన్నారు

అందుచే కాలనిర్ణయమును గురించిన పరిశోధన అవసరమే అయినను చరిత్రకు అందని, తర్కమునకు లొంగని పురాణ ఇతిహాసముల కాలమును నిర్ణయించుటలో వైరుధ్యములు నిరంతరం సాగుతూనే ఉంటాయి కావున వాటిలో యిమిడియున్న అంతరార్థమును గ్రహించే ప్రయత్నమే మేలు

పురాణములు కేవలం కథల కోసం వ్రాసినవి కావు అందు కథల రూపంలో నిగూఢమైన ఆధ్యాత్మిక రహస్యములును విశ్వసత్యములు అంతరార్థముగ యిమిడియున్నవి పురాణాలను మతగ్రంథాలుగా మాత్రమే చిత్రించి సప్తాహాలు వగైరా చేయుట వలన పురాణ ఇతిహాస అంతరార్థము మరుగునపడి అవి కాశీ మజిలీ కథలుగా మిగిలిపోతాయి పురాణములు వేదార్థమునకు సంకేతములు సంకేతార్థము గ్రహించనిచో అందలి గాథలు భయముతో కూడిన మూఢభక్తికి దోహదము చేయును తిన్నడు మూఢభక్తుడే కాని అతనికి వాంఛలు లేవు, విజ్ఞానము లేదు అందుచే అతనికి భయము, ఆచారములు లేవు అతని మూఢత్వము విజ్ఞాన తార్కిక రహితమైన నిష్కలంకభక్తి కాని పురాణ అంతరార్థము తెలుసుకొనగల విజ్ఞానము అవకాశము కలిగియుండి పురాణకథలు మాత్రమే గ్రహించి తద్వారా నిరర్థకమైన సంప్రదాయములను, ఆచారములను కల్పించుకుని, వాటికి ఆచరణ యోగ్యత కల్పించుటకు అవి ఆచరించనిచో కలుగు బాధలను కల్పించి భయము సృష్టించుకుని దాని ఫలితముగా మూఢత్వము ప్రబలుటకు మనము తోడ్పడుచున్నాము అట్టి పురాణ శ్రవణము కాని, ఆడంబర పురాణ శ్రవణ కార్యక్రమములు గాని ప్రయోజకములు కావు అది మన బుద్ధిహీనతను చాటిచెప్పును

**పురాణములందలి కర్మసిద్ధాంతము**

భాగవత పురాణము (III-31-1) (తృతీయ స్కంధము, ముప్పది ఒకటవ అధ్యాయము, ఒకటవ శ్లోకము)లో కర్మలే జన్మకు మూలము అని చెప్పబడినది

కర్మణా దైవనేత్రేణ జన్తుదేహో పపత్తయే ।
స్త్రియాః ప్రవిష్ట ఉదరం పుంసోరేతః కణాశ్రయః ॥

కర్మఫలము ననుసరించి విధి (దైవ) ప్రేరితుడై దేహమును పొందుటకు జీవుడు పురుషుని రేతస్సు కణముల ద్వారా స్త్రీ గర్భములోనికి ప్రవేశించును

ఇంకను (III–32-38లో) యిలా చెప్పబడినది

అవిద్యా కర్మ నిర్మితాః॥ అవిద్య (అజ్ఞానము) వలన కర్మలు ఏర్పడుచున్నవి

ఇదే పంచమాధ్యాయములో కూడ చెప్పబడినది కర్మ ఒక ఆశయం అనగా వాసన లేక వాంఛల రూపము అన్నారు

కర్మాశయం హృదయగ్రన్థి బన్ధ-మవిద్యయా సాదితమ ప్రమత్తః॥

అవిద్య కర్మలకు అభిప్రాయరూపము (V 5-14) కర్మలు హృదయగ్రంధిని (చిక్కుముడి వంటిది) కల్గించును అది లౌకిక బంధములకు మూలము సావధానముగా దానిని ఛేదించవలయును

తిరిగి తృతీయ స్కంధము ముప్పది రెండవ అధ్యాయము 1→21 శ్లోకములలో కర్మల వలన పరలోక ప్రాప్తి, పునర్జన్మలను గురించి చెప్పబడినది

గృహాసక్తుడైన వ్యక్తి గృహస్థ ధర్మముల ద్వారా ధర్మార్థకామములను అనుభవించును అట్టివాడు ఆత్మజ్ఞానము నుండి విముఖుడగును కామ (వాంఛ) మోహముతో యజ్ఞముల ద్వారా దేవతలను ఆరాధించును దేవతలను

గూర్చి వ్రతములు చేయును మరణానంతరము చంద్రలోకము చేరి సోమరసపానముతో ఆనందించి తిరిగి అధఃపతనము పొందును సంసారబంధము నందు ఆసక్తులై మానవులు బహువిధములగు కామ్యకర్మలను నిత్యకర్మలను చేయుట యందే నిమగ్నులై యుందురు వారు రజోగుణ ప్రధానులై ఇంద్రియాసక్తులు, గృహాసక్తులునునై నిత్యము పితృదేవతల నర్చించుదురు గృహ (సంసార) సక్తులు పితృలోకమునకు వెడలి తిరిగి తమ పుత్రాదులందు పౌత్రాదిక్రమముతో జన్మించి గర్భాదానము మొదలు, శ్మశానము వరకు గల సమస్త కర్మలు చేయుచుందురు పితృలోక భోగములతో పుణ్యము తరిగిపోగా వారు వివశులై తిరిగి మానవలోకమున పడిపోవుదురు ఇదే విషయము (III 31-31, 32)లో కూడ కనబడును

శ్లో॥ తదర్థంకురుతే కర్మయద్బుద్ధ్యోయాతి సంసృతిమ్।
యోఽనుయాతిదదత్క్లేశమవిద్యాకర్మబన్ధనః॥ 31

యద్యసద్భిః పథిపునః శిశ్నోదరకృతోద్యమైః।
ఆస్థితోరమతే జన్తుస్తమో విశతి పూర్వవత్॥ 32

అవిద్య వలన కర్మ వలన యీ దేహము జీవుని బంధమునకు కారణమై వానికి క్లేశము కలుగజేయును అదే జన్మజన్మలకు ఆ జీవుని అనుసరించును తిరిగి మూఢుడై జీవుడు ఆ దేహము కొరకే కర్మలు చేసి ఆ కర్మలకు బద్ధుడై సంసారమందు తిరుగాడుచుండును జీవుడు సన్మార్గము లందున్నను కొన్ని సమయములందు ఉదరపోషణకు, లైంగికతృప్తి కొరకు దుష్టసహవాసములకు దిగవలసి వచ్చును అట్టిచో తిరిగి దుష్కర్మ ఫలితమునే అనుభవింపవలసివచ్చును

తృతీయ స్కంధము ముప్పదవ అధ్యాయము ముప్పది నాల్గవ శ్లోకములో (III-30-34) దుష్కర్మ ఫలితములను అనుభవించుట ద్వారా జీవుడు శుద్ధుడగును అన్నారు

నిష్కామభక్తి ద్వారా కర్మఫలము నుండి విముక్తి పొందవచ్చునని భాగవత పురాణము చెప్పుచున్నది అట్టివారిని భగవంతుడు కర్మవిముక్తులను చేయును

శ్లో॥ ధర్మత్రాణాయసాధూనాం జన్మకర్మాపనుత్తయే॥ (XII-2-17)

సాధువుల కర్మ విముక్తి కొరకు, ధర్మరక్షణ కొరకు సర్వాంతర్యామి, జగదీశ్వరుడునునగు శ్రీహరి ఉద్భవించును

శ్లో॥ ధునోతి భగవాన్ హృతస్థోజన్మాఽ తాశుభమ్ ॥ (XII-3-46)

అనేక జన్మార్జితములైన మానవుల పాపపుణ్యములను శ్రీకృష్ణ భగవానుడు తొలగించును

ఇతర పురాణములందు కూడ వర్తమాన జన్మములోని కష్ట సుఖములకు గతకర్మ ఫలితములే కారణమని చెప్పుచున్నవి

బ్రహ్మవైవర్త పురాణము (3-11-19-24) యిలా చెప్పుచున్నది జీవులందరు తమ కర్మ ఫలమును తప్పక అనుభవింతురు సత్కర్మ దుష్కర్మ ఫలితములు ఎన్నటికి అంతము కావు అనుభవించుటయే వాటి నుండి విముక్తి కర్మల వలననే స్వర్గనరకములు కలుగును కర్మఫలముననుసరించియే పునర్జన్మ కలుగును కర్మఫలము వలననే పునర్జన్మలో మహారాజుగానో, సేవకునిగానో పుట్టును ధనికునిగానో, బీదవానిగానో పుట్టటం జరుగును జీవితములో అన్నిటికి గతకర్మలే కారణము

పురాణ వాఙ్మయములో కర్మమును ఒక కారణశక్తిగా చిత్రించారు జీవితములో అన్ని చర్యలకు గతకర్మలే కారణమని, కర్మఫలితముగానే దేహరూపము కలుగునని, చరాచర సృష్టికంతకు కర్మఫలితమే కారణమని వాయుపురాణము చెప్పుచున్నది

గతకర్మ కారణముననే జీవులు వివిధ వర్గములలో జన్మించుచున్నారని మత్స్యపురాణ వచనము కూర్మ పురాణము కూడ సర్వమునకు కర్మయే కారణమని చెప్పుచున్నది "సర్వత్ర కారణమ్ కర్మ శుభాశుభమ్ నసంశయః" (II 94-2) సర్వత్ర శుభాశుభములకు నిస్సంశయముగ కర్మయే కారణమని పద్మపురాణ ప్రవచనము "కర్మదాయాదకాలోకే కర్మసంబంధి బాంధవాః" (II 94-8) సంబంధ బాంధవ్యములకు కూడ గతకర్మయే కారణమని కూడ పద్మపురాణము చెప్పుచున్నది కర్మవలనే జీవుడు జనించును, కర్మ వలననే జీవుడు నశించును, సుఖదుఃఖములు, భయము బాధలు కర్మ వలననే కలుగును "సుఖమ్ దుఃఖమ్ భయమ్ శోకమ్ కర్మణైవ ప్రపద్యతే" (II 24-17) అని బ్రహ్మవైవర్త పురాణము నిర్వచించినది సర్వమునకు కర్మయే కారణమని పద్మపురాణవచనము

కర్మ, పునర్జన్మను గురించి వాయుపురాణం యిలా అన్నది (14-2)

"తథా సుకృతకర్మాతు ఫలమ్ స్వర్గే సమశ్నుతే ।
తస్మాత్ స్థానాత్ పునర్భ్రష్టో మానుష్యమనుపద్యతె ॥

సుకృత కర్మల ఫలితములు మనిషి స్వర్గములో అనుభవించును కర్మఫలం పూర్తికాగానే అతడు తిరిగి మానవుడుగా జనించును

మార్కండేయ పురాణము గూడ యిదే తెలియజేయుచున్నది (X-64) "తద్రూప దేహమ్ అన్యప్రపద్యతే" మరణ సమయమున బాధతో కూడిన దేహమును వదలి ఆ మనిషి ప్రాణము మరియొక శరీరములో ప్రవేశించును కర్మల ద్వారా కలుగు ఫలితము అనబడు శిక్షను అనుభవించుటకే భౌతిక శరీరము ఉద్దేశించబడినది అంతేగాని యదార్థముగ తలిదండ్రుల వలన ఏర్పడినది కాదు యీ భౌతిక శరీరము అని కూడ చెప్పినది గత కర్మలే ఆయుర్దాయమును, మరణమును నిర్ణయించును అన్నది ఇంకను మార్కండేయ పురాణము (XI-31) ఈ సంసార చక్రము ఘటయంత్రము

వంటిది (నూతి గిరక లేక ఏతము లేక బావి నుండి నీరు తోడుటకు కుండలతో కూడిన పెద్ద చక్రము) అని, అది ప్రకృతి నిబంధనలకు లోబడి మరల మరల తిరుగుచునే యుండును అన్నది

గత జన్మను గురించి, పునర్జన్మను గురించి మత్స్యపురాణం యిలా అన్నది తాను చేసిన పుణ్యపాపముల ననుసరించి మరణానంతరం జీవుడు మరియొక దేహమున ప్రవేశించును (39-18-19) "అన్యయోనిమ్ పుణ్యపాపానుసారమ్ హిత్వా దేహమ్ భజతే పుణ్యమ్ యోనిమ్ పుణ్యకృతో విశన్తి పాపమ్ యోనిమ్ పాపకృతో వ్రజంతి" పుణ్యము చేసిన జీవుడు పుణ్యాత్ముడుగాను, పాపము చేసిన జీవుడు పాపాత్ముడుగాను పునర్జన్మ పొందును గతకర్మ ఫలితముననుసరించి పునర్జన్మ రూపము ఏర్పడును మానవులు పశుపక్ష్యాదులుగా పునర్జన్మ పొందవచ్చును అన్నది (154-147-152) ఇది రూపకాలంకార భావ ప్రకటనగానే (metaphorical expression) తలచవలయును పశుపక్ష్యాదులుగా జన్మించవచ్చును అనగా పశుపక్ష్యాదులను పోలియున్నటుల కనబడు రూప స్వభావములు కలుగవచ్చును అని గ్రహించవలయును మహాప్రళయానంతరం జరుగు పునస్సృష్టి ఆవృత్తములో నుండును (cyclic) అనగా పునస్సృష్టి ప్రారంభ పరిణామములు గతసృష్టిని పోలియుండునని భావముగాని వర్తమాన సృష్టిలో జీవుని జన్మ పునర్జన్మలలో మానవ పశుపక్ష్యాది జన్మలు ఆవృతములో (cyclic) నుండునని అర్థము కాదు "పునరపి జననం పునరపి మరణం" అనునది ఒక పరంపర అది ఆవృతము కాదు సృష్టిలో పురోగమనమే గాని తిరోగమనముండదు

విష్ణుపురాణము (III 7-4→7) కర్మలు ఒక గొలుసు వంటివి అన్నది జీవితాంతమున జీవుడు యమునికి బానిసయై శిక్షలననుభవించును ఈ శిక్షల యనంతరము తిరిగి దేవతలుగానో, మానవులుగానో, లేక తత్సమరూపులుగానో జీవులు పునర్జన్మ పొందుచు నిరంతరము చక్రమున

తిరుగుచుందురు (VI-5 50→52) నరకము వలెనే స్వర్గము కూడ తాత్కాలికమే ఎచట నున్నను పునర్జన్మను గురించిన భయము జీవుని వెంటాడుచునే యుండును అని విష్ణుపురాణ వచనము (VI-7-16) సుఖము కొరకు మానవుడు అనేక కర్మలు చేయును దాని ఫలితముగ పునర్జన్మలో మరియొక శరీరము పొందును అలా నిరంతరం నూతన దేహములను పొందుచునే యుండును అగ్నిపురాణము కూడ (203-1-3) మరణానంతరమున జీవుడు మరియొక శరీరమును పొంది కర్మఫలమును అనుభవించును అన్నది (371-8-9) మరణ సమయమున ఆత్మ త్వరితగతిన బయటపడి మరియొక యోనిలో జన్మ పొందును "చ్యవన్తమ్ జాయమానమ్ వాప్రవిశాన్తమ్ చ యోనిషు" "గ్రహంతి తక్షణాద్యోగె శరీరమ్ చ అతివాహికమ్" సూక్ష్మ శరీరములోని యోగము ద్వారా లేక ఆత్మబంధము వలన వెనువెంటనే మరియొక శరీరమును పట్టుకొనును అని అగ్నిపురాణ వచనము పాపకర్మఫలము అంతమైన వెంటనే జీవుడు నరకము నుండి బయటపడును అని గరుడపురాణము (I 104 (1-3)) చెప్పుచున్నది మార్కండేయ పురాణములో చెప్పినటులే గరుడ పురాణము కూడ (I 225-11) ఘటయంత్రము వంటి యీ సంసార చక్రములో జీవుడు తిరుగాడుచుండును అని ప్రవచించినది "ఏవమ్ సమ్సారచక్రె అస్మిన్ భ్రమయతె ఘటియంత్రవత్"

పిల్ల తల్లివెంట ఉండునట్లు కర్మ కర్త వెంట నంటియేయుండునని అగ్నిపురాణము చెప్పుచున్నది (159-13) "వత్సవత్ ప్రాకృతమ్ కర్మ కర్తారమ్ విన్దతి ధృవమ్" కర్మ ఎంతయో ఫలితము అంతే యుండునని పద్మ పురాణ ప్రవచనము (II 94-7→9)" "యాదృశమ్ క్రియతే కర్మతాదృశమ్ పరిభుజ్యతే' పొలములో నాటిన విత్తును బట్టియే పంట ఫలము వచ్చును అని కూడ అన్నది పద్మపురాణం కాబట్టి జీవితములో కష్టసుఖములు జీవుని స్వయంకృత కర్మ ఫలితములేనని పురాణముల సిద్ధాంతము (A person reaps what he sows) స్వకర్మ ననుసరించియే జీవుడు బ్రహ్మ క్షత్రియ వైశ్య

శూద్ర వర్ణములను పొందునని బ్రహ్మవైవర్తము (II 24-(20-22) స్పష్టము చేసినది

స్వచ్ఛమైన భక్తి ద్వారా భగవంతుని అనుగ్రహము పొందుట ద్వారా గత కర్మ ఫలమును అధిగమించవచ్చునని పురాణములు చెప్పుచున్నవి అదియే మోక్షమునకు మార్గమని పురాణవచనం ఈ ధ్యానమార్గము మోక్ష మార్గమని విష్ణుపురాణము, మత్స్య, కూర్మ, గరుడ పురాణములు చెప్పుచున్నవి

గత కర్మనే విధి అని (Fate), దుష్కర్మ ఫలితమును పురుష ప్రయత్నము ద్వారా నిరోధించవచ్చునని కూడ పురాణములు చెప్పుచున్నవి పురుష ప్రయత్నమునే పురుషార్థము అన్నారు

శ్లో॥ ప్రతికూలమ్ తథా దైవవ్ పౌరుషేణ విహన్యతే
మన్గలాచారయుక్తానామ్ నిత్యముత్థాన శాలినామ్

మత్స్యపురాణమ్ (321-3)

విధి (దైవమ్) ప్రతికూలమైనను పురుషార్థ లేక పురుష ప్రయత్నము ద్వారా అనగా సత్కర్మల ద్వారా దానిని అనుకూలముగా చేసుకొనవచ్చును

గత సత్కర్మ ఫలములు పురుష ప్రయత్నము లేకుండగనే యీ జన్మయందు సిద్ధించునని మత్స్యపురాణవచనము స్వశక్తివలన స్వయంకృషి వలన కోరినది సాధించవచ్చునని మత్స్యపురాణము చెప్పుచున్నది (221-58) గత కర్మ వర్తమానములో కాని, భవిష్యత్తులో కాని ఫలితమునిచ్చును కాని పురుషార్థము (పురుష ప్రయత్నము) వర్తమానములోనే ఫలితమునిచ్చును అనగా విధి (గతకర్మ) మరియు పురుషార్థము కలిసి కాలముతో సంయుక్తముగా ఫలితమునిచ్చునని మత్స్యపురాణము వివరణ అంతేగాక సర్వము విధియేయని సోమరిగా కూర్చుండు మానవులు ఏమియు సాధించలేరని మత్స్యపురాణము హెచ్చరించుచున్నది (221-11-12) ఇదే అగ్నిపురాణము కూడ చెప్పుచున్నది (226-3→6)

శ్లో॥ పౌరుషమ్ దైవ సమ్పృత్యాకాలె ఫలతిభార్గవ
దైవమ్ పురుషకారశ్చద్వయమ్ పుమ్సః ఫలావహమ్ 226-3

విధి, కాలము కలసి పురుష ప్రయత్నము వలన కర్మఫలితము కలుగజేయును

ఇంకను

శ్లో॥ కృషేర్వృష్టి సమాయోగాత్ కాలెస్యుః ఫలసిద్ధ్యః
సధర్మమ్ పౌరుషమ్ కుర్యాన్నాలసోనచదైవాన్ 226-4

వర్షము పడినపుడే పంటఫలము దక్కును అటులే పుణ్యకార్యము ద్వారా విధిని నిరోధించవచ్చును విధి బలీయమని మనిషి సోమరిగా ఉండరాదు

**మహాభారతమునందలి కర్మసిద్ధాంతము**

పైన చెప్పబడి పురాణ కర్మ సిద్ధాంతము మహాభారతములో చెప్పబడిన కర్మ సిద్ధాంతముతోనే ఎక్కువ భాగము పోలియున్నది మహాభారతమందలి కర్మ సిద్ధాంతము సంప్రదాయబద్ధమైనది భగవద్గీత మహాభారతములోనిది ఉపనిషత్తుల సారాంశమే గదా భగవద్గీత అందువలన మహాభారతములోని కర్మసిద్ధాంతము ఉపనిషత్తులతో సామ్యము కలిగియున్నది

కర్మకు శక్తి గలదు, అనగా చేసిన కర్మఫలమును అనుభవించి తీరవలయును సర్వజీవులు కర్మబద్ధులు జ్ఞానము వలన కర్మబంధమును ఛేదించనగును అను ఉపనిషద్భావమే మహాభారత శాంతి పర్వములో కనబడును

"కర్మణా బధ్యతెజంతుః విద్యయాతు ప్రముచ్యతే"

ఇచట జంతుః అనగా జీవులు అని అర్థము

తండ్రి తాతల కర్మఫలము వారి సంతతికి ప్రాప్తించునని కొన్ని చోట్ల

చెప్పబడినది వ్యక్తి స్వేచ్ఛకు కర్మబంధమునకు మధ్య సామరస్యము (reconciliation) కల్పించు ప్రయత్నము జరిగినట్లు కనబడును అయినను కర్మ నియమము కఠోరమైనది కాన వ్యక్తి స్వేచ్ఛకు అవకాశము తక్కువ అను భావమునకే ఎక్కువ ప్రాధాన్యము యివ్వబడినట్లు కనబడును కాని మానవ ప్రయత్నము కర్మను మార్పు చేయగలదు అని కూడ చెప్పినది కర్మ నిప్పు వంటిది నిప్పును విసరి జ్వాలగా మార్చవచ్చును అదే నిప్పును ఆర్పివేయనువచ్చును ఇది మహాభారత సిద్ధాంతముగా తోచును

కర్మలు మూడు విధములన్నది సంచితము, ప్రారబ్ధము ఆగామి ఈ జన్మమునందు స్థూల శారీరము అనుభవించవలసిన పూర్వజన్మకర్మ ఫలములందు ఏది అనుభవములోనికి వచ్చుట ప్రారంభమగునో అట్టి కర్మను ప్రారబ్ధకర్మ అన్నది మిగిలిన పూర్వజన్మకర్మలు సంచితములు ఇక ఈ జన్మలో చేయు కర్మలు సంస్కారరూపములుగా ఆగామి కర్మలగును మహాభారతము చెప్పిన ఇంకొక ప్రధాన విషయమున్నది సంచిత కర్మలను, ఆగామి కర్మలను జ్ఞానము తోడను, ప్రాయశ్చిత్తము చేతను నిరోధించవచ్చును కాని ప్రారబ్ధ కర్మలను నిరోధించుట సాధ్యపడదు దైవకృప ద్వారా అనగా నిశ్చలభక్తి ద్వారా కూడా సంచిత ఆగామి కర్మలను నశింప చేయవచ్చును ఒక కార్యము చేయతలచినపుడు అది ఫలించుటకు కర్మఫలము యెంత అవసరమో సముచిత ప్రయత్నము గూడ అంతే అవసరము అని గ్రహించవలయునన్నది మరియు కర్మ నియమము భగవానుని అధీనము అన్నది పరమాత్మ స్వభావ ప్రకటనమే కర్మసూత్రము కర్మసూత్రము ధరించువాడు, ఆధారము, శక్తి పరమాత్మయే అన్నది అనగా సంచిత, ప్రారబ్ధ, ఆగామి కర్మల పరంపరకు పరమాత్మయే ఒక సూత్రము

పునర్జన్మను గూర్చి స్పష్టమైన నిర్వచనము భారతములో కనబడదు పితృయాన, దేవయానములు, నరకములున్నవని సూచించినది అమరత్వ

మనగా ఐశ్వర్యము కాదు జరామరణములు లేని నిత్యానందమునే అమరత్వ మన్నది యోగికి మాత్రమే అది సాధ్యము అని స్పష్టము చేసినది యోధునకు స్వర్గము లభ్యమగును భౌతిక దేహమును విడిచిన మునీశ్వరులు, యుద్ధభూమిలో మరణించిన వీరులు, నక్షత్రములగుదురని మహాభారత సందేశము పరమాత్మతో ఐక్యతతో కూడిన అనుసంధానమే లక్ష్యము కావలయునన్నది గోచరమగు ప్రకృతితో తనకు సంబంధము లేదు అని గుర్తించగలిగినపుడే విముక్తి సాధ్యమని మహాభారత తత్త్వములో నొక యంశము అశ్వమేధిక పర్వంలోని అను గీతలో చెప్పినట్లు దేహరూపముననున్న జీవుడు స్వచ్ఛమైన ఆత్మదర్శనము పొందగలిగినపుడు అతనికి పరిపూర్ణ స్వేచ్ఛ లభించును అతడు విశ్వమునకు అధిపతి, అతడు సంకల్ప మాత్రమున కోరిన దేహమును పొందగలడు తుదకు పరబ్రహ్మముతో ఐక్యత పొందును ఇది మహాభారతకర్మ సిద్ధాంత సారాంశము

"ఏవంపతతి సంసారే తాసుతాస్విహ యోనిషు
అవిద్యాకర్మ తృష్ణాభిర్భ్రామ్యమాణోధచక్రవత్" (వనపర్వము)

"ఈ ప్రకారముగ అవిద్య, కర్మ, తృష్ణల ద్వారా చక్రమువలె తిరుగుచు మనుజుడు సంసారమున వివిధ యోనులందు పడుచున్నాడు"

"రథః శరీరం పురుషస్యదృష్ట
మాత్మానియన్తేన్ద్రియాణ్యాహురశ్వాన్
తైరప్రమత్తః కుశలీసదశ్వై
ర్దాన్తైః సుఖంయాతిరథీవధీరః ॥ (వనపర్వము)

"ప్రత్యక్షముగ కనబడు ఈ స్థూల శరీరము ఒక రథము వంటిది బుద్ధి సారథి ఇంద్రియములు గుఱ్ఱములు నేర్పరి, అప్రమత్తుడు అయిన సారథి గుఱ్ఱములను వశపరచుకొని సుఖముగ పయనించునట్లు సాధన మనస్కుడు, సావధానపరుడు అయిన మానవుడు ఇంద్రియములను తన

వశము నందుంచుకుని జీవయాత్రను సుఖముగ సాగించును

"కర్మణః పురుషః కర్తాశుభస్యా ప్యశుభస్య చ
స్వఫలమ్ తదుపాసనాతి కథమ్ కర్తాస్విదీశ్వరః"

(వనపర్వము 181-5)

ఎవరు చేసిన కర్మ ఫలములను వారే అనుభవింతురు దానికి భగవంతుడు కర్త కాదు

"తత్రాస్యస్వకృతమ్ కర్మ ఛాయేవానుగతమ్ సదా ।"

(వనపర్వము (181-25)

ఎవరు చేసిన కర్మలు వారిని పునర్జన్మ యందు నీడవలె అనుసరించును

"య ఆత్మానౌ దుశ్చరితాద్ అశుభమ్ ప్రాప్నుయాన్నరః
ఎనసాన సదైవమ్ వాకాలమ్ వాగన్తు మర్హతి ॥"

(ఉద్యోగపర్వము 156-9)

మనిషి తన దుష్ట స్వభావము వలన కష్టములు పొందును దానికి అతడు దైవమును కాని కాలమును గాని నిందించకూడదు

"శయానంచానుశేతేహితిష్ఠన్తం చానుతిష్ఠతి
అనుధావతి ధావన్తం కర్మపూర్వకృతం నరమ్ " (స్త్రీపర్వము)

మానవుని పూర్వకృతకర్మ అతడు నిద్రించినచో వెంటనే నిద్రించును, లేచినచో వెంటనే లేచును, పరుగెత్తినచో వెంటనే పరుగెత్తును

"నాయమ్ పరస్య సుకృతమ్ దుష్కృతమ్ వాపిసెవతె
కరోతి యాదృశమ్ కర్మ తాదృశమ్ ప్రతిపధ్యతే॥"

(స్త్రీపర్వము 279-21)

ఒక మనిషి మరొకరి సుకృత దుష్కృత ఫలములను అనుభవించడు తాను చేసిన కర్మఫలమును తానే పొందును

"ఆత్మైవహ్యాత్మనొబన్ధురాత్మైవ రిపురాత్మనః
ఆత్మైవహ్యాత్మనః సాక్షికృతస్యాపకృతస్యచ ॥" (స్త్రీపర్వము)

మనుజుడు తనకు తానే బంధువు తనకు తానే శత్రువు తనకు తానే శుభాశుభకర్మలకు సాక్షి

"కర్మణా కాలయుక్తేన తథెదమ్ భ్రామ్యతెజగత్"
(శాంతిపర్వము 34-10)

కర్మలు కాలముతో కలిసి ప్రపంచమును త్రిప్పుచున్నవి జనన మరణములు కర్మ ఫలితములే

"స్వకర్మణా హతం హన్తి హత ఏవ సహన్యతే" (శాంతిపర్వము)

పాపి యగువాడు తన కర్మచే తనే చనిపోయియుండును కాబట్టి అతనిని చంపువాడు చచ్చినవానినే చంపుచున్నవాడు అగును

కోహిలోకస్యకురుతెవినాశప్రభవావుభౌ
కృతమ్ హితత్కృతెనైవ కర్తాతస్యాపి చాపరః
(శాంతిపర్వము 217-16)

ఈ ప్రపంచమునందు పునరుత్పత్తి నాశము ఎవరు చేయుచున్నారు? మానవుని విభిన్న కర్మలే ఇందుకు కారణము

జానతాతుకృతమ్ పాపమ్ గురుసర్వమ్ భవత్యుత
అజ్ఞానాత్స్ఖలితే దోషే ప్రాయశ్చిత్తమ్ విధీయతె
(శాంతిపర్వము 36-41)

ఉద్దేశపూర్వకముగా చేయబడిన దుష్కార్యములు చాల తీవ్రమైనవి ఉద్దేశము లేకుండ అనగా యాదృచ్ఛికముగ చేయబడిన దుష్కార్యములు తీవ్రములు కావు వాటిని ప్రాయశ్చిత్తము ద్వారా నిరోధించవచ్చును

"యాదృశంవపతే బీజం క్షేత్రమాసాధ్యకర్షకః
సుకృతే దుష్కృతే వాపి తాదృశం లభతే ఫలమ్ ॥"

(అనుశాసనిక పర్వం)

రైతు పొలములో విత్తనములు నాటును దానిననుసరించి అతనికి ఫలము లభించును అట్లే మనిషి పుణ్యము, పాపము అను ఏ కర్మను చేయునో తదనుసారము అట్టి ఫలితమే అతనికి దక్కును

మహాభారతము ననుసరించి మనుజుడు తన కర్మములననుసరించి కులము పొందును కాని గుణముల ననుసరించియే కులము వచ్చును అని కూడ చెప్పబడింది అనగా జన్మించుట ఏ కులము (వర్ణము) నందైనను అతని నిజమైన కులము గుణముల బట్టియే వచ్చునని గ్రహించవలసియున్నది

"యస్తు విప్రత్వముత్సృజ్య క్షాత్రమ్ ధర్మమ్ నిషేవతే
బ్రాహ్మణ్యాత్సపరిభ్రష్టః క్షత్రయోనౌ ప్రజాయతే ॥"

(అనుశాసనపర్వము 131-9)

బ్రాహ్మణుడు తన బ్రాహ్మణ ధర్మమును వదలి క్షత్రియ ధర్మము ననుసరించినచో అతడు బ్రాహ్మణత్వము నుండి పతనమొంది క్షత్రియుడుగా జన్మించును

"వైశ్యకర్మ చయోవిప్రో లోభమోహవ్యపాశ్రయం
బ్రాహ్మణ్యమ్ దుర్లభమ్ ప్రాప్యకరోత్యల్పమతిఃసదా
సద్విజోవైశ్యతామేతి వైశ్యోవాశూద్రతామియాత్
స్వధర్మాత్ప్రచ్యుతోవిప్రస్తతః శూద్రత్వమాప్నుతె ।"

(అనుశాసనపర్వం 131 (10-11))

దురాశా మోహితుడైన బ్రాహ్మణుడు అల్పబుద్ధి కలవాడై వైశ్యవృత్తిని చేపట్టును అట్టివాడు వైశ్యునిగానే జన్మించును అటులే శూద్రుని వృత్తిని అవలంబించు వైశ్యుడు శూద్రునిగానే జన్మించును బ్రాహ్మణుడు కూడ తన ధర్మమును వదలి శూద్రధర్మమును పాటించినచో శూద్రునిగానే జన్మించును

"సత్యం దానం క్షమాశీలమానృశంస్యంతపోఘృణా
దృశ్యన్తే యత్ర నాగేన్ద్ర సబ్రాహ్మణ ఇతి స్మృతః" (వనపర్వము)

ఎవని యందు సత్యము, దానము, క్షమ, సౌశీల్యము, క్రూరత్వ రాహిత్యము, తపస్సు, దయ - అను ఈ సద్గుణములుండునో, అతడే బ్రాహ్మణుడని చెప్పబడును

"బ్రాహ్మణః పతనీయేషు వర్తమానో వికర్మను
దాంభికోదుష్కృతః ప్రాయః శూద్రేణ సదృశోభవేత్ ॥" (వనపర్వము)

ఎవడు బ్రాహ్మణుడై యుండియు, పతనమను గోతియందు పడత్రోయు పాపకర్మలందు తగుల్కొనునో దుష్కర్మపరాయణుడై యుండునో, అతడు శూద్రునితో సమానుడేయగును

"యస్తు శూద్రోదమే సత్యేధర్మే చసతతోత్థితః
తం బ్రాహ్మణమహంమన్యేవృత్తేనహిభవేద్ ద్విజః॥" (వనపర్వము)

ఎవడు శూద్రుడైనను శమ, దమ సత్య ధర్మములను పాలించుటకు ఉద్యుక్తుడై యుండునో అతడు బ్రాహ్మణుడనియే నేను (ఇచట బ్రాహ్మణుడు (కౌశికుడు) ధర్మవ్యాధునితో చెప్పిన మాటలు) నమ్ముచున్నాను ఏలనన, మనుష్యుడు సదాచారము తోడనే బ్రాహ్మణుడగుచున్నాడు

"శృణుయక్షకులం తాతనస్వాధ్యాయో నచశ్రుతమ్

కారణంహి ద్విజత్వే చవృత్తమేవ న సంశయః (వనపర్వము)

బ్రాహ్మణత్వమునకు కారణము కులము కాదు స్వాధ్యాయము కాదు శాస్త్రశ్రవణము కాదు శుద్ధ ధర్మాచరణమే బ్రాహ్మణత్వమునకు కారణము

"కర్మభిః శుచిభిర్దేవి శుద్ధాత్మావిజితేంద్రియః
శూద్రోపి ద్విజవత్ సేవ్య ఇతి బ్రహ్మాబ్రవీత్ స్వయమ్ "
(అనుశాసనపర్వం)

శూద్రుడైనను జితేంద్రియుడై, పవిత్రకర్మల యొక్క అనుష్ఠానముచే తన అంతఃకరణమును పవిత్రమొనర్చుకొనినచో అతడు బ్రాహ్మణుని వలె గౌరవించతగినవాడు

శాంతిపర్వము, అనుశాసన పర్వములలో కాలము, విధి, కర్మల పరస్పర సంబంధము వివరించబడినది విధి, కర్మ పరస్పరము భిన్నములని భావించినట్లు కనబడుచున్నను తుదకు విధి, కర్మ పరస్పరము పర్యాయములనియే నిశ్చయించినట్లు తెలియుచున్నది

"కాలేన సర్వమ్ లభతే మనుష్యః" (వనపర్వము 26-5)

మానవులకు సర్వము కాలము వలననే లభ్యమగును కాలమే మనుష్యులకు పరిణతి కలిగించును కాలమే మనిషిని నాశనము చేయును కాలమే సర్వము సృజించును, కాలమే లయము చేయును (ఆదిపర్వము 1-188-189)

కాలమే సర్వమునకు కారణము (శాంతిపర్వము 220-72-73)

"కాలఃకర్తావికృతాచ"

కాలమునకు కర్మకు దగ్గర సంబంధము చెప్పినది శాంతిపర్వము

సత్కార్యములకు, దుష్కార్యములకు కర్మయే సాక్షి "సాక్షినామ్" అని చెప్పబడినది కర్మ ఫలితమును కాలమే కలిగించును (శాంతిపర్వం 34-7) కమ్మరివాడు (Black smith) తన అధీనంలోని పనిముట్టుతో ఇనుమును సాగగొట్టును అటులే కాలము తన అధీనములోని కర్మ ద్వారా ప్రపంచమును సజీవము చేయును (శాంతిపర్వము 34-10) "కర్మణా కాలయుక్తేన తథేదమ్ భ్రామ్యతేజగత్" కాలము, కర్మము ఏకముఖము అని మహాభారత నిర్వచనము

విధి (దైవము)కి కర్మకు అనుసంధానము కల్పించారు తుదకు కర్మయే విధి అన్నారు

కర్మను తప్పించుకొనుట సాధ్యముకాదు, అనుభవించి తీరవలయును అను కర్మ సిద్ధాంతమును కొన్నిచోట్ల అతిక్రమించినట్లు లేక మార్పుచేసినట్లు కనబడును

కర్మను నిరర్థకము చేయవచ్చునని, లేక మరియొకరికి మార్చుట, సత్కర్మ ఫలమును దానము చేయుట వంటి అవకాశములున్నవి అన్నారు

"తపసాకర్మాభిచైవ ప్రదానేన చ భారతా
పునాతి పాపమ్ పురుషః పూతశ్చేన్న ప్రవర్తతే" (శాంతిపర్వము 36-1)

తపస్సు, యజ్ఞకర్మ, దానము ద్వారా మనిషి తన పాపకర్మలను కడిగివేసుకొనవచ్చును కాని తిరిగి అట్టి కర్మలు చేయకూడదు

"యది నాత్మని పుత్రేషు, నచేత్పౌత్రేషు నప్త్రిషు
నహి పాపమ్కృతమ్ కర్మసద్యః ఫలతి గౌరివ" (శాంతిపర్వం 92-20)

ఒక వ్యక్తి చేసిన కర్మఫలము అది జరిగిన సమయమున అనుభవము లోనికి రాకపోవచ్చు కాని అది కర్త అనుభవములోనికి రానిచో అతని సంతానమునకు అనుభవములోనికి వచ్చును సంతానము అనగా అతని సంతానము కావచ్చు, మనుమలు, మనమరాండ్రు కావచ్చు, లేదా అతని

వారసులు కావచ్చు కర్మఫలమును సంతానమునకు లేక వారసులకు మార్చవచ్చు (transfer)

"కృతంచ వికృతమ్ కిన్చిత్ కృతే కర్మాణి సిధ్యతి
సుకృతే దుష్కృతమ్ కర్మ న యధార్థమ్ ప్రపద్యతె"
(అనుశాసనపర్వము 6-28)

సత్కర్మలు దుష్కర్మలను నిష్ఫలములు చేయవచ్చు సంచిత సత్కర్మలు వర్తమాన దుష్కర్మలచే నిష్ఫలములు కావచ్చు (అశ్వమేధికపర్వము) → దానములు చేయువాని దుష్కర్మ ఫలములు దానము గ్రహించిన వానికి అంటును దానము గ్రహించినవాని సత్కర్మ ఫలములు దాని చేసిన వానికి మారును

చివరగా (శాంతిపర్వము (37-8) కొన్ని సమయములందు ధర్మమే అధర్మముగాను, అధర్మము ధర్మముగాను, సత్యము అసత్యముగాను, అసత్యము సత్యముగా మారుచుండును అని మహాభారత సందేశము

**రామాయణములో కర్మసిద్ధాంతము**

రామాయణములో కర్మ సిద్ధాంతమునకు ప్రాధాన్యము కనబడదు మానవుని కష్టసుఖములు దైవ (విధి) ప్రేరితములు అని చెప్పబడినది సీతా, రామ, లక్ష్మణులు పడిన బాధలు వారి కర్మఫలములుగా చెప్పబడలేదు తనను అరణ్యమునకు పంపుటకు కైకేయి కోరిన వరములు దైవ ప్రేరితమే కాని అన్యము కాదని రాముడు లక్ష్మణునకు వివరించును (అయోధ్యాకాండము 22-16)

"యది భావోనదైవోఽయంకృతాంతవిహితోభవేత్"

కైకేయికి కలిగిన యీ అభిప్రాయము దైవకృతము కానిచో నామెకు నన్ను పీడించవలెనను బుద్ధి ఏల కలుగును?

"నాన్యద్దైవాత్సమర్థయే" - (అయోధ్యకాండ 22-18) కైకేయి కోరికకు కారణము దైవము తప్ప మరియొక కారణమును నేను సమర్థించను అని రాముడు అంటాడు

"యస్యన గ్రహణం కించిత్కర్మణోఽన్యతదృశ్యతే"
(అయోధ్యాకాండ 22-21)

కైకేయి ప్రదర్శించిన వైపరీత్యమునకు కారణము దైవముకాక మరొకటి కారణమని తనకు తెలియుట లేదు అంటాడు రాముడు

ఇంకను రాముడిలా అన్నాడు

"సుఖదుఃఖేభయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ
యచ్చకించిత్తథా భూతం ననుదైవస్య కర్మతత్॥"
(అయోధ్యకాండ 22-22)

సుఖము, దుఃఖము, శాంతము, క్రోధము, లాభము, నష్టము, జననము, మరణము అను వాటికి కారణము ఊహింపరానిది వాటికి దైవము తప్ప మరొకటి కారణము కాదు మరియు

"అసంకల్పితయేవేహ యదకస్మాత్ప్రవర్తతే
నివర్త్యారంభమారబ్ధం నను దైవస్య కర్మతత్ ॥"
(అయోధ్యకాండ 22-24)

ప్రారంభించిన కార్యమునకు భిన్నముగను, యాదృచ్ఛికముగను (తలంపకుండ) ఏ కార్యము అతిశీఘ్రముగ జరుగునో అది దైవము సంకల్పించిన కర్మయనియే తలంపవలెను అని రాముని సందేశము చివరకు రావణుడు మరణించిన తరువాత అతని భార్యలు అతని మరణము దైవప్రేరితమే అన్నారు

"న కామకారః కామం వా తవరాక్షస పుంగవ
దైవం చేష్టయతే సర్వం యతం దైవేన హన్యతే" (యుద్ధకాండ 113-23)

ఓ రాక్షసశ్రేష్ఠా! నీ మరణము నీ యిచ్ఛ ననుసరించి మాత్రమే కలిగినది కాదు సర్వము దైవమే చేయుచున్నది దైవము చేత హతుడైన వానినే శత్రువు చంపుచున్నాడు

ఇలా సర్వము దైవప్రేరితమే అని చెప్పబడినను కొన్ని చోట్ల కర్మ ప్రస్తావన కూడ యున్నది పుత్రవియోగ బాధలోనున్న దశరధుడు కర్మఫలమును గూర్చి ప్రస్తావించును

"యదాచరచి కళ్యాణి! శుభంవా యదివాఽశుభమ్
తదేవలభతేభద్రే! కర్తా కర్మజమాత్మనః" (అయోధ్యకాండ 63-6)

మానవుడు చేయు పని ననుసరించియే ఫలము శుభమో, అశుభమో జరుగును పుత్రవియోగ దుఃఖములో కౌసల్య కూడ యిటులే తన బాధపూర్వకర్మ ఫలితముగా తలంచును

"నిస్సంశయం మయామన్యేపురావీర! కదర్యయా
పాతు కామేషు వత్సేషుమాతౄణాం శాతితాస్తనాః ॥"
(అయోధ్యాకాండ 43-17)

పాలు త్రాగుచున్న దూడలను తమ తల్లుల నుండి తాను పూర్వజన్మలో దూరము చేసియుందునని, దాని ఫలితముగ యిపుడు పుత్రవియోగము అనుభవించుచుంటినని కౌసల్య విలపించును ఇదే విషయము రాముడు లక్ష్మణునికి చెప్పాడు

"నూనం జాత్యంతరే కస్మిన్ స్త్రియః పుత్త్రైర్వియోజితాః
జనన్యామమసౌమిత్రే తస్మాదేతదుపస్థితమ్ ॥"
(అయోధ్యాకాండ 53-19)

పూర్వజన్మము నందెన్నడో తన తల్లి స్త్రీలను వారి పుత్రుల నుండి వేరుచేసియుండునని, ఆ కర్మఫలమే యీ దుఃఖమని రాముడు విలపించును

ఒకరి కర్మ ఫలము మరియొకరు అనుభవించుట కుదరదు అని కర్మసిద్ధాంతము కదా! కాని యిచట తల్లి కర్మఫలము తనయులు కూడ అనుభవించుచున్నట్లు చెప్పబడినది తల్లికి పుత్రవియోగము అనగా పుత్రులు దూరమైనపుడే గదా! ఇచట కర్మఫలము యిరువురకు సమన్వయించబడినదని భావించవలయును

పూర్వకర్మఫలమును గురించి తిరిగి అరణ్యకాండలో ప్రస్తావించ బడినది సీతాపహరణము తరువాత రాముడు విలపించుచు లక్ష్మణునితో నిట్లనును

"పూర్వం మయానూనమభీప్సితాని
పాపానికర్మాణ్యసకృత్కృతాని,
తత్రాయ మద్యాపతితో విపాకో
దుఃఖేనదుఃఖం యదహం విశామి ॥" (అరణ్యకాండ 63-4)

తాను పూర్వమెపుడో అనేక పాపకృత్యములు ఆచరించియుందునని, అది సత్యమే అయియుండును తనకు సంభవించుచున్న దుఃఖము తరువాత దుఃఖము వచ్చుటకు ఆ పాపకర్మఫలమే కాని వేరు కాదు అని రాముడు విలపించును

వాలి వధ అయిన తరువాత విలపించుచున్న తారను హనుమంతుడు ఓదార్చుచు కర్మఫలమును గూర్చియే చెప్పను

"గుణదోషకృతం జంతుః స్వకర్మఫలహేతుకమ్
అవ్యగ్రస్త దవాప్నోతి సర్వంప్రేత్యశుభాశుభమ్ ॥"
(కిష్కింధాకాండ 21-2)

ప్రతి జీవుడు తన పూర్వకర్మలననుసరించి తెలిసియో తెలియకయో తానుచేసిన సత్కర్మ, దుష్కర్మలకు అనుగుణముగా సుఖదుఃఖములు తనను అనుసరించును అతడు పరలోకమున వాటిని అనుభవించును సుగ్రీవునిచే వాలి చంపబడెనని తలంపరాదు ఎందుకనగా వాలి స్వకర్మ ఫలితముగానే చనిపోయాడు సుగ్రీవుడు కేవలం నిమిత్తమాత్రుడు కాని అదే సమయమున రాముడు తార మొదలైన వారిని ఊరడించుచు సర్వమునకు భగవంతుడే కారణము అన్నాడు

> "నియతిః కారణం లోకే నియతిః కర్మసాధనం
> నియతిః సర్వభూతానాం నియోగేష్విహ కారణమ్"
>
> (కిష్కింధాకాండ 25-4)

భగవంతుడే లోకములన్నింటికి కారణము భగవంతుడే సకల కర్మలకు సాధనము అతడే సకల జీవులను నియమించువాడు

> "నకర్తా కస్యచిత్ కశ్చిత్ నియోగేచాపినేశ్వరః
> స్వభావేవర్తతేలోకస్తస్యకాలః పరాయణమ్॥"
>
> (కిష్కింధాకాండ 25-5)

ఎవ్వడును యే కార్యమునకు కర్త కాలేడు మరొకరికి ప్రేరకుడు కూడ కాలేడు లోకమంతయు కాలమునకు వశమై నడచును కాలమే సర్వమునకు మార్గము కర్మ పరిపక్వత అనగా కర్మ ఫలములు అనుభవము లోనికి వచ్చుట కాలముననుసరించి కలుగును కాలము గడిచిన తరువాతనే కర్మ పరిపక్వత కలుగును

> "నకాలస్యాస్తి బంధుత్వం నహేతుర్నపరాక్రమః
> నమిత్రజ్ఞాతి సంబంధః కారణం నాత్మనోవశః॥"
>
> (కిష్కింధాకాండ 25-7)

కాలమునకు ఎవ్వనితోను బంధుత్వముగాని పక్షపాతముగాని ఉండదు కాలమును వశపరచుకొనుటకు ఉపాయము గాని కాలము జయించుటకు తగిన పరాక్రమముగాని లేవు కర్మానుగుణముగ ఫలమును వర్తింపజేయునదే కాలము అని రాముని సందేశము

పుత్రవియోగముతో దుఃఖించు దశరధుడు తాను పూర్వము తెలియక మునికుమారుని చంపిన కర్మఫలమే నేటి పుత్రవియోగదుఃఖము అంటాడు

"తస్యాయం కర్మణోదేవి । విపాకస్సముపస్థితః
అపథ్యైస్సహసంభుక్తే వ్యాధిరన్నరసే యధా॥"

(అయోధ్యకాండ 64-60)

అపథ్యము చేసినప్పుడు వ్యాధి వృద్ధి చెందును అటులే తాను ఆనాడు చేసిన పాపకర్మఫలమే యీనాడు కలిగినదని దశరధుడు వాపోవును

సీతను వెదకబోయిన వానరులతో సంపాతియను గృధ్రరాజు (గ్రద్ద) విధిని గూర్చి యిట్లనెను

"విధిః కిలనరంలోకే విధానేనానువర్తతే
యధాయంవిహితో భక్ష్యశ్చిరాన్మహ్యముపాగతః ॥"

(కిష్కింధాకాండ 56-4)

ఇచట విధి ప్రస్తావించబడినది విధి ననుసరించి యే లోకము నడచుచుండును విధి ననుసరించియే వానరులు తనకు ఆహారరూపమున నచటకు వచ్చిరి అనును విధి కర్మకు పర్యాయమా? చెప్పబడలేదు

అశోకవనములోనున్న సీతను చూచిన హనుమంతునితో సీత తన దుఃఖమునకు కారణము తన పురాకృత కర్మమే కాని వేరొండుగాదు అనును ఇచట తిరిగి కర్మ ప్రస్తావన వచ్చినది

"భాగ్యవైషమ్యయోగేన పురాదుశ్చరితేనచ,
మయ్యైతత్ ప్రాప్యతే సర్వం స్వకృతం హ్యుపభుజ్యతే ॥"
(యుద్ధకాండ 116-39)

పూర్వకర్మఫలమనుభవింప తప్పునా అనును

కర్మను గురించిన ప్రస్తావనలున్నను రామాయణమందు మానవుని కష్టసుఖములకు విధిలేక దైవనిర్ణయమే కారణము అను విశ్వాసము అధికముగా కనబడును కర్మమును గురించిన ప్రస్తావనలు అనంతర కాలమున రామాయణ కావ్యములో చోటు చేసికొనిన ప్రక్షిప్తములు అయి యుండవచ్చు ననిపించును

తత్త్వశాస్త్రము, కర్మసిద్ధాంతము భిన్నములు కావు గత, వర్తమాన, ఆగామి కర్మల ప్రవాహమే కాలము కాలము యొక్క రూపమే గోచరసృష్టి పరిణామములు ఆ పరిణామములకు మూలము పరమాత్మ ఆ పరమాత్మను గురించిన వివేచనమే తత్త్వశాస్త్రము వాల్మీకి రామాయణము ఒక సుప్రసిద్ధమైన ఇతిహాసము ఇది మహాభారతము వలె 'నానామత భావసంపుటము కాదు' మతతత్త్వ దృక్పథములో మహాభారతమునకు గల ప్రాముఖ్యము రామాయణమునకున్నట్లు కనబడదు అయినను రామాయణము తత్త్వవివేచనరహితము కాదు ఇతిహాసము కావున తత్కాలము నాటి విశ్వాసములనే ప్రధానము ప్రదర్శించినది గృహస్థ ధర్మమును పోషించినది మోక్షసాధనకు సంసారమును త్యజించవలసిన అవసరములేదన్నది శ్రీరాముడు ధర్మమునకు అవతారము పరిపూర్ణతకు మూర్తి మహాభారతము కూడ ఇతిహాసమే కాని అది వాల్మీకి రామాయణము వలె మహాకావ్యము కాదు మహాభారతము వివిధ తత్త్వభావసంపుటము అయినను రామాయణ మహాభారతముల రెంటి యందు కర్మఫలానుభవ ప్రస్తావనలున్నవి కాని కర్మసిద్ధాంత నిర్వచనము స్పష్టముగా లేదు రామాయణమందు కర్మఫలానుభవ ప్రస్తావనలున్నను సర్వమునకు విధి లేక దైవ నిర్ణయమే కారణమను

విశ్వాసమునకే అధిక ప్రాధాన్యము యివ్వబడినది కాని మహాభారతము భిన్న విశ్వాసముల సంకలనముగానే కనబడును వాటిని సమన్వయము చేయు ప్రయత్నము కనబడదు భిన్నభావ సమన్వయ ప్రయత్నము భగవద్గీతలో కనబడును మహాభారత యుద్ధారంభ సమయమున భగవద్గీత ఉపదేశించబడినది యుద్ధము సమాప్తమైన తరువాత అర్జునుడు యుద్ధారంభ సమయమున శ్రీకృష్ణుడు తనకుపదేశించిన గీతను తిరిగి తనకుపదేశింపమని శ్రీకృష్ణుని కోరును కాని శ్రీకృష్ణుడు భగవద్గీత యోగదృష్టితో ఉపదేశించినదని, తత్సమానమైన యోగదృష్టి తిరిగి పొందుట దుర్లభమని పలికి దానికి మారుగా అనుగీత బోధించును అనేక తత్త్వశాఖలున్నట్లు అనుగీత అంగీకరించును ఈ భిన్న విశ్వాసముల సమన్వయము ద్వారా కర్మసిద్ధాంతమునకు ఒక నిర్వచనము నిచ్చుటకు భగవద్గీత యందు ప్రయత్నము జరిగినది

**భగవద్గీత యందలి కర్మసిద్ధాంతము**

గుణమును బట్టి కర్మము జరుగును అని భగవద్గీత నిర్ణయము సత్వ, రజస్తమోగుణములు వాటికి అనుగుణమగు కర్మలకు తగిన స్వభావము కల్పించును అవిధముగ కర్మలు మూడు విధములని భగవద్గీత చెప్పినది అవి 1) సాత్విక కర్మలు, 2) రాజసిక కర్మలు, 3) తామసిక కర్మలు సాత్విక కర్మలు అనాసక్తితోను, వివేకజ్ఞానముతోను, నిస్వార్థతతోను కూడి యుండును రాజసిక కర్మలు వాంఛలతోను, తీవ్రమైన మనోవికారములతోను కూడి యుండును తామసిక కర్మలు అజ్ఞానముతో కూడినవి భగవద్గీత (14-5→9) వీటిని వివరించినది సత్త్వరజస్తమములను మూడు గుణములు ప్రకృతి నుండి ఉత్పత్తి యగును

"సత్త్వంరజస్తమ ఇతిగుణాః ప్రకృతి సంభవాః ।" (14-5)

త్రిగుణములు ప్రకృతిని ఆశ్రయించి యుండునని భావము కాదు అగ్నినుండి ఉష్ణము వేరుకాదు అటులే ప్రకృతియంతయు యీ

త్రిగుణములందున్నది త్రిగుణములు, ప్రకృతి భిన్న స్వరూపములు కావు పరమాత్మ నిర్గుణుడు అతనిని గుణములు బంధించజాలవు ఆ నిర్గుణుని అంశయే ఆత్మ అనగా ఆత్మయే పరమాత్మ గుణములచే ఆత్మ బంధింపబడదు కాని గుణములచే బంధింపబడునది ఇంద్రియములతో కూడిన శరీరము ఆత్మ శరీరమందుండుటచే ఆత్మ బంధింపబడినట్లు తోచును అదియే అజ్ఞానము నీటిలోని సూర్యప్రతిబింబము వలె నీరు కదలుటచే బింబము కదిలినట్లు కనబడును కాని సూర్యుడు కదలుట లేదు "సత్త్వం నిర్మలత్వాత్' - (6) సత్త్వము నిర్మలత్వముతో కూడినది 'సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన' (6) సుఖములందు, జ్ఞానమునందు ఆసక్తిచే అది బంధించుచున్నది సత్త్వము అద్దమువలె ఆత్మ ప్రకాశమును వెలిబుచ్చును అద్దము దృశ్యములను, వస్తువులను యదార్థముగ ప్రతిబింబించును యదార్థమును గ్రహించుటయే జ్ఞానము సత్త్వగుణముచే అద్దమువలె బాహ్యవస్తుజ్ఞానము కలుగును దాని వలన సుఖానుభవము నందు అనురక్తి కలుగును వస్తువుల వలన కలుగు సుఖమును గురించిన పరిశోధన జ్ఞానాసక్తిని కలిగించును అట్టి జ్ఞానము దాని వలన కలుగు సుఖము పరస్పరము సంబంధము కలిగియుండును సత్త్వగుణము గల వ్యక్తి యొక్క మనస్సు ప్రకృతి జ్ఞానాసక్తి అనుబంధముతో కూడియుండును జ్ఞానము వలన వచ్చు సుఖము ఆనందమయమైనది అది సుఖమునిచ్చును ఆ సుఖమును మానవుడు అధిగమించలేడు ఆ విధముగా సత్త్వగుణము బంధము కలిగించును సత్త్వము బంధము కలిగించును అనగా, జ్ఞానముచే కలిగిన సుఖము వలన "నేను సుఖము గలవాడను" అను సుఖాసక్తి ఏర్పడుట వలన అది విషయమగును అనగా ఇంద్రియసుఖమగును ఈ విషయము (ఇంద్రియసుఖము) ఆత్మకు అంటునట్లు చేయబడుట వలన "నాకే సుఖము గలదు" అను సుఖాసక్తి ఏర్పడి అది అవిద్యయే యగును ఆత్మకు సంబంధము లేనిదానితో సంబంధమున్నట్లు చేయుచున్నది ఇచట సుఖభావము అంతఃకరణ స్వభావమే

కాని ఆత్మ యొక్క స్వభావము కాదు ఎందుకనగా ఆత్మకు ఆసక్తి సంబంధములు తగవు ఆసక్తి సంబంధములు, సుఖాసక్తి క్షేత్ర సంబంధమైనది మాత్రమే ఆత్మకు సంబంధము లేదు ఇది శంకరభాష్యము కాని రామానుజులు మరొక విధముగా చెప్పియున్నారు సత్త్వగుణము ఆత్మకు సుఖము జ్ఞానముచే ప్రకాశము కలిగించుచున్నది ఆ విధముగా సత్త్వగుణము ఆత్మను సుఖసంబంధము చేతను, జ్ఞాన సంబంధము చేతను బంధించుచున్నది వైదిక, లౌకిక కర్మాచరణముల ద్వారా జ్ఞానము, సుఖము పొంది, ఆ కర్మానుసారముగ పునర్జన్మ పొందు విధముగ సత్త్వగుణము ఆత్మను బంధించుచున్నది అని రామానుజ భాష్యము అర్థసమన్వయము చేసుకొనినచో సుఖము, జ్ఞానము సత్త్వగుణము ద్వారా పొందిన వృత్తిసుఖము వృత్తిజ్ఞానము మాత్రమే గాని ఆత్మస్వరూపానందము, ఆత్మస్వరూప జ్ఞానములు కానేరవు అని బోధపడును ఆత్మకు సుఖము తనది అను భ్రమను మాత్రమే కలుగజేయుచున్నది క్షేత్ర (శరీర) ధర్మమైన సుఖమును, ప్రపంచ విషయమైన జ్ఞానమును అనగా పాండిత్యమును వృత్తిరూపమైన అంతఃకరణ ధర్మములైనను, వాటిని ఆత్మయందు ఆరోపించబడుటచే సత్త్వగుణము ఆత్మను బంధించుచున్నది ఆ బంధమును కూడ దాటినపుడే పూర్ణమైన ఆత్మస్థితిని పొందుట సాధ్యము అంతఃకరణ ధర్మములు సుఖము, జ్ఞానము వీటి యొక్క భ్రాంతిని (అధ్యాసము) సంగము అన్నారు 'నేను సుఖము పొందుచున్నాను, నేను జ్ఞానము పొందినాను' అనునవే సంగములు ఈ సంగముల ద్వారానే సత్త్వగుణము ఆత్మను బంధించుచున్నది అయితే సత్త్వగుణము రజస్సు, తమస్సులు కలిగించు బంధమంత చెడ్డది కాదు అయినను అన్ని గుణములు ఆత్మకు ఏదో విధముగ బంధములే ఆ బంధములను దాటినపుడే పరమాత్మజ్ఞానము కలుగును

"రజోరాగాత్మకం" (7) అనురాగము, ఆశ, అనుబంధము రజోగుణ లక్షణములు "తృష్ణాసంగసముద్భవమ్" తృష్ణ అనగా కోరిక దాని వలన

విషయాసక్తి కలుగును తృష్ణ వ్యక్తం కావటానికి తపన పుడుతుంది అదే ప్రవృత్తి (స్వభావము)గా రూపొందును ఇదే రజోగుణబంధము రజోగుణము చర్యలకు అనగా కర్మలకు (activity) మూలము "నేను యీ కర్మ చేయుదును, దాని ఫలమును అనుభవించుదును" అను అభిమానము జీవుని కర్మకు కర్తగా చయును 'రాగాత్మకం' అనగా కామస్వరూపం అని శంకరభాష్యం రజస్సు వస్త్రమునకు వేయు రంగువలె ఆత్మకు రంగు కలుగజేయును అనాత్మ (ఆత్మ కానివి) విషయములలో ఆత్మకు ఆశ కలుగుట అనునది ఆ రంగు రాగము అనగా ఆశయని కాదు రాగము వలన ఆశ జనించును ఒక వస్తువు మీద కలిగిన రాగము అనగా అభిమానము వలన అది కావలయును అను ఆసక్తి (ఆశ, తృష్ణ) ఏర్పడును ఆ వస్తువు మీద ఆసక్తి కర్మబంధము కలిగించును రజోగుణము శరీరము ద్వారా ఆత్మకు కర్మబంధము కలిగించును స్త్రీపురుషుల పరస్పరానురాగము, వస్తువులను గురించిన ఆశ, పుత్రమిత్రాదుల గురించిన ఆశ కర్మసంగమును కలిగించును అనగా కర్మ చేయవలెనను ఆశ వలన పుణ్యపాపకర్మములు జరిగి వాటి ఫలితముగ జన్మలు కలుగును అన్నారు రామానుజులు కర్మసంగమే ఒక భ్రాంతియని భావించవలయును భ్రాంతియే కర్మకు మూలము సత్త్వగుణమును గూర్చి 'బధ్నాతి' అని, రజోగుణము, తమోగుణములను గూర్చి 'నిబధ్నాతి' అని చెప్పుటలో సత్త్వగుణము, రజోగుణ, తమోగుణములంతటి చెడ్డదికాదు అని భగవద్గీత భావముగా గ్రహించవలయును

'తమస్త్వజ్ఞానజం' (తమః తు అజ్ఞానజం) (8) ('తు' పాదపూరణము కొరకు ఉపయోగించబడినది) (ప్రత్యేకార్థము లేదు) తమస్సు వలన అజ్ఞానం ఏర్పడును "మోహనంసర్వదేహినామ్" సర్వప్రాణులకు మోహము కలుగ జేయును మోహము మాయ "ప్రమాదాలస్యనిద్రాభిః" బుద్ధిమాంద్యము, ప్రమాదము, ఆలస్యము, నిద్ర అను వాటిచే తమస్సు జీవుని బంధించును

సత్త్వగుణ లక్షణం వస్తువివేక సామర్థ్యం అనబడు ప్రకాశం ఆ సామర్థ్యం లేకపోవటమే ప్రమాదము అది తమస్సు వలన కలుగును రజోగుణము వలన చర్యలయందు చురుకుతనము (activity) దానివలన ప్రవృత్తి ఏర్పడును

రజోగుణకార్యమే ప్రవృత్తి దానికి వ్యతిరేకం ఆలస్యం ఇది తమోగుణ లక్షణం ఈ తమోగుణం అన్ని జీవులలోను ఉండును

"సత్త్వగుణము భౌతిక (ఐహిక) సుఖములందును, రజోగుణము భౌతిక కర్మలందును, తమోగుణము నిద్ర, సోమరితనములందును జీవుని బంధించుచున్నవి మూడు గుణములు ఆత్మను ఏదో విధముగ బంధించుచునే యున్నవి ఈ మూడు గుణములు ప్రకృతిలో కలసియున్నటులే మనలో కూడ కలిసియే యుండును ఒక్కొక్క సమయమందు ఒక్కొక్క గుణము అధిక ప్రాబల్యము కలిగియుండునని" భగవద్గీత సందేశము

'నాన్యం గుణేభ్యః కర్తారం' (14-19) గుణములు బయట నుండి వేరొకదానిచే కల్పించబడినవి కావు గుణములే గుణములకు కారణము త్రిగుణములు ప్రకృతి స్వరూపము కర్మమునకు యీ గుణములకు మించి ఎరుగా కర్త ఎవరును లేరు త్రిగుణములే కర్తలు ఇంద్రియ వాంఛలు గుణముల నుండి పుట్టినవే త్రిగుణములకు అతీతమైనదే పరమాత్మ పరమాత్మ ఎట్టి కర్మలకు కర్త కాదు పరమాత్మ సాక్షి వలె మాత్రమే యుండును ఆత్మను గూడ యట్లే గ్రహించవలయును

"నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి" (14-19)

ఎపుడును గుణములను మించి వేరొకటి గుణములకు కర్తగా చూచుటలేదో అనగా గుణములకు గుణము కర్తయని చూచునో అట్టి జీవుడు (ద్రష్ట) బ్రహ్మజ్ఞానము పొందును అనగా తనను తాను గుణముల కంటే

వేరువానిగా తెలిసికొనవలయును

జీవుడు చేయు సమస్త కర్మలకు జీవుడు కర్త కాదు వాటికి త్రిగుణములే కర్త ఆ త్రిగుణములతో కూడినదే మనస్సు ఆ మనస్సే సమస్త కర్మలకు కర్త ఇంద్రియములచే కర్మలను చేయించునది మనస్సు ఆత్మసాక్షి మాత్రమే కర్మబంధమును పొందునది కూడ మనస్సే కాని మనస్సుచే నియంత్రించబడు యీ శరీరము ఆత్మను ఆవరించియుండుటచే ఆత్మ కర్మబంధము పొందునట్లు కనబడును ఈ జగత్తు ఒక నాటకమనుకుంటే దానికి మనస్సు, త్రిగుణములు కర్తలు సినిమా ఒక తెర మీద చూస్తుంటాము సినిమా ఒక నాటకమే కదా! ఆ నాటకములో త్రిగుణాత్మకములైన దృశ్యములకు ఆధారము తెర కాని నాటకములోని గుణాత్మకములైన చర్యల (activities) ఫలితములు తెరకు అంటవు తెరలేనిది సినిమా లేదు కాని సినిమా తెరకు అంటదు అనగా సినిమాకు తెర ఆధారం (కర్త), కాని సినిమాలోని సుఖదుఃఖాలు తెరకు అంటవు తెరయే ఆత్మ గుణాత్మకమైన జీవితమే సినిమా ఆత్మను గురించిన యీ సత్యము గ్రహించినవాడు (మద్భావము = నా స్వరూపము (పరమాత్మ స్వరూపము)) బ్రహ్మజ్ఞానము పొందును

ఇందలి అంతరార్థము గ్రహించకున్నచో ఒక ప్రమాదమునకు అవకాశమున్నది ఎవరైన ఏదైన హత్యవంటి నిషిద్ధ కార్యము చేసి "ఇది నా ఇంద్రియములు చేసినవి నాకేమియు సంబంధము లేదు" అను విపరీతార్థము చెప్పుదురు ఇది శుష్కవేదాంతమగును ఆ పాపకార్యము ఆత్మకు అంటదు కాని దానికి కర్త అయిన మనస్సు, దేహము ఫలితము అనుభవింపక తప్పదు అనుభవించునది శరీరమే అయినను, ఆత్మ అనుభవించుచున్నది అను భ్రమ కలుగును ఆ భ్రమ తొలగినపుడు పరమాత్మ గోచరమగును

లౌకికస్థితికి కర్మ ఆధారము కర్మలు ఆచరించుట ద్వారా కర్మబంధము ఏర్పడును కర్మ బంధహేతువు, జన్మకారకము కర్మ చేయక ఏ జీవియు

మనజాలదు కాన దోషము కర్మయందు లేదు కర్మచేయు విధానమందు దోషముండునని గీతయందలి సాంఖ్యయోగము నందు చెప్పబడినది (2-38, 2-39) కర్మను సమబుద్ధితో ఆచరించినపుడు ఆ కర్మ పాపము అంటదు సమబుద్ధి అనగా సుఖదు:ఖములను, లాభనష్టములను, జయాపజయములను సమదృష్టితో గ్రహించుట దీనినే కర్మను వివేకముతో అనగా బుద్ధితో ఆచరించుట అన్నారు

(4-14 జ్ఞానయోగము) జీవుల పునర్జన్మ వారి గత కర్మ ననుసరించియే యుండును గాని వారి పునర్జన్మలకు భగవంతుడు కర్త గాదు ఆయనకు పక్షపాతము ఏమియు యుండదని చెప్పబడింది సృష్టి గమనము (progress) లో భాగమైన జీవుల జన్మ పునర్జన్మలకు అప్రత్యక్షముగా (indirectly) కారణము (హేతువు) అగుట వలన కర్త అగు భగవంతుడు ఆ సృష్టియను కర్మ యొక్క ఫలమునందు ఆసక్తిలేని వాడగుట వలన అకర్తగానేయున్నాడు అందువలన ఆ కర్మ ఆయనను అంటుటలేదు అటులే జీవులు కూడ ఫలాపేక్ష లేక కర్మలు నిర్వర్తించినచో వారిని కర్మలు అంటవు అదియే నిష్కామకర్మ దీనిని గురించి పూర్వ అధ్యాయములలో వివరముగా చర్చించబడినది

(14-41) (జ్ఞానయోగము) కర్మబంధమనునది కర్మచేయుట యందు గాని, చేయకపోవుటయందు గాని లేదు ఫలాసక్తి యందు, కర్తృత్వ బుద్ధి యందు అనగా నేను చేయుచున్నాను అను అహంకారము యందు, కర్మఫలాసక్తికి మూలమైన సుఖము, వస్తుజ్ఞానము అనబడు భ్రాంతియందు మాత్రమే కర్మబంధమేర్పడును అని భగవద్గీత వివరించినది కర్మ ఫలానుసారముగ స్వర్గాదిలోకములు పొందినను అవి జన్మ పునర్జన్మల పరంపరను ఆపలేవు ఆత్మజ్ఞానము తెలుసుకొనుట ఒక్కటే కర్మబంధము నుండి విముక్తి మార్గము

కర్మమును నిష్కామముగా ఆచరించి కర్మయోగము ద్వారా జ్ఞానము

పొందవచ్చు ఇదే బాలగంగాధర తిలక్ వంటి తాత్త్వికులు చెప్పారు నిష్కామకర్మమే కర్మబంధ విముక్తికి మార్గము అని తిలక్ భగవద్గీత వ్యాఖ్యలో చెప్పారు కాని కొంతమంది అద్వైతులు కర్మయోగము తుది (ultimate) మార్గము కాదు, కర్మయోగం ద్వారా జ్ఞానం లభించును, ఆ జ్ఞానం ద్వారా కర్మబంధవిముక్తి లభించును, అంతేకాని కర్మయోగం ఒకటే తుదిమార్గము కాదు అంటారు మరికొందరు కర్మయోగ, జ్ఞానయోగముల సమన్వయం ఒకటే సాధనం అంటారు కాని ఈ వాదముల వలన ప్రయోజనము ఏమిటి? పాండిత్య ప్రకటనకు మాత్రమే పనికి వస్తాయి గమ్యం అన్నిటికి ఒకటే అయినపుడు అనగా కర్మబంధము నుండి విముక్తియే అయినపుడు సాధనము ఏది అయినా ఒకటే గదా!

(మోక్షసన్యాసయోగము) (18-60, 61) - జీవుడు కర్మచే బంధితుడు ఆ బంధము వలన అవివేకుడగును అవివేకమున ఏ పనిచేయుటకు యిచ్ఛగించకుండునో అదే పనిని కర్మ ప్రభావము వలన తప్పకచేయును 'స్వభావజేన' స్వభావము అనగా పూర్వజన్మ (60) సంస్కారములచే గలిగినది, 'స్వేనకర్మణా' నీ యొక్క కర్మచేత, 'నిబద్ధం' పూర్తిగ బంధింపబడినవాడవు ఇక్కడ ఒక ప్రశ్న ఉదయించును పూర్వసంస్కారములనబడు కర్మకు వ్యక్తి నిబద్ధుడైనపుడు ఇక యీ జన్మకు ఉద్దేశము, గమ్యము ఉండవా? జీవుడు కర్మబద్ధుడైనంత మాత్రమున, యీ జన్మలో పురుష ప్రయత్నము వ్యర్థము కారాదు పూర్వజన్మ సంస్కారములు, యీ జన్మమందు పురుష ప్రయత్నము అను రెండును జీవితమందు ప్రధాన అంశములు అవి నిరంతరము సంఘర్షణకు లోనగుచుండును సత్కర్మ రూపమే పురుష ప్రయత్నము ఏ మనిషికైనను పూర్వజన్మ సంస్కారము అనగా సంచితకర్మ ఎటులున్నదో తెలియుట అసాధ్యము అందువలన ఈ జన్మమందు సత్కర్మరూపమున పురుష ప్రయత్నము తీవ్రతరము చేసినచో పూర్వజన్మ సంస్కారములు నిష్ఫలములగుటకు అవకాశము మెండుగ నుండును ఈ జన్మమందు అట్టి

పురుష ప్రయత్నము లేకున్నచో, పూర్వజన్మ సంస్కారములు తప్పక ప్రభావము చూపును

సత్కర్మ అనగానేమి? ఇచట కర్మ అనగా యజ్ఞయాగాదులు, పూజలు, వ్రతాలు కాదు మనసావాచా, కర్మణా (త్రికరణశుద్ధిగా) యితరులకు ఉపకారము చేయకున్నను, అపకారము మాత్రము చేయకుండుటయే వర్తమాన పరిస్థితులలో సత్కర్మగా చెప్పవలయును దీనినే భర్తృహరి చక్కగా వివరించాడు (నీతిశతకం - సుజనపద్ధతి (6-64)

శ్లో॥ ఏతే సత్పురుషాః పరార్థఘటకా స్స్వార్థాన్ పరిత్యజ్యతే
సామాన్యాస్తుపరార్థముద్యమభృతః స్వార్థావిరోధేనయే
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయనిఘ్నన్తియే
యేతుఘ్నన్తి నిరర్థకం పరహితం తేకేన జానీమహే ॥

**అనువాదము**

"తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్,
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్,
దమకై యన్య హితార్థఘాతుకజనుల్ దైత్యుల్, వృథాస్వార్థభం
గము గావించెడు వారలెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్ ॥"

తమ కార్యములను విడిచి అనగా త్యాగబుద్ధితో పరలకు సహాయము చేయువారు ఉత్తములనియు, అట్లు చేయలేనివారు తమ కార్యములకు భంగము రాకుండ అనగా త్యాగబుద్ధితో కాక స్నేహబుద్ధితో పరులకు సహాయము చేయువారు మధ్యములనియు, త్యాగబుద్ధి గాని, స్నేహబుద్ధి గాని రెండును లేక స్వార్థబుద్ధితో పరుల కార్యములు చెడగొట్టువారు అనగా అపకారము చేయువారు రాక్షసులనియు చెప్పాడు భర్తృహరి ఇక మరొక రకమువారిని, అనగా తమకు ఏ మాత్రము ప్రయోజనము లేకపోయినను పరులకు అపకారము

చేయు ప్రవృత్తి కలవారిని ఏమనవలయునో తనకు తెలియుటలేదని వాపోయాడు భర్తృహరి

ఇంకను నిస్వార్థ స్నేహమును గురించి క్షీరనీరముల సంబంధమును ఉపమానముగ భర్తృహరి చెప్పాడు నీతిశతకము - పరోపకారపద్ధతి (7-66)

క్షీరేణా పునస్త్వీదృశీ

పాలలో నీరు కలిపినపుడు అవి రెండును వేరుచేయుటకు వీలులేకుండ కలియును పిదప ఆ పాలను కాచినపుడు నీరు ఆవిరై పోవును అపుడు పాలు పొంగి పైకి వచ్చును ఆ పాలపై నీరు చల్లినపుడు అవి అణిగిపోవును నీరు ఆవిరై బయటకు పోవుటచే తాళలేక పాలు కూడ పొంగి నీటిని అనుసరించుననియు, తిరిగి నీరు చల్లినపుడు శాంతించుననియు భర్తృహరి ఉత్ప్రేక్షాలంకారములో చెప్పాడు

నిస్వార్థమైన మైత్రి యిటులుండవలయునని భర్తృహరి ఉద్దేశము

భగవద్గీత (18-60)లో చెప్పినది కూడ యిదే మానవుడు తన పూర్వజన్మ కర్మచే బంధితుడగుచున్నాడు ఇహజన్మయందు సత్కర్మ రూపపురుష ప్రయత్నముచే ఆ బంధము నుండి ముక్తుడు కావచ్చును

ఈ ప్రపంచమంతా భగవంతుని ఆటస్థలము మనమంతా ఆయన ఆటబొమ్మలము అను విశ్వాసమొకటి మనలో ప్రబలంగా నున్నది కాని భగవద్గీత (18-61) మోక్షసన్యాసయోగము అర్థము చేసుకొనే ప్రయత్నం చేస్తే యీ విశ్వాసములోని మూఢత్వం తెలుస్తుంది

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేஉర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢానిమాయయా " (18-61)

పరమేశ్వరుడు సమస్త ప్రాణుల హృదయములందు వెలసి

అచటనుండి వారిని యంత్రమును ఎక్కినవారి వలె అనగా కీలుబొమ్మలవలె తన మాయచే త్రిప్పుచుండును

నిర్గుణుడైన పరమాత్మ ఎచటనో లేడు మన హృదయమందే ఆత్మరూపమున నున్నాడు "సర్వభూతానాం హృద్దేశే" అని చెప్పబడింది మన శరీరమే ప్రకృతికి పర్యాయము ఆ ప్రకృతియే పరమాత్మ చైతన్యరూపము అనగా మాయ ఆ ప్రకృతి యందే పరమాత్మవైశ్వానరునిగా వ్యాపించియున్నాడు ప్రకృతి కార్యములన్నియు మాయా (చైతన్య) రూపములే వాటికి భగవంతుడు కర్త కాదు ప్రకృతియే కర్త ప్రకృతిలో నున్న పరమాత్మ వాటికి సాక్షి, పర్యవేక్షకుడు

దీనికి రామకృష్ణ పరమహంస ఒక ఉపమానము చెప్పారు పాము కోరలందు విషముండును, కాని ఆ విషము వలన దానికి బాధ లేదు అది యితరులను కరచినచో వారికి ప్రమాదము సంభవించును అటులే భగవంతుని (పరమాత్మ) యందు మాయయున్నది కాని ఆ మాయచే అతడు బంధితుడు కాదు అయన యందలి మాయకు రూపమైన ప్రకృతియందు ఆయన వ్యాపించియున్నాడు ప్రపంచమును భగవంతుడు ఆడించుచున్నాడు అనుటలోని అర్థమిదియే ఈశ్వరుడు అనగా పరమాత్మ ఒక శాసకుడు సమస్త ప్రాణులకు వారివారి కర్మానుకూలముగ ఫలములు పొందుటకు ఒక యాంత్రికమైన చలనమును కల్పించెను ఈ యాంత్రికమైన చలనమే సంసారచక్రము సంసారమనగా ప్రపంచము ఈ చక్రము దానంతట అదే తిరుగుచున్నట్లు కనబడును వాస్తవమునకు అది మాయచే తిరుగుచుండును ఆ మాయకు లోబడిన ప్రాణులు ఆ చక్రమున కర్మానుసారముగ తిరుగుచునే యుందురు "యంత్రారూఢానిమాయయా" అని చెప్పబడినది

సమస్త ప్రాణులకు అంతర్యామి ఈశ్వరుడు (పరమాత్మ) మాయచేత వారి కర్మలననుసరించి వారిని త్రిప్పుచూ వారి హృదయమునందే యున్నాడు

"యంత్రారూఢానిమాయయా" అని చెప్పుటలోని భావము ప్రకృతికి పర్యాయమైన శరీరము ఒక యంత్రము అందు జీవుడు కూర్చుని యుండును స్వయముగా తాను శరీరమును నడపకపోయినా రైలు వలె ఆ యంత్రము నడుస్తుండుటచే అతడు కూడ నడుస్తూనే ఉండును "ఆత్మ నిశ్చలమైనది, నిష్క్రియమైనది" శరీరముచే ఆవరించబడియుండుటచే శరీరముతో ఆత్మకు సంబంధము ఏర్పడి శారీరక క్రియ (కర్మ) ఆత్మకు ఆపాదించబడుచున్నది రైలును ప్రేరకుడు నడుపును కాని నడుచునది రైలు ప్రేరకుడు (డ్రైవరు) ఇంధనము ద్వారా రైలును నడుపును కాని ప్రేరకుడు నడవడు నడచునది రైలు ప్రేరకుడు కూడ నడుచునట్లు కనబడును ఈ ప్రపంచమే అనగా శరీరమే ఒక యంత్రము (రైలు) ఈశ్వరుడు అనగా ఆత్మప్రేరకుడు కర్మానుసారముగా శరీరమును పరమాత్మ (ఆత్మ) నడుపును శరీరము కర్మానుసారముగ జన్మపునర్జన్మలలో నడుచును నడుచునది శరీరము అందుండునది ఆత్మ అన్ని ప్రాణులలోను ఈశ్వరుడున్నాడు అనగా ఆ ప్రాణుల ద్వారా కర్మలు చేయిస్తూ, ఆ ప్రాణుల ద్వారా తానే మరల ఫలితము అనుభవిస్తున్నాడు అని అంతరార్థము 'సర్వము ఈశ్వరుడే, మనము నిమిత్తమాత్రులము" అనుటలోని భావము ఇదియే

త్రిగుణ రూపమే ప్రకృతి అనగా శరీరము గుణములను అనుసరించియే కర్మలు జరుగును కర్మబంధము నుండి విముక్తుడగుటకు మానవుడు గుణాతీతుడు కావలయును అని చెప్పబడింది త్రిగుణరూపమే శరీరమైనపుడు, గుణాతీతుడగుట ఎట్లు? దీనికి సమాధానము భగవద్గీత గుణత్రయ విభాగయోగము 14-22 నుండి 24 వరకు శ్లోకములలో వివరించబడినది

గుణాతీతుడగుటకు ఎంతో సాధన కావలయును ఎందుకనగా అందుకు మానవుడు రాగద్వేష శూన్యుడై ఉండాలి సత్త్వకార్యమైన ప్రకాశము

కాని, రజోగుణకార్యమైన ప్రవృత్తి గాని, తమోగుణ కార్యమైన నివృత్తిగాని దుఃఖస్వరూపములైనను వాటిని ద్వేషింపడు లేక సుఖస్వరూపాలైనను వాటిని కోరడు ఈ గుణాతీత లక్షణం ఎవరికి వారికి మాత్రమే తెలుస్తుంది రాగద్వేషాలు ఉండటం, లేకపోవటం ఎవరికివారు తామే స్వయముగా తెలుసుకొనవలయును ఇతరులకు అది తెలియదు గుణాతీత స్థితి చిహ్నము వ్యక్తి అంతఃకరణమునకు మాత్రమే తెలియును గుణాతీతుడు తటస్థుడు ప్రకృతి గుణముల వలన గాని వాటి వలన జరుగు కార్యముల వలన గాని అతడు చలించడు అతడు సుఖదుఃఖములను సమానముగా చూచును అతనికి రాయి, బంగారము రెండును సమానమే, ప్రియాప్రియములు రెండును సమానమే గుణాతీతుడు సర్వకర్మలను పరిత్యజించిన యతి (సన్యాసి) కావచ్చు, నిష్కామకర్మ యోగి కావచ్చు, లేదా సర్వమందు భగవంతుని చూడగల స్థిరబుద్ధితో కూడిన భక్తుడు కావచ్చు అతనికి ప్రత్యేక బంధము ఏమియు లేని మనస్సు సమముగా నుండును 'సర్వారంభ పరిత్యాగి' - ఏ పని తనకు తానుగా సంకల్పించి పూనుకొనడు అనగా ఆ పని చేయవలెను అను కీర్తి కాంక్షతో ఏ పనియును చేయడు తన వద్దకు వచ్చిన పనినే నిస్వార్థంగా, సవ్యముగా, పూర్తిచేయును గుణాతీతుడే జీవన్ముక్తుడైన ఆత్మజ్ఞాని తామరాకు మీద నీరు పడినను దానికి అంటదు గుణాతీతుని నీటి యందు మునిగి తేలుచున్నను రెక్కలకు నీరు అంటని పక్షితో పోల్చారు శ్రీరామకృష్ణ పరమహంస

భగవద్గీత 3-5, 6 శ్లోకములలో (కర్మయోగము) "కర్మ సర్వః ప్రకృతి జైర్గుణైః" మరియు "కర్మేంద్రియాణి సంయమ్యయ ఆస్తే మనసాస్మరన్ । ఇంద్రియార్థాన్వి మూఢాత్మా" అని చెప్పబడింది అనగా ప్రకృతి వలన (మాయ వలన) జనించు గుణములచే ప్రతివాడును కర్మములను చేయుచునే యుండును కర్మములు చేయక ఎవరును ఒక్క క్షణము కూడ ఉండలేరు కర్మ అనివార్యమైనది జ్ఞానేంద్రియములతో గాని కర్మేంద్రియములతో గాని,

మనస్సుతో గాని చేయు ప్రతి పనియు కర్మయే యగును ఇవి చేయకుండ ప్రపంచమున ఎవరైనను జీవించగలరా? ఇట్లు ప్రాణి కర్మబద్ధుడైనను పురుష ప్రయత్నముచే ఈశ్వరార్పణ బుద్ధితో నిస్వార్ధముగా కర్మల నాచరించినచో అతడే గుణాతీతుడగును అంతియేకాని ఎవడు కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములను అణచిపెట్టి మనస్సుచే ఇంద్రియ విషయములను గూర్చి తలచుచుండునో అతడు మూఢుడగును అట్టివాడు కపటి, వంచకుడు వాంఛలు నశించకపోవటం వలన కొంతమంది వాటిని గోప్యము (రహస్యము)గా పొందుతూ ఉంటారు వారు పైకి వద్దు అంటూనే లోపల దానినే కోరుకుంటూ ఉంటారు

కర్మ స్పందనతో (response) కూడియుండును ఈ ప్రకృతిలో స్పందన లేని వస్తువు లేదు కర్మఫలితము ఒక మార్పు అణువు మొదలు అండము వరకు అన్నియు మార్పు చెందుచునే యుండును మనము ఈ ప్రకృతి యను మాయయందు బంధించబడినవారము కావున కర్మమును వదలివేయుటకు మనకు స్వేచ్ఛ లేదు ప్రకృతి యనబడు యీ శరీరమునందు జీవాత్మ బంధించబడియున్నంత వరకూ మనస్సు చలించుచు ఏదో ఒకటి సంకల్పించుచునే యుండును అదే మనస్సు యొక్క ప్రవృత్తి ఆ సంకల్పమునకు ఇంద్రియములు కార్యరూపమునిచ్చును మనస్సును నిగ్రహించకుండ ఇంద్రియములను అణచుట వలన ప్రయోజనము లేకపోగా కపటత్వము మాత్రమే వచ్చును ఉదాహరణకు నీటియావిరితో నడచు ఇంజను రైలుబండిని లాగును దానిని ఆపవలసినపుడు ముందుగా ఆవిరి ప్రసారమును ఆపి అటుపై చక్రములను ఆపవలయును (brakes) అట్లుకాక ముందుగా చక్రములను ఆపినచో, ఆవిరి తగ్గకపోవటం వలన బ్రేకులు విరిగిపోవటం, అటుపై ప్రమాదము జరుగును మనస్సు ఆవిరి వంటిది, ఇంద్రియముల చక్రములు మానవుడు చేయు కార్యములు అతని మనోప్రవృత్తిని బట్టియే యుండును

సత్త్వరజస్తమోగుణరూపమైన ప్రకృతిని గురించి (కర్మయోగము) 3-27, 28 శ్లోకములలో వివరించబడింది త్రిగుణములచే నిండిన ప్రకృతిని 'మాయ' అని గూడ అంటారు అది కర్మ స్వరూపమైనది ప్రకృతి పరమాత్మ కాదు ప్రకృతిలో పరమాత్మయున్నాడు కర్మ, కర్మకు కారణము గూడ ప్రకృతియే అట్టి ప్రకృతి యొక్క వికారములే (మారురూపములు లేక చిహ్నములు) మానవదేహము, ఇంద్రియములు, మనస్సు ప్రకృతి వికారమైన యీ శరీరము వేరు, ఆత్మ వేరు ప్రకృతి వికారములే కర్మలనాచరించును ఈ వికారములే అనగా ఇంద్రియములతో కూడిన శరీరమే ఆత్మయనుకొనుటయే 'అహంకారము' కర్మ చేయని ఆత్మను కర్మచేయుచున్నదని తలచుట భ్రమ అనగా అహంకారము ఒక భ్రమ ఒక రైలుబండిలో కూర్చున్న వ్యక్తి, ఎదుటనున్నరైలుబండి కదలినపుడు తాను కూర్చున్న బండియే కదలుచున్నదని తలచుట భ్రమకు ఉదాహరణగా చెప్పున్నారు దేహము, ఇంద్రియములు, మనస్సు ఇవి గుణముల రూపములు ఇవి వాంఛ, వ్యామోహములకు హేతువులు వాటి చర్యలే కర్మలు ఆత్మకు గుణకర్మలకు సంబంధము లేదు గుణములు తమ నియమములననుసరించి వర్తించును గుణరూపమైన ప్రకృతి దృశ్యము అందున్న పరమాత్మ చూచువాడు అనగా సాక్షి లేక దృక్కు దృక్కు, దృశ్యములు వేరు వాటిని ఒకటిగా తలచుటే దుఃఖహేతువు ఆత్మ అనాత్మయైన ఇంద్రియములతో కూడిన శరీరము ఒకటేనని గుణప్రేరితములైన ఇంద్రియములచే జరపబడు కర్మలు తానే చేయుచున్నానని తలచుటయే మోహము ఈ మోహమే జీవుడు సంసారచక్రమున తిరుగుటకు కారణము

గుణప్రేరితములైన ఇంద్రియములు అనగా ప్రకృతి సహజములైన గుణములచే ప్రేరితములు మనము చేయు ప్రతి కర్మయు గుణరూపమైన ప్రకృతియే చేయించుచున్నది అని అర్థము మనమే చేయుచున్నాము అను తలంపు భ్రమ లేక అజ్ఞానము ప్రకృతి యనగా స్వభావము లేక సత్త్వాది గుణ సామ్యావస్థ ప్రకృతికి ప్రతీక లేక చిహ్నము మన శరీరము కావున మనము

చేయు ప్రతి కర్మయు ప్రకృతి కార్యమే అగును అని స్వామి రంగనాథానంద వ్యాఖ్యానించారు మానవులలోని శక్తులన్నీ ప్రకృతి నుంచి వచ్చినవే మానవుని కర్మలకు మూలమైన త్రిగుణములు ప్రకృతిలోనివే బయట కనబడు ప్రకృతి అంతా మనలో కూడా ఉన్నది త్రిగుణములు ఒకదానికొకటి సమముగా నున్నప్పుడు సృష్టిపరిణామము జరగదు వాటిలో హెచ్చుతగ్గులు ఏర్పడినపుడే కర్మలు జరుగును ఆ కర్మ ఫలితములే సృష్టి పరిణామమునకు కారణము నిర్మలత్వము సత్త్వము అత్యంత చలనశక్తి రజస్సు, చలనం లేనిది అనగా నిశ్చలత్వము కాదు, అది సోమరితనము, తమస్సు ప్రకృతిలో జరుగు ప్రతి కార్యము యీ మూడు గుణముల వలననే జరుగును సృష్టి పరిణామం అనగా వస్తు, శక్తి పరిణామమే కాదు జీవపరిణామము కూడ యీ మూడు గుణముల ఆధారముగానే జరుగుచున్నవి త్రిగుణ ప్రేరితమగు కర్మలు ప్రకృతిలో జరుగు చర్యలకు ప్రతిబింబములే అందుకే భగవద్గీత (3-27)లో

"ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః"

అన్నది ప్రకృతి యొక్క గుణముల చేత అన్ని విధముల చేయబడుచున్నవి కర్మలు

"అహంకార విమూఢాత్మాకర్తాహమితి మన్యతే"

అట్టి కర్మలను అహంకారము చేత మూఢుడు తాను చేయుచున్నాడనని తలచును

ప్రకృతిలో సామ్యావస్థలో నున్న త్రిగుణములు వికారము నొంది కారణరూపముగాను, కార్యరూపముగాను మార్పు చెందునని శంకరభాష్యము అట్టి గుణముల చేతనే లౌకిక, వైదిక కర్మలు చేయబడుచుండునని శంకరులు అన్నారు దేహము, ఇంద్రియములు తనవి అను భ్రమలో "నేనే కర్మలు చేయుచున్నాను" అని తానే కర్తగా మానవుడు తలచుచున్నాడు దేహము

వేరు, ఆత్మ వేరు అని తెలిసినవానికి ఇంద్రియ భ్రాంతి యుండదు గుణములే కర్మలను చేయించుచున్నవి అని గ్రహించి కర్మలయందు ఆసక్తి పొందడు విషయ వ్యామోహితుడు కాడు

గుణములను అధిగమించే శక్తి కూడ ప్రకృతిలోనే యున్నది ప్రకృతిలో జరుగు పరిణామములకు కారణము అందు నిత్యము రసాయనక, భౌతిక పదార్థములలో జరుగు సంయోగ, వియోగములతో కూడిన మార్పులు ప్రకృతిలో జరుగు రసాయనక భౌతిక మార్పులు మన శరీరంలో కూడ జరుగుచున్నవి ఈ మార్పులే మన చర్యలకు (కర్మలకు) కారణము ప్రకృతిలో ఒక పరిణామము మరియొక పరిణామమును అధిగమిస్తుంది అందుచే ప్రకృతి కర్మలకు లోబడదు, చలించదు కాని కర్మలు ఆగవు ఆ ప్రకృతి కర్మలకు ప్రతిబింబములుగా గుణములచే మనము చేయు కర్మలు జరుగుచున్నవి అని గ్రహించినప్పుడు మనము వాటికి చలించము వాటియందు ఆసక్తులము కాము అపుడే సర్వము "నేను చేయుచున్నాను" అను అహం నశించును అటులే గుణముల నుండి స్వేచ్ఛ కలుగును శక్తులన్నీ ప్రకృతిలో యిమిడి యున్నటులే మనలో కూడ యిమిడియున్నాయి ఆ శక్తులను సమన్వయించుకొనగలిగినపుడు అనగా ఒకదానికొకటి సమమగునట్లు, వ్యతిరేకము కానట్లు చేసికొనగలిగినపుడు మనము గుణములకు బానిసలము కాము, "సర్వం నేను" అను అహంకారులము కాము

బరువు బాధ్యతలతో కూడినది గృహస్థ జీవితము గృహస్థ జీవితములో నిష్కామకర్మ సాధ్యమా? సన్యాసికి గాని బ్రహ్మచారికి (ఆజన్మ బ్రహ్మచారికి) గాని యీ జంఝాటము ఉండకపోవచ్చు అందువలన వారికి నిష్కామ కర్మ సాధ్యపడవచ్చును కాని నిత్యము ఉద్వేగభరితమైన వర్తమాన గృహస్థ జీవితములో నిష్కామకర్మ సాధ్యమా? దీనికి భగవద్గీత యిచ్చిన సమాధానము తెలుసుకొనవలసియున్నది

భగవద్గీత కర్మయోగాధ్యాయము 3-1 నుండి 8 శ్లోకములలో అనాసక్తి భావముతో కర్మలనాచరించు విషయము చెప్పబడినది అటుపై 9 నుండి 16 శ్లోకముల వరకు ఫలాపేక్ష లేకుండ చేయబడు కర్మ యజ్ఞముతో సమానమని చెప్పబడినది కర్మలను నిష్కామబుద్ధితో ఆచరించవలయునని కర్మయోగములో గీత మరల మరల చెప్పినది సాధువులకో సిద్ధులకో తప్ప లౌకిక జీవులకు దానిని సాధన చేయు మార్గమేది? ఆత్మజ్ఞానమే దానికి మార్గమని కర్మయోగములో చెప్పారు నిత్యము లౌకిక జీవితములో మతాడంబరముల తోను, ఐహికవాంఛా వ్యామోహములతోను, తాము ఏది ఎందుకు చేయు చున్నామో తెలియక మతమౌఢ్యముతో కూడిన భయముతో అతలాకుతల మగుచున్న జీవితముతోను, మతమునే ఆసరాగా తీసుకుని మతము పేరిట ఏవో నిరర్ధకమగు సభలు, ప్రకర్షలు, పిట్టకధలు, సినిమా సంభాషణలతో పొంగిపొరలు పురాణ, హరికథా ప్రహసనములు, ఏదో ఒక విధమగు స్వార్ధముతో వేదోద్ధరణ, మతోద్ధరణ అను ముసుగులో పూజలు, ఉత్సవములు జరిపించు ప్రవృత్తితోను సలసలక్రాగుచున్న నేటి సమాజములో నిష్కామకర్మయే సాధ్యపడనపుడు, ఇక నిష్కామయోగులకే ఎంతో నిష్ఠతో కూడిన అభ్యాసము తరువాత గాని సాధ్యపడని ఆత్మయోగ సాధన ఈ మానవునికి సాధ్యమా? యోగాభ్యాసము కూడ ఒక సర్కస్‌గా మారిన రోజులివి మరి యిట్టి పరిస్థితులలో నిష్కామకర్మ నిష్ప్రయోజకమో లేక సాధకమో తెలియవలసి యున్నది

'యజ్ఞము' అను పదమునకు అగ్నిహోత్ర, మంత్ర, తంత్రాదులతో కూడిన ఒక వైదిక ప్రక్రియగా కాక పరోపకారార్ధము చేయు క్రియగా భగవద్గీత అంతరార్ధముగా వివరించినది (కర్మయోగాధ్యాయము) ఇట్టి యజ్ఞము అందరికి అందుబాటులోనే యుండును కర్మలు బంధహేతువులు అను భయమునకు భగవద్గీత సమాధానము చెప్పినది ఫలాసక్తితో చేయు కర్మలు మాత్రమే బంధహేతువులు, పునర్జన్మకారణములు కాని ఫలాపేక్షరహితముగ

చేయు కర్మ ఎన్నటికి బంధహేతువు కానేరదు అని గీత స్పష్టము చేసినది ఇదే నిష్కామకర్మ ఇట్టి కర్మలు అతి సామాన్యమైనవి అయినను "అవి మహాయజ్ఞముగ మారిపోయి జీవునకు శ్రేయము కలిగించును"

మనము చేయు పనిని విధ్యుక్త ధర్మముగా (యధావిధిగా) నిర్వహించి ఫలితమును భగవదర్పితముగా భావించి అనుభవించినచో అది నిష్కామకర్మయే యగును ఎటులైనను ఫలితమును అనుభవించునది మనమే భగవంతుడు రాడు, అనుభవించడు కాని భగవదర్పితము అను భావన మనలో కలిగినపుడు మానసికముగా ఇది 'నా స్వార్జితము', 'నాది' అను అహంకారమునకు స్థానముండదు అహంకార రహితమైన అనుభవము నిష్కామకర్మ ఫలానుభవమే యగును అది మనసున ధ్యానయోగమునకు మార్గము సుగమము చేయును మనిషికి తృప్తి అనునది ఎపుడు ఏర్పడునో అపుడే స్వార్థము నశించును స్వార్థరహితమైన కర్మ నిశ్చయముగ నిష్కామకర్మయే యగును నిష్కామకర్మను గూర్చి సభావేదికలపై ఉపన్యాసముల కంటే నిరాడంబరముగ ఆచరణ ద్వారా నిష్కామకర్మ చేసినచో కర్తకు యోగదాయకము, ఇతరులకు ఆదర్శప్రాయము అగును

'ఋషి' అనునది ఒక బిరుదు దీనిని ఎవరైనను పొందవచ్చును నిష్కామముగా ఆనాడు రాజులే కర్మయోగము సాధన చేసి రాచరికపు ఒడుదొడుకుల మధ్య ఆత్మయోగానుభూతి పొందిరి వారు రాజత్వము, ఋషిత్వము రెండును పొంది రాజర్షులైరి అందువలన నేటి ఉద్వేగభరిత జీవితములో కూడ నిష్కామకర్మయోగము కష్టసాధ్యము అనవచ్చును గాని అసాధ్యము అనుట సమంజసము గాదు దృష్టులు మూడు రకములు అవి దేహదృష్టి, మనోదృష్టి, ఆత్మదృష్టి బాహ్య శరీరము, రూపు, జాతి, రంగు మాత్రమే గ్రహించునది దేహదృష్టి స్వభావము, శీలము, పాండిత్యమును గ్రహించునది మనోదృష్టి ఈ రెంటి వలన మాత్రమే నిష్కామకర్మ యోగము

సాధ్యపడదు  పరమాత్మ సర్వవ్యాపి అని ప్రకృతియందు వైశ్వానరునిగా వ్యాపించియున్న ఆ పురుషుని అందరియందు చూడగలుగు దృష్టి ఆత్మదృష్టి అట్టి ఆత్మదృష్టి ద్వారా కలుగు అనుభూతితో నిష్కామకర్మ యోగము సాధ్యపడును  ప్రకృతియే మన శరీరము  వైశ్వానరుడైన ఆ పురుషుడే ఆత్మ

"ప్రకృతి సాయంబున ప్రభవించె జగము
సకలంబునద్దాన సంభవమయ్యె
ప్రకృతిపురుషుల యైక్యభావంబు తెలియ
సకలంబునద్దాన చక్కగా తెలియు
ప్రతిబింబరూపముల్ ప్రకృతిపురుషులకు
సతియుపతియు వారిజత జూడనెంచు
మతిమంతుడిమ్మహి మహిమవంతుండు
ప్రతిలేడు వానికి వసుధలోనెవడు"

అదీ యీ విశ్వసృష్టి  అది గ్రహించిననాడు నిష్కామకర్మము అసాధ్యము కాదు

(జ్ఞానయోగము (4-12)) కర్మఫల ప్రాప్తిని ఆశించి మానవులు దేవతలను ఆరాధించుచున్నారు, ఎందుకనగా యీ లోకమున కర్మఫలప్రాప్తి శీఘ్రముగ కలుగును అని చెప్పబడినది  అందువలన నిష్కామకర్మ ఫలప్రాప్తిని యీ లోకమునందే పొందవచ్చును  లభించినదానితో తృప్తిపడువాడు ఆశకు లోనుకాడు  ఆశలేనిచో స్వార్ధము రాదు  స్వార్ధము లేనపుడు కర్మ నిష్కామమేయగును  నిష్కామకర్మమునకు మనోనిగ్రహము అవసరము అని జ్ఞానయోగము (4-27)లో చెప్పబడినది  బంధమనునది కర్మములు చేయుట యందుగాని, చేయకుండుట యందుగాని యుండుట లేదు  కర్మఫలాపేక్ష వలన కర్తృత్వ భావమేర్పడి అందుచే బంధము కలుగుచున్నది  ఇది జ్ఞానయోగము (4-41)లో చెప్పబడినది  కర్మములు చేయకుండుట కంటే

కర్మలు చేయుటయే యోగదాయకము అని కర్మసన్యాసయోగములో (5-2) చెప్పబడినది

కర్మసన్యాసమనగా కర్మలను త్యజించమని గీతార్థము కాదు సన్యాసమనగా త్యాగము త్యాగము చేయవలసినది కర్మఫలము గాని కర్మగాదు నిష్కామముగా కర్మము చేయువాడు కర్మయోగి యగును అట్టివానిపై రాగద్వేషముల ప్రభావముండదు అట్టివాడు ఎల్లపుడును సన్యాసియేయగును రాగద్వేషములు, సుఖదుఃఖములు అనబడు ద్వంద్వములను త్యజించినవాడే నిజమైన సన్యాసి నిష్కామకర్మయోగ అంతరార్థము కూడ యిదియే యని గదా చెప్పబడినది సన్యాసి వేషము మాత్రము ధరించి అంతరంగమున రాగద్వేషాదులను కలిగియుండిన అతడు సన్యాసి కానేరడు "వాసనాత్యాగమే వాస్తవసన్యాసము అదిలేనివాడు సన్యాసియైనను పతితుడే అదియున్నవాడు గృహస్థు అయినను సన్యాసియే యగును" (గీత 5-3)

సంసారబంధము అనగా కర్మబంధము తొలగుటకు రాగద్వేషములను త్యజించుటయే మార్గము నిష్కామకర్మయోగము ద్వారా 'నిర్విషయ ఆత్మస్థితి' అనగా కోరికలను అధిగమించిన ఆత్మస్థితిని పొందవచ్చును ఆ స్థితియే జ్ఞానయోగ గమ్యము గూడ అట్టి యెడ జ్ఞానయోగ, కర్మయోగములందు భిన్నత్వము, వైరుధ్యమును గురించి తర్కించుట వివేకమనబడదు జ్ఞానయోగ కర్మయోగములను ఒకటిగా చూచువాడే సత్యమును చూచువాడగును "ఏకం సాంఖ్యంచ యోగంచ" (5-5) సాంఖ్యమనగా జ్ఞానయోగము, యోగమనగా కర్మయోగమని భావము ఇది గ్రహించక ఎవరైనను వేదాంతమును గురించి తర్కించ ప్రయత్నించినచో నది శుష్కవేదాంతమే యగును ప్రకృతి ప్రతిబింబ రూపమే ఇంద్రియములతో కూడిన యీ దేహము అని చెప్పబడినది గదా! అందువలన ఆత్మకు అనగా జీవునకు కర్మ కర్తృత్వము గాని కర్మఫలము తోటి

సంబంధము గాని కల్పించబడలేదు ప్రకృతిరూపములైన గుణములే కర్తలు గుణసంబంధమైన జన్మాంతర సంస్కారములే కర్మఫలితములు ప్రకృతి రూపాంతరమైన యీ దేహము కర్మములు చేయునట్లు, కర్మఫలము లనుభవించునట్లు కనబడును అది గ్రహించినపుడు పురుష ప్రయత్నము ద్వారా గుణముల సమతుల్యమును సాధించి కర్మయోగ గమ్యమును చేరవచ్చును

కర్మబంధము నుండి విముక్తి కొరకు భక్తిమార్గము సులభమార్గము గాను నిశ్చితమార్గముగాను భావించబడుచున్నది భక్తి ద్వారా భగవంతుని కృప పొంది తద్వారా కర్మఫలము నుండి విముక్తి పొందవచ్చునని విశ్వసించ బడుచున్నది ఇది కర్మ సిద్ధాంతమునకు విరుద్ధము అని కొందరి వాదన కర్మఫలము నుండి తప్పుకొనుట సాధ్యపడదు, అనుభవించి తీరవలయును, కర్మల పరంపరకు భగవంతుడు సాక్షి మాత్రమే, ఎవరి కర్మ వారు అనుభవించునట్లు చేయును, కర్మ పరిపక్వము పొందుటలో ఏమియును కల్పించుకొనడు అని కర్మ సిద్ధాంతము చెప్పుచుండగా భక్తిమార్గము ద్వారా భగవంతునిచే కర్మపక్వము చెందునట్లు లేక కర్మ నశించునట్లు చేయించవచ్చునని చెప్పుట కర్మసిద్ధాంతమునకు విరుద్ధము గదా అనునది వాదన

ఈ వాదనలో రెండు లోపములున్నవి మొదటిది భక్తిమార్గములోని ప్రధాన అంశమును విస్మరించుట, రెండవది కర్మానుభవములో భగవంతుడు కల్పించుకొనును అనుట భక్తికి ప్రధానమైనది ప్రపత్తి భక్తియే ప్రధానముగా గల విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతములకు ప్రపత్తి ప్రధానాంశము ప్రపత్తి అనగా సంపూర్ణ శరణాగతి అనగా సంపూర్ణ ఆత్మార్పణము (self surrender) భక్తియనగా ఎవరెవరో దేవతల పేర్లను ఊహించుకుని, రూపం కల్పించుకుని తమ వాంఛ నెరవేర్చుకొనుటకు వారిని పూజించటం కాదు, కనపడిన ప్రతి రాయికి, చెట్టుకి మ్రొక్కటం కాదు, వర్తక తుల్యమైన మ్రొక్కులతో యాత్రలు చేయుటకాదు

ఎవరో ఒక ఇష్టదేవతారూపమును ఆశ్రయించి అతడే సర్వాంతర్యామి అయిన పరమాత్మ ప్రతిబింబముగా భావించి, సర్వమునందు అతనిని, అతనిలో సర్వమును చూచుచు, విధ్యుక్త కర్మములను నిర్వర్తించుచు కర్మఫలము భగవదార్పణముగా తలచుటయే ఆత్మార్పణము అపుడు కర్మఫలాను భవమునకు మూలమైన 'అహంకారము' అనగా 'నేను' 'నాది' అను భావన నశించును అది నశించిన స్వార్థము నశించును అది నశించిన కర్మఫలము సుఖముగాని, కష్టముగాని ఆ వ్యక్తికి అంటదు అంటదు అనగా అనుభవము ఉండదని గాదు కర్మఫలము అనుభవించుచున్నను, అనుభవించుచున్నటుల ఆ వ్యక్తికి అనుపించదు ఈ స్థితి మాటలతో అర్థం కాదు అది సాధన ద్వారా మాత్రమే అందును జీవన్ముక్తికి అదియే ప్రధమ సోపానము మహాభారతములో గాని, భాగవతములో గాని, ఇతర పురాణములలో గాని భక్తులు ఎన్నో బాధలు పడి వారి కర్మ పరిపక్వము అయిన తరువాతనే వారిని భగవంతుడు కరుణించినట్లుగా కధలు తెలుపుచున్నవి గదా! ఉదాహరణకు భక్త కుచేలుని గాథ కుచేలుడు ఎన్నో బాధలు భరించిన తరువాత గాని శ్రీకృష్ణుడు అతనిని కరుణించలేదు 'భగవంతుడు భక్తులను పరీక్షించును' అని వ్యావహారికముగా మనము చెప్పుకునే దాని అర్థము యిదే కావున భగవంతుడు జీవుల కర్మఫలానుభవములందు కల్పించుకొనడు భక్తిమార్గమున ప్రపత్తితో (ఆత్మార్పణ లేక శరణాగతి) కర్మల నాచరించినపుడు అనాసక్తి యోగసాధనకు భగవంతుడు ప్రేరకుడై (catalyst) కర్మఫలానుభవ విముక్తి కలిగించును కావున భక్తిమార్గము కర్మసిద్ధాంతమునకు వ్యతిరేకము కాదు

పరమాత్మ (భగవంతుడు)ను గురించి చెపునపుడు అర్థమగుట కొరకు 'పైవాడు' అని ఆకాశము వైపు చూచుచుందుము ఆకాశము పరమాత్మయా? వాస్తవముగ కాదు ఆకాశము జడము పరమాత్మ చైతన్యమునకు మూలము ఆకాశమునకు పరమాత్మకు కొన్ని సామ్యములున్నవి అంతేకాని ఆకాశము పరమాత్మ కాదు ఆకాశము అవ్యక్తమైనది, అనగా

కంటికి కనబడునట్టి రూపము లేనిది పరమాత్మ కూడ అవ్యక్తుడే కదా! కంటికి కనబడు రూపము లేని ఆకాశము సర్వత్ర వ్యాపించియున్నది అటులే పరమాత్మ అగోచరుడు, సర్వత్ర వ్యాపించియున్నవాడు "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని ఉపనిషద్వాక్యము భగవద్గీత (9-6)లో యిదియే చెప్పబడినది వాయువు కంటికి కనబడదు, కాని సర్వత్ర వ్యాపించియుండును వాయువు ఆకాశమందున్నది కాని వాయువు ఆకాశమునకు అంటదు అనేక కోట్ల సంఖ్యలో ప్రాణులను కల్గిన యీ జగత్తు పరమాత్మయందు యిమిడియున్నది కాని అది పరమాత్మకు అంటదు దేవుడెక్కడున్నాడను ప్రశ్నకు సమాధానముగా దేవుడు సర్వత్ర వ్యాపించియున్నాడని చెప్పుటకే యీ శ్లోకము 'గీత' యందు చెప్పబడింది

అట్టి పరమాత్ముని సగుణునిగాను నిర్గుణునిగాను తెలుసుకొనవచ్చును భగవద్గీత (9-15)లో "బహుధావిశ్వతోముఖమ్" అని చెప్పబడినది అనగా వివిధ రూపముల విశ్వరూపుడు పరమాత్మ అని అర్థము జ్ఞానయోగము ద్వారా ఆత్మయే పరమాత్మ అని అర్థము జ్ఞానయోగము ద్వారా ఆత్మయే పరమాత్మ అని అద్వైతభావముతో గాని, పరమాత్మ బహురూపుడు, అందు ఒక రూపమును సేవించు ద్వైతభావముతో గాని పరమాత్మను తెలుసుకొనవచ్చును భక్తికి ఆడంబరము లక్ష్యము కాదు 'భగవద్గీత' 9-26లో చెప్పబడినటుల 'పత్రం పుష్పం ఫలం తోయం' వాంఛారహితమైన మనస్సుతో ఆకును గాని, పువ్వును గాని, పండును గాని, చివరకు జలమును గాని సమర్పించినను అది పరిశుద్ధమైన ఆత్మార్పణమేయగును (9-27 నుండి 30 వరకు) గల శ్లోకములందు ఆత్మార్పణ గురించి యింకను చెప్పబడినది ఈశ్వరార్పణ బుద్ధితో కర్మల నాచరించవలయుననగా పాపకార్యములను కూడ అని అర్థము కాదు పాపకార్యములు స్వార్థబుద్ధి తోడనే జరుగును స్వార్థమున్నంత వరకు ప్రపత్తి యుండదు అనగా ఆత్మార్పణ యుండదు

చరాచర ప్రాణికోటియందు భగవంతుడు సమముగా నుండును కాని ప్రాణులు వారి వారి కర్మఫలానుసారము సుఖదుఃఖములు పొందుచున్నారు అందుచే దేవుడందరి యందు సమముగా నున్నను, దేవుని యందు అందరు సమముగా నుండలేకపోవుచున్నారు భగవద్గీత (9-30) యింకొక ముఖ్య విషయము చెప్పింది ఎవరైన మిక్కిలి దుష్కార్యములు చేయువాడైనను, పశ్చాత్తాపము పొంది మనసు పరమాత్మవైపు మరల్చి అహమును విసర్జించినచో అతని పూర్వ దుష్కర్మ ఫలములు నిరోధించబడును పురుష ప్రయత్నముచే కర్మఫలమును నిరోధించవచ్చుననుటలోని భావమిదియే ఒకనాటి కిరాతుడు అనంతరం మహర్షి వాల్మీకియై ఆదికావ్యమైన రామాయణమును రచించటం యిందుకు ఒక మహత్తరమైన ఉదాహరణ భగవద్గీత (9-32)లో చెప్పబడినటుల యిది స్త్రీలకు, బ్రాహ్మణేతరులకు కూడ వర్తించును ఆధ్యాత్మపథమున గుణభేదము గాని, లింగభేదము గాని, జాతిభేదము గాని లేదు సంకుచిత భావములకు భగవద్గీత అతీతమైనదని విశదమగుచున్నది 'యద్భావంతద్భవతి' మనస్సు దేనిని గూర్చి నిరంతరం ఆలోచించుండునో, ఆ రూపమే దానికి కలుగును త్రికరణముగ నిస్వార్థమునే అనుసరించినచో బుద్ధి అటులే రూపొందును (9-34)

ఈ ఆత్మ సమర్పణ విషయములో సామాన్యుడు ఎదుర్కొను కష్టమొకటి యున్నది అదియే మనస్సు యొక్క చంచలత్వము ఈ విషయమే అర్జునుడు భగవానునితో చెప్పకొనును ఆత్మసంయమయోగము (6-26, 33, 34, 35, 36) శ్లోకములలో యిది వివరించబడినది

కర్మఫలమందు ఆపేక్షను విడిచి కర్మల నాచరించువాడు యోగి యగును అతడు సమస్తమును త్యజించిన సన్న్యాసితో సమానుడగును ఎవరైనను అగ్నిహోత్రమును వదలినంత మాత్రమున, క్రియలను వదలినంత మాత్రమున సన్న్యాసి కాడు క్రియాఫలమును వదలి క్రియలను ఆచరించువాడు

సన్యాసి, యోగి అగును అని (6-1) శ్లోకములోని భావము "ధ్యానయోగమునకు కర్మయోగము బహిరంగ సాధనం" కర్మయోగి చిత్తశుద్ధిని, జ్ఞానమును పొందును ఇదియే నిజమైన వేదాంతము ఆత్మ సంయమము అనగా ధ్యానస్థితి కొరకు సాధన కర్మయోగమనగా మనలోని వాసనలను తొలగించుకుని సంగము (attachment) (వ్యామోహము) లేకుండ, ఫలాపేక్షను వీడి కార్యములను (కార్యం = కర్మ) చేయుట కాషాయాంబరములు కట్టినంత మాత్రమున సన్యాసి కాలేడు, విభూతి ధరించినంత మాత్రమున యోగి కాలేడు, త్రిపుండ్రము (నామము) పెట్టినంత మాత్రమున భక్తుడు కాలేడు చేయదగిన కార్యములు ఫలాపేక్ష లేకుండ చేయువాడే నిజమైన వేదాంతి ఏకాకియైన బ్రహ్మచారికి గాని సన్యాసికి గాని కర్మ సన్యాసము అనగా క్రియలు చేయకుండుట సరిపడవచ్చును, వారికి ధ్యానయోగమే మార్గము కనుక కాని గృహస్థునకు కర్మయోగము ద్వారా పురుష ప్రయత్నమే మార్గమగును అయినను ధ్యానయోగులైన సన్యాసులకు కర్మసన్యాసము చెప్పబడినది గాని కర్మయోగులైన గృహస్థులకు ధ్యానయోగము అనవసరము అనలేదు ఏ కార్యము చేయుచున్నను ఏకాగ్రతతో ఆత్మార్పణ దృష్టితో ఈశ్వరుని (పరమాత్మ) మనసునందు స్థిరీకరణ చేసుకొనగలిగినచో అది ధ్యానయోగమే యగును కర్మయోగము ద్వారా ధ్యానయోగమే లౌకిక జీవితములోని ఏకైక మార్గము "అనాశ్రితః కర్మఫలం" (6-1) కర్మఫలమును అపేక్షించనివాడు సన్యాసి వలె ధ్యానయోగఫలమును పొందును అని భావార్థము

ఆత్మ సంయమమునకు (ధ్యానమునకు) మనోనిశ్చలత అవసరము కాని మనస్సు చంచలమైనది (6-33)లో చెప్పబడినటుల "సామ్యేన" అనగా మనస్సు యొక్క సమత్వము చేతనే (నిశ్చలత్వము) ధ్యానయోగము సాధ్యమగును ధ్యానయోగమే అనాసక్తి యోగమునకు మార్గము గదా! కాని ఏ ఇంద్రియమైతే మానవుని పశుపక్ష్యాదుల కంటే ఉన్నతునిగా చేసినదో అదే ఇంద్రియము తన చంచల స్వభావముచే మానవుని పతనమునకు

కారణమగుచున్నది అదే మనసు మనస్సు చపలముగా నున్నంత వరకు నిష్కామకర్మయోగము సాధ్యపడదు నిష్కామకర్మయోగము లేనిది ధ్యాన యోగము లేదు ఈ విషయమున అర్జునుడు సర్వమానవులకు ప్రతినిధి లౌకిక జీవితములో ఆత్మార్పణ సాధనకై తపనపడు మానవునికి అర్జునుడు ప్రతీక

"చంచలం హి మనః" (6-34) అని అర్జునుడు వాపోవును మనోనిగ్రహము "దుష్కరమ్" అని చెప్పక "సుదుష్కరమ్" అని చెప్పబడినది అనగా మనోనిగ్రహము నిశ్చయముగ అసాధ్యము అని గాక అది అతిప్రయాసతో కూడినదిగా భావార్థమును గ్రహించవలయును

"అసంశయం మహాబాహోమనోదుర్నిగ్రహంచలమ్" (6-35)

మనస్సు (చలమ్) చంచలమైనది సంశయము లేదు దానిని 'దుర్నిగ్రహం" అనగా నిగ్రహించుట కష్టసాధ్యము అని శ్రీకృష్ణుడు కూడ అంగీకరించుచున్నాడు అయినను 'అభ్యాసేనతు కౌన్తేయ వైరాగ్యేణ చగృహ్యతే' (6-35) అభ్యాసము చేతను, వైరాగ్యము చేతను మనోనిగ్రహము సాధించ వచ్చునని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు మనస్సును నియంత్రించుట ఎటులనునది ప్రతి మానవునకు ఎదురగు ప్రశ్న దీనికి శ్రీకృష్ణుడు చెప్పిన మార్గములు రెండు 1) అభ్యాసము, 2) వైరాగ్యము ఇందు అభ్యాసమనగా సాధన అనగా నిరంతర ప్రయత్నము పతంజలి యోగసూత్రములు గూడ బహుకాల నిరంతరాభ్యాసముచే మనోనిగ్రహము తప్పక సాధ్యపడగలదని చెప్పుచున్నవి అభ్యాసమనగా పురుషప్రయత్నమే యగును నిత్యజీవితములో దేనిని సాధించుటకైనను (practice) అభ్యాసము అవసరము విద్యార్థులు సంవత్సరమంతయు సాధన చేసిన గాని సంవత్సరాంతమున పరీక్షలందుత్తీర్ణులు కాలేరు జన్మల పరంపర యందు కలుగు సంస్కారముల వలన చంచలమయిన మనస్సును నిశ్చలము చేయుటకు ఏకాగ్రత సాధించుటకు ఎంత సాధన

(అభ్యాసము) కావలయునో తెలియదగును ఇక వైరాగ్యము వైరాగ్యమనగా రాగద్వేషములను నియంత్రించుట, విషయవాంఛలను త్యజించుట రాగద్వేషములను త్యజించినపుడు మనస్సు అంతర్ముఖమగును అపుడే ధ్యానమందు మనోనిశ్చలత కలుగును

సర్వత్ర పరమాత్మ యున్నాడను భావమును అనగా అభేదబుద్ధిని పొందినచో రాగద్వేషములను అధిగమించుటకు మార్గము సుగమమగును అపుడు ఆత్మదృష్టి కలుగునని (6-31) శ్లోకములో వివరించబడింది తన ఆత్మ వలెనే అందరి యందున్న ఆత్మ కూడ యుండును అను భావము కలిగినపుడు ఆత్మదృష్టి బలపడును "ఆత్మౌపమ్యేన సర్వత్ర సమంపశ్యతి" - (6-32) తనను ఉపమానముగా చేసుకొని అనగా సమస్త ప్రాణులను సుఖదుఃఖము లందు తనతో పోల్చుకొనుచు చూచువాడు యోగశ్రేష్ఠుడగును అన్నారు ఇది ఆచరణ (అనుష్ఠాన) వేదాంతం (Practical Vedanta) "అంతయు పరమాత్మయే" అనుచు యితర జీవులకు అపకారము చేయుట విశ్వాత్మను గుర్తించినట్లు కాదు అది "అనుభవ వేదాంతము" కాదు "అంతటా ఒకే ఆత్మ కలదు" అను భావమును ఆచరణయందు చూపగలిగినపుడే ఆత్మానుభూతి కలుగును ఇదే ఆత్మౌపమ్యస్థితి క్రైస్తవమతమందు విశ్వమానవ సౌభ్రాతృత్వము (సోదరత్వము) (universal brotherhood) యీ కోవకు చెందినదే అయినను ఆత్మౌపమ్యస్థితిని పోలినది కాదు "సోదరభావము" యీ స్థాయికి చేరుటకు మొదటి మెట్టు మాత్రమే ఉపనిషత్తులు చెప్పిన 'ప్రేమ' యీ భావమునకు చరమస్థితి (ultimate) అదే ఆత్మౌపమ్య స్థితి అనగా విశ్వము నంతను ఒకే ఆత్మరూపముగ గ్రహించుట చంచలమైన మనస్సును నియంత్రించుటకు సాధనను మించిన మార్గము లేదని భగవద్గీత చెప్పియున్నది మనస్సునందు రెండు భాగములుండును ఒకటి నిరంతరం చంచలముగా నుండి ఇంద్రియ వాంఛల వైపు పరుగెత్తుచుండును రెండవది దానిని వెనుకకు మరల్చుటకు ప్రయత్నము చేయుచుండును ఇందు ఎప్పటికి ఏది బలముగా నుండునో

అది జరుగును అనగా మనస్సును మనస్సు ద్వారానే నియంత్రించుటకు సాధ్యపడును

భగవద్గీతలో కొన్ని శబ్దములకు (words) ప్రత్యేక అంతరార్థముండునని గ్రహించవలయును (6-35)వ శ్లోకములో శ్రీకృష్ణుడు అభ్యాసము ద్వారా మనోనిగ్రహమును సాధించవచ్చునని చెప్పుచు అర్జునిని 'మహాబాహో' అని సంబోధించును మహాబాహో అనగా గొప్ప భుజశక్తి గలవాడా! యని యర్థము భుజశక్తి, పరాక్రమము భౌతికములు మనస్సు కూడ భౌతిక యింద్రియములలో నొకటి భౌతికశక్తులు సద్వినియోగమగుటకు నిరంతర సాధన కావలయును భౌతికముగా అత్యంతశక్తివంతుడైన అర్జునుని అదే శక్తితో అభ్యాసము ద్వారా భౌతిక ఇంద్రియమైన మనస్సును నిగ్రహించవలయునని 'మహాబాహో' అని సంబోధించుటలోని అంతరార్థము

గీతాసారము భగవద్గీతలోని చివరి అధ్యాయము 18 మోక్షసన్యాస యోగము భగవద్గీత అంతా వినిన తరువాత సామాన్య మానవునికి కలుగు ప్రశ్న ఒకటే ఈ ప్రపంచమంతా ఒక భ్రమ అనినపుడు, కర్మఫలం అనుభవించక తప్పదు అనినపుడు, ప్రాణులు కర్మము చేయక ఉండలేడు, కర్మము అనివార్యములు, పురుష ప్రయత్నముచే నిష్కామకర్మ ద్వారా కర్మఫలమును నిరోధించవచ్చునని భగవద్గీత ఎంత చెప్పినను, అసలు పనులు చేయుట ఎందుకు, అనివార్యమైన ఫలమును అనుభవించుట ఎందుకు అనునదే మరల మరల కలుగు ప్రశ్న పనులు చేయకుండ ఉండగలమా? ఒకవేళ పనులు చేసిన వాటి వలన అనేక సమస్యలు ఏర్పడును (problems) వాటికి తగిన పరిష్కారము (solution) కొరకు తపన అందువలన లోకమాన్య బాలగంగాధరతిలక్ తన గీతా రహస్యములో చెప్పినట్లు, అసలు పని చేయకుంటే సమస్యలుండవు గదా అను ఆలోచన మనదేశంలో సామాన్య మానవుని మనస్సును తొలుస్తూ ఉన్నది కాని అట్టి మానవుడు పనిచేయక సోమరిగా

కూర్చుండినను అతని మనసు అలా కూర్చుండదే! అతని మనస్సు నందు కోర్కెలు నిరంతరం సుడులు తిరుగుచుండును గదా! మరి ఏమి చేయాలి? అందుకని కోర్కెలు తీర్చుకొనుటకు మాత్రమే పనులు చేయుట ప్రారంభించును అదే స్వార్థమునకు ప్రారంభం మనస్సు చంచలం అని శ్రీకృష్ణుడు గూడ అంగీకరించాడు అందువలన మనస్సును కోర్కెల వెంట పరుగుతీయకుండ నియంత్రించవలయునని గీతాసారము

ప్రపంచంలో అందరు సన్యాసులు కాలేరు కావలసిన అవసరము కూడ లేదు భగవద్గీత (18-2)లో చెప్పినట్లు

"కామ్యానాం కర్మణాంన్యాసం సన్యాసం" (18-2)

కామ్యకర్మలను (ఫలాపేక్షతో చేయు కర్మలు) వదలుట (న్యాసమ్) సన్యాసము అన్నారు సన్యాసమనగా సమస్తమును త్యజించి వనములకు పోవలయునని గీత చెప్పుట లేదు ఇంకను "సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాం" (18-2) సర్వకర్మ ఫలమును త్యాగము చేయుటయే నిజమైన త్యాగము అని విచక్షణ కలవారు చెప్పుదురు (ప్రాహుః) స్వర్గవాంఛతో చేయబడు యజ్ఞాది కర్మలు త్యాగములు కావు అని అర్థము నిత్యం గృహస్థులు కోరునది స్వర్గసుఖం అనగా కష్టములు లేని జీవితం ఫలాపేక్ష లేకుండ కర్మలను చేసినపుడు వనములకు, ఆశ్రమములకు పోకుండగనే సన్యాసి పొందు మోక్షమునే పొందగలరని గీతావచనము సోదర మానవుని విస్మరించి వనానికి వెడలినను మోక్షము సాధ్యము కాదు సర్వము నందు భగవంతుని చూచుటయే ఉత్తమము అదే బంధవిముక్తికి మార్గము

శ్రీమద్భాగవతంలో కూడ ఇదే భావం వెల్లడి అగుచున్నది అనగా వనములకు వెడలనవసరము లేదు గృహమునే తపోవనముగా చేసుకొన వచ్చును ఒకవేళ వనములకు వెడలినను మనస్సు కోర్కెలతో నిండియున్నంత వరకు దేహము మాత్రమే యచట నుండును మనస్సు పరిపరివిధముల

కోర్కెల వెంట పరుగెత్తుచుండును అట్టి వనవాసము ఏమి ప్రయోజనము లేదు ఆత్మను తెలుసుకొనుట కొరకే గదా - వనములలోనైనను చేయు ఏకాంతవాసము అది మనలో, అందరిలో నున్నది దైవం కోసం ఎక్కడెక్కడికో వెళ్ళటం అజ్ఞానం అని రామకృష్ణ పరమహంస అన్నారు

కష్టములు వచ్చినపుడే దేవుడు జ్ఞాపకం వస్తాడు అపుడే మ్రొక్కులు, దేవుడితో యిచ్చిపుచ్చుకునే బేరసారాలు మొదలగును మానవుడు తెలిసికొన వలసినది ఒకటే సంకటస్థితి యందు మనస్సును దైవమునందుంచి శక్తిని పుంజుకొనవలయును ఆ శక్తియే కష్టములను దాటుటకు మార్గమును తెలుసుకొనును భగవంతుడు దిగివచ్చి మనకు ఆ పని చేయడు భగవంతుడు మనలోనే యున్నాడు అని మనము గ్రహించినపుడు మనకు శక్తి కలుగును ఆ శక్తియే భగవంతుని కృప ఆ శక్తి వలననే మనకు మార్గము దొరుకును కొన్ని సమయములందు ఆ శక్తి మనకు లభించినను, మనకు బయట నుండి సహాయము అవసరమగును అట్టి సమయమున ఎవరో ఒకరు ఏనాటి కర్మబాంధవ్యము వలననో మనము ఊహించని విధముగ మనకు సహాయ పడుదురు, మన పని నెరవేరును అదే "దైవం మానుషరేపేణ" అనుటలోని భావము దైవము కర్మలలోను, కర్మఫలములందు కల్పించుకొనడు కాని కర్మఫలములు ఒక క్రమపద్ధతిలో సందర్భానుసారముగా జీవులకు అందునట్లు చేయుటయే భగవంతుని సంకల్పము ద్వారా ప్రకృతిలో ఏర్పడిన ఒక అల్లిక పన్నిన విధము (Net work) అతడు మనలోను, ప్రకృతిలోను ఉండియే సాక్షిగా దానిని గమనించుచుండును

కర్మఫలములనబడు కష్టసుఖములే మన చుట్టూ యున్న ఒక దుర్గము (కోట) "దుర్గాణి" (18-58) అని భగవద్గీతలో చెప్పబడినది ఆ దుర్గమే ప్రకృతి అనగా మన శరీరమును ఆవరించియున్న 'మాయ' నిష్కామకర్మము ద్వారా సర్వవ్యాపి భగవంతుడు అను జ్ఞానముతో శక్తిని పొంది

ఆ మాయను దాటవచ్చునని భగవద్గీతాసారము అట్లుగాక అంతయు "నా శక్తి వలననే జరుగుచున్నది" అను అహంకారమున్నంత వరకు భగవంతుని మార్గదర్శకత్వము అనగా ఆత్మశక్తి లభించదు అది పూర్తిగా భౌతికశక్తి మీదనే ఆధారపడుటయగును

"సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" (18-66)

ఇది భగవద్గీతలో అత్యంత ప్రధానమైన శ్లోకము గీతయందలి తత్త్వబోధలోని చివరి శ్లోకముగా చెప్పవచ్చును సమస్త ధర్మములను విడిచిపెట్టి (మామ్ + ఏకం) "నన్ను ఒక్కని మాత్రమే" శరణము పొందుము (వ్రజ), (అహం) నేను, (త్వా) నిన్ను, సర్వపాపముల నుండి విడిపించెదను (మోక్ష యిష్యామి), శోకింపకుము (మాశుచః) అని శ్రీకృష్ణుడు అర్జునునికి ధైర్యము చెప్పెను వైష్ణవ మతమందు యీ శ్లోకము జపమంత్రమంత ప్రాధాన్యము పొందినది

'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనగా శ్రీకృష్ణుని బోధనలోని అంతరార్థము ఏమిటో తెలియవలెను చేయవలసిన కర్మమే ధర్మము అగును కర్మము చేయకుండ ఏ జీవుడు ఉండలేడు అని చెప్పూనే, సర్వధర్మములను త్యజించమని చెప్పుటలోని అర్థమేమి? శ్రీకృష్ణుడు పరస్పర విరుద్ధమైనవి బోధించి యుండడు గదా! కావున 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనుటలోని ప్రత్యేకార్థము తెలియవలయును

ఈ శ్లోకముతో కర్మయోగములోని 35వ శ్లోకమును అనుసంధానము చేసి చూచినచో అంతరార్థము బోధపడును

"శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః" (3-35)

'స్వనుష్ఠితాత్' చక్కగా నాచరింపబడిన ఇతరుల ధర్మముల కంటె 'విగుణః' గుణహీనముగా చేయబడినదైనను స్వధర్మమే శ్రేయమైనది స్వధర్మ నిర్వహణ యందు మరణమే పొందినను (నిధనమ్) అది శ్రేయమే యగును ఇతరుల ధర్మము భయానకమైనది అని చెప్పబడినది

ఇచట స్వధర్మము, పరధర్మము దేనిని బట్టి నిర్ణయించవలయును క్షత్రియుడుగా అర్జునుడు నిర్వర్తించవలసిన ధర్మమునుపదేశించుట గీతోపదేశములోని ముఖ్యఉద్దేశము కావున యిచట ధర్మము వర్ణాశ్రమము ననుసరించి చెప్పబడినదిగా తెలియుచున్నది కాని నేడు వర్ణాశ్రమములు లేవు వాటి ధర్మములు లేవు వర్ణముల స్థానమున కులములు వచ్చినవి ఈ కులములు పుట్టుకతో వచ్చునవి కాని గుణములను, కర్మములను అనుసరించి పొందినవి కావు వర్ణములకున్న ధర్మములు యీ కులములకు లేవు ఏ కులము వాడైనను ఏ పనైనను లేక అన్ని పనులు చేయవచ్చును చేయుచున్నాడు అందువలన గీతలో ఉద్దేశించబడిన స్వధర్మ, పరధర్మములని ఏమియును లేవు కావున ఎవరు ఏ పనిని తన ప్రవృత్తికనుకూలముగా నిర్ణయించుకుందురో అదే వారి స్వధర్మముగా (పని, లేక కర్మము) గ్రహించవలయును తాము నిర్ణయించుకున్న ధర్మమును స్వధర్మముగా నిర్వర్తించుచు పరుల కార్యము (ధర్మము) జోలికి పోకుండుటయే "శ్రేయాన్ స్వధర్మో" అను గీతావచనేమునకు నేటి స్థితిగతులకు సరిపడు వ్యాఖ్య అగును కొన్ని సమయములందు స్వభావమునకు (ప్రవృత్తి), అభిరుచికి, ఆశయమునకు సరిపడని వృత్తిని చేయవలసివచ్చును అది సంచితకర్మ (ప్రారబ్ధకర్మరూపమున) ఫలమేయగును అట్టి సమయములందు తృప్తి యొక్కటియే మార్గాంతరము తనకు ప్రాప్తించిన వృత్తినే స్వధర్మముగా నెంచి, నిత్యము పరుల వృత్తులు సుఖముగా నున్నవి, అది తనకు లేదు అను ఓటమి, నిస్పృహ స్థితికి లోనుగాక, ప్రాప్తధర్మమును (వృత్తి లేక జీవనస్థితి వలన చేయవలసిన కార్యములు) సవ్యముగ నిస్వార్థముగా నిర్వర్తించవలయుననియే యీ శ్లోక అంతరార్థము కష్టముగా కనబడినను

స్వధర్మమే మేలైనది

నేటి సమాజము చాల సంక్లిష్ట రూపములో నున్నది ధర్మమును స్పష్టముగా నిర్వచించుటకు సులభసాధ్యము కాని పరిస్థితి యీనాడున్నది సహజముగ స్వధర్మ, పరధర్మములను ధర్మశాస్త్రము, స్మృతులు, సూత్రముల ద్వారానే తెలుసుకొనవలసియుండును కాని శాస్త్రములు, స్మృతులు ఎప్పుడు వ్రాయబడినవి వర్ణాశ్రమ ధర్మములు గౌరవించబడుచున్న, అనుసరించ బడుచున్న కాలములో వ్రాయబడినవి అటులే వాటి భాష్యకారులు, వ్యాఖ్యాతలు ధర్మములకు భాష్యము చెప్పారు కాని నేడు వర్ణములు లేవు కులములు ఏర్పడినవి వాటినే వర్ణములుగా భావించినను అవి ఒక్కొక్కటి శతాధిక శాఖోపశాఖలుగా చీలిపోయి పరస్పర విరుద్ధ ధర్మములకు ప్రాచుర్యము కల్పించినవి చాతుర్వర్ణములు స్పష్టముగా లేనపుడు వాటినుద్దేశించి నిర్దేశించబడిన ధర్మములు యీనాడు ఆచరణయోగ్యములు కావు వర్ణములు అదృశ్యమైనటులే వర్ణధర్మములు కూడ అంతరించినవి వర్ణసంకరముతో పాటు ధర్మసంకరము కూడ జరిగినది అందువలన ప్రాప్తించిన వృత్తిధర్మమునే స్వధర్మముగా భావించవలయునని "శ్రేయాన్ స్వధర్మాన్" అనుటకు భాష్యముగా చెప్పవలయును అదే స్వధర్మ నిర్వహణమగును స్వధర్మమును విడిచి లేక మరచి పరధర్మమునకు మారుట మనస్సు స్థిమితము లేకుండుట యగును దీనికి శ్రీరామకృష్ణ పరమహంస చక్కటి ఉపమానము చెప్పారు వర్షములు లేనపుడు పంటపొలము బీడుగా మారును అంత మాత్రమున తరతరాలుగ వ్యవసాయమునే స్వధర్మముగా విశ్వసించిన వ్యవసాయదారుడు దానిని బీడుగా వదలివేయడు, వేయలేడు కాని క్రొత్తగా వ్యవసాయము మొదలుపెట్టిన వ్యాపారి ఒక పర్యాయము వర్షములు లేనంత మాత్రముననే దానిని విడిచివేయును అపుడతడు ఉభయభ్రష్టుడగును అదియే స్వధర్మమును విశ్వసించుట యందలి ప్రాధాన్యము

18వ అధ్యాయమున వర్ణస్వభావ కర్మములను గురించి చెప్పుచు 49వ శ్లోకమునందు తిరిగి యిదే విషయమును శ్రీకృష్ణుడు చెప్పారు

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావ నియతం కర్మకుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥" (18-47)

తన ధర్మము (విగుణః) గుణములేనిదైనను సవ్యముగా నిర్వర్తించినచో అది యితరుల ధర్మము కంటే (శ్రేయాన్) మిక్కిలి శ్రేష్ఠమైనది (స్వభావనియతం) స్వభావము వలన నేర్పడిన (స్వభావము ప్రారబ్ధకర్మము వలన కలుగును) కర్మమును చేయువాడు (కిల్బిషం) పాపమును (నాప్నోతి) పొందడు

విషపురుగులోని దోషము దానికి దోషము కాదు అది యితరులకు ప్రాకినచో అది అనగా ఆ విషము వారికి దోషమగుచున్నది అటులే స్వధర్మ పరధర్మములని శంకరభాష్యము "నేను చేయుచున్నాను" అను కర్తృత్వాభిమానమును విడిచి కర్మఫలమైన దేహము, మనస్సు, ఇంద్రియములు కర్మమును చేయుచున్నవి అని తలచి కర్మయోగమును ఆచరించుట ఉత్తమము దీనికి ఈశ్వరార్పణ బుద్ధి (ప్రపత్తి) ప్రధానము అని రామానుజుల భాష్యము ఏ కర్మమునన్నైనను నిస్వార్థ బుద్ధితో నిర్వర్తించిన అది భగవదారాధనే యగును "స్వభావనియతం కర్మ" అనగా నేటి సమాజ పరిస్థితుల ననుసరించి ప్రాప్తించిన వృత్తిధర్మమునే స్వధర్మముగా పరిగణించవలయునని భావము (18-46)లో కూడ దీనినే స్పష్టము చేశారు

"యతః ప్రవృత్తిర్భూతానాంయేన సర్వమిదం తతం ।
స్వకర్మణా మభ్యర్చ్య సిద్ధిం విందతిమానవః ॥" (18-46)

(యతః) ఎవరి నుండి సర్వప్రాణులు, ఉత్పత్తి, క్రియలు యగుచున్నవో, (యేన) ఎవరిచే యీ ప్రపంచమంతయు వ్యాపించబడియున్నదో (తం) అతనిని స్వకర్మముచే అర్చించి మానవుడు సిద్ధిని పొందుచున్నాడు

(విందతి) అన్నారు

ఈ ప్రపంచమందు అన్నిటి యందు పరమాత్మ, పరమాత్మ యందన్నియు యున్నవి పరమాత్మ సర్వాంతర్యామి అందుచే యీ ప్రకృతియందు నిరర్ధకమగునది ఏదియును లేదు చరాచరములన్నియు ఏదో యొక విధముగ సార్ధకములే చరములందు చలనము (క్రియ లేక కర్మము) కనబడుచుండును అచరములందు చలనము కనబడదు ఉదాహరణకు పర్వతములు గూడ పెరుగుచున్నవి అని భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు (scientists) చెప్పున్నారు గదా!

సమస్త జీవుల సంయుక్తరూపమే ప్రకృతి ప్రతి జీవుడు తనకు ప్రాప్తించిన వృత్తి ధర్మమును నిర్వర్తించుట ద్వారా ప్రకృతిలో తన వంతు ధర్మమును నిర్వర్తించుచున్నాడు కావున ప్రతి మానవుడు తాను చేయగలిగిన, చేయుచున్న కార్యమును ఈశ్వర ఆరాధనగా చేయుటయే కర్మయోగ మనబడును దీనినే స్వావలంబన యోగము అని శ్రీమద్భాగవతంలో అన్నారు (3-28-2)

స్వధర్మాచరణం శక్త్యావిధర్మాచ్చ నివర్తనం ।
దైవాల్లబ్ధేన సంతోష ఆత్మవిచ్చరణార్చనమ్ ॥

యధాశక్తిగ స్వధర్మమును ఆచరించవలయును ఇతరుల ధర్మమును అనుసరించక విడవవలయును లభించిన వస్తువును దైవప్రాప్తమని తృప్తితో సంతోషించవలయును ఆత్మజ్ఞానులను అర్చించవలయును

'స్వకర్మణాతమభ్యర్చ్య' (18-46) అనగా స్వధర్మాచరణ ద్వారా భగవంతుని ఆరాధించుట ఇదియే గీతా సారాంశముగా చెప్పవలయును దీని అర్థము గ్రహించినపుడే సంపూర్ణ ఆత్మార్పణ సాధ్యమగును అది లేనిచో కర్మ నిర్వహణయందు 'అహం'భావము పెరిగి కర్మబంధము ఏర్పడును

ఆత్మార్పణ బుద్ధితో స్వధర్మాచరణమే ఉత్తమమైనదని చెప్పబడినది ఈ ప్రపంచమందు ఒకటి తక్కువ పని మరొకటి ఎక్కువ పని అను సంశయమునకు స్థానము లేదు ఇదే భగవద్గీత సందేశము ప్రకృతియందు సమస్త జీవుల సమన్వయముండును అది మనకు కనబడదు అది తెలుసుకొనగల్గినపుడు 'ఆత్మార్పణ' యననేమిటో బోధపడును దాని ద్వారానే 'ఆత్మానుభూతి' కలుగును స్వధర్మము (మన పని) ద్వారానే కర్మయోగము సాధించి ఆత్మయోగమును పొందవచ్చును

గతజన్మ సంస్కారముల వలన పుట్టుకతోనే కొన్ని లక్షణములు ఏర్పడును ఆశలు, అభిరుచులు కలుగును వీటినే సైన్సులో జన్యుపరమైన స్థితి (Genetic or DNA) అన్నారు పురుషప్రయత్నముతో వీటిని మార్చుకొనవచ్చును కాని సాధారణముగా అది ఒక పరిధిలో (limit) మాత్రమే సాధ్యము దానిని సహజ స్వభావము అన్నారు సహజ స్వభావముతోనే స్వధర్మమును నిర్వర్తించుచు పరులకు అపకారము జరగకుండునటుల జాగ్రత్త వహించవలయును కాని నేటి మానవ జీవితం యాంత్రికమైనది యాంత్రిక జీవితమందు ఆత్మస్వేచ్ఛ కరువగును స్వధర్మమునందు నిరాశ నిస్పృహ ప్రబలును పరుల ధర్మము నందు వాంఛ, ఆకర్షణ కలుగును అది స్వార్థమును పెంచును ఆత్మార్పణ బుద్ధితో స్వధర్మమును నెరవేర్చినచో యీ ప్రమాదమునకు తావులేదు (work is divine) పని యందు ఆరాధనా భావమున్నపుడు పనిచేయుట యందు ఆనందము కలుగును వృత్తిపరంగానే కాదు కుటుంబపరంగాను, అన్ని కార్యములందు యిది వర్తించును మనము చేయు పని ఎంత చిన్నదైనను, దానికి ఆత్మ మూలము అని గ్రహించినపుడే అనుభూతి కలుగును సర్వవ్యాపియైన భగవంతుని ("సర్వం ఖల్విదం బ్రహ్మ") సర్వమందు చూచి ఆ అనుభూతి ద్వారా తాను కూడా దైవముగా మారవచ్చుననియే గీత యిచ్చు సందేశం ఈ అవకాశము మానవునికి మాత్రమే యున్నది తప్పులు చేయటం మానవునికి ఎంత సహజమో వాటిని

సరిదిద్దుకొనుటకు అంత స్వేచ్ఛ మానవునకున్నది ఆ స్వేచ్ఛను వక్రమార్గమున పడకుండ సద్వినియోగము చేసుకొనినచో ఆ స్వేచ్ఛ ఆత్మానుభూతికి మార్గమగును మనము చేయు పని నైతికవిలువతో కూడినదై దానిని యితరులు అనుసరించినపుడు ఆ నైతిక విలువ ఫలితము మనకు వస్తుంది అదే సర్వము నందు భగవంతుని చూచుటకు దోహదపడును

'సర్వధర్మాన్ పరిత్యజ్య' (18-66) అనునది ఆత్మార్పణబుద్ధికి మార్గముగా గ్రహించవలయును ఇది భక్తి ప్రపత్తికే మార్గము సర్వధర్మములను పరిత్యజించమనగా 'అహం'తో సర్వమునందు పరమాత్మను చూడలేని ధర్మములను అనగా కర్మములను పరిత్యజించమని భావము దృశ్యములగు వస్తువులే సర్వము అని తలపక 'దృక్' (చూచునది) యగు ఆత్మను గ్రహించటమే సర్వధర్మాన్ పరిత్యజ్య అనుటలోని అంతరార్థము ధర్మములను పరిత్యజించ మనగా ఏ పనిలేకుండ సోమరిగ నుండమని కాదు అంతేకాక ధర్మమును వదలి అధర్మ కార్యములు చేయమని కాదు ప్రపత్తి (ఆత్మార్పణ)తో కూడిన కర్మయోగము ద్వారా కర్మబంధ విముక్తి కలుగునని చెప్పుటయే "మామేకం శరణం వ్రజ, మోక్షయిష్యామి" అను గీతావచనములోని భావము జ్ఞానులకు అజ్ఞానులకు కూడ యిదే విముక్తి మార్గము జ్ఞానులు అంతర్ముఖులగుటకు, అజ్ఞానులు 'ఆత్మవత్ సర్వభూతాని" జీవులందరు నా తోటివారు అని అందరియందు భగవంతుని చూడగలుగుటకు ఇదే మార్గము

నది ఎంతో దూరము ప్రవహించి చివరకు సముద్రములో కలియును ఈ సంగమమే శరణాగతి మన చర్యలు నదీప్రవాహము వంటివి సముద్రమున సంగమమగుటకే నది ప్రవహించును ఫలాపేక్ష లేకుండ కర్మయోగము సాధించిన అది ఆత్మార్పణమే యగును నది సముద్రములో కలిసినపుడు తన స్వభావము కోల్పోయి సముద్ర స్వభావమునే పొందును అయితే నిష్కామకర్మ ద్వారా దైవస్వభావముతో మనము ఐక్యత పొందుదుము "కర్తవ్యము

నిర్వహింపుము, ఫలితము నీ కొరకే ఆశించకుము" అదే సత్‌చిత్ ఆనందమునకు సోపానము 'సత్' అనగా సత్యము నిత్యము, శాశ్వతమైన సత్యము అదే పరబ్రహ్మము (పరమాత్మ) "చిత్" అనగా జ్ఞానము లేక బుద్ధి శాశ్వతమైన ఆ పరమాత్మను తెలుసుకొనుటయే ఆ జ్ఞానము అట్టి 'చిత్' పొందినది 'ఆనందము' అది తాత్కాలికమైన భౌతిక ఆనందము కాదు ఎన్నడు తరగని సుఖమును కలిగించునదే ఆ ఆనందము ఆ ఆనంద స్థితియే బ్రహ్మజ్ఞానము ఆ పరబ్రహ్మమే సచ్చిదానందము ఆ బ్రహ్మస్థితిని పొందినవారు కూడ సచ్చిదానంద స్వరూపులగుదురు శాశ్వతమైన జ్ఞానమయమైన ఆనందస్థితి అది "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనుటలోని అంతరార్థము యిదే

నిత్యము క్రియలు లేక కార్యములతో నిండి యుండు యీ జీవితమును ఒక యానము (యానకము) (Medium) గా గ్రహించినచో కర్మ యుక్తమైన జీవితము ద్వారానే పరమార్థమును గ్రహించగలుగుతాము అనగా నిత్యము మనము చేయు కర్మములే కర్మవిముక్తికి మార్గములు అనగా మనలను మనమే ఉద్ధరించుకొనవలయును కర్మయుతమైన జీవితము ఒక ప్రవాహము ఎత్తుపల్లములను పాటించక నది ప్రవహించి సముద్రమును చేరును జీవితము కూడ అంతే కర్మయోగము ద్వారా సర్వమునందు భగవంతుని (పరమాత్మ) చూచి ఆత్మయోగ సిద్ధి పొందుటయే జీవితగమ్యము అపుడు మనకు మనమే శరణు పొందుదుము మనకు మనమే విముక్తి పొందుదుము

జీవన పర్వాలలో
పరువాలెన్నో
మరి పతనాలెన్నో,
నిమ్నోన్నత పరీవాహమే

జీవిత స్వారస్యం,
జీవన తరంగాలలో
నిమ్నాలే మిన్న
ఎక్కడో మరి ఉన్నతాలు
సంగమమే
వెలుగు చీకటుల సంగమమే
పరిణామం
జీవనయాన పరిణామం

కర్మ యోగమును గురించి భగవద్గీత పరిసమాప్త శ్లోకము (18-78)లో అంతర్లీనముగా చెప్పబడినది

"యత్రయోగేశ్వరః కృష్ణోయత్రపార్థోధనుర్ధరః,
తత్రశ్రీర్విజయోభూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ" (18-78)

(యత్ర) ఎచట యోగేశ్వరుడగు కృష్ణుడు ధనుర్ధరుడగు పార్థుడుండునో (తత్ర) అచట శ్రీ (సంపద) విజయము, (భూతిః) ఐశ్వర్యము (ధృవా) దృఢమైన నీతిః (నీతియు) (ఉండునని) మతిర్మమ (మతిఃమమ), (మమ) నా యొక్క (మతిః) అభిప్రాయము

గీతాబోధ పరిసమాప్తమైన తదుపరి సంజయుడు ధృతరాష్ట్రునికి తన అభిప్రాయముగా చెప్పిన శ్లోకమిది చెప్పినది సంజయుడైనను యిది శ్రీకృష్ణుడు చెప్పిన నిష్కామకర్మయోగ సారాంశము 18వ అధ్యాయమే గీతాసారాంశమగును 17వ అధ్యాయము వరకు చెప్పినదంతయు శ్రీకృష్ణుడు తిరిగి చెప్పియున్నాడు

ధనుర్ధరుడైన పార్థుడు గీతాసారాంశమును గ్రహించిన కర్మయోగి (కార్యశూరుడు)కి ప్రతీక ఆ యోగస్థితికి అర్జునుడు చేరుటకు ప్రేరకుడు అట్టి యోగమునకే బాహ్యరూపమైన శ్రీకృష్ణుడు కర్మయోగి, కర్మయోగరూపుడు

(ప్రేరకుడు) ఒక్కచోట నున్నపుడు సర్వశుభములు కలుగుననుట అర్జునుడు అప్పటి తన స్థితిపై తానే విజయము సాధించెనని భావార్థము ప్రేరకము ఆత్మ అనగా శ్రీకృష్ణుడు మన వెన్నెముక వెంబడి నాడీకేంద్రములు (యోగనాడులు) యుండును అదియే మానవుని ప్రజ్ఞకు సాధకము అది దివ్య ప్రజ్ఞప్రేరకము వలన ఉత్తేజము పొందినపుడు, ఆయుధమగును అర్జునుని ధనస్సు దానికి ప్రతీక దైవప్రజ్ఞ నరుని ప్రజ్ఞతో కూడినపుడు విజయము తధ్యము కర్మము నరుని ప్రజ్ఞ నిష్కామము దైవప్రజ్ఞ రెండును కలిసిన అది నిష్కామకర్మ యోగమగును

నరుని ప్రజ్ఞ శక్తి, దైవజ్ఞ యుక్తియని లోకమాన్య బాలగంగాధరతిలక్ తన గీతారహస్యమున వ్యాఖ్యానించారు ఎచట శక్తియుక్తి ఏకీభవించునో యచట బుద్ధి, సిద్ధి తప్పక యుండును కేవలము శక్తిచేగాని, కేవలము యుక్తిచే గాని కార్యము నెరవేరదని గీతారహస్యముగా తిలక్ భావించారు జరాసంధ వధ సందర్భమును తిలక్ మహాశయులు ఉదాహరణగా చెప్పారు "అంధం బలం జడం ప్రాహుః" (మహాభారతము సభాపర్వము 20-16) బలము గ్రుడ్డిది జడప్రాయమైనది, "ప్రణేతవ్యం విచక్షణైః" (2-20-16) దానికి యుక్తిపరుడు మార్గదర్శకుడు కావలయును అని ధర్మరాజు శ్రీకృష్ణునితో అనును శ్రీకృష్ణుడు "మయి నీతిర్బలంభీమే" (సభా 20-3) తన యందు నీతి (యుక్తి) భీముని యందు బలము యున్నవి యనును యుక్తిచే శ్రీకృష్ణుడు జరాసంధుని భీమునిచే వధింపజేయును యోగము అనగా యుక్తి యుక్తికి ఈశ్వరుడు శ్రీకృష్ణుడు ధనుర్ధరుడు అనగా యుద్ధము చేయుటకు శక్తిగలవాడు శక్తియుక్తుల కలయికయే నిష్కామకర్మకు మార్గము

నిస్వార్థ కర్మమే గీతా సారాంశమని మహాత్మాగాంధి కూడ అభిప్రాయ పడ్డారు (The Gospel of selfless action) 1930 దండి ఉప్పుసత్యాగ్రహ సందర్భమున ఆయన ఉదాత్తమైన అనర్గళమైన భాషణలందు యిలా అన్నారు

(Means-end) సాధనము-ఫలితమును గురించి చెప్పుచు సత్ఫలితమునకు మూలమైన నీతి, ధర్మములకు శ్రీకృష్ణుని సంకేతముగాను, శుద్ధమైన సాధనమునకు అర్జునుని ప్రతీకగాను వర్ణించారు మనము ఎంచుకొను మార్గము లేక సాధనము స్వచ్ఛమైనపుడు, నిస్సంశయముగా భగవంతుని ఆశీస్సులు ఉండును అన్నారు ఈ రెండు కలిసినపుడు విజయము తథ్యము అని కర్మయోగ సారాంశముగా చెప్పారు

దీనిని కర్మయోగ రహస్యము (The secret of Action) గా శ్రీ అరవిందులు నిర్వచించారు అరవిందుల దృష్టిలో భగవద్గీత సిద్ధాంత గ్రంథము కాదు అది ఒక సమన్వయ గ్రంథము లేక సాధన గ్రంథము కర్మ, జ్ఞాన, భక్తి యోగముల సమన్వయ ప్రయత్నమే భగవద్గీతా సారాంశము అన్నారు కాని కర్మయోగమునకే ఎక్కువ ప్రాధాన్యము యివ్వబడినదని అభిప్రాయపడ్డారు అయినా పరమాత్మతో సమాగమమగుటకు మార్గమునే (మోక్షము) సూచించింది అన్నారు ప్రకృతి అంతటా అన్నిటిలోను, అందరిలోను అగోచరముగానున్న దైవమును తెలుసుకొనుటయే కాక దివ్యచైతన్యమే (Divine Consciousness) అందరికి రావలయునని అరవిందుల ఆశయము మనకు నచ్చినది చేయుటయే కర్మయోగం కాదు కేవలం నైతిక ప్రవర్తన కూడ కర్మయోగం కాదు దివ్యచైతన్యముతో ఏకమైన స్థితిలో కర్మలు చేయుటయే కర్మయోగం అన్నారు కేవలం విధ్యుక్త ధర్మ నిర్వహణ మాత్రమే కర్మయోగం కాదు అన్నారు కురుక్షేత్ర యుద్ధము వలెనే జీవితం ఒక యుద్ధరంగం అని అరవిందుల అభిప్రాయం అందు సారధి సచివుడు పరమాత్మ తన దివ్యచైతన్యమును చేరుటకు మానవులకు తననే ఉదాహరణగా చెప్పుటకు తానే మానవ జీవితంలో వ్యక్తమగును దానినే అవతారమన్నారు నిష్కామ కర్మ ద్వారా జ్ఞానమును పొందుటయే ఆత్మార్పణకు మార్గమగును అన్నారు దివ్యచైతన్యముతో తన చైతన్యం ఏకం చేసి ఆ స్థితిలో కర్మలు చేయుటయే కర్మయోగమగును అన్నారు అరవిందుల దృష్టిలో కర్మఫలత్యాగమే ఒక

యజ్ఞము తాను కర్తను కాదని తెలుసుకొనుటయే కర్మఫల త్యాగమునకు మార్గము గీత కర్మ సన్యాసమును చెప్పలేదు 'అహం' నేను అను వ్యక్తిత్వమును వదులుకొని తద్వారా పరమాత్మతో ఐక్యత సాధించుటయే గీతాసందేశమన్నారు

బాలగంగాధర తిలక్, సర్వేపల్లి రాధాకృష్ణ వంటివారు భగవద్గీతను కర్మయోగము ద్వారా నైతిక విలువల సాధనను బోధించిన గ్రంథము అన్నారు అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత మతప్రవక్తలు తమ సిద్ధాంతములకనుగుణముగా భాష్యము చెప్పారు వర్తమానయుగంలో కొంత మంది విధ్యుక్త ధర్మమును ఆచరించుట ద్వారాను, పరోపకారము ద్వారాను కర్మయోగ సాధనయే గీతాసందేశమన్నారు అరవిందులు యిందుకు భిన్నమైన వ్యాఖ్య చెప్పారు గీత ఆధ్యాత్మిక గ్రంథము అన్నారు నిమ్న స్వభావము నుండి ఉన్నతమైన దైవస్వభావము సాధించి తద్వారా మానవాళి అందరిలోను దివ్యచైతన్యం ప్రవహించునట్లు చేయుటకు గీత సాధనమార్గము చెప్పిందని అరవిందులు వ్యాఖ్యానించారు మానవ జీవితస్థితి, ఉనికిని గురించిన రహస్యమును వివరించుటయే గీతాసందేశము అన్నారు అరవిందులు మానవుని స్థితి ప్రకృతి యంత్ర సముదాయములో (Machinery of Nature) నొకటి మాత్రమే కాదు ప్రకృతి యంత్రసముదాయము ఒక నియమిత చక్రము వంటిది ఏదో యుగములోనో లేక అనేక యుగములలోనో ఆత్మ ఆ చక్రములో తగుల్కొని యుండుటయే జీవిత స్థితి కాదు జీవించుట కొరకే జీవితము కాదు అది దివ్యచైతన్యముతో ఐక్యత కొరకు ఎందుకనగా ఆత్మ పరమాత్మ యందలి అంశమే కదా! కర్మము అనునది తనను తాను తెలుసుకొనుటకు, తన స్థితిని సఫలము చేయుటకు మరియు తాత్కాలికమైన బాహ్యాగోచరమగు కర్మఫలితము కొరకే గాక, ఆంతరికమైన దివ్యచైతన్యము కొరకు కూడ అయి యుండవలయును అన్నారు

భగవద్గీత (18-78) శ్లోకమునకు అర్థము చెప్పుచు అద్వైత (భావవాది) తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ యిలా అన్నారు యోగము అనగా ధ్యానము ద్వారా ఒక దర్శనమును (vision) పొందగలుగుట మానవుని ఆత్మ చైతన్యవంతమై పరమాత్మతో కలిసినపుడు విజయము, సంపద, నీతి, ధర్మము తప్పక కలుగును యోగ అనబడు దర్శనమును (vision) శక్తి అనబడు ధనుస్సుతో కలిసినపుడు, యోగమును ఉన్మాదముగా దిగజారకుండగను, శక్తి కిరాతకము (క్రౌర్యము)గా రూపొందకుండగను జాగ్రత్త వహించవలయునని గీతా సందేశము దివ్యత్వములోని అంశములే యోగములు ఆ యోగసాధన ద్వారా, ఆత్మార్పణ ద్వారా తన శక్తిని పరమాత్మ సృష్టి ప్రణాళిక (Cosmic Plan) పురోగతికి దోహదము చేయుచు భగవంతుని తెలుసుకొనవలయునని గీత చెప్పుచున్నది ఆధ్యాత్మిక దర్శనము, మానవసేవ నిరంతరం కలిసియే ముందుకు సాగవలయును మానవ జీవితములో ద్వివిధమైన ధ్యేయమున్నది ఒకటి ఆత్మ పరిపూర్ణత (స్వీయ పరిపూర్ణత) రెండవది సామాజికమైన సామర్థ్యము ఉన్నత భావన మరియు సక్రమ కార్యము (high thought and just action) ల సంయోగమే మానవపరిపూర్ణతకు మార్గము ఇదే నిత్యము జీవితధ్యేయము కావలయును అనియే భగవద్గీత సందేశము శ్రీకృష్ణుడు ఆత్మ పరిపూర్ణతకు, ఉన్నత భావనకు సంకేతము అర్జునుడు సామాజిక సామర్థ్యమునకు, సక్రమ కార్యశక్తికి ప్రతీక

ఆత్మార్పణ లేక శరణాగతి యనగా సర్వము దైవమే చేయును అను తలంపుతో పురుష ప్రయత్నం వదలివేయమని కాదు సృష్టిలోని ఈశ్వరుని ప్రణాళికనూ (planning) విస్మరించరాదు, అటులే సర్వము పురుష ప్రయత్నము చేతనే కలుగును అని భ్రమ చెందరాదు అట్టి భ్రమ 'అహం'కారమునకు దారితీయును ఫలమును భగవంతునికి అర్పించి ప్రతి వ్యక్తి తన కర్తవ్యమును పూర్తి చేయవలయును ఈశ్వరకృప యనగా కర్మఫలితమును ఆత్మార్పణ

ద్వారా భగవంతునకు వదలినపుడు కార్యము నెరవేర్చుటకు తగిన ప్రేరకము ఆంతరికముగా లభించుట అట్టి ఈశ్వరకృప, జీవుని ప్రయత్నము కలిసినపుడు లౌకిక జీవితములోను ఆంతరిక జీవితములోను విజయమార్గము ప్రాప్తించును సూర్యుని వెలుగు నీటి మీద, అద్దము మీద ప్రతిఫలించును నీరు, అద్దము ఎంత స్వచ్ఛముగా ఉండిన సూర్యుని వెలుగు అంత ప్రతిఫలించును కర్మసాధనకు వనరులు (resources) అవసరము వనరులు రెండు విధములు ఒకటి బాహ్యమైన భౌతిక వనరులు రెండవది ఆంతరికమైన ఆత్మసంబంధ వనరులు ఆత్మార్పణ అనగా శరణాగతి (ప్రపత్తితో గూడిన భక్తి) ద్వారా ఆంతరిక వనరులు ఒనగూడును భౌతికమైన బాహ్యవనరులు కార్యసాధనకు తోడ్పడును ఆంతరిక వనరులు కార్యసాధనకు సవ్యమైన మార్గము చూపును

భగవద్గీతలో చెప్పబడిన జ్ఞాన, కర్మ, భక్తియోగములలో పరస్పర వైరుధ్యమున్నదని కొంతమంది వాదము జ్ఞాన, కర్మ మార్గములను ఒకటిగా చెప్పి భక్తిమార్గము దానికి విరుద్ధముగా నున్నదందురు జ్ఞాన, కర్మమార్గములు రెండును కర్మసిద్ధాంతమును తమదైన రీతిలో అంగీకరించినవే జ్ఞానమార్గము కర్మత్యాగమునకు ప్రాధాన్యము చూపితే, కర్మమార్గము నిష్కామకర్మాచరణకు ప్రాధాన్యము నిచ్చినది కాని భక్తిమార్గము ద్వారా కర్మఫలానుభవము నుండి విముక్తి పొందవచ్చునని చెప్పబడినది గదా! అది కర్మ సిద్ధాంతమునకు విరుద్ధము గదా! అందురు ఈ విషయము యింతకు ముందు చర్చించబడినది వాస్తవమునకు జ్ఞాన కర్మ భక్తి మార్గములు మూడును కర్మసిద్ధాంతమునకు విరుద్ధములు కావు మానవుడు కర్మలు చేయక తప్పించుకొనలేడు, కర్మఫలము అనుభవించకా తప్పదు అనియే గదా భగవద్గీత చెప్పినది అయిన గీతాసందేశములో ప్రధానాంశములైన జ్ఞాన, కర్మ, భక్తి మార్గములు కర్మ సిద్ధాంతమునకు విరుద్ధము లెట్లగును?

కర్మ పరిపక్వము చెందునంత వరకు అనుభవించక తప్పదు కర్మ

పరిపక్వము లేక కర్మవిపాకము అనగా కర్మఫలమును పూర్తిగా అనుభవించుట ద్వారా దాని ప్రభావము నుండి విముక్తి పొందుట-అనుభవించుట ద్వారానే కర్మ నుండి విముక్తి కలుగును ఆ విముక్తి సమయమునే కర్మ పరిపక్వము లేక కర్మవిపాకము అన్నారు

పునరపి జననం, పునరపి మరణం అను వలయము నుండి విముక్తికి కోరికలను, కర్మలను త్యజించవలయునని తొలితరం ఉపనిషత్తులు - బృహదారణ్యక ఛాందోగ్య, కర, ముండక, ప్రశ్న మొదలగునవి చెప్పినవి ఆత్మార్పణతో కూడిన భక్తియే మార్గమని శ్వేతాశ్వతర ఉపనిషత్తు బోధించినది ఈ ఉపనిషత్తుల బోధనలను కర్మసిద్ధాంతముతో సమన్వయించుటకే భగవద్గీత నిష్కామకర్మమును గురించి చెప్పినది అని కొందరి అభిప్రాయము ఇంతియే గాక కులధర్మము ననుసరించి చేయవలసిన కర్మములుగా చెప్పబడినవి కర్మసిద్ధాంతమును గురించి కొన్ని క్లిష్ట సమస్యలు కలిగించును అని కూడ వారి అభిప్రాయం వర్ణములు గుణకర్మములననుసరించి విభజింపబడినవి అని భగవద్గీతలో చెప్పబడినది కులములు (caste) వర్ణములు కావు కులమునకు అన్వయింపబడిన ఆంగ్ల శబ్దమును అనువాదములో వర్ణమునకు కూడ అన్వయించుట వలన ఈ సమస్య ఏర్పడును వర్ణము అనునది గుణకర్మముల ననుసరించి అర్హత కలుగుట ద్వారా కలుగును పుట్టుకతో మాత్రమే వచ్చునది కాదు వర్ణము అనునది గుణము ద్వారా, చేయు కర్మముల ద్వారా పొందునది కులమునకు గుణముతో కాని, చేయు కర్మముతో గాని పనిలేదు కులము పుట్టుకతోనే ఏర్పడును అన్ని కులముల వారు అన్ని పనులు చేయుచున్నారు హిందువుల కొరకు అని భగవద్గీతలో ఎక్కడా చెప్పబడలేదు ఉదాహరణకు శూద్రులు అనగా వారొక కులమువారు అని భావము కాదు శూద్రుడు అనగా శ్రామికుడు అని అర్థము శరీరము అనబడు సమాజమునకు శూద్రుడు పాదము వంటివాడు అనగా శరీరమునకు పాదములు శ్రామికభాగము వలె శూద్రుడు సమాజములో శ్రామిక విభాగము వాని శ్రమ ననుసరించి

కర్మములుండును అగ్రవర్ణములను సేవించుటయే శూద్రుని కర్మము అని భావించుట పూర్తిగా వర్ణాశ్రమములను గూర్చి వక్రభాష్యమే యగును శ్రమ అనగా సేవ కాదు అగ్రవర్ణము, నిమ్నవర్ణము అనునది నేటి సమాజములో బుద్ధిహీనత వలన కల్పించబడిన బిరుదులు లేక పట్టములు మాత్రమే భగవద్గీత ఏ ఒక్కరి కొరకు చెప్పబడినది కాదు అది సర్వప్రాణికోటికి అనగా జీవులందరి కొరకు చెప్పబడినది

భగవద్గీత 18-44, శ్లోకములో చెప్పబడిన "పరిచర్యాత్మకం కర్మశూద్రస్యాపి స్వభావజమ్" అను వాక్యమునకు మిగిలిన మూడు వర్ణముల వారికి సేవచేయటమే (పరిచర్య) శూద్ర స్వభావముగా శబ్దార్థమును వ్యాఖ్యానముగా చెప్పుచున్నారు 'పరిచర్యాత్మకం' అని చెప్పబడినది గాని 'అగ్రవర్ణములుగా' చెప్పబడిన వారికి 'పరిచర్య చేయుట' అని చెప్పబడలేదు 'పరిచర్య' అనగా శ్రామిక జీవనము శూద్రులకు స్వాభావికము అని చెప్పబడినది కాని అగ్రవర్ణములకు వారు పరిచర్య చేయుచు దాస్య జీవనము గడపవలెనని వ్యాఖ్యానించుట భావ్యము కాదు

నేటి సమాజంలో శ్రమలేనిది జీవనము లేదు మనము ఏదైన దుకాణమునకు (shop) వెళ్లినపుడు ఆ దుకాణుదారు 'మీకు ఏమి సేవ చేయుదును' "How can I serve you" అని సంబోధించుట మర్యాద లక్షణమైనది ఇచట 'ఏమి సేవ' అనగా దాస్యము అని భావము కాదు 'serve' 'సర్వ్' అను ఇంగ్లీషు పదమునకు వ్యావహారికముగా 'ఇచ్చు' 'give' అని అర్థముతో ఉపయోగించబడుచున్నది అంతేకాని 'ఏమి సేవ చేయుదును' అనగా నీచత్వమును లేక అధోస్థాయిని సూచించునది కాదు 'పరిచర్య శూద్ర స్వభావము' అనగా శ్రామిక జీవులందరు శూద్రులను అర్థము చెప్పవలయును కావున శూద్రవర్ణము ఒక కులము కాదు శ్రమజీవనమును లోకువ భావముతో అగౌరవపరచమని భగవద్గీత చెప్పలేదు శ్రామికునికి కూడ ఆత్మగౌరవము,

ఆత్మవిశ్వాసము ఉండును సమాజమునకు వారి అవసరము ఎంతైనా యున్నది ప్రతిపనికి దానికి తగిన అవసరము, స్థానము ఎల్లపుడు ఉండును (18-45)వ శ్లోకంలో "స్వకర్మ నిరతః సిద్ధిం యధా విందతి" అని చెప్పబడింది కదా! ఎవరైనను తన పనియందె (స్వకర్మ) నిమగ్నుడై శ్రద్ధతో చేయుదురో వారు సిద్ధిని (విందతి) పొందుదురు అని భగవద్గీత వచనము స్వకర్మ ద్వారానే ఆత్మసాక్షాత్కారమును పొందవచ్చును

'పరిచారకుడు' అనగా చేసిన పనికి భత్యము (fees) పొందువాడు భత్యము లేకుండ ఎవరు ఏ పనిచేయుట లేదు గదా! అనగా అందరూ శూద్రులే వారు వృత్తి ద్వారా శూద్రులగుదురు అనగా పనికి భత్యము తీసుకొనుట వలననే కాని వారు కులశూద్రులు కారు ఆ విధముగా శ్రామిక జీవులందరు శూద్రవర్ణము వారే అగుదురు గుమాస్తాలందరు శూద్రులే అగుదురు కావున శ్రమకు జీతము తీసికొనుట తప్పుకాదు, దాని వలన వారికి నిమ్నవర్ణము గాదు గుణములననుసరించి కలుగు స్వభావముల ద్వారా వర్ణములు ఏర్పడును దాని బట్టి వృత్తులు చేయుదురు అంతేకాని యిందు అగ్ర, నీచ అను తారతమ్యము లేదు ఉత్తమమైన చింతన కలవారందరు అగ్రవర్ణులే యగుదురు భౌతిక జీవితమునందే అనురక్తి కలిగి స్వార్థబుద్ధితో మెలగువారు శూద్రులే యగుదురు మనో పరిపక్వతననుసరించి వర్ణము లేర్పడుచున్నవి శూద్రుని యొక్క ధర్మము కర్మయోగమునకు సమానమైనది వైశ్యుని ధర్మము రాజయోగమును పోలియుండును రాజయోగి తన స్వరూపము నందలి శక్తిని సేకరించును లౌకిక ప్రపంచమున శక్తికి చిహ్నము ధనము ఆ ధనమును వైశ్యుడు సేకరించును క్షత్రియునిది భక్తియోగముగా చెప్పవచ్చును సంఘమునందు ప్రీతి కలిగి దాని క్షేమము కొరకే అతడు కృషి చేయును ఇక బ్రాహ్మణునిది జ్ఞానయోగము సృష్టినంతటిని బ్రహ్మస్వరూపముగా చూచు జ్ఞాని అతడు ఈ నాలుగు యోగములు ఒకని యందే అమరిన యెడల అతడు పరిపూర్ణ మానవుడగును అతడు నాలుగు వర్ణ ధర్మములను ఏకము

చేయగలవాడగును ఈ నాలుగు వర్ణములు చక్కగా అమరిన సంఘము ఉత్తమమైన మానవ సమాజము జ్ఞానియైనవాడు అన్ని వర్ణముల ధర్మములను సక్రమముగా నిర్వర్తించగలడు అతడపరిపూర్ణుడైన బ్రాహ్మణుడు మూడు వర్ణముల కర్మములను నిర్వర్తించగలవాడు క్షత్రియుడగును రెండు వర్ణముల కర్మములు నిర్వర్తించగల సామర్థ్యము మాత్రమే గలవాడు వైశ్యుడగును ఈ విధముగ కర్తవ్య నిర్వహణా సామర్థ్యము క్రిందకు దిగివచ్చి శ్రామిక కర్మము మాత్రమే నిర్వర్తించగలవాడు శూద్రుడగును సత్త్వ రజస్తమోగుణముల కలయిక వలన యీ భిన్నత్వము ఏర్పడును సత్త్వగుణము పూర్ణముగా గలవాడు జ్ఞానియగును అతడు బ్రాహ్మణుడు ఎక్కువ భాగము సత్త్వగుణము, కొంత రజోగుణము గలవాడు క్షత్రియుడు ఎక్కువ రజోగుణము కొంత తమోగుణము గలవాడు వైశ్యుడు తమోగుణ ప్రధానుడు శూద్రుడు గుణప్రధానముగా వారు చేయు కర్మములుండును దానిననుసరించి వారు వృత్తులు చేయుదురు జ్ఞానసంబంధమైన విద్యకు శూద్రులు తగరు అనగా వారు తమోగుణ ప్రధానులు కావున మానసికముగా వారు జ్ఞానము గ్రహించగల స్థితి యందుండరు అని భావము సత్త్వగుణ స్పర్శ కలిగినపుడు వారి మనసు వికసించును అపుడు వారు అర్హులగుదురు బ్రాహ్మణులుగా చెప్పబడువారిలో ఎంతమందిలో సత్త్వగుణప్రేరిత మానసిక వికాసమున్నదో పరిశీలించినచో ఫలితము చాల నిరాశాజనకముగా యుండును వేదమంత్రములు బట్టీ పెట్టినంత మాత్రమున సత్త్వగుణరూపమైన మానసికవికాసము రాదు వాస్తవమైన బ్రాహ్మణత్వము సిద్ధించదు

భగవద్గీత (18-45)లో "స్వకర్మ నిరతః సిద్ధిం యథావిందతి" అని చెప్పబడినది ఇచట స్వకర్మమనగా వర్ణధర్మము ననుసరించి కాకపోయినను, తన గుణప్రధానముగా రూపొందిన ప్రవృత్తి (స్వభావము) ననుసరించి ఎంచుకొనిన కర్మమును స్వకర్మగా భావించి దానిని నిస్వార్థముగా కర్తవ్య నిర్వహణగా చేసినచో కృతార్థుడగును ఆత్మసాధనకు పరిపక్వత పొందుటకు

స్వకర్మమును మార్చవలసిన పనిలేదు

మనుస్మృతి కూడా కొన్ని సందర్భములలో నిర్ద్వందముగాను మరికొన్ని సందర్భములలో దానికి విరుద్ధముగాను వర్ణధర్మములను నిర్వచించినది ఇక చట్టములు మనము రూపొందించుకున్నవి అందు చెప్పబడినవి వర్ణములు కాదు, కులములు మాత్రమే ఒక కులములో తలిదండ్రులకు జనించిన తదుపరి ఆ కులమును మార్చుటకు వీలుపడదు అని చట్టము కుల వ్యత్యాసములను తారతమ్యలుగా భావించి పరస్పర వైషమ్యములకు దారి తీయనంత వరకు కులముల వలన ప్రమాదము లేదు కులమును మార్చినంత మాత్రమున ఆ వ్యక్తి గుణకర్మములు మారవు సామాజికముగా కులము ననుసరించి కొన్ని కట్టుబాట్లు, ఆచారములు, సంప్రదాయములుండును అవి బాహ్య లౌకికములు మాత్రమే ఈ కట్టుబాట్లు, ఆచారములు, వర్ణాశ్రమ ధర్మములకు, కర్మములకు సంబంధించినవి కావు సత్త్వరజస్తమోగుణములే వర్ణములకు ప్రధానము వాని ననుసరించియే కర్మములు ఏర్పడును

ఉపనిషత్తుల సారాంశము బ్రహ్మసూత్రములు బ్రహ్మసూత్ర సారాంశము భగవద్గీత గీతావచనమే ఆధ్యాత్మికముగా జ్ఞానసాధనకు ఆరోహణలో అంతిమ సోపానము, జ్ఞాన సర్వస్వము అందు చెప్పబడినదే ఆధికారికముగా తుదివచనముగా గ్రహించుట నేటి సమాజమునకు ఉత్తమము

ఇక ధర్మసూత్రములు, గృహ్యసూత్రములు, స్మృతులు ఇవి మతసంబంధమైన కర్మకాండలకు, లౌకిక ఆచారములకు సంబంధించినవి ఆధ్యాత్మికముగా మార్గదర్శకములు కావు ఇందు వర్ణములను గురించి నిశితముగా నిర్దేశించబడి యుండవచ్చును కాని ధర్మనిర్ణయము కాలమును బట్టి జరుగుచున్నది గృహ్యసూత్రములు, ధర్మసూత్రములు ఆయా కాలానుగుణముగా నిర్ణయించబడినవి ఈ సూత్రములు శంకరభాష్యములో (బ్రహ్మసూత్రభాష్యము) సందర్భానుసారముగా ఉదహరింపబడినవి స్మృతి

ప్రమాణంగా ఉదహరించారు అయితే కేవలం సంప్రదాయం మీద ఆధారపడి ఉన్న నిర్ణయములను మార్చుకొనవలసి యున్నది ఎందువలననగా మతమునకు, ధర్మమునకు సమాజములోని అన్ని వర్గాలతోను, మానవ మాత్రులందరితోను దేశకాల పరిస్థితులపై ఆధారపడినట్టి సంబంధం ఉండి తీరాలి మానవ ఆత్మకు కలుగుచున్న ప్రమాదమును మతం, ధర్మం గుర్తించాలి, లేనిచో వాటి మనుగడకే ప్రమాదం వాటిల్లును ఈ గుర్తింపే భగవద్గీత కలిగించును భగవద్గీత స్మృతులకు, సూత్రములకు అతీతమైనది గీతావచనము ఆధ్యాత్మిక జ్ఞానసర్వస్వము, తుదివచనము

పూర్వ సూత్రములను వల్లెవేసినంత మాత్రమున సరిపోదు దేశకాల పరిస్థితులను బట్టి ధర్మనిర్ణయము చేయకలిగియుండాలి భగవద్గీత కాలానుగతధర్మములకు సూత్రములకు అతీతమైనది అందువలన కొన్ని గతకాల ధర్మసూత్రములు భగవద్గీతకు భిన్నముగా కన్పడవచ్చును కాని భగవద్గీత సార్వజనీనము, సర్వకాలములకు చెందినది బ్రహ్మసూత్రభాష్య (అధ్యాయం 3, పాదం 1, సూత్రం 25) యజ్ఞములలో పశుహింసను గురించి చెప్పు సందర్భమున శంకర భగవత్పాదులు ఇలా అన్నారు "దేశకాల నిమిత్తములను బట్టి ఒకప్పుడు ధర్మమైనదే అందుకు భిన్నమైన దేశకాల పరిస్థితులలో అధర్మమవుతుంది కాబట్టి శాస్త్రజ్ఞానం వలన మాత్రమే ధర్మాధర్మ విజ్ఞానం కలుగుతుంది" శంకరులు చెప్పినట్లు ధర్మశాస్త్రమనేది దేశకాల నిమిత్తముల ననుసరించి ధర్మాధర్మ విజ్ఞానమును కలిగించాలి

సంప్రదాయమనునది కాలంతో రాజీపడాలి పడకపోతే సంప్రదాయానికే నష్టము కాలం ఆగదు శూద్రులకు, స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారం, వేదాధ్యయనాధికారం, ఉపనయనాధికారం మొదలగు అనేక విషయాలు కాలక్రమేణ పునఃపరిశీలనాంశములైనవి అస్పృశ్యత, స్త్రీ విద్య, బాల్య వివాహములు, వృద్ధవివాహములు, దేశాంతర యానము వంటి అనేక

విషయములలో సంప్రదాయవాదులు, సంప్రదాయ పరిరక్షకులు కూడ రాజీపడి తలవంచవలసి వచ్చింది చారిత్రకమైన ఈ వాస్తవమును చూస్తూ కూడ "మేము ఒప్పుకోము" అను మూర్ఖులైన సంప్రదాయవాదులను గురించి జాలిపడటం తప్ప చేయవలసినది, చేయగలిగినది ఏమియును లేదు

ఈ సందర్భములో కొన్ని ధర్మసూత్రములను (గౌతమ ధర్మసూత్రముల వంటివి), బ్రహ్మసూత్ర శంకర భాష్యమును (1-3-38) ఉదహరించి వేదమంత్రములను శూద్రుడు వినటం జరిగినపుడు అతని చెవుల యందు సీసము కరిగించి పోయవలయునని చెప్పబడినదని శూద్రవర్ణమును గురించి విపరీత భాష్యము చెప్పువారు కూడ ఉన్నారు బ్రహ్మసూత్రములలో ప్రథమాధ్యాయములో తృతీయ పాదమందు అపశూద్రాధికరణమందు ఈ విషయము చర్చించబడినది కర్మ సిద్ధాంతము - వేదాంతమును గురించిన సందర్భములో యీ విషయము కొంత తెలిసికొనవలసి యున్నది

మానవులకు, దేవతలకు బ్రహ్మవిద్యాధికారమున్నదని చెప్పబడింది (బ్రహ్మసూత్రము 1-3-34→38) మానవులందు ద్విజులకు మాత్రమే యీ అధికారమున్నది, శూద్రులకు లేదన్నారు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులను మాత్రమే ద్విజులు అన్నారు ద్విజులనగా రెండవసారి జన్మించినవారు అని అర్థము ఉపనయనము ద్వారా ఈ జన్మ కలుగును అన్నారు బ్రహ్మసూత్రములను గురించి చెప్పునపుడు స్వంత అభిప్రాయములను చొప్పించగలుగునంతటి ఉదాత్తుడను కాను నేను అయినను యీ రచన బ్రహ్మసూత్రభాష్యము కానందున, అందలి అపశూద్రాధికరణములోని కొన్ని విషయములతో వర్తమాన సామాజిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని విభేదించుటకు సాహసించుచున్నాను

ఇదే సందర్భములో స్త్రీలకు ఉపనయనార్హత వేదాధ్యయనార్హత లేవు కాబట్టి వారికి బ్రహ్మవిద్యార్హత లేదు అని వాదించువారితో కూడ

విభేదించక తప్పదు  శూద్రులకు అర్హత లేదు అని చెప్పుటకు అపశూద్రాది కరణమును ఉదహరిస్తున్నారు  శూద్రునకు సైతం బ్రహ్మవిద్యాధికారం ఉన్నదా? అను విషయమును గురించి అట్టి అధికారము శూద్రునకు లేదు అని చెప్పుటకు ఈ అధికరణములో ఛాందోగ్య ఉపనిషత్తులోని జానశృతి-రైక్వుని కథను (నాల్గవ అధ్యాయము, మొదటి, రెండవ ఖండములు) ఉదహరించారు జానశృతి అను రాజు గొప్ప కీర్తిమంతుడు  కాని అతడు రైక్వుడు అను ఋషి అంత బ్రహ్మజ్ఞాని కాడు  ఆ విషయము అతనికి తెలియజేసి అతడు బ్రహ్మవిద్యను రైక్వుని దగ్గర పొందునట్లు చేయవలెనని దేవతలు రెండహంసల రూపమున వచ్చి జానశృతికి వినబడునట్లు సంభాషించుచు జానశ్రుతి రైక్వుని వలె తేజశ్శాలి కాదు అనును  అది విని జానశృతి తన అల్పత్వమును గ్రహించి, రైక్వుడు ఎక్కడున్నది తన సారథి ద్వారా తెలిసికొని ఆయన వద్దకు బ్రహ్మవిద్యార్జనకై వెడలును  అప్పుడు జానశృతి మిక్కిలి విచారముతో నుండెను  జానశృతి ఆ మహర్షికి ఎంతో ధనము, గోవులను, హారములను బహూకరించ ప్రయత్నించును  కాని వాటిని ఆ మహర్షి నిరాకరించి "ఓ శూద్రుడా! నీ గోవులు, ధనము, హారములు నీ వద్దనే ఉంచుకొనుము" అని అనును  ఇదియే ఈ అధికరణములోని ప్రధాన విషయము  'తిరిగి రాజు మరికొన్ని ఆవులను, హారములను, తన కుమార్తెలలో ఒకరిని అతనికి భార్యగాను సమర్పించును '  ఆ మహర్షి తృప్తిచెంది ఆ రాజుకు ఉపదేశము చేసెను

జానశృతిని శూద్రుడా! అని సంబోధించి చివరకు బ్రహ్మవిద్యను మహర్షి ఉపదేశించాడు  కాబట్టి శూద్రులకు కూడ బ్రహ్మవిద్యాధికారం ఉన్నదని కొందరు వాదించారు  కాని జానశృతి శూద్రుడు కాడు  క్షత్రియుడు ఇచట శూద్ర అను శబ్దము మామూలు రూఢార్థములో వాడబడలేదు, విచారముతో వచ్చినవాడు అనువ్యుత్పత్తి అర్థంలో ప్రయోగించబడింది అని బ్రహ్మసూత్రకర్త వ్యాఖ్యానించారు  జానశృతి క్షత్రియుడు, ఉపనయనాధికారం ఉన్నది కాబట్టి బ్రహ్మవిద్యాధికారం ఉన్నది అన్నారు  శూద్రునకు

ఉపనయనాధికారం లేదు కాబట్టి వేదాధ్యయనాధికారం లేదు అన్నారు ఉపనయన సంస్కారము లేనందువలన అతనికి పాపము రాదు అని కూడ నిర్ణయించారు

అదే అధికరణములో (1-3-37)లో గౌతముని వంటి మహర్షులు బ్రహ్మవిద్యోపదేశమునకు ముందు విద్యార్థి శూద్రుడు కాదు అని నిర్ణయించుకుని అటు తరువాతనే ఉపదేశం చేశారు కావున శూద్రునకు ఉపనయనము లేదు కాబట్టి వేదాధ్యయనము లేదు అన్నారు

ఇది ఛాందోగ్య ఉపనిషత్తులో నాల్గవ అధ్యాయం నాల్గవ ఖండములోని జాబాలసత్యకాముని కథకు సంబంధించినది సత్యకాముడు జాబాల పుత్రుడు తన జాతి (గోత్రము) అతనికి తెలియదు సత్యకాముడు గురుశుశ్రూష ద్వారా బ్రహ్మవిద్యార్జనకై గౌతముని వద్దకు వెళ్ళును గౌతముడు అడుగగా తాను జాబాల సత్యకాముడనని, తన గోత్రము (జాతి) తెలియదని చెప్పను అతడు చెప్పిన యదార్థమునకు సంతసించి సత్యభాషణం అనగా సత్త్వగుణం బ్రాహ్మణధర్మం కాబట్టి సత్యకాముడు శూద్రుడు కాదని నిర్ణయించి గౌతముడు అతనికి బ్రాహ్మణోచితమైన ఉపనయన సంస్కారము చేయును ఉపనయనం చేసి బ్రహ్మవిద్యోపదేశం చేయవలయును కాన ఉపనయానాధికారం లేని శూద్రులకు బ్రహ్మవిద్యాధికారం లేదు వేదములను వినుట కాని, అధ్యయనము కాని, అనుష్ఠానము గాని, అర్థజ్ఞానము గాని శూద్రులకు నిషేధింపబడినది అన్నారు (1-3-38 బ్రహ్మసూత్రములు)

ఉపనయనార్హత శూద్రునకు లేదు శూద్రుడని నిర్ణయించుట ధర్మము (గుణము)ను బట్టియా లేక పుట్టుకను బట్టియా? ఇది నిరంతరము ఉండునట్టిది, సమాధానము లేనట్టిది అయిన ప్రశ్న గౌతమునకు సత్యకాముని పుట్టుక తెలియదు గుణమును బట్టి సత్యకాముని శూద్రుడు కాదని గౌతముడు నిర్ణయించుకున్నాడు ఉపనయనము చేశాడు కావున శూద్రత్వము

లేదు కాబట్టి శూద్రుడు కాదని నిర్ణయించుకున్నాడని చెప్పవలసి యుండును శూద్రత్వము అంటే ఏమిటి? శూద్రత్వము తమోగుణ ప్రధానము తమోగుణము వలన బుద్ధి వికసించదు బుద్ధివికాసము లేనిది బ్రహ్మవిద్యార్హత రాదు నేటి బ్రాహ్మణులలో ఎంతమందికి బ్రహ్మవిద్యోపదేశమునకు తగిన బుద్ధివికాస మున్నదో వారికి ఎపుడో ఒకప్పుడు ఉపనయనము చేసినంత మాత్రమున బ్రాహ్మణత్వము వచ్చునా? రాదు ఇక్కడ మరొక ప్రశ్న ఉదయించును ఉపనయనము లేనిది వేదాధ్యయనార్హత లేదు అన్నారు గాదా! మరి ఎంతో మంది ఉపనయనము లేనివారు భారతీయులు, ఎంతో మంది పాశ్చాత్యులు గూడ వేదములను చదివి, వ్యాఖ్యానించి గ్రంథాలు రచించారు గదా! వారికి అర్హత ఎక్కడిది వారికి ఉపనయనము లేదు కాబట్టి అర్హత లేదు వాస్తవమే వారిది వేదాధ్యయనము కాదు వేదపఠనము, దానిపై పరిశోధన మాత్రమే దానికి ఉపనయనముతో పనిలేదు ఉపనయనానంతరము గురుముఖముగా మాత్రమే వేదాధ్యయనము జరగవలెను అపశూద్రాధికరణము ప్రసంగవశాత్తు చెప్పటం జరిగినది అని బ్రహ్మసూత్రకర్త అన్నారు కర్మసిద్ధాంతసారమైన కర్మయోగమునకు మూలమైన బ్రహ్మవిద్యాధికారము గురించి నేటి పరిస్థితులకనుగుణముగా ప్రసంగవశాత్తు మనము కూడ తెలుసుకొనవలసి యున్నది

బ్రహ్మసూత్రములలో (1-3-38) చెప్పినట్లు ఉపనయనాధికారము లేని శూద్రులు వేదములు వినకూడదు, అధ్యయనము చేయకూడదు, అనుష్ఠానము చేయకూడదు అన్నారు కాని నేడు ఆ నిషేధము ఆచరణ యోగ్యముగా కనబడుట లేదు గదా! అలా అంటే ఇది కలియుగం, ధర్మం దిగజారిపోయింది అని వాపోతారు సంప్రదాయవాదులు కాని బ్రహ్మ సూత్రములలో (3-1-25) దేశకాల పరిస్థితులను బట్టి ఒకప్పుడు ధర్మమైనదే, అందుకు భిన్నమైన దేశకాల పరిస్థితులందు అధర్మం కావచ్చు అన్నారు నేడు సినిమాల్లోను, సినిమా ముహూర్తాలకు, దేవాలయాలలోను, వేదోద్ధరణ పేరుతో

వేదసభలలోను, రాజకీయ నాయకుల వేడుకలలోను, వేదఘోష జరుగుచున్నది కదా అది వినువారిలో ఎందరో ఉపనయనాధికారము లేని వారుంటారు వారందరి చెవులలో సీసం పోయటం సాధ్యమా?

సందర్భం వచ్చింది కాబట్టి నేడు హిందూ సమాజమును పట్టి పీడిస్తూ దానిని నిర్వీర్యం చేస్తున్న ఈర్ష్యాద్వేషాలనబడు నిరంతర జాడ్యములను రూపుమాపుటకు కాలమును బట్టి నేడు వచ్చిన మార్పులను తెలుసుకొనవలసిన అవసరమున్నది అని చెప్పవలసియున్నది

ఉపనయన యోగ్యత లేనివారు వేదపఠనము చేయకూడదు, వినకూడదు అన్నారు కాని శ్రీ గణపతి సచ్చిదానందస్వామి ప్రవచనము ఇందుకు భిన్నముగా మారిన కాలపరిస్థితుల కనుగుణముగా నున్నది వేదమంత్రాలను విన్న పశు, పక్ష్య, కీటకాదులకు కూడ భవిష్య జన్మలందు మార్పులు కలుగును అన్నారు స్వామి భగవంతుని రూపమునే వేదముగా భావించి వేదపఠనం వింటేనే పాపాలు తొలగి శుభములు సంప్రాప్తించును అన్నారు

అందువలన మారిన కాలపరిస్థితులను అర్థం చేసుకుని ద్విజుడు, శూద్రుడు, ఉపనయనము అను పదముల పూర్వాపర స్వరూపాలను, వాటి అర్థ, ప్రయోజనాలను గ్రహించవలసియున్నది మనమే సృష్టించుకున్న లెక్కకు మించిన కులాల వలన, యితర అనేక కారణముల వలన మన దేశంలో అనైక్యత ఏర్పడి అసూయ, ద్వేషము అను జాడ్యము ప్రబలి వాటికి స్వార్థం తోడై కర్మయోగం, నిష్కామకర్మ ఆకాశపుష్పముల వలె అందక అనుభవంలోకి రావటం లేదు ఈనాడు రేడియో, టి వి , పత్రికల ద్వారా ఆధ్యాత్మిక ప్రచారం జరుగుచున్నది మంచిదే కాని వాటి ప్రయోజనం ఎపుడు వస్తుంది? అవి కూడా కాలక్షేప కార్యక్రమాలగానే భావించినంత కాలం సమాజమునకు పట్టిన కుల, జాతి, మత జాడ్యములు, నశించవు, మానసిక

వికాసము రాదు అది రానంత వరకు కర్మయోగ సాఫల్యము, నిష్కామకర్మ అనుభవములోనికి రావు అందువలన బ్రహ్మజ్ఞాన విచారణ కంటే గుణకర్మముల వలన ఏర్పడు అన్ని వర్ణముల ఐక్యత సాధించవలసియున్నది వర్ణముల అంతరార్థము గ్రహించినపుడే ఈ ఐక్యత సాధ్యమగును అది లేనపుడు శాస్త్రవిచారణ, ఆధ్యాత్మిక ప్రసంగాలు, ధర్మబోధలు నిరర్ధకములగును దాన్ని గురించి చర్చించుటలోను, మన తప్పును మనం తెలుసుకొనటంలోను దోషం లేదు

ఉపనయనం అనునది ఒక సంస్కారము ఏదో ఒక రూపమున ఈ సంస్కారము అన్ని జాతులలోను, అన్ని మతములలోను కనుపించును సమాజంలో మతపరంగా, సాంస్కృతికంగా తన కర్తవ్యము నిర్వర్తించుటకు బాల్యావస్థ నుండి బయటపడుతున్న ఒక వ్యక్తికి చేయబడు కర్మయే ఇది హిందువుల ఉపనయనం, క్రైస్తవుల బాప్టిజమ్, పారశీకుల నూతన జన్మ సంస్కారం, కొన్ని మతముల వారు చేయు అంగఛేదనం, మరికొన్ని మతములవారు చేయు ధైర్యసాహస పరీక్షలు ఇటువంటి సంస్కారములే స్త్రీలకు కూడా యిటువంటివే మరొక రూపంలో కొన్ని సంస్కారములున్నాయి

ఇక్కడ చర్చనీయాంశం హైందవుల ఉపనయన సంస్కారం ఉపనయనం రెండవ జన్మ వంటిది అది అయ్యేంత వరకు వ్యక్తి ద్విజుడు కాడు ఉపనయనమే ద్విజుడగుటకు ఒక అర్హత కాబట్టి ద్విజత్వం జన్మతో వచ్చునది కాదు గదా! ఉపనయనం కానివాడిని "వ్రాత్యుడు" అన్నారు ఉపనయనం తరువాతనే వేదాధ్యయనమునకు అర్హత వస్తుంది వేదాధ్యయనమునకు ఈ అర్హత తప్పనిసరి అనగా వేదాధ్యయనం అవసరం లేనపుడు ఫలానా కులంలో పుట్టిన ప్రతి ఒక్కనికి ఈ సంస్కారం అవసరం లేదని అర్థం వస్తుంది కదా! అలా అర్థం తీసుకుంటే ఉపనయన సంస్కారమునకు విలువయే యుండదు

అసలు ఈ ఉపనయన సంస్కారం ఎప్పటి నుండి ప్రారంభమైనదో సరిగా తెలియదు ఋగ్వేదకాలం నాటి ఈ సంస్కారం యీనాడు జరుగుచున్న సంస్కార రూపంలో లేదు బ్రహ్మచర్యమే ఉపనయనము అని అర్థం వచ్చేటట్లు ఒకటి రెండు చోట్ల చెప్పినట్లు కనబడుతుంది అంటే దానిని ఒక సంస్కారముగా పరిగణించలేదేమో అనిపిస్తుంది కాని అధర్వవేదకాలమునాటికి దానికి ఒక సంస్కారరూపం వచ్చినట్లుగా కనబడుతుంది ఈ కాలంలో విద్యార్థియైన బ్రహ్మచారిని ఆచార్యుడు మూడు రాత్రులు తన గర్భంలో పెట్టుకొని కాపాడుతాడు అని చరిత్ర చెప్తోంది దీనిని చూడటానికి దేవతలు కూడ వచ్చేవారట దీనినే ద్వితీయజన్మ అన్నారు

"ఆచార్యం ఉపనయమానోబ్రహ్మచారిణం కృణుతే గర్భమన్తః"
(అధర్వవేదం 11-5-3)

"ఈ విశాలమైన పృధివి, ఆకాశం అటువంటి బ్రహ్మచారికి భిక్షగా లభించాయి" (అధర్వవేదం 11-5-9)

"కడుపులో పెట్టుకొని కాపాడటం" ఈనాడు కూడా అంటుంటాం అంటే రక్షణ కలిగిస్తామని గాఢంగా చెప్పటమన్నమాట మాతృగర్భం నుండి జన్మించిన తరువాత యీ విధముగా గురుగర్భము నుండి జనించటమే ద్వితీయజన్మ అంటే అది శబ్దార్థము కాదు భావార్థము మాత్రమే ఏదైనా ప్రమాదము జరిగో లేక ప్రమాదకరమైన అనారోగ్యము నుండో కోలుకున్నపుడు ఆ వ్యక్తి పునర్జన్మ పొందాడు అంటారు అది నిజంగా పునర్జన్మ కాదు గదా! పునర్జన్మ వంటిది అని భావార్థం అలాగే గురువు "బ్రహ్మచారిణంకృణుతే గర్భమన్తః" అనగా పరిణామార్థకముగానే గ్రహించవలయుననిపించును

కృణుః = చిత్తరువు వ్రాయువాడు, అన్త = ఆ సమయమున లేక, అన్తర్ధా = కప్పుట లేక లోపల 'గర్భము లోపల'

అనగా యీనాడు కూడ బ్రహోపదేశ సమయములో ఆచార్యుడు వటువును దగ్గరకు తీసుకుని పైన ఒక వస్త్రము కప్పుకుని ఉపదేశము చేయును కడుపులో పెట్టుకొని (కృణుతే గర్భమన్తః) అనుటలోని భావార్థము ఇదే కావచ్చును

శతపథ బ్రాహ్మణమును చూచినచో బ్రాహ్మణముల కాలమునకు (వేదవాఙ్మయ పరిణామదశలు) ఉపనయనము ఒక స్థిరమైన కర్మకాండగా రూపొందినట్లు తెలియుచున్నది ఆనాడు ఆచారం భిన్నంగా ఉండేది బ్రహ్మచారి గురువు వద్దకు వెళ్ళేవాడు గురువు అతనిని పరీక్షించి అర్హత నిర్ణయించుకొని దీక్షను ఇచ్చేవాడు కాలక్రమేణ గురువు స్థానమును తండ్రి అక్రమించి కుమారునికి బ్రహ్మోపదేశం ఇవ్వటం ప్రారంభమైంది ఇది స్పష్టముగా ఎపుడు ప్రారంభమైందో చెప్పటం సాధ్యం కాదు ఇదే అటుపై ఒక ఆచారంగా రూపొందింది

అటుపై తదనంతర కాలములో బహుశా ఉపనిషత్తుల కాలములో గాయత్రి మంత్రోపదేశము ఉపనయన సంస్కారములో భాగమైంది ఈ కాలము నాటికి ఉపనయన కర్మకాండలో యజ్ఞోపవీతధారణ ఉన్నట్లు స్పష్టముగా తెలియదు కాని గృహ్యసూత్రకాలము నాటికి మాత్రము యజ్ఞోపవీతధారణ ఉపనయన సంస్కారములో ఒక భాగంగా ఏర్పడిందని స్పష్టముగా తెలియుచున్నది ప్రాచీనకాలంలో యజ్ఞసమయంలో ఉత్తరీయం ధరించేవారట ఆ ఉత్తరీయం స్థానంలో యజ్ఞోపవీతం వచ్చి ఉండవచ్చునని గృహ్యసూత్రముల ద్వారా తెలుస్తోంది

"యజ్ఞోపవీతం కురుతే సూత్రంవస్త్రం కుశరజ్జుంవేలి"

(గోభిలగృహ్యసూత్రం)

"అజినముత్తరయా" (అపస్తమ్బగృహ్యసూత్రం, దశమ ఖండం, 11వ సూత్రం)

అజినం = జందెముగా చేయబడిన ఇర్రి (జింక) చర్మమును, ఉత్తరయా = ఉత్తరీయము వలె 'మిత్రస్య' అను మంత్రముచే వటువుచే ఆచార్యుడు ధరింపజేయును జింక చర్మమును చివరలు అతికి యుండునట్లు మధ్య కోసి జందెముగా ధరింపజేయుదురు ఉత్తరీయము స్థానములో ఇర్రి చర్మ జందెమును ధరింపజేయుదురు స్నాతకవ్రత పర్యంతము దీనిని ధరించుట ఆచరణ అయి యున్నది అది కూడ మార్పు చెంది చిన్న జింక చర్మపు ముక్కను జందెమునకే కడుతున్నారు అది కూడ ఉపాకర్మలో తీసివేస్తున్నారు

కాలక్రమేణ అనేక మార్పులకు లోనై యజ్ఞోపవీతం ఈనాడు ఇంత ప్రాధాన్యం పొందుతుందని బహుశా ఆనాడు ఎవరూ ఊహించి యుండరు యాజ్ఞవల్క్యస్మృతి, ఆపస్తంబధర్మసూత్రములను బట్టి ఉపనయనం కేవలం వేదాధ్యయనమునకు అర్హతకై ఏర్పడినట్లు తెలియును సూత్రకాలము నాటికి ఈ సంస్కారం సమాజంలో బాగా స్థిరపడింది జన్మచేత ద్విజుడు అయిన ప్రతివానికి వేదాధ్యయనం చేసినా చేయకపోయినను ఉపనయనం తప్పనిసరి సంస్కారంగా స్థిరపడిపోయింది అది యింకా దిగజారి క్షీణదశకు చేరి బ్రహ్మ క్షత్రియ వైశ్యజాతులకు విధింపబడిన వయస్సు పరిమితిని కూడ విస్మరించి వివాహమునకు ముందు తప్పనిసరిగా జరిగే లాంఛన సంస్కారముగా తయారైంది వటువు ముప్పది సంవత్సరములు దాటిన పసివాడు కాగా కేశవనామాలు కూడా రాని పితృదేవుడు ఆచార్యత్వము పొంది బ్రహ్మోపదేశము చేస్తాడు అతడిది ఏమీ లేదనుకోండి పురోహితుడు చెప్పినదాన్ని అప్పచెప్తాడు ఉదయం ఉపనయనం, ఒక గంట తరువాత స్నాతకం, మిట్టమధ్యాహ్నం పెళ్లి, రాత్రికి గర్భాదానం ఇవి వరుసగా జరుగుతాయి తరువాత రోజున అమెరికా ప్రయాణం ఇది నేటి ఉపనయన సంస్కారం యొక్క పరిస్థితి ఇది ఏ ఒక్కరిని నిందించటం కొరకు చెప్పింది కాదు నేటి సామాజిక పరిస్థితులు అలా ఉన్నాయి కాని అట్టి ఉపనయనం ద్వారా ద్విజత్వం వస్తుందని, దాని ద్వారా

వర్ణాధిక్యత కలుగుతుందని గర్వించటం మాత్రం హాస్యాస్పదము అంతేకాదు సామాజికపరంగా నేరం కూడా అవుతుంది

ఆనాటి ఋష్యాశ్రమములు స్వయం పోషకములుగా ఉండేవి ఇంకా రాజపోషణ కూడా ఉండేది అందువలన ఋషులు వేదాధ్యయనమునకు అర్హులైనవారిని అనగా తగిన బుద్ధి వికాసము గల విద్యార్థులను చేరదీసి ఉపనయనము చేసి వేదాధ్యయనమునకు సిద్ధము చేసేవారు అవి నిత్యము వేదనాదము ప్రతిధ్వనించు గురుకులములు అది ఆనాటి మాట విద్యాదానము అత్యున్నతమైనది అందువలన అది అపాత్రుల పాలుకాకుండ జాగ్రత్త పడెడివారు కాలం మారింది పరిస్థితులు మారినై ఆ గురుకులములు లేవు పాత్ర, అపాత్ర విచక్షణ లేదు బుద్ధివికాసము అనేది నిఘంటుపదముగా (Dictionary) మిగిలిపోయింది వర్ణములు శతాధిక కులములుగా మార్పుచెంది, అందును వర్గములేర్పడి వైషమ్యాలు పెరిగి వృత్తి కొరకు లేక ఉద్యోగము కొరకు కులముతో పనిలేకుండ పొట్ట చేతబట్టుకొని దేశవిదేశములలో తిరగటం, అటుపై స్థిరపడటం జరుగుతోంది ఈ పరిస్థితులలో 'ద్విజత్వము' అర్థశూన్యమై ఉపనయనము వివాహమునకు అర్హత లేక లైసెన్సు (qualification) గా తయారైంది వాస్తవమునకు ఉపనయనమునకు వివాహమునకు సంబంధము లేదు ఉపనయనము వేదాధ్యయనమునకు నిర్ణయించబడిన అర్హత అట్టి అర్హత పొంది అధ్యయనము పూర్తి చేసి ఇక గృహస్థాశ్రమమునకై గురువు అనుజ్ఞ పొందెడివారు అదియే స్నాతక వ్రతము ఆ వ్రతము చేసి గురువు అధ్యయనము పూర్తి అయినది అని ప్రకటించి వివాహము చేసికొనుటకు విద్యార్థికి అనుజ్ఞ యిచ్చెడివాడు ఇది ఉపనయన కర్మకాండను పోలియుండును ఈనాడు వివాహమునకు ముందు పెండ్లి కుమారునకు స్నాతకవ్రతము చేస్తున్నారు ఎందుకొరకు ఉపనయనం కర్మకాండ ఏర్పడిందో అది నశించినపుడు, స్నాతకవ్రతం ఎలాగూ చేస్తున్నపుడు, ఉదయం ఒక గంటసేపు నిరర్థకమైన ఉపనయనం, అటుపై స్నాతకవ్రతం రెండూ ఎందుకు? అది

ఉదాత్తమైన ఉపనయన కర్మకాండను హాస్యాస్పదము చేయటమే అగును

ఆనాటి ఋష్యాశ్రములలో ప్రతిధ్వనించుచుండెడి వేదనాద పవిత్రత నేడు లేదు ఉండుటకు అవకాశం కూడ లేదు వేదాధ్యయనము కాని వేదపరిశోధన కాని రెండునూ అనుభూతి లేని యాంత్రిక ప్రక్రియలుగా మారినై ఆర్భాటముతో ఏర్పడిన వేదపాఠశాలలో గాని (ఆనాటి ఋష్యాశ్రమములలోని గురుకులములు కావు), లేక ఎవరో ఒక గురువు వద్ద ఎంతో కొంత వేదము అధ్యయనము చేసి భుక్తికై ఊరూర సంభావనలకై తిరుగుచూ నాలుక చివరగా ఏదో ఒక వేదభాగమును యాంత్రికముగా ఘోషించి సంభావన గ్రహించి ఇచ్చినవారి కీర్తి కండూతికి (అనగా కీర్తి కొరకై పడు తపన అనబడు దురద) తోడ్పడి ముఖస్తుతులు చేయు ప్రక్రియగా మారింది వేదాధ్యయన కార్యక్రమము దేశములోను విదేశములలోను వేదములపై పరిశోధనలు జరిగినై జరుగుతున్నై కాని ఈ పరిశోధనలు 'ఆర్యులు విదేశీయులు వారు భారతదేశమునకు వచ్చి స్థిరపడి వేదములను రూపొందించారు' అను సిద్ధాంతము ఆధారంగా జరుగుతున్నై ఇది స్వార్థముతో బ్రిటిష్ చరిత్రకారులు సృష్టించిన కథ

అనాది కాలము నుండి ఆర్యులు యిక్కడివారే వారిలో అనేక శాఖలు యుండి యుండవచ్చును వీరు దేశములో ఉత్తర ప్రాంతమున, దక్షిణ ప్రాంతమున ద్రావిడులు ఇక్కడివారే ఆర్యులు హిమాలయములకు ఆవలి నుండి వచ్చినవారని వారే రచించిన వాఙ్మయములో ఎక్కడా ఆధారములు లేవు వారికి ఇది స్వదేశము కానపుడు, ఎపుడో ఒకప్పుడు వారి జన్మస్థలమును గూర్చిన జ్ఞాపకములు తప్పకవచ్చియుండెడివి ఆ స్మృతులు తప్పక వారి సాహిత్యములో చోటుచేసుకొని యుండెడివి కాని ఎచ్చటను వారి సాహిత్యములో వారు వదలివచ్చిన స్వస్థలమును గురించిన ప్రస్తావన ఏ మాత్రము లేదు ఆ విషయమును సూచించు పురాణకథలు గాని, సంప్రదాయములు గాని, చారిత్రక విశేషాలు కాని మచ్చునకు కూడ కనిపించవు ఇంకా చెప్పాలంటే మన

పూర్వీకులే ఇక్కడ నుండి దూరదేశాలకు వెళ్ళి మన సంస్కృతీ సంప్రదాయములతో అక్కడి నాగరికతను ప్రభావితం చేశారని చెప్పు ఆధారములు ఎన్నో ఉన్నాయి ఆర్యులు దూరదేశాల నుండి మనదేశానికి వచ్చారనే సిద్ధాంతం పూర్తిగా బ్రిటిషు వారి స్వార్థపూరిత కల్పన భారతీయులలో అధిక సంఖ్యాకులు ఎపుడో దూరదేశాల నుండి ఇక్కడకు వచ్చి స్థిరపడినవారే కనుక దూరదేశం నుండి వచ్చిన తాము కూడ భారతీయుల మీద అధికారం చెలాయించటంలో అసహజం గాని, అన్యాయం గాని లేదు అను భావమును ఇక్కడి ప్రజలలో చిన్న వయసు నుండి మనసులో నాటుకు పోయేటట్లు చేయటానికి స్కూలు, కాలేజి చరిత్ర పార్యాంశములలో ఆ సిద్ధాంతమును చొప్పించారు మన దౌర్భాగ్యం ఏమిటంటే మొన్నటి వరకు మన చరిత్రకారులు ఎవరూ కూడ ఆ సిద్ధాంతంలోని నిజానిజాలను నిలదీసి, వెలికితీసి, నిగ్గుతేల్చే ప్రయత్నాలు చేయలేదు ఎంతో మంది ఎన్నో పరిశోధనలు చేశారు డిగ్రీలు పుచ్చుకున్నారు కాని వారి పరిశోధనలన్నీ ఆ సిద్ధాంతాన్ని అంగీకరిస్తూనే చేశారు ఇపుడిపుడే మన చరిత్రకారులు కళ్ళు తెరుస్తున్నారు బ్రిటిష్ పారవశ్యము నుండి బయటపడుతున్నారు ఈ సత్యమును గూర్చిన అన్వేషణ ఎంతో జరగాలి కాని దానికి ఆర్థికబలం, అంగబలం కావాలి దానికి సంస్థల, మరియు ప్రభుత్వ సహాయం కావాలి అన్వేషణ నిష్పాక్షికముగా సాగాలి ఇది మూఢావేశపరులైన మతోన్మాదుల చేతులలోనికి పోగూడదు వారి వలన అన్వేషణ జరగకపోగా అనర్థం కలుగుతుంది ప్రసంగవశాత్తు ఈ విషయము చెప్పవలసి వచ్చినది ఇక అసలు విషయము కులమునకు లాంఛనంగా ముడిపెట్టబడిన ఉపనయన కర్మకాండకు కర్మసిద్ధాంతముతో ప్రమేయము ఉన్నదా అను విషయమును గూర్చి ప్రస్తుత పరిస్థితులలో మనం గమనించ వలసిన అంశములు కొన్ని ఉన్నాయి

ద్విజత్వం అనేది జన్మతో వస్తుందా? ఉపనయనం తరువాత సిద్ధిస్తుందా? అటులైన ఉపనయనమునకు పూర్వం అతడు ద్విజత్వమునకు

అర్హుడు కాదా? అర్హుడు కానిచో శూద్రునితో సమానమా? అట్లు కాక ద్విజత్వం గుణకర్మములను బట్టి వస్తుందా? వేదాధ్యయన ఇచ్ఛ లేనపుడు బ్రాహ్మణునకైనను ఉపనయనం అవసరం లేదా? వేదాధ్యయనము లేని తండ్రి కుమారునికి గాయత్రి ఉపదేశం చేయుటకు అర్హుడా? అట్లు చేసిన అది ఉపనయన సంస్కారము క్షీణదశకు చేరినట్లు కాదా? బ్రహ్మనిష్ఠ, బ్రహ్మజ్ఞానము కలవాడు మాత్రమే బ్రాహ్మణుడని, అట్టివాడే వేదవిద్యకు అర్హుడుకాతగినవాడని, జన్మకు ప్రాధాన్యము లేకుండ వానిని ద్విజుడు అని అనవచ్చునని, అనినచో దానికేమైనా అభ్యంతరముండునా? వేదకాలంలోను, అటు తరువాత కాలంలోను ద్విజులే ఎక్కువగా వేదాధ్యయనం చేసినందు వలన ఆ కులముల వారికి మాత్రమే ఉపనయన సంస్కారము స్థిరపడి యుండెనేమో వేదాధ్యయనం సంగతి అటుంచి, ఒక 50 సంవత్సరముల క్రిందటి వరకు లౌకిక విద్యాభ్యాసమునకు సైతం కొన్ని కులముల వారు మాత్రమే ముందుకు వచ్చేవారు కాని ఈనాడు అన్ని కులాల వారు అన్ని లౌకిక విద్యలకు, అన్ని వృత్తులకు సిద్ధపడుతున్నారు ఇవి చారిత్రకంగా జరిగిన పరిణామాలు ద్విజులు కానివారు ఎందరో బ్రహ్మజ్ఞానులు, యోగులు ఉన్నారు కాని ద్విజులైన వారిలోనే ఎంతోమంది వేదాధ్యయన ఇచ్ఛలేనివారు బ్రహ్మజ్ఞానము అంటే అర్థం తెలియనివారున్నారు శూద్రత్వమును నిర్వచించేటపుడు ఈ అంశములను గమనించవలసిన అవసరము ఎంతైనా ఉన్నది

మహాభారతం, అనుశాసనిక పర్వములో ద్విజుడు కానివానికి విద్యాదానము చేయకూడదు, ప్రత్యేకించి శూద్రునకు విద్యాదానము చేయ కూడదు అని చెప్పుట వలనను, భగవద్గీతలోని మతనియమముల వలనను అటు తరువాత స్మృతుల వలనను కులవ్యవస్థ స్థిరపడి ఒక వర్గము వారిని శాశ్వతముగా సేవకులుగా ఉంచడం జరిగింది అని కొందరు అభిప్రాయ పడుతున్నారు ఇది దురభిప్రాయము ఇంతకు ముందు చెప్పినట్లుగా

మహాభారతం గాని, భగవద్గీత గాని ఎవరినీ ప్రత్యేకంగా సేవకులుగా నిర్దేశించలేదు భగవద్గీత గుణకర్మములను బట్టి వర్ణములు సృష్టించబడినవి అని మాత్రమే చెప్పింది కులవ్యవస్థకు భగవద్గీత కారణం కాదు భగవద్గీత బ్రహ్మవిద్యాభాండాగారము అనేక కారణముల వలన కాలక్రమేణ కొందరి సంకుచిత బుద్ధి ప్రభావము వలన కులవ్యవస్థ నేడు ఉన్న దారుణ రూపమును పొంది స్థిరపడింది బ్రహ్మజ్ఞానయోగములకు, కర్మసిద్ధాంతమునకు కులవ్యవస్థతో ఎట్టి సంబంధం లేదు

అంత ఎందుకు, మహాభారతం అనుశాసనిక పర్వములో గుణ, కర్మ, ధర్మములను బట్టి మనిషి ద్విజుడగునని చెప్పబడింది కదా!

శ్లో॥ వర్ణాశ్రమా యధా సర్వే ధర్మజ్ఞాన వివర్జితాః
కృతవశ్చయధా సోమాస్తథా గంగాం వినాజగత్ ॥
(అనుశాసనపర్వము భీష్ముడు ధర్మరాజుతో చెప్పిన సిద్ధుడు - గృహస్థుని సంభాషణ)

"ధర్మము, జ్ఞానము లేనిచో, అన్ని వర్ణములకు, ఆశ్రమములకు, శోభ ఎట్లు ఉండదో, సోమరసము లేని యజ్ఞము ఎట్లు శోభించదో, అట్లే గంగానది లేనిది జగత్తునకే శోభ ఉండదు"

శ్లో॥ కర్మభిః శుచిభిర్దేవి శుద్ధాత్మావి జితేంద్రియః
శూద్రోఽపి ద్విజవత్ సేవ్య ఇతి బ్రహ్మాబ్రవీత్ స్వయం ॥

"శూద్రుడైనను జితేంద్రియుడై పవిత్రకర్మల యొక్క అనుష్ఠానముచే తన అంతఃకరణమును పవిత్రమొనర్చుకొనినచో, అతడు ద్విజుని వలె సేవ్యుడగును - ఇది సాక్షాత్ బ్రహ్మదేవుని కథనము"
(భీష్ముడు ధర్మరాజునకు చెప్పినది అనుశాసనపర్వము)

శ్లో॥ స్వభావః కర్మచశుభం యత్ర శూద్రేపిఽతిష్ఠతి

విశిష్టః సద్విజాతేర్వై విజ్ఞేయ ఇతియే మతిః ॥

(అనుశాసనపర్వము భీష్ముడు ధర్మరాజునకు చెప్పిన శివపార్వతీ సంభాషణ)

"నా అభిప్రాయమేమనగా శూద్రుని స్వభావము, కర్మ ఉత్తమమైనవి అగుచో అతడు ద్విజాతి వారికంటెను అధికముగ మాననీయుడు"

భగవద్గీత కాని, భారతము కాని గుణకర్మములను బట్టియే మానవుని ఔన్నత్యమును చెప్పింది కాని ద్విజత్వమును బట్టి కాదు అని తెలియుచున్నది కదా! ఇక స్మృతులు, ధర్మములు, గృహ్యాసూత్రములు కాలమును బట్టి మార్పు చెందునని సూత్రభాషణలో శంకర భగవత్పాదులు చెప్పియున్నారు కదా! వ్యక్తిధర్మము, సామాజిక ధర్మముల మధ్య ఘర్షణ వచ్చినపుడు మానవుని ధర్మము ఏమిటో భగవద్గీత చెప్పలేదు అంటారు కొందరు చట్టములతో ఏర్పడిన న్యాయసూత్రముల కంటే (వీటినే స్మృతులనవచ్చును) ధర్మము ప్రధానము, ధర్మము కంటే ధర్మసూక్ష్మము ప్రధానము భారతములో ధర్మసూక్ష్మమునకే ప్రాధాన్యము ఇవ్వబడినది ధర్మసూక్ష్మములో ఉద్దేశమునకు ప్రాధాన్యము ఎక్కువ ఉద్దేశము (intent) ఆంతరికము, ధర్మము బాహ్యము లేక బహిరంగము ఒక సైనికుడు యుద్ధములో శత్రుసైనికుని చంపినపుడు అతనికి పాపము అంటునా? అంటదు కారణము అతడు సైనికునిగా తన ధర్మమును నిర్వర్తించెనే కాని స్వయముగా తాను ద్వేషముతో హత్య చేయలేదు భగవద్గీత స్వధర్మ నిర్వహణయే ప్రధానమని చెప్పింది గదా అర్జునుని క్షత్రియునిగా తన ధర్మమును నిర్వర్తించి యుద్ధము చేయుమని గదా శ్రీకృష్ణుడు చెప్పినది స్వధర్మముగా కాక స్వార్థముగా హింస చేసినచో తప్పక పాపఫలము వెన్నంటునని భారతము అనుశాసనిక పర్వములో చెప్పబడింది

శ్లో॥ ఘాతకోవధ్యతే నిత్యం తథావధ్యతి భక్షితా
ఆక్రోష్టాక్రుధ్యతే రాజంస్థధా ద్వేష్యత్వమాప్నుతే ॥

" ఈ జన్మయందు ఏ జీవి హింసింపబడుచున్నదో, అది మరుసటి జన్మమందు తన ఘాతకుని వధించుచున్నది తనను ఇదివరకు భక్షించినవానిని చంపివేయుచున్నది ఇతరులను నిందించువాడు మరుజన్మమందు వారి క్రోధమునకు ద్వేషమునకు పాత్రుడగును కర్మఫలము ననుసరించి ఈ ప్రపంచమున నిత్యము జరుగు కార్యక్రమము ఒక వలయము వంటిది "

భగవద్గీత చెప్పిన నిష్కామకర్మ (అనాసక్తి యోగము) పూర్తిగా తార్కికమే గాని ఆచరణ సాధ్యము కాదు అని కొందరు వాదిస్తున్నారు ఇది నిష్కామకర్మ అంతరార్థము గ్రహించలేక పోవుటయే యగును కర్మములు గుణముల ననుసరించి జరుగును కాని ఇందు కొన్ని అసంకల్పితములు (involuntary) మరికొన్ని సంకల్పితములు (voluntary) అసంకల్పిత చర్యలు సృష్టి సహజములు గాలికి దుమ్ము లేస్తుంది అది మన కళ్ళలో పడుతుంది గాలికి దుమ్ము లేవటం అసంకల్పితం కాని గాలికి లేచునట్లు ఎవరైన దుమ్ము పోయటం దుశ్చర్యయేయగును అది అసంకల్పితము కాదు అరణ్యములో జంతువుల చర్యలు చంపుట - చంపబడుట (killing – being killed) అను ఒక ప్రకృతి సహజ కర్మ పరంపరలో భాగములు వాటికి తార్కిక బుద్ధి వికాసము లేదు అందువలన వాటి చర్యలు అసంకల్పితములే యగును కాని మానవునికి బుద్ధివికాసమున్నది కావున అరణ్యములో ప్రకృతి సహజమైన చంపుట - చంపబడుట మానవ సమాజములో అసంకల్పితములనుటకు వీలుపడదు అరణ్యములో జంతువులకు ఆహారం సంపాదించటం, ఆత్మరక్షణ సహజకర్మలు ఇవి చాలవరకు అసంకల్పితములే సృష్టిలో ఆ జంతుజీవులకు జీవించి ఉండుటకే ఆధారమగు ఆ చర్యలలో ధర్మాధర్మ ప్రసక్తికి అవకాశము లేదు కాని నక్కలను కుయుక్తికి చిహ్నములుగా చెప్తారు అది వాస్తవమే అయితే వాటి చర్యలు సంకల్పితములే యగును సంకల్పితములగు దుశ్చర్యలు పాపకర్మములే యగును మానవ సమాజంలో కూడ సంసారికి జీవితములో అనగా గృహస్థ ధర్మములలో మైథున కర్మ ప్రకృతి సహజమే

దుష్కర్మ కాదు కాని వ్యభిచారము సంకల్పితము అది దుష్కార్యము ప్రకృతి సహజము కాదు

ఇక సంకల్పితములగు దుష్కర్మములకు భగవద్గీత మానవ సమాజంలో స్థిరపరచిన కులవ్యవస్థ వలన ఏర్పడిన ఆర్థిక, సామాజిక అసమానతలు (inequality) కారణమగుచున్నవి అని కొంతమంది తత్త్వవేత్తల విమర్శ ఇది పూర్తిగా నిరాధారము భగవద్గీత కులవ్యవస్థను స్థిరపరచినదనుట అసమంజసము భగవద్గీత కులవ్యవస్థను గురించి ఎచటను చెప్పలేదు నాలుగు వర్ణములు గుణకర్మముల ననుసరించి విభజించబడినవి అని భగవానుడు చెప్పాడు అంతేకాని వారి గుణకర్మములకు తాను కర్తను కాను అన్నాడు (4-13) సంకల్పితములగు మానవ చర్యలకు వారే కర్తలు వారే వారి కర్మఫలమును అనుభవించవలయును ఈ సంకల్పిత చర్యలకు ఉద్దేశము (motive) ఆధారము ఏ వృత్తి ద్వారా చేయు కర్మమునకైనా ధనసంపాదనే ప్రధానమైన కోరిక ఆ కోరిక లేనిది ఆ వృత్తి అనగా ఆ కర్మము జరగదు వృత్తులు జరగనపుడు సమాజమునకు అభివృద్ధి ఉండదు కాబట్టి నిష్కామకర్మ బోధించుటకు ఉదాత్తముగా ఉండునే కాని ఆచరణలో అది సామాజికాభివృద్ధికి, నాగరికతా ప్రగతికి ఆటంకమగును అని కొందరి వాదన కామము (కోరిక) లేనిది కర్మము లేదు అని వారి తర్కము

'పనిచేయవలెను' అనునది ఉద్దేశము కర్మమునకు అది అవసరము దానిని కామము అనుటకు వీలులేదు కామము అనగా వాంఛ లేక కోరిక అది ఎపుడూ పనిచేయుట యందుండదు ఉద్దేశముననుసరించి కర్మము జరుగును పని ప్రారంభించినప్పటి నుండి 'ఇందులో నాకేమి వచ్చును' అని ఫలమును గూర్చి ఆలోచించుటయే కామము అనబడును అట్లు కాక తనకుగాని మరొకరికి గాని 'సర్వము పరమాత్మయే' అను దృష్టితో కర్తవ్య నిర్వహణగా చేసినచో వచ్చిన ఫలితము ఆనందము కలుగజేయును అట్లుకాక

ప్రారంభము నుండి ఫలమును గురించి ఆలోచించుచు చేసినచో కర్తవ్యభావన ఉండదు, ఫలము వచ్చిన తరువాత కూడ ఆనందము అనుభవము లోనికి రాదు కాబట్టి 'నిష్కామకర్మము' లేక 'అనాసక్తియోగము' అనగా నిరాసక్తి కాదు స్వార్థముతో ఫలమును వాంఛించకూడదు అని భావము కాని ఇది కూడ తాత్విక సిద్ధాంతమే కాని, నిత్యజీవితంలో సాధకము కాదు అంటారు దీనికి భగవద్గీత (18-25) శ్లోకమును ఆధారంగా చెప్తారు

"కర్మఫలమును, నష్టమును, దుఃఖమును, తన యొక్క సామర్థ్యమును తలచి చూడక, మోహము చేత యే కర్మము ఆరంభించ బడుచున్నదో అది తామసమనబడును" ఇది ఫలమును గురించి నిష్కామముగా కర్మ యొనరించవలెను అను నిష్కామకర్మను వ్యతిరేకించునది కాదు ఏ కర్మమును మోహముతో చేయకూడదు ఉద్దేశించిన కర్మము చేయుటకు తనకు సామర్థ్యమున్నదో లేదో తెలియకుండ చేసినచో కర్మము సత్యముగా పూర్తికాదు అ కర్మము వలన సుఖము కలుగునో, దుఃఖము కలుగునో ఆలోచించకుండ చేసినచో అది తమోగుణముతో నిండిన మానవుని చర్యయే యగును నిష్కామకర్మ యనగా తమోగుణము వలన కలిగిన మోహమును విసర్జించి వివేకముతో ఫలమును గూర్చి స్వార్థముతో ఆలోచింపక చేయు కర్మము కల్లకపటము లేని స్వభావం అనగా అమాయకత్వము కాదు భక్తుడుగా ఉండవలెను కాని మూఢుడుగా నుండరాదు అని అన్నారు శ్రీ రామకృష్ణ పరమహంస ఆత్మవిచారణ చేసుకొనవలయును ఆత్మవిచారణతో సత్యమును గ్రహించి కర్మమును నిర్వహించినపుడు స్వార్థమునకు తావుండదు అదియే నిష్కామకర్మ భగవద్గీత (18-26)లో సాత్వికునికి నిష్కామకర్మ సాధ్యమగును అని చెప్పబడింది ఆసక్తిని విడిచినవాడు, అహంకార రహితుడు, ధైర్యోత్సాహములతో కూడినవాడు, జయాపజయములచే బాధింపబడనివాడు అయిన కర్త సాత్వికుడనబడును సంగము అనగా కోరికతో కూడిన స్వార్థముతో కర్మము చేయువాడు జయమునందు సంతోషమును అపజయమునందు

దుఃఖమును పొందుచున్నాడు సర్వము ఈశ్వరరూపములే అని గ్రహించినవానికి యీ భౌతిక శరీరము ప్రకృతికి ప్రతీకయని తెలియును ప్రకృతిలో చర్యల వలెనే తన భౌతిక శరీరము కూడ కర్మములు చేయుచున్నది ప్రకృతిలో జరుగు చర్యలకు కర్త ఎవరు? ఎవరో కనబడరు, మనకు తెలియదు మనము చేయు కర్మలకు భౌతికముగా మనము కర్తలము అను భావన మన స్వార్థమునకు, కామము లేక కోరికకు చిహ్నము మన జీవితమే సృష్టి ప్రణాళికకు అద్దము పట్టే ప్రకృతికి సజీవ రూపము అది గ్రహించినపుడు 'నేను చేస్తున్నాను' అను అహం పోవును ప్రకృతి తనలో జరుగు చర్యలకు కర్తృత్వమును భావించక సృష్టి ప్రణాళికలో భాగముగా తన కర్తవ్యము నిర్వహించును అయితే మన జీవితములలో కూడ మనము చేస్తున్నాము అనిపించు కర్మములు ప్రకృతి ప్రణాళికలో భాగములే మనము అద్దములో ప్రతిబింబముల వంటివారము మన చేయి కదిలితే అద్దములో ప్రతిబింబము చేయి కదులును అది సహజముగా జరుగునది ప్రకృతిలోని పరమాణు సంయోగవియోగ ఫలితములే మనకు కనిపించు భౌతిక రూపములు అట్టి ప్రక్రియలే మన శరీరములో జరుగుచుండుట వలన ఫలితముగా మనచే కర్మములు జరుగుచున్నవి అపుడు కర్మములు ప్రకృతిసిద్ధముగా జరుగును అంటే పురుష ప్రయత్నమునకు స్థానం లేదా? ఉన్నది పురుష ప్రయత్నమునకు స్థానం లేనపుడు యీ జీవితమే నిరర్థకమగును మన మెదడు నందు రెండు భాగములున్నవి ఒకటి మెదడు (brain) నాడీమండలమును నియంత్రించి మన ఇంద్రియములచే పనులు చేయించును రెండవ భాగము బుద్ధి లేక మనసు (mind) అదే పురుష ప్రయత్నమునకు ఆధారము కాని 'బుద్ధిః కర్మానుసారిణి' అన్నారు ఇక్కడ ఒక విషయము గ్రహించవలసియున్నది ప్రకృతిలో లేక విశ్వము లేక అంతరిక్షములో జరుగు పరమాణు సంయోగ వియోగము ఫలితముగా శక్తులు ఉద్భవించును ఈ శక్తులు ప్రకృతి అంతటా ఒకే విధముగా ఉండవు ఈ శక్తులను అచరములగు వృక్షములు, పర్వతముల నుండి చరములగు

జీవుల వరకు అన్నీ వాటి పరిమితులకు లోబడి ఉపయోగించుకొనుచున్నవి మానవుడు యీ ప్రకృతి శక్తులను ఉపయోగించుకొని మరికొన్ని విభిన్న శక్తులను ఉద్భవింపజేస్తున్నాడు ఉదాహరణకు ప్రకృతి శక్తి నుండి ఉద్భవించినదే నీరు నీరు ఒక శక్తి ఆ శక్తిని ఉపయోగించి మానవుడు జలవిద్యుత్తును (Hydel Power) ఉత్పత్తి చేస్తున్నాడు ఈ విద్యుత్త శక్తిని తిరిగి విద్యుత్ దీపములు, రేడియో, టి వి , ఇంకా యాంత్రిక శక్తులుగా పరిణామము చెందిస్తున్నాడు గత కర్మననుసరించి ఉన్న బుద్ధి ప్రకృతి శక్తి పరిణామరూపమైన నీరు వంటిది దానిని మానవుడు పరిణామము చెందించి విభిన్నశక్తులుగా రూపొందించటం వలె పురుష ప్రయత్నము ద్వారా కర్మననుసరించు బుద్ధిని మళ్ళించవచ్చును వేదాంత శాస్త్రములో మనస్సు (Mind) బుద్ధి (intellect) చిత్తము (dreamlike state) అహం (ego) అన్నిటిని కలిపి అంతఃకరణము అన్నారు మనస్సు అనేది మనోమయకోశము బుద్ధి, చిత్తము, అహంకారము దానికి మరోపేర్లు అనగా మనస్సే అంతఃకరణమగును మన ఇంద్రియములు ఇంటికి ముఖద్వారము లాంటివి వీటికి బాహ్య ప్రపంచములోని వస్తువులతో సంబంధము ఏర్పడినపుడు అనేక విధములైన వేదన, జ్ఞానము, అనుభవము (sensations) ఏర్పడతాయి ఇవి ఒకపుడు ఉద్రేకపూర్వకంగా ఉంటాయి వీటిలో కొన్ని మనస్సు ద్వారా (అంతఃకరణములో ఒక భాగము) అంతఃకరణకు చేరును బుద్ధి అను భాగము తెలివిని కలిగించి ఇంద్రియానుభవమునకు కార్యరూపం కల్గించి కర్మము అనగా పనిని చేయిస్తుంది చిత్తం అను భాగము ప్రత్యేక సుఖములు, విలాసములపై యిష్టత చూపి ఆ పనులను ప్రోత్సహించును అహంకారం అనే భాగము ఇంద్రియముల ద్వారా కలిగిన జ్ఞానమును, అనుభవమును విశ్లేషించి, ఆ వ్యక్తికి సంబంధించినది గ్రహించి వివేకముతో కార్యరూపం దాల్చునట్లు చేయును ఇచటనే పురుషప్రయత్నమునకు అవకాశము కలుగును కర్మననుసరించు బుద్ధి అను భాగమును మనసు అను భాగము ద్వారా గత కర్మానుసరణ అను మార్గము నుండి మళ్లించటమే

పురుష ప్రయత్నం ఇది కర్మసిద్ధాంతమునకు వ్యతిరేకము కాదు ప్రారబ్ధ కర్మానుభవములో మునిగి నిస్సహాయుడుగా ఉండక, నీట మునిగినవాడు నీటిపై తేలుటకు ప్రయత్నించుచు ఏ ఆధారము దొరికినను దానిని ఉపయోగించుకొని ఒడ్డుకు చేరునట్లు ప్రారబ్ధ కర్మ అను ప్రవాహము నుండి బయటపడుట లేదా ఆ కర్మ ఫలానుభవము బాధించకుండునట్లు చేసుకొనటం పురుష ప్రయత్నమనబడును

ఆ ఆధారం ఏమిటి? ఎక్కడ నుండి వస్తుంది? ఆత్మ అనునది ఒకటి ఉన్నదని తెలుసుకొనుటే ఆ ఆధారం ఆత్మ అనేది మనసు కాదు అది ఒక ఇంద్రియము కాదు మనస్సు అంతఃపరికరము శరీరము, ఇంద్రియములు బాహ్య పరికరములు ఈ పరికరములతో సంబంధము ఏర్పరచుకొని ఆంతరికముగ నుండునది ఆత్మ విశ్వమంతటా (ప్రకృతి అంతటా) వ్యాపించియున్న విశ్వాత్మ (పరమాత్మ) యొక్క అంశయే ఆత్మ ఈ ఆత్మ ఒక శరీరమును వదలిపెట్టుటయే మరణము మరొక శరీరములో ప్రవేశించటమే పునర్జన్మ ఒక శరీరములో ప్రవేశించిన తరువాత ఆత్మ యొక్క తపన అంతఃకరణము ద్వారానే వ్యక్తమగును మనస్సునే అంతఃకరణము అని చెప్పవచ్చునన్నాము కదా! కావున మనస్సును మనలోని ఆత్మకు బదులుగా స్పందించు అవయవముగా గ్రహించవలయును ఆత్మ మనసులో ప్రతిబింబించునే కాని మనసే ఆత్మ కాదు మనసే ఆత్మ అనుకుంటే శరీరం, ఇంద్రియములే సర్వస్వం అవుతాయి అలా అనుకొనుటయే వ్యావహారికముగా 'అహం' అనుబడుతుంది ఈ శరీరమే ప్రకృతి ప్రకృతిలోని విశ్వాత్మయే ఈ శరీరములోని ఆత్మ అని గ్రహించినపుడు 'అహం' ఉండదు అహం అంతరించినపుడే సర్వములో తనను, తనలో సర్వమును మనిషి గ్రహించ గలుగుతాడు ఆ స్థితిలో ప్రారబ్ధకర్మానుభవము బాధించదు అపుడే నిష్కామకర్మ సాధ్యమగును

నిష్కామకర్మ ఆచరణ యోగ్యతను శ్రుతులు అనగా వేదములు గుర్తించలేదు అంటారు కాని ఈ విమర్శకులు ఒక విషయము మరచుచున్నారు వేదములందు అనగా సంహితలయందు 'కర్మ' అను పదము కర్మ సిద్ధాంత అర్థముతో ఉపయోగించినట్లు కనబడదు కర్మసిద్ధాంతమునకు రూపము ఏర్పడిన తరువాతనే కర్మము, సుకృతము, దుష్కృతము, పునర్జన్మ అను శబ్దములు అనంతర కాలవేద సాహిత్యమందు చోటుచేసుకొన్నట్లు తెలియు చున్నది సంహితల యందు 'కర్మ' శబ్దము మతసంబంధమైన కర్మకాండలు అను అర్థముతోనే ఉపయోగించబడినట్లు కనబడుచున్నది దైవప్రీతి కొరకు చేయబడు కార్యములను మాత్రమే కర్మములుగా పరిగణించినట్లు తెలియుచున్నది చర్య, ప్రతిచర్య, ఆత్మ, జన్మ, పునర్జన్మ అను అర్థములు 'కర్మ' అను శబ్దమునకు ఉపనిషత్తులకు పూర్వకాలము నాటి వేదసాహిత్యము నందు కనబడవు ఋగ్వేదమునందు, ముఖ్యముగా బ్రాహ్మణములలో 'కర్మ'ను 'యజ్ఞకర్మ' పరంగానే ఉపయోగించారు అట్టిచో వేదములు 'నిష్కామకర్మ'ను గుర్తించటం ఎలా జరుగుతుంది

ఇక 'కామం' అనగా కోరిక సృష్టిలో అన్నిటి కంటే ముందుగా పుట్టినదని (first form) ఋగ్వేద (R V X 129-4 and A V IX 2-19, XIX 5 2) అథర్వ వేదములు గుర్తించినవి కదా, కామం లేనిది ఏది లేనపుడు 'నిష్కామకర్మ' ఎలా సాధ్యము అని వాదన జీవితంలో ప్రతి మనిషి కోరుకునేది సంతోషం, సంతృప్తి, ఆనందం వీటినే సంస్కృతములో పురుషార్థములు అన్నారు పురుషార్థములే పురుష ప్రయత్నమునకు ఆధారాలు జీవితంలో అందరికీ సంతోషం ఒకే విధంగా ఉండదు ఎవరి కోరికలు వారికుంటాయి కార్మికుడు, కర్షకుడు, సామాన్య సంసారి, మేధావి, యోగసాధకుడు, పరిపూర్ణ జ్ఞాని - వీరందరూ కోరేది ఒకటే అదే వారి పురుషార్థం ఏ మనిషి ఏ అంతస్తులో జీవిస్తూ వుంటాడో అతడి ఆనందం అంతలోనే ఏర్పాటుచేస్తుంది ప్రకృతి అపుడే పుట్టిన పసిబిడ్డ దగ్గర నుండి నిర్వాణం చేరుకునే పరిపూర్ణ యోగి దాక

అందరూ కోరేది జీవితంలో సంతోషాన్ని, సంతృప్తిని ఇచ్చే మార్గాన్నే ఈ కోరికలు అనేకులకు అనేక రకాలు

కోరిక లేక ఆశ మానవ సహజ లక్షణం గదా యిక నిష్కామకర్మ ఎలా ఆచరణసాధ్యము అని విమర్శకుల వాదన సరే, కోరిక సహజమే కాదనలేము కోరిక అనబడు ఆశ ఎంతవరకు సహజము అది దురాశగా మారనంత వరకు దురాశ సహజము కాదు అది దోషము కోరిక సహజము, అవసరము ఒక పనిచేయవలెనని కోరిక కలిగినపుడే గదా అది చేసేది మరి అది నిష్కామం ఎలా అవుతుంది అనేది ప్రశ్న ఒక పని చేయుటకై కోరిక ఉండకూడదు అని భగవద్గీత చెప్పలేదు 'నిష్కామం' అనగా చేయతలచిన కర్మము (పని) యొక్క ఫలమును గురించి కామం (కోరిక) కూడదు అని పనిచేయాలి అని వాంఛించాలి, ఎపుడు, ఎలా, చేయాలో, ఆలోచించాలి, అది సత్ఫలితాన్ని ఇచ్చే విధముగా పూర్తిచేయాలి అంతేకాని పని ప్రారంభించినప్పటి నుండి 'ఇందులో నాకు ఎంత లాభం' అని వాంఛించటమే కామం అవుతుంది అది లేకుండటమే నిష్కామం అవుతుంది

'నిష్కామకర్మ' అసాధ్యము అనువారు ఛాందోగ్యములోని (7-22-1) మంత్రమును ఉదహరిస్తూ వుంటారు

మం॥ యదావై సుఖం లభతే అధకరోతి నా సుఖం లబ్ధ్వాకరోతి - సుఖమేవలబ్ధ్వాకరోతి సుఖంత్వేవవిజిజ్ఞాసి తవ్యమితి సుఖం భగవోవిజిజ్ఞాస ఇతి

"మనిషి ఏదైనా చెయ్యాలంటే సుఖంగా ఉండాలి అంటే శారీరక మానసిక సుఖం ఉండాలి సుఖంగా ఉన్నపుడు మాత్రమే ఏదైనా చేయగలుగుతాడు సుఖంగా లేకపోతే, కులాసాగా లేకపోతే ఏమీ చేయలేడు కాబట్టి సుఖమును గూర్చి జిజ్ఞాస చేయాలి" సుఖమును గురించి జిజ్ఞాస అనగా తెలుసుకొనుటకు కృషి చేయమని చెప్పబడిందే గాని కోరికలతో సుఖం

వస్తుందని చెప్పబడలేదే! భూమము అనగా విశ్వాత్మ యొక్క అనంతత్వమును తెలిసికొనుమని చెప్పిందే కాని కోరికలు సాధించటం ద్వారా సుఖం వస్తుందని చెప్పలేదే!

స్మృతులు ప్రధానంగా మనుస్మృతి నిష్కామకర్మకు పరిమితి విధించిందని చెప్తుంటారు కాని ఇది వాస్తవం కాదు (మనుస్మృతి - ద్వితీయాధ్యాయము - 2, 3, 4, 5 శ్లోకములు) "లోకమున ఫలాపేక్షతో కార్యములొనర్చుట ప్రశస్తమైనది కాదు అయినను, ఇహలోకంబున ఫలాపేక్ష లేకుండుట అసాధ్యము వేదములు సాంగముగా నభ్యసించుటయు, వేదోక్తములైన సకల కర్మలందాసక్తియు కామ్యమైనదే కామము సంకల్ప మూలమైనది ఆయా వస్తువులు కావలెనని కోరుట సంకల్పము దానివలననే కామము పుట్టుచున్నది యజ్ఞములు, వ్రతములు, నియమములు ఇవి అన్నియు సంకల్పము వలననే పుట్టుచున్నవి లోకమున కోరిక లేనివానికి ఏ క్రియయు లేదు భోజనము చేయుటకు ఇచ్ఛ కలిగినపుడు మానవుడు భోజనము చేయును నడచుటకు ఇచ్ఛ కలిగినపుడు నడచును మనుష్యుడు చేయు ప్రతి క్రియయు కామం యొక్క వ్యాపారమే కాని వేరు కాదు" ఇంతవరకు ఫలాపేక్ష లేకుండుట అసాధ్యమని చెప్పానే 5వ శ్లోకంలో ఇలా అన్నారు "అట్టి సంకల్పములయందు ఫలాపేక్ష లేకుండ మంచి తలంపు కలిగి కార్యములొనర్చువాడు బ్రహ్మభావమును పొందుచున్నాడు అట్టి బ్రహ్మభావమును పొంది యైహికములగు సర్వ మనోరథములను పొందు చున్నాడు"

బ్రహ్మజ్ఞానమును పొంది మనోరథములను పొందటం అంటే అనుబంధము లేకుండ ఇహకార్యములను నెరవేర్చుటయే కదా! అది వాస్తవమునకు జీవన్ముక్తియే యగును 'నిష్కామ కర్మ' లేక అనాసక్తి యోగ సారాంశము కూడ అదియే గదా! జీవితములో ఉన్నత స్థాయికి ఎదుగుటకు

సాధన అవసరము ఒకరికి సాధ్యమైనది మరొకరికి అసాధ్యమనిపించవచ్చును అందువలన నిష్కామకర్మ అసాధ్యము అనుటకంటే కష్టసాధ్యము అనుట సమంజసము

మానవుని సహజ స్వభావము ఎక్కువగా రాజసికము, తామసికము, సాత్వికము అరుదు అని, నిష్కామకర్మకు సాత్విక ప్రవృత్తి అవసరము కాన, నిష్కామకర్మ ఆచరణలో సాధ్యముకాదని భగవద్గీత గుర్తించలేదని ఒక విమర్శ ఉంది అందరు కర్మలకు మంచి ఫలితమునే ఆశిస్తారు, కాని వారిలో మంచి మార్గమునననుసరించువారు తక్కువ వారు చెడు ఫలితమును ఆశించరు కాని వారు అనుసరించు మార్గము చెడ్డది ఇది మానవుని సహజమైన బలహీనత కావున నిష్కామకర్మ మానవునికి ఆచరణసాధ్యము కాదు అనునది విమర్శ నిష్కామకర్మ ఆచరించు వానికి దాని ఫలము అంటదు అని కదా చెప్పబడింది కాని కర్మకు ఫలితముంటుంది కదా! ఫలితము లేని కర్మ నిరర్ధకమగును కదా! దీనికి భగవద్గీత సమాధానము చెప్పలేదు అనునది కూడ ఒక విమర్శ జైనబౌద్ధములు వ్యతిరేకించిన యజ్ఞకర్మలను ఉద్ధరించుటకు, కులవ్యవస్థను రక్షించుటకు, కర్మలను నిరోధించుటయే మోక్షమార్గము అను వాదమును వ్యతిరేకించుటకే భగవద్గీత నిష్కామకర్మను బోధించినది కాని, దాని సాధ్యాసాధ్యములను గుర్తించలేదు అని ఈ విమర్శ సారాంశము

దీనికి ఆధారముగా శంకరభగవత్పాదుల శిష్యులైన సురేశ్వరాచార్యుల "నైష్కర్మ్యసిద్ధి"లోని ప్రధమాధ్యాయములోని 30వ శ్లోకములోని 'పరీప్సా' 'జిహాసా' అను పదములను ఉదహరించి (పరీప్సా) పొందవలెనను ఇచ్ఛ, (జిహాసా) విడిచిపెట్టవలెనను ఇచ్ఛ పశువులందు కూడ కానవచ్చును గనుక అవి సహజములు అంటారు సహజములైన ఇచ్ఛలు ఉండుట వలన నిష్కామకర్మ ఆచరణసాధ్యము కాదు అని వాదన

యజ్ఞకర్మల ఉద్ధారణ భగవద్గీత ధ్యేయముగా ఎచటను కనబడదు

కులవ్యవస్థను గురించి ప్రస్తావనయే లేదు గుణ కర్మములను బట్టి వర్ణములు సృష్టించబడినవి అని చెప్పబడింది అకర్మవాదమును వ్యతిరేకించుటకే 'నిష్కామకర్మ'ను ప్రవేశపెట్టినదనుట అసమంజసము ఎందుకనగా కర్మయందు అకర్మ, అకర్మ యందు కర్మ భగవద్గీత యందు ప్రత్యేకంగా వివరించబడింది 14వ అధ్యాయము అంతేకాక 18వ అధ్యాయం 49→57 శ్లోకములలో కర్మయోగమే కర్మసన్యాసమగుచున్నదని చెప్పబడినది ఇక సురేశ్వరాచార్యుల 'నైష్కర్మ్యసిద్ధి'ని గురించి ప్రసంగవశాత్తు క్లుప్తముగా తెలుసుకొందుము

భగవద్గీత యందలి (18-49) శ్లోక భాష్యము స్థాపించిన నిర్వచనము ననుసరించి సురేశ్వరాచార్యులు 'నైష్కర్మ్యసిద్ధి' అను నిష్క్రియాత్మ స్వరూపమును చెప్పారు 'నైష్కర్మ్యసిద్ధి'ని శబ్దార్థము గ్రహించి తప్పు అభిప్రాయముతో కర్మ సిద్ధాంతమును ఖండించుటకే వినియోగించబడిన గ్రంథం అని కొందరు భావిస్తున్నారు భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు (18-49) "నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్యాసేనాధిగచ్ఛతి" అని చెప్పియున్నాడు

నైష్కర్మ్యసిద్ధిం = నిష్కామ కర్మసిద్ధిని, పరమాం = ఉత్తమమైన, సన్యాసేన = కర్మఫలత్యాగము చేత, అధిగచ్ఛతి = పొందుచున్నాడు

'నైష్కర్మ్య' అంటే 'నిష్క్రియ' అని అర్థం కాదు 'నిష్క్రియ' అనునది భౌతిక శరీరమునకు సంబంధించినది అది ఆత్మస్వరూపము అది ఆత్మస్థితి సన్యాసము అనగా త్యాగము అను భావముతో చెప్పబడినది కాబట్టి నైష్కర్మ్య స్థితి అంటే కర్మాతీతస్థితి అనాసక్తి అంటే నిరాసక్తీ కాదు, అశక్తతా కాదు స్వార్థముతో కూడిన ఫలాపేక్ష లేకపోవుటయే అనాసక్తి అనాసక్తమగు బుద్ధి గలవాని చిత్తము కోరికలను నిగ్రహించగల శక్తి కలిగియుండును అట్టివాడే కర్మఫలత్యాగము చేయగలడు అతనికే నైష్కర్మ్యసిద్ధి సాధ్యము కర్మయోగి అయినవాడు నిరంతరము కర్మమును ఆచరించుచునే యుండును ఆనాడు స్వాతంత్ర్యసమరయోధులు సాగించినది కర్మయోగమే వారు నిస్వార్థముగా

స్వాతంత్ర్య సమరం సాగించారు వారికి ఉద్దేశము లేదా? వారు ఫలమును ఆశించలేదా? వారి ఉద్దేశము, వారి ఆశించిన ఫలము దేశస్వాతంత్ర్యము అది వారి ఒక్కరికే కాదే! దేశము మొత్తానికి వారు తమ కర్మయోగఫలముగా స్వాతంత్ర్యం కోరారు కాబట్టి ప్రతి కర్మకు కోరిక, ఫలము రెండూ ఉంటాయి కాని అందు కర్మము చేయువాని యొక్క స్వార్థం ఎంత, నిస్వార్థం ఎంత అనుదాని మీదనే కర్మయోగసాధన, నైష్కర్మ్యసిద్ధి ఆధారపడి ఉంటాయి నీటి ప్రవాహముపై కట్టబడిన వంతెన చక్కని ఉదాహరణ నీటి రాకపోకలకు తోడ్పడును, తనపై వెళ్ళు పాదచారులకు సహాయపడును అదే అకర్మ యందు ఇమిడియున్న కర్మ వంతెన ఏమీ చేయుటలేదనిపించును కాని ఆ వంతెన లేనిది నీటి ప్రవాహ నియంత్రణ జరగదు, ఆ నీటిపై పాదచారులు క్షేమంగా నడచివెళ్ళటం జరగదు అదే జీవన్ముక్తి అంతరార్థము, అనాసక్తి యోగసాధన

మానవుని హృదయము సముద్రము వంటిది సముద్రమున అలలు లేచునట్లు, మావవుని మనసున కోరికలను భావములు లేచుచుండును సముద్రమున అలలు ఉపరితలముననే కనబడును లోనికి పోయిన కొలది నీరు ప్రశాంతముగా నుండును ఆ ప్రశాంతతే నిస్వార్థంతో కూడిన అనాసక్తి యోగము పైన లేచుచుండు అలలే చేయవలసిన కర్మమును గురించిన ఆలోచనలు అదే నిష్కామకర్మకు పరిరూపమైన నైష్కర్మ్యసిద్ధి తనకేమీ ప్రత్యేకంగా అవసరం లేకపోయినా, అందు తనకేమీ లభించకపోయినా 'కీర్తి కండూతి' అనబడు ఆశ లేకపోయినా, "ఆసక్తి లేని బుద్ధితో" తామర ఆకుపైన నీటివలె సదుద్దేశముతో సత్ఫలమునకై కార్యము నిర్వహించువాడు నైష్కర్మ్యసిద్ధిని పొందును కర్మఫలమును ఎంతో కొంత, ఏదో విధముగ తనకై ఆశించువాడు పనిచేస్తున్నపుడు ఉద్వేగముతోనో, లేక ఉద్వేగం ప్రదర్శిస్తూనో హడావిడి చేస్తుంటాడు అది ఎన్నటికీ కర్మయోగము కానేరదు అనాసక్తితో పనిచేయువాడు హడావిడి చేయడు ప్రశాంతంగా పనిని పూర్తిచేసి సత్ఫలమును సాధిస్తాడు

పైన ఉదహరించబడిన భగవద్గీతలోని (18-49) శ్లోకమునకు శంకరభగవత్పాదులు ఈ విధంగా భాష్యం చెప్పారు "పుత్ర మిత్ర ధన, కనకం మొదలైన వస్తువులపై తనదను అభిమానము విడిచి మనస్సును జయించినవాడు ఆత్మజ్ఞానియై జ్ఞాననిష్ఠను (నైష్కర్మ్యసిద్ధి) పొందును అదియే సర్వకర్మలను విడిచినట్టి సన్యాసము" దానికే రామానుజులు ఇలా వ్యాఖ్యానించారు "కర్మఫలము మొదలగు వాటిలో అభిమానము లేని బుద్ధి కలిగి మనస్సును జయించి తాను కర్తయను అభిమానము వదలి, అభిమానముతో కూడిన ఫలమును త్యజించినవాడై ఈశ్వరారాధన రూపముగా కర్మల నాచరించుచు జ్ఞానయోగఫలమైన సకల కర్మలకు అతీతమైన ధ్యాననిష్ఠను పొందును అదే నైష్కర్మ్యసిద్ధి "

ఈశ్వరార్పణముగ కర్మలనాచరించుటయే నైష్కర్మ్యసిద్ధియని రాఘవేంద్రస్వామి అన్నారు దేనియందు తగుల్కొనని బుద్ధి కలిగియుండుటయే అనాసక్తి యోగము (detached) మనస్సును జయించుట అనగా అదియే అర్థము ఆశ లేకుండుట అనగా కోరికలు వ్యామోహంగా మారకుండుట, కామం మోహంగా ఎగయకుండుట అపుడే నైష్కర్మ్యసిద్ధి సాధ్యము నిష్క్రియ ఆత్మస్థితి అనగా సమస్త కర్మలు రహితమైన ఆత్మస్థితి మనస్సు, ఇంద్రియములకు అతీతమైన స్థితి, అనగా కర్మఫలత్యాగమే నైష్కర్మ్యసిద్ధి అదే జీవన్ముక్తి

నిష్కామకర్మరూపమున సన్యాసమును భగవద్గీత ప్రోత్సహించు చున్నదని ఆరోపించుటకు సాధ్యపడదు కదా! వాస్తవంగా భగవద్గీత "ఏ ఒక్కడూ కేవలము కర్మలు చేయక ఉన్నంత మాత్రమున నైష్కర్మ్యసిద్ధిని పొందజాలడు" అని చెప్పింది అందుకే శంకరభగవత్పాదులు నైష్కర్మ్యసిద్ధి అనునది పరమాత్మ జ్ఞానముతో సర్వకర్మలకు అతీతమైన పరిపూర్ణ స్వరూపస్థితి అని చెప్పియున్నారు ఆత్మస్వరూప స్థితి యొక్క అనుభవమే సర్వకర్మముల త్యాగ అనుభూతి కలుగజేయును ఈ సందర్భముగ భగవద్గీత 3వ

అధ్యాయమందలి 4, 5, 6 శ్లోకములను పరిశీలించినచో నైష్కర్మ్యసిద్ధి అంతరార్థము బోధపడును

3వ అధ్యాయంలో (కర్మయోగం) 4వ శ్లోకంలో పురుషుడు కర్మలను ఆచరింపకపోవుట వలన ఆత్మస్వరూపమగు నిష్కర్మస్థితిని పొందజాలడు అని స్పష్టముగా చెప్పబడింది వట్టి సన్యాసము అనగా కర్మత్యాగము చేయుట వలన మాత్రమున సిద్ధిని (మోక్షము) పొందజాలడు కాయలు ముదిరి పక్వమైన తరువాతే పండుగా మారును అటులే మానవుడు కర్మల ద్వారా జ్ఞానఫలమును పొందును బలవంతముగా కర్మత్యాగము ఎందుకు చేయరాదనుటకు 3-5వ శ్లోకములో సమాధానమున్నది ఈ ప్రపంచమున ప్రతి మానవుడు ఒక్క క్షణకాలమైనను కర్మముచేయక యుండలేడు ఎందుకనగా ప్రకృతి సహజమైన గుణముల వలన ప్రతి మానవుడు తన వశములేకయే కర్మములన చేయుచునేయుండును ఈ ప్రకృతి త్రిగుణాత్మకమైన కర్మస్వరూపము కావున ప్రకృతిచే కట్టుబడిన మానవుడు కర్మలను చేసి తీరవలయును ప్రకృతియందు ప్రతి అణువు మార్పుచెందుట అను కర్మము చేయుచునే యుండును అందుచే కర్మము చేయుటను వదలివేయుటకు ప్రయత్నించినచో కర్మేంద్రియములను నిగ్రహించి, మనస్సునందు ఇంద్రియ విషయములను స్మరించుచున్న మూఢుడు కపటి అగుచున్నాడు అని 3-6వ శ్లోకములో చెప్పబడింది అందువలన నైష్కర్మసిద్ధిని కోరువారు ఇంద్రియములను మనస్సుతో నిగ్రహించి అనాసక్తుడై కర్మేంద్రియములతో కర్మములను చేయువాడు ఉత్తముడు అని 3-7వ శ్లోకములో చెప్పబడింది

ఇది నిత్యజీవితములో చాల ముఖ్యమైన విషయం ఉద్యోగం చేసేవానికి సెలవులోని ఆనందం తెలుస్తుంది నిరుద్యోగికి సెలవులోని ఆనందం ఏం తెలుస్తుంది? అలాగే కర్మములు చేసినపుడే నిష్కర్మ అర్థమవుతుంది సూక్ష్మంగా పరిశీలిస్తే కర్మలోనే నిష్కర్మ కనబడుతుంది

నిష్కర్మలో కర్మ కనబడుతుంది అనగా మనస్సు నిర్మలంగా ఉండి కర్మలు చేసినచో అది సాధ్యము అనగా కర్మకు మనస్సు బంధీ కానపుడు కర్మములు సవ్యముగా జరుగును ఇదే నైష్కర్మ్యస్థితి మానసిక శిక్షణ ద్వారా పనిని స్వేచ్ఛగా చేయమని స్వామి వివేకానంద అన్నారు

'నైష్కర్మ్యసిద్ధి' అను గ్రంథమందు (1-30) ఇచ్ఛ మానవులకు, పశుపక్ష్యాదులకు కూడ సహజము అని సురేశ్వరాచార్యులు అన్నారు అలా ఇచ్ఛతో చేయు కర్మలు అజ్ఞానమును నివారణ చేయజాలవు అని భావము సమ్యక్ జ్ఞానముతోనే అజ్ఞాన నివారణ జరుగునని అన్నారు వేదాంత వాక్యములతో కలుగు జ్ఞానము సమ్యక్ జ్ఞానము (శ్రేష్ఠమైన జ్ఞానము) సమ్యక్ జ్ఞానము మోహమును నివారించును పైన చెప్పిన గీతార్థమునకు ఇది పర్యాయము 'తత్త్వమసి' వాక్యముతో కలుగునది సమ్యక్ జ్ఞానము అది అవిద్యానాశనమునకు మార్గము ఇదే సురేశ్వరాచార్యులు చెప్పిన నైష్కర్మ్యసిద్ధికి పర్యాయపదమై యున్నది

'తత్త్వమసి' (అది నీవై యున్నావు) అను వేదాంత వాక్యమునకు అర్థవివరణ చేయుటయే 'నైష్కర్మ్యసిద్ధి' గ్రంథపు ముఖ్యవిషయముగా నున్నది ఛాందోగ్య ఉపనిషత్తులోని మహావాక్యము 'తత్త్వమసి' ఇది ఆరవ అధ్యాయంలో తొమ్మిదవ ఖండంలో నాల్గవ శ్లోకం - (6-9-4) ఈ సమస్త ప్రపంచము పరమాత్మచే పరిపూర్ణమై యున్నది ఆ పరమాత్మయే సత్యం అదియే ఆత్మ అదియే నీవై యున్నావు ఈ జగత్తుకు మూలకారణంగా ఏ సూక్ష్మమైన సారము చెప్పబడిందో అదే ఈ సమస్తమైన జగత్తాను ఆ సూక్ష్మమైన సారమే ఆత్మ అదే సత్యం అదే నీవు నీవే అది

జీవులన్నియు ప్రతిరోజు సుషుప్తిని అనుభవిస్తూ ఆ సత్ పదార్థంలో లీనమై పోతున్నాయి - ఏకీభావాన్ని పొందుతూనే ఉన్నాయి అయినప్పటికీ అవి (జీవులు) తాము ఆ చిరంతన (పాతది లేక సనాతనమైనది) సత్యంలో

లీనమైనాము అనే విషయం తెలుసుకోలేకుండా ఉన్నాయి ఆ మూలమైన పరమసత్యం (పరమాత్మ) ఈ జగత్తు అంతటికీ ఆత్మ దానిని ఆత్మగా పొందియుండు స్థితిని (తత్) నీవు (త్వం) అయియున్నావు (అసి) (తత్ + త్వం + అసి)

'నైష్కర్మ్యసిద్ధి' (1-29)లో ఇచ్ఛకు మూలము అజ్ఞానం అని సురేశ్వరాచార్యులు అన్నారు అజ్ఞానం వలననే 'అహం' (సర్వము నేనే), అహం వలననే ఐహిక వ్యామోహం, వ్యామోహం వలన వాంఛలు (కోరికలు) కలుగును ఆ వాంఛల వలన స్వార్థం పెరుగును కాబట్టి దీనికంతటకి మూలం అజ్ఞానం అని తెలుస్తోంది 'తత్త్వమసి' అను వేదాంతవాక్య అంతరార్థము గ్రహించినపుడు సర్వమందు మనలను, మనలో సర్వము చూడగలుగుతాము దీనికి మానసికంగా సాధన కావాలి అపుడు నైష్కర్మ్యసిద్ధి కలుగును నైష్కర్మ్యసిద్ధియే నిష్కామకర్మ స్వార్థవాంఛ లేకుండ కర్మలొనరించినపుడు అది కర్మలు చేయనట్లే యగును అనగా అదియే కర్మములో అకర్మ యగును

ఈ దేహమునకు కారణమైన ప్రారబ్ధ కర్మము భోగముతోనే అనగా అనుభవించుటతోనే పరిహారమగును అని సురేశ్వరాచార్యులు కూడ అంగీకరించారు (నైష్కర్మ్యసిద్ధి 1-12) ఈ విధమైన పరిహారము వాంఛలతో కర్మములు చేయువానికి, జ్ఞానికి కూడ సమముగానే ఉండును అన్నారు (1-45) కర్మములు చిత్తశుద్ధి కలుగచేయుట ద్వారా వైరాగ్యమునకు కారణమగును అన్నారు ప్రారబ్ధకర్మఫలము వలన దుఃఖితుడై పరిహారమునకై పుణ్యకర్మములు (వైదిక, లౌకిక కర్మములు) చేసి చిత్తశుద్ధి పొందును అపుడు వాంఛా వ్యామోహములు నశించును అన్నారు ఈశ్వరార్పణతో కర్మములొనరించినచో (1-47) చిత్తము నిర్మలమగునని తెలుసుకొనును వర్ణాశ్రమ విహితమైన కర్మములు కూడ ఈశ్వరారాధన బుద్ధితో చేయుట ద్వారా చిత్తశుద్ధి కలుగునని గ్రహించవలయును అన్నారు నిష్కామకర్మములే జ్ఞానోత్పత్తికి మార్గములు

అన్నారు (1-48) రజోగుణము మనస్సును కామము (కోరిక)తో నింపును ఎపుడు అంతఃకరణము సర్వకామములు విడుచునో అపుడే ఉత్థానము పొందును (1-30) శ్లోకములో పశుపక్ష్యాదుల నుండి మానవుల దాకా కోరికలు సహజము అని చెప్పి ఇక్కడ సర్వకామములను విడువవలయును అని చెప్తున్నారు అనగా కోరికల వలన కర్మములు జరిగి వాటి ఫలితముగా జననమొంది శరీరము ఏర్పడటం జరుగుతోంది దానికి మార్గాంతరము ఒకటేనని సురేశ్వరాచార్యులు ఇచట అంగీకరించినట్లు అవుతోంది ఆ మార్గమే నిష్కామ కర్మమార్గము కోరికలతో కూడినవాడు కర్మముల కారణముగా సంసారమున తగుల్కొని ఉంటున్నాడు విశుద్ధమైన అంతఃకరణముతో నిత్య, నైమిత్తిక లౌకిక కర్మముల నాచరించువానికి బ్రహ్మలోక (స్వర్గలోక) ఇచ్ఛ కూడ లేకుండును అని సురేశ్వరాచార్యులు ఇక్కడ అన్నారు చిత్తము స్వచ్ఛముగా వున్నను సంసారుల యందు రజస్సు మరియు తమోగుణ మాలిన్యము మనస్సును కలుషితము చేయుచునే యుండును ఇందువలన చిత్తచాంచల్యము ఏర్పడును కామము (కోరిక) అనునది ఒక గాలము అది మనస్సును లాగుచునే యుండును అటుల నిరంతము రజస్తమోగుణ రూపములైన వాంఛలతో పొర్లుతునే ఉంటాము అనువారిని చూచి జాలిపడ వలయునే తప్ప ఏమియు చేయలేము లౌకికముగా ఉన్నతస్థితి కొరకే గదా ఈ వాంఛలు నిరంతరం ఈ వాంఛలతోనే జీవితకాలం గడిపే కంటే కొంతలో కొంత అయినా మనకు ఈ ప్రకృతికి ఉన్న సంబంధం ఏమిటి? అసలు లౌకికంగా లబ్ధి మాత్రమే కాక ఇంకేమైనా ధ్యేయం ఈ జీవితానికి ఉన్నదా? అని ఆలోచించవలసియున్నది స్వర్గవాంఛతో నిత్యనైమిత్తిక కర్మలొనర్చినను అది కూడ కోరికతో చేయబడిన కర్మమే కాన అనిత్యమే యగును అన్నారు కర్మఫలము పూర్తి అయిన వెంటనే పునర్జన్మ పొందును అని చెప్పబడింది గదా! అసలు స్వర్గసుఖము, నరకబాధ అనునవి వేరే ఎక్కడో లేవు ఇక్కడే ఈ జీవితములోనే కర్మఫలరూపమున జరుగును అనునది వాస్తవము కారణ

శరీరము ద్వారా పునర్జన్మ పొందువరకు జీవుడు పొందు అనుభవమును స్వర్గము లేక నరకము అని కూడ చెప్పవచ్చును కాని పునర్జన్మ పొందు వరకు కర్మఫలములు అనుభవములోనికి రావు అనియు, వర్తమాన శరీరమును వదలిన వెంటనే కారణ శరీరము నూతన స్థూల శరీరమును వెతకి పట్టుకొనును అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి గదా! అది అంతయు ఇంతకు ముందు అధ్యాయములో చర్చించబడినది ప్రస్తుతాంశము నిష్కామకర్మ సాధ్యమా? కాదా? అవసరమా? కాదా? అను సంశయము కొంతమంది సురేశ్వరాచార్యుల నైష్కర్మ్యసిద్ధిలోని కొన్ని శ్లోకములు ఉదహరించి నిష్కామకర్మ ఆదర్శప్రాయమే కాని ఆచణ సాధ్యము కాదు అని చేయు వాదన విషయములో ప్రసంగవశమున సురేశ్వరాచార్యులు నిష్కామకర్మ ఆచరణ సాధ్యముకాదు అని చెప్పలేదు అని చూపుటకు ఆయన నైష్కర్మ్యసిద్ధిలోని కొన్ని శ్లోకములు ఇచట చర్చించటం జరిగింది (1-48) శ్లోకములో రజస్సు, తమస్సుల నుండి చిత్తము విడుదల పొంది రాగద్వేషములకు అతీతముగా కర్మములను నిర్వర్తించవలయునని చెప్పారు హృదయమును ఆశ్రయించియున్న సర్వకామములను ఎపుడు (మనసును) విడిచిపెట్టునో అపుడు మానవునకు బ్రహ్మభావము కలుగును అన్నారు కామములను విడిచిపెట్టుట అనగా కర్మములను విసర్జించుట అని కాదు కామముతో ఫలాపేక్ష లేకుండ కర్మములను ఆచరించవలయునని భావము అదియే గదా నిష్కామకర్మ

కామ్యకర్మలు అనగా కోరికలతో కూడిన కర్మలు ఇవి అనంతంగా ఉంటాయి అనంతమగు కోరికలను వాటి వలన జరుగు కర్మములను నిరోధించుట సాధ్యమగునా? అది ఒకసారిగ సాధ్యము కాదు అంతే కాని అసాధ్యము కాదు కామము (కోరిక) లేనిది కార్యము లేదు కాని కర్మమును సవ్యముగా ఒక ధ్యేయము కొరకు పూర్తి చేయవలయుననియే కోరిక ఉండవలయును

సంచితకర్మములలో ప్రారబ్ధకర్మము అనుభవించుటతో పోవును ప్రారంభము కాని కర్మములు అనగా గత కర్మలలో ప్రారబ్ధములు కానివి ప్రాయశ్చిత్తముతో నశించును. (నైష్కర్మ్యసిద్ధి 1-81) కాని కర్మములు అనుభవించుట ద్వారా నశించినను వాటి వాసనలు విత్తనముల వలె మిగిలియుండును అవి మళ్లీ మొలకెత్తుటకు అవకాశమున్నది ఇక ప్రాయశ్చిత్త కర్మముతో సంచిత కర్మములు సమసిపోవునని తలచినను ఆ ప్రాయశ్చిత్త కర్మలు గూడ కర్మలే అగుట వలన అజ్ఞానముచే 'నేను చేయుచున్నాను' అను కర్తృత్వ భావముతో వ్యవహరించెదము అపుడు ఆ సంచిత కర్మములు పూర్తిగా నివృత్తి కాజాలవు దీనికి మార్గాంతరము కర్తృత్వ భావము వదులుకొను జ్ఞానము పొందుటయే

వాస్తవమునకు ప్రారబ్ధముకాని సంచితకర్మలను పోగొట్టుకొనుటకు సాధ్యము కాదు ఎంత నిపుణుడైన వైద్యుడైనను రోగలక్షణములు కనబడకయున్నచో చికిత్స చేయజాలడు ప్రారంభమైన అనగా ప్రారబ్ధ కర్మములకు నివృత్తి లేదు అవి జరిగిపోయిన కర్మల ఫలితములు అవి అనుభవించుట ద్వారా మాత్రమే సమసిపోవును కాని సంచితకర్మలు ఎన్ని జన్మలలో ప్రారబ్ధ కర్మములుగా మారి సమసిపోవునో చెప్పుట సాధ్యము కాదు

నిత్యనైమిత్తిక కర్మములు మోక్షమును అనగా బ్రహ్మభావమునిచ్చునవి కాదు (నైష్కర్మ్యసిద్ధి 1-27) ఒక్కొక్క కర్మకు అనేక జన్మఘులనిచ్చు సామర్థ్యమున్నదని స్మృతులు చెప్పుచున్నవి కామ్యకర్మముల ద్వారా కామ్యకర్మములు అధికమగునే కాని నాశనము కాజాలవు నిత్యకర్మములకు ఫలము లేనందున (నైష్కర్మ్యసిద్ధి 1-84) అవి కామ్యకర్మములను నాశనము చేయలేవు కామ్య కర్మములతో గత కామ్యకర్మములు నాశనము చెందవు మరి ఇక గత్యంతరం ఏమిటి?

నిష్కామకర్మను అదర్శప్రాయమని మాత్రమే అని తలచక ఆచరణలో

సాధ్యమగు అనుష్ఠాన మార్గమును (Practical Way) గుర్తించుటయే గత్యంతరమగును నిష్కామకర్మ అంతరార్థమును (concept) గుర్తించ గల్గినపుడు ఇది అసాధ్యము కాదు కర్మమునందు స్వార్థముతో కూడిన బంధము లేకుండ కర్మమును చిత్తశుద్ధితో చేయుటయే నిష్కామకర్మ యని భగవద్గీత చెప్పింది ఒక వ్యక్తి తన కొరకు గాని, తన కుటుంబము కొరకు గాని, సమాజము కొరకు గాని ఒక కర్మము (పని) చేయునపుడు "తాను కాబట్టి చేస్తున్నాను లేక చేయగలుగుతున్నాను" అను 'అహం' (ego) తో ఆ కర్మఫలమును నిరంతరం మనసునందుంచుకొని చేయటం స్వార్థచింతన అగును కీర్తిని ఆశించి చేసినను అది కోరికే అగును అపుడది కీర్తి కండూతి అనబడు స్వార్థచింతన అగును నిష్కామకర్మ అనగా ఫలమును గూర్చిన స్వార్థచింతన లేకుండుట అని అంతరార్థము స్వార్థచింతన లేని వానికి ఫలమును గూర్చిన తపన యుండదు కార్యమును సవ్యముగా సంపూర్ణముగా నిర్వర్తించవలెను అను ధ్యేయముతోనే ఆ పనిని చేయును ఉద్దేశము, లేక ఆశయము (purpose or motive) అనునది కోరిక కాదు ఎందుకనగా కోరికలో ఎల్లపుడూ అంతర్లీనంగా స్వార్థచింతన యుండును

ఉదాహరణకు ఒక న్యాయవాది తనను ఆశ్రయించినవాని (client) (వ్యాజ్యదారుడు) వ్యాజ్యమును (case) గెలుచుటకే వాదించును వాదించ వలయును గూడ ఇచట న్యాయవాదిది కోరిక లేక కామము కాదు ఎందుకనగా న్యాయస్థానములో వాదించుట అతని వృత్తి అది అతని కర్తవ్యము (duty) ఆ కర్తవ్యమును చిత్తశుద్ధితో నిర్వర్తించటమే అతని బాధ్యత అది నిష్కామకర్మమే యగును తాను చేసిన పనికి వేతనము (fees) తీసుకొనుట కూడ తప్పుకాదు అది అతని జీవనాధారము గదా! అట్లుగాక చిత్తశుద్ధి లేక ధనము కొరకే తన వృత్తియని భావించి తన వ్యాజ్యదారుని పీడించటం దురుద్దేశమే యగును కాని నిష్కామకర్మ కాదు ఎచట దురుద్దేశముండునో అచట స్వార్థచింతన పొంగిపొరలుచుండును అటులే ఒక

వైద్యుడు తన వద్దకు వచ్చిన రోగికి ఉపశమనము (relief) ఇచ్చుటకే ప్రయత్నించును అది అతని వృత్తి దానికి డబ్బు తీసుకొనుటలో తప్పులేదు అది జీవానాధారం కూడా గదా! తనకు రావలసిన డబ్బునే మనస్సు నందుంచుకుని వైద్యవృత్తి చేసినచో అది నిష్కామకర్మ కాదు డబ్బు కొరకే ఈ వృత్తి అను భావము రానంతవరకు అది నిష్కామకర్మయే యగును రోగికి ఉపశమనం కొరకు ప్రయత్నించటం కోరిక కాదు అది వృత్తి ఆశయము బాధ్యత

**6) షడ్దర్శనములలో కర్మసిద్ధాంతము**

దర్శనము అంటే శాస్త్రము ఒక ఆలోచనాపద్ధతి తర్క హేతుబద్ధమైన సిద్ధాంతాలనన్నిటిని కూడ దర్శనాలనే అంటారు సంస్కృతధాతుశబ్దము 'దృశ్' అంటే చూచు అని అర్థము అనగా బ్రహ్మభావమును లేక ఆత్మస్థితిని దర్శింపచేయు శాస్త్రములు దర్శనము లనబడును మన విజ్ఞానము, బుద్ధి విశ్వాత్మవైపు మరలితే వివేకము కలిగి పరమసత్యదర్శనమవుతుంది కాని మన బుద్ధి తార్కికముగా బహువిషయక విస్తారంగా వృద్ధి చెందినప్పటికి, మూలసత్యమునకు దూరమై అసంపూర్ణ స్థితిలోనే మిగులుతుంది ఆ రకమైన బుద్ధియే మనకు ఆధారమైనపుడు మనము బాహ్యవిషయదర్శనముతోనే జీవితము వృధా చేసుకుంటున్నాము మనకు కావలసినది ఆ బుద్ధి కాదు వలసినది సంపూర్ణము, అభిన్నమును అయిన విజ్ఞానము అది సత్యమైనది అది బ్రహ్మజ్ఞాన సంపత్తికి మార్గం చూపుతుంది ఆ మార్గాన్వేషణలో రూపొందిన శాస్త్రములనే షడ్దర్శనములన్నారు ఇవి ఆరు కాని పరస్పర సంబంధ సామీప్యముల వలన ఇవి మూడు జంటలుగా ప్రసిద్ధి పొందినవి ఇవి న్యాయవైశేషికములు, సాంఖ్యయోగములు, పూర్వ, ఉత్తరమీమాంసలు ఎవరి పేరనైతే ఈ దర్శనములు ప్రసిద్ధిపొందినవో వాస్తవమునకు వారు వాటి మూలప్రవక్తలు కారు ఎంతోకాలము నుండి వారికి పూర్వమే ఉన్న ఈ దర్శనములకు వారు ఒక అనుక్రమణికగా సూత్రరూపమునిచ్చారు అందుచే

వారి పేరనే అవి స్థిరపడినవి న్యాయదర్శనమునకు గౌతముడు వైశేషికమునకు కణాదుడు, సాంఖ్యదర్శనమునకు కపిలుడు, యోగశాస్త్రమునకు పతంజలి పూర్వ మీమాంసకు జైమిని, ఉత్తరమీమాంస అనగా ఉపనిషత్తుల సారమైన బ్రహ్మసూత్రములకు వ్యాసుడు (బాదరాయణుడు) సూత్రకర్తలు ఉత్తర మీమాంసనే వేదాంతము అని కూడ అంటారు ఈ షడ్దర్శనములు శృతులను అనగా వేదములను అంగీకరించినవే ఈ షడ్దర్శనముల పూర్వాపరములు, సిద్ధాంతపరంగా వాటి పరస్పర భిన్నత్వము ఇచట చర్చనీయాంశము కాదు కర్మసిద్ధాంతమునకు సంబంధించినంత వరకు వాటి దృక్పధము మాత్రమే ఇచట చర్చించబడినది

## 1 న్యాయ, వైశేషికములు

న్యాయసిద్ధాంతమును అనుసరించువారు నైయాయికులు, వైశేషిక సిద్ధాంతవాదులు వైశేషికులు న్యాయ వైశేషికులు కర్మరూపమును 'అదృష్టము' అన్నారు అంతేకాక దానిని 'చలనము' అని కూడ అన్నారు హిందూమతము నందలి ఇతర శాఖలవలెనే న్యాయ దర్శనము (లేక) మతము కూడ కర్మసిద్ధాంతమును అంగీకరించినది మనము చేసిన కర్మల ఫలితములను తప్పక అనుభవించవలయునని న్యాయమతము విశ్వసించును కొన్ని కర్మలు వెంటనే ఫలితమునిచ్చును వంటచేయుట అటువంటి కర్మయే యగును వ్యవసాయము మొదలగు కర్మల ఫలితములు ఆలస్యముగా వచ్చును కర్మకాండల (వైదిక కర్మలు) ద్వారా వాంఛించు స్వర్గప్రాప్తి మరణానంతరము గాని లభించదు ధ్యానదైవకర్మఫలితములు కూడ ఆలస్యమేయగును అన్నారు కర్మపరిపక్వమగుటకు కలుగు ఆటంకముల వలన కర్మఫలము ఆలస్య మగునని, కర్మములు ఫలించుటకు అనుకూల పరిస్థితులు లేకుండుట చేతనో, లేక ఒక వ్యక్తి యొక్క కర్మతో సమానమగు కర్మగల ఇతరుల కర్మవాసనలు ఆటంకము కలుగజేయుటవలననో కర్మఫలములు ఆలస్య మగును అని కొందరు న్యాయసూత్ర భాష్యకారులు అభిప్రాయపడ్డారు కాని

ఫలములు వచ్చు లోపల కారణమైన కర్మలు నశింపవు అన్నారు కర్మములు జరిగిన తరువాత ఫలము సిద్ధించువరకు గల స్థితిని మధ్యమదశ అన్నారు దీనినే 'అదృష్టము' అన్నారు ఫలములనిచ్చుటకు పూర్వముండు వృక్షముల స్థితిని దీనికి ఉదాహరణగా చెప్తున్నారు ఇది కూడ కర్మరూపమే అన్నారు పూర్వకృతకర్మలననుసరించియే ఆత్మలు దేహము పొందును అని న్యాయసిద్ధాంతము దేహము వలననే ఆత్మకు నామము ఏర్పడును ఆత్మ మనుష్యుడు కాదు న్యాయవైశేషికములు సూక్ష్మదేహమున్నదని విశ్వసింపవు అణురూపము, అతీంద్రియమును అగు మనస్సు సహాయమున ఆత్మ దేహాంతరప్రాప్తి పొందును ఆత్మలకు అనంతమైన వ్యాప్తి ఉన్నది కావున మనస్సే జన్మాంతరములను పొంది వివిధ దేహములలో ప్రవేశించుచుండును అన్నారు

ప్రకృతి పురుషుల సముచ్చయము (కలయిక) ఈ జగత్తు అందుకే జగత్తు యదార్థము అన్నారు ఆత్మనే పురుషుడు అన్నారు ప్రకృతి ఆ పురుషకల్పితము కాదు అని న్యాయసిద్ధాంతము ఆత్మలకు అనుభవ యోగ్యముగా నుండునట్లు దేవుడే ప్రకృతి రూపమును సృష్టించాడు అన్నారు ఆత్మలకు ప్రకృతికి సామరస్యమున్నది దానికి కారణం దైవ సంకల్పమే అని భావించారు కాని న్యాయసూత్రములందు భగవంతుని గురించి కాకతాళీయంగా మాత్రమే పేర్కొనబడింది అందువలన ప్రాచీన న్యాయసిద్ధాంతము ఆస్తికము కాదు అనుటకు అవకాశము ఏర్పడినది అనంతర కాలమున నైయాయికులును, వైశేషికులును బహిరంగముగా ఆస్తిక్యమును ప్రకటించారు ఆత్మను గూర్చి వివరణ యిచ్చు సందర్భమున భగవంతుని గూర్చి చర్చించారు ఆత్మలు రెండు విధములు అన్నారు ఒకటి మనిషి సంబంధమైన ఆత్మ, రెండవది దైవసంబంధమైన ఆత్మ ఈ దైవాత్మ లేక పరమాత్మ ఒకటి మాత్రమే అది సర్వద్రష్ట మానుష ఆత్మలు అనంతములు భిన్నదేహములకు భిన్నములైన ఆత్మలున్నవి దేవుని విశిష్టమైన ఆత్మ అన్నారు సర్వశక్తి, సర్వజ్ఞత్వము అతని

లక్షణములు అందువలననే అతగు లోకమును క్రమరీతిని నడుపుచున్నాడు న్యాయవైశేషిక దర్శనమూలకర్తలగు గౌతమ, కణాదులు, మానుష దైవాత్మలను ఒకే వర్గమున చేర్చిరనుట సమంజసము గాలేదు అని సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు న్యాయదర్శనమందు వ్యావహారిక విషయములకు తర్కమునకు ప్రాధాన్యము నిచ్చుట వలన, దేవుని గూర్చి తగినంత శ్రద్ధ చూపలేదు అని కూడ సర్వేపల్లి రాధాకృష్ణ అభిప్రాయపడ్డారు

న్యాయసిద్ధాంతము ప్రకారం ప్రతి కార్యమునకు ఒక కారణముండును అందువలననే మన సుఖదుఃఖములకు ఒక కారణమేర్పడుచున్నది ప్రతి కారణము అంతకు పూర్వకారణమునకు కార్యరూపమే యగును అటులే ప్రతి కార్యము తరువాత జరుగు కార్యమునకు కారణమగును ఇది ఒక పరంపర దీనికి ఆరంభము లేదు అన్నారు నైయాయికులు అందువలననే మన సుఖదుఃఖములకు ఆరంభము తెలిసికొనుట సాధ్యపడదు కార్యములు భిన్నముగా నుండుటచే కారణములు కూడ భిన్నములే అయినవి మనము అనుభవించు భిన్నఫలములకు ఒకే కారణము అని చెప్పుట కుదరదు ఆ కారణము దేవుడని కాని, ప్రకృతి అని గాని చెప్పుటకు వీలుపడదు కర్మలు సంస్కారరూపమున మిగిలి కర్మఫలములనిచ్చుటకు శక్తి కలిగియుండును సత్కర్మ సంస్కారము పుణ్యము దుష్కర్మ సంస్కారము పాపము ఈ రెండింటి కలయికే 'అదృష్టము' అని న్యాయసిద్ధాంతము ఇది ఆ కర్మలకు కర్త అయిన వాని ఆత్మయందు నిల్వయుండును ఆ కర్తకు సుఖదుఃఖముల నిచ్చు వస్తువులందు ఆ అదృష్టము ఉండదు అన్నారు అనువైన దేశము, కాలము, వస్తువు కలిగినపుడు ఈ అదృష్టము కర్మఫలమును ఇచ్చును భిన్న ఆత్మలకు భిన్నములైన ఫలానుభవములో కలుగు భేదములకు అదృష్టభేదమే కారణము అన్నారు 'అదృష్టము' అతీంద్రియ శక్తియనియు, అందుచేతనే పుణ్యపాపములు అవిచ్ఛిన్నములుగా (నిరాటంకముగా) ఉన్నవి అని న్యాయతర్కము

అణువునందు సహజక్రియాశక్తి యుండును ఆత్మయందు అదృష్టముండును (సంస్కారరూపమున నున్న కర్మలు) ఈ రెండింటి వలననే విశ్వసృష్టి జరిగినది అని ప్రాచీన నైయాయికుల మతము ఇచట దేవుని ప్రసక్తి రాలేదు కాని ఉదయునుడు మొదలగు అనంతర కాలనైయాయికులు 'అదృష్టము' జడము (అచేతనము), అది శక్తియైనను కార్యములకు కారణము కాజాలదు అన్నారు 'అదృష్టము'ను సక్రమముగా నడుపుటకు ఈశ్వరు డొకడున్నాడు అని వాదించారు జగత్తు అణువుల వలనను, కర్మశక్తి వలనను ఉత్పత్తి జరిగినది అను సిద్ధాంతమును వీరు తిరస్కరించారు సహజముగా అణువులు క్రియ జరుపుటకు సమర్ధవంతములైనచో, ఆ సామర్థ్యము నిరంతరము ఉండవలయును గదా! ఒకవేళ అణువుల శక్తికి కాలము కారణము అనినచో, ఆ కాలము నిరంతరము క్రియాత్మకమైనను లేక నిష్క్రియాత్మకమైనను కావలయును ఒక శక్తి అచేతనమై ప్రవృత్తి (స్వభావము) కలిగియున్నదనినచో, ఆ ప్రవృత్తికి చేతనుడైన మరొక వ్యక్తి కారణమై యుండవలయును అదృష్టముపై జీవాత్మకు అధికారముండుటకు వీలుపడదు ఎందుకనగా అట్టి అధికారమే యుండినచో వాంఛితము కాని దుఃఖములను అది వారించి యుండగలిగెడిది కదా! అందుచే అనంతరకాల నైయాయికులలో ప్రముఖుడు ఉదయనుడు అచేతనమగు 'అదృష్టము' దేవుని ఆదేశము ననుసరించి ప్రవర్తించును అన్నాడు కాని దేవుడు అదృష్టమును సృష్టించడు దాని గమనమును మార్పుచేయడు కాని 'అదృష్టము' యొక్క కార్యము క్రమముగా జరుగునట్లు పర్యవేక్షించుచుండును కర్మఫలము ఆ కర్మకు కర్తయైనవానికి అందునట్లు చేయును అందుచే దేవుడు కర్మఫలమునిచ్చువాడు అన్నారు

జగత్తు విభిన్నములైన అంశములతో కల్పించబడినది అందువలన దానికి ఒక ఉత్పత్తియున్నది అపుడు దానికొక కర్త యుండవలసిన అవసరమున్నది అట్టి జగత్కర్తయే ఈశ్వరుడు అతనికి ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి,

క్రియాశక్తి అను మూడు శక్తులూ ఉన్నవి ఈ శక్తులతో జగత్తు నందు సర్వకారణములను చలింపజేసి నడిపించును కాని తాను మాత్రము దేనివలనను చలింపడు ఆ శక్తి వలన సృష్టి ప్రారంభమున అణుసంయోగముతో ద్రవ్యములు (పదార్థములు) ఏర్పడును ఈ శక్తికి ఈశ్వరుడు కర్త ఈ సృష్టి అంతటికి అతని సంకల్పశక్తియే ఆధారము ఈశ్వరుడు ప్రపంచమును సృష్టించి, లయముచేసి, తిరిగి సృజించును ఈశ్వరుని అస్తిత్వము ప్రత్యక్ష విషయము కాదు అందువలన అది సహేతుకము కాదు అనుట సమంజసము కాదు అన్నాడు ఉదయనుడు ఒక వస్తువు ఒకప్పుడు కనబడి ఇపుడు కనబడకపోయినచో అది లేదు అని చెప్పవచ్చును ఇంద్రియాతీత విషయముల గురించి అట్లు చెప్పుటకు వీలుపడదు దైవాస్తిత్వము ప్రత్యక్ష నిదర్శనములతో నిరూపించ జాలము

నైయాయికులకు ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు అతడు అనంతశక్తి సంపన్నుడు ఆ శక్తితో జీవుల పూర్వ కర్మ ఫలములననుసరించి సృష్టి చేయును అన్నారు దేవునికి కామము (కోరికలు) లున్నవి అన్నారు నైయాయికులు కాని ఆ కామము స్వార్థ ప్రయోజనము కొరకు కాదు అతడు స్వార్థ ప్రయోజనమునకు సృష్టి చేయలేదు మరి సృష్టి ఎందుకు చేసినట్లు? జీవుల యందలి ప్రేమచే చేసెనా! అది కూడ సరైన సమాధానము కాదు ఎందుకనగా అటులైనచో లోకమందు దుఃఖముండకూడదు కావున లోకము సృజించవలెనను ఇచ్ఛ కేవలము కరుణ వలన ఏర్పడిన స్పందన మాత్రమేయని నైయాయికుల వాదము సృష్టి చేయవలెనను భావము ఆనందదాయకమే కాని సృష్టించబడిన జీవుల స్వభావము అందుకు భిన్నముగా నున్నది సృజింపబడవలసిన మానవుల కర్మ పరిపక్వము కాలభేదమును కలిగియున్నది కర్మఫలములు భిన్నముగానున్నవి ఇందువలన దేవునికి స్వాతంత్ర్యము లేదనియా? కాదు అంటారు నైయాయికులు దేవుఁడు తానే కల్పించుకొనిన కారణముల వలన స్వాతంత్ర్యము లేనట్లు కనబడును అన్నారు మానవులకు

సుఖము చేకూర్చుట దేవుని లక్ష్యము కాదు అన్నారు మానవులకు పరమార్థమును చేకూర్చుటయే సృష్టి లక్ష్యము అని నైయాయికుల సిద్ధాంతము

హేతువునకు అందని ప్రతిదానిని నైయాయికులు 'అదృష్టము' అన్నారని సర్వేపల్లి రాధాకృష్ణ వ్యాఖ్యానించారు సృష్టి ప్రారంభమున కలిగిన అణు సంచలనము, అగ్ని ఊర్ధ్వముఖముగ వ్యాపించుట, అయస్కాంత ఆకర్షణ శక్తి - ఇవి అన్నియు అదృష్టకార్యములే యన్నారు అదృష్టమనునది హేతువునకు ఒక పరిమితిని విధించును అదృష్టమునకు ఒక సారధి కావలయునని గ్రహించిరి అతడే ఈశ్వరుడు అన్నారు జీవులు తమ క్రియాశక్తిని ప్రళయ కాలమున కోల్పోవుదురు తిరిగి పునస్సృష్టి సమయమున తమ క్రియాశక్తి పొందుదురు అన్నారు దానికి కారణము ఈశ్వరుడే అని కూడ అన్నారు ఉదయనుడు మొదలైన నైయాయికులు కారణధర్మమునకు ఎక్కువ ప్రాధాన్యము ఇచ్చారు సర్వకార్యములకు ప్రధానమైన కారణముండునా అనునది ప్రశ్న నైయాయికుల కారణవాదము వ్యాప్తి చెందలేదు జగత్తునందు వస్తు పరిణామములు జరుగును ఈ పరిణామములను చూచి కారణధర్మము ఊహింపబడినది ఊహింపబడిన యీ కారణధర్మము జగత్తు (సృష్టి)నకు కల్పించుటకు వీలుపడదు ఈ జగత్తునకు కారణమును ఊహించుటకు మానవుని శక్తి చాలదు కార్యము, కారణములకు మూలకారణము వెదకుచూ పోయినచో అది శుష్కవాదమే యగును నైయాయికులు ప్రపంచమును ఒక కార్యము అన్నారు దానికి ఎట్టి ప్రమాణములు లేకుండగనే అంగీకరించారు శాశ్వతమైనవి, ఉత్పత్తి లేనివి పదార్థములెన్నో ఉన్నవని నైయాయికులు అన్నారు ఈ బ్రహ్మాండము కూడ అట్టిదే అని వారి అభిప్రాయము కార్యకారణ పరంపరకు ఇతరమైన ఒక కారణమును న్యాయసిద్ధాంతము కల్పించినది ఆ కారణమునకు కారణము లేదని న్యాయవాదన

ఈ జగత్తు తనకు తానే ఆధారమా, లేక వేరొక కారణమునకు

కార్యరూపమా అను ప్రశ్నకు సమాధానము మనకు దొరకదు జగత్తు ఏర్పడుటకు ఒక కారణము మనము అంగీకరించినను దానికి మరొక కారణము ఊహించవలసి యుండును ఈ కారణాన్వేషణము చివరకు మన మతి పోగొట్టును అందుకేనేమో శంకర భగవత్పాదులు ఈ కారణాన్వేషణను నిరసించి, ఈ ప్రపంచము ఉన్నది ఉన్నట్లుగా మనకు కనబడుచున్నదని ధైర్యముగా చెప్పవచ్చునని అన్నారు శంకరుల మాయా (మిథ్యా) వాదము కూడ దీనినే అంగీకరించును మనము మాయ అను భ్రమలో నున్నంతవరకు ఈ ప్రపంచము ఉన్నట్లుగానే గోచరించునని భావము దేవుడున్నాడని భావించిన వానిని సృష్టించినదెవరు? దేవుడు స్వయంభువుడని చెప్పటం సులభమే అటులే ఈ ప్రపంచము కూడ స్వయంగానే పుట్టినదని చెప్పటం కూడ సులభమే అగును ఇది ఒక తాత్త్విక సమస్య వాస్తవమునకు దీనికి సమాధానం లేదు నైయాయికులు ఈ సమస్యను మరింత క్లిష్టం చేశారు దేవునికి దేహమున్నదా అను ప్రశ్నను ఉత్పన్నం చేశారు అదృష్టము అన్ని దేహములను నిర్మించునని న్యాయసిద్ధాంతము గదా! కాబట్టి దేవుని దేహము కూడ అదృష్టనిర్మితమే యగును ఇది సహజము కాదు గదా! సృష్టించబడిన దేహము కలవారికి అణువులపైనను, పాపపుణ్యములపైనను అధికారముండదు దేవుడు శాశ్వతమైనవాడు మరి అతని దేహమెట్లుండును? శాశ్వతమైన దేహము రూపురేఖలు మనం ఊహించలేము నైయాయికులకు కూడ దీనిపై స్పష్టత ఉన్నట్లు కనబడదు దేవుని గురించి రకరకాలుగా చెప్పారు దేవుడు దేహము లేకుండ సృజించునని, దేవుని శరీరము మానవుల అదృష్టఫలితముగా ఏర్పడునని, అణువులే దేవుని శరీరమని, ఆకాశమే అతని శరీరమని - ఇలా రకరకాల భావాలు ప్రకటించారు

'అదృష్టమే' శరీరమును ఏర్పరచి దానికి ఆత్మతో సంబంధము కలిగించును అన్నారు తల్లి గర్భము నుండి జననము పొందుటకు తలిదండ్రుల అదృష్టము, జన్మ పొందువాని అదృష్టము సంయుక్తముగా కారణములగునని

అన్నారు ఈ ప్రపంచమందలి అసమానతలకు కూడ అదృష్టమే కారణమని భావించారు అదృష్టం పరిసమాప్తి అయినపుడు ఆత్మదేహము నుండి విడివడును అన్నారు దేవుడున్నాడని చూపబడిన హేతువులను (కారణములను) అంగీకరించినను, మనము దేవుని నిరూపించగల పరిపూర్ణత గలవారం కాదు గదా! 'సర్వ ఆత్మ స్వరూపి' పరమేశ్వరుడు అన్నాము, ఆ పరమేశ్వరుని రూపములే మనమంతా అని విశ్వసించబడుచున్నది గదా! కాని నైయాయికులు నిరూపించిన పరమేశ్వరుడు మనము విశ్వసించుచున్న సర్వాత్మ స్వరూపియైన పరమాత్మ కాదు నైయాయికులు చెప్పిన ఈశ్వరుడు మనయందు ఉండడు అతడు లోకమునకు బయటనేయుండును అతడు సృష్టించును, పోషించును, లయము చేయును అంతవరకు బాగానేయున్నది కట్టెలను (కర్రలను) ఒక మోపుగా త్రాడుతో కట్టినపుడు మనము బయటనే ఉంటాము కర్రలకు మనకు ఏమి సంబంధము లేదు అటులే న్యాయసిద్ధాంతమునను సరించి ఈశ్వరుడు బయట నుండి ఈ లోకమునను న్న వస్తుసమూహమును ఒకచో బంధించినట్లుగుచున్నది అణువులను ఈశ్వరుడు సృష్టించలేదు కాని వాటికి రూపం ఇచ్చాడు అన్నారు జగత్తు భూతములను (Elements) కల్పించును ఆ భూతములను బయట నుండి గ్రహించి సృష్టియను కార్యము చేయును అన్నారు అనగా జగత్తునందు ఆంతరికముగా నుండు అనంతశక్తి స్వరూపుడు కాదు ఈశ్వరుడు అని భావము కలుగుచున్నది ఈ ప్రపంచము నుండి వేరుగా ఏకాంతముగా ఈశ్వరుడున్నాడనుట శుష్క ప్రసంగమేయగును అనగా అనంతుడైన ఈశ్వరుడు ఒక వైపు, అనంతమైన జగత్తు మరొక వైపు విడిగా ఉన్నట్లు అగుచున్నది ఇది సమర్థనీయము కాదు రెండు వస్తువులు వేరుగా నున్నపుడు అవి అపరిమితములనుటకు (అనంతములు) వీలుపడదు జీవులందరు ఎపుడో ఒకపుడు అంతమొందుదురు అపుడు సృష్టి అదృశ్యమగును ఈశ్వరుని ఆధిపత్యము అంతమగును అంతమగుదానికి ఆది కూడ ఉండాలి కావున ఈశ్వరుడు, జగత్తు రెండును శూన్యము నుండి వచ్చి శూన్యములోనికి

పోవలసివచ్చును

లోకమును ఈశ్వరుడు ప్రేమ (లేక) కరుణ వలన కలిగిన స్పందనతో సృష్టించెను అన్నారు కాని అపుడు యీ సృష్టికి అర్థమేమగును జీవులు, అణువులు రెండును నిత్యములగును ప్రపంచము వాటి పరస్పర సంయోగరూపమగును అపుడు ఈశ్వరునకు సృష్టించవలసినది ఏమి యుండును? దీనికి రెండు సమాధానములుండును ఒకటి ఈశ్వరుడు లేడని చెప్పవలయును లేదా అణువులు, జీవులు అచేతనములు కావు, అవి ఈశ్వరుని యొక్క నిత్యమైన కారణధర్మము యొక్క భిన్నరూపములని చెప్పవలసియుండును వస్తు స్వరూపమే ఈశ్వర శరీరమను అర్థము న్యాయధర్మములో సూచింపబడినది దీనినే రామానుజుడు తన విశిష్టాద్వైత తత్త్వమందు పొందుపరచి నిరూపించాడు అని అన్నారు సర్వేపల్లి రాధాకృష్ణ

ఈశ్వరుని గూర్చి స్పష్టమైన భావము లేకపోవుటయే న్యాయదర్శనము నందు ప్రధాన సమస్య ఈశ్వరుడు సర్వజ్ఞుడు అన్నారు కాని ఈశ్వరుడు జగత్తునందు అంతర్వర్తి (లోపల నుండువాడు) అని చెప్పలేదు ఈశ్వరభక్తిని గురించి చెప్పారు, కాని భక్తిప్రధానములైన ఈశ్వర సాయుజ్యముగాని, సారూప్యముగాని చెప్పలేదు ఎందుకనగా ఈశ్వరుడు జగత్తునకు బయట నున్నాడు అన్నారు వేదాంతము, యోగశాస్త్రము ఈశ్వరుని గూర్చి ఉపాసన బోధించాయి ఉపాసన ద్వారా ఈశ్వరసిద్ధి లభిస్తుంది కాని ఉపాసనకు ఈశ్వరుని గూర్చి ఒక స్థిరమైన భావం అవసరం

ఈశ్వరుని గూర్చి స్థిరమైన భావన లేకపోయినను న్యాయదర్శనమందు విమర్శాపూర్వకమైన సత్యాన్వేషణ విధానము కనబడును ఈ సత్యాన్వేషణ తమదైన పద్ధతిలో అన్ని దర్శనములందు కనబడును తాత్త్విక సమస్యా పరిష్కారమునకు పరిశీలనతో కూడిన వ్యవహారికానుభవము సరియైనది అను విశ్వాసము న్యాయదర్శనములోని బలమైన అంశము కాని ఆ అంశము

వలననే ఈశ్వరుని గూర్చి స్థిరమైన భావం లేకపోవుట దాని బలహీనత కూడ అయినది

**వైశేషికులు** కూడ 'అదృష్ట' సిద్ధాంతమును అంగీకరించారు 'అదృష్టము' అను అదృశ్యశక్తి అణువుల సంయోగము కలుగజేసి జీవపరిణామమునకు (evolution) తోడ్పడును అన్నారు శరీరము ఆత్మల కలయిక ద్వారా అదృష్టము జనన మరణములను కలుగజేయును అని వైశేషిక సిద్ధాంతము అదృష్టము లేకుండుటయే విముక్తి అన్నారు అదృష్టము లేనపుడు శరీరము, ఆత్మల సంయోగముండదు అదే జనన మరణముల నుండి విముక్తియగును రాగద్వేషములకు అదృష్టమే మూలము అని వైశేషిక సూత్రము న్యాయ వైశేషికముల ననుసరించి అదృష్టము ఒక ఉపకరణము (instrument) కాని అది ప్రకృతి వలెనే ఆలోచనాశక్తి లేనిది అన్నారు 'అదృష్టము' తాను స్వయముగా కర్మపరిపక్వమును కలుగజేయలేదు కర్మఫలమే అదృష్టముగా చెప్పారు అందువలన కర్మ పరిపక్వమగుటకు ఒక కారకుని అవసరమున్నది దేవుడే ఆ కారకుడు అన్నారు దేవుడే అదృష్టము పని చేయునట్లు చేసి కర్మఫలము అందునట్లు చేయును అని వైశేషికము కూడ చెప్పుచున్నది బ్రహ్మసూత్రములలో 3-2-38, 39, 41లలో ఇదే చెప్పబడింది మీమాంసకారుల 'అపూర్వ' న్యాయవైశేషికుల 'అదృష్టం' వంటిదే సూత్రభాష్యములో శంకరులు 'అపూర్వ' అచేతనమైనది కాన ఈశ్వరుని చేతనత్వము కర్మఫలము కర్తకు అందునట్లు చేయును అన్నారు కాని మీమాంసకులు 'అపూర్వము' స్వయం ప్రవర్తకమైనది, ఈశ్వరప్రమేయము లేకుండ ఫలమునిచ్చును అన్నారు శంకరులు దీనిని వ్యతిరేకించి ఈశ్వర ప్రమేయమును నిర్ధారించారు దీనికి శంకరులపై వైశేషిక ప్రభావమున్నదని కొందరి అభిప్రాయము

జీవులు, వస్తువులు మిథ్యారూపములు కావనియు అవి శాశ్వత సత్యరూపములనియు వైశేషికుల వాదన న్యాయసిద్ధాంతములో వలెనే,

పోవలసివచ్చును

లోకమును ఈశ్వరుడు ప్రేమ (లేక) కరుణ వలన కలిగిన స్పందనతో సృష్టించెను అన్నారు కాని అపుడు యీ సృష్టికి అర్థమేమగును జీవులు, అణువులు రెండును నిత్యములగును ప్రపంచము వాటి పరస్పర సంయోగరూపమగును అపుడు ఈశ్వరునకు సృష్టించవలసినది ఏమి యుండును? దీనికి రెండు సమాధానములుండును ఒకటి ఈశ్వరుడు లేడని చెప్పవలయును లేదా అణువులు, జీవులు అచేతనములు కావు, అవి ఈశ్వరుని యొక్క నిత్యమైన కారణధర్మము యొక్క భిన్నరూపములని చెప్పవలసియుండును వస్తు స్వరూపమే ఈశ్వర శరీరమను అర్థము న్యాయధర్మములో సూచింపబడినది దీనినే రామానుజుడు తన విశిష్టాద్వైత తత్త్వమందు పొందుపరచి నిరూపించాడు అని అన్నారు సర్వేపల్లి రాధాకృష్ణ

ఈశ్వరుని గూర్చి స్పష్టమైన భావము లేకపోవుటయే న్యాయదర్శనము నందు ప్రధాన సమస్య ఈశ్వరుడు సర్వజ్ఞుడు అన్నారు కాని ఈశ్వరుడు జగత్తునందు అంతర్వర్తి (లోపల నుండువాడు) అని చెప్పలేదు ఈశ్వరభక్తిని గురించి చెప్పారు, కాని భక్తిప్రధానములైన ఈశ్వర సాయుజ్యముగాని, సారూప్యముగాని చెప్పలేదు ఎందుకనగా ఈశ్వరుడు జగత్తునకు బయట నున్నాడు అన్నారు వేదాంతము, యోగశాస్త్రము ఈశ్వరుని గూర్చి ఉపాసన బోధించాయి ఉపాసన ద్వారా ఈశ్వరసిద్ధి లభిస్తుంది కాని ఉపాసనకు ఈశ్వరుని గూర్చి ఒక స్థిరమైన భావం అవసరం

ఈశ్వరుని గూర్చి స్థిరమైన భావన లేకపోయినను న్యాయదర్శనమందు విమర్శాపూర్వకమైన సత్యాన్వేషణ విధానము కనబడును ఈ సత్యాన్వేషణ తమదైన పద్ధతిలో అన్ని దర్శనములందు కనబడును తాత్త్విక సమస్యా పరిష్కారమునకు పరిశీలనతో కూడిన వ్యవహారికానుభవము సరియైనది అను విశ్వాసము న్యాయదర్శనములోని బలమైన అంశము కాని ఆ అంశము

realities) పదార్థములు అన్నాడు వస్తు విజ్ఞానము వైశేషిక దృక్పథము వస్తువుల యొక్కయు వాటికి సంబంధములగు వాటి యొక్కయు లక్షణములే యదార్థ వస్తులక్షణములు అన్నారు

పదార్థమనగా తెలుసుకొనదగిన అర్థమును కలిగియున్నది అది ఒక పేరు (నామము)ను కలిగియుండుటకు యోగ్యమై యుండవలయును లోకములోని అన్ని వస్తువులు, అనగా అనుభవయోగ్యములైన విషయము లన్నియు పదార్థములే అన్నారు న్యాయదర్శనములోని తర్కవిషయములు కాక, జ్ఞానవిషయముల సంపూర్ణ విభాగమును చెప్పునవి వైశేషిక పదార్థములు

వస్తువులు మాత్రమే కాదు, వస్తుజ్ఞానము గలవి కూడ పదార్థములే అన్నారు వైశేషికులు మన ఎదుట విస్తరించి కనబడు భౌతిక ప్రపంచమందు పరస్పర సంబంధము గల బహుళ (అనేక) విషయములున్నవి వాటిని గూర్చియే మన సహజ వివేక (commonsense) విజ్ఞానములు పనిచేయును పదార్థములు బాహ్య అనుభవము నిచ్చు ప్రపంచమునే కాక మానవుని ఆంతరిక అనుభవమును కూడ రూపొందించును అన్నారు మనము అంతర్ముఖులమైనచో ఒక జీవశక్తి, దానికి సంబంధించిన లక్షణములు గోచరించును వస్తువులే కాక వస్తుజ్ఞానము గలవి కూడ వైశేషిక పదార్థములే

వైశేషికులు పదార్థమును ఏడు వర్గములుగా విభజించారు అవి 1) ద్రవ్యము, 2) గుణము, 3) కర్మ, 4) సామాన్యము, 5) విశేషము, 6) సమవాయము, 7) అభావము కణాదుడు పదార్థములను ఆరుగానే వర్గీకరించాడు కాని అనంతర వైశేషికులు 'అభావమును' ఏడవదానిగా చేర్చారు

I ద్రవ్యము వైశేషిక తత్త్వమునకు ఆధారభూతమైన పదార్థము (substance) ద్రవ్యము బాహ్య ప్రపంచములో వస్తువులు స్వతంత్ర స్థితి

కలిగియున్నవి అవి యదార్థములుగానే కన్పడును అవి తమకు గల ప్రత్యేక లక్షణములను ప్రదర్శించును అవి బహురూపములై భిన్నమైన ప్రత్యేక లక్షణములను కలిగియున్నవి అందువలననే ఒకసారి చూచిన వస్తువును మరల చూచిన గుర్తు పట్టగలుగుతున్నాము ద్రవ్యము, గుణము, కర్మ ఒకే యదార్థమైన స్థితి గలవి అన్నారు వైశేషికము యదార్థ వస్తుతత్త్వము అగోచరములగు ఆత్మలున్నవని అది నమ్మినది యదార్థ ద్రవ్యములు అనగా స్థూలరూపములు కాక, వాని సూక్ష్మరూపములనియు అది చెప్పినది పదార్థములన్నిటిలోను ద్రవ్యమొక్కటియే స్వతంత్రప్రతిపత్తి (స్థితి) కలది మిగిలిన ఆరు పదార్థములు దాని మీద ఆధారపడును ద్రవ్యములను తొమ్మిదికములుగా విభజించారు అవి 1) ఆత్మ, 2) మనస్సు, 3) పృధివి, 4) వాయువు, 5) నీరు, 6) అగ్ని, 7) ఆకాశము, 8) కాలము, 9) దేశము లేక స్థలము

1) **ఆత్మ** చైతన్యమునకు అనుభవమునకు ఆధారం ఆత్మసిద్ధాంత విషయములో న్యాయవైశేషికములు ఒకే భావమును కలిగియున్నవి కాని వీటి ఆత్మ సిద్ధాంతంలో ఒక ప్రత్యేకత యున్నది ఆత్మ తన చైతన్యమును ఒక నిత్య లక్షణముగా కాక, ఆకస్మికముగా పొందుచుండును అన్నారు కాని వాస్తవమునకు ఆత్మ అచేతనము మనస్సుతో కలిసినపుడు చేతనత్వము పొందును ఇంద్రియ అనుభవములను గ్రహించునది మనసు మాత్రమే ఆత్మ అస్తిత్వము స్వయంనిరూపితము మనస్సు సంచలనము, ఇంద్రియ ప్రవృత్తి ఆత్మ అస్తిత్వమును నిరూపించును ఆత్మ శాశ్వతము ఆత్మ శరీరముతో కలిసినపుడు జననము, విడివడినపుడు మృత్యువు

2) **మనస్సు** ఇది అనుభవమునకు ఉపకరణము అనగా సుఖదుఃఖానుభవములు దృష్టికి నేత్రములు ఉపకరణములైనటులే మనస్సు అనుభవమునకు ఉపకరణము మనస్సు ఉపకరణమే కాక అనుభవమునిచ్చు

పదార్థము లేక వస్తువు అన్నారు అంతేకాక జ్ఞానమునిచ్చు వస్తువు కూడా అన్నారు కాని మనస్సు ద్వారా అనుభవమును పొందునది ఆత్మ ఆత్మ మనస్సును, శరీరమును తన ఇచ్ఛననుసరించి ఉపయోగించుకొనును మనస్సుతో కలిసినటులే ఆత్మ శరీరముతోను, జ్ఞానేంద్రియముతోను సహచరిత్వమును కలిగి వాటి ద్వారా బాహ్య ప్రపంచముతో సంబంధము ఏర్పరచుకొనును ఈ సహచరిత్వమే భౌతిక బంధములకు, తద్వారా కలుగు బాధలకు కారణము మరణానంతరము మనస్సు, ఆత్మ తోటే ఉండును ఆత్మకు మోక్షము కల్గినపుడు మనస్సు విడివడును పునర్జన్మతో శరీరము, ఇంద్రియములు తమ స్థితిని తిరిగి పొందును

**పంచద్రవ్యములైన భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములు** బాహ్యపదార్థములు (వస్తురూప భూతములు) ఇవే పంచభూతములు (Five elements) వాటి నిర్మల కారణ రూపములలో కాకపోయినను, ఈ పంచద్రవ్యములు మన బాహ్య జ్ఞానేంద్రియములకు గోచరములే బాహ్య ఇంద్రియములకు వాటి కారణరూపము అగోచరమైనను, వాటి స్థితి పరమాణు రూపమున అంతరింద్రియమైన మనస్సు గ్రహించును అన్నారు విశ్వసృష్టి యందు నియమిత కాలగమనములో (Periodic Process) చలితములగును (become active) అన్నారు దేశకాలముల (space and time) భేదము వైశేషికము గుర్తించినది దేశము (స్థలము) కనబడు వస్తువులకు సంబంధించినది జన్మించి నశించు వస్తువులకు సంబంధించినది కాలము వీటికి బాహ్యవస్తు వాస్తవికత యున్నది వస్తువులు కాలమును బట్టి చలించును స్థలమును బట్టి తమ స్థానములందు స్థిరపడును

పంచద్రవ్యములందు పృధివి (భూమి) ఘనపదార్థము నీరు ద్రవము వాయువు వాయురూపము అగ్ని తేజోరూపము ఆకాశము అవకాశరూపము అన్నారు అవకాశము అనగా తెరపి (open) వస్తువుల

స్థలగతి, స్థితిగతి దేశకాలములను ఆశ్రయించి యుండును దేశకాలములు పరివర్తన చెందు వస్తువుల ఉనికిని సూచించును అవయవములు లేని అనంతమైన ద్రవ్యమొకటి యున్నది అదియే ఆకాశము దానికి రూపము, రుచి, వాసన, స్పర్శ గుణములు లేవు అది నిష్క్రియము కాని రూపమున్న వస్తువులన్నియు అందు ఇమిడి యున్నవి అణువులు అతి సూక్ష్మములు అందుచే అవి స్పర్శ వలన గాని, సంయోగము వలన గాని ఒక ఘనపరిణామము పొందలేవు అవి కలిసియున్నను, విడిగానున్నను వాటి విభిన్న స్థితులకు ఆకాశమే ఆధారము అణువులు కలియును కాని ఆ కలయిక స్థిరమైనది కాదు ఆకాశము అణురూపము కాదు కాని అది అణువులను వాటి స్థానములందు నిలుపును ఆకాశము శాశ్వతము, సర్వవ్యాపి, ఇంద్రియములకు అతీతము అది స్వయముగా వస్తువులపై స్వభావ ప్రభావము కలిగియుండదు శబ్దమే ఆకాశ విశిష్టగుణము అందుచే అది వస్తువులతో సంబంధము కలిగి, శబ్దమును కలుగజేసి ప్రభావమును జూపును దేశము (space) అనగా అవకాశమని అర్థము చెప్పవచ్చును ఆకాశము కూడ అవకాశమే అన్నారు కాబట్టి ఆకాశమును కూడ దేశము లేక స్థలము (space) అనవచ్చును కాని వైశేషికులు ఆకాశమునకు, అవకాశమునకు భేదము చెప్పారు ఆకాశము శబ్దగుణమునకు ఉపకరణము అవకాశము సర్వకార్యములకు సామాన్య కారణము అన్నారు

పంచద్రవ్యములలో భూమికి రూపము, రుచి, వాసన, స్పర్శ గుణములున్నవి జలమునకు రూపము, రుచి, స్పర్శ గుణములున్నవి అగ్నికి రూపము, స్పర్శ గుణములు, వాయువునకు స్పర్శగుణము మాత్రమున్నవి అందువలన నివి వస్తువులే యగును పంచభూతాత్మకమైన సర్వవస్తువులకు మూలము సూక్ష్మఅణువులని వైశేషికవాదము

ఏడుగా విభజించబడిన పదార్థములలో మొదటిదైన ద్రవ్యమును

గురించి క్లుప్తముగా చెప్పబడింది ఇక రెండవది గుణము

**II గుణము** గుణము ద్రవ్యము కంటే భిన్నమైనది అది ద్రవ్యముపై ఆధారపడి ద్రవ్యములోనే యుండును అందువలన ద్రవ్యము కంటే భిన్నముగా దానికి గుర్తింపులేదు గుణమును కణాదుడు ఇలా నిర్వచించాడు "ద్రవ్యమును ఆధారముగా కలిగి, తనకి వేరు గుణములు లేనిది సంయోగ వియోగములకు కారణము కానిది, వాటితో ఎట్టి సంబంధము లేనిది" గుణము అన్నారు గుణములను స్థూలముగా సాధారణ లక్షణములు, ప్రత్యేక లక్షణములుగా (general qualities and special qualities) విభజించారు రెండు కాని ఎక్కువకాని వస్తువులలో నున్నచో అవి సామాన్య (సాధారణ) గుణములు పరిమాణము (size) అనేక వస్తువుల గుణము ఇది ఒకటి కంటే ఎక్కువ ఇంద్రియములకు గోచరించును రూపము, రుచి, వాసన, స్పర్శ గుణములు ప్రతి ఒక్క వస్తువునకు ప్రత్యేకముగా నుండి ఏదో ఒక ఇంద్రియమునకు మాత్రమే గోచరించును దేశకాలములకు (Time and Space) ప్రత్యేకించి గుణములేవియు ఉండవు

**III కర్మ** ఇది పదార్థములలో మూడవది ఇది ఒక స్వతంత్ర పదార్థము కర్మ అనగా చలనము (motion) ఇది ఒక స్పష్టమైన ప్రత్యేకత గల పదార్థము ఇది పంచభూతములపై ఆధారపడి యుండును ఇది ద్రవ్యము కాదు గుణము కూడ కాదు గుణములు ద్రవ్యమునకు చెందును అటులే చలనములు అనగా కర్మలు ద్రవ్యములకు చెందినవే గుణములు ద్రవ్యములకు నిత్యలక్షణములుగా నుండును కాని కర్మ (చలనము) అనిత్యలక్షణమై యుండును ఒక ద్రవ్యము యొక్క గొప్పతనము దాని గుణము విచ్ఛిన్నము కాని అనగా వేరుకానిది గుణము దానికి భిన్నమైనది అనగా విచ్ఛిన్నమగునది కర్మ అన్నారు ఒక ద్రవ్యమునకు చెందినది గుణరహితమైనది కర్మ అన్నారు కర్మ అయిదు రకములు 1 ఊర్ధ్వచలనము

(Upward motion), 2 అధశ్చలనము (Downward motion), 3 వృద్ధి చలనము (expansion), 4 క్షీణచలనము (అధోచలనము) (contraction), 5 సామాన్య చలనము (general movement) సూక్ష్మరూపములోనున్న చలనము క్షణికము వేగముతో నున్న చలనము కొన్ని చలనముల పరంపరల సంయోగమనబడును ఏది అయినను కర్మ నిత్యమైనది కాదు అన్నారు ఒక సంయోగము వలన గాని లేక చలనమునకు ఆధారమైన ద్రవ్యము నాశనమొందినపుడు గాని కర్మ పూర్తియగును స్థూలరూపము లేనందున జీవాత్మ, ఆకాశము, దేశ (స్థలము) కాలములకు చలనము అనగా కర్మలు ఉండవు అన్నారు

**IV సామాన్యము, V విశేషము** అనేక వస్తువులలో నున్న ఒక గుణము **సామాన్యము** (general) అనియు, ఆ గుణము చేతనే ఇతర జాతి వస్తువుల నుండి భేదము చెప్పినచో నది **విశేషము** (particularity) సామాన్యమును ఒక జాతికి చెందిన లక్షణముగా చెప్పవచ్చును అనంతర వైశేషికులు సామాన్యములకు స్వతంత్రస్థితి యున్నదని చెప్పారు కాని విశేషమునకు అట్టి స్థితి కల్పించలేదు ఒక జాతి యొక్క జన్మసిద్ధ లక్షణమే సామాన్యము ఈ సామాన్యములచే ఆవులను ఆవులుగాను, గుఱ్ఱములను గుఱ్ఱములుగాను గుర్తించి రెండు వేరు జాతులుగా చెప్పనగును కాని కొందరు గ్రుడ్డివారిని అంధజాతిగా చెప్పుటకు వీలుపడదు అంధత్వము జాతి సామాన్య లక్షణము కాదు జాతిగుణములుకాక, వ్యక్తుల గుణములు విశేషములు వీటిని గురించి మనకు తెలియుటకు అవకాశము లేదు పరమాణువుల సంఖ్య అనంతము అట్లే విశేషగుణముల సంఖ్య అనంతము కావున విశేషములను ఊహించుట దుర్లభము

**VI సమవాయము** కారణమునకు, కార్యమునకు గల సంబంధమే సమవాయము అని కణాదుని అభిప్రాయము అది పరస్పర ఆధారభూతమైన

సంబంధము ఒక పదార్థమునకు దాని గుణములకును, అఖండము అనగా మొత్తము (పూర్ణము)నకు దాని భాగములకును, కారణమునకు కార్యమునకు గల సంబంధమే సమవాయము సంబంధమున్నది అను భావమునకు మూలమైనది సమవాయము ఇది సామాన్య సంబంధము వంటిది గాదు ఇది అంతర్లీనముగా నుండును సామాన్య సంబంధము మన ఇచ్ఛననుసరించి ఏర్పడును రెండు వస్తువులను దగ్గరకు చేర్చి సంబంధము కల్పించవచ్చు, తరువాత విడదీయవచ్చు కాని అది సమవాయము కాదు ఎందుకనగా అది అవినాభావ సంబంధము కాదు అవినాభావ సంబంధము నూలుపోగులు, వానితో నేసిన వస్త్రమునకు గల సంబంధము వంటిది భూమి మీద పడిన ఫలమునకు భూమితో అవినాభావ సంబంధము లేదు అందుచే అది సమవాయము కాదు అవినాభావ సంబంధము సమవాయము కాని అది సంబంధము పొందు ఆ రెండింటి కంటే భిన్నమైనది, స్వతంత్రమైనది

VII అభావము అనంతర వైశేషికులు దీనిని పదార్థములలో చేర్చారు కణాదుడు దీనిని స్వతంత్ర పదార్థముగా అంగీకరించలేదు లేదనుట, కాదనుటను అభావము అన్నారు (deny existence or negation) అసత్యజ్ఞానము కాదనుటయే లేక వ్యతిరేకించుటయే దుఃఖమును వ్యతిరేకించుటయే అగును అన్నారు దానిని అభావము అన్నారు అది నిశ్రేయస్సును కలిగించునని అనంతర వైశేషికుల వాదము జ్ఞానము తనకు బయటనున్న వస్తువును గుర్తించును అటులే అభావ జ్ఞానము కూడ దాని స్థితిని ఆ జ్ఞానమునకు పేరుగా గుర్తించును దీనినే ఇంకొక విధముగా చెపితే, ఒక వస్తువు ఒకచోట లేకపోవటం, అది లేదు అనే జ్ఞానము ఒకటి కాదు మొదటిది స్థితి రెండవది భావము, చూచి, వస్తువు లేదు అని తెలియుట ఒకటి, ఆ వస్తువు లేదు అను జ్ఞానము మరొకటి ఆ వస్తువు లేదు అను జ్ఞానమే అభావము అభావమనగా ఆ వస్తువు అచటలేదు అనియే తప్ప అసలు ఆ వస్తువు లేదు అను శూన్యభావం కాదు ఉదాహరణకు, ఒక బల్ల మీద ఒక

పుస్తకము లేదు అనవచ్చు కాని దాని అర్థం ఆ పుస్తకం అసలు లేదు అని కాదు గదా! పద్మము తెల్లగా ఉండును అనునది సత్యము పద్మము నీలముగా ఉండును అనునది అసత్యము పద్మము నీలముగా ఉండదు అనునది కూడ సత్యమే కాని వ్యతిరేకముగా (negation) చెప్పబడినది అదే అభావము

అభావము ఒక తార్కిక పదార్థము అయినను అది కూడ భావముతో సమానమైనదే అన్నారు వ్యతిరేక భావమున అభావము కలిసి యున్నది సర్వసంబంధములకు వ్యతిరేక భావమును ఊహింపవచ్చును కాని వేదాంతములోను మీమాంసలోను భావమునకు ఒక పదార్థముగా స్థానము లేదు అ భావమును నాలుగు రకములుగా చెప్పారు

1) **ప్రాగభావము** (ప్రాక్ + అభావము) ఇది కార్యమునకు పూర్వము ఉన్న కారణము యొక్క స్థితి ఒక కుండ తయారగుటకు ముందు కుండలేదు మట్టి మాత్రమే యున్నది ఈ అభావమునకు ప్రారంభము లేదు కాని కుండ తయారైన వెంటనే ఈ అభావం అంతమగును 2) **ధ్వంసాభావము** (ధ్వంస + అభావము) ఇది అనంతర కారణ స్థితి లేక కార్యము కార్యము జరుగుటకు తోడ్పడిన అంశములుగా తిరిగి ఆ వస్తువు విడిపోవుట కుండ నాశనమైనపుడు కుండ ఉండదు కుండ పెంకులుండును కుండు రూపమున్నది కావున ఈ అభావమునకు ప్రారంభం ఉన్నది కాని అంతం లేదు ఎందుకనగా కుండ పెంకులున్నాయి కాని ఆ పెంకులు కుండగా మారలేవు ఇందు ప్రాగభావము మట్టిగా, ధ్వంసాభావము కుండ పెంకులుగా నున్నవి కాని అవి రెండు ఒకటి గాదు 3) **అత్యంతాభావము** (అత్యంత + అభావము) ఇది సంపూర్ణమైన అభావము భూమి మీద కుండ ఉన్నపుడు అస్తిత్వమున్నవి దానిని అచట నుండి తొలగించినపుడు భూమి మాత్రమే యుండును కుండలేదు దీనిని అత్యంతాభావము అన్నారు అన్ని వస్తువులకు అత్యంతాభావముండును (ఆయా ప్రదేశములందు ఆయాసమయములందు

వస్తువులున్నపుడు అత్యంతాభావము మరుగునపడియుండును ఆ వస్తువులను తొలగించినపుడు అత్యంతాభావము ఏర్పడును వస్తువు ఉండటం పరిమితం ఆ వస్తువు లేకుండటం అపరిమితం అన్నారు అపరిమితమైనది అత్యంతాభావము ప్రాగభావం ధ్వంసాభావము పరిమితమైనవి వాటికి ఆరంభమో అంతమో ఉన్నవి 4) **అన్యోన్యాభావము** (అన్యోన్య + అభావము) ఇది రెండు వస్తువుల మధ్య భేదము చెప్పును తాదాత్మ్యము అనగా ఏకత్వము (ఒక కుండ వస్త్రము కాదు అని చెప్పుట ఇదే అన్యోన్య అభావము కుండ కుండయే యగును' అని చెప్పుట తాదాత్మ్య మగును ఇది అన్యోన్య అభావమునకు వ్యతిరేకము)

(ఈ అభావములన్నియు వైశేషికుల తత్త్వదృష్టికి ఆధారములుగా కన్పడుచున్నవి వస్తువులన్నియు భావాత్మకములు మాత్రమే అయినచో వాటికి పరిణామముండదు అపుడు అవి నిత్యములు కావలయును ప్రాగభావము లేదనినచో ఏ వస్తువుకు ఆరంభం ఉండదు ధ్వంసాభావము లేదనినచో వస్తువులు అంతము లేనివగును అన్యోన్య అభావము లేదనినచో వస్తువుల భేదమే తెలియదు అత్యంతాభావము లేదనినచో అన్ని వస్తువులకు అన్ని ప్రదేశములందు, అన్ని సమయములందు అస్తిత్వముండును)

కొందరు జైనులు అణువాదమును ఊహించిరి కాని అణు సిద్ధాంతమును కల్పించినది కణాదుడు అణువులు అగోచరములు, నిత్యములు వాటిని విభజించుటకు వీలుపడదు కొన్ని అణువులు కలియుట కొన్ని అణువులు విడిపోవుచుండుట వలన వస్తువుల పరిమాణములలో భేదము ఏర్పడుచుండును అన్నారు పరిమాణములు అల్పముగాను అధికముగాను ఉండవచ్చును కాని అనంతములు కావు అవి పరిమితులకు లోబడినవి అన్ని కార్యములకు అణువులే ఉపాదానములు అనగా ప్రధాన కారణములు అన్నారు అణువులు గోచరము కావు వాటి

పరిమాణము, ఆకారము, సాంద్రత ఎరుగరానిది అయినను వాటిని వర్గీకరించవచ్చును వస్తువులు మనకు గోచరములు అందుండు అణువులు వాటి గుణములను ప్రదర్శించును ఆ గుణములచే అణువులను వర్గీకరించవచ్చును భూమి, నీరు, అగ్ని, గాలి అను నాలుగు భూతములకు అనుగుణముగా నాలుగు విధములైన పరమాణువులున్నవని అన్నారు ఈ పరమాణువులే చర్మము, నాలుక, కళ్లు, ముక్కు అను నాలుగు జ్ఞానేంద్రియములను కల్పించెనని భావించారు ఏదైనా ఒక ఇంద్రియము ప్రకోపించినపుడు ఆ సంబంధిత లక్షణమునే ప్రదర్శించును అన్నారు ఈ లక్షణములు భౌతిక పదార్థములకు చెందినవి పదార్థరూపము నాశనమైనపుడు అవి కూడ అదృశ్యములైనను నాశనము కావు అవి వాటి అణువులందు నిలిచియుండును అన్నారు

పూర్ణరూపములోనున్న ఒక వస్తువు అణువులుగా విడిపోవును తిరిగి ఆ అణువులు కలియుటచే పూర్ణవస్తురూపమేర్పడుచున్నది అణువులకు సహజ చలనము లేదు ప్రళయ సమయమందు అణువులు కార్యములు చేయక నిశ్చలముగా నుండునని అన్నారు అన్ని వస్తువులకు కారణములు అణువులు ఆ అణువుల వలననే గుణములేర్పడును ఈ గుణములు అణువులలో నిత్యములై యుండును ఆ గుణములు కార్యములలో కనబడును వస్తువులు పూర్తిగా ఎన్నడు నాశనము కావు వాటి బాహ్యరూపము మాత్రమే నశించును కాని వాటి మూలములగు భూతములు (elements) బీజరూపమున (seed form) నిత్యముగా నుండును వీటిని అంశములు అన్నారు వీటికి స్వతంత్రశక్తి గలదు అందుచేనివి సంయోగవియోగములు చెందుచుండును ఇందు మూలముననే సృష్టి లయములు గల క్రమగతితో కాలచక్రమేర్పడినది అన్నారు ఆధునిక యుగమున అణుసిద్ధాంతములో ఎన్నో మార్పులు, చేర్పులు జరిగినవి కాని హిందూ అణు విజ్ఞానమునకు వైశేషిక అణువాదము బీజము వేసినది అనునది సత్యము ప్రథమముగ

అణువాదము ఒక భౌతిక విజ్ఞానశాస్త్రముగా కాక ఒక తాత్త్విక సిద్ధాంతముగా ప్రతిపాదించబడినది అందుచే దానిని భౌతికపద్ధతులచే పరీక్షించుటకు వీలుపడదు ఇది ప్రకృతిరూపములకు అర్థము కల్పించుటకు కలిగిన భావములతో ఏర్పడిన తత్త్వము మాత్రమే ఇది పరిశోధనా ఫలితము కాదు సూత్రరూపములో చెప్పబడిన భావసంపుటి మాత్రమే

న్యాయవైశేషిక తత్త్వము క్లుప్తంగా చెప్పాలంటే వారు చెప్పిన ఏడు వర్గములను ముందుగా చెప్పాలి ఆ వర్గాలే పదార్థములు, వాటి స్వభావములు, సంబంధములు ఇవి సంయుక్తముగా విశ్వము నేర్పరచినవి వాటి మూలరూపములలో శాశ్వతములు, సత్యములు ఈ ఏడు వర్గములలో ప్రధానమైనది ద్రవ్యము దానికి తొమ్మిది మూలక పదార్థములు (elements) ఈ తొమ్మిదింటిలో ఆత్మ (self), చైతన్యమునకు (consciousness) ఆధారం, (substratum) అనుభవములకు ప్రధానం మిగిలినవి బాహ్య వాస్తవములు కాని అవి వాస్తవములైనప్పటికి ద్రవ్యముపై ఆధారపడియున్నవి

న్యాయవైశేషిక సూత్రములు బహిరంగముగా ఈశ్వరుని గురించి చెప్పలేదు అణువుల యొక్కయు, జీవుల యొక్కయు మూలప్రవృత్తికి అదృష్టమే కారణము అన్నారు అనంతర వైశేషికులు అదృష్టము ఈశ్వర సంకల్పముపై ఆధారపడి యుండునన్నారు ఈశ్వరుడు జగత్తుకు మూలకారణము అణువులు ఉపాదాన కారణము అన్నారు అనగా ప్రధాన కారణము న్యాయవైశేషికములు మనిషిలోని ఆత్మను జీవాత్మ అని, అది పరమాత్మ కాదు అనియు, పరమాత్మ సర్వాదీశ్వరుడైన పరబ్రహ్మము అన్నారు ఈశ్వరుని అస్తిత్వము గూర్చి ఈ న్యాయవైశేషిక దర్శనములు ఇచ్చిన నిదర్శనములు లేక ప్రమాణములు అంత విశ్వసనీయంగానూ ముఖ్యమైనవి గానూ లేవు ఈ విశ్వమందు భౌతికముగాను, నైతికముగాను ఒక క్రమగతి యున్నది ఈ క్రమగతికి (order) వెనుక ఒక అధికర్త (controller) ఉన్నాడని,

అతడే ఈ విశ్వమును శాసించునని, ధర్మమును కాపాడునని చెప్పినవి సృష్టిరూపమైన ఈ విశ్వము ఒక కార్యము కావున దానికి సార్థకమైన ఒక కారణముండాలి గదా! ఆ కారణమే ఈశ్వరుడు అన్నారు ఈ రెండు దర్శనముల ననుసరించి ఈశ్వరుని అస్తిత్వమునకు గాని ఈశ్వరుడు లేడు అనుటకు గాని తగిన నిదర్శనములు లేవు అనిపించును

న్యాయవైశేషికములు కర్మము విషయములో కారణ కార్యములకు ప్రాధాన్యమునిచ్చినవి కార్య కారణములు రెండు విడిగా ప్రత్యేకత (గుర్తింపు)ను కలిగినను, పదార్థ స్థితిని కలిగియున్నను, అవి పరస్పర సంబంధమును తప్పక కలిగియుండును ఈ దర్శనములు చెప్పిన కారణవాదము నందు ఒక విశేషమున్నది ఈ ప్రపంచము ఒక కార్యమునకు కలిగిన ఫలితరూపము కాని ఇది శాశ్వతము కాదు నిరంతరము లేక శాశ్వతములై అంతకు పూర్వము ఉన్న పదార్థముల ఉత్పత్తియే ఈ జగత్తు ఈ పదార్థములకు వాటివాటి ప్రత్యేక స్వభావములు, సంబంధములుండును కాని అవి ఉత్పత్తి చేయు ఈ జగత్తు ఎప్పటికప్పుడు క్రొత్తదిగానే యుండును ఈ సృష్టిచక్రమందు లయము తరువాత జరుగు ప్రతిసృష్టి అనగా జగత్తు క్రొత్తదిగానే కనిపించును దీనినే ఆరంభవాదము అన్నారు

ఈ రెండు దర్శనములలోను ఒక ప్రధానమైన భేదమున్నది వైశేషికము జీవసృష్టితో ప్రారంభించి భావములను రూపొందించినది న్యాయదర్శనము అట్లుగాక తర్కముతో కూడిన వ్యావహారిక జ్ఞానమునకు ప్రాధాన్యము నిచ్చినది పదార్థము ఏడు వర్గములని వైశేషికము చెప్పగా, న్యాయదర్శనము అవి పదునారు (16)గా చెప్పినది అజ్ఞానమే ముక్తికి ఆటంకము అని అన్ని భారతీయ తత్త్వములు చెప్పుచున్నవి న్యాయదర్శనము ఈ అజ్ఞానమునకు కారణం ఇంద్రియములతో కూడిన ఈ శరీరమే ఆత్మ అని భావించుట అన్నది అందుచే రాగద్వేషములకు బానిసలమై జనన, మరణ వలయములో చిక్కుకొని

యున్నాము అన్నవి

భౌతిక శరీరమే ఆత్మ అని భ్రమించటం ఒక్కటే అజ్ఞాన కారణం కాదు దానికి మోహం కూడినపుడు అజ్ఞానం వృద్ధి చెందుతుంది పదార్థ వర్గములను అర్థం చేసుకుని ఆత్మను గురించి జ్ఞానము పొందుటయే ముక్తికి మార్గము అన్నాయి ఆత్మజ్ఞానం, భక్తి, ఆత్మార్పణం (ప్రపత్తి), తాత్విక ఊహల లేక యోచనల ద్వారా కలుగుతుంది ఈశ్వరుడు పరమాత్మ (శివుడు అని అర్థం కాదు) - అతడే సృష్టికర్త స్థితికర్త అన్నారు జీవాత్మలు శాశ్వతములు వాటి గతకర్మల ఫలితముగా పునర్జన్మలు పొందుచుండును కర్మసిద్ధాంతము ననుసరించియే ఈ జగత్తు నియతి (order) యున్నది కర్మఫలము అనుభవింపక తప్పదు చైతన్యము ఆత్మలో అంతర్లీనముగా నుండునది కాదు, అది ఆకస్మికముగా కలిగేది అని చెప్పినవి అందువలన విముక్తికి చైతన్యమునకు సంబంధము లేదని ఈ దర్శనముల భావమని అనిపించును కాని అనంతర నైయాయికులు సవ్యమైన పరమానందమే ముక్తిస్థితి అన్నారు జీవన్ముక్తిని ఈ దర్శనములు ప్రత్యక్షముగా అంగీకరించకపోయినను దానికి సమానమైన మోహము లేని స్థితిని గురించి చెప్పినవి కాని దానిని పరిపూర్ణమైన విముక్తి (liberation) గా చెప్పలేదు

**2 సాంఖ్యము - యోగము**

**సాంఖ్య సిద్ధాంతము** ఈ భౌతిక జగత్తుకు మూలము ఒక కారణము దీనిని కారణవాదము అన్నారు ఒక కార్యమునకు కలిగిన ఫలితరూపమే ఈ జగత్తు అని **కారణవాదులైన** నైయాయికులు, వైశేషికులు చెప్పినది కాని ఇది శాశ్వతము కాదు అన్నారు శాశ్వతములై అంతకు పూర్వమే ఉన్న పదార్థముల ఉత్పత్తియే ఈ జగత్తు అని న్యాయవైశేషిక సిద్ధాంతము ఈ పదార్థములకు వాటివాటి ప్రత్యేక స్వభావములు, సంబంధములు ఉండును కాని అవి ఉత్పత్తి చేయు ఈ జగత్తు ఎప్పటికప్పుడు క్రొత్తదిగానే యుండును ఈ

సృష్టిక్రమమందు లయము తరువాత జరుగు ప్రతిసృష్టి అనగా జగత్తు క్రొత్తదిగానే కనిపించును ఇదే న్యాయవైశేషిక "**ఆరంభవాదము**".)

సాంఖ్య, యోగములు ఇందుకు భిన్నముగా జగత్తు సృష్టిని గురించి చెప్పినవి పదార్థము, ఆత్మ రెండును వాస్తవములే అని సాంఖ్యయోగసిద్ధాంతము ఆత్మలు అనంతములు అనును వాటినే 'పురుషులు' అన్నవి కాని ఈ జగత్తు సృష్టికి ప్రకృతి అను ఒకే ఒక మూలము (source) అని వీరి వాదము ఒకే ఒక మూలపదార్థమైన ప్రకృతి యొక్క పరిణామము వలన ఈ జగత్తు ఏర్పడినది ఇది సాంఖ్య, యోగముల 'పరిణామ వాదము' (Evolution) అనంత విషయ సంపుటి ఈ ప్రకృతి స్వరూపము అన్నారు అది నిత్య పరిణామముతో కూడినది భౌతిక పదార్థరూపములు అనంతదశలలో నుండును అవి సూక్ష్మ పదార్థములచే కల్పించబడి ప్రకృతి యొక్క మూలస్వరూపమును ఆవిష్కరించు చున్నవి అన్నారు వస్తు ప్రపంచమునకు మూలరూపము, ఆధారము అయిన ప్రకృతి అవ్యక్తము అన్నారు అనగా ప్రపంచమునకు మూలమై తెలియరాక యుండునది ప్రకృతి అని భావము ప్రకృతి పరిణామమే ప్రపంచము అన్నారు అలా ఏర్పడు ప్రతి వస్తువు దానిని ఉత్పత్తి చేయు ప్రకృతి కారణమునకు కార్యరూపము ప్రతి కార్యమునకు ఒక కారణముండును కాని ప్రకృతికి ఏ కారణము లేదు ప్రకృతియే అన్ని కార్యములకు కారణము అగుచున్నది అన్నిటికి అదియే మూలము, ప్రధానము అన్నారు సర్వకార్యములు దానిపైననే ఆధారపడినట్లు తెలియుచున్నది అన్నారు దానినే బ్రహ్మము అన్నారు ఎందుకనగా అది వృద్ధి చెందుచుండును దానిని మాయయని కూడ అన్నారు అది వస్తు పరిమాణమును కలిగించును కనుక అన్నారు అనేక భిన్నములైన ద్రవ్యములు దాని నుండి జనించును కనుక దానిని ఆదిమూర్తి అని కూడ చెప్పారు అయినను ప్రకృతి అనాత్మ (ఆత్మకానిది) అన్నారు అందుచే పురుషుడు (లేక ఆత్మ) దాని నుండి జనించెననుట కుదరదు అని సాంఖ్య సిద్ధాంతము

వస్తువులు కారణము వలన ఏర్పడును కాని ప్రకృతికి కారణము లేదు ప్రకృతి స్వతంత్రమైనది వస్తువులు అనేకములు ప్రకృతి మాత్రము ఒకటే ప్రకృతి సర్వవ్యాపి, నిత్యమైనది అది అగోచరము ఈ ఏక పదార్థము నుండి ప్రపంచమేర్పడినది పదార్థములందలి అంశములు భిన్నవిధముల సంయోగము చెందుటచే భిన్నరూపములు ఏర్పడుచున్నవి ఇది సాంఖ్య సిద్ధాంతము ఇది భౌతికవాదమును తలపునకు తెచ్చును సాంఖ్యవాదము, భౌతికవాదము (Materialism) రెండును ఒక పదార్థము నుండి ప్రపంచము ఉత్పత్తి యగును అని అంగీకరించినవి కాని సాంఖ్యులు చెప్పు ప్రకృతి ఒక పదార్థము మాత్రమేయని చెప్పుటకు వీలుపడదు భౌతికవాదులు (Materialists) ప్రపంచమునకు మూలము శుద్ధపదార్థము పురుషుని ఉత్పత్తి చేయు శక్తి ప్రకృతికి లేదు, అటులే ప్రకృతిని ఉత్పత్తి చేయు శక్తి పురుషునికి లేదు అని సాంఖ్యవాదము సాంఖ్యులు చెప్పు ప్రకృతి సర్వవ్యాపియైన ఒక పదార్థము కాదు అది ఒక చేతనత్వముతో కూడిన ఒక వ్యక్తి కూడ కాదు పురుషుడు, ప్రకృతి వేరు ప్రకృతి నుండి పంచభూతములే కాక మానవరూపములు కూడ జనించుచున్నవి మనకు కనబడు ప్రపంచమునకంతకు ఇదియే మూలము సాంఖ్య సిద్ధాంతము తాత్త్వికపద్ధతిని అనుసరించినది ఈ ప్రకృతిని సాంఖ్యులు రెండు భాగములుగా విభజించారు ఒకటి పరిపూర్ణమైన, మార్పులేని ద్రష్ట (చూచునది), రెండవది మనకు కనబడుచు నిత్యము మార్పు చెందుచుండు ఒక దృశ్యముగాను సాంఖ్యులు చెప్పారు ఈ దృశ్యభాగమునకు ద్రష్టభాగము మూలము ప్రకృతి తనకు తెలియకుండగనే, ఎట్టి లక్ష్యము నిశ్చయించు కొనకుండగనే నిత్యము క్రియారూపమై ప్రవర్తించును అని సాంఖ్యవాదము

(తాత్త్వికము అనగా తత్త్వసంబంధమైనది తత్త్వము అనగా పరమాత్మ స్వరూపము నిజస్థితి 'ఆత్మ' అని ప్రాణులలో నున్నది ఆత్మయే పురుషుడు ఈ విషయములో అన్ని ప్రాణులు సమానమే అన్నారు) ఆత్మలు జనించుటకు గాని, భౌతికదేహములు జనించుటకు గాని ఒక మూలకారణమున్నదని

చెప్పుటకు వీలులేదని సాంఖ్యభావము జీవితానుబంధములతో సంబంధములు లేనట్టి ముక్తి అనబడు "జీవావస్థ" ఒకటి ఉన్నదని సాంఖ్యసిద్ధాంతము మానవుడెవరు? మానవుడనగా దేహముగాని, మనస్సుగాని, ప్రాణముగాని కాదు అన్నారు వీటినన్నిటికి అధిపతియై, వాటిని పోషించునట్లు 'ఆత్మ'యే మానవుడు అన్నారు ఆత్మయే పురుషుడు పురుషుడు అనగా జీవుడు స్త్రీపురుష భేదముతో చెప్పినది కాదు ప్రపంచము అనగా ప్రకృతి దృశ్యమయము ఆ దృశ్యముల వలన జ్ఞానసంబంధమైన బంధము, అనుభవము కలుగును తెలిసికొనువాడు పురుషుడు, తెలియబడునది ప్రకృతి ఇది సాంఖ్య సిద్ధాంతము

పంచభూత సమూహమైన యీ ప్రపంచము జీవుని తృప్తి కొరకు ఏర్పడినది దాని అనుభవము పొందుటకు బుద్ధి మొదలైన వాటితో కూడిన దేహము సృజించబడినది అన్నారు ఆత్మస్వరూపమేమిటి? ఆత్మ శరీరము గాదు ఆత్మ చైతన్యము పంచభూతముల నుండి పుట్టినది కాదు ఏలనన పంచభూతములలో ఏ ఒక్కదానియందును ఈ చైతన్యము లేదు అందువలన అవి సంయోగము చెందినంత మాత్రమున ఆ చైతన్యము రాదు ఇంద్రియములు ఆత్మ కాదు అవి ఉపకరణములు మాత్రమే ఇంద్రియములు బుద్ధియందు మార్పులు కలిగించును బుద్ధి అచేతనము అందువలన బుద్ధి పురుషుడు కాదు భిన్నమైన మానసిక స్థితులను ఒకటిగా చేసి అన్ని అనుభవములకు సిద్ధినిచ్చునది ఆత్మ అటు ప్రకృతితో గాని, ఇటు దేహముతో గాని సంబంధము లేని శుద్ధ చైతన్యమే ఆత్మ (consciousness) ఆత్మ చైతన్యవంతము అనగా చైతన్యము కలిగినది అని గాదు మార్పులు లేని చైతన్యమే ఆత్మ నీరు తడిగానుండును అని చెప్పుటలో అర్థం లేదు గదా తడిగా ఉండటం నీటి లక్షణం ఆ రెండు వేరు కాదు అటులే పురుషుడు చైతన్యము గలవాడు అని చెప్పటం తప్పు ఎందుకనగా పురుషునిలో చైతన్యము అంతర్లీనముగా నుండును రెండు వేరు కాదు నిత్యము పరిణామము చెందు ఈ ప్రపంచము వెనుకనున్న పరిణామము లేని సత్యమే

పురుషుడు అన్నారు పురుషుడు దేనికిని కారణము కాని కార్యము కాని కాదు అన్నారు ప్రకృతి యనునది ఒకటి యున్నది వస్తు ప్రపంచమును చూచుటకు శక్తినిచ్చు వెలుగు ప్రకృతి అన్నారు ఆ వెలుగు ప్రకృతికెట్లు కలుగును? పురుషుని దివ్యకాంతి వలన ప్రకృతికి వెలుగు కలుగును ప్రకృతి గాని దానికి సంబంధించినది గాని స్వయముగా వ్యక్తములు కావు చేతనత్వమునకు భౌతిక సంబంధముండును కాని భౌతికమైన కారణములచే అది తెలియదు మనస్సు, బుద్ధి మొదలైనవి పరికరములు మాత్రమే

పురుషుడు జ్ఞానము కలవాడు కాని సహజ ఆనందరూపి కాదు ఆనందము ప్రకృతి స్వభావము ద్రష్ట (చూచువాడు) దృశ్య (చూడబడునది) సంబంధము వలననే సుఖదుఃఖ అనుభవము కలుగును సుఖదుఃఖములు బుద్ధికి చెందినవి పురుషుని (ఆత్మ) స్వభావములో ఆనందముండదు పురుషునికి చలనశక్తి (motion) లేదు అన్నారు మోక్షము పొందినపుడు ఎచ్చటకు పోడు పురుషుడు అణురూపి కాడు పురుషునికి కర్మసంబంధము లేదు పురుషుడు సర్వగుణరహితుడు సుఖదుఃఖములు ఆత్మకుండవు దేహములలోను, మనస్సులలోను మానవులందు భిన్నత్వమున్నది అందువలన ఆత్మలు అనేకములు అన్నారు జీవుడు తనకున్న విజ్ఞానముతో ప్రపంచమును తన దృక్పథముతో చూచి గ్రహించును అందువలన స్వతంత్రానుభవము కలుగును ఈ భిన్నమైన దృక్పథములకు కారణము ప్రకృతి కాదు అన్నారు భిన్నమైన చేతనత్వము వలన భిన్నరూపములు, భిన్న కర్మలు ఏర్పడుచున్నవి మోక్షమనగా పరబ్రహ్మముతో ఐక్యము కాదు ప్రకృతితో సంబంధము పోవుటయే మోక్షము అని సాంఖ్యము చెప్పును

సాంఖ్యము చెప్పిన ఆత్మ ఉపనిషత్తులు వివరించిన ఆత్మను చాలవరకు పోలియున్నట్లు కనబడును కాని ఒక ప్రధానమైన భేదమున్నది ఉపనిషత్తులు చెప్పిన ఆత్మకు ఆది అంత్యములు లేవు అది నిత్యము

సర్వవ్యాపి అది మనస్సు, బుద్ధికి అతీతమైనది దానికి పుట్టుక లేదు అది దేనిని పుట్టింపదు రూపం లేనిది దానికి వికారములు (మార్పులు లేక పరిణామము) లేవు అనగా నిర్వికారుడు, నిష్క్రియుడు సాక్షిగా మాత్రమే యుండును సాంఖ్యలు చెప్పిన పురుషుడు కూడ ఈ లక్షణములనే కలిగియుండును కాని ఉపనిషత్తులు వివరించిన ఆత్మ ఒకటి మాత్రమే అదే పరమాత్మ పరమాత్మ అంశములే జీవాత్మలు జీవాత్మలు కర్మసంస్కారములతో కూడిన సూక్ష్మ శరీరము లేక కారణశరీరముతో కూడినవి కాని సాంఖ్య ఆత్మలు అనేకములు ఈ ఆత్మలే పురుషులు ఈ పురుషులకు దేహము ఇంద్రియములతో సంబంధము కలిగినపుడు జీవాత్మలగును

సాంఖ్యలు చెప్పిన పురుషుడు, ప్రకృతి వేరు వేరుగా నున్నవి పురుషునికి ప్రకృతితో సంబంధము లేదు ప్రకృతికి చేతనత్వము లేదు పురుషుడు చేతనుడు పురుషుడు నిర్వికారుడు అనగా మార్పులకు లోనుగాడు ప్రకృతి నిత్యము వికారములు కలది అనగా మార్పులకు లోనగును ప్రకృతి మూడు గుణములతో కూడినది పురుషుడు నిర్గుణుడు ప్రకృతి దృశ్యము అనగా చూడబడునది పురుషుడు ద్రష్ట అనగా చూచువాడు పురుషుడు బుద్ధికి అతీతుడు పురుషునికి బుద్ధి, మనస్సు ఇంద్రియములతో కూడిన దేహముతో సంబంధము ఏర్పడినపుడు పరిమితులు (limits) ఏర్పడి జీవాత్మ యగును స్థూల శరీరము లోపల జీవాత్మను ఆవరించి సూక్ష్మ శరీరముండును దీనినే లింగశరీరము అన్నారు ఇది సర్వకర్మ, అనుభవ సంస్కారములకు నిలయము ఈ లింగదేహములే పురుషుని అనేకత్వమునకు ఆధారము పురుషుడు (ఆత్మ) లింగదేహములో నున్నంత కాలము స్థూలదేహము ధరించక తప్పదు స్థూలదేహము పంచభూతములతో ఏర్పడుట వలన ప్రకృతితో సంబంధముండును ఈ సంబంధమున్నంత వరకు కర్మ సంస్కారములు లింగ శరీరమును అంటియే యుండును ఆ సంస్కారముల వలన పునర్జన్మ తప్పదు లింగ శరీర సంబంధము వలన పురుషునికి అజ్ఞానము ఆవరించి

నిర్వికారము, నిర్గుణము అయిన పురుషస్థితిని మరచి పరిమితులకు లోబడి భౌతిక బంధములకు లోనగును ఈ బంధముల వలన సుఖదుఃఖములు వాటి స్మృతులు కలుగును పశువులందు తామసగుణము ఎక్కువగా నుండుటచే మనసు వికసించదు తామసము త్రిగుణములలో ఒకటి అంతేకాని వ్యావహారికముగా చెప్పు కోపము అని భావము కాదు తామసగుణము వలన పశువులందు ఊహ, స్మరణలు (imagination and memory) వికసింపవు అందుచే పశువులందు సుఖదుఃఖములు మొదలైనవి ఎక్కువ కాలముండవు వాటికి వర్తమాన స్వభావమునకు అవసరమగు స్వల్పజ్ఞానము మాత్రమే యుండును రజోగుణ మధికమైనపుడు పురుషుడు మానవదేహమందు ప్రవేశించి నిత్యము దుఃఖవిముక్తికై కృషి చేయును సత్త్వగుణము వికసించినపుడు మోక్షజ్ఞానము కలుగును

ప్రకృతి స్థూలదేహము ద్వారా మానవుని సుఖదుఃఖములలో బంధించును ప్రకృతి బంధము తొలగినపుడు జీవాత్మ శుద్ధపురుషుడగును అదే ముక్తి లేక మోక్షము అని సాంఖ్యసిద్ధాంతము సూక్ష్మశరీరముచే ఆవరింపబడియుండుటచే జీవాత్మ పురుష, ప్రకృతి సంయుక్త రూపమగుచున్నవి సూక్ష్మశరీరము (లింగ శరీరము) జడపదార్థముచే కల్పించబడినను ఆత్మ సంపర్కముచే చేతనుమగుచున్నది దానికి సుఖదుఃఖములు కర్మఫలములుగా ఏర్పడుచున్నవి ఆత్మ (పురుషుడు) సహజముగా ఉదాసీనుడు కాని ప్రకృతి వస్తువులలో నొకటియైన బుద్ధి సంబంధముచే ఆ పురుషుడే (ఆత్మ) కర్తగా కనబడుచున్నాడు కాని వాస్తవమునకు కర్త పురుషుడు కాదు, అంతఃకరణమే కర్తయని సాంఖ్యుల వాదము కాని అంతఃకరణము చేతనము కాదు మరి అది కర్త ఎట్లగును? అది పురుషుని నుండి చైతన్యము పొందును కాని చైతన్యము అంతఃకరణములో ప్రవేశించదు చైతన్యము అంతఃకరణమునందు ప్రతిఫలించును (reflection) అని సాంఖ్యులు అన్నారు

ఈ ప్రకృతి పురుష సంబంధము శాశ్వతము కాదు అన్నారు ఏ ప్రకృతి వలన పురుషుడు బంధితుడు అగుచున్నాడో ఆ ప్రకృతి ద్వారానే ముక్తుడు అగును అని సాంఖ్యతత్త్వము భౌతిక జగత్తుకు, మరియు మనస్సుకు ప్రకృతియే ఆధారమగుచున్నది మనస్సు ద్రష్టగాను (చూచునది) భౌతిక జగత్తు దృశ్యముగాను ప్రవర్తించును రెండింటికి పరిణామమున్నది కాని అది భిన్నముగా నుండును అన్నారు కర్మ, కర్మ ఫలము రెండును ప్రకృతికి సంబంధించినవే, ఎందుకనగా స్థూల, సూక్ష్మ శరీరములు ప్రకృతి ప్రతిబింబములే గదా! అది గ్రహించలేక జీవాత్మగా నున్న పురుషుడు తానే కర్మలు చేయుచుంటినని విశ్వసించి కర్మఫలమును అనుభవించును అట్లు అజ్ఞానమున పురుషుడు ఒక దేహము నందు బంధితుడై తన నిర్గుణ, నిష్క్రియాత్మకమైన పురుషస్థితిని మరచును పురుషునకు చలనము లేదు కాని ప్రకృతిరూపమైన దేహము చలించును అందువలన ప్రకృతి చలనమునకు పురుషుడు రూపాంతరమగుచున్నాడు పురుషుడు చేతనుడు ప్రకృతి చేతనము కాదు కాని దేహము ద్వారా పురుష సామీప్యము పొంది తాను చేతనత్వము పొందినట్లు తలచును పురుషుడు కర్త కాకున్నను ప్రకృతి సంబంధమున కర్తగా భావించును అది అజ్ఞానము వలన కలుగును దుఃఖము ఉపాధియగు శరీరము వలన మనస్సుకు కలుగు భావము మాత్రమే యన్నారు అంతఃకరణమునందు ఆత్మ (పురుషుడు) ప్రతిబింబమే జీవాత్మ అని అనంతర సాంఖ్యులు ప్రతిబింబవాదము ప్రారంభించారు

జీవాత్మ మోక్షము కొరకు ప్రయత్నించును అట్టి జీవాత్మకు అనంతము, నిర్వికారము అయిన ఆత్మకు (పరమాత్మకు) ఎట్టి సంబంధముండదు జీవాత్మ పరమాత్మను గ్రహించినపుడు ముక్తి పొందును ఇది అద్వైతవాదము దీనితో సాంఖ్యమునకు పొంతనము కనబడును సాంఖ్యము చెప్పిన పురుషుడు శాశ్వతముగా నిర్వికారుడే కాని దుఃఖమును అనుభవించును స్ఫటికము తనకు దగ్గరగా నున్న ఎరుపు వర్ణమును ప్రతిఫలింపచేయును కాని స్పటికము

ఎరుపురంగు పొందదు పురుషుడు (ఆత్మ) దుఃఖము అనుభవించునట్లు భ్రాంతి కలిగినను వాస్తవమునకు ఆత్మ (పురుషుడు) దుఃఖము లేక స్వస్థితిలోనే యుండునని సాంఖ్యము చెప్పును ఎపుడైనను పురుషుడు నిర్వికార స్థితి నుంచి చలించినట్లు కనబడినను అది శాశ్వతము కాదు చంచలమైన మనస్సుతో కల్గిన తాత్కాలిక సంబంధమే అది అన్నారు ఈ సంబంధము యదార్థము కాదు కావున కర్మ సంస్కారములు ఆత్మకు (పురుషునికి) అంటవు

సాంఖ్యతత్త్వములో ప్రకృతి పురుష సంబంధం అతిక్లిష్టమైనది పరిణామ సిద్ధాంతము సాంఖ్యతత్త్వములో ప్రధానాంశము ప్రకృతి పరిణామమునకు ఒక ధ్యేయము కల్పించారు దేహము ప్రకృతి సంబంధము ఆత్మ దేహ సంబంధముచే అజ్ఞానమును పొందును అజ్ఞానము ఒక గాఢనిద్ర వంటిది అట్టి నిద్ర నుండి ఆత్మను మేల్కొలుపుటకు ప్రకృతి ఈ ప్రపంచమును పరిణామము ద్వారా దుఃఖమయము చేయుచున్నది అన్నారు ఆత్మ (పురుషుడు) నిర్వికారముగా నుండును అన్నారు గదా! మరి యీ మేలుకొలుపు ప్రక్రియ ఎందుకు? ఆత్మ నిర్వికారముగా ఉంటూనే దేహ సంబంధముతో భ్రమకు లోనగునట్లు కనబడును అన్నారు ఆ భ్రమను తొలగించుటకు పరిణామము అను జగన్నాటకమును ప్రకృతి ప్రదర్శించును పురుషుడు ఆత్మగా నిర్వికారుడే అయినను, జీవాత్మగా భ్రమకు లోనగును అందువలన జగత్పరిణామము అవసరమైనది అన్నారు అనగా ప్రకృతి చేయు కార్యమంతయు పురుషుని ప్రయోజనము కొరకే అగుచున్నది అయినను ఆ విషయము ప్రకృతికి తెలియదు అని సాంఖ్యవాదము పురాణములలో కల్పించబడిన విచిత్రములను సాంఖ్యము అంగీకరించదు కాని ఈ జగత్తు యొక్క నిర్మాణమందు అంతర్గతముగా ఒక ప్రయోజనమున్నదని సాంఖ్యభావము పురుషునికి భ్రమను తొలగించటమే ఆ ప్రయోజనము అన్నారు కాని సాంఖ్యతత్త్వము ననుసరించి ప్రకృతికి చలనమున్నది కాని చైతన్యము, విజ్ఞానము లేవు

వృక్షములకు విజ్ఞానము లేదు అయినను అవి ఫలములనిచ్చుచున్నవి అట్లే విజ్ఞానము లేకున్నను ప్రకృతి కర్మలు చేయుచున్నది అని సాంఖ్యవాదము ప్రకృతికి చైతన్యము లేనపుడు పరిణామక్రియకు ఒక చైతన్యశక్తి ఆధారం కావలయును గదా! కేవలం పురుషుని సాన్నిధ్యముచే ప్రకృతి క్రియల యందు పరవశమగుచున్నది (లోనగుచున్నది) అంతేకాని ప్రకృతిపై పురుష ప్రత్యక్ష ప్రభావము లేదు అన్నారు పురుషునికి సృష్టి సామర్థ్యము లేదు అయినను పురుష సాంగత్యము వలన సమస్త వస్తు సమూహముతో కూడిన ఈ జగత్తును ప్రకృతి కల్పించుచున్నది అన్నారు ప్రకృతి గ్రుడ్డిది పురుషుని 'యాజమాన్యము' లో అది జగత్తును జనింపచేయుచున్నది సాంఖ్యులు చెప్పిన ప్రకృతి పురుష సాంగత్యము చాల నిగూఢంగా కనబడును ప్రకృతి పురుషులకు పరస్పర ప్రభావము లేదు, అనుబంధము లేదు ప్రకృతి, పురుష సాంగత్యమునకు సాంఖ్యులు ఒక ఉదాహరణ చెప్పారు ఒక కుంటివాడు స్వచ్ఛమైన దృష్టి కలవాడు బలమైన పాదములు కల మరొకరు గ్రుడ్డివాడు ఆ గ్రుడ్డివాని భుజములపై కుంటివాడు ఎక్కుట వంటిది ప్రకృతి పురుష సాంగత్యము అని సాంఖ్యులు చెప్పిన ఉపమానము గ్రుడివాడు నడుచును కుంటివాడు మార్గము చూపును **ప్రకృతికి ఉపమానము గ్రుడ్డివాడు, పురుషునికి ఉపమానము కుంటివాడు**

ప్రకృతి సంబంధముచే పురుషునకు అజ్ఞాన భ్రమ కలుగును పురుష సాన్నిధ్యముచే ప్రకృతి యందు త్రిగుణముల అనగా సత్వరజస్తమో గుణముల సామరస్యము (balance) చెడును ఈ సామరస్యభంగమే ప్రకృతి యందలి పరిణామములకు కారణము అన్నారు పరిణామమునకు పూర్వము ప్రకృతి సామ్యస్థితి (state of balance) లో నుండును పురుషుడు గూడ గుణములకు అతీతముగా సామ్యావస్థయందే యుండును పరస్పర సాంగత్యము వలన పురుషుడు భ్రమకు లోనై ప్రకృతిలోని సామ్యావస్థ చెడుటకు పరోక్షముగా కారణమగును అందుచే ప్రకృతిలో పరిణామములు

జరుగును ప్రకృతి తిరిగి సామ్యస్థితి పొందినపుడు మరల పురుష ప్రభావముచే పరిణామ దశలు ప్రారంభమగును ఇది ఒక వలయము ప్రకృతి పరిణామములకు పురుషుడే ఆదికారణము, అంత్యకారణము కూడ అన్నారు అయినా సాంఖ్యతత్త్వములో పురుషుడు నిమిత్తమాత్రుడు అతనికి ఎట్టి సంకల్పముండదు కేవలము పురుష సాన్నిధ్యమే ప్రకృతి పరిణామములకు కారణము అని సాంఖ్యభావము కర్మలు చేయునది ప్రకృతి, కాని పురుషుడు (జీవాత్మ) తాను చేసినట్లు భ్రమించును ఇదే పురుషుడు జీవాత్మ అగుటకు కారణము

పురుషుడు ప్రకృతిపై చూపు ప్రభావము అయస్కాంతము సూదిని ఆకర్షించినటులే ప్రకృతి పురుషులు వేరై యున్నారు ప్రకృతిపై పురుష ప్రభావము సత్యమే రెండింటికి సంబంధమున్న మాట సత్యమే కాని ఈ ప్రకృతి పురుష సంబంధ పూర్తి స్వరూపము అర్థం చేసికొనుట సులభము కాదు ఆ సంబంధమును గూర్చి రహస్యము మన వివేకమునకు అతీతమైనది అని సర్వేపల్లి రాధాకృష్ణ అభిప్రాయపడ్డారు జీవాత్మల ప్రయోజనము కొరకే ప్రకృతి వర్తన తోడ్పడును జీవాత్మగా పురుషుడు లింగశరీరముతో ఐక్యత భ్రమించి కోరికలు కలవాడగును అపుడు దుఃఖజ్ఞానము అవసరమగును కావున ప్రకృతి పరిణామములు జరుగును జీవుల బంధవిముక్తికి దుఃఖము వలన కలిగిన అనుభవము అవకాశము కలిగించును ప్రకృతి పురుషుల సంబంధ మున్నది ఈ సంబంధమున్నంతకాలము ప్రకృతి పురుషునికి అనుకూలముగా ప్రవర్తించును ప్రకృతి వేరు తాను వేరు అని పురుషుడు గ్రహించినపుడు ఆ సంబంధము పోవును యదార్థ పురుషులు అజ్ఞానము పొందుటయే ప్రకృతి పురుషుల సంబంధమునకు కారణమగుచున్నది

యదార్థ పురుషులను ప్రకృతి ఎట్లు వశపరచుకొన్నదో తెలియదు ఆ పురుషులు తమ ఇచ్ఛకు వ్యతిరేకముగా ప్రకృతి బంధములో ఎపుడు ఎటుల

చిక్కుకొనిరో తెలియదు అందువలన ఆ బంధమునకు కారణమైన అజ్ఞానమునకు ఆది యున్నట్లు కనబడదు ఈ విషయములు సాంఖ్యులు వివరించలేదు అసలు ఈ అజ్ఞానము పురుషునికి ఎటుల కలుగునో మనకు తెలియదు దాని ఆది లేదు కాని అంతమున్నదన్నారు ప్రకృతితో పురుషునికి సంయోగమేర్పడును కాని ప్రకృతికి పురుషునితో సంయోగముండదు అన్నారు ఎందుకనగా యీ సంయోగము యదార్థముగా పరిణామము కాదు అన్నారు పురుషునిలో క్రొత్త లక్షణము లేవియును ఉద్భవింపవు అన్నారు పురుష ప్రకృతి సంయోగము "భోగి భోగ్య" సంబంధము అని కొందరి అభిప్రాయము భోగి అనగా అనుభవించువాడు భోగ్యము అనగా అనుభవించతగినది పురుషుడు భోగి, ప్రకృతి భోగ్యము

జీవాత్మ వాస్తవమునకు పురుషుడే అని చెప్పారు పురుషుడను ఈ వాస్తవ ఆత్మ (True self) బుద్ధి, మనసు, జ్ఞానేంద్రియములు, శరీరములతో సంపర్కము వలన జీవాత్మ అగుచున్నాడు శరీరము రెండు భాగములు 1 స్థూల శరీరము, 2 సూక్ష్మ శరీరము లేక లింగశరీరము స్థూలశరీరము భౌతికము సూక్ష్మశరీరము ఆంతరికము సూక్ష్మశరీరమందు బుద్ధి, మనస్సు, జ్ఞానేంద్రియములను కలిగి యుండును ఈ సూక్ష్మశరీరము ప్రకృతి ఉత్పాదన సూక్ష్మశరీరము చేతనము కాదు కాని పురుషుని సంబంధము వలన చైతన్యము పొందును ఈ సూక్ష్మశరీరము ద్వారానే జీవుడు (జీవాత్మ) సుఖదుఃఖములను కర్మసిద్ధాంతముననుసరించి అనుభవించును జనన మరణములు, పునర్జన్మలను పొందును పురుషుడు స్వతంత్రుడైనను సూక్ష్మశరీర సంపర్కముచే అజ్ఞానమునకు లోనగును పరిమిత (limited) స్థితిగతులలో భౌతికముగా బంధితుడగును మరణముతో స్థూలశరీరము నశించును కాని లింగశరీరం స్థితిని పొందియే యుండును కర్మ సంస్కారములు ఈ లింగశరీరమునంటియే యుండును పునర్జన్మ ఈ సంస్కారముల

ననుసరించియే యుండును లింగశరీరము ననుసరించియే జీవుని ప్రవృత్తి యుండును

లింగశరీరము త్రిగుణములతో కూడియుండును పరిణామ దశలలో ఏదో ఒక గుణము ప్రబలమగును సత్వగుణ ప్రభావము ఎక్కువైనపుడు పురుషుడు తన యదార్థ స్థితి గ్రహించుటకు అవకాశమేర్పడును తుదకు పురుషుడు స్వేచ్ఛను పొందగలుగును ఆ విధముగా ప్రకృతి పురుషునికి బంధము కలిగించి దుఃఖానుభవము ద్వారా బంధవిముక్తికి కూడ తోడ్పడును అది ఎటులనగా ప్రకృతి అజ్ఞానము కలిగించి పురుషుని భ్రమకు లోనగునట్లు చేయును కాని ఆ అనుభవము ద్వారానే ప్రకృతికార్యమే అది అని పురుషుడు గ్రహించగలుగును అపుడే పురుషుడు ఉదాసీనుడు (detached) అగుటకు ప్రయత్నించును పురుషుని కొరకే ప్రకృతి ఉత్పన్నమైనట్లు అనిపించును కాని ప్రకృతి కొరకు పురుషుడు (ఆత్మ) ఉత్పన్నము కాలేదు పుష్పముల నుండి తేనెను గ్రహించుటకు తేనెటీగలు పుష్పములపై చేరును అంతేగాని పుష్పములలో బందీలగుటకు కాదు అటులే జీవుడు ప్రకృతి నుండి అనుభవమును గ్రహించవలయునే గాని ప్రకృతితో ఐక్యత (identify oneself) పొందకూడదు అని సాంఖ్యభావము క్రమముగా జీవుడు మేలుకొని తనను తాను తెలుసుకొని పురుషునిగా స్వేచ్ఛను పొందును అటుపై జీవునికి ప్రకృతి బంధములు గాని కర్మబంధములుగాని ఉండవు జీవునికి ఈ స్వేచ్ఛ కలిగించుటకు ప్రకృతి ప్రయత్నించును అని స్వామి వివేకానంద అన్నారు

జీవుడు స్వేచ్ఛ పొందగానే ప్రకృతి కార్యము నెరవేరినట్లు అగును ప్రకృతికార్యము నిస్వార్థసేవ అని స్వామి వివేకానంద కొనియాడారు స్వామి ఇంకా ఇలా అన్నారు భ్రమలో తనను తాను మరచిన జీవుని చేయి పట్టుకుని ప్రకృతి నడిపిస్తూ ఒకటి తరువాత మరొక మెట్టు ఎక్కిస్తూ పరిణామముల ద్వారా వస్తురూపములను పరిచయం చేస్తూ అనుభవము కలిగిస్తూ జీవుడు

తనను తాను శుద్ధపురుషునిగా గుర్తించగలుగునట్లు చేయును ప్రకృతి చేయు ఈ కార్యమునకు ఆది అంతములు లేవు ఒక ప్రవాహమువలె అనంతములైన జీవులు సుఖదుఃఖముల ద్వారా పయనించి తమను తాము గుర్తించి స్వేచ్ఛ అను మహాసముద్రమున చేరును తనను తాను గుర్తించగలిగిన జీవుడు ధన్యుడు అన్నారు స్వామి వివేకానంద

పురుషుని యందు ప్రపంచము యొక్కయు, అతని యొక్కయు యదార్థ స్వరూపమును గురించిన జ్ఞానమును ప్రకృతి ప్రతిఫలింపచేయును ప్రకృతి, పురుషులు భిన్నములు అయినా అంతర్గతముగా వారి మధ్య ఏకత్వమున్నదని ఇది సూచించుచున్నదని సర్వేపల్లి రాధాకృష్ణ అభిప్రాయపడ్డారు పురుషునితో సంబంధము కలిగినపుడు మాత్రమే ప్రకృతి పరిణామము చెందుచున్నది ఈ సంబంధము లేనపుడు ప్రకృతి వ్యక్తము కాదు అనగా కనబడదు ప్రకృతి అది చేయు పని ద్వారా మాత్రమే వ్యక్తమగును పురుషునితో సంబంధము కలిగినపుడే ప్రకృతి పని జరుగును అదే పరిణామరూపము అనగా పురుష సంబంధము లేని ప్రకృతిని ఊహించుట దుర్లభము ప్రకృతి లేని పురుషుడు సర్వస్వతంత్రుడు, నిత్యుడు అటులే పురుషునితో సమానమైన నిత్యత ప్రకృతికి కూడ ఉన్నదని సాంఖ్యసిద్ధాంతము దీనినే ఇంకొక విధముగ చెప్పినచో ఒకే సత్యస్వరూపములోని భిన్న అంశములే ప్రకృతి పురుషులు సృష్టిరూపమైన పరిణామమునకు అవి రెండును మూలాధారములైన ముఖ్యాంశములు అని సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు

ఈ పరిణామములో ప్రకృతి నుండి మహత్తు (బుద్ధి) అహంకారం మొదలైనవి ఉద్భవించటం ప్రాథమికం (Primary) అటుపై వస్తురూపములైన వృక్షములు మానవ శరీరములు మొదలైనవి ఏర్పడును ఇది తరువాతి (అనంతర) పరిణామము (secondary) ప్రాథమిక పరిణామ ఫలితముగా లేక రూపాంతరముగా ఈ ద్వితీయ (అనంతర) పరిణామము జరుగును ఇందు

ప్రథమ పరిణామమునకు భిన్నమైన లక్షణములు ఏవీ ఉద్భవించవు ఈ ద్వితీయ పరిణామరూపములు అపుడపుడు ప్రాథమిక పరిణామదశను తిరిగి పొందవచ్చును లేదా ఒక యుగాంతము వరకు (cycle) ద్వితీయ దశలోనే యుండవచ్చును ఒక వృక్షము నాశనమై పంచభూతములలో కలియవచ్చును కాని ఆ పంచభూతములు మాత్రము తిరిగి అంశములుగా విభజింపబడవు

ప్రకృతి మూలద్రవ్యము ఈ ప్రపంచమంతయు దాని నుండియే జనించినది సాంఖ్య సిద్ధాంతము ప్రకారం ప్రకృతి మిశ్రితము కానిది అనగా ఏకత్వము గలది (homogeneous) కాని నానావిధములుగానున్న ఈ జగత్తు (heterogeneous) ప్రకృతి యొక్క సృష్టియే పరిణామరూపమే ఈ సృష్టి అన్నారు వాస్తవమునకు క్రొత్త సృష్టి, ఉన్న సృష్టి నాశనమగుటగాని లేదు అని భావము సృష్టి నిత్యము జరుగుతూ ఉంటుంది ప్రస్తుతమున్న జగత్తు, అనేక జగత్తుల పరంపరలో ఒకటి జగత్తులు (worlds) గతంలో ఉన్నాయి ఇకముందు గూడ ఉంటాయి ప్రస్తుతం మనకు కనబడు పరిణామము గతంలోనూ ఉన్నది, భవిష్యత్తులోనూ ఉంటుంది క్రమానుసారంగా, నిరంతరం పరంపరగా జరుగుతూ ఉంటుంది ఈ పరిణామం అన్నారు ఆ విధముగా పాశ్చాత్య జీవశాస్త్రజ్ఞులు చెప్పిన పరిణామ సిద్ధాంతము (Theory of Evolution) నకు ఎన్నో వందల సంవత్సరములకు పూర్వమే సాంఖ్యులు పరిణామ సిద్ధాంతమును ప్రతిపాదించారు

ఈ పరిణామ క్రమములో అనగా సృష్టిక్రమములో క్రొత్తగా వచ్చి ఏది కలవదు కాని ఈ పరిణామకార్యము యొక్క ఫలితమే పునరుత్పత్తి (reproduction) అది కారణము యొక్క రూపాంతరము లేక మార్పు మాత్రమే అనగా ఫలితము కారణములోనే ఇమిడి యున్నదని సాంఖ్యవాదము కాబట్టి ప్రకృతి లోపల ఏదైతే ఇమిడియున్నదో లేక అణిగియున్నదో అది బయటకు వికసించుటయే పరిణామము అని సాంఖ్యము చెప్పుచున్నది ఈ

అను క్రమము (process) లో ఆటంకములు తొలగించుకొనవలసిన అవసరమే ఒక షరతు (condition) సాంఖ్య సిద్ధాంతము ననుసరించియే యోగదర్శన ప్రవక్త పతంజలి పరిణామ పరంపరకు ఒక ఉపమానము చెప్పారు పంట పొలములకు వచ్చు నీటి ప్రవాహమునకు అడ్డములు తొలగించటమే రైతు చేయుపని నీరు అక్కడ క్రొత్తగా జనించలేదు దగ్గరనున్న కాలువలో నీరు అంతకు పూర్వమే యున్నది ఆటంకము తొలగిస్తే నీరు అదే ప్రవహిస్తుంది

ఈ ఆటంకములు తొలగించు ప్రక్రియ ప్రకృతిలో సహజముగానే యున్నది ప్రకృతిలో నివే త్రిగుణములు పరిణామ పరంపరలో ఫలితమునకు శక్తివంతమైన కారణము ఈ త్రిగుణములె ఈ త్రిగుణములు ప్రకృతి యొక్క స్థితిదశలుగా (aspects) పనిచేయును జీవ, నిర్జీవముల పరిణామములలో అవి వ్యక్తమగును పరిణామములో (organic) జీవ, నిర్జీవముల (inorganic) (జడపదార్థము) భేదమును గురించి సాంఖ్యము ఏమియు చెప్పినట్లు కనబడదు వాస్తవమునకు పరిణామము పొందునవి గుణములు మాత్రమే పురుషుడు పరిణామము చెందడు కారణము అవ్యక్తముగా ఉండి (కనబడక యుండి) కార్యరూపమున వ్యక్తమగుటయే పరిణామము అన్నారు పరిణామరూపమున ప్రకృతి అనేక ద్రవ్యములను ఉత్పత్తి చేయును కాని తాను మాత్రము అవ్యక్తముగానే యుండును పురుషుడు పరిణామము చెందడు అతడు శుద్ధ చైతన్యస్వరూపుడు (consciousness) కాని జీవాత్మగా త్రిగుణములతో కూడిన సూక్ష్మ శరీరమందు బంధితుడగును జీవపరిణామము ద్వారా ఒక క్రమములో ఎదిగి అనగా వికసించి తుదకు ముక్తుడగును (liberated) భావాతీతమైన చైతన్యస్థితికి చేరినపుడు అనంతము పరిణామరహితము అయిన పురుష (ఆత్మ)స్థితికి జీవుడు చేరును ప్రకృతి ప్రతిబింబములైన బుద్ధి, అంతఃకరణ, మనస్సుల నుండి జీవుడు విముక్తుడగును కాని ఒక విషయము గ్రహించవలసియున్నది ప్రకృతి అవ్యక్తము తనంతట తానుగా ఏ పరిణామము చెందదు పురుష సాన్నిధ్యము వలన త్రిగుణ సామరస్యము (balance)

భంగమగుట ద్వారా పరిణామము చెందునట్లు కనబడును సూక్ష్మశరీరములో నున్న పురుషుడు మాత్రము పరిణామము చెందదు క్లుప్తముగా ఇదియే ప్రకృతి యొక్క పరిణామ పరంపర

ప్రకృతిలో సత్వరజస్తమో గుణములు మూడు సమతుల్యముగా (equilibrium) నుండును ఎపుడైతే ఆ సమతుల్యము లేక సామరస్యము (balance) భంగమగునో అపుడే పరిణామము (evolution) ప్రారంభమగునుని సాంఖ్యావాదము ప్రకృతి నుండి పరిణామములో మొదటగా ఉత్పత్తి అగునది మహత్తు మహత్తు అనగా ప్రకృతి (జగత్తు) (cosmic) సంబంధమైన బుద్ధి దీనిని శుద్ధబుద్ధిగా తలంచరాదు శుద్ధబుద్ధి (pure intelligence) అనగా ప్రకృతికి బద్ధుడు కాని శుద్ధపురుషుడు దీనినే మరొక విధముగా చెప్పినచో పరిణామములో మొదట ఉత్పన్నమగు బుద్ధిని (intelligence) జగత్తు సాధనముగా అనవచ్చును జీవాత్మ బుద్ధికి పురుషుని బుద్ధి మూలము కాని జీవాత్మ బుద్ధి శుద్ధపురుషుని బుద్ధి కాదు ఆ పురుషుని బుద్ధి జగత్తు బుద్ధియందు ప్రతిబింబించి జీవునకు ఆధారమగును దానిని మహత్తు అన్నారు కొంతమంది మహత్తును బుద్ధి అనకుండా జగత్తు బుద్ధినందు పురుష శుద్ధబుద్ధి ప్రతిఫలించినపుడు ఏర్పడు దానిని వ్యక్తిసాధకమైన బుద్ధి అన్నారు పరిణామములో రెండవ స్థాయి అన్నారు అనగా మహత్తు నుండి బుద్ధి పరిణమించును అని భావించారు మహత్తునందు శుద్ధబుద్ధి ప్రతిఫలించినప్పుడు బుద్ధి ఏర్పడును అని భావము ఈ బుద్ధి ద్వారా వస్తుభేదమును గుర్తించి పురుషుడు అనుభవమును పొందును వ్యక్తియందు బుద్ధి పురుషుని కొరకే పనిచేయును అన్ని ఇంద్రియములు బుద్ధి కొరకు పనిచేయును అయినను పురుషుని యందు ఎట్టి పరివర్తన ఉండదు కాని బుద్ధి ద్వారా వస్తుప్రపంచమును అనుభవించును స్వప్నావస్థ (subconscious) లో కలుగు మనోభావము లన్నియు (impressions) బుద్ధియందు నిల్వయుండునని సాంఖ్యభాష్యకారులు వ్యాఖ్యానించారు అనగా బుద్ధి ఒక నిల్వగది (గిడ్డంగి) (store-house) వంటిది

అని వారి అభిప్రాయము

బుద్ధికి అనంతర పరిణామము అహంకారం ఇది 'నేను' అను భావము లేక స్పృహ (self sense) తన యందు తనకు గల అభిమానమే అహంకారమునకు ప్రధానమైన స్వభావము (ప్రవృత్తి) (ego) అహంకారమునకు అనంతమైన పరిణామమే ఈ వస్తు ప్రపంచము అని సాంఖ్యసిద్ధాంతము విశ్వమంతట వ్యాపించియున్న అహంకారము ఒక సమిష్టిరూపము (combined) అనియు దాని వ్యష్టి (individual) రూపములే యీ వస్తు ప్రపంచమందలి దృశ్యములు అని ఊహింపవలసియుండును అని సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు అహంకారము భౌతిక పదార్థమని సాంఖ్యులు తలచారు బుద్ధి యందు జ్ఞానాధిక్యత, అహంకారమునందు క్రియాసమర్థత అధికభాగముండును అన్నారు ఈ క్రియా సమర్థత వలన కర్తృత్వ భావము కలుగును ఈ కర్తృత్వ భావము అహంకారమునకే పరిమితము పురుషునికి ఉండదు

విజ్ఞానమునకు ఆత్మజ్ఞానముతో సంబంధము ఉండును అట్టి సంబంధమే మహత్తునకు అహంకారముతో ఉండును మహత్తునకు అహంకారముతో సంబంధముండవలయును అనినచో విజ్ఞాన ఆత్మజ్ఞాన సంబంధము కూడ ఉండవలయును అను వాదన హేతుయుక్తమైనది అని రాధాకృష్ణ అభిప్రాయపడ్డారు అహంకారము ఉన్నది అని దాని వలన జరుగు కార్యముల ద్వారా తెలియుచున్నది ఇతర వస్తువులకు ఉపాదానము అనగా ప్రధాన కారణము అగుచుండుటచే అహంకారము కూడ ఒక ద్రవ్యము అన్నారు అహంకారము వలన ప్రకృతియందు జరుగు కర్మములన్నియు తనవేయని జీవాత్మగానున్న పురుషుడు తలచును ఒక కార్యమును గురించిన సూచనలు, తపన ఆత్మకు అహంకారము అందచేయును ఈ విధముగా ఒక భావము ఏర్పడుట, కార్యనిర్ణయక్రమమునందు అహంకారము జీవాత్మకు తోడ్పడును అన్నారు అయినను అహంకారము విశ్వచైతన్యము నుండి

వ్యష్టిగా రూపొందినది కాదు అన్నారు బాహ్య ప్రపంచమునుండి భావములు వచ్చును ఈ భావములకు వ్యక్తిత్వము అనగా రూపము అహంకారము కలుగజేయును అన్నారు ఈ అహంకారమునకు సత్వగుణసంపర్కము కలిగినపుడు మనము సత్కర్మలు చేయుదుము రజోగుణముతో కూడినపుడు స్వార్ధపరత్వముతో కార్యములు చేయుదుము తమోగుణ ఆధిక్యము కలిగినపుడు మనము సోమరులమై నిరాసక్తులుగా నుందుము నిద్రావస్థ (unconscious state) యందు అహంకారము ప్రవృత్తిలో ఉండదు అన్నారు అనగా జాగ్రదవస్థ (conscious) స్వప్నావస్థ (subconscious state) ల యందు మాత్రమే స్వభావమందు అహంకారము పనిచేయును అని చెప్పబడింది కాని కామ్యకర్మముల వలన ఏర్పడిన సంస్కారములన్నియు నిద్రావస్థయందు కూడ యుండును అవి కార్యరూపము మాత్రము పొందవు అహంకారము ఎటుల ఏర్పడుచున్నదో చెప్పుట సాధ్యపడదు అది మహత్తు నుండి ఏర్పడుచున్నదా, బుద్ధి నుండి ఏర్పడుచున్నదా చెప్పుట కష్టసాధ్యము

అహంకారము నుండి పరిణామము పొంది ఉత్పన్నమైనవే త్రిగుణములు గుణములు మూడు విధములుగా పరిణామము చెంది సత్త్వ రజస్తమోరూపములను పొందుచున్నవి అహంకారము నుండి త్రిగుణములు మూడు భిన్నమార్గములలో పరిణామమునకు తోడ్పడును సత్వ లేక తమో గుణ ఆధిక్యతననుసరించి దానికి రజోగుణము తోడ్పడును ఆ విధముగ పరిణామమార్గము (course) ఏర్పడును అహంకారము సాత్త్వికమైనపుడు మనస్సు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు రూపొందును అహంకారము తామసమైనపుడు శబ్ద, స్పర్శ, రూప (దృష్టి), రస (నాలుక/రుచి), గంధములు (వాసన) కలుగును ఈ అయిదు సూక్ష్మ భూతములు వీటినే పంచతన్మాత్రలు అన్నారు తామసగుణమధికమైనపుడు ఈ సూక్ష్మభూతముల పరస్పర సంయోగముచే, రజోగుణ సహకారముతో అయిదు స్థూలభూతములు ఏర్పడును వీటినే పంచభూతములు అన్నారు

పృధివి, నీరు, అగ్ని, వాయువు ఆకాశములు అన్నారు (earth, water, fire, air and ether or sky) ఈ పంచభూతములందు ఏదో ఒక గుణము అతిశయించినను మిగిలిన గుణములు తమ విధులను నెరవేర్చి వస్తు పరిణామము నందు పరోక్షముగా (indirectly) సహకరించును ఈ పంచభూతములు ప్రత్యక్షముగా మనస్సుకు తద్వారా అప్రత్యక్షముగా (indirectly) పురుషునకు తమను తాము వ్యక్తపరచుకొనుటలో సత్త్వగుణము వ్యక్తమగును (అనగా కనబడును)

మనస్సు ఒక అవయవము ఇంద్రియములు ఇచ్చు దృశ్యములను భావములుగా సమన్వయము (జ్ఞానేంద్రియములు) చేసి బుద్ధికి అందచేయుట మనస్సు యొక్క ముఖ్య కర్తవ్యము బుద్ధి యొక్క ఆజ్ఞలను కర్మేంద్రియముల ద్వారా నెరవేర్చుట కూడ మనస్సు యొక్క కర్తవ్యము బుద్ధికి అహంకారమునకు మధ్య భేదము సాంఖ్యలు ఎటుల నిర్వచించలేదో అటులే మనస్సును గూర్చియు, ఇంద్రియములు, వాటి ప్రవృత్తికిని కల భేదమును గురించి గూడ స్పష్టముగా చెప్పలేదు ఇంద్రియములు ద్వారములనియు, మనస్సు ద్వారపాలకుడని మాత్రము అన్నారు సాంఖ్యలు అన్ని కర్మలకు మనస్సు సహకారమవసరమున్నది కావున మనస్సు జ్ఞానమునకు, క్రియకు కూడ అవసరమే అయినను మనస్సునకు చలన, క్రియాశక్తులుండుట వలన అది అవిభక్తమైన (వేరుచేయబడని) సర్వవ్యాపి కాదు దానికి భిన్న భాగములు కలవు అనగా అవయవములతో కూడినది ఈశ్వరునికి మాత్రమే గల నిత్యత అను లక్షణము బుద్ధికి, ఇంద్రియములకు లేవు

ఆ విధముగ వాటి పని, ధర్మము, కర్మముల ననుసరించి బుద్ధికి, అహంకారమునకు, మనస్సునకు గల భేదము చెప్పబడింది బుద్ధి, అహంకారము, మనస్సులను కలిపి అంతఃకరణము అన్నారు ఇది ఆంతరిక అవయవము (inner organ) అదే మనస్సు ద్రవ్యము లేక పదార్థము (mind stuff)

ఇంతకు ముందు చెప్పినట్లుగా అహంకారము నుండి మనస్సేకాక అయిదు సూక్ష్మభూతములు ఏర్పడినవి (subtle elements) వీటినే తన్మాత్రలు - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు (hearing (sound), touch, sight, taste and smell) అన్నారు ఈ తన్మాత్రలు భౌతిక ప్రపంచమును (వస్తు ప్రపంచమును) రూపొందించును తన్మాత్రలు భౌతికతత్వములే కాని గోచరములు కావు కాని ప్రపంచము గోచరమగును సూక్ష్మభూతములైన (the finer materials of gross elements) అయిదు తన్మాత్రలు అయిదు జ్ఞానేంద్రియములు - చర్మము (త్వక్కు) కళ్లు, చెవులు, నాలుక, ముక్కు (sensory organs) - యొక్క భౌతిక స్వభావములు మాత్రమే ఇవి దృష్టికి గోచరించునవి కావు ఇందు ఒక్కొక్కటి ఒక్కొక్క ఇంద్రియసంబంధమును కలిగియుండును - శబ్ద - చెవులు, స్పర్శ - చర్మము, రూపము - దృష్టి లేక కళ్లు, రస - నాలుక (జిహ్వ), గంధ - ముక్కు ఈ తన్మాత్రలు మరల, మరల సంయోగము చెంది స్థూలభూతములు అనగా పంచభూతములు (gross elements – Five elements) ఏర్పడుటకు తోడ్పడును వాస్తవమునకు పంచభూతములు తన్మాత్రల (essensces) భిన్నభిన్న సంయోగరూపములే ఈ వ్యత్యాసము లేక నానావిధత్వము (variety) వలన వస్తువప్రపంచము అనేక విధములుగ కనబడును ఉదాహరణకు భూమి గంధ (వాసన) తన్మాత్రను ప్రధానముగా పొందియున్నది కాని మిగిలిన నాలుగు తన్మాత్రలు కూడ ప్రతి ఒక్కటి $^1/_8$ అంశములో కలిసియున్నవి అటులే మిగిలిన నాలుగు స్థూలభూతములు గూడ తన్మాత్రలను కలిగియున్నవి తన్మాత్రలు భౌతికదృష్టికి గోచరములు కావు పరమయోగదృష్టికి మాత్రమే గోచరమగును

తన్మాత్రల సంయోగ పరంపర ద్వారా పంచభూతములు ఏర్పడుట ఈ విధముగ జరుగును అన్నారు సూక్ష్మభూతమైన శబ్దతన్మాత్ర ఆకాశమును రూపొందించును దాని నుండి స్పర్శ తన్మాత్ర సంయోగముచే వాయువు ఏర్పడును ఈ రెండింటి నుండి రంగు (రూపము) తోడు కాగా అగ్ని (తేజస్సు)

ఉద్భవించును పై మూడింటికి రుచి కలిసినపుడు నీరు ఏర్పడును చివరకు పై నాలుగింటితో గంధము (వాసన) సంయోగము చెందినపుడు పృధివి రూపొందును ఈ పంచభూతముల స్వభావములు అందలి తన్మాత్రల ననుసరించియుండును అన్నారు ఆకాశ స్వభావము శబ్దము, వాయుస్వభావము శబ్దము, స్పర్శ, అగ్ని స్వభావము (రంగు) రూపము, శబ్దము, స్పర్శ, అటులే నీటికి రూప, శబ్ద, స్పర్శకు తోడు రుచి స్వభావము కలుగును పృధివికి ప్రధాన స్వభావం గంధము (వాసన) కాని రూప, శబ్ద, స్పర్శ, రుచి స్వభావములు కూడ కలిసియుండును భూతములను (Elements) సూక్ష్మ (subtle) అనగా తన్మాత్రలుగాను, స్థూల (Gross elements) భూతములుగాను విభజించుట న్యాయ-వైశేషికములు అంగీకరించలేదు

తన్మాత్రలు అణురూపము పొందినగాని ఇంద్రియసంబంధ విషయములు కాజాలవు అహంకారమునకు ద్రవ్యత్వము ఉన్నది కాని తమోగుణముచే ఆవృతమైన అహంకారము భేదరహితము, క్రియాశూన్యము రజోగుణము ఆవృతమైనపుడు అహంకారమునకు పరిభ్రమణశక్తి కలుగును అపుడు అది తేజోవంతమైన సూక్ష్మపదార్థముగ మారి శక్తిని పొందును అపుడే అహంకారము నుండి తన్మాత్రలు ఉద్భవమగును పంచభూతములకు తన్మాత్రలకు మధ్యమస్థానము ఆకాశము అన్నారు ఆకాశమును రెండుగా చెప్పారు 1) కారణాకాశము, 2) కార్యాకాశము కారణాకాశము సూక్ష్మమైనది అది సర్వవ్యాప్తమైనది కార్యాకాశము అణురూపములో నుండును ఇది పంచభూతములలో నొకటి అహంకార అంశములలో శబ్దతన్మాత్రలు కలిసినపుడు కారణాకాశము ఏర్పడును ఈ కార్యాకాశమునందే శబ్దతన్మాత్రలు అణుపరిణామము ద్వారా వాయువు ఏర్పడుటకు ఆధారమై యున్నది ఇట్లే మిగిలిన స్థూలభూతములేర్పడును

స్థూల అణువులు (gross elemental particles) కలిసినపుడు వాటి

గుణములు సంయుక్తద్రవ్యమునందు ఉండును కాని వాని తత్త్వములలో భేదముండదు ఆకాశ అణువునకు ఇతర ద్రవ్యములను ప్రవేశింపజేయు శక్తియున్నది వాయు అణువునకు ఒత్తిడి కలుగజేయు శక్తియున్నది అగ్ని (లేక) తేజస్సు అణువునకు ఉగ్రకాంతి, ఉష్ణశక్తులుండును జలఅణువునకు ద్రవ్యత్వమున్నది, పృధివి అణువునకు సంయోగము, ఆకర్షణశక్తి యున్నవి స్థూల అణుసంయోగము వలన పృధివీభూతము జనించుచున్నది సుఖ దుఃఖములను కలుగజేయు శక్తి తన్మాత్రలది అది తన్మాత్రల రూపములో ఉండదు అది స్థూల అణువులలో ఉండును అందువలన స్థూలభూతములకు (పంచభూతములు) గుణభేదములు చెప్పబడినవి అందువలననే భూమి అణువులు అనేక గుణభేదములచే నానారూపములతో కనబడుచున్నవి ఒకే అణువుతో ఏర్పడు వస్తువులలో చెప్పదగిన భేదములుండవు ప్రతి వస్తువులోను నిగూఢంగా శక్తి ఇమిడియుండును ఆ శక్తి సమానమైనదే అగుట వలన పరిణామమంతయు పురుషుని కొరకేయని చెప్పబడినది

స్థూల అణువులు చేతన, అచేతన అనగా కదలునవి (జంగమములు), కదలిక లేనివి (స్థావరములు) అన్నిటిని కల్పించును అందువలన అచేతనముల నుండి చేతన రూపములు ఏర్పడునపుడు పరిణామ పరంపరలో ఎట్టి విచ్ఛిన్నము ఉండదు అచేతనములు, స్థావరములు, జంగమములు అనునవి పరిణామములో స్థాయిలు (స్థితులు) (stages) అగుచున్నవి వీటియందలి ద్రవ్యములలో భేదముండదు కాని ఆ ద్రవ్యగుణములందు భేదముండును అణువులు భిన్నవిధములుగ సంయోగము చెందుట వలన భిన్నభిన్న గుణములు ఏర్పడుచున్నవి అన్ని దేహములకు భూమియే ప్రధాన కారణము ఇతర భూతములు సహకరించును స్థూలదేహము పంచభూతములచే ఏర్పడునని చెప్పబడినను అందు ఆకాశము అనవసరము అని కొందరు చెప్పగా మరికొందరు భూమి ఒక్కటి మాత్రమె చాలునని అన్నారు ఏది ఏమైనను మానవ స్థూల శరీరమందు భూమి (పృధివీభూతము) అంశము అధికముగా నుండునని

చెప్పబడినది

పరిణామములో ప్రకృతి నుండి పంచభూతముల వరకు తత్త్వములు యిరువది నాలుగు అనియు, పురుషుడు ఇరువది అయిదవ తత్త్వము అనియు చెప్పబడింది ఇది సాంఖ్యసిద్ధాంతము ప్రకృతి నుండి ఉత్పన్నమగు ఇరువది మూడు తత్త్వములు కార్యములే అన్నారు ఎందువలననగా అవి ప్రకృతి పురుషుల కంటే భిన్నమైనవి పరిమిత పరిమాణము కలవి అగుటచే వాటి ప్రధాన లక్షణములు వృద్ధి, శక్తి అందుచే అవి పురుషునికి ఉపకరణము లగుచున్నవి

ఈ ప్రపంచము వస్తుమయము ఆ వస్తువులు ప్రకృతికి వికృతులని చెప్పబడినవి ఒక మూలద్రవ్యమునకు గుణములకు సంబంధముండును అట్టి సంబంధమే ప్రకృతివికృతులకు చెప్పబడింది మహత్తు అహంకారము, అయిదు తన్మాత్రలు కొన్నిటికి కారణములుగాను, కార్యములుగాను అయి ఉన్నవి పంచస్థూలభూతములు దేనికిని కారణములు కావు పదకొండు ఇంద్రియములు కూడ వేనికిని కారణములు కావు పురుషుడు కారణము కాదు, కార్యమును కాదు ప్రకృతి అవ్యక్తము, వ్యక్తముగాను ఉండును అనగా అగోచరము (కనబడనిది), గోచరము (వస్తు ప్రపంచముగా కనబడునది) కారణరూపమున ప్రకృతి అవ్యక్తముగా నుండును కార్యరూపమున అది వ్యక్తమగుటయే (కనబడుటయే) పరిణామము అన్నారు ప్రకృతి అనేక ద్రవ్యములను ఉత్పత్తి చేయును అయినను అది అవ్యయముగానే నిలిచియుండును ఈ వస్తు ప్రపంచమున వస్తువులు ఉత్పత్తి అగును అయినను ఆ వస్తు ఉత్పత్తికి మూలాధారమైన ద్రవ్యము క్షీణించుట లేదు

పరిణామమునందు ఒక వస్తువు తన స్వంత లక్షణములు గల అనగా భిన్న లక్షణములు గల (మూలవస్తువు కంటే భిన్నమగు) ఇతర వస్తువును ఉత్పత్తి చేయగలిగినచో ఆ మూలవస్తువును 'అవిశేషము' అన్నారు

ఆ విధముగా ఉత్పత్తి చేయలేనిచో ఆ వస్తువును 'విశేషము' అన్నారు ఇంద్రియములు, స్థూలభూతములు భిన్నలక్షణములు గలవానిని ఉత్పత్తి చేయలేవు అందుచే అవి 'విశేషములు' 'అహంకారము' భిన్నలక్షణములు గల వానిని ఉత్పత్తి చేయగలదు అందుచే అది 'అవిశేషము' అన్నారు తన్మాత్రలు, అహంకారము, మహత్తు యొక్క 'అవిశేష' రూపములు పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు, దాని విశేష రూపములు

సాంఖ్య పరిణామ సిద్ధాంతములో ప్రకృతి, పురుషుల సన్నిహితత్వము ఎట్లు కలుగునో స్పష్టముగా చెప్పబడలేదు ఆ విషయము గందరగోళముగాను సందేహముగాను (perplexity) మిగిలినది దానిని గురించి చర్చించుట ఇచట సాధ్యపడదు తార్కిక సమాధానము ఏదైనను వాస్తవమునకు ప్రకృతి, పురుషులు ఒకరుగానే పనిచేయుదురు కాబట్టి వారు పరస్పర సహకారముతో పనిచేయుదురు అని చెప్పవలయును వాస్తవమునకు శరీరము లేనిది ఆత్మ ఉండదు ఆత్మలేని శరీరము నిరర్థకము ఇది అతిసామాన్య అనుభవిక విషయము అనగా పురుషుడు లేనిది ప్రకృతి లేదు ప్రకృతి లేనిది పురుషుడు ఉండడు ప్రకృతి, పురుషులతో సహా తత్త్వములు (principles) ఇరువది అయిదు అన్నారు సాంఖ్య-యోగ సిద్ధాంతములు రెండును చెప్పిన ఈ తత్త్వములను ఈ క్రింది పట్టిక రూపములో (Tabular form) చూపవచ్చును మహత్తు, బుద్ధి వేరుగా చెప్పినచో ఇరువది ఆరు తత్త్వములు అగును, లేక ప్రకృతి, పురుషులను లెక్కించకపోయినచో ఇరువదినాలుగు తత్త్వములగును ఈ ఇరువది నాలుగు వర్గములు మనసు, పదార్థముతో కూడిన విశ్వమునంతయు ఏర్పరచుచున్నవి ముందు చెప్పినట్లుగా కొందరు మహత్తు నుండి అహంకారము ఉత్పన్నమైనట్లు మరికొందరు మహత్తుకు బదులు బుద్ధిని చెప్పి అందునుండి అహంకారము ఉత్పన్నమైనట్లు చెప్పుచున్నారు ఈ పరిణామమందు భిన్నదశలకు గల హేతువులు ఏవో స్పష్టముగా చెప్పబడలేదు ఈ పరిణామదశలను

ప్రాథమిక పరిణామములు అని చెప్పవచ్చును (primary evolution) వస్తుప్రపంచములో మనకు కనబడు వృక్షములు, పర్వతములు మొదలగు వాటి నుండి భౌతిక దేహములు గల జంతువులు, మానవుల వరకు జరిగిన పరిణామమును (secondary transformation) పంచభూతముల (స్థూల




భూతముల) తరువాతి పరిణామము అని చెప్పబడినది ఈ తరువాతి పరిణామములో ఎట్టి క్రొత్త తత్త్వములు (categories) ఏర్పడలేదు ఈ స్థూలభూతములు తమలోనే ఉన్న తత్త్వములను బహిర్గతము చేసినవి ఈ పరిణామము ఒక ద్యూతము (జూదము) వలె ఉన్నది అన్నారు

ద్యూతమందు పాచికలు అన్నియు ఒకటే కాని అవి భిన్నవిధములుగా పడుట వలన మనకు భిన్నవిధములుగా కనబడును ఈ తరువాతి లేక ద్వితీయ పరిణామమందు మార్పులు వెనుకకు తిరుగవచ్చు (reverse change) మరల ముందుకు మార్పు పొందవచ్చు ఇది ఒక సృష్టివలయ పరిమితిలో జరుగును (single cycle) కాని ప్రాథమిక పరిణామశ్రేణి విచ్ఛిన్నము కాదు ప్రాథమిక పరిణామశ్రేణి లయమందు మాత్రమే (termination) విచ్ఛిన్నమగును అన్నారు ఉదాహరణకు ఒక వృక్షము నాశనమైనపుడు అది పంచస్థూలభూతములుగా విడిపోవును కాని ఆ పంచభూతములు సూక్ష్మభూతములుగా అనగా తన్మాత్రలుగా విడిపోవు అన్నారు

సాంఖ్య-యోగ సిద్ధాంతములలో సాత్త్విక వస్తువులకు, తామసిక వస్తువులకు మధ్యగల వ్యత్యాసము ప్రాధాన్యము సంతరించుకున్నది ఈ వస్తు ప్రపంచములోను, మన భౌతిక శరీరములోను అధికభాగము తామసికములే అన్నారు అవి భౌతికములు కాని భౌతికములలో సాత్త్వికములైనవి కూడ ఉన్నాయి అవి కూడ ప్రకృతి నుండి ఉత్పన్నమైనవే అవి సూక్ష్మతత్త్వములగుటచే వస్తువులను గురించి పురుషునికి (జీవాత్మకు) తెలియజేయు కార్యము నిర్వర్తించును కాని అవి స్తబ్ధముగా నుండును (passive) అందుచే అవి స్వయముగా వ్యక్తము కావు అయినను ఈ సాత్త్విక తత్త్వములు (entities) మానసిక జీవితమునకు అవసరము వాటి ఆవశ్యకతను అవి స్వయముగా వ్యక్తము చేయలేవు

సాత్త్విక వర్గమునకు చెందినవి బుద్ధి, అహంకారము, మనస్సు వీటిని సమిష్టిగా అంతఃకరణ (internal organ) అన్నారు బాహ్యప్రపంచము నుండి వచ్చు భావములకు రూపమునిచ్చి వాటికి తగిన రీతిలో స్పందించుటయే (respond) దీని కర్తవ్యము ఇందుకు దీనికి వివిధ ఇంద్రియములు తోడ్పడును

అంతఃకరణము (internal organ) దానికి సహకరించు పరికరములు

ఆధునిక మనస్తత్వశాస్త్రము చెప్పు మెదడు (brain) నాడీమండలమును పోలియున్నట్లుగా కనబడును సాంఖ్యము చెప్పిన అంతఃకరణము, దాని ఉపకరణములు, మనస్తత్వశాస్త్రము చెప్పు మెదడు, దానికి ఉపకరించు నాడీమండలము - రెండూ భౌతికములు, రెండును పురుషునకు (జీవాత్మకు) అనుభవము పొందుటకు ఆవశ్యకములే వాటిని వేరుపరచుట సాధ్యపడదు ఇదే పురుషుని అనుసరించి యుండు సూక్ష్మశరీరము లేక లింగశరీరము మరణానంతరము కూడ స్థూల శరీరము పురుషుని (జీవాత్మ) వీడును కాని సూక్ష్మశరీరము పురుషునితోనే కైవల్యము (పరిపూర్ణమైన స్వేచ్ఛ (విముక్తి) (full liberation) ప్రాప్తించు వరకు యుండును న్యాయవైశేషికములు దీనిని మనస్సు అన్నవి

పైన చెప్పిన తత్త్వములలో మహత్తు నుండి కర్మేంద్రియముల వరకు (మొత్తం పదునాలుగు) పరిణామ కల్పనలో (ఉత్పత్తిలో) (scheme of evolution) వాటి కార్యములను రెండు విధములుగా గ్రహించవలసియున్నది ప్రకృతిలో (cosmic) జరుగు పరిణామదశల (stages of evolution) (విశ్వమందు జరుగు పరిణామదశల) యందు వాటి ఆవశ్యకత, అర్థము (significance) ఎంత ఉన్నదో మానవుని జాగృత, స్వప్నావస్థల యందు కూడ అంతే అర్థము కలిగియున్నవి అటులే త్రిగుణములు ప్రకృతి పరిణామములో ఎంత అర్థవంతముగా నున్నవో, వ్యక్తి జీవితములో కూడ అంతే అర్థము కలిగియున్నవి వ్యక్తి అనుభవములో కలుగు సుఖ, దుఃఖ, మోహములకు వరుస క్రమములో (respectively) సత్వ, రజ, తమోగుణ ఆధిక్యతలే కారణము అన్నారు అనగా సత్త్వ, రజ, తమో ప్రవృత్తులను బట్టి వారికి క్రమముగా సుఖ, దుఃఖ, మోహ అనుభవములు కలుగును అని అర్థము ఇది సాంఖ్యసిద్ధాంతము కాని విశ్వపరిణామమందు (Cosmic Evolution) మహత్తు, బుద్ధి, అహంకారము, జ్ఞాన, కర్మేంద్రియముల గుర్తింపు అతి నిగూఢముగా నున్నది ఏది ఏమైనను ఈ భౌతిక ప్రపంచమంతయు ప్రకృతి నుండియే పరిణామము చెందినదనియు,

ప్రకృతి స్వతంత్రమైనది, ఈ పరిణామమునకు తుది కూడ ప్రకృతియేయని సాంఖ్య సిద్ధాంత ప్రధానాంశము (independent and ultimate)

ప్రకృతిని గురించి సాంఖ్యులు ఇంత వరకు చెప్పినదానిని గమనించినచో ప్రకృతి ఉత్పత్తి ఒక కారణం ఆధారంగా రూపొందిన ఒక భావచిత్రమా (image) అనిపిస్తుంది ప్రకృతి యొక్క కర్తవ్యము పురుషుని భోగము కలుగజేయుట లేక తుదకు పురుషుడు విముక్తి (liberation) పొందుటకు తోడ్పడుట మాత్రమే అనినచో అది ప్రకృతి సహజ స్వభావము అని చెప్పవచ్చును అయినా ప్రకృతి యొక్క ఆ నిరంతర కృషి వెనుక ఒక మనసు లేదు అని (మనోచైతన్యము) చెప్పుట సమంజసము కాదు వాస్తవమునకు ప్రకృతి పురుషునకు భోగములు కలిగించుట తుదకు విముక్తి కలిగించుట రెండును చేయుచున్నది అయినా వ్యక్తి (పురుషుని) అవసరములకు అనుగుణముగా ఆ రెండింటి యందు ఏదో ఒకటి నిర్ణయించుకొనగల శక్తి ప్రకృతికి ఉన్నట్లు కనబడును అనగా ప్రకృతి ఒక స్థిరమైన, నిశ్చలమైన లేక స్థావరమైన (static) స్వభావము కలదిగా చెప్పుటకు వీలుపడదు కాని ఇచట మరొక విషయము ఉన్నది ఈ గతి (గమనము) (process) అనగా పురుషుని సుఖదుఃఖ గమనము, అతని గత పాపపుణ్య కర్మలపై ఆధారపడియుండునని, గతకర్మయే అతని స్థితిని శాసించునని చెప్పినచో ప్రకృతి పురుషుని భోగమునకు విముక్తి కొరకు చేయు కృషి నిరర్థకమా అను ప్రశ్న వస్తుంది కాని గతకర్మ ఫలము కూడ ప్రకృతి కృషిలో భాగముగా ఉండును అన్నారు పురుషుడు తన కర్మఫలము అనుభవించుట ప్రకృతి కృషిలో ఒక స్థితి (phase) అన్నారు పురుషునికి భోగానుభవము కలిగించుట, విముక్తి కలిగించుట అనునవి ప్రకృతి చేయు రెండు భిన్నకార్యములు కావు అన్నారు ప్రకృతి కార్యములు రెండు పరస్పరం సహకారులు అని సాంఖ్యవాదము ప్రకృతి తన చర్యలను భిన్నముగా భిన్నపురుషులకు అనుకూలముగా సవరించుకొనును అను భావము ఇమిడియున్నది అన్నారు ప్రతి పురుషుని విషయములోను అతని స్థితికి

అనుకూలముగా ప్రకృతి తన ఆశయములో ఒకదానికి మారుగా మరొకటి ఆచరణలో పెట్టును అన్నారు కాని ఒక మానసిక లేక పరమ ఆత్మ స్థితికి (Super Spiritual State or Mind) ప్రకృతి తన చర్యలను పురుషునికి అనుకూలముగా ఎట్లు మలచుకొనునో వివరించుట సాధ్యము కాదు కాని ఇది సాధ్యపడుటకు ప్రకృతిలో ఒక పరమపురుషుడు (అనగా ఉపనిషత్తులు చెప్పిన పరమాత్మ) ఉన్నాడు అను భావన సాంఖ్య సిద్ధాంతములో నిగూఢమును ఇమిడియున్నదా అనిపించును కాని ఆ పరమ పురుషుడు ప్రకృతికి బయట ఉన్నట్లు, పూర్తిగా ఉదాసీనునిగాను భావించబడింది కాని ఇచట సాంఖ్య సిద్ధాంతమునకు వైరుధ్యము కనబడును ఎందుకనగా అచేతనము (inactive) గా నుండు ప్రకృతి తన ఇచ్ఛానుసారము చరించును అనుట విరుద్ధమే అగును గదా! ప్రకృతి పురుషుల సంబంధమునకు చెప్పబడిన గ్రుడ్డివాని, కుంటివాని ఉపమానము అసందర్భముగానున్నది ఎందుకనగా వాస్తవమునకు గ్రుడ్డివాడు, కుంటివాడు ఇద్దరు మానసికంగా చేతనత్వము గలవారె అందువలన వారు పరస్పరం సహకరించుకొనగలరు కాని ప్రకృతి పురుషులలో ఒకరు అచేతనులైనపుడు అట్టి సహకారమునకు అవకాశము ఉండదు ఈ సమస్యకు ఒకటే సమాధానము ఉన్నది ప్రకృతికి బయటనుండు అనగా బాహ్యస్థితిలోనున్న ఆ పురుషుని అతీతునిగాను సర్వోత్కృష్టునిగాను గ్రహించవలసియుండును ఆ పురుషుడే ఈ ప్రపంచమందలి వివిధ పురుషుల ఇచ్ఛకు అనుకూలముగా చరించుటకు ప్రకృతికి మార్గదర్శకుడగుచున్నాడని చెప్పవచ్చును కాని అది సాంఖ్య సిద్ధాంత ప్రాథమిక అంశములకే విరుద్ధము

సాంఖ్య సిద్ధాంతమందున్న ఈ పరస్పర వైరుధ్యమునకు ఏదైనా వివరణ ఉన్నదా? దీనికి వివరణ ఇచ్చుటకు రెండు విధముల అవకాశమున్నట్లు కనబడును మొదటిది ప్రకృతియందు సర్వవ్యాపిగా అంతర్లీనముగా ఒక అవ్యక్తమైన ఆత్మ మూలరూపం ఉన్నదని భావించవచ్చును ప్రకృతి పరిణామగతిని లోపం నుండి అది సారధ్యము వహించును అపుడు

పురుషుని విముక్తి కొరకు కృషి చేయునది ఆ ఆత్మమూలరూపము గాని (spiritual element) ప్రకృతి కాదు అని గాని లేక ఆ ఆత్మమూలరూప సహకారముతో ప్రకృతియే కార్యము నిర్వర్తించును అని భావించవలసివచ్చును ప్రకృతి యొక్క హేతుబద్ధమైన గతి లేక గమనమునకు ఇదియే సమాధానముగా కనిపించును

జీవితం విముక్తి కొరకు పడు తపన వంటిది అన్నారు ఆత్మజ్ఞానము లేకపోవుటచే వ్యక్తి అజ్ఞానుడు అగుచున్నాడు అని చెప్పినచో అది ఉపనిషత్తుల ప్రవచనములను పోలియుండును పరమాత్మ ఒక్కరే ప్రపంచమందలి జీవాత్మలుగా అతడే అనేక రూపములలో ఉత్పన్నమగుచున్నాడు పరమాత్మ అవ్యక్తుడు కాని స్థూల శరీరములలో వ్యక్తమగుచున్నాడు స్థూలశరీరము ప్రకృతికి ప్రతిబింబం ప్రకృతియందు అవ్యక్తుడై వైశ్వానరునిగా పరమాత్మ వ్యాపించియున్నాడు ప్రకృతి కార్యములకు అతడు మూలము ఇది బ్రహ్మ పరిణామవాదము సాంఖ్య సిద్ధాంత అంతరార్థము ఈ వాదమును పోలి యున్నట్లు కనబడును శ్వేతాశ్వతర ఉపనిషత్తు చెప్పినట్లు భగవంతుడు త్రిగుణములందే ఇమిడియున్నాడు ఉపనిషత్తులు చెప్పిన ఈ పరిపూర్ణ సత్యము అనగా పరమాత్మ (విరాట్ పురుషుడు) ప్రకృతి ఐక్యత అను సత్యము, సాంఖ్యములో ప్రకృతి పురుషులు రెండు భిన్నరూపములు అను ద్వైతభావ పక్షపాతముతో అస్పష్టముగాను అసంపూర్ణముగాను వ్యక్తమగుచున్నది అని చెప్పవలసి వచ్చును ప్రకృతి పురుషులను వేరుచేయుట వలన సాంఖ్యసిద్ధాంతము అతిక్లిష్ట రూపము పొందినది అని చెప్పక తప్పదు అందువలననే వారు చెప్పిన ప్రకృతి పురుషుల సహకారమును స్పష్టముగా హేతుపూర్వకముగా వివరించలేకపోయారు సాంఖ్యులు అంతేగాక ప్రకృతి పరిణామములుగా చెప్పబడిన మహత్తు అహంకారములు విశ్వవ్యాప్త అస్తిత్వములుగా (cosmic entities) ప్రకృతిలో అంతర్లీనముగానున్న పరమాత్మ (విశ్వాత్మ) (universal self) యొక్క అవయవములకు ప్రాతినిధ్యము

వహించుచున్నట్లు తోచును గదా! కాని ఇది ఉపనిషత్తుల ప్రతిపాదన అగుటచే సాంఖ్యులు దానిని అంగీకరించక వారు ప్రతిపాదించిన మహత్తు, అహంకారములు హేతురహితముగాను (arbitrary) గందరగోళముగాను (perplexing) మిగిలినవి

ఇక స్వభావవాదము (naturalism) ఈ వాదము ప్రకృతిలో అంతర్లీనముగా ఒక విశ్వాత్మ యుండి (అతీతశక్తి) (transcendental power) దాని ప్రభావమే ప్రకృతి వ్యక్తము చేయును అను భావమును అంగీకరించదు ఒక వస్తువు (పదార్థము) కనబరచు లక్షణము దాని స్వభావ లక్షణమే గాని బయట నుండి వచ్చినది కాదు అనునది, స్వభావవాదము (naturalism) నిప్పు వేడిగా ఉండటం నీరు తడిగా ఉండటం వాటి స్వభావములేగాని మరొక పదార్థము నుండి వచ్చినవి కావు అంటుంది స్వభావవాదం అవి వాటి సహజ సారములు అంటుంది ఈ వాదము అనగా వస్తువులు ఎలా ఉన్నవో అది వాటి సహజస్థితి అందువలననే ప్రకృతిలో అనేకత్వము (variety) అందులో ఒక క్రమస్థితి (order) కనబడును అన్నారు స్వభావవాదులు ఈ స్వభావవాదము నుండియే కాలక్రమమున భౌతికవాదము (Materialism) లేక చార్వాకమతము రూపొందినది ఈ మతము సామాన్య అనుభవములతో కూడిన ప్రపంచము వరకే నియమితమైనది ప్రారంభదశలో సాంఖ్యులు స్వభావవాదమునే (Naturalism) అనుసరించినట్లు కనబడును పురుషుడు లేక ఆత్మ ఉన్నది అను భావము, స్వీయపరిణామశక్తి, స్వీయ క్రమబద్ధత (self evolving and self regulating) కలిగిన ప్రకృతి సహకారముగా నున్నది అను భావము ఇతర సిద్ధాంతముల సంబంధము లేక సంపర్కము వలన సాంఖ్య సిద్ధాంతములోనికి చొరబడినట్లు తోచుచున్నది వాస్తవమునకు సాంఖ్య సిద్ధాంతములో గూడ పురుషభావమునకు ప్రకృతి భావము యొక్క తోడు (కలగలపు) అవసరమున్నట్లు వివరణ లేదు

తార్కికముగా (logically) పరస్పర సంబంధము లేని పురుషుడు, ప్రకృతి అను రెండు తత్త్వములను (Principles) సృష్టించుటయే సాంఖ్య

సిద్ధాంతములో ప్రధానమైన లోపముగా కనబడును రెండింటికి మధ్య సహకారము సిద్ధించుటకు అవసరమైన పరమాత్మ అస్తిత్వమును గుర్తించక పోవుటచే సాంఖ్య సిద్ధాంతము నాస్తికతత్త్వమా అనిపించును ఉపనిషత్తులందు, భగవద్గీత యందును ఈ సాంఖ్యభావమున్నది సాంఖ్యమనగా అనాత్మలైన అనగా ఆత్మకాని లేక ఆత్మకంటే భిన్నమైనవి 24 తత్త్వములను గురించి చెప్పునదిగా మాత్రమే గుర్తించబడినది ఉపనిషత్తులు, భగవద్గీత ఒక మహత్తరము, అతీతము అయిన పరమాత్మ అస్తిత్వము (ఉన్నది అనుట) సాంఖ్య సిద్ధాంతభావమునకు అనుబంధముగా జోడించినవి పురాణములలో కూడ సాంఖ్య సిద్ధాంతములో చెప్పబడిన సృష్టిక్రమ సిద్ధాంతము అనగా ప్రకృతి నుండి ఏర్పడు 24 తత్త్వములను అంగీకరించినవి కాని ప్రకృతి పురుషులకు సంబంధము లేదు అను విషయమును ఖండించి అవి ఏకస్వరూపమగు పరబ్రహ్మ పదార్థములోని రెండు భిన్న అంశములు మాత్రమే అని స్పష్టము చేసినవి సాంఖ్య సిద్ధాంతము యొక్క మూలరూపములో భగవంతుని 'ఆస్తికత' నిరూపించబడలేదు సర్వమునకు మూలమైన పరమాత్మ విషయములో ఉదాసీనంగా ఉండటం, సంసారబంధముల వలన ఆత్మకు అజ్ఞానము కలుగును అని చెప్పుటలో ఉపేక్షతో ఉండటం సాంఖ్యతత్త్వము బౌద్ధతత్త్వమును స్మరింపజేయును ఆ విధముగా సాంఖ్య ప్రవక్త కపిలుని నాస్తికత కఠినమైనది కాదు పరమాత్మగాని ఇష్టదైవముగాని లేడు అని ప్రకటించుటయందు అతనికి ఇచ్ఛ లేదు ఎట్టి తార్కిక పరిశోధనలు పరమాత్మ (భగవంతుని) అస్తిత్వము నిర్ద్వంధముగా నిరూపించుట గాని, అటులే భగవంతుని అస్తిత్వము యదార్థము గాదు అని గాని ప్రకటించలేవు అని చెప్పుటయే సాంఖ్యసిద్ధాంత ముఖ్య ఉద్దేశముగా కనబడును విజ్ఞానబిక్షు మొదలైన సాంఖ్యభాష్యకారులు సాంఖ్యములో కనబడు నాస్తికతను తొలగించుటకు ప్రకృతి పరిణామమును ఒక అఖండశక్తి నడుపుచున్నది అని భావించారు మానవుడు దేవునిపై అధికముగా ఆధారపడినచో అతని విచక్షణా

జ్ఞానము సన్నగిల్లును కాబట్టి ఈశ్వరునిపై ఆధారపడుటను తగ్గించుటకే కపిలుడు నాస్తిక భావమును సూచించెను అన్నారు కాబట్టి సాంఖ్యము నాస్తికవాదము అనుట అధిక ప్రసంగమే యగును అని వారు ప్రకటించారు

కపిలుని ఆలోచనలలో నిస్సంశయముగా ప్రకృతి పురుషుల ఏకత్వము అంతర్లీనముగా ఉండి యుండును అని ఆధునిక విమర్శకులు అభిప్రాయపడుచున్నారు ఉద్దేశములోను ప్రయత్నములోను ప్రకృతి పురుషుల ఐక్యత లేనిచో ఈ వస్తు ప్రపంచములోని అనుభవములు, తుదకు విముక్తి ఏ మాత్రము సాధ్యము కావు ప్రకృతి పరిణామదశలలో పురుషుడు వాటిని గురించి ప్రకృతికి తెలియచెప్పుచునే యుండును అన్నారు పరిణామము ఆసాంతము ప్రకృతి పరిణామమై బుద్ధియే పురుషుని వలె చరించును అన్నారు

జగత్తు సృష్టి దేవుని దయచే జరిగినది అనుటకు వీలుపడదు ఎందుకనగా సృష్టికి పూర్వము జీవులకు దుఃఖము అనునది లేదు అందుచే పోగొట్టుకొనవలసినది ఏమియును లేదు అపుడు దేవుని దయతో అవసరమేముండును అట్లుగాక దేవుడు శుభసంకల్పముతో సృష్టి చేసియుండినచో దుఃఖము అనునది లేని జీవులనే సృష్టించియుండును గదా! జీవుల ప్రవర్తనములు భిన్నములు అందుకు అనుగుణముగా వారికి కర్మఫలము ఇచ్చుటకు భగవంతుడు అవసరమని చెప్పినచో కర్మసూత్రము ప్రకారము కర్మఫలములు వచ్చును అని కర్మసిద్ధాంతము గదా! అపుడు భగవంతుని అవసరము ఉండదు గదా! చైతన్యశక్తి అచేతన వస్తువులను ఉత్పత్తి చేయదు సృష్టికర్త దేవుడు అతడు అనంతస్వరూపి అని చెప్పి, పురుషులు శాశ్వతముగా నుందురు అనినచో పరస్పర విరుద్ధమగును ఆత్మలను సృజించుటకు దేవుడున్నాడు అని చెప్పినచో ఆత్మలకు ఉత్పత్తియున్నట్లు అగును ఉత్పత్తి యున్న ఆత్మలు శాశ్వతము కానేరవు దేవుని అస్తిత్వము మన విజ్ఞానపరిధికి

అతీతమైనది కావున దానిని గురించి చర్చించుటకు ఇష్టపడక దేవుడున్నాడని రుజువు చేయుటకు వలసిన ప్రమాణములు లేవని మాత్రము సాంఖ్యము చెప్పుచున్నది దేవుడు లేడు అని చెప్పు అర్థములో సాంఖ్యము నాస్తికము అనుటకు వీలులేదు దేవుడు ఉన్నాడని చెప్పుటకు తగిన ప్రమాణములు లేవు అని చెప్పు అర్థములో సాంఖ్యము నాస్తికమా అనిపించును

ఒక దశలో మానవ మనస్సునందు కలిగిన సమస్యకు సమాధానము కొరకు జరిగిన ప్రయత్నము సాంఖ్యసిద్ధాంతము అది ఒక తాత్వికనిర్ణయము ఆనాటి తాత్విక లక్ష్యములు ఆధారముగా ఏర్పడినది సాంఖ్య సిద్ధాంతము జగత్తును గురించిన యదార్థము కొరకై జరిగిన పరిశీలనగా కనబడదు ఈ ప్రధాన సమస్యకు తృప్తికరమైన సమాధానము ఈయలేకపోయింది ప్రకృతి పురుషులు మన అనుభవములో గోచరములు కావు అనగా సత్యములు కావు కాని అనుభవమునకు అర్థము చెప్పుటకు అనుభవమునకు అతీతమైన భావనలను కల్పన చేయుటయే ఈ సిద్ధాంతములు అని గ్రహించి వాటిని అర్థము చేసుకొనుటకు ప్రయత్నించుట సమంజసము

చలనము (కదలిక), వేడిమి, విద్యుత్తు వంటి వాటికి శక్తి ఉన్నది కాని అది చైతన్యశక్తి కాదు జడ (అచేతన) శక్తి అంటుంది సాంఖ్యము ఇదే దాదాపు ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్రము (సైన్సు) కూడ చెప్పుచున్నది నరముల కదలికలు కొన్ని చేతన ప్రవృత్తులు (స్వభావము) వలన కలుగును అని సైన్సు అంటుంది దీనిని విస్మరించకూడదు కాని సైన్సు అంతవరకే వెళ్లను మన మానసిక దశలకు అతీతముగాను వేరుగాను ప్రకాశించునదే పరమ పురుష స్వరూపము (పరమాత్మ) అట్టి పురుషుడు మన అనుభవములకు అతీతుడు భౌతికమైన తత్వభావములలోకి అతడు ప్రవేశించడు కాని భౌతిక పదార్థముల నుండి పురుషుని వేరు చేసినచో, అట్టి పురుషుని తెలియుటకు మనకు సాధనము ఏమియు ఉండదు అపుడు పురుషుని గురించి అక్షయుడు

మొదలగు ఊహాకందని పదములతో తృప్తిపడవలసి వచ్చును "ఎట్టి చలనము కాని పరివర్తనము కాని లేక పురుషుడు ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు" అని చెప్పవలయును మన భావనాశక్తి ఎంత పటిష్ఠమైనను, దానిచే మనము ఆ పురుషుని ఊహింపలేము అందువలన పురుషుడు శుద్ధ చైతన్యమూర్తి అని మాత్రమే చెప్పవీలగును మన భౌతికవ్యవస్థ (ఒక నియమక్రమమే వ్యవస్థ) యొక్క ఫలితమే మన మనస్సుకు కలుగు దశాపరంపరలు ఆ పరంపరలను అది ప్రకటింపజేయును మనలో అంతర్వర్తిగానున్న చైతన్యశక్తియే పురుషుడు అని భావించబడింది ప్రకృతి (జగత్తు) ఒక నాటకరంగము దానిని అతడు దర్శించును కాని అందు అతడు (పురుషుడు) పాత్రధారి కాడు ఎవరి ఆశయము కొరకై ప్రకృతి శ్రమించునో ఆ పురుషుడు రంగస్థలములో కనబడడు కాని సర్వవస్తువుల అస్తిత్వము (ఉండుటకు) నకు అతడు మూలాధారము అని చెప్పబడింది మనము చూచునది ఆ పురుషుడు కాదు మనము చూచునది ప్రకృతిలో భాగముగానున్న పురుషుడు దేహము ప్రకృతి ప్రతిబింబము ప్రతి ఆత్మ అట్టి దేహమును ధరించిన పరమాత్మయే పురుషుడు ప్రకృతి నుండి ఏర్పడు వ్యక్తితో తాత్కాలిక సంబంధము మాత్రమే కలిగియున్నాడు అని చెప్పినచో జీవుల ఏకత్వము విచ్ఛిన్నమగును జీవులన్నియు ఒకటే, దేహములు భిన్నములు

ఆ విధముగ ప్రకృతి పురుష సంబంధము ఉన్నది అని తెలియుచున్నది ప్రకృతి పురుషులు వేరువేరు అనునది సత్యము కాదు సాంఖ్యములో కూడ అంతర్లీనముగా ఈ భావము గోచరించును ప్రకృతి రెండు పనులు చేయుచున్నది అన్నారు పురుషునిలో ప్రకృతి నివసించుటయే ఈ ప్రపంచము అట్టి లోకము యొక్క, తన యొక్క నిజస్వరూపమును ప్రకృతి నిత్యము ప్రతిబింబించుచునే యున్నది ప్రకృతి పురుషులు భిన్నత్వములోనే అంతర్గతముగా ఏకత్వమున్నదని చెప్పకయే చెప్పుచున్నట్లున్నది గదా! పురుషునితో సంబంధము ఏర్పడినపుడే ప్రకృతి పరిణామము పొందును సంబంధము లేనపుడు అది అవ్యక్తముగా

నుండును అనగా సృష్టి ఉండదు ప్రకృతిలో జరుగు ప్రతి పనిని ప్రకృతి చిహ్నాముగా భావించినచో, ప్రకృతి పురుష ప్రభావమునకు లోనైయున్నదని భావించవలయును అని సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు అనగా పురుష సంబంధము లేని ప్రకృతిని ఊహించుటకు సాధ్యపడదు అని తెలియుచున్నది ఆది అనగా మొదలు అంటూ ఏదియులేని స్వతంత్రుడు అయిన పురుషునితో సరిసమానముగా ప్రకృతికి నిత్యత కలదు అని సాంఖ్యము చెప్పుచున్నది దీనినే సవ్యముగా చెప్పినచో ప్రకృతి పురుషులు ఇరువురు ఒకే సత్య నిత్యస్వరూపములోని భిన్న అంశములు అని తెలియుచున్నది పరిణామరూపమే సృష్టి ఆ పరిణామమునకు మూలాధారములు ఆ రెండు భిన్న అంశములైన ప్రకృతిపురుషులు

అయినను ప్రకృతి పురుష భేదమే సాంఖ్యములో ప్రాధాన్యము వహించినది ప్రకృతి పురుషభేదజ్ఞానము లోపించుట వలననే సంసారబంధము ఏర్పడుచున్నది అని సాంఖ్యము చెప్పును ఈ అజ్ఞానము అంతఃకరణముపై తన సంస్కారమును ముద్రించుటచే అనంతర జన్మమునందు ఈ దోషము స్థిరపడుచున్నది జన్మజన్మలకు ఏర్పడు దేహములలో లింగదేహము పయనించుచుండును ఇందు మనస్సు, బుద్ధి, అహంకారములు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, అయిదు తన్మాత్రలు, పంచభూతములు బీజరూపములో (seedform) నుండును ఈ పరికరములతో కూడిన లింగశరీరము (సూక్ష్మశరీరము) బీజము (విత్తనము) వంటిది అది స్థూలదేహమును కల్పించును సినిమాకు తెర అవసరము వలె మనస్తత్వ నిర్మాణమునకు తన్మాత్ర బీజరూప అవసరమున్నది ఈ లింగదేహము కనబడదు ఈ లింగదేహమే జన్మజన్మలయందు ఏర్పడు కర్మ సంస్కారములను స్వీకరించును తదుపరి జన్మయందు కలుగవలసిన దేహమును లింగదేహమే నిర్ణయించును లింగదేహము సుఖదుఃఖములకు నిలయము లింగదేహము పురుషుడు కాదు కాని అది పురుషుని అంటియుండును అది వ్యక్తి యొక్క

రూపమును, లక్షణములను నిర్ణయించును అన్ని సంస్కారములు ఇందే యుండును రంగస్థలముపై నటునివలె భిన్న స్థూలదేహములను ధరించి భిన్నపాత్రలను పోషించును సర్వవ్యాపిత్వము ప్రకృతి లక్షణము ఆ లక్షణము లింగశరీరమునకు కూడ వచ్చినది ప్రకృతి ప్రతిబింబమైన లింగదేహముతో సంపర్కము పురుషునకు దుఃఖము ఏర్పడును పురుషుడు తన యదార్థ స్థితి గ్రహించునంతవరకు ఈ దుఃఖముండును స్థూలదేహము మరణముతో నశించును కాని లింగదేహము నిత్యత్వము కల్గియుండును అనగా లింగ స్థూలదేహముల కలయికే జననము అవి విడిపోవుటయే మరణము ప్రకృతి పురుష భేదజ్ఞానము కలిగినపుడు పురుషునకు విముక్తి కలుగును లేనిచో జన్మజన్మల పరంపరలో లింగదేహము యుగాంతము వరకు పురుషుని అంటియే యుండును అంతకాలమున లయము ద్వారా శాంతి పొందును అన్నారు కాని మరల సృష్టి ఏర్పడినపుడు లింగదేహము తిరిగి జన్మజన్మల చక్రభ్రమణము పొందుచుండును అని సాంఖ్యవాదము

స్థూల సూక్ష్మదేహములు లేనిచో కర్మఫలములనిచ్చు భావములకు అవకాశముండును కర్మఫలములే భిన్న జన్మములకు కారణములు విత్తనము, మొక్కలలో ఏది ముందు ఏది వెనుక అను సందేహము లేకుండ వాటి పరస్పర ఆధారవిధానము వలెనే జన్మ కర్మఫలములు బీజాంకుర న్యాయము వంటివే అనగా విత్తనము యొక్క విధానము వలె 'ఆది' (మొదలు) లేనివే - బుద్ధి, అహంకారము, సూక్ష్మ, స్థూలదేహములు ఏర్పడుట భౌతిక పరిణామరూపమే అన్నారు దాని ఫలితము కూడ భౌతికమే యగును కాని ఈ ఫలితములు కొన్ని బాహ్యదృష్టికి కనబడవు ఈ భౌతిక నిర్మాణమునకు పురుష సంపర్కము కలిగినపుడు కర్మఫలమునునుసరించి జన్మము కలుగును బుద్ధి భావములపై కర్మసూత్రప్రవర్తనము ఆధారపడి నడచును ప్రతి ఆత్మకు ఒక దేహసంబంధము ఏర్పడి పుణ్యవిశేషముననుసరించి జన్మరూపము ఏర్పడును ఈ దేహము లన్నియు ప్రకృతి నుండి ఏర్పడినవే అవి అంతర్వర్తియైన పురుషునిపై

ఆచ్ఛాదనము వలె యుండును గాని పురుషుని నశింపచేయలేవు ఇది కర్మఫలముల వలన కలగు జన్మ-పునర్జన్మల పరంపరను గురించిన సాంఖ్య వాదము

**యోగసిద్ధాంతము**

పతంజలి మహర్షి చరకసంహిత వంటి మహోన్నత ఆయుర్వేద వైద్యగ్రంధకర్త, వ్యాకరణశాస్త్ర భాష్యకర్త, యోగశాస్త్రమునకు కర్త అంటారు కాని ఈ వాదము ప్రక్షిప్తముగా కనబడుచున్నది అని విమర్శకుల అభిప్రాయము యోగసూత్రకర్త అయిన పతంజలి వైద్యశాస్త్రకర్త వ్యాకరణశాస్త్ర భాష్యకర్తల కంటే భిన్న పరిస్థితులకు చెందిన కాలము నాటివాడు కావున ముగ్గురు ఒకరు కాదు అని పెక్కు విమర్శకుల అభిప్రాయం ఏది ఏమైనను పతంజలి ఎవరు, ఏ కాలమువాడో ఇచట చర్చనీయాంశము కాదు - కర్మసిద్ధాంతము - కర్మఫలానుభవమును గూర్చి యోగసూత్రములు చెప్పు విషయములు మాత్రమే చర్చించబడును అదియునుగాక పతంజలి యోగశాస్త్ర స్థాపకుడు కాదు (founder) ఆయన కాలమునాటికే ఆచరణలోనున్న యోగశాస్త్రమునకు క్రమపద్ధతిలో సూత్రరూపము ఇచ్చాడు ఈ సూత్రములు 195 (అవి 196 అని కొందరు అంటారు )

పతంజలి యోగసూత్ర వ్యాఖ్యకారులలో భోజుడు, వ్యాసుడు ముఖ్యులు (ఈ వ్యాసుడు మహాభారతకర్త వ్యాసుడు కాదు అంటారు) సమాజంలో ఒక్కొక్క కాలంలో (period) ఒక్కొక్కటి ఆకస్మికంగా ఆచరణలోకి వచ్చి ఉప్పెనలాగ చుట్టుముట్టుతుంది కొంతకాలం ఉంటుంది తరువాత ఎలా వచ్చిందో అలాగే అకస్మాత్తుగా అదృశ్యమవుతుంది ఈనాడు విపరీతమైన ప్రచారంలోకి వచ్చిన యోగసాధన అటువంటిదా? కాదా? కాలమే నిర్ణయించాలి కాని ఒక విషయం మాత్రం వాస్తవం యోగము ద్వారా పతంజలి ఆశించిన ఆధ్యాత్మికత నేటి యోగసాధకులు ఆశిస్తునారా అంటే నిస్సందేహంగా లేదు

అనే చెప్పాలి ఈనాటి యోగసాధకులు ఆశిస్తున్నది ఆధ్యాత్మికత కాదు ఎందుకనగా వారికి (అనగా అందరు అని కాదు అధిక శాతము) ఆ మాటకు అర్థము తెలియదు వారు ఆశించునది పూర్తిగా భౌతికం ఆరోగ్యపరంగాను, వృత్తిపరంగాను, వ్యక్తిపరంగాను ఉద్వేగమును (Troubles, Tensions, Stress) నియంత్రించుటకే వారి కృషి అంతయును అది మంచిదే కాని యోగసాధన అంతరాశయము (implied aim) అది మాత్రమే కాదు సాధన ద్వారా ప్రకృతి బంధవిముక్తుడై అంతర్వర్తిగా ఆత్మజ్యోతిని దర్శించి జీవన్ముక్తుడు కావలయునని పతంజలి యోగసూత్ర ఆశయము ఈ ఆశయదృష్టి లేకుండ భౌతికపరంగా మాత్రమే అతిగా యోగసాధన చేసినచో తుదకు మనసు (brain and mind) నిస్సారమై (sterile) ప్రమాదమునకు దారితీయునని స్పష్టముగా చెప్పబడింది యోగశాస్త్రమునకు మనస్తత్వ శాస్త్రమునకు పోలిక చెప్పున్నారు పాశ్చాత్య దేశాలలో, మనదేశంలో కూడ చాలమంది మనస్తత్వ శాస్త్రములో యోగసాధనను ఒక ప్రక్రియగా చొప్పించారు కాని పాశ్చాత్య మనస్తత్వశాస్త్ర (Psychology) ధోరణి నిత్యము సంధిగ్ధముగానే ఉంటోంది ఏ ఒక్క అభిప్రాయం పరిపూర్ణం అని చెప్పుటకు వీలుపడదు మనస్తత్వశాస్త్రం గురించి అనగా మానవ మనస్తత్వస్థితిని గురించి పాశ్చాత్య ధోరణి 'ఇది' అని మనం చెప్పినచో మనది తప్పు అని వెంటనే విమర్శలు వస్తాయి ఎందుకనగా పాశ్చాత్య ధోరణిలో ఒక అభిప్రాయం వెలువడిన మరుక్షణం మరొక భిన్నాభిప్రాయం బయటపడును ఏది స్థిరమైనదో చెప్పటం దుర్లభం ఒక విషయం మాత్రము యదార్థం మానసిక చికిత్సా విధానంలో పాశ్చాత్య ధోరణిలో ఆత్మజ్ఞానమునకు స్థానము (spiritual) లేదు అట్టిచో యోగసాధన ద్వారా మానసిక చికిత్సలో పతంజలి యోగ ఆశయమైన పరిపూర్ణ యోగస్థితి (అనగా అంతర్వర్తియై ఆత్మజ్యోతిని దర్శించుట) ఎట్లు సాధ్యపడును పాశ్చాత్య దేశములలోను మనదేశంలోను ఆరోగ్యపరంగాను, వృత్తిపరంగాను, వ్యక్తిపరంగాను ఉద్వేగమును (Troubles, Tensions, Stress) నియంత్రించుటకు యోగసాధనను ఒక మానసిక

చికిత్సావిధానంగానే (Psycho Therapy) ఉపయోగిస్తున్నారు గాని ఆధ్యాత్మికత (Spiritual attitude) నిస్సందేహంగా ఆ యోగసాధన యందు లోపించుచున్నది ఎందుకనగా నిజంగా ఆ సాధనలో ఆధ్యాత్మికతే ఉండి ఉంటే నేటి సమాజంలో ఇంత కుళ్లు, కుత్సితత్వము (hypocrisy) ఎందుకుండును? కాబట్టి ఆ సాధన ఒక విధమైన మానసిక చికిత్సావిధానము మాత్రమే అని చెప్పాలి ఈ విధానములో యోగాసనములు, ప్రాణాయమము ప్రధానంగా సాధన చేస్తున్నారు కాని ప్రాణాయామ విషయములో పతంజలి దానియందు నమ్మకమున్న వారికే ప్రాణాయామము అంగీకరించెను చిత్తప్రశాంతి ప్రాణాయామము చేతనేగాక ధర్మానుష్ఠానముచే గూడ సాధించవచ్చునన్నాడు కాని హఠయోగమందు ప్రాణాయామమునకే అధిక ప్రాధాన్యము ఈయబడినది క్రమవిధానములో ఊపిరి పీల్చి విడచుట ఒక వ్యాయామముగా ఆరోగ్యదాయకమని నేడు కూడ చెప్పుచున్నారు ఈ వ్యాయామము అధికముగా చేసినచో కొన్ని సమయములందు పరవశత్వము లేక శరీరము తేలిక అయి తేలుచున్నట్లు అనిపించును అని చెప్పబడింది ప్రాణాయామము ప్రధానముగా గల హఠయోగము ద్వారా రహస్యశక్తులు (secret powers) కొన్ని కలుగునని చెప్పబడింది కాని ప్రాణాయామ విషయములో ఒక ప్రమాదమున్నది అన్నారు దేహదార్ఢ్యము లేనివారు ప్రాణాయామము అధికముగా చేసినచో ప్రమాదము కలుగవచ్చును అని చెప్పబడినది అందువలననేమో యోగవిద్యను రహస్యవిద్యగా ఉంచారు

యోగశబ్దము అనేక అర్థములలో ఉపయోగించబడినది అన్ని శాస్త్రగ్రంథములు సూత్రరూపములోనే చెప్పబడిన రోజులవి సూత్రమునకు స్థూలముగా 'దారము' అని అర్థము అతితక్కువ శబ్దములలో వీలైనంత ఎక్కువ భావము చెప్పునదే సూత్రము కొన్ని సమయములందు అతిప్రధానమైన ఒకటి, రెండు శబ్దములతోనే సూత్రము పూర్తిచేయబడినది తరచుగా ఏ సూత్రమందును వాక్యము సంపూర్ణరూపములో నుండదు శాస్త్రములు గ్రంథరూపమున వ్రాయుటకు సాధ్యపడని కాలమున సూత్రములు చెప్పబడినవి

సూత్రరూపముననున్న రచన మొత్తము కంఠస్థము చేయబడి గురుశిష్య పరంపరలో తరతరాలుగా శాశ్వతము చేయబడినది సూత్రమునకు అర్థము చెప్పుటకు దానిని విస్తరించి విపులముగా వ్యాఖ్య చెప్పవలసి యుండును

[1]యోగశబ్దమునకు విధానము అని స్థూలార్థము బంధించుట అను అర్థములో కూడ కొన్ని చోట్ల ఉపయోగించబడినది భగవద్గీత, ఉపనిషత్తులలో దుఃఖవిముక్తి పొందవలెనన్న యోగసిద్ధి సాధించవలయునని చెప్పబడింది యోగసిద్ధి అనగా పరమాత్మతో సంధానము (సంయోగము) సాధించుట కాని పతంజలి ననుసరించి యోగము అనగా సంయోగము కాదు (ప్రయత్నము అన్నాడు అనగా ప్రకృతి నుండి పురుషుడు విడివడు ప్రయత్నము సమాధిలో లభించు సిద్ధికి గూడ యోగమని చెప్పబడింది) అయినా దానిని సాధించు విధానమునే యోగము అని ఎక్కువగా చెప్పబడింది మానవ ప్రకృతిలో భౌతిక మానసిక చాపల్యములు ఎక్కువగా నుండును వాటిని నిగ్రహించుట ద్వారా పరమార్థమును సాధించు సక్రమవిధానమే యోగము అను భావములో పతంజలి ఆ శబ్దమును ఉపయోగించెను అని చెప్పవలసియుండును పతంజలి ముఖ్యోద్దేశము పరమార్థ సిద్ధాంతముగా కనబడదు చక్కటి శిక్షణ ద్వారా మంచి ప్రవృత్తి పొంది దాని ద్వారా మోక్షము సాధించుటయే అతని ప్రధాన లక్ష్యముగా కనబడును

యోగతత్త్వోపనిషత్తు, యోగచూడామణి ఉపనిషత్తు యోగమును గూర్చి చెప్పినవి యోగతత్త్వ ఉపనిషత్తు నాలుగు విధములైన యోగములను చెప్పినది అవి 1) మంత్రయోగము, 2) లయయోగము, 3) హఠయోగము, 4) రాజయోగము 1) మంత్రమును ధ్యానముతో 12 సంవత్సరములు జపించినచో అణిమ మొదలగు అష్టసిద్ధులతో కూడిన జ్ఞానము కలుగును ఇది మంత్రయోగము అల్పబుద్ధి గల అధముడు మాత్రమే ఈ అష్టసిద్ధుల కొరకు మంత్రయోగము సాధన చేయును అన్నారు 2) లయయోగము అనగా

చిత్తమును లయము చేయుట నడచునపుడు, నిలబడినపుడు, నిద్ర పోవునపుడు, చివరకు భుజించునపుడు కూడ నిష్కలంకమైన మనసుతో పరమాత్మను ధ్యానము చేయుటయే లయయోగము

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి అను ఎనిమిది అంగములను యోగము అన్నారు హఠయోగము, రాజయోగము అష్టాంగములను అనుసరించును కాని హఠయోగము దేహప్రవృత్తి నిగ్రహమే ప్రధానంగా చెప్పును (పతంజలి చెప్పినది రాజయోగము చిత్తవృత్తి నిరోధమే యోగసాధన మనియు తద్వారా సమాధిని పొందవచ్చుననియు పతంజలి తన సూత్రములలో చెప్పాడు) (హఠయోగంలో ప్రాణాయామమునకు విపరీతమైన ప్రాధాన్యము ఉన్నది విపరీతమైన శారీరక శిక్షణ కూడ యుండును తద్వారా మహిమలను పొంది వాటిని ప్రకటించుటయే హఠయోగ ప్రధానాంశము) పతంజలి చెప్పిన రాజయోగమందు దేహమును నిగ్రహించుట ఒక భాగమె కాని అది యోగ సర్వస్వము కాదు ఇందు పద్మాసనమునకు ప్రాధాన్యమెక్కువ పద్మాసనములో యోగసాధన చేసినచో మానవాతీత కార్యములు చేయకలుగు మహిమలు కలుగును హఠయోగి తన శక్తులను నిత్యము ప్రదర్శించును కాని రాజయోగి తన సామర్థ్యమును, మహిమలతో కూడిన తన వ్యక్తిత్వమును ప్రకటించడు సకల వస్తువులను ఆత్మయేయని భావించువాడు రాజయోగి జ్ఞానేంద్రియముల అనుభవమును సాధించును యోగి ఏకాంతముగ కూర్చుడి సంచిత (గత) పాపకర్మఫల నివృత్తికై ప్రణవ మంత్రమును జపించును ప్రణవ మంత్రమనగా ఓంకారము అది సర్వవిఘ్నములను నశింపజేయును ప్రణవమంత్రము అ, ఉ, మ అను మూడు అక్షరముల కలయిక సమస్తమును ఓంకారమునందే లీనమై యున్నది పద్మాసనముపై కూర్చుండి శరీరము తల సమముగా నుంచి ముక్కు చివర దృష్టి కలవాడై ఏకాంతమున అవ్యయమైన ఓంకారమును జపించవలెను నిత్యము యోగాభ్యాసము చేయు యోగికి

ఆకాశమునందు సంచరించు శక్తి కలుగును కాని యోగ సిద్ధులన్నియు పరమాత్మ స్థితికి విఘ్నములుగానున్నవి రాజయోగలక్ష్యము పరమాత్మ స్థితి నెరిగి ఆ అనుభూతిని పొందుట అందువలన బుద్ధిమంతుడు యోగసిద్ధుల కొరకు యోగసాధన చేయడు యోగసాధన ఫలితముగా నవి సిద్ధించును కాని రాజయోగి తన యోగశక్తిని ఏ విధముగను ప్రకటించడు రాజయోగి "నివురు గప్పిన నిప్పు" వంటివాడు అనగా పైకి అనామకునిగా కనబడు తేజశ్శాలి, శక్తిశాలి

మంత్రయోగము ద్వారా రోగనివారణ చేయుదురు కాని దీనికి విశ్వాసము (నమ్మకము) ముఖ్యము నమ్మకము ద్వారా రోగనివారణ చేయుట యనగా భగవంతుడు జోక్యము కలిగించుకొనుట గాని, లేక ఏదో ఒక ఇంద్రియాతీతశక్తి ప్రభావమును ఉపయోగించుట కాని కాదు రోగము నరములకు సంభవించినపుడు గాని, లేక మనస్సు చలించి చెడినపుడు గాని, లేక క్షోభచే మానసిక స్థితి గతి తప్పినపుడు గాని మంత్రములు పనిచేయును అన్నారు మంత్రయోగి తన మంత్రోచ్చాటన ప్రకంపనల (vibrations) ద్వారా రోగి నరములపై అనగా మెదడుపై ప్రభావము కలిగించి రోగికి స్థిమితము (stability) కలిగించును మంత్రయోగము గురించి మంత్రాలకు చింతకాయలు రాలునా? అను విమర్శయున్నది విరిగిన కాలు విశ్వాసముచే మంత్రముల ద్వారా అతుకునా? అతికిన రుజువు ఒకటి యున్నను దీనిని నమ్మవచ్చును అనునది అతికరినమైన నిరర్థకమైన విమర్శ విశ్వాసమనునది మనసునకు సంబంధించినది దాని ద్వారా మంత్రయోగశక్తితో మానసిక చకిత స్థితిని సరిచేయవచ్చునని భావముగాని విరిగిన కాలు విశ్వాసముచే మంత్రములతో అతుకును అని కాదు నేటి మానసిక వైద్యులు (Psychiatrist) యోగనిద్ర ద్వారా (Hypnotism) చలించిన మానసిక స్థితిని సరిచేయుటకు ప్రయత్నిస్తున్నారు గదా ఇంద్రజాలమునకు కూడా యోగనిద్ర (Hypnotism) కలిగించుటయే ఆధారము గదా! వీటి వలన విరిగిన కాలు అతుకునా? మంత్రయోగపద్ధతి

కూడ అంతే

సామాన్య మానవులకు అతీతమైన శారీరకమైన, మానసికమైన శక్తులను కొన్నిటిని యోగసాధన ద్వారా పొందవచ్చునని యోగసిద్ధాంత సారాంశము శరీరము యొక్కయు, మనస్సు యొక్కయు వ్యాపారములను నిరోధించుట వలన దుఃఖవిముక్తి కలుగునను భావము భారతదేశమున పుట్టినదే పరంజ్యోతిని దర్శించకలుగుట శ్రేష్ఠమగు భక్తిమార్గము అని ఋగ్వేదము చెప్పినది తపోసాధన వలన అతీంద్రియ శక్తులు పొందవచ్చునని అథర్వవేదము చెప్పినది అనంతర కాలమున ధ్యానము తపో మార్గముగ పరిగణింపబడినది పరమాత్మ యొక్క జ్ఞానము కొరకు ఆంతరంగికముగా చేయు అన్వేషణయే యోగసాధన అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి పరమాత్మ ప్రత్యక్షముగా గోచరము కానందున ఏకాగ్రతతో కూడిన ధ్యానమును ఉపనిషత్తులు చెప్పినవి సాంఖ్యతత్త్వమునకు భిన్నముగ కఠ, శ్వేతాశ్వతర మైత్రాయణ్యుపనిషత్తులు అనుష్ఠాన విధమును వివరించినవి ఈ ఉపనిషత్తులందు యోగము ఒక సాంకేతిక శబ్దముగా ఉపయోగించబడింది కాని ఉపనిషత్తులందు చెప్పబడిన యోగము పతంజలి చెప్పిన యోగమును పోలియున్నదని చెప్పుటకు వీలుపడదు 'సమాధి' అను భావము ఉపనిషత్తులు చెప్పిన గాఢ సుషుప్తి (నిద్రావస్థ) అవస్థ భావము నుండి ప్రతిఫలించి యుండునని తోచును బుద్ధి, చిత్తములతో ఇంద్రియములు ఎట్టి వృత్తియు లేని స్థితిని యోగావస్థగా కఠోపనిషత్తు చెప్పుచున్నది

'యోగః చిత్తవృత్తి నిరోధః' (1-2) అని పతంజలి యోగసూత్రములు నిర్వచించినవి చిత్తము అనగా అంతఃకరణ వృత్తులను నిరోధించుటయే యోగము అని పతంజలి అభిప్రాయము చిత్తమును ఏకాగ్రము చేయుట ద్వారా సమాధిస్థితికి చేరవచ్చునని చెప్పబడినది

'తదాద్రష్టు స్వరూపేఽ వస్థానవ్" (1-3) అట్టి యోగావస్థ యందు సాక్షియగు పురుషుడు (జీవాత్మ) స్వస్వరూపమును పొందియుండును అనగా

ఆత్మ సాక్షాత్కారముతో ఆత్మస్వరూపులమై యుందుము పతంజలి చెప్పిన ఆరు అంగములను గూర్చియు, ఆయన తత్త్వములోని కొన్ని 'శాస్త్రపదములు' మైత్రి ఉపనిషత్తునందు కాననగును ప్రాచీన ఉపనిషత్తుల కాలము నాటికి యోగశాస్త్రము పరిపూర్ణ రూపమునకు రాలేదని తెలియుచున్నది అనంతర ఉపనిషత్తుల కాలము నాటికి యోగతత్త్వము వికసించి యుండునని అనిపించును మైత్రి, శాండిల్య, యోగతత్త్వ, ధ్యానబిందు, యోగ చూడామణ్యుపనిషత్తు, యోగశిఖోపనిషత్తు మొదలగు కొన్ని అనంతర ఉపనిషత్తులు యోగసూత్రములకు ప్రాముఖ్యమునిచ్చినవి బుద్ధుని కాలమున లెక్కకు మించిన యోగాభ్యాస పద్ధతులున్నవని తెలియుచున్నది బుద్ధుడు తపోనియమములను, మహోన్నతమైన ధ్యానము కూడ సల్పెనని చరిత్ర చెప్పుచున్నది ఏకాగ్రత పద్ధతులు ఎన్నియో బౌద్ధము చెప్పినది

ఉపనిషత్తులు, మహాభారతము, భగవద్గీతయును జైనబౌద్ధములు కూడ యోగాభ్యాసమును అంగీకరించినవి బ్రహ్మయే యోగసిద్ధాంతమునకు మూలపురుషుడు అని చెప్పబడినది తన కాలమున వ్యాపించియున్న ధ్యాన తపోవిధానములను సంస్కరించి పతంజలి వాటికి సూత్రరూపము ఇచ్చి యుండునని చెప్పవచ్చును వ్యాప్తిలోనున్న భావములకు అనుభవములను జోడించి యుండవచ్చును అందువలననే పతంజలి యోగసూత్రములు అతని కాల పరిస్థితులను ప్రతిబింబించుచున్నవని చెప్పక తప్పదు పూర్వ యోగములలో ఒకటి కర్మను గురించి చెప్పింది ప్రపంచమే జీవుని కర్మ వలన ఉత్పత్తి యగుననియు, రాగద్వేషములు, క్రియా ఇచ్ఛ (క్రియాపరత్వము) కర్మ వలననే జనించునని యీ పూర్వసిద్ధాంతము చెప్పింది వాత్స్యాయనుడు ఈ పూర్వ సిద్ధాంతమును గూర్చి చెప్పియున్నాడు ఇందు మానవ ప్రయత్నమునకు ప్రాముఖ్యమీయబడినది అందుచే పూర్వమీమాంసతో పోలికయున్నట్లు కనబడును సత్కార్య ఆచరణ గురించి పూర్వమీమాంస చెప్పియున్నది ఆత్మ నిత్యము, శరీరము, ఇంద్రియములు, మనస్సు జడపదార్థ లక్షణములను

కలిగి ఆత్మసంయోగముచే జీవానుభవములకు కారణభూతములగుచున్నవని పూర్వమీమాంస వాదము ఆత్మస్వరూపము, కర్మ, కారణధర్మము మొదలగు కొన్ని ప్రధాన విషయములందు సాంఖ్యముతో యోగము భేదించినది అనగా సాంఖ్యతత్త్వమునకు కర్మ సిద్ధాంతము జోడించినచో పూర్వయోగ సిద్ధాంతము ఏర్పడునని అనిపించును

సాంఖ్యతత్త్వమును అంగీకరించి, కొన్ని భేదములతో దానిని ఆధారముగా పతంజలి యోగసూత్రములను రూపొందించినట్లు కనబడును కాని సాంఖ్యము చెప్పిన ఇరువదినాలుగు తత్త్వములను గూర్చి యోగసూత్రము లందు ఏ విధమైన చర్చ లేదు సాంఖ్యము యోగములందు ఉన్న భేదములు ప్రధానముగా రెండు 1) పతంజలి పరమగురువు రూపమున నున్న సగుణ (ఆకారము గల) దైవమును అంగీకరించాడు సృష్టిలో ఒక కల్పమునకు తాత్కాలికముగా ఆధిపత్యము పొందు ఒక పురుషుని తప్ప వేరొక దైవమును సాంఖ్యాలు అంగీకరించరు 2) ఆత్మ లేక పురుషునితో సమమగు మనస్సు సర్వమును పొందియుండునని యోగసిద్ధాంతము సాంఖ్యము దీనిని అంగీకరించదు

ప్రపంచము నిత్యము మారుచుండును దానికి ఆదియును, అంతమును లేవు అనియు, ఆది స్వస్వరూపములో గుణములతో కూడి ఎల్లపుడు ఒకటిగా మాత్రమే యుండు ప్రకృతి అన్నారు ఆత్మలు గుణములకు అతీతములు అవి జీవులకు చైతన్యమిచ్చుచుండును కాని ఇవి ప్రకృతి సంపర్కముచే పరోక్షముగా సుఖదుఃఖ అనుభవములకు కర్తలై సంసారచక్రములో అనేక దేహములను పొందుచున్నది ఇది యోగ సిద్ధాంతము ప్రకృతి పరిణామ విషయములో యోగసిద్ధాంతము సాంఖ్యము నుండి కొంచెము భిన్నముగా నున్నది పరిణామక్రమము మహత్తు నుండి ఆరంభమగును దానికి ఒకవైపు అహంకారము, మనసు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు




కర్మేంద్రియములు, మరియొకవైపున పంచభూతములు వానినుండి పంచ తన్మాత్రలు పరిణమించునని చెప్పబడెను

యోగభాష్యకారుడైన వ్యాసుడు పంచతన్మాలు స్థూలపంచభూతముల నుండి జనించవు, కాని స్థూలభూతములే పంచతన్మాత్రల నుండి ఏర్పడును అన్నాడు అహంకారమునందు సాత్విక భాగము ఇంద్రియములను, తామసభాగము తన్మాత్రలను పరిణమింపచేయునని సాంఖ్యము చెప్పెను ఈ రెండును మహత్తు నుండియే కలుగును అని చెప్పబడుటచే పరిణామ క్రమమందు సాంఖ్యము, యోగములకు గల భేదము ప్రత్యేకించి చెప్పదగినదిగా లేదు అనియే చెప్పవచ్చును సాంఖ్యములోని మూడు అంతరింద్రియములకు - అహంకారము, మనస్సు, బుద్ధి - యోగము చిత్తము అని సంయుక్తనామము ఇచ్చినది అహంకారము, మనస్సు, బుద్ధి నుండి భిన్నమైనవి అని యోగము అంగీకరించదు ఇంద్రియములు స్థూలభూతములచే ఏర్పడినవి అని చెప్పబడుటచే కావచ్చు, యోగసిద్ధాంతమందు సూక్ష్మశరీర ప్రసక్తి కనబడదు

వస్తువుల నిజస్వరూపము తెలుసుకొనుటయే జ్ఞానము అది తెలుసుకొనలేకపోవుట అజ్ఞానము అజ్ఞానము వలన కామము, క్రోధము మొదలైనవి కలుగును అవే సర్వదుఃఖములకు కారణములు ప్రపంచము

అనాది యగుటచే అజ్ఞానమునకు కూడ ఆది తెలుసుకొనుట సాధ్యము కాదు ప్రళయ సమయమందు (సృష్టి అంతము) పురుషుల చిత్తములు ప్రకృతిలో చేరి యందు కొంతకాలము విశ్రమించును మరల పునస్సృష్టి సమయమున పురుషచిత్తములు తమతమ అజ్ఞానముతోనే మరల సృష్టింపబడును అవిద్యయందు వ్యక్తిగత మార్పులుండవచ్చును అందువలన పునర్జన్మ యందు కొద్ది మార్పులు కలుగవచ్చును అజ్ఞాన పరిమాణముననుసరించి కర్మాశయమైన ఆయురారోగ్య సౌఖ్యములు కలుగును సృష్టికి కారణములు పరమాత్మ మరియు అజ్ఞానము అని యోగసూత్రములు చెప్పుచున్నవి నిత్యము పరిభ్రమించు ప్రకృతి శక్తి అజ్ఞాన ప్రభావముతో భౌతిక మానసిక ప్రపంచమందు వికారరూపములుగా పరిణామము చెందును అని కూడ యోగసూత్రములు చెప్పుచున్నవి ఈశ్వరుడు (పరమాత్మ) ప్రకృతికి దూరముగా నున్నను, ప్రకృతి పరిణామమునకు కలుగు ఆటంకములను తొలగించును పరమాత్మ చిత్స్వరూపుడు అనగా జ్ఞానస్వరూపుడు (చిత్ అనగా జ్ఞానము) అందుచే పురుషుల కోరికల నెరిగి తదనుగుణముగా ప్రకృతి వికారములను మార్చుచుండును అన్నారు సాంఖ్యములో జీవి ప్రకృతి అధీనుడు కాని యోగములో అధీనుడు కాడు అతనికి స్వేచ్ఛ ఉన్నదని యోగము చెప్పును ముక్తిని గూడ సాధించుకోగలడు ముక్తికి అర్థము సాంఖ్యయోగములు రెండును దాదాపు ఒకే విధముగ చెప్పినవి పునర్జన్మ దానిని అనుసరించియుండు దుఃఖముల నుండి విముక్తియే ముక్తియని చెప్పబడింది అనగా ప్రకృతి నుండి పురుషుడు వేరుపడటమే ముక్తి దానికి సాధనము ప్రకృతి పురుషుల భేదము తెలియుటయే ఇదే జ్ఞానము ఈ జ్ఞానము ముక్తిసాధనమని సాంఖ్యము చెప్పును జ్ఞానమునకు తోడు ఏకాగ్రత, కఠిన సాధన (ప్రయత్నము) కూడ అవసరమని యోగసిద్ధాంతము చెప్పును ముక్తికి జ్ఞానము సాధనమని సాంఖ్యవాదము కాగా నిష్కామకర్మ ద్వారా ముక్తిసాధ్యమని యోగవాదము ఇంకొక విధముగా చెప్పినచో సాంఖ్యము తర్కప్రమాణములను తీసికొనగా

యోగము భక్తి సాధనములకు, చిత్తనిగ్రహ సాధనకు ప్రాముఖ్యము ఇచ్చినది అందుచే యోగమునకు దేవుడున్నాడని అంగీకరించవలసిన అవసరమేర్పడినది బహుశ అందువలననే కావచ్చు 'కపిలుని నిరీశ్వరసాంఖ్యావాదమునకు (దేవుడు లేడు అను) ప్రతిగా యోగము స ఈశ్వర సాంఖ్యము (దేవుడున్నాడు అను) అని పేరు పొందినది '' అదియే సాంఖ్యము, యోగములకు సామ్యములో నున్న భిన్నత్వము జడ (అచేతనమైన) పదార్థములతో జీవుని సంబంధమును తొలగించుటయే యోగము ధ్యేయము చిత్తము పదార్థరూపము దానికి ప్రవృత్తి యున్నది ఆ ప్రవృత్తి బంధములనుండి విముక్తి పొందుటకు యోగము మార్గములు చెప్పినది

జ్ఞానము, యోగము మోక్షమునకు రెండు భిన్నమార్గములు ఇదే విషయము తన గూఢార్థదీపిక (గీతాభాష్యము) (ధ్యానయోగం 6-29) శ్లోకమునకు వ్యాఖ్యానము చెప్పుచు యోగవాసిష్ఠము నుండి ఉదాహరణ ఇచ్చారు మధుసూదన సరస్వతి

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతేయోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ (6-29)

యోగము ద్వారా స్థిరమైన (స్వచ్ఛమైన) మనసును పొందినవాడు (యోగమందు పక్వము పొందినవాడు) తనను సర్వప్రాణులందు, సర్వ ప్రాణులను తన యందు చూడగలిగి అన్నిటియందు సమదృష్టిని పొందును అట్టివాడు ఆంతరిక చైతన్యమైన ఆత్మను దర్శించగలడు ఆత్మదర్శనము పొందినవాడు 'యోగయుక్తాత్మ' అని చెప్పబడింది అపుడు అతడు 'నిర్విచార సమాధి' పొందును అపుడు ఆంతరిక అవయవమైన మనస్సు నిర్మలమైన స్థితిని పొందును అపుడు కలుగు 'అంతర్దృష్టి'ని (insight) 'ఋతంభరా' (rtambhara) అని అన్నారు అది బాహ్య ఇంద్రియముల ద్వారా పొందు జ్ఞానము కంటె భిన్నమైనది ఇదే విషయము పతంజలి యోగసూత్రములలో

చెప్పబడింది - సమాధి పాదము (యోగపాదము) (1-47-49) భగవద్గీతలో దీనిని యోగసిద్ధి అన్నారు నిర్విచార సమాధి అత్యంత నిర్మలమై యోగికి ఆధ్యాత్మిక నిర్మలత్వం లభింపచేస్తుంది (యోగసూత్రము 1-47) రజస్తమో గుణముల ఆధిక్యత నశించినపుడు బుద్ధిలో ప్రకాశ లక్షణం (నిర్మలత్వం) కనబడును ఈ స్థితిలో కలుగు ఆనందమును 'అధ్యాత్మ ప్రసాదం' అన్నారు ఇది నిర్విచార సమాధి వలన కలుగు ఫలము అట్టి స్దితి యందు బుద్ధి మిక్కిలి స్వచ్ఛముగా, నిర్మలముగా నుండును "ఋతంభరాతత్రప్రజ్ఞా" యోగసూత్రం (1-48) 'అధ్యాత్మ ప్రసాదము' వలన కలుగు తెలివినే (బుద్ధినే) 'ఋతమ్భరము' అన్నారు ప్రజ్ఞ అనగా బుద్ధి ఋతము అనగా పూర్ణసత్యము 'ఋతమ్భరా' అనగా అట్టి పరిపూర్ణ సత్యమును పొందు బుద్ధి ఆ బుద్ధియే ఋతమ్భరాప్రజ్ఞ అగును ఆ ప్రజ్ఞ వలన పదార్థముల నిజస్వరూపమును తెలిసికొను శక్తిగలవాడై యోగి అత్యుత్తమ స్థితిని పొందును

"శ్రుతానుమానప్రజ్ఞాభ్యామన్యవిషయావిశేషార్థత్వాత్"

(యోగసూత్రం (1-49))

శ్రుతము అనగా ఆగమము ద్వారా కలుగు విజ్ఞానం అనగా వేదశాస్త్ర జ్ఞానము, మిత్రుల మాటల వలన కలుగు జ్ఞానం సంపూర్ణజ్ఞానం కాదు అటువంటిదే అనుమానజ్ఞానం కూడాను అనుమానము అనగా పొగను చూచి అగ్నిని ఊహించినట్లు తెలిసినదానిని బట్టి తెలియనిదానిని ఊహించుట ఇది కూడ సాధారణ జ్ఞానమే అగును వేదశాస్త్రముల వలన, ఆప్తుల మాటలు వినుటవలన కలుగునది శ్రుతబుద్ధి యగును అనుమానము వలన కలుగునది అనుమానబుద్ధి ఈ రెండును అసంపూర్ణములే ఇవి వస్తువు యొక్క సామాన్య రూపమును మాత్రము గ్రహించును వస్తువు యొక్క సత్యరూప జ్ఞానము కలుగదు ఆగమము వలన సామాన్య విషయములు స్థూలముగాను ప్రత్యక్షముగాను కలుగును అనుమానము ఊహకు సంబంధించినది అగుట

వలన దాని వలన జ్ఞానము పరోక్షముగా నుండును (indirect) ఋతుమ్భరా కలది కాబట్టి ఋతమ్భరా ప్రజ్ఞ (బుద్ధి) వలన వస్తు సంపూర్ణ జ్ఞానం కలుగును ఇది శ్రుత, అనుమాన ప్రజ్ఞలకంటే విశేషమైనది ఋతమ్భరాప్రజ్ఞను తార్కికులు యోగ ప్రత్యక్షము అన్నారు దీని వలన తన్మాత్రల (సూక్ష్మ భూతములు) యొక్కయు, అంతఃకరణము యొక్కయు, పరమ పురుషుని యొక్కయు యదార్ధ స్వరూపస్థితులు తెలియును ఈ ఋతుమ్భరాప్రజ్ఞ వలన కలుగు జ్ఞానము (సంస్కారము) బాహ్యజ్ఞానముచే కలుగు అన్ని సంస్కారములను నిరోధించును గీతాశ్లోకము (6-29)లో చెప్పబడిన సమదర్శనము ఈ ఋతుమ్భరము అనబడు అంతర్దృష్టి వలన కలుగును సర్వత్ర సమదర్శనము కలవాడు ఆత్మను, అనాత్మను యదార్థస్థితిలో చూడగలుగును

యోగము ద్వారా నిర్మలచిత్తము పొందినవాడు, లేక సర్వత్ర సమదర్శన దృష్టి పొందినవాడు, ఇద్దరు ఆత్మదర్శనమును పొందగలరు అన్నారు మధుసూదన సరస్వతి తన గీతాభాష్యమందు ఇచట మధుసూదన సరస్వతి యోగవాషిష్ఠము నుండి ఉదాహరణగా చెప్పారు

(లఘుయోగవాసిష్ఠము వీతహవ్య ఉపాఖ్యానము) అహంకారముతో నిండియున్న మనస్సును నియంత్రించుటకు యోగము, జ్ఞానము రెండు సాధనములు మనః ప్రవృత్తిని యోగము నిరోధించును జ్ఞానము సత్యదర్శనము కలిగించును కొందరికి యోగము సాధ్యము కాదు మరికొందరికి జ్ఞానము అసాధ్యము ఇదే విషయము యోగవాసిష్ఠములోని భుశుండోపాఖ్యానములో కూడ చెప్పబడింది

"అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిద్ జ్ఞాననిశ్చయః
ప్రకారౌద్వౌతతోదేవో జగాద పరమశ్శివః"

ఒకరికి ప్రాణాయామ పూర్వకమైన యోగం అసాధ్యం కావచ్చు మరొకరికి జ్ఞానమార్గం అసాధ్యం కావచ్చు అందుకే పరమేశ్వరుడు (పరమాత్మ) రెండు

మార్గములను చెప్పాడు ఈ సందర్భములో మధుసూదన సరస్వతి యోగశాస్త్రములో చెప్పబడిన, అసంప్రజ్ఞాత సమాధి, సంప్రజ్ఞాత సమాధిని ఉదహరించారు

యోగము మోక్షమును సమాధియనియే నిర్వచించినది ఇతర భావములచే ఏ మాత్రము చలింపక ఒకే ధారగా ప్రవహించు భావమే ధ్యానమనబడును ఈ ధ్యానము సమాధిస్థితి యందు పూర్తియగును 1) సమాధియందు 'నేను' అను భావము పోవును 2) శరీరము, మనస్సు బాహ్య ప్రేరణములకన్నిటికి చలింపదు అనగా మరణించినట్లుగా ఉండును) 3) ధ్యానమునకు సంబంధించిన విషయము ఏది అయినను అది మాత్రమే మనస్సునందు ప్రకాశించును ఒక విషయమును గురించి ఈ మూడు కలిసినపుడు దానిని యోగశాస్త్రములో "సంయమము" అన్నారు బాహ్య విషయము గాని, ఆంతరిక విషయముగాని దానిపై సంయమము వలన కలుగు శక్తిని ప్రయోగించినపుడు అతీంద్రియశక్తులు కలుగును మూసిన తలుపుల వెనుకనున్న దానిని చూచుట, అదృశ్యమగుట, ఇతరుల భావములను గ్రహించగలుగుట మొదలగునవి ఇటువంటి శక్తులే కాని సాధకుడు ఈ శక్తుల వైపు ఆకర్షితుడైనచో యోగసాధన లక్ష్యము కోల్పోయి భ్రష్టుడగును సమాధి యనునది ఒక తన్మయస్థితి అందు బాహ్యప్రపంచముతో సంబంధము తెగిపోవును యోగసాధనకు ఇదియే పరమావధి ఇందు కాలమునకు వశమై పరివర్తనతో కూడిన స్థితి నుండి సత్యము, నిత్యము, పరిపూర్ణమైన స్థితికి పోవును తిరిగి సమాధి ప్రవేశ ద్వారము చేరినపుడు మరల పురుషుడు తన సహజస్థితిని పొందును సమాధి దశలను సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత సమాధులు అన్నారు

(యోగసూత్రము 1-17, 41→45) '**సంప్రజ్ఞాత యోగం**' అనగా చిత్తవృత్తిని నిరోధించి, బుద్ధి, పంచభూతములు (స్థూలభూతాలు) పంచతన్మాత్రలు

(సూక్ష్మభూతాలు) సమస్త తత్త్వములను గురించి సంపూర్ణజ్ఞానం కలిగియుండుట సంప్రజ్ఞాత యోగములో నాలుగు రకముల సమాధులను చెప్పారు వాటి వివరణ ఇచట అప్రస్తుతము సంప్రజ్ఞాత యోగమును సబీజ సమాధి అని కూడ అన్నారు ఇక **అసంప్రజ్ఞాత యోగము** అనగా ఆలంబనములైన త్రిగుణములకు సంబంధించిన అన్ని వృత్తులను నిరోధించినపుడు కలుగు ఉపరత అవస్థ అనగా సంపూర్ణ వైరాగ్యస్థితి ఇది విషయముల యందు కలుగు వైరాగ్యము కంటే ఉన్నతమైనది ఇది చిన్మయ లేక చిన్మాత్ర స్వరూపుడైన పరమాత్మ స్థితి అనగా సంపూర్ణజ్ఞానస్థితి చిన్మాత్ర స్థితికి చేరిన పురుషుడు ఆత్మస్వరూపము ఎరిగినవాడగును దీనినే ధర్మమేఘసమాధి లేక నిర్బీజసమాధి అన్నారు ఈ సమాధికి పూర్వమందు ఉండు స్థితియే సంప్రజ్ఞాత యోగము (సబీజ సమాధి)

ప్రకృతి గుణములందు (త్రిగుణములు) తృష్ణ (కోరిక) పూర్తిగా తొలగించినపుడు కలుగు వైరాగ్యమును పరవైరాగ్యం అన్నారు దీనికి ముందు అపరవైరాగ్యమున్నది సాధకుడు విషయవాసనలు తొలగించుకొనగలిగినపుడు అపరవైరాగ్యం కలుగును అపుడు అతని చిత్తమునకు ఏకాగ్రత కలుగును అటుపై యోగ లేక సమాధి పరిపక్వత కలిగి ప్రకృతి పురుషుల వివేకజ్ఞానం కలుగుతుంది ఈ జ్ఞానం కలిగినపుడు త్రిగుణ సంబంధమైన తృష్ణ ఉండదు, ఉండకూడదు అపుడు ఆ సాధకుడు నిష్కాముడు (ఎట్టి కోరికలు లేనివాడు) అగును ఈ విధమైన రాగరహిత స్థితిని 'పరవైరాగ్యం' అన్నారు ఈ స్థితిలో దుఃఖము పూర్తిగా తొలగిపోతుంది ఈ పరవైరాగ్యం జ్ఞానమునకు పరాకాష్ఠ లేక చివరిస్థితి ఇదే విషయము భగవద్గీత ధ్యానయోగము (6వ అధ్యాయము) 4, 5 శ్లోకములలో ఇదియే చెప్పబడింది

శ్లో॥ యదా హినేంద్రియార్థేషునకర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్ప సన్యాసీయోగారూఢస్తదోచ్యతే ॥ (6-4)

శ్లో॥ ఉద్ధరేదాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనోబంధుః ఆత్మైవరిపురాత్మనః ॥ (6-5)

ఎవడైతే ఎల్లప్పుడు ఇంద్రియ విషయములందు ఆసక్తియుంచక, కర్మమునందు కూడ ఆసక్తి చూపక సంకల్పములను తొలగించుకొనుచున్నాడో అతడు యోగారూఢుడగును (భగవద్గీత 6-4)

ఎవరికివారు అనగా తమని తామే ఉద్ధరించుకొనవలయును ఆత్మను కించపరచకూడదు ఎందుకనగా ఆత్మయే తనకు బంధువు, ఆత్మయే తనకు శత్రువు కూడ అగును (6-5)

యోగము నందు స్థిరత్వము పొందినవాడు యోగారూఢుడు అగును ధ్యానము పరాకాష్ఠకు చేరి సమాధి స్థితికి చేరినపుడు అతనికి బాహ్య ప్రపంచముతో సంబంధము తెగిపోవును శబ్దము స్పర్శలందు కూడ అతనికి ఆసక్తి యుండదు నిత్యనైమిత్తిక కర్మలన్నియు నిద్రయందువలె యుండును సంకల్పములన్నియు తొలగినపుడు మనస్సు నిశ్చలమైన సముద్రము వలె నుండును ఆలోచనలు అనబడు అలలు ఉండవు ఐహికము, ఆముష్మికము (పరలోక సంబంధమైనవి) ఏ మాత్రము ఉండదు అనగా ఈ లోకపు పరలోకపు ఆలోచనలుండవు సంకల్పములు లేనపుడు కోరికలుండవు అని మహాభారత శాంతిపర్వములో కూడ చెప్పబడింది యోగారూఢస్థితియందు సాధకుడు తన ఆత్మను తన ఆత్మచే ఉన్నతస్థితికి తీసికొనిపోవును

అందుకే ఎవరికివారు తమనితామే ఉద్ధరించుకొనవలయునని భగవద్గీత చెప్పింది మానవుడు పొందు నీచ ఉన్నత స్థితులకు తానే బాధ్యుడు వేరెవ్వరు అందుకు బాధ్యులు కాదు తనను తాను జయించినవారికి తానే బంధువు తనను తాను జయించని ఆత్మ శత్రువుగానే వ్యవహరించి తన నాశనమునకే దారితీయును

ఇంద్రియ విషయములందు కర్మలయందు ఎటువంటి ఆసక్తి లేకుండా అన్ని సంకల్పములను విసర్జించినవాడు యోగారూఢుడు అన్నారు అట్టి చిత్తవృత్తి నిరోధరూపమే నిర్బీజ సమాధి రూపమైన అసంప్రజ్ఞాత యోగము సంప్రజ్ఞాత సమాధియందు చిత్తము పూర్తిగా నిరోధింపబడదు అందు ఆలంబనము అనగా ఆధారము అనునది యుండును అందుచే సంప్రజ్ఞాత యోగము సాలంబన సమాధి అన్నారు అసంప్రజ్ఞాత యోగం నిరాలంబన సమాధి ఇందు అన్ని ఆలంబనలతో కూడిన వృత్తులు నిరోధింపబడును అనగా బాహ్యవస్తువుల ఆలంబనం నిరోధింపబడును ఇక మిగిలినది చిత్తము యొక్క సంస్కారశేషము ఈ స్థితిలోని సమాధిని అసంప్రజ్ఞాత యోగం అన్నారు ఈ స్థితిలో పరవైరాగ్యమును పొందిన సాధకుని చిత్తము ప్రాపంచిక విషయముల నుండి తనంతట తానుగానే ఉపరతమగును అనగా విరక్తిని పొందును ప్రాపంచిక విషయముల నుండి ఉపరతమైన చిత్తస్థితిని 'విరామ ప్రత్యయం' అన్నారు దీనికి సంబంధించిన అభ్యాసం కూడ పూర్తిగా ఆగిపోయిన స్థితిలో చిత్తవృత్తులు (చిత్తస్థితులు) అన్నీ ఆగిపోతాయి ఇది అభావస్థితి ఇపుడు చిత్తములో నుండు సంస్కారములు మాత్రమే మిగులును అటుపై సంస్కారాల క్రమం కూడ పూర్తిగా ఆగిపోవును అపుడు చిత్తము తనకు కారణమైన దానిలో లీనమైపోవును ఈ విధముగా ప్రకృతితో సంబంధము ఆగిపోవుట వలన ద్రష్ట (పురుషుడు లేక జీవాత్మ) తన నిజరూపం పొందగలుగుతాడు ఈ స్థితినే అసంప్రజ్ఞాత యోగం లేక నిర్బీజసమాధి అన్నారు ఇదే కైవల్యావస్థ యోగసూత్రం (1-50)లో ఋతుమ్భరాప్రజ్ఞను గురించి ఇంకా చెప్పారు

సూ (1-50) "తజ్జః సంస్కారోఽన్య సంస్కారప్రతిబన్ధీ" ఋతమ్భరా ప్రజ్ఞ వలన ఒక సంస్కారం ఏర్పడుతుంది ఆ సంస్కారం ఇతర విధములైన సంస్కారములన్నిటిని నిరోధించును ఏదైనా ఒక పని చేసినపుడు గాని లేక ఒక విషయం తెలుసుకున్నపుడు గాని మనకు ఒక అనుభవం కలుగుతుంది ఆ

అనుభవం ద్వారా జ్ఞానం కలుగుతుంది ఆ జ్ఞానం మన చిత్తము (బుద్ధి) మీద చెరగని ముద్రవేస్తుంది ఆ ముద్రలనే సంస్కారాలు అన్నారు వీటిని యోగశాస్త్రములో 'కర్మాశయములు' అన్నారు మనం పొందు జ్ఞానము, మనము చేయు పనులు ఈ సంస్కార ఫలితములే మానవులు ఈ సంస్కారములకు అతీతంగా జ్ఞానమును పొందటం గాని, పనులు చేయటం కాని సాధారణ పరిస్థితులలో అసాధ్యము అనగా మన జ్ఞానము, మన కర్మలు అన్నీ సంస్కారములకు లోబడినవే ఈ సంస్కారాలు అజ్ఞానం (అవిద్య) మూలంగా వస్తాయి, అలాగే జ్ఞానం వలన కూడ వస్తాయి అజ్ఞానం వలన వచ్చే సంస్కారములను యోగశాస్త్రములో 'క్లిష్టములు' అనియు, జ్ఞానం వలన కలుగు సంస్కారములను 'అక్లిష్టములు' అనియు అన్నారు ఇక్కడ ఒక విషయం ఉన్నది జ్ఞానం అజ్ఞానమునకు విరుద్ధం అందుచే అవిద్య (అజ్ఞానం) వలన కలుగు సంస్కారములు విద్య (జ్ఞానం) వలన కలుగు సంస్కారములచే నిరోధించబడతాయి అన్నారు అట్టి స్థితిని సంప్రజ్ఞాత సమాధి (యోగము) అన్నారు ఇది మనకు జాగ్రదవస్థ (మేలుకొని ఉన్నపుడు) యందు కలుగు సంస్కారములను నిరోధించును విద్య (జ్ఞానం) ఋతమ్భరాప్రజ్ఞ (బుద్ధి)కు మూలము అందువలన ఋతమ్భరా ప్రజ్ఞ అవిద్యా సంస్కారములను తొలగించు ప్రకృతి యదార్థ రూపమును గోచరింపచేస్తుంది ఆ సత్యస్వరూపమును గ్రహించినపుడు వైరాగ్యం కలుగును ఈ వైరాగ్యము వలన ఒక సంస్కారం ఏర్పడుతుంది అప్పటికే మనలో రాగద్వేషాలతో కూడ యున్న అజ్ఞాన సంస్కారములన్నిటిని ఈ వైరాగ్య సంస్కారము తుడిచివేయునని యోగసూత్రములు చెప్పుచున్నవి ఈ స్థితిలో జీవుడు ముక్తికి దగ్గరవుతాడు

ఇంకా (1-51) సూత్రంలో తరువాత స్థితిని గురించి చెప్పారు

సూ (1-51) "తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః"

తరువాత స్థితి నిర్బీజ సమాధి అనగా అసంప్రజ్ఞాతయోగము వైరాగ్య సంస్కారము అనగా సంప్రజ్ఞాతయోగము కూడా నిరోధించబడినపుడు నిర్బీజ సమాధి కలుగును ఋతమ్భరా ప్రజ్ఞ వలన అజ్ఞాన సంస్కారములు నశించును గదా! అటుపై ఈ ఋతమ్భరాప్రజ్ఞ (బుద్ధి) వలన కలుగు సంస్కారములు నిరోధించబడతాయి అపుడు అన్ని రకముల సంస్కారములు నిరోధించబడినట్లు అగును అనగా సంస్కార బీజం (విత్తనం) నశించినది అని అర్థము ఇదే నిర్బీజ సమాధి లేక కైవల్యావస్థ

యోగసూత్రకైవల్య పాదములో ఇంకా ఇలా చెప్పారు

(4-32) సూత్రము ఇది కొన్ని ఇతర ప్రతులందు (Editions) 31వ సూత్రముగా చెప్పబడింది

సూ (4-32) "తతః కృతార్థానాం పరిణామ క్రమసమాప్తి ర్గుణానామ్'' 'ధర్మమేఘ' సమాధి అనగా నిర్బీజసమాధి ప్రాప్తించిన తరువాత త్రిగుణములకు ఏ పని మిగలదు గుణముల పనియైన పరిణామ క్రమం పూర్తి అగును అంతటితో అది ఆగిపోవును నిర్బీజ సమాధి పొందిన యోగికి కర్తవ్యములు ఏమి మిగలవు త్రిగుణముల పరిణామ ప్రవృత్తి అంతమైంది కాబట్టి నిర్బీజసమాధి పొందిన యోగికి త్రిగుణములు పునర్జన్మను ఇవ్వగల శక్తిని కోల్పోవును

ఈ పరిణామం గురించి (4-33) సూత్రమందు చెప్పబడింది (కొన్ని ప్రతులందు ఇది 32వ సూత్రముగా చెప్పబడింది)

సూ (4-33) "క్షణ ప్రతియోగీ పరిణామాపరాన్త నిర్గ్రాహ్యః క్రమః" క్షణములకు శత్రువులే (ప్రతి యోగీ) అయిన క్షణములను విభజించునట్టిది దాని స్వరూపం పరిణామం (మార్పుల) చివరిలో మాత్రమే తెలియునట్టిది అయిన దానిని క్రమము అన్నారు అనగా వెనుకముందు అనుటకు వీలుగా

ఉండుదానినే గుణపరిణామక్రమము అన్నారు

ప్రతి వస్తువు ఒక రూపము నుండి మరియొక రూపమునకు మార్పు చెందటమే సృష్టి పరిణామం అనబడును ఇపుడున్న రూపం మరుక్షణంలో పాతదవుతుంది ఈ పరిణామం అనగా మార్పు నిరంతరం జరుగుతూనే ఉంటుంది కాని ఆ మార్పు మన కంటికి కనుపించదు ఈ పరిణామం ఒకసారిగా జరగలేదని, క్రమంగా వచ్చిందని అనుమానం ద్వారా మాత్రమే తెలుసుకొనగలము అనగా తెలిసినదానిని బట్టి తెలియనిదానిని ఊహించుట మన శరీరంలో కలుగు మార్పుల వలన మనకు 40 సంవత్సరములు వచ్చిన వయస్సులో గతంలో 20 సంవత్సరముల వయస్సులో ఎలా ఉన్నామో ఎలా తెలుస్తుంది? అనుమానం ద్వారానే అనగా ఊహించటం ద్వారానే ఇక్కడ ఒక విషయమున్నది బాల్యములో ఎలా ఉన్నామో అను భావన చివరిదైన ముసలితనంలో కలుగుతుంది గాని మధ్యలో కలగదు అనగా పరిణామ క్రమమునకు సంబంధించిన జ్ఞానం ఆ క్రమం చివరిలో మాత్రమే కలుగుతుంది అని పతంజలి ఈ సూత్రంలో అన్నారు "పరిణామాపరాన్తనిర్గ్రాహ్యః" అన్నారు మార్పులో ప్రతిక్షణమునకు సంబంధము ఉంటుంది అనగా ప్రతిక్షణమునకు అంతకు ముందు క్షణముతో సంబంధముండును ఇలా క్షణముల ననుసరించి కలుగు పరిణామమును పతంజలి 'క్రమము' అన్నాడు మనము ఒక విషయమును గూర్చి ఆలోచించునపుడు ఎన్నో క్షణములు గడచిపోవును క్షణం క్షణం మన ఆలోచనలో మార్పు వస్తూ ఉంటుంది ఇన్ని మార్పులు కొన్ని జరిగిన తరువాత గాని, ఆ మార్పులు జరిగినై అని మనం గ్రహించలేము దీనినే పరిణామక్రమం అన్నాడు పతంజలి 'క్షణప్రతియోగి' అనుటలో భావం ఇదే దీని అర్థం క్షణములను విభజించు క్రమము అని చెప్పవచ్చు కాని అన్నీ గతించినవి అను తత్వము చిత్తమందు కలిగినపుడు ఇక పరిణామక్రమము అనునది ఉండదు అన్నారు ఆ స్థితిలో చిత్తమునకు గతము అనునది ఉండదు అంతయు ప్రస్తుతమే అగును అనగా కాలప్రవాహ భాగములైన

భూత, భవిష్యత్తులు వాటి ఉనికిని కోల్పోయి వర్తమానము మాత్రమే మిగులును అనగా కాలము ఆ చిత్తము వశములో నుండునని భావము సర్వము తృటిలో కన్నులకు గోచరించును ఈ స్థితినే 'కైవల్య స్థితి' అన్నారు యోగసూత్రములలో

ఈ కైవల్య స్వరూపమును చివరి సూత్రములో వివరించారు

సూ (4-34) పురుషార్థ గుణానామ్ ప్రతిప్రసవే
కైవల్యం స్వరూప ప్రతిష్ఠావా చితి శక్తిరతి''

పురుషుని ప్రయోజనము కొరకు చేయవలసినవి ఏమియు లేని స్థితియందు త్రిగుణములు విలోమ క్రమమున (అవరోహణ క్రమమున in descending order) తమకు కారణమైన దానిలో లీనమైపోవును అనగా ప్రకృతిలో లీనమగును అపుడు ద్రష్ట (జీవాత్మ) తన స్వరూపములో (యదార్థరూపములో) ప్రతిష్ఠితుడగును దీనినే కైవల్యము (ముక్తి) అన్నారు

పురుషునికి భోగములను, తుదకు ముక్తిని ఇచ్చుటయే త్రిగుణముల (సత్వరజస్తమోగుణములు) కర్తవ్యముగా చెప్పబడింది ఈ కర్తవ్యం నిర్వర్తించుటకు గుణములు కొన్ని మార్పులు చెందుచుండును ఈ మార్పు రూపములే బుద్ధి, అహంకారము, మనస్సు, ఇంద్రియములు ముందు భోగములు కలుగజేసి పురుషునకు తుదకు ముక్తిని (అపవర్గమును) ఈ గుణములు కలుగజేయును అటుపై గుణముల కర్తవ్యము ఏమియు మిగలదు కారణము, కార్యము అను రూపములో కర్తవ్యము నిర్వర్తించిన గుణములు కర్తవ్యం పూర్తి అయిన వెంటనే ప్రకృతిలో లీనమగును అనగా గుణములు పురుషుని నుండి వేరగును గుణముల వలన కలిగిన అజ్ఞానము తొలగిపోయి పురుషుడు (జీవాత్మ) తన స్వరూపమున (యదార్థరూపమున) స్థిరపడుట (ప్రతిష్ఠితుడగుట) కైవల్యం అన్నారు అనగా మరణము కాదు ప్రకృతి బంధము నుండి పురుషుడు పూర్తిగా విడిపోవుట అని అర్థము ఇచట ప్రకృతి కార్యమును పవిత్రంగా చెప్పారు ప్రకృతి కార్యము ప్రేమతో కూడినది

పురుషుని ప్రయోజనము కొరకు కర్తవ్యంగా నిర్వర్తించబడు ప్రకృతి కార్యము తల్లి ప్రేమ రూపము తనను తాను మరచి ప్రకృతి పురుషునకు చేయూతనిచ్చును తనలోనున్న త్రిగుణముల ద్వారా అతనికి దృశ్యములను కనబడరచి అనుభవములను పొందునట్లు చేసి తుదకు అతడు (జీవాత్మ) తన స్వరూపములో ప్రతిష్ఠితుడగునట్లు చేయును దయారూపమే ప్రకృతి ఒక పురుషుడు కైవల్యస్థితి పొందిన వెంటనే ప్రకృతిమాత "జీవితము అను అరణ్యమున త్రోవ తప్పి చరించుచున్న ఇతరుల" ఉద్ధరణకై మరలిపోవును నిరంతరము ప్రకృతి కృషి సాగుచునే యుండును ఈ కృషి వలననే అంతులేని ఈ జీవప్రవాహము ఆత్మసాక్షాత్కారము (ఆత్మజ్ఞానము) అను సాగరమున కలియును శరీర బంధము విషయ బంధముల నుండి విడివడి పురుషుడు తనయందు ఉన్న చిత్ప్రకాశము, అనంత పరిపూర్ణ సచ్చిదానందము నందు ఐక్యమగుటయే కైవల్యపదము

సాంఖ్య పరిభాషలో చెప్పబడిన మహత్తునకు యోగమునందు చిత్తము అని చెప్పబడినది ఇంకా వివరముగా బుద్ధి, అహంకారము, మనస్సుల యొక్క సంయుక్తరూపమే చిత్తము అని చెప్పబడింది ఈ చిత్తము త్రిగుణములచే బంధించబడి ఆ గుణముల పరిణామము ననుసరించి అనేక వికారములను (వికార రూపము) పొందుచున్నది చిత్తము వాస్తవమునకు అచేతనము కాని జీవాత్మయైన పురుషుని సాన్నిధ్యము వలన పురుషుని (ఆత్మ) చైతన్యము చిత్తమునందు ప్రతిఫలించుచున్నది ఇంద్రియముల ద్వారా చిత్తము కలుషితమై వికారరూపము పొందుచున్నది అందుచే చిత్తము సర్వమునకు తానే భోక్తను (అనుభవించువాడు) అని భ్రమించుచున్నది నిజమునకు చిత్తము ద్వారము వంటి ఒక ఉపకరణము మాత్రమే ఆత్మ ఆ ద్వారము ద్వారా చూచు ద్రష్ట యగుచున్నది ఆ విధముగ చిత్తము కారణమగుచున్నది అందుచే అది ఆకాశము వలె సర్వత్ర వ్యాపించియున్నది కాబట్టి పురుషులు ఎటుల అనంతసంఖ్యలోనున్నారో అటులే చిత్తములు

కూడ అసంఖ్యాకములు జన్మపునర్జన్మలందు దేహ పరిమాణమును అనుసరించి చిత్తము కూడ ఎక్కువ తక్కువ పరిమాణములను పొందుచుండును పశుదేహమందు చిత్తము సంకోచము పొంది, మానవజన్మ యందు చిత్తము వృద్ధి పొందును పరిమాణ భేదముల వలన చిత్తమునకు "కార్యచిత్తము" అని యోగశాస్త్రము చెప్పినది సూక్ష్మశరీరమనునది చిత్తమును తనలో ఇముడ్చుకొనును కాని అట్టి సూక్ష్మశరీరము యోగతత్వమునందు అవసరము లేకపోయినది కర్మఫలానుసరణ ద్వారా ప్రకృతి వలన ఏర్పడు శరీరమందు కార్యచిత్తము రూపమును పొందును పురుషుని నుండి చైతన్యము పొందుటకు చిత్తము ద్వారము వంటి కారణమగుచున్నది ఈ **కారణచిత్తము** ఎల్లపుడు ఒకటిగానే యుండును అందుచే అది సర్వవ్యాప్తి చిత్తము దేహమును పొందినపుడు దేహపరిణామము ననుసరించి పరిమాణభేదమును పొందు చున్నది ఇలా పరిమాణములను పొందుట వలన చిత్తము **కార్యచిత్త**మగు చున్నది గుణములను నిరోధించి కార్యచిత్తమును సర్వవ్యాపియగు కారణస్థితికి మరల్చుటయే యోగాభ్యాస ధ్యేయము చిత్తము కారణచిత్తమై సర్వవ్యాపిత్వ లక్షణమును పొందగలిగినపుడు యోగి సర్వజ్ఞుడగుచున్నాడు చిత్తము పురుషుని యదార్థరూపమైన శుద్ధత్వమును పొందగలిగినపుడు ముక్తి పొందును

చిత్తము పురుషుని కొరకే యున్నదని యోగము చెప్పుచున్నది అట్టి చిత్తము ద్వారానే పురుషుడు వస్తువులను గురించి తెలిసికొనుట వలన ప్రపంచముతో అతనికి సంబంధము ఏర్పడుచున్నది చిత్తము తాను చూచు బాహ్య వస్తువుల రూపమును తాను పొందును కాని తాను చూచువానిని గురించి తనకు తెలియదు ఎందుకనగా చిత్తము అచేతనమైన ద్వారము వంటిది ఆత్మ చిత్తమునందు ప్రతిబింబించుట చేతనే వస్తువులను గురించి చిత్తమునకు తెలియుచున్నది చిత్తము నిత్యము మారుచుండును కాని జ్ఞానమునకు ఎట్టి మార్పు ఉండదు ఆత్మ కూడ ఎట్టి మార్పు లేని ద్రష్ట (చూచువాడు) చిత్తము ఒకసారి ఒకే మార్పును పొందును ఆత్మచిత్తము

ద్వారా మాత్రమే చూచును గావున ఆత్మ కూడ ఒకసారి ఒకే వస్తువును గురించి తెలిసికొనగలదు అందుచే చిత్తమునందు రెండు భిన్న భావములు ఒకే సమయమున కలుగవు చిత్తమునందు ఏర్పడు భావములు ముద్రలుగా స్థిరపడి సంస్కారములగును ఈ సంస్కారములే జన్మల పరంపరకు కారణమగుచున్నవి ఈ సంస్కారములే మన కర్మఫలములు చిత్తమునకు కలుగు ప్రవృత్తుల వలన (స్వభావము వలన) సంస్కారములే మరికొన్ని సంస్కారములకు కారణమగును సంస్కారములే మన కర్మఫలములు, మరల అవే మరికొన్ని కర్మలకు కారణమగుచున్నవి ఇదియే సంసారచక్రము ఈ చక్రపరిభ్రమణము వలన 'నేను', 'నాది'యను భావములు, రాగద్వేషములు కలుగుచున్నవి వీటి ఫలితమే తృష్ణ (కోరిక) దాని నుండి పుట్టినదే సంసారజీవితము

ఆత్మకు చిత్తముతో సంబంధము తొలగినపుడు, ఆత్మ తన యదార్థ స్థితిని పొందును అట్టి ఆత్మ (పురుషుడు) రాగద్వేషములకు అతీతమగును ఆ స్థితిలో పురుషుడు చిత్తప్రవృత్తులకు సాక్షి మాత్రమే యగును కాని చిత్తపరమైన అవస్థలను అనుభవించడు అనుభవించునట్లు కనబడును అంతే చిత్తము ధ్యానములో నిశ్చలమైనపుడు పురుషుడు తన యదార్థస్థితిని పొందును

మనోనిగ్రహము అనగా చిత్తవృత్తి నిరోధము మాత్రమే ముక్తికి మార్గమని యోగసిద్ధాంతము సాంఖ్యము జ్ఞానమునకు ప్రాధాన్యమిచ్చినప్పటికి దానిని యోగసిద్ధాంతము అంగీకరించినది కాని యోగము ఏకాగ్రతకే ఎక్కువ ప్రాముఖ్యమిచ్చినది యోగమంటేనే ఏకాగ్రత చిత్తవృత్తి నిరోధమనగా నిద్రావస్థ కాదు ఏకాగ్రత అనగా బాహ్యస్థితుల నన్నిటిని అతిక్రమించుట ద్వారా ఒక నిగూఢమైన (mysterious) స్థితికి చేరుట ఆ ఏకాగ్రతయే చిత్తవృత్తి నిరోధము చిత్తము యొక్క లక్షణములలో ఏకాగ్రత కూడ ఒకటి రాగద్వేషములతో నిండిన చిత్తము ఒక విషయముపై ఏకాగ్రత పొందవచ్చును

ఆ విషయమును స్థిరముగా ఆలోచింపవచ్చును ఈనాటి యోగశిక్షణలో దీనికే ప్రాధాన్యమిచ్చుచున్నట్లు కనబడుచున్నది కాని అట్టి ఏకాగ్రత యోగ ఆశయము కాదు యోగములో వాస్తవ ఏకాగ్రత యందు ఆలోచనలు హ్రస్వమగును ఆ స్థితిలో ఆత్మ (పురుషుడు) యదార్థ స్థితిని పొందును నిద్రాస్థితి కూడ అట్టిది కాదు తమోగుణము అతిశయించినపుడు కూడ (lethargy) (సోమరితనము) నిద్రాస్థితి కలుగును అది పురుషుని యదార్థ స్థితికి తీసికొనిపోవు నిద్రాస్థితి కాదు సామాన్యముగా ఏదో ఒక కారణముచే మనస్సు (చిత్తము) చలించుచుండును ఇది మనస్సు సాధారణస్థితి ఇక ఒకప్పుడు మనస్సు తనకు ఇష్టమైన వస్తువులను కోరును, ఇష్టము లేని వస్తువులను తిరస్కరించును ఈ స్థితులు మూడు గుణముల చేతనే కలుగును కావున అవి అసంపూర్ణ స్థితులు సత్త్వగుణము అధికమైనపుడు చిత్తమునకు ఏకాగ్రత కలుగును అత్యున్నత ప్రయత్నములకు ఇది సాధనమగును ఈ స్థితి యందు పూర్వసంస్కారములు నిల్వయున్నను చిత్తమునకు కలుగు మార్పులు అరికట్టబడును

ఆ విధముగ చిత్తము యొక్క అన్ని స్థితులందును ఏకాగ్రత యుండునని యోగము చెప్పుచున్నది కాని సమాధి స్థితి యందు ఉండు ఏకాగ్రతయే మహోన్నతస్థితి అన్నారు సంపూర్ణయోగము సాధించినవాడు చిత్తవృత్తులనే గాక పూర్వసంస్కారములను గూడ నిరోధించగలగాలి అపుడే విముక్తి ప్రాప్తించును మన చిత్తము ఒక యుద్ధభూమి వంటిది అనేక పరస్పర వ్యతిరేక భావములకు జన్మభూమి రోగాలు, సందేహములు, వ్యామోహము, మందమతితనము, చంచలత్వము, మొదలగునవి మానసిక సంఘర్షణకు కారణములు చిత్త ఏకాగ్రతకు ఇవి ఆటంకములగుచున్నవి

జ్ఞానమునకు మూడు సాధనములున్నవని యోగశాస్త్రము చెప్పుచున్నది చిత్తము ఇంద్రియముల ద్వారా బాహ్యవస్తు సంపర్కము పొందును

బాహ్యవస్తువులన్నియు యదార్థములని యోగము చెప్పను ఎందుకనగా భిన్నవస్తువులు మూలపదార్థము యొక్క భిన్నరూపములు రూపము మారినపుడు వస్తువు మారును గాని మూలపదార్థరూపము ఎన్నడు నాశనము కాదు రూపములన్నియు నశించినపుడు మూలవస్తురూపము స్థిరపడును భిన్నరూపములు మన భ్రాంతిచే కల్పించబడును అని చెప్పబడినది వస్తువులకు ఇంద్రియ సంపర్కము కలిగినపుడే వాటికి స్పందన కలుగును త్రిగుణముల ద్వారా చిత్తము వస్తుజ్ఞానము పొందును అందువలన బాహ్యవస్తువులను **ప్రత్యక్ష సాధనములు** అన్నారు

**రెండవది అనుమాన సాధనము** అనుమానము అనగా కనబడు దాని నుండి లేక తెలిసినదాని నుండి కనబడని లేక తెలియని దానిని ఊహించి అది ఉన్నదని నిశ్చయించుట (From the known to the unknown) ఇక **మూడవది** శబ్దసాధనము ఒక వ్యక్తి తనకు తెలిసిన విషయములను మాటల ద్వారా ఇతరులకు తెలియజేయును ఇతరులు ఆ జ్ఞానమును పొందుదురు ఇదియే శబ్ద సాధనము

కాని ఈ మూడు సాధనముల ద్వారా కలుగు జ్ఞానము పరిపూర్ణ జ్ఞానము కాదు అని యోగసిద్ధాంతము చెప్పుచున్నది ఎందుకనగా ఈ జ్ఞానము అనుభవ జ్ఞానము మాత్రమే అగుట వలన - ఈ అనుభవజ్ఞానములో పురుషునకు బుద్ధి (చిత్తము)కి భేదము తెలియదు యోగాభ్యాసము వలననే ఈ భేదము తెలియును అన్నారు

అందరి యందు దైవత్వమున్నది కాని అది మన సామాన్య జీవిత వ్యాపారములచే కప్పబడి యుండును ఈ దైవత్వ స్వభావము మనస్సునకు అంతర్గతమై యుండును దైవత్వ స్వభావము మన ఆత్మయందుండును ఆత్మ బీజరూపమున అనగా మూలరూపమున అందరి యందు ఉండును కాని భౌతికమైన వస్తుసంపాదన యందే మన శక్తులన్నియు గతించుటచే

మనము ఆత్మను గ్రహించలేకపోవుచున్నాము మన విజ్ఞానమును సవ్యమార్గమున మళ్లించినచో అది సాధ్యపడును దానికి శిక్షణ (సాధన) అవసరము అభ్యాసము ద్వారా చిత్తవృత్తులను నిరోధించవచ్చునని యోగసిద్ధాంతము చెప్పుచున్నది అందుకు మనశ్చాంచల్యమును నిగ్రహించ వలయును దానికి చిత్తశుద్ధినిచ్చు కర్మ, జ్ఞానము, భక్తి అవసరము యోగమందు చిత్తమునకు ఎంత ప్రాముఖ్యమున్నదో శరీరమునకు కూడ అంతే ప్రాముఖ్య మున్నది ఏకాగ్రతకు ఆసనము భౌతికముగా సహాయపడునని యోగ సిద్ధాంతము ధ్యానమునకు ముందు సరియగు ఆసనము అవసరము యోగ భాష్యకారులు అనేక ఆసనముల గూర్చి వివరించారు శరీరమును సరియగు నిగ్రహములోని తీసికొనిపోవలయును నిగ్రహము అనగా దేహమును బలవంతముగా శిక్షించి కృశింపచేయమని కాదు సరియగు యోగశిక్షణ యందు శరీరదార్ఢ్యము సౌకుమార్యము కూడ కలుగునని చెప్పబడినది యోగమందు ప్రాణయామమునకు కొంత ప్రాముఖ్యము ఈయబడినది పతంజలి దానియందు నమ్మకమున్న వారికే ప్రాణాయామము అంగీకరించెను హఠయోగమందు ప్రాణయామమునకు అత్యంత ప్రాధాన్యమున్నది దేహ దార్ఢ్యము లేనివారికి అధిక ప్రాణాయామము ప్రమాదము కలుగచేయవచ్చునని కూడ చెప్పబడింది

ధ్యానము కూడ యోగసాధనలో ఒక భాగమే ఆంతరంగికముగా కలుగు పరివర్తనల (చిత్త పరివర్తనలు) నుండి, బాహ్యకర్మల నుండి చిత్తమును మళ్లించినపుడు ఆత్మసత్యము గోచరమగును అని యోగతత్వం చిత్తమును కేంద్రీకరించుటయే ధ్యానము లేక ధారణ పరిపూర్ణమైన ఏకాగ్రత ఒక్క క్షణకాలమును మించి నిలబడదు ఇది నిజము ఎట్టి భావములకు చలింపక **ఏకధారగా నుండు భావస్థితియే** ధ్యానము అన్నారు ధ్యానమునకు చివరి స్థితి సమాధి సమాధి యందు 'నేను' అను భావము నశించును బాహ్య ప్రేరణములకు శరీరము, **మనస్సు నిర్జీవముగా** (life less or responseless)

**నుండును - ధ్యానవిషయమొక్కటే మనస్సునందు ప్రకాశించును** ఒకే విషయమందు ఈ మూడు కలిగినపుడు దానిని యోగశాస్త్రమందు 'సంయమము' అన్నారు ఈ సంయమము ద్వారా అతీంద్రియ శక్తులు కలుగునని యోగశాస్త్రము చెప్పుచున్నది

"చిత్తము ఒక తిరుగలి వంటిది అని యోగము భావించును" తిరుగలి యందు మనము ఏది ఉంచిన అది పిండిగా మారును అందు ఏదియు ఉంచకున్నచో అది తిరిగి తిరిగి అరిగిపోవును అదే విధముగ చిత్తవృత్తులను నిరోధించినచో చిత్తము యొక్క వ్యాపారము ఆగిపోయి అది నిష్క్రియమగును అపుడు బాహ్య ప్రపంచమునకు అతీతమైన అనంతమైన ప్రశాంతత మనలో ఏర్పడును అపుడు చిత్తమునకు నిస్సహాయత (Helpless stage) కలుగును దాని ఫలితముగా పురుషుడు (ఆత్మ) స్వస్థితిని (యదార్థస్థితి) పొందును ఏకాగ్రత వలన కలుగు స్థితి ఇదియే దీనిని మాటలలో చెప్పుట సాధ్యపడదు అవి యోగసాధన వలన మాత్రమే తెలియును యోగులందు కూడ ఎవరో కొద్దిమంది ఇది పొందగలరు ఎందుకనగా జీవితమునకు ఉండు అవసరములు పరిపూర్ణ యోగసమాధికి నిత్య ఆటంకములు ధ్యానమందు తన్మయావస్థ కలుగుననుటలో సందేహము లేదు తన్మయావస్థ యందు అతీంద్రియ దృశ్యములు కనబడుట, అతీంద్రియ నాదములు వినబడుట సత్యపరాయణులగు భక్తులకు ధైర్యము కలిగించుటకు భగవంతుడు చేయు సహాయముగా తలపవచ్చును దీనిని "ఈశ్వరోన్మాదము" అన్నారు కాని యోగమందు దీనికి స్థానము లేదు "ప్రతిజీవియు మూలమునందు దైవస్వరూపమే" అని యోగశాస్త్రము చెప్పును తన్మయముగా చెప్పబడిన స్థితియందు కనబడు అతీంద్రియ దృశ్యములు వినబడు నాదములు మనలోని ఆత్మశక్తి వ్యక్తమగుటయేయని యోగశాస్త్రము చెప్పును ఈ రెండు విధములైన భావములు హేతువాదమునకు అందవు వాటి ప్రమాణమును హేతుజ్ఞానము అంగీకరించదు (rationalism)

యోగమందు మోక్షము అనగా సంపూర్ణ స్వేచ్ఛ (కైవల్యము) అది శూన్యస్థితి కాదు ప్రకృతి బంధముల నుండి స్వేచ్ఛను పొందిన పురుషుని (ఆత్మ) స్థితియే మోక్షము అన్నారు ఇది నిర్గుణావస్థ ఈ స్థితియందు పురుషునకు ఏ ప్రయోజనము ఉండదు ఎందుకనగా పురుషుడు తన యదార్థ రూపమును పొందును హిందూమతములోని ఇతర తత్వములలో చెప్పినట్లుగానే యోగమందు కూడ వస్తు యదార్థరూపము తెలియకుండుటయే వాంఛలకు కారణము అని చెప్పబడింది అజ్ఞానము వలన స్థూలశరీరము కలుగుచున్నది చిత్తము దానికి తోడుగా నుండును భోగములు అనుభవించుట దాని విషయము అజ్ఞానమున్నంత వరకు సంసారబంధముండును జ్ఞానముతో అజ్ఞానము పోవును పురుషుడు శుద్ధుడగును చిత్తవృత్తులకు అతీతుడగును

సమాజములో నుండు మానవ బంధుత్వము, కుటుంబ సంబంధములు ఆత్మస్వేచ్ఛకు వ్యతిరేకములు యోగమందు ఆత్మస్వేచ్ఛ ప్రధానము, ధ్యేయము భౌతిక జీవితమున నుండు అన్ని బంధములను తొలగించుటకు ప్రయత్నించు యోగశాస్త్రమందు నీతిధర్మములకు స్థానము లేదు అనిపించును ధర్మం మనలను పరిపూర్ణ స్థితికి తీసికొని పోగలదు కాని ధర్మాధర్మములకు అతీతమైన స్థితికి యోగము తీసికొనిపోగలదు అన్నారు అందువలన యోగమునందు నీతిధర్మములు లేవు అనుటకంటే ఆత్మ తన యదార్థస్థితికి చేరుటకు యోగము మార్గము చూపును అని చెప్పుట సమంజసముగా నుండునని అనిపించును ఆత్మయొక్క యదార్థరూపము నెరుగుటయే ముక్తి అన్నారు గదా! తత్వజ్ఞానము తర్కము (వాదనలతో)తో కూడినది అట్టి తత్వములు మనలను ఉద్ధరించలేవు అని యోగతత్వము చెప్పను మనకు కావలసినది ఆది అంతము లేని వాదనలు కాదు దుఃఖము నుండి విముక్తి కావలయును కామ్యములు (కోరికలు) అనబడు అంతరిక రోగము నుండి విముక్తి కావలయును ఆ రోగము నుండి విముక్తి కలిగించునదే నిజమైన తత్వశాస్త్రము యోగతత్వము అట్టి విముక్తి కలిగించగల శాస్త్రము

మానవులలో అందరు యోగాభ్యాసమునకు అర్హులు కారు అర్హులు కానివారికి కర్మయోగము తగినది అని చెప్పబడింది యోగం (2-1) పూర్వజన్మ కర్మఫలితములు వాసనల రూపముతో చిత్తమును కలుషితమొనర్చును ఈ కాలుష్యమును తొలగించుటకు తపస్సు సరియైన మార్గము అన్నారు తపస్సు కర్మ సంస్కారములను తొలగించునని యోగము చెప్పుచున్నది మన మనస్సునకు బయట జరుగునదంతయు మనస్సు (చిత్తము) అంతరప్రవృత్తుల వలననే జరుగును అనేకమంది నరముల రోగముతోను, చకితమైన మనస్సుతోను గ్రహముల వలన కలుగు బాధలతోను జీవితములో ఎంతో బాధపడుచున్నారు వీరి మనస్సులో అంతర్గతముగా నున్న భావములను బయలుపరచుటకు మంత్రయోగము ద్వారా రోగికి తన్మయావస్థ కలిగించుదురు ఇది ఈనాటి మానసిక రోగచికిత్సా విధానములోని (Psychiatry) (or) (Psychoanalysis) పద్ధతులను పోలియున్నట్లు కనపసడును

ఇట్టి విచిత్రవిద్య ఒక వైపు, సాధన ద్వారా ముక్తిని పొందుటకు ప్రయత్నము మరొకవైపు రెండును యోగాభ్యాసములోని భాగములుగానే ఉన్నవి యోగసాధనలో కొన్ని అద్భుతశక్తులు కలుగునని మూలబౌద్ధము గుర్తించినట్లు బౌద్ధగ్రంథములలో కనబడును కాని బుద్ధుడు ఆ శక్తులు భ్రాంతిని కలిగించును గాన వలదని తిరస్కరించెను భ్రాంతి మోక్షసాధనకు ఆటంకమగును అని ఆయన అన్నాడు సమాధిస్థితి పొందుటకే ఈ శక్తులను ఉపయోగించవలెనని యోగసిద్ధాంతము ఆత్మకు ప్రకృతికి భేదము గ్రహించిన వానికి సర్వజ్ఞత్వము కలుగునని, భూత భవిష్యత్ వర్తమానములు తెలియునని పతంజలి ప్రవచనము దీనిని యోగములో ప్రతిభ అన్నారు

అతీంద్రియ శక్తులు యోగపరిపూర్ణతకు చిహ్నాములు అని కొందరి వాదము కాని అవి కూడ సమాధికి ఆటంకములు అని పతంజలి అన్నారు (యో సూ 3-37) చంచలమైన మనస్సు కలవానికి మాత్రమే సిద్ధులు అనగా

అతీంద్రియ శక్తులు ఉపయోగపడును కాని నిజమైన సాధకునికి అవి ఆటంకములు ఆత్మ ఉద్ధారణ ఆశయము లేని సాధకునకు అవి మహిమలే అగును కాని నిజమైన సాధకుడు వీటిని నిషేధించాలి అన్నారు ఈ మహిమల యందు కూడ వైరాగ్యం కలిగినపుడు కైవల్యము ప్రాప్తించును నిజమైన సాధకుడు స్వర్గభోగాలయందు కూడ ఆసక్తి చూపరాదు అన్నారు (యోగసూత్రం 3-50, 51) యోగశక్తులందు వ్యామోహం పొందినవాడు పతనము పొందును యోగసిద్ధలు అనేక విధములు అనగా పుట్టుకతోను, కొన్ని ఔషధముల వలన, కొన్ని మంత్రములు జపించుట వలన, తపస్సు వలన కలుగునవి నైట్రస్ ఆక్సైడు (Nitrous oxide) అను రసాయన పదార్ధము కలిగించు తన్మయావస్థ (ఒళ్లు మరచుట)లో అతీతదృష్టి, ఆ క్షణములో సత్యము తెలియుట యోగసిద్ధి వంటిదే అన్నారు ఒకరి కళ్లలోకి ఏకాగ్రతతో చూడటం, లేక ఒక వస్తువునో, గీతలున్న పటమును చూడటం ద్వారానో యోగనిద్ర (Hypnotism) కలిగించటం ఇటువంటిదే కాని ఔషధ ప్రక్రియకు పతంజలి యోగసిద్ధాంతములో ప్రాధాన్యము లేదు పతంజలి యోగమందు సంయమమునకే ప్రాధాన్య మీయబడినది అనగా నేను అను భావము నశించుట, బాహ్యప్రేరణములకు చలింపకపోవుట, ధ్యాన విషయముపై ఏకాగ్రత అయినను మహిమలు, ఔషధ ప్రక్రియలు ఆనాటి సమాజములో ప్రాచుర్యము పొందియుండుటచే జనసామాన్యము కొరకు తనకు ఇష్టము లేకపోయినను ఈ సిద్ధులు, ఔషధ ప్రక్రియలకు యోగ సూత్రములలో పతంజలి స్థానము కల్పించినట్లు కనబడును కాని వాటిని గురించిన వివరణకు స్థానమీయలేదు ఈ ప్రక్రియలకు మహిమలకు యోగతత్త్వము నందు ఎట్టి విలువ లేదు అనునది మాత్రము యదార్ధము

యోగమునకు భక్తి ఒక సహకారము అని పతంజలి భావించాడు (యోగసూత్ర 1-23)

సూ॥ "ఈ శర్వరప్రణిధానాద్వా"

ఈశ్వర ప్రణిదానము వలన గూడ సమాధి లభించును అన్నారు 'ప్రణిధానము' అనగా భక్తిభావము అని, కర్మఫలము ఈశ్వరునకు అర్పించుట అనియు వ్యాఖ్యానించారు అదే ఈశ్వరశరణాగతి (ప్రపత్తి) దీని వలన కూడా నిర్బీజ సమాధి పొందవచ్చునన్నారు ఈశ్వరార్పణ బుద్ధితో చేయు సాధన యోగించును

కాబట్టి అభ్యాసము, వైరాగ్యముల ద్వారానే కాక ఈశ్వర శరణాగతి ద్వారా కూడా సమాధి సిద్ధి పొందవచ్చునని భావము అర్పణ బుద్ధితో చేయు సాధనకు ఆటంకములు తొలగిపోవును దేవుడున్నాడు అనుటలో పతంజలి యదార్థ భావము గమనించవలసియున్నది పతంజలి యోగతత్వములో భగవంతుని అస్తిత్వము (ఉండుట) (ఆస్తిక్యము) అవినాభావ సంబంధముతో కూడిన భోగముగా కనబడదు ఎందుకనగా ఆస్తిక్యమును ధృవపరచు జ్ఞానవిషయములు వివరించబడలేదు యోగసాధనకు దేవుని సహాయము అవసరము అను భావనతోనే దేవుని అస్తిత్వమును గూర్చి పతంజలి ప్రస్తావించెను అని తోచును కాని దేవుని సర్వజ్ఞతను పతంజలి అంగీకరించాడు (యోగసూత్రం 1-25)

సూ॥ తత్రనిరతిశయం సర్వజ్ఞబీజమ్

ఈశ్వరుని జ్ఞానం నిరతిశయము అనగా అంతకు మించి జ్ఞానము ఎవరికి ఉండదు 'పురుష విశేష ఈశ్వరః' (యో॥సూ॥ 1-24) అన్నాడు అందరి కంటే ఉత్తముడైనవాడు ఈశ్వరుడు పతంజలి చెప్పిన భగవంతుడు ఈ విశ్వమునకు కర్తకాదు అతడు ఆది, అంతములేని సర్వజ్ఞుడు ఉత్తమత్వము లోను, జ్ఞానముండుటలోను తరతమ (తక్కువ ఎక్కువ) భేదములున్నపుడు అల్ప, అధిక, అత్యధిక స్థాయి దాటి అన్నిటికి మించిన ఒక స్థితి ఉండాలి అంతకు మించిన స్థితి ఎవరికీ ఉండకూడదు ఈ భావముతోనే భగవంతుని

సర్వోత్తమునిగాను, సర్వజ్ఞునిగాను భావించి ఆయన అస్తిత్వము పతంజలి ప్రస్తుతించాడు

మానవులు తాము చేయు కర్మఫలితములకు అనుగుణముగా అనుభవము పొందుదురు ఈ కర్మ ఫలానుగుణమైన అనుభవము వలన ప్రపంచమున క్రమము సామరస్యము ఏర్పడును కాని దీనికి ప్రకృతి కారణము కాదు ఎందుకనగా ప్రకృతి జడపదార్థము ప్రకృతి పరిణామ క్రమమును నడుపునది పరమేశ్వరుడు కాని పరమేశ్వరుడు ప్రపంచమును సృష్టించలేదు ఈ ప్రపంచము దుఃఖమయము దానికి దయాళుడైన భగవంతుడు కర్త ఎట్లగును? ప్రకృతి పరిణామము పురుషుని ప్రయోజనము కొరకు ఉండునట్లు భగవంతుడు నడుపుచున్నట్లు మాత్రమే తోచును

వేదముల ద్వారా భగవంతుని అస్తిత్వము సాధించుటకు ప్రయత్నము అంతుతేలదు ఎందుకనగా వేదములు భగవంతుడు చెప్పినవే అని కదా విశ్వాసము వేదములు చెప్పునవి సత్యములు కావున వేదముల వచనములు ప్రమాణములు అన్నారు సాంఖ్యసిద్ధాంతము వేదప్రామాణ్యమును అంగీకరించినది కాని దానిని సమర్థించు ప్రయత్నము చేయలేదు వేదములకు మూలము భగవంతుడు అని యోగము కొంతవరకు సమర్థింప ప్రయత్నించినది కాని ఈశ్వరుని గూర్చి పతంజలి భావములు నిర్దిష్టముగా లేవు కర్మ సిద్ధాంతమునకు (కర్మఫలములకు) అతీతుడని (యోగసూత్రము 1-24) మాత్రము చెప్పబడింది

సూ॥ క్లేశ, కర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః' (1-24)

క్లేశము అనగా దుఃఖము, పుణ్యపాపకర్మలు, విపాకము అనగా కర్మఫలము, ఆశయము అనగా కర్మ సంస్కారముల సమూహము (దీనిని కర్మాశయమని కూడ అంటారు) - ఈ నాలుగింటితోను జీవులందరికి సంబంధం ఉంటుంది ఈశ్వరునికి ఈ నాల్గింటితోను ఎప్పుడూ సంబంధం లేదు

గతంలో లేదు, ఇపుడు లేదు, ఇక ముందు కూడా ఉండదు కాబట్టి ముక్తి పొందిన పురుషుల కంటే కూడ ఈశ్వరుడు ఉత్తముడు ఎందుకనగా ఇపుడు ముక్తి పొందిన పురుషునికి అంతకు ముందు వీటితో సంబంధము ఉండియే యుండవచ్చును అందుకనే ఈశ్వరుని "పురుష విశేష" అన్నారు 'విశేష' అంటే విశిష్టమైనవాడు విశిష్టుడైన ఈశ్వరుడు (పరమాత్మ) ప్రపంచ సంబంధమైన బంధములు లేనివాడు

వేదములలో ఈశ్వరుడు సర్వకర్త అన్నారు కాని యోగసూత్రములలో ఈశ్వరుని కర్తగా చెప్పలేదు ఈశ్వరుని సర్వజ్ఞతను నిరూపించటానికే పతంజలి అనుమానమును (తెలిసినదాని నుండి తెలియనిదానిని తెలిసికొనుట From the known to the unknown) ప్రమాణముగా తీసికొని ప్రయత్నించారు సత్త్వగుణము పరమాత్మవశములో నుండును ఈశ్వరభక్తితో ఆ సత్త్వగుణము మనకు ఆత్మజ్ఞానము కలిగించును భగవంతుడు నిత్యముక్త స్వభావుడు ముక్తిని పొందిన వారు ఎవరు ఆతనితో సములుకారు ఒక భేదమున్నది ముక్తిని పొందిన జీవులకు ప్రపంచముతో సంబంధముండదు కాని పరమాత్మకు ప్రపంచముతో నిత్యము సంబంధముండును సత్త్వగుణముతో ఎన్నడూ విచ్ఛేదము కాని సంబంధము పరమాత్మకుండుటచే అతని జ్ఞానసంపద నిత్యము అఖండము అయి ఉండునని చెప్పబడింది

సాంఖ్యమునకు యోగమునకు దగ్గర సంబంధమున్నది రెండింటి లోను ప్రకృతియే పరిణామము చెందును ఎవరి ప్రేరణతోనో ప్రకృతి పరిణామము చెందుట లేదు దీనికి కర్తృత్వం త్రిగుణములలో నున్నదని సాంఖ్యము చెప్పును త్రిగుణములు ప్రకృతి అంతర్గతములు కర్తృత్వం పురుషునిలో లేదు పురుషుని చిన్మయస్వరూపుడు (జ్ఞాన స్వరూపుడు) అన్నారు యోగసూత్రములలో (4-3) ప్రకృతికి పరిణామములో స్వాతంత్ర్యమున్నది ప్రకృతి జడపదార్థము (చేతనము లేనిది) అయినను

పురుషుని ప్రయోజనముల (పురుషార్థముల) కొరకు ప్రపంచ రూపములో పరిణమించుచున్నది అన్నారు ప్రకృతికి స్వాతంత్ర్యం ఉన్నందువలన ఎవరి ప్రేరణ అవసరం లేదు కాబట్టి ప్రపంచమునకు ఆదిగురువు ప్రకృతేయని పతంజలి యోగవచనము

వేదములు ఈశ్వరవాక్యములు అన్నారు గదా! కాబట్టి ఈశ్వరుడు సర్వజ్ఞుడు అయి ఉండాలి ప్రాణులందరికి ఉపదేశం చేయగల సమర్థుడు అయి ఉండాలి రాగద్వేషములకు అతీతుడు అందువలననే ఈశ్వరుని సర్వజ్ఞుడు అన్నారు కాని యోగులందరూ కూడ జ్ఞానులగుదురు అని (3-54) సూత్రంలో అన్నారు అందు 'వివేకజం జ్ఞానమ్' అన్నారు వివేకము వలన కలుగు జ్ఞానం తారకమగును (రక్షకమగును) అన్నారు ఈ జ్ఞానం ద్వారానే యోగికి కైవల్యము కలుగును మరి ఈశ్వరుని ప్రత్యేకత ఏమిటి? ఈశ్వరుని జ్ఞానం ఆది, అంతము లేనిది అది సాధనతో పొందినది కాదు కాని వివేకజ్ఞానం వలన సర్వజ్ఞులైన జ్ఞానులంతా సాధన ద్వారా మాత్రమే సర్వజ్ఞులవుతారు అందువలన వారి సర్వజ్ఞత్వం సంపాదించుకున్నది సహజము అనాది కాదు కాబట్టి సాంఖ్యయోగములు ఈశ్వరుని ఈ జగత్తుకి కర్తగా అంగీకరించలేదు కాని ఈశ్వరుని మహిమను, సర్వజ్ఞత్వాన్ని, అనాదిత్వాన్ని అంగీకరించినట్లే తెలియుచున్నది

ఈశ్వరునికి కాలపరిమితి లేదు అతనికి పూర్వము, పరము కూడ లేదు అని యోగము చెప్పుచున్నది (యోగసూత్రం 1-26)

సూ॥ సర్వేషామపి గురుః కాలేనాన వచ్ఛేదాత్ (1-26)

ఈశ్వరుడు గురువులందరికి గురువు అతడు అంతర్యామిగా నుండి వేదములనిచ్చాడు ఈశ్వరుడు కాలమునకు కట్టుబడినవాడు కాదు అతడు సృష్టికి పూర్వము ఉన్నాడు, సృష్టి ఆరంభంలో ఉన్నాడు తరువాత కూడ ఉన్నాడు సృష్టి అంతమైనపుడు కూడ ఉంటాడు భగవద్గీత (8-17)లో

చెప్పినట్లు కాలమునకు లోబడినవగుటచే బ్రహ్మలోకము కూడ 'పునరావృత్తి' కలదే అగుచున్నది బ్రహ్మకు (పరబ్రహ్మము కాదు) వేయి యుగముల కాలం పగలు, వేయి యుగముల కాలం రాత్రి అని యోగులు అన్నారు భగవద్గీతలోనే (10-2, 3) బ్రహ్మాది దేవతలకు, మహర్షులకు సైతం (పరమాత్మ) పుట్టుక శక్తి తెలియదు అని శ్రీకృష్ణుడు అన్నాడు కారణం పరమాత్మకు జన్మ లేకపోవటమే శ్వేతాశ్వతర ఉపనిషత్తు మూడవ అధ్యాయం 3, 4 మంత్రములు ఇదే చెప్పుచున్నవి "పరమాత్మ అద్వితీయుడు అంతట వ్యాపించి ఉన్నవాడు అతడు దేవతల ఉత్పత్తికి ఐశ్వర్యమునకు కారణమైనవాడు విశ్వమునకంతటికి ప్రభువు, సర్వజ్ఞుడు అతడు సృష్టికి ముందు హిరణ్యగర్భుని సృష్టించిన వాడు" అని ఉపనిషత్తులో చెప్పబడింది

కొంతమంది వ్యక్తులకు రాత్రి నిద్రపోయి ఉదయమున నిర్ణయించుకున్న సమయమునకు మేల్కొనగల సంకల్ప, సంస్కారబలము ఉంటుంది అటులే పరమాత్మ సంకల్పశక్తిచే సర్వసృష్టికి కారణమగుచున్నాడు ప్రళయ కాలమందు ప్రకృతి అవ్యక్త (కనబడని) రూపములోనికి పోవును అపుడు భగవంతుడు తన రూపమును విడిచిపెట్టును తిరిగి సృష్టి అయినపుడు రూపము ధరించును ప్రకృతి క్రొత్త పరిణామము ప్రారంభము కాగానే ఈశ్వరుడు తన పూర్వరూపమును సంకల్పించి ధరించును ప్రణవ శబ్దమైన 'ఓం'కారము పరమాత్మ చిహ్నము ఈశ్వరుడు ఆ శబ్దముతోనే పిలువబడును భగవద్గీత (17-23) శ్లోకంలో చెప్పబడినట్లు 'ఓమ్, తత్, సత్' అను ఈ మూడు శబ్దములు పరబ్రహ్మను నిర్దేశించును అనగా పరబ్రహ్మను సూచించును దేనినైనా సూచించుటకు సంకేతముగా ఉపయోగించునది నిర్దేశము అనబడును వేదములకు ఈ మూడు శబ్దములే మూలము మూడున్నర మాత్రలు గల శబ్దము ఓంకారము అ, ఉ, మ, అర్థ అను స్వార్థము - ఇవి చేరిన ఓంకారమగును ఓంకారము (అర్ధమాత్ర) ఈశ్వర సంకేతము అన్నారు ఓంకారమునే అలా ఎందుకు అనవలసి వచ్చింది? అ, ఉ అచ్చులు అతిస్వల్ప

ప్రయత్నముతో ఉచ్చరించవచ్చు 'మ' అనునాసికమగు హల్లు దీనిని స్వల్ప ప్రయత్నముతో ఉచ్చరించవచ్చు ఎట్టి మార్పులు లేకుండ విరామం లేకుండ స్వల్ప ప్రయత్నముతో ఉచ్చరించుటకు వీలగును అంతేగాక చిత్త ఏకాగ్రతకు ఇది ఎంతయో తోడ్పడును అందుకే ఓంకారమును (ప్రణవం) పరమాత్మ సంకేతముగా చెప్పారు

యోగతత్త్వములో సగుణ దైవభావన, ధ్యానము ఉన్నవా అను సందేహము కలుగును అట్టి భావము ఉన్నదనే చెప్పాలి కాని యోగములోని ఇతర భావములతో దీనికి పొంతన కుదరదు మానవ జీవిత ధ్యేయము పరమేశ్వరునితో ఐక్యము పొందుట కాదు అన్నారు ప్రకృతి నుండి పురుషుడు విడివడుటయే ముక్తి అన్నారు (భగవంతుని ఒక విశిష్ట పురుషునిగా మాత్రమే చెప్పారు ప్రకృతి పరిణామములను నడిపించును కాని ఆ పరిణామమునకు గాని, సృష్టికి గాని కర్తయు కాదు పోషకుడు కాదు మానవుల కర్మఫలముల ననుసరించి శిక్షించుట గాని, రక్షించుట గాని అతడు చేయడు కాని అతడు 'సృష్టిరంగము'లో ఉన్నాడని అంగీకరించారు గదా! మరి అతని కార్యమేమిటి? ప్రణిధానము (ప్రపత్తి, శరణాగతి, అర్పణము) చేయు వారి వికాసమునకు కలుగు ఆటంకములను తొలగించుటయే అతని కార్యము అన్నారు ఈశ్వరుడు ముక్తి ప్రసాదించడు కాని భక్తుల ముక్తిసాధనలో సహాయము చేయును) ఇటువంటి ఈశ్వరభావముతో మానవులకు విశ్వాసము కలుగదు, తృప్తి కలుగదు ఆనాటి ప్రజాభిప్రాయమునకు సరిపడునట్లు యోగసిద్ధాంతములో ఈశ్వరుడు కల్పించబడినాడే తప్ప యోగతత్త్వ మూలరూపమునకు ఈశ్వరభావము పొంతన లేకుండ అనంతరకాలమున చేర్చబడినదని కొందరి అభిప్రాయము యోగసూత్రములలో 1-23 నుండి 27 వరకు, 2-45 సూత్రములలో సగుణదైవభావము కనబడును ఇవి పతంజలి మూల సిద్ధాంతమునకు అనుకూలముగా కనబడవు ఈ సగుణదైవభావము చేర్చుట వలననే యోగసూత్రములకు స్థిరత్వము ప్రాచుర్యము వచ్చిందని కూడ

కొందరి అభిప్రాయం సమాజములో వ్యాపించియున్న ఆస్తికత్వమును అనుసరించకుండ సిద్ధాంతము చేయుట సాధ్యపడదు అను అభిప్రాయముతోనే సాంఖ్యములోని ప్రకృతి పరిణామవాదములోను, యోగములోని సాధన ప్రక్రియలలోను సగుణ భగవంతునికి స్థానముకల్పించబడినట్లుగా కనబడును అనంతరకాలమున సామాన్య మానవుల ప్రాధాన్యము అధికమై యోగతత్త్వములో ఈశ్వరునకు ముఖ్యస్థానము ఈయబడినది అని అద్వైతతత్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణ అన్నారు

ఈశ్వరుడున్నాడు అనుటకు తార్కిక సాక్ష్యమే కాని ప్రత్యక్ష సాక్ష్యముండదు ఎందుకనగా భగవంతుని అస్తిత్వమునకు వ్యక్తి ఆత్మానుభవము మాత్రమే సాక్ష్యము సత్యమును గ్రహించినవారు తమ మనస్సులోనే ఈశ్వరుని వాక్శబ్దము వినగలరు వేదములు అటుల ఏర్పడినవే గదా! యోగసాధనకు సహకారి మార్గదర్శకుడు, ఉత్సాహమునిచ్చువాడు అయిన ఈశ్వరుడు అవసరమైనాడు కాలక్రమమున మానవ జీవితధ్యేయమునకు భగవంతుడు కేంద్రబిందువైనాడు సర్వవిధ ధ్యానములలో ఈశ్వర జ్ఞానము ఉత్తమమని స్థిరభావము రూపొందినది యోగము నందు చెప్పబడిన భగవంతుని అస్తిత్వ భావము (ఉన్నాడు అను భావము) మార్పు చెంది భగవద్గీతలో నిష్కలంక భక్తి, నిష్కామకర్మయోగముగా రూపొందినది

శ్లో॥ అనన్యాశ్చింతయంతోమాంయేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

(భగవద్గీత 9-22)

ఎట్టి ఇతర భావములు లేనివారై నన్నే నిరంతరం ధ్యానించెడి నిత్యయోగల యోగక్షేమముల బాధ్యత నేనే వహించెదను అని భగవంతుడు చెప్పాడు

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ

అహం త్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥ (భగవద్గీత 18-66)

అన్ని విధములైన ధర్మములను వదలి నన్నొకనినే శరణు కోరుము సమస్త పాపముల ఉండి నిన్ను విముక్తుని చేసెదను నీవు చింతిల్లకుము అని చెప్పాడు భగవంతుడు జీవితములో భగవంతునికి ఆత్మార్పణతో కూడి కర్మమే శ్రేష్ఠమైన కర్మ అని భావము

'కర్మయోగేన యోగినామ్' (భగవద్గీత 3-3) అని గీతలో చెప్పబడింది యోగీశ్వరులకు కర్మయోగముచే ముక్తి కలుగును అన్నారు ఇంద్రియములను నిగ్రహించినంత మాత్రమున వివేకము కలుగదు (గీత 3-6)

శ్లో॥ తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యా చరన్ కర్మపరమాప్నోతి పూరుషః ॥ (గీత 3-19)

కర్తవ్యమును ఫలాపేక్ష లేనివాడవై ఆచరించుము అనాసక్తుడై కర్మమును ఆచరించు పురుషుడే మోక్షమును పొందుచున్నాడు అని చెప్పబడింది అనగా సర్వకర్మములు అనాసక్తి యోగము (నిష్కామకర్మ యోగము) ద్వారా ఈశ్వరార్పణ బుద్ధితో చేసినచో కర్తవ్యము నెరవేరును, ముక్తి కలుగును

కాని ఈనాడు యోగసాధన అంతయు ఆసనములతో కూడిన వ్యాయామముగానో, లేక "ఆత్మవశీకరణ తంత్రము" వలెనో భావించబడు చున్నది కాలాంతరమున వ్యాపించిన తాంత్రిక ఆచారములు, "ఉన్మాదయోగుల మూఢ అభ్యాసములు" పతంజలి యోగమునకు అపార్థము కల్పించినవి పతంజలి యోగసిద్ధాంతములో ఈ దోషములు లేవు నేడు యోగాభ్యాసము వికసించుచున్నమాట వాస్తవమే కాని పతంజలి నిర్దేశించిన మార్గములో ప్రకృతి పురుషుల సంబంధము గ్రహించగలుగు పద్ధతిలో యోగాభ్యాసము సాగుచున్నదా అని సందేహించవలసి వస్తున్నది శరీర ఆరోగ్యమునకు, మనస్సు ఏకాగ్రతకు సంబంధించినంత వరకు ప్రస్తుత సాధనలు ఉపయోగ

పడునట్లుగానే కనబడుచున్నవి

మన ఊహకు కూడా అందని శక్తులు మనలో అణిగి ఉన్నాయని పతంజలి అన్నాడు సాధన ద్వారా ఈ శక్తులను వ్యక్తము చేయుటయే (బయలుపరచుటయే) యోగసాధనములని పతంజలి సూత్రములు తెలుపును శరీర, చిత్త, ఆత్మశుద్ధి ద్వారా అంతర్ముఖులమై ఆత్మజ్యోతిని దర్శించుటకు మార్గము చూపునదే యోగాభ్యాసము మానవ జీవితమునకు ఆధారము చిత్తప్రవృత్తి చిత్తనిగ్రహము ద్వారా మన ప్రవృత్తినే మనము మార్చుకొనవచ్చునని యోగసూత్రములు చెప్పుచున్నవి ఏకాంతముగా ప్రశాంత మనస్సుతో మనలో ఇమిడియున్న ఆత్మశక్తులను దర్శించుట ద్వారా కనబడు జ్ఞానజ్యోతి ప్రకాశము మన వాస్తవ జీవితముపై ప్రసరింపచేసుకొనుటయే పతంజలి యోగసూత్ర ఆశయము

అజ్ఞానము ఎంతకాలముండునో అంతకాలము జనన మరణములతో కూడిన యీ జీవితచక్రమందు పురుషుడు (జీవాత్మ లేక జీవుడు) తిరుగుచునే యుండును మన జీవితము మన కర్మఫలమునను సరించి నడుచును అని యోగతత్వము కూడ చెప్పుచున్నది "నిర్బీజ సమాధి (అసంప్రజ్ఞాత యోగం) యోగమునకు పరాకాష్ఠ" యోగసాధనలో అత్యంత ఏకాగ్రత కలవానికి, చిత్తశుద్ధి గల సాధకునికి మాత్రమే నిర్బీజ సమాధి సాధ్యమగును మరి సాధారణ సాధకునికి నిర్బీజ సమాధికి ముందు క్రియాయోగం చెప్పారు (యోగసూత్రం 2-1)

సూ (2-1) "తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః"

సమాధులు కష్టసాధ్యములుగాన క్రియాయోగమును మొదటి మెట్టుగా చెప్పారు (మంద, మధ్యమ, ఉత్తమ అని సాధకులలో మూడు రకములు చెప్పారు యోగసాధన యందు ఏదో ఇచ్ఛ మాత్రమే కలవారు మందవర్గమునకు చెందినవారు యోగాభ్యాసము ద్వారా యోగమును పొందుతూ ఉన్నవారు

మధ్యమవర్గవారు గతజన్మలోని క్రియాయోగసాధన సంస్కారములున్నవానికి ఈ జన్మలో క్రియాయోగ అవసరం ఉండదు అట్టివారు ఉత్తమయోగులు భగవద్గీత (6-4)లో వీరిని యోగారూఢులు అన్నారు

మధ్యమ వర్గమునకు చెందినవారికే క్రియాయోగములు చెప్పారు తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వర ప్రణిధానం అను మూడూ క్రియాయోగములు యోగలక్ష్యముతో చేయు క్రియలను క్రియాయోగం అన్నారు ఇవే కర్మయోగమునకు కూడ సాధనములు క్రియాయోగం అనగా కర్మాచరణము, యోగసాధనము అని కూడ అన్నారు "ఇంద్రియములు గుఱ్ఱములు, మనస్సు కళ్లెము, బుద్ధి సారధి, ఆత్మరధికుడు, శరీరము రధము," గుఱ్ఱములు మిక్కిలి బలిష్ఠములై కళ్లెమునకు (పగ్గములకు) లొంగనపుడు సారధికి వాటిని లొంగదీసుకొను మార్గము తెలియని యెడల రధము అనగా శరీరమునకు అధోగతి పట్టును నిష్కామకర్మనే కర్మయోగము అన్నారు ఈశ్వర ప్రణిదానము (ఈశ్వరార్పణతో పనులు చేయుట) కూడ కర్మయోగభాగమే యగును

క్రియాయోగము మూడు విధములు అన్నారు గదా! అందు 1) **తపస్సు** అనగా కేవలం ఇంద్రియసుఖము కొరకు మాత్రమే చేయు పనులను నిరోధించుట ఎవరి ధర్మమును వారు నిర్వర్తించుట నిష్కామముతో చేయు తపస్సు చిత్తశుద్ధిని కలుగజేయును తపస్సు అనునది శారీరక క్రియాయోగము 2) **స్వాధ్యాయం** వాక్కుకు సంబంధించిన క్రియాయోగం వేదపఠనం, ఓంకారజపము, గాయత్రిజపము మొదలైనవి స్వాధ్యాయం అనబడును జీవితమును అధ్యయనం చేయటం అనగా జీవితమును తెలుసుకొనుట కూడ స్వాధ్యాయమేయగును అన్నారు 3) **ఈశ్వర ప్రణిధానం** మానసికం ఈశ్వరార్పణ బుద్ధితో కర్మములను నిర్వర్తించటమే ఈ ప్రణిధానము క్రియాయోగము సమాధిసిద్ధిని కలుగజేస్తుంది కర్మములను ఈశ్వరార్పణము చేయుట యనగా కార్యము సఫలమైనను లేక విఘ్నమైనను రెండింటిని ఈశ్వరునికే అర్పించి

నిశ్చలుడై యుండుటయే ఈశ్వర ప్రణిధానము లేక నిష్కామకర్మయోగము క్రియాయోగము ద్వారా మనోనిగ్రహము పొంది దుఃఖములను నివారించవచ్చును)

యోగసూత్రము (2-12→14)లలో కర్మసంస్కారములే దుఃఖమునకు కారణములు అన్నారు ఒక అనుభవ ప్రభావం మనస్సుపై స్థిరంగా ఉంటుంది దానినే సంస్కారం అన్నారు సంస్కారములే కర్మాశయములు (కర్మఫలమును విపాకం అన్నారు) కర్మఫలం వలన కలుగు అనుభవము వలన మరల సంస్కారం ఏర్పడుతుంది ఈ సంస్కారములను వాసనలు అని కూడ అంటారు కాని వాసనలకు విపాకం (ఫలము) ఉండదు ఒక సంస్కారమునకు ఫలం లభించాలంటే దానికి అనుకూలమైన వాసన ఉండాలి అనగా కర్మను కలిగించు కోరిక కలగాలి అజ్ఞానము మొదలైనవాటిని క్లేశములు అన్నారు ఈ క్లేశములు లేకుండ చేసిన కర్మకు కర్మాశయములు ఏర్పడవు అన్నారు అనగా రాగద్వేషరహితముగా నిష్కామకర్మ చేసినచో సంచిత (గత) కర్మఫలం కూడా నశించవచ్చును అన్నారు

క్లేశములకు అనగా దుఃఖములకు మూలం కర్మ సంస్కారములు అవి ఉన్నంతవరకు కర్మాశయఫలం (సంస్కారముల ఫలం) వలన పునర్జన్మ కలుగుచునే యుండును కర్మ సంస్కారములున్నంత వరకు (అజ్ఞానము మొదలైన క్లేశములు) క్లేశము కలిగించు కర్మలు చేస్తూనే ఉంటాము వాటి ద్వారా మరల కర్మసంస్కారాలు ఏర్పడటం వాటి వలన సుఖదుఃఖాలు అనుభవించటం జరుగుతూనే ఉంటుంది పునర్జన్మ, ఆయుర్దాయం, సుఖదుఃఖరూపములైన అనుభవాలు కలుగుతూనే ఉంటాయి వీటికి కారణం ఈశ్వరుడని కొందరు, అజ్ఞేయం (తెలియనిది) అని మరికొందరు, ఇంకకొందరు అసలు కర్మయే వీటి అన్నిటికి కారణము అన్నారు ఈశ్వరుడు కారణం అనటం మూఢవిశ్వాసం అవుతుంది మానవులకు కారణం తెలియదు

అనుటకు ప్రమాణము లేదు కర్మయే అన్నిటికి కారణం అనుటకు ఆధారములున్నవి పుణ్యపాపకర్మల పరిణామంగా ఫలితములుండును ఈ కర్మపరిణామ రూపమే పునర్జన్మ, ఆయుర్దాయం సుఖదుఃఖములతో కూడిన అనుభవము పుణ్య కర్మఫలంగా ఉన్నతమైన పునర్జన్మ, పాపకర్మ ఫలంగా నీచమైన పునర్జన్మ కలుగును అన్నారు పూర్వజన్మముల గురించి మనకు తెలియదు కాని ఈ జన్మలోని కొన్ని స్వభావములను బట్టి పూర్వజన్మ వివరములను కొన్ని ఊహించవచ్చును "ఈ జన్మయందు పరిపక్వము పొందు సంకల్పము యొక్క రూపముననుసరించి ఫలస్వరూపముండును సంస్కారములకు ఆధారం చిత్తం విషయముల వలన ఈ సంస్కారములు బయల్పడును" విషయములనగా లౌకిక లేక ఇంద్రియ వాంఛలు

సాంఖ్యములో కర్మకు ప్రముఖస్థానం ఉన్నది కర్మఫలములు కర్మమును అనుసరించియే యుండును గాని ఈశ్వరుని ప్రమేయముండదు ప్రకృతి, పురుష సంబంధమునకు కర్మయే కారణము అని సాంఖ్యము చెప్పును సాంఖ్యములో ప్రకృతి, పురుషులు రెండు వేరు వర్గములు (categories) ప్రకృతి, పురుషబంధం విడిపోయినపుడు ముక్తి కలుగును యోగసిద్ధాంతం కూడ ప్రధానంగా మూలకర్మ సిద్ధాంతము ననుసరించియే కర్మను, కర్మఫలమును వివరించింది వాచిక, శారీరక కర్మలను బాహ్యకర్మలని, మనసు చేయు కర్మలను అంతర (internal) లేక మానసిక కర్మలు అన్నది కర్మలు ఫలరూపము పొందుటను కర్మవిపాకము లేక కర్మ పరిపక్వము అన్నారు పూర్తిగా కర్మ పరిపక్వము చెందినది అనగా కర్మఫలం అనుభవస్థితికి వచ్చుటయని కూడ అర్థం చెప్తారు కొన్ని కర్మలు పరిపక్వము చెంది అనుభవంలోనికి వచ్చును వీటిని నిత్యవిపాకములు అన్నారు కొన్ని కర్మలు పరిపక్వత భవిష్యత్తులో ఎప్పుడు కలుగునో చెప్పుట అసాధ్యము అందువలన ఈ కర్మల ఫలములు తప్పక అనుభవములోనికి వచ్చును అని చెప్పుట కుదరదు వీటిని అనిత్య విపాకములు అన్నారు నిత్య విపాకములో కూడ

కొన్ని కర్మలు వర్తమాన జన్మలోనే అనుభవములోనికి వచ్చును మరికొన్ని భవిష్యత్తులో ఎపుడో ఒకప్పుడు తప్పక అనుభవములోనికి వచ్చును అని యోగసూత్ర భాష్యము

(యోగసూత్రములు 2-13) కర్మాశయములు అనగా పరిపక్వం (విపాకం) పొందిన కర్మఫలములు జాతి (పునర్జన్మ) ఆయువు (ఆయుర్దాయము) భోగము (సుఖదుఃఖములు) కలిగించును కర్మాశయములైన కర్మలు ఒకే రూపంలో సామూహికముగా అనుభవములోనికి వచ్చును అని చెప్పబడింది అనుభవములోనికి రాని కర్మలు అనగా పరిపక్వము (విపాకము) కాని కర్మలు వాసన రూపములో స్వాప్నిక స్మృతులుగా (subconscious impressions) మిగిలియుండును వీటినే సంస్కారములు లేక కర్మశేషము అని కూడ అన్నారు వాసనలు సంచితకర్మ (పూర్వజన్మకర్మలు)లో భాగములు ఇవి అనుకూల సమయమందు పరిపక్వం చెంది అనుభవములోనికి వచ్చును కర్మాశయములకు వాసనలకు (సంస్కారములకు) కొంత భేదము చెప్పారు కర్మాశయములు పరిపక్వము (విపాకము) చెందినపుడు అవి అన్నియు ఒకే జీవితకాలంలో అనుభవములోనికి వచ్చును ఇక వాసనలకు ఆ పరిమితి లేదు వాయిదాల పద్ధతిలో అనేక జన్మలలో పరిపక్వం చెంది అనుభవములోనికి వచ్చును అందువలననే కర్మాశయములను ప్రాధమిక (Primary) కర్మలు అని, వాసనలను (సంస్కారములను) అప్రాధాన కర్మలు (Secondary) అన్నారు ప్రాధమిక కర్మలు ప్రధానమైనవి అవి తప్పక ఒకే జీవితకాలంలో విపాకము చెందును అప్రధాన కర్మలు అనుబంధములు అవి కూడ విపాకము చెందును కాని ఒకే జీవితకాలంలో విపాకం చెందవు

యో॥సూ॥ బన్ధకారణ శైధిల్యాత్ప్రచార సంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః"

(3-38)

చిత్తము బంధింపబడుటకు కారణము కర్మ ఆ కర్మ శిధిలమైనపుడు

చిత్తమునకు సమ్యక్ జ్ఞానము కలుగును సమ్యక్ జ్ఞానము అనగా సత్యజ్ఞానము సత్ లేక సత్యము అనగా ఆత్మ అనగా ఆత్మజ్ఞానము కలుగును 'ఈ శరీరం నేను కాదు, 'నేను ఆత్మను' అను జ్ఞానం కలుగుతుంది ఇది చిత్తము యొక్క గతిని మార్చును 'ఈ శరీరమే నేను' అను భావం ఉన్నంత కాలం చిత్తము భౌతిక విషయములను అనుసరిస్తూ ఉంటుంది 'ఈ శరీరము నేను కాదు' లేక 'నేను ఈ శరీరమును కాదు' అను భావం ఏర్పడినపుడు చిత్తమునకు కర్మబంధము నశించును యోగతత్త్వములో సూక్ష్మశరీరమునకు స్థానం లేదు చిత్తమే ఆత్మను అనుసరించి యుండును కర్మఫలమును అనుభవింప జేయుటకు చిత్తమునకు ఏదో ఒక శరీర అవసరమున్నది అందువలన చిత్తమునకు శరీరముతో బంధము ఏర్పడుచున్నది యోగసాధన ద్వారా, సమాధి ద్వారా కర్మసంస్కారములను శిథిలం చేయవచ్చునని, అపుడు "నేను ఈ శరీరమును కాను" అను భావము స్థిరపడుతుంది ఆ భావము వలన చిత్తము స్వచ్ఛత పొంది మహిమలను కూడ పొందును జన్మ, పునర్జన్మలలో చిత్తము ఏ మార్గము ద్వారా శరీరంలోనికి రావటం, పోవటం చేస్తూ ఉంటుందో ఆ మార్గముల ద్వారా జరుగు చిత్తగతిని యోగి పూర్తిగా తెలుసుకోగలుగుతాడు చిత్తము యొక్క సంచారమార్గము తెలియుట వలన యోగి తన చిత్తమును ఇతరుల శరీరములో ప్రవేశపెట్టగలడు యోగసిద్ధాంతము ననుసరించి ఆత్మయేగాక చిత్తము గూడ ఒక శరీరము నుండి మరియొక శరీరములో ప్రవేశింపగలదు అనగా చిత్తము కూడ సర్వగతమైయున్నది కర్మము నశించినపుడు చిత్తమునకు శరీరబంధము నశించును యోగి స్వయముగా తానొక శరీరమందు ఉన్నను, మరొక మృతశరీరమందు ప్రవేశించి దానిని కదలునట్లు చేయగలడు అటులే జీవించియున్న మరొక శరీరమునందు ప్రవేశించి ఆ శరీరము యొక్క మనస్సును, ఇంద్రియములను నిరోధించి తాత్కాలికముగా ఆ శరీరముతో చరించగలడు, ప్రవర్తించగలడు ఇక్కడ విశేషమేమిటంటే యోగి చిత్తముతో పాటు అతని ఇంద్రియశక్తులు కూడ

చరించును అనగా చిత్తముననుసరించియే ఇంద్రియములుండును ఇదియే పరకాయ ప్రవేశము దీనికి యోగము చెప్పిన వివరణ ఒకటి యున్నది యోగములో చెప్పబడిన 'మహత్తు' విశ్వమునకు మనస్సు ఆ మనస్సు యొక్క అంశమే మానవుని మనస్సు విశ్వము యొక్క మనస్సు అనగా మహత్తు సర్వవ్యాపి కాని మానవుని మనస్సు అతని నాడీమండలమునకు పరిమితమై యున్నది అతని నాడీప్రవాహమందు మాత్రమే అతని మనస్సు చరించగలదు కర్మబంధము తొలగినంతనే చిత్తమునకు (మనస్సునకు) స్వేచ్ఛ కలిగి నాడీమండలమును దాటి చరించగలదు అని యోగము చెప్పుచున్నది 'పరకాయ ప్రవేశము' అనగా ఇతరుల శరీరమందు ప్రవేశించుటకు ఈ స్వేచ్ఛయే ఆధారము

(యోగసూత్రము 4-7, 8, 9, 10) సాధారణ మానవులు చేయు కర్మలు మూడు విధములు అన్నారు 1) శుక్లకర్మలు 2) కృష్ణకర్మలు 3) శుక్లకృష్ణకర్మలు శుక్లకర్మలు తెల్లనివి స్వచ్ఛమైనవి వీటిని పుణ్యకర్మలు అనవచ్చు కృష్ణకర్మలు నల్లనివి మలినమైనవి వీటిని పాపకర్మలు అనవచ్చు శుక్లకర్మఫలం సుఖము కృష్ణకర్మఫలం దుఃఖము ఇక శుక్లకృష్ణకర్మలు ఇందు పుణ్యపాపకర్మలు రెండు కలిసియే ఉంటాయి సాధారణ మానవులు చేయు కర్మలన్నీ ఈ కోవకు చెందినవే సామాన్య మానవులు తరతమ భేదములతో శుక్లకృష్ణకర్మలు చేస్తుంటారు సిద్ధులైన యోగులు చేయు కర్మలను అశుక్లములు, అకృష్ణములు అన్నారు అనగా పుణ్యకర్మలూ కాదు, పాపకర్మలూ కారు వీటికి ఏ విధమైన ఫలమూ ఉండదు ఈ కర్మలకు సంస్కారములుండవు ఎందుకనగా వారి చిత్తములు కర్మబంధ శూన్యములు

ఇక సామాన్య మానవులకు ఆ మూడు విధములైన కర్మముల ఫలమును గూర్చి (4-8) సూత్రములో చెప్పారు ఈ మూడు రకముల కర్మలు చేయటం వలన వాటి వలన కలుగు ఫలితము అనుభవించుటకు తగిన

వాసనలు (సంస్కారములు) ఉత్పత్తి యగును అన్నారు  చిత్తశుద్ధి పొందలేని వారి కర్మలు సంస్కారములుగా అంతఃకరణలో చేరి నిల్వయుండును  ఆ కర్మలలో ఏఏ కర్మలు ఫలితమునివ్వనున్నవో, ఆ ఫలములకు తగిన వాసనలు ఆ సమయంలో ఏర్పడును అని చెప్పబడింది  ఫలదశకు రాని కర్మలకు వాసనలు ఏర్పడవు

మానవజన్మ పొందినపుడు ఆ జన్మకు వలసిన మానవవాసనలే ఉత్పన్నమగును  ఒకవేళ పశువాసనలు ఉన్నప్పటికి అవి వ్యక్తం కావు  ఆ జన్మలో అతడు చేయు కర్మ కర్మాశయమగును  ఆ మానవుడు మరుజన్మలో పశువుగా పుట్టటం జరిగినప్పటికి మానుష వాసనలు పోవు అన్నారు  దీని అంతరార్థం ఏమైయుండును? అరవిందులు రాధాకృష్ణ, స్వామి అభేదానంద మొదలైనవారు చెప్పినట్లు ప్రకృతి పరిణామములో జీవుడు మానవస్థాయికి ఎదిగి మానవజన్మ పొందిన తరువాత వికసించిన మనస్సుతో కూడిన అతని సూక్ష్మశరీరము లేక చిత్తములోని ఆత్మ తిరిగి పశుశరీరములో ప్రవేశించలేదు  కర్మవాసనల ద్వారా పశుప్రవృత్తి ఏర్పడినను మానవ శరీరంతోనే పశుప్రవృత్తికి తగిన కర్మాశయములతో వాసనలతో జన్మించును  ఎందుకనగా కర్మాశయం వలన కలుగు జన్మ అనగా అటువంటి సంస్కారములు (వాసనలు) కలిగిన జన్మ అని భావమగును గాని, పరిణామంలో అవరోహణ చెంది పశుజన్మ పొందును అనుట సమంజసము కాదు  పరిణామము ఆరోహణక్రమంలోనే ఉండునుగాని అవరోహణలో ఉండదు గదా!  లేనిచో పరిణామప్రవాహం ముందుకు సాగదు

కర్మ సంస్కారములు అను వాసనలు అనేక జన్మలవి  స్వాప్నిక (subconscious) స్థాయిలో నిల్వయుండును అన్నారు  మరి ఆ సంస్కారములలో దేశ, కాల, జన్మాంతరముల వ్యవధి ఉంటుంది గదా! మరి వాటికి ప్రస్తుత జన్మతో పొంతన ఎట్లు కుదురును?  ఎట్టి వాసనలకు

పరిస్థితులు అనుకూలమై యుండునో అట్టి వాసనలు మాత్రమే వెలువడి అనుభవములోనికి వచ్చును అన్నారు గదా! మిగిలిన వాసనలు సంచితములుగా నిల్వయుండును అని కూడ అన్నారు కదా! దీనివలన పరిస్థితుల మూలమున వాసనలను నిరోధింపగలమనియే అర్థము వచ్చుచున్నది గదా! పరిస్థితులకు అనుకూలమైన కర్మము మాత్రమే వెలువడును అనే గదా భావము దీనివలన జాతి (పునర్జన్మ) కాలము మొదలైన పరిస్థితులను బట్టి కర్మఫలమును కూడ నిరోధింపగలమనియే గదా భావము నిల్వయున్న సంస్కారములలో దేశకాల జన్మాంతరముల వ్యవధి యుండును వాటికి ప్రస్తుత జన్మతోకలుగు పొంతన గురించి యోగసూత్రములు 4-9, 10 లో చెప్పారు స్మృతి (బుద్ధి) (జ్ఞాపకము) (impressions) మరియు సంస్కారములు ఏకరూపమునే పొందియుండును అన్నారు "కర్మానుభవములు సూక్ష్మస్థితిని పొంది సంస్కారములు అగును తిరిగి సంస్కారములు స్మృతి రూపము పొందును ఈ జన్మలో మనము చేయు పనులతో ఆ పూర్వానుభవములు మనకు తెలియకుండ సమాన స్థితికి వచ్చి స్మృతియందు చేరును ప్రతి శరీరమందును సరిగా అట్టి శరీరమునందు అంతకు ముందు పొందియుండిన సంస్కారసముదాయము మాత్రమే కర్మమునకు హేతువగును" అన్నారు మరొక జాతికి (జంతుజాతికి) చెందిన అనుభవములు అందు ఉండినను అవి నిరోధింపబడును ప్రతి జన్మ ఆ జాతి పరంపరకు మాత్రమే చెందియున్నట్లు శరీరము ఉండునని భావము గదా! మన అనుభవమంతయు సుఖము పొందవలెనను వాంఛతో కూడియుండును క్రొత్త అనుభవములు పాత అనుభవములకు అనుసంధానములు అందుచే అనుభవములకు, వాసనలకు (సంస్కారములకు) ఆది యనునది లేదు వాసనలను బట్టి జన్మ కలుగుతోందని, కర్మలనుబట్టి వాసనలు కలుగును అన్నారు మరి అన్నిటికంటే మొదటి జన్మకు కారణమైన వాసనలు ఎక్కడ నుండి వచ్చినవి? జీవనేచ్ఛ అనగా జీవించి ఉండాలనే కోరిక శిశువు పుట్టినప్పటి నుండి ఉంటుంది అలాగే జీవనేచ్ఛ సృష్టి ఎప్పటి నుండి ఉన్నదో అప్పటి

నుండి యున్నది అది ఎప్పటి నుండి? అది మనకు తెలియదు ఈ జన్మ పరంపరతో పాటు అనాదిగా ఆ ఇచ్ఛ, దానితో వాసనలు వస్తూనే ఉన్నాయి అవి నిత్యమైనవి అని మాత్రమే యోగసూత్రములు చెప్పుచున్నవి

కర్మాశయములను, వాసనలను తపస్సు ద్వారా నిరోధించవచ్చు, యోగసాధన ద్వారా నిరోధించవచ్చు అన్నారు ఇది జైన సిద్ధాంతములో చెప్పిన నిర్జరా అను కఠిన నిష్ఠలతో కూడిన కర్మనిరోధక ప్రక్రియతో పోలియున్నట్లు కనబడును సాంఖ్యములోను, యోగములోను, జైనములో కూడ కర్మ భౌతిక స్వభావము లేక పదార్థ స్వభావముననుసరించియే వాటిని నిరోధించు ప్రక్రియ యుండునట్లు కనబడుచున్నది సాంఖ్య, యోగములలో కర్మలు ప్రకృతి ఉత్పాదన అందుచే అవి కూడ ప్రకృతి వలె జడములు (చైతన్యము లేనివి) అవి ఆత్మ(జీవాత్మ)లోనికి ప్రవేశించవు ఇది జైనమునకు భిన్నము జైనములో భగవంతుని ప్రస్తావన లేదు అందువలన కర్మనిరోధకమునకు మంత్రములకు, ధ్యానముల ప్రాధాన్యము లేదు జైనములో కఠిన నిష్ఠా జీవితమునకే ప్రాధాన్యత ఎక్కువ కాని యోగములో ఏకాగ్రతకు, ధ్యానమునకు అత్యంత ప్రాధాన్యమున్నది

కర్మకు, కర్మఫలితములకు గోచరమగు అనగా దృష్టికి కనబడు సంబంధమును నిరూపించుట సాధ్యము కాదు అని ఒక వాదమున్నది మనకు అనుభవములోనికి వచ్చునది కర్మఫలితములు మాత్రమే అవి కర్మాశయములై ఈ జన్మలోవి అయినను కర్మలు మనకు బాహ్యస్మృతి (జాగృతావస్థ)లో ఉండవు ఇక వాసనల రూపమైన గతకర్మలు మనకు ఎట్లు జ్ఞాపకముండును అందువలన కర్మఫలానుభవమును బట్టి ఆ ఫలమును ఇవ్వగలిగిన కర్మను గతంలో ఎప్పుడో మనము చేసి ఉంటాము అని భావించవచ్చును అనుభవములను దృష్టినందుంచుకుని ఏ కర్మలకు ఏ ఫలములు వచ్చునో పురాణములలో చెప్పబడినది అంతయు అనుభవం లేక

యోగదృష్టి ద్వారా చెప్పిన ఊహాచిత్రములేయని చెప్పక తప్పదు ఎందుకనగా ఏ కర్మకు ఏ ఫలముండునో భౌతికముగా ఆధారములతో చెప్పుట సాధ్యము కాదు కాని కొన్ని సమయములందు అనుభవములోనికి వచ్చిన కర్మఫలము అతిసమీపకాలములోని మన గతకర్మను జ్ఞప్తికి తెచ్చి, ప్రస్తుత అనుభవము దాని ఫలితమే అని మనకు తెలియునట్లు చేయును ఇది వాస్తవము కాని సాధారణము కాదు (not common) అందువలన కర్మలు మన బాహ్యాస్మృతిలో ఉన్నను లేకున్నను వాటి ఫలితములను అనుభవింపక తప్పదు ఫలమునకు కారణమైన కర్మను జ్ఞప్తికి తెచ్చుకొనుట లేక ఊహించుట మన వంతు

కర్మ నిరోధము జరుగునంతవరకు కర్మఫలము అనుభవింపక తప్పదు అని సాంఖ్యము చెప్పినది కర్మలకు కర్తయైన వ్యక్తి బాధ్యతే కాని మరెవరిదీ కాదు అని కూడా అన్నది యోగమును సఈశ్వర సాంఖ్యము అన్నారు అనగా సాంఖ్యము నాస్తికము కాకపోయినను భగవంతుని అస్తిత్వము అందు వ్యక్తం చేయబడలేదు సాంఖ్యములో చెప్పబడిన ఇరువది అయిదు తత్త్వములకు మరొకటి చేర్చి ఆ తత్త్వమును యోగములో భగవంతుడు అన్నారు కాని ఈ భగవతత్త్వమునకు యోగసిద్ధాంతముతో నిర్దిష్ట సంబంధము స్పష్టము చేయబడలేదు ఈశ్వర ప్రణిధానమును యోగనియమములలో చేర్చారేకాని ఈశ్వర అస్తిత్వమును స్పష్టము చేయలేదు సాంఖ్యములో కాని, యోగములో కాని జీవుని కర్మలకు ఈశ్వరుని కర్తగా చేయలేదు కర్మలకు కర్త వ్యక్తిలోని అహంకారమే కాని ఈశ్వరుడు కాదు అన్నారు యోగములో "పురుష విశేష ఈశ్వరః" (1-24) అన్నారు జీవాత్మలుగా భౌతిక శరీరములను పొందు అనేక పురుషుల కంటే ఈశ్వరుడు విశేషమైన పురుషుడు అన్నారు అంతే ఈ విశేషపురుషునికి కర్మాశయములు, వాసనలు అంటవు అన్నారు జీవాత్మలైన పురుషులు ప్రకృతి బంధము నుండి విడివడినపుడే కర్మబంధము నుండి ముక్తి అన్నారు కాబట్టి జీవాత్మల కంటే భిన్నమైన, ప్రత్యేకమైన ఆత్మయే ఈశ్వరుడు లేక పరమాత్మ అని భావించవలయును అందుచే కర్మలకు కర్త

కాకపోయినను, కర్మఫలము ఆయా జీవులకు చేరునట్లు ఈశ్వరుడు ఒక అల్లిక ప్రక్రియ (network) నడిపించుచు దానికి కేంద్రముగా నుండను అని భావించవలసియుండును

3 పూర్వమీమాంస

షడ్దర్శనములలో ఒకటియైన పూర్వమీమాంస కర్త వ్యాసుని శిష్యుడుగా ప్రతీతి పొందిన జైమిని మహర్షి జైమిని అను పేరు తప్ప అతనిని గురించి ఇంకే వివరములు తెలియవు అదేకాక జైమిని అను పేరుతో అనేక తత్త్వ, వైదిక రచనలు సంబంధము కలిగియున్నట్లు కనబడును జైమిని మహర్షి ఒకరా లేక అంతకంటే ఎక్కువమంది ఉన్నారా అను సందేహమునకు తృప్తికరమైన సమాధానము ఎన్నటికీ రాదు మీమాంస సూత్రకర్త అయిన జైమిని, జైమిని పేరనే ఉన్న బ్రాహ్మణము, వేదసంహిత, కొన్ని శ్రౌత సూత్రముల, గృహ్య సూత్రముల కర్తగా చెప్పబడుచున్న జైమిని, 'జైమిని సూత్రములు' అను పేరుననున్న జ్యోతిష గ్రంథ రచయిత, ఇంకా మహాభారతములోను, పురాణములలోను కనబడు జైమిని ఒకరు కాదు అని పెక్కుమంది తత్త్వజ్ఞుల అభిప్రాయము వారి కాలనిర్ణయమును గూర్చి, వారి గుర్తింపును గూర్చి ఇచట చర్చించుటకు సాధ్యపడదు ప్రస్తుత సందర్భమునకు మీమాంస సూత్రకర్త జైమిని మహర్షియే సంబంధించిన వ్యక్తి మీమాంస సూత్రములకు సంబంధించినంత వరకు కూడ 'మీమాంస'కు ప్రారంభ రూపం ఇచ్చినది జైమిని అను పేరు గల మరొక వ్యక్తి అని అంటున్నారు అతడు ఈ జైమినికి చాల పూర్వీకుడు అయి ఉంటాడని, మీమాంసకు నిర్దిష్టమైన సూత్రరూపము ఇచ్చినది ఈ జైమిని మహర్షియే అని మాత్రము నిస్సందేహముగా చెప్పవచ్చును అంటున్నారు వేదములలో పూర్వభాగములైన బ్రాహ్మణములకు ప్రాధాన్య మిచ్చిన మీమాంసను పూర్వమీమాంస అనియు, వేదములలో తరువాతి భాగములైన ఉపనిషత్తులకు ప్రాధాన్యమిచ్చిన మీమాంసను ఉత్తరమీమాంస అన్నారు కాలక్రమమున పూర్వమీమాంస మీమాంస సిద్ధాంతముగాను

ఉత్తరమీమాంస వేదాంతముగాను స్థిరపడినవి పూర్వమీమాంస రూపమే మీమాంస సూత్రములు ఉత్తరమీమాంస రూపమే బ్రహ్మసూత్రములు

(మీమాంస అనగా చర్చించుట, సంశయించుట) (సిద్ధాంతమనగా ప్రతిపాదన ఒక ప్రతిపాదన గురించి హేతువు (కారణం) ఆధారంగా వాదనతో ఆలోచనతో సంశయములను దాటి దాని అర్థము తెలిసికొనుటయే మీమాంస అనవచ్చును కర్మకాండను, జ్ఞానకాండను చర్చించి ప్రతిపాదనలను వివరించునదే మీమాంసశాస్త్రము బ్రాహ్మణములతో సంబంధము గల పూర్వమీమాంస కర్మకాండను ప్రతిపాదించు శాస్త్రము ఉపనిషత్తులతో సంబంధము గల ఉత్తరమీమాంస జ్ఞానకాండను ప్రతిపాదించు శాస్త్రము) వేదవాక్య అర్థమునకై సంశయ విషయములను విశదపరచవలసి వచ్చినది మీమాంస అనగా వేదభాష్యము కాదు సక్రమ యజ్ఞ ఆచరణకై వేదవాక్య అర్థములందు ఏర్పడిన సందేహములను సమస్యలను సందర్భముననుసరించి వివరించి నిశ్చితమైన అర్థములను చెప్పుటకు జరిగి వాదన (తర్కము) ఆలోచనలే మీమాంస మీమాంస ఒక ప్రతిపాదనకు అనుకూలంగానో, వ్యతిరేకంగానో జరిగిన తర్కము, ఆలోచన కాదు ఆ ప్రతిపాదనకు సరియగు అర్థమును స్థిరపరచుటయే మీమాంస (హిందూమతమందు పూర్వమీమాంసకు చాల ప్రాధాన్యము ఏర్పడినది) నిత్యజీవితములోని నియమములను తెలుపు ధర్మగ్రంథములకు అర్థము మీమాంస సూత్రముల ఆధారంగా చెప్పబడింది ఈ ధర్మగ్రంథములే స్మృతులైనవి ఈ స్మృతులు (codes) ఆధారంగానే హిందూన్యాయస్మృతులు (Hindu Code Bills) చట్టములు చేయబడినవి అనగా మీమాంస సహాయముతో మత గ్రంధములకు (ధర్మశాస్త్రము, స్మృతులు) అర్థము గ్రహించి వాటికి న్యాయస్థానములలో ఉపయోగించుటకు చట్టపరంగా నిశ్చిత అర్థముతో రూపం కల్పించబడింది

షడ్దర్శనములలో మరొకటి న్యాయదర్శనము అందుకూడ

తర్కమునకు అత్యంత ప్రాధాన్యము కలదు (కాని న్యాయతర్కము ఒక వాక్యమునకు అర్థము విశదపరచు ప్రయత్నము కాదు ఒక ప్రతిపాదన లేక సిద్ధాంతమునకు సహేతుకంగా (కారణములతో) అనుకూలంగానో వ్యతిరేకం గానో వాదించుటయే న్యాయతర్కము ఒక సిద్ధాంతమును స్థాపించుటకే న్యాయతర్కము ప్రారంభము నుండి ఒక ప్రణాళిక ప్రకారం సాగును) ఉదాహరణకు ఒక పర్వతము మండుచున్నది అనునది (ఒక ప్రతిపాదన దానిని స్థిరపరచటమే న్యాయతర్క ఆశయము న్యాయతర్కవాక్యమునకు నాలుగు భాగములున్నవి 1 ప్రతిజ్ఞ - అనగా స్థాపించవలసిన ప్రతిపాదన లేక సిద్ధాంతము 2 హేతువు - ఆ సిద్ధాంతం స్థాపించవలసి వచ్చుటకు కారణమేమి? పర్వతముపై పొగవచ్చుచున్నది కనుక 3 ఉదాహరణము - పొగ యున్న చోట నిప్పు ఉండును దీనికి ఉదాహరణగా వంట పొయ్యి 4 ప్రయోగము - ఆ విధముగనే పర్వతముపై నిప్పు ఉన్నదని చెప్పుట 5 నిర్ణయము లేక ప్రకటన) కావున పర్వతము మండుచున్నదని సాధించుట లేక ప్రకటించుట న్యాయతర్కమందు స్థాపించవలసిన ప్రతిపాదన ముందే ప్రకటించబడును దానిని స్థాపించుటయే న్యాయతర్క కార్యము ఆ స్థాపించుట అను సమస్యకు అనుకూలమైన మార్గము కొరకై అన్వేషణ జరుగును ఇచట ప్రతిపాదన తెలుసుకొనుట అను సమస్య రాదు ఎందుకనగా ప్రతిపాదన అర్థము తెలియనిచో దానిని సమర్థించుట ఉత్పన్నము కాదు ఇందు రెండు అంశములున్నవి 1 విషయము లేక ప్రతిపాదన 2 ఇక అందు స్థిరపరచవలసినది ఏమిటి? పర్వతము మండుచున్నది అను ప్రతిపాదనలో విషయము పర్వతము సాధించవలసినది అది మండుట న్యాయతర్కమందు ఒక ప్రతిపాదనను స్థాపించుటకు దానికి వ్యతిరేకమైన ప్రతిపాదన చేసి అది సాధ్యము కాదని స్థిరపరచుట ద్వారా అసలు ప్రతిపాదనను స్థాపించుట జరుగును ఆత్మ నిత్యము (soul is eternal) అనునది ప్రతిపాదన దానిని స్థాపించుటకు వ్యతిరేక ప్రతిపాదన చెప్పుదురు అనగా ఆత్మ నిత్యము కాదు

అపుడు తర్కము (వాదము) మొదలగును ఆత్మ నిత్యము కానిచో అది గతకర్మఫలమును ఎట్లు అనుభవించును గత కర్మ లేనిచో పునర్జన్మ ఎట్లు కలుగును అనగా పునర్జన్మ ఉండదు, అటుపై మోక్షముండదు అందువలన ఆత్మ అనిత్యము కాదు అనగా ఆత్మ నిత్యము అని స్థిరపడుచున్నది తర్కమునకు ప్రత్యక్ష (Direct source) ఆధారము ఉండదు పరోక్షమగు (indirect) ఆధారముతోనే యదార్థమును స్థాపించును ఒక ప్రతిపాదనకు వ్యతిరేకమైనది అసాధ్యము కాబట్టి ఆ ప్రతిపాదన సాధ్యము అని స్థిరపరచును ఇంకొక విధముగా చెపితే ఆత్మ అనిత్యము కాదు కాబట్టి అది నిత్యమే అయి యుండవలెనని సూచించును అనగా తర్కము ఒక ప్రమాణము (standard) కాదు కాని ప్రతిపాదనలను స్థాపించుటకు సూచనలిచ్చును (ఆ విధంగా **న్యాయతర్కము ఒక ప్రతిపాదనను స్థాపించు ప్రయత్నమైతే మీమాంస తర్కము ఒక ప్రతిపాదన అర్థమును స్థాపించు ప్రయత్నము** న్యాయతర్కమందు అర్థము తెలుసుకొను ప్రయత్నముండదు ఎందుకనగా అర్థము ముందే తెలిసి యుండవలెను న్యాయచట్టమును (legal codes) రూపొందించుటకు మీమాంస తర్కము ఉపయోగపడితే, న్యాయస్థానములందు ఆ చట్టములను ఒక విషయమునకు అనుకూలముగాను, వ్యతిరేకముగాను వాద ప్రతివాదములతో స్థాపించుటకు న్యాయతర్కము ఉపయోగపడును)

యజ్ఞకర్మలు విధ్యుక్త ధర్మముగా పూర్వమీమాంస నిర్ణయము విధ్యుక్తధర్మము అనగా వేదములో చెప్పబడిన కర్మకాండలు జ్ఞానము, కర్మకాండలు పరస్పర విరోధములు అని ఆదిశంకరులు అన్నారు అయినను సత్కర్మల వలననే సత్యమును తెలుసుకొనుటకు ఆసక్తి కలుగును అని కూడ శంకరులు అన్నారు ఇచట కర్మలు అనగా కర్మకాండలే కాదు మనము నిత్యము చేయు పనులు అని చెప్పవచ్చును వేదములో చెప్పబడిన కర్మకాండల ఆచరణ జ్ఞానమునకు "పూర్వరంగము" అన్నారు కాని కర్మకాండలే సర్వస్వము అనుట నిశ్చయముగ జ్ఞానమునకు విరుద్ధమే యగును మీమాంస

చేసిన నిర్ణయములు అంతకు ముందే వేదములలోని బ్రాహ్మణములలో కనబడును కాని బ్రాహ్మణములలో నిర్ణయములకు పొంతన లేక అవి అసంపూర్ణముగా కనబడుటచే దానికి సహాయముగ సంప్రదాయమును అనుసరించి యజ్ఞకర్మలను నిర్వహించినట్లు తెలియుచున్నది ఈ సంప్రదాయములకు స్థిరమైన గ్రంథరూపము లేదు, ఉండదు ఎందుకనగా సంప్రదాయములు ఒక తరము నుండి మరొక తరమునకు వాక్కు రూపంగానే ప్రసారమవుతూ వచ్చినాయి అందుచే సంప్రదాయములకు ఆధారములు ఎక్కడా దొరకవు ఏ ఒక్క సంప్రదాయము అధికారికము (standard) కాదు ప్రాంతములను బట్టి, కాలమును బట్టి ఈ సంప్రదాయములు భిన్నములైనవి

ఆనాడు కూడ చాలాకాలము యజ్ఞకర్మలు బ్రాహ్మణములలోని వాక్యములకు ఆచారము జోడించి చేయుచుండెడివారని చెప్పబడింది విభిన్న వైదికశాఖలు ఏర్పడుట, బౌద్ధమత ప్రభావము ఎక్కువగుట వలనను వేదమత సత్యమును తిరిగి ప్రతిష్ఠించవలసి వచ్చినది అందువలననే యజ్ఞకర్మ నియమములను సూత్రీకరించి ఒక క్రమపద్ధతిలోనికి తెచ్చుటకు జైమిని మీమాంస సూత్రములు రచించెను మీమాంస ధ్యేయము సిద్ధాంతమును నిర్మించుట కాదు వేదములో చెప్పబడిన కర్మలను ఆచరించుటయే దాని లక్ష్యము తాత్విక లేక జ్ఞానచర్చలు మీమాంసకు ప్రధానములు కావు కర్మాచరణ ద్వారా కలుగు ఫలితమును అనుభవించుటకు ఒక శరీరము, అందు ఒక ఆత్మ ఉండవలెను గాన, ఒక నిత్యమగు ఆత్మయున్నదని మీమాంస అంగీకరించినది వేదప్రమాణమును తిరస్కరించిన బౌద్ధమునకు, కర్మల కంటే జ్ఞానమే గొప్పదని చెప్పువారికి సమాధానముగా వేదప్రమాణమును, కర్మల ప్రాధాన్యమును స్థాపించుటకు జైమిని మీమాంస సూత్రములు రచించెను

'బ్రాహ్మణము' అను వేదభాగము యొక్క పేరు 'బ్రహ్మన్' (పరబ్రహ్మము) నుండి వచ్చినట్లుగా కనబడినను, బ్రాహ్మణము అనగా బ్రాహ్మణ

సమూహము అని కూడా అర్థముండుట వలన బ్రాహ్మణములనగా పురోహితులైన బ్రాహ్మణులు యజ్ఞకర్మలను గురించి అధికారికముగా చెప్పిన ప్రవచనములనియే అర్థము వచ్చును బ్రాహ్మణములకు ఒక క్రమపద్ధతిన జరిగిన సూత్రరూపమే మీమాంస ఇందు 30,000 సూత్రములు కలవు అందుగల 60 పాదములు 12 అధ్యాయములుగా విభజింపబడినవి దీనిని ద్వాదశ లక్షణి అన్నారు దీనికి అనుబంధముగా ఇంకను 600 సూత్రములు 4 అధ్యాయములు గల అనుబంధ గ్రంథమొకటి యున్నది ఇది జైమిని రచన కాకపోవచ్చునను వాదన కొంతకాలము ప్రచారములోనున్నది తుదకు మొత్తము 16 అధ్యాయములు గల షోడశలక్షణి అను మీమాంస సూత్రరచన జైమిని రచనయే అన్నారు

మీమాంసకు ప్రధానమైన ఆధారము జైమిని మీమాంస సూత్రములే కాని అనంతర కాలమున మీమాంస సాహిత్యము అనంతముగా పెరిగింది మీమాంస సూత్రములకు శబరస్వామి వ్రాసిన భాష్యమే ప్రధానమైనది తరువాత వచ్చిన మీమాంస వ్యాఖ్యాతలందరికి శబరభాష్యమే ఆధారమైనది అనంతర కాలములో కుమారిలభట్టు, ప్రభాకరుడు అనువారు కొంతవరకు రెండు భిన్నమార్గములలో సూత్రములకు, భాష్యమునకు వ్యాఖ్యానం వ్రాశారు కాలక్రమమున వారి అనుయాయి మీమాంసకులు రెండు శాఖలుగా విడిపోయిరి ఇంకా ఎందరో వ్యాఖ్యలు వ్రాశారు కాని వాటి వివరణకు ఇచట సందర్భము కాదు

మీమాంసకులు కొన్ని ప్రమాణములను అంగీకరించారు ప్రమాణము అనగా జ్ఞానమునకు (తెలుసుకొనుటకు) మూలము లేక ఆధారము (source) జైమిని చెప్పిన ప్రమాణములు మూడు 1 ప్రత్యక్షము, 2 అనుమానము, 3 శబ్దము తరువాతవారైన ప్రభాకరుడు, కుమారిలుడు ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధిలను కూడ ప్రమాణములుగా చేర్చారు లోకవార్తలను (rumours)

గుర్తించలేదు ఆ వార్తలు ఎచట నుండి వచ్చినవో, వాటి స్వభావము తెలియుట అసాధ్యము స్మృతులను కూడ ప్రామాణ్యములుగా గుర్తించలేదు ఎందుకనగా స్మృతులు పూర్వము ఉన్నవాటినే తిరిగి చెప్పును కాని క్రొత్తవి ఏమీ ఉండవు అన్నారు ఆత్మ ఒక ద్రష్ట (చూచువాడు) ఆ ద్రష్టకు చెందినదే ఈ శరీరము శరీరములోని మనసు ఒక అణుద్రవ్యము ప్రతి జ్ఞానక్రియయందు అనగా ఒక విషయము తెలిసికొనుట అను కార్యమునందు మనస్సు ఆత్మతో సంపర్కమునకు ప్రయత్నించును మనస్సు సుఖము, దుఃఖము మొదలగు కార్యములను కలిగించును కాని రంగు, వాసన మొదలగు గుణములను కలిగించదు కాబట్టి ఆ గుణములను ఎరుగుటకు మనస్సు ఇతర ఇంద్రియముల సహాయము తీసికొనును ఆ విధముగ మనస్సు, ఇతర ఇంద్రియములకు బాహ్యవస్తువులతో సంపర్కము కలిగినపుడు ఆత్మకు బాహ్యప్రపంచ జ్ఞానము కలుగును మనస్సు ఆత్మ సంయోగమునకు పుణ్యపాపములు ఆధారము అన్నారు సుఖము, దుఃఖము, రాగము, ద్వేషము మొదలగు స్థితులను మనస్సు చూడగలదు అందువలననే మనస్సును కూడ ఇంద్రియముగా గుర్తించారు మనము మనస్సుతో సహా ఇంద్రియములపై ఆధారపడవలసిన అవసరము తొలగించపడినపుడు ఎన్నో వస్తువులను ఒకే సమయమున తెలుసుకొనుటకు వలసిన శక్తి మనకు ఉండెడిది అని అన్నారు ఆత్మ మనసుతో కలిసినపుడు జ్ఞానము అను కార్యమునకు కారణమగుచున్నది ఆత్మ మనసుల సంయోగము గతజన్మ కర్మఫలమును అనుసరించుయుండు 'అదృష్టశక్తి' వలన గాని, లేక ఆత్మచే నిశ్చయించబడు మానసిక కార్యముల వలన గాని ఏర్పడును అన్నారు అనుభవమునకు కర్త మరియు భోక్త (అనుభవించునది) కూడ ఆత్మయే అన్నారు శరీరము భోగములకు ఆశ్రయము కల్పించును ఇంద్రియములు భోగానుభవమునకు సాధనములు అన్నారు అనుభవ విషయములు రెండు రకములు 1 ఆంతరికములు, 2 బాహ్యములు సుఖము, దుఃఖము ఆంతరికములు ఇంద్రియములకు గోచరించునవి

బాహ్యములు అనగా బయటనుండును మన జ్ఞానము ఒక సమయమున ఒకే వస్తువును గ్రహించగలదు గాని రెండు అంతకు మించిన వాటితో సంయోగము పొందలేదు అని మీమాంస వ్యాఖ్యాతల అభిప్రాయము

(మీమాంసకులు చెప్పిన ప్రమాణములు 1 ప్రత్యక్షము, 2 అనుమానము, 3 శబ్దము, 4 ఉపమానము, 5 అర్థాపత్తి, 6 అనుపలబ్ధి) 1 ఇందు **ప్రత్యక్షము** అనగా సాక్షాత్తుగా తెలియునది ఇంద్రియముల సంయోగము ఇందుకు కారణము విషయము లేక వస్తువు యొక్క గుణములతో ఇంద్రియములకు సంపర్కమేర్పడును అటుపై ఇంద్రియములతో మనస్సునకు సంపర్కము కలుగును చివరకు మనస్సుతో ఆత్మసంయోగము పొందును అనగా ఇంద్రియములకు కనబడు వస్తువులే ప్రత్యక్షములు ఇంద్రియములకు అతీతమైనవి ప్రత్యక్ష ప్రమాణములు కావు అన్నారు 2 **అనుమానము** అనగా తెలిసిన వస్తువు ఆధారముగా తెలియని వస్తువును ఊహించుట తెలిసిన వస్తువు నందు తెలియని వస్తువును గూర్చి కొంతభావము కలుగును అని అర్థము అనుమానమునకు వస్తు సామాన్య ధర్మములే ఆధారము పొగ ఉన్నచోట నిప్పు ఉండును అనునది ఇట్టిదే పొగ నిప్పుకు సామాన్య ధర్మము 3 **శృతి లేక ప్రమాణము** అనగా వేద శబ్దమును అనగా వేదములలో చెప్పబడిన మాటలను ప్రమాణముగా గ్రహించుట కొన్ని విషయములు ప్రత్యక్షములు కావు, అనుమానాలూ కావు యజ్ఞము చేయువాడు స్వర్గమునకు పోవును దీనికి సాక్ష్యము ఏది? దీనికి ఎట్టి ప్రమాణములు ఉండవు వేదవాక్యమే దీనికి ప్రమాణము వేదములలోని ప్రతివాక్యము యజ్ఞకర్మనే చెప్పునని మీమాంసకుల వాదన యజ్ఞకర్మలను గురించి చెప్పు వేదభాగములే బ్రాహ్మణములు శబ్దప్రమాణము అనగా ఆ శబ్దము యొక్క అర్థమే ప్రమాణము ఇంద్రియములకు అందని జ్ఞానము శబ్దార్థము గ్రహించుట వలన కలుగును అన్నారు అదే శబ్దజ్ఞానము ఒక జ్ఞానము ద్వారా మరొక జ్ఞానము పొందుట ప్రమాణము కాదు అన్నారు కాని వేదప్రమాణమునకు ఆ దోషము లేదు

అన్నారు ఎందుకనగా వేదవాక్యమునకు దేశకాల పరిస్థితులతో సంబంధము లేదు కాబట్టి వేదములు తమకు తామే ప్రమాణములు వాటికి మరొక ప్రమాణము అవసరము లేదు వేదశబ్దములు సహజములు, శాశ్వతములు శబ్దార్థ సంబంధము సహజము అది కృత్రిమముగా ఏర్పడునది కాదు శబ్దమునకు భావమును చెప్పు శక్తి సహజముగానే యుండును ధ్వని అనునది ఏదియు లేదు, అక్షరరూపమే ధ్వనియని మీమాంస భాష్యము ఒక శబ్దమునకు ఉండు భావశక్తి అందలి అక్షరముల సంయోగముచే కలుగును శబ్దజ్ఞానము ఇంద్రియములకు గోచరముకాదు అది శబ్దార్థ జ్ఞానముచే మాత్రమే కలుగునని చెప్పబడింది కొన్ని అక్షరములు కూర్చు శబ్దము ఆ అక్షరముల నుండి వేరు కాదు అక్షరములను చెవి దర్శించును అక్షరములు వినబడు క్రమమును బట్టి ఆ శబ్దము ఏర్పడును ఒక శబ్దమందలి అక్షరసంఖ్యను బట్టి అన్ని ధ్వనులుండును శబ్దమందలి ప్రతి అక్షరము ధ్వనిని కలిగియున్నను అవి ఏర్పరచిన శబ్దమును ఒకే ధ్వనిగా గ్రహించుదుము ప్రతి అక్షరము దాని ధ్వని వెలువడినంతనే అనగా అక్షరరూపము దర్శనమిచ్చినంతనే ఆ అక్షరము అదృశ్యమగును అక్షరరూపమే ధ్వని, అదియే దర్శనము ఒక శబ్దములోని ప్రతి అక్షరము దర్శనమైన వెంటనే తనదైన ఒక ముద్రను లేక సంస్కారమును కలిగించును ఆ శబ్దమందలి చివరి అక్షరదర్శనముతో ఆ సంస్కారములు కలిసి ఆ శబ్దభావము ఏర్పరచును కావున అక్షరములే శబ్దజ్ఞానమునకు కారణములని చెప్పబడినది జ్ఞానము కలిగించు శక్తి అక్షరములకే గాని శబ్దమునకు కాదు అన్నారు ఒక శబ్దమును రూపొందించు అక్షరముల ధ్వనులు క్షణము మాత్రమే యుండును ఆ ధ్వనులకు వేరైనది, ఆ ధ్వనుల చేతనే ఏర్పడునట్టి సంపూర్ణ శబ్దరూపము లేదు అన్నారు మీమాంసకులు సంపూర్ణ శబ్దరూపమును 'స్ఫోటము' అన్నారు శక్తి అక్షరములకే కాని స్ఫోటమునకు కాదు అని మీమాంస భాష్యము శబ్దమును తెలుపు ధ్వనుల ననుసరించి శబ్దకల్పనము కలుగునని జైమిని అన్నారు ఒకే సూర్యుని

అనేకులు అనేక ప్రదేశముల నుండి ఒకే సమయమున చూచుచున్నారు చూచువారు అనేకులు కాని సూర్యుడు ఒక్కడే అతని యందు మార్పు ఉండదు అటులే ఒకే శబ్దమును అనేకులు అనేక ప్రదేశముల నుండి ఉచ్చరించినపుడు శబ్దమునందు మార్పులు కనబడును కాని శబ్దమందు మార్పు ఉండదు, వారు ఉచ్చరించినది వేరు శబ్దములు అని జైమిని అభిప్రాయము శబ్దము నిత్యము ఉండును దానిని ఇతరులకు తెలుపుట కొరకే ఉచ్చరించబడును అని జైమిని అన్నారు 'శబ్దము యొక్క ప్రయోజనము వ్యావహారికము' శబ్దము ఒక జాతిని గాని రూపమును గాని చెప్పును అది వ్యక్తులను చెప్పదు అన్నారు 'అది ఒక గోవు' అనినపుడు గోవునకు ఉండు సామాన్య లక్షణములు గల ఒక జంతువు అని అర్థము గాని ఏదో ఒక ప్రత్యేకమైన గోవు అని కాదు శబ్దము ఏ ఒక్క వ్యక్తిని ప్రత్యేకముగా చెప్పదు అలాగని ఒక జాతిలోని సర్వవ్యక్తులను తెలుపదు గోవు అనగానే తెలుపుగా నుండును అని వ్యక్తమగును ఎందుకనగా అది గోజాతి సహజ లక్షణము కాబట్టి ఎక్కడనైనా నల్లని రంగుతోనున్న ఆవు ఉన్నచో అది ప్రత్యేక లక్షణము దానిని గోవు శబ్దము వ్యక్తపరచదు ఒక రూపము శాశ్వతమైనపుడు అది ఆ జాతిని చెప్పు శబ్దముతో శాశ్వత సంబంధము కలిగియుండును శబ్దములు వాని అర్థములు శాశ్వతములు అందువలన కొన్ని సమయములందు ఆ రెండు మనకు అపార్థము కలిగించవచ్చును అన్నారు ఎందుకనగా మానవుల ఉచ్చారణ దోషము వలన అది కలుగును "వేదములు ఉచ్చరించినవానికి ఆ దోషములు ఉండవు" అన్నారు మీమాంసకులు చెప్పిన శబ్దార్థ సంబంధము చాలా క్లిష్టమైనది, మిక్కిలి సూక్ష్మమైనది (subtle) వేదప్రమాణమునకు వేద శబ్దార్థ సంబంధమే మూలము అని మీమాంసవాదము అక్షరములననుసరించి ధ్వనులు కలుగును, ఆ ధ్వనులు శబ్దమును కల్పించును శబ్దమునందు కనబడు మార్పు మన ఉచ్చారణ దోషము వలనైనను కావచ్చును లేక మార్పు చెందినట్లు కనబడు ఆ శబ్దము వేరొక శబ్దం అయినా కావచ్చును కాని

శబ్దమందు మార్పు ఉండదు అని మీమాంసకుల నిర్ణయము వేదశబ్దములందు ఆ మార్పులుండవు, దోషములుండవు అక్షరముల నుండి స్వశక్తితో ధ్వనుల ద్వారా ఏర్పడినవి, శాశ్వతములు అయినవి వేదశబ్దములు

వేదములకు ఈశ్వరుడు కర్త అని మీమాంసకులు అంగీకరించరు వేదములు వాటి స్వశక్తితోనే ఉత్పన్నమై శాశ్వతములు అయినవి అని వారి వాదము ఈశ్వరునకు దేహము లేదు అందువలన ఇంద్రియములు లేవు అందుచే అతనికి వాక్కు ఉండదు అటులైన వేదవాక్యములను ఎటుల ఉచ్చరించగలడు వేదములను ఉచ్చరించవలయుననిన అతనికి ఇంద్రియములతో కూడిన భౌతిక శరీరము కావలయును భౌతికమైన మానవ దేహమును పొందినపుడు ఈశ్వరుడు భౌతికమైన జీవితావస్థలన్నిటికి లోనగును అపుడు ఈశ్వరుడు వేదవాక్యములు ఉచ్చరించినను అవి ప్రమాణములు కాలేవు కావున వేదములు ఈశ్వరునిచే గాని, మానవులచే గాని కల్పించబడినవి కావు సృష్టికర్త ప్రతికల్ప ప్రారంభమున గతించిన కల్ప జ్ఞాపకశక్తిచే వేదములను మరల వ్యక్తపరచును అని పురాణముల వచనములు కాని ఇచట ఒక సందేహమున్నది వేదమంత్రములకు కర్తలుగా ఆయా ఋషుల పేర్లు మంత్రములకు జోడించబడినవి అనగా ఆ వేదమంత్రములు మానవులు కల్పించినవి అని అర్థము వచ్చును గదా! దానికి సమాధానముగా స్వయంశక్తిచే ఉత్పన్నమైన ఆ వేదమంత్రములను ఆయా ఋషులు గ్రహించి ఇతరులకు చెప్పుటచే ఆ మంత్రములు ఆ ఋషుల నామములతో శాశ్వతములైనవి అన్నారు అంతేకాని వారు ఆ మంత్రములను సృష్టించలేదు అన్నారు మంత్రములు చెప్పునవి శాశ్వత సత్యరూపములు అందు జోడించబడిన నామములు వాస్తవనామములు కావు అవి ఏ ఋషులకు చెందినవి కావు అందుచే అవి చారిత్రకనామములు కావు అన్నారు ఉదాహరణకు విశ్వామిత్రుడు అనగా విశ్వామిత్రుడను ఋషి కాదు, విశ్వమునకంతటికి మిత్రుడు అని భావమే తప్ప అతడు ఒక ఋషి కాదు అని మీమాంసవాదము

ఒక వస్తువును చూచినపుడు వేరొక వస్తువు జ్ఞాపకమునకు వచ్చినపుడు ఆ రెండు వస్తువుల సామ్యము లేక పోలికయే దానికి కారణమగును అన్నారు ఈ సామ్యమునే 4 **ఉపమానము** అన్నారు ఉపమానము వలన వచ్చునది జ్ఞానము కాదు ఎందుకనగా అది ప్రత్యక్షము కాదు ఉపమానమందు ఆ సమయమున ఇంద్రియములతో సంపర్కము లేని వేరొక వస్తువును గురుంచి జ్ఞాపకముచే మాత్రమే మనము తెలుసుకొనుచున్నాము ఇది అనుమానము కాదు ఎందుకనగా ఇది తెలిసిన దానినుంచి తెలియనిదానిని ఊహించుట కాదు ఇచట ఊహించబడిన వస్తువు ఏదియు లేదు ఇక 5 **అర్థాపత్తి** అనగా మనకు ప్రత్యక్షముగా నున్న ఒక విషయమును గ్రహించుటకు మరొక విషయమును గురించిన భావము అవసరమగుట ఇది కూడ అనుమానము కాదు ఇచట మనకు వచ్చిన సందేహము మనకు ప్రత్యక్షముగా నున్న విషయమును గురించియే ఆ సందేహ నివృత్తి కొరకు మరొక భావన సహాయము తీసికొనుచున్నాము అనుమానమందు సందేహమునకు తావులేదు తెలిసిన విషయము నుండి తెలియని విషయమును ఊహించుటయే గదా అనుమానము దీనికి ఒక ఉదాహరణ చెప్పారు ఒక మనిషి ఇంట్లో లేడు ఇంట్లో కనబడుట లేదు కావున ఇంట్లో లేడు ఇది ప్రత్యక్షము ఏమైనట్లు? అను సందేహనివృత్తికి ఎక్కడికో వెళ్లి ఉంటాడని అనుకుంటాము కాని అతడు జీవించియే ఉన్నాడను భావనతోనే ఎక్కడికో వెళ్లి ఉంటాడని అనుకుంటాము అతడు జీవించి ఉన్నాడను భావనయే అర్థాపత్తి ఇక చివరిది 6 **అనుపలబ్ధి** - అనంతర కాలంలో మీమాంసవ్యాఖ్యాతలు అనుపలబ్ధిని ఒక స్వతంత్రమైన జ్ఞానప్రమాణముగా చెప్పారు రెండు వస్తువుల మధ్య సామ్యము లేకపోవుటయే భేదమగును ఒకచోట ఒక వస్తువు లేదు అని చెప్పినపుడు ఆ వస్తువును గురించి మనకు ముందే తెలిసి ఉండాలి అనగా ప్రత్యక్షముగా ఆ వస్తువు లేదు అను జ్ఞానమును పొందుచున్నాము ఆ వస్తువును గురించి తెలిసి ఉండకపోతే అది లేదు అను జ్ఞానము కలుగదు ఆ వస్తువు లేదు అనునది

ఒక భావము అదే అనుపలబ్ధి అన్నారు

పైన వివరించబడినవన్నియు జ్ఞానము కొరకు మీమాంసకులు చెప్పిన ప్రమాణములు మీమాంస జ్ఞాన సిద్ధాంతములో రెండు భిన్న శాఖలున్నవి అవి ప్రభాకర శాఖ, కుమారిలుని శాఖ ప్రభాకరుడు కుమారిల భట్టు మీమాంసకు భిన్న విధముల భాష్యము చెప్పుట వలన మీమాంసకులు రెండు శాఖలుగా విడిపోయారు ప్రభాకరుని సిద్ధాంతము ప్రకారం జ్ఞానం అనునది ఒక క్రియ ఈ క్రియయందు తెలిసికొనబడు విషయము, తెలిసికొనువాడు, అతని తెలివి (తెలిసికొనగల శక్తి) ఒకే సమయమున పనిచేయును “నేను దీనిని తెలిసికొనుచున్నాను” అనునది ఒక వాక్యము ఇందు తెలిసికొనబడునది ఇది (దీనిని), తెలిసికొనునది ‘నేను’, మరియు ‘తెలిసికొనుచున్నాను’ అనునది తెలివి ఇచట ‘నేను’ అనుటలో ఆత్మకు మనస్సుతో సంయోగము కలుగును జ్ఞానము అనగా ఇంతకు ముందు చెప్పిన ప్రమాణముల వలన కలుగునది, ఆత్మ మనస్సు సంయోగము వలననే కలుగును ప్రతి జ్ఞానక్రియయందు ఆత్మను గూర్చిన జ్ఞానముండును కాని అట్టి ప్రతి జ్ఞానక్రియయందు అనాత్మయైన విషయమును గూర్చి ఉండకపోవచ్చును ఆత్మను గూర్చిన జ్ఞానము ఆ క్షణమున ప్రత్యక్షముగానే యుండును అనుమానము నందు, స్మరించుకొనుట యందు విషయముతో ప్రత్యక్ష సంబంధముండదు అయినను పరోక్ష ప్రమాణముచే (indirect) కలుగు జ్ఞానము ప్రత్యక్షముగా మారవచ్చును అని ప్రభాకరుని అభిప్రాయము అట్టి జ్ఞానము ప్రత్యక్ష ఆత్మదర్శనము పొందినపుడు ఆత్మజ్ఞానమగును జ్ఞానము ఒక జ్యోతి అది ప్రకాశించుటకు ఇతర వస్తు సహాయము అవసరము లేదు అందువలన జ్ఞానము స్వయముగా ప్రకాశించి అందు గోచరించు విషయములను, వస్తువులను ప్రకాశించునట్లు చేయును మనస్సు, అది గ్రహించు విషయములు స్వయంప్రకాశకములు కావు కావున వాటికి స్వయంప్రకాశకమైన మరొకదాని సహాయము కావలయును అట్టి

సహాయమిచ్చునది స్వయంప్రకాశకమైన జ్ఞానము

జ్ఞానక్రియ స్వయంప్రకాశకమైనను అది వస్తువుల వలె కనబడదు జ్ఞానము వలన కనబడు రూపము వస్తువుల వలె గోచరములు కావు జ్ఞానరూపములు ఎక్కువగా అనుమాన ప్రమాణముచే కలుగునని ప్రభాకరుని వాదము మనకు ఒక విషయమును గ్రహించు శక్తి యున్నది ఆ శక్తి వలన జ్ఞానము కలుగునని అనుమాన ప్రమాణము చెప్పును ఇది యదార్థముగా తెలుసుకొనతగిన జ్ఞానమే యగును కాని సుఖదుఃఖముల వంటి అనుభవము కలిగించునది సంపూర్ణ జ్ఞానము కాదు ఒక విషయము అనగా వస్తువు యొక్క రూపము కనబడినపుడే దానిని గురించిన జ్ఞానము సంపూర్ణమగును ఇంద్రియములకు కనబడు వస్తువులకు మాత్రమే ఇది వర్తించును జ్ఞానము వలన ఏర్పడు రూపములు కనబడవు ఎందుకనగా వాటికి రూపములు ఉండవు అవి అనుమాన ప్రమాణము ద్వారా మాత్రమే తెలియును కాని అనుమానము వలన ఒక విషయము యొక్క రూపముకాని, స్వభావముకాని తెలియదు ఆ విషయము (వస్తువు) ఉన్నది అని మాత్రమే తెలియును జ్ఞానక్రియల వలన కలుగు రూపములు ఆత్మలో కలుగు పరిణామ ఫలితములు కావున అవి అనుమాన ప్రమాణముచే కలుగునని ప్రభాకర, కుమారిల మీమాంసలు చెప్పుచున్నవి ఆత్మజ్ఞానము ఇట్టి జ్ఞానక్రియారూపమే అన్నారు

జ్ఞానము రెండు విధములు అన్నాడు ప్రభాకరుడు అవి 1 ప్రామాణికమైన జ్ఞానము, 2 ప్రామాణికము కాని జ్ఞానము ప్రత్యక్ష అనుభూతి కలిగించునది ప్రామాణికము స్మృతి (స్మరణ) వలన కలుగునది ప్రామాణికము కాదు ఎందుకనగా స్మృతికి ఆ విషయమును గురించి పూర్వజ్ఞానము ఉండాలి దీనిని విషయముతో పరోక్ష సంబంధము అనవచ్చును (indirect) ఇట్టి సంబంధము గల జ్ఞానము యుక్తమైనది కాదు అన్నారు విషయముతో పూర్వసంబంధము లేని జ్ఞానము ప్రామాణికము అగును కాని ఇందు

దోషములు ఉండకూడదు అన్నారు జ్ఞానము యుక్తమైనదే, దానిని ప్రవృత్తి నడిపించును జ్ఞానము అంతా యుక్తమైనది అనుట సాధ్యము కాదు అని కొందరు అన్నారు

తడబాటుతో (విపర్యము లేక వ్యత్యాసముతో) కూడినది 'సత్' జ్ఞానము కాదు అన్నారు అనగా జ్ఞానము అంతా స్వయముగా ప్రకాశించునది కాదు ముత్యపుచిప్పను చూచి వెండిగా తలచుట స్వప్రకాశక జ్ఞానము కాదు రెండింటికి గల భేదము తెలిసికొను వివేకము లోపించినది దీనినే విపర్యము అన్నారు మన మనస్సునందు చిత్రింపబడునదే జ్ఞానము అగును ఇచట ముత్యపుచిప్పను వెండిగా తలచుట భ్రమకాదు ముత్యపుచిప్ప మనకు కనబడుచున్నది వెండి మనస్మృతి (జ్ఞాపకము) యందు ఉన్నది అది ముత్యపుచిప్ప అను భావము మన మనసున ప్రవేశించలేదు దృష్టియందున్న ముత్యపుచిప్ప, స్మృతియందున్న వెండి ఒకటి కాదు అయినను 'ఇది వెండి' అని నిశ్చయింపబడినది ఇందు దృష్టి విషయమైన ముత్యపుచిప్ప స్మృతి విషయమైన వెండి రెండును యదార్థములే కాని రెంటికి గల భేదవివేకము లోపించుటయే దీనికి కారణము ఇది ఇంద్రియదోషము అన్నారు ఈ వివేక లోపమే ప్రవృత్తికి (స్వభావమునకు) కారణమగును అన్నారు ప్రత్యక్షజ్ఞానమందు ఈ దోషము ఉండదు ఇంద్రియ దోషముతో కూడి వివేకము లోపించిన జ్ఞానము, ప్రత్యక్ష అనుభూతితో కూడిన జ్ఞానము రెండును కర్మను కలిగించును కాని కొన్ని మీమాంసశాఖలు ఈ జ్ఞానసిద్ధాంతమును అంగీకరించలేదు

కుమారిలుని జ్ఞానసిద్ధాంతము దీనికి కొంత భిన్నముగా నుండును సంచలనము కలిగించుట (movement or shaking) ఆత్మలక్షణము ఆ సంచలనమే జ్ఞానము అన్నారు దీని ఫలితముగా బయటనున్న వస్తువులను గురించిన వివేకము కలుగును జ్ఞానము ప్రత్యక్ష విషయము కాదు అని కుమారిలుడు అన్నాడు జ్ఞానము వస్తువును తెలియునట్లు చేయును ఆ

జ్ఞానముచే అనుమాన ప్రమాణము ద్వారా వస్తురూపము తెలియనగును అన్నాడు ప్రతిజ్ఞానము ఒక కర్మయే యగును అందు చూచువానికి, చూడబడు దృశ్యమునకు ఒక విధమగు సంబంధమున్నది ఇందు చూచువాని స్వభావము కొంత ఇమిడియుండును అన్నారు ఈ సంబంధము వలన ద్రష్ట అనగా చూచువాని కర్మను అనుమానము ద్వారా తెలుసుకొనవచ్చును ఈ కర్మనే జ్ఞానరూపము అన్నారు తెలియువానికి, తెలియబడు విషయమునకు గల సంబంధము వలననే జ్ఞానము లభించును ఇది మనస్సు నందు గోచరమగును అనగా తెలియువానికి, తెలియబడు వస్తువునకు మధ్య మనస్సు ప్రవేశించును ఈ మనస్సు లేనిదే ఆత్మకు విషయమునకు సంబంధము ఏర్పడదు మనస్సు అనగా చిత్తము ఆత్మకు అనాత్మయైన విషయమునకు సంబంధము కలుపును "అందువలన ఆత్మకు విషయమునకు కలుగు సంబంధము 'అంతర్బుద్ధి' విషయమనియు, దాని వలన జ్ఞానము యొక్క అస్తిత్వము తెలియును" అని ప్రభాకరుడు, కుమారిలుడు కూడ అన్నారు

ఉపకరణములలో దోషమున్నపుడు మనము పొందు జ్ఞానము ప్రమాణమును కోల్పోవును 'రజ్జు సర్పభ్రాంతి' ఇట్టిదే ఒక రజ్జువు (త్రాడు)ను సర్పముగా మనము భ్రమించి అనంతరము యదార్థము తెలిసికొనినపుడు మొదట కలిగిన జ్ఞానమును అనగా త్రాడు పాము అని కలిగిన భ్రమను తొలగించుదుము ఇచట మనకు కలిగిన జ్ఞానమునకు ఉపకరణము కన్ను అది పాముగా మనలను భ్రమింపజేసినది కామెర్ల జబ్బువానికి తెల్లటి ముత్తపుచిప్ప పచ్చగా కనబడును దోషము ముత్తెపుచిప్పది కాదు కంటిది అది మనము గ్రహించినపుడు దోషము తొలగిపోవును అందుచే ఉపకరణ దోషములను గ్రహించకలిగినపుడు సంశయమునకు స్థానముండదు దశలలో ఏర్పడు జ్ఞానము కూడ యదార్థ జ్ఞానము యగునని కుమారిలుని వాదము ముత్తెపుచిప్ప వెండియని భ్రమించినపుడు ఆ క్షణమున కలిగిన జ్ఞానము యదార్థమే యగును అన్నాడు తరువాత కలిగిన అనుభవముతో ఆ భ్రమ

తొలగిపోవుట మరియొక దశయగును అన్నాడు అటులే ముత్తెపుచిప్ప పచ్చగా కనబడుట, త్రాడు పాము అని భ్రమించుట ఆ క్షణమునకు యదార్థ జ్ఞానములే యగును విపర్యజ్ఞానం అనగా వ్యత్యాసముతో కూడిన జ్ఞానమునకు కారణము అసంపూర్ణ జ్ఞానము కావచ్చు లేదా అజ్ఞానము కావచ్చు కాని కేవలం దోషముతో కూడిన జ్ఞానము కాదు అని భావించారు దోషము లేనిది, అంతకు ముందు తెలియని విషయములను గురించిన జ్ఞానమే ప్రామాణికము అన్నారు ప్రామాణ్యము అనగా సాక్ష్యముతో కూడియుండుట జ్ఞానము యొక్క లక్షణము దానికి ఇతర జ్ఞానములతో వ్యతిరేకత ఉన్నది లేనిది తెలుసుకొనవచ్చును కాని ఇది జ్ఞానము యొక్క బాహ్యరూపమునే తెల్పును జ్ఞానము యొక్క ఆంతరిక స్వభావము తెల్పదు జ్ఞానక్రియలకు రూపములు ఉండాలి లేనిచో వాటి భేదములను తెలియుట అసాధ్యము అన్నారు జ్ఞానభేదము జ్ఞానమునకు సంబంధించిన విషయము ద్వారానే తెలియును గనుక విషయరూపమే జ్ఞానరూపము అగును అన్నారు కాబట్టి జ్ఞానమునకు జ్ఞానవిషయమునకు సంబంధించిన విషయమునకు సామ్యము ఉండును అన్నారు తెలియునది ఆత్మ తెలియబడునది వస్తువు ఆ రెంటికి సామ్యమున్నచో ఆత్మకు తెలియునది ఏమియు ఉండదు ఆ వస్తువును ఆత్మ తెలియునని చెప్పుటకు సాధ్యపడదు అన్నారు కాబట్టి జ్ఞానభేదమునకు కారణము రూపము ఒక్కటే కాదు ప్రతివ్యక్తికి ఒక జ్ఞానముండును అది వ్యక్తిజ్ఞానము ఆ జ్ఞానము ఆ వ్యక్తి ద్వారా విషయముతో సంబంధము పొందు స్వభావమును కల్పించును ఆ స్వభావ ప్రభావము ఏ వస్తువుపై పడునో ఆ వస్తువు మాత్రమే గ్రహింపబడును అన్నారు అదియే జ్ఞానభేదమునకు కారణమగుచున్నది అని మీమాంసకుల వాదము

సర్వజ్ఞానముతో అనగా పరమాత్మని సర్వజ్ఞత్వముతో జ్ఞానమునకు నిత్య సంబంధముండును జ్ఞానము యొక్క ప్రకాశకత్వము సర్వజ్ఞానము యొక్క నిత్యగుణము - జ్ఞానప్రవృత్తిచే వస్తువులు తెలుసుకొనబడును ఇందు

మనస్సుకు వాస్తవ ప్రపంచముతో గల సంబంధము కలిసియుండును మనస్సు కొన్ని విజ్ఞానసూత్రములననుసరించి పనిచేయును ఇది అనివార్యము 'ఇవి పాలు' అని చెప్పినపుడు అవి నిజముగా పాలు కాకపోయినను అవి పాలు అనియే తలచెదము ఆ క్షణమున ఆ భావము తప్పదు ఆ క్షణమున సంశయమునకు తావులేదు అది అప్పటికి సంపూర్ణముగా యదార్థమేయగును కావున కొన్ని సమయములందు మన నిర్ణయములు సత్యములు కావచ్చు అసత్యములు కావచ్చును కాని అవి అప్పటికి తప్పనిసరిగా సత్యనిర్ణయమే యగును 'భావనిర్ణయము' ఊహాప్రవాహము అని తలచకూడదు మన మనస్సునకు కనబడు దానిని మనము అంగీకరించక తప్పదు మనకు కనబడు ఈ జగత్తు మన మానసికమైన పనులను స్థిరపరచును మన మనస్సు చేయు ప్రతి భావనిర్ణయమందు మనకు కనబడునది ఆ సమయమున మనకు కనబడనిది ఇంకా కొంత మిగిలినది అని సూచన చేయబడును మనకు కనబడిన దానిని ఇంకను విస్తరింపచేయు కార్యము మన మనస్సు చేయు భావనిర్ణయమందు ఉండును కనబడు విషయమునకు అర్థము చెప్పునపుడు మన మనస్సు దానిని లోకమందు ఒక అంశము మాత్రమేయని నిర్ణయించును వస్తుప్రపంచము యదార్థమే యనునది మీమాంసకుల వాదమునందలి ప్రధానాంశము ఒక నిర్ణయము యొక్క ప్రమాణము మరికొన్ని ఇతర నిర్ణయములపై ఆధారపడి యుండునని కుమారిలుని వాదము మనము అనుభవించు ఈ జగత్తు యదార్థము దానికి మన మనస్సుకు గల సంబంధము అను సమస్యకు సమాధానము మీమాంసకులు వివరించలేదు మన మనస్సునకు బయటనున్న జగత్తు యదార్థమని మాత్రము మీమాంసకులు అంగీకరించారు మన మనస్సు భావములకు నిజమగు వస్తువులకు గల సామ్యము వలన ఏర్పడు క్లిష్టమైన ప్రశ్నలకు సమాధానములుగా సర్వ జ్ఞానమునకు (సర్వజ్ఞత్వము) గల రూపములు సహజ ప్రమాణముల వంటివి అన్నారు ఇది మీమాంసకులు చెప్పిన ప్రతిపాదన

వేదములు చెప్పిన విధులను నిర్వర్తించినచో ఆ కర్మల ఫలము మరొక లోకములో లభించును అని మీమాంస సిద్ధాంతము ఆ ఫలము అనుభవించుటకు మరణానంతరము జీవించియుండగల ఒక శరీరము అవసరమున్నది లేనిచో మీమాంస చెప్పిన వేదకర్మలు నిష్ఫలములగును యజ్ఞకర్మ చేసినవాడు స్వర్గమునకు పోవును అన్నారు మరణానంతరము ఈ భౌతిక శరీరము శిధిలమైపోవును గదా! మరి స్వర్గమునకు పోవునది ఏది? అది ఆత్మ అయి ఉండవలయును ఆత్మకు గూర్చి జైమిని ప్రత్యేక వివరణ ఇవ్వలేదు కాని శబరుని మీమాంస భాష్యము ఆత్మను గూర్చి కొంత చెప్పినది ఆత్మ అనబడు పురుషుడు బుద్ధి, ఇంద్రియముల కంటే భిన్నమైనవాడు అతడే ద్రష్ట అనగా చూచువాడు అతడు ఇతరుల దృష్టికి కనబడడు జ్ఞానస్వరూపమే ఆత్మ అన్నారు ఆత్మ ఆత్మకే అనగా పురుషునికే తెలియును అని చెప్పారు, అనగా పురుషుని పురుషుడే ఎరుగును పురుషుడు అనగా లింగభేదము చెప్పు శబ్దము కాదు

స్థూలశరీరము శిధిలమైనను ఆత్మనాశము కాదు కావున ఆత్మ యనగా ఇంద్రియములు కాదు మనకున్న ఇంద్రియములు విడివిడిగా పనులు చేయును వాటిని సమన్వయపరచుటకు శరీరమందు ఒక శక్తి యుండవలయును గదా! స్థూలశరీరము భౌతికము దానికి భిన్నమైనవాడు, దాని ద్వారా విషయములను గ్రహించువాడు ద్రష్ట మన శరీర భాగములు విడివిడిగా జడములు అవి చైతన్యములు కావు అందుచే అవి కలిసినను చైతన్యము కావు జన్మకు రూపమైన ఈ దేహమునకు ఒక ధ్యేయమున్నది ఆ దేహమును ధ్యేయము వైపుకు నడుపునది ఆత్మ ఆత్మ దేహమును ఒక పరికరముగా లేక ఉపకరణముగా (instrument) గ్రహించును అన్నారు జన్మ పునర్జన్మల పరంపరలో ఆత్మకు కూడ పరివర్తన కలుగును అన్నారు అయినను ఆత్మ స్థిరముగానే యుండునన్నారు ఈ పరివర్తన ఆత్మ శాశ్వతత్వమునకు భంగము కలిగించదు

భావ పరంపరల రూపమే ఆత్మయని బౌద్ధ సిద్ధాంతము దానిని కుమారిలుడు తిరస్కరించెను కర్మఫలము ఒక నియమమును బట్టి అ౯ ౧వములోనికి వచ్చును అదే పునర్జన్మకు కారణము అగును కాని బౌద్ధులు ఈ రెంటిని వివరించలేదు ఒక భావము నుండి కలిగిన సంస్కారము ఆరువాత భావమును కలుగజేయును అని బౌద్ధవాదము కాని ఈ భావ పరంపరను కలుపు సూత్రము లేక ఆధారము ఒకటి ఉండవలయునని కుమారిలుని వాదము లింగదేహము దీనికి సమాధానము కాజాలదు ఎందుకనగా భావములకు లింగదేహమునకు గల సంబంధము తెలియజాలము కావున భావసామర్థ్యము కలది, పునర్జన్మ పొందునది అయిన ఒక ఆధారము కావలయును అదియే ఆత్మ అని మీమాంసకుల నిర్ణయము ఆత్మ అంతటా వ్యాపించి యుండును జన్మజన్మల దేహములతో సంబంధము పొందును అది కర్మ చేయును కర్మ యనగా అణువుల చలనము ఆత్మ తన శక్తిచే శరీరమును చలింపచేయును వ్యక్తి ప్రవృత్తికి అతని ఆత్మ కారణము వ్యక్తులు అనేకులు అటులే ఆత్మలు అనేకములు వ్యక్తి గుణములందు భిన్నత్వముండుటకు ఆత్మల అనేకత్వమే కారణమని మీమాంసకులు అంగీకరించారు సూర్యుడు ఒక్కడే కాని అతడు భిన్న వస్తువులలో భిన్నముగా ప్రతిఫలించును ఈ భిన్నత్వమునకు కారణము సూర్యుడు కాదు వస్తువులు అటులే వ్యక్తుల భిన్నత్వము వారి దేహములదే కాని ఆత్మలది కాదు అనగా ఆత్మ ఒకటే కాని దేహములు భిన్నములు అయినను సుఖదుఃఖములు ఆత్మకు సంబంధించినవే ఆత్మ ఒకటే అయినను భిన్నదేహములలో అనేకముగా నుండును

జ్ఞానము ఒక క్రియ అని ప్రభాకరుని సిద్ధాంతం ఆ క్రియ వలన ఒక అనుభూతి కలుగును ఆ అనుభూతి సుఖదుఃఖములుగా నుండును ఆ సుఖదుఃఖముల అనుభవమునకు ఒక ఆశ్రయము కావలయును గదా! ఆ ఆశ్రయ స్వరూపమే ఆత్మయనియు, దానికి చేతనత్వము లేదనియు ప్రభాకరుని

వాదము ఆత్మయున్నదను ప్రత్యక్ష సాక్ష్యము లేదు అనుభవముల పరంపరలో గత అనుభవమును గుర్తించగల శక్తి మనకి ఉన్నది ఆ శక్తి ఆత్మదే అని తెలియుచున్నది ఇదే ఆత్మను గురించి పరోక్ష (indirect) సాక్ష్యము ఆత్మ సర్వవ్యాపి మార్పు చెందనిది అయినను అది స్వయంప్రకాశకము కాదు అన్నారు నిద్రలో కూడ ఆత్మయుండును కాని మనకు జ్ఞానము ఉండదు ఆత్మకు స్వరూపము లేదు కాని 'నేను అనగా ఆత్మ అనియే భావము అందువలన ఆత్మకు దేహముతో సంబంధమున్నది జ్ఞానక్రియకు అది కర్తగానే తెలియును కాని ఆత్మకు ప్రత్యేకముగా కర్మఫలము ఉండదు అది దేహము ద్వారానే కలుగును బయట, లోపల కూడ ఆత్మ కనబడదు ఆత్మకు ప్రత్యేకముగా వివేకము లేదు అన్నారు అయినను ఆత్మ సర్వవ్యాపి అది బుద్ధి, ఇంద్రియములు దేహమునకు భిన్నమైనది అది శాశ్వతమైనది అన్ని జ్ఞానరూపములచే అది తెలియును ఆత్మ పరిమాణము అణువు కాదు, భౌతికదేహమూ కాదు అన్నాడు ప్రభాకరుడు ఆత్మ సర్వవ్యాపి అయినను తన పూర్వకర్మఫలమునననుసరించి వచ్చు దేహమునందు మాత్రమే విషయములను అది అనుభవించును దేహమునకొకటిగా ఆత్మలు అనేకములు

ముక్తి కలిగినపుడు ఆత్మ శుద్ధ స్థితి యందు ఉండును ఆ స్థితి యందు అన్ని వస్తుజ్ఞానములకు ఆశ్రయమగును అయినను సుఖదుఃఖములు దేహమున్నంత వరకు ఉండును గదా! ముక్తి స్థితి పొందిన ఆత్మకు వాటితో సంబంధముండదు అవి దేహమునకు మాత్రమే సంబంధించి యుండును ఆత్మ ఎందువలన ఏర్పడినది కారణము తెలియుట సాధ్యము కాదు అందువలన ఆత్మ ఏర్పడుటకు కారణము లేదనే చెప్పాలి కారణము లేనపుడు ఆత్మకు నాశము కూడ లేదు ఆత్మ ఆత్మజ్ఞానమునకు విషయము అని చెప్పారు ఏదో ఒక జ్ఞానప్రమాణముచే వస్తువులు తెలియుచున్నవి అటులే ఆత్మకూడ జ్ఞానప్రమాణముచే తెలియవలెనని చెప్పారు కాని ఆ జ్ఞానమునకు కర్త ఎవరు? ఆత్మయే కర్తయగును కదా! అపుడు ఆత్మ ఒక

విషయము అగుటకు వీలులేదు విషయము అనగా తెలియబడిన ఒక అంశము లేక గోచరమగు ఒక వస్తువు ఆత్మ ఒకే సమయమున కర్త మరియు కర్మ కూడ కాజాలదు అని ప్రభాకరుడు అభిప్రాయపడ్డాడు అనగా ఆత్మ తెలియువానిగాను తెలియబడిన విషయము (వస్తువు)గాను ఉండదు కాని మరికొందరు ఇది సాధ్యము అన్నారు అనగా ఆత్మ ప్రత్యక్షజ్ఞానము లేక అనుభూతికి కర్త మరియు ఆ అనుభూతికి కారణమైన విషయము (వస్తువు) కూడ కావచ్చును అనుటలో వైరుద్ధ్యము లేదు అన్నారు జ్ఞానము పొందుట అను క్రియ వలన ఆత్మ తెలియును అని ప్రభాకరుడు అన్నాడు ఆత్మచైతన్యము అనగా జ్ఞానము లేక తెలివి అగుటయేగాక చైతన్యము కలిగించు వస్తువు కూడానని ప్రభాకరుని భావము అయి ఉండును అని అనంతర మీమాంసకులు అభిప్రాయపడ్డారు ఆత్మ కర్తయే కాని విషయము (వస్తువు) కాదు అనే ప్రభాకరుని వాదముగా కనబడును దానికి ఒక ఉపమానం చెప్పారు నడచుచున్న ఒక వ్యక్తి నడచుట అను క్రియ (కర్మము)కు కర్త ఆ కర్మము అతనిదే కాని అతడు నడక అను విషయము కాదు అనగా నడక క్రియారూపమైన ఒక విషయము కాదు దానిని అతడు నిర్వహించును కాని అదే అతడు కాదు

ఆత్మ గోచరమగు అంశము అనగా చైతన్యము, జ్ఞానము (conscious) ఒకటి కాదని భావించుటచే ఆత్మ స్వయంప్రకాశకము కాదు అని ప్రభాకరుడు చెప్పవలసి వచ్చెనను అభిప్రాయము సమర్థనీయము కాదు అని విమర్శకులు చెప్పుచున్నారు ఆత్మ జ్ఞాత అనగా తెలియునది (తెలిసికొనునది) ప్రభాకరుడు ఆత్మనే జ్ఞానము అని కూడ అన్నాడు ఆత్మ మనస్సుకు కనబడు ఒక విషయము అని కుమారిలుని వాదము దానిని తిరస్కరించుచు కొందరు మీమాంసకులు ఆత్మకు స్వయంప్రకాశమున్నదని, బయటనుండు వస్తువులను గురించిన జ్ఞానముతో సంబంధము కలిగియుండునని అందుచే అది అచేతనము కాదనియు అది వస్తుజ్ఞానమునకు ఆశ్రయరూపము అన్నారు 'సంవిత్తు'కు అనగా వస్తువు తెలియు లక్షణమునకు స్వయంప్రకాశమున్నదని, కాని అది

స్వయముగా విషయము కాదు అన్నారు జ్ఞానక్రియ లేక ప్రజ్ఞ అనగా గ్రహణశక్తి ఆత్మ యొక్క పరిణామ రూపము (modifications) అని చెప్పారు కావున 'సంవిత్తు' అనగా వస్తువు తెలియు లక్షణము ఆత్మ స్వభావమే యగును అన్నారు వస్తువు తెలియుట జ్ఞానరూపముగా మార్పు చెందుటకు ఆత్మస్వభావమే కారణము కావున సంవిత్తు అనగా ఆత్మ అనియే అర్థము చెప్పవచ్చును ఆత్మ ఆత్మకు విషయము కాలేదు అయినను ఆత్మ అచేతనము కాదు 'నేను' అనగా ఆత్మయనియే యర్థము అన్ని జ్ఞానములకు అదియే ఆధారము, అదియే కర్త ఆత్మ ద్రవ్యము కాదు గుణము కాదు కర్మ కూడ కాదు 'సంవిత్తు' స్వరూపమే ఆత్మ అన్నారు అహంకారముతో కూడినపుడు 'అహం' (ego) ఏర్పడి భ్రాంతి కలుగును ఇది అద్వైత సిద్ధాంతము గాఢమైన నిద్రయందు ఆత్మకు అహంకార బంధములుండవు అపుడు 'అహం' కలుగదు సర్వవ్యాపియగు ఆత్మ వస్తువును గురించిన జ్ఞానమునందు ఆ వస్తుజ్ఞానమునకు తగిన లక్షణముతో కనబడును అని ప్రభాకరుడు అన్నాడు 'నేను' 'నాది' అను మాటలు 'ఆత్మను గురించిన మిధ్యాభావములు' వాటిని సర్వసంగ పరిత్యాగికి చెప్పవలయును గాని, సంసారబంధములందు తగుల్కొని యున్న వానికి కాదు అని ప్రభాకరుడు చెప్పాడు

ఆత్మ శరీరము కంటే భిన్నమైనది అని కుమారిలుడు అన్నాడు ఆత్మ చిత్త (జ్ఞానము) స్వరూపము అనగా జ్ఞానస్వరూపము జీవాత్మలు అనేకము కాని వాటి స్వభావము ఒకటే అందువలనే **ఆత్మ ఒకటేయని ఉపనిషత్తులు చెప్పుచున్నవి** జ్ఞానము ఆత్మలక్షణము అని రామానుజుడు కూడ అంగీకరించాడు కాని జ్ఞానము ఆత్మ యొక్క పరిణామరూపము, అది ప్రమాణములచే తెలియును అని కుమారిలుని వాదము 'అహం' అను భావము వలన ఆత్మ ఉన్నదని ఊహింపబడినది ఆత్మ మనస్సుకు ప్రత్యక్ష ప్రమాణము ఇతరులకు అది కనబడదు బాహ్యవస్తువులు ప్రత్యక్షములే

కదా! అటులే ఆత్మజ్ఞాన విషయమునకు అది ప్రత్యక్షముగనున్న వస్తువేయగును జ్ఞానమునకు ఆత్మకర్త మరియు వస్తువు (విషయము) కూడ అగును ఆత్మయంధు రెండు అంశలున్నవి అన్నారు జ్ఞానమునకు సంబంధించిన విషయరూపములో ద్రవ్య అంశగా అనగా 'పదార్థ అంశ'గా నుండును జ్ఞానమును తెలియునదిగా లేక చూచునదిగా 'బోధ అంశగా' నుండును అన్నారు కాని ద్రవ్యము అచేతనము అది ఆత్మయందు ఉండలేదు అని కొందరు పై వాదమును తిరస్కరించారు వాస్తవమునకు ఆత్మ 'చిత్' (జ్ఞాన) స్వరూపమే అది కర్తయేయగును గాని వస్తువు (విషయము) కాదు ఒకే సమయమున ఆత్మ కర్తగాను, విషయముగాను పరిణామము చెందదు జ్ఞానము విషయము (వస్తువు) ద్రవ్యము (పదార్థము) అయినచో ఆత్మ కూడ ద్రవ్యమే కావలయును కాని కర్త కాలేదు దీనికి సమాధానముగా కుమారిలుడు జ్ఞానము రెండు విధములు అన్నాడు శుద్ధజ్ఞాన స్వరూపముగా ఆత్మ కర్తయగును వ్యావహారిక జ్ఞానస్వరూపముగా ఆత్మ విషయము అగును అన్నాడు అపుడు అది మూడు విధములగుచున్నది 1) శుద్ధ విషయమును (జ్ఞాన విషయము) గ్రహించుట 2) శుద్ధజ్ఞాత (ఆ విషయము తెలియువాడు లేక గ్రహించువాడు) 3) జ్ఞాతయే విషయముగా పరిణామము చెందుట ప్రతి జ్ఞానక్రియ యందు ఆత్మ ప్రత్యక్షజ్ఞాత (తెలియువాడు లేక గ్రహించువాడు)గా కనబడును కావున ఆంతరికముగా ఆత్మ ప్రత్యక్షదర్శనమును ఊహించవలసిన అవసరము లేదు

ఆత్మయే జ్ఞానరూపమైనపుడు, ఆత్మ అచేతనము కాదు ఆత్మ 'చిత్' (జ్ఞాన) స్వరూపమైనపుడు దానికి సహజ స్వంతస్థితి యుండును అందుచేదాని అస్తిత్వము (ఉన్నది అను అభావము) స్థిరపడును అన్ని ప్రమాణములు దాని అస్తిత్వమునకు సాక్ష్యరూపములగును జ్ఞానమునకు విషయముతో వృత్తి వలన (స్వభావము వలన) సంబంధము ఏర్పడునని కుమారిలుని అభిప్రాయము ఆత్మయందలి చిత్ (అజ్ఞాన) అంశ అంతఃకరణము అయి

ఉండవచ్చును అన్నారు అంతఃకరణము ద్వారానే ఆత్మ స్వభావము (వృత్తి)గా పరిణామము చెందును జ్ఞానము సంబంధించినంతవరకు ఆత్మ కర్తయు, విషయము కూడ కావచ్చును కాని దాని భావము ఆత్మయందు జ్ఞాన, అజ్ఞాన అంశలున్నవని కాదు అన్నారు ఈ విధముగా ఆత్మను గూర్చి ఒక యదార్ధమైన శ్రేష్ఠమైన భావమును ప్రభాకరుడు, కుమారిలుడు కూర్చలేకపోయిరనే చెప్పవలయును జైమిని మాత్రము ఆత్మను గూర్చి ఎట్టి ప్రమాణములు చూపక వేదాంత సిద్ధాంతమునే అంగీకరించినట్లు కనబడును

జగత్తు మిధ్య అను వాదమును మీమాంసకులు అంగీకరించరు ప్రపంచము యదార్ధమైనది అది యదార్ధము అనునది ఒక భావము కాదు అందు దాని వాస్తవికత దానిని చూచువాని మనస్సుపై ఆధారపడియుండదు ఇది మీమాంస ప్రధానాంశము దీని ఆధారముతోనే మీమాంస తత్వమునందు యజ్ఞకర్మలు ప్రధాన స్థానము పొందినవి భావములకు ఆధారము ఉండదు అను **నిరాలంబనవాదమును**, బాహ్యజగత్తు వాస్తవము కాదు అది అంతా శూన్యము అను **శూన్యవాదమును** కుమారిలుడు తిరస్కరించాడు మీమాంసకులు చెప్పిన ప్రత్యక్ష ప్రమాణముననుసరించి వస్తు ప్రపంచము వాస్తవము వస్తుప్రపంచముతో సంబంధము వలన వస్తు ప్రత్యక్ష దర్శనముకలుగును 'చూచుచున్నాను' అనగా వస్తువు చూచుచున్నాను అని అర్ధము గాని జ్ఞానక్రియను (cognition) కాదు జ్ఞానక్రియ అనుమాన పద్ధతిన ఊహించబడును కాని దర్శనము అనగా ప్రత్యక్షముగా వస్తువును చూచుట జ్ఞానము స్వయముగా ప్రకాశించును జ్ఞానమునకు ఆధారమైన వస్తువు యదార్ధము కానిచో జ్ఞానము ప్రకాశించజాలదు జీవితమందలి అనుభూతులకు వాస్తవ ప్రపంచము ఉండుటయే కారణము ప్రపంచము మన భావ పరంపరల రూపమే తప్ప యదార్ధము కానిచో మన అనుభవములన్నియు అసత్యములగును బాహ్యప్రపంచము యదార్ధమగుట వలననే జ్ఞానక్రియ జరుగును బాహ్యప్రపంచ వాస్తవికతకు ఆధారములున్నవని తెలియుట

జ్ఞానము ఆ జ్ఞానము అనంతర జ్ఞానముచే వ్యతిరేకించబడలేదు యోగదృష్టియందు బాహ్య ప్రపంచము అసత్యముగా కన్పడును అను వాదమును ఖండించుటకు కుమారిలుడు యోగదృష్టి ప్రమాణము కాదు అన్నాడు అంతియేగాక కొందరు యోగుల దృష్టిలో బాహ్యప్రపంచము వాస్తవముగానే కనబడును అన్నాడు

ఒక వస్తువును దాని గుణముల నుండి విడదీయలేము వస్తువునకు దాని గుణములతో నుండు సంబంధము సమవాయసంబంధమనబడును సామాన్యము, విశేషము కూడ సమవాయ సంబంధము కలిగియుండును (universal and particular) అనగా అంతర్గత సంబంధము యుండును ఒక వ్యక్తి జన్మించినపుడు అతనికి సమవాయ (inherence) సంబంధము ఏర్పడును అదే ఆ జాతి ఇతర వ్యక్తులతో గల సంబంధము ఆ వ్యక్తి మరణించినపుడు సమవాయబంధం కూడ నశించును కాని ఈ సమవాయము శాశ్వతము కాదు నశించు వస్తువులందు కూడ ఈ సంబంధము ఉండును ఎన్ని వస్తువులుండునో అన్ని సమవాయి సంబంధములుండును వస్తు స్వభావము ననుసరించి ఆ సంబంధముండును ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యములను ద్రవ్యములు ఒక శక్తి వలన వస్తువునకు కారణమగుచున్నవి దానినే శక్తి అన్నారు ఈ శక్తి అది కలిగించు ఫలితములను బట్టి ఎరుగనగును నిత్యమైన వస్తువులలో నిత్యముగాను అనిత్యమగు వస్తువులలొ అనిత్యముగాను ఈ శక్తి ఉండును కారణములో ఒక అదృష్టశక్తి ఉన్నదని, అది కార్యమును కలిగించును అను అభిప్రాయమును నైయాయికులు అంగీకరించలేదు ఎందుకనగా ఆ శక్తి ప్రత్యక్ష విషయము (వస్తువు లేక పదార్థము) కాదు, అనుమాన విషయము కాదు అన్నారు ద్రవ్యము అనగా పదార్థము (substance) గుణములతో కూడియుండును ద్రవ్యములు తొమ్మిది 1) భూమి, 2) నీరు, 3) వాయువు, 4) అగ్ని, 5) ఆకాశము, 6) ఆత్మ (జీవాత్మ), 7) మనస్సు, 8) స్థలము (space), 9) కాలము కుమారిలుడు చీకటిని, శబ్దమును కూడ

ద్రవ్యములే అన్నాడు భూమి, నీరు, అగ్ని, వాయువులకు రూపము (రంగు) స్పర్శగుణములున్నవి అందుచే అవి కళ్లు, చర్మ ఇంద్రియములకు సంబంధించిన విషయములు ఇతర ద్రవ్యములు ప్రత్యక్షములు కావు అనుమాన ప్రమాణముచే (inference) తెలియును ఆకాశము యొక్క తెలుపు అందున్న అగ్నికణముల వలన కలుగును శబ్దము ఆకాశమును ఆశ్రయించి యుండునని అనుమాన ప్రమాణము (inference) చే చెప్పారు వాయువును ఉష్ణముగాను శీతము (hot or cold) గాను కూడ ప్రభాకరుడు పరిగణించలేదు అగ్నికణములు, జలకణములు అందుండుటచే వాయువు శీతముగాను ఉష్ణముగాను తోచును వాయువు చర్మ ఇంద్రియమునకు గోచరించును అనగా స్పర్శచే కనబడును అన్నారు ద్రవ్యములు వాటి గుణములను గురించి ప్రభాకరుడు, కుమారిలుడు చెప్పినది వైశేషిక సిద్ధాంతమును పోలియున్నది సృష్టికి ఆది, పూర్తిగా అంతము ఉన్నదని మీమాంసకులు అంగీకరించలేదు

ఉచితమైన జీవిత మార్గమును తెలుపునది ధర్మము సరియగు మార్గమున మనిషిని నడిపించుటయే ధర్మము యొక్క లక్షణము ఈ లక్షణము చోదనము అనబడును చోదనము అనగా ఆంతరికముగా కలుగు ప్రేరణ కర్మమునకు ప్రేరణ ధర్మవాక్యముల వలన కలుగును ఈ ప్రేరణ వలన మనస్సుకు నచ్చినది బయట నుండి వచ్చు విధ్యుక్త కర్మతో ఏకీభవించును విధ్యుక్త కర్మ మిక్కిలి సుఖము నిచ్చునని మీమాంస భాష్యకారులు చెప్పారు పూర్వమీమాంస ధ్యేయము సుఖము అది ఇచట కాకున్నను ఆ సుఖము కొరకే కర్మకాండలు అని మీమాంస లక్ష్యము పరలోక సుఖము కొరకు ఈ లోక సుఖమును త్యాగము చేయవలెను విధ్యుక్తమైనదే ధర్మము అన్నారు అదియే సుఖమునకు మార్గము విధ్యుక్త ధర్మములు అనగా వేదముచే చెప్పబడిన విధులు (duties) పూర్వమీమాంస చెప్పు ధర్మములు వేదముల నుండి గ్రహింపబడినవి వేదము చెప్పినదే సత్కర్మయగును ఎప్పుడైనను

స్మృతివాక్యము శృతి (వేదము) వాక్యములకు భిన్నముగానున్నచో శృతి వాక్యములనే గ్రహించవలయునని మీమాంస చెప్పును స్మృతులలో ఒకప్పుడు స్వార్థపరత్వము ఉండవచ్చును అపుడు వాటిని విడువవలయును సదాచారమునకు కూడ మీమాంస స్థానము కల్పించినది హిందూమతములో ధర్మనిర్ణయములకు జైమిని మీమాంస సూత్రములు అత్యంత ప్రాధాన్యము వహించినవి నిత్యకర్మలు, నైమిత్తిక కర్మలు కూడ ముక్తికి అవసరము అన్నారు వాటిని నియమములు అన్నారు ప్రత్యేకమైన కోరికలకు కామ్యకర్మలు విధించారు నిషేధించబడిన కర్మలు చేయకూడదు సాధ్యమైనంత వరకు కామ్యకర్మలు చేయకుండుటయే మంచిది అని చెప్పబడింది

యజ్ఞకర్మలు చేయుటకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులముల వారికే అర్హత ఇచ్చారు ఇది జైమిని నిర్ణయము ఆ మూడు వర్ణముల వారిని ద్విజులు అన్నారు అప్పటికే సర్వవర్ణముల వారు యజ్ఞములు చేయవచ్చునను వాదన ఉన్నట్లుగా తెలియుచున్నది శూద్రులకు వేదార్హత లేదు కావున వారు యజ్ఞకర్మలు చేయకూడదని జైమిని వాదన యజ్ఞకర్మలలో చెప్పబడు విధి శబ్దములు యజ్ఞఫలము పొందుటకు శక్తి కలిగించును అన్నారు మీమాంసయందు మానవ ప్రయత్నమునకు కూడ స్థానమీయబడినది ఎందుకనగా పురుష ప్రయత్నమున్నపుడే కర్మల యందు బాధ్యత ఏర్పడును కర్మసిద్ధాంతం వ్యక్తి స్వేచ్ఛకు ఆటంకము కాదు అని మీమాంసకుల అభిప్రాయం మొదటి అడుగు మానవ ప్రయత్నము దానిని అనుసరించి మిగిలినవి కర్మసూత్ర ప్రకారమే జరుగును వేదములు చెప్పు నియమములను అధిక సంఖ్యాకులు సమర్థించుటచే వాటికి ప్రామాణ్యమున్నదని తెలియును అని కుమారులుని వాదన ధర్మనిర్ణయమందు వేదవాక్యములదే తుదినిర్ణయము

కర్మకాండలు జడములు (అచేతనములు) కావున వాటిని వేదాంతము తిరస్కరించినది కర్మకాండలు ప్రధానముగా యాంత్రికములు ముక్తికి అట్టి

కర్మలు సాధనములు కాజాలవు అట్టి కర్మలు మూఢవిశ్వాసములకు దారితీయును ఎన్ని యజ్ఞములు చేసినను ఆంతరిక పరివర్తనము లేనిచో అవి నిష్ప్రయోజనములగును యజ్ఞమందు నేయి మాత్రమే అగ్నికి ఆహుతి చేసిన ప్రయోజనము లేదు స్వార్థమును కూడ హోమము చేసినపుడే వేదములు చెప్పిన శ్రద్ధ, భక్తి ఏర్పడును కాని వాస్తవమునకు యజ్ఞకర్మలలో వీటికి ప్రాధాన్యములేదు యజ్ఞములు కోరికలతో కూడినవి కావున పరమేశ్వరార్పణ బుద్ధి ఉండదు ఈ లోకమున కానిచో పరలోకమున సుఖము ఉండునను వాంఛతో యజ్ఞములు జరుపబడుటచే నిష్కామకర్మకు మీమాంస యందు స్థానము లేదు యజ్ఞకర్మలే మీమాంస యందు హెచ్చు ప్రాధాన్యము పొందియుండుటచే మానవ జీవితములో మిగిలిన అధికభాగమును గురించి ప్రస్తావన లేదు

కర్మలు ఫలము కొరకే చేయబడును అవి అందుకే ఉద్దేశించబడినవి కావున కర్మకు దాని ఫలమునకు ఒక సంబంధం ఉండాలి ఈ సంబంధమునే మీమాంసకులు 'అపూర్వము' అన్నారు అపూర్వము అనగా అంతకు ముందు లేనిది ఒక కర్మ చేయబడిన తరువాత ఎపుడో ఫలితమునిచ్చును కాని అది గతించుటకు ముందు అనగా గతకర్మ అగుటకు ముందు ఏ రూపమున ఉండును? ఆ రూపమునే 'అదృష్టము' అన్నారు అదృష్టమునే ఒక శక్తి అని జైమిని చెప్పాడు ఆ 'అదృష్ట శక్తి'కే 'అపూర్వము' అని జైమిని ఇచ్చిన పేరు కర్మ గతించుటకు ముందున్న స్థితిని గాని, కర్మ పూర్తి అయిన తరువాత ఆ కర్మస్థితిని గాని 'అపూర్వము' అనవచ్చునన్నారు యజ్ఞకర్మల ఫలము కాలాంతరమున కలుగునన్నారు 'అపూర్వ' సహాయము లేనిది ఆ ఫలము సిద్ధించదు అని జైమిని వాదన కర్మఫలము ఇచ్చునది ఎవరు? పరమేశ్వరుడు కాదు అని మీమాంసకుల వాదము

కర్మ చేయుటకు ముందు కర్తయందు గాని, కర్మయందు గాని

లేనట్టిది, అటు తరువాత ఉండునది అయిన ఒక శక్తియే అపూర్వము అని కుమారిలుని నిర్వచనము అపూర్వము కర్మనుండియే పుట్టును ఫలమునకు అది ఒక ఉపకరణమగు శక్తి యజ్ఞం చేసినపుడు యజ్ఞకర్త యందు ఒక శక్తి జనించును ఆ శక్తి అతని యందు జీవితాంతము ఉండి అనంతర కాలమున ఆ యజ్ఞఫలమును అతనికి అందజేయును ఈ శక్తియే అపూర్వము గదా! అది శరీరములో ఎచట ఉండును? అది ఆత్మలో ఉండదు అని ప్రభాకరుని అభిప్రాయము ఆత్మ సర్వవ్యాపి అగుటచే అది క్రియ చేయదు కర్మ కర్త యందు శక్తిని కలిగించునని ప్రభాకరుడు అంగీకరించలేదు యజ్ఞము వలన అట్టి శక్తి కలుగుననుటకు ప్రమాణములు లేవు అన్నాడు అందుచే ఫలమును ఇచ్చు 'అపూర్వ' శక్తి కర్మ యందే ఉండవలయును గాని కర్తయందు కాదు అని అతని వాదన ఇచట కర్మకు కార్యమునకు భేదము చెప్పాడు యజ్ఞము అనునది ఒక కర్మ ఆ యజ్ఞము చేయుటను కార్యము అన్నాడు అందువలన ఫలమునకు కర్మ ప్రత్యక్ష కారణము కాదు అని వాదన కర్మము చేయుట ఒక పని లేక పరిశ్రమ ఆ పనినే కార్యము అన్నారు కర్మ కర్తయందు ఈ కార్యమును నియోగించునని ప్రభాకరుని నిర్వచనము కర్తయందు కార్యము జనింపజేయుటను నియోగము అన్నాడు ప్రభాకరుడు ప్రభాకరుని నిర్వచనము సులభముగా అర్థము కాదు

అపూర్వ సిద్ధాంతమును కొంతమంది తిరస్కరించారు ఎందుకనగా అది నిత్యముకాదు అన్నారు అది నిత్యమైనచో పాపపుణ్యములు నిత్యములే అగును అపూర్వము ఏ రూపమున వ్యక్తమగునో తెలియదు అపూర్వశక్తి ఒకటియా లేక అనేకమా తెలియదు వ్యక్తులు అనేకులు, కర్మలు వ్యక్తిని బట్టియే యుండవలయును గదా! అపూర్వ శక్తి కనబడదు కాని ఫలసిద్ధి రూపమున బయట పడినపుడు అంతకు ముందు ఎచట దాగియున్నదో తెలియదు అపూర్వము నిత్యమైనను భిన్నవ్యక్తులలో భిన్నముగా నుండును అనినను అది ఎట దాగియుండనో తెలియదు అపూర్వము అచేతనము

కర్మలు సాధనములు కాజాలవు అట్టి కర్మలు మూఢవిశ్వాసములకు దారితీయును ఎన్ని యజ్ఞములు చేసినను ఆంతరిక పరివర్తనము లేనిచో అవి నిష్ప్రయోజనములగును యజ్ఞమందు నేయి మాత్రమే అగ్నికి ఆహుతి చేసిన ప్రయోజనము లేదు స్వార్థమును కూడ హోమము చేసినపుడే వేదములు చెప్పిన శ్రద్ధ, భక్తి ఏర్పడును కాని వాస్తవమునకు యజ్ఞకర్మలలో వీటికి ప్రాధాన్యములేదు యజ్ఞములు కోరికలతో కూడినవి కావున పరమేశ్వరార్పణ బుద్ధి ఉండదు ఈ లోకమున కానిచో పరలోకమున సుఖము ఉండునను వాంఛతో యజ్ఞములు జరుపబడుటచే నిష్కామకర్మకు మీమాంస యందు స్థానము లేదు యజ్ఞకర్మలే మీమాంస యందు హెచ్చు ప్రాధాన్యము పొందియుండుటచే మానవ జీవితములో మిగిలిన అధికభాగమును గురించి ప్రస్తావన లేదు

కర్మలు ఫలము కొరకే చేయబడును అవి అందుకే ఉద్దేశించబడినవి కావున కర్మకు దాని ఫలమునకు ఒక సంబంధం ఉండాలి ఈ సంబంధమునే మీమాంసకులు 'అపూర్వము' అన్నారు అపూర్వము అనగా అంతకు ముందు లేనిది ఒక కర్మ చేయబడిన తరువాత ఎపుడో ఫలితమునిచ్చును కాని అది గతించుటకు ముందు అనగా గతకర్మ అగుటకు ముందు ఏ రూపమున ఉండును? ఆ రూపమునే 'అదృష్టము' అన్నారు అదృష్టమునే ఒక శక్తి అని జైమిని చెప్పాడు ఆ 'అదృష్ట శక్తి'కే 'అపూర్వము' అని జైమిని ఇచ్చిన పేరు కర్మ గతించుటకు ముందున్న స్థితిని గాని, కర్మ పూర్తి అయిన తరువాత ఆ కర్మస్థితిని గాని 'అపూర్వము' అనవచ్చునన్నారు యజ్ఞకర్మల ఫలము కాలాంతరమున కలుగునన్నారు 'అపూర్వ' సహాయము లేనిది ఆ ఫలము సిద్ధించదు అని జైమిని వాదన కర్మఫలము ఇచ్చునది ఎవరు? పరమేశ్వరుడు కాదు అని మీమాంసకుల వాదము

కర్మ చేయుటకు ముందు కర్తయందు గాని, కర్మయందు గాని

చివరగా ఈశ్వరుని గూర్చి మీమాంస దృక్పథము తెలియవలసి యున్నది యజ్ఞహోమములు వేదములో చెప్పబడినవి అయినపుడు వాటిని సమర్పించుటకు దేవతలు అవసరము అయినారు అందుచే పూర్వమీమాంస ఎంతో మంది దేవతలను కల్పించినది యజ్ఞకర్మలకు సర్వాంతర్యామి అయిన పరమేశ్వరుని అవసరము కనబడలేదు అందుచే పూర్వమీమాంస యందు ఈశ్వరుని ప్రసక్తి లేదు జైమిని ఈశ్వరుని అస్తిత్వమును గురించి మిన్నకుండెనే గాని నాస్తికత్వమును ప్రకటించలేదు వేదము నిత్యమైనది, స్వయంస్థితి కలది అందువలన వైదిక కర్మలకు ఈశ్వరునితో పనిలేదు అని భావించబడినది వేదములకు ఈశ్వరుడు కర్త కాదు అని మీమాంస నిశ్చయము గదా! యజ్ఞఫలము పొందుటకు ఈశ్వరుని ప్రమేయము అవసరములేదు 'అపూర్వ'ము ద్వారా కర్మఫలము సిద్ధించునని మీమాంసకుల విశ్వాసము ఈశ్వరుడున్నాడని చెప్పుటకు ప్రత్యక్ష ప్రమాణములు లేవు కర్మ, కర్మఫలములలో ఏది ముందు అను వాదము 'బీజవృక్ష న్యాయము' వంటిది అనగా విత్తుముందా చెట్టు ముందా అను సమాధానము లేని ప్రశ్న వంటిది జగత్తు లయమగుట, తిరిగి సృష్టించబడుట మీమాంసకులు అంగీకరించలేదు ప్రళయము, పునర్జన్మలను సృష్టి పరిణామము (Evolution) పరంపరలో భాగముగానే భావించారు ఏదో ఒక సమయమున ఈ పరిణామమును అంతము చేసి తిరిగి జీవులను పరమేశ్వరుడు సృష్టించును అను భావము నిరర్థకము అన్నారు లయము, పునరుత్పత్తి లేనే లేవు అన్నారు మానవులు తలిదండ్రుల ద్వారానే జన్మింతురు గాని అందు ఈశ్వరుని ప్రమేయము ఉండదు అన్నారు

ఈశ్వరుడు ఉన్నాడని గాని లేడని గాని చెప్పజాలని మీమాంసవాదము అసంపూర్ణముగానే మిగులును అణువులు పనిచేయుటకు దైవకృప అవసరము లేదు ప్రతి జీవాత్మ తనను ఆచ్ఛాదించియున్న (కప్పియున్న లేక ఆవరించియున్న) అణుమయమగు శరీరమును తానే నడిపించును ధర్మము, అధర్మములను ఈశ్వరుడే నడుపునని చెప్పుటకు సాధ్యపడదు అవి బుద్ధిని పొందియున్న

మానవజాతి గుణములు ఎంత సూక్ష్మబుద్ధితోనైనను ఎదుటి మనిషి ధర్మాధర్మగుణములను ఎరుగుట సాధ్యము గాదు కర్మఫలమైన అదృష్టమును ఈశ్వరుడు చూడగలడా అంటే దానికి ప్రమాణము లేదు దేవునికి శరీరము లేనపుడు మనస్సు గాని ఇంద్రియములుగాని ఎట్లుండును? మానవుల ధర్మాధర్మములు ఈశ్వరుడెట్లు నడపగలడో తెలియదు ఈశ్వరునకు మానవుల ధర్మాధర్మములతో సంబంధముండదు ధర్మాధర్మములు గుణములే కాని ద్రవ్యములు కావు ధర్మాధర్మములు జీవులలో నుండును గాని ఈశ్వరునిలో ఉండవు అందువలన వస్తుగుణ సంబంధమునకు కూడ అవకాశముండదు

వేదములకు ఈశ్వరుడే కర్తయును న్యాయసిద్ధాంతమును మీమాంసకులు అంగీకరించరు ఈశ్వరుడు సృష్టి చేసెనని చెప్పుటకు సాక్ష్యము లేదు చేసినట్లు అంగీకరించినను ఎట్లు చేసినది తెలియుట సాధ్యము కాదు ఏదైనా సృష్టి చేయుటకు ముందు దాని కర్తకు ఆ కోరిక కలగాలి శరీరమున్నపుడే కోరికలు కలుగును ఈశ్వరునికి శరీరమున్నదా? ఉన్నచో దాని సృష్టికర్త ఎవరు? ఈశ్వరుని దేహము ఆది అంతము లేనిది అయినను సృష్టికి ముందు పంచభూతములు లేవు గదా! మరి అతని శరీరము ఎట్లు ఏర్పడెను? సృష్టికి ముందే పదార్థమున్నచో ఈశ్వరుడు జగత్తుకు సృష్టికర్తయని చెప్పుటకు వీలుపడదు ఎందుకనగా ఈశ్వరుడొక్కడే కాదు పదార్థములు కూడ సృష్టికి ముందే ఉన్నవి గదా! ఈశ్వరుడు సృష్టి చేసెనని అంగీకరించినను, దుఃఖముతో కూడిన సృష్టి ఎందుకు చేసెను? దుఃఖములు కర్మఫలములనినచో సృష్టికి పూర్వము కర్మలు లేవు గదా! సృష్టికి పూర్వము మరొక సృష్టి ఎట్లుండును ఈశ్వరుడు దయామయుడు దయతోనే సృష్టి చేసెను అనినచో జీవులందరు సుఖముగా ఉండవలయును గదా! దుఃఖము లేకుండ సృష్టి సాధ్యపడదు అనినచో అది ఈశ్వరుని శక్తి కించపరచినట్లగును ఈశ్వరుడు సర్వశక్తియుతుడు అయి ఉండాలి గదా! సృష్టి ఈశ్వరుని వినోదము లేక ఆట అనినచో దుఃఖముతో కూడిన సృష్టి ఈశ్వరుని సచ్చిదానంద

స్వరూపమునకు భంగము కలిగించును తానే చేసిన సృష్టిని తానే నాశము చేయుట సమంజసము కాదు అపుడు లయము అనునది ఉండకూడదు నిష్కారణముగా తన శక్తిని ప్రదర్శించుటకే ఈశ్వరుడు సృష్టిచేసెనా? ధర్మములు వేదవచనములు అవి సృష్టి తరువాత ఏర్పడినవి ఈశ్వరుడు ధర్మ స్వరూపుడనినచో సృష్టికి ముందే వేదములుండెనా? అణువుల చలనము, ఈశ్వరుని ఆజ్ఞకు లోబడియుండునని చెప్పినను, 'అదృష్టము' ఈశ్వరుని సంకల్పమునకు కారణము అనినను, అపుడు సృష్టికే అదృష్టము కారణమగును అది ఎట్లు సాధ్యము? కర్మ జరిగినపుడు గదా అదృష్టము ఏర్పడునది అదియును గాక ఈశ్వరుడు మరొకదానిపై ఆధారపడినపుడు అతని శక్తి కించపడును ఇక ఆయన సంకల్పమే సృష్టికి కారణమయినచో కర్మ సిద్ధాంతమునకు అర్థముండదు

దేవతలకు శరీరములుండునని మీమాంసకులు అంగీకరించలేదు దైవప్రార్థనలందు వారి శరీరములు సంకేతార్థము (symbolism) తోనే వర్ణించబడినవి కర్మ ఫలితములకు దేవతలు కారకులు కారు అన్నారు కొన్ని సందర్భములలో దేవతలకు శరీరములున్నట్లు చెప్పిరి గాని కాలక్రమమున మీమాంసయందు దైవశరీరముల కంటే మంత్రములకే ప్రాధాన్యమీయబడెను యజ్ఞకర్మలందు దేవతల కంటే మంత్రములే ప్రధానములాయెను హోమములు సమర్పించుటకే దేవతలను ఊహించి కల్పించారు అని విమర్శకుల అభిప్రాయము మంత్రములకు దేవతలుండిరని చెప్పినట్లు కనబడదు

ఆధునికులు కొందరు మీమాంసకు వేదాంతమును సమన్వయము చూపుటకు ప్రయత్నించారు కర్మఫలము నిచ్చువానిగా ఈశ్వరుని అస్తిత్వము జైమిని తిరస్కరించెను కాని జగత్తు సృష్టికి కర్తగా ఈశ్వరుని జైమిని తిరస్కరించలేదని వీరి వాదన ఈశ్వరుడు కర్మఫలమునిచ్చుటయే గాక జగత్తు సృష్టికి కర్తగా కూడ ఉన్నాడని కొందరు మీమాంసకులు అన్నారని వీరు

ప్రకటించారు కొందరు కర్మఫలమును ఇచ్చునది ఈశ్వరుడు కాదు అని మాత్రమే అన్నారని వీరి అభిప్రాయము వీరి దృష్టిలో సుఖదుఃఖములను ఇచ్చునదే కర్మఫలము అది వ్యక్తి అనుభవముగా మారినపుడే ఫలమగును ఫలమునకు కర్మ కారణము అనగా ఒక వస్తువు పుట్టి మనిషి అనుభవమునకు ఉపకరణమగునని అర్థము చెప్పారు కర్మఫలమును ఇచ్చునది అపూర్వమే కాని ఈశ్వరుడు కాదు అని జైమిని చెప్పాడు దీనిని బాదరాయణుడు బ్రహ్మసూత్రములలో తృతీయాధ్యాయములో తిరస్కరించాడు (3-8-40 సూ) ఫలమును వారి వారి కర్మలననుసరించి వారికి అందునట్లు ఈశ్వరుడే చేయును అని బాదరాయణుడు ప్రకటించాడు దేవుడు సృష్టికర్త కాడు అని జైమిని చెప్పియుండిన యెడల బాదరాయణుడు బ్రహ్మసూత్ర ద్వితీయాధ్యాయములో విరుద్ధ మత సిద్ధాంతములు తిరస్కరించినటులే జైమిని సిద్ధాంతమును గూడ తిరస్కరించి యుండెడివాడె గదా! అట్లు చేయలేదు ఎందుకనగా జైమిని అట్లు చెప్పియుండలేదు కనుక అని వీరి వాదన సృష్టిలో కనబడు భేదములన్నిటికి ఈశ్వరుడే బాధ్యుడనినచో ఈశ్వరునికి పక్షపాతబుద్ధి ఆపాదించినట్లు అగునని జీవులలో భిన్నత్వమునకు కర్మఫలమే కారణము ఈశ్వరుడు కాదు అని జైమిని ప్రకటించాడని వీరి భావము ఈ వాదము సహేతుకము కాదు అని సర్వేపల్లి రాధాకృష్ణ వ్యాఖ్యానించారు మనకు సుఖదుఃఖములు ఇచ్చునది పూర్వకర్మయే అయినచో సృష్టికి కూడ అదే కారణమై ఉండాలి 'అపూర్వ'మనగా కేవలము 'కర్మనియతి' యగునని దానిని అనుసరించి సృష్టికార్యము ఈశ్వరుడు చేయును అని చెప్పవలసి వచ్చును అపుడు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని కర్మఫలము నిచ్చునది, సృష్టిచేయునది కూడ ఈశ్వరుడేయగును అని రాధాకృష్ణ వ్యాఖ్యానించారు కాబట్టి పూర్వమీమాంసకు వేదాంతమునకు సామరస్య మున్నదని చెప్పుట సమర్థనీయము కాదు

ఈశ్వరుని గూర్చి సహేతుకమైన వివరణ లేకపోవుట పూర్వమీమాంస యందలి లోపమనియే చెప్పవలయును ఈ లోపముచే మీమాంసపై దాని

అనుచరులలో కొంత అసంతృప్తి ఏర్పడియుండవచ్చును అందువలనే అయి ఉండవచ్చు అనంతర మీమాంసకులు దేవునికి అస్తిత్వము కల్పించారు 'అపూర్వము' జడము అనగా చైతన్యము లేనిది దానికి సృష్టిలో సమన్వయము కలిగించు శక్తి ఉండదు అని వీరు భావించారు ఈ కారణము వలననే మీమాంసలో ఈశ్వరుడు చొరబడ్డాడు కర్మఫలమును నడిపించువాడు ఈశ్వరుడు అందువలన అతడు కర్మసూత్రమునకు బద్ధుడు కాడు ఉపాసన కూడ కర్మవలెనే ముక్తికి అవసరము అని కుమారిలుడు అన్నాడు అందుచే అతడు ఈశ్వరుడు ఉన్నాడని అంగీకరించినట్లే అగుచున్నది క్రమముగా యజ్ఞములు గూడ పరమేశ్వర ప్రీత్యర్థమే చేయుట ఉత్తమం అని భావించారు ఈ భావమే క్రమముగా 'సఈశ్వరమీమాంస' అనగా ఈశ్వరుడున్నాడని అంగీకరించిన మీమాంసగా మారింది

కర్మసూత్రమే సత్యము, ధర్మమే ఈశ్వరుడు అన్నారు ధర్మ విషయములు వేదములలోనివే వేదములు ఈశ్వరుని చిత్తము (జ్ఞానము)ను తెలుపును శబ్దమే బ్రహ్మరూపము దాని బాహ్యరూపమే వేదము అన్నారు ఈ రూపమునకు స్థాపకుడు ఈశ్వరుడే అన్నారు మీమాంస క్రమముగా సగుణ ఈశ్వర ఆరాధనకు స్థానము కల్పించినది ఈశ్వరునికి దేహరూపము కల్పించారు, వర్ణించారు తుదకు ఈశ్వరుని సంకల్పమునకు రూపములే వేదములు అన్నారు అనాడు ప్రబలుచున్న లోకాయత మతములను అనగా చార్వాక మతము వంటి నాస్తిక సిద్ధాంతములను విరోధించుటకై మీమాంసయందు దేవునికి అస్తిత్వము కల్పించుటకై దానికి నూతన అర్థవివరణ ఇచ్చారు ప్రధానంగా కుమారిలుని భావములు ఈ మార్గముననే నడిచినవి

ఎన్ని వివరణలు ఇచ్చినను సృష్టి, భగవంతుని గూర్చి తాత్విక భావరూపము మీమాంస ఇవ్వలేదనే చెప్పాలి ఎన్ని చెప్పినను వివరణలన్నియు యజ్ఞకర్మపైననే కేంద్రీకృతమైనవి యజ్ఞకర్తల యెదుట దేవతలను శక్తిహీనులుగా

చేశారు యజ్ఞమందు 'స్వాహ' అనుటలో హోమము చేయుచున్నాను అని భావము 'ఇంద్రాయ స్వాహ' అనగా చతుర్థీ విభక్తిలో ఇంద్రుని కొరకు హోమము చేయుచున్నాను ఇంద్రుడు అను దేవత యందు ప్రీతితో హవ్యములను ఇచ్చుచున్నాను అని భావము ఇచట హవ్యములు ఇచ్చుట అనగా దేవునికి నైవేద్యం పెట్టటం కాదు నైవేద్యం అనగా నివేదన మనము ఇచ్చు నైవేద్యం దేవుడు తినడు అది తినునది మనమే కాని దానిని దేవునికి సమర్పించుటలోని భావము దానిని దేవుని ప్రసాదముగా మనము గ్రహించుటయే ఇది మన మనస్సులో సర్వం ఈశ్వరార్పణం అను స్పందనను వ్యక్తం చేయుటయే యగును కాని యజ్ఞహోమములలో ఆ స్పందనకు స్థానములేదు మీమాంసలో యజ్ఞకర్తకు కల్పించబడిన ఆధిక్యత (superiority) వలన అతనిలో 'అహం' ప్రబలునే కాని భక్తి స్పందన రాదు ఈ 'అహం' పరాకాష్టకు చేరినపుడు దేవతల మీద దయతో వారికి యజ్ఞహవ్యములు ఇచ్చుచున్నాను అను భావం ప్రబలుతుంది 'అర్పణ' భావం ఉండదు పురాణాలలోను, చరిత్రలోను ఇందుకు ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి భక్తి స్పందన కలిగినపుడే చిత్త చైతన్యము కలుగును అనాడు మీమాంస ప్రభావము అధికమగుట వలనే భక్తిప్రధానమగు వైష్ణవ, శైవమతములు, తాంత్రికులు సృష్టించిన ఏకేశ్వరమతము ఏర్పడియుండవచ్చునను అభిప్రాయము కలుగును మానవుడు ఆశించునది సుఖము అది లోపించినపుడు అతడు తనకు తోడు ఎవరూ లేరు అను ఒంటరితనము (isolation) అనుభవించును అపుడు అతనికి వలసినది మానసికంగా ధైర్యము - దేవుడొకడున్నాడు, నిత్యము అతడు తన వెంటనే యున్నాడు, తన కర్తవ్యము తాను నెరవేరిస్తే సత్ఫలితము ఆయనే కలిగించును అను ధైర్యము మనిషికి ఎంతో బలమును (శక్తిని) ఇచ్చును ఇదే ఈశ్వరార్పణ తత్త్వము (ప్రపత్తి) ఆ బలమే మనిషిని నడిపించును ఈశ్వరార్పణ తత్త్వము మీమాంస యందు లేదు

**4 ఉత్తరమీమాంస (వేదాంతము)**

ప్రాచీన భారతదేశములో విద్యావిధానమునకు అరణ్యములలో మహర్షుల అధీనములోనున్న గురుకులములు లేక ఆశ్రమములు కేంద్రములుగా నుండెడివి అవి విద్వత్సభలు (academies) అందు బోధన సూత్ర రూపముననుండెడిది బోధన యందు వివరణ, చర్చ, చింతనలకు ప్రముఖ స్థానముండెడిది గ్రంధ ముద్రణావకాశములు లేనందున, అవి తాళపత్రముల పైననే వ్రాయబడెడివి అవి ప్రతి విద్యార్థికి అందజేయుట అసంభవము రచన సూత్రరూపమున నుండెడిది సూత్రములు కంఠస్థము చేయబడెడివి సూత్రరూపమున నున్న బోధనావిధానము గురుశిష్య పరంపరలో సాగినది

ఈ సూత్ర సాహిత్యమునకు ఒక ప్రత్యేకత యున్నది సూత్రములో అతితక్కువ అక్షరములలో ఎట్టి సంధిగ్ధమునకు అవకాశము లేకుండ సాధ్యమగునంత ఎక్కువ విషయము ఇమిడి యుండును అందుచే సూత్రములు విషయవివరణలు కావు అవి విషయసారములు (essence) కాని ఈ సూత్రకర్తలు సూత్రములను అతిగా కుదించుటచే సూత్రభావము తెలియుట కష్టసాధ్యమైనది అందుచే సూత్రభాష్యము అవసరమైనది భాష్యకారులు వారి వారి సిద్ధాంతములకు అనుగుణముగా సూత్రములకు వ్యాఖ్యలు చెప్పారు భాష్యకారులు చెప్పిన వ్యాఖ్యలలో సూత్రకర్త యొక్క భావము యదార్థముగా ప్రతిఫలించినది లేనిది తెలియదు బ్రహ్మసూత్రములు కూడ ఆ కోవకు చెందినవే సూత్ర సాహిత్యములో ప్రధానమైనవి కల్ప సూత్రములు ఇందు శ్రౌత సూత్రములు, ధర్మసూత్రములు, గృహ్యసూత్రములు భాగములు అనంతరకాలమున తత్త్వదర్శనములు సూత్ర పద్ధతినే అనుసరించి వ్రాయబడినవి వేదాంతమునకు మూలము మూడు తత్త్వరచనలు ఈ మూడింటిని ప్రస్థానత్రయము అన్నారు ప్రస్థానము అనగా తత్త్వశాస్త్రపద్ధతి ప్రస్థానత్రయము అనగా ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, భగవద్గీత ఉపనిషత్తులను శృతిప్రస్థానము, బ్రహ్మసూత్రములను న్యాయప్రస్థానము,

భగవద్గీత స్మృతి ప్రస్థానము అన్నారు

భారతదేశంలో అనేక తత్త్వములు (Schools of Philosophy) ఉన్నవి కాని అన్నిటి కంటే వేదాంతతత్త్వము ఎక్కువ ప్రచారము పొంది ఇప్పటికీ సజీవముగా నున్నది వేదాంతమందు తాత్త్వికసంపద (విజ్ఞానము) విస్తారముగా నుండుట చేతను, వేదమతముతో సాన్నిహిత్యముండుటచేతను భారతీయ తత్త్వవిజ్ఞానమునకు ప్రతీకగా ప్రాధాన్యము పొందినది వేదసారమే ఉపనిషత్తులు 'వేదాంత'మనగా 'వేదముల చివరి భాగము' అని శబ్దార్థము ఉపనిషత్తులందు చెప్పబడిన సిద్ధాంత సముచ్చయమే వేదాంతము ఉపనిషత్తులే వేదముల చివరి భాగములు వేదముల సారము చెప్పునవి ఉపనిషత్తులు వేదాంత సూత్రములు పరబ్రహ్మతత్త్వమును విశదపరచును గావున బ్రహ్మసూత్రము లనియు, నిర్గుణుడైన పరబ్రహ్మ రూపమును తెలుపును గాన శారీరక సూత్రములు అని కూడ అందురు యజ్ఞకర్మలను గూర్చి వివరించునది కర్మమీమాంస, పరబ్రహ్మతత్త్వమును వివరించునది శారీరక మీమాంస అనబడినవి కర్మమీమాంస అయిన పూర్వమీమాంస, తత్త్వమీమాంస అయిన ఉత్తరమీమాంస రెండును కలిసి వేదసర్వస్వమగును

తాత్త్విక సమస్యలను ఒక క్రమపద్ధతిన ఉపనిషత్తులు చర్చించలేదు కాని అవి శృతుల వలెనే ప్రమాణము కలవి, మహోన్నతమైన ఉపదేశము అందు ఇమిడియున్నది అని విశ్వసించారు ఉపనిషత్తుల అంతరార్థమును ఒక క్రమపద్ధతిలో వెలికి తీయుటకు బాదరాయణుడు పూనుకొనెను బ్రహ్మసూత్రములను ఆస్తికతత్త్వవివరణగా చెప్పవచ్చును ఎందుకనగా పరబ్రహ్మ ఉన్నాడని స్థిరపరచుటయే బ్రహ్మసూత్ర లక్ష్యము పరబ్రహ్మము, వస్తు ప్రపంచము, సంసారచక్రమందు పరిభ్రమించు జీవాత్మ, ముక్తి, - వీటిని గూర్చిన అన్వేషణకు సూత్రరూపము ఇచ్చినవే బాదరాయణ బ్రహ్మసూత్రములు ఇందు వేదాంత తత్త్వమంతయు ఇమిడియున్నది ఇందు 555 సూత్రములు

కలవు ఇవి నాలుగు అధ్యాయములుగా విభజింపబడినవి ప్రతి అధ్యాయము నాలుగు పాదములు, ప్రతి పాదములో కొన్ని అధికరణములు (భాగములు), ప్రతి అధికరణములోను కొన్ని సూత్రములు ఉన్నవి మొత్తం అధికరణములు (topics) 192 ఇందు ఎక్కువ సూత్రములు రెండు, మూడు పదములతో కూడినవే సూత్రములు సులభముగా బోధపడవు అందుచే భాష్యకారులు స్వేచ్ఛగా వారివారి సిద్ధాంతములకు అనుగుణముగా సూత్రభాష్యము చెప్పుటకు అవకాశమేర్పడినది సూత్రభాష్యములు ద్వారా భిన్నములైన ఆస్తికమతశాఖలు అనగా వేదాంతశాఖలు ఏర్పడినవి అందు సజీవముగా ఇప్పటికీ నిల్చియున్నవి ప్రధానముగా శంకరుని అద్వైతమతము, రామానుజుని విశిష్టాద్వైతము, మధ్వుని ద్వైతము ఈ మతములు ప్రాచీనకాలము నుండి ఉన్నవే వాటికి ఈ ఆచార్యులు సిద్ధాంతరచనారూపమునిచ్చిరి ఇందు శంకరుల అద్వైతమతము ఒక్కటే సంపూర్ణము, అనన్యము అయిన అస్తికతత్త్వ సిద్ధాంతము (విశిష్టాద్వైతము, ద్వైతములు అనంతరకాలమున బహుళ ప్రజాదరణ పొందిన భక్తిమతమునకు ప్రాతిపదికలు (మూలములు) అయినవి వీరు ముప్పురేకాక ఇంకా భాస్కరుడు, యాదవప్రకాశుడు, కేశవుడు, నీలకంఠుడు, బలదేవుడు, వల్లభుడు, విజ్ఞాన భిక్షువు కూడ భాష్యములు వ్రాశారు )కాని ఇందు ఎవరు చెప్పిన సూత్రార్థము సక్రమమైనదో చెప్పుట అసాధ్యము బ్రహ్మసూత్రార్థము స్పష్టముగా లేనందున బాదరాయణ ఆస్తికతత్త్వ సిద్ధాంతమును గూర్చి నిరంతరము చర్చలు జరుగుచుండిన కాలమున ఈ భాష్యములు వ్రాయబడినవి భాష్యకారులు తమ సిద్ధాంతములకు అనుకూలముగా సూత్రార్థము చెప్పిరి ఎంతమంది ఎన్ని చెప్పినను అన్ని భావములకు అవకాశము కల్పించిన అపూర్వమైనవి బ్రహ్మసూత్రములు బాదరాయణుని కాలమున గూడ ఉపనిషత్తుల భావమును గూర్చి చర్చలు జరిగియుండును ఇతర వేదశాఖలు కూడ కొన్ని ఏర్పడి యుండును లేనిచో (ద్వితీయాధ్యాయమునందు ఇతర శాఖలను ఖండించ వలసిన అవసరము బాదరాయణునకు ఉండెడిది కాదు) బాదరాయణుని

చరిత్ర ఇచట చర్చనీయాంశము కాదు జీవుడు - కర్మకు సంబంధించినంతవరకు బ్రహ్మసూత్రభావము మాత్రమే చర్చనీయాంశము

పూర్వమీమాంస, ఉత్తరమీమాంస రెండును వేదములకు వ్యాఖ్యానములే షడ్దర్శనములో మిగిలిన నాలుగింటిలో న్యాయదర్శనమును గూర్చి బాదరాయణుడు ఏమియును చెప్పలేదు సాంఖ్యమును యోగముతో చేర్చి విమర్శించెను సాంఖ్యమునకు ఎక్కువ ప్రాధాన్యమీయబడెను ఎందుకనగా సాంఖ్యమును కొంతవరకు బాదరాయణుడు అంగీకరించెను వైశేషికము కూడ ఖండించబడినది బౌద్ధ, లోకాయత అనగా నాస్తికమతములు కూడ విమర్శించబడినవి భగవద్గీత, భాగవతము తత్త్వప్రేరకములుగా బాదరాయణుని ప్రభావితుని చేసియుండునని అనిపించును బాదరాయణుడు క్రీ పూ 500-200 సంవత్సరముల మధ్యకాలములో ఉండెనని చెప్పబడుచున్నది

ఆత్మజ్ఞానము పొందుటకు ఉపనిషత్తులు మూడు సోపానములు చెప్పియున్నవి అవి 1) ఆత్మ యొక్క సత్యమును తెలియవలయును 2) ఆ సత్యమును సహేతుకముగా చర్చించవలయును 3) ఆత్మను గూర్చి ధ్యానించవలయును 1) ఉపనిషత్తులు ఆత్మను గూర్చి సత్యమును తెలియజేయును 2) ఆ సత్యమును బ్రహ్మసూత్రములు సహేతుకముగా చర్చించును భగవద్గీత ఒక స్మృతి జీవితములో నీతినియమములను, వాటిని ప్రత్యక్షముగా ఆచరించు మార్గములు గీత తెలియజేయును బ్రహ్మసూత్రముల లోని మొదటి నాలుగు సూత్రములు బ్రహ్మసూత్ర సర్వస్వమును తెలియ జేయును ఈ నాలుగు సూత్రములను చతుస్సూత్రి అన్నారు

**మొదటి సూత్రము** "అధాతోబ్రహ్మజిజ్ఞాసా"

అధ, అతః, బ్రహ్మజిజ్ఞాసా ఈ మూడు శబ్దాలే సూత్రములో ఉన్నాయి అధ పిమ్మట, అతః = కాబట్టి, బ్రహ్మజిజ్ఞాసా = బ్రహ్మమును తెలుసుకొనుటకు కోరిక పూర్వమీమాంస సూత్రములు "అధాతో ధర్మ

జిజ్ఞాస''తో ప్రారంభమైనవి 'బ్రహ్మజిజ్ఞాసా' అని బ్రహ్మసూత్రములలో అన్నారు 'ధర్మజిజ్ఞాసా' అని మీమాంసా సూత్రములలో అన్నారు అదే మీమాంసకు, వేదాంతమునకు గల భేదము 'అథ' అనగా రెండింటిలోను పిమ్మట లేక అనంతరము అని చెప్పారు మీమాంసలో 'అనంతరం' అనగా వేదాధ్యయనం అయిన తరువాత అని అర్థం చెప్పారు బ్రహ్మసూత్రములో 'అనంతరం' అనగా సాధన చతుష్టయమును పొందిన తరువాత అని అర్థము చెప్పారు (సాధన చతుష్టయము అనగా 1) నిత్యము అనిత్యము అయిన వస్తువుల గురించిన వివేకము అనగా బ్రహ్మము సత్యము నిత్యము అని తెలియుట ఇహలోక మరియు స్వర్గలోక సౌఖ్యములు నిత్యములు కావు అను జ్ఞానము దీనినే నిత్యానిత్యవస్తువివేకము అన్నారు 2) ఇహాముత్రఫలభోగవిరాగము (ఇహాముత్రలు అనగా ఇహపరములు) అనగా ఐహికములైన సంసారం, ధనం మొదలైన భోగాలయందు ఆముష్మికములైన స్వర్గసుఖములందు కూడ ఎట్టి ఆసక్తి లేకుండుట అదే వైరాగ్యం 3) శమదమాది సాధన సంపత్తి శమము అనగా మనోనిగ్రహము, దమము అనగా బాహ్యములైన ఇంద్రియ నిగ్రహము 'ఆది' అనగా మొదలైనవి అవి చిత్తచాంచల్యమును నిగ్రహించుట లేక సన్యాసం స్వీకరించుట, శీతోష్ణములను సహించు శక్తి, పరమాత్మ యందు విశ్వాసం (శ్రద్ధ), సమాధి అనబడు ఏకాగ్రత ఇవి ఆరు వీటినే శమదమాదిషట్కము అన్నారు 4) ముముక్షుత్వము మోక్షము పొందవలెనను ఆసక్తి ఈ నాలుగింటిని సాధన చతుష్టయము అన్నారు ఈ నాలుగు సాధనములను పొందిన పిమ్మట బ్రహ్మజ్ఞానము గూర్చి వాంఛించాలి జిజ్ఞాస అనగా కోరిక ఆ కోరికకు ఫలం జ్ఞానం బ్రహ్మజిజ్ఞాసకు ఫలం బ్రహ్మజ్ఞానం బ్రహ్మమును తెలుసుకొనినవాడు బ్రహ్మమే అవుతాడు అన్నారు అందుచే తెలుసుకొనతగినది బ్రహ్మస్వరూపం) సూత్రములో రెండవ శబ్దం 'అతః' అనగా కారణము లేక హేతువు అని అర్థం చెప్పారు అనగా బ్రహ్మజ్ఞానము ఎందుకు పొందాలో కారణము చెప్పను ఛాందోగ్య ఉపనిషత్తు (8-1-6)లో

చెప్పినట్లు కర్మల వలన సంపాదించిన ఐహిక భోగములు, స్వర్గసౌఖ్యాలు కూడ క్రమముగ క్షీణించిపోవును "బ్రహ్మవిదాప్నోతిపరమ్" తైత్తరీయోపనిషత్తు (2-1-1)లో బ్రహ్మజ్ఞానము వలన ముక్తి లభించును అని చెప్పబడింది బ్రహ్మజిజ్ఞాసకు ఇదే కారణము అని భావము బ్రహ్మజ్ఞానమును తెలుసుకొనుట జిజ్ఞాస (కోరిక) అనే అన్నారు గాని కర్తవ్యము అనలేదు ఇచ్ఛ కలిగినపుడు సాధన అవసరం ఏర్పడుతుంది సాధన చతుష్టయము సాధించిన తరువాత బ్రహ్మజ్ఞానము ద్వారా మోక్షప్రాప్తికి కోరిక కలిగిన కారణమున ఈ అధ్యాయము చెప్పబడినది ఇది బ్రహ్మసూత్ర విషయము (theme)

**రెండవ సూత్రము** "జన్మాద్యస్యయతః"

జన్మాది = సృష్టి స్థితి లయములు, అస్య దీని యొక్క (జగత్తు యొక్క), యతః = ఎవని వలన (కలుగుచున్నవో) అనగా ఈ జగత్తుకు మూలము (origin) బ్రహ్మమనియు లేక ఎవని వలన ఈ జగత్తు ఉత్పత్తి స్థితి, లయములు జరుగుచున్నవో అతడే పరబ్రహ్మ అని భావము మొదటి సూత్రములో బ్రహ్మజిజ్ఞాసను గురించి చెప్పారు ఇపుడు ఆ బ్రహ్మ యొక్క లక్షణం ఈ సూత్రంలో చెప్పారు ఏ వస్తువు నుండి ఈ విచిత్రమగు జగత్తు పుట్టుచున్నదో, ఏ వస్తువు మీద ఈ జగత్తు స్థితి ఆధారపడియున్నదో, ఏ వస్తువులో ఈ జగత్తు లయము పొందుచున్నదో అదే బ్రహ్మము అని సూత్రార్థము తైత్తిరీయ ఉపనిషత్తు (3-1)లో చెప్పినదే ఈ సూత్రములో కనబడుచున్నది "యతోవాఇమానిభూతానిజాయన్తే" సమస్త భూతములు ఎవని నుండి పుట్టి, ఎవనిచే జీవించుచు, అంతమందు ఎవనియందు లయమగునో అతడే పరబ్రహ్మయని తెలుసుకో అని చెప్పబడింది "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" తైత్తిరీయ ఉపనిషత్తు (2-1-1) అని కూడ చెప్పబడింది అనగా సత్య, సర్వజ్ఞ స్వరూపుడు, అంతము లేనివాడు, దేశకాలవస్తువులచే పరిచ్ఛేదము లేనివాడు (విభజింపబడనివాడు) ఇది ఈ సూత్రములోని విషయం

**మూడవ సూత్రము** 'శాస్త్రయోనిత్వాత్'

ఈ జగత్తుకు మూలము (కారణం) అని మొదటి సూత్రములోను, పరబ్రహ్మ సర్వజ్ఞుడు, అనంతుడు అని రెండవ సూత్రములోను చెప్పబడింది ఈ విషయమే ఈ సూత్రంలో ధృవపరచబడింది ఇచట రెండు అర్థములు వచ్చుచున్నవి శృతులకు కారణము పరబ్రహ్మ అనియు అవే శృతులు బ్రహ్మజ్ఞానమునకు ఉత్పత్తి స్థానము లేక మూలాధారము (source) అని అర్థము బ్రహ్మము యొక్క యదార్థ స్వరూపమునకు శాస్త్రము అనగా వేదములే ప్రమాణములు అని భావము 'శాస్త్రయోనిత్వాత్' అనగా శాస్త్రమునకు కారణము అయినవాడు అని అర్థం వేదములు అపౌరుషేయములు, సర్వజ్ఞుడైన పరబ్రహ్మమే వాటికి కర్త అని ఈ సూత్రార్థం

**నాల్గవ సూత్రము** "తత్తు సమన్వయాత్"

ఇంతవరకు జగత్తుకు మూలకారణముగాను, సర్వజ్ఞునిగాను, అతనికి ఉన్న శాస్త్ర ప్రమాణమును చెప్పబడినది శాస్త్ర ప్రమాణమును సమన్వయం వలన తెలియనగునని ఈ సూత్రార్థము తత్ + త + సమన్వయాత్ తత్ = అది అనగా శాస్త్రప్రమాణం అను విషయం, తు = అయితే, సమన్వయాత్ = సమన్వయం వలన తెలియనగును వేదాంత వాక్యములన్నిటికి బ్రహ్మమే ముఖ్యార్థము కాబట్టి, (సమన్వయం అనగా పరస్పరం విరుద్ధముగా లేకుండుట ) వేదాంత వాక్యములన్ని పరబ్రహ్మమును గూర్చి ఏకాభిప్రాయము కలిగించును అందుకు కారణం వాటి సమన్వయం వేదాంత వాక్యములు సమన్వయముతో కూడిన అర్థముతో బ్రహ్మజ్ఞానమును కలిగించుచున్నవి

పరబ్రహ్మను గూర్చిన సామాన్యజ్ఞానం అందరికీ పరిచయమే కాని పరబ్రహ్మకు ఆత్మకు గల సంబంధమును గూర్చి అనగా ఆత్మ పరమాత్మల ఐక్యత గూర్చి అనేక వివాదములు ఉన్నాయి

1 'దేహమే ఆత్మ' అని నాస్తికులు, చార్వాకులు అన్నారు, అంటున్నారు

2 'ఇంద్రియాలే ఆత్మ' అని కొందరి వాదన

3 అంతరింద్రియమైన మనస్సు ఇంద్రియములకు ప్రేరకముగా పనిచేయును కాబట్టి మనస్సే ఆత్మయని మరికొందరి వాదన

4 బుద్ధిని క్షణిక విజ్ఞానము అంటారు కాబట్టి ఆ బుద్ధియే ఆత్మయని బౌద్ధములోని శాఖ అయిన 'యోగాచారులు' అన్నారు

5 బౌద్ధములోని మరియొక శాఖ అయిన మాధ్యమిక శాఖవారు అంతా శూన్యమే తప్ప ఏమియు లేదని అన్నారు వీరు శూన్యవాదులు

6 నైయాయికుల, వైశేషికుల వాదము మరొక విధముగా నున్నది దేహమునకు, ఇంద్రియములకు భిన్నమైన వాడొకడున్నాడు అతడే కర్త, భోక్త అనగా చేయువాడు, అనుభవించువాడు అతడే ఆత్మ అన్నారు

7 సాంఖ్యుల వాదన ఇందుకు భిన్నము దేహము, ఇంద్రియముల కన్న భిన్నమైన ఆత్మ భోక్త మాత్రమే అగును కాని కర్త కాదు అన్నారు

8 పతంజలి యోగశాస్త్రము మరొక విధముగా చెప్పుచున్నది ఆత్మభోక్త కాని అందుకు వేరుగా ఈశ్వరుడున్నాడు అతడే సర్వజ్ఞుడు సర్వజ్ఞానస్వరూపుడు, సర్వశక్తియుతుడు అని చెప్పును

9 ఇక వేదాంతము ఈశ్వరుడే జీవాత్మ అనును అజ్ఞానము, దేహము, ఇంద్రియములతో కూడిన జీవాత్మకర్త, భోక్త అట్టి జీవాత్మనే ఈశ్వరునిగా నిర్ణయించారు ఇందుకు శృతివాక్యప్రమాణాలు చాలా చెప్పారు 'బ్రహ్మవేద బ్రహ్మైవభవతి' (ముండకోపనిషత్ (3-2-9) బ్రహ్మను తెలుసుకొన్నవాడు బ్రహ్మయేయగును మహావాక్యములు (శృతివాక్యములు లేక ఉపనిష ద్వాక్యములు) బ్రహ్మ స్వరూపము ఆత్మస్వరూపము ఒకటియే యని చెప్పుచున్నవి ఈ వాక్యములు వేదముల నుండి ఉపనిషత్తులలోకి వచ్చినవి

అహం బ్రహ్మాస్మి' బృహదారణ్యకం (1-4-10) నేనే బ్రహ్మమునై యున్నాను

తత్వమసి' ఛాందోగ్యం (6-9-4) అదే ఈ సమస్తమైన జగత్తు అదే ఆత్మ అదే సత్యం, అదే నీవు నీవే అది

'అయమాత్మాబ్రహ్మ' మాండూక్యోపనిషత్తు (2) ఈ ఆత్మబ్రహ్మమే అయియున్నది

'సోహం అస్మి' (మైత్రేయోపనిషత్ 1-11) అతడు అనగా పరబ్రహ్మము నేనైయున్నాను

'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఛాందోగ్యం (3-14-8) పూర్తిగా సర్వము అనగా ఈ జగత్తు అంతయు అన్నిటికి మూలమైన పరబ్రహ్మమే

ఇలా ఎన్నో శృతివాక్యములు ఉన్నాయి జీవాత్మ పరమాత్మను గురించి ఇంకా అనేకులు అనేక విధాలుగా చెప్తుంటారు ఈ స్థితిలో దేనిని విశ్వసించాలో తెలియక సామాన్య మానవుడు చివరకు జీవాత్మ పరమాత్మ అను విషయాలే వ్యర్థ ప్రసంగాలుగా తీసిపారవేస్తాడు ఎందుకనగా అతని దృష్టిలో ఈ ప్రసంగాలు ఎవరి స్వలాభమునకు వారు చేయు నిరర్థక సంభాషణలుగా కనబడును

కాని ఇది సమాధానం కాదు జననమరణములు అందరికీ సహజములు కాని ఆ రెంటికి మధ్య ఉన్న జీవితం ఒక సమస్య దుఃఖాలే ఆ సమస్య దాని నివృత్తి కావాలనే కదా అందరు కోరేది మోక్షమే ఆ నివృత్తికి మార్గము అంటే అది ఎక్కడో ఎపుడో సామాన్య మానవుడికి అంతుబట్టదు ఇక్కడే ఈ జీవితంలోనే ఏదైనా మార్గం ఉన్నదా అనేదే ప్రశ్న దానికి సమాధానమే వేదాంతం చెపుతుంది మనలో ఉన్న ఆత్మయే పరమాత్మ, ఆ పరమాత్మ అందరిలో ఉన్నాడను 'జీవో బ్రహ్మైవనపరః'' అను సత్యమును అనగా జీవుడే పరబ్రహ్మ, పరబ్రహ్మ కంటే ఇతరము కాదు అని గ్రహించినపుడు ఇక్కడే ఈ జీవితంలోనే సమస్యకు సమాధానం దొరుకుతుంది జీవబ్రహ్మ ఐక్యతను తెలుసుకొనినపుడే జీవన్ముక్తి అనగా జీవించి ఉండగనే ముక్తి

లభించును ఆ ముక్తి మరణానంతర స్థితి కాదు జీవించి ఉండగనే మనస్సు వికసించి సచ్చిదానంద స్థితి కలుగును అదియే వేదాంత లక్ష్యము ఆ స్థితి ప్రత్యక్ష అనుభూతి అది వ్యక్తిగతము మాటలలో వర్ణించుట సాధ్యము కాదు ఎంతో కొంత స్థాయిలోనైనా ఆ స్థితి సాధించగలిగితే మనము ధన్యులము

బ్రహ్మసూత్రములు ఈ స్థితికి మార్గము వివరించును **ప్రథమాధ్యాయము** బ్రహ్మసత్యము అను సిద్ధాంతమును వివరించును భిన్నములైన శృతివాక్యములు ఇందు సమన్వయము చేయబడెను స్వంత అనుభూతితో మహర్షులు చెప్పిన వాక్యముల అభిప్రాయమును సమన్వయము చేసి బ్రహ్మకు జీవాత్మకు, జగత్తుకు ఉన్న సంబంధము ఈ అధ్యాయములో చెప్పబడినది ఈ అధ్యాయమును **సమన్వయాధ్యాయము** అన్నారు

జగత్తు ఉత్పత్తి, స్థితి, లయములు **ద్వితీయాధ్యాయములో** వివరించబడినది ఆత్మకు పరమాత్మకు గల సంబంధము, ఆత్మస్వరూపము ఇందు చెప్పబడినది ఆత్మ పరమాత్మ సంబంధమును గూర్చి ఆక్షేపణలకు సమాధానము చెప్పబడినది అందుచే ఈ అధ్యాయం **అవిరోధాధ్యాయం** అన్నారు

**తృతీయాధ్యాయములో** బ్రహ్మజ్ఞాన సాధనకు మార్గములు చెప్పబడినవి పునర్జన్మను గూర్చి కూడ ప్రస్తావించబడినది అందుకే ఇది **సాధనాధ్యాయము**

బ్రహ్మజ్ఞానఫలమును గూర్చి **చతుర్ధాధ్యాయములో** చెప్పబడింది మరణానంతర జీవితమును గూర్చియు, దేవయాన పితృయాన మార్గములు పునర్జన్మ రహితమైన మోక్షమును గూర్చి ఇందు వివరించబడినది అందుచే ఇది **ఫలాధ్యాయం** అనబడింది

శాస్త్రము అనగా వేదము పరమ ప్రమాణమని బాదరాయణుని అభిప్రాయము పరబ్రహ్మ సత్యమును కనుగొనుటకు తర్కమే మార్గము

అన్నాడు శృతి స్మృతులను మూలములుగా గ్రహించాడు శృతి యనగా ఉపనిషత్తులు స్మృతులు మహాభారతము, భగవద్గీత, మనుస్మృతి శృతికి ప్రమాణము అవసరం లేదు స్మృతికి ప్రమాణము (proof or authority) కావలయును అందువలన స్మృతి ప్రమాణము కొరకు శృతిపై ఆధారపడును పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారములతో కూడినది భౌతికరంగము బుద్ధికి అతీతమైనది బ్రహ్మమునకు సంబంధించిన రంగము తర్కము ననుసరించి నిర్దిష్టమైన (specific) లక్షణములు బ్రహ్మకు ఉన్నవి కాని భక్తిధ్యానములకు 'సాక్షాత్కార జ్ఞానము' లభించును దానికి తర్కము సరిపోదు తర్కము నిలకడ లేనిది ఒక తార్కికుని వాదమున బ్రహ్మము ప్రతిష్ఠించబడకపోయినను వేదాంతవాక్య సమన్వయమునకు విరోధము ఉండదు అని (2-1-11) సూత్రములో చెప్పారు పరమాత్మజ్ఞానమే సమ్యక్‌జ్ఞానము ఆ జ్ఞానమందు విరుద్ధ అభిప్రాయములకు తావులేదు అన్నారు కాబట్టి శృతిని అనుసరించని తర్కం ప్రమాణము కాదు అన్నారు కనబడని ఆత్మను భక్తియోగం ద్వారా ధ్యానములో దర్శించవచ్చునని (3-2-24) సూత్రములో చెప్పారు ఆ ప్రత్యక్షానుభూతి సమాధి అనబడింది కన్నులు మూసుకుని అంతర్ముఖుడై యోగి పరమాత్మను దర్శించును పరమాత్మ జ్యోతిస్వరూపుడు ఆ జ్యోతిని యోగము ద్వారా దర్శించవచ్చును (3-2-25) సూత్రము 'తత్వమసి' అను శృతి వాక్యమును వివరించును దేహము అను ఉపాధి వలన కలిగిన భిన్నత్వమే తప్ప ఆత్మకు పరమాత్మకు భేదము లేదు సహజ రూపం ఒకటే

ప్రకృతి పురుషులు స్వతంత్రులు, భిన్నముగా నుందురని సాంఖ్యము చెప్పును ప్రకృతి పురుషులు ఒకే వస్తువు యొక్క భిన్నరూపములని వేదాంతము చెప్పును బ్రహ్మపదార్థమే జగత్తుకు మూలము, ఆధారము నిద్ర (సుషుప్తి) పరబ్రహ్మము (ఆత్మ) ఉన్నదనుటకు ప్రమాణముగా చెప్పబడినది ఆత్మజ్యోతి పరబ్రహ్మయే అతడు మానవుని హృదయమను ఆకాశమున ఉన్నాడు

అచటనున్న అతని జ్యోతిరూపమును ఆరాధింపవలయును అచేతనములైన పదార్థములు, చేతనులైన జీవులు సృజించబడుటకు బ్రహ్మమే కారణము బ్రహ్మమే ప్రతి భౌతిక పదార్థము సృజించెను పంచభూతముల కార్యముచే జగత్తు పరిణామము సంభవించును అయినను ఆ పరిణామశక్తి బ్రహ్మము వలననే కలుగునని చెప్పబడినది (2-3-13) సూత్రములో ఈ విషయము చెప్పబడింది పరమేశ్వరుడే ఆకాశము మొదలగు భూతములపై ఆధిపత్యం వహించి సృష్టిని సంకల్పించి భౌతికరూపములను కల్పించెనని చెప్పబడింది సర్వకార్యములకు పరబ్రహ్మయే కర్త, పంచభూతములు కావు అన్నిటియందు ఉంటూ అన్నిటిని ప్రవర్తింపజేయు అంతర్యామి పరమాత్మ అతడే జగత్తుకు ఉపాదానము అనగా మూలకారణము బంగారము బంగారు వస్తురూపమునకు మారునటులె నిర్గుణుడైన పరమాత్మ సర్వవస్తురూపమును ధరించెను పరమాత్మయే కారణము, పరమాత్మయే కార్యము దీనికి ఉపమానం 2-1-16, 19, 20 సూత్రములలో చెప్పారు 2-1-16లో కార్యకారణములను గురించి చెప్పారు కార్యము పుట్టుటకు ముందు అది కారణరూపంలో ఉంటుంది కుండ ఏర్పడక ముందు అది మట్టిగా ఉన్నది కుండరూపం ఏర్పడిన తరువాత కూడ అది మట్టి కంటె భిన్నము కాదు అనగా కార్యము పుట్టిన తరువాత కూడ అది కారణం కంటె వేరు కాదు కుండ కార్యము మట్టి కారణము సృష్టికి ముందు ఒక్క పరమాత్మయే ఉన్నాడు అతడే బ్రహ్మపదార్థం బ్రహ్మయే జగత్తుకు కారణం జగత్తు కార్యము కారణమైన బ్రహ్మము భూత, వర్తమాన, భవిష్యకాలములందు ఉండును అటులే జగత్తు కూడ ఉండును మట్టి లేనిచో కుండలేదు అటులే పరమాత్మ లేనిచో జగత్తు లేదు ఇసుక నుండి నూనెరాదు గదా!

దీనికి 2-1-18లో యుక్తి ద్వారా సృష్టికి ముందు 'సత్' భావం ఉన్నదని తెలియును అన్నారు పెరుగు కావాలనుకున్నవాడు పాలు తెచ్చుకుంటాడు మట్టిని తీసికురాడు ఎందుకనగా మట్టిలో పెరుగు

ండదు పాలలో పెరుగు ఉండునని వానికి తెలును అనగా పెరుగు
ృడుటకు ముందు అది పాలలో ఉన్నది అను భావము ఈ భావమే యుక్తి
ుక్తి వలన కార్యమగు పెరుగు కారణమైన పాలలోనే ఉన్నది అని తెలియును
నగా కార్యమనునది కారణములో ముందుగనే యుండును కారణమగు
రమాత్మయందు కార్యమగు జగత్తు ముందే ఉన్నది 2-1-19లో మరియొక
పమానం చెప్పారు ఒక వస్త్రం మడత పెట్టబడినపుడు వస్త్ర స్వరూపము
్పష్టంగా తెలియదు మడతలు విప్పిపరచినపుడు ఆ వస్త్రస్వరూపము పూర్తిగా
లియును మడతలో ఉన్న వస్త్రము, మడత విప్పినపుడూ అదే వస్త్రము
న్నము కాదు అటులే కార్యకారణములు భిన్నములు కావు

2-1-20 సూత్రమందు మరియొక వివరణ ఇచ్చారు ప్రాణాయామ
మయంలో ఊపిరి బిగించబడును అపుడా వ్యక్తి ఏ పని చేయలేదు
యినను అతడు సజీవుడే ఊపిరి విడిచినపుడు తిరిగి కాళ్లు, చేతులు
నిచేయును రెండు సమయములందు ఉన్న ఊపిరి ఒకటే భిన్నముకాదు
గించినపుడు ఊపిరి ప్రసారం లేదు, వదలినపుడు ఊపిరి ప్రసారం ఉండును
ఊపిరి ఒక్కటే అదే విధంగా కార్యకారణములకు భేదం ఉండదు
ార్యకారణములు సమానములే అయినను ఫలితములు భిన్నముగా నుండును

అటులే జగత్తు బ్రహ్మము నుండి భిన్నము కాదు బ్రహ్మ సూత్రములకు
ాష్యకారులు అందరు కార్యకారణములకు భేదము లేదని అంగీకరించినను
్రహ్మమునకు జగత్తునకు గల సమానత్వమునకు రూపము చెప్పటలోనే
ారు విభేదించారు బాదరాయణుని అభిప్రాయములో బ్రహ్మమునకు
గత్తుకు గల సంబంధము అనన్యము అనగా భేదము లేదని గాని జగత్తునందు
ూర్పు ఉండదు అని గాని కాదు అని రాధాకృష్ణ వ్యాఖ్యానించారు ఈ
ూర్పునకు కారణము అవిద్య (అజ్ఞానము) అని శంకరుడు భాష్యం చెప్పారు
ాడు సర్పము అని భ్రాంతి పొందినవానికే త్రాడు సర్పముగా కనబడును

అచటనున్న అతని జ్యోతిరూపమును ఆరాధింపవలయును అచేతనములైన పదార్థములు, చేతనులైన జీవులు సృజించబడుటకు బ్రహ్మమే కారణము బ్రహ్మమే ప్రతి భౌతిక పదార్థము సృజించెను పంచభూతముల కార్యముచే జగత్తు పరిణామము సంభవించును అయినను ఆ పరిణామశక్తి బ్రహ్మము వలననే కలుగునని చెప్పబడినది (2-3-13) సూత్రములో ఈ విషయము చెప్పబడింది పరమేశ్వరుడే ఆకాశము మొదలగు భూతములపై ఆధిపత్యం వహించి సృష్టిని సంకల్పించి భౌతికరూపములను కల్పించెనని చెప్పబడింది సర్వకార్యములకు పరబ్రహ్మయే కర్త, పంచభూతములు కావు అన్నిటియందు ఉంటూ అన్నిటిని ప్రవర్తింపజేయు అంతర్యామి పరమాత్మ అతడే జగత్తుకు ఉపాదానము అనగా మూలకారణము బంగారము బంగారు వస్తురూపమునకు మారునటులె నిర్గుణుడైన పరమాత్మ సర్వవస్తురూపమును ధరించెను పరమాత్మయే కారణము, పరమాత్మయే కార్యము దీనికి ఉపమానం 2-1-16, 19, 20 సూత్రములలో చెప్పారు 2-1-16లో కార్యకారణములను గురించి చెప్పారు కార్యము పుట్టుటకు ముందు అది కారణరూపంలో ఉంటుంది కుండ ఏర్పడక ముందు అది మట్టిగా ఉన్నది కుండరూపం ఏర్పడిన తరువాత కూడ అది మట్టి కంటె భిన్నము కాదు అనగా కార్యము పుట్టిన తరువాత కూడ అది కారణం కంటె వేరు కాదు కుండ కార్యము మట్టి కారణము సృష్టికి ముందు ఒక్క పరమాత్మయే ఉన్నాడు అతడే బ్రహ్మపదార్థం బ్రహ్మయే జగత్తుకు కారణం జగత్తు కార్యము కారణమైన బ్రహ్మము భూత, వర్తమాన, భవిష్యకాలములందు ఉండును అటులే జగత్తు కూడ ఉండును మట్టి లేనిచో కుండలేదు అటులే పరమాత్మ లేనిచో జగత్తు లేదు ఇసుక నుండి నూనెరాదు గదా!

దీనికి 2-1-18లో యుక్తి ద్వారా సృష్టికి ముందు 'సత్' భావం ఉన్నదని తెలియును అన్నారు పెరుగు కావాలనుకున్నవాడు పాలు తెచ్చుకుంటాడు మట్టిని తీసికురాడు ఎందుకనగా మట్టిలో పెరుగు

సృష్టి చేయు శక్తి బ్రహ్మమునకు ఉన్నదని బాదరాయణుడు అంగీకరించెను బ్రహ్మ తానెట్టి మార్పుచెందక ప్రపంచముగా పరిణామము చెందును కాని ఆ పరిణామము ఎటుల సాధ్యమో బ్రహ్మసూత్రములు చెప్పలేదు (1-4-26, 2-1-27) ఈ విషయమే భాష్యకారులు వివిధ రీతులలో వ్యాఖ్యానించారు

బ్రహ్మ జగత్తుగా మారలేదని, అవిద్య వలన బ్రహ్మము జగత్తుగా మారెనని విశ్వసించుచున్నాము అని శంకరుని భాష్యము తెలిసినవాడు (జ్ఞాత) తెలియదగిన విషయము (జ్ఞేయము), బుద్ధి (జ్ఞానము) ఈ మూడింటి సంయుక్త స్వరూపము పరబ్రహ్మ అగుటచే ప్రపంచము బ్రహ్మమునందే యున్నదని శంకరుని వాదము బ్రహ్మమునకు అద్భుతశక్తులున్నవని రామానుజుని సూచన బ్రహ్మమునకు తోడుగా అనాదియైన జగత్తు ఒక ప్రవాహముగా విడిగానున్నది అను వివరణకు సమాధానముగా పరబ్రహ్మకు అద్భుతశక్తులుండుటచే అతనికి అసాధ్యమనునది ఉండదు అని రామానుజుని ప్రవచనము మొత్తం మీద 'మాయ' అను శబ్దమునకు వేదాంత సిద్ధాంతము లందు స్పష్టమగు అర్థమున్నట్లు కనబడదు స్వప్నమువలె జగత్తు మాయకాదు అని బ్రహ్మసూత్రములు చెప్పగా (3-2-3), అనంతరకాలమందు రూపొందిన సిద్ధాంతములందు దానికి స్పష్టమైన అర్థము కనబడదు

మాయ సర్వత్ర వ్యాపించియుండుటయేగాక అది ఆది, అంతము లేనిది అని శంకరుని సిద్ధాంతము కాని సర్వత్ర వ్యాపించియున్న (universal) మాయకు వ్యక్తిపరముగా అజ్ఞానరూపంలో నుండు మాయకు భేదము తెలియవలెను వ్యక్తిపరమైన అవిద్యకు ఆది లేదు కాని ఏదో ఒక సమయమున అంతము కావచ్చు ఆత్మజ్ఞానజ్యోతి దర్శన అనుభూతి (spiritual illumination) పొందినపుడు అజ్ఞానము అనబడు మాయ అంతరించును అట్టి మానవుని స్మృతి (స్పృహ consciousness) నుండి ఈ వస్తుప్రపంచము అదృశ్యమగును

అచటనున్న అతని జ్యోతిరూపమును ఆరాధింపవలయును అచేతనములైన పదార్థములు, చేతనులైన జీవులు సృజించబడుటకు బ్రహ్మమే కారణము బ్రహ్మమే ప్రతి భౌతిక పదార్థము సృజించెను పంచభూతముల కార్యముచే జగత్తు పరిణామము సంభవించును అయినను ఆ పరిణామశక్తి బ్రహ్మము వలననే కలుగునని చెప్పబడినది (2-3-13) సూత్రములో ఈ విషయము చెప్పబడింది పరమేశ్వరుడే ఆకాశము మొదలగు భూతములపై ఆధిపత్యం వహించి సృష్టిని సంకల్పించి భౌతికరూపములను కల్పించెనని చెప్పబడింది సర్వకార్యములకు పరబ్రహ్మయే కర్త, పంచభూతములు కావు అన్నిటియందు ఉంటూ అన్నిటిని ప్రవర్తింపజేయు అంతర్యామి పరమాత్మ అతడే జగత్తుకు ఉపాదానము అనగా మూలకారణము బంగారము బంగారు వస్తురూపమునకు మారునటులె నిర్గుణుడైన పరమాత్మ సర్వవస్తురూపమును ధరించెను పరమాత్మయే కారణము, పరమాత్మయే కార్యము దీనికి ఉపమానం 2-1-16, 19, 20 సూత్రములలో చెప్పారు 2-1-16లో కార్యకారణములను గురించి చెప్పారు కార్యము పుట్టుటకు ముందు అది కారణరూపంలో ఉంటుంది కుండ ఏర్పడక ముందు అది మట్టిగా ఉన్నది కుండరూపం ఏర్పడిన తరువాత కూడ అది మట్టి కంటె భిన్నము కాదు అనగా కార్యము పుట్టిన తరువాత కూడ అది కారణం కంటె వేరు కాదు కుండ కార్యము మట్టి కారణము సృష్టికి ముందు ఒక్క పరమాత్మయే ఉన్నాడు అతడే బ్రహ్మపదార్థం బ్రహ్మయే జగత్తుకు కారణం జగత్తు కార్యము కారణమైన బ్రహ్మము భూత, వర్తమాన, భవిష్యకాలములందు ఉండును అటులే జగత్తు కూడ ఉండును మట్టి లేనిచో కుండలేదు అటులే పరమాత్మ లేనిచో జగత్తు లేదు ఇసుక నుండి నూనెరాదు గదా!

దీనికి 2-1-18లో యుక్తి ద్వారా సృష్టికి ముందు 'సత్' భావం ఉన్నదని తెలియును అన్నారు పెరుగు కావాలనుకున్నవాడు పాలు తెచ్చుకుంటాడు మట్టిని తీసికురాడు ఎందుకనగా మట్టిలో పెరుగు

భావించాడు

శంకరునిది అద్వైతవాదం రామానుజునిది ఈశ్వరవాదం లేక ఆస్తికవాదం నిర్గుణము నిర్వికారము అయిన పరబ్రహ్మమే సత్యము ఈ ప్రపంచమంతా మాయచే కప్పబడి సత్యముగా కనబడు అసత్యము దానినే మాయ లేక మిధ్య అన్నాడు శంకరులు జీవాత్మయే పరమాత్మ బ్రహ్మజ్ఞాన అనుభూతి పొందినపుడు ఈ సత్యము తెలియును అన్నారు శంకరుడు క్రమముక్తి అంగీకరించెను క్రమముక్తి అనగా మరణానంతరము దేవయానము ద్వారా ప్రయాణించి ముక్తిని పొందుట అయినను శంకరుడు భావాతీత జ్ఞానముతో జీవించియుండగనే ముక్తిని అనగా జీవన్ముక్తి పొందుటయే శ్రేష్ఠమని భావించెను రామానుజుడు జీవన్ముక్తిని విశ్వసించలేదు విదేహముక్తినే అనగా మరణానంతర ముక్తినే అతడు కాంక్షించాడు రామానుజుడు శంకరుని మాయాసిద్ధాంతమును తిరస్కరించినను, మానవుని అజ్ఞానమునే మాయగా అంగీకరించెను అజ్ఞానము వలన ఆత్మ తన దివ్యమూలస్థితిని, తన ధ్యేయమును మరచి భౌతికమైన స్థూలశరీరముతో ఐక్యత పొందుచున్నది అన్నాడు దాని ఫలితముగా అహంకారము ప్రబలును అన్నాడు భగవంతునికి భక్తితో ఆత్మార్పణ చేసుకొనినపుడు ముక్తి కలుగును అని చెప్పాడు ఈశ్వరవాదియన రామానుజుడు ఇష్టదైవమునే పరబ్రహ్మ అన్నాడు ఈ పరబ్రహ్మ సగుణుడు ఆత్మలు, విశ్వము అంతా సత్యము అవే పరబ్రహ్మ అంశలు లేక రూపాంతరములు దానిమ్మకాయను ప్రతీకగా చెప్పారు విత్తనములు ఆత్మలు (జీవులు) పైన ఉన్న బెరడు విశ్వము విత్తనములు లేకుండ బెరడు లేదు బెరడు లేకుండ విత్తనములు లేవు ఇది రామానుజుని వాదము పరబ్రహ్మ జీవులు ఒకరు కాదు కాని ఇద్దరు వేరు కాదు బ్రహ్మమునకు విశ్వమునకు ఉన్న సంబంధమే జీవాత్మకు శరీరమునకు ఉన్నది ఆత్మశరీరము కంటే భిన్నమైనది అయినను ఆత్మ శరీరమును నడిపించును శరీరమును ఒక పరికరముగా ఉపయోగించును అదే

అచటనున్న అతని జ్యోతిరూపమును ఆరాధింపవలయును  అచేతనములైన పదార్థములు, చేతనులైన జీవులు సృజించబడుటకు బ్రహ్మమే కారణము బ్రహ్మమే ప్రతి భౌతిక పదార్థము సృజించెను  పంచభూతముల కార్యముచే జగత్తు పరిణామము సంభవించును  అయినను ఆ పరిణామశక్తి బ్రహ్మము వలననే కలుగునని చెప్పబడినది  (2-3-13) సూత్రములో ఈ విషయము చెప్పబడింది  పరమేశ్వరుడే ఆకాశము మొదలగు భూతములపై ఆధిపత్యం వహించి సృష్టిని సంకల్పించి భౌతికరూపములను కల్పించెనని చెప్పబడింది సర్వకార్యములకు పరబ్రహ్మయే కర్త, పంచభూతములు కావు  అన్నిటియందు ఉంటూ అన్నిటిని ప్రవర్తింపజేయు అంతర్యామి పరమాత్మ  అతడే జగత్తుకు ఉపాదానము అనగా మూలకారణము  బంగారము బంగారు వస్తురూపమునకు మారునటులె నిర్గుణుడైన పరమాత్మ సర్వవస్తురూపమును ధరించెను పరమాత్మయే కారణము, పరమాత్మయే కార్యము  దీనికి ఉపమానం 2-1-16, 19, 20 సూత్రములలో చెప్పారు  2-1-16లో కార్యకారణములను గురించి చెప్పారు  కార్యము పుట్టుటకు ముందు అది కారణరూపంలో ఉంటుంది కుండ ఏర్పడక ముందు అది మట్టిగా ఉన్నది  కుండరూపం ఏర్పడిన తరువాత కూడ అది మట్టి కంటె భిన్నము కాదు  అనగా కార్యము పుట్టిన తరువాత కూడ అది కారణం కంటె వేరు కాదు  కుండ కార్యము  మట్టి కారణము  సృష్టికి ముందు ఒక్క పరమాత్మయే ఉన్నాడు  అతడే బ్రహ్మపదార్థం బ్రహ్మయే జగత్తుకు కారణం  జగత్తు కార్యము  కారణమైన బ్రహ్మము భూత, వర్తమాన, భవిష్యకాలములందు ఉండును  అటులే జగత్తు కూడ ఉండును మట్టి లేనిచో కుండలేదు  అటులే పరమాత్మ లేనిచో జగత్తు లేదు  ఇసుక నుండి నూనెరాదు గదా!

దీనికి 2-1-18లో యుక్తి ద్వారా సృష్టికి ముందు 'సత్' భావం ఉన్నదని తెలియును అన్నారు  పెరుగు కావాలనుకున్నవాడు పాలు తెచ్చుకుంటాడు  మట్టిని తీసికురాడు  ఎందుకనగా మట్టిలో పెరుగు

జీవాత్మలు పరస్పరం భిన్నములు అవి భగవంతుని కంటె భిన్నములు జీవాత్మలకు సహజ జ్ఞానముండును కాని జననమొందిన ప్రతి జీవి సంసార బంధమందు తగుల్కొనును నిరంతర కృషితో భక్తి ద్వారా బంధవిముక్తి పొందవచ్చును అయినను జీవాత్మలు మూడు రకములు అని మధ్వమతము 1) భక్తులు నీతిమంతులు భగవధ్యానము ద్వారా వీరు ముక్తి పొంది వైకుంఠము చేరుదురు ముక్తి అనగా వైకుంఠ ప్రాప్తియే 2) రెండవరకము వారికి ఎన్నటికి ముక్తి లభించదు జనన, మరణ, పునర్జన్మ ప్రవాహములో కష్టసుఖములను అనుభవిస్తూ ఉంటారు 3) ఇక మూడవరకము దురాత్ములు వీరు విష్ణువును దూషించుచు భక్తులను హింసించుదురు వీరికి ముక్తి ఉండదు వీరికి నరకదండన నిశ్చయము

మధ్వమతమందు జీవన్ముక్తికి స్థానము లేదు 'మాయ' అను ప్రసక్తియే లేదు మహిమకే ప్రాధాన్యము కాని ఎవరో కొద్దిమందికి మాత్రమే ముక్తి కలుగును మిగిలినవారు అనర్హులు అని జీవులను వర్గములుగా విభజించుట వేదాంత వచనములకు విరుద్ధముగా కన్పడుచున్నదని ఒక విమర్శ ఉన్నది ముక్తికి అర్హత సాధనతో ఏ జీవుడైనను పొందవచ్చునని వేదాంత భావము గదా!

భాస్కరుడు శంకరుని అనంతర కాలమువాడు రామానుజుని ముందు కాలమువాడు ఇతడు కూడ అద్వైతవాదియే కాని శంకరుని మాయావాదమును ఇతడు అంగీకరించలేదు ఇతనిది భేద అభేదవాదము అనగా జీవాత్మ పరమాత్మల సంబంధములో భేదములో భేదము లేకుండుట పరబ్రహ్మ స్వభావము పవిత్రము, అనంతము కాని ఒక నిశ్చితరూపము ఉండదు పరమాత్మయే కర్త, భోక్త అనగా అనుభవించు శక్తి, అనుభవించబడు శక్తి అందువలననే పరమాత్మ చేతనులైన జీవులుగాను, అచేతనములైన వస్తువులుగాను తనకుతాను మార్పు పొందగలడు ఈ పరిణామము వాస్తవము

అచటనున్న అతని జ్యోతిరూపమును ఆరాధింపవలయును అచేతనములైన పదార్థములు, చేతనులైన జీవులు సృజించబడుటకు బ్రహ్మమే కారణము బ్రహ్మమే ప్రతి భౌతిక పదార్థము సృజించెను పంచభూతముల కార్యముచే జగత్తు పరిణామము సంభవించును అయినను ఆ పరిణామశక్తి బ్రహ్మము వలననే కలుగునని చెప్పబడినది (2-3-13) సూత్రములో ఈ విషయము చెప్పబడింది పరమేశ్వరుడే ఆకాశము మొదలగు భూతములపై ఆధిపత్యం వహించి సృష్టిని సంకల్పించి భౌతికరూపములను కల్పించెనని చెప్పబడింది సర్వకార్యములకు పరబ్రహ్మయే కర్త, పంచభూతములు కావు అన్నిటియందు ఉంటూ అన్నిటిని ప్రవర్తింపజేయు అంతర్యామి పరమాత్మ అతడే జగత్తుకు ఉపాదానము అనగా మూలకారణము బంగారము బంగారు వస్తురూపమునకు మారునటులె నిర్గుణుడైన పరమాత్మ సర్వవస్తురూపమును ధరించెను పరమాత్మయే కారణము, పరమాత్మయే కార్యము దీనికి ఉపమానం 2-1-16, 19, 20 సూత్రములలో చెప్పారు 2-1-16లో కార్యకారణములను గురించి చెప్పారు కార్యము పుట్టుటకు ముందు అది కారణరూపంలో ఉంటుంది కుండ ఏర్పడక ముందు అది మట్టిగా ఉన్నది కుండరూపం ఏర్పడిన తరువాత కూడ అది మట్టి కంటె భిన్నము కాదు అనగా కార్యము పుట్టిన తరువాత కూడ అది కారణం కంటె వేరు కాదు కుండ కార్యము మట్టి కారణము సృష్టికి ముందు ఒక్క పరమాత్మయే ఉన్నాడు అతడే బ్రహ్మపదార్థం బ్రహ్మయే జగత్తుకు కారణం జగత్తు కార్యము కారణమైన బ్రహ్మము భూత, వర్తమాన, భవిష్యకాలములందు ఉండును అటులే జగత్తు కూడ ఉండును మట్టి లేనిచో కుండలేదు అటులే పరమాత్మ లేనిచో జగత్తు లేదు ఇసుక నుండి నూనెరాదు గదా!

దీనికి 2-1-18లో యుక్తి ద్వారా సృష్టికి ముందు 'సత్' భావం ఉన్నదని తెలియును అన్నారు పెరుగు కావాలనుకున్నవాడు పాలు తెచ్చుకుంటాడు మట్టిని తీసికురాడు ఎందుకనగా మట్టిలో పెరుగు

అంతరించును శుద్ధమైన ఆత్మస్థితి పొందినపుడు ముక్తి కలుగును ఆత్మ బ్రహ్మములో ఐక్యమగుటయే ముక్తి అది మరణానంతరమే సాధ్యము కాని జీవించియుండగా కాదు అనగా జీవన్ముక్తిని భాస్కరుడు విశ్వసించలేదు పరమాత్మతో ఐక్యత పొందుటయే జీవుని ధ్యేయము కావలయును అందుకు ప్రపంచములో ఉంటూనే ప్రపంచమందు ఆసక్తి లేకుండ పరమాత్మను ధ్యానించుటయే దానికి మార్గము అని భాస్కరుడు చెప్పాడు

మధ్వుని తరువాత కాలమువాడు నింబార్కుడు భక్తిమార్గ వేదాంతములో అనగా వైష్ణవమతములో ఏర్పడిన నాలుగు శాఖలలో నింబార్కునిది ఒకటి అవి రామానుజుని అవిశిష్టాద్వైత వైష్ణవం నింబార్కుని ద్వైతాద్వైతవైష్ణవం, మధ్వుని ద్వైతవైష్ణవం, వల్లభుని శుద్ధాద్వైతవైష్ణవం నింబార్కుని ద్వైతాద్వైతం భాస్కరుని భేదాభేదమును పోలియుండును కాని అతనికి పరమాత్మయందు అపారమైన విశ్వాసముండుటచే పరమాత్మను సగుణరూపునిగా భావించి రామానుజుని వలె అతడు భక్తితత్త్వమును విశ్వసించెను భాస్కరునిది భక్తితత్త్వము కాదు

శంకరుని అనంతరము బ్రహ్మసూత్ర భాష్యకారులు అందరు శంకరుని అద్వైత సిద్ధాంతమును ఎదుర్కొనినవారే (వ్యతిరేకించినవారే) కాని వారు ఆశించినంత విజయం వారికి సిద్ధించలేదు ఎందుకనగా శంకరుని అద్వైత సిద్ధాంతము, జీవన్ముక్తి భావము నేటికీ సజీవముగానే ఉన్నాయి నింబార్కుని తత్త్వసిద్ధాంతములో ఒక ప్రత్యేకత ఉన్నది అతడు తన సిద్ధాంతమును వివరించెనే గాని ఇతరుల సిద్ధాంతములను వ్యతిరేకించలేదు భగవంతుడు అనంతుడు అతనిని గ్రహించుటకు మార్గములు అనంతములు క్లుప్తముగా ఇది అతని భావం భగవంతుడు భావాతీతుడు, అవ్యక్తుడు విశ్వసృష్టియందు అతనికి అలుపు ఉండదు అటులే పరమాత్మను సగుణునిగా కూడ అతడు విశ్వసించాడు

ఈ విశ్వము పరమాత్మకు భిన్నముగాను, అదే సమయమున భిన్నత్వము లేకుండగను ఉండును దీనికి సముద్రపు అలలను (waves) ఉపమానంగా చెప్పారు సముద్రపు ప్రతి అల ఆ నీటిలోనిదే కాని ప్రతి అలకు తనదైన ప్రత్యేకత లేక భిన్నత్వము ఉండును సూర్యుని కిరణములు సూర్యుడు కాదు కాని అవి సూర్యుని కంటే భిన్నము కాదు అటువంటిదే జీవాత్మ పరమాత్మ సంబంధము అన్నాడు జీవాత్మ ఒకే సమయమున పరమాత్మతో ఏకత్వమును, భిన్నత్వమును కూడ కలిగియుండునని అతని భావము ఇది మూలపదార్థమునకు దాని భాగమునకు ఉండు భేదము మాత్రమే కాదు ఎందుకనగా ఆ భాగము మూలములోనిదే అదే జీవాత్మ పరమాత్మ సంబంధము అందువలన నింబార్కుని ద్వైతాద్వైతమునకు, భాస్కరుని భేదాభేదమునకు పోలిక ఉన్నదని చెప్పవచ్చును కాని రెండు తత్త్వముల మధ్య ఒక ప్రధానమైన భేదమున్నది అజ్ఞానముతో నున్నంతవరకు జీవాత్మ పరమాత్మ అంశగా విడిగానుండును అజ్ఞానము తొలగినపుడు జీవాత్మ పరమాత్మతో ఏకమై ముక్తి పొందును ఇది భాస్కరుని సిద్ధాంతము కాని నింబార్కుని దృష్టిలో ఎల్లపుడు జీవాత్మ పరమాత్మలోని అంశము అదే సమయమున పరమాత్మతో ఐక్యముగాను ఉండును అజ్ఞానస్థితిలోను, జ్ఞానస్థితిలోను అట్లే ఉండునన్నాడు

నింబార్కుని అనుసరించి అజ్ఞాన స్థితియందు జీవాత్మ గోచరమగుచున్న వస్తు ప్రపంచ అనుభవమును పొందుచుండును జ్ఞానము సిద్ధించినపుడు మనస్సు అతీతమై భావాతీతమైన దృష్టిని (vision) పొంది తనలోనే ఉన్న పరమాత్మ దర్శన అనుభూతిని పొందును అదే సమయమున జీవాత్మ తాను పరమాత్మ అంశమనియు పరమాత్మతో ఏకమనియు కూడ గ్రహించును ఇదే ద్వైతములో అద్వైతము నింబార్కుడు జ్ఞానమునకు భక్తికి కూడ ప్రాధాన్యమొసగెను జ్ఞానము పరమాత్మను తెలుపును భక్తి ఆత్మార్పణతో కూడిన ప్రేమలో కలియును భక్తిలోను, ఆత్మార్పణలోను జీవాత్మ నిల్చియే

యుండును (self remains) అనగా ఐక్యము పొంది తన స్థితిని కోల్పోదు నింబార్కుని అనుయాయులు కృష్ణుని పరబ్రహ్మ స్వరూపునిగాను, రాధను మధురభక్తికి (నిశ్చలమైన ప్రేమభక్తి) ప్రతీకగాను భావించారు నింబార్కుడే ఈ భావము కలిగియుండెనని కూడ అంటారు పరబ్రహ్మ యొక్క దివ్యసుందరా కారమే శ్రీకృష్ణుడని, అతని శక్తియే రాధయని అతని భావము అన్నారు రామానుజుడిది కూడ ఇదే భావము కాని అతడు భావించినది రాధాకృష్ణుల రూపములు కాదు అవి లక్ష్మీనారాయణుల రూపములు

వల్లభుడు చాల అనంతరకాలమువాడు అతడు చెప్పినది శుద్ధాద్వైతము అన్నారు వల్లభుని బోధనలలో ప్రశాంత ప్రేమ స్వరూపుడైన పరబ్రహ్మ కేంద్రబిందువు శ్రీకృష్ణుడే పరబ్రహ్మ సగుణ స్వరూపమని వల్లభుని మతము శ్రీకృష్ణుడు అద్వితీయుడు, సచ్చిదానందమూర్తి అయిన ప్రేమ స్వరూపుడు కావున వల్లభునకు ఇష్టదైవమైన కృష్ణుడే పరబ్రహ్మ ఆ దేవునికి వల్లభుడు మూడు రూపములు చెప్పాడు 1 పరబ్రహ్మ అయిన పురుషోత్తమునిగా శ్రీకృష్ణ రూపము, 2 అంతర్యామిగా అందరి జీవులలో నుండు జీవాత్మ, 3 అక్షరబ్రహ్మముగా శ్రీకృష్ణుని నివాసస్థానము అక్షరమే ప్రకృతిగాను, జీవాత్మగాను రూపము పొందును కాని అక్షరబ్రహ్మము రెంటికి అతీతముగా నుండును పురుషోత్తముడు సర్వోన్నతుడు, సర్వజ్ఞుడు, అక్షరము అతని బాహ్యరూపము అన్నాడు ఈ అక్షరము కాలము, కర్మ స్వభావముగా కనబడును కాలము ఫలితము బట్టి తెలియును సర్వజీవులకు అది ఆధారము కర్మ సర్వవ్యాపి అది వివిధ జీవుల చర్యలలో వివిధ రూపములు పొందును స్వభావము పరిణామమును కలిగించును

భగవంతుడు నిర్గుణుడు సగుణుడు కూడ భగవంతుని కృపతోనే భగవంతుని తెలియగలము భగవంతుడు తన మాయతో ఏ రూపమునైనా పొందగలడు పరబ్రహ్మ తన నుండే విశ్వమును సృష్టించాడు సృష్టిని ఒక

ఈ విశ్వము పరమాత్మకు భిన్నముగాను, అదే సమయమున భిన్నత్వము లేకుండగను ఉండును దీనికి సముద్రపు అలలను (waves) ఉపమానంగా చెప్పారు సముద్రపు ప్రతి అల ఆ నీటిలోనిదే కాని ప్రతి అలకు తనదైన ప్రత్యేకత లేక భిన్నత్వము ఉండును సూర్యుని కిరణములు సూర్యుడు కాదు కాని అవి సూర్యుని కంటే భిన్నము కాదు అటువంటిదే జీవాత్మ పరమాత్మ సంబంధము అన్నాడు జీవాత్మ ఒకే సమయమున పరమాత్మతో ఏకత్వమును, భిన్నత్వమును కూడ కలిగియుండునని అతని భావము ఇది మూలపదార్థమునకు దాని భాగమునకు ఉండు భేదము మాత్రమే కాదు ఎందుకనగా ఆ భాగము మూలములోనిదే అదే జీవాత్మ పరమాత్మ సంబంధము అందువలన నింబార్కుని ద్వైతాద్వైతమునకు, భాస్కరుని భేదాభేదమునకు పోలిక ఉన్నదని చెప్పవచ్చును కాని రెండు తత్త్వముల మధ్య ఒక ప్రధానమైన భేదమున్నది అజ్ఞానముతో నున్నంతవరకు జీవాత్మ పరమాత్మ అంశగా విడిగానుండును అజ్ఞానము తొలగినపుడు జీవాత్మ పరమాత్మతో ఏకమై ముక్తి పొందును ఇది భాస్కరుని సిద్ధాంతము కాని నింబార్కుని దృష్టిలో ఎల్లపుడు జీవాత్మ పరమాత్మలోని అంశము అదే సమయమున పరమాత్మతో ఐక్యముగాను ఉండును అజ్ఞానస్థితిలోను, జ్ఞానస్థితిలోను అట్లే ఉండునన్నాడు

నింబార్కుని అనుసరించి అజ్ఞాన స్థితియందు జీవాత్మ గోచర మగుచున్న వస్తు ప్రపంచ అనుభవమును పొందుచుండును జ్ఞానము సిద్ధించినపుడు మనస్సు అతీతమై భావాతీతమైన దృష్టిని (vision) పొంది తనలోనే ఉన్న పరమాత్మ దర్శన అనుభూతిని పొందును అదే సమయమున జీవాత్మ తాను పరమాత్మ అంశమనియు పరమాత్మతో ఏకమనియు కూడ గ్రహించును ఇదే ద్వైతములో అద్వైతము నింబార్కుడు జ్ఞానమునకు భక్తికి కూడ ప్రాధాన్యమొసగెను జ్ఞానము పరమాత్మను తెలుపును భక్తి ఆత్మార్పణతో కూడిన ప్రేమలో కలియును భక్తిలోను, ఆత్మార్పణలోను జీవాత్మ నిల్చియే

మార్గములు అన్నాడు ధ్యానములో ఏకాగ్రత ద్వారా పరమాత్మతో ఐక్యతానుభూతిని వల్లభుడు విశ్వసించాడు ఇట్టి నిగూఢమైన ఐక్యతయే జీవితధ్యేయము అన్నాడు అహంకారము, వ్యామోహము నశించినపుడు భగవంతుని యందలి వాస్తవ ప్రపంచమును గుర్తించగలము అపుడే కృష్ణప్రేమతత్వము, గోపికల మధురభక్తి బోధపడును అన్నాడు భాగవత కృష్ణుని ప్రేమస్వరూపిగా గుర్తించగలగటమే జీవితములో ఉత్కృష్టమైన కార్యసిద్ధి అని వల్లభుని ప్రవచనము భక్తియే ముక్తికి మార్గము అని అతని విశ్వాసము జీవన్ముక్తి ప్రసక్తి శంకరుని అద్వైతములో తప్ప ఇతరులు లెవ్వరు దానిని తలచలేదు

(2-3-18) సూత్రములో బాదరాయణుడు ఆత్మను 'జ్ఞా' అన్నాడు 'జ్ఞా'కు భాష్యకారులు వివిధ వాఖ్యలు చెప్పారు 'జ్ఞా'ను శంకరుడు జ్ఞానము అన్నాడు రామానుజుడు 'జ్ఞాత' అన్నాడు అనగా తెలియువాడు కొందరు అది జ్ఞానము, జ్ఞాత కూడా అన్నారు ఈ సూత్రార్థము శంకరభాష్యముననుసరించి జీవుడు నిత్యుడు కాబట్టి చైతన్యస్వరూపుడు జీవునికి జననమరణములు లేవు అన్నారు కాబట్టి పరమాత్మయే జీవుడు పరమాత్మ వలెనే జీవుడు నిత్యము జ్ఞానస్వరూపుడు ఉపాధుల వలన అనగా శరీర ఇంద్రియ సంబంధము వలన జీవుడుగా ఉండును తప్ప ఆత్మ అచేతనము కాదు జీవాత్మ ఒక కర్త (2-3-33→39) ఆత్మకు ఆది లేదు అందుచే జననమరణములు ఆత్మకు అంటవు జీవాత్మ పరిమాణము అణువు అని బాదరాయణుడు అన్నాడు ఇతర భాష్యకారులు కూడ ఇది అంగీకరించారు శంకరుడు 'ఆత్మ సర్వవ్యాపి' అనగా శరీరమంతా వ్యాపించి యుండును అన్నాడు వ్యావహారికముగా మాత్రమే అది అణురూపి అన్నారు అని భావించారు బాదరాయణుడు పరమాత్మ జీవాత్మలో ఉన్నదని చెప్పాడు (1-2-8) కాని జీవాత్మ లక్షణముల సంబంధ దోషము పరమాత్మకు అంటదు అన్నాడు జీవాత్మ కర్మఫల మనుభవించును పరమాత్మకు ఏ కర్మఫలములు చెందవు సర్వమునకు

పరబ్రహ్మయే కారణము అయినపుడు జీవాత్మకు కూడ అతడే కారణము కావలయును అనియు ప్రతి జీవునిలోను ఈశ్వరాంశ యున్నదనియు, దైవత్వమన్ని వస్తువులందు ఉన్నదని బాదరాయణుడు చెప్ప ప్రయత్నించెను కాని జీవాత్మ పరమాత్మ సంబంధమును స్పష్టముగా వివరించలేదు జీవాత్మ బ్రహ్మ అంశమో లేక ఉపాధుల (శరీరము, ఇంద్రియముల) వలన అభాసపాలైన బ్రహ్మమో తెలియదు భిన్న భావములను ప్రస్తావించెను గాని బాదరాయణుడు తన భావము స్పష్టముగా చెప్పలేదు (1-4-19-22) కొందరు పరిపూర్ణ బ్రహ్మమే జీవాత్మయని భాష్యం చెప్పారు (2-3-43)లో పరమాత్మలో జీవాత్మ 'అంశ' అను దానికి 'అంశ వలె కనబడును' అని శంకరభాష్యము

కొందరు భాష్యకారులు చెప్పినట్లు సృష్టి పరబ్రహ్మ లీలావినోదము కాదు సృష్టి పరమాత్మ సంకల్పము తనను జీవులు నిత్యము ప్రార్థించునట్లు చేయుటకే దుఃఖములు సృజించెననుట సత్యము కాజాలదు జీవుల దుఃఖముల జూచి వినోదించు అతడు భగవంతుడు కాలేడు దయాస్వరూపమే భగవంతుడు జీవుల కర్మలే వారిలోని భిన్నత్వమునకు సుఖదుఃఖములకు కారణము భగవంతుడు కాదు మానవుల కర్మల వలన దేవుని దయకు ఆటంకము ఏర్పడును పరబ్రహ్మ పక్షపాతి కాదు ఎవరి కర్మఫలములు వారికి అందునట్లు భగవంతుడు చేయుననుటయందుగాని జీవుల సత్కర్మలకు భగవంతుడు కారణమగుచున్నాడా అనుటయందుగాని తగిన పరిష్కారము బ్రహ్మసూత్రములందు దొరకదు భాష్యకారులే వారివారి సిద్ధాంతముల కనుగుణముగా పరిష్కారము చెప్పారు

ద్విజులు అనబడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు యజ్ఞార్హత ఇవ్వబడినది శూద్రులకు, స్త్రీలకు దైవకృపయే ముక్తిమార్గముగా చెప్పబడింది (2-3-40→42) (2-3-23, 24) సూత్రములననుసరించి జీవుడు మన హృదయపద్మమునందు ఉన్నాడు అది వెన్నెముకలో ఒక సూక్ష్మకేంద్రము

దాని ద్వారా సుషుమ్నానాడి శిరస్సులోనికి వ్యాపించియుండును వేదాంతంలో బ్రహ్మలోకప్రాప్తికి మరణానంతరవ దేవయానమార్గం ప్రతిపాదించారు (4-2-7) ఆ మార్గం సుషుమ్నానాడి వద్ద ప్రారంభమగును (మూర్ధన్యనాడి) బ్రహ్మజ్ఞానము పొందినపుడే ఆ మార్గము ప్రారంభమగును మూర్ధన్యనాడిని చేరునంతవరకు ఉత్క్రమణమార్గము అనగా ఆత్మ బయటకు పోవుమార్గం జ్ఞానికి, అజ్ఞానికి ఒకటిగానే యుండును జ్ఞాని (ఆత్మ) హృదయగ్రంధిని చీల్చి సుషుమ్నానాడిని చేరి కపాలమును ఛేదించి బయటకు దేవయానమార్గము ద్వారా పోవును జీవుడు సూక్ష్మఇంద్రియములను, మనస్సును కూడ తోడ్కొని పోవును అజ్ఞానికి ఆత్మ సుషుమ్నానాడియందు ప్రవేశించక నాడులలో ప్రవేశించి దక్షిణవైపుగా పితృయాన మార్గములో బయటకు పోవును ఇపుడు కూడ సూక్ష్మ ఇంద్రియములు మనస్సు ఆత్మవెంటనే యుండును దేవయానమే బ్రహ్మలోకప్రాప్తికి మార్గం అన్నారు

ఈ బ్రహ్మలోకప్రాప్తి, దేవయానమార్గము సగుణ బ్రహ్మజ్ఞానికి అనగా ఇష్టదేవతా ఉపాసకునికి మాత్రమే అన్నారు ఉపాసకునికి వచ్చు అమృతత్వం అనగా బ్రహ్మలోకప్రాప్తి నిష్కామముతో కూడిన అమృతత్వం కాదు బ్రహ్మలోకప్రాప్తి అనగా అపేక్షతో కూడిన అమృతత్వం అజ్ఞానులైన జీవులు శరీరము పొందుటకు వేరొక యోనియందు ప్రవేశిస్తారు మరణానంతరం కూడ మరొక చోట సంసారం ఏర్పడును కాబట్టి చచ్చుట మోక్షం కాదు బయటకు వెళ్లిపోయేటపుడు సూక్ష్మశరీరం తేజోరూపంలో ఉంటుంది సూక్ష్మభూతములతో (పంచభూతములు) ఆ సూక్ష్మశరీరం నాడీరంధ్రముల ద్వారా నిష్క్రమించును సూక్ష్మశరీరం లోపల ఉన్నందువలననే శరీర ఉష్ణం కలుగును సూక్ష్మశరీరం బయటకు వెడలిన తరువాత మృతదేహంలో ఉష్ణం ఉండదు ఉష్ణం సూక్ష్మశరీర ధర్మం

నిర్గుణ బ్రహ్మజ్ఞానం కలవానికి కూడ మరణ సమయమున ఉత్క్రమణ

కాంతి (తేజస్సు) ఉండునా? నిర్గుణ బ్రహ్మజ్ఞాని ప్రాణాలు ఉత్క్రమింపవు అనగా బయటకు పోవు అని శ్రుతివచనము శ్రుతివచనమునకు వాస్తవ అర్థం అది కాదు అన్నారు ఉత్క్రమణ లేనపుడు బ్రహ్మజ్ఞానికి మృత్యువు ఉండదు కదా! ఉత్క్రమణం లేదు అనగా (4-2-12→16) నిర్గుణ బ్రహ్మజ్ఞాని ప్రాణములు ఉత్క్రమణ చెందవు అనగా బయటకు పోవు ప్రాణములు శరీరంలోనే ఇచటనే నాశనమై అతడు మరణిస్తాడు బ్రహ్మజ్ఞానికి శరీరము నుండి విడుదల కలుగును అంతే తప్ప సూక్ష్మశరీరము సుషుమ్నానాడి ద్వారా గాని, ఇతర నాడుల ద్వారా ఉత్క్రమణ అనగా బయటకు వెళ్లుట ఉండదు బ్రహ్మజ్ఞాని ఆత్మ ఇచటనే సర్వవ్యాపియైన పరబ్రహ్మములో లీనమై తాను పరబ్రహ్మమే అగును పరబ్రహ్మ జ్ఞానం పొందిన వానికి దేవయానం వంటి మార్గములుండవు, ఉత్క్రమణం ఉండదు అని మహాభారతం శాంతిపర్వం (12-2‿3-12)లో కూడ చెప్పబడింది

శ్లో॥ సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
యదాపశ్యతి భూతాత్మా బ్రహ్మసంపద్యతేతదా ॥ (శాంతిపర్వం 239-21)

అన్ని భూతములందు తన ఆత్మను, తన ఆత్మయందు సర్వ భూతములను ఎపుడైతే (యదా) దర్శించగలడో (పశ్యతి) అపుడు (తదా) పరబ్రహ్మమును పొందగలడు (సంపద్యతే) రామానుజుడు (4-2-7కు) తన భాష్యములో సగుణ, నిర్గుణజ్ఞాని అని చెప్పలేదు ధ్యానములో పరబ్రహ్మ దర్శనానుభూతి పొందిన జీవాత్మ సుషుమ్నానాడి ద్వారా ఉత్క్రమణ చెందును అన్నారు ఆ అనుభూతి పొందివానికి ఇచటనే బ్రహ్మానందము కలుగును అన్నాడు (4-2-12→13)లో కూడ బ్రహ్మజ్ఞాని ప్రాణములు శరీరము నుండి ఉత్క్రమణ చెందును కాని జీవాత్మ నుండి కాదు అన్నారు బ్రహ్మలో ఐక్యమగునంతవరకు ప్రాణములు జీవాత్మను వదలవు అన్నాడు బ్రహ్మజ్ఞాని ఆత్మ సుషుమ్నానాడి ద్వారానే బ్రహ్మములో ఐక్యమగును అన్నాడు

సేవతో చేసిన కర్మ, సన్యాసము కూడ వేదము చెప్పినవే (3-4-9) అనినప్పటికి నిష్కామకర్మమే బాదరాయణుని మతమని తెలియుచున్నది (3-3-32→34) ప్రతి కర్మ దోషము కాదు అజ్ఞానముతో చేసిన కర్మయే దోషము జీవన్ముక్త స్థితిలో కూడ కర్మ అవసరముండును అన్నాడు (3-4-2→^) కర్తరూపంలో ఆత్మ కర్మకు అవయవము ఇది పూర్వపక్షము దీనిని బాదరాయణుడు (3-4-10)లో ఖండించాడు ఆత్మ, ఆత్మను గూర్చిన జ్ఞానం రెండును కర్మకు అంగములేయగును అని భావము జీవించుయున్నంతవరకు కర్మచేస్తూనే ఉండాలి కాబట్టి జ్ఞానం స్వతంత్రంగా మోక్షసాధనం కాదు అని జైమిని ప్రతిపాదన బాదరాయణుడు దీనిని వ్యతిరేకించాడు (3-4-8) జ్ఞానం స్వతంత్రంగా ముక్తిసాధనమని బాదరాయణుని అభిప్రాయం వేదాంతము చిన్మయుడైన (జ్ఞానస్వరూపుడైన) ఈశ్వరుని గూర్చియే చెప్పును వేదాంతం చెప్పునది ఆత్మజ్ఞానం దానివలన పురుషార్థసిద్ధి, ముక్తి కలుగును తత్వజ్ఞానం కర్మకు అంగం కాదు (3-4-9, 10) అనగా ఆత్మజ్ఞానం కర్మలకు ఉపయోగించదు "యదేవ విద్యయాకరోతి" ఛాందోగ్యం (1-1-10)లో చెప్పినది విద్య, శ్రద్ధ, యోగముతో చేయబడిన కర్మ శక్తివంతము అనగా విద్య కర్మ యొక్క అంగము అని భావము కాని ఇచట విద్య అనగా అన్ని విద్యలు కాదు అని, కేవల వేదవిద్య మాత్రమేయని బాదరాయణుని అభిప్రాయం బ్రహ్మవిద్య అనగా ఆత్మజ్ఞానం కర్మకు అంగం కాదు అని భావం

బ్రహ్మసూత్రములు ఇష్టదేవతారాధన అంగీకరించినవి (3-2-38) కాని ఇష్టదేవతారూపముల కంటే సత్యము అనగా పరమాత్మ అతీతము అని చెప్పబడింది పరబ్రహ్మ కనబడడు కాని సమాధిస్థితిలో కనబడును అన్నారు (3-2-24) ఆత్మజ్ఞానమే జీవితలక్ష్యము బాదరాయణుడు జీవన్ముక్తి సాధ్యమనియే విశ్వసించెను (4-1-15) ప్రారబ్ధకర్మ అనుభవించక తప్పదు అది విడువబడిన బాణమువంటిది ప్రారబ్ధకర్మము క్షయమగునంతవరకు దేహముండును అంతవరకు బ్రహ్మజ్ఞాని సంసారిగానే ఉండును అతడే

జీవన్ముక్తుడు ముక్తి వలన అనంతశక్తి, జ్ఞానము కలుగును ముక్తుడు పరమాత్మయే యగును కాని సృష్టి, స్థితి, లయము చేయు శక్తులు మాత్రముండవు (4-4-17) అది భగవంతునికొక్కడికే సాధ్యము జీవాత్మ పరమాత్మ భేదమును బాదరాయణుడు స్పష్టముగా చెప్పలేదు

ఈశ్వరుడు ఒకడే అని అనగా ఏకేశ్వరతత్త్వము బాదరాయణుడు ప్రకటించెను బహుదేవతాతత్త్వమును అతడు విశ్వసించినట్లు కనబడదు కొందరు బ్రహ్మభావమును నిర్విశేష చిన్మాత్రము (Indeterminate Intelligence) అన్నారు అనగా పరమాత్మ జ్ఞానస్వరూపుడు అతడు అనిశ్చితుడు, అనియతుడు, అపరిమితుడు మరికొందరు బ్రహ్మభావమును 'సవిశేష చిన్మాత్రము' (Determinate Personal Lord) అన్నారు ఈ భావముననుసరించి పరమాత్మ నిశ్చితుడు బాదరాయణుడు ఈ రెండు భావములను అంగీకరించినట్లుగానే కనబడును కాని ఈ రెండు భావముల సమన్వయము అతడు ఎట్లు చేసెనో సూత్రములలో మనకు కనబడదు ఉపనిషత్తులననుసరించి బ్రహ్మము నిర్వికార స్వరూపము అనగా ఎట్టి మార్పులు చెందనిది మరి జగత్తు అనిత్యము, నిత్యము మార్పు చెందునది జగత్తు సృష్టి అనబడు ఒక కార్యము ఈ కార్యము అట్టి పరమాత్మ అను కారణము నుండి ఎట్లు ఉత్పన్నమాయెను (1-4-26, 27) సూత్రములలో శ్రుతివాక్య ఆధారముగా ఆత్మను స్వయముగా సృజించెను అన్నారు 'తదాత్మానం స్వయమకురుత' (తైతరీయోపనిషత్తు 2-7) అనునది శ్రుతివాక్యం ఇందు పరమాత్మకు "స్వయంకర్తృత్వం" చెప్పబడినది 'ఆత్మానం" అను ద్వితీయావిభక్తి వలన కర్మ గూడ తానెనని తెలియదగును దీని భావం 'తనను' అగుట బ్రహ్మకు 'ఉపాదానత్వం' అనగా ప్రధానకారణత్వం కలుగుచున్నది సృష్టికి పూర్వము జగత్తు నామరూపములు లేని పరమాత్మగానే ఉండి, ఆ పరమాత్మనుండే నామరూపములు గల జగత్తు పుట్టెను అని ఉపనిషత్ వాక్య భావము పరిణామము వలన పరబ్రహ్మకు కర్మత్వం కలిగినది మట్టి రూపాంతరం చెంది కుండ అయినటులే పరిణామము అనగా

వివర్తనము ద్వారా అవిద్య అను దాని వలన జగత్తుగా పరబ్రహ్మ మార్పుచెందెనని భావము ఆత్మను 'యోని' శబ్దంతో కూడ చెప్పారు కాబట్టి పరబ్రహ్మ కారణత్వము నిమిత్తమాత్రమే జగత్తులోని సర్వభూతములకు ప్రకృతియే అసలు కారణం ప్రకృతియే వివర్తరూపము అనగా పరబ్రహ్మ జగత్తుగా పరిణమించినను తాను నిర్వికారియై నిల్చునని బాదరాయణుడు చెప్పాడు

పరబ్రహ్మము యొక్క కార్యకారణత్వమును సహేతుకముగా నిర్వచించుటకే భాష్యకారులు ప్రయత్నించారు తాను ఎట్టి మార్పు చెందకుండ పరబ్రహ్మము జగత్తుగా పరిణామము చెందెనని శంకరుని భాష్యము పరబ్రహ్మము నిజముగానే జగత్తుగా మార్పుచెందెనని రామానుజుడు అన్నాడు వల్లభుడు కూడ అదే అభిప్రాయం వెలిపుచ్చాడు జీవునిలో బ్రహ్మము ఉన్నను జీవుని దోషములు బ్రహ్మమునకు అంటవు అని బాదరాయణుడు (1-2-8) సూత్రములో చెప్పాడు జీవాత్మ పరమాత్మల ఏకత్వము అదే సమయమున భేదము కూడ చెప్పాడు కాని ఇది ఎంతవరకు సహేతుకముగా నున్నది అనేది వివాద అంశము ఉపనిషత్తులు బ్రహ్మమును నిర్గుణము, నిర్విశేషముగా చెప్పాయి బాదరా-యణుని అభిప్రాయం అందుకు అనుగుణముగా లేదు అని శంకరుని భావము కాని బాదరాయణుని భావము ఉపనిషత్తులకు అనుగుణముగానే యున్నదని ఇతర భాష్యకారుల వాదన అసలు సగుణ, నిర్గుణ బ్రహ్మమును గురించిన భావము, ఇంకను జగత్తు మాయ (మిథ్య) అను భావము బాదరాయణునికి లేదు అని ఈ భాష్యకారుల అభిప్రాయముగా కనబడుచున్నది అని రాధాకృష్ణ వ్యాఖ్యానించారు ప్రపంచము మిథ్యయని -దరాయణుడు తలచియుండినచో దానికి బ్రహ్మము కర్తయని ప్రమాణములు చెప్పుటకు అతడు శ్రమపడి యుండెడివాడు కాదు అని వీరు వాదించారు పరిణామము అనునది ఒక స్వభావము అది పరబ్రహ్మమునందు సహజముగానే యున్నది అందువలననే పరబ్రహ్మము వస్తుప్రపంచమున ఇన్ని రూపములు ధరించుట జరిగినది అని వీరి వాదము కాని వీరి వాదము కూడ ఎంత వరకు

సహేతుకమో చెప్పజాలము

జీవాత్మ పరమాత్మ ఐక్యత విభజించుటకు వీలులేని స్థితి అని చెప్పబడినది ఈ స్థితి ఎంత వరకు విభజించుటకు వీలులేనిది అనుదాని మీదనే భాష్యకారుల వాదన ఐక్యత పరిపూర్ణము అని శంకరుడు వ్యాఖ్యానించగా, అది అసంపూర్ణము అని రామానుజుడు వాదించాడు ఒక క్రమపద్ధతిన లేని ఉపనిషత్తుల భావములను క్రమబద్ధము చేయనెంచిన బాదరాయణుడు ఆ భావములను సూత్రరూపమున అతిగా క్లుప్తపరచి భాష్యకారుల వాదనలకు అవకాశము కల్పించెను బాదరాయణుని భావము స్పష్టముగా నిర్ణయించి చెప్పుట సాధ్యము కాదనియే కనబడుచున్నది

బ్రహ్మసూత్ర భావమును గురించి కొంతైనా అవగాహన కొరకే బ్రహ్మసూత్ర సారాంశము క్లుప్తముగా చెప్పటం జరిగింది అంతేకాని ఇది బ్రహ్మసూత్ర వ్యాఖ్యానమూ కాదు, సూత్రభాష్య విమర్శా కాదు నిత్యం ఉద్వేగ భరిత జీవితంలో సతమతమగుచున్న సామాన్య మానవునికి బ్రహ్మసూత్రభావము గ్రహించే తీరిక, అవసరము ఉన్నదా అనేదే ప్రశ్న తీరిక లేని మాట వాస్తవం కాని అవసరం మాత్రం ఉన్నది ఎందుకనగా అతడికి వలసినది మనశ్శాంతి, ధైర్యము అది బ్రహ్మసూత్రాలు చదివినా, వినినా వస్తుందా? అంతమాత్రం చేతరాదు బ్రహ్మసూత్ర భావమును తన జీవితమునకు అన్వయించుకుని అర్థం గ్రహించగలిగినపుడు వస్తుంది దానిని ఎలా సాధ్యము చేసుకోవాలి?

బ్రహ్మసూత్రాల గురించి ఎన్నో భిన్నభిన్న అభిప్రాయాలు, పరస్పరం వ్యతిరేకమైన భాష్యాలు ఉన్నాయి వాటి సారాంశం తెలుసుకుంటే మంచిదే అంతవరకే కాని అనవసర తర్కవితర్కములతో కాలము వృథా చేయటం నిష్ప్రయోజనం ఆ భాష్యములు చెప్పిన అంతటివారము కాదు మనము మనము అంటే అందరు కాదు సామాన్య మానవులమైన మనము సాటి మానవుడు కూడా తనవంటివాడేనని మనకి భావం కలిగితే మానవతకు,

పరస్పర అవగాహనకు మార్గం సుగుమం అవుతుంది 'ఆత్మ' అనే పదం అందరికి తెలుసు దానిని విరివిగా ఉపయోగిస్తుంటారు కూడా కాని ఆత్మ అంటే ఏమిటి, దానికి బయటనున్న వస్తుప్రపంచమునకు గల సంబంధము ఏమిటో తెలుసుకోలేకపోతే 'ఆత్మ' అనే శబ్దం అర్థం లేని అలవాటు పదంగాను నాలుక చివరి మాటగాను మిగిలిపోతుంది ఆత్మ ఏమిటో కొంతైనా తెలిస్తే అది అందరిలోను ఉన్నది, స్వభావాలు వేరైనా ఎదుటి వాడు కూడా మనవంటి మనిషే అను మానవతాభావం కలుగుతుంది అపుడు పరిమితులు లేని స్వార్థమునకు పరిమితులు (Limits) ఏర్పడు అవకాశం కలిగి మనుషుల మధ్య సఖ్యతకు అవకాశం ఏర్పడుతుంది స్వార్థం లేని సఖ్యత ఆనందం కలుగజేస్తుంది

అద్వైతభావం ఇందుకు మార్గమేమో అనిపిస్తుంది మనలోను అందరిలోను ఉన్నది ఒకే ఆత్మ అని గ్రహించినపుడు మనలో అహం తగ్గుతుంది అహం తగ్గినపుడు బ్రహ్మభావం కలుగుతుంది అపుడు నిష్కామకర్మకు తద్వారా రాజయోగసాధనకు మార్గం ఏర్పడుతుంది జీవులందరిలోను ఉన్నది పరమాత్మ ఒక్కటే అని గ్రహించినపుడు భేదభావం నశిస్తుంది దీని అర్థం ద్వైతభావం నిష్ప్రయోజనం అని కాదు ద్వైతభావంలో దేవుడొకడు మనకంటే అతీతుడైనవాడు ఉన్నాడు, అతని తోడు, దయ మనకు ఎపుడూ ఉంటుంది అను భావం కలుగుతుంది ఆ భావంతో ధైర్యం వస్తుంది జీవితంలో ముందుకు సాగుతాడు వ్యక్తి అలా అది వ్యక్తిగతమే అవుతుంది కాని తాను ఎవరు, ఎదుటివానితో మనకి సంబంధం ఏమిటో తెలియదు ఆత్మ ఉన్నదని తెలిసినా అది ఏమిటో తెలిసికొను అవసరం భక్తిభావంలో ఉండదు భక్తిభావంలో ఆత్మార్పణం అనగా ప్రపత్తి ప్రధానం కాని అసలు ఆత్మ అంటే తెలిస్తేనే కదా ఆత్మార్పణకు అర్థం ఉంటుంది మతము వ్యాపారాత్మకంగాను రాజకీయపరంగాను వాడబడుతున్న ఈ రోజుల్లో ద్వైతం, అద్వైతం గురించి ఆలోచించేదెవరు? అందుచే ద్వైతమా, అద్వైతమా అని వాదనలతో వాచిక జ్ఞానులగుట కంటే రెండూ కలిపి జీవితానికి సమన్వయించుకొనటం మేలు

నేటి మనిషి మానసిక స్థితికి ప్రత్యక్షదైవమే కావాలి ఎందుకనగా నేటి భక్తిప్రపత్తితో కూడినది కాదు 'నా కోరిక తీరిస్తే నీకు 'ఇది' ఇస్తాను లేక డబ్బులిస్తాను అని' మొక్కులతో నిండినది నేటి భక్తి మూఢభక్తి లక్షణం మొక్కుబడి కాని 'మొక్కుభక్తులు' ఎక్కువ మంది మూఢభక్తులు కాదు చాలా యుక్తిపరులు ప్రత్యక్షదైవము అనగా ఇష్టదైవము నుండి పరమాత్మవైపు నేటి మనిషిని మరల్చుట సాధ్యము కాదు అందుచే కొంత సాధనతో ఇష్టదైవమునే పరమాత్మ సగుణరూపునిగా తలచి అతడే పరమాత్మగా మన యందున్నట్లు భావించి, అతనినే ధ్యానించుచు ఏకాగ్రతల' ఆ రూపమును కన్నులు మూసుకుని మనసున చూడకలిగినపుడు ద్వైత అద్వైత సమన్వయము నిత్యజీవితములో కలుగును ఇష్టదైవమును వేరొక మూర్తిగాకాక మనలోనే ఉన్న ఆత్మరూపునిగా భావించి మానసిక స్థిరీకరణతో రాజయోగ మార్గమున కర్మ నిర్వహణ చేయుచు మనలను సవ్యమైన మార్గమున నడిపించమని ధ్యానించినపుడు మానసిక శాంతి, కర్తవ్యమగు కర్మ నిర్వహణలో ధైర్యము, శక్తి కలుగును నేటి మనిషికి కావలసినది ఇదే

బ్రహ్మసూత్ర భాష్యములలో శంకరభాష్యం ప్రాచీనమైనది, ఎక్కువ మంది ఆమోదం పొందినది ప్రచారం కూడా ఎక్కువగానే యున్నది దీనివలన మిగతా ఆచార్యుల భాష్యములకు భంగపాటు ఏమి రాలేదు, రాదు ఆదిశంకరాచార్యుల వలెనే ఆ భాష్యకారులందరు మహనీయులైన తత్త్వవేత్తలే కాని ఇన్ని భాష్యముల వలన వేదమతమునకు మంచి జరిగిందా, చెడు జరిగిందా అంటే ఒక విధంగా చెడు జరిగిందనే చెప్పాలి ఇన్ని సిద్ధాంతాల వలన మతంలో వర్గాలు ఏర్పడి సత్యాన్వేషణ కంటే వైరుధ్యము, అనైక్యత ఎక్కువగా ప్రబలినాయి

అద్వైతం చెప్పటం ఎంత తేలికో, అనుభూతితో అర్థం చేసుకొనుట అంత కష్టం ఒక శ్లోకపాదంలోనే అద్వైతం అంతా ఇమిడినట్లు చెప్పారు

"బ్రహ్మసత్యం, జగన్మిధ్యా జీవోబ్రహ్మైవనాపరః" బ్రహ్మసత్యం, జగత్తు అంతా మాయ, జీవుడు బ్రహ్మమే ఇరువురికి భేదము లేదు ఈ నాలుగు మాటలు ఎవరైనా అతిసులభంగా చెప్పవచ్చు కాని దాని అనుభూతి పొంది చెప్పువారు ఎందరు? ఎందరో కాదు, అసలు ఉన్నారా అనిపించును అద్వైతానుభూతికి వలసిన గుణములు అనగా రాగద్వేషాలకు అతీతంగాను స్వార్థమునకు దూరంగాను ఉండగల స్వభావం లేనపుడు కొన్ని ప్రమాదములకు అవకాశమున్నది ఈ వస్తు ప్రపంచం మాయ కాబట్టి మన జీవితం అంతా ఒక స్వప్నమే కాబట్టి, మనం చేయు దుర్మార్గములు అన్నీ స్వప్నములుగానే భావించి దాని వలన మనకేమి నష్టములేదు అను భావం ప్రబలి అన్యాయం, అధర్మములకు దారితీస్తుంది అర్హులు కాని వారికి వేదాంత చెప్పవలదు అన్నది ఇందుకనే కావచ్చు భగవద్గీత (3-25, 26) శ్లోకములలో తాము పరమాత్మ రూపంలో సత్కర్మలు చేయాలి, చేయించాలి అన్నారు జ్ఞానులు ప్రపంచమును తీర్చిదిద్దుచు కర్మలు చేయాలి అని చెప్పారు అద్వైతం కర్మలకు వ్యతిరేకం కాదు అది నిష్కామకర్మలను ప్రోత్సహించును ఎందుకనగా జీవన్ముక్తిని చెప్పినది అద్వైతం ఒక్కటే అద్వైతం అంటే "నేను కూడ పరబ్రహ్మమునే కదా" అని కర్మలు చేయక సోమరిగా ఉండమని కాదు అది జీవన్ముక్తికి మార్గం కాదు పరబ్రహ్మ సగుణమా, నిర్గుణమా అని సందేహాలతో కాలం వృధా చేయుట తగదు

వాస్తవమునకు సగుణ, నిర్గుణ బ్రహ్మములు భిన్నములు కావు సగుణమునకు చైతన్యం ఉంటుంది ఆ చైతన్య రూపాలే మనం ఊహించుకునే దైవరూపాలు నిర్గుణ బ్రహ్మమే తప్ప మరేమియు లేదంటే ఈ సృష్టి ఏమి కావాలి, సృష్టికర్త ఏమవుతాడు, వేదాలు, శాస్త్రాలు ఎందుకు? 'బ్రహ్మము సత్యం, జగత్తు మాయ' అను అద్వైతసూత్ర అంతరార్థమును గ్రహించలేనపుడే ఈ ప్రశ్నలు వచ్చును జగత్తు మాయ అంటే జగత్తు లేదు అని కాదు దీనికి ఒక ఉదాహరణ చెప్పారు ఆకాశం ఉన్నది దానికి ఆది, అంతము లేదు

దానికి ఏమి ఆకారం లేదు కాని ఆకాశంలో మబ్బులు చేరినపుడు ఆకాశమునకు రంగు రూపం వస్తాయి వర్షం పడిన తరువాత మబ్బులుండవు తిరిగి ఆకాశమే మిగులుతుంది ఈ మబ్బులనే మాయకు చిహ్నంగా ఊహించుకుంటే సగుణ, నిర్గుణ బ్రహ్మమునకు భేదం తెలుస్తుంది ఆకాశం అంతా మేఘాలు ఉండవు అలాగే నిర్గుణ బ్రహ్మము అంతా సగుణబ్రహ్మగా మారదు ఈ మబ్బులే 'అహం'తో కూడిన అజ్ఞానం మబ్బులు ఆకాశమును కప్పివేసినట్లు అజ్ఞానం సత్యబ్రహ్మభావమును కప్పివేస్తుంది మబ్బులు కప్పి ఉన్నంత మేర ఆకాశం మబ్బుల రూపంలో కనబడుతుంది ఆకాశంలో మార్పు ఏమి ఉండదు కొంత మేర మబ్బుల రూపంలో కనబడుతుంది ఆ కనబడటమే మాయ ఆ మాయ వలన ఆ మబ్బులే ఆకాశం అని భ్రమలో ఉంటాము వర్షం పడిన తరువాత ఆ భ్రమ పోతుంది ఆకాశం నిర్మలంగా యదార్థం అవుతుంది నిర్గుణ బ్రహ్మము యొక్క చైతన్యమే ఈ వస్తుప్రపంచము మబ్బుల వెనుకనున్న ఆకాశం మనకు కనబడనట్లు, ఈ వస్తు ప్రపంచం వెనుకనున్న నిర్గుణబ్రహ్మమును మనము గుర్తించలేము ఆ గుర్తించ లేకపోవటమే మాయ లేక భ్రమ అంతేకాని వస్తు ప్రపంచము అసత్యముకాదు నిర్గుణబ్రహ్మము సగుణరూపము అనగా సృష్టి రూపము పొందటమే చైతన్యము అదే మాయ అదే ప్రకృతి కాబట్టి ఈ సగుణరూపం నిర్గుణబ్రహ్మము కంటే భిన్నం కాదు

ఆకాశంలో మేఘాలు కొంత మేర మాత్రమే ఆవరించినట్లు నిర్గుణబ్రహ్మములో ఇమిడియున్న చైతన్యములో కొంత భాగము మాత్రమే సగుణమైన సృష్టిగా మారినది ఇదే సగుణ నిర్గుణ సంబంధం ఆకాశంలో మబ్బులు శాశ్వతంగా ఉండవు అవసరమైనపుడు అనగా వాటి భారం ఎక్కువైనపుడు అవి వర్షించి అదృశ్యమగును అటులే కొన్ని సమయములందు నిర్గుణబ్రహ్మ తన చైతన్యం అనగా మాయాశక్తి సహాయముతో మానవరూపం దాల్చి ధర్మమును స్థాపించటం జరుగుతుంది ఇది నిర్గుణబ్రహ్మ చైతన్యము

ప్రకృతిగా పరిణామం చెందటం కాదు ప్రకృతిగా పరిణామం చెందటం నిర్గుణబ్రహ్మములో కొంతభాగము మాత్రమే మిగిలిన భాగంలో నుండి అంశరూపంలో వచ్చినవారే ఈ ప్రత్యేక మానవమూర్తులు ఈ మానవమూర్తులే పురాణాలలో చెప్పబడిన అవతారమూర్తులు వారే రాముడు, కృష్ణుడు, శివుడు మొదలైనవారు ఈ మూర్తులంతా నిర్గుణబ్రహ్మము యొక్క సగుణరూపాలు ఈ సగుణ రూపములను నిర్గుణ బ్రహ్మజ్ఞాన అనుభూతికి సాధనములుగా గ్రహించాలి ఉపనిషత్తులలోను, బ్రహ్మసూత్రములలోను, భగవద్గీతలోను సగుణ, నిర్గుణ బ్రహ్మరూపములను గురించి చెప్పారు సగుణ బ్రహ్మ రూపములను ఉపాసించుటయే భక్తి ఈ సగుణ బ్రహ్మరూపములను అన్ని మతములలోను భిన్నములైన పేర్లతో ఊహిస్తారు

ఈ సగుణ రూపములను ఉపాసించువారికి లభించునది జీవన్ముక్తి కాదు క్రమముక్తి నిర్గుణ బ్రహ్మజ్ఞానసిద్ధి పొందినవారే జీవన్ముక్తులు జీవన్ముక్తులు ప్రారబ్ధకర్మ అనుభవం పూర్తి అయిన తరువాత ఇక్కడే వారి ఆత్మ సర్వవ్యాపి అయిన నిర్గుణబ్రహ్మమందు లీనమగును వారి సూక్ష్మశరీరం ఆత్మవెంట ఉండదు అది ఇక్కడే పంచభూతములలో కలిసిపోవును ప్రారబ్ధకర్మ అనుభవించుచున్నను ఆ కర్మ భావము జీవన్ముక్తులకు అంటదు సగుణ బ్రహ్మరూపమును ఉపాసించువారు అనగా నిష్కామభక్తిమార్గమును అవలంబించువారికి క్రమముక్తి లభించును అన్నారు వారు అనగా ఉపాసకులు, భక్తులు తమ పురుషార్థ ప్రయత్నముల ద్వారా భగవద్గీత (8-24)లో చెప్పినట్లు వారు మరణానంతరం బ్రహ్మలోకం చేరుదురు వారు పయనించు మార్గమును దేవయానం అని బ్రహ్మసూత్రాలు చెప్పాయి బ్రహ్మలోకము అంటే త్రిమూర్తులలో ఒకరైన బ్రహ్మ యొక్క లోకము కాదు ఈ బ్రహ్మలోకమును అనేకమైన పేర్లతో చెప్పారు విష్ణుభక్తులు వైకుంఠం అన్నారు, శివభక్తులు కైలాసం అన్నారు, రామభక్తులు సాకేతం అన్నారు, కృష్ణభక్తులు గోలోకము అన్నారు నిర్గుణబ్రహ్మము యొక్క సగుణమైన కార్యరూపమే విరాట్‌పురుషుడు

విరాట్‌పురుషుని చైతన్యరూపనే ప్రకృతి ప్రకృతి యందు వ్యాపించి విరాట్‌పురుషుడు వైశ్వానుని రూపమున ఉండును అతడే కార్యబ్రహ్మము ఆ కార్యబ్రహ్మము యొక్క అంశరూపములే అవతారమూర్తులు బ్రహ్మలోక మందు ఉండు విరాట్ పురుషుని విష్ణువు అనవచ్చు, శివుడు అనవచ్చు, గోలోక కృష్ణుడు అనవచ్చు

పైన చెప్పినట్లు నిర్గుణబ్రహ్మ సగుణరూపులైన అవతారమూర్తులు రాముడు, కృష్ణుడు మొదలైనవారు కూడ క్రమముక్తినే పొందుతారు అని చెప్పబడింది అనగా వారు కారణపురుషులు వారు తమ కార్యము నిర్వర్తించి మానవుల వలెనే మరణించి దేవయానమార్గమున బ్రహ్మలోకము చేరుతారు అదే వైకుంఠం అదే కైలాసం వారు మన ఊహారూపాలైన విష్ణువుగానో, శివునిగానో ఆ బ్రహ్మలోకంలో ఉంటారు వారు అవసరమైనపుడు తిరిగి సగుణరూపంలో అవతరిస్తారు కల్పాంతమున కార్యబ్రహ్మముతో నిర్గుణ బ్రహ్మమందు లీనమగుదురు కార్యబ్రహ్మమనగా చైతన్యరూపము (మాయా రూపుడు) అయిన నిర్గుణ (బ్రహ్మ) భాగము అనగా సృష్టిరూపమైన సగుణ బ్రహ్మము అతడే విరాట్ పురుషుడు సగుణ బ్రహ్మము అగోచరుడుగా గోచరమగు జగత్తునందు వైశ్వానరునిగా వ్యాపించి ఉంటాడు ఆ సగుణ బ్రహ్మము అంశలే మానవరూపులైన అవతారమూర్తులు అవతారమూర్తులైన మహాత్ములు ఏ దేశంలోనైనా ఏ కాలంలోనైన అవతరించవచ్చు సగుణ బ్రహ్మములైన ఈ అవతారమూర్తులను ధ్యానించు లేక ఉపాసించు భక్తులు, యోగులు కూడ బ్రహ్మలోకము చేరుదురు అన్నారు కదా! వారు నిర్గుణ బ్రహ్మములో ఐక్యము కారా? కల్పాంతము వరకు బ్రహ్మలోకమందుండి అంతమున కార్యబ్రహ్మముతో కూడి అవతారమూర్తుల వలెనే నిర్గుణ బ్రహ్మములో లీనమగుదురు కాని వీరు అవతారమూర్తులు కారు ఇలా ముందు బ్రహ్మలోకమును చేరి కల్పాంతమున నిర్గుణ బ్రహ్మములో లీనమగుటను క్రమముక్తి అన్నారు భక్తులు, ఉపాసకులు, మరియు

అవతారమూర్తులది కూడ క్రమముక్తియే కాని భక్తులు, ఉపాసకులకు ముక్తి సాధనతో వచ్చినది అవతారమూర్తులకు సాధనతో పనిలేదు వారు కారణజన్ములు ఒక పని కొరకు కార్యబ్రహ్మముచే పంపబడినవారు అనగా వారు కార్యబ్రహ్మ అంశరూపులే కల్పాంతమున సృష్టి లయముతో కార్యబ్రహ్మముతో కూడి మూల నిర్గుణ బ్రహ్మములో ఐక్యమగుదురు

ఇక జీవన్ముక్తి అనునది పూర్తిగా భిన్నమైనది జీవాత్మ పరమాత్మ జ్ఞానము పొంది పురుషార్థములను సాధించి, ప్రారబ్ధ కర్మమును పూర్తిచేసి సూక్ష్మశరీరమును ఇచటనే వదలి బ్రహ్మములో ఐక్యమగుట జీవించియుండగనే వారికి ముక్తి అనుభూతి కలుగును కర్మఫలములు వారు అనుభవించుచున్నను వారు చలించరు

ఇక్కడ ఒక సందేహం ఉన్నది మోక్షం పొందిన వారికి పునర్జన్మ ఉంటుందా? ఉండదా? పునర్జన్మ ఉంటే మోక్షం అను దానికి అర్థం లేదు పరమాత్మయందు లీనమగుటయే మోక్షము లీనమైన తరువాత పునర్జన్మ ఎట్లుండును ఈ విషయంలో అనేక భ్రమలున్నాయి మోక్షసౌఖ్యం పూర్తి అయిన తరువాత పునర్జన్మ ఉండును అనేది ఒక భ్రమ మోక్షం అనేది సుఖం కాదు అది పూర్తిగా పరబ్రహ్మములో కలిసిపోవటం సుఖం అనేది బ్రహ్మలోకం పొందటంలో ఉంది దానినే స్వర్గసౌఖ్యం అని వ్యావహారికముగా అంటాము ఇది క్రమముక్తికి సోపానము క్రమముక్తి సోపానములలో వారి స్థాయిననుసరించి భూతలములో కాక (Plane of the earth) ఇతర తలముల (planes) లో పునర్జన్మలు పొంది తుదకు ముక్తి పొందుదురని ఒక వాదము ఉన్నది ఈ తలములనే లోకములు అని కూడ అన్నారు దీనికి ప్రత్యక్ష సాక్ష్యము (ప్రమాణము) లేదు

మోక్షం జ్ఞానం వలన వస్తుంది కాని కామక్రోధాది దుర్గుణాలు జీవించి ఉన్నంత కాలం తప్పవు కాబట్టి ఆత్మజ్ఞానం వలన జీవన్ముక్తి ఈ

దుర్గుణాలున్నను పొందవచ్చునా? ఈ ప్రశ్నకు అర్థం లేదు ఎందుకనగా ఈ దుర్గుణాలున్నంతవరకు ఆత్మజ్ఞానం సిద్ధించదు. భక్తిని నాలుగు విధాలుగా చెప్పారు 1) సామీప్య భక్తి, 2) సారూప్య భక్తి, 3) సాలోక్య భక్తి, 4) సాయుజ్య భక్తి ఇవి నాలుగు విధములుగా చెప్పినను వాస్తవమునకు నాలుగు సోపానములు చివరిది సాయుజ్యము భక్తికి పరాకాష్ఠ **సామీప్య భక్తి** దాస్యభావంతో గాని, మధుర భావంతో గాని భక్తితో భగవంతుని సమీపించటమే సామీప్యభక్తి అనగా ఏకాగ్రతతో నిశ్చల మనస్సుతో భగవంతునికి దగ్గరవడం రోజూ ఎంతో కొంత సమయం దేవునికి సమీపంలో కూర్చొనడం, ఆ సమయంలో మనస్సులో ఇతర ఆలోచనలను నిరోధించడం ఇందలి ప్రధానాంశాలు ఉదాహరణకు భక్తికి ఉపవాసం ప్రధానం అన్నారు ఎందుకనగా ఉపవాసం అంటే సమీపంగా ఉండటం, నివసించటం కాని నేడు ఉపవాసం తన యదార్థ భావమును కోల్పోయి, ఒకపూట భోజనం చేసి రెండవపూట సుష్టుగా ఉపాహారము తినటం అయింది ఈ రకమైన ఉపవాసం ఆరోగ్యరీత్యా ఎంతవరకు ఉపయోగమో వైద్యులే చెప్పాలి గాని భక్తికి మాత్ర నిరర్థకం భగవంతునికి సమీపంగా ఉండే స్థితి పొందటం సామీప్యభక్తిగాని, ఈ రకమైన ఉపవాసం కాదు

రెండవ దశ లేక సోపానం **సారూప్యభక్తి** భగవంతుని యొక్క స్వరూపాన్ని పొందటం సారూప్యం మిత్రభావంతో ఆరాధనయే సారూప్యభక్తి అన్నారు సారూప్యభక్తి వలన భగవంతుని రూపం మనస్సులో స్థిరపడుతుంది ఆ రూప ప్రభావం మనసున ముద్రపడి దేవుని అలంకారాలపై మక్కువ పెరుగుతుంది ఆ రూపంలోనే తానూ ఉండాలని భావం కలుగుతుంది వైష్ణవులు ముఖమున పెట్టు నామములు (ఊర్ధ్వత్రిపుండ్రములు) శంఖచక్ర ముద్రలు ధరించటం ఇటువంటిదే ఇది భగవంతుని పట్ల కలిగిన ఆకర్షణకు నిదర్శనం శివభక్తుల విభూదిరేఖలు, మధ్వుల గంధపుబొట్టు ఇటువంటివే భగవంతుని రూపమును అనుకరించడమే సారూప్యభక్తి భగవంతునికి

దగ్గరగుటకు ఇదొక మార్గము ఈ దశలో భక్తియందు కొంత పరిపక్వత కనబడును

ఇక మూడవమెట్టు **సాలోక్య భక్తి** భగవంతుడుండు లోకంలో ఉండు స్థితి పొందటం సాలోక్య భక్తి జీవించి యుండి భగవంతుని లోకానికి ఎలా వెళ్లటం అని సందేహం వస్తుంది ఇది నిజంగా ఆ లోకానికి వెళ్లటం కాదు ఆ లోకానికి వెళ్లినట్లు మానసిక స్థితి కలుగుట ఇది వాత్సల్య భావంతో ఆరాధిస్తే కలుగుతుంది భగవంతుడుండు లోకదృశ్యమును భక్తుడు తన పరిసరములలో ఉన్నట్లు భావిస్తూ అందు సంచరించు స్థితి సాలోక్య భక్తి భగవంతుని నివాసమును భక్తుడు తన చుట్టు కాల్పనిక శక్తితో ఊహించుకుని అందు నివసించుటయే సాలోక్య భక్తి

చివరది **సాయుజ్యభక్తి** ఇది తుది సోపానం సాయుజ్యం అంటే భగవంతునిలో లీనమగుట సాయుజ్యం అనగా సహయోగము ఇది జ్ఞానంతో కూడిన భక్తి వాస్తవమునకు సహయోగం మూడు దశలలోను ఉంటుంది భగవంతునిలో తాను ఉన్నట్లు భావించటం మొదటిదశ తనలో భగవంతుడు ఉన్నాడని భావించటం రెండవదశ తుదకు తనకు భగవంతునకు భేదము లేదు అని గ్రహించి తానే భగవంతుడు, భగవంతడే తాను అను భావం కలగడం మూడవదశ ఈ దశ అతిప్రధానమైనది ఇది భక్తికి పరాకాష్ఠ పై మూడు దశలలోను ఏకాగ్రచిత్తంతో ధ్యానించువానికి సాయుజ్యభక్తి క్రమంగా ఏర్పడుతుంది ఈ దశలు దాటినవాడు భాగవతోత్తముడు అవుతాడు అనగా భక్తులలో శ్రేష్ఠుడు కాని ఏ మాత్రం చిత్త చాంచల్యం కలిగినా అతని స్థితి మరల మొదటికి వస్తుంది మనస్సును భగవంతుని యందే లగ్నం చేయగల సాధన కావాలి భక్తి భగవంతునికి భక్తుడికి మధ్య అనుసంధానం అంతేకాదు అది దేవునికి భక్తునికి మధ్య అవినాభావ సంబంధం 'భక్తి లేని పూజ పత్రి చేటు' అని వేమన చెప్పినట్లు పూజకు భక్తి ప్రాణం

మోక్షమునకు ఆత్మజ్ఞానం అవసరం ఆత్మజ్ఞానమునకు నిష్కామ కర్మయోగము, ధ్యానయోగము, ఉపాసనలతో పాటు భక్తి కూడ ఒక మార్గమే సాయుజ్యభక్తిలో తానే భగవంతుడు, భగవంతుడే తాను అను భావం కలగటం ఆత్మజ్ఞానమే యగును కాలం, కులం, లింగం, ఇవి ఏమి సాయుజ్యభక్తికి, ముక్తికి ఆటంకములు కావు మోక్షమునకు, సాయుజ్యభక్తికి స్త్రీ పురుష భేదం లేదు ముక్తి పొందిన వ్యక్తులకు పునర్జన్మ ఉండదు ముక్తుడైన పురుషునకు అనగా జీవన్ముక్తునకు ప్రపంచంలో ఉంటున్నా దాని బంధముండదు నిర్గుణ బ్రహ్మను గాని సగుణ బ్రహ్మను గాని ఎవరినైనా ధ్యానించవచ్చు సగుణ బ్రహ్మరూపాలు అనేకం అవే ఇష్టదైవాలు ఒక ఇష్టదైవం మీద మనస్సు లగ్నమైన వానికి ఇతర దైవరూపాల మీద మనస్సు లగ్నం కాదు వ్యాసుడు ఇలా వివిధ ఇష్టదైవాలున్నవారికి అనుగుణంగా 18 పురాణాలు వ్రాసాడు ప్రతి పురాణంలోను ఆ పురాణంలో చెప్పబడిన సగుణ బ్రహ్మరూపము సర్వోత్కృష్టమని చెప్పబడింది అతడే సృష్టి స్థితి లయ కారకుడని చెప్పాడు కాని ఇందులోని అంతరార్థం గ్రహించినపుడే తమతమ ఆరాధ్యదైవమే అందరి కంటే గొప్పవాడు అను మూఢత్వం నశిస్తుంది ఎవరి ఇష్టముననుసరించి వారు ఏదో ఒక రూపమును ధ్యానించవచ్చు, జపము చేయవచ్చు కాని ఇతర రూపాలను గురించి హీనంగా మాట్లాడటం దోషం ఏ వృత్తి చేసినా, ఏ పని చేసినా కావలసినది, కర్తవ్య భావం, నిష్కామబుద్ధి, పరమేశ్వరార్పణ భావము జీవాత్మ పరమాత్మల సంబంధము తెలుసుకుని తన ఆత్మను అందరిలో దర్శించగలిగి నపుడు అతడు నిజమైన భక్తుడు, జ్ఞాని అవుతాడు అతని గమ్యం మోక్షమే అవుతుంది

వేదములలో అనగా బ్రాహ్మణములలో చెప్పబడిన కర్మకాండలను, ఆచారకర్మలను ఉపనిషత్తులు తిరస్కరించినవి ఉపనిషత్తులు జ్ఞానకాండకు ప్రాధాన్యం ఇచ్చినవి వాస్తవమునకు రెండును వేదములోని భాగములే బ్రాహ్మణములు దైవపూజలకు, యజ్ఞకర్మలకు నియమములను చెప్పినవి

ఉపనిషత్తులు యజ్ఞబలిని నీచముగా నెంచి తృణీకరించినవి అనగా వేదములోని ఒక భాగము మరియొక భాగమునకు విరుద్ధమైనది మరొక విధముగా చెపితే వేద అరంభంలో చెప్పబడినది వేద అంతమున తిరస్కరించబడినట్లు అగుచున్నది ఒకవైపు పూర్తిగా ఆచారకర్మలు మరియొకవైపు పూర్తిగా జ్ఞానకాండ అనగా వేదాంతం ఇది చాల వింతగా కనబడుతుంది

జైనము, బౌద్ధము కర్మకాండలను పూర్తిగా తిరస్కరించినవి భగవద్గీతలో శ్రీకృష్ణుడు కూడ వేదాంతమును మాత్రమే చెప్పెను వేదములు త్రిగుణములను గురించియే చెప్పెను, కాని భగవద్గీత గుణాతీతస్థితికి ప్రేరణ కలిగించినది భగవద్గీత (11-44)లో వేదములను అనుసరించువారు అనగా వేదభాష శబ్దార్థము మాత్రమే గ్రహించువారు కోరికలతో ప్రేరితులై స్వర్గభోగము కంటే మించినది లేదు అని విషయ వాంఛలతో నిండిన వారగుదురు, వారు అవివేకులు అని చెప్పబడింది భోగమోహము కలవారు అవివేకులు కర్మకాండలు అనగా ఆచారకర్మలు స్థిరచిత్తమును, భావాతీత ధ్యానము కలిగించవు ఇది పరస్పర విరుద్ధముగా కనబడును వేదములకు మూలమైన భగవానుడు వేదములను తిరస్కరించుచున్నాడు వేదములు ధర్మమునకు ఆధారము అన్నారు మరి ఈ వైరుధ్యము ఏమిటి? సూక్ష్మబుద్ధితో పరిశీలించినచో ఈ వైరుధ్యము యదార్థము కాదు, స్థూల దృష్టికి మాత్రమే వైరుధ్యముగా కనబడును అని కంచికామకోటిపీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి అన్నారు

నిత్యజీవితంలో సామాన్య స్థాయియందు ఉపనిషత్తుల అంతరార్థమైన ఆత్మ పరమాత్మ సంబంధము గ్రహించుటకు సాధ్యము కాదు త్రిగుణముల వలన కలుగు బంధములను వదలించుకుని ఏకాగ్రతతో ఆత్మయందే దృష్టిని నిల్పినగాని ఆత్మపరమాత్మ సంబంధము బోధపడదు వేదములు చెప్పిన కర్మలు ఆ స్థితికి చేరుటకు సోపానముల వలె తోడ్పడును అని కంచిస్వామి

అన్నారు ఆత్మ పరమాత్మల సంబంధము తెలియునంతవరకు ఈ వస్తు ప్రపంచము యదార్థమే యగును కాబట్టి ఈ జీవితంలో సౌఖ్యం కొరకు, పరలోక సౌఖ్యము కొరకు ప్రయత్నం మానవుని సహజమైన ఇచ్ఛయే యగును కాని జీవితధ్యేయము అంతియే కాకూడదు భగవంతునితో ఏకత్వము సాధించుటయే మన ఆశయము కావలయును వేదములు చెప్పిన కర్మకాండలు ఈ ఆశయము నెరవేరుటకు వలసిన చిత్తశుద్ధి, ఏకాగ్రత సాధించి పరమాత్మ కంటే మనము భిన్నము అను భావము నశించుటకు పరమాత్మతో ఐక్యత సాధించుటకు మార్గము నిర్మలము చేయుటకు ఉద్దేశించబడినవి ఎందుకనగా స్వర్గసౌఖ్యము కూడా ఆత్మజ్ఞాన ప్రత్యక్షానుభూతితో సమము కాదు అంతే కాదు స్వర్గసౌఖ్యము కూడ శాశ్వతము కాదు అని చెప్పబడింది కదా!

ముందు వేదాధ్యయనము లేకుండ సూటిగా ఒకేసారి ఉపనిషత్తుల అధ్యయనము చేసి ఎంతో బుద్ధికుశలతతో ఉపనిషద్భావములను చర్చిస్తున్నారు అది దోషం కాదు కాని అది ఈయవలసిన మనశ్శాంతిని ఇచ్చుట లేదు వాంఛా బంధముల నుండి విముక్తి కలిగించుట లేదు, వాస్తవముగా ఆచరణలో ఆత్మజ్ఞాన అనుభూతి కలిగించటం లేదు అందుకు కారణం ముందుగా ఉండవలసిన పునాది లేకపోవుటయేయని స్వామి అభిప్రాయపడ్డారు అది వాస్తవమే కావచ్చు కాని యజ్ఞబలులు ఇచ్చి కుండలములు ధరించి సోమయాజి బిరుదు వహించినవారిలో ఎంత మందికి ఆత్మజ్ఞాన ప్రత్యక్షానుభూతి కలుగుచున్నది సోమయాజి బిరుదాంకితులలోను, ఆచార సార్వభౌములలోను ఎక్కువ మంది స్వభావము గమనించినచో ఆత్మ-పరమాత్మ అనుభూతి లేకపోవటమే కాక వాంఛా వ్యామోహములను ఏ మాత్రము వీడలేదు అవి స్పష్టముగా తెలియును శ్రీకృష్ణుడు భగవద్గీత చెప్పిన కాలమున సరిగా ఇదే పరిస్థితి ఉన్నట్లు చరిత్ర చెప్పుచున్నది శ్రీకృష్ణుడు కర్మకాండలను విమర్శించుటలోని భావము ఇట్టి కర్మిష్ఠులను తిరస్కరించుటయే యగును వేదధర్మమును పరిరక్షించుటయే ఆయన ఆశయము కాని కర్మకాండలే

సర్వస్వము అనేవారిని ఆయన తిరస్కరించాడు శ్రీకృష్ణుని అభిప్రాయము ఆ కాలమునకు తగినదేయని కంచిస్వామి అభిప్రాయం కాని ఆ శ్రీకృష్ణుడే ఈనాడు భగవద్గీత చెప్పవలసి వస్తే ఇంకా కఠినమైన పదములలో చెప్పియుండెడివాడు ఎందుకనగా నేటి పరిస్థితి రెండు విధములా భ్రష్టుగానే యున్నది కర్మిష్ఠులకు ఆచార ఆడంబరము, కీర్తి కండూతి తప్ప అందరిలోను పరమాత్మ ఒకడేయను సామ్యభావము ఏ మాత్రము లేదు ఇక ఉపనిషత్ ప్రవచనాలు చెప్పేవారిలో ఎంతమంది నిజమైన అనుభూతి పొందినవారో తెలియుట సాధ్యముకాదు కాని వారిలో ఎక్కువమంది 'వాచికజ్ఞానులు'గానే కనబడతారు ఎందుకనగా ఆచరణలో వారికి అనుభూతి కలిగినట్లు ఏ మాత్రం కనబడదు కనీసం ఆ దిశలో వారి ప్రయత్నం కూడా లేదు

కాబట్టి కర్మకాండలు ఒక సోపానము వంటివి ఆత్మానుభూతి పొంది జ్ఞాని యగుటకు తగిన మానసిక స్థితి కల్పించుటకే అవి కల్పించబడినవి యదార్థముగా ఆత్మానుభూతి పొందిన తరువాత కర్మకాండలతో పనిలేదు ఆత్మజ్ఞానియే పరమాత్మయగును వానిద్వారా పరమాత్మ ప్రతిబింబించును చెట్టుకు పూవు పూస్తేనే కాయ అంటే ఫలం వస్తుంది కాని పూవు రాలిపోతే ఫలం ఎలా వస్తుంది ఇదే కర్మకాండలకు ఆత్మజ్ఞానమునకు గల సంబంధము పూవు కాయగా మారటం సహజ ప్రక్రియ సహజమైనది జరగనపుడు అంతా అసహజంగాను కృత్రిమంగాను ఉంటుంది

మనోవికాసంతో ఆత్మజ్ఞాన అనుభూతి కలగకపోతే కర్మకాండలు, భక్తి కూడా నిష్ప్రయోజనం అని భగవద్గీత చెప్పుచున్నది భగవద్గీత స్మృతి అది శృతి కాదు అనగా వేదము కాదు వేదము అనగా సంహితలు, బ్రాహ్మణములు కొంతవరకు ఆరణ్యకములు ఉపనిషత్తులు వేదాంతములు భగవద్గీత అటు తరువాత పురాణములు ఇవి వేదములు కావు అందరి అభీష్టాలకు సరిపడునట్లు వ్యాసుడు 18 పురాణాలు వ్రాశాడు ఏ పురాణంలో ఆ పురాణంలోని

సగుణబ్రహ్మరూపమే అందరి కంటే ఉత్కృష్టమని, అతడే సృష్టి స్థితి లయకారకుడైన పరమేశ్వరుడని వ్రాశాడు ఇతర పురాణాలలో చెప్పిన సగుణ బ్రహ్మరూపాలు తక్కువ అని వ్యాసుని భావం కాదు కాని ఇందులోని పరమార్థాన్ని గ్రహించలేక తమతమ ఆరాధ్యదైవాలు మాత్రమే గొప్పవాళ్లు అను మూఢత్వంతో దైవరూపములను మానవులుగా మార్చి వారి కొరకు అభిమాన సంఘాల వలె కొట్లాడుకొని దేశానికి, మతానికి కూడ కీడు చేస్తున్నారు పురాణాల ఆశయం అది కాదు జగత్తులోని నిగూఢసత్యములను కథల రూపంలో సామాన్య మానవునికి అందుబాటులోకి తెచ్చుటయే వాటి ఉద్దేశము భగవద్గీత వలెనే పురాణములు కూడ కర్మకాండలే సర్వస్వం అనుకొని వాటితోనే తృప్తిపడుట బుద్ధిహీనతే యగును అన్నాయి భగవంతుని సామీప్యమును మానసికంగా అనుభవించకుండ యజ్ఞకర్మలు చేయుట అగ్నికి కట్టెలు వేయుట వంటిది అనియు, అపుడు పొగ మాత్రమే వచ్చును, అట్లు చేయువాడు బుద్ధిహీనుడు, అట్టివానికి ఎన్నటికి ఆత్మజ్ఞాన అనుభూతి రాదు అని కర్మకాండలే చెప్పుచున్నవి అని చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి అన్నారు

కర్మకాండలే కాక, జీవితంలో చేయు ప్రతి పని నిష్కామముతో చేసినపుడు అది చిత్తశుద్ధి కలుగజేసి మనస్సును త్రిగుణములకు అతీతమైన స్థితికి చేర్చును కర్మకాండలే వాటి పరిమితులను అంగీకరించినవి పురుషసూక్తము వంటి వాటిలో జ్ఞానమునకే ఉన్నతస్థానము ఉన్నది నిజానికి పురుషసూక్తం ఉపనిషత్తులలోనిది కాదు కదా! అది సంహితలోనిదే తైతరీయ ఉపనిషత్తులో కర్మల గురించిన మంత్రాలు ఉన్నాయి పరమాత్మ జ్ఞానం పొందుటకు కర్మఫలమును భగవంతునికి అర్పించవలయునని భగవద్గీత చెప్పిన సత్యము అత్యంత పూర్వమైన ఉపనిషత్తు 'ఈశావాస్య'లో చెప్పబడింది (2వ మంత్రము) వేదకర్మలు వంద సంవత్సరములు చేసినను, వాటిని దైవమునకు అర్పించు బుద్ధితోనే చేయవలయును స్వార్థవాంఛతో చేయకూడదు అపుడే కర్మబంధము వారికి ఉండదు అని చెప్పబడింది కాబట్టి ఉపనిషత్తులు

కర్మలను చెప్పవు నిష్క్రియతనే ప్రోత్సహించును అని భావించుట సమంజసము కాదు

ఆత్మజ్ఞానసిద్ధి కలిగినపుడు అతనికి వేదములే అర్థమును కోల్పోవును అని చెప్పబడింది ఎందువలన అనగా వేదములే భగవంతుని శాసనములు భగవంతునితోనే ఏకత్వము కలిగినపుడు అతని శాసనముతో పనిలేదు భగవదారాధనలో కూడ భగవంతుడు తన కంటే భిన్నమైనవాడు అను భావము ఉన్నంతవరకు 'సత్యంబ్రహ్మ' అను యదార్థమును గ్రహించలేడు దేవతలైనను పరమాత్మను గురించిన సత్యమును గ్రహించలేనపుడు బ్రహ్మానందమును పొందలేరు అని తైతరీయ ఉపనిషత్తు (2 5)లో, బృహదారణ్యక ఉపనిషత్తులోను చెప్పబడింది (2-3 3) ఆత్మజ్ఞాని అంటే దేవతలకు భయం అని పురాణాలలో చెప్పబడింది ఎందుకనగా ఆత్మజ్ఞాని కర్మకాండలు చేయరు మానవులు చేయు యజ్ఞములే దేవతలకు మంచిని కలుగజేయును (అనగా వారికి ఉపయుక్తమైనవి) గదా! అందువలన దేవతలకు జ్ఞానులు కాదు మూఢులే ప్రియులు అని లోకోక్తి ఉన్నది 'దేవానామ్ ప్రియః' అనగా బుద్ధిహీనుడు అని వ్యంగ్యార్థము బ్రహ్మానంద స్థితికి జేరుటకు వేదాంతము ప్రేరణ కలిగించును ఆ స్థితిలో కర్మకాండలు, దేవతలను తృప్తిపరచుపని ఉండదు 'సర్వము పరబ్రహ్మయే' అదే సత్యము అదే వేదాంతం

కర్మ సిద్ధాంతమును గురించి వేదాంతము ప్రత్యేకంగా ఏమియు చెప్పలేదు ప్రధాన మతములైన అద్వైతము, ద్వైతము కర్మ సిద్ధాంతమును గూర్చి తెలిసిన విషయములే తిరిగి చెప్పాయి ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములలో చెప్పినవే అవి కూడ చెప్పినవి కాని అద్వైతవాదులు లింగశరీరమును గూర్చి ప్రత్యేకంగా చెప్పారు లింగశరీరమే సూక్ష్మశరీరము పునర్జన్మ యందు ఈ సూక్ష్మశరీరమే నూతన శరీరంలో ప్రవేశిస్తుంది కర్మఫలమును సంస్కారములుగా పునర్జనమలోనికి తరలించునది ఈ

సూక్ష్మశరీరమే అన్నారు కోరికయే కర్మకు హేతువు అని తైత్తరీయోపనిషత్తులో శంకరులు అన్నారు 'కర్మహేతుకామస్యత్' అజ్ఞానమే కోరికలకు (కామమునకు) అటుపై కర్మలకు కారణము అన్నారు ఇవి కామ్యకర్మలు "అవిద్యాకామకర్మో పాదానహేతు" 'కామ్యమనస్' అనగా కోరికలతో నిండిన మనస్సు కర్మలకు హేతువు కామ్యకర్మలు భౌతిక ప్రపంచమునకు వర్తించును అవి వ్యావహారిక సత్యములు మోక్షము పారమార్థిక సత్యము జ్ఞానము కర్మబంధమును తొలగించును బ్రహ్మజ్ఞానము మోక్షసాధనము అన్నారు (తై ఉ 1-(11))

బ్రహ్మసూత్రభాష్యం (3-1-2, 8)లలో శంకరుడు పునర్జన్మకు, నూతన శరీరమునకు సంచితకర్మయే కారణము అన్నారు జీవితములో కష్టసుఖములకు కూడ ఈ కర్మలే కారణము పుణ్యకర్మల వలన జీవపరిణామములో ఉన్నతస్థితి పొందవచ్చును కాని ముక్తి కాదు అన్నారు కర్మఫలములు నిరంకుశముగా నుండును ప్రారబ్ధకర్మము అనుభవించుట ద్వారానే అంతమగును సంచితకర్మ బ్రహ్మజ్ఞానం పొందుట ద్వారా నశింపజేయవచ్చును ముండకోపనిషత్తు (3-1-1) శంకరభాష్యంలో ఇలా చెప్పబడింది "అవిద్యా కామకర్మా - వాసనాశ్రయ - లింగఉపాధి ఆత్మేశ్వరౌ (శంకరభాష్యం) అజ్ఞానం వాంఛలు, కర్మ సంస్కారములు లింగశరీరములో ఆత్మను నియంత్రించును అన్నారు ఈ లింగశరీరమే పునర్జన్మకు విత్తనము బ్రహ్మసూత్ర శంకరభాష్యం (3-2-38,41)లో కర్మ అచేతనము, అది జడపదార్థములైన కట్టె, మట్టి వంటిది అని చెప్పబడింది

కర్మ సిద్ధాంతమును గురించి రామానుజుని భావములు అతని బ్రహ్మసూత్రభాష్యములో తెలియును (1-1-1) కర్మను అజ్ఞానముతో సమం చేశాడు (1-1-21) కర్మను చెడుతో (evil) కూడ సమంచేశాడు చెడు కర్మలను (పాపకర్మలను) వదలిపెడితే కర్మప్రభావము నశించును, కర్మబంధము తొలగిపోవును అన్నాడు సుఖదుఃఖములకు కర్మయే కారణము ఈ

జగత్తునందు సర్వము గడ్డిపరక వరకు కర్మరూపములే ప్రపంచమందు అసమానతలకు, భిన్నత్వమునకు కర్మయే కారణము కర్మనాశనము జరిగితే కర్మ ఫలరూపములైన వస్తువులన్నియు నశించును అని రామానుజుని భావము సర్వవ్యాపియైన ఆత్మశక్తి కర్మల వలన దుఃఖమును భరించవలసివచ్చుచున్నది జీవాత్మకు సుఖదుఃఖములు కర్మల వలన సంభవించుచున్నవి (2-1-14 బ్ర సూ ) సుఖదుఃఖములు ఆత్మ భౌతిక శరీరమును పొందుట వలన కాక పాపపుణ్యకర్మల వలన కలుగును అన్నారు జాతి, కులము కర్మఫలముగానే కలుగును అన్నారు మంచి చెడు కర్మలకు మూలము దైవశక్తియే యనియు ఆ కర్మలకు తగు దేహము, ఇంద్రియములు ఆ శక్తి వలనే ఏర్పడును అన్నారు అయినను కర్మలు చేయుటకు స్వేచ్ఛ మానవునికి ఉన్నది అందువలన ఎవరి కర్మలకు వారే బాధ్యులగుదురు అన్నారు భగవంతుడు వారి కర్మలను విచారించి తగిన ఫలములు అందునట్లు చేయును అని వ్యాఖ్యానించారు

యోగవాసిష్ఠ మహారామాయణము అద్వైతసిద్ధాంతమును వివరించు పాఠ్యపుస్తకము వంటిది వేదాంతము కావ్యపద్ధతిలో చెప్పబడినది యోగవాసిష్ఠం అనేది 32 వేల శ్లోకములతో కూడినది కాలక్రమేణ ఆ గ్రంధ పరిమాణము తగ్గుతూ వచ్చి ఇపుడు కొన్ని వందల శ్లోకాలు మాత్రమే మిగిలినవి యోగవాసిష్ఠము అద్వైత వేదాంతసరళిలో కర్మసిద్ధాంతమును ప్రతిపాదించినది దుఃఖము నుండి విముక్తియే వేదాంతసారము అని చెప్పును యోగవాసిష్ఠము జగత్తు స్వప్నములో వలె మిథ్య, అది భ్రాంతి అని తెలియునంతవరకు మనిషి అజ్ఞాని అన్నది ఆత్మజ్ఞానం కలిగినపుడు శాంతి దానంతట అదే వస్తుంది సుఖాలు, భోగాలు అశాశ్వతములు అని తెలిసియు మనిషి వాటి బంధంలో చిక్కు కుంటున్నాడు వైరాగ్య ప్రకరణంలో లక్ష్మి అనగా ధనం మోహిన్ని పుట్టించి తుదకు దుఃఖమునే మిగులుస్తుంది అని చెప్పారు వాణిజ్యాది కర్మల ద్వారా సంపదను పెంచిన కొద్ది అది అనర్థాలకు కారణమవుతుంది, దుఃఖము పెరుగుతుంది సంపద మానవుని సద్గుణములను నాశనం చేస్తుంది సంపద

మనస్సును ఆకట్టుకుంటుంది చిత్తవృత్తులు అనగా స్వభావం దానిపైనే ఆధారపడి ఉంటుంది 'సంపద ఎప్పుడైనా దుష్టకర్మల వలననే లభించును' కాబట్టి అది ఒక క్షణం ఉంటుంది, ఇంకొక క్షణంలో ఉండదు దీనికి ఉపమానం చెప్పారు సంపద సర్పంచేత చుట్టబడిన మల్లెతీగ వంటిది అన్నారు ఆ మల్లె వాసన దుఃఖమునే కలిగించును అజ్ఞానం వలన శరీరమే ఆత్మ అనుకుంటాం ప్రపంచంలో అహంకారమును మించిన శత్రువు లేదు అహంకారం అనేది మోహం వల్ల పుడుతుంది అజ్ఞానం వలన అది పెరుగుతుంది మానసిక వికృత స్వభావం అహంకారం వలన కలుగును అనుకూలమైన వాటికోసం చిత్తం వెంపరలాడుతూ ఉంటుంది ఎంత సంపద లభించినా మనస్సుకు తృప్తి అనేది ఉండదు "మనస్సు అనే పిశాచం అగ్ని కంటే ఉష్ణం కలది" అన్నారు దీనిని అదుపులో పెట్టుట చాల కష్టమైన పని "తృష్ణ అనగా కోరికను రాత్రి అనియు అజ్ఞానం అనేది చీకటి" అన్నారు జీవాత్మ ఆకాశం పాపాలు గుడ్లగూబలు 'మహాపండితుని కూడ తృష్ణ ఒక్క క్షణంలో నీచునిగా మారుస్తుంది" అన్నారు

స్త్రీని గురించి చాల కఠినంగా వ్యాఖ్యానించబడినది వైరాగ్య ప్రకరణంలో స్త్రీ సౌందర్యం ఒక భ్రమ కలిగిస్తుంది, స్త్రీ ఒక అగ్నిజ్వాల వంటిది, స్త్రీ తప్పక భోగేచ్ఛ కలిగించును, కాని స్త్రీని వదిలితే జగత్తును వదిలినట్లే అన్నారు సంసారం ఒక తీర్థయాత్ర యాత్రలో అనేకులు కలుస్తుంటారు, కొంతకాలం ఉంటారు తరువాత వెళ్లిపోతారు అట్టిదే ఈ సంసారం, భార్యా, సంతానం, బంధుమిత్రులు వీరంతా కలిసి ఉండి తరువాత ఎవరి త్రోవన వారు పోయేవారే

కాలమును కొల్చుటకు ఒక గణనము పెట్టుకున్నాము కాలమును క్షణమని చెప్తాము కాలగణనం అసత్యమే అంటుంది యోగవాసిష్ఠం కల్పాలు, క్షణాలు అన్నీ భ్రమ మాత్రమే కాలంలో హెచ్చుతగ్గులు అంతా

భ్రమయే దేవతలందరూ కూడ మృత్యువాతపడ్డారు

మానవ జీవిత ప్రారంభదశలో బుద్ధి వివేకంతో కూడి ఉంటుంది అపుడే చిత్త చాంచల్యమునకు తగిన చికిత్స చేయవలెను ఈ జన్మలో నశించేది శరీరం ఒక్కటే విషయవాసనలు (కర్మసంస్కారములు) విషం వంటివి అది జన్మ జన్మాంతరములకు కారణమై కర్మఫలమును ఇచ్చును యోగవాసిష్ఠం పురుషార్థములకు ప్రాధాన్యమిచ్చినది పురుషార్థసిద్ధి కోసం కర్తవ్యాలను పూర్తిగా నిర్వహించాలి అజ్ఞానం తొలగినపుడు బ్రహ్మజ్ఞానం లభించును మబ్బు నుండి జారిన నీటిబొట్టు సముద్రంలో పడి సముద్రమే అయిపోతుంది అటులే బ్రహ్మమును గురించి తెలిసినవాడు బ్రహ్మమే యగును అన్నారు భోగాలు రుచించనివాడు జీవన్ముక్తుడు

యోగవాసిష్ఠ 'ముముక్షు' వ్యవహార ప్రకరణంలో పురుషార్థమునకు అనగా పురుష ప్రయత్నమునకు ప్రాధాన్యం చెప్పబడింది పురుష ప్రయత్నం అశాస్త్రీయంగా ఉండకూడదు అన్నారు శాస్త్రీయమైన పురుషార్థం పరమార్థాన్ని యిస్తుంది అన్నారు వైరాగ్య ప్రకరణములో స్త్రీని వదలమని చెప్పారు మరి ఇక్కడ పురుషార్థమును సాధించమంటున్నారు ఇది విరుద్ధంగా అనిపించును కాని అంతరార్థం గ్రహించిన వైరుధ్యం ఉండదు ఎందుకనగా స్త్రీ లేనిది గృహస్థాశ్రమమే లేదు ప్రకృతికి పర్యాయం స్త్రీ ప్రకృతి లేనిది సృష్టియే లేదు పురుషుడు పరమాత్మ ప్రకృతి అతని మాయ మాయ చైతన్యమై ప్రకృతిరూపం పొందనంత వరకు పరమాత్మ నిర్గుణుడు పరమాత్మ నిర్గుణుడుగా నున్నంతవరకు ఈ సృష్టి లేదు ఈ సృష్టి కొరకే పరమాత్మ పురుషుడైనాడు అతనిలోని మాయ విడివడి ప్రకృతియైనది ప్రకృతి లేనిది పురుషుడు లేడు ప్రకృతి చైతన్యము పురుషుడు ఆధారము ఆ ప్రకృతి పురుషుల సంయోగమే ఈ సృష్టి అపుడు స్త్రీని వదలివేయమనుటలో భావం ఏమిటి? ప్రకృతికి పర్యాయం స్త్రీ అనుటలోని భావం స్త్రీ మాయారూపిణి అద్వైతంలో జగత్తు

అంతా మాయ అనుటలోని భావమే ఇక్కడా వర్తించును మాయ అంటే జగత్తు లేదు అని కాదు జగత్తు అంతా కనబడునది మాత్రమే దాని వెనుక సృష్టికి మూలమైన పరబ్రహ్మమున్నది అని గ్రహించినపుడు సృష్టికి విలువ పోతుంది మబ్బుల వెనుక ఆకాశం ఉన్నది, మబ్బులు ఆకాశం కాదు అని గ్రహించినపుడు మబ్బుల విలువ పోతుంది అంతవరకు మబ్బులలాగానే కనబడు ఆకాశం వలె ప్రపంచము కూడ అది నిజము అని భ్రమలో ఉన్నంతవరకు అది యదార్థమే యగును

అటులే స్త్రీని ఒక మోహవస్తువుగా కాక ప్రకృతి శృంగారరస ప్రవాహమునకు ప్రతీకగా గ్రహించినపుడు కామం శృంగారంగానే ఉంటుంది గాని మోహం కాదు కామమును పురుషార్థంలోను చెప్పారు, అంతశ్శత్రువులైన అరిషడ్వర్గములలో కూడ చెప్పారు పురుషార్థములు పురుష ప్రయోజనము కొరకు, అరషడ్వర్గములు పురుష వినాశనమునకు దారితీయును పురుషార్థములను మానవుడు సవ్యముగా అనుసరించి ప్రయోజనం పొందాలి రసానుభూతితో కూడిన కామకళ మనిషికి ప్రయోజనమే కలుగజేయును గాని అపకారము కాదు ఇక కామం మనోవికారంగా మారితే ప్రమాదం (passion) మనోవికారం పురుషార్థం కాదు మనోవికారం జంతుప్రవృత్తి వంటిది పురుషార్థం చాల ఉన్నతమైనది అది జీవితానందము కొరకు ఏర్పడినది అట్లు కానిది పురుషార్థము కాదు మనోవికారం ఆనందం కాదు కాబట్టి స్త్రీని వదలవలెను అనగా స్త్రీ పట్ల మనోవికారములను (passions) వదలవలెను అని భావము అంతేకాని స్త్రీయే లేకుండ చేయమని కాదు

పూర్వజన్మ వాసనలు అనగా గతకర్మ సంస్కారములను తప్పించు కొనుటకు వీలుపడదు అన్నారు ఈ సంస్కారములు శుభములు, అశుభములు అని రెండు విధములు పురుష ప్రయత్నంతో సంస్కార ప్రవాహమును శుభమార్గమునకు మరలించగలగాలి అని వాశిష్ఠ రామాయణం చెప్పింది చిత్త

ప్రవృత్తియే కర్మలకు మూలము చిత్తం అనగా మనస్సు పసిపిల్లవాని వంటిది దానిని ప్రయత్నముతో మంచి కర్మల వైపుకు మరలించాలి ఇందుకు తొందరపాటు పనికిరాదు అన్నారు సాధన ద్వారానే ఇది సాధ్యము మన కోరికలన్నిటి స్వరూపమే మనస్సు మన కర్మలకు మూలము మనస్సే కాని ఇంద్రియముల ద్వారా జరుగు భౌతిక చర్యలు కాదు అన్నారు మూర్ఖత్వం (మూఢత్వం) అన్నిటికి కారణం అది తొలగినపుడు వివేకం వస్తుంది మూఢత్వం తొలగించుకొనుటయే జీవితలక్ష్యం కావాలి తీర్థయాత్రల వలన ఇది సాధ్యము కాదు మనస్సును నియంత్రించుట సాధన వలనే సాధ్యము ఆంతరిక మానసిక శాంతియే పరమానందం

కర్మకు మూలకారణం ఏదియూ ఉండదు ఒక కర్మ మరియొక కర్మకు కారణమగును సృష్టికి ఏ కర్మలు కారణం కాదు అటుపై మనిషి కర్మలే అతని సుఖదుఃఖములకు కారణములైనాయి సంతుష్టుడైనవాడే (contented) మనశ్శాంతిని పొందును ఆశించినది లభించినా, లభించక పోయినా సమభావంతో ఉండగలవాడే మనశ్శాంతిని పొందును లభించిన దానితో తృప్తిపడువాడే సంతుష్టుడు అన్నారు అహంకారము పోయినపుడే ఇది సాధ్యము దీనికి వివేకం అవసరం వివేకం కలిగినపుడే యుక్తాయుక్తములు (మంచిచెడులు) తెలియును మాటలలోని అర్థమును బట్టే ఆ మాటలను గ్రహించాలి 'అసమంజసమైన దానిని బ్రహ్మదేవుడు చెప్పినా విననక్కర లేదు' అని యోగవాసిష్ఠము చెప్పుచున్నది అందుకే యోగవాసిష్ఠము పురుషార్థం అనగా పురుష ప్రయత్నమునకే ప్రాధాన్యమిచ్చినది కర్మలను విడనాడుట కంటే వాటిని పురుష ప్రయత్నంతో వివేకంతో ఆచరించటమే మేలు అని చెప్పినది



# III. ముగింపు

### 1) కర్మ సిద్ధాంతము - ఆక్షేపణలు

ప్రధాన భారతీయ తత్త్వ శాస్త్రములు కర్మసిద్ధాంతమును అంగీకరించి నను కొంతమంది దానిని ఆక్షేపించినవారు కూడ ఉన్నారు అట్టివారిలో యజ్ఞకర్మలు, లౌకిక కర్మలను కూడ తిరస్కరించి నిష్క్రియతను ప్రోత్సహించినవారు బుద్ధునికాలంలో ఉండినట్లు తెలుస్తోంది చార్వాకులు భౌతికవాదులు పంచభూతముల నుండే ఆత్మ కూడా జన్మిస్తుంది శరీరము పంచభూతములలో కలిసినపుడు ఆత్మ కూడా నశిస్తుంది పునర్జన్మ ఉండదు మంచి లేదు చెడు లేదు కనబడు ఈ ప్రపంచమును దాటి ఏమియు లేదు మరణంతో వ్యక్తి జీవితం పూర్తి అగును పునర్జన్మ ప్రసక్తి లేదు ఇది చార్వాక వాదన పునర్జన్మ లేనపుడు కర్మ సిద్ధాంత అవసరం లేదు నిష్క్రియా లేక అక్రియావాదులకు (inactivity or non-action) దయ, ధర్మము, ఇంద్రియనిగ్రహం (self control), నీతి, నిజాయితీలకు అవసరం లేదు కొంతమంది నియతివాదులున్నారు పునర్జన్మకు కారణం కర్మఫలం కాదు నియతి లేక విధి (fate) అని వీరి వాదన కర్మ పరిపక్వత ప్రసక్తే లేదు వీరి దృష్టిలో జీవులందరు నిస్సహాయులు నియతి వాదం ప్రకారం ప్రపంచంలో అన్నీ ముందుగానే నిర్ణయించబడినట్లే జరుగును 'నియతి' అనునది ఒక శక్తి సృష్టి ఆరంభమున 'నియతి' అను శక్తి జనించెను అది అంతము లేని ప్రవాహము దానిని ఆపుట అసాధ్యము యోగవాసిష్ఠములో కూడ ఉత్పత్తి ప్రకరణంలో 'నియతి'ని గూర్చి చెప్పబడింది అనంతరకాలంలో 'నియతి'నే కర్మగా గుర్తించారు సంచితకర్మనే నియతి అన్నారు కర్మ సిద్ధాంతమును వ్యతిరేకించిన వారిలో ముఖ్యులు 'లోకాయతులు' లేక 'చార్వాకులు' వీరు పదార్థవాదులు నాలుగు భూతములనే వీరు గుర్తించారు అవి భూమి, నీరు, అగ్ని, వాయువు బుద్ధిని కలిగిన శరీరమునే ఆత్మ అన్నారు ప్రత్యక్ష సాక్ష్యమే

వీరి దృష్టిలో అన్నిటికి ఆధారము సైన్సు ఒక విధముగా భౌతిక వాదమునే పోలియున్నది భౌతికవాదంలో మృత్యువే ముక్తి మరణానంతరం ఏమియు లేదు పరలోకం, పునర్జన్మలు, భవిష్యజన్మలో గతకర్మ అనుభవించుట ఇవి ఏమియు లేవు చార్వాకులు ఆత్మ ఉన్నదని విశ్వసించలేదు శరీర దహనంతో అంతా సమాప్తి పునర్జన్మ లేదు అందువలన చార్వాకులు తినటం, త్రాగటం, వినోదం, ఉల్లాసం - ఇవే జీవిత ఆశయాలుగా చెప్పారు చార్వాకులకు భగవంతుడు లేడు ముక్తి ప్రసక్తి లేదు వాంఛలను మించిన ధర్మం లేదు పాపపుణ్యములు లేవు

కాలవాదులు, యాదృచ్ఛవాదులు, అజ్ఞానవాదులు కూడ కర్మ సిద్ధాంతమును వ్యతిరేకించారు 'కాలవాదులు' అన్నిటికి మూలకారణము కాలమే అన్నారు 'స్వభావవాదులు' ప్రకృతి వలన ఏర్పడు ప్రవృత్తి అనగా స్వభావమే మూలకారణము అన్నారు 'యాదృచ్ఛికవాదుల' దృష్టిలో దేనికీ కారణం లేదు అన్నీ అకస్మాత్తుగా జరుగును అని వీరి మతము 'అ జ్ఞానవాదులు' మనస్సులో కలుగు ఉద్దేశమును విశ్వసించలేదు అన్నీ వాటంతట అవే సహజముగా జరుగును అని వాదించారు మహాభారతము శాంతిపర్వములో కాలప్రాధాన్యము గూర్చి చెప్పారు (12-34-7)లో మనుష్యుల పాపపుణ్యములకు కాలమే ప్రత్యక్షసాక్షి అన్నారు (12-34-10)లో కర్మలు కాలము ద్వారానే ప్రపంచములో జీవము, చైతన్యము కలిగించుచున్నవి అన్నారు కర్మసిద్ధాంత వ్యతిరేక ప్రవచనాలు మనుష్యులను బుద్ధిహీనులనుగా చేయును, అట్టివారు పాపములను నిర్భయంగా చేస్తారు అని జైనమతాచార్యులు భావించారు పరలోకం కనబడదు ఈ జీవితంలో సుఖసంతోషాలు కనబడతాయి అవి మన చేతులలోనే ఉన్నాయి భవిష్యత్తు మనకు తెలియదు అని వారు భావిస్తారు అని జైనాచార్యులు అన్నారు

కర్మలకు ఆధారం కాలం అని భారతంలో కూడ చెప్పబడింది

కర్మకు మూలం కోరిక అయితే, ఆ కోరిక కర్మరూపం పొందటానికి కాలమే ఆధారం 'కాలచక్రము'ను నిరోధించుట ఎవరివలనను సాధ్యము కాదు శ్వేతాశ్వతర ఉపనిషత్తు భాష్యంలో శంకరుడు కాలము అన్ని పరిణామములను కల్పించును అన్నారు కర్మసిద్ధాంత వ్యతిరేకవాదములు ఎన్ని వచ్చినను అవి కర్మసిద్ధాంతమును చలింపచేయలేదు కాలమునకు కర్మమునకు అవినాభావ సంబంధమున్నది కాలము కర్మ ద్వారా పనిచేయును కర్మ కాలము ద్వారా వ్యక్తమగును నియతిని సంచితకర్మగా భావించుటలో కూడ కాలము ఇమిడియున్నది వేదముల 'ఋతము' (rta) నియతిని పోలియున్నట్లు కనబడును కర్మసిద్ధాంతమును పూర్తిగా వ్యతిరేకించిన చార్వాక మతము అంతరించినది

ఉపనిషత్తులు, కర్మసిద్ధాంతమును వ్యతిరేకించలేదు కాని పరబ్రహ్మ కర్మములకు అతీతుడు అందుచే బ్రహ్మజ్ఞానిని కర్మఫలములు అంటవు అని చెప్పాయి మహాభారతము కర్మసిద్ధాంతమును అంగీకరించినను పురుష ప్రయత్నమునకు ప్రాధాన్యము ఇచ్చినది శాంతిపర్వంలో పురుష ప్రయత్నమును గురించి ప్రత్యేకంగా చెప్పబడింది పురుష ప్రయత్నము లేక ప్రయోజనము సిద్ధించదు అన్నది ప్రారబ్ధకర్మ ముందుగనే నిశ్చయించబడినది అందుచే పురుష ప్రయత్నమే ప్రధానము అన్నారు (human effort) అయినను కర్మను వ్యతిరేకించలేదు పాపియగువాడు తన కర్మ చేత చనిపోయినవాడే అగుచున్నాడు అతనిని చంపువాడు చచ్చినవానినే చంపినట్లు అగును అన్నారు ప్రారబ్ధ కర్మమును ఉల్లంఘించుట అసాధ్యమైనను పురుషప్రయత్నము కార్యసిద్ధికి సాధనము అన్నారు జీవులు వారి కర్మానుసారము విభిన్న మార్గములందు పయనించుదురు అని భారత వచనము పురుష ప్రయత్నముతో కర్మఫలమును ఎదుర్కొనవచ్చునని మహాభారత ప్రవచనముగా కనబడును ఈ పురుష ప్రయత్నమును గురించి శాంతిపర్వంలో (12-174-33) వ్యక్తుల భిన్నత్వమును వివరించారు ప్రపంచంలో రెండు రకముల మనుష్యులే సుఖంగా ఉంటారు

వారిలో ఒకరు మూర్ఖులు. వీరికి తెలుసుకొనవలసినది, ప్రయత్నించవలసినది ఏమియు కనబడదు. ప్రపంచమంతా సుఖమయంగానే వీరికి కనుపించును. ఇక రెండవవారు నిశ్చయమైన బుద్ధితో ధర్మమునెరిగి ఇంద్రియములను నియంత్రించి పురుష ప్రయత్నముతో విజయమును సాధించుదురు. వీరి ఇద్దరికి మధ్యనున్నవారే ఎక్కువ దుఃఖమును అనుభవించుదురు. వీరు మూర్ఖులు కాదు, వివేకవంతులూ కాదు. వీరు ఇద్దరికీ మధ్యనున్నవారు. వీరు జ్ఞానులు కాదు అజ్ఞానులు కాదు. మూర్ఖుల వలె నిష్క్రియులు కాదు. వివేకవంతుల వలె పురుషప్రయత్నము చేయలేరు. ప్రారబ్ధకర్మము వీరినే ఎక్కువ బాధించును.

**2) పురాణముల సంకేతార్థములు (Symbolism in Mythology) :**

వేదములు జగత్తు ఉత్పత్తిని గురించి చెప్పాయి. పురుషసూక్తం (ఋగ్వేదం X-90) హిరణ్యగర్భసూక్తము (ఋగ్వేదం X-121)లలో పరమాత్మయే సృష్టికి కారణము అని చెప్పాయి. (ఋగ్వేదం X-72)లో బ్రహ్మణస్పతి దేవతలను వృక్షములను సృష్టించెనని చెప్పబడింది. అలాగే (ఋగ్వేదం X-81)లోని విశ్వకర్మ వృక్షములు, అడవులు, ప్రకృతి నుండి భూమిని సృష్టించెనని చెప్పారు. (ఋగ్వేదం X-90) అనగా పురుషసూక్తములో విరాట్ పురుషుని సృష్టికి మూలకారణముగా చెప్పారు. ఋగ్వేదంలో పురుషుని బలితో యజ్ఞము చేయబడెను అని చెప్పారు. ఇచట సంకేతార్థమునే గ్రహించాలి. ఉపనిషత్తుల కాలంలో మంత్రప్రభావం తగ్గి పరబ్రహ్మమును తెలుసుకోవాలనే ఆధ్యాత్మిక జిజ్ఞాస ఏర్పడింది. అపుడే యజ్ఞములకు, బలులకు సంకేతార్థములు ఏర్పడినై. నిగూఢమైన అర్థంతో భగవంతుని బలి యిచ్చింది భగవంతుడే అన్నారు. అనగా బలి ఇచ్చింది ఆయనే, బలి ఇవ్వబడింది ఆయనే. ఇది ఒక ఆదిమ (Primeval) సిద్ధాంతం. ఆ ఆదిమ బలి లేక త్యాగము ఈ సృష్టికి మూలం అనేదే ఆ సిద్ధాంతార్థము. ఋగ్వేద కాలాంతములో బహుశ ఈ సిద్ధాంతం ఏర్పడి ఉండవచ్చు. అంతవరకు దేవుళ్ళుగా నమ్మబడిన అగ్ని,

ఇంద్రుడు, వరణుడు తెరమరుగైనారు సర్వజీవులకు ప్రభువైన దేవుడు 'ప్రజాపతి' అన్నారు ఈ ప్రజాపతే తరువాత కాలంలో చెప్పబడిన హిరణ్యగర్భుడు ఈ ప్రజాపతే సృష్టికి పూర్వము ఉన్న ఆదిపురుషుడు అన్నారు ప్రజాపతే తనను తాను తన కొరకే బలిగా చేసుకున్నాడు ఈ ప్రక్రియయే యజ్ఞమునకు గల గూఢార్థము విశ్వసృష్టికై తనను తానే ఆహుతిగా చేసుకున్నాడు ఇదే మొదటి 'బలి'గా చెప్పబడింది అలా ఆహుతియైన ప్రజాపతి సృష్టిలోని జీవులలో వ్యాప్తిచెందాడు సృష్టికి కావలసిన మహత్తు కొరకు తనను తానే త్యాగం చేసుకున్నాడు ఇది పూర్తిగా జ్ఞానరూప యజ్ఞము అనగా మనస్సు ద్వారా చేయబడినది, కర్మ ద్వారా కాదు అని అర్థము ఇది పూర్తిగా సంకేతార్థము (symbolic meaning) తరువాత ఉపనిషత్తుల కాలంలో ఈ భావమునకు పరిపూర్ణరూపం ఏర్పడింది

నిష్క్రియుడు, నిరాకారుడు అయిన పరబ్రహ్మకు సృష్టి సంకల్పము కలిగినపుడు స్ఫోటము ఏర్పడినది అపుడు పరబ్రహ్మము నుండి చైతన్యశక్తి విడివడి ప్రకృతిగా రూపొందింది తాను విరాట్ పురుషుడుగా రూపొందాడు ఆ విరాట్ పురుషుని గర్భము - హిరణ్యగర్భముగా చెప్పబడింది అందుండి ప్రకృతిచే ఆవరించబడిన జీవులు సృష్టి పొందాయి విరాట్ పురుషుడు వైశ్వానరుడై వ్యష్టిగా ప్రతి ఒక్క జీవిలోను ఆత్మగా రూపొందాడు అనగా విరాట్ పురుషుడు (ప్రజాపతి) తనను తాను విచ్ఛిన్నం చేసుకుని సృష్టిగా ఏర్పరచుకున్నాడు విరాట్ పురుషుడు తనను తానే బలి చేసుకుని తిరిగి తానే భిన్నముగా రూపొందాడు ఇదే యజ్ఞము విరాట్పురుషుడే యజ్వ (యజ్ఞము చేసినవాడు) అతడే భారతంలో వర్ణింపబడిన విశ్వరూపము అథర్వవేదం 19వ కాండ 6, 7 సూక్తములలో కూడ ఇదే చెప్పబడింది

క్రీ॥పూ॥ 1500 సంవత్సర ప్రాంతంలో అంతరిక్ష నిగూఢత్వమును గురించి నిరంతరంగా జ్ఞానదృష్టితో పరిశీలన జరిగింది దాని ఫలితమే

ఉపనిషత్తులు. పరబ్రహ్మ సంకల్పరూపులు విరాట్ పురుషుడు, చైతన్యశక్తి (ప్రకృతి). వారిద్దరి సంయోగమే ఈ సృష్టి అను సిద్ధాంతం ఏర్పడింది. హిరణ్యగర్భుడే పురుషుడు (ఋగ్వేదం X-121). అతనిచే ప్రకృతికి దానము చేయబడిన గర్భమే బ్రహ్మాండము అన్నారు. ఈ బ్రహ్మాండమే ఈ సృష్టిరూపము.

సృష్టిని ఒక ప్రతీకగా (symbol) గ్రహించటం ఇపుడే ప్రారంభమైంది. 'ప్రజాపతి బలి' అనగా యజ్ఞమును గూడ ప్రతీకగానే గ్రహించారు. ఋగ్వేదంలో (X-129) చెప్పబడిన 'సృష్టి ఋక్' (Hymn of creation) ఈ స్థితిని చక్కగా తెలియజేస్తుంది. సృష్టికి ముందు అంతరిక్షంలో నున్న సంకులస్థితి ఇందు తెలుపబడింది.

అంతా శూన్యం, స్థితి లేదు, వాయువు లేదు, స్వర్గం లేదు, ఈ శూన్యం ఎక్కడుంది? దానిని ఆవరించి ఏముంది? దీని రక్షకుడు ఎవరు? అంతరిక్షంలో అగాధమైన నీరు ఉన్నదా? ఇవీ ప్రశ్నలు వారిని వేధించినవి.

అపుడు అనగా సృష్టికి పూర్వం మృత్యువు లేదు. అమృతత్వం లేదు. రాత్రి లేదు. పగలు లేదు. వాయువు లేకున్నను శ్వాసించువాడొక్కడున్నాడు. ఉన్నది వాడొక్కడే. మరొకరు లేరు.

ప్రథమంగా అంతా చీకటి. రోదసి (space) అంతా వెలుగులేని నీటిమయం. ఆ ఒకడు ఉష్ణము లేక అగ్ని లేక వెలుగు నుండి ఉద్భవించాడు.

ముందుగా కోరిక అతనిలో ఏర్పడింది. మనస్సు నుండి వచ్చిన ఆదిబీజము అదే. తపస్వులు తమ జ్ఞానదృష్టితో ఆ ఆది బీజమునకు సంబంధించిన వారెవరో తెలుసుకున్నారు.

ఆ తపస్వులు తమ దృష్టిని సారించి అంతరిక్షమందు భూమికి పైన ఏముంది, క్రింద ఏముంది గ్రహించారు. వీర్యము (శుక్రము) మహాశక్తికి మూలమైంది. క్రింద శక్తిపైన ప్రేరణ.

కాని ఇదంతా ఎపుడు జరిగింది? ఎలా జరిగింది? సృష్టి ఎలా ఏర్పడింది? ఎలా తెలుస్తుంది? దేవతలే సృష్టి తరువాత వచ్చారు

సృష్టి ఏర్పడినపుడు సృష్టికి మూలం ఆ ఒకడు దీనిని రూపొందించాడా? లేదా? ఎలా తెలుస్తుంది? ఈ సృష్టిని పై నుండి గమనిస్తున్నాడా లేదా?

దాదాపు 3500 సంవత్సరముల తరువాత నేటికీ ఇవే ప్రశలు మానవుని వేధిస్తున్నాయి

పైన ఉదహరింపబడినట్లు బృహద్రధుడను రాజు అడిగిన ప్రశ్నలకు శాకాయన్యుడు అను ఋషి సమాధానం ఇచ్చాడు (మైత్రేయణ్యుపనిషత్తు)

రాజా! పరిశుద్ధమైన జీవుడు ఈ శరీరము నుండి నిష్క్రమించి జ్యోతిని చేరి పరంజ్యోతిగా రూపొందును ఇదియే ఆత్మ ఇది అద్భుతమైనది అభయమైనది ఇదియే బ్రహ్మము పరమమగు ఈ ఆత్మ శుద్ధమైనది, నిశ్చలమైనది, అసంగమైనది నాటకమును చూచు ప్రేక్షకుని భంగి ఉండునది గుణమయమైన వస్త్రముచే తన స్వరూపమును ఆచ్ఛాదించుకొని యుండునది 'ఆ ఒక్కడే' పరమాత్మ అతని శ్వాసప్రక్రియయే ఈ జగత్తు శ్వాసను బయటకు వదలుట సృష్టి లోపలికి తీసికొనుట సృష్టి లయము ఉష్ణము లేక అగ్ని అంటే స్ఫోటము అనుకొనవచ్చు (Big Bang) అదే సృష్టికి మూలం కదా! పరమాత్మ సంకల్పమే 'కోరిక' ఆ కోరిక ఫలితమే విరాట్ పురుషుడు ప్రకృతి పురుషుల కలయికయే సృష్టి ఇదే గీతలో పురుషోత్తమ యోగంలో చెప్పబడింది గదా!

దీనిని బట్టి ఉపనిషత్తుల కాలం నాటికి అనగా సుమారు క్రీ॥పూ॥ 1000-1500 సంవత్సర మధ్యకాలంలో ఆత్మజ్ఞాన సాధన ప్రారంభమై యుండవచ్చును అందుచే యజ్ఞకర్మల ప్రాబల్యం తగ్గింది ఇంచుమించు నేటికీ ఈ పరిశోధన సాగుతూనే ఉన్నది

యజ్ఞమునకు సంకేతార్థ ప్రాధాన్యం ప్రబలమైంది విష్ణుసహస్ర

నామములలో 104వ శ్లోకమును నిశితంగా పరిశీలించినచో యజ్ఞమంటే బలి అని కాక భిన్నమైన సంకేతార్ధము గోచరించును. యజ్ఞము అంటే సంకేతార్ధము సృష్టి అని తెలుస్తోంది. సృష్టి పరమాత్మ నుండే ఏర్పడుతోంది, తిరిగి పరమాత్మలోనే లీనమగును. మరి ఈ యజ్ఞమునకు ప్రయోజనమేమిటి?

వాస్తవమునకు ఈ సృష్టికి ఏమియు ప్రయోజనము లేదు. మరి ఈ శ్రమ అంతా ఎందుకు? ఆడుకుంటున్న పిల్లవాడిని, ఎందుకు ఆడుతున్నావు అని అడిగితే, సమాధానం చెప్పగలిగిన తెలివి ఉంటే ఆడుకోవటం కోసమే అంటాడు. అంటే ఆడుకోగలగటమే ఆడుకోవటం వలన ప్రయోజనం అని అర్ధం. సమాధానం చెప్పలేనివాడు నవ్వుకుంటూ వెళ్లిపోతాడు, మరల ఆడుకుంటాడు.

సృష్టి కూడ ఇలాంటిదే. భగవంతుడిని అడిగినా ఇలాగే చిరునవ్వు నవ్వి ఊరుకుంటాడు. అంటే సమాధానం చెప్పలేక కాదు. చెప్పటానికి సమాధానం లేదు కాబట్టి. సృష్టికి పూర్వం ఉన్న సంకులస్థితిలో పరమాత్మ తప్ప ఎవరూ లేరు. ఆ స్థితి ఒంటరితనం భరించలేక మరియూ నిష్క్రియాపరుడై ఉండలేక సృష్టియను యజ్ఞం ప్రారంభించి, ప్రణాళిక ఏర్పరచి, తన చైతన్యశక్తిని ప్రకృతిగా మార్చి సృష్టి పరిణామ ప్రక్రియ ప్రారంభించి ఒక వలయంగా (చక్రభ్రమణం) జరుగు ఆ ప్రక్రియను గమనిస్తూ ఆనందిస్తూ ఉంటాడా అనిపిస్తుంది. ఇది భగవంతుని క్రీడా ఫలితమని గ్రహించలేక అంతా తమ ప్రయోజకత్వమని జీవులు భ్రమిస్తూ ఆనందిస్తూ ఉంటారు. ఈ విధంగా సృష్టి ఏ ఒక్కరిని ఉద్దేశించినది గాని, ఏ ఒక్కరి ప్రయోజనమునకుగాని కాదు. కాబట్టి ఈ సృష్టికి బాధ్యులెవరు అను ప్రశ్నకు సమాధానం లేదు, సృష్టియందలి జీవులకు తాత్కాలికముగా ఏవో కొన్ని ప్రయోజనాలున్నట్లు కనబడినను సృష్టి మొత్తమునకు వేరే ప్రయోజనం అంటూ ఏదియును లేదు. విరాట్ పురుషుడైన పరమాత్మయే వైశ్వానరునిగా ఈ సృష్టి యందు అంతటా వ్యాపించి ఉన్నాడు.

అందుకే అతనిని అంతర్యామి అన్నారు అతనికైనను ఇది వినోదమే కాని ప్రయోజనమంటూ ఏదియు లేదు అట్టిది ప్రయోజనమునకు మించినది, అనగా ప్రయోజనము ఆశించక చేయునది యజ్ఞము

పరమాత్మ వినోదము కొరకై ఈ సృష్టి ఏర్పడినా, సృష్టిలో అతడు పాల్గొనుట లేదు సృష్టికి అతీతుడై సృష్టిని నడుపుతున్నాడు సృష్టి పరిరక్షణ, పర్యవేక్షణ అతనిదే అందువలన సృష్టియను ఈ యజ్ఞమునకు అధిపతి అతడే 'పురుష సూక్తములో' చెప్పబడినట్లు సృష్టియందలి సమస్త భాగములు పరమాత్మయందలి భాగములే ఈ సృష్టియను యజ్ఞము విరాట్ పురుషుని శరీర భాగముల నుండి దిగివచ్చినదే ముందు చెప్పినట్లు సృష్టి .గవంతుని ఉచ్ఛ్వాస నిశ్వాసలే

సృష్టిని గురించి చెప్పిన ఋక్కులందు కర్మను గురించి ప్రస్తావించలేదు సృష్టికి పూర్వము ఎట్టి కర్మ ఉండు ప్రసక్తియే లేదు కాబట్టి కాని ఇతిహాసముల లోను, పురాణములలోను కర్మ సిద్ధాంతము ప్రధానాంశము అయినది జనన మరణములు ఏర్పడుటకు మహాభారతం శాంతిపర్వంలో ఒక కథ చెప్పబడింది పూర్వం ఒకపుడు జీవుల ఉత్పత్తి విపరీతమై జనాభా సంఖ్య అపరిమితమగుట వలన సృష్టికర్త తేడాలు గమనించకుండ జనాభా సంఖ్య తగ్గించుటకు జీవులను నాశనం చేయ ప్రారంభించాడట అపుడు శివుడు అడ్డుపడి జననాశనమును ఒక క్రమపద్ధతిన చేయమని కోరాడట అందుకు పునర్జన్మయే మార్గము అన్నాడట అపుడు మృత్యువు అను స్త్రీని సృష్టించి ఆమె ద్వారా ప్రవృత్తి - నివృత్తి అనగా జనన మరణములను కల్పించాడట మృత్యువు ధర్మముననుసరించియే తన కార్యమును నిర్వర్తించవలయునని నిర్దేశించ బడింది అప్పటి నుండి మృత్యువు నిష్పాక్షికముగా జననాశనమును ఒక నియమిత విధానంలో చేయసాగింది ఆ నియమిత విధానమే కర్మసిద్ధాంత మైనది గత జన్మలో చేసిన కర్మలను జీవుడు పునర్జన్మలో అనుభవించుట

ప్రారంభించాడు అన్నారు. దీని భావము జనన మరణములు, కర్మానుభవము జీవుల ప్రవృత్తిని నియంత్రించుటకు ఏర్పడినట్లు సంకేతార్థముగా గ్రహించ వచ్చును.

సృష్టిలో అధర్మము పెరిగినపుడు జలప్రళయం సంభవించి జీవులను నాశనము చేయునని మహాభారత అరణ్యపర్వములోని మత్స్యావతార కథ చెప్పుచున్నది. (3-13, 9, 128) సూర్యుని పుత్రుడగు వైవస్వతమనువు బదరికావనమందు తపము చేయుచుండెడివాడు. అతడు ప్రజాపతి (బ్రహ్మము) అంత తేజశ్శాలి. ఒక రోజున ఒక చేప (మత్స్యము) అతని వద్దకు వచ్చి రక్షణ కోరెను. మనువు ఆ మత్స్యమును ఒక కడవలో నీటియందుంచెను. ఆ మత్స్యము ఆ కడవ పట్టనంత పెద్దదిగా పెరిగెను. అపుడతడు దానిని తీసి ఒక పెద్ద బావి యందుంచెను. కాని అది ఆ బావి వైశాల్యమునకు మించి పెద్దదాయెను. అపుడు దానిని గంగానది యందుంచెను. అది గంగానదిని మించి పెద్దదాయెను. అపుడు దానిని మనువు సముద్రమునందు ఉంచెను. అపుడు ఆ మత్స్యము అతనికొక విషయము చెప్పెను. "సర్వప్రపంచమును లయము చేయు మహాజలప్రళయము రానున్నది. నీవు ఒక దృఢమైన ఓడను తయారుచేయించి, అందు నీవు సప్తఋషులతో కూర్చొనుము. అన్ని విధములగు బీజములను (విత్తనములను) సంగ్రహించి ఉంచుకొనుము. అందు నా కొరకై వేచియుండుము. నేను వచ్చెదను. నాకు ఒక కొమ్ము ఉండును. దానిచే నన్ను గుర్తించి ఒక త్రాడుతో నావను నాకొమ్మకు కట్టుము. నేను మిమ్ము రక్షించెదను" అని చెప్పెను. ప్రళయము వచ్చినది. మనువు నావ యందు సప్తఋషులతో విత్తనములు ఉంచుకొని వేచియుండెను. అపుడు పర్వతాకారముతో నున్న మత్స్యము వచ్చినది. మనువు నావను త్రాడుతో మత్స్యము కొమ్మునకు తగిలించెను. అపుడు జగత్తు అంతా జలమయం. మనువు, మత్స్యము, సప్తఋషులు మాత్రమే కన్పడుచుండిరి. భూమి, ఆకాశము, దిక్కులు ఏమియు తెలియుట లేదు. మత్స్యము నావను

హిమవత్ పర్వత శిఖరము వద్దకు చేర్చి నావను శిఖరమునకు కట్టమని సప్తఋషులకు చెప్పెను వారు అట్లే చేసిరి అపుడు ఆ మత్స్యరూపుడైన పరమాత్మ ఇట్లనెను "మహర్షులారా! నేను ప్రజాపతియగు పరబ్రహ్మను ఈ మహాప్రళయమందు నేను తప్ప ఏదియును మిగలదు మిమ్ములను నేను రక్షించితిని ఇకపై ఈ మనువు సర్వజగత్తును సృజించవలయును నాయనుగ్రహముతో ఇతడు తన కార్యమును నిర్వర్తించును" మత్స్యము అదృశ్యమాయెను వైవస్వత మనువు ప్రపంచ సృష్టిని చేయదలచెను కాని అతనికి మోహము లేక మాయవలన ఏమియు తోచలేదు అపుడతడు తపస్సు చేసి ఆ శక్తిచే సృష్టి చేయ ఆరంభించెను మత్స్య పురాణము ద్వితీయాధ్యాయములో కూడ ఇదే కథ చెప్పబడింది ఈ కథ యథార్థమా, కాదా అనేది ప్రధానం కాదు సృష్టికి పూర్వం విశ్వమందలి స్థితిని చెప్పు భావార్థం ప్రధానం మత్స్య పురాణంలో దీనిని అవాంతర ప్రళయం అన్నారు (unexpected)

సృష్టి, స్థితి, లయలు అనేవి జగత్తు అనబడు రంగమందు మూడు అంకములు లయం లేకపోతే ఉన్న స్థితి అలాగే సాగుతుంది సృష్టి అంటే జగత్తుకు మొదలు లయం అంటే జగత్తుకు అంతము ఈ రెండు లేని స్థితి పరమాత్మది అది జనన మరణములు లేని స్థితి అందుకనే విష్ణు సహస్ర నామాలలో పరమాత్మ తత్త్వమును "అనాది నిధనః" అని చెప్పారు కాని సృష్టి ఆరంభము, అంతము కూడ పరమాత్మ రూపములే కాబట్టి పరమాత్మ తత్త్వమును 'దాత' (భరించువాడు) అని కూడ అన్నారు సృష్టిని కల్పించినవాడు పరమాత్మ అందుకే 'విశ్వకర్మ' అయినాడు 'విశ్వకర్మ' అంటే దేవతల శిల్పి అని కాదు అసలు విశ్వకర్మ పరమాత్మ సృష్టి ఒక నిర్మాణం లాంటిదే (construction) జగత్తును పరమాత్మ నిర్మించాడు ఆ నిర్మాణమునకు ఆయనకు ఉపకరించిన శక్తులు రెండు అవి విష్ణుసహస్రనామంలో చెప్పినట్లు మనుః, త్వష్ట మనువు అంటే పురాణాలలో చెప్పిన 14 మంది మనువులలో ఒకరు కాదు 'మనుమతేమనుః' మననం చేయువాడు మనువు మననం అనగా ఆలోచన

చేయువాడు మనువు. సృష్టిని గురించి ఆలోచించినవాడు పరమాత్మ. కాబట్టి అతడే మనువు. తన ఆలోచన కార్యరూపం దాల్చుటకు ఒక ప్రణాళిక (plan) వేశాడు. ప్రణాళిక వేసేది ఒక వాస్తుశిల్పి (architect) లేక ఒక ఇంజనీర్ (plan). ఆ ప్రణాళికే మనవు అని సంకేతార్థంలో చెప్పవచ్చు. దానిని ఆచరణలో పెట్టువాడు 'త్వష్ట' అనగా కట్టెడివాడు లేక చెక్కువాడు. అతడు విశ్వకర్మ. కాబట్టి మనువు, విశ్వకర్మ కూడ పరమాత్మయే. పరమాత్మ సంకల్పమాత్రంతో జగత్తు సృష్టించబడినది అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. జగత్ జ్ఞానమయం అన్నారు. అనగా జగత్తు అంతా జ్ఞానమే. పరమాత్మ ఆలోచన చేశాడు. కాబట్టి అతడు మనస్సు. మనస్సే సంకల్పం. సంకల్పరూపమే జ్ఞానము. దానినుండే ఈ జగత్తు అంతా సృష్టించబడింది. జగత్తు ఒక పదార్థం. అది మనస్సు (Mind) నుండి వచ్చింది. ఇది ఉపనిషత్తు వాక్యం. సైన్సు ఇందుకు వ్యతిరేకంగా చెప్తోంది. మనస్సు (Mind) ఒక పదార్థం. దాని నుండి ఆలోచనలు వస్తాయి అంటుంది. అనగా మనస్సు నుండి పదార్థం వచ్చిందని ఉపనిషత్తులు చెపితే, పదార్థం నుండి మనసు (ఆలోచన) వచ్చిందని సైన్సు చెప్తుంది. సంకల్పంతో (జ్ఞానం) జగత్తు ఎలా ఏర్పడింది అంటే జగత్తు సృష్టి ఒక స్వప్నం లాంటిది. స్వప్నంలో మనము అనేక భవంతులు, కట్టడాలు చూస్తుంటాము. అవి ఎలా ఏర్పడినాయి. మన మనస్సే వాటిని సంకల్పించింది, రూపొందించింది. ఎందుకనగా స్వప్నం మానసిక సృష్టి కదా! అదే విధంగా పరమాత్మ మనస్సు సంకల్పించి రూపొందించింది ఈ జగత్తు. ఒక పదార్థం తయారుకావటానికి రెండు కారణాలు ఉంటాయి. 1) ఆధారం అగు కారణం (మూలాధారం) దీనినే ఉపాదానం అన్నారు. 2) నిమిత్తం అనగా లక్ష్యకారణము. ఒక కుండ తయారుకావటానికి మట్టి ఉపాదానం. చేయాలను ఉద్దేశం (లక్ష్యం) కుమ్మరిది. అందుచే కుమ్మరి నిమిత్త కారణము. జగత్తు సృష్టియందు మనవు అనగా ఆలోచన ఉపాదానం. త్వష్ట నిమిత్త కారణం (కుమ్మరి). ఈ రెండూ పరమాత్మయే. పరమాత్మ అంశరూపమే మనిషి అన్నారు. కాబట్టి మనిషిలో

కూడ ఈ రెండూ ఉండాలి మనిషికీ మనస్సు ఉంది ఆ మనస్సే ఉపాదానం లోపల ఉన్న ప్రాణం త్వష్ట ప్రాణం వలననే మనకు క్రియాశక్తి వస్తుంది మనస్సు సంకల్పిస్తుంది, అనుభవిస్తుంది అయితే పరమాత్మకు మనకు ఉన్న భేదం ఒకటే ఆయన సంకల్పం సృష్టి రూపం పొందింది ఆయన శక్తి అనంతం మన శక్తి అల్పం సాధనతో అనగా ఆత్మజ్ఞానంతో ఆ శక్తి వస్తుంది కాని సృష్టి చేయు శక్తి రాదు

సత్యం విశ్వజనీనం మతం అంటే అభిప్రాయం అభిప్రాయాలు మనం కల్పించుకున్నవి అభిప్రాయాలు ముదిరి వెర్రిగా మారితే బుద్ధి మందగిస్తుంది మతి చెడుతుంది అందుకే అన్నారు మతం మతిని పోగొడుతుందని మతాలు వేరు వేరు కాని సత్ లేక సత్యం ఒక్కటే ఆ సత్‌నే అనేక రూపాలతో అనేక పేర్లతో భావిస్తుంటాము ప్రవక్తలు భగవంతుని అంశరూపములు వారు ఎవరైనా ఎక్కడైనా చెప్పే భావం ఒక్కటే మాటలు వేరు వారు జ్ఞానులు వారి జ్ఞానదృష్టికి గోచరించినది ఒక్కటే ఋగ్వేదం లేక పురాణంలో చెప్పిన మనువు కథ గాని, ఖురాన్‌లో చెప్పిన హజరత్‌నూ (Hazrat Nuh) కథగాని, బైబిల్‌లో చెప్పిన నోవా (Noah) కథగాని ఒక్కటే ఈ కథలు ఆ అవాంతర ప్రళయమును గురించి చెప్పినవే మతాలు ఏవైనా మూలం ఒక్కటే

బైబిల్‌లో (Genesis VI to X) చెప్పబడిన కథ ప్రకారం భూమి మీద పెచ్చు పెరిగిన అధర్మము అరాచకము చూచి భగవంతుడు బాధపడి తాను వారిని సృష్టించినందుకు విచారించాడు సృష్టిని అంతము చేయుటకు జలప్రళయము సృష్టించతలిచాడు భగవంతుడు ధర్మపరుడైన నోవా (Noah) ద్వారా నూతన సృష్టి ప్రారంభించ తలచి అతనికి జలప్రళయమును గూర్చి చెప్పి నోవాను ఒక ఓడ (Ark)ను తయారుచేయించి అందు అతని కుటుంబముతోను, జంతువులు, పక్షులందు రకమునకు రెండు చొప్పున ఆడ, మగ తెచ్చి ఆ నావ

యందు ఉండమని చెప్పాడు. ఏడు రోజుల తరువాత జలప్రళయం వచ్చింది. ప్రళయం నలుబది రోజులు సాగింది. జీవులన్నీ నశించినాయి. కాని ఓడలోని వారు క్షేమంగానే ఉన్నారు. అపుడు భగవంతుడు భూమిపై గాలి వీచునట్లు చేశాడు. ఓడ ఆరారత్ అను పర్వతముపై ఆగింది. జలప్రళయం అదృశ్యమైంది. అపుడు భగవంతుడు నోవాను అతని కుటుంబము ద్వారాను, అతడు నావలో తెచ్చిన జంతువులు, పక్షుల ద్వారాను నూతన సృష్టి వృద్ధి చెందించమని చెప్పాడు. ఇదీ కథ. ఇది వైవస్వత మనువు జలప్రళయము కథను పోలియున్నది గదా! బైబిలు నందు మత్స్యమును గూర్చి చెప్పినట్లు కనబడదు.

ఖురాన్‌లో కూడ ఇదే విధమైన సంఘటన చెప్పబడింది. (11:37→44) అధర్మం, అరాచకం పెరుగుటచే భగవంతుడు సృష్టిని జలప్రళయం ద్వారా అంతం చేయదలిచాడు. ధర్మపరుడైన నూ (Nuh) ద్వారా నూతన సృష్టి రూపొందించాలని తలచి అతనిని ఒక ఓడను తయారుచేయించమని, అందు అతని కుటుంబముతో పాటు, జంతువులు, పక్షులలో జాతికి రెండు (ఆడ, మగ) చొప్పున తెచ్చి ఉండమని చెప్పాడు. జలప్రళయం వచ్చింది. ఓడలోనివారు తప్ప మిగిలిన జీవులన్నీ నశించినాయి. ప్రళయం తగ్గింది. ఓడ జూడి (Judi) అను పర్వత శిఖరం మీదకు చేరింది. భగవంతుని ఆజ్ఞానుసారం నూ (Nuh) తో నూతనసృష్టి రూపొందటం మొదలైంది.

క్రైస్తవులు, ముస్లిములు, యూదులు (Jews) నోవా (Noah or Hazrat Nuh) ను రెండవ ఆదమ్ (Adam) అంటారు ఎందుకనగా ఆదమ్ సృష్టిలో మొదటి మానవుడు అన్నారు గదా! ముస్లిములు మానవులను ఆదామీ (Adami) అంటారు. ఇది ఆదమ్‌ను పోలిన పదము గదా! హిందువులు మానవుడు లేక మానుష్ (మనుష్య) అంటారు. ఇది మనవు శబ్దము నుండి రూపొందిందే కదా! మనువు, నోవా, నూ అనువారు నూతన సృష్టికి పునాది వేశారు. పేర్లు మాత్రమే వేరు. వారు ఒకరే. ఆ నావలు తుదకు చేరింది పర్వత

శిఖరముల మీదికే పర్వతముల పేర్లు, భౌగోళిక స్థలములు మాత్రమే వేరు కథ ఒక్కటే, పరమాత్మ ఒకరే సత్యమునకు వివిధ ప్రాంతములలో వివిధ భాషలలో వివిధములైన పేర్లు చెప్పబడినవి అంతే ఋగ్వేదము (X-80-6) లో మనువుకు నహుష అను పేరు కూడ చెప్పారు ఇది నోవా (Noah) నూ (Nuh) పేర్లను పోలియున్నది గదా! బైబిల్ (Genesis XI) లో నోవా సంతతి వారు, ఋగ్వేదం (III-60-3, X-80-6) లో మనువు సంతతివారు పనివారు, చిత్రకారులు, శిల్పులు, కళాభిజ్ఞులు (Artisans that means mechanics and handicraftsmen) అని చెప్పబడింది

క్రైస్తవంలో దేవుడు ఒకడే మామూలు మనిషి ఆకారంలో కాకపోయినా, భగవంతునికి ఆకారం ఉంది భగవంతునికి మనస్సు, ఆలోచన, వివేకం ఉన్నాయి అతడు పరిశుద్ధాత్ముడు క్రైస్తవంలో భక్తికే ప్రాధాన్యం ఎక్కువ భగవంతుడు ఒకడే అయినా అంతర్గతంగా మూడు రూపాలు చెప్పారు 1 తండ్రి, 2 కొడుకు 3 పవిత్రాత్మ వాస్తవానికి ఈ మూడు ఒకరే ఇది వేదమతంలోని త్రిమూర్తుల కల్పన వలె ఉంది జీసస్ భగవంతుని కొడుకు భగవంతునిచే అభిషిక్తుడై ప్రవక్తగా అవతరించాడు అతడినే ప్రత్యక్షదైవంగా భావిస్తారు భగవంతుడు ఇచ్చిన శక్తిని మానవుడు దుర్వినియోగం చేస్తున్నాడు పాపములు కూడ గట్టుకుంటున్నాడు అంటారు మొదటి మానవుడైన ఆదమ్ చేసిన పాపమే మానవుని బాధలకు మూలమైంది అంటారు "క్రైస్తవంలో పాపము అంటే భగవంతుని యెడల అవిధేయత తప్ప మరేమీ కాదు " ఆత్మ శాశ్వతం అని విశ్వసిస్తారు అందుచే పునర్జన్మ ఉన్నదని నమ్ముతారు మానవుడు చేసిన పాపపుణ్యములను బట్టి చివరి తీర్పు రోజున (Judgement Day) స్వర్గమో నరకమో లభిస్తుంది రెండు శాశ్వతములే బాధలకు నరకం, సుఖమునకు స్వర్గం నిత్యము భగవంతుని స్మరించుటయే స్వర్గమునకు మార్గం ఇంతకు మించి కర్మసిద్ధాంతం లేదు

ఒక ప్రవక్త ద్వారా ఏర్పడినది ఇస్లాం మతం. ఇది ప్రపంచంలో ప్రధాన మతాలన్నిటికంటే అధునికమైనది. క్రీ॥శ॥ 7వ శతాబ్ద ఆరంభంలో ఏర్పడింది. ఇస్లాం జీవన విధానంలో చాల కఠినమైన నియమ నిబంధనలు ఉన్నాయి. 'ఖురాన్' ఇస్లాం మత గ్రంథం. దేవదూతగా బ్రియల్ ద్వారా ప్రవక్త మహమ్మదుకు అందిన సందేశం 'ఖురాన్'లో ఉంది. ఈ మతంలో దేవుడు 'అల్లా'. దేవుడొక్కడే అల్లా. బహుదేవతారాధన నిషేధించబడింది. 'ఖురాన్' పవిత్ర గ్రంథం. 'ఖురాన్' అంటే వల్లించటం అని అర్థం. ఇస్లాం అంటే ఆత్మసమర్పణ అంటారు. దేవదూతలు మానవుల కర్మల అనగా పాపపుణ్యముల చిఠా తయారుచేస్తారని అంటారు. ఇస్లాంలో కూడ అంతిమతీర్పు రోజు విశ్వసించబడుతుంది (Judgement Day). ఆ రోజున దేవదూతలు సమాధి చేయబడిన జీవులను దేవుని వద్దకు తీసుకువస్తారు. పుణ్యాపాపముల ననుసరించి స్వర్గనరకాలు ఉంటాయి. రెండు శాశ్వతాలే. కర్మకాండలు, విగ్రహారాధన నిరసించబడినవి. అదృష్టం, మోక్షం లేవు. తీర్థయాత్రలు విశ్వసించబడినాయి. భగవంతుని తీర్పు మాత్రమే జీవునికి తుదిఘట్టం. అంతకు మించి కర్మ సిద్ధాంతం లేదు.

సందర్భవశమున క్రైస్తవం, ఇస్లాంను గురించి కొద్దిగా చెప్పటం జరిగింది కాని అవి ఇక్కడ చర్చనీయాంశములు కావు. వేదవాఙ్మయములో దేవతలు, అసురులు అని రెండు భిన్న వర్గములుగా చెప్పారు. అసురులు దేవతలకు శత్రువులుగా చెప్పారు. రామాయణ కాలంలో ఈ భేదం కొంత తగ్గినట్లు కనబడును. మహాభారత కాలంలో ఈ భేదం చాలవరకు చెదిరి మసకబారింది. తామసికగుణం కలవారు రాక్షసులు, రజోగుణం కలవారు మానవులు, సత్వగుణం కలవారు దేవతలు అని గుణములను బట్టి చెప్పారు. కర్మలననుసరించి ఈ గతులు వచ్చునని మనుస్మృతి (XII-39, 40) చెప్పింది. బృహదారణ్యక ఉపనిషత్తు భాష్యములో (5-2-3) శంకరుడు దేవతలకు, మనుష్యులకు, అసురులకు ప్రత్యేకమైన భేదములు లేవు అన్నారు. దేవతలు,

అసురులు మనుష్యులలోనే ఉన్నారు అన్నారు నదేవాః అసురా అన్యకేచన విద్యంతే మనుష్యేభ్యః'' ఉత్తమ లక్షణములు కలవారు దేవతలు, లోభము కలవారు మానవులు, హింసించువారు క్రూరులు రాక్షసులు అన్నారు 'ఉత్తమైర్గుణై సంపన్నాః తెదేవాః, లోభప్రధానా మనుష్యాః, హింసాపరాః క్రూరాః అసురాః'' దీనికి అనుగుణంగానే వేదాలలోని 33 దేవతలు పురాణాలలో అసంఖ్యాకులైనారు 33 నుండి 3300 అటుపై 33000కు వృద్ధిచెందారు వీరిని దేవతాగణములు అన్నారు

దేవతలు కూడ కర్మఫలమును అనుభవింతురు అని దేవీభాగవత పురాణం చెప్తుంది (4-2-8) గరుడ పురాణంలో (1-113-15) కర్మ సృష్టికర్త బ్రహ్మను విశ్వము అనబడు అండము లేక పాత్రయందు ఉండునట్లు, విష్ణువును దశావతారములు దరించి బాధను అనుభవించునట్లు, శివుని కపాలచిప్పతో భిక్షాటనమొనర్చునట్లు చేసెను అని చెప్పబడింది ఇది సంకేతార్థమే యగును (symbolic meaning) ఎందుకనగా మహాభారతం అరణ్యపర్వములో ప్రపంచసృష్టి అవతార విశేషములను గురించి చెప్పుచు ప్రజాపతికి అనగా, విరాట్ పురుషునకు (చైతన్యబ్రహ్మము) మూడు అవస్థలు ఉన్నవి అని చెప్పారు ప్రజాపతి కార్యబ్రహ్మయై సృష్టి చేయును విష్ణువుగా లోకరక్షణ చేయును రుద్రునిగా దానిని లయము చేయును అనగా ముగ్గురు ఒకరే స్థితులు భిన్నము ఆ స్థితులు త్రిగుణములకు ప్రతీకలు (symbols)

మహాభారతంలో (3-200 58-59) (యమలోక వృత్తాంతము) వైతరణీనదిని గురించి చెపుతూ పాపకర్ములకు అది చీమునెత్తురుతో ప్రవహించునట్లు కనబడును, పుణ్యాత్ములకు అది స్వచ్ఛమైన నీటితో ఉన్నట్లు కనబడును అన్నారు మొదటిది నరకమునకు చిహ్నము, రెండవది స్వర్గమునకు ప్రతీక నది ఒకటే భిన్నముగా కనబడును అన్నారు కాబట్టి స్వర్గనరకములకు ప్రత్యేకమైన ప్రతిపత్తి (గుర్తింపు) లేదు అని తెలియుచున్నది వ్యక్తి యొక్క

ప్రవృత్తిని బట్టి ఏర్పడు రెండు భిన్నమైన స్థితులే స్వర్గనరకములు అనదగును. జైనబౌద్ధములలో కూడ స్వర్గనరకములకు ప్రత్యేకమైన భిన్నత్వము కనబడదు. బౌద్ధములో దేవతలకు కూడ జననమరణములు ఉన్నవి అన్నారు. అంతే కాక దేవతలు మానవులుగా జన్మించటం కూడ సంభవం అన్నారు. దేవతలు నిర్వాణము పొందుటకు మానవులుగా జన్మించవలసినదే యని జైనము చెప్పను.

ఋగ్వేదములో స్వర్గమునకు ప్రాధాన్యము ఈయబడినది. కాని నరక ప్రస్తావన కనబడదు. చీకటి ప్రదేశం ఒకటి యుండునని, అది ఒక అగాధము (bottomless pit) అని మాత్రం చెప్పబడింది. నరకాధిపతిగా చెప్పబడిన యముని పాత్ర (character) యందు కూడ కాలక్రమమున పరిణామములు ఏర్పడినవి. ఋగ్వేదములోని యముని పాత్రను పురాణ, ఇతిహాసములలోని యముని పాత్రతో పోల్చిచూచినచో ఇది బోధపడును. ఋగ్వేదంలో (1-35-6) దివ్యలోకమును మూడు భాగములుగా చెప్పారు. రెండు భాగములు సూర్యునికి చెందినవి. మూడవది యమునికి చెందినది. దీని భావం యముడు కూడ స్వర్గాధిపతులలో ఒకడు అని కావచ్చు. కానీ యముని దేవతలలో ఒకనిగా చెప్పలేదు. ఇతిహాసముల కాలంనాటికి యమలోకం స్వర్గంలో భాగంగా అదృశ్యమైంది. రామాయణంలో అధర్మం చేసిన వానిని మృత్యువు యమలోకమునకు పంపును అని దశరథుడు కైకేయితో అంటాడు. పితృలోకముగా భావించబడిన యమలోకము ఇపుడు నరకలోకముగా మారి జీవులను వారి కర్మలననుసరించి శిక్షించు లోకమైనది. పితృలోకము పైన చెప్పబడిన మూడు లోకములలో ఉన్నతమైన భాగము అయింది. అందుకు భిన్నంగా యమలోకము జీవుల కర్మలను బట్టి స్వర్గము, నరకము రెండును అయింది.

మహాభారతకాలం నాటికి యముడు యమధర్మరాజు అయినాడు.

'కర్మసాక్షి'గా (మహాభారతం (1-68-30) జీవుల కర్మలను రహస్యముగా వీక్షించును అన్నారు ఎవని యెడల పరమాత్మ సంతుష్టుడగునో అట్టివాని పాపములను యముడు స్వయముగా నశింపజేయును, మరియు ఎవని యందు పరమాత్మ సంతుష్టుడు కాడో అట్టి పాపిని యముడు స్వయముగా దండించును అని ఆదిపర్వంలో చెప్పబడింది ఇదే విషయము శాంతిపర్వంలో కూడ చెప్పబడింది ఇంకను యముడు జీవులను (మానవులను) నియమ బంధన యందుంచును అన్నారు ధర్మపరులను రక్షించును అని రక్షకుడుగా గూడ అనుశాసన పర్వంలో (13-105-16) పరిణామం చెందాడు యమునికి ధర్మరాజు, సమవర్తి అను పేర్లు కూడా చెప్పారు యమునికి సహాయకుడుగా చిత్రగుప్తుడు ఉద్భవించాడు వేదకాలంలో చిత్రగుప్తుని ప్రసక్తి లేదు ఇది పూర్తిగా ఇతిహాసకాలంలో కల్పించబడిన పాత్ర (character) విష్ణుపురాణంలో కూడ యమునికి పాప, పుణ్యకర్మల ఫలములను క్రమబద్ధము చేయుట బాధ్యతగా చెప్పబడింది (II-7-14)

'లోకము' అను శబ్దము 'స్థితి' (state)కి పర్యాయముగా ఉపయోగించ బడినట్లు కనబడును వివిధ కర్మఫలముల అనుభవమునకు అనుగుణంగా 'లోకములు' అని బహువచనములో చెప్పబడినట్లు తోచును కర్మలు అనగా కర్మకాండలు గాని లౌకిక కర్మలుగాని చేయుట ద్వారా భవిష్య అనుభవమునకు ఒక స్థితి కల్పించబడును ఈ స్థితి (situation)యే లోకము దుష్కర్మల వలన ఆ లోకమును కోల్పవుదురు అనగా దుష్ట ప్రవృత్తి వలన ఆ స్థితిని కోల్పోవుదురు అని భావార్థము కావున లోకములు అనునవి మానవుడు తన నడవడి (behaviour) ద్వారా కల్పించుకొనినవే అని ఒక ఆధునిక నిర్వచనం ఉన్నది 'శతపథ బ్రాహ్మణం' (VI-2-2-27)లో "కృతమ్ లోకమ్ పురుషోభిజాయతే" అని చెప్పబడింది అనగా మానవుడు తను కల్పించుకొనిన స్థితిలోనికే పునర్జన్మ పొందును అని భావము స్వర్గలోకం అనునది పరలోకం అని ఆనందము, సుఖము కలిగించునది అను అర్థంలో చెప్పారు యజ్ఞకర్మల ఫలముగా

పొందు ప్రతిఫలము లేక బహుమానము అని, అది సుఖసంతోషములతో కూడిన స్థితి అనియు కూడ అనంతరకాల వేదవాఙ్మయములో కనబడును. అనంతరకాల బ్రాహ్మణములలో స్వర్గలోకమనగా ఈ లోకములోనే సుఖ సంతోషములతో కూడిన స్థితి అను భావంలోనే చెప్పబడింది (అయితరేయ బ్రాహ్మణము 7.10.3) "అస్మిమ్‌ల్లోకాయామ్ స్వర్గః" ధర్మపత్నితో కూడి నిత్యాగ్ని హోత్రము అనుష్ఠించినచో పుత్రులు, మనుమలు, మునిమనుమలతో స్వర్గసౌఖ్యము ఇచటనే అనుభవింతురు అని చెప్పబడింది. (Ref : Loka : World and Heaven in the Veda. 1966 Edition By J. Gonda. Pages 72 to 96).

పూర్వమీమాంస భాష్యకారులు శబర స్వామి (5 AD), కుమారిలుడు (8 AD) స్వర్గము, ఇతర లోకములు పూర్తిగా ఒక స్తుతిమార్గంలో చెప్పబడిన వర్ణనలు మాత్రమే యని స్పష్టం చేశారు. ఈ లోకములు కవితా కల్పనలతో కూడిన ఊహాచిత్రములుగా పౌరాణికము చేయుట జరిగినదని ఆధునిక తత్వశాస్త్రజ్ఞుల అభిప్రాయం.

**3. స్మృతులు :**

ధర్మశాస్త్రములు, స్మృతులు చాల ఉన్నాయి. హిందూ న్యాయ చట్టములకు ఇవి కొంతవరకు ఆధారములైనవి. ధర్మశాస్త్రముల, స్మృతులపై కర్మ సిద్ధాంత ప్రభావం చాల ఉన్నది. అందుచే న్యాయచట్టములపై కూడ పరోక్షముగ కర్మసిద్ధాంత ప్రభావము కనబడును. గౌతమ, బోధాయన, వసిష్ఠ, ఆపస్తంభధర్మ సూత్రములు ఈ కోవకు చెందినవే. యజ్ఞకర్మకు అనర్హులు యజ్ఞబలి ఇచ్చుట దోషముగా ఈ ధర్మసూత్రములు అనగా స్మృతులు చెప్పినవి. పూర్వకాలంలో ఋషులు ధర్మనియమములను అతిక్రమించినను వారి శక్తి వలన వారు చేసినవి పాపములుగా పరిగణించబడలేదు అని స్మృతులు చెప్పును. అనంతరకాలంలో ఎవరైనను అట్లు చేసినచో వారు తప్పక

పతనము చెందుదురు అని చెప్పినవి పితృదేవతలను పూజించుటలోను, యజ్ఞకర్మలందు చేయు బలి కార్యలందును హింస జరిగినను అది హింస కాదు అని స్మృతివాక్యం అశ్వమేధము బ్రహ్మహత్యాపాతకమును కూడ తొలగించును అని చెప్పబడినది

క్రీ॥శ॥ 1956కు పూర్వము హిందూ న్యాయచట్టములు కుల పక్షపాతముతో కూడి యున్నవి బ్రాహ్మణుని హత్య చేయుట (బ్రహ్మహత్య) మహాపాపమనియు, ఇతర కులముల వారి హత్య తక్కువ పాపమనియు చెప్పబడినది బ్రాహ్మణుని అతని నేరం ఎట్టిదైనను శిక్ష నుండి వినాయించారు (exempted) శిక్షలు కూడ కులమును బట్టి నిర్ణయించబడినవి నేరము ఒకటే అయినను అగ్రకులముల వారికి తక్కువ శిక్ష నిమ్న కులముల వారికి ఎక్కువ శిక్షగా సంప్రదాయము ఏర్పడినది కులవ్యవస్థ ఆధారముగా శిక్ష నిర్ణయించుట కర్మ సిద్ధాంతమునకు విరుద్ధముగా కనబడుటచే పైన చెప్పిన ధర్మశాస్త్రములు ఆర్యులు, అనార్యులు అని విడదీసి, ధర్మశాస్త్రములు ఆర్యులకు మాత్రమే వర్తించును, అని అనార్యులను శూద్రులు లేక అంటరానివారిగా పరిగణించి వారికి ధర్మశాస్త్రములు వర్తించవు అని నిర్ణయించినవి అంటరాని వారికి సత్కర్మల ఫలము ఉండదని, వారు ప్రాయశ్చిత్తమునకు అర్హులు కారని చెప్పినవి మనుస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి ఈ విషయములో అన్ని కులముల వారిని సమదృష్టితో చూచినను, హిందూ ధర్మసూత్రములు (స్మృతులు), వాటి ద్వారా రూపొందిన న్యాయచట్టములు ఎక్కువ భాగము కులవివక్షతను పాటించినవి

కాని కాలక్రమమున పరిస్థితులు మారినవి న్యాయచట్టములు ధర్మశాస్త్ర, స్మృతుల బంధముల నుండి విడివడి కులవివక్షతను విడిచినవి ఆ విధముగా పరోక్షముగా కర్మ సిద్ధాంతము న్యాయచట్టములపై కూడ ప్రభావము చూపినది కర్మఫలమును నేరములకు భగవంతుడు ఏర్పరచిన శిక్షగా

భావించబడినది అనగా చట్టప్రకారము నేరమునకు నిర్ణయించబడిన శిక్ష పరోక్షముగా దైవముచే ఇవ్వబడిన కర్మఫలముగా భావించబడినది

4 ప్రాయశ్చిత్తము

దుష్కర్మ ఫలము నుండి విముక్తి పొందుటకు మార్గము ప్రాయశ్చిత్తము అన్నారు ప్రాయశ్చిత్తము ద్వారా కర్మఫలమును మార్చవచ్చునని కూడ విశ్వసించబడింది ప్రాయశ్చిత్తము అనునది వేదసంహితలలో కనబడును కాని కాలక్రమమున ఆ శబ్దమునకు అర్థం కొన్ని మార్పులు చెందినట్లు కనబడును ప్రారంభంలో ఆకస్మికముగా జరుగు దోష నివారణకు చేయు పనిని ప్రాయశ్చిత్తము అన్నారు హారతి ఇచ్చునపుడు జ్వాల ఆరిపోవుట, ఇటువంటి వాటిలో ఒకటి కాని ప్రధానంగా కర్మకాండలలో జరుగు ఆకస్మిక దోషముల నివారణకే ప్రాయశ్చిత్తం ఉద్దేశించబడినది ప్రాయశ్చిత్తములు ప్రధానంగా రెండు రకములు 1 కర్మకాండలందు అశ్రద్ధ వలన జరుగు లోపములను సరిదిద్దుట 2 కర్మకాండలు శాస్త్రము నిర్దేశించినట్లు నిర్వర్తింపబడనపుడు కలుగు దోషములను నివారించుట

దోషపరిహారము, దేవతల ఆగ్రహమును శాంతింపజేయుట ప్రాయశ్చిత్త కర్మల ముఖ్యోద్దేశము జంతుబలులు, నదీస్నానములు, వేదమంత్ర జపము, ఉచ్చాటన ప్రాయశ్చిత్త ప్రక్రియలు కాని ఈ ప్రాయశ్చిత్తము కర్మసిద్ధాంతమును అనుసరించినవి కావు అనగా దుష్కర్మ నివారణకు కాదు దుష్కర్మకు ప్రాయశ్చిత్తము లేదు 'చేసిన పాపం చెపితే పోతుంది' అను సామెత అర్థం పశ్చాత్తాపం ద్వారా కర్మఫలమును తగ్గించవచ్చునను విశ్వాసము ప్రాయశ్చిత్తం పశ్చాత్తాపం కాదు

'ప్రాయశ్చిత్తము' అను శబ్దమునకు అర్థము వ్యావహారికముగా చెప్పుట సులభసాధ్యము కాదు ప్రాయశ్చిత్తమునకు సామాన్య అర్థము పాపపరిహారార్థము చేయు కర్మ కాని దాని వ్యుత్పత్తి అర్థము అందుకు

భిన్నముగా నున్నది అనేక విధములుగా వ్యుత్పత్త్యర్థము చెప్పారు తపోనిష్ఠ ద్వారా మనస్సు శుద్ధము చేయుట, పాపమును శమింపజేయుట, కోల్పోయిన దానిని తిరిగి పొందుటకు చేయు ప్రయత్నము, ఇవి కొన్ని అర్థములు అనంతర కాలమున మహాపాతక దోషపరిహారం కొరకు ప్రాయశ్చిత్తం చెప్పారు స్మృతులందు, ధర్మసూత్రములందు ప్రాయశ్చిత్త ఉద్దేశమును ఇంకా విస్తరింపజేశారు హత్యాదోషం, మద్యపానదోషం, అసత్యదోషం, దొంగతనం, సంతానం లేక బంధువుల జననకాలదోషం వీటి నివారణకు తపస్సు ప్రాయశ్చిత్తంగా చెప్పారు

ప్రాయశ్చిత్తమునకు చాలామార్గాలు చెప్పారు ఉపవాసములు, ఆహారనియమము, పంచగవ్యము (అనగా ఆవుపేడ, ఆవు మూత్రము, పాలు, పెరుగు, నెయ్యి ఈ అయిదును చేర్చినది) ఉపయోగించుట ఒక రాత్రిగాని పగలుగాని ఉపవాసముతో నీటిలో మునిగియుండుట, మొదలగునవి ప్రాయశ్చిత్తరూపములు కాని ఏ ఒక్క స్మృతి గాని ధర్మశాస్త్రము గాని మరొక స్మృతి లేక ధర్మశాస్త్రము చెప్పినది అంగీకరించలేదు కొన్ని ప్రాయశ్చిత్తమును గూర్చి సందేహించినవి గూడ కర్మఫలము అనుభవింపక తప్పదు కాబట్టి ప్రాయశ్చిత్తము నిష్ప్రయోజనమని కొందరు ధర్మసూత్రకర్తలు భావించారు కాని తపస్సు ప్రాధాన్యము దాదాపు అందురు అంగీకరించారు

మనుస్మృతి జరిగిన కర్మ ఉద్దేశము ననుసరించి పాపపరిహారం యొక్క ఉపయోగం ఉండునన్నది (IV-173) పాపకర్మ ఉద్దేశపూర్వకంగా జరిగినదా? కాదా? అనేది ప్రధానం అన్నది మనుస్మృతి శిక్షలను (IX-235-242) కులమును బట్టి నిర్ణయించింది యాజ్ఞవల్క్యస్మృతి (III 226) కూడ ఉద్దేశ పూర్వకముగ చేసిన పాపకర్మలకు ప్రాయశ్చిత్తం లేదు అన్నది సామాన్యముగ 'స్మృతు'లన్నియు దాదాపుగ కర్మఫలము అనివార్యము అనియే చెప్పినవి వేదాంత మార్గముననే పురుష ప్రయత్నము ద్వారా సంచింతకర్మను

నివారించుటకు అవకాశమున్నది గాని ప్రారబ్ధకర్మఫలం తప్పదు అనియే స్మృతులు చెప్పుచున్నవి మొత్తం మీద పాపకర్మ నివారణకు ప్రాయశ్చిత్తము యొక్క సామర్థ్యమును గూర్చి స్మృతులలో స్థిరమైన అభిప్రాయం కనబడదు తుదకు మనుస్మృతియే ఎక్కువ ప్రాధాన్యము సంతరించుకున్నది హిందూ న్యాయచట్టములు మనుస్మృతినే ఎక్కువ ఆధికారికముగా గ్రహించినవి నిశితంగా ఆలోచించినచో ప్రాయశ్చిత్తమును అంగీకరించినచో కర్మసిద్ధాంతము నిరర్థకమగును మహాభారతం కూడ పురుష ప్రయత్నమునే చెప్పింది పురుష ప్రయత్నం ప్రాయశ్చిత్తం కాదు చిత్తశుద్ధితో పురుషార్థములను నిర్వర్తించుటయే పురుష ప్రయత్నము ఈ ప్రాయశ్చిత్త ప్రక్రియలు హేతుబద్ధమైన సమాధానములుగా కనబడవు ఎక్కడినుండో దిగుమతి అయి అతుకు పెట్టబడినవిగా కనబడును అనంతరకాలమున ఇవి స్మృతులలో ఇమిడిపోయి యుండవచ్చును

బౌద్ధములో ప్రాయశ్చిత్తమును అంగీకరించినట్లు కనబడదు ప్రాయశ్చిత్త సిద్ధాంతము జైనములో ఒక రూపం పొందినట్లు కనబడును కర్మ ద్రవ్యరూపము అని జైనసిద్ధాంతము కర్మపదార్థము సూక్ష్మ అణురూపమున నుండి జీవులను ఆకర్షించును సాహచర్యముచే జీవి, కర్మపదార్థ అణువులు కలియును ఒకే ప్రదేశమందు ఏర్పడు ఈ సాహచర్యమే కర్మపదార్థము జీవునందు ప్రవేశించుటకు కారణము కాబట్టి ఇక్కడ కర్మకు ఉద్దేశం ప్రధానం కాదు అయినను దురుద్దేశము ఎక్కువ కర్మపదార్థ అణువులను చేర్చును ఈ కర్మపదార్థమే కర్మబంధమగును కర్మబంధవిముక్తికి ప్రాయశ్చిత్తము చెప్పారు అది 'సంవరము', 'నిర్జరము' అని రెండు విధములు సంవరము అనగా ధర్మనియతి తీర్థంకరుల బోధనల ననుసరించి మనోవికారములైన కామక్రోధాది గుణములను నిరోధించుట ద్వారా సంవరమును సాధించవచ్చునన్నారు 'నిర్జరమును' పూర్వపాపములను కఠిననిష్ఠ ద్వారా నాశనము చేయుట అని నిర్వచించారు ప్రాయశ్చిత్త కర్మ క్రియమాణ కర్మ అనగా వర్తమానకర్మచే

సంచితకర్మను నిరోధించుట అగును కఠిన నిష్ఠతో శరీరమును శిథిలము చేయుటయే ఈ 'నిర్జర' అను ప్రాయశ్చిత్తకర్మ అగుచున్నది ఇది కర్మఫలమును శరీరము శిథిలము చేసుకొనుట ద్వారా అనుభవించుటయే యగుచున్నదిగదా! అనగా కర్మానుభవమే ప్రాయశ్చిత్తము కాలక్రమమున తప్పు ఒప్పుకొనుట, పశ్చాత్తాపము చెందుట, అటుపై నిరాహారదీక్షతో కూడిన ఉగ్రతపస్సు ప్రాయశ్చిత్తములో చోటుచేసుకున్నవి మధ్వాచార్యులు తన సర్వదర్శన సంగ్రహములో (III-23) 'నిర్జరను' రెండు విధములుగా చెప్పారు (1) యథాకాల నిర్జర (2) ఔపక్రమిక నిర్జర కర్మ పరిపక్వము చెంది పూర్తియగుట ద్వారా ఏర్పడు నిర్జర యథాకాల నిర్జర అన్నారు రెండవది సంకల్పబలంతో ఉగ్రతపస్సు ద్వారా కర్మను పరిపక్వము చెందించుట జైనములో ఉగ్రతపశ్చర్య ద్వారా కర్మనాశనము జైనకర్మ సిద్ధాంతమునకు అణుగుణంగానే ఉన్నదని చెప్పవచ్చును ఎందుకనగా కర్మను ఒక పదార్థముగా నిర్వచించారు కాబట్టి శృతుల కాలము నుండి స్మృతుల కాలమునకు వచ్చునప్పటికి ప్రాయశ్చిత్త సిద్ధాంతము జైనకర్మసిద్ధాంత ప్రభావమునకు లోనై యుండవచ్చుననిపించును కర్మ సిద్ధాంత పరిధిలోనే స్మృతులు, ధర్మసూత్రములందు ప్రాయశ్చిత్త ప్రక్రియ కూడ ఇమడ్చబడినదిగా కనబడును మొత్తము మీద ప్రాయశ్చిత్తమును గూర్చి ఒక నిశ్చిత సిద్ధాంతరూపం ఉన్నట్లు కనబడదు ఒకరు చెప్పినది మరొకరు వ్యతిరేకించటమే జరిగింది గాని ప్రాయశ్చిత్తము ద్వారా నిజంగా దుష్కర్మ నాశనము సాధ్యమని పరిపూర్ణ విశ్వాసంతో ఏ ఒక్కరు చెప్పినట్లు కనబడదు వసిష్ఠుడు, విశ్వామిత్రుడులాంటి యోగనిష్ఠాగరిష్ఠులు, శక్తిపరులు ఇపుడు లేరు ఈనాడు ప్రాయశ్చిత్తకర్మలు కూడ చిత్తశుద్ధితో కాక వ్యాపారాత్మకంగాను, పైపై ఆడంబరములతోను జరుగుచున్నవి చేయించువారికి, చేయువారికి చిత్తశుద్ధి శూన్యము ప్రాయశ్చిత్తము చేశాము అను సంతృప్తి తప్ప ప్రాయశ్చిత్తము వలన ఉద్దేశించిన ఫలము దక్కునని చెప్పుట సాహసమే యగును 'నేతి బీరకాయ' వంటివే ఈనాటి ప్రాయశ్చిత్తకర్మలు

సంచిత దుష్కర్మ ఫలములు వర్తమాన సత్కర్మల ద్వారా నిర్వీర్యము చేయుట సాధ్యమా? సంచితకర్మను గురించి సాధారణంగా ఒక విశ్వాసం ఉంది అది బ్యాంకు (Bank) ఖాతా వంటిది అంటారు బ్యాంకు ఖాతా వలెనే ఇందు కూడ జమ, ఖర్చులు ఉండును అని వారి విశ్వాసం పుణ్యకర్మలు జమ, పాపకర్మలు ఖర్చులు అని భావం పుణ్యకర్మలు ఆధ్యాత్మిక సంపద అంటారు కర్మఫలము లేక శిక్ష (retribution) సర్వసామాన్యము కాదు అది వ్యక్తిగతము అంతేకాదు కర్మఫలము ప్రతి కర్మకు విడిగా ఉండదు అది కొన్ని కర్మల మొత్తము ఫలం అని బౌద్ధుల వాదం బర్మాలో బౌద్ధమే కదా! బర్మా బౌద్ధులు వారు చేయు పుణ్యకర్మల పట్టిక (ఖాతా) (account) వ్రాసుకుని ఎప్పటికపుడు వారి వర్తమాన స్థితిని వారి పుణ్యకర్మల లెక్క చూసుకుని తెలుసుకుంటారట ఈ ఆచారం ఇంకా ఉన్నదో లేదో తెలియదు కర్మ అనునది ఒక ప్రవాహం వంటిది అని బౌద్ధం చెప్తుంది వీటి ప్రవాహం కలుషితమైనటులే దుష్కర్మలతో సత్కర్మలు కలుషితమగును అంటారు నీటిని శుద్ధి పరచునటులే సత్కర్మలతో దుష్కర్మలను నిష్ఫలం చేయవచ్చు నంటారు అనగా ఖాతాలో జమాఖర్చులను తారుమారు చేయవచ్చునని భావము

కాని భారతీయ బౌద్ధములోను, జైనములోను ఈ విశ్వాసము లేదు ప్రతి కర్మ విడిగానే ఫలము నొసంగునని సామాన్య సిద్ధాంతము అయినను పురుష ప్రయత్నమునకు ఇతిహాస (మహాభారత) కాలంలో ప్రాధాన్యం ఇచ్చారు దుష్కర్మలు, సత్కర్మలు విడిగానే పరిపక్వము చెందునని బౌద్ధములో ఎక్కువగా కనబడును ప్రతి కర్మ పరిపక్వము చెందుటకు కొంత కాలము పట్టునని, అది కర్మననుసరించి భిన్నముగా నుండునని జైనుల సిద్ధాంతము జైనులు కర్మను పదార్థము అన్నారు కాబట్టి ప్రతికర్మ ఒక పదార్థముగా భిన్న లక్షణములను కలిగియుండును కర్మ ప్రవాహము భిన్న లక్షణముల మిశ్రమం కాబట్టి దానిని సమం చేయుట సాధ్యము కాదు అని భావం

కర్మ విపాకము ఎపుడు జరుగునో అనగా సించితకర్మ ఎపుడు అనుభవములోనికి వచ్చునో తెలుసుకొనుట సాధ్యము కాదు కర్మఫలం శారీరక రూపంలో కనబడవచ్చు, లేక సుఖ, దుఃఖ అనుభవ రూపంగా కనబడవచ్చు సంచితకర్మలో కొంత ప్రారబ్ధకర్మగా అనుభవములోనికి వచ్చును మిగిలినది కర్మశేషముగా సంచితముగానే యుండును ఇందు ప్రతికర్మ తన ప్రత్యేకతను సాగించునను విశ్వాసము సర్వసామాన్యము గతకర్మలు సంయోగవియోగములతో క్రొత్త కర్మలను సృష్టించవు వర్తమాన జీవితంలో చేయబడు కర్మలే వాటితో కలిసి సంచితములగును ప్రతి కర్మకు ప్రత్యేకత ఉన్నను, నిత్యజీవిత అనుభవంలో వాటి ప్రత్యేకత తెలియుట సాధ్యము కాదు ఫలములు మిశ్రమంగానే అనుభవంలోనికి వచ్చును కాని కర్మఫలములు శాశ్వతములు కావు అనగా సుఖ, దుఃఖానుభవములు శాశ్వతములు కావు ప్రాధమిక స్వభావము, శారీరక రూపము ఆ జన్మకు శాశ్వతములే సత్కర్మ దుష్కర్మ ఫలములు మిశ్రితములే అయినను జన్మ పునర్జన్మలలో జన్మ రూపములు మిశ్రితములు కాలేవు జన్మస్వభావము మిశ్రితము కావచ్చు ఉదాహరణకు న్యాయస్థానములలో ఒక నేరస్థుని వివిధ నేరములకు వివిధ శిక్షలను ఒకే పర్యాయం విధించి, అవి ఒకే కాలంలో ఒకే శిక్షగా అనుభవించునట్లు తీర్పు ఇచ్చుట జరుగుచున్నది గదా!

మనం తిను ఆహారమును బట్టి మన శరీరంలో జీర్ణక్రియ జరుగుతూ ఉంటుంది అటులే మన కష్టసుఖాలకు పూర్తి బాధ్యత మనదే ప్రకృతికి అందరు సమానమే ప్రకృతి శక్తులను మనము ఉపయోగించుకొను మార్గము మీదనే లాభనష్టములు ఆధారపడియుండును నీరు మన దాహం తీరుస్తుంది అదే నీరు కలుషితం చేస్తే మన ప్రాణం తీస్తుంది అటు మన కర్మ ఫలితమును గ్రహించి వర్తమాన భవిష్య జీవితమును సరిదిద్దుకొని సవ్యమార్గములో నడిపించుకొనవచ్చును సముద్రముపై తెరచాప వాలుని బట్టి మాత్రమే పడవ నడుస్తుంది గాని గాలివాటమును బట్టి కాదు అంత దైవవిధియే మానవకర్తవ్యము

లేదనుట సత్యము కాదు దారిన నడచునపుడు దైవం మీద భారం వేసి కన్నులు మూసుకొని నడవము కదా! మానవుడు తన వంతు కర్తవ్యము సన్మార్గంలో నిర్వర్తించి సత్ఫలితముల కొరకు దైవముపై ఆధారపడవచ్చును

గతంలో చేసి కర్మల వలన కలుగుచున్న దుష్ఫలితముల నుండి యిపుడు రక్షణ పొందగలమా? పొందగలము కాని అది సమాధానం చెప్పినంత సులభం కాదు ఏ దురభ్యాసమునకైనను మూలం వ్యామోహం మనసు వ్యామోహంలో పడినపుడు దుష్కార్యములు జరుగును, ఆ పైన దుష్ఫలితాలు కలుగుతాయి దుష్కార్య ఫలితం అప్పటికే కాక తరువాత చాలకాలం వరకు బాధించును తనకేకాక తన సంతానమునకు కూడ వ్యాపించును తను చేసిన దుష్కర్మఫలితం అమాయకులైన తన సంతానం అనుభవించవలసి వస్తోంది ఉదాహరణకు త్రాగుడు` వ్యభిచరం దురలవాట్లే గదా! వాటి దుష్ఫలితాలు ఎంతవరకు వ్యాపించేది అందరికి తెలిసిన విషయమే ఈ దురభ్యాసముల నుండి బయటపడినపుడు ఆ తరువాత వాటి దుష్ఫలితాలు ఉండవు గదా!

అటులనే గత దుష్కర్మ ఫలితాల నుండి యిపుడు రక్షణ పొందాలంటే మనస్సును వ్యామోహంలో పడకుండ కాపాడుకోవాలి గత దుష్కర్మ మనస్సును వ్యామోహపరచి తిరిగి దుష్కర్మ చేయిస్తుంది అంతే కాని వ్యామోహమునకు లోబడని మనస్సును పూర్వకర్మ ఏమియు చేయలేదు అనగా మనోబలముచే పూర్వకర్మ దుష్ఫలితముల నుండి తప్పించుకొనవచ్చును దానికి ఆత్మబలం, నిగ్రహశక్తి కావాలి ఇది ఎంతో అభ్యాసము వలన గాని సాధ్యపడదు అది సాధించిన నాడు గతకర్మ ఫలితాలు ఇపుడు బాధించవు ఈ సాధనకు మార్గాలు అనేకం ఆత్మజ్ఞానం, నిర్మలభక్తి, నిస్వార్ధసేవ, మానవసేవ, నిగ్రహసాధన మొదలైనవి

చేసిన కర్మ ఫలితాన్ని అనుభవించి తీరాలి కాబట్టి సుఖప్రాప్తికి గాని,

దుఃఖనివారణకు గాని మనం ప్రయత్నించడం వ్యర్థం అని చెప్పరాదు కర్మ సిద్ధాంతముపై అవగాహన లేనివారు చేసే విమర్శ ఇది గత కర్మ ఫలితంగా ఈ జన్మ ఏర్పడింది కాబట్టి అది ఆ ప్రకారమే నడుస్తుంది ప్రత్యేకించి మనం చేయగలిగింది ఏమి లేదు అనటం వర్తమాన జన్మ వ్యర్థం అన్నట్లు అవుతుంది ఆత్మజ్ఞానసిద్ధి వైపుగా పరిణామ ప్రగతి సిద్ధాంతం వ్యర్థమే అవుతుంది క్రియ-ప్రతిక్రియ (action and reaction) ప్రకారం క్రియ జరిగినపుడు ప్రతిక్రియ తప్పదు ఉదాహరణకు బంతికి గోడకు కొట్టినపుడు అది తిరిగి మన ముఖంపై పడుతుంది ముఖమునకు ఏదైనా అడ్డం పెట్టుకుంటే బంతి తగిలే ప్రమాదం కొంతైనా తగ్గుతుంది ప్రారబ్ధ కర్మను తప్పించుకొనుటకు జీవన్ముక్తునికి కూడ సాధ్యపడదు కాని ఆ కర్మానుభవము అతనికి అంటదు అతని ఆత్మజ్ఞానసిద్ధి అట్టిది

ప్రారబ్ధకర్మయే కాక ఈ జన్మలో కూడ కర్మము చేయకుండ ఉండలేము కదా! కర్మము లేనిది జీవితము లేదు అన్నారు కదా! వర్తమాన కర్మల ద్వారా ప్రారబ్ధ కర్మల ప్రభావం తగ్గించుకొనవచ్చును ఏదైనా జబ్బు చేస్తే అది ప్రారబ్ధకర్మ అని ఊరుకుంటున్నామా? లేదు మందులు తీసుకుంటున్నాము జబ్బు నుండి బయటపడుతున్నాము జబ్బు ప్రారబ్ధకర్మ వైద్యం పురుష ప్రయత్నం ప్రారబ్ధకర్మ తప్పదు కాని దాని ప్రభావం తగ్గటానికి ఈ జన్మలో కర్మ కావాలి ప్రారబ్ధకర్మలో ఇమిడియున్న సుఖదుఃఖాలు, వర్తమాన జన్మలో మనం చేయు కర్మముల ననుసరించి మార్పు చెందుతూ ఉంటాయి పురుష ప్రయత్నమే వర్తమాన కర్మ పురుష ప్రయత్నమే లేకపోతే సృష్టి ఆంతర్యమే వ్యర్థమవుతుంది

అధునిక నాగరికత, వైజ్ఞానికాభివృద్ధి ఫలితంగా మనం మనకు భౌతిక సుఖాలను అందిస్తాయన్న భ్రమతో అనేక వస్తువులను సమకూర్చుకుంటూ మానసిక సుఖమును కోల్పోతున్నాం మానసిక ప్రశాంతి ఉన్నవాడు రోడ్డు

ప్రక్కనైనా ప్రశాంతంగా నిద్రపోగలడు అది లేనివాడు ఏ సి (airconditioned) గదులలో మెత్తని పరుపుల మీద కూడా నిద్రపోలేడు

"నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" (శంకర భగవత్పాదులు) అంతేకాదు ఈ వస్తువులే జీవితం అని భ్రమించి ఆ వస్తువులతో తాదాత్మ్యం చెందడం వలన కూడా మనం అనర్థమునే పొందుచున్నాము ఉదాహరణకు ఒక ముప్పది ఏళ్ల క్రిందట ఈ ఫానులు (Fans) లేవు విసనికర్రలే ఆనాటి ఫానులు వాటితోనే తృప్తిపడ్డాం నేడు కొద్దిసేపు కరంటు పోతే, ఫాను లేకపోతే చికాకుతో తపనపడు స్థాయికి దిగాం ఈ విధంగా మనం సమకూర్చుకుంటున్న వస్తువులు మనకు దుఃఖమునే మిగులుస్తున్నాయి ఇలా పెంచుకుంటూ పోతే మనం మనశ్శాంతిని కోల్పోయి మన ఉనికినే మనం మరచిపోతాం అంటే నేడు నాగరికతా చిహ్నాలుగా చెప్పబడుతున్న ఈ వస్తువులను సమకూర్చుకొనగూడదా! నిశ్చయంగా సమకూర్చుకొనవచ్చు దోషం ఆ వస్తువులలో లేదు వాటి మీద మనం ఏర్పరచుకొను వ్యామోహంలోనే దోషం ఉన్నది వస్తువులను ఉపయోగించుకొనవచ్చు కాని వాటి మీద అవధులు దాటిన వ్యామోహం పనికిరాదు

**5 పునర్జన్మ**

కర్మవిపాకము లేక కర్మ పరిపక్వము అనగా సంచితకర్మ పండి ప్రారబ్ధకర్మ రూపమున అనుభవములోనికి వచ్చుట ఇది సృష్టిక్రమంలో వివిధ శరీరరూపములలోను, శిక్షారూపంలోను ఉంటుంది అన్నారు సృష్టిక్రమం జీవపరిణామం శిక్ష అనునది దుఃఖానుభవ రూపంలో అనగా బాధల రూపంలో ఉంటుంది ఇందు మొదటిది పునర్జన్మ రెండవది జననం తరువాత జీవితంలో కలుగు అనుభవం ఈ రెండు కర్మసిద్ధాంతము యొక్క రెండు అంశములు అనగా ఒకే నాణెమునకు రెండు ప్రక్కలు పునర్జన్మ ద్వారానే కర్మ పరిపక్వమై ప్రారబ్ధకర్మగా అనుభవములోనికి వచ్చును

పునర్జన్మ జీవపరిణామ పురోగతిలోనిదా? లేక దుష్కర్మ పరిపక్వము పేరున తిరోగతిలోనిదా? ఆనాటి నుండి ఈనాటి వరకు మానవుని వేధిస్తున్న ప్రశ్న ఇది బ్రహ్మ సూత్రములలో చెప్పిన దానిని జీవపరిణామ సిద్ధాంతమునకు సమన్వయించి అంతరార్థం గ్రహిస్తే సత్యం బోధపడుతుంది

సృష్టిరూపమే పరిణామ పురోగతి అందరికి బ్రహ్మజ్ఞానసిద్ధి కలిగినపుడు సృష్టి ఆశయము పూర్తి అగును అని శ్రీ అరవిందులు అన్నారు అందుచే సృష్టిలో తిరోగమనము ఉండదు అన్నారు సర్వేపల్లి రాధాకృష్ణ కూడ సృష్టిలో తిరోగమనమునకు అవకాశము లేదు అన్నారు ఉపనిషత్తులలో చెప్పబడినట్లు పునర్జన్మలో పశుపక్ష్యాదులుగాను లెక జడముగాను కర్మఫలమునుసరించి మానవుడు జనించును అనునది రూపకాలంకార వ్యక్తమే కాని (Metaphorical Expression) పశుపక్ష్యాదులుగా మానవులు జనించరు పశుపక్ష్యాదులుగా జనింతురు అనగా మానవరూపములోనే పశుప్రాయులుగా జన్మింతురు అని రాధాకృష్ణ వ్యాఖ్యానించారు

జన్మలు ఒక ఆవృతము వంటివి (cyclic) కావున కర్మమును బట్టి మానవుడు పశుపక్ష్యాదులుగా పుట్టటం తిరిగి మానవజన్మ కర్మను బట్టి పొందటం జరుగుతుంది ఇదే ఉపనిషత్తులలో చెప్పినదాని భావము అని కొందరి వాదన ఇది తార్కికము కాదు మానవుడు కర్మ ఫలముచే పశుజన్మ పొందును అని అంగీకరించినను, ఆ పశువు తిరిగి మానవజన్మ పొందకలుగునంత సత్కర్మ ఎటుల చేయగలదు దీనికి సమాధానంగా ఒక వాదన ఉన్నది మానవరూపంలో ఉన్నపుడు చేసిన కర్మలో కొంత పశుజన్మ పొందవలసినంత పాపకర్మ అయినపుడు ఆ పాపకర్మఫల అనుభవము పూర్తి అగునంత వరకు పశుజన్మలో ఉండి అటుపై తిరిగి మానవజన్మ ఎత్తును అని ఈ వాదన పశుజన్మ అనుభవించునపుడు సంచిత కర్మలోని మిగిలిన భాగము అనుభవము లోనికి రాదు అని కూడ ఈ వాదనలోని అంశమే ఇది తార్కికము కాదు

మానవుడు తిరిగి పశుజన్మ పొందటం జరుగుతుంది అంటే సృష్టి ప్రణాళికకు అర్థముండదు అధిక శాతం పాపకర్మలే ఉండుట వలన పశుసంతతి పెరిగి మానవసంతతి అంతరిస్తుంది సృష్టి అంతము అది కాదు

మత్స్యపురాణములో చెప్పిన జలప్రళయంలో సృష్టి నశించింది కాని పునస్సృష్టికి వైవస్వత మనువు, సప్తఋషులతోను, అన్ని విధములగు బీజములతోను నావ యందు కూర్చుండగా మత్స్యరూపమున పరమాత్మ నావను రక్షించెను మనువు ద్వారా నూతన సృష్టి ప్రారంభమాయెను మానవుడు జంతువుగా తిరోగమనం చెందునపుడు సృష్టి ప్రారంభమునకు జంతుబీజములు ఎందుకు కాపాడవలసి వచ్చినది? జంతువులు సృష్టి ప్రణాళికాక్రమంలో పురోగతి చెంది మానవులుగా పరిణమించునే గాని మానవులు తిరోగమించి జంతువులుగా జన్మింతురని భావము కాదు గదా!

యుగములు మారినపుడు మానవుడు పశువుగా జన్మించటం పునరావృతం అగును అని కొందరి వాదన కాని ఇది కూడ తార్కికము కాదు కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు కలిసి ఒక మహాయుగము అది 43,20,000 సంవత్సరములు ఈ నాలుగింటిలోను తిరిగి చిన్నచిన్నవి నాలుగు యుగములుండును ఈ చిన్న యుగములలో జరుగునవి స్వల్పమార్పులు కాని ప్రళయము కాదు మహాయుగములు కొన్ని గడిచి కల్పాంతమున మహాప్రళయము వచ్చి సృష్టి అంతమైనపుడు అపుడు జన్మలు పునరావృతమగును అంతేకాని ప్రతి చిన్నయుగమునకు జన్మలు పునరావృతమగును అనుటలో ఏ మాత్రం అర్థంలేదు అట్లు జరిగినచో సృష్టి ముందుకు సాగదు సృష్టి ముందుకు సాగనిచో ఎప్పటికీ ఏకకణజీవులతోనే నిండియుండెడిది గదా! సృష్టిలో పురోగమనమే కాని తిరోగమనము ఉండదు పురోగమనమునకు ప్రకృతిలో అనేక అవకాశములు కల్పించబడినవి ఉన్న స్వల్పమైన మెదడు పదార్థముతోను, మనసుతోను, బుద్ధితోను పురోగమించి వికసించి పశుపక్ష్యాదులు

మానవరూపంలోకి పరిణామం చెందుచున్నవి ఉపనిషత్తులలో చెప్పబడిన జన్మలు పునరావృతమగును అంటే "పునరపి జననం పునరపి మరణం" అని, ఆత్మజ్ఞానసిద్ధి కలుగునంతవరకు పుట్టుట, గిట్టుట తిరిగి పుట్టుట - ఇట్లు జన్మలు పునరావృతమగుచుండునని అర్ధము మానవుడు తిరిగి పశుజన్మ పొందును అని కాదు

కర్మ కఠినమైనదీ కాదు ఉదారమైనదీ కాదు కర్మ వలన మానవుడు నిరాశ చెందనవసరము లేదు తాను గతంలో చేసి దాని ఫలం ఈనాడు తాను అయినపుడు తాను కాబోయేది తాను ఈనాడు చేయవచ్చు హిందూమతమునకు ఇతర మతములకు ప్రధాన భేదము పునర్జన్మయందలి విశ్వాసము ముఖ్యముగా ఉపనిషత్తుల కాలమునుండి పునర్జన్మ విశ్వాసము స్థిరపడింది కాని అది ఉపనిషత్తులతో అకస్మాత్తుగ పుట్టినది కాదు వేదములు, బ్రాహ్మణములలో అభిప్రాయరూపంలో ఉండి ఉపనిషత్తులలో స్పష్టముగ ఉచ్చరించబడింది (ఋగ్వేదం X 16-3) (శతపథ బ్రాహ్మణం I 5-3-4, X 3-3-8) బృహదారణ్యక ఉపనిషత్తులలో (4-4-3) సంసారియగు జీవుడు ఒక దేహమును వీడి మరియొక దేహమును ఎట్లు పొందునది చెప్పారు "తృణజలాయుకాతృణస్యాన్తంగత్వా" అను వాక్యం ఇందులోనిదే ఆత్మ (ముఖ్యప్రాణం) అన్ని జీవులలోను ఒకటే పురాణములందు ఎడపెడ (ఎడనెడ) జీవుడు స్థూలదేహముతోనే పరలోకమునకు వెడలినట్లు కన్పడును అది అసాధారణ విషయము అది కథాభాగమునకు సంబంధించిన విషయము మాత్రమే స్థూలదేహమును ఇచట విడిచి జీవుడు మరియొక దేహమును పొందుట సత్యము ఇది స్వప్నము వంటిది అన్నారు పూర్వకర్మ సంస్కారములకు అనుగుణముగా కొత్త దేహము పొందును పూర్వకర్మ సంస్కారము అంతఃకరణమునందే యుండును స్థూలశరీరమునందు కాదు దీనికి ఉదాహరణగా బృహదారణ్యకం (4-4-3)లో గడ్డిపురుగు కదలికను చెప్పారు గడ్డిపురుగు (small caterpiller) (తృణజలాయుక) ఒక గడ్డిఆకు చివర వరకు వెళ్లి, మరియొక ఆకు పట్టుకొని దాని పట్టు చూచుకొని

వెనుకటి గడ్డిపరక మీదనున్న తన అవయవములను ఉపసంహరించును (అనగా సమాప్తి చేయును, చంపును, సంకుచితము చేయును) అటులే సంసారియగు జీవాత్మ మరణకాలమందు స్థూలశరీరమును వదలివేయును ఇది స్వప్నమందు, జాగ్రదవస్థయందు (conscious or wakeful state) శరీరమును వదలిపెట్టునట్లుండును గడ్డిపురుగు దానికి తగిన మరియొక గడ్డి ఆకు పట్టుకొనినటుల జీవాత్మ తన సంస్కార భావ ప్రభావమున నూతన శరీరమును తానే ఏర్పరచుకొనును స్వప్నమందు మరియొక దేహముపై అభిమానము ఏర్పడినటుల కర్మసంస్కారముల ననుసరించి ఏర్పరచుకొనిన నూతన స్థూలదేహమునందు వెనుకటి ఇంద్రియములు శక్తివంతములై వ్యక్తములగుటచే ఆ నూతన శరీరముపై అభిమానము ఏర్పడును బృహదారణ్యకము (4-4-4)లోనే జీవాత్మతోనున్న పూర్వ సూక్ష్మభూతములు (సూక్ష్మ శరీరమందలి పంచభూతములు) ఆకారమును మార్చి నూతన దేహమును నిర్మించును అన్నారు ఇది కంసాలి ఒక బంగారు ఆభరణమును మార్చి మరియొక ఆభరణము చేయునట్టిదే

కాబట్టి పూర్వ స్థూలదేహమును వదలిపెట్టుటకు ముందే అనగా చివరి క్షణములలో నూతన దేహమును కనుగొనును అని తెలియుచున్నది జీవాత్మ సృజనశక్తి (creavity) కలిగియుండుటచే పంచభూతముల సహాయముతో నూతన శరీరమును ఏర్పరచుకొనును కర్మ సంస్కారముల ననుసరించి ఆ నూతన శరీరరూపసౌందర్యము ఉండును స్థూల దేహమందు హృదయస్థానమందలి పద్మము, లేక శూన్యప్రదేశమందు జీవాత్మ యుండును పరిమాణములో అతిసూక్ష్మమైనను రూపములో స్థూలదేహమునే పోలి యుండును అన్నారు మేడ మీదికి వెళ్లుటకు మెట్లు ఎక్కునటులే జీవాత్మ జన్మల పరంపరలో తన శక్తి సామర్థ్యములను పెంచుకొనుచుండును అని భగవద్గీత అంతరార్థము ఈ అభిప్రాయమే పాశ్చాత్యుడైన ఎమర్సన్ కూడ (R W Emersan) తన గీతావ్యాసమునందు వ్యక్తం చేశాడు కాబట్టి సృష్టి

పరిణామ ప్రణాళిక యందు (ప్రవాహమందు) జీవాత్మ శక్తి సామర్థ్యములకు పురోగతియే కాని తిరోగతి యుండదు అని భౌతిక విజ్ఞానశాస్త్రవేత్తలు, జీవశాస్త్రవేత్తలు (scientists) కూడ అంగీకరిస్తున్నారు ఇది జన్మ పునర్జన్మల పరంపరలో సాగుచుండును

ఇక స్వర్గ నరకములు వాస్తవములు కావు అవి కల్పితములు అని తెలియుచున్నది స్వర్గము అనునది సుఖము, ఆనందము కలిగించు ప్రదేశముగా భావించారు దానిని భిన్నమతముల వారు భిన్నంగా ఊహించుకున్నారు అనగా ఈ ప్రపంచంలో వారికి అందని సుఖం ఏదైతే ఉందో అది ఉండుచోటు స్వర్గంగా భావించారు మహమ్మదీయుల స్వర్గంలో అపరిమితమైన నీరు, నీడ, పండ్లు, సుందరాంగులు, వారి సంగీతనృత్యములు ఉంటాయని ఊహించారు హిందువులు ఊహించిన స్వర్గంలో కూడ సుందరాంగులు, వారి సంగీత నృత్యాలు ఉంటాయి నార్వే దేశస్థులు వీరులు యుద్ధములో శత్రువులను జయించుట, అడవి జంతువులను చంపుట, ఉండు ప్రదేశమే స్వర్గమనుకున్నారు అలాగే అమెరికాలోని ఇండియన్లు (Red Indians) నిరంతరం వేటకు సరిపడు జంతువులుండు చోటు స్వర్గముగా భావించారు క్రైస్తవులది మరొక ఊహ కాబట్టి స్వర్గమనేది మన ఊహాసౌఖ్యం, ఆనందం దొరకు చోటు అది మన ఊహాచిత్రము మాత్రమే

వేదమతానికి అనగా హిందూమతానికి అందరికీ తెలిసిన అనేక చారిత్రక కారణాల వలన విదేశీ మతశక్తులతో ప్రమేయం ఏర్పడింది ఆ సంపర్కంతో మహాసముద్రంలాంటి మన మతంలో ఆయా మతవిశ్వాసాలు వచ్చి కలిసినాయి అయినా వేదమతం తన ప్రత్యేకతను కోల్పోలేదు 19వ శతాబ్దం ఆరంభం నుండి భారతీయుల జీవనంలో, భావాలలో, ఆదర్శాలలో, నడతలో ఊహింపబడని మార్పులు వచ్చాయి ఇప్పుడున్నది ఒక విచిత్ర పరిస్థితి కొందరు విదేశీ వ్యామోహంలోను, అనుకరణలోను కొట్టుకుపోతున్నారు

కొందరు ఇంకా కాలం చెల్లిన ఆచారాలను, విశ్వాసాలను మూర్ఖంగా పట్టుకొని గబ్బిలాల వలె వ్రేలాడుతున్నారు కొందరు మాత్రం విదేశీ వ్యామోహపరుల ఆక్షేపణలకు వివేకంతో సమాధానం చెపుతూ వేదమతమును దేశపరిధులను దాటేటట్లు వ్యాపింపచేశారు అందువలన ఈ మారిన పరిస్థితులలో ప్రాచీన గృహ్యసూత్రాలను, ధర్మసూత్రాలను తిరుగ వ్రాయవలసిన అగత్యం ఏర్పడింది అట్టిదే పునర్జన్మ విశ్వాసం మానవుడు పునర్జన్మలో తిరిగి కర్మననుసరించి పశుపక్ష్యాదులుగా జనించు అవకాశము ఉన్నది అను అంధవిశ్వాసమును తొలగించి ఉపనిషత్తుల వాక్యముల అంతరార్థము వ్యక్తం చేయవలసిన అగత్యం ఏర్పడింది వేదాంతులు జీవశాస్త్రజ్ఞులు సహయోగముతో కృషిసల్పి ఉపనిషత్తుల అంతరార్థమును చెప్పినపుడే దానికి విలువ ఏర్పడుతుంది

పశుపక్ష్యాదుల కంటే, జడపదార్థముల కంటే మానవజన్మ ఉత్కృష్ట మైనది అని తెలుస్తోంది జ్ఞానశక్తి, క్రియాశక్తి మానవునిలో వికాసం చెందినాయి కాబట్టి భావిజన్మను నిర్ణయించుకొనగల శక్తి మానవునికి ఉన్నది దానిని సద్వినియోగం చేసుకొనుట అతని కర్తవ్యం స్వర్గం నరకం అను ప్రత్యేక లోకాలు ఉన్నట్లు ప్రమాణాలు లేవు సుఖానుభవమే స్వర్గం, కష్టము అనుభవించుటయే నరకం వాటి అనుభవము కొరకు సామాన్య మానవుడు తగిన యోనులలో జన్మించటం తప్ప మరొకటి కాదు

వాస్తవమునకు ఏ మనిషికైనా తన జననం తెలియదు, ఎవరో చెపితే వినటం తప్ప కాని మృత్యువు తెలుస్తుంది అనగా మానవుడు తాను మరణించు సమయమున ఆ విషయం అతనికి తెలుస్తుంది కాని జననసమయ అనుభవం తెలియదు జన్మరహస్యము ప్రకృతియందు ఇమిడియున్నది ఈ విషయం భగవద్గీత (15-7)లో చెప్పబడింది స్థూలశరీరం వదలిన తరువాత నూతన శరీరం పొందునంత వరకు జీవాత్మ అంతరిక్షంలోనే (ప్రకృతిలోనే) ఉంటుంది కర్మ సంస్కారములకు తగిన శరీరము తల్లి గర్భాశయమునందు

సృష్టించబడును తల్లి గర్భమందు పిండమునకు ఏడు నెలలు నిండినపుడు పూర్తి శరీరస్థితి ఏర్పడును దానికి స్వంత నాడీమండలము ఏర్పడును అందలి న్యూరాన్ కణములు (నాడీకణములు) అదే నాడీస్థితి కలిగిన లింగదేహముతో నున్న జీవాత్మను ఆ పిండము (foetus) లోనికి ఆకర్షించును అప్పటి నుండి ఆ జీవాత్మ ఆ శరీరముపై పూర్తి ఆధిపత్యము పొందునని ఒక వాదమున్నది పునర్జన్మకు ఆ వ్యక్తి కర్మ సంస్కారములే బాధ్యులగును కాని మరెవ్వరు కాదు జనన మరణములకు ముందు తరువాత కూడ వ్యక్తి తన గతికి (destiny) తానే బాధ్యుడు

మరణించిన తరువాత పునర్జన్మకు ఎంత కాలం పట్టేది చెప్పలేము ఎందుకనగా తల్లి గర్భమందు పిండ శరీరములోని నాడీకణముల స్వభావము సంపూర్ణముగా లింగశరీరములోనున్న ఆ జీవాత్మకు తగినట్లు ఉన్నపుడే ఆ జీవాత్మ అందు ప్రవేశించును అట్టి పిండ శరీరము కొరకే జీవాత్మ అన్వేషించును ఇది ప్రకృతిలోని సృష్టి ప్రవాహములోని అంతర్భాగము బయటకు కనబడదు దీనికి ఉదాహరణగా భాగవతములోని (9-13) నిమి చక్రవర్తి కథ యున్నది ఇది నిమిరాజు మరణము విదేహి జనకుని జననమునకు సంబంధించినది నిమి తన గురువైన వసిష్ఠుని రాక ఆలస్యమైనందున, సమయము దాటకుండ యజ్ఞము పూర్తి చేయవలసియున్నందున, గురువు రాక ముందే యజ్ఞమును పూర్తిచేసెను అటు తరువాత వచ్చిన వసిష్ఠుడు కోపించి నిమిని శపించెను అకారణ శాపమునకు కోపించి నిమి కూడ వషిష్ఠుని శపించెను ఆ శాప కారణమున ఇద్దరు మృతులైరి అది సహజ మరణము కాదు కాబట్టి వారిని పునర్జీవితులను చేయుటకు (resuscitate) అచటనున్న ఇతర మహర్షులు ప్రయత్నించారు ముందుగా వసిష్ఠుని పునర్జీవితుని చేశారు కాని ఎంత ప్రయత్నించినను నిమి పునర్జీవితుడు కాలేదు అపుడు ఆ ఋషులు స్వర్గమునకు వెళ్లి నిమి జీవాత్మను తిరిగి రమ్మని కోరారు స్వర్గసుఖములలో నున్న ఆ నిమి జీవాత్మ తన గురువు అకారణ శాపమునకు విరక్తి చెంది భౌతిక

ప్రపంచములోనికి తిరిగి వచ్చుటకు నిరాకరించెను అపుడు ఆ ఋషులు అంతరిక్షమందు భ్రమణములో నుండు (తిరుగుచుండు) మరియొక జీవాత్మ కొరకు అన్వేషించారు తగిన స్థూలదేహము కొరకు అన్వేషణలో నున్న ఒక జీవాత్మ వారికి కనబడింది ఋషుల కోరికపై ఆ జీవాత్మ నిమి దేహమునందు చేరుటకు అంగీకరించినది కాని ముందుగా నిమి దేహమును తనకు తగినట్లుగా మార్పు చేయమని ఋషులను కోరింది ఆ ఋషులు నిమి దేహమును మార్పుచేసి నూతన జీవాత్మకు జన్మనిచ్చిన దేహం కావున జనకుడు అని నామకరణం చేశారు దేహం దొరకక అన్వేషణలోనున్న ఆ జీవాత్మకు 'విదేహి' అని కూడ నామకరణం చేశారు ఆ విదేహి మార్పుచెందిన నిమి దేహమునందు ప్రవేశించి జనకుడు అయింది ఈ జనకుడే శ్రీరాముని పత్ని సీతాదేవి తండ్రి ఇచట ప్రాధాన్యము కథాభాగమునకు కాదు జీవాత్మ తనకు తగిన దేహము కొరకు అన్వేషించును అను అంతరార్థము ప్రధానం ఇక్కడ ఒక సందేహము వస్తుంది స్త్రీ గర్భంలోని అండమందు (ovum) పురుషుని శుక్రమందు (sperm) అప్పటికే జీవముండును గదా, ఇక రెండును సంపర్కము చెందినపుడు క్రొత్త జీవమునకు అవసరమేముండును అని అంతియేగాక అది క్రొత్త జీవసృష్టి ఎట్లు అగును అని అండములోను, శుక్రములోను జీవమున్నను అవి కలిసినపుడు మాత్రమే స్థూలశరీరపిండరూపము ఏర్పడును సంపర్కము జరుగునంతవరకు అండము, శుక్రము వాటి స్థానములలో నిల్చియుండును సంపర్కము జరిగినపుడు క్రొత్త జీవము ఏర్పడును

అణువు నందలి ఎలక్ట్రానులే (Electrons) శక్తి ఏర్పడుటకు ఆధారము అణువులందలి వలయములందు (orbits) ఎలక్ట్రానులు సవ్యముగా పరిభ్రమించుచుండును ఆ పరిభ్రమణమే నూతన శక్తికి కారణము సవ్యముగా భ్రమణము అయిన తరువాత ఆ ఎలక్ట్రాను అపసవ్యముగా తిరిగి నాశనమగును అని కొందరు శాస్త్రజ్ఞులు అంటారు క్రొత్త ఎలక్ట్రాన్ ఎపుడు ఎలా ఏర్పడును? తిరిగి క్రొత్త సవ్య భ్రమణము ఎపుడు ప్రారంభమగును? క్రొత్త ఎలక్ట్రాను

పూర్తిగా పాతదాని వలెనే ఉండునా? లేక సృష్టి ప్రవాహములో అది ఒక క్రొత్త ఎలక్ట్రానా? సమాధానము సులభము కాదు కాని క్రొత్త ఎలక్ట్రాను ఏర్పడుట సత్యము జనన మరణములు గూడ ఇట్టివే

బ్రహ్మసూత్రములలో కూడ దాదాపు ఇదే విషయము కనబడును (3-1-24→27) యజ్ఞకర్మలాచరించినవారు మరణానంతరం చంద్రలోకము పొందుదురని చెప్పబడింది వెళ్లునపుడు దేహము దహించబడినపుడు అందలి నీరు ఆవిరియై, మేఘమై (అభ్రం) అటుపై పొగమంచుగా, వాయువును చేరి తుదకు అకాశము చేరును తిరిగి వచ్చునపుడు అదే వరుసలో వచ్చి భూమిని చేరును అనగా ఆకాశము, వాయువు, ధూమము (పొగమంచు), మేఘము (అభ్రం), తుదకు నీరు జీవాత్మ నిజంగా ఆకాశము, వాయువు, ధూమము, అభ్రముగా మార్పు చెందదు ఆ సామ్యమును (పోలికను) మాత్రమే పొందును తుదకు వర్షరూపంలో భూమికి చేరును ఇది కల్పితముగా కనబడవచ్చును కాని మరణానంతరము జీవాత్మ లింగశరీరముతో ప్రకృతియందు చేరును అని అంతరార్థము ఈ సామ్యములు ఎక్కువ కాలముండవు శీఘ్రముగానే వర్షరూపములో భూమిని చేరును

భగవద్గీతలో కఠోపనిషత్తు ప్రాధాన్యం పొందినట్లే బ్రహ్మసూత్రములలో ఎక్కువ భాగము ఛాందోగ్య ఉపనిషత్తు ఆధారమైంది ఛాందోగ్యం (5-10-6,7)లలో చెప్పినట్లుగానే బ్రహ్మసూత్రములు (3-1-24→27) చెప్పుచున్నవి చంద్రమండలం నుండి దిగివచ్చువారు వర్షరూపంలో భూమి మీద పడిన తరువాత ధాన్యం, యవలు, వనస్పతులు, ఓషధులు, నువ్వులు, మినుముల రూపంలో జన్మింతురు అని చెప్పబడింది ఆ ధాన్యాదులను ఎవరు తింటే వారి రూపమే ఆ జీవులు పొందుదురు అన్నారు అనగా అవి తినినవారి వీర్యముగా ఆ జీవులు మార్పు చెందుదురు అని అర్థం ఇచట కర్మశేషము గల ఆ జీవులు సస్యములుగా మార్పుచెందరు సంసర్గము లేక సంబంధము లేక సంశ్లేషమును

(కౌగలించుకొని లేక ఆవరించుకొనియుండుట) మాత్రమే పొందుదురు అంటే ఆ జీవులు పునర్జన్మకు అవి మాధ్యమాలుగా (Medium) వర్తించును (similarity only not embodiment or only connected) ఈ సమయములో ఆ జీవులకు కర్మఫలానుభవం ఉండదు అందువలన ఆ ధాన్యం ఉడకపెట్టటం జరిగినపుడు ఆ బాధలు వీరికి ఉండవు కొంతసేపు వాటితో కలిసియుండి, తగిన శరీరం దొరికే అవకాశం లేకపోతే వదలివెళ్లిపోతాయి ఆ ధాన్యం తినిన వారితో ఈ జీవులకు భావసంబంధము ఉండదు (the soul only gets connected with that person as it was connected with the plants, herbs etc and is not born as them) ఆ పురుషుని వీర్యము స్త్రీ యోని యందు ప్రవేశించినపుడు, దానినంటుకొనియున్న జీవుడు తన కర్మల అనుభవమునకు తగిన శరీరమును పొందును అన్నారు

కాని జీవులు వర్షం ద్వారా వచ్చి జలరూపంలో భూమిని చేరిన తరువాత పునర్జన్మ పొందటం చాల కష్టము అన్నారు ఎందుకనగా ఆ వర్షపు నీరు ఎడారులలోను, పర్వతముల మీద, అడవులలోను, సముద్రములోను ఎక్కడైనా పడవచ్చు అపుడు తిరిగి ఆవిరియై మరల వర్షరూపమున భూమిని చేరి ధాన్యములతో సంబంధము పొందకలగాలి ఇది చాల కష్టముతో కూడినదే ఆ ధాన్యము ఆ జీవాత్మ సంస్కారములకు తగిన దేహమును ఈయగల పురుషుడు మాత్రమే తినాలి అంతవరకు నీటిరూపంలో ఆ ధాన్యముతో సంబంధము కలిగియుండి తగిన పురుషుడు దొరకినపుడు అతని వీర్యములో ప్రవేశించును ఆ జీవాత్మలు తగిన దేహము దొరకునంత వరకు భ్రమించుచునే యుండును కాని ఇచట ఒక సందేహమున్నది జీవాత్మ సంబంధము పొందేది ఒక పురుషునితో కాని ఆ జీవాత్మ కర్మానుభవమునకు వలసినది ఆ శరీరము కాదు ఆ వీర్యము ద్వారా స్త్రీ గర్భములో రూపొందు నూతన శరీరము ఆ జీవాత్మకు కావలసినది అది ఆ జీవాత్మకు తగినదే అగునని నమ్మకం ఏమిటి?

దీనికి సమాధానం ఛాందోగ్యం (5-10-6)లో ఉన్నది "రేతః సించతి తద్భూయఏవభవతి" ఆ జీవాత్మ సంబంధం పొందిన వీర్యము ఎవరిదో ఆ రూపముతోనే స్త్రీ గర్భములో నూతన దేహం ఏర్పడును 'ఆత్మావైపుత్ర నామాసి' అని శృతివాక్యము కాబట్టి జీవాత్మ తన కర్మానుభవమునకు తగిన పురుషుడు దొరికినపుడు అతని వీర్యముతో సంబంధము పొం. ను అయితరేయ ఉపనిషత్తులో (2-1-1) వీర్యము ఎవరిదో ఆ రూపమే గర్భమున రూపొందును అన్నారు రూపము అంటే పోలిక కాదు మానవరూపము అని అర్థము జీవులు వీర్యరూపంలో పురుషుని శరీరంలోనే గర్భరూపాన్ని ధరిస్తాయి వీర్యమనునది మానవుని అన్ని అవయవముల నుండి ఉత్పన్నమగు సారము అది తేజోరూపములో నుండును పురుషుడు ఆ విధమైన తన రూపమును తన శరీరంలోనే పోషిస్తున్నాడన్నమాట అనంతరం ఆ పురుషుడు గర్భరూపంలో తనలో పోషింపబడుచున్న ఈ వీర్యమును (శుక్రమును) స్త్రీలో నిక్షేపించును (ఉంచును) అనగా ఉత్పత్తి చేస్తున్నాడని భావము

బృహదారణ్యకంలో (4-4-3)ను, ఛాందోగ్యములోను (5-10-6) అయితరేయంలోను (2-1-1) చెప్పిన విషయములు సమన్వయం చేసుకొనినచో వాస్తవము బోధపడును

1 జీవాత్మ పాత శరీరమును వదలు సమయముననే కొత్త శరీరమును నిశ్చయించుకొనును
2 తనకు వలసిన శరీరమును తానే రూపొందించుకొనును అనగా అన్వేషించి తెలుసుకొనును
3 కర్మసంస్కారములననుసరించియే ఈ అన్వేషణ సాగును
4 జన్మలు పునర్జన్మలు మాత్రమే ఆవృతములు (cyclic)
5 రూపములు పరిణామ ఫలితములే
6 సృష్టి ఒక పరిణామ ప్రవాహము అందు పురోగమనమే తప్ప తిరోగమన

ముండదు

7 పురోగతిలో వికసించిన మానసిక స్థితితోను, విజ్ఞానముతోను మానవ రూపం పొందిన జీవాత్మ పునర్జన్మలో మానవరూపమునే పొందును పశుపక్ష్యాదుల దేహమును పొందదు అది తిరోగమనమగును

8 జీవాత్మ ధాన్యముతోను, నీటితోను, వీర్యముతోను కలిసినపుడు అది సంబంధము మాత్రమే పొందును గాని రూపము కాదు ఆ సమయమున కర్మానుభవము ఉండదు

9 తనకు తగిన దేహము దొరుకునంతవరకు జీవాత్మ అంతరిక్షమందు భ్రమించుచుండును అపుడు కర్మానుభవము ఉండదు

10 పునర్జన్మకు ఎంతకాలము పట్టునది తెలియుట సాధ్యము కాదు

11 స్వర్గనరకములు స్థితులే కాని లోకములు కావు

శ్రీ అరవిందులు చెప్పినది వ్యక్తిగత అభిప్రాయం కాని ఉపనిషత్తుల ఆధారముతో కాదు అని కొందరి వాదన అసలు ఉపనిషత్తు ఏమిటి? గురుశిష్యుల చర్చలో రూపొందిన భావరూపము అనగా ఊహను వ్యక్తం చేయుట ఊహలు వ్యక్తిగత అభిప్రాయములే గదా! ఉపనిషద్కర్తలు మహాయోగులు వారికి దివ్యదృష్టి అనగా యోగదృష్టి ఉండెను కాబట్టి సృష్టిని గూర్చి వారు గ్రహించగలిగారు అంటే యోగదృష్టితో గ్రహించుట ప్రత్యక్ష దర్శనం కాదు గదా! అది కూడ ఒక రకమైన ఊహయేగదా! శ్రీ అరవిందులు కూడ మహాయోగియే గదా! మరి వారి అభిప్రాయములు వారు మానసికముగా గ్రహించినవి సత్యములు ఎందుకు కాకూడదు? శ్రీ రామకృష్ణ పరమహంస, రమణమహర్షి అట్టివారే కదా! ఉపనిషత్తులు కూడ మహాతాపసుల అభిప్రాయము లైనపుడు, శ్రీ అరవిందులు చెప్పింది కూడ అట్టిదే అనుటకు ఎట్టి సందేహము పడవలసినది లేదు

ఇక రాధాకృష్ణ చెప్పిన విషయము ఉపనిషత్తులలోని ప్రవచనములు

సూత్రప్రాయముగా నుండును అంతేకాక అవి ఒక క్రమపద్ధతిలో లేవు అందువలన వాటిని సమన్వయించి వ్యాఖ్య చెప్పటం జరిగింది ఆ భాష్యములలో ఏది తార్కికముగా సత్యమునకు దగ్గరగా ఉన్నదో దానిని గ్రహించవలసిన బాధ్యత మనది

ఇక అవతారములను గురించి మత్స్యా అవతారము నుండి పరిపూర్ణ మానవ అవతారములగు రామకృష్ణులు దాకా జరిగింది జీవపరిణామ దశలు అంటే వాటి దశలకు ప్రతీకలుగా గ్రహించాలి అని కొందరు అంటారు కాని అవతారములు ప్రతి చిన్నయుగమునకు పునరావృతం కావు ప్రతి చిన్నయుగమునకు రాముడు, కృష్ణుడు జన్మించరు కొన్ని మహాయుగముల కొకసారి ఈ అవతారములు పునరావృతమగునని చెప్పబడినది అందువలన జనన మరణ పునరావృతంలో మానవుడు పశుపక్ష్యాదులుగా పుట్టడం, తిరిగి మరల మానవజన్మ పొందడం జరుగుతుంది, అది అవతార పునరావృతం లాంటిది అనటంలో ఏ మాత్రం అర్థం లేదు

మత్స్యావతారంలో రక్షించబడింది ఎవరు? ప్రళయంలో నాశనం కాకుండ కొంతమంది సత్కర్ములైనవారు మనువు, మహర్షులు పరిపూర్ణ మానవులే గదా! కూర్మావతారం దేవరాక్షస వైరుధ్య సందర్భములోనిది రాక్షసులది గుణం రాక్షసం రూపం మానుషమే కదా! వరాహ, నారసింహ అవతారములలో చంపింది హిరణ్యాక్ష హిరణ్యకసిపుల్లను వారు కూడ మానవ రూపంలోనున్న రాక్షసులే గదా! కాబట్టి ఈ అవతారములు జీవపరిణామ ప్రతీకలుగానే (symbols) గ్రహించాలి గాని పునరపి జననం పునరపి మరణం అను ఆవృతంలో పశువు నుండి మనిషికి తిరిగి పశువుగాను జీవుడు ఆవృతంలో (cycle) తిరుగుచుండును అని చెప్పుట అర్థరహితం

సృష్టిలో పురోగమనమే గాని తిరోగమనం లేదు పునర్జన్మలలో మానవుడు తిరిగి క్రిమి కీటకాదులుగానో, జడములుగానో జన్మించటం

జరగదు కర్మఫలమును బట్టి ఆ గుణములతో ప్రవృత్తితో మానవుడుగా జన్మించి కర్మఫలము అనుభవిస్తాడు కర్మఫలమును బట్టి మనిషిజన్మ నరకం వంటి బాధలతోనో, స్వర్గం వంటి సుఖములతోనో ఉంటుంది అని కర్మ సిద్ధాంత అంతరార్థము అంతేగాని కర్మమును బట్టి మనిషి క్రిమికీటాదులుగానో, పశుపక్ష్యాదులుగానో, జడములుగానో పుట్టును అని అర్థం కానేకాదు ఉపనిషత్తుల ప్రకారం పునర్జన్మ కర్మను,బట్టి ఉండును అనగా పునర్జన్మలోని స్వభావము, సుఖదుఃఖములు ప్రారబ్ధకర్మము ననుసరించి ఉండునని భావార్థమే కాని (ప్రతీకార్థము) (symbolic meaning) పునర్జన్మలో కర్మను బట్టి పరిణామదశ తిరోగమించును అని అర్థం కాదు

ఉపనిషత్తులను పరిశీలించినచో ముందుకాలంలో (earlier) రూపొందిన ఉపనిషత్తులలోని ప్రవచనములు తరువాత కాలపు (later) ఉపనిషత్తులలో మార్పు చెందినట్లుగా కన్పడును 'పునర్మృత్యువు' అని ఎక్కువగా ఉపయోగించబడిన పదము 'పునర్జన్మ'గా మారింది అటుపై పునర్జన్మ, పునర్మృత్యువు అను కాలచక్రము నందు తిరుగుట (rotate) (ఆవృతము) అను భావం వ్యక్తమైంది కావున ఉపనిషత్తులలో పునర్జన్మ, పునర్మృత్యువు అను ఒక ఆవృతము (cycle) ఉన్నదను భావమే వ్యక్తపరచ బడ్డదిగాని, పశుపక్ష్యాదుల నుండి మానవరూపమునకు తిరిగి పశుపక్ష్యాదులు గాను పుట్టుట అని కాదు కాలచక్రము వలె అంటే పునర్జన్మలో కర్మమును బట్టి ఏర్పడు స్థితి (state of life) కాని పరిణామదశాస్థితి కాదు కొన్ని సందర్భములలో ఉపనిషత్తులు పరస్పరం విరుద్ధముగా (contradictory) నున్నట్లు కనబడును

ఆత్మ తనకు తగిన శరీరము కొరకు వెతకి తిరిగి జన్మ పొందును అని చెప్పినపుడు, కర్మఫలమును బట్టి పునర్జన్మ కలుగును అని చెప్పుటలో అర్థమేమున్నది కావున కర్మఫలమును బట్టి పునర్జన్మలో జీవితస్థితి ఏర్పడును, అంతే కాని పునర్జన్మలో కర్మను బట్టి మానవుడు పశుపక్ష్యాదుల జన్మములను

పొందును అని కాదు అనినచో కర్మఫలము పునర్జన్మలో అనుభవములోనికి వచ్చును అనుటలో అర్థముండును కర్మఫలమును బట్టి ఏర్పడిన సంస్కారములు కారణశరీరము ద్వారా జీవునితో కూడియుండి వాటికి అనుకూలమైన మానవ శరీరమును పొంది ప్రారబ్ధకర్మకు తగిన స్థితిని పొందును అనుట సమంజసము

కర్మ, పునర్జన్మ అనునవి ఆవృతములు (circular or cyclical) అవి పరంపరలు (linear or evolutionary) కావు అను వాదనలో అర్థం లేదు సృష్టి ఉద్దేశము, ఆశయము పురోగతి మాత్రమే పురోగతి పరిణామము ద్వారానే సాధ్యము పరిణామము స్వయంప్రవర్తకము (automatic) అనగా దానంతట అదే జరుగును పరిణామము లేకపోయినను, లేక పరిణామములో వెనుకకు, ముందుకు ఉన్నను పరిణామ ఉద్దేశము నాశనమగును సృష్టికర్త సృష్టిని ముందుకు త్రోయుట, మరల వెనుకకు లాగుట చేయడు సృష్టికర్త సృష్టి ప్రణాళికను ఏర్పరచాడు అది స్వయముగానే ముందుకు సాగును సృష్టికర్త కల్పించుకొనడు పర్యవేక్షించును నియమగతి తప్పినపుడు దానిని నియమగతిలో పెట్టును పరిణామము లేనిచో సృష్టి నిశ్చలమగును అది సృష్టి ఆశయము కాదు ముందుకు సాగుటయే సృష్టి ఆశయము

ఇక్కడ ఒక సందేహమున్నది సృష్టి పరిణామముతో కూడినది అన్నపుడు ఇంకను క్రిమికీటకాదులు ఎందుకు పుట్టుచున్నవి? దీనికి సమాధానం సులభం పరిణామం నిరంతర ప్రవాహం అది పరంపరగా సరళరేఖగా సాగుచునే యుండును పరిణామ పరంపరలో వికాసము వ్యక్తమగును పరంపరలో పరిణామం చెంది వికసించిన మానసిక స్థితిని పొంది ఆ స్థితిలో స్థూలదేహమును వదలి, ఆ స్థితితో కూడిన కారణశరీరముతో నున్న జీవుడు ఆ స్థితికి ఎదగని క్రిమికీటాదుల, లేక పశుపక్ష్యాదుల శరీరములలో ప్రవేశించి ఎట్లు ఇమడగలడు? నిశ్చయముగా ఇమడలేడు కర్మఫలమును బట్టి

పునర్జన్మ కలుగును అను వాదన అంగీకరించినను అది పరిణామములో తిరోగమన రూపము కాదు (retardation) పరిణామములో ఉన్నతస్థితి పొందిన మానవరూపం అటులేయుండి అతని మానసికస్థితి, స్వభావము కొంత తిరోగమించవచ్చు అతడు పశుప్రాయుడుగానో, జడప్రాయుడుగానో ప్రవర్తించవచ్చు కాని అది కూడ తాత్కాలికమే అన్నారు పరిణామంలో వికసించేదాకా క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు ఆ స్థితిలోనే పునర్జన్మ పొందుతూ ఉంటాయి

విశ్వము ఒక అనంతమైన గిడ్డంగి (store house) అందు పదార్థము, శక్తి నిండి యుండును (matter, energy) పదార్థము, శక్తుల సంయోగము లేక సంయోజనము (composition) నిత్యము మార్పు చెందుచుండును ఆ మార్పులు కాలక్రమములో నుండును (from time to time) అదే సృష్టి విషయము (theme) మార్పు వలన కణముల సంఖ్య వృద్ధి చెందును అని సైన్సు చెప్తోంది అందు కొన్ని కణములకు (particles) క్రొత్త లక్షణములు (qualities) కలుగును కొన్ని పాత లక్షణములనే సాగించును సృష్టికి పూర్వము విశ్వము భయంకరమైన సంకులస్థితి యందు (chaotic condition) ఉండెను సృష్టి ప్రణాళిక ప్రారంభమైన తరువాత కాలక్రమంగా ప్రస్తుత స్థితికి చేరింది సృష్టి ప్రణాళిక సాగునంత వరకు అది వెనుకకు మరలదు పదార్థము విడిపోయినపుడు (decompose) (శిథిలమైనపుడు) విశ్వస్థితి తిరిగి సంకులమగును సృష్టిఅంతమగును కాని అంతము సంపూర్ణము కాకపోవచ్చు శక్తివంతమైన కొన్ని కణములు అటులే యుండి నూతన సృష్టి పరంపరకు ప్రారంభం (initiate) కావచ్చు ఆ విధంగా సృష్టి ప్రారంభం ఆవృతం (cyclic) కాని సృష్టి ప్రారంభమై ఒక పరంపర (process) ఏర్పడినపుడు అది పురోగతితో కూడి సరళరేఖగానే ముందుకు సాగును ఆవృతమై వెనుకకు తిరగదు

పదార్థకణముల సంయోగవియోగములలో కొన్ని అతిశక్తివంతమైనవి (higher particle) కొన్ని శక్తిహీనమైనవి (lower particles) ఏర్పడవచ్చు

శక్తిహీనమైనవి మరికొంత కాలములో శక్తివంతమైనవిగా పరిణామం చెందవచ్చు సృష్టి పరంపర కూడ అట్టిదే పరిణామంలో మానవుడుగా వికసించిన జీవుడు ఇంకా పురోగమిస్తూ ముందుకు సాగును ఈ పరంపర నిత్యప్రవాహము అగుట వలన ఇంకను పురోగమించని జీవుడు క్రిమికీటకాదులుగానో పశుపక్ష్యాదులుగానో పుట్టుచూ కాలక్రమంలో మానవుడుగా పరిణమించును కాని మానవుడు తిరోగమించి క్రిమికీటకాదులుగానో పశుపక్ష్యాదులుగానో జన్మించడు పురోగమించిన మానవుని కారణశరీరము క్రిమికీటకాదులలోను లేక పశుపక్ష్యాదులలోను ఇమడదు

కర్మ ఈ సృష్టి పరిణామ పరంపరకు (process of evolution) ఊపిరివంటిది సృష్టి విచ్ఛిన్నమై విశ్వము తిరిగి సంకులస్థితి పొందునంత వరకు కర్మప్రేరిత (లేక) చోదితమైన అనగా కర్మచే నడపబడు పరిణామ పరంపర (process of evolution) సాగుచునే యుండును అది ముందుకే సాగును వెనుకకు తిరగదు మహాయుగాంతమునకు ప్రళయము సంభవించి సృష్టి అంతరించి తిరిగి ప్రారంభమగును కాని ఆ యుగాంతము ఎప్పుడో స్పష్టముగా ఎవరూ చెప్పలేరు ఎందుకనగా యుగపరిమాణము (యుగ గణనము) (measure or period) మనము ఏర్పరచుకొనినదే భగవంతుడు ఏర్పరచలేదు బ్రహ్మ ఆయుర్దాయము హిందూ కాలగణనములో ఇలా నిర్ణయించారు

360 (సుమారు) మానవ దినములు ఒక సంవత్సరం

360 మానవ సంవత్సరములు ఒక దైవ సంవత్సరం

17,28,000 మానవ సంవత్సరములు కృతయుగం (Golden Age)

12,96,000 మానవ సంవత్సరములు త్రేతాయుగం (Silver Age)

8,64,000 మానవ సంవత్సరములు ద్వాపరయుగం (Copper Age)

4,32,000 మానవ సంవత్సరములు కలియుగం (Iron Age)

ఈ నాలుగు యుగముల కాలము, మొత్తం మహాయుగమగును 43,20,000 మానవ సంవత్సరములు ఒక మన్వంతర ప్రారంభం నుండి 71 మహాయుగములు ఆ మన్వంతర కాలమగును అనగా ఒక మన్వంతర కాలము 30,67,20,000 మానవ సంవత్సరములు

అట్టి మన్వంతరములు 14 వాటి మొత్తం కాలం 4,29,40,80,000 మానవ సంవత్సరములు పాతస్సంధ్య, సాయంసంధ్యాకాలముతో కలిపి 2,59,20,000 మానవ సంవత్సరములగును

ఈ మొత్తం 14 మన్వంతరముల కాలము 1,000 మహాయుగము లగును

అది ఒక కల్పము అది 432,00,00,000 మానవ సంత్సరములగును

ఒక కల్పకాలము బ్రహ్మకు పగటికాలమగును బ్రహ్మకు రాత్రి కాలము కూడ అన్ని మానవ సంవత్సరములు 432,00,00,000

పగలు, రాత్రి కలిపిన 864,00,00,000 మానవ సంవత్సరములు బ్రహ్మకు ఒక దినము అగును అట్టి 360 బ్రహ్మదినములు బ్రహ్మకు ఒక సంవత్సరమగును అనగా 311,40,00,00,000 అనగా 311040 కోట్ల మానవ సంవత్సరములు బ్రహ్మకు ఒక సంవత్సరము అట్టి 100 సంవత్సరములు బ్రహ్మకు జీవితకాలము అనగా 3,11,04,000 కోట్ల మానవ సంవత్సరములు అది పూర్తి అయినపుడు సృష్టి లయమగును

ఇట్టి అపరిమితమైన కాలములో మన జీవితకాలం ఎంత అనామకమో గ్రహించవచ్చు మానవుడు గడ్డిపుష్పము వంటివాడు గడ్డిపుష్పము వికసించిన కొద్దిసేపు చాల అందంగా ఉంటుంది కాని ఒకే ఒకసారి గాలి వస్తే అది కొట్టుకుపోతుంది కనపడదు భగవద్గీతలో చెప్పినట్లు భగవంతుడు కాలస్వరూపుడు లేక కాలమే భగవంతుడు కాని చెప్పుట ఎంత తేలికో

అర్థమగుట అంత కష్టము కాలమును గణించుటకు మానవుడు ప్రమాణములు కల్పించుకున్నాడు కాని కాలమునకు ఆది అంతము లేదు అందుకే కాలము పరమాత్మ ఇది తెలియుట ఆత్మజ్ఞానమునకు ప్రారంభం మాత్రమే కాలమును మనకు కనిపించు వస్తు ప్రపంచమును బట్టి మనము గణిస్తున్నాము ఒక వస్తువు ఉన్నదంటే దానిని చేసినవాడు ఒకడుండాలి వ్యావహారికంగా మనం గడియారమును బట్టి కాలం తెలుసుకుంటున్నాము ఎవరో ఒకరు ఆ గడియారమును తయారుచేసి ఉండాలి కదా! ఇదే విధంగా సృష్టి మనకు కనబడుతూ ఉంది కాబట్టి దానిని చేసినవాడు ఒకడు ఉండాలి కాబట్టి అతడే భగవంతుడు అనుకుంటున్నాము ఇది భౌతిక విశ్వాసము మాత్రమే అనుభూతి (Direct experience) కాదు అనుభూతి కలిగినపుడే పరమాత్మను గ్రహిస్తాము కాబట్టి ఈ సృష్టి ఏర్పడుట (integration) శిథిలమగుట (disintegration) ఆవృతముగా జరుగుచుండును ఒక సృష్టియందలి పరిణామము ఆవృతము కాదు అది పరంపరా ప్రవాహముగా ముందుకు సాగుచు పురోగమించును అట్లుకానిచో సృష్టి విఫలమగును సృష్టి చేతనమైనది (active) నిశ్చలమైనది కాదు (stand still)

సృష్టి పరిణామములో జీవదశలు వర్తమాన జీవితములో వయసు దశలతో పోల్చవచ్చును వయస్సు పెరుగుటయే కాని తరుగుట యుండదు వయస్సుతో శరీరదశలు బాల్య, యవ్వన, కౌమార, వార్ధక్యములు ఏర్పడును ఈ దశలు ముందుకే తప్ప వెనుకకు మరలవు బాల్యం, యవ్వనం తిరిగిరావు కౌమార, వార్ధక్యములలో కూడ బాల్య, యవ్వన ప్రవర్తన, ప్రవృత్తి ఉండవచ్చు కాని బాల్య యవ్వనములు తిరిగిరావు అటులే పరిణామదశలలో మానవస్థితి పొందిన జీవుడు తిరిగి పశుదశకు తిరోగమించలేడు మానవరూపంలోనే పశుప్రవృత్తి, ఒక విధంగా వికారరూపం కూడా కలుగవచ్చు కాని పశుజన్మ రాదు

6 హృదయం - మనసు (Heart & Mind)

ప్రస్తుతకర్మ భవిష్యత్తులో పునర్జన్మకు కారణమగును అన్నారు మరి ప్రస్తుత కర్మకు బాహ్యకారణము ఏది? మనసే ప్రస్తుత కర్మకు కారణము ఇంద్రియములు పరికరములు మాత్రమే మనస్సు, బుద్ధి, చిత్తము అని మూడు విధములుగా చెప్పారు మనస్సు చైతన్యమగు అనుకంపనలకు అనగా భావములకు (feelings) స్థానము అనుకంపన (భావములు) (feelings) ఆంతరికముగా నుండును వాటి బాహ్యరూపము అయిన స్పందన (response) కలిగినపుడు భావములు కార్యరూపము పొందును మనస్సున కలుగు భావములకు రూపము, శక్తినిచ్చునది బుద్ధి (intellect) మనస్సు, బుద్ధి కలిసి చిత్తమగును దానినే అంతఃకరణం అన్నారు బుద్ధియే మేధస్సు మనసే హృదయం హృదయం అంటే వైద్యపరంగా రక్తప్రసారమునకు ఆధారమగు హృదయం కాదు వైద్యపరంగా చెప్పబడు మెదడు (brain) లోని భాగములే మనస్సు, బుద్ధి (మేధస్సు) వైద్యపరంగా రక్తప్రసారకేంద్రమును హృదయమని (Heart), భావకేంద్రమునకు మనస్సు (Mind) అంటారు ఇది మెదడులోని భాగమే మెదడు శరీరమందలి నాడీమండలమును (Nerve System) నియంత్రించును ఇంద్రియములు పనిచేయుటకు నాడీమండలమే ఆధారము బుద్ధి (intellect) అచేతనము (inactive) దాని చేతనరూపము (active form) మనస్సు (Mind) లేక హృదయం మనస్సు చైతన్యమునకు కార్యరూపము ఇచ్చునది నాడీమండలము ద్వారా మెదడు భాగము (Brain) ఇవి అన్నియు ఒకే చోట మెదడు అను పదార్థమందే (Brain matter) యుండును మానసిక చైతన్యమునకు బాహ్యరూపములే కర్మలు

మనస్సు-హృదయం రెండు ఒకటే అనునది మనస్తత్వ శాస్త్ర (Psychology) పారిభాషిక వివరణ వ్యావహారికముగా మనస్సు, హృదయము అను పదములను ఉదారంగా (liberal) యథేచ్ఛగా ఉపయోగిస్తుంటాము కాని వేదాంతంలో మనస్సుకు ప్రత్యేక స్థానం ఉంది మనస్సుకు జీవాత్మతో

పరిసంబంధం (Direct Contact) ఉండును మనస్సు జీవాత్మకు ఉపకరణము (instrument) మనస్తత్వ శాస్త్రంలో మనస్సు, హృదయం, భావములు, ఉద్రేకములు అన్ని ఒకటే వేదాంతంలో హృదయం చిత్తమునకు పర్యాయపదము చిత్తశుద్ధి అను పదము విరివిగా వాడుతుంటాము అంటే ఒక భావము లేక ఆలోచనను గురించిన స్వచ్ఛత విషయమును మనసు గ్రహించును ఆ గ్రహించబడినది మనసున నాటుకొనును అనగా ముద్రవేయును ఈ ముద్రలే అనగా సంస్కారములు (impressions) వ్యక్తి ఆలోచనలపై ప్రభావము చూపును అందువలన ఈ ముద్రలనబడు భావములు పరిశుద్ధము (స్వచ్ఛము) కావలయును ఎందుకనగా మనసునందు ఏర్పడు ఆలోచనలే (భావములే) కర్మకు కారణములగును మనసున ఏర్పడు ఈ భావముద్రలు స్వచ్ఛమైనపుడు చింతనశక్తి (power of reflection) కలుగును అనగా మంచి గ్రహించగల శక్తి కలుగును దీనినే పర్యాలోచన అని గూడ అంటారు

మనసు ఒక అద్దం వంటిది అద్దంపై దుమ్ము చేరితే దాని ప్రతిఫలించు (పరావర్తనం చెందు) (reflecting power) శక్తి తగ్గును ప్రాపంచిక విషయముల పైననే ఆసక్తి చూపు వారికి కోరికలు ప్రబలమగును ఈ కోరికలు అద్దముపైన దుమ్మువంటివి అన్నారు దుమ్ము తుడిచివేసిన అద్దము స్వచ్ఛమగును కోరికల కార్యరూపములే కర్మలు మనసున కోరికలు అను భావములను తుడిచివేసిన చిత్తశుద్ధి కలుగును వ్యావహారికముగ మనస్సు, హృదయము, చిత్తము ఒకటిగానే గ్రహించవచ్చును కోరికలనేవి చాల మొండివి ఎంత తుడిచివేసినా వాటి ఛాయలు ఉంటూనే ఉంటాయి అవే కొత్త కోరికలకు ఆధారం (మూలం) అవుతాయి కోరికలను తుడిచివేయమని చెప్పటం ఎంత సులభమో ఆచరణ అంత కష్టము పూర్తిగా కోరికలను తుడిచివేసి మనసును శూన్యము చేయుట రాజయోగము ద్వారానే సాధ్యము పరిపూర్ణ రాజయోగము యోగాసనములు సాధన చేసినంత మాత్రమునరాదు

కోర్కెలను పూర్తిగా శూన్యము చేయుట సామాన్య మానవునికి సాధ్యము కాదు అందువలన వ్యామోహం తగ్గించి కోర్కెలను నియంత్రించినచో కర్మ సంస్కారములు స్వచ్ఛమగుటకు అవకాశమున్నది

ఆంతరికస్థితులను (innerstate) పరిశీలించుటకు మనస్సే సాధనము ఏకాగ్రత శక్తిని సక్రమ మార్గమునకు తెచ్చి అంతర ప్రపంచము వైపుకు (inner world) మరల్చినపుడు ఆ శక్తి మనస్సును శోధించి అంతర్గత విషయములను బహిర్గతము చేయును చెదిరిన సూర్యకిరణములను కేంద్రీకరించినపుడు అవి తీక్షణముగా వెలుగును ఏకాగ్రత వలన మానసిక శక్తులు ప్రకాశించును జ్ఞానమునకు ఇదియే సాధనము ఏకాగ్రతకు ఎంతో సాధన అవసరము ఏకాగ్రత వలన మనస్సు ద్వారా మనస్సు స్వభావమును గ్రహించవచ్చునని స్వామి వివేకానంద అన్నారు

మనలోని అంతర ప్రపంచము ఒక సూక్ష్మ ప్రపంచము దాని బాహ్యరూపమే బయటనున్న వస్తుప్రపంచము కర్మకు బాహ్యప్రపంచము కార్యము, అంతర ప్రపంచము (సూక్ష్మ ప్రపంచము) కారణము అన్నారు అందువలన మన ఆంతరిక శక్తులను నేర్పుతో నడుపనేర్చినవానికి ప్రకృతి యంతయు లోబడును అన్నారు స్వామి వివేకానంద ప్రకృతిని నిరోధించుటయే ఆత్మజ్ఞానమునకు మార్గము మనస్సు నియంత్రించుట ద్వారానే ప్రకృతిని నియంత్రించుట సాధ్యము బాహ్య, అంతరములు ఒక రకముగా కల్పితములైన పరిమితులు (Limits) ఈ నియంత్రణకు నిరాహారిగా నుండనవసరం లేదు మితిమీరిన పరిశ్రమ పనికిరాదు కాని పనిపాటలు లేకుండుట కూడ దోషమే యగును

కర్మాచరణమే క్రియాయోగము ఇంద్రియములే గుఱ్ఱములు వాటిని వశము చేసుకొనిన కోరికలు నియంత్రించబడును దానికి మనస్సే కళ్లెము వంటిది కీడు జరిగిన తరువాతనే మేలు ప్రభావము తెలియును కష్టముంటేనే

సుఖము తెలియును దోషము లేని ప్రపంచము ఆకాశపుష్పము వంటిది ఇది గ్రహించగలిగినవాడు కోరికలను చంపుట కంటే నియంత్రించుట మేలు అని తెలుసుకొనును కర్మము కర్తవ్యముగా నిర్వహించిన కోరికలను నియంత్రించుటకు అవకాశము కలుగును కోరికలను నియంత్రించిన కర్మ నిష్కామమగును అయినను కర్తవ్య నిర్వహణలోనైనను పాపము చేసిన అది స్వార్థమగును దానికి ప్రాయశ్చిత్తము చేసుకొనవలెను అందుకే శ్రీకృష్ణుడు భారతయుద్ధానంతరము పాండవులచే నదీ స్నానము చేయించెను నదీస్నాన మనునది శబ్దార్థముగా కాక పాపములను కడుగుకొనవలయునను సంకేతార్థముగా (symbolic meaning) గ్రహించవలయును

విశ్వము అనంతమైనది అందు మన భూమి ఒక అల్పమైన భాగము సముద్రతీరమందలి పెద్దపెద్ద శిలలతో పోలిస్తే ఇసుకరేణువు ఎంతటిదో విశ్వమందు మన భూమి అంతటిది అనంతమైన విశ్వమందు మానవుడు ఒక రేణువు స్వల్పాతిస్వల్పమైన జీవి కాని మానవుడు సాధించిన కార్యములు గమనించినచో ఈ అల్పత్వము అదృశ్యమగును అతని మనసు-మేధస్సులే అతని విజయమునకు కారణములు అతని మనస్సు మేధస్సులే కాలము, అంతరిక్ష పరిమితులు (Limits) దాటుటకు తోడ్పడినవి కాని అదే మనసు అతని అశాంతికి, అసౌఖ్యమునకు కూడ కారణమవుతోంది అందు మూలమున అతడు అంతశ్శత్రువులైన అరిషడ్వర్గములకు - కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములకు బానిస అవుతున్నాడు అదే మనస్సు-మేధస్సుతో సర్వమునకు అతీతము, అనంతము అయిన శక్తి ఏదో ఉన్నదని అదే విశ్వమును పర్యవేక్షించుచున్నదని గ్రహించాడు తన జీవితమును కూడ నడిపేది ఆ శక్తియేయని తెలుసుకున్నాడు ఎంతో కుతూహలంతో ఆ శక్తిని గురించి తెలుసుకునే ప్రయత్నం చేశాడు చేస్తున్నాడు తన జీవిత సమస్యలకు ఆ శక్తి ఏ విధంగా తీర్చగలదో తెలుసుకొనుటకు తపనపడుతున్నాడు

ఈ స్థితిలో భక్తి-దైవము అతని మనస్సున ప్రవేశించాయి గుళ్లు వెలిసాయి భక్తి మానవుడికి దైవముతో అనుసంధానము కలుగజేస్తుంది మనస్సుతో మేధస్సుతో దైవమునకు భౌతికరూపం కల్పించాడు అయినా అతని సమస్యలు తీరలేదు సమస్యలు తీరటానికి ఆ దైవమును తృప్తిపరచటానికి మార్గాలు ఆలోచించాడు ఇక్కడ కూడ అతనికి మనస్సు, మేధస్సు తోడ్పడినాయి ఆ మనస్సు-మేధస్సుతో దైవమును వ్యాపారస్థుడిని చేశాడు భక్తి వ్యాపారమైంది భగవంతుడిని తెలుసుకోవాలనే తపన తుడిచివేయబడింది దాని స్థానంలో అదే మనస్సు, మేధస్సుతో స్వార్థమును రూపొందించుకున్నాడు స్వార్థము ఇంతింత అయి, అంత అయి తుదకు అతని మనస్సు మేధస్సును స్వాధీనం చేసుకుంది భగవంతునితో బేరాలు సాగించాడు, దేవాలయాలు అంగడి వీధులైనాయి ఇపుడు బాధల కంటే కోరికలు ఎక్కువైనాయి తన కోరిక నెరవేరిస్తే దక్షిణ ఇస్తానని, కష్టాలు నివారణ అయితే మొక్కు చెల్లిస్తానని భగవంతుని ఉపయోగించుకొనటం ప్రారంభించాడు

మనం కొట్టే కొబ్బరికాయలు దేవునికి అవసరమా? మనము ఇచ్చు ముడుపులు భగవంతునికి ఎందుకు? మన తల జుట్టు భగవంతునికి కావాలా? ఇవి అన్ని ఆత్మార్పణకు సంకేతాలు ఆత్మార్పణలేని భక్తి శూన్యము భగవంతునికి ఇవ్వవలసినది నిర్మల భావం, నిశ్చల హృదయం, నిస్వార్థ చర్య మననుండి భగవంతుడు కోరేవి ఇవే మిగిలినవి ఎన్ని సమర్పించినా అవి నిరర్థకములే ప్రార్థన అంటే భక్తి శ్లోకాలు చదవటం మాత్రమే కాదు భజనలు, పాటలు, శ్లోకాలు మొదలగునవి బాహ్య శుభ్రతకు మాత్రమే ఉపకరిస్తాయి లోపల శుభ్రత కొరకు ప్రార్థన హృదయంలోంచి రావాలి పెదవుల నుండి మాత్రమే వచ్చు మాటలు ఎన్నటికి ప్రార్థన కానేరవు ప్రార్థన అంటే ఆత్మ పడు తపన ఆర్తితో తన బాధను భగవంతునితో చెప్పుకోవడం ఆర్తితో కూడినదే ప్రార్థన దానికి హృదయమే మార్గము జీవితము యెడల మానవుని దృక్పథము మార్చుటకే ప్రార్థన ఆధ్యాత్మిక దృష్టి ఏర్పడుటకే ప్రార్థన

భగవంతుని విగ్రహరూపునిగా కాక సర్వాంతర్యామిగా గ్రహించకలిగినపుడు మానసిక శాంతి, పరమానందము కలుగును ఆ స్థితి యందు మనస్సు మేధస్సు పరిశుభ్రమగును చిత్తశుద్ధి కలుగును హృదయం భగవంతుని సాన్నిధ్యమునకు తపించును ఆ స్థితియందు ప్రారబ్ధకర్మ అనుభవించుచున్నను బాధలు అంటవు మనము బాధలో నున్నపుడు వైద్యుడు బాధ తెలియకుండ మత్తు కలిగించు ఇంజక్షనే ఇస్తాడు బాధలు పోవు కాని తెలియవు భక్తి కూడ అట్టిదే కర్మబాధలు అనుభవిస్తున్నట్లే మనకు తెలియదు

భగవద్గీత (18-75)కి వ్యాఖ్య చెప్పుచు అరవిందులు జీవించుట కొరకే జీవితము కాదు అన్నారు అది మనము ఎవరో తెలుసుకొనుట కొరకు కర్మము అనునది తనను తాను తెలుసుకొనుటకు, తన స్థితిని సఫలము చేయుటకు చేయవలయును కర్మను తాత్కాలికమైన బాహ్యాఫలితములకే కాక ఆంతరికమైన దివ్యచైతన్యము కొరకు కూడ చేయవలయును

ధ్యానం కోసం కూర్చున్న వెంటనే మనస్సు ఇతర ఆలోచనల వైపు మరలుతుంది అయినా నిరాశ పడకూడదు మనసు గాలిలో పెట్టిన దీపంలాంటిది ధ్యానంలో మనం ఉండేది కొద్ది క్షణాలే అయినా నిరాశ కూడదు సాధనతో క్షణాలను పెంచుతూ ముందుకు సాగాలి ధ్యానంలో సిద్ధి పొందలేకపోయినా సాధన వదలకూడదు

కొందరు తమకు భగవంతుని దర్శనమైందని చెబుతుంటారు వారు మహాత్ములు కావచ్చు లేక దొంగస్వాములు కావచ్చు అది వినేసరికి ఆస్తికులైనవారు ఆయనను పట్టుకుంటారు వారిలో భగవంతుని దర్శనం వాంఛించువారు కొద్దిమంది అయితే ఎక్కువమంది తమ కోరికలు సిద్ధిస్తాయి అని ఆశించేవారే నాస్తికులు అయితే ఏదీ భగవంతుని చూపించమను అని సవాలు విసురుతారు దీని వలన అసలు విషయం మరుగునపడుతుంది భగవంతుని దర్శనం మానసికం మనకు తలనొప్పి వచ్చినపుడు ఆ నొప్పి

మనకే తెలుస్తుంది ఎదుటివానికి తెలియదు నొప్పికి మందు వేసుకుంటే నొప్పి తగ్గుతుంది కాని ఆ తగ్గటం కూడ మనకే తెలుస్తుంది ఇతరులకు తెలియదు నొప్పి అనుభవం ద్వారానే తెలుస్తుంది అటులే ఒక వస్తువును మనము గుర్తించినపుడే అది ఉన్నదని తెలుస్తుంది అది కంటికి కనబడేది కావచ్చు కాకపోవచ్చు కంటికి కనబడనిది అనుభవం ద్వారానే గుర్తించ కలుగుతాము ఉదాహరణకు ఆకాశం మనకు కనబడుతుందా? కనబడదు ఆకాశం అనగానే పైకి చూస్తున్నాము ఆకాశం కంటికి కనబడకపోయినా ఉందని గుర్తిస్తున్నాము కంటికి కనబడని దానికి మన హృదయంలో రూపం ఏర్పడుతుంది ఆ రూపమే అనుభూతిని (Direct experience) కలుగజేస్తుంది

వేదాంతంలో ఆత్మజ్ఞానమునకు ఆధిక్యత ఉన్నది మతములో భగవంతుని తృప్తిపరచే మార్గాలకు ప్రాధాన్యం ఎక్కువ ఆత్మతో సంబంధము కనబడదు అందుచే మనిషి భగవంతునికి దూరమవుతున్నాడు వేదాంతంలో అనుభవసిద్ధితోను, అనుభూతితో భగవంతునితో ఏకత్వమునకై సాధనలు చెప్పారు క్రైస్తవమతము, ఇస్లాం మతము ప్రవక్తల ద్వారా ఏర్పడినవి ప్రవక్తలనే రక్షకులుగా (Deliverers) భావించారు కాబట్టి ప్రవక్తలు ఆత్మ-పరమాత్మను గురించి ప్రస్తావించలేదు మతము కొన్ని విశ్వాసముల మిశ్రమము అందుచే రక్షకుడుగా భావించబడిన ప్రవక్తనే వారు ధ్యానింతురు

హిందూమతములో మతము, వేదాంతములు భిన్నములుకావు ఎందుకనగా హిందూమతము ఏ ప్రవక్త వలన ఏర్పడినది కాదు ఇది వేదమతము వేదముల నుండి స్వయముగానే రూపొందినది వేదములు ఎవరో ఒకరు చెప్పినవి కావు ప్రత్యక్ష అనుభూతి పొందిన ఋషుల అనుభవములకు అక్షరరూపము దివ్యచైతన్య (పరమాత్మ) అనుభూతి (realization of supreme consciousness) యే వేదమత ఆశయము అదే వేదాంత ధ్యేయముతో ఏకీభావము పొందును కాని హిందూమతములో

కొంతమంది మతోన్మాదులు మతమును వేదాంతము నుండి వేరుచేసిన సందర్భాలు ఉన్నాయి ఆ స్థితిలో మనిషి పరమాత్మ నుండి దూరమవుతాడు

అనుష్ఠానము ద్వారా బాహ్యపరిశుద్ధతకు మతము మార్గము చూపును కాని వేదాంతము అంతరశుద్ధికి అనగా చిత్తశుద్ధికి దోహదము చేయును బాహ్య పారిశుధ్యము ద్వారా నిరోధములు (repressions) ఎక్కువచేసినచో అవి మూఢవిశ్వాసములుగా అవతరించును మూఢ విశ్వాసములను భయములు అనుసరించియే యుండును మూఢవిశ్వాసములే మతక్షీణదశకు ప్రారంభము మనిషి ఆత్మజ్ఞానమునకు దూరమగును విశ్వమునకు మూలకారణమును గురించి తెలుసుకొనుటకు తార్కికమైన (logical) పద్ధతి వేదాంతము నిజమైన వేదాంతి దివ్య చైతన్యమును గ్రహించుటలో ఎన్నడూ భౌతిక వాంఛల సాఫల్యమును ఆశించడు ఆత్మ జ్ఞానమునకు చేరువ అయిన కొలది మనిషికి మత అచరణల యందు ఇచ్ఛ తగ్గును వేదాంతములో జాతి, వర్గములకు స్థానము లేదు ఆచారముతో కూడిన మతమునందు కుల, వర్గ భేదములు అతిశయించును నరకభయమే మతాచారములకు మూలము భౌతికవాంఛలు నెరవేర్చుకొనుటకు మతం ఒక మార్గమైంది

**మతం, భక్తి, వేదాంతం** మూడూ సదుద్దేశముతో ఏర్పడినవే కాని వాటి పరిధులు భిన్నమైనవి **మతం** ప్రక్రియలకు, అనుక్రమణికలకు ప్రాధాన్యం ఇస్తుంది ఈ ప్రక్రియలకు మూలం ఏదో ఒక లబ్ధి వాంఛ ఈ లబ్ధి భౌతికం కావచ్చు, లేదా నరక పరిసరాలకు కూడ వెళ్లకుండా సరాసరి స్వర్గానికి వెళ్లు లబ్ధి కావచ్చు చాలవరకు బాహ్యప్రక్రియలకే ప్రాధాన్యం ఇచ్చి ఏదో లబ్ధి కొరకు ప్రాకులాడేదే మతం నిజంగా భక్తిభావంతో కూడినవైతే మత ప్రక్రియలు కొంత వరకు నయం కాని వాస్తవమైన భక్తి ఆధ్యాత్మికం దానికి బాహ్యకర్మ ప్రక్రియలతో పనిలేదు

ఇక రెండవదైన **భక్తి** ప్రధానంగా మూడు విధాలు 1 జ్ఞానభక్తి, 2

మధురభక్తి, 3 మూఢభక్తి

1 **జ్ఞానభక్తి** పరిపూర్ణంగా ఆధ్యాత్మికం భక్తిలో ఇష్టదేవతారాధనే ఉంటుంది కాని ఆ ఇష్టదైవమునే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను భావంతో సర్వంలోను ఆ దైవమేయని ఆ దైవంలోనే పరబ్రహ్మమును అప్రత్యక్షంగా చూస్తాడు త్యాగయ్య, తుకారాం మొదలైనవారు ఆ కోవకు చెందినవారు

2 ఇక **మధురభక్తి**కి ప్రేమ ప్రధానం రాధాకృష్ణ ప్రేమతత్త్వం అదే జీవాత్మ పరమాత్మల సంబంధం రాధాకృష్ణ ప్రేమతత్త్వం ఇందులో జీవాత్మ రాధ పరమాత్మ కృష్ణుడు మధురభక్తిలో కృష్ణ పాత్ర ప్రాధాన్యం ఎక్కువ జయదేవుడు, చైతన్యుడు మొదలైనవారు మధురభక్తులు

3 **మూఢభక్తి** అటు జ్ఞానముతో గాని ఇటు మధురభావముతో గాని కూడినది కాదు భగవంతుని తన వలెనే ఒక జీవునిగా తలుస్తాడు తనని తను మరుస్తాడు అంతా భగవంతునిమయంగా కనబడుతుంది అతనికి అతడు పారవశ్యానికి లోనౌతాడు అతనిది జ్ఞానం కాదు, అజ్ఞానం కాదు అతనిది మాటలలో చెప్పనలవి కాని భక్తిభావ ఉద్రేకం తిన్నడు, గోరాకుంభార్ ఇటువంటివారే ఈ మూడు ఆధ్యాత్మికాలే పరమాత్మతో ఐక్యత వస్తుంది

కాని భక్తికి లబ్ధి భావన సంపర్కం ఏర్పడితే ఆధ్యాత్మికం పోయి అది మతప్రభావానికి లోనవుతుంది భక్తికి కూడ ప్రక్రియలు, అనుక్రమణికలు ఏర్పడతాయి భక్తి బజారు పాలవుతుంది అంతరాత్మకు దూరమవుతుంది ఆ భక్తి పారమార్థికం కాదు

ఇక **తత్త్వదృష్టి** లేక **వేదాంతం** ఇది పరిపూర్ణమైన ఆధ్యాత్మికం ఇచట లబ్ధి భావనకు స్థానం లేదు ఎందుకనగా లబ్ధి ఎవరు కలిగిస్తారు తాత్త్వికం జ్ఞానంతో కూడినది 'సర్వఖల్విదం బ్రహ్మ' అనునది పరిపూర్ణంగా అనుభూతిలోకి వస్తుంది అతడు జీవన్ముక్తుడు కావచ్చు భక్తి లబ్ధి భావనలేనంత

వరకు ఆధ్యాత్మిక పరిధులలోకి వ్యాపిస్తుంది లబ్ధితో కూడిన భక్తి పూర్తిగా భౌతికం మతంలోనికి పతనమవుతుంది లబ్ధి మాతృకతో కూడిన మతం మతిని పోగొడుతుంది అంతే

ఏనాటికైనా ఆదర్శవంతమైన మతం రూపొందాలంటే అది చాల విశాల దృక్పథంతో కూడినదై అన్ని మనసులకు ఆహారమునిచ్చునదై ఉండాలి తాత్వికుని తాత్వికశక్తి, భక్తునికి ధ్యానశక్తి, ఆచారకర్మిష్ఠికి సమిష్ఠిభావం అట్టి మతమునకు వలసిన లక్షణములు

'ఈ విశాల దృక్పధానికి ఆర్ద్రతతో కూడిన హృదయం, చైతన్యముతో కూడిన మనస్సు, వివేకముతో (wisdom) కూడిన బుద్ధి కావలయును కాని మనసులు రానురాను యాంత్రికమై దిగజారిపోతున్నాయి అని విశ్వవిఖ్యాత తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి అన్నారు మనసులు ప్రవాహంలో కొట్టుకుపోతున్నాయి దానివాలన జీవితంలో ఎన్ని ఉన్నా తికమక ఏర్పడుతోంది (confusion) ఏదీ స్పష్టంగా ఉండదు దేనిని నమ్మాలో తెలియదు అందుచేతనే ఆలోచనా ప్రాధాన్యమును గుర్తించాలి మన జీవితానికి ఆలోచనే ఆధారం ఆలోచనకు మనస్సు మూలం కాని ఆలోచనలు ఎన్నడూ సంపూర్ణం కావు అందుచే ఆలోచనలను బట్టి నడిచే జీవితం కూడ అసంపూర్ణమే అవుతుంది సంపూర్ణమైన ఆలోచనలతో జీవితం సఫలం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాం ఆ విధంగా జీవితం ఒక నిరంతర పోరాటం అయింది మన లోపాలను, ఈ పోరాటాన్ని అంతం చేయాలి అది ఎటుల సాధ్యము? మనలను మనం అర్థం చేసుకున్నపుడే అది సాధ్యము ఈ అర్థం చేసుకొనటం ఎవరో చెప్పినటుల కాదు మనలను మనం అద్దంలో చూసి అర్థం చేసుకోవాలి అని జిడ్డు కృష్ణమూర్తి అన్నారు

అద్దంలో చూచినపుడు "మీలో కనబడు మూర్ఖత్వం, వికారరూపం, ఆదుర్దా, సంకుచితత్వం మొదలైనవి కనబడితే అద్దంలో మిమ్ములను నిర్భయంగా

చూడండి విచారణ చేయండి" అని కృష్ణమూర్తి అన్నాడు కృష్ణమూర్తి ప్రవక్త కాదు, గురువు కాదు కాని అతడు ప్రవక్త కాని ప్రవక్త గురువు కాని గురువు అయాడు ఆయన ఏ మతాన్ని స్థాపించలేదు, ఏమీ బోధించలేదు కృష్ణమూర్తి తాత్వికుడు కాని మనకు తెలిసిన తాత్వికుల వంటివాడు కాదు అతడు ఒక ప్రత్యేక తత్త్వవేత్త అతడు ఏ తత్త్వచింతనకు వారసుడు కాదు నిత్యసత్యాన్వేషి కృష్ణమూర్తి వేలాది శిష్యులకు గురువై జె కేగా, కృష్ణాజీగా విశ్వఖ్యాతి గడించాడు

ఆయనది స్వతంత్ర చింతన (ఆలోచన) స్వతంత్ర చింతననే ప్రేరేపించాడు మనను గురించి మనం విచారణ చేసుకోవడంలో ప్రపంచము నుండి మనలను వేరుచేసుకోనక్కరలేదు ఎవరికి వారు తమ ఉనికిని (స్థితిని) అర్థం చేసుకుంటే తమని తాము అర్థం చేసుకున్నట్లు అగునని కృష్ణమూర్తి చెప్పాడు తాను ఎలా ఉన్నాడో అలాగే అర్థం చేసుకోవాలి కాని ఉందామనుకున్నట్లుగా కాదు మనస్సు హృదయాల గమనం పరిశీలించటానికి స్వేచ్ఛ గల మనస్సు ఉండాలి పరిపూర్ణమైన స్వేచ్ఛగల మనసే కృష్ణమూర్తి తత్త్వప్రధానాంశము ప్రతిదానిని అంగికరించడమో లేక అంగీకరించకపోవడమో చేసే మనసు కాదు వాద ప్రతివాదాలను జాగ్రత్తగా అనుసరించే మనసు కావాలి ఇది చాల కష్టసాధ్యం ప్రతిదానిని సరళంగా, సరిగా చూడగలగడం కష్టమైన పని అన్నాడు 'నన్ను నేను ఎరుగుదును' అని ప్రారంభిస్తే మనలను మనం ఎన్నడూ తెలుసుకోలేము 'నేను-నాది' అను భావం ఉన్నంతవరకు మనం ఒక చట్రంలో ఇరుక్కుపోతాము ఈ చట్రంలో కుల, మత, వర్గ, సంప్రదాయ, ఆచార మొదలైన ఒత్తిడులు ఉంటాయి వాటి ప్రభావాలకు లోనై మనం నిబద్ధులమై పోతాము (controlled) అసలు మనం నిబద్ధులమై ఉన్నామా అని ముందుగా ప్రశ్నించుకోవాలి అంటాడు దానికి సమాధానం సాధారణంగా తెలియదు కష్టసుఖాలలోనే అది తెలియును అంటాడు పరిస్థితులను నిందిస్తూ కాలం గడిపే ప్రవృత్తి మన అందరిలోను ఉంది మన ఇబ్బందులను యితరులకు, పరిస్థితులకు, ఆర్థిక ఒత్తిడులకు అంటగట్టటానికి

ప్రయత్నిస్తాము అని కృష్ణమూర్తి అభిప్రాయం ఈ చికాకులకు అలవాటుపడి మన మనసు బద్ధకంగా తయారవుతుంది మనం పెరిగిన వాతావరణానికి అనుగుణంగా స్పందనలు, ప్రతిస్పందనలు చేస్తూ వుంటాము అవి మరింత కట్టుబాట్లను కలుగజేస్తాయి గతం నుండి మనం విడివడాలి అంటాడు

మనసులో ఒక సమూలమైన పరివర్తనం జరిగి మానసిక విప్లవం రావాలి అంటాడు ఈ విప్లవానికి సిద్ధాంతాలు ఉండవు ఈ విప్లవం ద్వారా ఎవరికివారు మానసిక వికాసం (awareness) సాధించాలి అన్నాడు సర్వతోముఖ వికాసం ద్వారానే మానసిక పరివర్తనం వస్తుంది ఈ విప్లవం ఒక్క ఆలోచనలోనే కాకుండా, మొత్తం మనసులోనే జరగవలసియున్నది జీవిత విధానాన్ని అంతా అర్థం చేసుకోవాలి అందులో ఒక కార్యాచరణ రావలసిన అవసరం ఉంది అంటాడు సంస్కరణలు సమస్యలకు తాత్కాలిక పరిష్కారాలే తప్ప జీవితంలోని క్లిష్ట సమస్యలకు పరిష్కారాలు కాలేవు మానవ స్వభావం క్లిష్టమైంది దానిని అవగాహన లేకుండా సంస్కరణలు జరిపితే పరిస్థితి అస్తవ్యస్తమై మరికొన్ని సంస్కరణలకు దారితీస్తుంది ఈ సంస్కరణలకు అంతుఉండదు దీనివలన పరిపూర్ణమైన పరివర్తనం జరగదు అందుకు మనసులోనే పూర్ణ విప్లవం రావాలి మానసిక పరివర్తనంతోనే ఈ విప్లవం వస్తుంది ఈ విప్లవం ఒక్క ఆలోచనలోనే కాకుండ మొత్తం మనసులోనే రావాలి ఆలోచన అనేది ఒక ఫలితం కాని మూలం కాదు

లోతుగా విచారణ చేయడం, నేర్చుకొనడం మనసు చేసే పని నేర్చుకొనడం అంటే జ్ఞానమును జమ చేయటం కాదు స్పష్టంగాను, హేతుబద్ధంగాను భ్రాంతి లేకుండా ఆలోచించగలగటమే నేర్చుకొనుట జ్ఞానం సంపాదించడం నేర్చుకొనడం కాదు, అవగాహన సంపాదించటమే నేర్చుకొనటం నిర్బంధం లేనపుడే నేర్చుకొనటం సాధ్యమగును అంటాడు దీనికి మనసు వికాసం చెందాలి మనసుకు తన అసలు స్థితిని గురించి అవగాహన

(awareness) ఉండాలి అసలు స్థితి అంటే సంప్రదాయ బద్ధత, లోపలి ప్రేరకాలు, వ్యాపకాలు గల, క్రమశిక్షణకు లోనగు మనసు, స్వేచ్ఛ గల మనసు కాదు కోర్కెలను అణచివేయకూడదు కోర్కెల పూర్తిరూపమును అర్థం చేసుకొన్నపుడే మనస్సుకు విముక్తి కలుగుతుంది స్వేచ్ఛ గల మనసే వికాసం పొందుతుంది జ్ఞాపకశక్తి మాత్రమే కలిగిన మనస్సు ఆధునిక కంప్యూటర్ వంటిది మేధస్సు ఉపయోగించి హేతువాదాలు చేస్తుంటాం కాని మానసిక ప్రేరణలు, ఉద్వేగాలు అంతకంటే బలమైనవి వీటిని అణగద్రొక్కితే మనసు వికాసం చెందదు మానవుని పరిపూర్ణ వికాసం కోసం కావలసింది జ్ఞాపకశక్తి గల కంప్యూటర్ వంటి మనసు కాదు, ధృఢమైన మనసు ధృఢమైన మనసే వికాసంతో పరివర్తన పొందుతుంది

మనస్సుకు సున్నితత్వం (sensitivity) ఉండాలి అంటే ప్రేమించగలిగి ఉండాలని కృష్ణమూర్తి భావం సున్నితత్వం అంటే ప్రేమ కలిగి ఉండటం 'ప్రేమ' అంటే మామూలుగా మనం అనుకునే ప్రేమ అనే మాట కాదు ప్రేమ అంటే ఏ ఒకరియందో ప్రేమ అని కాదు పూవు నుండి సువాసన వచ్చినట్లు ప్రేమ సహజ స్వభావం కావాలి జ్ఞానం ద్వారా పొందేది కాదు ప్రేమ ప్రేమతత్వంతో అత్యాశ నశిస్తుంది మనసు నిర్మలం చేయు శక్తి ప్రేమకి ఉంటుంది నడవడికలో సంస్కారం అంటే ఒత్తిడుల వలన కలిగేది కాదు ప్రేమ అను స్వభావం వలన అప్రయత్నంగా కలిగేదే సంస్కారం ఈ సంస్కారం వలన చిన్నచిన్న సమస్యలను చిత్తస్థయిర్యంతో పరిష్కారం చేయవచ్చు ప్రేమ అంటే కామ సంబంధమైన భావాలు కాదు ప్రేమతత్వం వలన మానసిక సున్నితత్వమును మేల్కొల్పవచ్చు అంతేకాక శరీర అవయవాలన్నీ వికాసం చెందాలి శరీరం మనసు యొక్క ఉపకరణం కాదు శరీరం, మనసు, ఉద్వేగాలు కలిసి సంపూర్ణమానవుడు అంటాడు కృష్ణమూర్తి అందువలన ఇవి సమపాళ్లలో కలవాలి అంటాడు ఇవి సమన్వయం చెందినపుడు మనసు చేతనత్వం (consciousness) లోని లోపలి పొరలను తరచిచూడటం

సాధ్యపడును అంటాడు

మనసు వికసించాలంటే ఏకాగ్రత కాదు ప్రధానం అంటాడు సావధానత (లేక) శ్రద్ధకు ప్రాధాన్యం ఇవ్వాలి ఏకాగ్రత అంటే ఒక బిందువు మీద మనసు లగ్నం చేయటం అది ఒక రకమైన నిర్బంధం దానితో మనసు కుంచించును సావధానత లేక శ్రద్ధ పరిమితులు లేని విశాలత్వం దాని వలన మనసు యొక్క పరిపూర్ణత్వాన్ని అవగాహన చేసుకొనవచ్చును ఏకాగ్రత ద్వారా జ్ఞానం వస్తుంది కాని జ్ఞానమును ఉపయోగించుకొనటం శ్రద్ధ వలనే సాధ్యమగును నేర్చుకొనటం శ్రద్ధవలనే సాధ్యం కాని మనస్సుకు నిర్బంధాలు ఏవీ ఉండకూడదు జ్ఞానం అవసరమే కాని అదొకటే గమ్యం కాదు సంపూర్ణ మానవునిగా వికాసం చెందడమే గమ్యం శ్రద్ధ నేర్చుకుంటే వచ్చేది కాదు భయం, అభద్రతాభావం తొలగినపుడు శ్రద్ధ దానంతట అదే వస్తుంది

అందరిలో సాధారణంగా ఉండేది అసంతృప్తి ఈ అసంతృప్తిని తొలగించుటకు మార్గం వెతుకుతుంటాము తృప్తి కలిగినపుడు మనసు నిద్రిస్తుంది తిరిగి అసంతృప్తి కలిగినపుడు మేల్కొంటుంది మనసు ఈ తృప్తి అసంతృప్తి చక్రంలో ఇరుక్కుంటుంది అసంతృప్తి అంటే కృష్ణమూర్తి చెప్పిన అర్థం వేరు మనసు తను ఉన్న స్థితిని గూర్చి యదార్థమును తెలుసుకుని ఇంకా తెలుసుకోవాలని తపనపడు స్థితిని అసంతృప్తి అన్నాడు ఉన్న స్థితిని దాటి వెళ్లుటకు చేయు 'చలనం' లేక ప్రయత్నం అసంతృప్తి అంటాడు అసంతృప్తి తృప్తిని కాల్చివేస్తుంది అసంతృప్తి కోరికలను ఎక్కువజేస్తుంది దానితో అసూయ పుడుతుంది కాని కృష్ణమూర్తి చెప్పిన అసంతృప్తి ఇది కాదు ఇందు అసూయ ఉండదు అత్యాశ ఉండదు ఈ అసంతృప్తిలో కోరికలుండవు ఇది ఏ కల్మషం లేని స్థితి ఈ అసంతృప్తి స్వభావం అర్థం చేసుకుంటే శ్రద్ధ అనేది ఇందులోని ఒక భాగం అని తెలుస్తుంది అంటాడు కాబట్టి స్వార్థప్రయోజనాలకు తృప్తి పొందటం వంటి వాటి మీద ఆధారపడని శీలమే శ్రద్ధ అంటాడు ఈ శ్రద్ధ

చిన్నతనం నుండే అలవర్చుకోవాలి ప్రేమభావం ఉన్నపుడు అడ్డుగోడలు తొలగి (సావధాన) శ్రద్ధాస్థితి (attention) కలుగును అంటాడు

మానవునికి సర్వతోముఖ వికాసం కలగాలంటే అతని మనస్సు "చేతనావర్తము"తో (conscious mind) పాటు "అచేతనావర్తము" ను (unconscious mind) గూడ తప్పక పరిగణనలోనికి తీసుకోవాలి అని జిడ్డు కృష్ణమూర్తి అంటాడు అచేతన మనస్సును అర్థం చేసుకోకుండ చేతన మనస్సు మీదనే ఆధారపడితే జీవితంలో 'స్వయంవైరుధ్యాలు' (self contradictions) ఏర్పడతాయి అంటాడు చేతన మనస్సు పై పై పొరలకు సంబంధించినది లోపల దాగిఉన్న మనసు పొరలు పై పొరల కంటే అత్యంత ప్రధానమైనవి అంటాడు ఈ దాగి ఉన్న మనసు 'అజ్ఞాత మనసు' (unconscious mind) పై మనసు ఎంత శిక్షణ పొందినా, ఎంత సర్దుకొనిపోయే సమర్థత కలిగిఉన్నా, అజ్ఞాత మనసు అంతకంటే చాల శక్తివంతమయినది ఈ అజ్ఞాత లేక అచేతన మనస్సు ఒక తేనెతుట్టె వంటిది అందులోనే ఆశలు, ఆశయాలు, ఆశాభంగాలు, భయాలు, ఆచారాలు గట్టిగా వ్రేళ్లు పాదుకొని ఉంటాయి ఈ అజ్ఞాత మనసు గతకాలపు మిగిలిన స్మృతులను భద్రపరచటమే కాక భవిష్య జీవితాన్ని ప్రభావితం చేయగల శక్తి కలిగి ఉంటుంది మతవిశ్వాసాలు, మూఢనమ్మకాలు కూడ ఇక్కడే భద్రంగా ఉంటాయి చేతన మనస్సు తీరికగా ఉన్నపుడు స్వప్నములు మొదలైన వాటి ద్వారా అచేతన మనసు తనలో ఉన్నవాటి సూచనలను చేతన మనసుకు అందజేస్తుంది

అజ్ఞాత మనసు అపవిత్రమైనదీ కాదు, భయపడవలసినదీ కాదు అజ్ఞాత మనసు (unconscious mind) అత్యంత శక్తివంతమగుట వలన చేతన మనసు తన ఇచ్ఛను దానిపై రుద్దలేదు వాస్తవానికి చేతన మనస్సులోని భాగమే అజ్ఞాత (అచేతన) మనసు అయినా అజ్ఞాత మనసుతో పోల్చినపుడు చేతన మనసు చాల బలహీనమైదని చెప్పాలి అంటాడు చేతన మనసు అజ్ఞాత

మనసును పైపైన స్పృశించగలదే కాని దానిలో ప్రవేశించలేదు ఈ రెంటికి మధ్య వైరుధ్యం తప్పనిసరిగా ఉంటుంది "ఈ రెంటికి మధ్య వంతెన కట్టడం అసాధ్యం" అంటాడు చేతనావస్థలో (conscious state) నున్న మనసు పూర్తిగా వర్తమానంతో నిండి ఉంటుంది కాని అచేతన మనసులో ఎన్నో శతాబ్దాల బరువు ఉంటుంది అంటాడు అచేతన (unconscious mind) మనసును ఆపడం కుదరదు అచేతన మనసుకు 'కాలతత్వం' ఉంటుంది చేతన మనసు అచేతన మనసుకు అపుడపుడు కలుగు అవసరాలకు అనుగుణంగా ప్రవర్తించలేదు రెంటికి మధ్య వైరుధ్యాలను తొలగించాలంటే పై పొరకు చెందిన చేతన మనస్సు తాను అచేతన మనసుకు అనుగుణంగా ప్రవర్తించలేను అను సత్యమును తెలుసుకోవాలి అలాగని అజ్ఞాత (అచేతన) మనసు ప్రేరణలను అంగీకిరంచమని కాదు కాని రెంటికి మధ్య వైరుధ్యం తొలగిస్తే అజ్ఞాతమనస్సు వర్తమానంలోకి ప్రవేశించదు అపుడు చేతన మనసుకు స్థిమితం దొరుకుతుంది వైరుధ్యం ఉంటే రెంటికి మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది వర్తమానానికి గతకాలానికి మధ్య గండి పెద్దదవుతుంది

అజ్ఞాత మనసుని అర్థం చేసుకోవడమే అన్నిటికంటే ప్రధానమైనది అంటాడు కృష్ణమూర్తి అపుడే వివేకం కలుగుతుంది అంటాడు పై పొర మనసును (చేతన మనసును) మేల్కొల్పాలి అజ్ఞాత మనస్సును గూడ అర్థం చేసుకోవాలి అజ్ఞాత మనస్సును అర్థం చేసుకుంటే వరుసగా వచ్చు సుఖదుఃఖాలతో కూడిన వైరుధ్యం ఉండదు అంటాడు అజ్ఞాత మనస్సు పనిచేసే విధానం తెలుసుకోవాలి కాని దానిలో పూర్తిగా మునిగి పోకూడదు పై పొరకు చెందిన చేతన మనస్సు అజ్ఞాతమును అర్థం చేసుకొనగలిగితే మనసు వికసిస్తుంది అపుడు కాలమునకు అతీతమైన ఆనందమును మనసు గుర్తిస్తుంది అంటాడు

కృష్ణమూర్తి చెప్పిన మనసును గురించిన వాదమునకు ఎక్కడా

ఆధారములు లేవు  అది ఆయన సృష్టి  కృష్ణమూర్తి చెప్పింది మనస్సుకు స్వేచ్ఛ  ఎవరు చెప్పినదైనా గుడ్డిగా నమ్మకూడదు  నియమాలను దాటి నిర్ణయ స్వేచ్ఛ (Man's free will) గల మనసే జిడ్డు కృష్ణమూర్తి వాంఛించినది అంతిమ నిర్ణయం ఎవరిది వారిదిగానే ఉండాలి  మనసు చాల విచిత్రమైనది అది ఆలోచనల ప్రవాహం  ఆలోచనలను నిగ్రహించకూడదు  ఆలోచనలు ఎలా వస్తున్నాయో తెలుసుకోవాలి  మనసులో వచ్చెడి ఆలోచనలను వాటిని గురించి ఎరుక సంపాదించాలి (awareness)  మనస్సు వ్యాపారము (పని), కోరికలను తెలుసుకోవాలి

శాశ్వత సంపూర్ణ సత్యమును అన్వేషించుటయే కృష్ణమూర్తి ధ్యేయము సమస్త భయాల నుండి విముక్తి కలిగినపుడే సత్యం గోచరిస్తుంది అంటాడు ఎవరికి వారు సర్వస్వతంత్రులు, నిబద్ధతలు (controls) లేని వారు కావాలి తనను ఒక మతంగా గుర్తించరాదు అన్నాడు  మనిషిని బయట నుండి ఎవరూ స్వతంత్రుడుగా చేయరు  ఆనంద సామ్రాజ్యపు తాళం చెవి ఎవరికివారే అవుతారు  ఆత్మ అభ్యున్నతితోనే ఆనంద సామ్రాజ్యపు తలుపులు తెరుచుకుంటాయి అన్నాడు  ఆ ఆనంద సామ్రాజ్యం పొందినవాడే సత్యస్వరూపుడు  మనలను మనం పూర్తిగా తెలుసుకొనటమె సత్యమును తెలుసుకొనటం

జీవితమును చదవటమే అసలైన విద్య అన్నాడు  అన్ని భయాలకు కారణం కోరికలు  వాటి వలన మనసు నిర్మలత్వమును కోల్పోతుంది  భయం ఏర్పడుతుంది  రానిది రాదేమో, ఉన్నది పోతుందేమో, కోరుకున్నది దొరకదేమో, ఈ ఆందోళనలే భయాలు  వీటిని పోగొట్టు విద్యయే సరియైన విద్య  అన్నీ ప్రశ్నించి తెలుసుకోవాలి  దీనికి చాల ధైర్యం కావాలి  ప్రశ్నించడం నేర్పనిది విద్య కాదు  మనిషికి సంపూర్ణ స్వాతంత్ర్య అనుభవాన్ని ఇచ్చేదే అసలైన విద్య స్వాతంత్ర్యం అంటే అర్థంలేని నిబంధనల నుండి, సంఘం, మతం,

సంప్రదాయాల ప్రభావం నుండి విముక్తి భవిష్యత్తు, కీర్తి, ప్రతిష్ఠ మొదలగు వాటిని గురించిన ఆందోళనల నుండి విముక్తి విముక్తి కావాలంటే ముందు వాటిని గురించి ఎరుక (awareness) కలగాలి వాంఛలు నశిస్తే అదే స్వాతంత్ర్యం

సాంకేతికంగా మనిషి అద్భుతమైన పురోగతి సాధించాడు కాని మనిషిగా ఏ ప్రగతీ సాధించలేదు అధికార వ్యామోహం, కీర్తికండూతి, ప్రతిష్ఠకు ప్రాకులాట, వాటికై ఆందోళన, క్రూరత్వం, నీచత్వం ఇవి ఇప్పటికీ మనిషిలో ప్రబలంగానే ఉన్నాయి అతని స్వభావంలో మార్పురాలేదు ప్రతి వ్యక్తి తన మనసును గురించిన సత్యం తెలుసుకుంటే పరివర్తనకు మార్గం సులువవుతుంది స్వేచ్ఛను సాధించటమే జీవిత లక్ష్యం కావాలి ఈ లక్ష్యమును ప్రతి ఒక్కరు స్వయంగా చేరుకోవాలి అని కృష్ణమూర్తి తత్వం సత్యమును దర్శించాలి అనేది ఆయన బోధన దేనినీ గుడ్డిగా నమ్మవద్దు అని ఆయన బోధనలో ప్రధానాంశం అంతిమ నిర్ణయం ఎవరిది వారిదే కావాలి జిడ్డు కృష్ణమూర్తి వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, శంకరుని అద్వైతం, బౌద్ధం, తుదకు భగవద్గీత అన్నీ తిరస్కరించాడు ఎవరి మార్గం వారే నిర్ణయించుకోవాలి ఏ ఒకరు మరొకరిని ఉద్ధరించలేరు నిబంధనలను దాటి నిర్ణయం పొందాలి అన్నాడు

జిడ్డు కృష్ణమూర్తి కర్మసిద్ధాంతమును గాని, వేదాంతమును గాని అనుసరించలేదు వ్యక్తి తనను గురించి తాను సత్యమును తెలుసుకోవాలి అన్నాడు ఇది మనసు ద్వారా జరగాలి అంటే మనసును మనసు తెలుసుకోవాలి వేదాంతం కూడ సత్యమును (సత్) తెలుసుకొనమంది కాని ఈ సత్యం మనసును గురించి కాదు మనసుకు ఆవల లోపలనున్న ఆత్మను గురించి అదే మనలను గురించి మనం తెలుసుకోవటం అలాగే గత కర్మ సంస్కారములు కారణ శరీరము నుండి ప్రసారమై మనసు ద్వారా అనుభవములోనికి వచ్చును అని కర్మ సిద్ధాంతము చెప్తుంది జిడ్డు కృష్ణమూర్తి

తత్వం కూడ అజ్ఞాతమనసు శతాబ్దాల భారం మోస్తుంది అంటుంది అంటే గతజన్మ స్మృతులు లేక సంస్కారములు (impressions) అన్ని అజ్ఞాత మనస్సునందు ఉండుననియే గదా! కృష్ణమూర్తి మానసిక వికాసము, వ్యక్తి స్వభావ పరివర్తనమునకు ప్రాధాన్యం ఇచ్చాడు దీనినే విప్లవం అన్నాడు సందర్భవశమున కృష్ణమూర్తి తత్వమును గురించి చెప్పడం జరిగింది ఇది పూర్తి విశ్లేషణ కాదు ఇది కృష్ణమూర్తి తత్వమును గూర్చిన అతిసంక్షిప్త వివరణ మాత్రమే ఇంకా తెలుసుకోవాలంటే ఆయన ఉపన్యాసాలు చదవాలి

నిబంధనల నుండి విముక్తి కావాలంటాడు మనసుకు స్వేచ్ఛ కావాలి అని కృష్ణమూర్తి అంటాడు ఆయన తత్వంలో ఏకాగ్రతకు స్థానం లేదు సావధానత (లేక) శ్రద్ధకే ప్రాధాన్యం ఇవ్వబడింది (attention) వేదాంతంలో ఏకాగ్రతతో కూడిన ధ్యానయోగమునకు ప్రాధాన్యం ఇవ్వబడింది వ్యక్తి సుఖదుఃఖాలు మానసిక స్పందన (response) మీదనే ఆధారపడి ఉంటాయి కాబట్టి మనసు స్వభావం, దాని చలన విధానము (mode of functioning) తెలుసుకోవాలని వేదాంతం చెప్తుంది వ్యావహారికంగా చెపితే మనసుతో స్నేహం చేయాలని వేదాంత భావం

మనసు చాల నిగూఢమైనది జీవితంలో అనేక సమస్యలకు మనసే కారణం అంటున్నారు ఇపుడు అందువలన మనస్తత్వశాస్త్రము (Psychology) వైద్యమనోవిజ్ఞానశాస్త్రము (Clinical Psychology) మానసిక రోగ చికిత్సా విధానము (Psychiatry) ఇలా అనేక విధాలుగా మనసును గురించిన శాస్త్రము అభివృద్ధి చెందుచున్నది పరిపూర్ణ ఆరోగ్యమునకు (Holistic health) రోగలక్షణములు, శరీరస్థితి మాత్రమే కాక మానసిక స్థితి, స్వభావమును కూడ పరిగణనలోనికి తీసుకోవాలని అంటున్నారు శరీర క్షేమమునకు మానసిక వికాసము ఎంతో అవసరమని వేదాంతం కూడ చెప్పుచున్నది మనసు ఒక సారవంతమైన క్షేత్రం (భూమి) వంటిది అట్టి భూమిని సాగు చేయకపోయినచో

అది బీడువారిపోవును మనసు కూడ అట్టిదే సాగు చేయని భూమిలో ముళ్లపొదలు, పిచ్చిచెట్లు పెరుగును మనసు కూడ స్వేచ్ఛకు, బంధములకు కూడ మూలము అగుచున్నది మన మానసిక స్థితి మీదనే మన సుఖదుఃఖములు, జ్ఞానము అజ్ఞానము, వివేకము అవివేకము, శక్తి అశక్తి ఆధారపడి ఉండునని వేదాంతం చెప్పుచున్నది మనసు స్థూల శరీరము కంటే భిన్నమైనది అదే విధంగా అది జీవాత్మ కూడా కాదు అత్మజ్ఞాని (తెలుసుకొనునది) (knower) మనసు జ్ఞానమునకు సంబంధించిన వస్తువు (జ్ఞానము కలది) (object of knowledge) బయటనున్న వస్తువులను చూచినట్లే మనసును కూడ చూడవచ్చు అంటుంది వేదాంతం ఆత్మ మనస్సు కంటే ఇంద్రియముల కంటే భిన్నమైనది పనిచేయునవి ఇంద్రియములుగా కనబడును కాని ఇంద్రియముల ద్వారా పనిచేయునది ఆత్మ దృష్టి కన్నులది కాని చూచేది ఆత్మ అటులే ఆత్మ మనసును కూడ చూచును మన మనసును మనము అంతర్దృష్టితో (introspection) ప్రత్యక్షముగా చూడవచ్చును జిడ్డు కృష్ణమూర్తి గూడ మన మనసును మనం తెలుసుకొనవచ్చును, తెలుసుకోవాలి అన్నాడు ఇతరులు మన మనసును పరోక్షముగా మాత్రమే (indirectly) తెలుసుకొనగలరు

మనసు జ్ఞానమునకు సంబంధించిన వస్తువు అగుటచే అది చేతనము కాదు చేతనత్వం జీవాత్మలో ఉండును (consciousness) మనస్సు చీకటి, అది ఒక వస్తువు అని వేదాంతం అంటుంది పాశ్చాత్య తత్వశాస్త్రంలో మనసు వస్తువు లేక పదార్థము కాదు మనసే జీవాత్మగా భావించబడింది ఈనాడు మరొక క్రొత్తవాదం మొదలైంది మనసును భౌతిక శరీరముగా గుర్తిస్తున్నారు నిజానికి మనసు శరీరం కాదు, ఆత్మ కూడ కాదు పాశ్చాత్యులు శతాబ్దాల నుండి మనసును ఆత్మగా గుర్తిస్తున్నారు లేక భావిస్తున్నారు కాని పాశ్చాత్యమతం (క్రైస్తవం) ఆత్మ, మనసు, శరీరములకు గల భిన్నత్వమును విశ్వసిస్తోంది కాని పాశ్చాత్య తత్వశాస్త్రంలోను మనస్తత్వశాస్త్రంలోను మనసుకు ఆత్మకు భేదం లేదను వాదమే కనబడుతుంది

వేదాంతంలో మనసు, హృదయం, చిత్తం (బుద్ధి) కలిపి అంతఃకరణం అన్నారు నిజానికి హృదయం, చిత్తం కూడ మనసులోని భాగాలే కాబట్టి మనసునే అంతఃకరణం అనవచ్చు ఇది అంతర అవయవము (internal organ) అనవచ్చు అసలు మనసు అవసరమేమున్నది పనులు బాహ్య ఇంద్రియాలు చేస్తాయి ఫలం ఆత్మ పొందుతుంది మధ్యలో మనసు పని ఏముంది ఉదాహరణకు ఒకరు మాట్లాడుతుంటే మనం వింటున్నాం మాట్లాడు మనిషి కనబడుతున్నాడు, అతని మాటలు వినబడుతున్నాయి కాని హఠాత్తుగా మన మనసు చలించి ఆలోచన ఎటో పోయింది మనం అక్కడే ఉన్నాము అతడు మాట్లాడుతూనే ఉన్నాడు మన కళ్లు చూస్తూనే ఉన్నాయి, చెవులు వింటూనే ఉన్నాయి కాని అతన్ని మనం గమనించం, ఆ మాటలు వినబడవు అంటే బాహ్య ఇంద్రియాలకు ఆత్మకు మధ్య మనసు అడ్డుపడింది ఇచట మన శరీర గమనంలో ఒక బాహ్య వస్తువు, మన బాహ్య ఇంద్రియము, ఆ విషయము గ్రహించు ఆత్మ, మధ్యలో మనస్సు ఇన్ని ఉన్నాయని తెలుస్తుంది కాబట్టి మనసు బాహ్య ఇంద్రియముల కంటే భిన్నమైనది, ఆత్మ కంటే కూడ భిన్నమైందని తెలుస్తోంది మనసును అంతరిక దృష్టి (internal perception) అనవచ్చు కళ్లతో బాహ్య వస్తువులను చూచినట్లే కళ్లు మూసుకుని మనసుతో ఎన్నో చూడవచ్చు బాహ్యదృష్టి ఎంత అవసరమో, జీవితంలో అంతర్దృష్టి కూడ అంతే అవసరము మన ఇష్టాయిష్టాలు, సుఖదుఃఖాలు, ఆశనిరాశ, రాగద్వేషాలు, ఇవి యదార్థములే కాని కళ్లకు కనబడవు మనసుకు మాత్రమే కనబడతాయి అంటే తెలుస్తాయి దీనిని బట్టి భౌతిక శరీరము కంటే మనసు భిన్నమైందని తెలుస్తోంది ఇవి మనసు ప్రాథమిక లక్షణములని వేదాంతం కూడ అంగీకరించింది మనసుకు చేతనశక్తి ఉన్నది (Force of consciousness), కాని మనసు చేతనం కాదు అంటే స్వయంచేతనత్వం లేదు మనసు ఆత్మకంటే భిన్నమైనది, కాని మనసుకు ఆత్మకి సహచర్యము ఉన్నది చేతనత్వము ఆత్మది కాని ఆత్మ స్వయంగా చేతనత్వము (activity or

consciousness) ప్రదర్శించదు ఆత్మ తన చేతనత్వమును మనసు ద్వారా ప్రసరించును అంటే ఆత్మజ్యోతి మనసు ద్వారా ప్రతిఫలించును ఆత్మమూలం, మనసు ప్రతిబింబం మనసు పలుచని ద్రవం వంటి పదార్థం (rarefied matter) అన్నారు అందువలననే సూక్ష్మశరీరం నశించినను మనసు అన్ని ఇంద్రియ లక్షణములతో నిలిచియుండి కారణశరీరముతో (astral body) సహయోగము చెందును

నిజానికి అనుకంపనలు (feelings) ప్రతిస్పందనలు (responses) అనుభవం (experience) పొందేది ఆత్మ కాని వాటిని మనసు ద్వారా పొందుతుంది ఉదాహరణకు విద్యుత్తు తీగ ద్వారా ప్రసరించి బల్బును చేరితే బల్బు వెలుగుతుంది వెలిగేది తీగకాదు విద్యుత్తు అను శక్తి తీగకు ఆ వెలిగే శక్తి లేదు కాని ఆ శక్తిని తన ద్వారా ప్రసారం చేస్తుంది అదే విధంగా అనుకంపనలు (feelings), అనుభవాలు, స్పందనలు (responses) పొందేది మనసు కాదు కాని ఆత్మ చేతనత్వము మనసునందు ప్రతిఫలించుట వలన అవి మనసు పొందునట్లు అనిపించును, వాటికి అనుగుణముగా ప్రవర్తించుటకు మనసుకు శక్తి కలుగును అందుకే మనసుకు నాలుగు విధములైన పనులున్నాయని వేదాంతం అంటుంది వ్యక్తి ఏదైనా ఒక వస్తువును చూచినపుడు దానిని గుర్తించుటకు నాలుగు దశలుండును అన్నారు ముందుగా అది ఏమిటి, అని ఆలోచిస్తుంది ఈ ఆలోచన దశను (deliberations) మనసు అన్నారు తరువాత అట్టి వస్తువును గురించి గత స్మృతులను అన్వేషించి ఆ వస్తువును గుర్తించును ఈ గుర్తించటం లేక జ్ఞాపకం చేసుకొనటం దశను 'చిత్తము' (recollection) అన్నారు (చింతన) అటుపై అది ఫలాని వస్తువని నిర్ణయించటం జరుగుతుంది (determination) ఈ దశను బుద్ధి అన్నారు చివరకు 'ఇది నాకు తెలుసు' అను దశకు చేరుతుంది దీనిని 'అహంకారము' (Ego) అన్నారు వేదాంత శాస్త్రంలో మనసును గత సంస్కారములకు (impressions) స్థానముగా భావించబడింది ఇవి ఒక వస్తువును, లేక వ్యక్తిని

గురించి కావచ్చు, మన గత చర్యల (activities) జ్ఞాపకములు, లేక ముద్రలు కావచ్చు వీటినే సంస్కారములు అని కూడ అనవచ్చు కర్మల వలన ఏర్పడు సంస్కారముల వలన మన స్వభావము (ప్రవృత్తి) రూపొందును ఈ సంస్కారముల వలన కలిగిన స్వభావముతో ఒక పనిని గతంలో చేసిన విధంగానే తిరిగి చేస్తాము ఈ సంస్కారములకు మనసు ఒక నిల్వ గది లేక గిడ్డంగి (store house) వంటిది వేదాంతంలో మనసుకు స్థితులే చెప్పారు కాని భాగాలు లేక పొరలు చెప్పలేదు మేల్కొని ఉండు స్థితి, స్వప్నావస్థ, నిద్రావస్థ అన్నారు కాని చేతన (conscious) అచేతన (unconscious) భాగాలు అనలేదు ఏదైనా అర్థం ఒకటే

బయటపడిన సంస్కారములు మనసులోని చేతన (conscious) భాగమందుండును బహిర్గతం కానివి స్వప్న భాగమందు (subconscious) ఉండును చేతన భాగమందున్నవి అహంకార పరిధిలో ఉండును అచేతన (unconscious) భాగము అహంకార పరిధికి దూరంగా ఉండును కాని అహంకార పరిధి పెరిగినపుడు అచేతన భాగము కూడ బహిర్గతమగును ఆత్మజ్ఞాన సంస్కారములు అహంకారమునకు అతీతముగా నుండును అచేతన (అజ్ఞాన) (unconscious) మనస్సు నందు దుష్ట సంస్కారములు ఉండవచ్చు, మంచివి కూడ ఉండవచ్చు కాని ఈ అజ్ఞాత భాగమును గురించి భయపడవలసిన పనిలేదు అంటుంది వేదాంతం ఎందుకనగా చేతన భాగము స్వయంశక్తి గలది అది అచేతన భాగమును అధిగమించవచ్చును అని వేదాంతం చెప్తుంది కాని జిడ్డు కృష్ణమూర్తి తత్వంలో చేతన భాగము చాల బలహీనమైనది అజ్ఞాతమనసే శక్తివంతమైనది జిడ్డు కృష్ణమూర్తి మనస్సుకు పరిపూర్ణ స్వేచ్ఛ కావాలన్నాడు వేదాంతం కూడ మనసుకు స్వేచ్ఛనే కోరింది ఎందుకంటే ఆ స్వేచ్ఛతోనే అంతరదృష్టి, ఆత్మజ్ఞానము కలిగి స్వేచ్ఛానుభూతి పొందవచ్చును జీవన్ముక్తుని మనసుకు ఎంతో స్వేచ్ఛయుండును ఆదిశంకరాచార్యులు కూడ మనసును నియంత్రించమన్నారు గాని

నిరోధించమనలేదు ఆత్మనిగ్రహము (self-discipline) ద్వారా మనసు స్వచ్ఛమగును స్వచ్ఛమైన మనసు ఎపుడు స్వేచ్ఛగానే యుండును మానసిక వికాసమునకు వేదాంతం ధ్యానయోగమును చెప్పింది ధ్యానయోగము ద్వారా ఆత్మజ్ఞానము సిద్ధించవచ్చును కాని ధ్యానయోగమునకు ఏకాగ్రత కావాలి ఇక్కడే జిడ్డు కృష్ణమూర్తి విభేదించాడు కృష్ణమూర్తి ఏకాగ్రతను తిరస్కరించాడు సావధానత (శ్రద్ధ) (attention) కావాలన్నాడు ధ్యానయోగములో ఏకాగ్రత మానసికంగా పరమాత్మతో ఏకతాభావం కలిగించును అంతర్‌దృష్టి (introspection) వృద్ధిచెందును అంతరదృష్టి ద్వారా మనసును ఇంకా ఎక్కువ తెలుసుకొనుటకు సాధ్యపడును మనసును ఎంత ఎక్కువ అర్థం చేసుకుంటే దాని జిత్తులు అంత తక్కువగును ధ్యానయోగము ద్వారా మనసు పరిధి (range) పెరుగును అంతర్‌దృష్టి వికసించును అజ్ఞాతముగానున్న సంస్కారములు గోచరమగును ఈ అంతరదృష్టి ద్వారా మనలను మనం తెలుసుకుంటాము అపుడు ఆత్మనిగ్రహము సాధ్యపడును ఆత్మ నిగ్రహము (self discipline) సాధించినపుడు శరీరము, మనసు మన అధీనములో ఉండును అపుడు అజ్ఞాతముగానున్న సంస్కారముల ప్రభావము ఉండదు

### 7 కామం నేరమా?

'కామసూత్రాలు' అను పుస్తకం పేరు తెలిసినవారు, విన్నవారు, చదివినవారు కూడ ఎంతోమంది ఉండవచ్చు 'కామము'ను ఒక శాస్త్రముగా పరిగణించి ఆ శాస్త్రమునకు సూత్రరూపము ఇచ్చినవాడు వాత్స్యాయనుడు ఆ సూత్రగ్రంథమును వాత్స్యాయనుడి ఆశయమును గ్రహించి చదివినవారు ఎంతమంది? ఎంతో మంది ఉండరు అజన్మ బ్రహ్మచారిగా చెప్పబడిన వాత్స్యాయనుడు 'కామము'ను గురించి పరిశోధించి దాదాపు 1600 సంవత్సరముల క్రిందట రచించిన ఈ గ్రంథము ఒక మహాగ్రంథముగా (classic) నేటికీ స్థిరంగా నిలబడింది 'కామము'ను శాస్త్రంగా పరిగణించారు శాస్త్రం అంటే అందులోని విషయాలు కొత్తగా కల్పించబడినవి కావు అది ఎవరి స్వంతం

కాదు దర్శింపబడిన దానిని దర్శనం అన్నారు వేదాంతం ఒక దర్శనము శాస్త్రం కూడ దర్శింపబడినదే కాబట్టి దానికి వాస్తవమైన కర్త ఎవరు ఉండరు ఎందుకంటే శాస్త్రంలో చెప్పబడినవి అంతకు ముందే లోకంలో నిగూఢంగా ఉన్నాయి ప్రతిభ, వ్యుత్పత్తి కల ప్రజ్ఞావంతుడు వాటిని దర్శించగలుగుతాడు అలా దర్శించిన వారే ద్రష్టలు దర్శించిన సత్యములను సూత్రరూపములో ప్రపంచానికి వారు చాటారు శాస్త్రం లౌకికం కావచ్చు అలౌకికం కావచ్చు కామం లౌకికమే కాని అలౌకికార్థము అందులో ఉన్నది కామం ప్రకృతి రహస్యాలలో ఒకటి

కామం అనేది మానవ జీవితంలో విడదీయరాని ఒక భాగం 'కామం' అంటే తెలిసి స్పందించేవారు అతితక్కువ మంది అయితే 'సెక్సు' (sex) అనగానే స్పందించేవారు కోట్ల సంఖ్యలో ఉన్నారు భాషాభేదమైనా భావార్థం ఒకటే కాని 'సెక్సు' అనగానే ఉద్రేకం కలుగుతుంది కారణం ఆ పదానికి అంటగట్టబడిన మలినం

మనసును స్వాధీనంలో ఉంచుకునే విధానం ఉపనిషత్తులు చెప్తున్నాయి మనసు శక్తియుక్తులను గురించి, ఇంద్రియములను అధీనములో ఉంచుకొను విధమును గురించి యోగదర్శనం చెప్తుంది అలాగే కామశాస్త్రము స్త్రీపురుష సహజ సంబంధమును వివరిస్తుంది స్త్రీపురుష సంబంధమును చౌకబారుగా వివరించటం నేరం మానవ జీవితానికి ఇది ఆధారం ఈ సంబంధమును గూర్చి తరచి తెలుసుకున్న కొద్దీ జీవితసత్యం బోధపడుతుంది ఆహారం, నిద్రవలెనే జీవులందరికి కామం సహజం ఎవరైనా కామమును పూర్తిగా నిరోధించామని చెప్తే అది ఆత్మవంచన అనాలి ఎందుకంటే వయసుతో సంబంధం లేకుండ కామం మానవ జీవితంలో విడదీయరాని భాగం వారి మనసులోకి మనం తొంగిచూడగలిగితే సత్యం బోధపడుతుంది అందువలన కామమును నిరోధించాము అని చెప్పట కంటే ఆత్మనిగ్రహంతో దానిని

నియంత్రించుటకు ప్రయత్నిస్తున్నాము అంటే సత్యమునకు దగ్గరగా ఉంటుంది ఆత్మనిగ్రహంతో కామం అనుభవించినపుడు దానికి సార్థకత మనసుకు శాంతి, జీవితంలో సుఖం ఉంటాయి సామాన్య మానవుడికి 'కామ' పరిజ్ఞానం లేకపోవుట వలననే కామం మలినమై వెర్రితలలు వేస్తోంది వైద్యులు, మనస్తత్వ శాస్త్రజ్ఞులు కూడ ఇదే అంటున్నారు కామమును అణగత్రొక్కుటకు ప్రయత్నిస్తే అది వెర్రితలలు వేస్తుంది కామం ఒక ప్రకృతి సహజమైన కళ ఇతర కళల వలెనే దీనిని కూడ ఆరాధించి లైంగిక రహస్యాలను ప్రకృతి ధర్మాలుగా భావించి ఒక సహజధర్మంగా అనుష్ఠించాలి సహజ కామం అశ్లీలం కాదు, అసభ్యము కాదు కామం క్రమబద్ధంగా ఉంటే సుఖసంతోషాలకు కారణమవుతుంది

'కామ్యతే సర్వైరితికామం' అని అమరకోశం వ్యుత్పత్తి చెప్పింది అంటే అందరిచేత కోరబడేది కామం మానసికమైన అంతర్హేతువు వలన కామం కలుగును ఇది మానసికశాస్త్రం శారీరక శాస్త్రం కూడా కామం మనసులో అవ్యక్తంగా ఉంటుంది ఇదే సమస్త సృష్టికి మూలం కామం ఒక పురుషార్థం ఆనందహేతువు వాత్స్యాయనుడు కామశాస్త్రం రచించినపుడు కామం అంటే నేటి మలినార్థాలు లేవు కామం ఒక కళగానే ఆరాధించారు, ఆస్వాధించారు బహిరంగంగానే చర్చించుచుండెడివారని చరిత్ర చెబుతోంది కాలక్రమేణ కామశాస్త్రం నిగూఢం (mystery) గోప్యం (secret) అయినందు వలన నేడు అది 'సెక్సు' (sex) అను పేరుతో వికృతమై వెర్రితలలు వేసింది అది నేడు తృష్ణ (దాహం)గా మారింది సహజకామం తృష్ణకాదు "ధర్మయుక్తమైన కామం మోక్షదాయకమే" అంటాడు వాత్స్యాయనముని రతిలో కలుగు హృదయానందం మానసిక ప్రవృత్తులను శాంతింపజేస్తుంది అన్నారు కళ్లకు పొరలు కమ్మితే కామం అనర్థహేతువు అవుతుంది వ్యక్తి కామాంధుడు కాకూడదు అది కామశాస్త్ర ఆశయం కాదు

కామం అనేది తెచ్చుకుంటే వస్తుంది అని కొందరి వాదన అది సత్యం కాదు అది ప్రతిప్రాణికి సహజంగా ఉంటుంది అంతర్హేతువు (internal cause) వలన అది ప్రేరణ పొందును బాహ్యాహేతువులు దోహదములు మాత్రమే యగును మనిషి తన నిజస్వరూపం తెలుసుకుంటే తనలో ఎన్ని రహస్యాలున్నవోయని విస్తుపోతాడు 19వ శతాబ్దం చివరలో (1892 AD) ఆస్ట్రియా దేశస్థుడు ఫ్రాయిడ్ (6-5-1856 to 23-9-1939 = 83 years) మానవుని గుప్త రహస్యాలను విప్పిచెప్పాడు సంప్రదాయవాదియైన మానవుని 'అహం'ను దెబ్బతీసాడు మనిషి యందు అచేతన (అజ్ఞాత) అంతఃప్రవృత్తులు (unconscious instincts) ఉంటాయి అన్నాడు ఫ్రాయిడ్ మానవుని కార్యకలాపాలకు ఈ అంతఃప్రవృత్తియే కారణమన్నాడు అతని ఆలోచనలను కూడ ఆ ప్రవృత్తియే ప్రభావితం చేయును అన్నాడు అంతఃప్రవృత్తులు అచేతనంగా సామూహికంగా పుట్టును అన్నాడు అంటే వాటిని అచేతన సహజాతాలు (unconscious instincts) అనవచ్చు వీటివలన మానవుడు ఊహల్లో స్వేచ్ఛగా విహరించలేడు అన్నాడు దీంతో అప్పటికి చెలామణిలో ఉన్న సిద్ధాంతాలు తలక్రిందులైనాయి నాగరిక సమాజమును నగ్నం చేశాడు అని, విశృంఖలమైన 'సెక్సు' (sex) బోధిస్తున్నాడని సమాజం ఫ్రాయిడ్‌పై దాడి చేసింది కాని క్రమంగా సమాజం ఆత్మపరిశీలనలో పడింది 20వ శతాబ్దంలో మానవస్వభావంపై జరిగిన పరిశోధనలన్నిటిపైన ఫ్రాయిడ్ ముద్ర పడింది

మానవుని కోరికలు ప్రాధమికంగా మృగ ప్రవృత్తితో ఉంటాయి (animal instincts) అన్నాడు ఈ కోరికలు ప్రధానంగా కామంతోను (సెక్సు), ఉద్వేగం (వ్యాకులం Tension) తోను ఉంటాయి ఇవి మొండివి 'ఒక పట్టాన' సంతృప్తి చెందవు వ్యవస్థీకృతమైన (institutionalized) సమాజం, అనగా ఆచార నిబంధనలతో కూడినది, ఈ కోరికలను అణగద్రొక్కుతుంది దాని ఫలితమే మానసిక ఘర్షణ వ్యక్తికి సమాజానికి మధ్య సామరస్యం

ఉన్నపుడే నాగరికత వర్ధిల్లుతుంది శారీరక కారణములు లేని రోగాలు కొన్ని ఉన్నాయి, అవి మనస్సుకు సంబంధించినవి అని ఫ్రాయిడ్‌తోనే గుర్తింపు వచ్చింది మానసిక రోగ చికిత్సా విధానం (Psychiatry) వృద్ధి చెందటం ప్రారంభమైంది 'సమ్మోహనవిద్య' (Hypnotism) ద్వారా రోగలక్షణములను తొలగించవచ్చునని వైద్యశాస్త్రం గ్రహించింది మనోవిశ్లేషణ (Psychoanalysis) అను పదం ఫ్రాయిడ్‌తోనే ఉద్భవించింది కారణాలు కనబడని అనేక రోగాలకు మనసు కేంద్రబిందువని నిర్ధారించాడు హిస్టీరియా (Hysteria) రోగకారణములను పరిశోధించి లైంగిక వైఫల్యం (వైకల్యం) (sexual disturbance) అందుకు ప్రధాన కారణము అవి ప్రకటించాడు (1892) ఈ సందర్భంగా ఉత్పన్నమైన అనేక ప్రశ్నలకు సమాధానంగా బాల్య లైంగికత్వ (infantile sexuality) సిద్ధాంతమును ప్రకటించాడు (1898) బాల్యంలోనే తెలియకుండ కామవాంఛ ఉంటుందని భావము అటుపై ఫ్రాయిడ్ ప్రకటించిన స్వప్నరహస్యభేదనం (interpretation of dreams) (1990) సంచలనం సృష్టించింది ప్రతికలకు కారణం ఉంటుందన్నాడు మనిషిని స్త్రీగా పురుషునిగా విశ్లేషించి ప్రతిమనిషిలోను స్త్రీపురుష అంశలు రెండూ ఉంటాయన్నాడు ఇలా కామవాంఛ మనిషి పుట్టుకతోనే వస్తుందని నిర్వచించాడు ఇది ఫ్రాయిడ్ సిద్ధాంత విశ్లేషణ కాదు సందర్భవశమున చెప్పబడిన అతిసంక్షిప్త వివరణ మాత్రమే ఇది

ఫ్రాయిడ్‌కి 1600 సంవత్సరములకు పూర్వము మన వాత్సాయనుడు యీ విషయమే చెప్పాడు కామసూత్రాలు (1-2-1)లో ధర్మార్థకామములు పరస్పర ఆశ్రయము కలిగి ఉంటాయి అని, ఈ మూడు పురుషార్థములను సాధించటానికి ప్రతి వ్యక్తి కృషిచేస్తూనే ఉండాలి అన్నాడు వాత్సాయనుడు ఈ మూడు ఒకదానికొకటి విరుద్ధం కాకుండ చూసుకోవాలి (సూత్రం 1-2-11) జీవాత్మతో మనసు కూడియుండును ఇంద్రియాలు మనసు అధీనంలో ఉండి వాటి విషయాలు నిర్వర్తిస్తూ వుంటాయి ఆ విధంగా ఇంద్రియాల ద్వారా అనేక

విషయాలను జీవాత్మ అనుభవిస్తూ సుఖమూ ఆనందము పొందుతూ వుంటుంది ఆ సుఖము, ఆనందములే కామం అన్నాడు అంటే పుట్టుకతోనే కామం జీవుని అంటిపెట్టుకుని వుండునని తెలియుచున్నది జీవాత్మకు మనసు ప్రతినిధి (spokesman) జీవాత్మ కొరకు మనసే కార్యం నిర్వర్తిస్తుంది అందువలన కామం మనసులోనే పుడుతుంది కామం రూపం మన్మథుడు మనసు నుండి పుట్టినవాడు కావున అతడు మనసిజుడు అని వ్యుత్పత్తి అర్థం చెప్పారు ఇది సామాన్య కామమును గురించినది వాత్సాయనుడు విశేషకామం కూడ చెప్పాడు (సూ 1-2-12) రతి సమయంలో స్త్రీపురుష రూపాలలో వుండు జీవులకు ఆలింగనం, చుంబనం అను పది అంగక్రియల వలన అభిమానముతో కూడిన ఒక సుఖము కలుగుతుంది పంచాలుడను మహర్షి ఈ పది అంగాలతో ఋగ్వేదంలో ఋక్కులు చెప్పాడు అని (కామసూత్ర (2-2-4, 5)లో వాత్సాయనుడు వివరించాడు ఈ సుఖం ఫలప్రదమగుటకు అర్థముగా ప్రసిద్ధి చెందినదే కామం నిజమైన కామం ఇదే ఇలా పరస్పరం ప్రేమించుకుంటూ పొందు సుఖమే కామం అన్నాడు వాత్సాయనుడు కామప్రవృత్తి ప్రకోపం కారాదు ప్రకోపం (ముమ్మరం లేక అతీతం) ముప్పు కలిగించును (సూ 1-2-47) కాని దోషమున్నదని కామమును నిరోధించకూడదు ఇది వాత్సాయనుడి వాదం (ప్రవచనం) సంభోగ సుఖమును ద్వేషించే మనిషి మనిషే కాడు అన్నాడు దోషం అనేది ఎంతో కొంత అన్ని సుఖములలోను ఉన్నది దోషంలేని సుఖం సృష్టిలోనే లేదు అందుచే దోషాన్ని తొలగించుకుంటూ సుఖమును అనుభవించటం మానవధర్మం ప్రతి మానవుడు ధర్మ అర్థ, కామములను మూటినీ తప్పనిసరిగా సేవించాలి ఇవి పురుషార్థములు కాబట్టి ఇహపర సుఖములకు మార్గములు

(కామంలో ప్రకోపం అను దోషం తొలగించుటకు జిడ్డు కృష్ణమూర్తి చెప్పిన ప్రేమతత్వం చక్కటి మార్గం ప్రేమతత్వం ఉన్నచోట ప్రకోపం, ఉద్రేకం (excessive passion and lust) ఉండవు) కామసంబంధమైన ప్రేరణలను

గూర్చి అవగాహన కావాలి ప్రేమతత్వం లేకపోతే కామం వికృత ప్రయోగాలకు దారితీస్తుంది ప్రేమతత్వం మనసులోని వికృతములను తుడిచివేస్తుంది ప్రేమతత్వం ఉంటే కామంలో పరస్పర అసౌఖ్యమును (బాధను) సహించరు (అంగీకరించరు) అందువలన ప్రేమతత్వభావం తప్పనిసరిగా కామంలో వ్యక్తంకావాలి అట్టి కామం ఎన్నటికీ నేరం కాదు

(ప్రేమతత్వ అవగాహనలో సౌందర్యం ఒక ప్రధాన భాగం సౌందర్యం అంటే జిడ్డు కృష్ణమూర్తి చెప్పింది రూపసౌందర్యం కాదు, రసజ్ఞత కూడా కాదు, నడవడిక కాదు సౌందర్యం అనేది ఒక స్థితి (state or condition) అన్నాడు ఆ స్థితిలో మనసునందు 'నేను' అను కేంద్రస్థానం ఉండదు సరళత, నిష్కాపట్యము (simplicity) అను ఉద్వేగం (Tension) లో మనసు మునిగియుండును అన్నాడు నిరాడంబరత్వం సరళతలోని ప్రధానాంశం ఈ నిరాడంబరత్వం క్రమశిక్షణ, ఇంద్రియనిగ్రహం వలన వచ్చినది కాకూడదు అన్నాడు నిరాడంబరత్వం అంటే స్వప్రయోజనం అనగా స్వార్థమును పరిత్యజించడమే ప్రేమభావం ద్వారా మాత్రమే ఈ నిరాడంబరత్వం సాధ్యమగును ప్రేమభావం లేని నాగరికత సజీవంగా ఉండదు యాంత్రికముగా ఉండును నిర్మల మనసుకే ప్రేమభావం ఉంటుంది సౌందర్యం పోల్చి చూడటం ద్వారా అర్థం కాదు గాఢమైన ఉద్వేగంతో శరీరాన్ని తృప్తిపరచే మోహకాంక్షలో ప్రేమతత్వం ఉండదు, సౌందర్యం తెలియదు మోహకాంక్షలేని గాఢ ఉద్వేగంలో ప్రేమతత్వం ఉంటుంది, సౌందర్యం అవగాహన అవుతుంది)

కామం అనగా ఇచ్ఛ (కోరిక) ఆ కోరికలలో ఒకటి సంభోగేచ్ఛ ఆ కళకు పరమార్థం శృంగారరసం శృంగారరసమునకు ఆధారం కామకళ నవరసాలలో శృంగారం ఉత్తమం, ప్రధానం ఈ చరాచర సృష్టి అంతా శృంగారరసాధిదేవత ప్రసాదం మన నిత్య జీవితంలో విడదీయరాని బంధం గల ఆ రసాన్ని ఆ గౌరవంతోనే చూడాలి గాని మలినం ఆపాదించకూడదు

అలసిసొలసి ఇల్లు చేరిన వారికి శృంగారం ఒక పన్నీటి జల్లు మరి 'ఏకోరసః కరుణఏవ' అన్నారు కదా అని సందేహం రావచ్చు అలాగే మరికొందరు వీరరసం ప్రధానం అన్నారు అయినా కరుణగాని వీరంగాని సృష్టి జరిగిన తరువాత కదా! అంతేకాక కరుణ వీరరసాలు మానవప్రవృత్తికి దోహదాలు వాటికి మేధస్సుతో పనిలేదు అవి మానసిక ఉద్రేక ప్రవృత్తులు కరుణ (దయ) దైవదత్తముగా మానవతలో కలిగిన లక్షణము అది 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను ఉపనిషద్వాక్య భావగ్రహణకు తోడ్పడును కరుణకు జ్ఞానము తోడైనపుడు దైవత్వం సిద్ధించును కరుణకు వీరము కలిసి సత్వగుణ ప్రధానమైనపుడు ధీరోదాత్తత వస్తుంది అదే ధర్మవీరం

కామకళలో అంతరప్రవాహమైన శృంగారరస పరమావధి భిన్నమైనది భర్తృహరి శృంగార శతకం వ్రాయుటయే గాక ఎంతటి విరాగియైనను తన శృంగార శతకము చదివినచో తప్పక రాగి మరియు శృంగారి యగునని ప్రతిజ్ఞ కూడ యొనర్చెను అట్టి ప్రతిజ్ఞ చేయకున్నను అమరుకకవి విరాగులను గూడ శృంగారులుగా మార్చగల శృంగార శతకమును వ్రాసియున్నాడు దానినే అమరుక శతకము అందురు దానిని మించిన శృంగార రచన కానరాదు వాత్స్యాయనునిది సూత్రరచనయే కాని శృంగార కావ్యము కాదు అట్టివే తదుపరి వచ్చిన కామశాస్త్ర గ్రంథములు

ఈ శతకము అమరుకుని పేర ఉండినను వాస్తవమునకు దాని కర్త శంకర భగవత్పాదులేనని విజ్ఞుల అభిప్రాయం తత్వశాస్త్రమున మార్తాండుడైన శంకర భగవత్పాదులేమిటి శృంగార శతకము వ్రాయుట ఏమిటి అని సందేహము కలుగవచ్చును మరి ఆ శంకరులే పరమోన్నతమైన సౌందర్య చిత్రణగా తన కవితాలహరిలో సౌందర్యలహరిని మన కన్నుల ముందు చిత్రించలేదా! అటులనే ఈ శృంగార శతకము కూడ శృంగారకవితామలయమారుత ప్రభావిత నందనవనము శృంగారము రససామ్రాట్ రసజ్ఞుని హృదయమందు ఒక

మేరువు నిల్చియున్నదని ఊహించినచో దాని అత్యున్నత శిఖరమే శృంగారము రసప్రకృతిని గూర్చి చర్చించుటకు ఇది స్థానము కాకపోయినను, శృంగారము ఒక రసమే కదా! దానిని గూర్చి కొంతైనా తెలుసుకొనవలసియున్నది భోజుని దృష్టిలో శృంగారము సర్వరసముల సమన్వయం కరుణరసమునకు భవభూతి ఉన్నతస్థానము కల్పించినప్పటికి అది కొంత వియోగఫలితార్థమేమో అనిపిస్తుంది అది రసానుభూతికి అనుకూలమగునా అనునది చర్చనీయాంశము ఇక శాంతరసము సహజమైన ప్రకృతిరసము అని కొందరి అభిప్రాయం కాని అది విరక్తులకే కాని రక్తులకు కాదని కొందరి వ్యతిరేకత భక్తిరసమగునా, కాదా, అనేది అంతుతేలని చర్చనీయాంశము కొందరు ఆలంకారికులకు భక్తిరసము కాదు మధుసూదన సరస్వతి తన భక్తి రసాయనములో భక్తిని రసముగా నిరూపించాడు భక్తిని రసముగా అంగీకరించినను, మధురభక్తి శృంగార రసమునకు విరుద్ధము కాదు గదా! ఇక శాంతము, శృంగారము ఇవి పరస్పర విరుద్ధములా? విరుద్ధమనుట ఆధ్యాత్మిక శృంగార విషయమున చెల్లదు అందువలన ఈ రెండు రసములు ఒకే నాణెమునకు ఉన్న రెండు వైపుల రూపములు అనవచ్చు రాధాకృష్ణుల శృంగారము పరమాత్మ జీవాత్మల సంగమమేయని భాగవత తాత్త్వికులు చెప్పుచున్నారు

అమరుక శతకమందలి ప్రతి ఒక్క శ్లోకము శృంగార గులికయే అసలు ఈ శతకకర్త శంకర భగవత్పాదులేనని శ్రీ విద్యారణ్యులు శ్రీ శంకర విజయమున చెప్పియున్నారు అది విశ్వసనీయమని తాత్వికాభిజ్ఞుల అభిప్రాయం శ్రీ శంకరాచార్యులు మండనమిశ్రుని జయించినను మండన మిశ్రుని భార్య, భారతీ అవతారమని ప్రశంసించబడిన భారతీదేవి తనను జయించినగాని శంకర విజయము సంపూర్ణము కాదని వాదించినది ఆమెను జయించుటకు శంకరులకు శృంగారరసవిజ్ఞానము కావలసియున్నది ఆ సమయముననే మరణించిన అమరుక మహారాజు శరీరమున పరకాయ ప్రవేశము చేసి కామశాస్త్ర విజ్ఞత పొంది తిరిగి తన శరీరము పొంది భారతీదేవిని

జయించి తన విజయమును సంపూర్ణము చేశారని ఇతిహాసము

కాని సన్యాసియైన శంకరులు శృంగారి ఎటుల అగును అని కొందరి విమర్శకు సమాధానముగా శ్రీ శంకరులే అమరుక శతకమునకు ఆధ్యాత్మికార్థము చెప్పియున్నారని కొందరి అభిప్రాయము కాని ఈ శతక వ్యాఖ్యాతలెవ్వరు ఆధ్యాత్మికార్థము చెప్పుటకు ప్రయత్నము చేసినట్లు కనబడదు అంతమాత్రం చేత ఈ శ్లోకములందలి శబ్దములకు ఆధ్యాత్మికార్థ స్వభావము లేదనుట తగదు అమరుక శతకమందలి కొన్ని శ్లోకములను పరిశీలించినచో విషయం విశదమవుతుంది

శ్లో॥ (3) ఆలోలామ్ అలకావలీమ్ విలులితామ్ బిభ్రత్ చలత్ కుండలమ్
కించిత్ మృష్ట విశేషకమ్ తను తరైః స్వేదామ్భసః శీకరైః ।
తన్వ్యాః యత్ సురతాంత తాంతనయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వామ్ పాతు చిరాయ కింహరి హర స్కందాదిభిః దైవతైః ॥

సంభోగాంతమున స్త్రీపురుషులకు అలసట సహజము అయినను సంభోగాసక్తి వారికి ఇంకా కొంత మిగిలియే యుండును ఆ సమయమున స్త్రీ పురుషుని అనుమతితో పైనుండి సంభోగమునకు అతనికి తోడ్పడును ఈ పద్ధతిని పురుషాయతము అన్నారు సంభోగాంతమున స్త్రీ యొక్క జుట్టు చెదిరియుండును ముంగురులు కదులుచుండును ముఖముపై ఏర్పడిన స్వేదబిందువులచే బొట్టు కొంచెము చెదరును ఆ స్థితియందు స్త్రీ మరింత అందముగా కన్పడును అట్టి కాంతాముఖము నిన్ను రక్షించుగాక సుఖరతి అంతమందు కాంత యొక్క ముఖము రక్షణకై ప్రార్థింపబడినట్లు ఈ సంభోగ శృంగారము వర్ణింపబడినది సురతి అంతమున కలుగు సుఖమును నీకు శివుడు కాని, విష్ణువు కాని, కుమారస్వామి కాని ఈయలేరు గదా! ఇది ఆక్షేపాలంకారము అనగా ఆ సుఖమునకు సరియైనది మరొకటి లేదు అని భావం

ఇచట కాంత యొక్క ముఖము రక్షణకై ప్రార్థింపబడుట హాస్యోద్దేశము మాత్రమే ఇచట స్త్రీ ప్రౌఢ ప్రేమ పెరిగిన కొలది సిగ్గు తగ్గును కదా! ప్రౌఢ నాయికానాయక సంభోగము వారికి సమాధి సదృశమైన ఆనందము కలిగించును ఇదే దాదాపు రజనీష్ తత్వవిచారము కూడ రజనీష్ సాహిత్యము పరిశీలించినచో దీనితో సాపేక్షత కన్పడును ఆనందమునకు మూలము మనసు నందు ఏర్పడు ఆర్ద్రత ఈ ఆర్ద్రతే సంభోగ శృంగార రసమున ఎడబాటు శృంగారరసమున మరియు కరుణరస ఉద్దీపలోను కనబడును ఈ ఆర్ద్రత వేదాల ఆజ్ఞాసరళిలోను, పురాణబోధనామార్గంలోను లోపిస్తుంది 'కాంతా సమ్మితమ్ కావ్యమ్' కావ్యము కాంతతో సమానమైనది అదియు రసప్రధానంగా ఉండాలి అపుడు ఆ కావ్యము శృంగారనాయికవలె సుకుమారముగా ధర్మము నందు ఆదరము కలిగించును

ఇచటనున్న ఆధ్యాత్మికార్థము కూడ గ్రహించాలి 'హరిహర స్కందాదిభిః' అనుట దేవతా అభేదత్వము గోచరించును అభేదత్వములో ఇష్టదేవతతో తాదాత్మ్యము ఏర్పడును అదే కదా అద్వైత భావము ఈ శ్లోకములోని దేవతాక్షేపణకు ఇదియే అంతరార్థము ఇచట స్త్రీపురుషులు పరస్పర ఉపాసకులు సంభోగరూపమే వారి ఉపాసనాస్థితి ఆ స్థితిలో ఎవరు ఎవరిని ఉపాసించుచున్నారు అను భేదభావం ఉత్పన్నం కాదు వారే పరస్పరం జీవాత్మ పరమాత్మలకు ప్రతీకలు జీవునకు ఈశ్వరానుభూతి స్థితికి సదృశమైనది ఈ స్థితి అని అంతరార్థము లేనిచో వేదాంత సంవాదములో మండనమిశ్రుని భార్య భారతీదేవి కామకళను గురించి ఎందుకు చెప్పించును అందునా సంవాదము అద్వైతతత్వప్రవక్త శంకర భగవత్పాదులతో అందులోనే కామకళలోని ఆధ్యాత్మికత తెలుస్తుంది

శ్లో॥ (4) అలస లలితైః ప్రేమ ఆర్ద్రా ఆర్ద్రైః ముహుర్ ముకులీకృతైః
క్షణమ్ అభిముఖైః లజ్జాలోలైః నిమేషపరాన్ముఖైః ।

హృదయనిహితమ్ భావాకూతమ్ వమత్ భిరివ ఈక్షణైః
కథయ సుకృతీకః అయమ్ముగ్ధే త్వయా అద్య విలోక్యతే ॥

నాయిక ఒక పురుషుని చూస్తుంది అది ఆమె సఖి గమనిస్తుంది ఎవరిని చూస్తున్నావు, ఆ పుణ్యాత్ముడు ఎవరు అని అడుగుతుంది నాయిక చూపులు మెల్లగా కదులుతున్నాయి అందుచే కన్నులు అందముగా నుండి ప్రేమచే తడితడిగానున్నవి అవి తరచుగా మూయబడుచున్నవి కొంచెంసేపు నాయకుని చూస్తుంది వెంటనే సిగ్గుతో కన్నులు కదులును మనసులోని ప్రేమభావమును వెల్లడిస్తున్నయా అనునట్లు సంకేతముగా కన్నులు క్షణముసేపు చలనము లేక యుండును

ఇచట నాయిక లజ్జతోనున్నది అని చెప్పబడుట వలన ఆమె కన్యగానే భావించవలయును నాయకుడు శ్రీకృష్ణుడుగాను నాయిక రాధ లేక గోపికగాను భావించవచ్చును అపుడు ఇది రాధాకృష్ణ శృంగారముగా భావించవలయును శ్రీకృష్ణుడు పరమాత్మ సమస్త జీవులు (మధురభక్తి) ఆయన నాయికలే రాధను గురించి స్పష్టముగా ఎచటను తెలియదు అందువలన ఆమెను మధురభక్తిరస (ప్రణయ శృంగారరస) ప్రతీకగా గ్రహించవలసి యుండును జయదేవుని రాధ నిరంతరం విరహ శృంగారంలోనే చరించింది రాధను ప్రతీకగా గ్రహించినచో ఆమె పరమాత్మయైన శ్రీకృష్ణుని అంతర్భాగమే తనలోని అంతర్భాగమును వెలువరచి విప్రలంభ శృంగారరసోద్దీపన ద్వారా జీవాత్మ పరమాత్మల సంయోగమునకై ఆతురత, అందులోని ఆర్ద్రత ప్రకటించబడింది

ఇంకా శ్లోకము (102)లో విప్రలంభ శృంగార పరమావధిని చెప్పారు నాయకుడు విరహముతో బాధపడుతున్నాడు అన్ని దిక్కుల యందు అతనికి ఆమెయే కన్పడును మరొకటి ఏదియు కన్పడుట లేదు అతని మనసునందు ఆమె తప్ప మరొకటి లేదు సమస్త జగత్తు ఆమెయే అంటాడు అతడు అద్వైత

తత్వమునకు ఇది అద్భుతమైన ప్రతీక

భార్యాభర్తల సంబంధమందు ప్రేమతత్వముతో కూడిన అద్వైత తన్మయత్వము ఇమిడియుండగా ఆచార సార్వభౌములు దానికి లేని అపవిత్రత అంటగట్టి మలినం చేసారు లేనిచో భార్యాభర్తల సంయోగము తదుపరి ఏదో మహాపాపం జరిగిపోయినట్లు స్నానాదులతో కూడిన ప్రాయశ్చిత్తములు ఎందుకు పెట్టారు ఇట్టి ఆచార్య సార్వభౌములున్నంత వరకు సంసారంలో ప్రేమతత్వము ఉండదు అలౌకిక ఆనందము ఉండదు సంసారంలో శృంగారం ఉండదు స్వారస్యం ఉండదు యాంత్రికమైన సంసార జీవితం వలన సుఖశాంతులు కరువగును శృంగారమును ప్రేమతత్వముతో సౌమ్యముగా నిత్యజీవితంలోకి మలచినపుడే జీవితానికి ఒక అర్థం, ఉద్వేగభరిత నిత్యజీవితానికి భౌతికాతీతమైన ఒక ఆనందం ఉంటుంది

సృష్టికి అధిష్ఠానమైన పరమాత్మ దివ్య సౌందర్యము ప్రజ్వలించు జ్యోతి ఆ సౌందర్యజ్యోతి లహరియే ఈ సర్వసృష్టి సౌందర్యమునకు పర్యాయము శృంగారము ఆ శృంగారమునకు బాహ్యరూపము కామకళ వీటి సగుణరూపాలు ప్రకృతి-పురుషుడు ఆ ప్రకృతి-పురుషుల సౌందర్య ఆరాధన ద్వారా ఆ పరంజ్యోతి దర్శనానుభూతిని పొందవచ్చును పురుషుడు పరమాత్మ, ప్రకృతి అతని మాయ మాయచైతన్యమై ప్రకృతి రూపము పొందునంతవరకు పరమాత్మ నిర్గుణుడు పరమాత్మ నిర్గుణుడుగా నున్నంత వరకు ఈ సృష్టి లేదు ఈ సృష్టి కొరకే పరమాత్మ పురుషుడైనాడు అతనిలోని మాయ విడివడి ప్రకృతియైనది ప్రకృతిలేనిది పురుషుడు లేడు ప్రకృతి చైతన్యము పురుషుడు ఆధారము ఆ ప్రకృతి పురుషుల సంయోగమే ఈ సృష్టి ఆ పురుషుడే వైశ్వానరుడు ఆ సృష్టి అంతరప్రవాహమే శృంగారం ఆ శృంగార భావరూపమే కామకళ దానికి చైతన్యమైన ఉత్ప్రేరకము సౌందర్యము అందుకే పరమాత్మ చైతన్యరూపమైన ప్రకృతి సౌందర్యఅధిదేవత, శృంగార

రసప్రవాహరూపం ప్రకృతియే సౌందర్యలహరి ఆ అధిదేవత వరప్రసాదమే ఈ చరాచర సృష్టి అంతా మనదైనందిన జీవితంలో విడదీయలేని బంధం గలది శృంగారరసం ఆ శృంగారరస ప్రవాహరూపమే ఈ ప్రకృతి గదా! అట్టి ప్రకృతిలోని భాగమే గదా మనం ఆ సౌందర్య ఆరాధనే శృంగారరసమునకు ఉద్దీపన దాని పర్యవసానమే సత్యమైన ఆనందం అందుకే "అందమే ఆనందం, ఆనందమే జీవిత మకరందం" అన్నారు అట్టి శృంగార రసమును ఆ గౌరవముతోనే గ్రహించాలి గాని దానికి మలినం ఆపాదించకూడదు అలసిసొలసిన మానవునికి శృంగారం ఒక పన్నీటిజల్లు ప్రకృతి సౌందర్యం పరమాత్మ తేజోప్రతిబింబము అది ప్రకృతిలో చరాచరములన్నిటికి పన్నీటిజల్లు ప్రకృతిలో అణువణువునా శృంగారం ప్రతిఫలిస్తుంది

'కామము'ను పురుషార్థములలోను ప్రస్తుతించారు మరల దానిని అంతశ్శత్రువులైన అరిషడ్వర్గాలలోను పరిగణించారు ధర్మ, అర్థ, కామ, మోక్షములు పురుషార్థములు ధర్మము అనగా వేదోక్త విధి, సత్కార్యము, విలువ, నీతి మనోవికాసం కలిగించేదే ధర్మము స్వార్థం తొలగినపుడే మనోవికాసం కలుగుతుంది ఇది వ్యక్తిపరంగా, సమాజపరంగా, విశ్వపరంగా ఉంటుంది అంతేకాదు ధర్మము కాలమాన పరిస్థితులకు అనుకూలంగా మార్పులతో సమన్వయించాలి అది స్వార్థరహితంగా మనోవికాసం కలిగించేదిగా ఉండాలి అర్థము అనగా ఇంద్రియార్థము, ప్రయోజనం, విధము, రాజనీతి, ధనము కామము అనగా ఇచ్ఛ-మోక్షము అనగా పునర్జన్మ నివృత్తి

పురుషార్థములు పురుష ప్రయోజనము కొరకు ఏర్పడినవి పురుషుడు అనగా లింగ సందర్భముగా కాక మానవుడు అనే అర్థంలో గ్రహిస్తే సమన్వయం కుదుర్తుంది అనగా మానవుని జీవనసరళికి ప్రయోజనకారులు ఈ నాలుగు పురుషార్థాలు అని భావం పురుషార్థములే పురుష ప్రయత్నములు మానవుడు వాటిని అనుసరించి ప్రయోజనం పొందాలి గృహస్థాశ్రమము కొరకే

పురుషార్థములు ఏర్పడినవి గృహస్థుగానున్నంత వరకు వాటిని తప్పక అనుసరించాలి

శ్లో॥ పరస్పర విరుద్ధానాం తేషాంచ సముపార్జనమ్ (మనుస్మృతి 7-152)

ధర్మార్థ కామములలో తరచు పరస్పర విరోధం కలదు అట్టి విరోధమును పొసగనీయక ఆ పురుషార్థములను మూటిని సంపాదించు ఉపాయము ఆలోచింపవలయును

శ్లో॥ ధర్మశ్చార్థశ్చ కామశ్చ పరస్పర విరోధినః
ఏషానిత్యవిరుద్ధానాం కథమేకత్రసంగమః।

(మహాభారతం - అరణ్యపర్వం)

ధర్మము, అర్థము, కామము ఈ మూడు పురుషార్థములు పరస్పర విరోధులు ఒకదానికొకటి పొసగకయుండును కనుక ధర్మార్థ కామములను పురుషుడు సమముగా సేవించుట ఎట్లు? సమాధానం ఈ క్రింది శ్లోకం

శ్లో॥ యదాధర్మశ్చ భార్యాచ పరస్పర వశాను గౌ
తదా ధర్మార్థ కామానాం త్రయాణామపి సంగమః।

(మహాభారతం - అరణ్యపర్వం)

భార్య ధర్మమును విడువక అనుసరించినచో అపుడు ధర్మార్థ కామములు మూడును పరస్పర విరోధము లేక ఒకచోట నిలుచును కనుక అట్టి భార్య ద్వారానే ధర్మనిర్వహణ, అర్థార్జన, కామానుభూతి నిర్వర్తించి పురుషుడు కృతకృత్యుడగును మరియు

శ్లో॥ ధర్మార్థ కామః సమమేవసేవ్యః
సఉత్తమోయోనిరతః త్రివర్గేవిభజ్యకాలమ్ పరిసేవమానః

(మహాభారతం - శాంతిపర్వం)

ధర్మార్ధ కామములను సమముగా మాత్రమే సేవించవలయును ధర్మార్ధ కామములను వేరువేరుగా భావించకూడదు కేవలం ఒకదానినే ఆశ్రయించక వాటికి పరస్పర సంఘర్షణ రాకుండ సాధించవలయును కాలమును మూడు భాగాలుగా చేశారు పగలు పూర్వభాగం, పగలు ఉత్తరభాగం, చివరి భాగం రాత్రి ఎవరైతే ఆసక్తితో ఈ వరుసలో క్రమంగా ధర్మార్ధకామములను సేవించుదురో అతడు ఉత్తముడు అన్నారు

ధర్మము, అర్ధము సంయోజితములు ఒకదానికి మరొకటి సహాయకారి ధర్మార్ధములు వ్యక్తి పరంపగానే కాకుండ కుటుంబపరంగా సమాజపరంగా విస్తరిస్తాయి కాని కామం పూర్తిగా వ్యక్తిపరం ఇచ్ఛ వ్యక్తిపరమేగా! ఫలితం ఆ వ్యక్తికే కాక మరొకరికి కూడ చెందవచ్చు పురుషార్ధములలో కామమునకు సంభోగ ఇచ్ఛ భావార్ధం ఈ ఇచ్ఛకు శృంగారం అలంకారం ఆ అలంకారమే కామకళారూపం దీనికి ఆధారం సౌందర్య ఆరాధన కామానుభూతి తరువాతే మోక్ష అర్హత అని పురుషార్ధముల ఆశయముగా గోచరించును అందుకే "కామిగానివాడు మోక్షకామి గాడు" అను నానుడి ప్రసిద్ధమైంది

ఈ శృంగార సానుభూతి అభాసము అగుటకు కారణములు రెండు (1) రసానుభూతి గ్రహించలేక, కామకళలోని అంతరార్ధము గోచరించక, సౌందర్యారాధనలోని ఆశయము తెలియక, సంభోగేచ్ఛలోని రసమయ పరవశత్వం అర్ధం చేసుకోలేక దాని ద్వారా కలుగు ఆనంద పరమావధి చేరలేక, సంభోగేచ్ఛను ఒక మనోవికారంగా పరిణమింపజేశారు కొందరు వారి ఇచ్ఛలో కామకళాప్రతీకలు నశించి, రసానుభూతి లోపించి సౌందర్యారాధన అదృశ్య మవుతుంది అపుడు వీటి అన్నిటి సంయుక్తరూపమైన ప్రేమ ఆకాశదీపం అవుతుంది అట్టి కామం పురుషార్ధం కాదు అది మనోవికార (passion) రూపమైన పశుఅంతర్ప్రవృత్తి (animal instincts), ఇంద్రియలోలత్వం

(2) శృంగార రసాభాసకు మరొక కారణం కూడ ఉంది "సంతాన యజ్ఞమేవ సంసారం" అని ఎచటనుండో ఒక నీతిని దెచ్చి భార్యాభర్తల, ప్రేయసిప్రియుల ఏకాంతసేవను వైదిక సంప్రదాయ పరంచేసి అదేదో తప్పదు కాబట్టి చేయాలి అను యాంత్రిక భావనను ఎర్పరచి రసానుభూతిని నీరసింపజేశారు అసలు వివాహం అంటే ఏమిటి? యువతీ యువకుల మధ్య ఏర్పడు ప్రేమానుబంధ రూపమే వివాహవ్యవస్థ సంప్రదాయానుబద్ధమైన ప్రేమానుబంధమే వివాహబంధము ప్రేమానుబంధము లేని సంప్రదాయనిబద్ధత నేతిబీరకాయ వంటిది జీవితాంతము ఇద్దరు జీవుల మధ్య సంసారాను బంధమునకు ప్రతీక వివాహవ్యవస్థ

ఉదాత్తం వివాహబంధం,
రెండు హృదయాల సంబంధం,
అవ్యక్తం ఆ ప్రేమానుబంధం

శారీరక సుకృతం సౌందర్యం,
ఆత్మానురూపం సౌశీల్యం,
సుప్రభావితం, ఆ స్త్రీపురుషానురాగం

**ప్రేమయే వివాహబంధానికి సూత్రం**

అదొక సంయమ సంద్రం,
పగలు పద్మమిత్ర పరువంలో,
రాత్రి కలువరేని కాంతిలో
సర్వదా శాంతి సంయమం

నిండు హృదయాల
నిండారు నవ్వులతో
నిత్యనూతన వసంతశోభల,
కిలకిలారావాల మధురిమలో,

వలుపులు గొలిపెడి చిలుకల తళుకులలో,
సర్వదా శాంతి సంయమం

తావిభరితకుసుమం
వైవాహిక సంబంధం,
ప్రణయం తత్ఫలితం,
తత్పరమార్థం దాంపత్యం
తత్ఫలితార్థం గార్హస్థ్యం

వివాహబంధానికి సూత్రం మాంగల్యరూపంలోని ప్రేమ మాంగల్యం వ్యక్తమయే సూత్రం అది సామాజికం అవ్యక్తమైన సూత్రం ప్రేమ అది వ్యక్తిగతం ప్రేమ అంటే ఇద్దరి కలయిక మాత్రమే కాదు ప్రేమ అనేది తత్త్వము అది మానసికం పూవు పరిమళం యిచ్చునట్లు ప్రేమప్రేమనే ఇస్తుంది పరిమళం కనబడదు అనుభూతిని కలుగజేస్తుంది పుష్పమునకు రంగు, రూపం ఆకర్షణ ఇస్తాయి కాని పరిమళం లేని రంగు, రూపం వృథా పరిమళం కూడ ఆకర్షణ కలుగజేస్తుంది కాని అది అవ్యక్తం పరిమళం ఇచ్చు అనుభూతి వట్టి ఆకర్షణ మాత్రమే కాదు అది అవ్యక్తానుబంధం ప్రేమకి కొలతలు లేవు ప్రేమ అంటే కామం కాదు కాని ప్రేమ కామానికి సున్నితత్వం కలుగజేస్తుంది ప్రేమ మనసును వర్ధిల్లజేసి మానసిక సున్నితత్వమును మేలుకొల్పుతుంది

మరి ఈనాడు వివాహం తరువాత కుటుంబంలో స్నేహం, సౌహార్ద్రతలకు బదులు కలతలు ఎందుకు వస్తున్నాయి దీనికి ప్రతి ఒక్కరు కారణమే దీనికి మూలం వ్యక్తుల కపటత్వం, దర్పం, భయం 'ప్రేమ' అంటే మామూలుగా వాడుకలోనున్న 'ప్రేమ' అనే మాట కాదు 'ప్రేమ' అనేది ఒక తత్త్వము కామసంబంధమైన ప్రేరణల వలన ప్రేమతత్వం ఉత్పన్నం కాదు ఈనాడు వాడుకలోనున్న 'ప్రేమలో పడటం' అంటే ప్రేమతత్వం ఉత్పన్నం

కావటం కాదు ప్రేమతత్వం వికసించటానికి వివాహానికి ముందు ప్రేమలో పడనవసరం లేదు 'ప్రేమలో పడటం' అనేది సాధారణంగా ఒక ప్రేరకం (stimulus) వలన ఉత్తేజితమగు ఒక అంతఃప్రవృత్తి (instinct) అది ప్రేమతత్త్వం కాదు ప్రేమతత్త్వం ఇద్దరి మధ్య సత్సంబంధం వలన మేల్కొంటుంది అంతవరకు అది నిద్రావస్థలో ఉంటుంది ప్రేరకం వలన ఉత్తేజితమయే అంతఃప్రవృత్తి ప్రేమతత్వమును మేల్కొల్పుతుంది అని విశ్వసించలేము 'ప్రేమలో పడకుండ' సంప్రదాయపద్ధతిలో ఏర్పాటు (arranged marriage) చేయబడిన వివాహాల ద్వారా కూడ అనుకూల వాతావరణంలో ప్రేమతత్వం మెల్కొనవచ్చు అనుకూల వాతావరణం కల్పించటమే మన బాధ్యత

కాని ఈనాటి వివాహాలు ఇందుకు భిన్నంగా ఉంటున్నాయి ప్రేమతత్వానికి స్థానం లేదు వృత్తిరీత్యా ధనవాంఛ రీత్యా వ్యాపారాత్మకం అయినాయి విదేశ గమనం ప్రాధాన్యం వహిస్తోంది ఇక్కడ వివిహం ద్వారా ఒక బంధం ఏర్పడుతోందే తప్ప నిజమైన ప్రేమతత్వం మేల్కొనే అవకాశం కన్పడుటలేదు ఇక వివాహ వేడుకలో కూడ దంభాలు, అర్థంలేని ఆడంబరాలు తప్పితే ఏమియు లేదు ఉదాహరణకు ఆశీర్వచన కార్యక్రమంలో ధర్మోపన్యాసాలు, నీతివచనాలు ఎందుకు? అది వింటున్నది ఎవరు? ఆ సమయంలో వధూవరుల మానసిక స్థితి ఏమిటి? వారు ఇంద్రియ ప్రభావంలో తమ సహచర జీవితమును గూర్చి ఊహాలోకంలో ఉంటారు ఈ ఉపన్యాసాలు వారికి వినబడవు ఇక అతిధులు ఎక్కడికక్కడ చిన్న చిన్న గుంపులుగా "లోకాభిరామాయణంలో" ఉంటారు ఈ ఉపన్యాసాలు వారి చెవిన బడవు ఉపన్యాసం అయిపోయిందని ఎవరైనా చెపితే తెలుస్తుంది కన్యాదాత ఖర్చుని గూర్చి ఆవేదనలో ఉంటాడు వరుని తండ్రి 'భుజకీర్తులను' ఊహించుకుంటూ ఉంటాడు ఇక వివాహం అయిన తరువాత వధూవరులకు అనుకూల వాతావరణం కల్పిస్తే క్రమంగా అవగాహన ఏర్పడి ప్రేమతత్వం మేల్కొంటుంది కాని రెండు వైపుల అనేక సందర్భాలలో ఇందుకు భిన్నంగా జరుగుతోంది

వరుని తలితండ్రులు తమ పుత్రరత్నం ఎక్కడ భార్యావిధేయుడైపోతాడేమోనని అనుమానంతో వాతావరణం కలుషితం చేస్తున్నారు ఇక వధువు తలిదండ్రులు వారి కుమార్తెపై తమ ప్రేమ ఒలికిపోతుంటే తాళలేక వారి సంసారంలో క్షణంక్షణం కల్పించుకుని వాతావరణం మలినం చేస్తున్నారు రెండు వైపులా సహృదయులైతే నూతన దంపతుల జీవితం నిండినదిలా ప్రశాంతంగా సాగుతుంది ఆ ప్రశాంతతలోనే ప్రేమతత్వం మేల్కొంటుంది ప్రేమతత్వ ప్రభావంలోనే కుటుంబంలో పరస్పర సౌహార్ద్రత వర్ధిల్లుతుంది

శృంగార రసానుభూతి అభాసము అగుటకు ఈ రెండు కారణముల వలన కామం పురుషార్థ ఆశయం కానేరదు పురుషార్థ కామము చాల ఉన్నతమైనది అది జీవితానందము కొరకు ఏర్పడినది మానవ జీవితలక్ష్యాలు మూడు అందు ఏ ఒకటి మరొకదానికంటే తక్కువాకాదు, ఎక్కువాకాదు అవి 1) బాహ్య జీవితావసరములు, ఇంద్రియానురక్తి, 2) రసజ్ఞాన విద్య, సౌందర్యభావవిషయిక దర్శనము, 3) ఆత్మతత్వవివేచనము

వీటి సాధన కొరకే పురుషార్థములు ఏర్పడినవి అట్లు కానిది పురుషార్థము కాదు అది అంతశ్శత్రువై అరిషడ్వర్గములో చేరినదే యగును జీవన్ముక్తి కొరకే మానవజన్మ పొందగలిగాము కాబట్టి ఆ లక్ష్యమును మరువకుండ లౌకిక జీవితం గడపాలి లౌకిక జీవితంలో సుఖభోగాలు అతిథుల వంటివి అతిథులను గౌరవించినట్లే వాటిని ఆదరించాలి అపుడు అతిథి అనుభవించే తృప్తి మనకు 'సుఖీభవ' అని ఫలిస్తుంది అలా వాటిని అనుభవిస్తూనే గమ్యం చేరుకోవాలి

అనుభవం ఎపుడూ ఇంద్రియాల ద్వారానే ఉంటుంది ఇంద్రియాల ద్వారా మనసును చేరుతుంది మానసిక సంతోషమే ఇంద్రియ సౌఖ్యం ఇంద్రియాలు పరికరాలు మనసు అధిష్ఠానం (మూలం) ఇంద్రియాలు లేనిది మనసు నిష్క్రియారూపం మనోనిగ్రహం సాధన చేస్తే ఇంద్రియ విశృంఖలత్వం

ఉండదు మనో నిగ్రహంతో ఇంద్రియాలు క్రమణికగా పనిచేస్తాయి అపుడే మానసిక ఆనందం కలుగుతుంది

అంతశ్శత్రువులు లోపల నుండి ఇంద్రియముల ద్వారా బయటకు వెలువడు తరంగముల వంటివి ఇవి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు వాస్తవానికి ఈ శత్రువులు ఆరు కాదు, మూడు మాత్రమే మొదటి మూడు అయిన కామక్రోధలోభములు అంతశ్శత్రువులు తదుపరి మూడు మొదటి మూడింటి పర్యాయరూపాలు మొదటి మూడు తీవ్రమైనపుడు తదుపరి మూడుగా రూపొందుతాయి అపుడవి మరింత ప్రమాదకరమైన శత్రువులుగా మారుతాయి ఇంక కొంత లోతుగ వాస్తవికతలోనికి పోతే మొదటి మూడు కూడ ఒకదాని నుండి మరొకటి క్రమంగా ప్రజ్వలిస్తాయి

ప్రథమంగా మనసు నుండి (బుద్ధి నుండి) బయటకు వచ్చే తరంగం కామం కామం అంటే కోరిక అది కావాలి, ఇది కావాలి అనే కోరిక సంభోగేచ్ఛ కూడ అట్టి కోరికలలో ఒకటి ఇది మానవుని అవరోహణకు (పతనమునకు) మొదటి మెట్టు ఒకసారి కోరిక మనసులో ప్రవేశించగానే అది లోపల తొలుస్తూనే ఉంటుంది అనగా మథించటం అన్నమాట ఈ మథించటమే మన్మథుని కార్యవిశేషం ఈ మథన పరిణామమే క్రోధం తనకు అందనిది మరొకరు పొందితే ఈ కామమే కోరిక తీరనందుకు దుఃఖమై అది క్రోధముగా పరిణమించును అంతటితో ఆగదు కోరిక తీరి కావలిసినది పొందినా, దానిని మరొకరు ఎట్టి పరిస్థితులలోను పొందకూడదు అను లోభం ప్రబలుతుంది అంతా తనకే ఉండాలి అనేదే లోభం

ఈ కామక్రోధలోభాలే తీవ్రమై వికారస్థాయికి పెరిగినపుడు అవి మోహమదమాత్సర్యములుగా పరిణమిస్తాయి కామం వికటిస్తే మోహంగా మారుతుంది కామం కోరిక స్థాయిలోనే ఉంటుంది కాని అది ముదిరి మోహమైతే మనసు మరుగున పడిపోతుంది ఎట్టి పరిస్థితులలోనైనా తన

కోరిక తీరాలి అను పట్టుదల ఏర్పడుతుంది అది తీరనపుడు అట్టి కోరిక మరెవరికి ఉండకూడదు, ఒకవేళ ఉన్నను అది తీరకూడదు అను ఆలోచన కలుగుతుంది ఇదే క్రోధ పరిణామమైన మదం తన కోరిక తీరినపుడు పొందిన ఫలితం మరెవరికి ఉండకూడదు అనేదే లోభం ఒకవేళ ఎవరైనా ఆ ఫలితం పొంది ఉంటే, వారిని నాశనం చేసే ప్రయత్నమే లోభం పరిణామరూపమైన మాత్సర్యం మాత్సర్యం అసూయతో కూడిన పగ ఈ మూడు అంతశ్శత్రువులు తనకేకాక సమాజానికి కూడ శత్రువులేయని గ్రహించాలి

దీనిని బట్టి అన్నిటికి మూలం కామం అని తెలుస్తోంది గదా! మరి కామం దోషం కాదా! కామం ప్రకోపించనంత వరకు దోషం కాదు కామం ప్రకోపిస్తే మోహం అవుతుంది కామం మోహంగా ప్రకోపించనంతవరకు మంచిదే పురుషార్థమైన కామం మోహం కాదు కానేరదు పురుషార్థ కామం సుఖసంతోషాలకు ప్రాపు పురుషార్థకామం మనోనిగ్రహ పరిధిలో ఉంటుంది మోహంగా పరిణామం చెందితే కామం మనసు అధీనం తప్పుతుంది ఇంద్రియాధిక్యత పెరుగుతుంది అపుడది తప్పక నేరమేయగును అట్టి కామం శత్రువే

వసిష్ఠ మహారామాయణం (యోగవాసిష్ఠము) మోహమే అహంకారమునకు మూలం అన్నది మూఢత్వం లేక అజ్ఞానం వల్లనే ఇది బాగా విస్తరిస్తుంది మోహరూపమైన అహంకారం అనేక శారీరక, మానసిక వికారములకు కారణమవుతుంది ఈ వికారముల వలన మనసు మూర్ఛమవుతుంది వసిష్ఠ రామాయణం వైరాగ్య ప్రకరణలో మనసును వీధికుక్కతో పోల్చారు వీధికుక్క వ్యర్థంగా చంచలంగా ఇంటింటికీ తిరుగుతుంటుంది మనసు కూడా తన కోరికలననుసరించి అటూఇటూ తిరుగుతూ ఉంటుంది ఇట్టి మనసును పిశాచం అన్నారు అంతశ్శత్రువులకు లోబడేది ఇట్టి మనసే ఈ మనసుకు తృష్ణ అతిగా ఉంటుంది తృష్ణ

వేసవికాలంలో దాహం వంటిది అది తీరదు ఎంత ఉత్తముడినైనా ఈ తృష్ణ ఒక్క తృటిలో తుచ్ఛునిగా చేస్తుంది

తృష్ణకు మూలం అజ్ఞానం లేక మూఢత్వం అది కలిగిన అంతఃకరణ నిరంకుశంగా వ్యవహరిస్తుంది మోహంగా పరిణమించిన కామం పిశాచం వంటిది అది మనిషిని వివశుణ్ణి చేస్తుంది అంతవరకు నిర్మలంగా ఉన్న నది వర్షఋతువు రాగానే పరవళ్ళు త్రొక్కుతుంది, కలుషితమవుతుంది యవ్వనదశ ఇట్టిది అంటారు బాల్యం నిరంకుశ స్వభావంతో కూడి సుఖదాయకం కాదు అన్నారు యవ్వనం మోహంతో, మదంతో కలుషితమై పోతుంది ఆ యవ్వన దోషాలకు మూలం స్త్రీయని వసిష్ఠ మహారామాయణంలో స్త్రీని తీవ్రంగా నిందించారు స్త్రీ సౌందర్యం పురుషునికి భ్రమ కలుగజేస్తుంది 'స్త్రీ జ్వలించే అగ్నిశిఖ లాంటిది' అన్నారు ఆమె కేశములు పొగవంటివి అని, అగ్ని గడ్డిని దహించివేసినట్లు ఆమె కామవాసన అను అగ్నితో పురుషుణ్ణి దహించివేస్తుంది స్త్రీ సమీపంలో ఉంటే పురుషునికి భోగేచ్ఛ తప్పదు 'స్త్రీ భోగక్షేత్రం' స్త్రీ లేకపోతే భోగేచ్ఛయే యుండదు కాబట్టి స్త్రీని వదలినవాడు సుఖవంతుడు బాల్యమును యవ్వనం మ్రింగివేస్తుంది యవ్వనమును వార్ధక్యం వచ్చి ఆవరిస్తుంది వార్ధక్యంలో కోరికలు నశించవు కాని శక్తి నశిస్తుంది వార్ధక్యంలో ఉన్న మనిషిని చూచి అందరు హేళన చేస్తారు ఇలా తన నిజస్వరూపాన్ని గాని, తన కర్తవ్యాన్ని గాని గుర్తించక తిరుగు మానవుని తుదకు మృత్యువు మ్రింగివేస్తుంది ఇది వసిష్ఠ మహారామాయణం వైరాగ్య ప్రకరణంలో చెప్పిన మానవజీవిత సారాంశము

అదే ప్రకరణంలో జీవితం తీర్థయాత్ర వంటిది అన్నారు యాత్రలో ఎంతోమంది కలుస్తారు, విడిపోతారు జీవితంలో కూడ భార్యాపుత్రులు అట్టివారే ఈ వైరాగ్యం అందరికి తెలిసిందే కాని నిజజీవితంలో ఇది ఎంతవరకు సాధ్యము ఒకవైపు కర్తవ్యాన్ని గుర్తించాలని చెపుతూ మరొకవైపు

సంసారం అంతా అబద్ధం అంటున్నారు కాలమును మనం క్షణాల నుండి కల్పముల వరకు లెక్కలు ఏర్పరచుకున్నాము ఈ లెక్కలు కాలబేధాలు అన్ని అసత్యాలే అని వసిష్ఠ మహారామాయణం చెప్తోంది కాలగణనం అసత్యమే కాని కాలం అసత్యం కాదు కాబట్టి కాలమును ఏదో విధంగా గుర్తించాలి అందుకే క్షణాలు, సంవత్సరాలు, యుగాలు చెప్పబడినాయి అలాగే సంసారం అసత్యం అన్నారు కాని అది అసత్యమని ఎపుడు తెలుస్తుంది? అసత్యం అంటే అర్థం తెలిసినపుడు అది ఎపుడు తెలుస్తుంది సత్యం తెలిసినపుడు సత్యం ఎపుడు తెలుస్తుంది సత్యం ఆత్మజ్ఞానం కలిగినపుడు తెలుస్తుంది ఆత్మజ్ఞానం కలిగినపుడు జీవుడు జీవన్ముక్తుడు అవుతాడు

అంతవరకు ఈ దృశ్య ప్రపంచమంతా వాస్తవమే శ్రీరామునికి చిన్నవయసులోనే వైరాగ్య ప్రవర్తన కలిగింది ఆ స్థితిలో శ్రీరాముడు చెప్పిన మాటలే వసిష్ఠ రామాయణంలోని వైరాగ్య ప్రకరణము వైరాగ్యంతో జీవితకర్తవ్య నిర్వహణ జరగదు కర్తవ్య నిర్వహణ జరగకపోతే రామావతార ప్రయోజనం సిద్ధించదు అందుచే దశరథుడు, విశ్వామిత్రాది మహర్షులందరి కోరికపై వసిష్ఠుడు శ్రీరామునికి సత్యమును బోధించి జీవన్ముక్తుని స్థితి కలిగించాడు జీవన్ముక్తుడై శ్రీరాముడు కర్తవ్యం నిర్వహించాడు రామావతార ప్రయోజనం సిద్ధించింది "తన నిత్యకృత్యాలన్నీ, విధులన్నీ నిర్వహిస్తూ కూడా, ఎవడైతే ఈ ప్రపంచాన్ని ఆకాశంలాగా శూన్యంగా చూస్తూ అసంగుడుగా ఉంటాడో అట్టివాడు జీవన్ముక్తుడు" అని వసిష్ఠుడు నిర్వచించాడు

మనం సామాన్య మానవులం అవతార పురుషులం కాదు మనకు అవతార ప్రయోజనం లేదు మనకు పునరపి జననం - పునరపి మరణం తప్పదు అందువలన ప్రతి జన్మ జీవునికి ఒక అవతారమే కాబట్టి ప్రతి జన్మకు కర్తవ్యం, ప్రయోజనం ఉంటాయి కర్తవ్యం నిర్వర్తించాలి ప్రయోజనం సాధించాలి మనం జీవన్ముక్తులం కాలేదు కాని నిష్కామకర్మయోగం ద్వారా

జీవన్ముక్తి కొరకు ఒక్కొక్క మెట్టు ఎక్కవచ్చు తురీయము అను పరమశాంతి లభించునంత వరకు పురుష ప్రయత్నం సాగుతూనే ఉండాలి పురుష ప్రయత్నం కొరకే పురుషార్థాలు చెప్పబడినవి నిస్వార్థముగా పురుషార్థములను సాధించాలి వట్టి వైరాగ్య ప్రవర్తనతో ప్రయోజనం లేదు అని చెప్పటమే వసిష్ఠ రామాయణములోని ఉద్దేశము

దోషాలకు ఆస్పదం స్త్రీ అని, ఆమె అగ్నిజ్వాల, పొగ అని నిందించారు మన దృష్టిని బట్టి వస్తువు విలువ మారుతుంది కామం పురుషార్థమైతే పురుషుని కార్యనిర్వహణకు తోడ్పడుతుంది కామం మోహమైతే శత్రువు అవుతుంది ప్రేమతత్వంతో కూడిన కామం ప్రయోజనకారి అలానే స్త్రీ అగ్ని అన్నారు అగ్ని దహిస్తుంది అదే అగ్ని వంటకు ఉపయోగపడి ఆహారం సమకూరుస్తుంది అదే అగ్ని హోమకుండములో పవిత్రంగా ప్రజ్వరిల్లుతుంది శ్రీరామునికి కలిగిన అశాంతి సిద్ధార్థుడికి కూడ కలిగింది వసిష్ఠుడు అతనిలో వెలిగించిన జ్ఞానజ్యోతి వలన శ్రీరాముడు కర్తవ్యోన్ముఖుడైనాడు సిద్ధార్థుడు సంసారం వదలి జ్ఞానసిద్ధి పొంది బుద్ధుడైనాడు జిడ్డు కృష్ణమూర్తికి కూడ ఒక స్థితిలో జీవితంలో అసంతృప్తి, అశాంతి కలిగినై మానవుడు తనను గురించి తాను సత్యం తెలుసుకోవాలని గ్రహించాడు తన మనసుని తాను అవగాహన చేసుకోవాలి అన్నాడు దానికి నిర్బంధం పనికిరాదు మనసుకు స్వేచ్ఛ కావాలన్నాడు తురియాజ్ఞానం, భావాతీత అనుభూతితో మనసుకు స్వేచ్ఛ వస్తుందని వేదాంతం కూడ చెప్తుంది కాబట్టి దోషం కామంది కాదు దానిని పురుషార్థంగా ఆచరించి ప్రయోజనం పొందటమో, లేక మోహంగా మార్చుచేసి పతనం చెందటమో మన వంతు పని

ఇందుకు సంయమనం కావాలి అంటే ఏకతా భావముతో కూడిన దీక్ష కావాలి అది పొందగలిగిననాడు కర్తవ్య నిర్వహణ, జీవితానికి ప్రయోజనం సమకూరుతాయి ప్రకృతి-పురుషుడు అంటే స్త్రీపురుషులు లేంది సృష్టి లేదు

## ప్రకృతి - పురుషుడు

ప్రత్యయరహిత
శబ్ద స్వరూపం,
సత్వాదిగుణ
పరిరంభం,
సహజం-ప్రకృతం,
పంచభూతాత్మకం
అదే ప్రకృతి
ప్రకృతికి
కారణం
పురుషుడు
జగత్కారణ పురుషుడు,
వారే
ప్రకృతి పురుషులు

ప్రకృతి దేహి,
గుణరహితుడు
పురుషుడు
ఎవరా ప్రకృతి?
మరెవరో కాదు
మనమే! మనమే! మనమే!
అది తెలిసిన
సాధ్యమే సంయమనం

ప్రకృతి పురుష
సంయమనం
సాధించినా,

వైషమ్యాలమయం
మన ప్రకృతి
కళ్లుండి చూడలేని
చెవులుండి వినలేని
ప్రకృతి మనది

సర్వమందు
సమరూపం
బ్రహ్మం
స్వప్రకాశునికే
బ్రహ్మానుభవజన్య
ఆనందం
ఇది గీతావాక్యం

అవ్యక్తం పురుషుడు,
వ్యక్తమే ప్రకృతి
సంయమనం
వ్యక్తంలో
అవ్యక్తదర్శనం
ఆత్మచే
ఆత్మదర్శనం
వ్యక్తావ్యక్త బాంధవ్యం
అదే-అదే
మాధవసేవ
అదే
మానవసేవ కూడ

బ్రహ్మాండమునెల్ల
కాల్చు మార్తాండుడే
కాలపుంగతి తగ్గి
చరించు గదా శీతునన్
మరి!
వీడలేడా,
కొంతైనా
తన స్వార్థాగ్ని,
ఏ మనిషైనా

వీడిననాడు
వ్యక్తం,
పురుషాధిదైవతం
స్వయంప్రకాశం

ఆత్మకు ఆత్మయే చుట్టం,
ఆత్మయే శత్రువు
ఆయుధం,
ఆత్మజ్ఞానం,
జయించాలి - జయించాలి
ఆత్మను -
అపుడు
ఆత్మయే బంధువు,
ఆత్మయే మిత్రుడు
జ్ఞానశూన్యం
స్వార్థం

చూపున్న గ్రుడ్డితనం
స్వార్థపరత్వం
చెదిరిన మేఘం
జీవితం
దరిచేరాలి
చెదిరిన జీవితం
పీడాలి
స్వార్థం కోసం పరద్వేషం

అపుడే!
స్వార్థరహిత చైతన్యం
అదే
ప్రణవనాద సంరంభ సదృశం,
ఓంకారాంకితం,
శుభప్రదం,
వ్యోమాంత సంకీర్ణం,
శంకాంకురహరం
బుధమనస్సంతోషసన్నద్ధం

శాంతినింపు
మనమున,
సుఖమేదో కూర్చు
క్షణమాత్రమున
ఆత్మ నిల్పు
పవిత్రతను భావసంపదల
ఇచ్చు
మనోవికాస

భ్రాతృభావవల్లరి
పులకించు పుడమి
పుష్పసంతతి పూర్ణశోభ

## 8 వ్యక్తిగత వేదాంతం - సమస్యలు

భావాతీతధ్యానంలో తురియాస్థితికి చేరి అంతర్ముఖులమై మనలను మనం తెలుసుకునేటంత వరకు దృశ్య ప్రపంచమంతా యదార్థమే యగును యదార్థ ప్రపంచంలో మనం యదార్థంగానే ఉండాలి యదార్థంగా ఉండటానికి మొదటి మెట్టు మన మనసును మనం అవగాహన చేసుకోవటం ఎందుకనగా మనసు ద్వారానే అంతర్ముఖులమై ఆత్మను దర్శించగలము మనసు ఒక ద్వారం వంటిది అదే అంతర్‌దృష్టి దానినే మనోదృష్టి అని కూడా అంటారు తురియా స్థితికి ముందు లౌకికంగా జీవితస్థితిని ప్రశాంతం చేసుకోవాలి నిత్యం జీవితంలో అనేక సమస్యలు ఎదురవుతూ ఉంటాయి ఆ సమస్యలకు సమాధానం సాధించినపుడే మనసు ప్రశాంతమై భావాతీత ధ్యానమునకు మార్గం సుగమమవుతుంది మనసు గురించి మనం తెలుసుకోవడానికి ప్రపంచం నుండి మనలను వేరుచేసుకోనక్కరలేదు ఎవరికి వారు తమ స్థితిని యధాతధంగా అర్థం చేసుకుంటే తమని తాము అర్థం చేసుకున్నట్లు అగునని జిడ్డు కృష్ణమూర్తి అన్నాడు దీనికి మనసుకు పరిపూర్ణమైన స్వేచ్ఛ ఉండాలి దేనినైనా అంగీకరించడమో, అంగీకరించకపోవడమో చేయు స్వేచ్ఛ కాదు వాదప్రతివాదాలను జాగ్రత్తగా అనుసరించే స్వేచ్ఛ కావాలి ఇట్టి మానసిక వికాసం వ్యక్తిగతం సమస్యలకు పరిష్కారాలు కూడా వ్యక్తిగతాలే వేదాంతం కూడ ప్రత్యక్ష అనుభూతి (Direct experiece) వ్యక్తిగతమే అంటుంది అనుభూతి సామూహికం కాలేదు కాని పరమాత్మ ఒకడే పరమాత్మను గూర్చిన అనుభూతి కూడ ఒకటే అది వ్యక్తిగతం ఎలా అవుతుంది అనుభూతి కలగటంలో గల స్థాయిలే ఇందుకు కారణం - ఈ స్థాయిలకు మనసులో

ఉండు కర్మ సంస్కారములే కారణం ఈ కర్మసంస్కారాలను బట్టే జీవితంలో సమస్యలు ఎదురవుతూ ఉంటాయి ఆ సమస్యలకు సమాధానాలు వెతికే ప్రయత్నం కూడా వాటిననుసరించే ఉంటుంది కాబట్టి మనం చేసే పనివిధానం బట్టి సమస్యలు ఉత్పన్నమవుతాయి

ఆధునిక జీవితమే సమస్యలమయం అనేక సవాళ్లను మనం ఎదుర్కొనవలసి వస్తోంది సవాళ్లను (challenges) ఎదుర్కొనటంలోనే సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి సమస్యల పట్ల సరైన అవగాహన లేకపోతే సమస్యలు మరీ క్లిష్టమవుతాయి కొన్ని సమస్యలు మన ప్రమేయం లేకుండానే వస్తుంటాయి వీటిని గురించి అతిగా స్పందించటం మాని, సమస్య ఎలావచ్చింది తెలుసుకుని దాని నుండి బయటపడే మార్గం ఆలోచించాలి అంతేగాని ఇది మన ప్రమేయం లేకుండ వచ్చింది గాబట్టి ఇది "విధివ్రాత" మనము ఏమి చేయలేము అని అసమర్థంగా కూర్చోకూడదు 'నా తప్పేం లేదు' అంటూ కూర్చోవటం ఆత్మవంచనే అవుతుంది

ఇక మన ప్రమేయంతో వచ్చే సమస్యలు అందుకు కారణమైన మన అనాలోచిత చర్య ఏమిటో తెలుసుకునే ప్రయత్నం చేయాలి మన అనాలోచిత చర్య తెలుసుకోవడంలో మనకు నిజాయితీ ఉండాలి మన స్పందన నిజాయితీగా ఉంటే సమాధానం దొరుకుతుంది సమాధానం కొరకు అన్వేషణలో తరువాత చేయు పనిని ఆపకూడదు పని చేసుకుంటూ పోవటమే ప్రయత్నం అవుతుంది ఆ ప్రయత్నంలోనే సమాధానం దొరుకుతుంది ఇది ఏ ఒక్కసారో సంభవించే విషయం కాదు తడబాట్లు, పొరపాట్లు చేయటం మానవ సహజం వాటిని గ్రహించి జాగ్రత్తపడటమే వివేకం మనిషికి జ్ఞానం ఒకటే చాలదు వివేకం కూడా కావాలి వివేకం ఉంటేనే జ్ఞానం సద్వినియోగం అవుతుంది నిజానికి ఒక వ్యక్తి శీలం అతడు చేసిన ఘనకార్యాల వలన తెలియదు సర్వసామాన్యమైన పనులు నిర్వర్తించేటపుడే అతని శీలం బయటపడును

అన్నాడు స్వామి వివేకానంద అన్నివేళలా ఒకే రీతిగా విశిష్టంగా ఉండువాడే శీలవంతుడు అవుతాడని స్వామి వివేకానంద అన్నాడు

సమస్యలు వచ్చినపుడు సాధారణంగా బాబాల దగ్గరికి వెళ్లడమో, దేవుడుకి మొక్కులు ప్రతిజ్ఞలు (pledge or promise) చేయడమో చేస్తుంటారు ఎందుకు? వారి మీద వారికి విశ్వాసం లేకనే బాబాలతోను, మొక్కులతోను సమస్యలు తీరవు మొక్కు అనేది వ్యాపారాత్మకం ఇచ్చిపుచ్చుకోవటం (Barter system) మన భక్తి ప్రపత్తికే అనగా ఆత్మార్పణతో కార్యం కొనసాగించితే సమస్యకు సమాధానం భగవంతుడే చూపుతాడు అంతేకాని లంచం ఇస్తే కాదు 'ఈశ్వరః సర్వభూతాని' అనగా ప్రతి ప్రాణిలో ఈశ్వరుడున్నాడని ఉపనిషద్వాక్యం అది గ్రహించిననాడు సహజంగానే మనం భగవంతునికి దగ్గరవుతాము ఆ దగ్గరైనపుడే సమస్యకు సమాధానం గోచరిస్తుంది భగవంతునికి భక్తునికి మధ్య అనుసంధానికి కార్యకర్తలుగా సందుకో స్వామి వీధికో బాబా వెలిశారు నిజానికి వీరు మనిషికి, దేవునికి మధ్య దూరాన్ని సృష్టిస్తున్నారు నిజమైన దైవత్వం, నిరాడంబరత గల స్వాములు లేరని కాదు కాని వారి సంఖ్య చాల తక్కువ వాస్తవంగా భక్తి అనుభూతి పొందటం అంటే 'సెల్‌ఫోన్' లో మాట్లాడటం కాదు ఈ దొంగస్వాములు తాము దైవానికి ప్రతినిధులుగా ప్రచారం చేసుకుంటున్నారు వారి ప్రచారం కంటే జనులు వారి ఆకర్షణకు లోబడటమే విచారం కలిగిస్తుంది ఎక్కడో ఒక రామకృష్ణ పరమహంస, ఒక స్వామి వివేకానంద, ఒక రమణమహర్షి ఉంటారు వారు ప్రచారం చేసుకోరు దేవుని ప్రతినిధులమని చెప్పరు దొంగస్వాములు, బాబాలను గురించి వార్తాపత్రికలలో చదువుతూనే ఉంటారు అయినా వారిని నమ్ముతూనే ఉన్నారు అది ఆధ్యాత్మికత కాదు దీనికి ప్రధాన కారణం మానవునిలో సహజంగా ఉండే భయం అనే బలహీనత ఈ భయాన్ని గూర్చి జిడ్డు కృష్ణ చక్కటి వివరణ ఇచ్చాడు మనిషికి అలవాటు అనేది ఉంటుంది అలవాటు అంటే ఒకే మాదిరి పనిని మళ్లీమళ్లీ చేస్తూ ఉండటం అలవాట్లతో మనిషి

జీవిస్తున్నాడంటే అతనొక యంత్రమన్నమాట అలవాటుకి ఆలోచన అవసరం లేదు ఆలోచన లేకుండా పనులు చేస్తే మనచుట్టూ మనం ఒక గోడను నిర్మించుకుంటున్నామన్నమాట ఆ గోడ వలన భయం తీరదు పైగా గోడల మధ్యన పరిమితులమైనందువలన భయం పెరుగుతుంది అలవాట్లు, ఆచారాలు, నమ్మకాలు ఈ గోడల వంటివే మనలను పరిమితులను చేస్తాయి భయం పెరుగుతుంది అలాకాక మనసుకు స్వేచ్ఛ ఇస్తే ప్రతి సమస్యను పరిశీలిస్తుంది, ఆలోచిస్తుంది మనసుకు స్వేచ్ఛ ఉంటే వివేకం ఉంటుంది వివేకం మనలో ఉంటే భయం నుండి విముక్తి కలుగుతుంది

ప్రపంచంలో ముఖ్యంగా మనదేశంలో ఒక పరిమిత కాలంలో (limited period) కొన్ని పరిణామాలు ఉప్పెనలాగ వచ్చి ఉరుములాగ ప్రతిధ్వనిస్తాయి గతచరిత్ర పరిశీలించినచో అలా ఆకస్మికంగా వచ్చిన పరిణామాలు ఆకస్మికంగానే అదృశ్యమైనాయి అలాంటి పరిణామమే ఈ తరంలో ముఖ్యంగా యువతలో కన్పడుతోంది కనబడుతోంది అనేకంటే నలుమూలలా ప్రతిధ్వని ప్రకంపనలు (booming) సృష్టిస్తోంది అనవచ్చు నిజంగా చెప్పాలంటే అది గర్జిస్తోంది అదే ఆకిస్మక ఆధ్యాత్మిక ప్రతిధ్వని ప్రకంపన (Boom of Spirituality) ఇది సంధిగ్ధయుగము (era of uncertainty) ఏ భావానికి, ఏ మార్గానికి నిశ్చయరూపం లేదు, స్థిరం లేదు అస్థిరత వ్యక్తిని, సమాజాన్ని పాలిస్తోంది ఈ స్థితిలో యువత ముఖ్యంగా మహానగరాలలో మందలుగా (large groups) కొంత సంప్రదాయమైన నమ్మకాలతోను మరికొంత నూతన విశ్వాసాలతోను దేవుని వైపుకు కదులుతున్నారంటే అది వారిలో కలిగిన నిజమైన భక్తిభావమా? యదార్థమైన ఆధ్యాత్మిక చింతనా? పరిస్థితిని నిశితంగా విశ్లేషిస్తే వారిలో కలిగిన ఈ మార్పుకు వారి జీవితంలో ఏర్పడిన అభద్రతాభావము (insecurity) ప్రధాన కారణంగా తోచును జీవితంలో ప్రతి విషయంలోను పోటీ పెరిగింది దాంతో క్షణం క్షణం ఒత్తిడి, ప్రయాస (mental stress and strain) అది తట్టుకోలేని పరిస్థితి ఏర్పడింది ఆ స్థితిలో

ముందుకు సాగాలంటే ఎవరి సహాయమైనా కావాలి ఆ సహాయం ఒక అతీతమైన శక్తి ద్వారా రావాలి అను భావం యువతలో ఒకరి నుండి మరొకరికి ప్రసారమైంది ఆ అతీతశక్తి ఇష్టదైవమే గదా! దైవం అంటే ఎవరు, జీవాత్మ, పరమాత్మ సంబంధమును గురించిన చింతనకు సమయం లేదు నిత్య ఉద్వేగం (tension) 'సర్వం ఖల్విదం బ్రహ్మ' - అంతా పరమాత్మయే అను భావమునకు సావకాశం లేదు ఇష్టదైవమందు భక్తి అంటే ప్రపత్తి, ఆత్మార్పణ భావంతో ఉన్నదా అంటే లేదనే చెప్పాలి ప్రపత్తి, ఆత్మార్పణ ఆ స్థితిలో వారి మనసు పరిమితిలోనికి రావు వారికి సహాయం కావాలి, వారు ఆశించిన మార్గంలో ముందుకు సాగాలి అదే వారికి కావాలి ఇచట ఇష్టదైవం అంటే త్యాగయ్యలాగానో, చైతన్యప్రభులాగానో, లేక తిన్నడులాగానో జ్ఞానభక్తితోనో, మధురభక్తితోనో, మూఢభక్తితోనో ఏర్పరచుకున్న ఇష్టదేవతా స్వరూపము కాదు ఆ నగరంలో ఆ దేవుడి గుడికి వెళ్తే పనులు అవుతాయి అను విశ్వాసం ఒకరి నుండి మరొకరికి ప్రసారమై వేలు, లక్షల సంఖ్యలో ఆ గుడికి వెళ్తారు ఈనాటి యువతది జ్ఞానభక్తి కాదు, మధురభక్తి కాదు, మూఢభక్తి కూడ కాదు అభద్రతా భావంతో నిండిన ఒక విధమైన మానసిక స్థితి అది అందు తర్కమునకు, వేదాంతమునకు, ఆధ్యాత్మికతకు సావకాశం లేదు

మానసిక ఒత్తిడి, ప్రయాసలు (Mental Stress and Strain) యువతలోనే కాదు వృత్తిలో కార్యనిర్వాహక (managerial stress) ఒత్తిడులతో సతమతమగుచున్న మధ్యవయస్కులు (middle aged) కూడ మానసిక శాంతికి, ఏకాగ్రతకు యోగాభ్యాసం చేస్తున్నారు ఇందు స్త్రీపురుష భేదం లేదు ఇది కూడ పూర్తి ఆధ్యాత్మికం అనుటకు వీలుపడదు ప్రపత్తికి గాని, జీవాత్మ-పరమాత్మ సంబంధమునకు గాని అవకాశం లేదు ఈ అభ్యాసంలో మనసే ఆత్మ అందుకే ఆత్మ అను పదం విరివిగా వినబడుతూ ఉంటుంది మనసు పై ఒత్తిడుల (stress) ప్రభావం తగ్గాలి దాని ద్వారా పరిపూర్ణ ఆరోగ్యం (holistic health) అను మాట వాడుకలోకి వచ్చింది మానసిక చికిత్సావిధానంలో

యోగాపద్ధతిని అనుసరిస్తున్నారు ఆసుపత్రులలో (Hospitals) కూడ యోగాకేంద్రాలు ఏర్పాటు చేస్తున్నారు ఇదంతా వ్యక్తిపరంగా, సామాజికపరంగా మంచిదే కాని ఆధ్యాత్మికంగా మానసిక వికాసం పొందిన ఆత్మజ్ఞాన అనుభూతితో తురియాస్థితి కలుగజేస్తుందా అంటే లేదనే చెప్పాలి ఆత్మ-జీవాత్మ ప్రసక్తి ఉంటే గదా ప్రత్యక్షానుభూతికి అవకాశం కలిగేది ఇది వ్యక్తిగత వేదాంతం కూడా కాదు మనసులో 'నేను ఎవరు', 'నా కర్తవ్యం ఏమిటి' అను ప్రశ్నలకు సమాధానం కోసం ప్రయత్నం ప్రారంభమైనపుడే వ్యక్తిగత వేదాంతం (Personal Philosophy) రూపొందుతుంది ఇచట ఆ ప్రయత్నం ఉండదు ఆశించింది సాధిస్తామో, లేదో అను తపనతో కూడిన భయం, కార్యనిర్వహణలో ఒత్తిడుల నుండి విముక్తి, ఏకాగ్రతలే ఇచట ప్రాధాన్యం వహిస్తాయి కాకపోతే ఇందు వ్యాపారాత్మకమైన భక్తికి, ముడుపులకు ప్రవేశం లేదు

ముంబాయిలో ప్రతి మంగళవారం వేల సంఖ్యలోను, అది వినాయకచవితి అయితే లక్షల సంఖ్యలో సిద్ధి వినాయక గుడికి వస్తుంటారని చెప్తున్నారు తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి గుడికి సగటున మామూలు రోజున 40 నుండి 50 వేల యాత్రికులు వస్తుంటారని, సెలవు రోజున దానికి రెట్టింపులో సంఖ్య ఉంటుందని అంటారు గత సంవత్సరం తిరుపతి దేవాలయం హుండీలో 400 కోట్ల రూపాయలు వచ్చిందట సరే, అది యాత్రాస్థలం కాబట్టి అంత మంది వస్తారు అనుకున్నప్పటికి, మహానగరాలలో ప్రసిద్ధిచెందిన దేవుని దగ్గరకు ప్రతివారం యువకులు, మధ్యవయస్కులు వస్తున్నారంటే అది యాత్ర అనుకొనుటకు వీలులేదు ప్రతి నగరంలోను ఆధ్యాత్మిక పట్టడలు (workshop) (కర్మాగారాలు), ధ్యానకేంద్రాలు, యోగాకేంద్రాలు ఏర్పడుతున్నాయి, చర్చావేదికలు ఏర్పాటు చేస్తున్నారు టెలివిజన్ మహేష్‌యోగి ఛానల్ యందు ఆధ్యాత్మిక ప్రసంగాలు, సంభాషణలు రోజుకు 24 గంటలు ప్రసారం చేస్తున్నారు ఇతర ఛానళ్ల యందు కూడ ఉదయం భక్తిగీతాలు, ఆధ్యాత్మిక ప్రవచనాలు ప్రసారం అవుతున్నాయి

పౌరాణిక సినిమాలు ఇపుడు తీయటం లేదు కాని టెలివిజన్ ఛానళ్లలో నిత్యం ఏదో ఒక పౌరాణిక ధారావాహికం ప్రసారం అవుతోంది అమెరికాలోని డిస్నీలాండ్ మాదిరి ఇక్కడ రామాలాండు, దుర్గాలాండ్ వంటివి ఏర్పాటు చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని వింటున్నాము మంచిదే కాని ఏమిటి ఇదంతా నిజంగా ఇది ఆధ్యాత్మిక విప్లవమా? గోద్రెజ్, నాగార్జున వంటి పెద్ద పెద్ద కంపెనీలు తమ ఉద్యోగుల కొరకు ధ్యానమును వ్యవస్థీకరణం చేస్తున్నారట మతపీఠాధిపతులు కొందరు విలువలతో కూడిన కార్యనిర్వాహక శిక్షణా కేంద్రాలు ఏర్పాటు చేస్తున్నారట (Centre of Value Based Management) విశ్వవిద్యాలయాలలో వైదిక కర్మకాండలు పాఠ్యాంశముగా డిగ్రీ కోర్సులు, వేదాంగ జ్యోతిష్యమునందు కూడ డిగ్రీకోర్సులు ప్రవేశపెట్టే ప్రతిపాదన చేశారు కారాగృహాలలో (Jail) ఖైదీలకు యోగ, ధ్యానములందు శిక్షణ ఇస్తున్నారట ఒకాయన ముంబైలో ప్రతి మంగళవారం దాదాపు 20 కిలోమీటర్లు తన ఇంటి నుండి నడిచి సిద్ధివినాయకుడి గుడికి వెళ్తాడట అతడు యువకుడేట వయసు 30 సంవత్సరముల లోపేనట, "ఎందుకు నీకు ఇంత శ్రమ" అని అడిగితే "ఇందులో పెద్దగా గంభీరమైంది, నిగూఢమైంది ఏమీ లేదు నన్ను ఎపుడు నిరాశపరచని ఒక ఆత్మీయుడైన స్నేహితుని కలవటానికి వెళ్తున్నాను అంతే" అన్నాడట ఈ సన్నివేశమును గురించి ఏదో పత్రికలో వచ్చింది దీనిని ఏమనాలి? కుచేలుడు లాగ భగవంతునితో మిత్రత్వభావన అనాలా కాని కుచేలుడు తానుగా భగవంతుని ఏమీ కోరలేదు కాని ఇచట 'ఎపుడు నిరాశపరచని మిత్రుడు' అను భావం కనబడుతోంది అంటే ఏదో ఒక కోరిక ఫలించాలి అను భావం అనుకోవాలి ఇది అంకితభక్తియా? కాని అంకితభక్తి యందు ఆత్మార్పణయే ఉంటుంది కాని కోరికలు ఉండవు గదా! దీనికి ఒకటే సమాధానం కనబడుతోంది ఈ తరం యువత, మధ్యవయస్కులలో నెలకొని ఉన్న అభద్రతాభావం, భయం, ఒత్తిడి, ప్రయాసలకు వారికి కొంత ఓదార్పు కావలసి యుండి అది ఒక మిత్రుని వంటి

అతీతశక్తియైన భగవంతుని నుండి కలుగును అను భావం రూపొందింది అనిపించును ఇచట తాత్త్విక చింతనకు, తర్కమునకు ఆస్కారం లేదు

ఈ విధంగా యువతలోను, మధ్యవయసు వారిలోను భక్తి పునస్థాపితం అయిందా అనిపించును ఈ భావం ఎక్కువగా నగరములలోని సంపన్నవర్గముల వారిలోనే కనబడుతోంది ఇందు జీవిత స్వభావంలో (Quality of life) మార్పును కోరుటయే కన్పడును పవిత్రత, సన్యాసవాంఛ, వైరాగ్యములకు ఇందు స్థానం లేదు సంపద, అధికారమును గురించిన తపన, పరిపూర్ణ ఆరోగ్య వాంఛలకే ఇందు ప్రాధాన్యము పొందినవి ఈనాటి ఈ తరం 'భక్తు' ల మనసులలో లౌకిక అలౌకికములకు మధ్య (between the material and the spiritual) ఘర్షణ లేదు వాస్తవానికి ఆ రెంటికి మధ్య వారికి భేదం తెలియదు ఒకవైపు నిత్య భగవద్గీత పారాయణ, అది పూర్తి అయిన వెంటనే వ్యాపారపత్రిక చదవటం, చాలమందిలో గమనిస్తుంటాము ఇది దోషమా, కాదా? అనేది ప్రశ్నకాదు భక్తిపవిత్రత, భౌతిక లాభవాంఛ మిళితమవుతున్నాయి అది వ్యక్తి మనోవికాసమునకు ఎంతవరకు తోడ్పడుతుంది అనేదే ముఖ్యమైన ప్రశ్న ఎందుకనగా ఆధ్యాత్మికంగా మనోవికాసమునకు గీతాపారాయణ ఒకటే చాలదు గదా, దానికి తోడు చింతన తప్పక ఉండాలి అపుడే గీతా సారాంశము మనసుకు చేరుతుంది లేకపోతే అది యాంత్రికం, నిష్ఫలం అవుతుంది

సరళీకృత ఆర్థిక విధానం వలన కొందరు వ్యక్తుల ఆదాయం పెరిగింది ఆ సంపదకు ప్రదర్శన కావాలి దాని ఫలితమే విరివిగా, విస్తారంగా జరుగుచున్న మతఆచారకర్మలు (rituals) వీటిని ఆధ్యాత్మికం అనవచ్చునా? ఆ మధ్య ఏదో పత్రికలో వచ్చింది ఏదో సంపన్నుల హోటల్‌లో మేనేజర్‌గా పనిచేస్తున్న యువతి భగవంతుడైన శ్రీకృష్ణుని వివాహం చేసుకుంటున్నట్లు ఆహ్వానపత్రికలు పంచినదట తన చిన్నతనము నుండి శ్రీకృష్ణునే భర్తగా భావించినదట అంతేకాదు, వివాహం అయిన తరువాత తన భర్తతో రాత్రులు

గడిపినట్లు 'భావప్రాప్తి' పొందినట్లు చెప్పినదట దీనిని ఏమనాలి? అది మీరాబాయి పొందిన మధురభక్తి భావన అనాలా? లేక అది మతిభ్రమ (hallucination) అనబడు మానసిక స్థితి అనాలా? ఈనాటి 'సాఫ్ట్‌వేర్' (Software) వృత్తిలో అంతులేని ఒత్తిడి, ప్రయాసలు (stress and strain) కనబడుతున్నాయి నేడు ఈ వృత్తి అవధులు దాటి విపరీతంగా విస్తరించింది దాంతో మానసిక ఒత్తిడి తగ్గించుకోవటానికి మార్గాలు వెతకటం మొదలైంది యోగాభ్యాసం, తక్షణభక్తి (instant devotion) మార్గాలుగా దొరికినాయి మానసిక ఒత్తిడి, ఉద్వేగం (stress and tension) వలన నేటి యువత, మధ్యవయస్కులు ఒక రకమైన మతిభ్రమ వంటి మానసికస్థితికి లోనవుతున్నారు దాని ఫలితమే నేటి భక్తిభావం ఇది దోషం అని చెప్పుటకు వీలుపడదు కాని అది నిశ్చయంగా అంకితభక్తి కాదు భగవంతుని తోడు (company) పొందుతున్నాము అను భావనతో ఉద్వేగం నుండి విముక్తి పొందు ప్రయత్నం మాత్రమే ఇది వృత్తిరీత్యా తీసుకోవలసిన ఎన్నో నిర్ణయాల వలన మానసిక ఒత్తిడులు, ఉద్వేగాలు కలుగుతున్నాయి (stress and tension) వీటిని తట్టుకోవటానికే యోగాభ్యాసాలు, సంపూర్ణ ఆరోగ్యమార్గాలు (Holistic health methods) ఆచరణలోకి వచ్చాయి వందల సంఖ్యలో గురువులు, స్వాములు, బోధకులు, అధ్యాపకులు ఉద్భవించారు విముక్తి కలిగిస్తామని ప్రకటించారు, ప్రకటిస్తున్నారు వీరిలో అందరు దొంగస్వాములు కాకపోవచ్చు ఆరోగ్యానికి 'రైకీ' పద్ధతి, 'ప్రాణిక్' పద్ధతి ప్రచారంలోకి వచ్చాయి 'భావాతీత ధ్యానం' అను పదము మాత్రం ప్రచారంలోకి వచ్చింది నిజంగా భావాతీత ధ్యాన అనుభూతి పొందుతున్నది, లేనిది ఆ వ్యక్తులే చెప్పాలి అది పూర్తిగా వ్యక్తిగతం

ఆధ్యాత్మ సంగీతం అని ఒక ప్రక్రియ ఈ మధ్య ప్రచారంలోకి వచ్చింది సంగీతానికి భాషాపరిధులు, మతనియమాలు లేవు అంటున్నారు అది ఎప్పటి నుండో అందరికీ తెలిసిన విషయమే అది మనిషి మనసును ఒక అతీతశక్తితో అనుసంధానం చేస్తుంది అని చెప్తున్నారు ఇది కూడ




తెలిసినదే త్యాగరాజు ఏనాడో చెప్పాడు దీనిని ఆత్మసంగీతం (Soul music) అన్నారు

మెదడునే కేంద్రస్థానంగా చెప్తున్నారు అందులోనే మనసు, అహంకారము, జీవాత్మ ఉన్నాయని విశ్వసిస్తున్నారు మనసు నుండి శరీరం ద్వారా సంగీతం ఉత్పన్నమవుతుంది అంటే సంగీతానికి మూలం భగవంతుడు అని భావం నాదం పరబ్రహ్మస్వరూపం అని చిరకాలం నుండి తెలిసిందే పద్ధతులు వేరుకావచ్చు కాని గమ్యం ఒకటే

కొంతమంది విద్యావంతులైన యువకులలో జీవితానికి ఉద్దేశము (purpose) ఏమిటి అను ప్రశ్న ఉదయిస్తున్నట్లు కనబడుతోంది ఆ ప్రశ్నకు సమాధానం కొరకు చేసే కృషి వలన మనసులో అస్తవ్యస్తత, తాత్కాలికతా భావం (feeling of temporariness) తగ్గుతున్నాయి అంటున్నారు తనను తాను తెలుసుకోవటానికి ఇది ప్రారంభదశ మంచిదే ప్రస్తుత సామాజిక వాతావరణం గమనిస్తే నూతనంగా ఏర్పడిన విశ్వాసాలలో పవిత్రతకు స్వలాభానికి మధ్య, ఆధ్యాత్మిక ఐహికాలకు మధ్య, పారమార్థిక నిగూఢత్వానికి వ్యావహారిక భౌతికతత్వానికి మధ్యనున్న సరిహద్దులు చెరిగిపోయినాయి ఆధ్యాత్మికం

ఐహికంలోను, అలౌకికం లౌకికంలోను మిళితమైపోతున్నాయి ఇప్పటి తరానికి కావలసినది సాధన ద్వారా కలుగు క్రమవిముక్తి కాదు, తక్షణ విముక్తి (instant liberation) అందుకే భగవంతుడు కూడ కాలానికి అనుగుణంగా అందుబాటులో ఉండే అలవాటు చేసుకోవాలేమో అనిపిస్తుంది ఆధ్యాత్మిక సంగీతం కోసం క్యూలో (Queues) నిలబడి కాంపాక్టు డిస్కులు కొంటున్నారు (C D) గ్రామఫోనులు, రేడియోలు పోయి కాంపాక్టు డిస్కులు వచ్చాయి ఎక్కడైన ఒక చోట ప్రశాంతంగా భక్తిసంగీతం వినుటకు సమయం లేదు అందుకని ఆఫీసులో పనిచేసుకుంటున్నా వినటానికి, రోడ్డు మీద నడుస్తున్నా వినటానికి చెవులకు తగిలించుకుని జేబులో పెట్టుకునే రేడియోలు వచ్చినై ఆధ్యాత్మికత మరీ 'సూపర్ ఫాస్ట్'గా ఉంది భగవంతుడు కూడా సర్దుకుపోవాలి (adjust) మహానగరాలలో ఆధ్యాత్మిక పరిస్థితి ఇలా ఉంటే, గ్రామవికాసం కొరకు పాండురంగశాస్త్రి అధ్వాలే వంటి గురువులు గ్రామాలకే తరలివెళ్లి స్వాధ్యాయ ఉద్యమం చేపట్టారు

తనను తాను అధ్యయనం చేసుకోవడమే స్వాధ్యాయ పరమార్థమని స్వాధ్యాయిాల తలంపు స్వాధ్యాయ ఉద్యమ సంస్థాపకుడు ముంబాయి వాసి అయిన పాండురంగశాస్త్రి అధవాలె దైనందిన జీవితంపై భగవద్గీత ప్రభావం వివరించటం వీరి ధ్యేయం కులమతాలకు అతీతంగా పరస్పర సహకారం, స్నేహభావం పాదుకొల్పటానికే వీరి కృషి "దేవుడు ఎక్కడో లేడు నీ మనసులోనే ఉన్నాడు నీ పని నీవు సక్రమంగా చేస్తే ఎవరి సహాయము అక్కరలేదు" అని పాండురంగశాస్త్రి బోధన (జననం 1920 రాయఘడ్) విలువల పునరుద్ధరణయే ఆయన చేపట్టిన యజ్ఞం గీతావాక్యములను సామాజికపరంగా వ్యాఖ్యానించి గ్రామీణుల ఉద్ధరణకు పూనుకున్నాడు ఆయన ఉద్యమమునకు మహారాష్ట్ర, గుజరాత్‌లలోనే కాక ఆంధ్రప్రదేశ్ కొన్ని ప్రాంతాలలో కూడ విశేష ఆదరణ లభిస్తోందని పత్రికలు చెప్తున్నాయి బాలలను ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దటం, యువకులను ధైర్యవంతులుగా, ఉత్తమ

క్రీడాకారులుగా చేయడం, వృక్షాలను పెంచటం, గోవులను రక్షించటం, రైతులకు, మత్స్యకారులకు చేయూతనివ్వటం మొదలైనవి వారి ఉద్యమ కార్యక్రమాలు తత్త్వజ్ఞానం ద్వారా వ్యక్తి తనను తాను తెలుసుకునేటట్లు చేయటం, అదే సమయంలో వ్యక్తుల పరస్పర సహకారం వర్ధిల్లేటట్లు చేయటం స్వాధ్యాయ ఉద్యమలక్ష్యం నిజంగా నేటి గ్రామీణులకు వలసినది ఇట్టి జ్ఞానము సహకారములే

వ్యక్తిగత వేదాంతం అంటే స్వార్ధంతో మనం చేసే దుష్క్రియలకు సమాధానం (Justify) చెప్పుకోవటం కాదు అది ఆత్మవంచన వ్యక్తిగత వేదాంతం అంటే ఆత్మవంచన కాదు వ్యక్తిగత వేదాంతం సాధారణంగా మృత్యుభయంతో ప్రారంభమవుతుంది అంటే చచ్చిపోతామేమో అని కాదు చనిపోయిన తరువాత ఏమిటి? నాలుగు రోజులు ఏడుస్తారు ఆ తరువాత జ్ఞాపకం వచ్చినపుడు "ఏ లోకాన ఉన్నాడో" అని కాసేపు జ్ఞాపకం చేసుకున్నందుకు గుర్తుగా నాలుగు మాటలు చెప్తారు అక్కడితో అది సరి పెట్టేవారు తద్దినాలు పెడ్తారు, లేనివారు అదీ లేదు ఈ భావంతో నిర్వేదం కలుగుతుంది నిర్వేదం అంటే తన స్థితిని గురించిన జ్ఞానం తనకు కలిగి నిరాశ ఏర్పడుతుంది ఆ నిరాశలో "ఇంత చేసాను, ఏం మిగిలింది నాకు, ఎందుకు చేసాను, ఎందుకు బంధాలు పెంచుకున్నాను" అని ఆత్మనింద చేసుకోవటమే వ్యక్తిగత వేదాంతం ఎవరైనా ఆత్మీయులైన మిత్రులు బంధువులు పోయినపుడు కూడ వ్యక్తిగత వేదాంత భావన వస్తుంది కాని సాధారణంగా అది తాత్కాలికం క్రమంగా దైనందిన కార్యక్రమాలలో పడిన తరువాత అది మరుగున పడుతుంది

జీవితంలో జరిగే కొన్ని సంఘటనలు మనసును విపరీతంగా ప్రభావితం చేస్తాయి అప్పటికే కొంత అలౌకిక భావన, పారమార్థిక చింతన ఉన్న వ్యక్తికి నిరాశ కాదు కలిగేది ఏమిటి ఇదంతా? ఈ కష్టసుఖాలు ఏమిటి? అవి ఎందుకు వస్తున్నాయి? కొందరికే కష్టాలు ఎక్కువగా ఎందుకు వస్తున్నాయి?

తెలిసి నేనేమి తప్పుచేయలేదే? దీనికంతా మూలం ఏమిటి? ఇదంతా ఎందుకు జరుగుతోంది? ఎవరైనా కావాలని జరిపిస్తున్నారా? ఇలా తనను తాను ప్రశ్నించుకుని సమాధానం కొరకు వేదన పడతాడు ఈ వేదన ఫలితంగా సమాధానం రూపొంది ఏర్పడు ఆధ్యాత్మిక భావనయే వేదాంతం ఇది పూర్తిగా వ్యక్తిగతం దీనికి శాస్త్రీయ ఆధారాలుండవు, అనుభవాలే ఆధారాలు అవుతాయి ఇది వైరాగ్యం అనుకుంటే పొరపాటు రాగద్వేషాలు నశించినపుడే వైరాగ్యస్థితి కలుగుతుంది ఇచట రాగద్వేషాలు పూర్తిగా నశించవు ఇది నిర్వేద స్థితి మాత్రమే నిర్వేదం వైరాగ్యం కాదు వైరాగ్యం సన్యాసానికి అర్హత నిర్వేదంలో ఉన్నవారికి కలిగేది తాత్కాలిక వైరాగ్యం రాగద్వేషాలు తిరిగి ప్రజ్వలించినపుడు అది తుడుచుకుపోతుంది

నిజంగా పారమార్థిక చింతన ఉన్న వ్యక్తికి నిర్వేదం యదార్థమైన అలౌకిక భావన కలుగజేస్తుంది క్రమంగా ఈ భావన బలమై తనను తాను అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తాడు అతడికి వైరాగ్యం రాదు, కాని అలౌకిక భావనతో లౌకిక జీవితం గడపటానికి ప్రయత్నం చేస్తాడు రాగద్వేషాలను నియంత్రించుకునే ప్రయత్నం చేస్తాడు ఇదే యదార్థమైన వ్యక్తిగత వేదాంతం ఈ స్థితి వికసించిన కొలది భయం క్రమంగా తగ్గుతుంది జీవితంలో ఏర్పడు సమస్యలకు భగవద్గీత చెప్పిన మార్గంలో సమాధానం పొందుటకు ప్రయత్నం చేస్తాడు

ఈ జగత్తు రహస్యం చాల నిగూఢమైంది (mysterious) అది తెలియదు కాబట్టి దానిని తెలుసుకోకుండ ఉండటమే మంచిది అను భావం నిర్వేదమునకు చివరిస్థితి ఇపుడే హేతువాదం మనసులో ప్రవేశించుటకు అవకాశం కలుగుతుంది కాని హేతువిచారణతో జగత్తు నిగూఢత్వం తెలియదు పైగా అది మనసును పరమాత్మ నుండి దూరం చేస్తుంది హేతువు తెలుసుకొనవలసిన అవసరం ఉంది కాని పరమాత్మ హేతువుకు అందడు

అనుభూతి ద్వారానే పరమాత్మను తెలుసుకోవాలి భగవంతుడు ఉన్నాడను భావన మనిషి అంతరాంతరాలలో ఎపుడూ ఉంటుంది కాని భగవంతుడు హేతుపూర్వకమైన రుజువులకు అందడు అందుకు భగవంతుడు లేడా అని సందేహము అప్పుడప్పుడు కలుగుతూ ఉంటుంది ఆ సందేహమును నుండి బయటపడుటకు ఒక అతీతశక్తి సహాయం కావాలి అందుకే ఆనాటి ఋషుల నుండి నేటి యువత వరకు ఆ సహాయం కోసమే వేదన పడుతున్నాడు

పరమాత్మ ఎక్కడో లేడు ఆత్మరూపంలో మనలోనే ఉన్నాడు అని వేదాంతం చెప్తుంది ఈనాడు సైన్సు డి యన్ ఏ (DNA) ను కనుక్కుంది అది మన శరీరంలోని ప్రతిజీవకణంలోను ఉంటుంది అదే జీవమునకు యదార్థమూలము అని సైన్సు అంటోంది డి యన్ ఏ తెలిసింది నేడు కాని అది నేడు పుట్టలేదు దాని వయసు ఎన్ని లక్షల సంవత్సరాలో తెలియదు మనిషికి వయసు పెరుగుతుంది ముసలితనం వస్తుంది కాని డి యన్ ఏ కి ముసలితనం లేదు దానికి అమరత్వం ఉందేమో ఆత్మశరీరమును వదలి మరొక శరీరములో ప్రవేశించునట్లు డియన్ఏ తరాలు మారుస్తూ ఉంటుంది దీనిని బట్టి డి యన్ ఏ ను శాశ్వతం చేయుటకొరకే మనిషి పుట్టుచు చస్తున్నాడా? నిత్యం ఉండే డి యన్ ఏ ను కనుక్కున్న మానవుడు రేపు మనిషికి నిత్యయవ్వనము ఉండేటట్లు మార్గం తెలుసుకుంటాడా? తెలుసుకుంటే అపుడు దేవుడి అవసరం మనిషికి ఉండదా? ఇది నిరర్థకమైన ప్రశ్న ఎందుకనగా మనిషి దేవుని సహాయం కోరుతున్నది నిత్యయవ్వనం కోసం కాదు కోరికలు తీర్చుకోవటానికి, కష్టాల నుండి బయటపడటానికి విశ్వాసము, అవిశ్వాసముల మధ్య ఊగిసలాడటమే జీవితం అనవలసియుండును ఈ దృష్టితో చూస్తే అజ్ఞాని మనసే ప్రశాంతంగా ఉండుననిపించును ఎందుకంటే అతనికి భగవంతుడు ఉన్నాడా, లేడా అనే సందేహమే రాదు దేవుడున్నాడనే అతని విశ్వాసం హేతువుకు స్థానం లేదు అతని మనసులో

మరణము, మరణానంతర జీవితమును గుర్చిన భయమే మనకు దేవుని గూర్చి తెలుసుకోవాలనే జిజ్ఞాస కలుగజేస్తుంది అన్నారు మరణానంతర జీవితాన్ని గురించి నిజంగా తెలిస్తే అపుడు మరణం అంటే భయం పోతుంది కాని అది ఎప్పటికీ తెలియదు మరణించిన జీవి తిరిగి ఎవరూ రాలేదు రారు మనకు తెలిసింది, తెలిసేది ఒక అనిశ్చితమైన ఆలోచనారూపమే అది ఎప్పటికీ నిగూఢంగానే ఉంటుంది తార్కికంగా పునర్జన్మను గూర్చి చెప్పగలము గాని మరణానంతర జీవితమును గూర్చి చెప్పలేము భగవంతుడు మనిషిని సృష్టించాడు మనిషి భగవంతుని తన ఊహారూపానికి అనుగుణంగా సృష్టించుకున్నాడు ఆ రూపమే భగవంతుడని విశ్వసిస్తున్నాడు సృష్టికి మూలం ఎప్పటికి ప్రత్యక్షంగా హేతువుకు అందదు అది ఎప్పటికీ ఆలోచనారూపంగానే ఉంటుంది అదే ప్రత్యక్ష అనుభూతి కలుగజేస్తుంది భగవంతుడు సృష్టి ఎందుకు జేసాడు అను ప్రశ్నకు హేతుపూర్వకంగా సమాధానం ఎప్పటికీ దొరకదు విరాట్ పురుషుని చైతన్యరూపమే ఈ సృష్టి అంతకు మించి సమాధానం ఎంత తర్కించినా దొరకదు

అసలు జీవితం అంటే ఏమిటి? ఎన్నో నిర్వచనాలు చెప్పారు ఏదీ సంపూర్ణం కాదు ఎందుకంటే జీవితం వ్యక్తివ్యక్తికి భిన్నంగా ఉంటుంది జీవితధ్యేయాలు భిన్నం అందువలన గమనం కూడ భిన్నంగానే ఉంటుంది జీవితం మన అదుపులో ఉన్నంత వరకు ఆ జీవితానికి ఒక అర్థం ఉంటుంది ఆ అర్థంలోనే మన గమ్యం ఉంటుంది గతంలోను భవిష్యత్తులోను మన జీవితానికి ఒక భాగం ఉందని గ్రహిస్తే అపుడు ఆ జీవితానికి అర్థం ఏర్పడుతుంది కాని జీవితానికి అర్థం, అంటే మనం ఎందుకు పుట్టాము అను ప్రశ్నకు సమాధానం హేతువు ఆధారంగా ఎప్పటికీ దొరకదు ప్రేమతత్వం వికసిస్తే జీవితానికి గమ్యం ఏర్పడుతుంది అందుకని జీవితాన్ని ప్రశ్నిస్తూ కాలం వృధాచేయుట కంటే జీవితాన్ని ఒక సదాశయంతో గడపటమే మంచిది మహాభారతం శాంతిపర్వంలో దాదాపు ఇదే చెప్పబడింది

శ్లో॥ శ్వఃకార్యమద్యకుర్వీతపూర్వాహ్ణే చాపరాహ్ణికమ్
     నహిప్రతీక్షతే మృత్యుఃకృతం వాస్యనవాకృతమ్ ।

"కాలం పరుగెత్తుతుంది ఈ రోజే ఒక మంచి పనిచేయి కాలయాపన చేయవద్దు మృత్యువు పొంచి ఉంటుంది చేయవలసిన పని పూర్తిచేయి మృత్యువు ఆగదు" రేపటి పని ఈ రోజే చేయి కర్తవ్యం నిర్వర్తించు బ్రతికి ఉంటే గౌరవం, ఆనందం కలుగుతాయి భూతకాల, భవిష్యత్కాలములను గూర్చిన చింతను వదలి వర్తమాన కాలమున జీవిత నిర్వహణమును గావింపుమని కూడ చెప్పబడింది

వార్ధక్యము, మరణము - ఈ రెండు తోడేళ్ల వంటివి వీటికి చిన్న, పెద్ద, బలవంతుడు, బలహీనుడు అను భేదము లేదు అందరినీ తినివేయును అన్నారు

మరి దేవుడు, ఆత్మ, జీవితం, మృత్యువు అన్ని యదార్థములేనా? యదార్థములే కాని ఆ యదార్థమే మాయ ఈ సందర్భానికి ఒక పౌరాణిక గాథ ప్రచారంలో ఉంది ఆ కథ ఆధారంగా సినిమాలు కూడ తీసారు నారదునికి శ్రీకృష్ణుడు మాయను తెలియజెప్పే కథ శ్రీకృష్ణుడు నారదుని మాయాప్రభావితుని జేస్తాడు ఆ మాయలో పడి నారదుడు ఒక గ్రామంలో ఒక స్త్రీని వివాహం చేసుకుని సంతానం పొందుతాడు సంసారవ్యామోహంలో కూరుకుపోతాడు ఆ గ్రామంలో భారీవర్షాలు పడి దగ్గరలోనున్న నది పొంగుతుంది తప్పించుకునే ప్రయత్నంలో భార్య, సంతానం నదీప్రవాహంలో కొట్టుకుపోతారు నారదుడు ఏకాకి అయి దుఃఖమును భరించలేకపోతాడు

ఆ సమయంలో శ్రీకృష్ణుడు వచ్చి మాయను తొలగిస్తాడు నదీ లేదు, ఊరూ లేదు, ఏమీలేదు నారదుడు యదార్థం గ్రహిస్తాడు విరాట్ పురుషుని చైతన్యరూపమే ఈ జగత్తు ఆ చైతన్యమే మాయ అంటే ఆ మాయారూపమే ఈ జగత్తు లేక ప్రకృతి ప్రకృతి ప్రతిరూపమే మనము అంటే ఆ మాయలో

భాగమే మనమంతా అంటే మనం యదార్థం కాదా? యదార్థమే అన్నీ యదార్థమే కాని ఎంతవరకు? ఇది మాయ అని మనకు తెలిసేటంతవరకు ఎపుడు తెలుస్తుంది? మనలను మనం తెలుసుకున్నపుడు, సత్యం గోచరమవుతుంది అపుడు జీవితమును గురించి ఆలోచన ఉండదు నిస్వార్థంగా కర్తవ్యాన్ని నెరవేరుస్తాము మనసుకు శాంతి పొందుతాము జీవితమును గురించి ప్రశ్నించటం కాదు చేయవలసినది జీవితమును సార్థకం చేసుకోవాలి

పౌరాణిక గాథలు కల్పితాలు కావచ్చు కాని ఆ కథల వెనుకదాగియున్న అంతరార్థమును గ్రహించుటయే ఆ కథల ఉద్దేశము దీనికి మరొక ఉదాహరణ విష్ణుపురాణంలో కనబడుతుంది అది క్షీరసాగర మథనం పాలసముద్రం ఉన్నదా, లేదా అనేది కాదు ప్రశ్న మంథర పర్వతం, వాసుకి, క్షీరసముద్రం నుండి బయటకు వచ్చిన వస్తువులు ఇవి అన్నీ రూపకాలంకారములు తాత్విక అవగాహనకు ఇవి చెప్పబడినవి మనసులు రెండు రకాలు నిత్యం వాంఛలతో కల్లోలంగా ఉండే మనసు ఒక రకం అది సముద్రం వంటిది ప్రత్యక్షానుభూతి (Direct experience) పొందిన మనసు సాత్వికస్థితిలో క్షీరసాగరము వంటిది అంటే ఇక మనసులోని బుద్ధియే మంథర పర్వతం (మన్‌థర) మనసును ధరించేది అని వ్యుత్పత్తి చెప్పవచ్చు అహంకారమును మథించటమే క్షీరసాగరమథనం వాసుకియే అహంకారమునకు చిహ్నము మథనం (చిలకడం) అంటే ధ్యానయోగం ఈ యోగం ద్వారా క్షీరసాగర మథనంలో ముందుగా బయటపడిన కామధేనువు వంటి అద్భుతశక్తులు అను సిద్ధులు కలగవచ్చు కాని ధ్యానయోగధ్యేయము అది కాదు ఆత్మానుభూతి సిద్ధియే గమ్యం అదే అమృతం ఇలా ఎన్నో తాత్విక సత్యములు పురాణగాథలలో ఇమిడియున్నవి

జీవితమును సార్థకము చేసుకోవాలని తాత్వికార్థము కాని దీనికి

అవరోధాలుగా వచ్చేవి సమస్యలు  మహాభారతం శాంతిపర్వంలో చెప్పినట్లు సమస్యలకు ప్రధానకారణం 'నాది, నేను' అను స్వార్థం

"మమేతిచ భవేన్మృత్యుర్నమమేతిచ శాశ్వతమ్"

'మమ' - 'ఇది నాది' అనునది మృత్యువు  'నమమ' - 'నాది కాదు' అనునది అమృతం (శాశ్వతమ్)

"బ్రహ్మమృత్యూతతో రాజన్నాత్మన్యేవసమాశ్రితౌ"

రాజన్! మృత్యువు, అమృతం (బ్రహ్మము) రెండును శరీరములోనే అదృశ్యరూపముననున్నవి  మృత్యురూపమే 'మమ' అను భావము  ఈ 'మమ' అను భావము కులము, జ్ఞానము, సంపద అన్నిటినీ ప్రభావితం చేస్తుంది  "కులాజ్ఞానాత్ తదైశ్వర్యాన్మదోభవతి దేహినామ్" (మహాభారతం - శాంతిపర్వం) తమ యొక్క కులము ఉత్తమమైనదను, జ్ఞానము ఉత్కృష్టమైనదను, సంపద ఘనమైనదను అభిమానముచే మనుజులందు మదము కలుగుచున్నది

'నాది, నేను' అను స్వార్థంతోనే అన్ని సమస్యలు వస్తున్నాయని తెలుస్తోంది గదా!  ఆ విధంగా జీవితమంతా సమస్యలమయమే అయింది  సమస్యలుండనివారు ఇద్దరే ఉంటారు  ఒకరు సమస్యలకు అతీతుడైన నిష్కామకర్మయోగి  రెండవవాడు సంపూర్ణ బుద్ధిహీనుడు (Idiot)  వానికి సమస్యలంటే అర్థమే తెలియదు  నేటి మానవుడు సాధించిన సాంకేతిక ప్రగతితో (progress in technology) సమస్యలు విస్తారంగా పెరిగినాయి  ఫలితం ఒత్తిడి, ప్రయాస, ఉద్వేగం (stress, strain and tension)  దీనికి పరిష్కారం మనను మనం తెలుసుకొనుట ద్వారా భగవంతుని తెలుసుకొనుట  భగవంతుని తెలుసుకొనుట అంటే ఒక అతీత శక్తిగా భావించి మత్తును కలుగచేసుకొనుట కాదు  భగవంతుడు ఎక్కడో లేడు  మనలోనే ఉన్నాడు

కాని ఈ విశ్వాసంతో సమస్యలు పరిష్కారమవుతాయా? కావు కాని ఆ విశ్వాసంతో మనలో నిద్రాణంగా ఉన్న వివేకం (wisdom) మేల్కొంటుంది ఆ వివేకం వలన మనలో శక్తి ప్రసరిస్తుంది ఆ శక్తి ద్వారా సమస్యలకు పరిష్కారం దొరుకుతుంది భగవంతుని యందు విశ్వాసము అంటే వర్తమాన జీవితమును విస్మరించమని కాదు పురుషార్థములను సాధించుట ద్వారా పురుష ప్రయత్నముతో సమస్యలకు సమాధానం సాధించటమే భగవంతునియందు విశ్వాసము కలిగియుండటం అంతేకాని 'గాలిలో దీపం పెట్టి, దేవుడా నీవు చూసుకో' అనటం విశ్వాసం కాదు

సరే! బాగానే ఉంది (అసలు వివేకం అంటే ఏమిటి? అలా ప్రశ్నించటమే వివేకం అంటాడు జిడ్డు కృష్ణమూర్తి వివేకం ఎలా వస్తుంది అను సంశయం ఉన్నంత కాలం భయం ఉంటుంది భయమును నివారిస్తే వివేకం అదే వస్తుంది అంటాడు జిడ్డు కృష్ణమూర్తి సంతోషం అనేది ఎపుడు వస్తుంది సంతోషంగా ఉన్నపుడు సంతోషం అంటే తెలియదు ఆ తరువాతగాని 'నేను అపుడు సంతోషంగా ఉన్నాను' అను భావన రాదు అంటే ఎరుక లేకుండానే సంతోషం వస్తుంది సంతోషంగా వున్నాను అని అనుకున్న తక్షణమే సంతోషం ఆగిపోతుంది అంటాడు కృష్ణమూర్తి కాబట్టి ఇది సంతోషం అని చెప్పటానికి వాస్తవమైన ఆ సంతోష సమయమున స్పృహ ఉండదు)

మనం దైవదర్శనానికి వెళ్లినపుడు దైవాన్ని ఏమి యివ్వమని కోరాలి? కోరికతో కూడిన భక్తి భక్తి కాదు అన్నారు మరి దైవదర్శనం ఎందుకు? అడగంది అమ్మ అయినా పెట్టదు అంటారు గదా! మనసు ఎపుడు ఏదో ఒకదాని కోసం వెతుకుతూనే ఉంటుంది నిరంతరం ఏదో ఒకటి కోరుతూనే ఉంటుంది ఆ కోరికలలో కూడ నిలకడ ఉండదు మన మనసును మనం పరిశీలిస్తే ఇది మనకే తెలుస్తుంది మధ్యమధ్య తనను తాను అదుపులో పెట్టుకోవడానికి కూడ మనసు ప్రయత్నిస్తుంది ఏదో ఒక విధంగా తృప్తిపడాలని

కూడా ప్రయత్నిస్తుంది ఇతరులతో పోల్చి చూసుకుంటూ ఉండటం కూడా చేస్తుంది ఇదంతా మనసు యొక్క జాగ్రత్త అందామా - కాదు ఎందుకంటే నిజంగా జాగ్రత గల మనసు నిశ్చలంగా ఉంటుంది నిశ్చలంగా ఉండు మనసు దైవమును దైవముగానే అవగాహన చేసుకుంటుంది కోరికలు తీర్చు వ్యక్తిగానో, శక్తిగానో కాదు ఎడారిలాంటి మనసే దేవుని ఏదో ఒకటి కోరుతుంది ఎడారి ఇసుకలో నీరు ఎంత పోసినా ఇంకిపోతుంది అలాగే ఏ మనసూ తాను కోరింది కోరిన విధంగా పొందలేదు అందువలన దైవమును అడగవలసినది ఏదో ఒకటి కాదు మనోనిశ్చితత్వం కోరాలి అంటే సంధిగ్ధత పోవాలి సంధిగ్ధత తీరితే మనసు నిశ్చితంగా పనిజేస్తుంది కోరికలు అవే తీరుతాయి

అసలు ఈ జీవిత ఉద్దేశం ఏమిటి? ఈ పరస్పర సంబంధాలకు అర్థమేమిటి? మనసులో గందరగోళం ఏర్పడినపుడే ఈ ప్రశ్న వస్తుంది జీవిత పరమార్థమును గురించి చాలమంది ఉపన్యసిస్తూనే ఉంటారు మతపరంగా, సమాజపరంగా, కుటుంబపరంగా అని ఎన్నో చెప్తారు ఇందులో కూడా ఒకరు చెప్పింది ఇంకొకరు ఒప్పుకోరు గందరగోళం అనేది ఒక తెర వంటిది మనసు గందరగోళంగా ఉన్నపుడు ఏది తెలుసుకున్నా అది గందరగోళం అనే తెరలోంచే అందుతుంది అంటాడు జిడ్డు కృష్ణమూర్తి గందరగోళం అంటే ఆదుర్దా, భయం, సంధిగ్ధం కాబట్టి మనకు అందింది తెర ద్వారా వక్రించి అందుతుంది అందువలన జీవిత ఉద్దేశాన్ని తెలుసుకునే ముందు మనసు నిశ్చలత పొందాలి ఒక గుడ్డివానికి వెలుగును గురించి చెపితే ఏం తెలుస్తుంది అంధకారానికి అనుగుణంగానే అర్థం చేసుకుంటాడు కాబట్టి మనసు నిశ్చలం చేసుకోవాలంటే ఉన్న గందరగోళానికి కారణం తెలుసుకోవాలి ఆ కారణమును అవగాహన చేసుకోవాలి అపుడు ఆ కారణం మనలోనే ఉంది అని తెలుస్తుంది ఎందుకంటే మనసు ఎపుడూ ఏదో ఒకటి స్వంతం చేసుకోవాలని, విజయం పొందాలని, తాను కీర్తి పొందాలని, తాను ఇంకా వృద్ధి చెందాలని అనుకుంటూ

ఉంటుంది ఈ ఆలోచనకు అనుగుణంగానే అసూయ, అత్యాశ, భయం, ఫలితంగా గందరగోళం కలుగుతూ ఉంటాయి మనసుకు నిశ్చలత వచ్చి గందరగోళం పోతే మనం ఏం చేయాలో స్పష్టంగా తెలుస్తుంది ఆ 'ఏం చేయాలి' అనేదే జీవితము అంటే అర్థం

వేదాంతం అంటే చెప్పిన దానిని గుడ్డిగా విశ్వసించటం కాదు హేతువు ఆధారంగా విచారించి నచ్చిన పద్ధతిని అనుసరించటమే వేదాంతం భగవద్గీత (18-63) గూడ ఇదే చెప్పింది "సత్యమును చక్కగా పరిశీలించి చూచి నీకు ఇష్టమైనట్లు చేయుము" అని శ్రీకృష్ణుడు అర్జునునికి స్వేచ్ఛ ఇచ్చాడు వివేకంతో కూడిన అనుభవం సమస్యలకు సమాధానం కలుగజేస్తుంది

మనిషి స్వభావాన్ని బట్టి సమస్యలు వస్తాయి సమాధానాలు కూడ ఆ స్వభావాన్ని బట్టే దొరుకుతాయి మనుషులంతా ఒకటే కాని వారి సంస్కారములను బట్టి వారి స్వభావాలుంటాయి (భగవద్గీత 17-2,3) స్వభావాన్ని బట్టి శ్రద్ధ ఏర్పడుతుంది శ్రద్ధను బట్టి ఆలోచనలు రూపొందుతాయి వాటిని అనుసరించి ప్రవృత్తులుంటాయి ప్రవృత్తులను బట్టియే వారి సమస్యలు ఉంటాయి ఆ సమస్యలకు పరిష్కారాలు కూడ వారి ప్రవృత్తులకు అనుగుణంగానే ఉంటాయి

స్థిరంగా ఉండు వ్యక్తిని ముని అంటారు (మననం చేయువాడు ముని గొప్ప ఆలోచన గలవాడు ఎక్కడో అడవిలో తపోనిష్ఠలో ఉండేవాడు మాత్రమే ముని కాదు తీవ్రంగా ఆలోచించగలిగి దానిని తిరిగి మననం (చింతన) చేయగల ప్రతివాడు మునియే అవుతాడు (భగవద్గీత 2-56)) మునులలో కూడ స్థాయిలుండవచ్చు ఎవరి పరిమితిలో వారు మునులు కావచ్చు సుఖదుఃఖాలకు చలించనివాడే ముని అలా చలించనివానికి భయం ఉండదు వేదాంతం భయమును ప్రోత్సహించదు నిర్భయత్వమే

వేదాంత సందేశం అని స్వామివివేకానంద అన్నారు కొన్నిచోట్ల భయాలు తప్పవు కాని వాటిని ధైర్యంగా దాటాలి వేదాంతం ద్వారా ఆ ధైర్యం అలవర్చుకోవచ్చు

శారీరకంగా మానసికంగా పరిణామం చెందటమే జీవితం ఈ పరిణామం బుద్ధి దాకా పెంచినపుడు సుఖదుఃఖములను అధిగమించగలరు (భగవద్గీత 2-50) అపుడే మనోనిశ్చలత వస్తుంది బుద్ధికి సమత్వం కలుగుతుంది ఈ సమత్వమే యోగం ఏకాగ్రచిత్తముతో తన కర్మను ఆచరించువాడు ఉత్తముడు ఏకాగ్రత నేర్పును కలుగజేస్తుంది నేర్పుతో కార్యం నిర్వర్తించటం యోగం దీనినే సమర్ధత అన్నారు ఈ సమర్ధత ఉన్నపుడు సమస్యలు రావు వచ్చినపుడు సమాధానం దొరుకుతుంది తక్కువ శక్తితో ఎక్కువ ఫలితమును సాధించడమే సమర్ధత కార్య సమర్ధతతో పాటు మానసికంగా అనుభూతి కూడా ఉండాలి అపుడే కార్యనిర్వహణ యోగం అవుతుంది కార్యనిర్వహణ భౌతికం, అనుభూతి ఆంతరికం ఈ రెండు సమన్వయం పొందినపుడు లౌకికం అలౌకికమునకు అడ్డురాదు సాధారణమైన జీవితంలోనే కొంత అంతర్ముఖులమగుటకు వీలగును అపుడు మనసు, హృదయం క్రమపద్ధతిలో నడుస్తాయి కార్యం సమర్ధవంతంగా నిర్వహించబడుతుంది సమస్యలుండవు ఉన్నా పరిష్కారం ఉంటుంది

అనుష్ఠాన వేదాంతమే (Practical Vedanta) జీవితయోగం అని స్వామివివేకానంద అన్నాడు ఆయన భగవద్గీత ఆధారంగానే అలా అన్నాడు ఈ యోగం అంటే యోగాసనాలు కాదు జీవితంలో సమస్యలను ఎదుర్కొనే విధానమే ఈ యోగం (భగవద్గీత 2-37,38) జీవితం శ్రమించేవారిది సోమరులది కాదు సుఖదుఃఖాలతోను, జయాపజయాలలోను స్థిరంగా ఉండు మనసును సాధన ద్వారా పొందాలి జీవితం అనేది ఒక సమరం దానికి స్థిరమైన మనసు కావాలి

భావాలు చలితం
వాంఛలు చంచలం
చలితం మనోగతం
ఆకస్మికం మనోరథం

మనోగతం అంటే మనసు నడక లేక పద్ధతి మనసులోని కోరిక మనోరథం ఇదీ మనసు స్థితి ఈ స్థితి వలననే సమస్యలు వస్తుంటాయి ఈ స్థితిని అధిగమించాలంటే సంపూర్ణ మానసిక సమన్వయం కావాలి ఆ సమన్వయం అనగా స్థిరమైన బుద్ధి అది కలవానిని స్థితప్రజ్ఞుడు అన్నారు స్థితప్రజ్ఞునికి స్వేచ్ఛ ఉంటుంది స్థితప్రజ్ఞుడు అనాసక్తి యోగముతో పనులు చేయువాడు అదే పురుష ప్రయత్నం ఇది కార్యదక్షత కలుగజేస్తుంది మానసిక సమతుల్యత (సమభావం) (equanimity) దీనికి ఆధారం సమస్య లన్నిటికి పరిష్కారం ఇదే

కొన్ని సమయాలలో ఎన్ని ప్రయత్నాలు చేసినా సత్ఫలితం రాదు ధైర్యం సన్నగిలుతుంది నిరుత్సాహం ఆవరిస్తుంది అపుడు ఏం చేయాలి? పాలలో నానబెట్టిన పేలాలవలె ఉండువాడు జీవితంలో ఎందుకూ పనికిరాడు అని రామకృష్ణ పరమహంస ఉపదేశము స్థిరత్వము కలవాడే వీరుడు అతడే అన్నిటిని సాధించగలడు (భగవద్గీత 2-3) మనిషి తనలోని శక్తిని గుర్తించాలి పిరికితనమును వదలిపెట్టాలి ఇదే వేదాంతం యొక్క ప్రధాన అంశం ప్రతి మనిషిలోను దివ్యశక్తి ఉంది బలహీనత, పిరికితనం దానిని మరుగున పడేస్తాయి వేదాంతభావం ఈ పిరికితనాన్ని పారద్రోలుతుంది ఆత్మస్థైర్యమును కలుగజేస్తుంది మనం పరుగిడితే సమస్యలు మన వెంటబడతాయి మనం వాటి వైపుకు తిరిగి వాటి వెంటబడితే అవి పారిపోతాయి అన్నారు స్వామివివేకానంద సమస్యలను ఎదుర్కోవాలి అదే పౌరుషం వేదాంతంలో పిరికితనానికి స్థానం లేదు మనని మనం తెలుసుకుంటే భగవంతుని మనం

పొందుతాము అపుడు నిర్భయత్వం వస్తుంది అదే లౌకికంలో అలౌకికతత్వం ఐహిక జీవితంలో పారమార్థిక అనుభూతి

"క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ" (భగవద్గీత 2-3)

నీచమైన మనోదుర్బలత్వమును విడిచి (త్యక్త్వా), లెమ్ము మేలుకొనుము - అని గీతావాక్యము

సదా వేంకటేశం స్మరామి స్మరామి

